The Hindu Philosophy of Life, Ethics and Religion.

ఓం తత్సత్

# శ్రీ భగవద్గీతారహస్యము

అను

# కర్మయోగశాస్త్రము

ఉపోద్ఘాత బహిరంగ పరీక్షణమును, మూల సంస్కృత శ్లోకములును, అర్థమును
నిర్ణయించు టిప్పణములును, పాశ్చాత్య తత్త్వజ్ఞానము, హైందవ
తత్త్వజ్ఞానము మతములను పోల్చిచూపుట మొదలగు
వానితోఁ గూడినది.

మహారాష్ట్ర భాషయందు

లోకమాన్య శ్రీ బాలగంగాధర తిలక కృతము.

[illegible]నాటి సంస్కృత కాలేజి ప్రధానోపాధ్యాయుఁడగు
నోరి. సుబ్రహ్మణ్యశాస్త్రిచే ఆంధ్రీకృతము.

శ్లో॥ తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః.

గీతాసు. ౩. ౧౯

చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచే
వావిళ్ల ప్రెస్సున ముద్రితము.

పునహా:
కేసరి ఆఫీసు వారిచే
ప్రకటితము.

క్రీ. శ. 1918. శాలివాహన కాళయుక్తి సంవత్సరము.

# అథ గ్రంథకర్తృసమర్పణమ్.

శ్రీగీతార్థః క్వ గంభీరో వ్యాఖ్యాతః కవిభిః పురా,
ఆచార్యైర్యశ్చ విపూఢా క్వ, మేఽల్పా విషయా మతిః.

తథాపి చాపలాదస్మి వక్తుం తం పునరుద్యతః,
శాస్త్రార్థాన్ సంముఖీకృత్య ప్రత్నాన్ నవ్యైః సహోచితైః.

తమార్యాః శ్రోతుమర్హంతి కార్యాకార్య-దిదృక్షవః,
ఏవం విజ్ఞాప్య సుజనాన్ కాళిదాసాక్షరైః ప్రియైః.

బాలో గంగాధరశ్చాఽహం తిలకాన్వయజో ద్విజః,
మహారాష్ట్రే పుణ్యపురే వసన్ శాండిల్యగోత్రభృత్.

శాకే మున్యగ్ని వసుభూ-సంమితే శాలివాహనే,
అనుసృత్య సతాం మార్గం స్మరంశ్చాపి వచో † హరేః.

సమర్పయే గ్రంథమిమం శ్రీశాయ-జనతాత్మనే,
అనేన ప్రీయతాం దేవో భగవాన్ పురుషః పరః.

---

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్.

గీతా, ౯. ౨౭.

# లోకమాన్య శ్రీ బాలగంగాధరతిలకగారి

## సంగ్రహజీవనచరిత్రము.

---

ఏమహనీయుఁడు దొరతనమువారి బిరుదు లైహికాముష్మికసాధనములని భ్రమనొందక "లోకమాన్యుఁడ"ను ప్రజలిచ్చినబిరుదుచే జగద్విఖ్యాతిఁ గాంచెనో, యేమహామహుఁడు దేశోద్ధరణమునకై కంకణముఁ గట్టుకొన్నవారికెల్లరకును మకుటప్రాయుఁడై సత్యాసక్తియందు హరిశ్చంద్రునిపగిది కష్టములఁ బడియును సత్యమును స్థాపించుచుండెనో, యేమహాయశుఁడు భారతమాతృపుత్రులకెల్ల గురుస్థానము నలంకరించి రాజకీయ సాంఘిక విషయములందువలెనే, హిందూమత విషయములో సైతము కృషిఁజేయుచు హిందూమతమునకు నూతనోజ్జీవమును గలిగించుచుండెనో, యేమహామహుని పాదరజము సోకినంతనే సర్వపీడాపరిహారమగునని యాతపల్ప్రాంతములందలి మహారాష్ట్రజనులు భావించుచుండిరో, యేసద్గుణసంపన్ను నాంధ్రులు "భగవాన్ తిలక" యని పేర్కొనసాగిరో యా 'లోకమాన్యబాలగంగాధరతిలక' ధీవరుని పావనచరిత్రమును సంగ్రహముగ నెఱుఁగుట మహాభాగ్యము కదా!

మహారాష్ట్రమున రాజ్యమేలిన పేష్వాలును, నానాఫడ్నీస్, రాస్తే, గోపాలకృష్ణగోఖలే మొదలగు జగద్విఖ్యాతపురుషు లెల్లరును కొంకణస్థ (అనఁగా: సహ్యాద్రిపర్వతములకును— (Western Ghauts) అరబ్బీసముద్రమునకును మధ్యనుండు దేశములోని) చిత్పవనబ్రాహ్మణులే. అట్టి పేరొందిన బ్రాహ్మణవంశస్థుఁడగు గంగాధరరామచంద్రతిలక (తిలకయను గృహనామముగల రామచంద్రరావుగారి కొమరుఁడగు గంగాధరరావు) అనువారు మహారాష్ట్రదేశములోని రత్నగిరి యను పట్టణమున నొకపాఠశాలలోఁ బ్రధానోపాధ్యాయులుగ నుండిరి. వీరిభార్య పార్వతీబాయి యను సతీమణి. ఈదంపతు లొకకొమరుని మువ్వురుకొమార్తెలనుఁ బడసిరి. ఈకొమరుఁడే మనయిప్పటి కథానాయకుఁడగు బాలగంగాధరతిలక. వీరు శాలివాహనశకపు సం ౧౭౭౮కి సరియగు రాక్షససంవత్సర ఆషాఢబహుళ షష్ఠి బుధవారము (క్రీ. శ 1856 సం. జూలై 23.) శుభలగ్నమున జననమందిరి. వీరికి బల్వంతరావు (లేక బాలగంగాధరతిలక) యని నామకరణముఁ జేసిరి. బల్వంతరావు

A

మనస్సాక్షికి విరుద్ధముగఁ జరింపనివ్వాఁడగుటచే, వీరాకళాశాలతోఁ దనకుగల సంబంధమును ౧౮౯౧ వ సంవత్సరములో వదలుకొనిరి. ఇందువలన నుభయపక్షములవారికిని వాదములు హెచ్చినవి. ప్రతికక్షులలోని ఆగర్కారుగారు "కేసరి" యనుపత్రికను, తిలకుగారు "మహారాష్ట్ర" యనుపత్రికను స్థాపించి వాదప్రతివాదములను జరుపసాగిరి. పిదప కొన్నినాళ్లకిరుపక్షములవారును సంపూర్ణ దేశాభిమాననిరతులు గావున నొకరినొకరు నిందించుటను మాని మరల మిత్రులైరి. వీరిరువురు కొల్హాపురపుమహారాజగు శివాజీరావు (Shivaji Row) బహద్దర్ గారి విషయములోఁ దమపత్రికలయందు తీవ్రచర్చను జరిపిరని దండాధ్యక్షుఁడు (Magistrate) వీరిరువురను నేరస్థులఁ జేసి ౧౦౦ దినములు కారాగారమున నుండునట్లు విధించెను. అటుపిదప వీరిరువురకును సాంఘికమతవిషయములలో భిన్నాభిప్రాయములు బొడమినందున ఆగర్కారు కేసరిపత్రికను విడనాడి 'సుధారక్'' అనుపత్రిక నారంభించిరి. పండితపక్షపాతియగు తిలకుగారు కేసరి పత్రికను సైతము స్వీకరించి నడుపుచుండిరి.

ఇట్టిస్థితిలో నిండియాదేశపు శాసననిర్మాణసభలో "అంగీకారవయస్సు చట్టము"(Age of Consent Bill) విషయమై చర్చయొకటి ప్రారంభమాయెను. అది హిందువుల సాంఘికమతవిషయకమైనది. "దొరతనమువా రిట్టివిషయములలో నెట్టిబదనామిఁ గలుగఁజేసికొనినను హిందూప్రజలయాచారమునకు భంగకర" మని తిలకుగారికి తోఁచినది. కావున నట్టిచట్టము నధిక్షేపించుచు పండితులపక్ష మవలంబించి యతిధైర్యస్థైర్యసామర్థ్యములతో మహానీయులగుతిలకుగారు తీక్ష్ణముగ వ్రాసిరి. ఈతరుణముననే పుణే (పునహా) పట్టణములో న్యాయశాస్త్రపాఠశాల (Law College) నొకదానిని నెలకొల్పి తిలకుగా రందు బోధించుచుండిరి. ఇదిమొదలు మనమహానీయులు రాజకీయాందోళనమునఁ గడుశ్రద్ధతో విశేషముగఁ బనిచేయసాగిరి.

శ్రీయుత లోకమాన్యుల రాజకీయప్రయత్నములును, అందువలన నాసత్యసంధునకుఁ గలిగినయిక్కట్టులును ప్రస్తుతము మన కవసరములేదని తోఁచినను నట్టి ముఖ్యవిషయములు లేక, వారిజీవితచరిత్ర యసంపూర్ణముగను, హాస్యాస్పదముగ నుండుటచే నీక్రింద నించుక వానిని మందలింపవలసివచ్చినది.

మహారాష్ట్రభాషలోఁ బ్రచురితమగుచున్న "కేసరి" పత్రికవలననే లోకమాన్యుల పేరుప్రతిష్ఠలు మహారాష్ట్రదేశమునందు హెచ్చుగాఁ జొచ్చెను. ఇంతి

యుగోక పుణేనగరమునఁ బ్రసిద్ధినొందిన "బాపట్" కేసువలనను, ముంబయి (బొంబయి) రాష్ట్రీయమహాసభకుఁ గార్యదర్శిగానుండి చేసినపనివలనను, రాయఘడమునందు శివాజీమహారాజుయొక్క సమాధిని పునరుద్ధరణఁజేసి దేశమునం దామహారాజస్మరణచిహ్నమును గౌరవించుటవలనను, పుణేపట్టణమున పురపాలకసభలో సభ్యుఁడుగనుండి వహించినశ్రద్ధవలనను, ముంబయిరాష్ట్రీయశాసననిర్మాణసభలో గౌరవసభ్యుఁడుగ నుండినందునను, సార్వజనికసభయందు జేసినకృషివలనను తిలకుగారికీర్తి దిగంతముల వ్యాపించి వారికి ప్రజానాయకత్వ మిప్పించెను.

ఇట్టిసమయమున పుణేనగరమున మహామారిజాడ్యము ప్రబలమైనది. ఈ వ్యాధి నణచుటకు దొరతనమువారు చేయుప్రయత్నములు ప్రజల కతృప్తికరములాయెను. అల్లరు లారంభించెను. ౧౮౯౭ సం. జూన్ నెల ౨౨వ తేదీ నాడు 'ర్యాండు, లెప్టినెంటు అయర్స్' లను నైరోపీయోద్యోగులు దుర్మరణము నొందిరి. ఇట్టిస్థితిలో నియల్లరులఁగూర్చి కేసరిపత్రిక సింహనాదముఁజేసెను; పునాలో జరిగిన శ్రీ శివాజి పట్టాభిషేకోత్సవదినమున లోకమాన్యుఁడిచ్చిన యుపన్యాసము ౧౮౯౭ సం జూన్ తే ౧౫డి కేసరియందు ప్రచురమాయెను. ఈసందర్భములు దొరతనమువారికి ససృహములై తిలకువంటినాయకులను శిక్షించినచో నల్లరులు తగ్గునని యెంచి, తిలకుగారిపై బొంబయిలోని యున్నతన్యాయస్థానమున (High Court) రాజద్రోహపునేర మారోపింపఁబడి విచారణకు వచ్చెను. ఈయభియోగమునకు పంచాయతీలుగా నాల్గురైరోపియనులును, ముగ్గురుభారతీయులు నేర్పఱుపఁబడిరి. వీరిలో నైరోపీయపట్కము తిలకుగారిని 'దోషి' యనియు, ముగ్గురు భారతీయులు 'నిర్దోషి' యనియు నభిప్రాయము నిచ్చిరి. న్యాయమూర్తి స్ట్రాచీ (Justice Strachy)గా రెక్కువమంది యభిప్రాయానుసారముగ శ్రీతిలకుగారికి ఒకటిన్నరసంవత్సరము కారాగారమునఁ గఠినశిక్ష ననుభవించునట్లు తీర్మానించిరి. ప్రధానన్యాయస్థానమునకు (Privy Council) నభియోగము కొంపోఁబడినది (అప్పీలు చేయఁబడినది) గాని తిలకుగారి కుపయోగము లేకపోయెను. అయినను సంస్కృతవిద్యాభిమాని యగు మాక్సుములరు (Prof. Max Muller) గారి ప్రేరేపణమున దొరతనమువార్లు తిలకుగారిని ౧౮౯౮ సం. సెప్టంబరు నెల. తే ౬డీ శిక్షనుండి విడుదలఁజేసిరి. కారాగృహమునుండి విడుదలకాగానే తిలకుగారు చెన్నపురిలో జరిగిన దేశీయమహాజనసభ కేతెంచి యచటినుండియు సింహళమువఱకును యాత్రగావించి, పునహానగరము మరలఁ జేరి శ్రీశివాజీమహారాజుయొక్క పట్టాభిషేకదినోత్సవము నతివైభవముతో జరుప నారంభించిరి.

మహారాష్ట్రదేశములో నొకసంస్థాను "బాబామహారాజు" అనునతఁడు స్వర్గస్థుఁ డగుతఱి (7-8-1897) బాలగంగాధరతిలకు, శ్రీకృష్ణకపర్ది, రావుసాహెబ్ కంభోజ్కార్, నాగపూర్ కొర్ గార్లను తనయాస్తికి పాలకులుగ (Trustees) నియమించి, వారియిష్టానుసారము లేనిచో, తనభార్యయగు శ్రీ శుకవార్ బాయి (లేక తాయిమహారాజు) యొప్పఁదగిన చిన్నవానిని స్వీకార మొనర్చుట కనుజ్ఞ నిచ్చుచు మరణశాసనమును వ్రాసెను.

వీరిలో రావుసాహెబ్ గారును, పిదప నాగపూర్ కొర్ గారును ట్రస్టీలై యుండుట మానుకొనిరి. తిలకుగారును, కపర్దిగారును, కంభోజ్కార్ గారును తాయిమహారాజు నిచ్ఛానుసారముగ నామెభర్తవంశమునకు సంబంధించిన జగన్నాథ్ అనువాని నేర్పాటుచేసి, తాయిమహారాజుచే దత్తస్వీకారము యథావిధిగఁ జేయించిరి. కాని, కొందఱి దురాలోచనలవలన నామె మఱియొక చిన్నవానినిగూడ స్వీకరించి జగన్నాథుని వెడలఁగొట్టెను. అంత జగన్నాథుని దత్తునుఁగూర్చి ట్రస్టీలు పునహాయందలి సబ్ జడ్జిగారి న్యాయస్థానమున వ్యాజ్యముఁ దెచ్చి యచ్చట జయమొందిరి. కాని తాయిమహారాజు బొంబయి హైకోర్టులో నప్పీలుచేసి గెలిచినది. అయినను ట్రస్టీలు ప్రధానన్యాయస్థానమున (Privy Council) నప్పీలు చేయఁగా జగన్నాథునిదత్తత స్థిరపడి వీరికి జయముగలిగినది. ఈసందర్భమున తిలకుగారును, మఱికొందఱును అబద్ధపుసాక్ష్యమును చెప్పినట్లును, మోసము చేసినట్లును వారిపై నేరము మోపింపఁబడినది. ఇందుకై తిలకు గారికి పదునెనిమిదిమాసములు కారాగారపుకఠినశిక్ష విధింపఁబడెను. కాని అపీలులో తిలకుగారే జయమొందిరి. మఱియు నీవ్యవహారమునందును తిలకుగారు వారిపరోపకారబుద్ధికై ప్రధానన్యాయస్థానమువలన మెప్పువడసిరి.

స్వదేశోద్యమము, విదేశవస్తుబహిష్కారము, జాతీయవిద్య, స్వరాజ్యాందోళనముల విషయములలో తిలకుగారు చేసినకృషి యింతింతయని వ్రాయనలవి కాదు. సర్వకాలసర్వావస్థలయందును దేశాభిమానమే స్వర్గతుల్యముగ నెంచు మహానీయుఁ డిట్టివిషయములలోఁ బట్టుదలను పెంపుచేయునుగాని యుపేక్ష వహించునా? సమర్థవిద్యాలయము, పైసానిధి (Paisa Fund) తలేగాంను నందలి గాజుసామగ్రిఁ దయారుచేయు యంత్రశాల యున్నగువానికి వీరే కారకు లన నొప్పును. వీరెల్లప్పుడును రాజాంగవిధానమునందలి లోపముల నతితీక్ష్ణముగను, నిర్భయముగను, సహేతుకముగను 'కేసరి', 'మహారాష్ట్ర' పత్రికలయందు విమర్శించుచు చర్చించుచుండువారు. ౧౯౦౭ వ సంవత్సరము డిసెంబరు నెలలో సూరతు

పట్టణములో సమావేశమైన దేశీయమహాజనసభకు విఘ్నము తటస్థించినది. అప్పటి నుండియు దేశీయప్రముఖులలో మితవాదులు, అతివాదులు, అని రెండుపక్షము లేర్పడినవి. తిలకుగారును వారియనుచరులును అతివాదులుగ భావింపఁబడిరి. మితవాదులు దొరతనమువారి యనుగ్రహమునకు పాత్రులైరి. తిలకుగారే సూరతు దేశీయమహాజనసభ విఘ్నమగుటకు కారణులని మితవాదులు చెప్పి తిలకుగారిని నిందింపుచువచ్చిరి. ఇంతియకాక తిలకుగారు మితవాదులయభిప్రాయములకు లొంగక పోవుటయేగాక యప్పటిమితవాదులందఱిపుడు వారియభిప్రాయమును సరియే యని యొప్పుకొనిరి.

1908 వ సం. జూలై నెలలో మరల రాజద్రోహపు నేరము తిలకుగారిపై యారోపింపఁబడెను. అందుకై బొంబయిలోని యున్నతన్యాయస్థానము (High Court) న విచారింపఁబడిరి. న్యాయమూర్తి "దావరు" గారు తిలకుగారిని నేరస్థులని తీర్మానించి యాఱుసంవత్సరములు కారాగారబద్ధునిగాఁ జేసిరి. కొద్దికాలము 'బర్మతీ' యందు కారాగారవాసము చేయించినపిదప తిలకుగారిని బర్మాయందలి 'మాండలే' (Mandalay) కు రహస్యముగఁ గొంపోయి యచ్చోట కారాగారమున దొరతనమువా రుంచిరి. కాని, కఠినశిక్షనుండి విడిశిక్ష జేసి, దొరతనమువారు, తిలకుగారికి గ్రంథములు పఠించుట కవకాశ మొసఁగిరి. మాండలేయందు శిక్ష ననుభవించు కాలమున నీమహనీయుని సహధర్మచారిణి సత్యభామాబాయి స్వర్గస్థురాలాయెను. ఈవార్తను విని ధైర్యము చెడక భగవంతునిపై భారమువైచి తిలకుగారు శిక్షాకాలమును పూర్తిగ జరిపి 1914 వ సంవత్సరములో విడుదలచేయఁబడిరి. అప్పటినుండియు మరల దేశోపకారకార్యములయందు బద్ధకంకణులై శ్రీమతి, అనిబెసంటు దొరసానిగారికి సాయమొసఁగుచు నతివాదులను మితవాదుల నేకము చేయుటయేగాక 1916 వ సంవత్సరారంభమున పునహానగరమందు "ఆంగ్లసామ్రాజ్యస్థస్వరాజ్య సంఘము"ను స్థాపించి తత్సంఘమున కధ్యక్షుఁడుగ నుండి స్వరాజ్యప్రాప్తియే భరతఖండమునకుఁ బరమావధి యనునమ్మకముతో నలుదెసల సంచరించి యుపన్యాసముల నిచ్చుటమూలమునను, పత్రికలయందు వ్యాసములు రచించి ప్రకటించుట మూలమునను అతిశ్రద్ధతో సర్వదా పనిఁజేయుచున్నారు. "రాజ్యాంగ విషయములలో సహజముగ నభిప్రాయభేద మొల్లవారికివలె నాకుఁగూడ నుండి నందువలన చక్రవర్తిగారి పరిపాలనమునకు నేను విరుద్ధభావమును వహించితినని గాని, విరుద్ధముగఁ బనిచేయుచుంటినని గాని యెంచుట హాస్యాస్పదము. అది నాయుద్దేశము గాని యాశయముగాని కాదు. పరిపాలనావిధానముల మార్చుటకై రెండులో

నాఁటి బూర్వ దేశమును నాలుగు వేలసంవత్సరముల క్రిందట నుండినట్లు సిద్ధాంతము చేసెను.

1907 వ సంవత్సరమున నితఁడు మహారాజు చెఱసాలయం దుండి (Arctic Home in the Vedas) "వేదములయందలి యార్యులయుత్తర ధ్రువ (లేక నమేరు) నివాసము" అను నసాధారణప్రజ్ఞావిశేషములుగల గ్రంథమును వ్రాసెను. అం దనేకయుగముల క్రిందట నార్యు లుత్తర ధ్రువప్రాంతనివాసులై యుండిరనియు, పిదపఁ గాలక్రమాంతరములచే దక్షిణాభిముఖముగ వచ్చిరనియును, పిదపఁ గొందఱు మన భూమిని కనుగొంచిరనియు, వారే యార్యావర్తమును తమ నివాసముగఁ జేసికొనిరనియును వేదములను ప్రమాణములుగఁ గైకొని వ్రాసియున్నాఁడు. పాశ్చాత్యపండితులనేకులు నీ గ్రంథమును బరికించి యత్యద్భుత మొందినవారై తమకుఁగల యభిప్రాయములను మార్చుకొని శ్రీలోకమాన్యుని సిద్ధాంతము నంగీకరించిరి.

1908 వ సంవత్సరము మొదలు 1914 వ సంవత్సరమువఱకు నాఱుసంవత్సరములు కారాగృహవాసమున్నను, సతీవియోగము గల్గినను, ప్రవాసమున నుండుటచే నైనను హిందూమతమును నుద్ధరింపఁబూని పలు గ్రంథసామగ్రిని సేకరించుకొని విమర్శనబుద్ధితోఁ బరికించి హిందూమతమునకు వన్నె దెచ్చిన శ్రీభగవద్గీతారహస్యమును హిందువసోదరులకు నుపదేశించుటకై మాతృభాషాభిమాని గావున స్వభాషయగు మహారాష్ట్రభాషయందు భాషావైచిత్ర్యములను బెంపొందింపుచు "గీతారహస్యము, లేక కర్మయోగము" అను సద్గ్రంథమును వ్రాసి 1914 వ సంవత్సరములోఁ జెఱసాలయందుండి విముక్తిఁ బొందినవెంటనే ప్రచురపఱచెను. ఈగ్రంథ మమూల్య మగుటచే మహారాష్ట్రభాష యలవాటులేని యితరపండితపామరజనులెల్లరకును, సుబోధ్యమగునట్లు గుజరాతి, హిందీ భాషలలో భాషాంతరీకృతమై కర్ణాటాంధ్రద్రావిడాదిభాషలయందు సైతము భాషాంతరీకరణంబు గావింపఁబడుచున్నది.

శ్రీలోకమాన్యతిలకుగారికి ముగ్గురు కొమార్తెలును, ముగ్గురుకొమారులును గలిగిరి. కొమార్తె లందఱును వివాహితలై తమతమభర్తలతోఁ గాపురములు చేయుచు సుఖముగ నున్నారు. పెద్దకొమార్తెకు 37 యేండ్లప్రాయము. కాని పెద్దకుమారుఁడు బి. ఏ. పరీక్షయందు త్తీర్ణుఁడై 1908 వ సంవత్సరములో నకాలమరణమునొంది తలిదండ్రులకు మితిమీరిన దుఃఖమును గావించెను. ఇపు డుండు కుమారు లిరువురిలో పెద్దవాఁడు రామచంద్రరా వనువాఁడు, అతను యిరువది

మూఁడేండ్లవాఁడు, రెండవవాఁడు శ్రీధరరావు. ఇతఁడు యిరువదియొక్కయేండ్ల వాఁడు. వీరిరువురును కళాశాలలయందుఁ జదువుచున్నారు.

హిందూమతపోషకుఁడును, ప్రజానాయకుఁడును, పండితోత్తముఁడును, కర్మయోగియును, పరోపకారధురంధరుఁడును, సత్యసంధుండును, ధైర్యసాహసాది సద్గుణసంపన్నుండు నగు శ్రీలోకమాన్య బాలగంగాధరతిలకుచే మహారాష్ట్ర లోకమున కొసంగఁబడిన యీయుత్కృష్టగ్రంథమ్ము నాంధ్రులెల్లరును బఠించి కృతార్థులయ్యెదరుగాత! శ్రీకృష్ణభగవానులు లోకమాన్య బాలగంగాధరతిలకునకు నాయురారోగ్యైశ్వర్యాదు లొసంగి ప్రపంచమునం దెల్ల నీగ్రంథప్రభావ మప్రతిమానమై వెలయించుగాత!

"ఓంతత్సత్.—"

తెనాలి.
15. 9. 18.

పెద్దిభట్ల. లక్ష్మీనరసింహం,
ప్లీడరు.

# గ్రంథకర్తయొక్క ప్రస్తావన.

---

సంతాంచీ ఉచ్ఛిష్టే బోలతోఁ ఉత్తరే,
కాయ్ మ్యా పామరే జాణావే హే.

"నేను చెప్పువాక్యములు సత్పురుషుల యుచ్ఛిష్టము. పామరుఁడ నగు నేను వానిభేదము నే మెఱుంగగలను"? — తుకారాం.

శ్రీమద్భగవద్గీతపై ననేకము లగుసంస్కృతభాష్యములు, టీకలు లేక ప్రాకృతభాషాంతరములు, మఱియు విస్తృతములు, సర్వసామాన్యము లగునిరూపణములు నుండగా నీగ్రంథమును ప్రచురించుటకు కారణము గ్రంథారంభముననె చెప్పఁబడినను గ్రంథములోఁ బ్రతిపాద్యములగు కొన్నివిషయములయొక్క వివేచన యందు చేయుటకు వీలులేకపోవుటచే వానినిఁ బ్రకాశింపఁజేయుటకై ప్రస్తావన దక్క మఱియొకమార్గ మేమియు లేదు. వీనిలో మొదటిది గ్రంథకర్తనుగురించినవిషయము (స్వవిషయము.) నాకు భగవద్గీతతో మొదటిపరిచయము నేటికి సుమారు నలుబదిమూఁడుసంవత్సరములక్రిందట నైనది. క్రీ.సం. ౧౮౭౨వ సంవత్సరమున నాతండ్రిగారు తా మంతిమవ్యాధిగ్రస్తులై యుండి భగవద్గీతపైనున్న "భాషావివృతి" యనుపేరి ప్రాకృతటీకను తమకు వినుపింపుమని నా కాజ్ఞ యొసఁగిరి. అప్పుడు (అనఁగా: నాపదునాఱవయేట) గీతలయొక్క భావార్థము పూర్ణముగఁ దెలిసికొనుటకు శక్యముగాకుండెను. అయినను బాల్యమున మనస్సునకు సంభవించినసంస్కారము స్థిరమయి యుండునుగాన సంస్కృతముయొక్కయు నాంగ్లభాషయొక్కయు నభ్యాస మధికమైనపిదప గీతలపైనున్న సంస్కృతభాష్యములను, ఇతరములగు టీకలను ఇంగ్లీషునందును మహారాష్ట్రమునందును ననేకులగు పండితులచేఁ జేయఁబడిన వివేచనలను సైత మప్పుడప్పుడు చదువుచుంటిని. కాని స్వకీయులతో యుద్ధము చేయుట గొప్పపాపకార్య మనియెన్ని ఖిన్నుఁడైన యర్జును నాయుద్ధమునందే ప్రవర్తింపఁజేయుటకుఁ జెప్పఁబడినగీతలయందు బ్రహ్మజ్ఞానముచేగాని,

భక్తిచేఁగాని మోక్ష మెట్లు లభించును? లేక యీగ్రంథమున మోక్షమార్గము యొక్క వివేచన యేల చేయవలయును? అనుశంక మనస్సున నెగడి యదియే మునుముందు ప్రబలుచుండెను. కారణ మేమన: గీతలయొక్క టీకలయందును దానికి తగిన సమాధానము గన్పట్టలేదు. ఈశంక నాకేగాక యితరుల కేకిని గలిగి యుండకపోదు. కాని టీకలనే చూచుచుండువాఁడు టీకాకారులచేఁ జెప్పఁబడిన సమాధానము సరియైనది కాకున్నను నదిదక్క మఱియొక సమాధాన మేమియు స్ఫురింపదు. కాన నన్నిటీకలను భాష్యములను దూరముగనునిచి కేవలగీతలనే స్వతంత్రముగ విచారించుచు పలుమారు పారాయణములు చేసియుంటిని. అప్పుడు టీకాకారుల శైలిని వదలి మూలగీత నివృత్తికొఱకుఁగా దనియు, కర్మయోగపరమేనియు, వేయేల? గీతయందున్న 'యోగ' యనువ్యస్తపదమే 'కర్మయోగ' మనునర్థమునఁ బ్రయోగింపఁబడిన దనియు నేను తెలిసికొంటిని; మహాభారతమును, వేదాంతసూత్రములను, ఉపనిషత్తులను, వేదాంతశాస్త్రముపై నున్న సంస్కృతగ్రంథములను, నాంగ్లగ్రంథములను పఠించినను నాయభిప్రాయమే దృఢమైనందున దానిని లోకమునఁ బ్రకాశింపఁజేయుటవలన నీవిషయమును గుఱించి యూహాపోహ లధికముగ నగుననియు, నిజమును నిశ్చయించుటకు సౌలభ్యము గలుగుననియు నూహచే నీవిషయములనుగురించి నాలుగైదుస్థలములయందు వెవ్వేఱుసమయముల సభలలో నుపన్యసించితిని. ౧౯౦౨-వ సంవత్సరము జనవరి నెలలో నాగపూరున నొకయుపన్యాసముఁ గావించితిని. మఱియు, కరవీర, సంకేశ్వరమఠాధిపతు లగు శ్రీజగద్గురు శంకరాచార్యులవారల సమక్షమున వారియాజ్ఞ ననుసరించియె ౧౯౦౪-వ సంవత్సరము ఆగష్టు నెలలో నీవిషయమునే యుపన్యసించితిని. నాగపూరులోఁ గావింపఁబడిన యుపన్యాస మప్పటి వార్తాపత్రికలలోఁ బ్రకటింపఁబడినది. నాకుఁ దోఁచిన యీవిషయమును వెల్లడింపవలయు ననుతలంపుననే యవకాశము లభించి నప్పుడెల్లను కొంతమంది గొప్పవిద్వాంసులసమక్షమునను వాదోపవాదములఁ జరుపుచుంటిని. నామిత్రులలోనే స్వర్గస్థ శ్రీపతి బువాభింగార్కరుగా రొకరుండిరి. వారిసహవాసముచే భాగవతసంప్రదాయమునందున్న కొన్నిమహారాష్ట్రభాషయందలి గ్రంథములఁ జూచుట సంభవించెను. గీతారహస్యములోఁ జెప్పఁబడిన కొన్నివిషయములు బువాగారికిని నాకును జరిగినవాదోపవాదములవలనే మొదట నిశ్చయింపఁబడెను. బువాగారీగ్రంథమును జూచువఱకును జీవించియుండకఁ బోవుట నాకు మిగులదుఃఖకరముగనున్నది. అదియట్లుండనిమ్ము; ఇట్లు గీతయందు ప్రతిపాద్యములైనవిషయము ప్రవృత్తిపరమైనదే యనుమతము స్థిరపడినది. దానిని

వ్రాయవలెనను నిశ్చయము బహుకాలముక్రిందటనె కలిగెను. కాని ప్రస్తుత మనకుం గన్పట్టుచున్న భాష్యములయందును, టీకలయందును, భాషాంతరముల యందును స్వీకరింపఁబడని యీగీతాతాత్పర్యము (అనఁగా: ప్రాచీనులగు టీకా కారులచే నిశ్చయింపఁబడని తాత్పర్యము) నాకుమాత్రమేల గ్రాహ్యము కాదో కారణముఁ జూపక గ్రంథరూపముగఁ బ్రచురపఱచితినేని మిక్కిలి యన్యాయమై యుండును; టీకాకారులయందఱమతమును సంగ్రహించి వానియందుండులోప ములను సకారణముగఁ జూపించుటయును, గీతాధర్మముల నితరధర్మములతో లేక తత్త్వజ్ఞానముతో సరిపోల్చిచూపుటయు ననుకార్యము బహుప్రయాససాధ్యమయి నందున నది కొలఁదిదినములలో స్పష్టముగ నుపపాదింప శక్యముగాకుండెను. కాని నేను గీతపై నొకక్రొత్తగ్రంథమును శీఘ్రముగనే ప్రచురించుచున్నానని నా మిత్రులగు రా. రా. దాజీసాహెబ్ ఖరేగారిని కొంతతొందఱపఱచి మొదటనే ప్రచురించినను, నిట్లుచేయుటకు నాకు సంపూర్ణమగుసామగ్రి యప్పటికి లేదని తోఁచినందున గ్రంథము వ్రాయుట యనుకార్యము జరుగకనేయుండెను; పిదప ౧౯౦౮ వ-సంవత్సరము శిక్షితుఁడనై బ్రహ్మదేశము (బర్మా)లో మాండలేయను పట్టణమున నున్నప్పుడీగ్రంథము వ్రాయువిషయమున బొత్తుగ నిరాశనుజెంది యుంటిని. కాని గ్రంథము వ్రాయుటకు నావశ్యకమగుపుస్తకాదిసామగ్రి పునహా (పుణ్యపురి) నుండి నాయుండుచోటికిఁ గైకొనివెళ్లుటకు దొరతనమువా రనుమతించి నందున ౧౯౧౦-౧౧ సంవత్సరములసంధిలో (శక ౧౮౩౨) కార్తికశు౧, ఫాల్గున బ. ౩౦ (అమావాస్యలోపల గ్రంథముయొక్క సామాన్యస్వరూపము (ముసా యిదా) మాండలేలో కారాగృహమున మొదట వ్రాయఁబడినది. పిమ్మట నాయా సమయములయందుఁ దోఁచినవిషయములనప్పుడప్పుడు వ్రాయుచుండినను, పుస్త కములన్నియు నాయొద్దలేనందున ననేకస్థలములయందున్నలోపముల నచ్చోటినుండి విముక్తుఁడనైన పిదపఁ బూర్తిగా సవరించితిని. ఇప్పటికి నీగ్రంథములో వ్రాయవల సినవిషయములన్నియుఁ బూర్తియైనవియని చెప్పుటకు వీలులేదు. కారణ మేమన: మోక్షముయొక్కయు నీతిధర్మములయొక్కయు సిద్ధాంతములు గూఢములగు నందున వానివిషయమై ప్రాచీనులు నవీనులు నైనయనేకపండితులును, వ్యర్థముగ గ్రంథబాహుళ్యముచేయక యీచిన్నగ్రంథమువందు నిర్ణయించుట కవకాశము కావలెఁ, విస్తృతమగువివేచనఁ జేసియున్నారు. కాని మహారాష్ట్రకవివర్యులగు మోరోపంతుగారు—

కృతాంతకటకామలధ్వజజరాదృశో లాంగలీ,
పురః సరిగదాం సక్త్యేష్వగతాం తనూభాగలీ.

"యమునిసేనలోని విమలమగు ధ్వజము నాకిప్పుడు కొంచెము కన్పట్టు చున్నది. రోగములతో యుద్ధముఁజేయుచు నాదేహము క్షీణించుచున్నది." అని చెప్పినట్లు నా స్థితియుఁ బ్రస్తుతమున నటులే యయినది. గృహస్థాశ్రమమునందున్న సహచారిణిస్తు మొదట పరమపదమును బ్రాపించినది. కాని మనచే గ్రహింపఁ బడినవిషయమును, నాకు స్ఫురించినవిచారమును, లోకములోఁ బ్రచురపఱచితి నేని యెవరైన సమానధర్ములు (నావంటివారు) ముందు వెలువడి పూర్తిచేయుదు రని నమ్మి యీ గ్రంథమును బ్రచురింపఁదలంచితిని.

సాంసారికకర్మలు గౌణములని, లేక త్యాజ్యములని నిశ్చయించి, బ్రహ్మ జ్ఞానము, భక్తి మొదలగు కేవలనివృత్తిపరమగు మోక్షమార్గమే గీతలయందు నిరూపింపఁబడిన దనుమతము నాకు సమ్మతము కాకున్నను మోక్షప్రాప్తికి గలమార్గము బొత్తిగ వివేచింపఁబడలేదని నే ననని యారంభమునందె ముఖ్యముగఁ జెప్పు చున్నాఁడను. వేయేల? ప్రతిమనుజుఁడును శుద్ధమగు పరమేశ్వరస్వరూపమును దెలిసికొని దానినుండి తనయొక్క బుద్ధిని శక్యమైనంతనిర్మలముగను పవిత్రముగను చేసికొనుట గీతాశాస్త్రానుసారముగ నీజగమునం దెల్లవారికి నవశ్యకర్తవ్యమనియు నీగ్రంథమున స్పష్టముగ నిరూపించితిని. కాని యిది గీతకు ముఖ్యమగు విషయము కాదు. యుద్ధము చేయుట క్షాత్రధర్మమైనను, కులక్షయము మొదలగు ఘోరపాతకములు విపరీతముగ సంఘటిల్లును. గావున నే యుద్ధము మోక్షప్రాప్తిరూపమగు నాత్మకల్యాణమును నశింపఁజేయునో యట్టిదానినిఁ జేయుదునా? మానుదునా? యని యర్జునుఁడు యుద్ధారంభమునందె కర్తవ్యమోహమును జెందెను. కాన నా మోహమును నివర్తింపఁజేయుటకై వేదాంతశాస్త్రాధారమున శుద్ధముగ కర్మాకర్మలను మోక్షోపాయమును పూర్ణముగ వివేచించి మఱియుఁ గర్మ లెప్పుడును వీడవు, వీడుటకు వీలుసైతము లేదనియు నిశ్చయించి యేయుక్తిచే కర్మ చేసినను నేవిధమైన పాపమును తగులక తుదకు మోక్షముసైతము లభించునో, యాయుక్తియే యనఁగా జ్ఞానమూలకమును భక్తిప్రధానమును నగు కర్మయోగమే గీతలయందు భగవంతుఁడు ప్రతిపాదించెనని నాయభిప్రాయము. కర్మాకర్మలయొక్క లేక ధర్మాధర్మములయొక్క యీ వివేచనము నే యాధునికులగు కేవలాధిభౌతిక పండితులు నీతిశాస్త్ర

మని పేర్కొనుచున్నారు. ఈవివేచనము గీతలలో నెట్లు చేయఁబడినదో సామాన్య పద్ధతి ననుసరించి గీతలలోని శ్లోకానుసారముగ వ్యాఖ్యానముచేసి నిరూపించుటకు సాధ్యము కాకపోయెను. కాని, వేదాంతము, మీమాంసము, సాంఖ్యము, కర్మ విపాకము, లేక భక్తి మున్నగు శాస్త్రములయందున్న యనేకవాదములయొక్కయు ప్రమేయములయొక్కయు నాధారముచే కర్మయోగము గీతలయందు ప్రతిపాదింపఁబడినదనియు నాశాస్త్రము అప్పుడప్పుడు మిక్కిలి సంకుచితముగ ప్రతిపాదింపఁబడినదనియు శాస్త్రీయసిద్ధాంతములను ప్రథమమున తెలిసికొనవలయు ననియు, లేనిచో గీతలయందున్న వివేచనముయొక్క రహస్యము పూర్ణముగను శీఘ్రముగను మనస్సునకుఁ దోఁపదనియు నిశ్చయించి యిందులకై గీతలయందేయే విషయములును సిద్ధాంతములును చెప్పఁబడినవో వానిని శాస్త్రీయరీతి ననుసరించి ప్రకరణములుగ విభజించి దానియందున్న ముఖ్యములగు యుక్తివాదములను సైతము గీతారహస్యమునందు మొదట సంక్షేపముగ నిరూపించినాఁడను. ఈపుస్తకమునందు మొదట వ్రాయఁబడిన గీతారహస్యమను నిబంధన మీవిధముగ కర్మయోగమును గురించి వ్రాయఁబడినదియు, స్వతంత్రమైనదియు నగునొకచిన్న గ్రంథమని చెప్పవచ్చును. కాని యేమి చెప్పినను ఇట్టి సామాన్యనిరూపణమునందు గీతలయందున్న శ్లోకములలో ప్రతిశ్లోకమును పూర్ణముగ విచారించుట శక్యముగాకపోయెను. కాన తుదను గీతలలోని శ్లోకములన్నింటికి నర్థము వ్రాసి పూర్వాపరసందర్భములు మనస్సునకుఁ దోఁచునిమిత్తమును, లేక ప్రాచీనులగు టీకాకారులు తమతమసంప్రదాయసిద్ధికొఱకు గీతయందలి కొన్ని శ్లోకముల నెట్లు తికమక జేసినదియు (గీ. ౩. ౧౭-౧౯; ౬-౩; మఱియు ౧౮-౨ చూడుము) స్పష్టముగ నిరూపించుటకును, లేక గీతారహస్యమునఁ జెప్పఁబడిన సిద్ధాంతములలోను, గీతలయందున్న సిద్ధాంతములలోను గీతలయందున్న సంవాదాత్మక పద్ధతిననుసరించి, యేయే సిద్ధాంతము లెక్కడెక్కడ నెట్లున్నది చూపుటకును, టీకారూపముగ భాషాంతరమును జేసి యాయాస్థలములయందు క్రింద టిప్పణి వ్రాసితిని. ఈరీతిని బట్టి కొన్ని కొన్ని విషయములకు ద్విరుక్తియయినదన్నటలో సందేహములేదు; కాని గీతాగ్రంథముయొక్క తాత్పర్యవిషయమై సామాన్యు లగు చదువరులకుఁ ప్రస్తుతమున గల్గుభ్రమను పూర్ణముగ నివారించుట మఱియొకరీతిచే శక్యముగాదని తోఁచినందున గీతారహస్యవివేచనమును గీతలయొక్క భాషాంతరముకంటె వేఱుగ వ్రాసితిని; మఱియు దానిమూలమున వేదాంతము, మీమాంసము, భక్తి, మొదలగు విషయములయందు, గీతలయొక్క సిద్ధాంతములు, భారతము, సాంఖ్యశాస్త్రము, వేదాంతసూత్రములు, ఉపనిషత్తులు,

మీమాంసయు మొదలగు మూలగ్రంథములలో నెక్కడెక్కడ వ్రాయబడినదో వానిని పూర్వమునం దున్న ఇతిహాసములతోడను నాధారములతోడను గాన్పించుటకును, సన్న్యాసము కర్మయోగము ననురెండుమార్గముల యొక్కయు గలభేదమును స్పష్టముగ నుపపాదించుటకును లేక గీతల నితరములగు ధార్మికములగు నగుమతముల తోడను తత్త్వజ్ఞానములతోడను పోల్చి వ్యావహారికదృష్టిచే గీతలయందుగల మాహాత్మ్యమును యోగ్యముగ నిరూపించుటకును మిక్కిలి యుపకారము గలిగెను. గీతలపై ననేకవిధములగు టీకలు బయలువెడలి గీతార్థము ననేకు లనేకవిధములఁ బ్రతిపాదింపనిచో నా గ్రంథమునందున్న సిద్ధాంతములకు నాధారభూతములగు మూల సంస్కృతవచనములను వ్రాయుట కేమియు నవసరము లేకపోవును. కాని యిట్టికాల మిట్టిది కానందున నాచెప్పఁబడిన గీతార్థము, లేక సిద్ధాంతము యుక్తమైనదియా? కాదా? యనువిషయమై యనేకులు సంశయపడవచ్చును. కాన నేనేయు సిద్ధాంతములకుగల యాధారమును నాయా స్థలములయందు వ్రాసి మిక్కిలి ముఖ్యమగు ప్రదేశములయందు మూలసంస్కృతవచనములనుసైతము భాషాంతరముకావించి వ్రాసియుంటిని. వీనిలో నెక్కువవచనములు తఱుచుగ వేదాంతగ్రంథములయందే ప్రమాణముగఁ గైకొనఁబడియుండుటచే జనువరుల కావచనము సహజముగ తెలిసియుండుటంబట్టి వానియందున్న సిద్ధాంతములను, మనస్సులో నుంచుకొనుటకు, సులభముగ నుండునదియు, సంస్కృతవచనములను వ్రాయుటకు మఱియొక యంతరాయముగలదు. చదువరు లందఱును సంస్కృతమును దెలిసినవారె యగుట సంభవింపనందున సంస్కృతము తెలుగనివారలు సంస్కృతశ్లోకములను వదలి చదువుదురేని యావచనములయర్థ మెచ్చోటను సందేహాస్పదముగ నుండఁగూడదనియు మొత్తముపై గ్రంథము నీతీరున రచించితిని. దీన్నినుండి సంస్కృతశ్లోకములకు శబ్దార్థములంబట్టి భాషాంతరము చేయక వాని సారాంశములనే యనేకస్థలములయందు నిర్వహింపవలసివచ్చెను. కాని మూలశ్లోకములను తప్పక పైన వ్రాసినందున నీరీతింబట్టి కొంచమైనను భ్రమచెందుదు రనిభీతిలేదు.

కోహినూరు మాణిక్యము విషయమై హిందూస్థానములోనుండి ఇంగ్లాండునకుఁ గైకొనిపోయినపిదప నచ్చో నూతనములైన ప్రకాశము వెలువడినదనియు, దానివలన నది మిక్కిలి కాంతితోఁ గాన్పించుచుండుననియు లోకమునందు ప్రవాద కలదు. మాణిక్యమునకు సంబంధించు నీన్యాయము సత్యరూపముగను రత్నమునకును సంబంధించును. గీతలయందున్న ధర్మము సత్యమ్ము నదియు నభయమైనదియూ నను విషయమయి సందియమేమియు లేదు. కాని యది యేకాలమున నేస్వరూపముగఁ

చెప్పఁబడినవో పూర్వకాలీనులకన్న నర్వాచీనమున నాతేజస్వినేతలకంటె కిప్పు డాకటిగఁ గాన్పించుటలేదు. ఏకర్మ మంచిదో, యేకర్మ చెడుదో నిశ్చయింపఁబడక పోవుటయేగాక కర్మ నొనర్పవలయునా? వలదా? యనిసైతము సామాన్యముగ ప్రశ్న చేయుకాలమునందు నీవలు చెప్పఁబడియుండుటంబట్టి వానియందు విశేష భాగ మిప్పుడు కొందఱ కనావశ్యకముగఁ దోఁచుచున్నది. మఱియు నివృత్తిమార్గీయులగు టీకాకారు లాగీతలకు మిక్కిలివ్యాఖ్యానములను జేసియుండుటచే గీతలయందున్న కర్మయోగవివేచన మనేకులకు ప్రస్తుతము దుర్బోధముగ నున్నది. ఇంతియకాక యీకాలమున పాశ్చాత్త్యులదేశమున నాధిభౌతికజ్ఞానము విశేషముగ వృద్ధి బొందుచున్నందున నధ్యాత్మశాస్త్రానుసారముగ పూర్వకాలమునందు చేయఁబడిన కర్మయోగవివేచనలు ప్రస్తుతకాలమున పూర్ణముగ ననుకూలములుకావనియు ననేకులను దీనులైన విద్వాంసులయభిప్రాయమైయున్నది. ఈయభిప్రాయము సరియైనదికాదని నిరూపించుటకై గీతారహస్యమునందలి వివేచనలయందు గీతలయొక్క సిద్ధాంతములతో సదృశములగు పాశ్చాత్త్యపండితులయొక్క సిద్ధాంతమును నేనాయాకడ సంక్షేపముగ వ్రాసియుంటిని. యథార్థముగఁ జూచితిమేని గీతలయందున్న ధర్మాధర్మవివేచనల నీవిధముగఁ బోల్చిచూచుటచే గలుగు నధికమగు ప్రాబల్యమేమియును లేదు. అయినను ప్రస్తుతకాలమందు గలిగినయాధిభౌతికశాస్త్రముయొక్క యశ్రుతపూర్వముగువృద్ధిచే నెవరియొక్క బుద్ధి యాశాస్త్రమున నమ్మకముగలదియాయెనో, లేక ప్రస్తుతకాలమునందున్నయేకదేశీయమగు విద్యాశిక్షణపద్ధతిచే నీతిశాస్త్రముయొక్క విచార మాధిభౌతికదృష్టితో ననఁగా: బాహ్యవిచక్షణమున నే చేయఁబడవలయునని శిక్షింపఁబడిరో వారికి మోక్షధర్మములు నీతియు ననురెండు విషయములు నాధిభౌతికజ్ఞానమునకు పరమం దున్నవనియు, పూర్వకాలమున మన శాస్త్రకారు లీవిషయమై చేసినసిద్ధాంతములకంటె వారలజ్ఞానముయొక్క గతి నేటికిని విశేషదూరముగ బోలేదనియు, నింతియగాక పాశ్చాత్త్యదేశమునందును నధ్యాత్మదృష్టిచే నీవిషయములయూహాపోహలు నేటికిని చేయఁబడుచు నేయుండినను నీయాధ్యాత్మికగ్రంథకారులవిచారము గీతాశాస్త్రమునందలిసిద్ధాంతములకంటె విస్తారము వేఱుగ లేదనియు నీసరిపోల్చిచూచుటవలన స్పష్టమగును. గీతారహస్యమందలి వేర్వేఱుప్రకరణములయం దున్నతులనాత్మకమగు వివేచనవలన నీవిషయము స్పష్టమగును. కాని యీవిషయము మిక్కిలి వ్యాపకమైనందున పాశ్చాత్త్యపండితులమతమునందలి స్వార్థాంశ మాయాకడ వ్రాయుట గీతార్థమును ప్రతిపాదించుటయే నాయొక్క ముఖ్యోద్దేశమైనందున గీతయందలి సిద్ధాంతములను

ప్రమాణములుగఁ గైకొని నాటికిని పాశ్చాత్యనీతిశాస్త్రజ్ఞులయొక్క లేక పండితులయొక్క సిద్ధాంతములకు నెంతవఱకు కలయిక యున్నదో చూపుటకొఱకే యనియు, నదియును సామాన్యులగు దేశభాషలను జదువువారలకు (మహారాష్ట్రము) వానియందలి సిద్ధాంతము సుగమముగఁ దెలియునట్లుగనే, వ్రాసితిననియు నిచ్చో ముఖ్యముగఁ జెప్పవలసివచ్చెను. అనఁగా: రెండింటియందును గలభేదము స్వల్పమో యధికమో తెలిసికొనఁదలచువారును నీసిద్ధాంతములయొక్క యుపపాదనము పూర్ణముగను విరివిగను తెలిసికొనఁదలచువారును మూలభూతములగు పాశ్చాత్త్యగ్రంథములనే నిర్వివాదముగ చూడవలసినదేయుండును? కర్మాకర్మవివేకము, లేక నీతిశాస్త్రముపై మొదటిమార్గప్రదర్శకమగు గ్రంథము 'అరిస్టోటిల్' అనుపేరుగల గ్రీకుతత్త్వజ్ఞునిచే వ్రాయఁబడినదని పాశ్చాత్త్యవిద్వాంసులు చెప్పుచున్నారు. కాని 'అరిస్టోటల్' కంటెను పూర్వమునం దతని గ్రంథముకంటెను మిక్కిలివ్యాపకమైనదనియు నీవిషయములవిచారము మిక్కిలి తాత్త్వికమగుదృష్టితో శ్రీమహాభారతమునందును శ్రీమద్భగవద్గీతలయందును చేయఁబడినదనియు, నధ్యాత్మదృష్టితో గీతలయందు ప్రతిపాదింపఁబడిన నీతిసిద్ధాంతములకంటె వేఱగు నీతితత్త్వము నేటికిని బయల్పడలేదనియు, మాయభిప్రాయము. సన్న్యాసులవలె నుండి తత్త్వజ్ఞానముయొక్క విచారమునందు, శాంతముగ నాయుష్యమంతయు గడపుట మంచిదా? లేక యనేకవిధము లగు రాజకీయవ్యవహారములలో చిక్కులు పడుట యుక్తమా? యనువిషయమైయరిస్టోటల్ చేఁ జేయఁబడిన వ్యాఖ్యానమంతయు గీతలయం దున్నది. మఱియు మనుజుఁడు చేయుపాపమంతయు నజ్ఞానముచేఁ జేయఁబడునది యను సాక్రటీసుయొక్క మతమును నొకవిధముగ గీతలలో నంతర్భూతమయియేయున్నది. కారణ మేమన బ్రహ్మజ్ఞానముచే బుద్ధి సమమయిన పిదప వారొనర్చిన కార్యములకు పాపము సంఘటిల్లుట శక్యము కాదని గీతలలోని సిద్ధాంతము. పూర్ణావస్థనుజెందిన పరమజ్ఞానియొక్క యాచరణమే నీతిదృష్టిచే నెల్లవారికిని పుస్తకమువలె ప్రమాణమ్ముగ నుండునని 'ఎపిక్యూరియన్' అనునట్టియు, 'స్టోయిక్' అనునట్టియు మార్గములయందలి గ్రీకుపండితులయొక్క మతములును గీతలలో చెప్పినట్లే యున్నవి. ఈమతములయందు వర్ణన వారిచేఁ జేయఁబడిన పరమజ్ఞానులయొక్క స్థితియు, గీతలయందు వర్ణింపఁబడిన స్థితప్రజ్ఞునియొక్క స్థితియును, నొకవిధముగనే యున్నవి. అటులే "మానవజాతులలో నెల్లవారికిని ప్రత్యేకముగా హితార్థమై ప్రవర్తించుట యనునదియే నీతియందలి పరమసిద్ధాంతము, లేక నికషోపలము," అనుమిల్లుయొక్కయు, స్పెన్సరుయొక్కయు, కోంట్సు మొదలగు

సాధిభౌతికవాదులయొక్కయు సిద్ధాంతములును గీతలయందు వర్ణింపఁబడిన స్థిత ప్రజ్ఞునియొక్క "సర్వభూతహితేరతః" అను బాహ్యలక్షణములయందే సంగ్రహింపఁబడినవి. మఱియు కాంటుయొక్కయు, గ్రీనుయొక్కయు నీతిశాస్త్రములయందలి యుపపత్తులును, ఇచ్ఛాస్వాతంత్ర్యమువిషయమై యున్న సిద్ధాంతములును, ఉపనిషత్తులయాధారమునుబట్టి గీతలలో వర్ణింపఁబడినవి. గీతలయం దింతకంటె విశేష మేమియు లేకున్నను గీత యందలిను గౌరవింపఁదగియే యుండనున్నను. కాని యింతమాత్రముతోఁ దృప్తినొందక మోక్షము, భక్తి, నీతిధర్మములు ననువానివిషయమై యాధిభౌతికగ్రంథకారులకు స్ఫురించుచున్న విరోధములను, లేక జ్ఞానము, కర్మము, ననువానివిషయమై సన్న్యాసమార్గావలంబులయాముతానుసారముగ నుండువిరోధమును సత్యమైనది కాదనియు, బ్రహ్మవిద్యయొక్కయు, భక్తియొక్కయు, మూలసిద్ధాంతములే నీతికిని సత్కర్మములకును మూలాధారములనియు నిరూపించి జ్ఞానము, సన్న్యాసము, కర్మము భక్తియు ననువానికిఁ గల యోగ్యమగుపరస్పరసంబంధముచే మనుజుఁ డిహలోకమునందు జీవితకాలము నెల్లు గడుపవలసినదనియు గీతలయందు నిర్ణయింపఁబడినది. గీతాగ్రంథ మీరీతిని ప్రధానముగ కర్మయోగపరమే యయినందుననే "బ్రహ్మవిద్యాంతర్గత (కర్మ-) యోగశాస్త్ర" మను పేరితో సమస్తవైదికగ్రంథములలోను దానికి నగ్రస్థాన మీయఁబడినది. "గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః" — ఒక గీతాగ్రంథమునే పూర్తిగ చదివెనేని చాలును. మిగిలినశాస్త్రములనెడు గ్రంథవిస్తారములతో నేమిప్రయోజనము?" అనిచెప్పిన దేమాత్రము నసత్యమైనది కాదు. కావుననే హిందూధర్మములకును నీతిశాస్త్రమునకుం గలమూలసిద్ధాంతములను తెలిసికొనవలయునని తలంచువారీయపూర్వగ్రంథమునే మొదట చదువవలయునని వినయపూర్వకముగ పట్టుదలతోడను చెప్పుచున్నాఁడను. కారణ మేమన సాంఖ్యము, న్యాయము, మీమాంస, ఉపనిషత్తులు, వేదాంతములు మొన్నగుక్షరాక్షరసృష్టిని, క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానమును బోధించు ప్రాచీనశాస్త్రములు శక్యమగునంతపూర్ణావస్థలోనికి వచ్చినపిదప వైదికధర్మములకు జ్ఞానమూలకమగుభక్తి ప్రధానమైనదియు, కర్మయోగపరమైనదియు, చిట్టచివరకు గల్గినదగు స్వరూపమునందు ప్రకృతమున ప్రచారములోనున్న వైదికధర్మములమూలమును ననువదియే గీతలయందు ప్రతిపాదింపఁబడుటంబట్టి సంక్షేపముగను నిస్సందేహముగను ప్రస్తుతమందున్న హిందూధర్మములసిద్ధాంతములను బోధించు గీతవంటి

మఱియొక గ్రంథము సంస్కృతవాఙ్మయమున నెచ్చోటను లేదని చెప్పుట యతి
శయోక్తి కానేరదు.

గీతారహస్యములోనున్న వివేచనయొక్క సామాన్యముగు స్వరూపము పైఁ జెప్పఁబడినదానింబట్టి చదువరులకు బోధపడగలదు. గీతలపై కర్మయోగపరమగు టీక మొదటినుండియు వచ్చునని గీతలపై శాంకరభాష్యముయొక్క మూఁడవ యధ్యాయారంభమున ప్రాచీనటీకాకారుల యభిప్రాయము వ్రాయఁబడుటచేతఁ స్పష్టముగఁ గాన్పించును. ఆటీక యిప్పుడు దొరకదు; కాని గీతలకు కర్మయోగపరమును తులనాత్మకమును నగు వివేచనమున కిదియే మొదటిగ్రంథ మని చెప్పుటకు నేమియు నభ్యంతరములేదు. ఇందు కొన్నిశ్లోకముల కిదివఱకున్న టీకాకారులు వ్రాసినయర్థముకంటె వేఱగునర్థము వ్రాయఁబడినది. మహారాష్ట్రభాషయందు పూర్వము నెచ్చోటను సవిస్తరముగ వర్ణింపఁబడని యనేకవిషయములను నీగ్రంథమున సవిస్తరముగ వర్ణింపఁబడినవి. ఆవిషయములను వానికిఁగల యుపపత్తియును శక్యమయినంత సంక్షేపముగను సుబోధకముగను వ్రాయుటకు నే యత్నించితిని. చెప్పినమాట మరల చెప్పవలసివచ్చినను లక్ష్యపెట్టకయే శబ్దముల యర్థము మహారాష్ట్రమునందు (ప్రాకృతభాషలో) నేటికిని సుప్రసిద్ధముకాలేదో యాశబ్దములకు పర్యాయశబ్దములను జేర్చియే యనేకస్థలములయందు ముఖ్యముగఁ బ్రతిపాదించితిని. ఇంతియకాక యీవిషయమునందలి ముఖ్యములగు సిద్ధాంతము లాయాస్థలములయందు సారాంశరూపముగ నుపపాదించి వేఱుగఁ జూపింపఁబడినవి. అయినను శాస్త్రీయములును, గూఢములు నగువిషయములచర్చ వాడుకలోనున్న శబ్దములతోఁ జేయుట మిక్కిలి కష్టము. ఆవిషయములకు సంబంధించిన మహారాష్ట్రములోని (ప్రాకృతభాషలోని) పారిభాషికశబ్దములు నేటికిని నిర్ణీతములుకాలేదు. కాన భ్రమచేతను, దృష్టిదోషముచేతను, లేక కారణాంతరములచేతను నాసంబంధ మగు నీక్రొత్తవివేచనయందు కాఠిన్యమును, దుర్బోధత, (తెలిసికొనలేకపోవుట) అపూర్ణత మొదలగుదోషములు నుండియుండునని నేను పూర్ణముగఁ దెలిసికొనుచున్నాడను. అయినను భగవద్గీత చదువరులకు నపరిచితమయినది కాదు. గీత బహుజనులకు నిత్యమును పారాయణములో నుండును. దానిని శాస్త్రీయదృష్టితో నధ్యయనము చేసినవారును, చేయుచున్నవారును అనేకులు గలరు. అదియునుగాక యాయధికారముగల పురుషులు తామీగ్రంథమును చదివినప్పుడు పూర్వోక్తములగుదోషములు కనఁబడునేని, యుపకారపూర్వకముగ వానిని నాకుఁ దెలుపవలయునని, నీగ్రం

గ్రమును పునల ముద్రింపించినప్పు డచ్చుతప్పులను సవరింపవలయునేని సవరిం చెదననియు ప్రార్థించుచున్నాఁడను. నేనేదో యొకసంప్రదాయములోనివాఁడ ననియు, దానిని స్థిరపఱచుటకై యేదోనూతనార్థమును వ్రాయుచున్నాననియు నెవ్వరు నూహింపవచ్చును. ఏలయన గీతారహస్యమను గ్రంథ మేదో యొకసంప్ర దాయ ప్రవర్తకునిగాని, లేక సంప్రదాయమునుగాని యుద్దేశించి వ్రాయలేదని నేను నొక్కి వక్కాణించుచున్నాఁడను. నాబుద్ధిని బట్టి గీతయందలిశ్లోకములకు నేయర్థము సరళమైనదిగఁ దోఁచెనో యాయర్థమును వ్రాసితిని. ప్రస్తుతమునందు సంస్కృతము విశేషప్రచారములోనుండుటచే నేచేయునర్థము సరళముగ నున్న దియు, లేనిదియు ననేకులకు సహజముగనే తెలియవచ్చును. ఇట్లు సరళమగునర్థమును జేసినప్పుడు, దానియందే దేదైన సాంప్రదాయార్థ మున్నచో నది గీతలోనిదే కాని నాదికాదు. “నాకు రెండుమూఁడుమార్గములను చెప్పి నన్ను భ్రమింపఁజేయక నాకు వానిలో శ్రేయస్కరమగు నొకమార్గమునే నిశ్చయముగ చెప్పుము.” (గీ; ౩. ౨; ౫. ౧) అని యర్జునుఁడు భగవంతుని స్పష్టముగ నడిగినందున గీతల యం దేదైననొక్కటియే నిర్ణీతమైనమతము ప్రతిపాద్యముగ నుండవలయు నను మాట స్పష్టమే. (గీ. ౩. ౩౧) మఱియు నది యేదైయుండును నని గీతామూలమునే యర్థముఁజేసికొని నిరాగ్రహబుద్ధితో మనము చూడవలయును ; మొదట నేదో యొకమతమునం దభిమానము నుంచుకొని దానికి సంబంధింపని శ్లోకములయర్థ ములను తలక్రిందు చేయరాదు. గీతలలోని నిజమగు రహస్యమునందలి సారాం శమే సంప్రదాయమునకైనను, పంథకైనను సంబంధించియున్నను దానిని గీతా భక్తులకుఁ దెలిపి భగవంతుఁడు అర్జునునకుఁ జెప్పిన జ్ఞానయజ్ఞమునుఁ జేయు టకు నే ప్రవర్తించితిని ; ఆయజ్ఞమున్ పూర్తిఁజేయు నిమిత్తమై పైనఁ జెప్పఁబడిన జ్ఞానభిక్షను నాయొక్క దేశబంధువులును ధర్మబంధువులును నాకు పరమసంతో షముతో నిడుదురని నమ్ముచున్నాఁడను.

ప్రాచీనటీకాకారులచే ప్రతిపాదింపఁబడిన గీతాతాత్పర్యమునందును నే చెప్పిన గీతారహస్యమునందును నున్న భేదమునకుఁ గారణములు గీతారహస్యము నందు సవిస్తరముగ నిరూపింపఁబడినవి; కాని గీతాతాత్పర్యమునం దిట్టిమతభేదము లున్నను గీతపై వ్యాఖ్యానము చేసినభాష్యకారులును, టీకాకారులును, పూర్వ మువారుగాని, యిప్పుడుగాని ప్రాకృతభాషలలో వ్యాఖ్యానములఁజేసినవారును నేనీ గ్రంథమును వ్రాయుటకు నాకు సహాయులయినందున వారలయందఱకును నేను

కృతజ్ఞుఁడను(విధేయుఁడ) అని యిచ్చట ముఖ్యముగఁ జెప్పుచున్నాఁడను. అటులనే యేపాశ్చాత్త్యపండితుల గ్రంథములయందలి సిద్ధాంతముల నాక్షేపక నుల్లేఖించి తనో పరిచేసైతము నేను కృతోపకారుఁడనని యెన్నుచున్నాను. వేయేల ? ఈ గ్రంథముల యన్నింటియొక్కయు, సహాయము లేనిచో నీగ్రంథమును వ్రాయ గలుగుదునా ; లేనా ? యనువిషయము సందిగ్ధమైనందున నీప్రస్తావనారంభమున "సంతాంచీ ఉచ్ఛిష్టే బోలతో ఉత్తరే"—నేను చెప్పువాక్యములు సత్పురుషుల యొక్క యుచ్ఛిష్టములే యని తుకారాంబువాగారియొక్క పదమును నేను వ్రాసి తిని. ఎల్లప్పుడు నొకరీతిగనే యుండునదియునుగాక త్రికాలాబాధితమగుజ్ఞానమును బోధించునట్టి గీతలవంటి గ్రంథము కాలభేదముచే నూతనమగుస్ఫూర్తిని కలిగించు చున్నదనువిషయమం దాశ్చర్యమేమియు లేదు. కారణ మేమన నిట్టివ్యాపకమగు గ్రంథమునకు నిదిసహజ మగుధర్మమే యైయున్నది. కాని యంతమాత్రముచే ప్రాచీనపండితు లిట్టిగ్రంథముపైఁ జేసినపరిశ్రమ వ్యర్థము కాదు. గీకు, నింగ్లీషు, జర్మని మొదలగుభాషలలో జేసినభాషాంతరములును నిట్లే యుపయోగకరములై యున్నవి. ఈభాషాంతరములును తఱుచుగ ప్రాచీనులగుటీకాకారుల ననుసరించియే చేయఁబడియుండును. అయినను కొందఱు పాశ్చాత్త్యపండితులు గీతలకు స్వతంత్రరీతిచే నర్థముచేయుటకును విశేషమగుప్రయత్నము చేయనారంభించిరి. అయినను సత్యమగు (కర్మ—)యోగముయొక్క తత్త్వము, లేక వైదికములైన ధార్మికసంప్రదాయముల యితిహాసము బాగుగ గమనింపనందున, లేక బహిరంగపరీక్షణమునందె వారిదృష్టిని విశేషముగ వ్యాపింపఁజేయుటచే, లేకయితరములగు నిట్టికారణములచేతనే పాశ్చాత్త్యపండితు లీ వివేచనము ననేకస్థలములయం దపూర్ణముగను కొన్నిస్థలములయందు నిస్సంశయముగ భ్రాంతిఁ గలుగఁజేయునటులుగను తప్పులుగఁ జేసిరి. గీతలపై పాశ్చాత్త్యపండితుల గ్రంథముల నిచ్చో విస్తరముగ పరీక్షించుటకుగాని, విచారించుటకుగాని యవసరము లేదు. వారు సిద్ధాంతించిన ముఖ్యవిషయములనుగురించి నేచెప్పునదంతయు నీగ్రంథముయొక్క పరిశిష్టప్రకరణములో వ్రాసినాను. అయినను ప్రస్తుతమందు నేను జూచియున్న కొందఱు వ్రాసిన గీతలపై కొన్ని యింగ్లీషులేఖనముల నిచ్చో చెప్పుట యావశ్యకము. మొదటిది మి. బ్రుక్సుడి. సి. బ్రుక్సనునతఁడు థియాసఫిస్టుం (దివ్యజ్ఞానసామాజికుఁడు) భగవద్గీత కర్మయోగపరముగనే యున్నదని తా రచియించినగ్రంథమున నిరూపించెను. తనవ్యాఖ్యానమునందు నామతమునే ప్రతి

పాదించెను. రెండవది మద్రపురిలోని మి. యస్. రాధాకృష్ణ యనువారిది. అది చిన్ననిబంధరూపముగ నమెరికాలోని సార్వరాష్ట్రీయనీతిశాస్త్రములబోధించు త్రైమాసికపత్రికలో ప్రచురింపఁబడినది. (జూలై. ౧౯౧౧) దానియందు ఆత్మస్వాతంత్ర్యము, నీతిధర్మ మనీ రెండువిషయములలోను, గీత, క్యాంటుమతముతోఁ బోల్చి నిరూపింపఁబడినది. ఈసామ్య మితరవిషయములయందు సైతము వ్యాపకమైనదనియు, గ్రీనుయొక్క నైతికమగు నుపపత్తి క్యాంటుకంటెను గీతలతో నధికముగ సంబంధించియున్నదనియు నామతము. కాని యీరెండువిషయముల వ్యాఖ్యానమును ఈగ్రంథమునందుఁ జేయఁబడియుండుటచే దాని నిచ్చోట మరల చెప్పనవసరములేదు. అటులనే పండిత సీతానాథతత్త్వభూషణ యనువారియొక్క 'కృష్ణ; మరియు గీత;' యనిపేరు గల యీగ్రంథముసైతము ప్రస్తుతము ప్రచురింపఁబడినది. దానిలో నీపండితుఁడు గీతలపై వ్రాయఁబడిన ౧౨ పండ్రెండువ్యాఖ్యానముల ముద్రించినాఁడు. కాని యీపండితునియొక్కగాని, మి. బ్రుక్సుయొక్కగాని ప్రతిపాదనమునకును, నాప్రతిపాదనమునకును గలభేదము లీగ్రంథమును జదువునప్పుడు చదువరులకు స్పష్టములగును. అయినను పైనచెప్పినలేఖనములకంటె గీతాసంబంధములో నాయొక్క విచార మపూర్వముకాదనియు, గీతలయందున్న కర్మయోగముపైపునకు లోకులు మిక్కిలియధికముగ లక్ష్యముంచుచుండుచిహ్నము కనఁబట్టుచున్నదనియు నీయాధునికములగు లేఖనముల నన్నింటిని నేనభినందించుచున్నాఁడను.

ఈగ్రంథము మాండలేలో నున్నప్పుడు వ్రాయఁబడినదనుట నిజమే. కాని పెన్సిలుతో వ్రాయఁబడినదగుటచే దాని ననేకస్థలములయందుఁ గొట్టివైచి సవరణచేసినాఁడను. కాన పిదప నాపుస్తకము దొరతనమువారు శోధించి మరల నాకంపఁగా ముద్రింపించుటకై శుద్ధప్రతి వ్రాయవలసివచ్చెను. మఱియు నీకార్యమును నేనొక్కఁడనే చేసినచోఁ బ్రచురించుటకు నింక నెంతకాలమగునో తెలియదు; కాని, వామనగోపాలజోసిగారును, నారాయణ కృష్ణగోగటెగారును, రామకృష్ణదత్తాత్రేయపరాడకరుగారును, రామకృష్ణసదాశివ పింపుటుకర్ గారును, అప్పాజీవిష్ణుకులకర్ణిగారును, మొదలగుగృహస్థు లీకార్యమున మనఃపూర్వముగ సాహాయ్యముచేయుటచే శీఘ్రముగ పూర్తియైనందున వారియందరివిషయమునను కృతజ్ఞుఁడను. అట్లే రా. రా. కృష్ణాజీఖడిల్కరుగారును మఱియు విశేషముగ వేదశాస్త్రసంపన్నులగు దీక్షితకాశీనాథశాస్త్రిలేలేగారును నీపనికై బొంబయినుండి యిచ్చోటికి (పూనాకు) విచ్చి యీవ్రాసినగ్రంథమును చదివి యనేకములగు

నుపయోగకరములును, రహస్యవిషయములు నగువానిని దెలియఁజెప్పిరి. కావున నీవిషయమున వారు నాకు మహోపకారులు. అయినను నీగ్రంథమునందున్న విషయముయొక్క బాధ్యతయంతయు నాయదియే గ్రంథ మీరీతిగ ముద్రింపించుటకు సిద్ధమైనది; కాని యుద్ధమువలన కాకితములు దొరకనిసమయము తటస్థించినది. అయినను బొంబయిలోనున్న కాగల (కాకిత) యంత్రాధికారియగు మెసర్సు. డి. పదమ్జీ వారు ఉచితకాలమున నాయభిప్రాయానుసారముగ మంచికాకితముల నిచ్చుటచే నాలోపము తీరినది. మఱియు గీతాగ్రంథము మంచిస్వదేశ కాకితములపై నచ్చువేయఁబడినది. అయినను గ్రంథమును ముద్రించునప్పుడు నాయూహకంటె గ్రంథము వృద్ధినొందినందున మరల కాకితములకు లోపము వాటిల్లెను; మఱియు పునహా (పుణ్యపురి) లోనున్న రే. కాకితయంత్రాలయముయొక్క యధికారిచే నాలోపము తీర్పఁబడనిచో నింకకొన్ని నెలలవఱకును నీగ్రంథము ప్రచురింపఁబడుటకు చదువరు లెదురుచూచుచునే యుండవలసినవారు. కాన పైనజెప్పిన కాకితయంత్రాధికారులకు నేనేగాక చదువరులుసైతము కృతజ్ఞతను జూపవలయును. తుదకు శోధనీయపత్రములను శోధించెడుకార్యము మిగిలెను. దీనిని. రా. రా. రామకృష్ణసదాశివపింప్రుటీకరుగారును, రా. రా. హరిరఘునాథభాగవతులుగారును స్వీకరించిరి. దానియందును నాయాకడ వ్రాయఁబడిన యితరగ్రంథము లసంఖ్యాదికము సరిగ నున్నదా? లేదా? యనుదానిని శోధించుటయు పొరబాటున్నచో చూపించుటయు ననుకార్యము రా. రా. హరిరఘునాథభాగవతు లొక్కరే చేసిరి. అనఁగా వీరెల్ల వారిసహాయము లేనిచో నీగ్రంథ మింతశీఘ్రముగ నాయొక్కనిచేతనే ప్రచురింపఁబడుట శక్యముగాకనేపోవును. కాన వీరెల్లరకును నేను మనఃపూర్వకముగ ధన్యవాదములనిచ్చుచున్నాఁడను. ఇప్పుడు ముద్రించుటయే యవశిష్టమైనందున చిత్రశాలాముద్రణాయంత్రాధిపతి యీపుస్తకమును మనఃపూర్వకముగను, సావధానముగను, శీఘ్రముగను ముద్రించెదనని యంగీకరించి తదనుసారముగ నీకార్యమును నెరవేర్చినందున వారికి నేను ధన్యవాదముల నర్పించుచున్నాఁడను. క్షేత్రము ఫలించినను ధాన్యమును పక్వముచేసి తినుటకు వీలగువఱకు ననేకులసాహాయ్యము నపేక్షించునటులనే కొన్నివిషయములలో గ్రంథకారునియొక్క స్థితి పరాధీనమైయుండును. ఎవరిది కాకున్నను నాయొక్క స్థితి యటువంటిదిగనున్నదని చెప్పుటకు నాకొంక మేమియు లేదు; కావున పైనచెప్పినయట్లు నాకు సహాయపడినవారల పేరు లిచ్చో వ్రాయఁబడినను లేకున్నను వారలకందఱకును తిరిగి యొకసారి ధన్యవాదముల నిచ్చి యీప్రస్తావనను ముగించుచున్నాఁడను.

ప్రస్తాపన ముగిసినది. ఏవిషయమున్న విచారించుచు నేటివఱకు ననేకసంవత్సరములు కాలక్షేపముచేసితినో, దేనియొక్క నిత్యమగుసహవాసముచేతను చింతనచే నా మనస్సున విశ్రాంతిగల్గి యానందముగల్గినదో యావిషయము నన్నువదలి గ్రంథరూపముగ వెడలిపోవుట నామనస్సునకు కష్టముగనున్నను నేజేసిన యీవిచారమును రాఁగలతరమువారు నాకంటె నధికముగఁగాని లేక యున్నదియున్నట్టుగగాని చేయునట్లు చేసితినిగదా యని నేను సంతసించుచున్నాఁడను. కాన వైదికశాస్త్రములయందున్న రాజగుహ్య మనునీవిషయమును "ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య వరాన్నిబోధత." లెండు! మేల్కొనుఁడు! (మఱియు భగవంతునిచే నీయఁబడిన) ఈవరములను తెలిసికొనుఁడు!—అనుకఠోపనిషత్తునందున్న మంత్రపూర్వకముగను ప్రేమయను నుదకముతోడను (కఠ.3. ౧౪) ముందురాఁబోవుపాఠకులకు స్వాధీనము చేయుచున్నాఁడను. దీనియందే కర్మాకర్మలసంపూర్ణబీజ మున్నది. మఱియు నీధర్మములయొక్క యాచరణ స్వల్పమైనను, మహాసంకటమునుండి యుద్ధరించునని స్వయముగ భగవంతుఁడే చెప్పెనని నిశ్చయపూర్వకముగఁ జెప్పుచున్నాఁడను. ఇంతకంటె విశేష మేమికావలయును? "చేసిననే కాని యేమియుఁ గానేరదు; అను సృష్టినియమమును మనస్సున నిడికొని నీవు మాత్రము నిష్కామబుద్ధితోఁ జేసినఁజాలును. కేవలస్వార్థపరాయణమగుబుద్ధితో సంసారముచేసి యలసి కాలమును వ్యర్థపఱుపుమనిగాని, సంసారమును వదలుటకు సిద్ధుఁడవు కమ్మనిగాని గీతచెప్పదు. సంసారమునే మోక్షదృష్టితో నెట్లుచేయవలసినదియుఁ దెల్పుటకును మనుష్యమాత్రులకు సంసారమునందు నిజమగుకర్తవ్య మేదియో తాత్త్వికదృష్టితో నుపదేశించుటకును గీతాశాస్త్రము బయలువెడలినది. కావున పూర్వవయస్సుననే గృహస్థాశ్రమసంబంధమైన, లేక సంసారమునుగురించిన యీప్రాచీనమగుశాస్త్రమును శక్యమయినంత తొందరతో ప్రతిమనుజుఁడును తెలిసికొనకయుండఁగూడ దని మాత్రమే నాయొక్క కడపటి విన్నపము.

పూనహా, అధికవైశాఖము,
శకము. ౧౮౩౭.

బాలగంగాధరతిలక్.

# అనువాదకుని విజ్ఞాపనము.

---

అనువాదమును జేయువారల్లరును గ్రంథకారుని గుఱించియు నాగ్రంథములోని విషయమును గుఱించియు వ్రాయుట సంప్రదాయముగ నున్నది. కాని యీగ్రంథకారులు లోకమాన్యులును లోకవిదితులు నగుటచే వారిని బ్రకాశింపఁ జేయ నేఁజేయు యత్నములు సూర్యునిఁ జూపుటకై సంపాదింపఁబడు దీపాది సాధనములవలె యనవసరములగుటయే కాక వారిభూమికచే గ్రంథములోని విషయము సైతము వివరింపఁబడుటచే దానిఁగూర్చియు నాప్రయత్నమునకుఁ గొంచెమైన నవకాశము కాన్పింపదు. కావున ననువాదకుఁ డేమైనను గ్రంథమును గురించి వ్రాయవలయునను సాంప్రదాయికోక్తిని నెఱవేర్చుటకై శ్రీమచ్ఛంకరభగవత్పాదులకును లోకమాన్యులకును గీతలవిషయమునఁ గలయభిప్రాయము లెంతవఱకు నేకీభవించునో యెంతవఱకు భేదించునో చూపుటకై నాశక్తికొలఁదిని నే నింతదనుక ఖండనమండనాదులవలనఁ దెలిసికొనినంతవఱకును చదువరులకు మనోరంజనముఁ గావింపఁ బూనెదను.

భగవత్పాదు లసామాన్యప్రజ్ఞ గలవారనియును, ఇట్టి యలౌకికప్రజ్ఞ గలవారు సంస్కృతవాఙ్మయమున నేగాక మఱియెక్కడను లేరనియు వారియాధ్యాత్మికజ్ఞానము ననుసరించియే యధ్యాత్మప్రకరణమును వ్రాయుచున్నాననియు నిరూపించుటఁబట్టి చూడ నీగ్రంథకారులు తదనుయాయివర్గములోనివా రనియు వారికిని వీరికిని ముఖ్యాంశములలో భేదము విశేషముగ లేదనియుఁ జెప్పుటకేమియు నభ్యంతరము లేదు. కాని లోకమాన్యుల గ్రంథము వెలువడినపిదప కొన్నియంశములలో భగవత్పాదుల భాష్యమునకు విరుద్ధముగ నుండుటంబట్టి యీగ్రంథము సిద్ధాంతవిరుద్ధమనియు కావున నే భ్రమజనకమనియు నీగ్రంథకారుని గుఱించియు, నీగ్రంథమునందలి సిద్ధాంతములను గుఱించియు మఱియొక యూహ కలుగవచ్చును. కాన శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారికిని ఈగ్రంథకారులకును నిజముగా మతములో నేమైన భేద మున్నదా? ఉన్నచో నది [illegible] నాభేద మెచ్చోట? వీరిలో నెవరు మతివిన్నది [illegible] యని నిష్పక్ష

D

పాతబుద్ధితోఁ [illegible] నిరూపించుట యావశ్యకము. అయినను శ్రీ భగవత్పాదులవారి గ్రంథములను సంపూర్ణముగఁ దెలిసికొనునంతశక్తి నాకు లేనందున వారి సిద్ధాంతములలోఁ బ్రవేశింపక వారిమతము నీగ్రంథకారు లెటుల గ్రహించియున్నారో చూపుటకై కొంచెము ప్రయత్నించెదను. అందు ప్రథమమున శ్రీ శంకరభగవత్పాదులమతమును సంక్షేపముగఁ జెప్పెదను.

బంధమన జననమరణాదిరూపమగు సంసారము. మోక్షము, లేక ముక్తి యన జననమరణరూపమగు బంధమునుండి పూర్తిగ తప్పించుకొనుట. బంధము కర్మ వలనఁ బ్రాప్తమగును; మోక్షము బ్రహ్మాత్మైక్యజ్ఞానముచే సిద్ధించును; ఈజ్ఞానము శ్రౌతస్మార్తకర్మలను నిష్కామబుద్ధితో నాచరించుటచే లభ్యమగును; జ్ఞానము కలిగినపిదప జ్ఞానముకలుగకమునుపు సంచితములైన (అనఁగా: ఏకర్మఫలము లారంభింపఁబడలేదో యవి) పుణ్యపాపకర్మలన్నియు నశించును. కాని యేకర్మల ఫలమారంభింపఁబడినందున జ్ఞానికి దేహము లభించినదో యాకర్మలమాత్రము జ్ఞానముచే నశింపవు. అవి యుపభోగముచేతనే నశించును. "భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే" (బ్ర. సూ. ౪-౧. ౧౯.) అందువలన జ్ఞాని బ్రహ్మతాదాత్మ్యము నొందుటకు దేహప్రాప్తి సాధనములగు కర్మలు క్షయమగువఱకును వేచియుండవలసివచ్చును. మఱియు "అనారబ్ధకార్యే ఏవతు పూర్వే తదవధేః" (బ్ర. సూ. ౪. ౧. ౧౫.) జ్ఞానము కలిగినపిదప దేహపాతమువఱకు నుండు జ్ఞానియొక్క స్థితిని జీవన్ముక్తావస్థ యని పేర్కొనుచున్నారు. ఈయవస్థయందున్న జ్ఞానిచేఁ జేయఁబడు నేవిధమగు పుణ్యపాపకర్మలయొక్కయు కర్తృత్వ మాతని కుండదు. జ్ఞానమువలన వానికి ఫలమును బుట్టించుశక్తి నశించును. అవి యున్నను లేనివానితో సమానములే. మోక్షమునకుఁ బ్రతిబంధకములగు పూర్వోత్తరములగు పుణ్యపాపకర్మలు జ్ఞానముచే నశించును గావునను, అవి వాని నంటనేరవు కావునను జ్ఞానికి దేహపాతానంతర మవశ్యము ముక్తి లభించును. "తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్" (బ్ర. సూ. ౪. ౧. ౧౩.) "ఇతరస్యాప్యేవ మసంశ్లేషః" (బ్ర. సూ. ౪. ౧. ౧౪.) అనునది శ్రీ శంకరభగవత్పాదులవారి మతసిద్ధాంతము.

శ్రీ భగవత్పాదులవారిచేఁ జేయఁబడిన యీ వేదాంతసిద్ధాంతము లోకమాన్యులకు సంపూర్ణముగ సమ్మతమైనదే. కాని జ్ఞానము కలిగినపిదప దేహపాతము పర్యంతము [illegible] లగడపవలయునను ప్రశ్నమున కుత్తరమును జెప్ప

టలో మాత్ర మాచార్యులకును లోకమాన్యులకును మతభేదము కలదు. ఆత్మజ్ఞానికి యావత్తు సమస్తకాములు నెరవేరియుండుటచే (సర్వకామములను పొందియుండుటచే) ప్రాప్తవ్యమేమియు (అనగా: పొందదగిన దేదియు) లేనే లేదు. కాన నాతడు సర్వకర్మములను, కర్మసాధనములను యజ్ఞోపవీతము, శిఖ మొదలగు వన్నింటిని పరిత్యజించి యుదరనిర్వాహార్థమై భిక్షాటనమును మాత్రము చేయవలయు ననియు మిగిలిన కాలమునంతను నాత్మచింతనమునందే గడపవలయుననియు, మఱియొక కార్యము నెంతమాత్రమును జేయగూడదనియు భగవత్పాదుల యభిప్రాయము. ఆత్మజ్ఞాని తనకొఱకు గాకపోయినను లోకసంగ్రహార్థమే యైనను (అనగా: లోకుల కుపకారము జేయవలయుననను నూహతోనైన) వెనుకటివలెనే సర్వకర్మలను జేయుచు నుండుటయే మిక్కిలి ప్రశస్తమనియు నలసునివలె కాలక్షేపమును మాత్రము జూచుకొనగూడదనియు, తిలకమహాశయుని యభిప్రాయము. భగవత్పాదులకును, లోకమాన్యులకును మతభేదము జ్ఞాని జ్ఞానము కలిగినపిదప నెట్లు ప్రవర్తింపవలయు ననువిషయమునుగూర్చి వెలువడినది. వీనిలో శ్రీ భగవత్పాదులవారిమార్గము సన్న్యాసమార్గమనియు, నివృత్తిమార్గమనియు జెప్పబడును. లోకమాన్యుల మార్గము కర్మమార్గమనియు, ప్రవృత్తిమార్గమనియు జెప్పబడును. వ్యాకరణ మహాభాష్యగతములను, శంకరభాష్యగతములను నగు కొన్ని వాక్యములను నవీన గ్రంథములలో నేకదేశిభాష్యమనియు, ప్రౌఢోక్తియనియు జెప్పుచు వాదము చేయుట గ్రంథకారుల శైలి కావున నంతమాత్రముచే నవీనులని నిందింపక మనము విచారమువైపునే దృష్టినుంచి యుక్తిప్రతియుక్తులను పరీక్షింపవలయును. ఇట్టి యుక్తులు బుద్ధిమంతులకు వానిని జదివిన పిదప దోచుటవలనను ప్రాచీన గ్రంథములయందలి మహత్త్వమునకు మఱింత తోడుపడుటయే యగును. జ్ఞానము కలుగనిచో ముక్తి కలుగదనియు, నంతఃకరణశుద్ధి లేనిచో విచారముగుండా జ్ఞానము కలుగుటకు వీలులేదనియు వర్ణాశ్రమవిహితములను జేసినచో గాని చిత్తశుద్ధి గలుగదనియు జెప్పు శ్రీ భగవత్పాదులవారిమతము లోకమాన్యులకును సమ్మతమే. సంశయమేమియు లేదు. కాని సన్న్యాసాశ్రమమును స్వీకరించిననే గాని మోక్షము లభించుటకు వీలు లేదని శ్రీ భగవత్పాదులు సెప్పుచున్నారు. జ్ఞానము కలిగినచో వర్ణాశ్రమవిహితమగు ననుష్ఠానము జేయుచు నుండినను మోక్షము లభించునని లోకమాన్య తిలకమహాశయులు సెప్పుచున్నారు. జ్ఞానము కలిగినపిదప సన్న్యాసాశ్రమమును స్వీకరించినచో మోక్షము లభింపదనిమాత్రము చెప్పరు. కాని తిలకమహాశయుని మతమే శ్రుతిస్మృతిప్రమాణములచే సిద్ధమగుచున్నదో విచా

పించుట వారికని కష్టమైన విషయమే. కావున నీవిషయ మే ప్రమాణములచే సిద్ధ మగునో నిరూపించుట యావశ్యకము.

మొదట జ్ఞాని కర్మ చేయుటకు శక్యమగునా ? కానేరదా ? యనువిషయము విచారణకు గావించెదము. ఈవిషయమున సాచార్యశిష్యులగు శ్రీ విద్యారణ్యుల వారు "విద్వాంశ్చేత్తా దృశాన్మధ్యే తిష్ఠేత్తదనురోధతః, కాయేన, మనసా, వాచా కరో త్యేవాఖిలాః క్రియాః" అట్టివారిలో (అనఁగా: జ్ఞానులలో) నుండ దలఁచినపుడు తత్త్వజ్ఞాని వారి ననుసరించియే తన కాయిక వాచిక మానసికములగు కర్మల నన్నింటిని జేయుచున్నాఁడని చెప్పిరి. (పంచదశి. ప్ర. ౭) శ్రీ భగవత్పాదులును "కామప్రహాణేతు విద్యమాన మపి కర్మ పుణ్యాపుణ్యోపచయ కరం న భవతి" "ఉచ్ఛిన్నకామస్య విద్యమానాన్యపి కర్మాణి బ్రహ్మవిదో వంధ్యప్రసవాని భవంతి" కోరికలు నశించినపిదప కర్మయున్నను పుణ్యపాపములను సంపాదింప నేరదు. కామములు నశించిన బ్రహ్మజ్ఞానియొక్క కర్మలున్నను ఫలమును సంపాదించునవి కావని బృహదారణ్యక భాష్యమునఁ జెప్పిరి. "విదుషా క్రియమాణమపి కర్మ పరమార్థతో௨కర్మైవ" గీతాభాష్యమునను (౪-౨౦) విద్వాంసుఁడు కర్మఁ జేసినను నిజముగ నది యకర్మయే యనియుఁ జెప్పిరి. భగవత్పాదులు జ్ఞానికి కర్మఁ జేయుటకు శక్యమగునని యొప్పుకొనుటయేగాక, "యస్యసర్వేసమారంభాః కామ సంకల్పవర్జితాః) జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః" (గీ.౪-౧౯) అనుశ్లోకముయొక్క భాష్యములో జ్ఞానులను ప్రవృత్తులనియు (ప్రవృత్తిమార్గావలంబులనియు) నివృత్తులనియు (నివృత్తిమార్గావలంబులనియు) రెండు తెగలుగ విభజించి జ్ఞానులు జీవితమును గడపుటకు రెండుస్వతంత్రము లగుమార్గములు గల వని చూపించి, కొంతమందిజ్ఞానులు తమయిచ్ఛానుసారముగ లోకసంగ్రహమును చేయుటకును మఱికొందఱు తమశరీరనిర్వాహమును చేసికొనుటకును కర్మలనన్నింటినిఁజేయుచునే యున్నారని స్పష్టముగఁ జెప్పిరి. అచ్చో భాష్యమున 'అస్యాయథోక్తదర్శినః (కర్మణ్యకర్మ అకర్మణి చ కర్మ పశ్యతః) సర్వే యావంతః సమారంభాః కర్మాణి .. కామసంకల్పవర్జితాః కామైస్తత్కారణైశ్చసంకల్పైర్వర్జితాః-ముధైవ చేష్టామాత్రా అనుష్ఠీయంతే ప్రవృత్తేన చేల్లోకసంగ్రహార్థం నివృత్తేన చే జ్జీవన మాత్రార్థం తం జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం.....ఆహుః పరమార్థతః పండితం బుధాః".—"కర్మయందు అకర్మదృష్టియు నీకర్మయందు కర్మదృష్టియుఁ గలిగిన యాపురుషుని కర్మ లన్నియుఁ గోర్కెలతోడను వానికి కారణభూతములగు సంకల్పములతోడను శూన్యములైనవో; (అనఁగా: ప్రవృత్తిమార్గములోనుండు నేని లోక

సంగ్రహాముకొఱకును నివృత్తిమార్గములో నుండునేని జీవన్ముక్తొఱకును నైనికర్మ లన్నియు స్వార్థ చేష్టలై నను(ష్ఠింపబడినవో) వానిని నిజముగ జ్ఞానాగ్నిచే దహింపఁ బడినకర్మలు గలిగినపండితుఁడని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు" అని యున్నది.

పైవివేచనవలన జ్ఞానము కలిగినపిదప జ్ఞాని జీవితకాలమును గడపుటకై ప్రవృత్తిమార్గము నివృత్తిమార్గము ననునీ రెంటిలోఁ దేనికిష్టము వచ్చిన దేని యొక మార్గమును గ్రహింపవచ్చునుగాన ప్రవృత్తిమార్గావలంబియగు నేని లోకసంగ్రహార్థమై యన్నికర్మలను, నివృత్తిమార్గావలంబియగు నేని దేహధారణోపయుక్త మాత్ర మగుభిక్షాచరణాదికర్మను చేయుచు జీవితశేషమును నాత్మచింతనముచే గడుపవలయునని శ్రీభగవత్పాదులుసైత మంగీకరించినటుల నిర్వివాదముగ నే సిద్ధమగుచున్నది. ఇంతియఁగాక జ్ఞాని క్షత్రియుఁడో, లేక వైశ్యుఁడో యగునేని స్వార్థ మేమియు లేకపోయినను లోకులకై ప్రవృత్తిమార్గము నే యవలంబింపవల యును. నివృత్తిమార్గము నవలంబింపనే కూడదని సైత మాచార్యులు ముఖ్యముగఁ జెప్పుచున్నారు. "బ్రాహ్మణానా మేవాధికారో వ్యుత్థానే" (బృ. భాష్యం) బ్రాహ్మణులకే సన్న్యాసాధికారముగాని క్షత్రియులకును వైశ్యులకును లేదు.

భగవత్పాదులమతము ననుసరించియే క్షత్రియులును, వైశ్యులును, జ్ఞానము గలిగిన పిదప లోకసంగ్రహార్థమై యనఁగా: కేవలము లోకోపకారముకొఱకై కడవఱకును కర్మలనుఁ జేయుచునే యుండవలయును. వారికి రెండవమార్గము లేనే లేదు. "ఇతరవర్ణాపేక్షయా వా యావజ్జీవశ్రుతిః నహి క్షత్రియవైశ్యయోః పారివ్రాజ్యప్రవృత్తి రస్తి" (బృ. భాష్యం). మఱియు బ్రాహ్మణులకుఁ బ్రవృత్తి నివృత్తిమార్గముల రెండింటియందును నధికార ముండుటచే వారి కిష్టమైనమార్గ మవలంబింపవచ్చునని స్పష్టమగుచున్న దని సారాంశము. ఈవిషయములో శ్రీభగవత్పాదులకును లోకమాన్యులకును నేమియు విరోధము లేదని స్పష్టముగ నెల్లవారు నెఱుంగవలయును.

కాని, "తస్మాద్గీతాశాస్త్రే ఈషన్మాత్రేణాపి శ్రౌతేన స్మార్తేనవా కర్మణా ఆత్మజ్ఞానస్య సముచ్చయో న కేనచిద్దర్శయితుం శక్యః" (గీతాభాష్య. అ. ౨. శ్లో. ౧౦.) మఱియు "తస్మాద్గీతాశాస్త్రే ఆత్మజ్ఞానవతస్సన్న్యాస ఏవాధికారో న కర్మణీతి తత్ర తత్ర ఉపదిష్టా దాత్మజ్ఞానప్రకరణే దర్శయిష్యామః" అనఁగా: "గీతలలో కొంచెమైన శ్రౌతములుగాని లేక స్మార్తములుగాని యగుకర్మలతో జ్ఞానమునకు సముచ్చయముఁ జెప్పఁబడిన దెవరును చెప్పుటకు వీలులేదు" "కావున గీతాశాస్త్రమునం దాత్మజ్ఞానికి సన్న్యాసమునందే యధికారముగాని కర్మ లయం

దధికారము లేనట్లు సిద్ధమగుచున్నది. జ్ఞానప్రకరణములయం దక్కడక్కడ నిరూపించబడియెనని శ్రీభగవత్పాదులవారనేకస్థలములయందుఁ జెప్పిన దానికర్థమేమి యని శంకింపవచ్చును. అయినను శ్రీభగవత్పాదులవారేజ్ఞానకర్మసముచ్చయము నశక్యమని చెప్పిరో దానికర్థము తెలియనందున నీశంక బయల్పడును. అది తెలిసికొనినచో నీప్రశ్నకును నవకాశమే యుండదు. కాన శ్రీభగవత్పాదులవారశక్యమని చెప్పిన జ్ఞానకర్మసముచ్చయమున కర్థ మేమో యిచ్చో వివరించుట యావశ్యకము.

మోక్షము జ్ఞానము చేతనే లభించుననియు, మోక్షము లభించుటకై జ్ఞానమునకు కర్మాపేక్షయేమియు నుండదనియు, కర్మ యనునది జ్ఞానోత్పత్తికి కారణమనియు, ఆజ్ఞానము కలిగినచో కర్మలయావశ్యకత యేమియు నుండదనియు, జ్ఞానము మోక్షమునకు స్వతంత్రమయిన సాధనమనియు శ్రీభగవత్పాదులవారి సిద్ధాంతము. దీనికి విరుద్ధముగ జ్ఞానమాత్రముచే మోక్షప్రాప్తికి వీలులేదనియు, జ్ఞానమునకు (ఆత్మజ్ఞానమునకు) కర్మసంబంధముండిననే తప్ప మోక్షము సిద్ధించుటకు వీలు లేదనియు, నాత్మజ్ఞానము స్వతంత్రమైనది కాదనియు నది కర్మకంగమనియు(అనఁగా: నేజ్ఞానమునకును, ఆత్మజ్ఞానమునకును, కర్మతో సముచ్చయము గలదో యాకర్మసముచ్చితమగు జ్ఞానమే— (ఆత్మజ్ఞానమే) మోక్షము నిచ్చుటకు సమర్థమైనదనియు) కేవలాత్మజ్ఞానముచే మోక్షము దొరకుటకు వీలులేదనియు సముచ్చయవాదులు చెప్పుదురు. ఈజ్ఞాన, కర్మ, సముచ్చయపక్షమును (అనఁగా: కర్మసముచ్చితమగు జ్ఞానముచేతనే మోక్షము సిద్ధించుననియు, జ్ఞానమాత్రముచే మోక్షము ప్రాప్తింపదను పక్షమును) శ్రీభగవత్పాదులవారు తమభాష్యములో నాయాకడల ఖండించిరి. మఱియు దీనికి విరుద్ధమగుపక్షము నాచార్యులవారి భాష్యమును లెస్సగఁ జదివినవారికిఁ దెలియఁగలదు. ఉదాహరణము:— గీతాభాష్యమునందు "తస్మాద్గీతాసు కేవలాదేవ తత్త్వజ్ఞానాన్మోక్షప్రాప్తిః నకర్మసముచ్చితాదితి నిశ్చితోఽర్థః" "యథా భగవతో వాసుదేవస్య క్షాత్రధర్మ చేష్టితం న జ్ఞానేన సముచ్చీయతే పురుషార్థసిద్ధయే" "తస్మాత్ కేవలాదేవ తత్త్వజ్ఞానాన్మోక్ష ఇత్యేషోఽర్థో నిశ్చితో గీతాసు సర్వోపనిషత్సు చ" ఇత్యాదికము గీతాభాష్యమునందే చెప్పఁబడినది. ఈస్థలములయన్నింటి యందును పురుషార్థసిద్ధికొఱకు (అనఁగా: మోక్షప్రాప్తికొఱకు, నిశ్శ్రేయసముకొఱకు) ఆత్మజ్ఞానమునకు కర్మయొక్క సహాయ మేమియు లేదని యున్నది.

"అతశ్చ కర్మాణి విద్యయా ఫలసిద్ధౌ నాపేక్ష్యంతే." (బ్ర. సూ. భా. ౩. ౪—౨౫.) కేవలము జ్ఞానముచేతనే మోక్షము గల్గును అని యాచార్యులవారు చెప్పి

నట్లు స్పష్టముగఁ గన్పట్టుచున్నది. ఎక్కడ 'పురుషార్థసిద్ధికొఱకు,' 'మోక్ష ప్రాప్తికొఱకు మొదలగు శబ్దములనుఁ బ్రయోగింపకయే జ్ఞానకర్మ సముచ్చయము నిషేధింపఁబడినదో యది పురుషార్థసాధన మనుదృష్టితోడనే నిషేధింపఁబడినదని యెఱుంగవలయును. ఆచార్యులవారే జ్ఞానకర్మసముచ్చయపక్షమును ఖండించిరో అది గీతారహస్యకారులమతము కాదని నిర్వివాదమే. లోకమాన్యులే జ్ఞానకర్మసముచ్చయమును చెప్పుచున్నారో యది యాచార్యులవారు నిషేధించిన సముచ్చయవాదము కాదు. కారణ మేమన, జ్ఞానము కల్గినపిదప లోకసంగ్రహార్థమై (మోక్షము కొఱకు గాదు) చేయఁబడిన కర్మ యాచార్యులవారిదృష్టిచేఁబట్టి కర్మయే కాదు. "గీతాశాస్త్రే.....కర్మణాజ్ఞానస్య సముచ్చయో నకేనచిత్ దర్శయితుం శక్యః" అనిచెప్పి వెంటనే "యస్యతు అజ్ఞానా ద్రాగాదిదోషతో వా కర్మణి ప్రవృత్తస్య యజ్ఞేన దానేన తపసావా విశుద్ధ సత్వస్య జ్ఞాన ముత్పన్నం పరమార్థ తత్త్వవిషయ మేక మేవేదం సర్వం బ్రహ్మ అకర్తృచేతి తస్య కర్మణి కర్మప్రయోజనేచ నివృత్తేః లోకసంగ్రహార్థం యత్నపూర్వం యథాప్రవృత్తస్తథైవ ప్రవృత్తస్యకర్మణి యత్ప్రవృత్తిరూపం దృశ్యతే న తత్కర్మ యేన బుద్ధేస్సముచ్చయస్స్యాత్." (గీ. భా. అ. ౨. అవతరణము) అనుభాష్యగ్రంథమును చూడుము. (అనఁగా: గీతాశాస్త్రమునందు జ్ఞానముతో కర్మకు సముచ్చయము కలదని యెవరును నిరూపించుటకు వీలు లేదు) కాని యజ్ఞము దానము తపస్సనువాని సంబంధముచే నంతఃకరణము శుద్ధమైనందున నీసర్వమును బ్రహ్మయే యనియు నది అకర్తృత్వ హీనమైనదనియు పారమార్థికవిషయమగు జ్ఞానముకలిగి, కర్మమునుండియు కర్మలప్రయోజనమునుండియు నెవరు నివృత్తిఁ బొందినారో వారు పూర్వమువలెనే యత్నపూర్వకముగ కర్మలలో వర్తించినట్లు కాన్పించినను వారు సేయునది కర్మయే కానేరదు. వారిజ్ఞానమునకు కర్మలతో సముచ్చయ మెటులుండును?

అటులనే "విదుషా క్రియమాణం కర్మ పరమార్థతోఽకర్మైవ తస్య నిష్క్రియాత్మదర్శన సంపన్నత్వాత్" "కర్మణ్యభిప్రవృత్తోపి నిష్క్రియాత్మదర్శన సంపన్నత్వాన్నైవ కించిత్కరోతి." (గీ. భా. ౪. ౨౦) "ఏవం లోకసంగ్రహం చికీర్షుణాఽపి క్రియమాణం కర్మ పరమార్థతోఽకర్మ బ్రహ్మబుద్ధ్యుపమృదితత్వాత్" "ఇదంతు బ్రహ్మ బుద్ధ్యుపమృదితార్పణాదికర్మ అకర్మైవతత్"— (గీ. భా. ౪. ౨౪) మొదలగు ననేకవచనముల నాచార్యులవారిభాష్యమునఁ జూపవచ్చును. వానిలో "నేను నిష్క్రియుడగు బ్రహ్మను" అనుజ్ఞానము

వారు చేసినవి కర్మలే కావని యాచార్యులవారు నిశ్చయించి చెప్పినారు. దీని విషయమై పైనఁజూపిన ప్రమాణములు చాలునని నాయభిప్రాయము. ఆచార్యుల వారిసిద్ధాంతమునకును, లోకమాన్యులసిద్ధాంతమునకును లేశమాత్రమైనను విరోధము లేదను విషయము నిర్వివాదముగనే యున్నది.

విరోధము లేకపోయినను రుచిభేదముమాత్రము గలదు. జ్ఞానము గలిగిన పిదప జ్ఞానికి జీవితమును (దేహపాతము వఱకు నుండుకాలమును) గడపుటకు ప్రవృత్తిమార్గము నివృత్తిమార్గము నను నీరెండిటి యందును సంపూర్ణముగ నధికారమున్నదని యిరువురు నొప్పుకొన్నను జ్ఞాని కర్మసన్న్యాసమును గ్రహించి భిక్షావృత్తితో నుండుటయనునదియే శ్రేయస్కరమని యాచార్యులును, జ్ఞాని కర్మసన్న్యాసమునుఁ జేయక లోకోపకారార్థమై కర్మలను చేయుచునే యుండుట మిక్కిలి మంచిదనియు లోకమాన్యులు సెప్పుచున్నారు. "భిన్నరుచిర్హి లోకః" అనున్యాయమునుఁ బట్టి "నచ వేద సమ్యక్ ద్రష్టుం" అని యీ యిరువురిలో నెవరిని యనుటకు సాధ్యముకాదు.

ఇంతవఱకు శ్రీభగవత్పాదులవారికిని లోకమాన్యులకును గలయభిప్రాయము కలసియే యుండెను. అయినను ముందుఁ జెప్పఁబోవువిషయముం బట్టి వీరియువురకు నపరిహార్యమగు నొకవిరోధము బయలువెడలును. జ్ఞానము కలిగినపిదప నివృత్తి మార్గమును స్వీకరించుట (అనఁగా: సర్వకర్మ సన్న్యాసముం జేయుట) మిక్కిలి శ్రేయస్కరమనియు గీతల కీమతమే సమ్మతమనియు శ్రీభగవత్పాదులవారు సెప్పుచున్నారు. ("తస్యాస్య గీతాశాస్త్రస్య సంక్షేపతః ప్రయోజనం పరం నిశ్శ్రేయసం.....తచ్చ సర్వకర్మసన్న్యాస పూర్వకాత్ ఆత్మజ్ఞాన నిష్ఠారూపాత్ ధర్మాద్భవతి") జ్ఞానము కలిగినపిదప ప్రవృత్తిమార్గమును స్వీకరించుట (అనఁగా: సర్వకర్మలను చేయుచుండుట) మిక్కిలి మంచిదనియు, గీతల కీమతమే సమ్మతమై యదనియు లోకమాన్యులు సెప్పుచున్నారు (కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే "కర్మజ్యాయోహ్యకర్మణః") అని గీతలయొక్క ముఖ్యసిద్ధాంతము (గీ. ర. పుట. ౪౩౪, ౪౩౫ చూడుఁ.)

ఈరెండుపక్షములలోను గీతలకు సమ్మతమైన దేది యని విచారింపవలసియున్నది. ఇప్పటికి సుమారు ౧౨౦౦ ల సంవత్సరములుగా శ్రీభగవత్పాదులవారి భాష్యము వందలును పఠించుచుండుట బట్టి వారిపక్షమునే గీత యంగీకరించుచున్నదని దృఢమైన నమ్మకము కలదు. అట్టిస్థితిలో లోకమాన్యులు తమసిద్ధాంతమును నెరవేర్చుటకై చూపుచున్న ప్రమాణములను కొంచెము విచారింతము,

సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగంచ శంససి,
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితం.
(గీ. ౫. ౧.)

ఓకృష్ణా! యొకపరి సన్న్యాసమును, యొకపరి కర్మయోగమును, (అనఁగా: కర్మను చేయుచుండవలయునను మార్గమును) నుత్తించుచు చెప్పుచున్నావు. ఈరెంటిలో నేది మంచిదియో (మిక్కిలి ప్రశస్తమైనదో) దాని నొక్కదానినే నిశ్చయముగా నాకుఁ జెప్పుము. అను ప్రశ్నమునకు నుత్తరమిచ్చునప్పుడు—

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే.
(గీ. ౫. ౨.)

కర్మసన్న్యాసమును కర్మయోగమును రెండును నిశ్శ్రేయసకరములే (అనఁగా: మోక్షమును గలుగఁజేయునవియే), కాని (అనఁగా: మోక్షమును సంపాదించుటకు సమానమైనయోగ్యతఁ గలవైనను) యీరెంటిలో కర్మసన్న్యాసముకంటె కర్మయోగము విశేషమైనయోగ్యతఁ గలిగినది—అను ప్రశ్నోత్తరములు రెండును నిస్సందిగ్ధములైనవియు స్పష్టములునై యున్నవి. మొదటిశ్లోకమునందున్న శ్రేయశ్శబ్దమునకు మిక్కిలి ప్రశస్యము (బహుమంచిది) అని వ్యాకరణశాస్త్రానుసారముగ నర్థమును చెప్పవలయును. రెండుమార్గములలో నున్న తారతమ్యమును గుఱించిన యర్జునుని ప్రశ్నమునకే 'కర్మయోగోవిశిష్యతే' కర్మయోగము మిక్కిలి గొప్పదని భగవంతుఁ డుత్తరమిచ్చినందున కర్మయోగపక్షమే మిక్కిలి గొప్పదని చెప్పుటకు ప్రమాణమని లోకమాన్యులు చెప్పుచున్నారు. జ్ఞానముకలిగినపిదప కర్మలు సేయనక్కఱలేదను విషయము భగవంతునకు సమ్మతమైనచో "నీరెంటిలో సన్న్యాసమే శ్రేష్ఠ"మని యర్జునునకు నేల యుత్తరమీయలేదు? అట్లుచెప్పక "కర్మలను చేయుటయు, మఱియు కర్మలను విడిచిపెట్టుటయు సమానముగనే మోక్షదాయకములని రెండవశ్లోకముయొక్క మొదటిపాదమునఁ జెప్పి పిదప 'తు' అనఁగా 'గాని' అను పదమును ప్రయోగించి 'తయోః' అనఁగా నీరెండుమార్గములలో ను కర్మలను విడుచుమార్గమునకంటె కర్మలను జేయవలయునను మార్గమే మిక్కిలి ప్రశస్తము (శ్రేయము) అని భగవంతుఁడు నిస్సందిగ్ధముగా విధించియున్నందున సాధనావస్థయందు జ్ఞానము లభించుటకై యేనిష్కామకర్మలను జేయవలయునో వాని నే పిదప [illegible] యందు సైతము లోకసంగ్రహార్థమై జ్ఞాని యానర్థ[illegible]

E

చేయుటయే నుండవలయు ననుమతము భగవంతున కిష్టమైనదని పూర్ణముగ సిద్ధముగనున్నది. (గీతారహస్యము. పుట. ౯౪౯ చూడు.)

ఇప్పటి ప్రశ్నకైతె సమాధానమునైతము స్పష్టముగను సరళముగను నున్నది. "కర్మములను విడలుట యుక్తమా? లేక చేయుట యుక్తమా?" అని యర్జునుఁడు ప్రశ్నచేయఁగా మోక్షదృష్టిలో నవిరెండును సమానములుగనున్నను కర్మను త్యజించుటకంటె నాచరించుటయే యుక్తమని భగవంతుఁడు సమాధానము చెప్పెను.

శ్రీశంకరులు చెప్పువిషయము నిట్లు కొంచెము గమనింపవలయును.— అర్జునుని ప్రశ్నకు నిది యాశయము కానేరదు. భగవంతుని సమాధానమునకును నిది యాశయము కానేరదు. నాలవయధ్యాయమున "కర్మణ్యకర్మ యః పశ్యేత్", (౪. ౧౮) మొదలు "యోగసన్న్యస్తకర్మాణం.....కర్మాణి ననిబధ్నంతి ధనంజయ" (౪. ౪౧) అనువఱకును భగవంతుఁడు సర్వకర్మసన్న్యాసమునుఁ జెప్పి, మరల "ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత" అను శ్లోకముచే నీవు కర్మయోగము నాచరింపుమని చెప్పెను. కాని కర్మయోగకర్మసన్న్యాసములు స్థితిగతులవలె (కూర్చుండుట నడచుటవలె) పరస్పరవిరుద్ధములు గావున వీనిరెంటిని యొకఁడే, యొకసమయముననే యాచరించుట శక్యముకాదు. మంచిది; కాలభేదమునఁ జేయవలయునని చెప్పాదుమేని (అనఁగా: నొకదాని నాచరించి పిదప మఱియొకదాని నాచరింపవలయునందుమేని) అట్లు భగవంతుఁడు చెప్పలేదు. కాన నేదో యొకదానినే యాచరింపవలయును. వానిలో నేదియుక్తమో దానిని చేయుదమన్న వభిప్రాయమును మనస్సున నిడికొని యర్జునుఁ డడుగుచున్నాఁడు.— "యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితం" "యోగసన్న్యస్తకర్మాణం" అను శ్లోకమున (మఱియు నింతకు పూర్వమున మఱికొన్నిశ్లోకములయందును) ఆత్మవేత్తనుద్దేశించి కర్మసన్న్యాసము చెప్పఁబడినదనియు "ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠ" యనుశ్లోకమునం దనాత్మవేత్తను గుఱించి కర్మయోగము చెప్పఁబడినదనియుఁ దోఁచి యీప్రశ్నమును చేసినటుల భగవంతుఁడు చెప్పిన యుత్తరమును బట్టి కానిపించుచున్నది. కారణ మేమన: "సన్న్యాసం కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ" సన్న్యాసమును కర్మయోగమును రెండును మోక్షము నిచ్చునవే యని భగవంతుఁడు సమాధానమును జెప్పినాఁడు. కాని యీరెండును నాత్మవేత్తకు నిశ్శ్రేయసకరములా?. ఆత్మవేత్తకు నిశ్శ్రేయసకరము అందుమేని యాత్మవేత్తకు నాత్మజ్ఞానముచేతనే నిశ్శ్రేయసము (మోక్షము) లభించునుగాన నతనికి

(ముక్తునకు) సన్న్యాసము ముక్తి నిచ్చునదా? లేక కర్మయోగమా? యను ప్రశ్నమే యసంగతమగును. కావున ననాత్మజ్ఞునకు (ఆత్మజ్ఞానములేనివానికి) నవి మోక్షము నిచ్చునవి యని చెప్పవలసివచ్చును. అనఁగా : ననాత్మవేత్తకే కర్మసన్న్యాసము కర్మయోగము నను నీరెండును మోక్షము నిచ్చునవి యని భగవంతుఁడుత్తర మిచ్చుటంబట్టి యర్జునునిప్రశ్నమును ననాత్మవేత్తనుగురించియే చేయఁబడినదని స్పష్టముగఁ గాన్పించుచున్నది.

(౧) "యోగసన్న్యస్త కర్మాణమ్" (౪. ౪౧) మొదలగుశ్లోకములం దాత్మవేత్త సన్న్యాసమునే గ్రహింపవలయునని చెప్పఁబడినది. (౨) 'తస్మా దజ్ఞాన సంభూతమ్, (౪౪. ౨) మొదలగు శ్లోకములయం దనాత్మవేత్త కర్మయోగము నాచరింపవలయునని చెప్పఁబడినది. (౩) కాని కర్మత్యాగము కర్మయోగము నను నీరెండును ననాత్మవేత్త నుద్దేశించియే చెప్పఁబడినవని యర్జునుఁడు భ్రమఁజెందెనని "నిశ్శ్రేయసకరా వుభౌ" అను భగవంతుని యుత్తరమువలనఁ గాన్పించుచున్నది. (౪) తాను తెలిసికొనిన విషయమును బట్టి "యనాత్మవేత్తకు కర్మలను త్యజించుట మంచిదా? కర్మయోగము మంచిదా?" యని యర్జునుఁ డడిగెను. (౫) ఆప్రశ్నమున ననాత్మవేత్త కర్మములను సన్న్యసించుటకంటె కర్మములను చేయుటయే లగ్గని, (యుత్తమమని) భగవంతుఁడు సెప్పిన భగవత్పాదులభాష్యము నందలి సారాంశము.

కాని యాత్మవేత్తచేతను చేయఁబడు కర్మసన్న్యాసకర్మయోగములలో నేది మిక్కిలి శ్రేయస్కరమని యర్జునునిప్రశ్నమనియు నాత్మవేత్త కర్మలను త్యజించుటకంటె కర్మయోగము నాచరించుటయే మిక్కిలి శ్రేష్ఠమని భగవంతుఁడుత్తర మిచ్చెననియు లోకమాన్యులగు తిలకమహాశయులు చెప్పుచున్నారు.

ఈరెండుమతములలో నేది యుక్తమో విచారింపవలయును. అందుకై తొలుత నాచార్యులమతమును విచారింతము. శ్రీభగవత్పాదులు భగవంతుని యుత్తరమునుబట్టి యర్జునునిప్రశ్నకభిప్రాయమును తెలిసికొనవలయునని నిశ్చయించినారు. కాని భగవంతునియొక్క యుత్తరములో నేమి చెప్పఁబడినది యను విషయమే ముఖ్యముగ విచారింపఁదగినదై యున్నందున దానినిఁబట్టి ప్రశ్నమునకభిప్రాయమును నిర్ణయించుట శక్యముగాదని లోకమాన్యులు నుడివెదరు. అనఁగా నేవచనముయొక్క యర్థమును నిర్ణయింపవలయునో యావచనముయొక్క నిర్ణయింపఁబడినయర్థమునుండియే యితరవచనముల కర్థమును నిర్ణయింప [illegible] లేదని యభిప్రాయము. ఇందులకు శ్రీభగవత్పాదులవా [illegible]

యొక్క సంబంధముచే నర్జునున్నిప్రశ్నకభిప్రాయమును నిశ్చయించిరో వానినే విచారించుట యావశ్యకము.

భగవంతుఁడు 'యోగసన్న్యస్తకర్మాణం' అనుశ్లోకమునం దాత్మవేత్త కర్మసన్న్యాసమునుఁ జేయువలయునని చెప్పినాఁడనియు దానికి పిదపనున్న 'తస్మాదజ్ఞానసంభూతం' అనుశ్లోకమున నాత్మవేత్త కర్మయోగము నాచరింపవలయునని చెప్పినాఁడనియు శ్రీభగవత్పాదులు సెప్పుచున్నారు. కాని వీరు సెప్పినసంగతి యెంత వఱకు యుక్తమైనదో చూచుటకై నీరెండుశ్లోకములను నర్థముతోఁగూడ వ్రాయవలయును.

శ్లో. యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్,
ఆత్మవంతం నకర్మాణి నిబధ్నంతి ధనంజయ. ౪౧
తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. ౪౨
(గీ. అ. ౪.)

(౪౧) ఓయర్జునా! పరమార్థదర్శనరూప మగుయోగముచే నెవరు కర్మలను వదలిరో, మఱియు నేకత్వజ్ఞానముచే నెవరిసంశయము నశించినదో యాయాత్మవంతుని (అప్రమాదశీలుఁడగుపురుషుని) కర్మలు బంధింపవు. కావున జ్ఞానముగలిగిన పిదప కర్మలయొక్క లేపము తగులదు.—(౪౨) 'తస్మాత్'—ఈ హేతువుచే (వస్తుస్థితి యటులుండుటచే) నజ్ఞానమునుండి బయలువెడలినదియు, నీహృదయమునం దున్నదియు నగుసంశయమును జ్ఞానఖడ్గముచే ఛేదించి యోగమును (ఆత్మజ్ఞానోపాయమగు కర్మానుష్ఠానమును) ఆచరింపుము. ఓయర్జునా! నీవు యుద్ధమును జేయుటకై లెమ్ము.—అని శ్రీభగవత్పాదులవారు చేసినయర్థము. కాని మొదటి శ్లోకములోని మొదటిచరణమునకు నింకనూ స్పష్టముగ నర్థమును చేయవలయును. భాష్యములో 'యోగసన్న్యస్తకర్మాణం' అనుదానికి 'పరమార్థరూప మగుయోగముచే కర్మలను వదలివేసినవారు' అని యర్థమును జేసినను నాపరమార్థదర్శనము పరోక్షజ్ఞానమా? అపరోక్షజ్ఞానమా? యనియు కర్మలను వదలివేయుట యనఁగా కర్మలను స్వరూపతః (బొత్తుగా) త్యజించుటయా? లేక కర్మఫలత్యాగమా? యను రెండువిధములగు సందియములు బయలువెడలును. వానిలో నిచ్చో శ్రీభగవత్పాదు లేయర్థము నొప్పుకొనిరో మనకుఁ దెలియుటకు వీలులేదు. ఆనందగిరి వ్యాఖ్యానమునుఁ జూచితిమేని "తచ్చ (పరమార్థదర్శనం) వైధసన్న్యాసపక్షే

పరోక్షం, ఫలసన్న్యాసపక్షే త్వపరోక్షమిత్యభిప్రాయః" — అనగా : "సన్న్యస్త కర్మాణ" మనుటకు, కర్మలను స్వరూపతః వదలినవాడని యర్థము, పరమార్థ దర్శన మనగా : నపరోక్షజ్ఞానమని యర్థము, ఫలతః కర్మలను వదలినవాడు (కర్మఫల ములను వదలినవాడు)ను నర్థమున, "పరమార్థదర్శన" మనగా : పరోక్షజ్ఞాన మనియు నర్థమును చేసికొనవలయునని చెప్పుటచే నిరుభయార్థములును యుక్తములైనవే యని యానందగిరియతి చెప్పెను. కాని దీనిచే నాచార్యులవారి కేయర్థము వివ క్షితమో తెలిసికొనుట కానందగిరి తోడ్పడదు. కాని కర్మలను బొత్తుగ త్యజిం చుట యనునర్థము "యోగసన్న్యస్త కర్మాణం" అనుదానికి జేసినచో నుత్తరార్థ ముతో సుసంగతము కానేరదు. కావున మేమన : "కర్మలను బొత్తుగా వదలిన వారిని కర్మలు బంధింపవు" అని చెప్పుటలో కర్మములే లేనిచో కర్మలు బంధింప వని చెప్పుటవలన ప్రయోజన మేమియుండును? నిషేధము ప్రాప్తిపూర్వకమై యుండునుగాన ప్రాప్తియే లేనపుడు నిషేధ మెటులుండును? కర్మలు బంధింప వని చెప్పుటంబట్టియే కర్మలున్నట్లు తెలియ వచ్చుచున్నది. అనగా : "యోగ సన్న్యస్తకర్మాణ"మనుశబ్దమునకు యోగముచే కర్మములను వదలినవాని (అనగా: కర్మలను బొత్తుగా త్యజింపక కేవలకర్మఫలములను, కర్మబంధనములను వదలిన వాని) నను నర్థమే యుక్తమగునట్లు కాన్పించుచున్నది.

'యోగసన్న్యస్త కర్మాణం' అన్నపదమున యోగయుక్తమునకు శ్రీభగవ త్పాదులు ప్రతిస్థలమునందును 'జేయుచున్న సమత్వబుద్ధియుక్తమగు కర్మానుష్ఠానము (జ్ఞానోపాయభూతమగు కర్మానుష్ఠానము) అను నర్థమును వదలి ప్రస్తుతమున 'పర మార్థదర్శరూపమగు జ్ఞాన'మని యపూర్వముగ నర్థముం జేసిరి. అనగా : నిచోట 'జ్ఞానముయొక్కయుపాయమునే జ్ఞాన' మనిరి. (సాధనమునే సాధ్యమనిరి) అని లోకమాన్య లందురు. దీనింబట్టి యాచార్యులవారియర్థమునకంటె లోకమాన్యులు చేసిన 'సమత్వబుద్ధియుక్తమగు కర్మానుష్ఠానము'అనునర్థమే మంచిదని మన మొప్పు కొన్నను ఆచార్యులు చెప్పిన యర్థము విరుద్ధముగ నుండదని తేలుచున్నది. కావున నీశ్లోకార్థము విషయమై యేవిధమగు వాదమును లేనందున యోగశబ్దమున కాచార్యులవారు చేసిన 'పరమార్థదర్శన'మను నర్థమునే గ్రహించి, 'యోగ సన్న్యస్తకర్మాణం' అనుటకు 'జ్ఞానముయొక్క యోగముచే నెవరు కర్మలను త్యజిం చిరో' (అనగా : నెవరికర్మ సన్న్యాసము జ్ఞానమూలభూతమైనదో) యని యర్థము చేసికొని పిదప నన్న రెండవ శ్లోకభావము పై పునకు మలుపుదము.

తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత.

ఈశ్లోకమునకు భాష్యములలో నుండునదియు, పరస్పరవిరుద్ధముగ నుండునట్లు తోఁచునదియు నగు భాగమునుమాత్ర మిచ్చో వ్రాసెదము.

"తస్మా త్పాపిష్ఠ మజ్ఞానసంభూతం......హృత్స్థం జ్ఞానాసినా శోకమోహాదిదోషహరం సమ్యగ్దర్శనం జ్ఞానం తదేవాసిః ఖడ్గః తేన జ్ఞానాసినా స్వస్య ఆత్మనః......ఛిత్త్వా ఏనం సంశయం స్వవినాశహేతుభూతం యోగం సమ్యగ్దర్శనోపాయం కర్మానుష్ఠానం ఆతిష్ఠ కురు ఇత్యర్థః"

ఈభాష్యమునకు "నీవు జ్ఞానముచే నీసంశయమును ఛేదించుకొని పిదప జ్ఞానమును సంపాదించుకొనుటకై యుపాయము నవలంబింపుము" అని సంక్షేపముగ నర్థము. ఈయర్థము 'ముందుగ భార్యవలన సంతానమును బొంది పిదప వివాహమాడు'మని చెప్పినటులుండును కావున నీయనుపపత్తి ప్రస్తుతశ్లోకమున 'తస్మాత్' అను పదమును తీసివైచినఁగాని వారింపఁబడదు. మఱియు దీనిని తీసివైచితిమేని 'జ్ఞానము కలిగినపిదప కర్మయోగము నాచరింపు'మని భగవంతుఁ డర్జునునకుఁ జెప్పినటు లర్థమగును. అటులగునేని లోకమాన్యులయర్థము సిద్ధాంతమనియు, నది గీతలకు సమ్మతమైనదనియు తేలును. అది యెటు లుండుగాక.

ఈ (౪.౪౨) శ్లోకమున భగవంతుఁడు 'ఆత్మజ్ఞానమును సంపాదించుకొనిన పిదప కర్మయోగము నాచరింపు'మని యర్జునునకుఁ జెప్పెనని సిద్ధమయినపిదప దీనికి ముందున (౪.౪౧) శ్లోకమున నాచార్యులుచెప్పినటుల భగవంతుఁడు జ్ఞానము కలిగినపిదప కర్మసన్న్యాసమును జెప్పినటులును (యోగసన్న్యస్తకర్మాణ మిత్యంతై ర్వచనైః కర్మసన్న్యాసమవోచద్భగవాన్) పంచమాధ్యాయారంభమున మొదటి శ్లోకములో నవఁగ "సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి" అను శ్లోకమున నాత్మజ్ఞానము కలిగినపిదపనే సన్న్యాసము యుక్తమా? కర్మయోగము యుక్తమా? అని యర్జునుఁడు ప్రశ్నఁజేసెననియుఁ జెప్పుట, నేప్రామాణికులైనను విరుద్ధమని జెప్పఁజాలరు. కాని భగవంతునియుత్తరములంబట్టి 'జ్ఞానము కలుగక పూర్వము సన్న్యాసము మంచిదా? కర్మయోగము మంచిదా?' యని యర్జునుని ప్రశ్నమునకు అభిప్రాయమని శ్రీ భగవత్పాదు లనుచున్నారు.

భగవంతుని యుత్తరముంబట్టి చూచిన నర్జునుఁడు జ్ఞానము కలిగిన పిదప నా సన్న్యాసకర్మయోగములలో నేది మంచిదని యడిగెననియు, జ్ఞానము కలిగిన పిదప కర్మయోగము మంచిదని భగవంతుఁ డుత్తరమును జెప్పెనని లోకమాన్యు లనుచున్నారు. కాని 'నిశ్శ్రేయసకరౌ' అను దానికి యర్థము చేయునప్పుడు శ్రీభగవత్పాదు లేమేమికల్పింపవలసివచ్చెనో కొంచెము విచారింతము. (౧) (౪.౪౧) శ్లోకమునందలి యోగశబ్దమునకు జ్ఞానమని యర్థముఁ జేయుట, (౨) దానికి పరముం దున్న (౪.౪౨) శ్లోకమునందలి యోగశబ్దమునకే జ్ఞానోపాయమని యర్థముఁ జెప్పుట, (3) దానివలన నాశ్లోకార్థమునందు సమాధానము చెప్ప నర్హముగాని యనుపపత్తిని స్వీకరించుట, (౪) అర్జునునకు భగవంతుఁడు చెప్పినమాట తెలియలేదని చెప్పుట, (౫) 'కర్మయోగో విశిష్యతే' యనునది యర్థవాదమని యంగీకరించుట, (౬) అర్జునుఁడు కేవలసన్న్యాసము యోగము ననువిషయములఁ బ్రశ్నించినను అజ్ఞానికర్తృకము లగు సన్న్యాసము యోగము ననురెండు విషయములకును భగవంతుఁ డుత్తరము చెప్పెనని కల్పించుట, (౭) అయిదవయధ్యాయమునందలి నాల్గవశ్లోకమునందు సాంఖ్యము (అనఁగా: జ్ఞానోత్తరసన్న్యాసము) నిశ్శ్రేయసఫలప్రదమని ప్రతిపాదించి యావిరోధమును పరిహరించునిమిత్తమై యింత శ్రమపడిరో యాయాపత్తిని తిరిగి తమమీఁదికిఁ దెచ్చుకొన్నట్లు, (౮) అయిదవ శ్లోకమున 'యోగైర్గమ్యతే' అనుపదములకు మాత్రము "జ్ఞానప్రాప్త్యుపాయత్వేన ఈశ్వరే సమర్ప్య కర్మాణి ఆత్మనః ఫల మనభిసంధాయ అనుతిష్ఠద్భిః పరమార్థజ్ఞానసన్న్యాసప్రాప్తిద్వారేణ గమ్యతే" అను నింతపెద్దయర్థమును స్వీకరించుట. (౯) మొదటిరెండు శ్లోకములయందున్న సన్న్యాసశబ్దమునకు కేవలసన్న్యాసమని యర్థము చెప్పి, దానికి విరుద్ధముగ నాఱవశ్లోకమునందు 'సన్న్యాస' శబ్దమునకు పారమార్థిక సన్న్యాసమని యర్థముఁ జెప్పుట. (౧౦) దానియందున్న బ్రహ్మశబ్దమునకు సన్న్యాసమనెడు విలక్షణార్థమును శ్రీభగవంతుఁడు స్వీకరించుచున్నాఁడనునది మొదలు, గాఁగల సంగతులఁ జెప్పిరి. ఇంతియఁగాక యాచార్యులవారి శబ్దములయర్థమును తలక్రిందుఁ జేయుటలోఁ జదువరులకు తిరిగి నివారింపరానియాపత్తి స్ఫురించుచున్నది. ఆయాపత్తి నాల్గైదుశ్లోకములయొక్క యర్థమునకు సంబంధించియున్నది. అది యెట్టులన:—

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి నపండితాః,
ఏకమప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్. ౪
యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే,
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి సపశ్యతి. ౫

ఇందులో రెండవశ్లోకముయొక్క యవతరణమునందు "ఏకస్యాపి సమ్యగనుష్ఠానాత్ కథం ఉభయోః ఫలం విందతే" ఇత్యాహ. రెండింటిలో దేనినో యొకదానిని సుస్థిరముగ నాచరించుటచే రెండింటియొక్క ఫలము నెట్లు పొందుచున్నాఁడని శంకించి సమాధానములను చెప్పుచున్నాఁడని చెప్పి "యత్సాంఖ్యైః జ్ఞాననిష్ఠైః సన్న్యాసిభిః ప్రాప్యతే స్థానం మోక్షాఖ్యం తద్యోగై రపి........ పరమార్థజ్ఞాన సన్న్యాస ప్రాప్తిద్వారేణ గమ్యతే ఇత్యభిప్రాయః" అనఁగా: 'సాంఖ్యులకు (జ్ఞానయుక్తసన్న్యాసులకు) మోక్షసంజ్ఞికమగు నేస్థానము లభించునో యది యోగులకును (కర్మ-యోగులకును) జ్ఞానయుక్తమగు సన్న్యాసము వలన ప్రాప్తమగును' అని చెప్పఁబడినది. జ్ఞానయుక్తుఁడగు సన్న్యాసికి సాక్షాత్తుగ మోక్షము లభించుననియు, (కర్మ-)యోగికి జ్ఞానయుక్తమగు సన్న్యాసము వలన మోక్షము దొరకుననియు దీనికి స్పష్టార్థము. అనఁగా: (కర్మ-)యోగి జ్ఞానయుక్తుఁడైన సన్న్యాసియైననేగాని మోక్షము లభింపదు. ఇంతియఁగాక కర్మయోగము నాచరించినగాని, జ్ఞానయుక్తమగు సన్న్యాసము లభించుట దుర్లభమనియు శ్రీశంకరులు చెప్పుచున్నారు. (గీ. ౫-౬) "యేషాం స్సన్న్యాసపూర్వికా జ్ఞాననిష్ఠాదృశ్యతే తేషాం తయైవ లింగేన ప్రాగ్జన్మసుభగవదర్పితకర్మనిష్ఠా అనుమీయతే, కారణమంతరేణ కార్యోత్పత్త్యయోగాత్". తదుక్తం. శ్లో. యాన్యతోఽన్యాని జన్మాని తేషు నూనం కృతం భవేత్, సత్కృత్యం పురుషేణేహ నాన్యథా బ్రహ్మణి స్థితిః" అని మధుసూదనసరస్వతియుఁ జెప్పెను. బ్రహ్మజ్ఞానముఁ గలిగినవారు ఈజన్మమున కాకున్నను పూర్వజన్మమునైన నిష్కామకర్మయోగానుష్ఠానము చేసియేయుండవలయును. లేనిచో బ్రహ్మజ్ఞానము లభింపశక్యముకాదు.

కారణములేనిదే కార్యము పుట్టుటకు శక్యముకాదు. దీనింబట్టి (కర్మ)-యోగము, మఱియు సాంఖ్యము (జ్ఞానయుక్తసన్న్యాసము) అనువానిపౌర్వాపర్యక్రమమునకు వ్యభిచారములేదని నిర్వివాదముగ సిద్ధమగును. ఇట్టిస్థితిలో, "ఏకమప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్" మొదలగునది చెప్పుట బొత్తుగ నసంగతమని యందఱును సులభముగఁ దెలియఁగలదు. కారణమేమన రెండుసాధనములును నొకఫలమునే స్వతంత్రముగ నిచ్చునవియయిననే కాని "ఏకమప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్" అని చెప్పుట కెప్పుడును శక్యము కాదు. ఈ సిద్ధాంత మొంకదృష్టాంతముచే స్పష్టముగ దృఢపరుపవచ్చును.

వాడ్చినఁ జాలును. ఇటులుండ శ్రీభగవత్పాదులు శ్రీకృష్ణుని యీమాట కింత విస్తృతపుగు నర్థము నేల చేయవలయునో తెలియదు. "అర్కే చేన్మధు విందేత కిమర్థం పర్వతం వ్రజేత్" అను న్యాయముచే నొకచోట గౌణార్థమును స్వీకరించుటచే నంతయు సమన్వయమైనచో, పదిస్థలములయందు గౌణార్థమును ననుపపన్నార్థమును కల్పించుకష్టమెందులకు? "నిశ్శ్రేయసకరౌ" అనఁగా: నిశ్శ్రేయసప్రతిబంధకములు కావనిగాని, నిశ్శ్రేయసప్రతిబంధకనివారకము లనిగాని యర్థముఁ జేసినచో నన్నివిరోధములును పరిహృతములగును.

జ్ఞానము కలిగినపిదప కర్మయోగము నాచరించుటకు వీలులేదని చెప్పుటకును సాధ్యముఁ గాదు. అట్లు చెప్పుట టీకాకారు లెల్లరకును సాధ్యముఁగాదు:—

"సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాం స్తథాఽసక్తః చికీర్షు ర్లోకసంగ్రహమ్."

(గీ. ౩. ౨౫)

అని భగవంతుఁ డాజ్ఞ యిచ్చియున్నందున నీవిషయ మందఱు నంగీకరింపక తప్పదు. ఇప్పుడు జ్ఞాని కర్మను చేయుటకు వీలున్నదా? లేదా? యని నిరూపింపఁబడినది.

ఇఁక లోకమాన్యులు చెప్పునర్థమునఁ గలయనుపపత్తులను విచారించుదము. (౧) 'నిశ్శ్రేయస' శబ్దమునకు లాక్షణికార్థమును గ్రహించుట, (౨) యోగశబ్దమునకు కర్మయోగమను లాక్షణికార్థమునుఁ జెప్పుట, (౩) తమకు సమ్మతమగు నర్థమునకు "కర్మజ్యాయోహ్యకర్మణః" "కర్మయోగో విశిష్యతే" అను గీతావచనములు ప్రమాణములని చెప్పినను, స్మృతికి శ్రుతిమూలమున ప్రామాణ్యము గలదు గాని, స్వయముగఁ బ్రామాణ్యము లేనందున నే శ్రుతిమూలమున నీస్మృతికి ప్రామాణ్యము వచ్చినదనియును నిరూపింప వీలులేకపోవుట, (౪) "పురుషార్థసిద్ధికౌ" అని చెప్పకయే సముచ్చయవాదమును ఖండించినచోట్ల నెల్ల "పురుషార్థసిద్ధయే" యని యధ్యాహారముఁ జేసికొనుట, (౫) లోకసంగ్రహార్థమై జ్ఞాని కర్మలనుఁ జేయుటయనునది లోకోపకారార్థమైనను నాలోకోపకారము సిద్ధించుటకు ప్రతిబంధకమువచ్చినచో దానిని నిరాకరించుటకొఱకు జ్ఞాని తన చిత్తమును బహిర్ముఖముగఁ జేయక తప్పకపోవుటయు, (౬) సాంఖ్యయోగమును మొదటఁ జెప్పి కర్మయోగమును పిదపఁ జెప్పినను ప్రశ్నము ననుసరించి సాంఖ్యయోగము మొదటఁ జెప్పఁబడినది గాని కర్మయోగమే భగవంతుఁడు గీతలకు ముఖ్యశాస్త్ర

దీని నాంధ్రీకరింపుమని నన్ను ప్రోత్సాహపరచిరి. కాని, యాభాషను, శ్రీలోకమాన్యుల గొప్పశైలిని గమనించి యాంధ్రభాషకు వారిభావములనన్నియును మోచికొనిపోవుటకు శక్తిలేనివాఁడనుగనుక నంగీకరింపకయుంటిని. కాని, శ్రీ లక్ష్మీనరసింహముగారికీకార్యనిర్వహణమునకు నన్ను మిక్కిలి ప్రోత్సాహపరచుటయేగాక, తెనాలియందుండు గొప్పవారందఱును, మిక్కిలిగా మాసంస్కృతకాలేజి కార్యదర్శిగారైన శ్రీ పిల్లుట్ల. ఆంజనేయశాస్త్రులగారును నేనికార్యమునుఁ బూనుకొనునట్లు నన్ను వదలకపోయిరి. నేనికార్యమునకసమర్థుఁడనయినను గొప్పవారగు వీరందఱియాజ్ఞయయినను నామార్గ మీయకఁబోవునా యని ధైర్యముతో నొప్పుకొనినంతన, లోకమాన్యులును, నేను కాశీపట్టణములో బహుకాలము నివసించుట మొదలగుసంగతులను కర్ణాకర్ణిగా విని, యాంధ్రీకరింపుమని యాజ్ఞ నొసంగిరి. కాని, గ్రంథ మతివిస్తృతమైనందునను, సంస్కృతమును, నాంధ్రమును బాగుగఁ దెలిసి వ్రాయువారు లభ్యపడకపోవుటవల్లను కాలయాపనజరుగుచు కష్టపడుచుంటిని. అంతట నాతో విద్యాసంబంధము గలిగిన బ్రహ్మశ్రీ. బుర్రా పూర్ణయ్యశాస్త్రులవారను హైస్కూలుపండితులు శ్రీభారతమును వ్రాయునపుడు వేదవ్యాసులకు గజాననుఁడు తోడ్పడినటుల నాకుఁ దోడ్పడి యీగ్రంథమును సంపూర్ణముగ వ్రాసిరి. వారెంత బాగుగ వ్రాసినను శ్రీలోకమాన్యులశైలి మహారాష్ట్రభాషలో లోకోత్తరమగుటచేతను, గ్రంథ మతివిస్తృతమగుటచేతను నాలోచించి వ్రాసినచో నొకపుటయైనను పూర్తిఁజేయుట కశక్యముగ నుండినందున 'మక్షికాస్థానే మక్షికా' న్యాయముగ వ్రాసితిమి. కాని, విశేషణప్రాయముగా నుండు నాంధ్రభాషలోని కుపవాక్యప్రాయ మగుమహారాష్ట్రభాషను మార్చుట మహాప్రయాసమైనది. ఈస్థితిలో బ్రహ్మశ్రీ వేదాంత. శ్రీరామశాస్త్రులవారను హైస్కూలుపండితులు పూర్వమునందెపుడో నాయొద్ద వ్యాకరణ మభ్యసించియుండి "ఏకాక్షరప్రదాతార" మనున్యాయము ననుసరించి నాయెడ విశ్వాసము నుంచి యీగ్రంథమును మొదటియక్షరము మొదలుకొని యంత్యాక్షరమువఱకున్ను నాతో సమానముగ పరిశ్రమఁజేసి సరిచూచి సంస్కరించి బాగుఁజేసిరి. పై యిరువురును జీవనోపాయమైన నిర్బంధోద్యోగములయం దుండియు శ్రమను సహించి కార్యము నెఱవేఱునటుల నాకు దాసానుదాసులయి నా కీకార్యనిర్వహణమున చక్రరక్షకులుగ నుండినందున నేను వారికి మిక్కిలి కృతజ్ఞుఁడను. ఈ గ్రంథ మిటుల వ్రాయఁబడినను, దీని భాషారచన యాంధ్రలోకమునకు మెప్పు పుట్టించువట్లును, స్త్రీబాలురకును సుబోధక మగుసులభశైలి నేర్పఱచి చిత్తప్రతు

లను సరిచేసి ముద్రణమున కుపయుక్తములగునట్లు పరిష్కరించిన నెల్లూరుజిల్లా, పుదూరుగ్రామనివాసియగు బ్ర. శ్రీ. సీతారామశాస్త్రులవారు నాకు మిత్రులు శ్రీ వావిళ్ల. రామస్వామిశాస్త్రులవారి కొమారులు శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారి ప్రోత్సాహమునం జేసిన మితిలేని యుపకారమును స్మరింపఁజాలను.

మఱియు నిందుకు సహాయముగ ముద్రణాలయమునకు వ్రాతప్రతులు ముద్రణకు సిద్ధమైపోయినపిదప నీగ్రంథమును ప్రారంభము మొదలు తుదవఱకును మూలమహారాష్ట్రప్రతికి సరియైన యాంధ్రభాషాంతరములగునై యున్నవా? లేవా? యని శోధించి పొరఁబడి వదలిన భాగములను నాకుఁ దెలిపి భాషాంతరమును చెప్పించియు తామే సవరింపఁజాలినవానిని ఓపికతో శ్రీ వావిళ్ల. వేంకటేశ్వరశాస్త్రులతోఁగూడి సవరించియు ప్రూఫుప్రతుల శోధించిన విద్వాంసులు శ్రీ మాన్. ఉత్పల. వేంకటనరసింహాచార్యులును నాకృతజ్ఞతకు పాత్రులు.

ఇఁక నీగ్రంథము ప్రచురింపఁబడుటకును, శ్రీ లోకమాన్యులకు భరతఖండము లోనికీర్తి యీగ్రంథముచే నాంధ్రలోకమున మఱింత విస్తరిల్లవలయునని యత్యుత్సాహముతో శ్రీ లోకమాన్యుల యాజ్ఞ ననుసరించి ముద్రించి ప్రకటించినవారును, నిందులకై యొకపర్యాయము కలకత్తాకును, నింకొకపర్యాయము బొంబాయికిని మఱియొకపర్యాయము పునహాకును మార్గాయాసమున కోర్చి పోయి, ముద్రణపరికరము లన్నియును ప్రస్తుతపు ఐరోపామహాసంగ్రామముచే నపారము లగు మూల్యములుగలవైనను, శ్రీలోకమాన్యులయందు తమకుఁగల యాంతరంగమును, బాహ్యమును నగు భక్తిచే వారియిష్టానుసారముగ రమ్యముగ ముద్రింపించి ప్రకటించిన శ్రీయుత వావిళ్ల. వేంకటేశ్వరశాస్త్రులవారి సహాయము లేనిచో నీగ్రంథము ప్రకటింపఁబడుటకు వీలు లేకయే పోవును గాన వారిని నే నేమని శ్లాఘింపవలయునో తోఁచలేదు.

కాని, పూర్వము చెప్పినకారణములను బట్టి విశేషకాల మాలస్యమైనందు నకు క్షమింపవలసినదిగా నాంధ్రలోకమును ప్రార్థించుచున్నాఁడను. మఱియు, నాకు మహారాష్ట్రభాషాజ్ఞానము చాలమిచేఁగాని, యక్షరయోజకుల దృష్టిదోషముచేఁగాని యితరములగు మఱికొన్ని కానరానికారణములచేఁగాని యనేక స్ఖాలిత్యము లుండవచ్చును. కావున బుద్ధిమంతులగు చదువరులు బాగుగ పరిశీలించి నాకుఁ దెలిపినచో వానిని శిరసావహించి పునర్ముద్రణమున బాగుచేయింతునని విన్నవించుచున్నాఁడను.

ఈ గ్రంథము నాంధ్రీకరించుట విషయమునను, నచ్చొత్తించుటయందును మొదటనుండియు నధికశ్రద్ధతోఁ బనిఁజేసియుఁ బ్రోత్సాహపఱచియు నాంధ్ర లోకమున కుపకారముఁ జేయఁబూనిన బ్రహ్మశ్రీ, పెద్దిభొట్ల. లక్ష్మీనరసింహము గారును, ముద్రణాలయమునందుండిన పండితులును నీ గ్రంథముయొక్క సవరణలలో నిప్పటిస్థితికిఁ దోడ్పడినవారైన విద్వాన్. శ్రీ ఉత్పలవేంకటనరసింహాచార్యులును గ్రంథము సమాప్తియగునప్పటికి పరలోకగతులగుట యాంధ్రుల కందఱకును విచారకరముగనున్నది.

ఇట్లు,

శ్రీ దండిభొట్ల. విశ్వనాథశాస్త్రి భట్టాచార్యులవారిశిష్యుఁడును, గోదావరీతీర విరాజమాన రాజమహేంద్రవరపురసమీపమునందున్న మునికూడలి గ్రామ మభిజనంబుగ నున్న,

నోరి. సుబ్రహ్మణ్యశాస్త్రి,
వ్యాకరణాచార్యః.



# గీతారహస్యమునందలి విషయములకు ఆయా ప్రకరణములయందున్న యనుక్రమణిక.

---

## మొదటి ప్రకరణము - విషయప్రవేశము.



## రెండవప్రకరణము - కర్మజిజ్ఞాస.

ఆస్తేయమును తదపవాదమును... 'చచ్చుటకంటె జీవించియుండుట శ్రేయస్కరము' అనుదానికపవాదము... ఆత్మసంరక్షణము... మాతాపితరులును గురువును మొదలుగాగల పూజ్యులవిషయమైన కర్తవ్యమును దానికపవాదమును... కామము, క్రోధము లోభము నను వాని నిగ్రహమునందలి తారతమ్యము... ధైర్యాదిగుణములయొక్క ప్రసంగము 'దేశకాలాదిమర్యాదయు... ఆచారములయొక్క తారతమ్యము ..ధర్మాధర్మములయొక్క సూక్ష్మత్వమును గీతయొక్క యపూర్వతయు...
.... .... .... .... .... .... (పుట.. ౪౦—౭౦)

## మూఁడవప్రకరణము - కర్మయోగశాస్త్రము.

కర్మజిజ్ఞాసయొక్క మహత్త్వము, గీతలలోని ప్రథమాధ్యాయమును, కర్మయోగశాస్త్రముయొక్క యావశ్యకతయు ..కర్మశబ్దముయొక్క యర్థనిర్ణయము... మీమాంసకుల మతానుసారముగ కర్మవిభాగము ..యోగశబ్దముయొక్క యర్థనిర్ణయము...గీతలయందున్న యోగము=కర్మయోగము, మఱియు నదియే ప్రతిపాద్యము...కర్మాకర్మలకు పర్యాయశబ్దములు ... శాస్త్రీయప్రతిపాదనమున నాధిభౌతికమనియు, నాధిదైవికమనియు, నాధ్యాత్మికమనియు మార్గములు మూఁడు... ఈమార్గములయొక్క భేదమునకు కారణము...కోంటుయొక్క మతము...గీతలను బట్టి యధ్యాత్మదృష్టిశ్రేష్ఠము ..ధర్మశబ్దమునకు రెండర్థములు, పారలౌకికమును వ్యావహారికమును...చాతుర్వర్ణ్యాదిధర్మములు...జగత్తును ధరించునది గాన ధర్మము... ధర్మాధర్మనిర్ణయార్థమైన సామాన్యనియమము...'మహాజనో యేన గతః స పంథాః' అనునదియును దానియందున్న దోషమును...'అతి సర్వత్ర వర్జయేత్' అనునదియు దానియొక్క యపూర్ణతయు...విరోధము లేకుండ ధర్మనిర్ణయము ..కర్మయోగశాస్త్రముయొక్క కార్యము .... .... .... (పుట. ౭౧—౧౦౦)

## నాల్గవప్రకరణము - ఆధిభౌతికసుఖవాదము.

స్వరూపప్రస్తావన...ధర్మాధర్మములను నిర్ణయించు తత్త్వములు... చార్వాకులయొక్క కేవలస్వార్థము...స్వార్థబుద్ధివలెనే పరోపకారబుద్ధియు నైసర్గికము ...యాజ్ఞవల్క్యులయొక్క యాత్మార్థము...స్వార్థపరార్థోభయవాదము లేక (ఉదాత్త లేక ఉచ్చ) స్వార్థము...వానియాక్షేపము...పరార్థప్రధానపక్షము;... ఎక్కువమంది కెక్కువసుఖము... దానిపై నాక్షేపము ... ఎక్కువమంది కెక్కువహిత మెవనిచే మఱియు నెట్లు నిర్ణయింపబడును ... కర్మకంటె కర్తను

సంబంధించినబుద్ధియొక్క మహత్త్వము.. పరోపకార మేల్లచేయవలెను?... మనుష్యజాతియొక్క పూర్ణావస్థ ..శ్రేయమును, ప్రేయమును..సుఖదుఃఖముల యొక్క యనిత్యత్త్వము నీతిధర్మములయొక్క నిత్యత్త్వమును ... ... .... .... .... .... .... .... (పుట. ౧౧౧—౧౩౫)

## ఐదవ ప్రకరణము - సుఖదుఃఖవివేకము.

సుఖార్థమై ప్రతిజీవుని యొక్క ప్రవృత్తియు ..సుఖదుఃఖములయొక్క లక్షణమును వానియందలి భేదమును...సుఖము స్వతంత్రమైనదా? దుఃఖాభావరూపమైనదా?...సన్న్యాసమార్గావలంబులయొక్క మతము...దానిఖండనము ..గీతయందలి సిద్ధాంతము...సుఖదుఃఖము లనునవి రెండును స్వతంత్రములైన భావపదార్థములు...ఇహలోకమునందు ప్రాప్తమగు సుఖదుఃఖములయొక్క విపర్యాయము ...సంసారమందు సుఖ మధికమా? దుఃఖ మధికమా? .. పాశ్చాత్త్యులయొక్క సుఖాధిక్యవాదము . మనుజుం డాత్మహత్య చేసికొనక పోవుటమాత్రముచే సంసారము సుఖమయమని సిద్ధము కానేరదు...సుఖేచ్ఛయొక్క యపారమగువృద్ధి .. సుఖోపభోగముచే సుఖేచ్ఛ తృప్తిపొందుట కశక్యము కావున సంసారమున దుఃఖాధిక్యము...తదనుకూలముగ మనశాస్త్రకారులసిద్ధాంతము...శోపెన్‌హారయెర్ యొక్క మతము...అసంతోషముయొక్క యుపయోగము .. దానియొక్క దుష్పరిణామమును దప్పించుకొనుట కుపాయము ..సుఖదుఃఖానుభవము నకు నాత్మవశమగుట, మఱియు ఫలాశయొక్క లక్షణము...ఫలాశను త్యజించుటవలననే దుఃఖనివారణ మగును గాన కర్మత్యాగమును నిషేధించుట ..ఇంద్రియనిగ్రహము యొక్క పరిమితి ..కర్మయోగముయొక్క చతుస్సూత్రి ..శారీరకమగు సుఖము పశుధర్మ మగుట...ఆత్మప్రసాదజమగు (ఆధ్యాత్మికమగు) సుఖముయొక్క శ్రేష్ఠత్వమును నిత్యత్వమును ఈరెండుసుఖములయొక్క మేళనమనునదియే కర్మయోగ దృష్టిచే పరమసాధ్యము...విషయోపభోగసుఖము అనిత్యమును పరమసాధ్య మగుట కయోగ్యమును ..ఆధిభౌతికసుఖవాదముయొక్క అసంపూర్ణత ... ... .... .... .... .... .... .... (పుట. ౧౩౬—౧౬౫)

## ఆఱవ ప్రకరణము - ఆధిదైవతపక్షమును, క్షేత్రక్షేత్రజ్ఞవిచారమును.

పాశ్చాత్త్యుల సదసద్వివేక దేవతాపక్షము ..దానితో సమానమైన మనో దేవతావిషయమై మన గ్రంథములయం దున్నవచనములు ..ఆధిదైవతపక్షము పై నాధి

భౌతికపక్షమునాక్షేపణ... అలవాటుచేతను (అభ్యాసముచేతను) కార్యాకార్యవివేకము శీఘ్రముగ నగును...సదసద్వివేకమనునది వేఱైనశక్తి కాదు... ఆధ్యాత్మపక్షముయొక్క యాక్షేపణము, మనుష్యదేహరూపమగు గొప్పకర్మాగారము...కర్మేంద్రియములయొక్కయు జ్ఞానేంద్రియములయొక్కయు వ్యాపారము...మనస్సుయొక్కయు బుద్ధియొక్కయు వేర్వేఱగు కార్యములు...వ్యవసాయాత్మకమును వాసనాత్మకమును నగుబుద్ధులయొక్క భేదమును సంబంధమును... వ్యవసాయాత్మక మగుబుద్ధి యొకటియే సాత్త్వికాదిభేదములచే మూఁడువిధములు...సదసద్వివేకబుద్ధి దానియందే యంతర్గతమగును వేఱుకాదు ..క్షేత్రక్షేత్రజ్ఞవిచారముయొక్కయు, క్షరాక్షరవిచారముయొక్కయు స్వరూపమును కర్మయోగముతోసంబంధమును .. క్షేత్రశబ్దార్థము .. క్షేత్రజ్ఞునియొక్క యనఁగ నాత్మయొక్క యస్తిత్వము ..క్షరాక్షరవిచారముయొక్క ప్రస్తావన. ... ... .... .... .... .... .... .... (పుట. ౧౬౬—౧౯౯)

## ఏడవప్రకరణము - కాపిలసాంఖ్యశాస్త్రము.
## లేక, క్షరాక్షరవిచారము.

“క్షరాక్షరములను విచారించు శాస్త్రములు...కాణాదుల పరమాణువాదము...కాపిలసాంఖ్యము...సాంఖ్యశబ్దార్థము...కాపిలసాంఖ్యవిషయికమయిన గ్రంథములు...సత్కార్యవాదము...జగత్తునకు మూలభూతమగు ద్రవ్యము లేక ప్రకృతియొకటియే ..సత్త్వరజస్తమోగుణములనునవి దానియొక్క మూఁడు భాగములు...గుణత్రయముయొక్క సామ్యావస్థయు నన్యోన్యమేళనముచే నానా పదార్థములయొక్క యుత్పత్తియు...ప్రకృతి, అవ్యక్తమును, అఖండమును, ఏకమును, అచేతనమును ..అవ్యక్తములనుండి వ్యక్తము...ప్రకృతినుండియే మనస్సును బుద్ధియును... హేకెలు అనువానియొక్క జడాద్వైతమును, ప్రకృతినుండి యాత్మయొక్క యుత్పత్తియును సాంఖ్యశాస్త్రమునకు సమ్మతము కాదు...ప్రకృతి పురుషు లనునీరెండును స్వతంత్రమగు తత్త్వములు...వీనిలో పురుషుఁ డకర్తయును, నిర్గుణుఁడును నుదాసీనుఁడు నైనందున కర్తృత్వ మంతయు ప్రకృతికే చెందియున్నది...రెంటియొక్క సంయోగముచే సృష్టియొక్క వ్యాప్తి...ప్రకృతిపురుషులయొక్క భేదమును తెలిసికొనుటచే కైవల్యము (మోక్షము) లభించుట ...మోక్ష మెవరికి ప్రకృతికా?పురుషునకా? సాంఖ్యమతమున పురుషు లసంఖ్య

లును వేదాంతులమతమున పురుషుడు ద్రష్టయగుట. ప్రకృతిపురుషాత్మ.. సాంఖ్యముయొక్కయు తత్సదృశమైన గీతలయొక్కయు సిద్ధాంతములయందున్న భేదము.

.... .... .... .... .... .... (పుట. ౨౦౦—౨౨౬).

## ఎనిమిదవప్రకరణము - ప్రపంచముయొక్క యుత్పత్తియు, సంహారమును.

ప్రకృతియొక్క విస్తారము.. జ్ఞానవిజ్ఞానముల లక్షణము.. సృష్ట్యుత్పత్తిని గుఱించి వేర్వేఱగు క్రమములను తుదకు వానికేకవాక్యతయు.. ఆధునికమగు ఉత్క్రాంతివాదముయొక్క స్వరూపమును దానికి సాంఖ్యులయొక్క గుణోత్కర్షతత్త్వముతో సాదృశ్యమును.. గుణోత్కర్షవాదముయొక్క (లేక గుణపరిణామవాదముయొక్క) నిరూపణము.. ప్రకృతినుండి మొదట వ్యవసాయాత్మకబుద్ధియు పిదప నహంకారముయొక్కయు నుత్పత్తి. దానియొక్క త్రిఘాతముచే ననంతభేదములు.. అహంకారమునుండి బయలుదేఱిన సేంద్రియ సృష్టియందు మనస్సుతోగూడ పదునొకొండగుతత్త్వములయొక్కయు నింద్రియ సృష్టియందు తన్మాత్రరూపములయిన యైదుతత్త్వములయొక్కయు నుత్పత్తి... తన్మాత్రలైదేలయుండవలయును? సూక్ష్మేంద్రియములు పదునొకండేల కావలయును? అనుదానికి కారణము... సూక్ష్మసృష్టియందుండి స్థూలమగు విశేషము... ఇరువదియైదుతత్త్వములు గల బ్రహ్మాండవృక్షము... అనుగీతలయందున్న బ్రహ్మవృక్షమును గీతలయందున్న యశ్వత్థవృక్షమును. ఇరువదియైదుతత్త్వములను వర్గీకరణము చేయు సాంఖ్యులయొక్కయు వేదాంతులయొక్కయు వేర్వేఱగురీతులు... దానికోష్టకము.. స్థూలములగు పంచమహాభూతములయొక్క యుత్పత్తివిషయమై వేదాంతగ్రంథములయందు వర్ణింపబడిన క్రమము. మఱియు పిదప పంచీకరణముచే స్థూలపదార్థములన్నియు... ఉపనిషత్తులయందున్న త్రివృత్కరణముతో దానిని పోల్చుట.. సజీవసృష్టియు లింగశరీరమును... వేదాంతమునందలి లింగశరీరమునకును సాంఖ్యుల లింగశరీరమునకును భేదము.. బుద్ధియొక్క భావమును వేదాంతములయందున్న కర్మయు... ప్రళయము ... ఉత్పత్తిప్రళయకాలములు.. కల్పయుగమానములు. బ్రహ్మదేవునియొక్క రేయింబవళ్లును మొత్తముపై నాతని యాయుర్దాయమును... ఇతరములగు సృష్ట్యుత్పత్తిక్రమములతో విరోధమును, ఏకవాక్యతయును.... .... .... .... (పుట. ౨౨౭—౨౫౫)

## తొమ్మిదవ ప్రకరణము - అధ్యాత్మము.

ప్రకృతియు పురుషుఁడు ననుద్వైతముపై నాక్షేపము... ఈ రెండింటికంటె పరమంటున్న వానిని విచారించు పద్ధతి... ఈ రెండింటికంటెను పరమంటున్నవాఁడు పరమాత్మ... అతఁడొక్కఁడే లేక పరపురుషుఁ డొక్కఁడే... ప్రకృతి (జగత్తు) పురుషుఁడు (జీవుఁడు) పరమేశ్వరుఁడనునీముగ్గురు... గీతలయందు వర్ణింపఁబడిన పరమేశ్వర స్వరూపము... వ్యక్తము లేక సగుణము నగురూపమును దానియొక్క గౌణత్వమును... అవ్యక్తమైనను మాయచే వ్యక్తమగును... అవ్యక్తమునకే సగుణమనియు, నిర్గుణమనియు, సగుణనిర్గుణమనియు మూఁడు భేదములు... ఉపనిషత్తులలోని తత్సదృశమగు వర్ణనము... ఉపనిషత్తులయందుపాసనార్థమై చెప్పఁబడిన విద్యలును ప్రతీకములును. మూఁడు విధములగు నవ్యక్తరూపములయందును నిర్గుణమే శ్రేష్ఠము (పేజీ ౨౫౬, ౨౫౭) పై సిద్ధాంతమునకు శాస్త్రీయమగు నుపపత్తి... నిర్గుణమునకును సగుణమునకును గూఢ మగునర్థము... అమృతత్వమునకు స్వభావసిద్ధమైన కల్పన... సృష్టిజ్ఞాన మెట్లు గల్గును? మఱియు నెవరికిగల్గును?... జ్ఞానక్రియయొక్క వర్ణనమును, నామరూపములయొక్క వ్యాఖ్యయు... నామరూపము లనుదృశ్యమును వస్తుతత్త్వమును... సత్యముయొక్క వ్యాఖ్యానము.. నామరూపములు నశ్వరములైనందున నసత్యములైనవియు వస్తుతత్త్వము నిత్యమైనందున సత్యమైనదియు... వస్తుతత్త్వమనునదియే యక్షరబ్రహ్మము మఱియు నామరూపము లనునది మాయ... సత్యశబ్దమునకు మిథ్యాశబ్దమునకును వేదాంతమునందలి యర్థము... ఆధిభౌతికశాస్త్రములు వేదాంతమునందలి యర్థము... ఆధిభౌతికశాస్త్రములు నామరూపాత్మకములు (పేజీ ౩౦౦, ౩౦౧)... విజ్ఞానవాదము వేదాంతులకు గ్రాహ్యముకాదు... మాయావాదము ప్రాచీనమైనది... నామరూపములచే నాచ్ఛాదింపఁబడిన నిత్యబ్రహ్మయొక్కయు శారీరమగు నాత్మయొక్కయు స్వరూప మొక్కటియే... ఇరువురను చిద్రూపులనియే చెప్పుదురు... బ్రహ్మాత్మైక్యమునగా 'పిండమందున్నదే బ్రహ్మాండమందున్నది' ... బ్రహ్మానందము... నేను అనువానికి మరణము తురీయావస్థ లేక నిర్వికల్పసమాధి... అమృతత్వముయొక్క హద్దు మఱియు మరణముయొక్క మరణము (పేజీ ౩౧౮)... ద్వైతవాదముయొక్క యుత్పత్తి... గీతలును నుపనిషత్తులును నద్వైతవేదాంతమునే ప్రతిపాదించుచున్నవి ... సగుణమగు మాయ నిర్గుణమునుండె ట్లుత్పత్తియగుచున్నది ?... వివర్తవాదమును గుణపరిణామవాదమును... జగత్తు, జీవుఁడు, పరమేశ్వరుఁడు అనువారివిషయమై

యధ్యాత్మశాస్త్రముయొక్క సంక్షిప్తమగు సిద్ధాంతము (పేజి ౩౩౭). బ్రహ్మయొక్క సత్యతయు నసత్యతయు...ఓంతత్సత్ మొదలుగాగల బ్రహ్మనిర్దేశము...జీవుడు పరమేశ్వరునియొక్క 'అంశ' మెట్లగును?...పరమేశ్వరుడు, ఒకొక్కలాగుచే నపరిచ్ఛిన్నుడు (పేజి ౩౭౩) ..అధ్యాత్మశాస్త్రముయొక్క చరమసిద్ధాంతము...' దేహేంద్రియములయందు నిండియున్న సామ్యబుద్ధి ,, మోక్షస్వరూపముయొక్కయు సిద్ధావస్థయొక్కయు వర్ణనము (పేజి ౭౮౫, ౭౮౯)...బుగ్వేదమునందున్న నాసదీయసూక్తము నర్థముతో వివరించుట...పూర్వాపర ప్రకరణముల సంగతి

.... .... .... .... .... .... (పుట. ౨౬౯—౩౫౫)

## పదియవ ప్రకరణము - కర్మవిపాకమును, ఆత్మస్వాతంత్ర్యమును.

మాయాసృష్టియు బ్రహ్మసృష్టియు... దేహముయొక్క కోశములును కర్మము నాశ్రయమగు లింగశరీరమును...కర్మయును నామరూపములును మాయయు నను- వానికి గల పరస్పరసంబంధములును...కర్మయొక్కయు మాయయొక్కయు వ్యాఖ్యానము...మాయయొక్క మూల మగమ్యమైనందున మాయ పరతంత్రురాలయైనను నిత్యాదియయినది ..మాయాత్మకమగు ప్రకృతియొక్క వ్యాప్తి లేక, సృష్టి యనునదియే కర్మము ..కావున కర్మమును ననాదియె ..కర్మముయొక్క యఖండమగు ప్రయత్నము...పరమేశ్వరుడు దానియందేమియు బ్రవర్తింపక కర్మానుసారముగనే ఫలము నిచ్చుచున్నాడు (పేజి ౩౬౭)...కాని కర్మ చేయుటకు సాధనములు...కర్మబంధముయొక్కయు ప్రవృత్తిస్వాతంత్ర్యముయొక్కయు. ప్రస్తావన ...కర్మవిభాగము, ప్రారబ్ధము, క్రియమాణమును...ప్రారబ్ధకర్మణాం భోగాదేవ క్షయః ..మీమాంసకులయొక్క నైష్కర్మ్యసిద్ధివాదము వేదాంతులకు గ్రాహ్యముకాదు...జ్ఞానముదక్క కర్మబంధమునుండి విముక్తిచేయున దెద్దియును లేదు... జ్ఞానశబ్దార్థము ..జ్ఞానమును సంపాదించుకొనుటకు జీవుడు స్వతంత్రుడు (పేజి ౩౭౭, ౩౭౮)...కాని కర్మచేయుటకు సాధనము లతనియొద్ద లేకుండుటచే నంతమాత్రమే పరాపేక్షగలవాడు ..మోక్షమునొందుట కాచరింపబడినకర్మ స్వల్పమైనను వ్యర్థముకానేరదు... కావున నొకప్పుడైనను దీర్ఘప్రయత్నముచే స్వయముగనే సిద్ధించును ..కర్మక్షయముయొక్క స్వరూపము ..కర్మలను విడుట శక్యముగాదు...ఫలాశను వదలుము ..కర్మల కుండుబంధకత్వము మనోమూలకము ...కర్మలు బంధకములుగావు...కాన జ్ఞాన మెప్పుడుగల్గినను దానినుండి మోక్షమనుఫలమే గలుగును ..అప్పటికిని నవస్థానకోశముయొక్క మహాత్మ్యము (పేజీ

౩౯౮, ౩౯౯) ... కర్మకాండమును జ్ఞానకాండమును .. శ్రౌతయజ్ఞమును స్మార్తయజ్ఞమును ... కర్మపతితమయిన గృహస్థాశ్రమప్రవృత్తి ... కర్మములు జ్ఞానయుక్తములనియు జ్ఞానవిరహితములనియు .. తెదనుసారముగ వేర్వేఱగుగతి ... జీవన్ముక్తావస్థను వర్ణించుట .... .... .... .... .... (పుట. ౩౫౬—౪౧౨)

## పదునొకండవ ప్రకరణము - సన్న్యాసమును, కర్మయోగమును.

సన్న్యాసము కర్మయోగము ననునీరెంటిలోను శ్రేష్ఠమగుమార్గ మేదియని యర్జునుఁడు ప్రశ్నించుట ... ఈమార్గములవంటివే పాశ్చాత్త్యులమార్గములు ... సన్న్యాసము కర్మయోగము ననువానికి పర్యాయశబ్దములు .. వీనిలో సన్న్యాసశబ్దముయొక్క యర్థము కర్మయోగము ... సన్న్యాసమార్గమున కంగము కానందున రెండును స్వతంత్రములైనవి ... టీకాకారు లీవిషయమున వ్రాసినయంగాంగిభావములు ... ఈరెండుమార్గములలోను కర్మయోగమే శ్రేష్ఠమని గీతలయొక్క స్పష్టమగు సిద్ధాంతము : సన్న్యాసమార్గీయులగు టీకాకారులచే చేయఁబడినవిపర్యాసము ... అందుకు సమాధానము ... అర్జునుఁ డజ్ఞానియనుకొనుటకు వీలులేదు ... (పేజీ౩౬౬) .. కర్మయోగమే శ్రేష్ఠ మేలయాయె ననువిషయమై గీతలలోఁ జెప్పఁబడినకారణములు .. ఈయాచార మనాదినుండియు ద్వివిధములుగ నేయున్నది కాన శ్రేష్ఠత్వమును నిర్ణయించుట వ్యర్థము ... జనకునిచే వర్ణింపఁబడిన మూఁడు నిష్ఠలును గీతలయందు వర్ణింపఁబడిన రెండునిష్ఠలును ... కర్మలు బంధకములని చెప్పుటచే వానినే వదలివేయవలయునని సిద్ధింపదు ... ఫలాశను వదలుటచే నిర్వాహకము కానేరదు ... కర్మ వదలుట కశక్యము .. కర్మలను వదలుదు మేని యాహారము కూడ లభింపదు ... జ్ఞానము కల్గినపిదప స్వార్థమై కర్తవ్య మేమియు లేకున్నను, లేక వాసనాక్షయమైనను కర్మలు వీడవు ... కాన స్వార్థబుద్ధి లేకున్నను జ్ఞానముకలిగిన పిదపను కర్మలు తప్పక చేయవలయును ... భగవంతునియొక్కయు, జనకునియొక్కయు నుదాహరణము ... ఫలాశాత్యాగమ్ము, వైరాగ్యమును, కర్మోత్సాహమును (పేజీ౩౭౬, ౩౭౭) ... లోకసంగ్రహమును దానిలక్షణమును .. ఇదియె బ్రహ్మజ్ఞానమునకు నిజమగుపర్యవసానము ... ఆలోకసంగ్రహమైనను చాతుర్వర్ణ్యానుసారముగను నిష్కామముగను చేయవలయును (పేజీ౪౭౪) ... స్మృతిగ్రంథములలో వర్ణింపఁబడిన యాశ్రమచతుష్టయమునందలి జీవితమును గడపుమార్గమును ... గృహస్థాశ్రమ మాహాత్మ్యము ... భాగవతధర్మములు స్మార్తధర్మములన నెందటియర్థ మేమియో వివరింపుట గీతలయందున్న కర్మయోగమున భాగవతధర్మములె ప్రతి

పాద్యమనుట...గీతలయందున్న కర్మయోగమునకును మీమాంసకుల కర్మమార్గమునకును భేదము...స్మార్తసన్న్యాసమునకును భాగవతసన్న్యాసమునకును గల భేదము...ఈ రెంటికినుండు నేకవాక్యత...మనుస్మృతియందున్న వైదికకర్మయోగమునకును, భాగవతధర్మములకును గల ప్రాచీనత...గీతలయందున్న యధ్యాయసమాప్తిసూచకమగు సంకల్పమునకు గల యర్థము ..గీతలయొక్క యపూర్వతయు ప్రస్థానత్రయమునందున్న మూఁడుభాగములకు సార్థక్యము (పేజీ ౪౮౭)...సన్న్యాసమును (సాంఖ్యమును) కర్మయోగమును (యోగమును) ననునీరెండు మార్గములయందును గలభేదాభేదములకు కోష్టకరూపము క్లిప్తమగునిరూపణము...దానిని ప్రతిపాదించునట్టి ఈశావాస్యోపనిషత్తునందలి మంత్రము...దానినిగుఱించిన శంకరభాష్యమునందలి విచారము ..మనుస్మృతియందును నితర స్మృతులయందును గల జ్ఞానకర్మసముచ్చయాత్మకములగు వచనములు. ... ...

.... .... .... .... .... .... (పుట. ౪౧౩—౫౦౬)

## పన్నెండవప్రకరణము - సిద్ధావస్థయు, వ్యవహారమును.

సంఘముయొక్క పూర్ణావస్థ ..పూర్ణావస్థయందున్నవా రందఱును స్థితప్రజ్ఞులే...నీతియొక్క పరమావధి ... పాశ్చాత్త్యులమతానుసారముగ స్థితప్రజ్ఞుఁడు ...స్థితప్రజ్ఞునియొక్క విధి నియమములతో సంబంధించియుండదు...కర్మయోగియగు స్థితప్రజ్ఞునియొక్క స్థితియే పరమనీతి...పూర్ణావస్థయందలి పరమావధియగునీతియు, లోభులగు సామాజికులయొక్క నీతియు ననువానిభేదములు...దాసబోధయందు చెప్పఁబడిన యుత్తమపురుషునివర్ణన ..కాని యీభేదముచే నీతిధర్మములయందునిత్యత్వము తగ్గదు. (పుట ౫౧౭)... స్థితప్రజ్ఞుఁడీభేదవిషయమున నేమి చేయుచున్నాఁడు ?...సమాజమునకు శ్రేయస్సు, కల్యాణము, లేక సర్వభూతహితము...అయిన నీబాహ్యధోరణికంటె సామ్యబుద్ధియే శ్రేష్ఠమయినది...అనేకుల కెక్కువహితమును సామ్యబుద్ధియు ననునీరెండింటిని పోల్చిచూచుట...సామ్యబుద్ధిచే జగత్తునందలి యాచరణము ..పరోపకారమును స్వీయమగుయోగక్షేమమును ... ఆత్మౌపమ్యబుద్ధియు...దానియొక్క వ్యాపకతయు, మాహాత్మ్యము, నుపపత్తియు..."వసుధైవ" కుటుంబము (పేజి ౫౩౯, ౫౪౦)...బుద్ధి సమమయినను పాత్రాపాత్రవిచారము వదలనేరదు..నిర్వైరుఁ డనఁగా నిష్క్రియుఁడుగాని, లేక ప్రతిక్రియ చేయనివాఁడుగాని కాఁడు...ఎట్టివానిటులె... దుష్టనిగ్రహము...దేశాభిమానము, కులాభిమానము మొదలగువాని

కుపపత్తి ..దేశకాలమర్యాదాపరిపాలనము ఆత్మసంరక్షణము ...జ్ఞానియొక్క కర్తవ్యము , లోకసంగ్రహమును కర్మయోగమును...విషయసమారోపము... స్వార్థమును, పరార్థమును, పరమార్థమును... ... (పుట. ౨౦౭—౨౨౯)

## పదమూఁడవప్రకరణము - భక్తిమార్గము.

నిర్గుణబ్రహ్మస్వరూపము అల్పబుద్ధిగల సామాన్యమనుజులకు దుర్బోధ్యము ... జ్ఞానప్రాప్తికి సాధనములును, శ్రద్ధయు, బుద్ధియు ...రెండింటికి నుండు పరస్పరాపేక్ష ..శ్రద్ధచే వ్యవహారసిద్ధి...శ్రద్ధచే పరమేశ్వరజ్ఞానము గలిగినను నిర్వాహకము కానేరదు ...అది మనస్సునకుఁ దెలియుటకై నిరతిశయము, నిర్హేతుకము నగు ప్రేమచే పరమేశ్వరుని చింతింపవలసివచ్చును...దీనిపేరే భక్తి... సగుణమగు నవ్యక్తముయొక్క చింతనము కష్టమయమును దుర్ఘటమును...కాన నుపాసనకు ప్రత్యక్షమయినవస్తువు కావలయును ..జ్ఞానమార్గమును, భక్తిమార్గమును పరిణామమునం దొకవిధమె యయినను జ్ఞానమువలె భక్తి స్వతంత్రమగు నిష్ఠ కానేరదు ... పరమేశ్వరుని భక్తికొఱకై గ్రహింపఁబడిన ప్రేమ గమ్యము ప్రత్యక్షమునగు రూపము...ప్రతీకశబ్దార్థకము ..రాజవిద్యయు, రాజగుహ్యము, అనుశబ్దములకు నర్థము...గీతలయందు చెప్పఁబడిన ప్రేమరసము...(పుట ౨౭౬, ౨౭౭) ..పరమేశ్వరుని యనేకవిభూతులలో నేదైనను, ప్రతీకమగును ... అనేకులకు ననేకప్రతీకములును, వానినుండి కలుగఁబోవు ననర్థములును, వానిని తప్పించుటకు పాయము . ప్రతీకముయొక్కయు, ప్రతీకసంబంధభావమునకును నుండు భేదము ...ప్రతీక మేదైనను భావనానుసారముగ ఫలమునొందును...వెవ్వేఱగు దేవతల యుపాసన...వానియందును ఫలదాత పరమేశ్వరుఁడొక్కఁడె...దేవతలు కారు...ఎదేవతను భజించినను నాభజించుట విధిచోదితముగాని పరమేశ్వరుని యొక్క భజనమే యగును...ఈదృష్టితోఁ జూచిన గీతలయందున్న భక్తిమార్గమునకు గలశ్రేష్ఠత్వము...శ్రద్ధయొక్కయు ప్రేమయొక్కయు శుద్ధత్వాశుద్ధత్వములు...ఉద్యోగముచే క్రమముగ సుధారణ ..మఱియు ననేకజన్మములయొక్క యంతమందు సిద్ధియు...శ్రద్ధయు, బుద్ధియు లేనివాఁడు చెడిపోవును...బుద్ధిచేతను భక్తిచేతను తుదకు నొకఁడే యగు నద్వైతబ్రహ్మయొక్క జ్ఞానము ప్రాప్తమగును(పుట. ౨౯౦)...కర్మవిపాకప్రక్రియయందున్నట్టియు నధ్యాత్మమం దున్నట్టియు సిద్ధాంతములన్నియు భక్తిమార్గమునసైతము గ్రాహ్యములే ..ఉదాహరణమేమనఁగా:—గీతలయందున్న జీవపరమేశ్వరులయొక్క స్వరూపము అయినను నీ

సిద్ధాంతములవిషయమున నక్కడక్కడ శబ్దభేదమే యుండును. ఉదాహరణము:—కర్మయనఁగా: కర్మయోగమార్గమునందు పరమేశ్వరునికై యగును .. బ్రహ్మార్పణమును, కృష్ణార్పణము నయినను నర్థభేద ముండునట్లు కేవలము శేని శబ్దభేద మును చేయలేదు .. గీతాధర్మములయందు గ్రహింపఁబడిన శ్రద్ధకును జ్ఞానమునకును సంబంధము .. భక్తిమార్గమునకు సన్న్యాసధర్మముయొక్క యపేక్ష లేదు .. భక్తికిని కర్మకును విరోధము లేదు .. భగవద్భక్తియు లోకసంగ్రహమును .. తమతమకర్మలచేతనే భగవంతుని యజనపూజనములు ?. జ్ఞానమార్గమున త్రైవర్ణికులకే యధికారము కలదు .. భక్తిమార్గమున స్త్రీశూద్రాదుల కెల్లరకును నధికారము గలదు ... అంతకాలమునందైనను పరమేశ్వరుని యనన్యభావముచే శరణుఁ జొచ్చునేని ముక్తిగలుగును ... గీతలయందున్న ధర్మముల కితరధర్మముల యన్నింటి కంటె శ్రేష్ఠత్వము ... ... ... ... (పుట. ౫౬౦—౬౦౮).

## పదునాల్గవ ప్రకరణము - గీతాధ్యాయసంగతి.

విషయమునుఁ బ్రతిపాదించుటకు శాస్త్రీయమనియు సంవాదాత్మకమనియు రెండుమార్గములు .. సంవాదాత్మకపద్ధతియందున్న దోషములు గుణములు .. గీతల యొక్క ప్రారంభము ... ప్రథమాధ్యాయము ... ద్వితీయాధ్యాయమునందున్న 'సాంఖ్యమును యోగమును' అను రెండుమార్గములనుండియే యారంభము ... మూఁడు, నాలుగు, అయిదు అధ్యాయములయందున్న కర్మయోగవివేచనము ... కర్మకంటె సామ్యబుద్ధి శ్రేష్ఠమైనది .. కర్మలు వదలవు ... సాంఖ్యనిష్ఠకంటె కర్మయోగము శ్రేయస్కరము ... సామ్యబుద్ధిప్రాప్తి కింద్రియనిగ్రహ మావశ్యకము .. ఆఱవ యధ్యాయమునందున్న యింద్రియనిగ్రహసాధనములు ... కర్మయు, భక్తియు, జ్ఞానము నని గీతలను విభజించుట యోగ్యము కాదు ... జ్ఞానము భక్తియు ననునవి కర్మయోగమునందున్న సామ్యబుద్ధికి సాధనములు .. కాన 'త్వం తత్ అసి' యను దానిగుఱించి యాఱు అధ్యాయములు చెప్పఁబడలేదు .. ఏడవయధ్యాయము మొదలు పండ్రెండవయధ్యాయమువఱకు నుండు తాత్పర్యము ... ఈ యధ్యాయములయందును భక్తియును, జ్ఞానము, గీతలయందు వేర్వేఱుగ వర్ణింపఁబడలేదు ... ఒకదానిలో నొకటి చేర్పఁబడినది ... మఱియు వానికి జ్ఞానవిజ్ఞానములని యొక్క పేరే పెట్టఁబడినది ... పదుమూడవయధ్యాయము మొదలు పదునేనవయధ్యాయమువఱకును సారాంశము ... పదునెనిమిదవయధ్యాయమునందున్న యుపసంహారము

కర్మయోగపరమైనదే... కాన నుపక్రమోపసంహారము మొదలుగాగల మీమాంసకుల నిబంధననుబట్టియు గీతలయందు కర్మయోగమే ప్రతిపాద్యమగును... చతుర్విధపురుషార్థములు... అర్థము, కామము ధర్మము ననుసరించియే యుండవలయును ..కాని మోక్షమునకును ధర్మమునకును విరోధము లేదు...గీతలకు సన్న్యాసపరమగు నర్థ మెట్లు చేయఁబడినది...సాంఖ్యము + నిష్కామకర్మము = కర్మయోగము...గీతలయందు లేని దేదియైనను తుదకు కర్మయోగమే ప్రతిపాద్యము... సన్న్యాసమార్గీయులకు విజ్ఞప్తి (ప్రార్థన)... ...(పుట. ౧౦౯—౧౪౭)

## పదునేనవప్రకరణము - ఉపసంహారము.

కర్మయోగశాస్త్రమునందును, ఆచారసంగ్రహమునందును గలభేదము... వేదాంతశాస్త్రముతో నీతిశాస్త్రమున కుపపత్తి కుదురదని భ్రమఁజెందుట...గీతయా యుపపత్తినే చెప్పుచున్నది ..కేవల నీతిదృష్టిచే గీతాధర్మముల వివేచనము... కర్మకంటె బుద్ధి శ్రేష్ఠము...నకులోపాఖ్యానము...తత్సదృశములగు బౌద్ధక్రైస్తవసిద్ధాంతములు...అనేకుల కధికహితమును మనోదైవతము ననెడు నీరెండు పాశ్చాత్త్యసిద్ధాంతములతో గీతలయొక్క సామ్యబుద్ధిని పోల్చుట ..పాశ్చాత్త్యుల యాధ్యాత్మికపక్షముతో గీతలయందున్న యుపపత్తికి గలసామ్యము... కాంటు,గ్రీన్ అనువానిసిద్ధాంతము .. వేదాంతము నీతియు (పుట. ౧౧౧)...నీతిశాస్త్రమునందు వేర్వేఱుమార్గములు పుట్టుటకు కారణము... పిండబ్రహ్మాండముయొక్క రచనవిషయమై మతభేదము...గీతలయొక్క యాధ్యాత్మికమగు నుపపాదనమం దున్న మహత్త్వవిశేషము... మోక్షము,నీతిధర్మములును, వ్యవహారమనువాని నేకవాక్యత...క్రైస్తవసన్న్యాసమార్గము సుఖహేతుకమగు పాశ్చాత్త్యకర్మమార్గములు ..వానిని గీతలయందున్న కర్మమార్గముతోఁ బోల్చుట... చాతుర్వర్ణ్యవ్యవస్థయందును నీతిధర్మములయందును భేదము...దుఃఖనివారకమగు పాశ్చాత్త్యకర్మమార్గమును నిష్కామగీతాధర్మములును (పుట. ౧౫౩) ...కలియుగమం దున్న సంక్షిప్తమగు కర్మయోగమునుగుఱించిన యితిహాసము...జైనబౌద్ధయతులు..శంకరాచార్యులవారి సన్న్యాసమార్గము...తురకలరాజ్యము... భగవద్భక్తులు, సత్పురుషసముదాయమును, రామదాసుగారును...గీతాధర్మములు నేటికి వాడుకలో నుండుట...గీతాధర్మముయొక్క యభయత్వము, నిత్యతయు, సమతయు... దేవతాప్రార్థన.... .... .... (పుట. ౧౪౫—౧౫౭)

## పరిశిష్టప్రకరణము - గీతలయొక్క బహిరంగపరీక్ష.

గీత మహాభారతమునందు యోగ్యమగు కారణముచే యోగ్యమగు స్థలము నందె చెప్పఁబడినది; ప్రక్షిప్తము కాదు... (మొదటిభాగము) గీతయొక్కయు మహాభారతముయొక్కయు కర్తృత్వము ... గీతలయొక్క ప్రస్తుతమగు స్వరూపము ... మహాభారతముయొక్క ప్రస్తుతస్వరూపము... మహాభారతమునం గీతలవిషయమగు నేడుల్లేఖములు ( ) రెండింటియందును నొకవిధముననే యున్న శ్లోకములును, భాషాసాదృశ్యమును... నటులే యర్థసాదృశ్యమును... దీనినుండి గీతయు, మహాభారతమునను, రెండు గ్రంథములకును గ్రంథకర్త యొకడె యని సిద్ధించును. (రెండవభాగము) గీతలను ఉపనిషత్తులను పోల్చిచూచుట ...శబ్దసాదృశ్యమును, అర్థసాదృశ్యమును... గీతలయందున్న యధ్యాత్మజ్ఞానము, గీతలలోఁ బ్రతిపాదింపఁబడినదే .. ఉపనిషత్తులయందును గీతలయందును నున్న మాయావాదము ... ఉపనిషత్తులకంటె గీతలయందున్న విశేషము ... సాంఖ్యజ్ఞానము వేదాంతజ్ఞానము ననువానికి నేకవాక్యత ..వ్యక్తోపాసన, లేక భక్తిమార్గము,.. కాని కర్మయోగమార్గముయొక్క ప్రతిపాదనమునెడు విశేష మన్ని గ్రంథములకంటెను గీతలయందధికము ..గీతలయందున్న యింద్రియనిగ్రహార్థమై చెప్పఁబడినయోగము, పాతంజలయోగము, ఉపనిషత్తులును...(మూఁడవభాగము) గీతలయొక్కయు బ్రహ్మసూత్రములయొక్కయు ప్రాచీన-నవీన భావము...గీతలయందు బ్రహ్మసూత్రములు స్పష్టముగ నుల్లేఖింపఁబడుట... బ్రహ్మసూత్రములయందు గీత'స్మృతి'శబ్దముచే ననేకపర్యాయము లుల్లేఖింపఁబడుట... రెండు గ్రంథములకును గలపౌర్వాపర్యవిచారము... బ్రహ్మసూత్రములు ప్రస్తుతమందున్న గీతలకు సమకాలీనములై యుండవచ్చును... లేదా ప్రాచీనములైనవి... కాని పిదప రచింపఁబడినవి కావు... గీతలయందు బ్రహ్మసూత్రముల నుల్లేఖించుట ప్రబలమగు నొకకారణము ..(నాల్గవభాగము) భాగవతధర్మములయొక్క యుదయమును గీతలును....గీతలయందున్న భక్తిమార్గము వేదాంతము, సాంఖ్యమును, యోగమును సంబంధించియే యున్నవి. వేదాంతులమతానుసారముగ గీతలలో తర్వాత చేర్పఁబడినవి కావు ..వైదికధర్మములయొక్క యత్యంతమగు ప్రాచీనత్వము...కర్మప్రధానమైనది...తదనంతరము నజ్ఞానముయొక్కయు(అనఁగా: వేదాంతముయొక్కయు)సాంఖ్యవైరాగ్యములయొక్కయు

ప్రామాణ్యమైనది... వీనికి నేకవాక్యత చిరకాలమునందే చేయఁబడినది... పిమ్మట భక్తియొక్క యుద్భవమైనది... కాన భక్తికి పూర్వోక్తములగు మార్గములతో మొదటినుండియును నేకవాక్యత చేయుట యావశ్యకము... భాగవతధర్మములయొక్క ప్రాచీనతయు నిజమే!... గీతలయందున్న జ్ఞానకర్మసముచ్చయ ముపనిషత్తులలోనిదే... కాని భక్తిసంబంధముమాత్ర మధికముగ నున్నది... భాగవతధర్మములయందలి ప్రాచీనగ్రంథములు... గీతయు నారాయణీయోపాఖ్యానము... శ్రీకృష్ణునియొక్కయు సాత్త్వతములైన లేక భాగవతములయినధర్మములయొక్కయు నుదయకాల మొక్కటియే... బుద్ధునికి పూర్వము సుమారు నేడెనిమిదివందలసంవత్సరములు అనఁగా: క్రీస్తునకు పూర్వము పదునైదువందలసంవత్సరములకు పూర్వము... అని యంగీకరించుటకు కారణము... అట్లంగీకరింపనిచోఁ గలుగఁబోవు ననవస్థ.. భాగవతధర్మములయొక్క మూలస్వరూపము నైష్కర్మ్యపరము అనంతరము భక్తిపరమును... మూలభూతమగు గీత క్రీస్తునకంటె పూర్వమందు సుమారు తొమ్మిదివందలసంవత్సరముల క్రిందట బయలువెడలెను...(అయిదవభాగము) ప్రస్తుతమందున్న గీతల కాలము.... ప్రస్తుతమందున్న మహాభారతముయొక్కయు ప్రస్తుతమందున్న గీతలయొక్కయు కాల మొక్కటియే...వీనిలో ప్రస్తుతమందున్న మహాభారతము భాసునికంటెను నశ్వఘోషునికంటెను, నాశ్వలాయనునికంటెను, నలెగ్జాండరుకంటెను, మేష్టాదిగణనకంటెను నెన్నకనే యున్నది గాని బుద్ధుని యనంతరమున బయలువెడలినది... కాన సుమా రైదువందలశకవర్షములకంటె ప్రాచీనమైయున్నది... ప్రస్తుతమందున్న గీత కాళిదాసునికంటెను, బాణభట్టునికంటెను, భాసకవికంటెను, పురాణములకన్నను, బౌధాయనునికన్నను, బౌద్ధధర్మములయందున్న మహాయానపథముకన్నను ప్రాచీనమైనది. అనఁగా : శకవర్షములకంటె నయిదుస్సంవత్సరములు ప్రాచీనము...(ఆఱవభాగము) గీతయు బౌద్ధగ్రంథములును... గీతలయందున్న స్థితప్రజ్ఞునియొక్కయు బౌద్ధమతమునందలి యర్హతునియొక్కయు వర్ణనమునందలి సామ్యము, బౌద్ధధర్మముయొక్క స్వరూపమును తత్పూర్వమున నున్న బ్రాహ్మణధర్మములనుండి దానియుత్పత్తియు... ఉపనిషత్తులయందున్న యాత్మవాదమును వదలి కేవల నివృత్తిపరమగు నాచారములమాత్రమే బుద్ధుఁడు స్వీకరించినాఁడు... బౌద్ధమతానుసారముగ నీయాచారమునకు దృశ్యములగు కారణములు, లేక నాలుగు ఆర్యసత్యలు... బౌద్ధమగు గార్హస్థ్యధర్మమునకును వైదికమగు స్మార్తధర్మమునకును గలసామ్యము... ఈవిచార

మంతయు మూలవైదికధర్మములలోనిదియే... అయినను మహాభారతమును గీతయును నీవిషయమై వేఱుగ విచారించుటకు కారణము.. మూలభూతములును ననాత్మబోధకములును, నివృత్తిపరములును నధర్మములనుండియే వైదిక భక్తిపరములగు బౌద్ధధర్మములు బయలువెడలుట యసంభవము... మహాయాన పంథయొక్కయుత్పత్తి... దానియందలి ప్రవృత్తిపరమగు భక్తిధర్మము, గీతలయందుండియే గ్రహింపఁబడిన దని యంగీకరించుటకు కారణములు... మఱియు దానింబట్టి యేర్పడుగీతలయొక్క కాలనిర్ణయము ..(ఏడవభాగము) గీతలును, క్రైస్తవ బైబిలును ... క్రైస్తవధర్మములలోనుండి గీతలలోని కొన్నిసిద్ధాంతములు గ్రహించుట యసంభవము...యహూదీయధర్మములనుండి క్రైస్తవధర్మములు స్వతంత్రరీతిచే మెల్లమెల్లగ బయలువెడలినవి కావు. అది దేనినుండి యుద్భవించిన దనువిషయమై ప్రాచీనక్రైస్తవపండితులమతములు ..ఎసీన్ పంథయును గ్రీకుతత్త్వజ్ఞానమును... బౌద్ధధర్మములకు క్రైస్తవధర్మములతో నుండువిలక్షణ సామ్యములు...వీనిలో బౌద్ధధర్మములకు ప్రాచీనత్వము నిస్సంశయము . బౌద్ధయతులకు యహూదీయమతావలంబుల, దేశమునందు చిరకాలముక్రిందటనే ప్రవేశ మున్నది...కాన క్రైస్తవధర్మములయందున్న సిద్ధాంతములు బౌద్ధధర్మములనుండియె లేక గీతలనుండియె బయలుదేరినవి యని చెప్పుటకు పూర్ణముగా నవకాశము... దానినుండి సిద్ధముకాఁబోవు గీతలయొక్క ప్రాచీనత్వము నిస్సంశయముగ నున్నది... ... .... .... ....(పుట. ౫౭౮—౬౧౮)



# గీతారహస్యమునందలి సంక్షిప్తములగు చిహ్నముల వ్యాఖ్యానము; సంక్షిప్త చిహ్నములచే సూచింపఁబడిన గ్రంథముల విషయమై పరిచయమును.



**అథర్వ.** అథర్వవేదము. కాండము, సూక్తము, ఋక్కులు, అనుక్రమముచే సంఖ్య.

**అష్టా.** అష్టావక్రగీత. అధ్యాయము, శ్లోకమును. అష్టకర్, మఱియు సంఘము యొక్క గీతాసంగ్రహపుస్తకము.

**ఈశ.** ఈశావాస్యోపనిషత్తు. ఆనందాశ్రమములోఁ బ్రచురింపఁబడినది.

**ఋ.** ఋగ్వేదము. మండలము, సూక్తము, ఋక్.

**ఐ.** లేక **ఐ. ఉ.** ఐతరేయోపనిషత్తు. అధ్యాయమును, ఖండమును, శ్లోకములును. ఆనందాశ్రమము. సంస్కరణము.

**ఐ. బ్రా.** ఐతరేయబ్రాహ్మణము. పంచికయు, ఖండమును. డా. హౌగ్ యొక్క సంస్కరణము.

**క.** లేక **కఠ.** కఠోపనిషత్తు. వల్లియు, మంత్రమును. ఆనంద. సంస్క.

**కేన.** కేనోపనిషత్తు (=తలవకారోపనిషత్తు). ఖండమును, మంత్రమును. ఆనంద. సంస్క.

**కై.** కైవల్యోపనిషత్తు. ఖండమును, మంత్రమును. ౨౮ ఉపనిషత్తులు, నిర్ణయసాగరమున సంస్కరింపఁబడినది.

**కౌషీ.** కౌషీతక్యుపనిషత్తు, లేక కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తు. అధ్యాయమును, ఖండమును. కొన్నిచోట్ల నీయుపనిషత్తు యొక్క ప్రథమాధ్యాయమునే బ్రాహ్మణానుక్రమమున తృతీయాధ్యాయమని చెప్పుదురు. ఆనంద. సంస్క.

గా. తుకారాం బువాగారి 'గాథ.' దామోదరసాంబళారామసంస్కరణము.
సకె. ౧౮౨౨.

గీ. భగవద్గీత. అధ్యాయము, శ్లోకము. గీ. శాం. భా. గీతాశాంకరభాష్యము, గీ. రా. భా. గీతారామానుజభాష్యము. గీతలకును శాంకరభాష్యమునకును ఆనందాశ్రమములో ముద్రింపఁబడిన పుస్తకముచివర అకారాదిక్రమముగ శబ్దములసూచి యుండినందున దానికర్తకు నేను చాల కృతకృత్యుఁడను. రామానుజభాష్యము వేంకటేశ్వరసమాచారముద్రాలయమున ముద్రింపఁబడినది; మాధ్వభాష్యము కుంభకోణమునందున్న కృష్ణాచార్యులవారిచే ముద్రింపఁబడినది. ఆనందగిరియొక్క టీకయు పరమార్థప్రపయను వ్యాఖ్యానమును, జగద్ధితేచ్ఛుముద్రణాలయమునందు ముద్రింపఁబడినవి. శ్రీధరీటీకయు, వామనీ (మరాఠీవ్యాఖ్యానము) నిర్ణయసాగరమున ముద్రింపఁబడినది. పైశాచ్యభాష్యము. ఆనందాశ్రమములో ముద్రింపఁబడినది. వల్లభసంప్రదాయానుసారి యగుతత్త్వదీపిక గుజరాతీప్రింటింగ్ప్రెస్‌లో ముద్రింపఁబడినది. బొంబయిలో నున్న మహాభారతమునందు నీలకంఠీ యచ్చుపడినది. బ్రహ్మానంది మద్రపురిలో నచ్చుపడినది. ఈవ్యాఖ్యానములన్నియుఁ జూడఁబడినవి. కాని వీనిలో పైశాచ్యభాష్యమును, బ్రహ్మానందియు దక్క మిగిలిన వన్నియు నింబార్కసంప్రదాయముయొక్క టీకతోనున్నా ఇంకను కొన్నిటీకలతోనున్న కల్గని ౧౧ టీకలతో గుజరాతీ ప్రింటింగ్ప్రెస్సునందు ప్రస్తుతమునందె ముద్రించి ప్రకటించినందున యీయొకగ్రంథము చేతనే యన్నిపుస్తకములయుపయోగము గల్గును.

గీ. ర. లేక గీతా. ర. గీతారహస్యము. నాపుస్తకముయొక్క మొదటిభాగము.

ఛాం. ఛాందోగ్యోపనిషత్తు. అధ్యాయము, ఖండము, మంత్రము. ఆనంద. సంస్క.

జై. సూ. జైమినియొక్క మీమాంసాసూత్రములు. అధ్యాయము, పాదములు, సూత్రములు. కలకత్తాసంస్కరణము.

జ్ఞా. జ్ఞానేశ్వరీ అర్థసహితము. ఇందిరాముద్రాలయము. సంస్కరణము.

తుకా. గా. తుకారాంబువాగారి గాథ. పైన. గా. చూడు.

తై. లేక తై. ఉ. తైత్తిరీయోపనిషత్తు. వల్లి, అనువాకము, మంత్రము. ఆనంద. సంస్క.

తై. బ్రా. తైత్తిరీయబ్రాహ్మణము. కాండము, ప్రపాఠకము, అనువాకము, మంత్రమును. ఆనంద. సంస్క.

తై. సం. తైత్తిరీయసంహిత. కాండము, ప్రపాఠకము, అనువాకము, మంత్రమును.

దా. లేక. దాస. శ్రీసమర్థులవారిచే చేయఁబడిన దాసబోధము. ఛల్ల్యాసత్కార్యోత్తేజకసభయొక్క సంస్కరణము. చిత్రశాలాముద్రాలయమునం దచ్చుపడినది. కాందీయనువాద (?)

నా. పం. నారద పంచరాత్రములు. కలకత్తాసంస్కరణము.

నా. సూ. నారద సూత్రములు. బొంబయిసంస్కరణము.

నృసింహా. ఉ. నృసింహోత్తరతాపనీయోపనిషత్తు.

పాతంజల. సూ. పాతంజలయోగసూత్రములు. తుకారాంతాత్యాసంస్కరణములు.

పంచ. పంచదశీ. సటీకము. నిర్ణయసాగరసంస్కరణము.

ప్రశ్న. ప్రశ్నోపనిషత్తు. ప్రశ్నమును, మంత్రమును, ఆనం. సంస్కరణము.

బృ. లేక. బృహా. బృహదారణ్యకోపనిషత్తు. అధ్యాయము, బ్రాహ్మణము, మంత్రము. ఆనం. సంస్క. సామాన్యముగ కాణ్వపాఠము గ్రహింపఁబడినది. ఒకప్రదేశమునందుమాత్రము మాధ్యందినశాఖయొక్క పాఠము మాత్ర ముల్లేఖింపఁబడినది.

బ్ర. సూ. ముందున్న వేదాంతసూత్రము చూడు.

భాగ. శ్రీమద్భాగవతపురాణము. నిర్ణయసాగర సంస్కరణము.

భా. జ్యో. భారతీయ జ్యోతిశ్శాస్త్రము; కై. శంకరబాలకృష్ణదీక్షితకృతము.

మత్స్య. మత్స్యపురాణము. ఆనం. సంస్కరణము.

మను. మనుస్మృతి. అధ్యాయము, శ్లోకమును. డా. జాలీయొక్క సంస్కరణము. కాని మండలీకునియొక్క, లేక యింక మఱియొకరియొక్క సంస్కరణమునందు నీశ్లోకము లె తఱుచుగ నిచ్చోటనే కాన్పించును. మనుస్మృతిమీఁది టీక మండలీకుని సంస్కరణమునం దున్నది.*

మ. భా. ప్రక్కనున్న బ్రాకెట్టులోపల యున్నయక్షరములు వేర్వేఱుపర్వములను, అంకెలు అధ్యాయములకు శ్లోకములను సూచించునవి. బాబు ప్రతాపచంద్రరాయునిచే కలకత్తాలో ముద్రింపఁబడిన సంస్కృత ప్రతిని నేనిచ్చట నుపయోగించినాను. బొంబయిప్రతిలో నీశ్లోకములు చూచినయెడల యవి కొంచెము వెనుకముందుగ దొరుకును.

మి. ప్ర. మిళిందప్రశ్నము. పాళీగ్రంథము. ఇంగ్లీషుభాషాంతరము. S. B. E.

ముం. ముండకోపనిషత్తు. ముండకము, ఖండకము, మంత్రమును. ఆనంద. సంస్కృ.

మైత్రి. మైత్ర్యుపనిషత్తు, లేక మైత్రాయణ్యుపనిషత్తు. ప్రపాఠకమును, మంత్రమును. ఆనం. సంస్కృ.

యాజ్ఞ. యాజ్ఞవల్క్యస్మృతి. అధ్యాయమును, శ్లోకమును. బొంబయిప్రతి. దీనిపై అపరార్కునిటీకయు. (అనంద. సంస్కరణము) ఒకటి రెండు చోట్ల నుల్లేఖింపఁబడినది.

యో. లేక. యోగ. యోగవాసిష్ఠము. ప్రకరణము, సర్గ, శ్లోకము. ఆఱవ ప్రకరణమునకు పూర్వార్ధమునకు (పూ.) అనియు ఉత్తరార్ధమునకు (ఉ) అనియు రెండుభాగము లున్నవి. సటీకముగ నిర్ణయసాగరముద్రాలయములో సంస్కరింపఁబడినది.

రామ. పూ. రామపూర్వతాపిన్యుపనిషత్తు. ఆనంద. సంస్కృ.

వాజ. సం. వాజసనేయసంహిత. అధ్యాయము, మంత్రమును. వేబరనువాని సంస్కరణము.

వాల్మీకి. రా. లేక వా. రా. వాల్మీకిరామాయణము. కాండము, సర్గము, శ్లోకములు, బొంబయిసంస్కరణము.

విష్ణు. విష్ణుపురాణము. అంశము, అధ్యాయము, శ్లోకములు. బొంబయిసంస్కరణము.

వే. సూ. వేదాంతసూత్రములు లేక, బ్రహ్మసూత్రములు. అధ్యాయము, పాదము, సూత్రము. వే.సూ.శాం.భా. వేదాంతసూత్రములు—శాంకర

భాష్యము. ఆనందాశ్రమములో ముద్రింపఁబడినప్రతియే యంతట నుపయోగింపఁబడినది.

**శాం. సూ.** శాండిల్యసూత్రములు. బొంబయిలో సంస్కరింపఁబడినది.

**శివ.** శివగీత. అధ్యాయము, శ్లోకము. అష్టేకర్ సంఘముయొక్క గీతాసంగ్రహ సంస్కరణము.

**శ్వే.** శ్వేతాశ్వతరోపనిషత్తు. అధ్యాయము, మంత్రము. ఆనంద. సంస్కరణము.

S. B. E. Sacred Books of the East Series.

**సాం. కా.** సాంఖ్యకారిక. తుకారాంతాత్యాగారిచే సంస్కరింపఁబడినది.

**సూర్య. గీ.** సూర్యగీతా. అధ్యాయము, శ్లోకములు. మద్రపురిలో సంస్కరింపఁబడినది.

**హరి.** హరివంశము. పర్వము, అధ్యాయము, శ్లోకము. బొంబయిలో సంస్కరింపఁబడినది.

టిప్పణి. ఇవియేగాక యింకననేకములగు, సంస్కృతగ్రంథములు, ఆంగ్లగ్రంథములు, పాలీగ్రంథములును యాకడ నుల్లేఖింపఁబడినవి. కాని వాని పేర్లు తఱుచుగ నక్కడక్కడనే వ్రాయఁబడియుండుటచే, లేక తెలిసికొనుటకు వీలుగ నుండుటచే నవి పై పట్టికలో నుదాహరింపఁబడలేదు.



# గీతారహస్యములోని సామాన్యమగు అనుక్రమణిక.

---



---

శ్రీగణేశాయనమః.

ఓమ్ తత్సత్.

# శ్రీమద్భగవద్

# గీతారహస్యము

అను

# కర్మయోగశాస్త్రము

## ప్రథమప్రకరణము.



## ※ విషయప్రవేశము. ※

"* నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్."

శ్రీమహాభారతము, ప్రథమశ్లోకము.

శ్రీమద్భగవద్గీత యనునది మన క్షున్నధర్మగ్రంథములలో నత్యంత తేజోవంతమును నిర్మలము నగునొకరత్నముగా నున్నది. పిండబ్రహ్మాండజ్ఞానపూర్వకముగ గూఢమును పవిత్రము నగునాత్మవిద్యాతత్త్వమును సంగ్రహముగనే కాక నిస్సంశయముగ సైతము చెప్పుచు నాయాధారమున మనుష్యమాత్రులకుఁ దుర్య్యా

* నారాయణుని, నరులలోనుత్తముఁ డగునరుని, వేదవ్యాసుని, సరస్వతీదేవిని, నమస్కరించి తరువాత జయము (మహాభారతము)ను జదువవలయును. పూర్వము పరమాత్మయే నరనారాయణు లనునిద్దఱు మహర్షులుగ నవతరించెను.

నిజముగ. నాలోచించిన భగవంతున కక్కఱ యేదియు లేదు. అయినను భగవంతుఁడు సైతము మరలఁ జెప్ప నక్కఱ యనుటఁ జూడఁ గీతామహత్త్వ మెంత గొప్పదియో సుస్పష్ట మగును.

వైదికధర్మములలో వేఱువేఱుసంప్రదాయములకు వేదమువలె నీగ్రంథము సుమారు 2500 సంవత్సరములనుండి యెల్లవారలకు నేకరీతిగ మాన్యమును ప్రమాణము నగుటకు భగవంతుం డిట్లు చెప్పుటయే కారణము. కావుననే:—

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్."

"ఉపనిషత్తులన్నియు గోవులు; శ్రీకృష్ణభగవానుఁడు పాలుపితుకువాఁడు; బుద్ధిశాలి యగునర్జునుఁడు (ఆగోవులకుఁ జేఁపుఁదీయునట్టి) భోక్త యగువత్సము(లేఁగ, దూడ); (ఇట్టియపూర్వసామగ్రిఁ గూర్చి) పితుకఁ బడినక్షీరమే గీతామృతము,"

అని స్మృతులకాలములో నేర్పడినగ్రంథములోని గీతాధ్యానశ్లోక మలంకారయుక్తమైనను యథార్థముగనే చెప్పుచున్నది. హిందూస్థానములోని యన్ని ప్రాకృతభాషలలోను దీనికి వ్యాఖ్యానములును భాషాన్తరీకరణములును, నిరూపణలును జేయఁబడి యున్న వనుటలో నేమియు నాశ్చర్యము లేదు. ఇంతియ కాక పాశ్చాత్త్యులకు సంస్కృతమునఁ బ్రవేశముకలిగినపిదప గ్రీకు, లాటిన్, జర్మని, ఫ్రెంచి, ఇంగ్లీషు లోనగుభాషలలోనికిని, ఆభాషలలోనుండి సైత మితరభాషలలోనికిని దర్జుమా చేయఁబడుచునీయద్వితీయగ్రంథరాజ మిప్పటి కన్నిదేశములయందును బ్రసిద్ధిఁగాంచినది.

సర్వోపనిషత్సార మీగ్రంథమం దంతర్భూత మగుటయే కాక యీగ్రంథమునకు "శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్" అనునది సంపూర్ణనామమై యున్నది. గీతలలోఁ బ్రత్యధ్యాయాంతమునందును నధ్యాయసమాప్తిని సూచించుసంకల్పములో "ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే," ఇవి మొదలగుశబ్దము లున్నవి. ఈసంకల్పము మూలభారతములో లేకున్నను గీతాగ్రంథముయొక్క-పుస్తకములన్నింటిలో నియతముగ నుండుటవలన నియమపూర్వకమగు పారాయణమునకై భారతమునుండి గీతలను వేఱుపఱిచినది మొదలు (గీతలపై నేవ్యాఖ్యానముంబుట్టకమునుపటినుండియు) నీసంకల్పము ప్రచారములో నున్నదని యనుమానప్రమాణముచే నిశ్చయింపఁబడినది. ఈదృష్టిచే గీతాతాత్పర్యమును

నిశ్చయించుటవలన నీసంకల్పమున నేమిమహత్త్వ మున్నదియు ముందుఁ జెప్పఁబడును. మొట్టమొదట నీసంకల్పములోని "భగవద్గీతాసు – ఉపనిషత్సు" అను నీరెండుపదముల విచారించవలసియున్నది. 'ఉపనిషత్' అను నీశబ్దము మహారాష్ట్రాది భాషలలో నపుంసకమయినను సంస్కృతమున స్త్రీలింగమే; కావున "భగవంతునిచే గానముచేయఁబడిన (చెప్పఁబడిన) యుపనిషత్తు" అను నీయర్థమున 'భగవద్గీతా–ఉపనిషత్' అను విశేష్యవిశేషణభావము రెంటికింగుదిరినది. గ్రంథ మొక్కటియైనను గౌరవార్థమున బహువచనప్రయోగముల వాడుకలో నుండుటవలన 'శ్రీమద్భగవద్గీతాసు – ఉపనిషత్సు' అని సప్తమీబహువచనాంతప్రయోగము చేయఁబడినది. ఈకారణముననే యాచార్యులవారిభాష్యములోఁ గూడ 'ఇతి గీతాసు' అని బహువచన ప్రయోగము చేయఁబడినది. ఐనను సంగ్రహముగఁ జెప్పునప్పు డాదరార్థక బహువచనమును, శ్రీమదిత్యాదిపదమును జివర నున్న జాతివాచకసామాన్యశబ్దమగు నుపనిషచ్ఛబ్దమును దీసివైచి కేన, కఠ, ఛాందోగ్యాదిసంక్షిప్తనామములవలె 'శ్రీమద్భగవద్గీతా – ఉపనిషత్' అను ప్రథమైకవచనాంతద్వయమును, మొదట 'భగవద్గీతా' అనియు, రానురాను, 'గీతా' అనియు నతిసంగ్రహముగ వాడఁబడినది. ఉపనిషచ్ఛబ్దము మొదటినామములో లేనియెడల, భారతం, భాగవతం, గోపీగీతం, ఇత్యాదిశబ్దములవలె నీగ్రంథనామము భగవద్గీత మని యేనియు గీత మని యేనియు నపుంసకలింగముగనే ప్రయోగింపఁబడి యుండును. అట్లు గాక భగవద్గీత యనియు, గీతయనియు స్త్రీలింగరూపప్రయోగమే యంతటఁ గానఁబడుచుండుటవలన నుపనిషచ్ఛబ్ద మెల్లపు డధ్యాహార్య మని తెలియ నగును. అర్జునమిశ్రవిరచితమగు నను గీతావ్యాఖ్యానమునను, గీతాశబ్దమునకు నిట్లే యర్థము చెప్పఁబడినది.

ఐనను గీతాశబ్ద మేడువందలశ్లోకముల భగవద్గీతను మాత్రమె చెప్పక రూఢ్యర్థమువలన నితరము లగు ననేకజ్ఞానబోధకగ్రంథముల సైతము చెప్పుచున్నది. మహాభారతమున శాంతిపర్వాంతర్గతమోక్షధర్మపర్వములోని కొన్నిచిన్నప్రకరణములకు, పింగళగీత, శంపాకగీత, మంకిగీత, బోధ్యగీత, విచఖ్యుగీత, హారీతగీత, వృత్రగీత, పరాశరగీత, హంసగీత, లోనగునామము లుండుటయు, నశ్వమేధపర్వములోని యనుగీతలో నొకభాగమునకు బ్రహ్మగీత యని వేఱుగ విశిష్టనామ ముండుటయు, నిందుకుఁ దార్కాణము. ఇంతియ కాక, అవధూతగీత, అష్టావక్రగీత, ఈశ్వరగీత, ఉత్తరగీత, కపిలగీత, గణేశగీత, దేవీగీత, పాండవగీత, బ్రహ్మగీత, భిక్షుగీత, యమగీత, రామగీత, వ్యాసగీత, శివగీత, సూతగీత, సూర్యగీత మున్నగు ననేకగీతలు

సుప్రసిద్ధములుగ నున్నవి. వీనిలోఁ గొన్ని స్వతంత్రరీతిగ నిరూపింపఁబడినవియు, మఱికొన్ని వేర్వేఱు పురాణములలో నిమిడియున్నవి. ఎట్లన:— గణేశగీత గణేశపురాణముచివరఁ గ్రీడాఖండము ౧౩౮, ౧౪౮ యధ్యాయములలో నున్నది. అది కొంచెము శబ్దభేదముగ భగవద్గీతకు సరి యగు ప్రతిబింబ (ద్వితీయరూప) మనుట యేమియు బాధకము గాదు. ఈశ్వరగీత కూర్మపురాణోత్తరభాగమున మొదటిపదునొకండధ్యాయములలో నున్నది. తర్వాతి యధ్యాయములలో వ్యాసగీత యారబ్ధమైనది. మఱియు స్కాందపురాణాంతర్గతసూతసంహితఁ జతుర్థప్రకరణ మగుయజ్ఞవైభవఖండములో నుపరిభాగమునఁ బ్రథమాధ్యాయము మొదలు పండ్రెండవయధ్యాయమువఱకు బ్రహ్మగీతయు, తరువాతి యెనిమిది యధ్యాయములలో సూతగీతయు నున్నవి. స్కాందపురాణములోని యీబ్రహ్మగీతకన్న వేఱగు మఱియొక బ్రహ్మగీత యోగవాసిష్ఠమున నిర్వాణప్రకరణమున నుత్తరార్ధములో ౧౭౩ వ సర్గ మొదలు ౧౮౧ వ సర్గవఱకు నున్నది. యమగీత మూఁడువిధములుగ నున్నది. అందు, మొదటిది విష్ణుపురాణము తృతీయాంశమున నేడవయధ్యాయమునను, రెండవది యగ్నిపురాణమునఁ దృతీయఖండములో ౩౮౧ వ యధ్యాయమునను, మూఁడవది నృసింహపురాణమున నెనిమిదియవయధ్యాయమున నున్నది. రామగీతసంగతియు నిట్లే యున్నది. మావైపునఁ బ్రచారములో నున్న రామగీత యధ్యాత్మరామాయణమున నుత్తరకాండములో నయిదవసర్గలో నున్నది. ఈయధ్యాత్మరామాయణము బ్రహ్మాండపురాణములో నొకభాగముగ నంగీకరింపఁబడు చున్నది. ఇంతియకాక రెండవరామగీత చెన్నపురి ప్రాంతమున ప్రసిద్ధమగు 'గురుజ్ఞానవాసిష్ఠ-తత్త్వసారాయణ' నామకగ్రంథమం దున్నది. ఈగ్రంథము వేదాంతసంబద్ధమై జ్ఞాన, ఉపాసన, కర్మ లనుమూఁడుకాండములతోఁ గూడి యున్నది. పైగ్రంథములో నుపాసనాకాండద్వితీయపాదములోని మొదటిపదునెనిమిది యధ్యాయములలో రామగీత యున్నది. మఱియు మూఁడవదియగు కర్మకాండయొక్క తృతీయపాదములోని మొదటియైదధ్యాయములలో సూర్యగీత యున్నది. శివగీత పద్మపురాణములోఁ బాతాళఖండములో నున్న దని చెప్పుదురు; కాని పునహాలో నానందాశ్రమముద్రాశాలాముద్రిత మగుపద్మపురాణములో శివగీత కానరాదు. పండిత జ్వాలాప్రసాదుగారు తమయష్టాదశపురాణదర్శన మనుగ్రంథమున గౌడీయపద్మోత్తరపురాణమున శివగీత యున్న దని చెప్పిరి. నారదపురాణములో నితరపురాణములకువలెఁ బద్మపురాణమునకుఁ జెప్పబడినవిషయానుక్రమణికలో శివగీత పే[illegible]

బడియున్నది. ఇంతియకాక శ్రీ[illegible]తపురాణములో నేకాదశస్కంధమునం బను మూఁడవయధ్యాయమున హంసగీతయు నిరువదిమూఁడవయధ్యాయమున భిక్షుగీతయు నున్నవి. మూఁడవస్కంధములోని కాపిలేయోపాఖ్యానమును (౨౩-౩౩) 'కపిలగీత'యని యనేకులు వ్యవహరించుచున్నారు; కాని 'కపిలగీత'యని ప్రత్యేకముగ ముద్రిత మైనస్వతంత్రగ్రంథము మాయొద్ద నున్నది. ఈకపిలగీత హఠయోగప్రధాన మైనది. ఇది పద్మపురాణాంతర్గత మని దానియందే వ్రాయఁబడియున్నది. కాని యిది పద్మపురాణమున దొరకమియ కాక యిందొకచోట (౪-౭) జైన, జంగమ(లింగాయితు), సూఫీల (ముసల్మానుసాధువుల) యుల్లేఖ ముండుటచేఁ దురుష్కసామ్రాజ్యకాలమున మీఁగీత వ్రాయఁబడియుండునని చెప్పవలసియున్నది. భాగవతపురాణమునంబోలె దేవీభాగవతమునను నేడవస్కంధమున ౩౧ వ యధ్యాయము మొదలు ౪౦ వ యధ్యాయమువఱకు నొకగీత యున్నది. దీనిని దేవి చెప్పుటచే 'దేవీగీత'యని యందురు. ఇంతియకాక భగవద్గీతాసారమే యగ్నిపురాణతృతీయఖండమున ౩౮౦ వ యధ్యాయమునను, గరుడపురాణపూర్వఖండమున ౨౪౨ వ యధ్యాయమునను గలదు. అటులే యోగవాసిష్ఠ మనుగ్రంథము రామావతారమున వసిష్ఠునిచే రామున కుపదేశింపఁబడినదని చెప్పఁబడినను, ఈపురాణమున నే యర్జునోపాఖ్యాన మనుపేరఁ గృష్ణావతారమున భగవంతునిచే నర్జునునకుఁ జెప్పబడిన భగవద్గీతాసారము భగవంతుఁ డర్జునునకుపదేశించినయనేకశ్లోకములయానుపూర్వితోఁ గూడ నిర్వాణప్రకరణమున సువిపులమైగ నున్నది. (యోగ. ౬. పూ. సర్గ. ౫౨-౫౮.) పూనాలో నచ్చుపడినపద్మపురాణములో శివగీత లే దని యిదివఱకే చెప్పియున్నాము; కాని శివగీత లేక పోయినను, ఈగ్రంథముయొక్క 'యుత్తరఖండములో' అ. ౧౭౧ మొదలు ౧౮౮ వఱకు భగవద్గీతామాహాత్మ్యము వర్ణింపఁబడియుండుటయే కాక భగవద్గీతలలోనియొక్కొకయధ్యాయములోని మాహాత్మ్యమును గుఱించి యొక్కొకయధ్యాయము రచింపఁబడియున్నది. దానిలో సంబంధమైనకథ సూచింపఁబడియున్నది. ఇదియునుగాక వరాహపురాణములో నొక గీతామాహాత్మ్యము గలదు. శైవపురాణముననో వాయుపురాణముననో మూఁడవవిధ మగుమఱియొకగీతామాహాత్మ్యము గల దని చెప్పుదురు; గాని కలకత్తాలో ముద్రిత మైనవాయుపురాణములో నది కానరాదు. గీతాధ్యాన మనునొకనవశ్లోకీప్రకరణము భగవద్గీతయొక్క ముద్రితపుస్తకముల నారంభము ననే యున్నది. ఈ నవశ్లోకి యెచ్చటనుండి గ్రహింపఁబడినదో తెలియదు; కానియీశ్లోకములలో "భీష్మ

ద్రోణతటా జయద్రథజలా" అనుశ్లోక మిం చుక శబ్దభేదముగా నర్వాచీనకాలమున బ్రసిద్ధుఁ డగుభాసకవిచే విరచిత మైన 'ఊరుభంగ' నామనాటకారంభమున వ్రాయఁబడినది. కావుననే యీధ్యానశ్లోకమునకుఁ దఱచుగా భాసకవికాలానంతరమునఁ బ్రచారము గలిగినట్లున్నది. కాని మేమనఁ బ్రసిద్ధకవీశ్వరుఁ డగుభాసుఁ డీశ్లోకమును గీతాధ్యానములోనుండి గ్రహించి యుండు ననుట కన్న గీతాధ్యానమే వేర్వేఱుగ్రంథములలోని శ్లోకములఁ దీసి కొంచెము మార్చి నవీనముగ వ్రాయఁబడిన దనుట యుక్తియుక్తముగ నుండును. భాసకవి కాళిదాసుకన్నఁ బూర్వకాలికుఁ డగుటచే నెంతతగ్గించినను శకాబ్దములకు మున్నూఱు కంటె నధికముగా నవీనుఁ డని చెప్పుటకు వలనుపడదు. *

పైఁజెప్పఁబడిన సంగతులఁబట్టి భగవద్గీతల కే వేవియో యెన్నెన్నియో వ్యాఖ్యానములును, భాషాంతరీకరణములును, కొంతమార్పు గలయితరగ్రంథములును, దాత్పర్యములును, మాహాత్మ్యములును, పురాణములలోనుండి వెలువడినట్లు స్పష్టమగుచున్నది. అవధూతగీత, యష్టావక్రగీత మొదలగుకొన్నిగీత లేపురాణమున నున్నవో తెలియకున్నను, పురాణమున లేకయే యున్నను నట్టిస్వతంత్రగ్రంథము లేకాలమున నెవరు రచించి రనునదియుఁ దెలియఁబడుట లేదు. అయినను నీసమస్తగీతలరచనాప్రకారమును, వానిలోనివిషయవిభాగప్రకారమును జూడ నీగ్రంథములు భగవద్గీత సుప్రసిద్ధ మైనతర్వాతను, దానిలోకపూజ్యతం గనుగొనిన తర్వాతను రచింపఁబడినట్లు కన్పట్టుచున్నది. పేరేల? భగవద్గీతంబోలు నొకగీత లేవు విశిష్టమార్గమునను బురాణములను లేనిచో నామార్గమునకుఁ బూర్ణత్వము రానేరదని తలఁచిరేమో యీభిన్నభిన్నగీతలు రచించియుందు రని చెప్పినను బాగుగ నుండును. భగవద్గీతలలో భగవంతుఁ డర్జునున కేరీతి విశ్వరూపముఁ జూపి జ్ఞానమును బోధించెనో యావిధముననే శివగీత, దేవీగీత, గణేశగీతలలోను వర్ణన మున్నది. మఱియు శివగీత, యీశ్వరగీత మొదలగు కొన్నిగీతలలో భగవద్గీతలలోని కొన్నిశ్లోకము లేమియు మార్పకయే వ్రాయఁబడియున్నవి. జ్ఞానదృష్టిచేఁ జూచినను భగవద్గీతలలోకన్న నీగీతలలో నేమియు విశేషము లేమియే కాక యధ్యాత్మజ్ఞానముఁ గర్మయు ననునీరెంటిసంబంధములను జెప్పుటలోఁ గూడ భగవద్గీతల యపూర్వశైలి వీనిలో నేగీతలోను స్వచ్ఛముగఁ గనఁబడదు. భగవద్గీతలలో పాతం

* పైనఁ జెప్పినగీతలలో నధికభాగమును నింక ననేకగీతలను (భగవద్గీతతోఁ గూడ) రా. రా. హరిరఘునాథభాగవతులనువారు పూనాలో ముద్రింపించి ప్రచురించుచున్నారు.

జలయోగ మేనియు, హఠయోగ మేనియుఁ, గర్మత్యాగరూపసన్న్యాస మేనియుఁ
గావలసినంతవిస్పష్టముగఁ జర్చింపఁబడ లే దని కొంతమంది కైనను తోఁచియునికిం జేసి
కృష్ణార్జునసంవాదరూప మగు భగవద్గీతకుఁ బూరణమను పేర నుత్తరగీత వెనుక
రచింపఁబడినది. మఱియు నవధూతగీత, యష్టావక్రగీత మొదలగు కొన్ని గీతలు
కేవల వేదాంతమునే (అనఁగా సన్న్యాసమార్గమునే) ప్రతిపాదించు చున్నవి.
యమగీత, పాండవగీత, మొదలగు కొన్ని రెండవతరగతిగీతలు స్తోత్రములవలె
మిక్కిలి సంక్షిప్తములుగను, భక్తిపరములుగను నున్నవి. శివగీత, గణేశగీత, సూర్య
గీత లట్లుగాక, సయుక్తికముగ జ్ఞానకర్మల సమర్థించిన వనుట నిజమే. అయినను
వానిలోని ప్రతిపాదనప్రకారము తఱచుగ భగవద్గీతనుండియే గ్రహింపఁబడుట
వలన వానిలోఁ గ్రొత్తవిషయ మేమియుఁ గనఁబడదు. కావుననే ప్రగల్భమును
వ్యాపకమునగు భగవద్గీతా తేజముముందఱఁ దర్వాత వ్రాయఁబడిన పౌరాణికము
లగు చిన్నచిన్న గీతలవ్యాప్తి లేకపోవుటే కాక యీ ప్రతిబింబములుగా నున్న గీతలు
చిట్టచివరకు విశేషముగ భగవద్గీతామహత్త్వమునే యధికముగను స్పష్టముగను
స్థాపించుచున్నవి. మఱియు 'గీతా' అనునీశబ్దమునకు 'భగవద్గీత' యనునర్థమే ప్రధాన
ముగ రూఢ మైనది. అధ్యాత్మరామాయణమును, యోగవాసిష్ఠమును విస్తృ
తము లైనను భగవద్గీతకన్న నవీనము లనుసంగతి వానిరచనవలననే స్పష్టమగుచు
న్నది. చెన్నపురిప్రాంతమున ముద్రిత మైనగురుజ్ఞానవాసిష్ఠ (తత్త్వసారాయణ
గ్రంథ) మతిప్రాచీనమని యనేకులుచెప్పుదురు; కాని, మాకో మాత్ర మట్లు
తోఁపలేదు. ఏలయన : ఆగ్రంథములో నష్టోత్తరశతోపనిషత్తులుఁ బేర్కొనఁబడి
యుండుటచే నవియన్నియుఁ బ్రాచీనములే యని యొప్పుకొనుటకు సాధ్యము
కాదు. మఱియు సూర్యగీతఁ జూచినచో నందు విశిష్టాద్వైతవర్ణనము కనఁబడు
చున్నది. (౩. ౩౦) కొన్నికొన్నిస్థలముల భగవద్గీతనుండియే కోటిక్రమము (పూర్వ
పక్షసిద్ధాంతములరీతి) గ్రహింపఁబడినట్లు కనఁబడుచున్నది. (౧. ౬౮) కావుననే
యీగ్రంథముకూడ, పిమ్మట, వేయేల? శ్రీశంకరాచార్యులవారియనంతరము
వ్రాయఁబడి యుండు ననుట యుక్తమని తోఁచుచున్నది.

ఈ అనేకగీత లున్నను భగవద్గీతశ్రేష్ఠత్వము పైనఁ జెప్పఁబడినకారణమువలన
నిర్వివాద మగుటం జేసి యితరగీతల లక్ష్యముసేయక భగవద్గీతను బరిశీలించుచు
దానితాత్పర్యమును తమధర్మబంధువులకుఁ జెప్పిననే తమజన్మకుసాఫల్యము సంభ
వించు నని యర్వాచీనులగు వైదికధర్మబోధకులు నగుపండితులు తలంచుచు
వచ్చిరి.

గ్రంథవిమర్శనము రెండువిధములుగ నుండును. అవి (1) అంతరంగపరీక్ష, (2) బహిరంగపరీక్షయనునవి; గ్రంథమును సమగ్రముగఁ బరిశీలించి యందలి మర్మమును, రహస్యమును, మథితార్థమును, లేక, ప్రమేయమును జెల్లముగ వెల్లడించుటకే యంతరంగపరీక్ష యని పేరు. ఎవ్వఁ డేకాలమున నెచ్చో గ్రంథమును రచించె ననియు, నాగ్రంథరచనాశైలి (భాష)యెట్లున్నది యనియుఁ, గావ్యదృష్టిచే నందు మాధుర్యమైనను బ్రసాదమైన నెంత యున్న దనియు, గ్రంథములోని శబ్దరచన వ్యాకరణసమ్మతముగ నున్నదియు, లేనిదియు, దానిలో నేవేని ప్రాచీన ప్రయోగము (ఆర్షము)లున్నవియు, లేనిదియు, నేయేమతములయొక్కగాని, వ్యక్తులయొక్కగాని నిరూపణలు కలవో లేవో యనియు, అందుండి గ్రంథకాలనిర్ణయమును జేయుటనుగుఱించి యైనను, ఆకాలమందలిసమాజస్థితినిగుఱించి యైనను తెలిసికొన సాధనము లున్నవియు, లేనిదియు, గ్రంథములోనివిచారము స్వతంత్రమైనదియుఁ, గానిదియు, నితరగ్రంథములనుండి తీసి వ్రాయఁబడెనేని యెచ్చట నుండి యేవిషయ మనునవి మొదలగుబాహ్యాంగములవివేచనకు బహిరంగపరీక్ష యని పేరు. గీతలమీఁద భాష్యములను గాని వ్యాఖ్యానములను గాని చేసినప్రాచీన పండితులు బహిరంగపరీక్షపై నేమియు దృష్టి వేయలేదు; ఏలయన: భగవద్గీత యను నలౌకికగ్రంథమును బరీక్షించుచు బాహ్యాంగపరీక్షఁ జేయుట వారి యభిప్రాయమును బట్టి చూడ నేదే నొకయుత్తమపుష్పము కనఁబడినపు డాపుష్పపు సువాసనయు, వన్నెయు, సౌందర్యము ననువిషయములయం దుత్సాహము వదలి దానివెడల్పును బొడవును గొలుచుటవలెను, తేనెలో నిండినతేనెతెట్టె దొరకి నపుడు దానిరంధ్రములపరీక్షకుఁ గాల మంతయుఁ గడపునట్లును వ్యర్థ మని తోఁచియే యని తోఁచుచున్నది; కాని పాశ్చాత్యపండితులవలె నిటీవలిపండితులు గీతయొక్క బాహ్యాంగములంగూడ విశేషముగనే పరీక్షించు చున్నారు. ఒక పండితుఁడు గీతలలోని యార్షప్రయోగముల నన్నింటి లెక్కించి చూచి యీ గ్రంథము యేసుక్రీస్తుజన్మకంటెఁ గొన్నిశతాబ్దము లేనియుఁ బిమ్మట వ్రాయఁబడి యుండు నని నిర్ణయించెను. దీనివలన గీతలలోనిభక్తిమార్గము తదుత్తరకాలమున వ్రాయఁబడి ప్రచారములోనున్న క్రైస్తవధర్మమునుండి గ్రహింపఁబడియుండు ననువారియూహ నిష్ప్రమాణ మని తేలుచున్నది. మఱియొకపండితుఁడు పదు నాఱవయధ్యాయమున నిరూపింపఁబడిననాస్తికధర్మప్రకరణమును జూచి యీ ధర్మములు తఱుచుగ బౌద్ధమతసంబద్ధములు గాన బుద్ధునియనంతరము బౌద్ధ మతమునుండి గ్రహించి వ్రాయఁబడియుండు నని యూహించెను. మఱియొక

పండితుఁడు పదుమూఁడవ యధ్యాయములోని "బ్రహ్మసూత్రపదైశ్చైవ" అనుశ్లోకములో బ్రహ్మసూత్రములనిరూపణ యుండుటచే బ్రహ్మసూత్రానంతరము గీత వ్రాయఁబడియుండు ననియెను; కాని యీయంశమునకు విరుద్ధముగఁ బ్రహ్మసూత్రములలోఁ గొన్నికొన్నిచోట్ల గీతనే యాధారముగఁ జేసికొనిన విషయము నిర్ణయింపఁబడుటచే గీతలు బ్రహ్మసూత్రములతర్వాత వ్రాయఁబడిన వని చెప్పుటకు సాధ్యము కాదని యనేకు లనుచున్నారు. మఱికొందఱు యుద్ధభూమిలో శస్త్రసంపాతసమయమున నేడువందలశ్లోకములు గలగీతఁ జెప్పనవకాశ ముండదనియు, నిసమయమం దతిత్వరఁగాఁ బాతికపాలో పరకపాలో ముఖ్యము లైనశ్లోకము లర్జునున కుపదేశింపఁబడి యుండు ననియు, వానినే విస్తరించికొనుచు సంజయుఁడు ధృతరాష్ట్రునకును, వ్యాసుఁడు శుకునకును, వైశంపాయనుఁడు జనమేజయునకు, ననంతరము సూతుఁడు శౌనకునకును జెప్పుచు రాఁగాఁ జివరకు మూలభారతమును రచించినవారిచేత యీగీత లింతవిస్తృతముగ వ్రాయఁబడియుండు ననియుఁ జెప్పుదురు. గీతలరచనావిషయమై యిట్టినిశ్చయము లోకులకు బాగుగఁ గలిగినపిదప గీతాసాగరమున మునిఁగి యీఁతలు కొట్టి కొందఱు గీత సప్తశ్లోకి † యనియు కొంద ఱష్టావింశశ్లోకి యనియు, షట్త్రింశశ్లోకి యనియు, మఱికొందఱు శతశ్లోకి యనియు నిట్లు గీతలమూలభూతశ్లోకముల వెదకి వెదకి తీసిరి. చిట్టచివర కనేకులు రణభూమియందు గీతలలోని బ్రహ్మజ్ఞాన మర్జునున కుపదేశించుట కేమియు ఫలము లేనందున వేదాంతార్థప్రతిపాదకం బగునీయుత్తమగ్రంథమును తర్వాత నెవరో భారతములో నిఱికించి నారని తలంచిరి. బహిరంగపరీక్షాసంబంధములగు నీప్రశ్నలు బొత్తిగ నిరర్థకములు గావు. ఉదాహరణమునకు వెనుకఁ జెప్పఁబడిన, ౧. పుష్పము రేకుల గొలుచుటయు, ౨. తేనెతెట్టె రంధ్రముల లెక్కించుటయు గ్రహింపుము. వృక్షముల ప్రభేదములఁ బరీక్షించునపుడు పుష్పపరిమాణా

---

† ఇప్పుడు సప్తశ్లోకీగీతను ప్రచురించి యున్నారు. దానిలో ౧. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" (గీ. ౮. ౧౩); ౨. "స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా." (గీ.౧౧.౩౬); ౩. "సర్వతః పాణిపాదం తత్" (గీ.౧౩.౧౩); ౪. "కవిం పురాణ మనుశాసితారం" (గీ. ౮. ౯); ౫. "ఊర్ధ్వమూల మధశ్శాఖం" (గీ. ౧౫. ౧); ౬. "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" (గీ.౧౫.౧౫); ౭. "మన్మనా భవ మద్భక్తః" (గీ. ౧౮. ౬౫); అనుశ్లోకములు మాత్ర మున్నవి. ఇట్లు భగవద్గీత కనేకములగు సంగ్రహగ్రంథములు వ్రాయఁబడినవి.

ములు కూడ పరీక్షణములోఁ జాల నుపయోగకరములు *. కావున నిట్టియుపయోగమున దృష్టి యుంచి నే నీగ్రంథరాజముయొక్క బహిరంగపరీక్షాంతర్గత మగు మహత్త్వమును బ్రతిపాదించుటకై యీగ్రంథపరిశిష్టప్రకరణమునఁ గొంతవిచారణముఁ జేసి యున్నాను; కాని గ్రంథరహస్యము సంపూర్ణముగఁ దెలిసికొనఁ దలఁచినవారికి మాత్ర మీబాహ్యాంగపరీక్షలో విశేష ముపయోగకర మగుసంగతి యేమియు లేదు. వాగ్దేవీరహస్యము దెలిసికొన్నవారికిని నామెబాహ్యసేవ చేయువారికిని నుండుభేదముం జూప, మురారినాటకకవీశ్వరుఁ డొకసరస మైన దృష్టాంతము రచించియున్నాఁడు. అదేమన:—

శ్లో. "అబ్ధి ర్లంఘిత ఏవ వానరభటైః కిం త్వస్య గంభీరతా,
మాపాతాళనిమగ్నపీవరతను ర్జానాతి మంథాచలః."

"అగాధ మగుసముద్రప్రదేశ మెక్కడ నున్నదియు నెంత లోఁతున్నదియు విచారింపవలసిన నెవరి విచారింపవలయును? రామరావణయుద్ధప్రసంగమున గొప్పగొప్పవారుగ నెన్నఁబడి గబగబ తరంగముల దాఁటి లంకలోనికి వెళ్ళినచపల వానరవీరులనా? అగాధ మగుసముద్రప్రదేశము వారి కెట్లు తెలియును? సముద్రమథనసమయమునఁ గవ్వముగఁ జేసి దేవత లేపర్వతమును సముద్రముయొక్క యట్టడుగునకును వదలిరో యాపర్వతమునకే గూడా శరీర మంతయు మునుఁగుటం జేసి నిజ మైనలోఁతు తెలియును," అని మురారికవిచేఁ జెప్పఁబడిన యీన్యాయము ననుసరించి గీతారహస్యమును దెలిసికొన ననేకులగు పండితులచేతను నాచార్యులచేతను మథింపఁబడినయీగ్రంథముపై మనము సంపూర్ణదృష్టి నుంచవలయును. ఈపండితులలో మహాభారతకారుఁడే యగ్రగణ్యుఁడు. వేయేల? ప్రస్తుతగీతల కాయన యొకవిధ మగుకర్త యనినను దప్పు లేదు. కావున మహా

* తేనెతెట్టెయందు తేనెపరిమాణము తక్కువ గాకుండునట్లును, తేనెకు వెలుపల నావరణముగ నుండుమైనము మిక్కిలి తక్కువగా నుండునట్లును తేనెటీఁగలు రంధ్రములఁ జేయును. (అనఁగా మైనముయొక్క తూనికయు వదియుండు ప్రదేశముయొక్క కొలఁతయు పృష్ఠఫలప్రమాణముగ నుండునట్లును జేయును. (౬-కి, ఘనఫలము ౬×౬×౬=౨౧౬. అదే ౬-కి పృష్ఠఫలము ౨౧౬) కావున గణితముచే నారంధ్రములఁ బరీక్షించుటవలన నైతము తేనెటీఁగలకు పుట్టుకతోనే కలిగిన యీగణితచాతుర్యమున్ను తెలిసికొనుట కుపయోగించును.

భారతకారునిమతానుసారముగ గీతలోని తాత్పర్యమును ముందు సంక్షేపముగఁ
జెప్పెదను.

"భగవద్గీత", లేక, "భగవంతునిచే గానము చేయఁబడిన యుపనిషత్తు" అను పేరునుబట్టియే గీతలలో నర్జును నుద్దేశించి చేయఁబడినయుపదేశము ప్రధానముగ భాగవత (అనఁగా, భగవంతునిచేఁ బ్రవర్తింపఁజేయఁబడినధర్మ) మని కనఁబడుచున్నది. ఏలయన: శ్రీకృష్ణునకు "భగవాన్" అనుపేరు సాధారణముగ భాగవతధర్మములలోఁ బ్రచారము గలిగియున్నది. ఈయుపదేశము క్రొత్తది కాదు. భగవంతుఁడు పూర్వ మీయుపదేశము నే వివస్వంతునకును, వివస్వంతుఁడు మనువునకును, మను విక్ష్వాకునకును, జేసినట్లు గీతలలోఁ జతుర్థాధ్యాయారంభమున నున్నది. (౪. ౧-౩) మహాభారతములో శాంతిపర్వముచివర "నారాయణీయధర్మములయొక్క, లేక, భాగవతధర్మములయొక్క సవిస్తరనిరూపణములో బ్రహ్మదేవుని వేర్వేఱుజన్మములలో (కల్పాంతరములయందు) భాగవతధర్మములపరంపర యెట్లున్నదియు వర్ణింపఁబడినది. తుదకు బ్రహ్మదేవుని ప్రస్తుతజన్మములో (త్రేతాయుగమునందు)

శ్లో. "త్రేతాయుగాదౌ చ తతో వివస్వాన్ మనవే దదౌ,
మనుశ్చ లోకభృత్యర్థం సుతా యేక్ష్వాకవే దదౌ.
ఇక్ష్వాకుణా చ కథితో వ్యాప్య లోకా నవస్థితః."

అని యీభాగవతధర్మము వివస్వంతుఁడు, మనువు, ఇక్ష్వాకువు, ననువారలకుఁ బారంపర్యముగఁ బ్రసరించిన దని యున్నది. (చూ. మ. భా. శాం. ౩౪౮. ౫౧-౫౨.) ఈరెండుపరంపరలు పరస్పరము సంబంధించి యున్నవి. (గీత. ౪. ౧. మీఁద నావ్యాఖ్యానము చూడుము) మఱియు వేర్వేఱైనయీరెండుధర్మముల పరంపరయు నొకటియే యైనందున గీతార్థమును భాగవతధర్మమును నొకటియై యుండవలయు నని యీపరంపరైక్యమును బట్టియు నూహింపఁదగు; కాని యీ విషయము కేవలము అనుమితి (ఊహ)చే లభ్యమే కాదు. కారణ మేమన:— నారాయణీయధర్మములయొక్క, లేక, భాగవతధర్మములయొక్క నిరూపణము గల భారతముననే:—

శ్లో. "ఏవ మేష మహాన్ ధర్మః స తే పూర్వం నృపోత్తమ,
కథితో హరిగీతాసు సమాసవిధికల్పితః."

"రాజోత్తమా! జనమేజయా! ఇదియే గొప్పభాగవతధర్మము; ఇది విధి సహితముగను సంక్షేపముగను హరిగీతలయందు (భగవద్గీతలయందు) పూర్వము నీకుఁ జెప్పఁబడినది." (మ. భా. శాం. ౩౪౬. ౧౦.) అని వైశంపాయనులు జనమేజయునకు గీతాతాత్పర్యమును వర్ణించిరి. ఇంతియకాక యందే యొకయధ్యాయము వదలఁగఁ దదనంతరాధ్యాయమున:—

శ్లో. "సముపోఢేష్వనీకేషు కురుపాండవయోర్మృధే,
అర్జునే విమనస్కే చ గీతా భగవతా స్వయమ్."
(మ. భా. శాం. ౩౪౮-౮.)

"కౌరవపాండవులయుద్ధమం దుభయసేనలును యుద్ధమునకు సిద్ధమై యుండఁగా నర్జునుఁడు విమనస్కుఁడు కాఁగా (దిగులుపడఁగా) నతనికి భగవానుఁడు గీతను స్వయముగాఁ జెప్పె"నని నారాయణీయధర్మమున స్పష్టముగనే యున్నది. దీనినిఁబట్టిచూడ హరిగీతాశబ్దముచే, భగవద్గీతయే యిచ్చట వివక్షిత యనువిషయమున సంశయ మేమియు లేదు. గురుపరంపర యొక్కటియై యుండుటయ కాక, గీతాప్రతిపాదితమని స్పష్టముగ రెండుపర్యాయములు వర్ణింపఁబడిన "నారాయణీయధర్మములకు", లేక, "భాగవతధర్మములకే," "సాత్వతధర్మములు", లేక, "ఏకాంతికధర్మము"లని రెండవపేరు గలదు. మఱియు నాధర్మమును నిరూపించుచు శాంతిపర్వమునందలి—

శ్లో. "నారాయణపరో ధర్మః పునరావృత్తిదుర్లభః,
ప్రవృత్తిలక్షణశ్చైవ ధర్మో నారాయణాత్మకః."
(మ. భా. శాం, ౩౪౭. ౮౦-౮౧)

"ఈనారాయణీయధర్మము పునర్జన్మము నివారించునది(అనఁగా:పూర్ణమోక్షప్రద మగుచుఁ బ్రవృత్తిపరముగ నున్నది.)"అనుశ్లోకము దానిద్వివిధలక్షణములను నిర్వచించు చున్నది. అనంతర మీధర్మము ప్రవృత్తిపర మెట్లో యాసంగతి పూర్ణముగ స్పష్టీకరింపఁబడినది. ప్రవృత్తి యనఁగా: సన్న్యాసము పుచ్చుకొనక మరణపర్యంతమును చాతుర్వర్ణ్యవిహితనిష్కామకర్మఁ జేయుటయే,యనునర్థము ప్రసిద్ధముగనే యున్నది. కావున గీతలలో నర్జునునకుఁ జేసినయుపదేశము భాగవతధర్మసంబద్ధ మగుటచేతను, నాధర్మము ప్రవృత్తిపరముగా నుండుటచేతను, నాయుపదేశము ప్రవృత్తిపర మని మహాభారతకారుఁడు తలఁచె నని సుస్పష్ట మగుచున్నది.

ఆయినను గీత కేవలము ప్రవృత్తిపర మగుభాగవతధర్మమునే ప్రతిపాదింపలేదు. ఇంక నేమన:— ఈభాగవతధర్మమును

శ్లో. "యతీనాం చాపి యో ధర్మ స్స తే పూర్వం నృపోత్తమ,
కథితో హరిగీతాసు సమాసవిధికల్పితః."

(మ. భా. శాం. ౩౪౮. ౫౩.)

"దానితోపాటు (చాపి) యతులయొక్క—(స న్యాసులయొక్క—) నివృత్తిపరధర్మమును, ఓరాజా! నీకు పూర్వము భగవద్గీతలలో విధిసహితముగను, సంక్షేపముగను జెప్పఁబడినది." అని జనమేజయుఁడు వైశంపాయనునితో మరలఁ జెప్పెను; కాని ప్రవృత్తిధర్మముతోనే యతులనివృత్తిపరధర్మముకూడ జెప్పఁబడినను మను విక్ష్వాకువు మొదలగువారిగీతాధర్మపరంపర యతిధర్మములకు బొత్తిగ సంబంధింపదు. భాగవతధర్మముతో మాత్ర మీపరంపర సంబంధించును. కావుననే గీతలలో నర్జునునకుఁ జేయఁబడినయుపదేశము ముఖ్యముగ మనువు, ఇక్ష్వాకువు లోనగువారిపరంపరగ వచ్చినప్రవృత్తిపరభాగవతధర్మసంబద్ధ మగుచు నాపరంపరాసంబంధమున (అనఁగా: అప్రధానముగా) నివృత్తిపరయతిధర్మమును నిరూపించునది యై యున్నది. ఇది మహాభారతకారునియభిప్రాయ మనుసంగతి పూర్వోక్త వచనములయొక వాక్యతవలనఁ దేలును. మహాభారతములోని యీప్రవృత్తిపర మగు నారాయణీయధర్మమును, భాగవతములోనిభాగవతధర్మమును మొదట నొకటిగనె యుండె నని, పృథువు, ప్రియవ్రతుఁడు, ప్రహ్లాదుఁడు మొదలగు భగవద్భక్తుల కథలవలనఁ గాని, భాగవతములో మఱియొకచోట నున్న నిష్కామకర్మవర్ణనవలనఁ గాని స్పష్ట మగుచున్నది. (భాగవత. ౪. ౨౨-౫౧-౫౨; ౭. ౧౦-౨౩; ౧౧. ౪-౬; చూడుము.) ఐనను భాగవతధర్మములలోఁ గర్మపరమగు ప్రవృత్తితత్త్వమును సమర్థించుట భాగవతపురాణముఖ్యోద్దేశము కాదు. ఈసమర్థనము మహాభారతమునందే, విశేషముగ గీతలలోనే చేయఁబడినది; కాని యీసమర్థనముతోపాటు భాగవతధర్మమం దున్నభక్తిరహస్యమును జగురీతి నాభారతమున వ్యక్తపఱుచుట వ్యాసులవా రప్పుడు మఱచిరి. భక్తి లేని కేవలనిష్కామకర్మ వ్యర్థ మని భాగవతమున నున్నది. (భాగ. ౧. ౫-౧౨; చూ.) ఈసంగతి తోఁచియే వ్యాసులు భారతములోనియీలోపమును బూర్తి చేయుటకు భాగవతపురాణమును దర్వాతఁ బ్రత్యేకముగఁ జెప్పవలసి వచ్చె నని భాగవతారంభమున వర్ణింపఁబడియున్నది. భాగవతపురాణమును జెప్పుటకు ముఖ్యహేతు విదియే యని యాగ్రంథమువలన స్పష్ట మగుచున్నది. మఱియు నీ భాగవతధర్మమును ననేకవిధము లగు మార్గ

కథలు చెప్పఁబడుచున్నవి; కాని భాగవతధర్మములలోని భగవద్భక్తిమాహాత్మ్యము భాగవతములో వర్ణింపఁబడినట్లు భాగవతధర్మములోనికర్మపర మైనయంగముల వివేచన యుచ్చో నంతగ వర్ణింపఁబడలేదు. వేయేల? సమస్తకర్మయోగమును భక్తి లేమి వ్యర్థ మని భాగవతకారునిమతము! (భాగ. ౧. ౫.-౩౪.) కావున గీతాతాత్పర్యము నిశ్చయింపవలసివచ్చినప్పుడు, గీత యేభారతములోఁ జెప్పఁబడెనో, దాని లోనే యున్న నారాయణీయోపాఖ్యానమున కనుకూలముగ నిర్ణయించి తీరవల యును; కాని భాగవతపురాణము భాగవతధర్మసంబంధముగ నున్నను కేవలము భక్తిప్రధాన మగుటవలన నారాయణీయోపాఖ్యానసంబంధ మైన దనుటకు వీలు లేదు; ఒకవేళ నట్లన్నను భారత భాగవతముల యుద్దేశములును కాలములును వేర్వే అని యొఱిఁగి యే చెప్పవలయు.

నివృత్తిపరయతిధర్మములయు, ప్రవృత్తిపరభాగవతధర్మములయు, మూల స్వరూపము లేవి? ఇవి వేర్వే అగుటకుఁ గారణ మే మైయుండును? మూలభాగ వతధర్మములు ప్రకృత మేరూపాంతరములఁ బొంది యున్నవి? అను నిట్టిప్రశ్నల విచారము ముందుగ్రంథములో స్పష్టముగ నిరూపణ చేయఁబడును.

ఇంతదనుక మహాభారతకారుని మతానుసారముగ గీతాతాత్పర్యము వర్ణింపఁ బడినది. ఇఁక గీతమీఁద భాష్యకారులచేతను, టీకాకారులచేతను, నేమి నిశ్చ యింపఁబడినదో విచారింతము.

ఈభాష్యములలోను, టీకలలోను శ్రీశంకరాచార్యులవారి గీతాభాష్యమే యతిప్రాచీన మని ప్రకృతకాలమునఁ దలఁపఁబడుచున్నది. ఆభాష్యముకన్నఁ బూ ర్వము గీతలమీఁద మంచిమంచిభాష్యములును టీకలును వ్రాయఁబడియుండె ననుట కేమియు సంశయములేదు; కాని యాటీకలు ప్రకృతము కనిపింపనందున మహా భారతానంతరము శ్రీశంకరాచార్యులవారియవతారముకంటెఁ బూర్వము గీతల యర్థ మేవిధముగ యోజన చేయఁబడినదో తెలిసికొనుట కిప్పుడు సాధనము లేవియు లేవు. అయినను శాంకరభాష్యమందే యున్న ప్రాచీనటీకాకారులమతస్వరూప నిరూపణవలననే యాచార్యులవారికన్నఁ బూర్వు లగుటీకాకారులచే గీతలయర్థము మహాభారతకారానుమతముగనే, జ్ఞానకర్మసముచ్చయాత్మకముగ (అనఁగా; జ్ఞాన ముతోఁగూడనే జ్ఞానియగువాఁడు మరణపర్యంతము స్వధర్మోక్తకర్మ చేయవలయు నని) ప్రవృత్తిపరముగ యోజన చేయఁబడిన దని స్పష్ట మగు చున్నది. (గీ. శాం. భాష్య. ౨; ౧౦, ౩; వీనియుపోద్ఘాతము. చూ.) కాని వైదికకర్మయోగము బోధింపు నివిద్ధాన్తము శ్రీశంకరాచార్యులవారి కంగీకర్తవ్యము కాకపోవుటవలననే యా

భగవద్గీతలోని కర్మయోగ గ్రంథమున కతిప్రయాసతోను బట్టుదలతోను భాష్యము వ్రాసినారని యీశాంకరభాష్యోపోద్ఘాతములోనే స్పష్టముగ నున్నది. వేయేల? భాష్యశబ్దార్థనిర్వచనమును గనుఁడు. భాష్యటీకాశబ్దములు రెండును సమానార్థకము లనుట కనేక ప్రామాణిక ప్రయోగములు గలవు; కాని టీక యనుదానిలో మూలగ్రంథమునకు సులభమగు నన్వయమును, దానిలోనిశబ్దములకు సుగమమైన యర్థము నుండును. భాష్యకర్త లంతమాత్రముతోఁ దృప్తిఁ జెందక, సంపూర్ణ గ్రంథమును న్యాయరీతిగఁ బర్యాలోచించుచు స్వమతానుసారముగ నాగ్రంథములోనితాత్పర్యమును దదనుసారముగ గ్రంథార్థమును యోజించురీతిని కూడఁ జెప్పుదురు. గీతలమీఁదిశాంకరభాష్య మీరీతిగనే యున్నది; కాని గీతాతాత్పర్య నిరూపణములో నాచార్యులవారు భారతకారునిమతమునకంటె వేఱుగాఁ జెప్పుటకుఁ గారణము నెఱింగింప ముందుగా నొకవిషయ మిచ్చటఁ జెప్పవలసియున్నది. అదేమన:—

వైదికధర్మము కేవలతాంత్రికము కాకుండుటచే నిధర్మముయొక్క గూఢతత్త్వ మేమియో తెలిసికొనుటకుఁ బూర్వమే యుపనిషత్తులలో సూక్ష్మవిచారణ చేయఁబడినది; కాని యీయుపనిషత్తులు వేర్వేఱుమునులచే వేర్వేఱుకాలములందు నిరూపింపఁబడుటం జేసి వానిలో ననేకవిధములగు విచారణలు గలవు. మఱియు వానిలోఁ జూపులకుఁ గొంచెము పరస్పరవిరుద్ధములుగ నుండునంశములుఁ గలవు. అయినను వైదికధర్మములలోనితత్త్వజ్ఞానవిచార మింతమాత్రముచే పూర్తికానేరదు. ఏల యనగా:—ఉపనిషత్తులలోఁ బ్రతిపాదితమైనజ్ఞానము తఱుచుగ వైరాగ్యపరమై (అనఁగా: నివృత్తిపరమై) యుండును. వేదాంతసూత్రము లుపనిషత్తులకేకవాక్యతఁ జేయుటకే రచింపఁబడిన వగుటచే వానిలో వైదికప్రవృత్తిమార్గసంబంధమైనతత్త్వ మెక్కుడను సవిస్తరముగఁ బ్రతిపాదింపఁబడలేదు. కావుననే వెనుకఁ జెప్పఁబడినరీతిగఁ బ్రవృత్తిమార్గప్రతిపాదకమైనభగవద్గీతచే నాయుభయమండలిలోపమును బూర్తి చేయఁబడినది. ఈధార్మికతత్త్వజ్ఞానమును బూర్తి చేయునది యీభగవద్గీతయే కాన నీగ్రంథము సర్వాంగీకర్తవ్యమును, బ్రమాణమును నైయున్నది. ఇందువలన(1)ఉపనిషత్తులు, (2) వేదాన్తసూత్రములు, (3)భగవద్గీతయు ననునీమూఁడుగ్రంథములకును బ్రస్థానత్రయ మనుపేరు వచ్చినది. ప్రస్థానత్రయ మనఁగా: ప్రవృత్తినివృత్తిమార్గములకు రెంటికిని మార్గప్రదర్శకములును, తాత్త్వికవివేచన చేయునవియును, వైదికధర్మసంబద్ధములు నగుమూఁడు ముఖ్యాధారగ్రంథములు;

లేక, ఆవైదికధర్మముపోషణమునకు మూఁడు ముఖ్యాధారస్తంభములై యున్నవి. భగవద్గీత కీవిధముగఁ బ్రస్థానత్రయమున సమావేశము కలిగినది. ఇట్టి ప్రస్థానత్రయసామ్రాజ్య మేకకాలమందు స్థాపితమైనపిదప, నేమతధర్మము లీమూఁడు గ్రంథములకు సంబంధించి యుండవో, లేక, యీమూఁటిలో నేమతమునకు సమావేశము కానేరదో, యామతములు నాసంప్రదాయములును వైదికధర్మములలో గౌణములనియు నగ్రాహ్యము లనియు లోకులెన్నుచు వచ్చిరి. తుదకీవిషయ మెట్లు పరిణమించె ననఁగా:—అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము, శుద్ధాద్వైతము ననుమతములును (ఆమతసంబంధమైనసన్న్యాసము, భక్తి మొదలగు వైదికధర్మములయొక్క యేయేసంప్రదాయములు బౌద్ధధర్మము క్షీణించినపిమ్మట హిందూస్థానములోఁ బ్రచారమునకు వచ్చినవో యవియును) బయలుదేఱుటచే వానిలోఁ బ్రతిసంప్రదాయప్రవర్తకుఁడైన ప్రత్యాచార్యుఁడును ప్రస్థానత్రయములోనిమూఁడుగ్రంథములకును; (అనఁగా: భగవద్గీతకుఁగూడ) భాష్యములు వ్రాసి యీసర్వసంప్రదాయములు బయలుదేఱుటకుఁ బూర్వమే ధర్మగ్రంథము లని చెప్పఁబడి ప్రమాణభూతము లగునీమూఁడుగ్రంథములయందును దమసంప్రదాయమే సత్యముగా నిలుచు ననియు నితరసంప్రదాయము లీధర్మగ్రంథసమ్మతములు కావనియు సిద్ధము చేసి చూపుట ప్రాప్తమైనది.

కారణ మేమన:—తమసంప్రదాయమే కాక యితరమార్గములు గూడ, ప్రమాణభూతములగునీధర్మగ్రంథములమూలమున గ్రాహ్యములుగానున్నవని యొప్పుకొనినయెడలఁ దమసంప్రదాయముయొక్క మహత్త్వమునకు లోపము కలుగును. ఇట్లు లోపము కలుగుట యేసంప్రదాయమునకు నిష్టము కానేరదు; సంప్రదాయము ననుసరించి ప్రస్థానత్రయముమీఁదను భాష్యములు వ్రాయుట యనుమార్గ మారంభమైనతర్వాత వేర్వేఱుపండితులు తమసంప్రదాయములో నుండుభాష్యములయొక్క యాధారముననే తమచే రచింపఁబడినటీకలమూలమున గీతార్థముఁ బ్రతిపాదించుచు వచ్చిరి. మఱియు నాయాసంప్రదాయములలో నాయాటీకల కధికగౌరవము వచ్చుచుండెను. గీతలమీఁదఁ బ్రస్తుతమెట్టిభాష్యములును టీకలును కనఁబడుచున్నవో యాసర్వగ్రంథము లట్టి వేర్వేఱుసంప్రదాయములకు సంబంధించినయాచార్యులవి గాని పండితులవి గాని యై యున్నవి. ఈసర్వసంప్రదాయములలోను మొదటిది, అనఁగా: ప్రాచీనసంప్రదాయము, శ్రీశంకరాచార్యులదై యున్నది. తత్త్వజ్ఞానము ననుసరించిన యాసంప్రదాయమే హిందూస్థానములో బహుమాన్యముగా

నున్నది. శ్రీమదాద్యశంకరాచార్యులవారు శాలివాహనశకము ౭౧౦-న సంవత్సరమున జన్మించి ముప్పదిరెండవసంవత్సరమున గుహాప్రవేశము చేసిరని ప్రస్తుతము కొందఱు నిశ్చయించియున్నారు.(శాలి.శక.౭౧౦-౭౪౨)* ఆచార్యులవారు గొప్ప యలౌకికజ్ఞానులై తమబుద్ధిసామర్థ్యముచే నాసమయమున సర్వదేశములయందును వ్యాపించియుండిన జైన బౌద్ధమతములను ఖండించి తమయద్వైతమతమును స్థాపించిరి. మఱియు శ్రౌత స్మార్త వైదికధర్మసంరక్షణార్థమై భరతఖండములో నాలుగుదిక్కులను నాలుగుమఠములను స్థాపించి, నివృత్తిపరమును, వైదికము నగు సన్న్యాసధర్మమును, లేక, సంప్రదాయమును, కలియుగమున మరల స్థాపించిరి. ఈ కథ యందఱకును తెలిసినదియే. ప్రతిధార్మికసంప్రదాయమునకును స్వాభావికముగా రెండుభాగము లుండును. మొదటిది తత్త్వజ్ఞానసంబంధమైనది. రెండవది యాచరణసంబంధమైనది. మొదటిదానిలో పిండబ్రహ్మాండవిచారణచే పరమేశ్వరస్వరూప మేది యని తెలిపి యాసంగతిఁ జెప్పి మోక్ష మనఁగా నేమి యనునది యోగశాస్త్రదృష్టిచే నిర్ణయింపఁబడును. రెండవభాగమున మోక్షము సిద్ధించుటకు సాధనములు, లేక, యుపాయము లనువిషయముతో నీప్రపంచమున మనుష్యుఁ డెట్లు ప్రవర్తింపవలసినదియు నిర్ణయింపఁబడును. కావున శాంకరమతమునందలి మొదటి భాగమునకైనము శంకరులు తత్త్వదృష్టిచే నిట్లు చెప్పుదురు.

౧. నేను, నీవు, లేక, మనుష్యులకుఁ గంటికి గనఁబడుప్రపంచ మంతయు, అనఁగా: సృష్టిలోనుండు పదార్థముల కున్న నానాత్వము, సత్యము కాదు. ఈసమస్తమునందు నొకటియును శుద్ధమును నిత్యమునైన పరబ్రహ్మము నిండి యున్నది. మఱియు నట్టిపరబ్రహ్మమాయచేత మనుష్యులయింద్రియములకు నానాత్వము భాసమానమగుచున్నది. ౨. అట్లే మనుష్యునియాత్మయు మొదట పరబ్రహ్మరూపమునే యున్నది. ౩. జీవాత్మపరమాత్మల యేకత్వముయొక్క పూర్ణజ్ఞానము, అనఁగా: స్వానుభవాత్మకనిశ్చయము, కలిగిననే కాని యెవరికిని మోక్షము సిద్ధించుట అసాధ్యము. దీనినే యద్వైతవాదమని చెప్పుదురు. కారణమేమనఁగా:——ఏకమును నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమును నగుపరబ్రహ్మకంటె వేఱుగా స్వతంత్రమును సత్యమును నైనరెండవవస్తు వేమియును లేదు. నేత్రములకు గోచరించు నానాత్వము

* శ్రీమదాద్యశంకరాచార్యులకాల మింకను నూఱేండ్లు పూర్వమని మా మతము. పరిశిష్టప్రకరణమున దానియాధారముల వ్రాసితిమి. కాన నచట చూచుకొనవలయును.

మానవదృష్టియొక్క భ్రమ గాని, మాయయొక్క యుపాధ్యనుగుణమున నగు చున్నయాభాసము గాని యై యున్నది. మాయ రెండవస్వతంత్రవస్తువు కాదు. మిథ్యగా నున్న దని యీసిద్ధాంతతాత్పర్యమై యున్నది. మఱియుఁ గేవలతత్త్వ జ్ఞానవిచారమే కర్తవ్య మైనప్పుడు శాంకరసంప్రదాయ మంటేకంటె నధికముగాఁ జేయుట కావశ్యకత యుండదు. ఐనను శాంకరసంప్రదాయ మింతమాత్రము తోనే పూర్ణము కానేరదు. అద్వైతతత్త్వజ్ఞానమునకు సంబంధించినదియు, శాంకర సంప్రదాయములోనితత్త్వజ్ఞానమహత్త్వమంతటిమహత్త్వము గలదియు, నాచరణ దృష్టిలో నున్నదియు నగు రెండవసిద్ధాంత మేది యనఁగా:—

చిత్తము శుద్ధమై బ్రహ్మాత్మైక్యజ్ఞానము పొందుయోగ్యత వచ్చుటకు స్మృత్యుక్తము లైనగృహస్థాశ్రమకర్మలు చేయవలసియున్నను నీకర్మలు సర్వదా చేయ నక్కఱలేదు. తుదకు సర్వకర్మత్యాగము చేసి సన్న్యాసాశ్రమమునఁ బ్రవే శించిననే తప్ప మోక్షప్రాప్తి దుర్లభము. ఏలయన:—కర్మజ్ఞానములు రెండును చీఁకటియు వెలుతురునువలె పరస్పరవిరుద్ధములగుటచే సర్వవాసనలును కర్మ లును వదలి పోయినఁ గాని బ్రహ్మజ్ఞానముయొక్క పూర్ణత్వము సిద్ధింపదు. ఈరెం డవసిద్ధాంతమును నివృత్తిమార్గమని కాని, తుదకు సర్వకర్మసన్న్యాసముఁ జేసి జ్ఞాన ముననే మగ్నుఁడై యుండును గాన సన్న్యాసనిష్ఠ యని కాని చెప్పుదురు.

ఉపనిషత్తులలోను బ్రహ్మసూత్రములలోను కేవలాద్వైతజ్ఞానోపదేశమే కాక శాంకరసంప్రదాయ మగుసన్న్యాసమార్గముయొక్కయు పూర్వోక్తములగు రెండుభాగములయొక్కయు నుపదేశమును కలదు. ఈతీరున నీరెండుగ్రంథముల శాంకరభాష్యములలోను ప్రతిపాదనము చేయఁబడినది. భగవద్గీతలకుసైత మిదే తాత్పర్య మని గీతలశాంకరభాష్యములో నిర్ణయింపఁబడినది. (గీతా. శాం. భా. ఉపోద్ఘాతము; బ్రహ్మసూ. శాం. భా. ౩-౪-౧౮-చూడుము.) మఱియు దీనికి ప్రమాణము:—"జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతేఽర్జున!" (గీ-౪-౩౭) "జ్ఞానరూపాగ్నిహోత్రము సర్వకర్మలను దగ్ధముఁ జేసి బూడిద చేయుచున్నది." అనియు, "సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే" (గీ-౪-౩౩) "సర్వ కర్మలసమాప్తియు జ్ఞానమందే యగుచున్నది," అనియు నిట్టి గీతావాక్యములు చూపింపఁబడినవి. సారాంశ మేమన:— బౌద్ధధర్మసమాప్త్యనంతరమున నీవిశిష్ట మార్గ మెక్కటియే శ్రేష్ఠమని నిశ్చయించి శ్రీశంకరాచార్యులవారు దీని స్థాపిం చిరి. తదనుకూలముగనే గీతార్థమున్నది. పూర్వటీకాకారులు చెప్పినట్లు జ్ఞానకర్మల

సముచ్చయము గీతలలోఁ బ్రతిపాద్యము కాదు; కాని జ్ఞానప్రాప్తికి సాధనము అనఁగా: గౌణసాధనము. తుదకు సర్వకర్మసన్న్యాసపూర్వక మగుజ్ఞానముచేతనే మోక్షము సిద్ధించు నని యీశాంకరసంప్రదాయసిద్ధాన్తమునే భగవద్గీతలలో శ్రీకృష్ణభగవానుఁ డర్జునున కుపదేశించెను. ఈవిషయము నిరూపించుటకే శాంకరభాష్యము వ్రాయఁబడినది. శంకరాచార్యులవారికంటె పూర్వమునం దీగీతలకు సన్న్యాసపరముగ నేదో యొకటీక యుండి యుండును. అది యిప్పు డలభ్యము. కావుననే గీతలయొక్క ప్రవృత్తిపరమైనటీకను తీసివైచి, దానికి నివృత్తిపరమైనసాంప్రదాయిక రూపమును కలుగఁ జేయుటకు శాంకరభాష్యమే మొట్టమొదట నారంభించిన దని చెప్పవలయును. శంకరాచార్యులతర్వాతనుండి వారిసంప్రదాయమ్మున కనుయాయు లైన మధుసూదనసరస్వతి మొదలగు ననేకటీకాకారు లీవిషయమున ముఖ్యముగ నాచార్యులవారినే యనుకరించిరి. ఐనను తరువాత మఱియొకచమత్కారమగుకల్పన వెలువడెను. అది యేమన:—అద్వైతమతమునకు మూలభూతము లగు మహావాక్యములలో "తత్త్వమసి" "అది (అపరబ్రహ్మము) నీవు (శ్వేతకేతువు) అయితివి," అను ఛాందోగ్యోపనిషత్తులోనిముఖ్య మగునిమహావాక్యముయొక్క వివరణమే గీతలలో పదునెనిమిదియధ్యాయములలో నున్నది. కాని మహావాక్యములో నున్నపదములక్రమమును మార్చి మొదట "త్వమ్" అనియు, పిదప "తత్" అనియు, నటుపిమ్మట "అసి" యనియు నీపదములఁ జేకొని యీనూతనక్రమ్మాను సారముగ నారంభము మొద లొక్కొకయాఱధ్యాయములను భగవంతుఁడు నిష్పక్షపాతబుద్ధితో సరసగా సరిగా పంచిపెట్టినాఁడు. గీతలమీఁదఁ బైశాచభాష్య మనునదే సంప్రదాయానుసారమునను గాక స్వతంత్రముగా నున్న దనియు, నాభాష్యమును హనుమంతుఁడు (మారుతి) రచించె ననియు ననేకులు తలఁచుచున్నారు. కాని యిది సత్యము కాదు. భాగవతవ్యాఖ్యాన మొనర్చినహనుమత్పండితునిచేతనే యీభాష్యము రచింపఁబడి సన్న్యాసమార్గసంబంధిగ నున్నది. మఱియు నాభాష్యములో కొన్నిచోట్ల శాంకరభాష్యమ్ములో నున్నయర్థమే యాశబ్దములతోనే రచింపఁబడినది. ఇటులే పూర్వమం దైనను పిదప నైనను రచింపఁబడిన గీతలమహారాష్ట్రిభాషాంతరీకరణములలో నైనను, అభాషలోని నిరూపణలలో నైనను తఱుచుగ శాంకరభాష్యానుసారముగనే యర్థ మున్నది. ప్రొఫెసర్, మాక్సుమూలరుచే సంకలింపఁబడినప్రాచ్యధర్మ పుస్తకమాలలోను, కై. కాశీనాథపంత్ తెలంగుగారిచే నొనర్పఁబడినయాంగ్లభాషాంతరీకరణమునను, శ్రీశంక

రాచార్యులనుగాని, శాంకరసంప్రదాయపు జైనటీకాకారులనుగాని యనుసరించి యే యర్థము వ్రాయఁబడినది. ఇటులే భాషాంతరీకరణగ్రంథప్రస్తావనలో చెప్పఁ వ్రాయఁబడినది.

గీతలమీఁద నైనను ప్రస్థానత్రయములోనిగ్రంథములమీఁద నైనను, సాంప్రదాయికభాష్యగ్రంథములు వ్రాయునాచార మిటుల నొకతీరునఁ బ్రారంభమైన పిదప నితరసంప్రదాయములయందును దానికే (శాంకరమతమునకే) యనుకరణము చేయఁ బడినది. మాయావాదమును, అద్వైతమును, సన్న్యాసమును ప్రతిపాదించు శాంకరసంప్రదాయానంతరమున దాదాపు ౨౫౦ సంవత్సరములకు శ్రీరామానుజాచార్యుల [జన్మశకము ౯౩౮] వారిచే విశిష్టాద్వైతసంప్రదాయము ప్రవర్తింపఁ జేయఁబడినది. మఱియు నాసంప్రదాయమును స్థిరపఱచుటకు శ్రీశంకరాచార్యుల వలెనే రామానుజాచార్యులును ప్రస్థానత్రయముమీఁదను (అనఁగా: గీతలమీఁదఁ గూడ) స్వతంత్రమైనభాష్యమును రచించినారు. శ్రీశంకరాచార్యులవారిమాయా మిథ్యాత్వవాదము, నద్వైతసిద్ధాంతమును సత్యములు కావనియు, జీవుఁడు, జగత్తు, ఈశ్వరుఁ డనునిమూఁడుతత్త్వములును భిన్నము లైనను, జీవుఁడు (చిత్) జగత్తు (అచిత్) అనునిరెండు నొకయీశ్వరునిశరీరముగ నుండుటచేఁ జిదచిద్విశిష్టుఁ డగు నీశ్వరుఁ డొక్కఁడే యనియు, ఈశ్వరశరీరములో నున్నయీసూక్ష్మచిదచిద్వస్తువులందుండియే యనంతరమ్మున స్థూలచిదచిద్వస్తువులు (అనఁగా: అనేకజీవములు, జగత్తులు) నిర్మింపఁబడుచున్న వనియు రామానుజులవారి సంప్రదాయము. మఱియు నీమతమే యుపనిషత్తులలో బ్రహ్మసూత్రములలో గీతలలోఁ బ్రతిపాదిత మని రామానుజాచార్యులవారు తత్త్వజ్ఞానదృష్టిచే నుడివిరి. (గీ. రా. భా. ౨-౧౨; ౧౩-౨) వేయేల? భాగవతధర్మములు విశిష్టాద్వైతధర్మము నాక్రమించుకొనుటకు వీరిగ్రంథమే కారణమైన దని వక్కాణింపవచ్చును. కారణ మేమన:—తత్పూర్వమందు మహాభారతములోను గీతలలో నున్నభాగవతధర్మనిరూపణ మద్వైతమతమును స్వీకరించి రచియింపఁబడినట్లు కానఁబడుటయే. రామానుజాచార్యులవారు భాగవతధర్మమున నుండినవా రగుటచే గీతలలోఁ బ్రవృత్తిపర మగుకర్మయోగము ప్రతిపాద్య మనువిషయమును యథార్థముగ నూహింపవలసినవారే; కాని రామానుజాచార్యులవారికాలమున మూలభూతము లగుభాగవతధర్మములలోఁ గర్మయోగము విశేషభాగము లుప్తప్రాయమై దానికి తత్త్వజ్ఞానము ననుసరించి విశిష్టాద్వైతపర మైనదియు, నాచారము ననుసరించి ప్రధానముగ భక్తిపర మైనదియు

నసంన్యాసరూపము ప్రాప్తమగుటచే, గీతలలో జ్ఞానము, కర్మ, భక్తియను మూఁడును చెప్పఁబడినను, తత్త్వజ్ఞానదృష్టిచే విశిష్టాద్వైతము, నాచారదృష్టిచే వాసుదేవ భక్తియు నను రెండే గీతలకు సారభూతములు. కర్మనిష్ఠయే జ్ఞాననిష్ఠాసంపాదకము. స్వతంత్రము కాదు; అని రామానుజాచార్యులవారిచే నిర్ణయింపఁబడినది. (గీ. రా. భా. ౧౮-౧; మఱియు ౩-౧; చూడుము) కాని యద్వైతజ్ఞానస్థానమున విశిష్టాద్వైతమును, సన్న్యాసమునకు మాఱుగ భక్తియును శాంకరసంప్రదాయమునకంటె రామానుజసంప్రదాయమున వేఱై యున్నను తుద నాచరణకాలమున భక్తియు కర్తవ్యమని చెప్పఁబడును. మఱియుఁ జాతుర్వర్ణ్యమునకును స్వధర్మోక్త కర్మాదికకర్మ లామరణాంతము చేయవలసినవియే యనుపక్షము గౌణముగ నున్నది. ఈకారణమున గీతలకు రామానుజులవారితాత్పర్యము సైత మొకవిధమైనకర్మసన్న్యాసయోగముగనే యున్న దని చెప్పవలయును. కారణ మేమన:— కర్మలచేఁ జిత్తము శుద్ధమై, జ్ఞానోత్పత్తి యైనపిదపఁ జతుర్థాశ్రమమునఁ బ్రవేశించి, బ్రహ్మచింతనలో మునిఁగి యుండిన నేమి? ప్రేమచే నిరతిశయవాసుదేవభక్తిప్రవాహమున నీఁదులాడిన నేమి? రెండుమార్గములును కర్మయోగదృష్టిచే నొక్కటియే, అనఁగా: నివృత్తిపరములే. మఱియు నీయాక్షేపణయే రామానుజాచార్యులవారి యనంతరము వెలువడినసంప్రదాయములను సంబంధించుచున్నది.

“మాయామిథ్యాత్వవాదము సత్యము కాదు. కావున వాసుదేవభక్తిచేతనే యంతిమమోక్షము లభించుచున్నది. పరబ్రహ్మమును జీవునకును కొన్నియంశములచే నైక్య మున్నను నంశాంతరములచే భేద మొప్పుకొనుట పరస్పరవిరుద్ధమై యసంబద్ధ మగును. కావున నీరెండును సర్వదా భిన్నములే యని యెఱుంగవలయును. పూర్ణత్వము గాని, యంశముగుంపు గాని రెంటికి నైక్యమగుట గాని, సంభవము కాదు,” అని శ్రీరామానుజాచార్యులవారియనంతరము వెలువడినమూఁడవసంప్రదాయముయొక్క యభిప్రాయముగ నున్నది. ఈకారణముచేతనే దీనిని ద్వైతసంప్రదాయ మని చెప్పుదురు. ఈసంప్రదాయప్రవర్తకు లగుశ్రీమదానందతీర్థులను నామాంతరము గల శ్రీమధ్వాచార్యులవారు, ౧౧౨౦-వ శకవత్సరమున సమాధిస్థులైరి. మరణసమయమున ౭౯ సంవత్సరములవయస్సు గలవారై యుండి రని మాధ్వసంప్రదాయకులు వచించెదరు; కాని డాక్టర్ భాండారకరునిచేఁ బ్రకటింపఁబడిన “శైవ, వైష్ణవ, ఇతరుల పంథ” యనునాంగ్లగ్రంథము ౫౯-వ పేజీలో మధ్వాచార్యులవారికాలము ౧౧౧౯-వ శకవత్సరము మొదలు ౧౧౯౮-వ వత్సర

పర్యంతమై యున్న దని శిలాలేఖాదికము లగు ప్రమాణాంతరములచే నిశ్చయింపఁబడినది. శ్రీమధ్వాచార్యులు ప్రస్థానత్రయముమీఁద (అనఁగా: గీతలమీఁద నైతము) రచించిన భాష్యమునుండి యీసర్వగ్రంథములును ద్వైతసంప్రదాయ సంబంధములే యని తేలుచున్నది. "నిష్కామకర్మయొక్క మహత్త్వము గీతలలో వర్ణింపఁబడినను, నిష్కామకర్మ సాధన మగును కాని, భక్తియే పరమము (ముఖ్య సాధనము.)" అని తమగీతాభాష్యములో శ్రీమధ్వాచార్యులవారు వక్కాణించుచున్నారు. "భక్తి సిద్ధమైనపిదపఁ గర్మ చేసినను చేయకపోయినను విశేష మేమియు లేదు." "ధ్యానాత్కర్మఫలత్యాగః," "పరమేశ్వరధ్యానముకంటె (అనఁగా: భక్తికంటె) కర్మఫలత్యాగము, లేక, నిష్కామకర్మ, శ్రేష్ఠము"—ఇత్యాదికము లగు కొన్ని గీతావచనములే యీసిద్ధాంతమునకు విరుద్ధములుగ నున్నవి. ఈవచనములు పరమార్థముగా (అక్షరశః) సత్యములు గావు. అర్థవాదాత్మకము లని యెఱుంగ వలయును," అని భగవద్గీతల మాధ్వభాష్యములో నున్నది.(గీ. మా. భా. ౧౨-౧౩.)

నాల్గవసంప్రదాయము శ్రీవల్లభాచార్యులవారది, (జన్మశకము ౧౪౦౧); శ్రీరామానుజాచార్యమధ్వాచార్యుల సంప్రదాయములవలెనే యీసంప్రదాయమును వైష్ణవమార్గములోనిదే; కాని విశిష్టాద్వైతద్వైతమతములకంటె జీవేశ్వరజగత్తుల సంబంధవిషయమున నీసాంప్రదాయికమతము వేఱైనది. "మాయావిరహితమును (అనఁగా:శుద్ధజీవము)పరబ్రహ్మయు నొక్కటియే; రెండుకా"వని వచించుట యీ సంప్రదాయోద్దేశము. కావుననే వీరిని శుద్ధాద్వైతు లని చెప్పుచున్నారు. అయినను శ్రీశంకరాచార్యమతానుసారముగ జీవబ్రహ్మల నైక్య మంగీకరింపక 'అగ్నివిష్ఫులింగ' న్యాయరీతిగ "జీవుఁ డీశ్వరాంశముగ నున్నాఁడు; మాయాత్మకజగత్తు మిథ్య కాదు. ఎందుచే ననః—మాయయే పరమేశ్వరేచ్ఛచే నీశ్వరనుండి విభక్తమైనయొకశక్తిగ నున్నది. మాయాపరతంత్రుఁ డగుజీవునకు మోక్షప్రాప్తిజనక మగుజ్ఞాన మీశ్వరానుగ్రహము లేక లభించుట యసంభవము గాన భగవద్భక్తియే మోక్షమునకు ముఖ్యసాధన"మని యీసంప్రదాయమందలి రెండవ సిద్ధాంత మగుటచే శాంకరసంప్రదాయముకంటె నిది వేఱుగ నున్నది. ఈపరమేశ్వరానుగ్రహమునకే పుష్టి యనియు, పోషణ యనియు, నామాంతరము లుండుటచే నీసంప్రదాయమును పుష్టిమార్గ మనియుఁ జెప్పవాడుక గలదు. ఈసంప్రదాయము ననుసరించి గీతలమీఁద వ్రాయఁబడిన "తత్త్వదీపికా" దిగ్రంథములలోఁ బ్రతిపాదింపఁబడి నిశ్చయింపఁబడినవిషయ మేమనః—"సాంఖ్యజ్ఞానమును, కర్మ

యోగమును నర్జునున కుపదేశించి తుద కతనిచే భక్త్యమృతపానముఁ జేయించి భగవంతుఁ డతనిఁ గృతకృత్యునిఁ జేసినకారణమున గృహదారాదుల వదలివేయఁ దగినట్టి కేవలనివృత్తిపర మగుపుష్టిమార్గీయభక్తి యనునదే సర్వగీతాతాత్పర్యము. మఱియు నీహేతువుచే భగవంతుఁడు.— "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" (గీ. ౧౮-౬౬) "సర్వధర్మములు వదలి నన్నొక్కనినే శరణు చెందుము." అని తుద కుపదేశించినాఁడు."

ఇదియకాక నింబార్కాచార్యులవారిమతము రాధాకృష్ణపరమై భక్తి ప్రధాన మగునొక వైష్ణవసంప్రదాయముగ నున్నది; ఈయాచార్యులవారు శ్రీరామానుజాచార్యులవారి యనంతరమునను శ్రీమధ్వాచార్యులవారికిఁ బూర్వమునను (శక. ౧౧౬౨) నుండిరని డాక్టరు భాండారకరుగారిచే నిశ్చయింపఁబడినది. జీవేశ్వరజగత్తులు మూఁడును వేర్వేఱైనను జీవ జగత్తులయస్థితివ్యాపారములు స్వతంత్రములు గాక యీశ్వరేచ్ఛ నవలంబించియున్నవనియు, మూలభూతుఁ డగుపరమేశ్వరునియందే జీవ జగత్తులసూక్ష్మత్వము లంతర్భూతము లగుచున్నవనియు నింబార్కాచార్యులవారిమతము. ఈమతసిద్ధాంతమునకు నింబార్కాచార్యులు వేదాంతసూత్రములమీఁద స్వతంత్రమగునొకభాష్యమును వ్రాసిరి. ఈసంప్రదాయము ననుసరించి కేశవకాశ్మీరభట్టాచార్యులవారు భగవద్గీతలకుఁ 'తత్త్వప్రకాశిక' యనునొకవ్యాఖ్య వ్రాసి యాగ్రంథమున గీతార్థ మీసంప్రదాయమున కనుకూలించి యున్నదని నిరూపించిరి. శ్రీరామానుజాచార్యులవారిసంప్రదాయమునకు నీసంప్రదాయమునకు భేదము చూపుటకు దీనిని ద్వైతాద్వైతసంప్రదాయ మని చెప్పుట యుక్తముగ నున్నది. నేత్రములకుఁ బ్రత్యక్షగోచరము లగువస్తువులు సత్యములని యంగీకరింపక పోవుటచే, వ్యక్తముయొక్క యుపాసనము (అనఁగా : భక్తి). నిరాధార మగును. కొన్నికొన్ని యంశములలో నసత్య మగుననుతలంపుచే శాంకరసంప్రదాయ మగుమాయావాదమును స్వీకరింపక ద్వైతవిశిష్టాద్వైతుల వేర్వేఱగు భక్తిపరసంప్రదాయములు ప్రవృత్తము లైన వనుసంగతి స్పష్టమగుచున్నది. భక్తియొక్క యుపపత్తి సంబంధించుటకొఱకే యద్వైతమ్మును మాయావాదమును వదలవలయు నని వచించుట కశక్యము. మాయావాదమును నద్వైతమును స్వీకరించియే మహారాష్ట్రసాధుసత్పురుషులు భక్తిని సమర్థించియున్నందున నీ మార్గము శ్రీశంకరాచార్యులకుఁ బూర్వమునందుండియే వచ్చుచున్నదని యూహ తోఁచుచున్నది. అద్వైతము, మాయామిథ్యాత్వము, కర్మత్యాగావశ్యకత

ములలోఁ బాతంజలయోగము సర్వోత్తమ మని స్థాపించె నని జ్ఞానేశ్వరులు స్పష్టీకరించిరి.

సారాంశ మేమన:— గీతలలో నుపదేశింపఁబడిన ప్రవృత్తిపరకర్మమార్గము గౌణము (అనఁగా జ్ఞానమునకుఁ గేవలసాధనము); అని నిర్ణయించి, తమతమ సంప్రదాయములలో వర్ణింపఁబడిన తత్త్వజ్ఞానమును, దానితోపాటు మోక్షదృష్టిచేఁ గుదకు గర్తవ్యములని వర్ణింపఁబడినయాచారములే, అనఁగా : మాయావాదాత్మక మగునద్వైతము కర్మసన్న్యాసము, మాయాసత్యత్వప్రతిపాదకవిశిష్టాద్వైతము వాసుదేవభక్తి, ద్వైతము విష్ణుభక్తియును, శుద్ధాద్వైతము భక్తియును, శాంకరాద్వైతము భక్తియును, లేక, పాతంజలయోగము భక్తియును, లేక, కేవలభక్తియు, కేవలయోగమును, కేవలబ్రహ్మజ్ఞానము ననున నేకవిధము లగుకేవల నివృత్తిపరము లైనమోక్షధర్మములు, గీతలలో ప్రతిపాద్యములుగా నున్న వని వేర్వేఱు భాష్యకర్తలును, టీకాకారులును తమతమగీతార్థములను నిశ్చయించియున్నారు. *

భగవద్గీతలలోఁ గర్మయోగము ప్రధానముగఁ బ్రతిపాద్య మని యెవ్వరును చెప్పరని నే ననుటయే కాక ప్రసిద్ధులును మహారాష్ట్రకవులునగు వామనపండితులును నీసంగతినే చెప్పుచు గీతలకుఁ దమచే విస్తృతముగ రచియింపఁబడిన 'యథార్థదీపిక' యనుమహారాష్ట్రభాషాటీకయొక్క యుపోద్ఘాతమున నిట్లనిరి.— "పరి ఆజీ భగవంతజీ, యాకలియుగామాజీ, జో తో గీతార్థ యోజీ, మ్హతానురూప." "స్వామీ! యీకలియుగమున ననేకులు తమతమమతముల కనుకూలముగ గీతార్థమును వ్రాసియున్నారు." అని చెప్పి యనంతరమున:— "కోణ్యామి సేతరీకోణీ గీతార్థ అన్యథా వాఖాణీ, మజనావ దేఈ కోరాచీ హీకరణీ కాయకరూజీ భగవంతా." "ఓ పరాత్పరా! ఏకో యొకకారణమున నందఱును గీతలకు తోఁచినటులెల్ల నర్థము వ్రాసిరి. కాని వీరు వ్రాసినయర్థము నాకిష్టములేదు. భగవంతుఁడా! నేనేమి చేయుదును?" అని భగవంతునిసమీపమున నిందారూపముగ గాన మొనర్చిరి. అనేక

* వేర్వేఱుసంప్రదాయములను బ్రవర్తింపఁజేయునట్టి యాచార్యులగీతా భాష్యములును, ఆయాసంప్రదాయముల ననుసరించి భాష్యములమీఁద వ్రాసిన టీకలును, మొత్తమున పదియేను టీకలు బొంబయిలో నున్న గుజరాతిప్రింటింగ్ ప్రెస్ ముద్రాక్షరశాలాధిపతిచేఁ బ్రచురింపఁబడినది. వేర్వేఱుటీకాకారులయభిప్రాయముల నొక్కసారిగఁ జూచుట కీగ్రంథము మిక్కిలి యుపయోగించును.

యర్జునుని భ్రమ నశించుటకు శ్రీకృష్ణభగవానునిచే నుపదేశింపఁబడినదే కాని యిటుల భ్రమ వృద్ధిఁ బొందుటకుఁ గాదు. మఱియు నీగీతలలో నిశ్చితార్థ మొక్కటియే యర్జునున కుపదేశింపఁబడుటచే (గీ. ౫. ౧-౨) నతని కాయుపదేశ మటుల పరిణమించినది.

అటులే యైన నీగీతల తాత్పర్యవిషయమున నిన్ని భేదము లేల? సత్యమే! ప్రశ్నకఠినముగనే యున్నది; కాని దానికి సమాధానము విచారించినతర్వాతఁ గొంత నసుకొన్నంతకఠిన మైనదిగ నుండదు. అందులకు నొకదృష్టాంతము:— మధురమై, రసయుక్త మైనయొకపక్వాన్నమును (మిఠాయి) జూచి యొకఁడది గోధూమధాన్యసంబంధి యనియు, మఱియొకఁడు ఘృతసంబంధి యనియు, నింకొకఁడు శర్కరాసంబంధి యనియుఁ దమతమయభిరుచి ననుసరించి చెప్పినచో, వానిలో నెవది యసత్య మని యందుము? ముగ్గురును దమతమమతముల ననుసరించి యథార్థమునే చెప్పుచున్నారు. మఱియు నింతయైన నాపక్వాన్న మేది? యనుప్రశ్న కావలసి యైన సమాధానము తెలియక ప్రశ్న పూర్వమువలెనే యున్నది. ఏలన:— గోధుమలు, నేయి, పంచదారయు నీమూఁడుపదార్థముల నేకముగఁ జేసి, అందుండి లాడు, జిలేబి, మోతిచూర్ మొదలగు ననేకపక్వాన్నములు (మిఠాయీలు) చేయుటకు వీలుండుటచే, వానిలో ప్రస్తుతపక్వాన్న మేది? యనుదానినిర్ణయము, గోధూమప్రధాన మని యైనను, ఘృతప్రధాన మని యైనను, శర్కరాప్రధాన మని యైనను చెప్పినంతమాత్రముననే చేయుట శక్యము కాదు. మఱియు రెండవ దృష్టాంతము:— సముద్రమథనసమయమం దెటు లొకరి కమృతము, నింకొకరికి విషము, మఱియు ననేకులకు ప్రాప్త్యనుసారముగ లక్ష్మి, కౌస్తుభము, నైరావతము, పారిజాతము మొదలగు వేర్వేఱువస్తువులు లభించినంతమాత్రమున, సముద్రముయొక్క యాథార్థ్యస్వరూపనిర్ణయ మెటుల గోచరము లేదో, యటులే సాంప్రదాయరీతి ననుసరించి గీతాసముద్రమథన మొనర్చుటీకాకారుల భిన్నభిన్న తాత్పర్యనిరూపణమాత్రముచే గీతాతాత్పర్యయాథార్థ్యనిర్ణయము గోచరముకాదు. మఱియుఁ గంసవధసమయమున సభామంటపములోనికి నిశ్శంకముగాఁ బోయిన శ్రీకృష్ణభగవానుఁ డొక్కఁడే యెటుల వేర్వేఱుమనుష్యులకు వేర్వేఱుగ (అనఁగా మల్లురకు వజ్రసన్నిభునిగను, కామినులకు మదనునివలెను, మాతాపితరులకుఁ బుత్త్రునివలెను) భాసించెనో (భాగ. ౧౦. పూ. ౪౩. ౧౭.) యటులే, భగవద్గీత యొక్కటియై వేర్వేఱుసాంప్రదాయికులకు వేర్వేఱుగఁ గానిపించుచున్న దని చెప్పుట తప్పు కాదు. ఏధర్మసంప్రదాయ మైనను సాధారణముగఁ బ్రమాణభూతము

అనుసరించి వ్రాసినశ్లోకము కల్పదు. ఏవ్రాత కైనను ప్రకరణమున కైనను గ్రంథమున కైనను తాత్పర్యము నిర్ణయింపవలసినచో నీశ్లోకమునఁ జెప్పఁబడిన యేడు సంగతులు సాధనభూతము లగుటచే వాని నవశ్యము విచారణ చేయవలయు నని మీమాంసకులందురు. దీనిలో "ఉపక్రమోపసంహారౌ", అనఁగా: గ్రంథాద్యంతములు, మొదలు తుదలను విషయము లై యున్నవి. ఎవరైన మనస్సున నేదో యొక నూతనోద్దేశము నుంచుకొని గ్రంథరచన కారంభింతురు. మఱియుఁ బ్రకృత మగు తన నూతనోద్దేశము సిద్ధమైనపిదప గ్రంథసమాప్తిఁ జేయుదురు. కావుననే గ్రంథోపక్రమోపసంహారములను గ్రంథతాత్పర్యనిర్ణయవిషయమున ముఖ్యముగ విచారింపవలయును. సరళరేఖ యనఁగ నేమియో వివరించునప్పుడు భూమితిశాస్త్రమున (అనఁగా: రేఖాగణితశాస్త్రమున) "ప్రారంభమం దున్న బిందువునుండి కుడివైపున కైనను, ఎడమవైపునకైనను, క్రిందికిగాని పైకిఁగాని వంపులేక నేరేఖ సరిగా వెళ్ళునో యది సరళరేఖ" యని చెప్పవలయునని నిర్ణయింపఁ బడినది. గ్రంథతాత్పర్యమునకు నీ న్యాయమే సంబంధించియున్నది. ఏతాత్పర్యము గ్రంథాద్యంతములను వదలిపెట్టక యా రెండుగుర్తులకు మధ్య సరిగా నిమిడియుండునో యది యా గ్రంథమునకు సరళ మగు తాత్పర్యమగును. ప్రారంభము మొదలు సమాప్తిపర్యంతము నడచుట కితరము లగుమార్గము లున్నను నవియన్నియు వంకరత్రోవలే యని యెఱుంగవలయు. ఆద్యంతములు చూచి యిట్టుల గ్రంథతాత్పర్యమార్గము ముందుగ నిశ్చయించి, పిమ్మట నా గ్రంథములో 'నభ్యాసము' (పునరుక్తి; లేక, మాటిమాటికి చెప్పినసంగతి) చూడవలయును. ఎందులకు కారణము; గ్రంథకారునిమనస్సులో నేసంగతి స్థిరపఱుపవలయు నని యుండునో ఆద్దానిసమర్థించుటకై పలుమారు ననేకకారణములచేఁ బ్రతిసమయమునను "కావుననే యీసంగతి సిద్ధమైన" దనియైనను, లేక, "యీసంగతి యిట్లొనర్పవలయు" ననియైనను మాటిమాటికి నొకనిశ్చితమైనసిద్ధాంతమునే చెప్పును. గ్రంథతాత్పర్యమును నిశ్చయించుటలో నాలవదైనసాధనము లగు 'నపూర్వత'యును, ఫల' మునై యున్నవి. అపూర్వత యన నవీనత్వము; ఏగ్రంథకారుఁ డైనను తా నొకక్రొత్త సంగతిని చెప్పక యెన్నఁడును నవీనగ్రంథరచనలోఁ బ్రవర్తింపఁడు. పూర్వము ముద్రణయంత్రములు లేనప్పుడు సైత మట్టుల ప్రవర్తింపలేదు. కావున నేదైననొక గ్రంథతాత్పర్యము నిర్ణయించుటకంటె ముందు పూర్వగ్రంథములో నపూర్వత్వము, లేక, నవీనత్వ మేమి కలదో చూడవలసివచ్చును. అటులే యా వ్రాతకైనను, గ్రంథమున కైనను, అనఁగా: వానినుండి లబ్ధమైనపరిణామ మేమియో, విచారింపవలయును.

ఏలన:—ఈఫలము సిద్ధింపవలయు ననియు, లేక, నిష్పన్నము కావలయునని తలంపు కలిగి గ్రంథము రచింపఁబడుటచే సిద్ధించినపరిణామము ననుసరించియే గ్రంథకర్త యొక్క యాశయ మవశ్యము నిర్ణయింపఁబడవలసియుండును.

ఆఱవ యేడవసాధనము 'అర్థవాదము, నుపపత్తియు; 'అర్థవాద' మనునది మీమాంసకులపారిభాషికశబ్దము. (జై. సూ. ౧. ౨; ౧. ౧౫) మనకు నేసంగతి నేని ముఖ్యముగ విధించుటకు నైన, సిద్ధింపఁజేయుటకు నైన, నది సిద్ధ మైనపిదప నుపపాదనారీతుల సంఘములోఁ జేరుటకైనను, పోలికగుండ నేకవాక్యతఁ జేయుట కైనను, సామ్యము నైనను భేదము నైనను నిరూపించుటకైనను, ఇతరపక్షములలో దోషములఁ జెప్పి స్వపక్షమున గుణమును నిరూపించుట కైనను, నలంకారార్థము గాని, యతిశయోక్తికిఁ గాని, యుక్తివాదమునకుఁ బోషక మను ప్రశ్న యొక్క పూర్వేతిహాససంబంధముచే నైనను, నితరకారణములచే నైనను నొకప్పుడేమియు నూతనోద్దేశము లేకపోయినను, ఇతరములగు ననేకవిషయప్రసంగములంబట్టి గ్రంథకారుఁ డీయర్థవాదము నుపయోగించుచుండును. ఇట్టిసమయములయందు గ్రంథకారునిచే వర్ణింపఁబడువిషయము కేవల మసంబద్ధముగా నుండక పోయినను గౌరవార్థమును, స్పష్టీకరణార్థమును, పూర్త్యర్థము నైనను జెప్పఁబడియుండుటచే నాయర్థవాదములు పరమార్థముగ సత్యము లై యుండు నని నియమము లేదు. వేయేల ? ఇట్టివిధానముల సంబంధములో నర్థవాదములు ప్రత్యక్షరముగ సత్యము లగునా? కావా! యని విచారించుటయందును, గ్రంథకారులు ప్రయత్నము చేయరని నైతము చెప్పవచ్చును. *కావుననే యీవిధానములు ప్రమాణభూతములు (అనఁగా:వానిలోనున్న వేఱువేఱువిషయములసంబంధముచే గ్రంథకారుని సిద్ధాన్తమును దెలియఁజేయునవి) అని యంగీకరింపక, యవి కేవలము ప్రశంసాపరము (స్వార్థములు) లో, యాగంతుకములో, స్తుత్యర్థములో యని తెలిసికొని మీమాంసకులు వానికర్థవాదము లని నామ మిడిరి. మఱియు నర్థవాదాత్మకవిధానములను వదలియే, గ్రంథతాత్పర్యమును నిశ్చయించుచున్నారు. ఇంత విచారించినను తుద కుపపత్తిని నైతము

* ౧. గుణవాదము, ౨. అనువాదము, ౩. భూతార్థవాద మన్ని యర్థవాదము మూఁడువిధములు. ౧. ఇతరప్రమాణములకు విరుద్ధమగునది గుణవాదము. ౨. ఇతరప్రమాణములవలన సిద్ధమగునది యనువాదము. ౩. ఇతరప్రమాణములకు విరుద్ధముగాని, ఇతరప్రమాణములవలన సిద్ధమగునదిగాని గాకుండునది భూతార్థవాదము.

చూచియే తీరవలయును. ఒకానొకనూతనవిషయనిరూపణకు బాధకప్రమాణములను విమర్శించి కుమరక సాధకప్రమాణములను తర్కశాస్త్రానుసారముగ నిరూపించుటయే యుపపత్తి యని యైన నుపపాదన మని యైనఁ జెప్పుదురు. ఉపక్రమోపసంహారరూపము లగురెండుహద్దులును మొదట స్థిర మైనపిమ్మట మధ్యమార్గ మర్థవాదోపపత్తులసంబంధముచే నిశ్చయించుటకు వీలగును. ఏవిషయ మప్రస్తుతముగాఁ గాని యానుషంగికము గాఁ గాని యున్నదో యాసంగతి యర్థవాదమునుండియె తెలుసుకొనఁబడుచుండుటచే నొక పర్యాయ మర్థవాదముయొక్క నిర్ణయ మైనపక్షమున గ్రంథతాత్పర్యమును నిశ్చయించి చూచుమనుష్యుఁడు పెడత్రోవల నన్నిటిని విడిచి వేయును. కుమార్గమును వదలి సుమార్గమునకు వచ్చినతర్వాత, నుపపత్తిసరణి, సముద్రముయొక్క తరంగములవలె, వాచకుల నైనను గ్రంథపరీక్షకుల నైనను క్రమముగ దొర్లించుచుఁ దుదకుఁ తాత్పర్యపర్యంతమును సరళముగఁ దీసికొనిపోయి వదలును. మన ప్రాచీనమీమాంసకులచే నిశ్చయింపఁబడి వదలివేయఁబడినయీగ్రంథనిర్ణయనియమము సమస్తదేశములలో నున్నవిద్వాంసులకు నొక తీరుననే సమ్మత మగుటచే. వానియుపయోగవిషయముగాని, యావశ్యకతావిషయమునఁగాని యిక్కడ విశేషముగ వివేచన చేయ నక్కఱలేదు. *

ఇంతవిమర్శ యైనపిమ్మట సైత మెవ రైన "ఈమీమాంసకుల నియమము సంప్రదాయప్రవర్తకు లగునాచార్యులకుఁ దెలియదా? వారిగ్రంథములనుండియే యవి మీచే గ్రహింపఁబడినయెడల వారిచే నిర్ణయింపఁబడిన గీతాతాత్పర్య మేకదేశీయముగ నున్న దనుటకుఁ గారణ మేమి?" యని శంకింతురు. ఈప్రశ్నలకు సమాధానమును వచించెద:—దృష్టి యొకపర్యాయము సాంప్రదాయిక మైన

* గ్రంథతాత్పర్యముల నిర్ణయించు నీ విషయములు ఇంగ్లీషువారివ్యవహారములలో సైతము గన్పట్టుచున్నవి. ఉదాహరణము— ఏదైన నొకతీర్పునందుఁ గావలసినవిషయము తేలనియెడల హుకుంనామాను (డిక్రి) చూచుకొని తీర్పుయొక్క యర్థమునుగాని, ఫలితార్థమును గాని నిర్ణయించుకొన వలసివచ్చును. ఆ తీర్పునందలి ముఖ్యాంశమును నిర్ణయించుట కుపయోగింపనిసంగతు లున్నయెడల నవి మఱియొకవ్యవహారమునందుఁ బ్రమాణములుగ నొప్పుకొనఁబడవు. ఇట్టివిషయము నింగ్లీషులో ఆబిటర్ డిక్టా (Obiter dicta) అనఁగా: ప్రకృతమునకు సంబంధింపనివిషయములందురు, బాగుగ విచారింతు మేని యదియు నర్థవాదములో నొకభేదము కావచ్చును.

పక్షమునఁ బ్రమాణభూతము లగుగ్రంథములలోఁ దమసంప్రదాయమే వర్ణితమైన దని నిరూపించుటకు వీలైనవిధమునే సాంప్రదాయిక టీకాకారులు స్వీకరింతురు. ఏలన:— తమసంప్రదాయమే కాక, పైగ్రంథమునకు రెండవయర్థమే మైన నున్న నది సత్యముకా దనియు నట్లుండుటకు నేదో హేతువు వేఱై యున్నదనియు, సాంప్రదాయికటీకాకారులు గ్రంథతాత్పర్యసందర్భమున ముందే నిశ్చయించుకొని యుందురు. మఱియుఁ దమమతమున కనుసారముగ మొదటనే సత్యమని నిశ్చయించుకొన్నయర్థమే యంతటను బ్రతిపాద్యముగ నున్న దని నిరూపించుచున్న యీటీకాకారులకు మీమాంసాశాస్త్రముయొక్క కొన్ని నియమములకు బాధకలిగినను బూర్వోక్తమగు దృఢనిశ్చయముచే మీమాంసానియమముల మహత్త్వ మెంతమాత్ర మిష్టము కాదు.

హిందూధర్మశాస్త్రములలో 'మితాక్షర, దాయభాగము', మొదలగుగ్రంథములలో నున్నస్మృతివచనములయొక్క వ్యవస్థ యేకవాక్యతనుసైత మీతత్త్వమ్మననుసరించియే (సాంప్రదాయికదృఢనిశ్చయముతోనే) చేయఁబలసివచ్చు చున్నది; కాని కేవలహిందూధర్మగ్రంథములలోనే యీపద్ధతి గ్రహింపఁబడలేదు. క్రైస్తవులయొక్కయు మహమ్మదీయులయొక్కయు ధర్మముల కాదిగ్రంథము లగు 'బైబిలు, ఖురాను' లలోఁగూడ ననంతరము వెలువడినయనేకులగు నాయాసాంప్రదాయికగ్రంథకారులచేతను, నిటులే యర్థాంతరములు రచింపఁబడినవి. మఱియు బైబిలుయొక్క ప్రాచీననిర్ణయములలో నున్నకొన్నికొన్ని వాక్యములకు నర్థమీన్యాయము ననుసరించియే యూహూదీయుల (Jews) యర్థములనుండి, క్రైస్తవభక్తులచేఁ దమ కనుకూల మగునర్థము వేర్వేఱై కల్పింపఁబడియున్నది. వేయేల ? ఏదైన నొకవిషయముపై నుండుప్రమాణభూతగ్రంథములు గాని, లేఖములు గాని యెచ్చటెచ్చట మునుపే నిర్ణయింపఁబడియుండునో, మఱియు నెచ్చటెచ్చట ప్రమాణభూతము లగు నీ నియ్యమితగ్రంథములయాధారముచేతనే మూంచు సర్వమును నిర్ణయింపఁబడవలయునో, అచ్చటచ్చట నిట్టిగ్రంథార్థనిర్ణయపద్ధతియే స్వీకరింపఁబడియుండునట్లు స్పష్ట మగుచున్నది. ఆధునికు లగుగొప్పధర్మశాస్త్రపండితులును, వకీల్లును, న్యాయాధీశులును ప్రాచీనప్రమాణభూతధర్మగ్రంథములయొక్కయు, నిర్ణయములయొక్కయు, విషయమును దమతమమతాననుసారముగనే క్రిందుమీఁదు చేయుట కిదియే కారణము. శుద్ధలౌకికవిషయముననే యిట్టిస్థితి సంభవించునెడల నుపనిషత్తులు — వేదాన్తసూత్రములవలెనే ప్రస్థానత్రయములోనిగ్రంథ మగుభగవద్గీతపైనను సంప్రదాయము ననుసరించి వేర్వేఱు

భాష్యములు బయలుదేరుట యాశ్చర్యకరమగుటకు నేమియుఁ గారణము లేదు; కాని యీ సాంప్రదాయికమార్గమును వదలి పూర్వోక్తరీతిగ భగవద్గీతయొక్క యుపక్రమోపసంహారాదికముపై దృష్టియుంచినచో, భారతీయయుద్ధారంభమునకంటెఁ బూర్వమునసే కురుక్షేత్రమున నుభయసైన్యములు యుద్ధసన్నద్ధము లై పరస్పరముఁ బ్రత్యక్షముగ శస్త్రసంపాతనోద్యమమున నుండునంతలో, హఠాత్తుగ బ్రహ్మజ్ఞానప్రసంగతులు చెప్పుచు విమనస్కుఁడును సన్యసించుటకు సిద్ధుఁడునైనయర్జునుని దనక్షాత్రకర్మయందుఁ బ్రవర్తింపఁజేయుటకు భగవంతునిచే గీతయుపదేశింపఁబడినదని తేలును. దుష్టుఁ డగుదుర్యోధనునకు సహాయభూతు లై తనతో యుద్ధోపక్రమమునకై యెవ రెవరు వచ్చి యున్నారో వారి నందఱను జూచుచుండ, నర్జునునకు వృద్ధుఁ డగుభీష్మపితామహుఁడును, గురుఁడగుద్రోణాచార్యుఁడును, గురుపుత్త్రుఁ డగునశ్వత్థామయుఁ, బ్రతిపక్షు లైనను బాంధవులే యగుకౌరవులును, నితరు లగుస్నేహితులును, నాప్తులును, సంబంధులును, మిత్త్రులును, మామలును, పినతండ్రులును, బావమఱఁదులును, రాజులును, రాజపుత్త్రులు మొదలగువారును, గనఁబడిరి. మఱియు "కేవలహస్తినాపురరాజ్యసంపాదనకొఱకే వీరిని జంపి కులక్షయాదిమహాపాపములను మనము చేయుట కుద్యుక్తులమైతిమే" యనువిచార మర్జునునకు మనంబున నుద్భవిల్లుటచేఁ జిత్తము మిక్కిలి క్షోభముఁ జెందెను. ఒకవైపున యుద్ధము చేయుమని క్షాత్త్రధర్మముచెప్పుచుండెను. పితృభక్తియు, గురుభక్తియు, బన్ధుప్రేమయు, సుహృత్ప్రీతియు మొదలగు ధర్మములు వెనుకకు లాగుచుండెను. యుద్ధము కర్తవ్య మైనను స్వీయులతోనే యగుటచేఁ బితామహగుర్వాప్తాదులహింసచే ఘోరపాతకము సంభవించును. చేయనియెడల క్షాత్త్రధర్మమే యంతరించును. ఇటు లొకవైపున గోయియు నొకవైపున నూయియు నుండుటచే రెండుగొఱ్ఱెపోతుల దెబ్బలమధ్యమునఁ బడిన యొకదుర్బలప్రాణి యవస్థవలె నర్జునునిగతి యాయెను. అర్జునుఁడు మహాయోధుఁడనుమాట సత్యమే; కాని ధర్మాధర్మసంబంధనీతి యనుబోనులో హఠాత్తుగఁ జిక్కుటచే నిజముగ నతనిముఖ మెండిపోయెను. దేహము గగుర్పడెను. చేతివిల్లుజాఱిపోయెను. "నేను యుద్ధము చేయ" నని యేడ్చుచు రథముపై దిగులుచేఁ జతికిలఁబడెను. మఱియుఁ దుదకుఁ జిరకాలమునుండి పరంపరగ వచ్చుచున్నక్షత్త్రియధర్మమునకంటె నధికమని స్వభావముగనే మిక్కిలి ప్రియమై తోఁచుచున్నమమత్వముయొక్క (అనఁగా: సమీపమందున్నబంధువులపైని స్నేహముయొక్క) మహత్త్వమును స్థిరపఱుచుకొని మోహముచే "పితృవధ, గురువధ, బంధువధ, సుహృద్వధ, కుల

క్షయము మొదలగుఘోరపాపములఁ జేసి రాజ్యసంపాదనచేయుటకంటె నుదరం భరిత్వముకొఱకు బిచ్చ మెత్తుట తప్పిదమా?" యనుకొని యర్జునుఁ డిట్లుచెప్ప నారంభించెను. "ఈసమయమున శస్త్రమును వదలిన నన్నుఁ జూచి శత్రువులు నాతలఁ దఱిగినను మేలే. యుద్ధమున స్వకీయులను వధించి వారినెత్తుటిచేనపరిశుద్ధములు నభిశప్తము (అనఁగా: శాపమునొందినవి) లగుభోగముల ననుభోగించుట కే నిష్టపడను. క్షాత్రధర్మ మెట్టిదైన నేమి? అందుకై పితృవధ, బంధువధ, గురువధ మొదలగుభయంకరము లగుపాతకములఁ జేయవలసివచ్చె నేని నాక్షాత్రధర్మము దగ్ధ మగుఁ గాక? ఆక్షాత్రకతికి నిప్పంటుకొనుఁగాక? ఈసంగతిఁ దెలియనివారై ప్రతిపక్షులు దుష్టవర్తనులైనను నేను సైతే మటులే ప్రవర్తించుట యుక్తము కాదు. నాయాత్మకు నిజమగు కళ్యాణ మెటు లగునో యాసంగతి నేను జూచుకొనవలయును. మఱియు "నటువంటిఘోరపాతకముఁ జేయుట శ్రేయస్కర మని నాకుఁ దోఁపనియెడల క్షత్రధర్మ మెంతశాస్త్రోక్త మైనను నిట్టి ప్రసంగమున నాకు దానితోఁ బనియేమి?" యని యాతనిమనంబే యాతనికి నిరుత్సాహంబుఁ గల్పింపఁగ ధర్మసమ్మూఢుఁడై (కర్తవ్య మేదియో లోఁపనివాఁడై) శ్రీకృష్ణుని శరణుఁ జొచ్చినపిమ్మట భగవంతుఁ డర్జునునకు గీతల నుపదేశించి మార్గములోనికిఁ దెచ్చెను. మఱియు నాతనికి యుద్ధము కర్తవ్యమైనను, ఆసమయమున భీష్మాదులను వధింపవలయు ననుభీతి యాతనికిఁ గలుగుటచే యుద్ధము చేయ నొల్లని యర్జునునకు నాయుద్ధమే స్వేచ్ఛచేఁ జేయవలసివచ్చెను. గీతలలో నున్నరహస్యమును బయలుపఱుపవలసియున్న నది యీయుపక్రమోపసంహారములనుఫలము ననుసరించియే యుండవలయును. "భక్తిచే మోక్ష మెట్లు సిద్ధించును? బ్రహ్మజ్ఞానముచే నైనను, పాతంజలయోగముచే నైన నది యెట్లు సిద్ధించును?" ఇత్యాదికేవలనివృత్తిపరమార్గము, లేక, కేవలకర్మత్యాగరూపమగు సన్యాసధర్మమును, చెప్పుటవలన నిక్కడ నేమియుఁ బ్రయోజనము లేదు. శ్రీకృష్ణుని మనంబున, నర్జునుఁడు సన్యసించి విరాగియై బిచ్చ మెత్తుచు వనములకుఁ బోవలయునని యూహ కాని; కాపీనధారియై వేపాకుఁ దినుచు మరణాంతము యోగాభ్యాసము చేయుటకొఱకు హిమవత్ప్రాంతములకుఁ బోవలయు నని తలంపుగాని; ధనుర్బాణములకు బదులు, తాళము మద్దెల వీణయు నర్జునునిచేతికిచ్చి వాని నాదములోనే భక్తిచే భగవన్నామఘోషణముఁ జేయుచుఁ బ్రేమరూపానందభరితుండై కురుక్షేత్ర మనుధర్మభూమియందు భారతవర్షములోని సకలక్షాత్రసమాజము

నెనుట బృహన్నలచే వలె నర్జునునిచే దరల నాట్యము చేయింపవలయు నని కాని యభిప్రాయము లేదు. అజ్ఞాతవాసానంతరమునఁ గురుక్షేత్రమునఁ బ్రవేశించి చేయవలసిననాట్యము బృహన్నలనాట్యమునకంటెఁ గఠినమైనదియు భిన్నమైనదియు నై యున్నది. గీతల నుపదేశించుచు ననేకస్థలములయం దనేకవిధము లగు కారణముల నిరూపించుచుఁ జివరకు 'తస్మాత్,' అనఁగా: 'కావున', లేక, 'ఆహేతువువలన' అను నర్థముగలపదము (అనఁగా: అనుమానదర్శకమహత్త్వబోధకపదమును) ప్రయోగించి "తస్మాద్యుధ్యస్వ భారత." "కావున నోయర్జునా! యుద్ధము సేయుము;" (గీ. ౨-౧౮) "తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః" "కావున నో కౌన్తేయా! యుద్ధమునకుఁ గృతనిశ్చయుండవగుము; లెమ్ము." (గీ. ౨-౩౭) "తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర" "కావున నాసక్తిని వదలి నీవు చేయవలసినకార్యమును చేయుము." (గీ. ౩-౧౯) "కురు కర్మైవ తస్మా త్త్వం" "కావున నీవు కర్మనే చేయుము;" (గీ. ౪-౧౫) "మా మనుస్మర యుధ్య చ" "కావున నన్ను స్మరించుచు యుద్ధము చేయుము." (గీ. ౮-౭) "సర్వకర్తయును సర్వకారయితయును నేనే యగుటచే నీవు నిమిత్తమాత్రుఁడవై యుండి యుద్ధమొనర్పుము. శత్రువుల జయింపుము." (గీ. ౧౧-౩౩) "శాస్త్రప్రామాణ్యముచేఁ బ్రాప్త మైన కర్తవ్యము నొనర్చుటయే నీ కుచితముగ నున్నది." (గీ. ౧౬-౨౪) అని యిటుల నిశ్చితార్థమును గర్మపరము నైనయుపదేశమును నర్జునునకుఁ జేసి పదునెనిమిదవయధ్యాయమున నుపసంహారార్థమున మరల "ఈసమస్తకర్మల నొనర్చియే తీరవలయును" (గీ. ౧౮-౬) అని నిశ్చితమును నుత్తమమునైన స్వమతమును భగవంతుఁడుపదేశించెను. మఱియుఁ దుదకు "అర్జునా! నీకజ్ఞానమోహ మిప్పటి కైనను నశించినదా? లేదా"! (గీ. ౧౮-౭౨) యని ప్రశ్న చేసి యతనివలన.—

"శ్లో. నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ॥

[గీ. ౧౮. ౭౩]

"స్వామీ! నాయజ్ఞానమును, సంశయమును నశించినవి; ఇంకఁ దమ యిష్టము ననుసరించినకార్యమును జేయుదును;" అని ప్రత్యుత్తరమును రాఁబట్టుకొనెను. ఇటుల వాగ్రూపముగనే యర్జునుఁడు ప్రత్యుత్తర మీయలేదు; తానాడినమాట సత్య మగునటులఁ జేసి ప్రసంగోపాత్తమైనయాయుద్ధమున భీష్మ కర్ణ

జయద్రథాదులను వధించెను. ఇందువలన నశేస లర్జునునకు భగవంతునిచేఁ జేయఁబడినయుపదేశము నివృత్తిపర మగుజ్ఞానమునకును యోగమునకును భక్తికిని సంబంధించిన దగుటచే, నదియే ముఖ్యప్రతిపాద్యవిషయ మను చున్నారు; కాని యుద్ధారంభ మైనది కాఁబట్టి నడుమనడుమఁ గర్మను గొంతకొంత ప్రశంసించుచు భగవంతుఁ డర్జునునిచే నాయుద్ధమును సమాప్తి నొందించెను. ఇచ్చట యుద్ధము నెఱవేర్చుట యనువిషయము ముఖ్యము కాదు. దీనిని ఆనుషంగిక మని కాని, యర్థవాదాత్మక మని కాని చెప్పుచున్నారు; కాని వారిటుల కోటిక్రమమును దబ్బిబ్బులుగ నెటులో నిర్వహించినను గీతయొక్క యుపక్రమోపసంహారములకుఁ గాని ఫలమునకుఁ గాని యుపపత్తి కుదరదు. ఏలయన:—స్వధర్మానుసారముగఁ బ్రాప్త మైన కర్తవ్య మెట్టి దైనను మరణాంతము నొనర్చుచునే యుండవలసిన దానియొక్క మహత్త్వమును నావశ్యకతయు నీసమయమున భగవంతుం డగుశ్రీకృష్ణునిచే నిరూపింపఁబడఁదగి యున్నది. మఱియు నావిషయమును సిద్ధింపఁజేయుటకు వెనుకఁ జెప్పినటుల గీతలలో నెక్కడను సూచింపఁబడియుండలేదు. ఒకవేళ నట్లు సూచింపఁబడి యుండినను, బుద్ధిమంతుఁడును వివేకియు నైనయర్జునున కాయసంబద్ధము లగుసిద్ధాంతములు మనస్కరింపక యైన నుండవలయును.

భయంకర మైనకులక్షయ మగుననుసంగతి కంటి కెదుటఁ గనఁబడుచుండఁగనే, "యుద్ధము కర్తవ్యమా?, కాదా? కర్తవ్యమనుపక్షమును స్వీకరించినచోఁ బాపము లేకుండ నెట్లు చేయవలయును?" అనియే యర్జునునిముఖ్యప్రశ్న యై యున్నది. మఱియు నెంతకలవరము కలిగించినను, నిష్కామబుద్ధితో యుద్ధము చేయుమని యైనను, కర్మ చేయుమని యైనను జెప్పినయీసమాధానము (అనఁగా: ముఖ్యప్రశ్నకు సమాధానము) అర్థవాద మని చెప్పి తప్పించుకొనఁబూనుటకు సాధ్యముకాదు. యజమానునింట యజమానినే యతిథిఁగ భావించుటవంటి దగును. వేదాన్తము, భక్తి, పాతంజలయోగము ననునవి గీతలలోఁ బొత్తిగ నుపదేశింపఁబడలేదని మే మనము. మఱియేమన: గీతలలో నీమూఁడువిషయములకుఁ గలసంబంధము, పరస్పరవిరుద్ధధర్మముల యొక్క భయంకర మైనయల్లరిలోఁ బడుటచే "ఈపని చేయుదునా? యాపని చేయుదునా?" యని సందేహపడి, కర్తవ్యమూఢుఁ డైనయర్జునునకుఁ గర్తవ్య మైన నిష్పాపమార్గమును బోధించి క్షాత్రధర్మానుసారముగ స్వీయశాస్త్రోక్తకర్మ నొనర్చుటకుఁ బ్రవృత్తుఁ డగునట్లు చేయునదిగనే యుండవలయు నని యందుము. ఈసందర్భమునఁ బ్రవృత్తిపరధర్మజ్ఞానమే ప్రస్తుతము ముఖ్య మగుటచే నితరవిషయములు

తత్సిద్ధ్యర్థము లగుచు,(అనఁగా: 'ఆనుషంగికము లగుచు). గాన, గీతాధర్మరహస్యము ప్రవృత్తిపరమే (కర్మపరమే) యయి యుండవలయు నను విషయము స్పష్టమగుచునే యున్నది; కాని, "యీప్రవృత్తిపరరహస్య మెద్ది? అది వేదాన్తశాస్త్రమునుండియే యెటుల నిష్పన్న మగును?" అను విషయమై యేటీకాకారునిచే నైనను సరి యగు నిరూపణ చేయఁబడ లేదు. ఏటీకాకారులును గీతోపక్రమ గీతోపసంహారములను ఫల్లమును జూడకయే, గీతలలో బ్రహ్మజ్ఞానము గాని, భక్తిగాని తమతమసంప్రదాయముల కనుకూల మగునటుల నివృత్తిపరదృష్టితో సిద్ధాన్తముచేయ నాసక్తులై యున్నారు. భక్తికిఁ గాని జ్ఞానమునకుఁ గాని కర్మతో సదాసంబంధము గల్పించుటయే యొకమహాపాతకము. ఈశంకనే యొకరు చేసికొని శ్రీకృష్ణునిస్వీయచరిత్రను కంటియెదుట నుంచుకొని భగవద్గీతార్థము నిర్ణయింపఁబడవలయు నని వ్రాసియున్నారు.*మఱియు శ్రీకాశీక్షేత్రమందు సమాధిస్థులును ప్రసిద్ధులు నద్వైతులు నగు పరమహంస శ్రీకృష్ణానందస్వాములవారు 'గీతార్థపరామర్శ' మను పేరు గలచిన్న సంస్కృతనిబంధమును వ్రాసియున్నారు. దానిలో "తస్మా ద్గీతా నామ బ్రహ్మవిద్యామూలం నీతిశాస్త్రమ్" "కావున గీత యన బ్రహ్మవిద్యనుండి సిద్ధ మగు నీతిశాస్త్ర (కర్తవ్యధర్మశాస్త్ర)" మని సిద్ధాన్తపఱిచినారు. † జర్మనుపండితుఁడు (ప్రో. డాయసన్) తన యుపనిషత్తులలో నున్న 'తత్త్వజ్ఞాన' మను గ్రంథములో నొకచోట భగవద్గీతాసందర్భమున నీరీతిగనే వ్రాసియుండుటచే నితరులును ననేకు లగుపాశ్చాత్యులును, పౌరస్త్యులు (Oriental) నగు గీతాపరీక్షకులచే నీమతమే నిర్ధారింపఁబడినది. అయినను వీరిలో నెవరును సమగ్రగీతాగ్రంథమును బరీక్షించి కర్మపరదృష్టితో వానిలో నున్న సర్వప్రతిపాదనలయొక్క గాని యధ్యాములయొక్క గాని సందర్భము లెట్లు కూడునో యావిషయమును స్పష్టముగ నిరూ

* ఈవ్యాఖ్యానకారునిపేరును, ఈవ్యాఖ్యానములోని కొంతవిషయమును, చిరకాలముక్రిందట నొకగృహస్థుఁ డుత్తరమునుండ నాకుఁ దెలిపెను; కాని నా కున్నవ్యవహారపుఁ దొందరలలో నాయుత్తర మెచ్చటనో పడిపోయినది. ఇంకను గనుపడలేదు.

† శ్రీకృష్ణానందస్వామి రచించిన గీతారహస్యము, గీతాధర్మప్రకాశము, గీతార్థపరామర్శము, గీతాసారోద్ధారము, నను నాల్గుగ్రంథములఁ జేర్చి యొకసంపుటముగనే రాజకోట యనుపట్టణమున ముద్రిత మైనది.

పించుటకుఁ బ్రయత్నము చేసినవారు కారు; అట్లు ప్రయత్నము చేయకపోవుటయే కాక, విపరీతముగా "ఈసి ప్రతిపాదన కష్టసాధ్య" మని సైతము 'డాయసన్' అను పండితుఁడు వ్రాసియున్నాఁడు.* కావున నీగీతలఁ బరీక్షించి దానిలో నుండు విషయమును నిరూపించుటయే యీగీతారహస్యమను గ్రంథముయొక్క ముఖ్యోద్దేశము. కాని యిట్లు చేయుటకుఁ బూర్వము గీతాప్రారంభమునఁ బరస్పరవిరుద్ధము లగు నీతిధర్మములనడుమఁ జిక్కినయర్జునునిసంకటస్వరూపము స్పష్టపఱుచుట యావశ్యకము. ఇంతమాత్రముననే గీతలయందుండు విషయమర్మము వాచకులకుఁ బూర్తిగ గోచరముగానేరదు. కావునఁ గర్మాకర్మల వివేచనయందలిసంకట మెట్టులుండునో యదియు, "ఈకార్య మొనర్తునా? యాకార్య మొనర్తునా?" యని సందేహపడి యనేక ప్రసంగములలోఁ జీకాకుపడినమనుష్యుఁ డెట్లుకర్తవ్యమూఢుఁడగునో (అనఁగా: దిక్కుతోఁపక యుండునో) యదియు, ననునీవిషయములు బాగుగఁ దెలియుటకై శాస్త్రములలోను నంతకంటె యధికముగ మహాభారతములోను నున్న యిట్టి ప్రసంగములలోని యనేకము లగునుదాహరణములచే నిప్పుడు ముందుగ విచారింతము.

ఇది విషయప్రవేశ మను ప్రథమప్రకరణము.

---

* Prof. Deussen's Philosophy of the Upanishads P. 362-(English Translation, 1906.)

# ద్వితీయ ప్రకరణము.

## కర్మ జిజ్ఞాస.

"శ్లో. కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః." *
[గీ. ౪—౧౬]

భగవద్గీతా ప్రారంభమునఁ బరస్పరవిరుద్ధము లగు రెండుధర్మములలోఁ జిక్కుపడుటచే కర్తవ్యమూఢుఁ డగునర్జునునకు సంభవించినప్రసంగ మెంతెయు నూతనము కానేరదు. సన్యసించి జగద్గోష్ఠి వదలి మఠములలో నుండువానియొక్కయు, లేక, అశక్తిచే జగత్తులోనియనేకము లగునన్యాయములఁ గేవలమూకభావమున సహించునట్టియుదరంభరులయొక్కయు సంగతియువేఱుకాని, ప్రపంచగోష్ఠిలో గొప్పవాఁడును నిర్వాహకుఁడునై సంసారమందలిస్వకర్తవ్యమును ధర్మానుసారముగ్గను నీత్యనుసారముగను జేయవలసినవాని కిట్టిసందర్భము (స్థితు) లనేకసమయముల సంభవించుచునే యుండును. అర్జునునకుఁ గర్తవ్యజిజ్ఞాసయు మోహమును యుద్ధారంభమునఁ గలిగెను. ఆమోహమే తుదకు యుద్ధమున మృతులగుబంధువులకు శ్రాద్ధములు చేయవలసివచ్చినప్పుడు ధర్మరాజునకు సైతము తోలిగెను. అట్టివానిమోహమును శాంతింపఁ జేయుటకు శాంతిపర్వము చెప్పఁబడియె. కర్మాకర్మసంశయమున, దేయేల? యిట్టి ప్రసంగము లెచ్చో నున్నవో వెదకి కాని కల్పించికాని యీవిషయములపై గొప్ప గొప్పకవీశ్వరులచే సరసకావ్యములును త్తమనాటకములును రచింపఁబడినవి. ఉదాహరణార్థమై ప్రసిద్ధుఁడు నాంగ్లేయభాషలో ననేకనాటకకారుఁ డగు "షేక్స్పీయరు" యొక్క "హామ్లెట్" అనునాటకమును గ్రహింతము. డెన్మార్కుదేశమునఁ బూర్వకాలమున 'హామ్లెట్టు'నురాజపుత్త్రుఁ డొకఁ డుండెను. వానిపిన తండ్రి, రాజును దనయన్నయు నైన 'హామ్లెట్' తండ్రిని జంపి, 'హామ్లెట్' తల్లితో మైత్రి సంపాదించుకొని సింహాసనముసైతము నాక్రమించుకొనెను.

---

* "కర్మ యన నేమి? అకర్మ యన నేమి? యనువిషయమునఁ బండితులు సైతము పొరపడుదురు." అని శ్లోకార్థము. ఇచట అకర్మశబ్దమునకు కర్మాభావము, లేక తప్పు పని యని యర్థము చేసికొనవలయును. ఈశ్లోకవ్యాఖ్యానముఁ జూడుఁడు.

పాపి యగుపినతండ్రిం జంపి, పుత్రధర్మానుసారముగఁ బిత్రృణమునుండి ముక్తుఁడు గావలసినవాఁడా? లేక, కేవలము పినతండ్రి యుఁ, దల్లిదండ్రికిఁ బిమ్మట నతనితోఁ సమానముగాఁబూజనీయుఁడును, సింహాసనారూఢుఁడు నను కారణముచే 'హామ్లెట్టు' ఊరకుండవలసినవాఁడా? ఇట్టిమోహములోఁ బడి, కలతఁ జెందినమనంబు గల్గినవాఁడును దరుణవయస్కుఁడునగు 'హామ్లెట్టు'న కెట్టియవస్థ సంప్రాప్తమైనదో కనుఁడు. అతరుణమున శ్రీకృష్ణునివంటియోగ్యుఁడును మార్గదర్శకుఁడు సంగరక్షకుఁడు నగు పురుషుఁ డాలోచన చెప్పుటకు లేకపోవుటచే, 'హామ్లెట్' వెట్టియెత్తి బ్రతుకవలసినవాఁడా? చావవలసినవాఁడా? ఈయవస్థలోఁ గర్తవ్యతావిచారముతో, పాపము హామ్లెట్టున కెటుల తుదకు మరణము సంభవించెనో యాచిత్ర మీనాటకమున నధికముగఁ జమత్కరింపఁబడినది. మఱియు 'కోరియలానెస్' అను మఱియొక నాటకములో సైత మిటులే 'షేక్స్పీయరు' మఱియొక ప్రసంగము వర్ణించియున్నాఁడు. శూరుఁడును రోమకదేశపువాఁడు నగు 'కోరియలానెస్' అనువాఁడు తన్ను రోమకపురవాసు లాయూరినుండి వెడలఁగొట్టుటచే నతఁడు రోమకదేశపుశత్రువులపక్షపువాఁ డైనదియేకాక వారిగుట్టును రోమకపురవాసుల కెన్నటికిని జెప్పనని వారి నమ్మకమునకై ప్రతిజ్ఞఁ జేసెను. పిమ్మటఁ గొంతకాలమున కీశత్రుసహాయముచే రోమకజనులపై దండెత్తి దేశముల జయించుచు రోమకపట్టణసింహద్వారమునందే రోమనులశత్రుసైన్యముల నిలిపెను. అప్పుడు రోమకపురమున నున్న స్త్రీలందఱును 'కోరియలానెస్' భార్యను, తల్లిని ముందుంచుకొని వచ్చి, మాతృభూమివిషయమున నతనికిఁ గర్తవ్యము నుపదేశించిరి. పిమ్మట రోమకపురజనుల శత్రువులకిచ్చిన యభయవచనము నా 'కోరియలానెస్' తానే యతిక్రమించి ప్రవర్తింపవలసివచ్చెను. కర్తవ్యాకర్తవ్యమోహమునఁ బడుటకు కిట్టియితరోదాహరణము లెన్నియో ప్రాచీనము లైనవి జగత్తున నితిహాసగ్రంథములలో నున్నవి; కాని యింతదూరము మనము పరుగిడ నవసరము లేదు. మనమహాభారతమను గ్రంథ మిట్టిసందర్భముల కొకగని యనునది యతిశయోక్తి కానేరదు. గ్రంథారంభమున (ఆ.౧) భారతమును వర్ణించుచు వ్యాసులవారు "సూక్ష్మార్థం న్యాయయుక్తం" "అనేకసమయాన్వితమ్" అని మహాభారతమునకు విశేషణములఁ జెప్పి, యీగ్రంథములో సర్వధర్మశాస్త్రములు నర్థశాస్త్రములు మోక్షశాస్త్రములు సైతము వర్ణితములై యున్నవని చెప్పుటయే కాక, యీవిషయమున "యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్" (ఆ.౬౨. ౫౩) "ఇంధములో నున్నవిషయములె ఇతరగ్రంథ

ములలో వర్ణితము లైనవి. మఱియు నిచ్చోట లేనివిషయము లెచ్చోటను వర్ణితములు కావు" అని యీభారతమహత్త్వమును కొనియాడెను. వేయేల? సంసారమందలి యనేకాపత్ప్రసంగములలోఁ బ్రాచీను లగుమహాపురుషు లేయేవిధముగఁ బ్రవర్తించిరో యావిషయముల వ్యాఖ్యానము సులభముగ సామాన్యజనులకు బోధించునదగుటచే, భారతము మహాభారతమయ్యెను. కేవలము 'భారతయుద్ధ' మని యైనను, 'పాండవవిజయ' మని యైనను బేరుగల యితిహాసమును వర్ణించుటయే యైనచో నష్టాదశపర్వములు చెప్పునంతయావశ్యకత యుండకయే పోవును.

"శ్రీకృష్ణార్జునలసందర్భమును వదలినచో మన కీ మహాచర్చవలన లాభ మేమి? మన్వాదిస్మృతికర్తలు తమతమస్మృతులలో మానవు లెటుల సంసారమునఁ బ్రవర్తింపవలసినదియు, ఆసందర్భమున స్పష్ట మగునియమములను వ్రాయలేదా? "హింసను వధను జేయకుఁడు. నీతితోఁ బ్రవర్తింపుఁడు. సత్య మాడుఁడు. వృద్ధులకు గురువులకు సన్మాన మొనర్పుఁడు. చౌర్యవ్యభిచారములు చేయకుఁడు;" ఇత్యాదు లగుసర్వసామాన్యనియమములు సర్వధర్మములలోను విధింపఁబడినవానిని జూచిన యెడల మరల నియ్యల్లరిలోఁ బడుట కేమి కారణ?" మని కొందఱడుగుదురు; కాని విపరీతముగ నిటుల సైతము విచారింపఁబడినది. ఆయంశ మేమన:—జగత్తునసర్వజనులు నెంతపర్యంత మీనియమము ననుసరించి ప్రవర్తింపరో, యంతపర్యంత మీ పామరజనులవలలోఁ బడి సజ్జనుఁడు తనసద్వర్తనమును వదలకయుండవలయునా? లేక, వారిప్రతిక్రియనిమిత్తమై యెట్టివానియొద్ద నట్లు ప్రవర్తించి తన్ను రక్షించుకొనవలయునా? ఇంతియకాక, యీసామాన్యనియమములు నిత్యములుఁ బ్రమాణములని యంగీకరించినను, కర్త యగుపురుషున కనేకపర్యాయము లీసామాన్యనియమములలో రెండుమూఁడు నియమము లొకసమయముననే ప్రాప్తము లగుచున్నవి. మఱియుఁ గర్త యగుపురుషుఁడు "ఇది చేయుదునా? అది చేయుదునా?" యనువివేచనలోఁబడి పిచ్చివాఁ డగుచున్నాఁడు. అర్జునునకు సంభవించినప్రసంగము వీనిలోనిదే; కాని యర్జునునకే కాక యితరు లగుగొప్పవారికి నిట్టిసందిగ్ధావస్థ యేల వచ్చునో యీసందర్భము మహాభారతములో ననేకస్థలములలో సమూలముగ విమర్శితమై యున్నది. ఉదాహరణ మేమన:—మనువుచే సర్వవర్ణములకు సామాన్య మని చెప్పఁబడిన "అహింసా సత్య మస్తేయం శౌచ మింద్రియనిగ్రహః" (మను. ౧౦. ౬౩) అహింస, సత్యము, అస్తేయము, మనోవాక్కాయములశుద్ధతయు, నింద్రియనిగ్రహము ననునవియైనసనాతననీతిధర్మములలో నహింసయొక్క విషయమే

మనము గ్రహింతము. "అహింసా పరమో ధర్మః" (మ.భా. ఆ. ౧౧. ౧౩) ఈ తత్త్వము మనవైదికధర్మములలోనే కాక యితరులసర్వధర్మములలోను ముఖ్యముగఁ బరిగణింపఁబడియున్నది. బుద్ధక్రీస్తుధర్మగ్రంథములలో నున్నయాజ్ఞలలో "హింస చేయకుము" అనునీయాజ్ఞ మనుస్మృతియందువలెనే యగ్రగణ్యమైనది. హింస యనఁగా : కేవలము జీవమును దీయుటయే కానేరదు. ఇతరప్రాణియొక్క మనసున కైనను శరీరమున కైనను నుపద్రవముఁజేయుటసైతము హింసయే! హింస యనః సచేతన మగుప్రాణికి నేవిధ మగు పీడకలిగింపక పోవుటయే; పితృవధ, మాతృవధ, మనుష్యవధ మొదలగునవి హింసలలో ఘోరము లై యున్నవి. కావున జగత్తులోని సర్వమతసంప్రదాయములలో నీయహింసాధర్మము సర్వధర్మముల లోను శ్రేష్ఠ మైన దని యంగీకరింపఁబడినది. ఐనను ప్రకృతము తెలిసికొనవలసిన విషయ మే మన:—మనప్రాణము దీయుటకైనను, భార్య, కొమార్తె వీరిని బలాత్కారపఱచుటకైనను, మనయింటికి నిప్పంటించుటకైనను, మన స్థిరచరాత్మక సర్వధనహరణమున కైనను, నెవఁ డైనదుష్టుఁడు కత్తి చేఁబూని సన్నద్ధుఁడు కాఁగా, సమీపమున రెండవవాఁడు లేనప్పు డిట్టియాతతాయిని "అహింసా పరమో ధర్మః" అని చెప్పి కన్నులు మూసికొని యుపేక్షింపవలయునా? లేక యాదుష్టుని సామోపాయములచేతను, లేక, విననియెడల దండోపాయముల చేతను యథాశక్తిగ శాసింపవలయునా?

"శ్లో. గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతమ్,
ఆతతాయిన మాయాంతం హన్యా దేవావిచారయన్."

(మను. ౮. ౩౫౦)

ఇటువంటియాతతాయి (దుష్టుఁడు) గురువుగాని, వృద్ధుఁడుగాని, బాలుఁడుగాని, విద్వాంసుఁడగు బ్రాహ్మణుఁడుగాని యైనను నీవిషయముల విచారింపకయే నిశ్శంకముగ వానిఁ జంపి తీరవలయును; కారణ మేమన:—ఇట్టిసమయములలో హింసాసంబంధ మగుపాపము హింసకునికిఁ దగులదు. ఆతతాయి తనయధర్మముచేతనే చంపఁబడుచున్నాఁడు. అని మనుస్మృతికర్త చెప్పుచున్నాఁడు. మనువుచేతనేకాక యితరు లగునవీనదండశాస్త్రకర్తలునీతిననుసరించి యైన నాత్మసంరక్షణ మనువాక్యమునకు గొప్పగౌరవ మంగీకరింపఁబడినది. ఇట్టిసందర్భములలో నహింసకంటె నాత్మసంరక్షణయోగ్యతయే యధికముగ నంగీకరింపఁబడినది. భ్రూణహత్య (గర్భస్థశిశుహత్య) యందఱిచే నతిగర్హ్యముగఁ నెన్నఁబడినది; కాని తల్లికి హాని

కలుగు నెడ నాగర్భస్థశిశువును పాత్రము నటికి పోఱువేయ నక్కఱ లేదా? యజ్ఞములో నున్న పశువధ వేదముచేతనే ప్రశస్తమని యంగీకరింపఁబడినది. (మను. ౫. ౩౧) అయినను పిష్టపశువును జేసి యదియు నొకానొకసమయమున నెఱవేర్పుటకు సాధ్య మగును. (మ.భా.శాం. ౩౩౭; అను. ౧౧౫. ౫౬.) కాని వాయువులో, ఫలములలో, జలము మొదలగువస్తువులలో నిండి యత్యల్పము లగు ననేకజీవములను జంపకుండ మనుష్యుఁ డెట్లు ప్రవర్తింపఁగలఁడు?. మహాభారతములో—

శ్లో. "సూక్ష్మయోనీని భూతాని తర్కగమ్యాని కానిచిత్
పక్ష్మణోఽపి నిపాతేన యేషాం స్యాత్ స్కంధపర్యయః."
(మ. భా. శాం. ౧౫. ౨౬.

"కన్నులకుఁ గనఁబడక పోయినను, వేని (యేజంతువుల) యస్తిత్వము తర్కముచేఁ దెలిసికొనఁబడునో యట్టిసూక్ష్మజంతువు లీజగమున నిండియున్నవి. అనఁగా: మనము మనకంటిరెప్పలను గదల్చినమాత్రముననే యీజీవములహస్తపాదాదులు విఱిగి క్రిందఁబడును." "ఇటులుండ హింసఁ జేయుము, హింసఁ జేయకుమని నోట నన్నమాత్రమున నేమిప్రయోజనము?" అని యర్జునుఁడు చెప్పుచున్నాఁడు. ఈసారాసారమునే విచారణఁ జేసి యనుశాసనపర్వములో(అను. ౧౧౬) మృగయావిషయమును సమర్థించినారు. అరణ్యపర్వములో నున్న కథ యేమనఁగా:—కోపమున నొక పతివ్రతను భస్మము చేయుట కుద్యుక్తుఁడైన బ్రాహ్మణునిప్రయత్నము నిష్ఫలము కాఁగా, నాబ్రాహ్మణుఁ డాపతివ్రతను శరణు వేఁడెను. పిమ్మట సత్యమగు ధర్మరహస్యమును తెలిసికొనుటకు నాబ్రాహ్మణు నొకానొకవ్యాధునివద్ద కాపతివ్రత పంపెను. ఆవ్యాధుఁడు మాంసవిక్రేతయయ్యు నత్యధిక మగుమాతృపితృభక్తి గలవాఁడై యుండెను. ఈవ్యాధునివ్యాపారమును జూచినయీబ్రాహ్మణున కత్యంత విస్మయమును, ఖేదమును గలిగెను. అప్పు డావ్యాధుఁడు బ్రాహ్మణునకు నిజమగు తత్త్వమును జెప్పి నమ్మకము కల్గునటుల చేసెను. జగత్తున నెవ రెవరిని దినుట లేదు? "జీవో జీవస్య జీవనం" (భాగ. ౧. ౧౩. ౪౬) ఈవ్యవహార మెల్లప్పుడును జరుగుచునే యున్నది. కావున నాపత్కాలమం దైన "ప్రాణ స్యాన్న మిదం సర్వం" (మను. ౫—౨౮; మహాభా. శాం. ౧౫. ౨౧) అనిస్మృతికారులచేతనే కాక యుపనిషత్తులలో సైతము స్పష్టముగఁ జెప్పఁబడినది. (వే. సూ. ౩. ౪. ౨౮; ఛాం. ౫. ౨. ౧; బృ—౬. ౧—౧౪). అందఱచేతను హింస వదలి వేయఁబడినయెడల క్షాత్రధర్మముమాత్ర మెటుల నిలిచును? క్షాత్రధర్మము నశించినయెడఁ బ్రజలకు

రక్షకుఁడెవఁడు? ప్రతిమనుజుఁడు తనకంటె బలహీనుఁడగువాని నెల్లఁ బట్టి హింసించుట సంభవించును. సారాంశ మేమన:—నీతియొక్క సామాన్యనియమముల వలనఁ గొన్నిసమయములలో తప్పక కార్యనిర్వాహము గాకపోవుచున్నది. కావున నీతిశాస్త్రములో ముఖ్య మని చెప్పఁబడినయహింసయొక్క నియమములయందు సైతము కర్తవ్యాకర్తవ్యములతారతమ్యవిచారము లేకపోలేదు.

అహింసాధర్మము ననుసరించియే, క్షమ, శాంతి, దయ యనునీగుణములు శాస్త్రములోఁ జెప్పఁబడినవి; కాని యీశాంతి యన్నిసందర్భముల నెటుల నడచును?. శాంతముగ నుండువానిభార్యాపుత్త్రాదులసైతము నితరులు వానియొట్టయెదుటనే యపహరించుకొనిపోకుండ నుండ రనునీకారణమును ముందు నిరూపించి, పిమ్మట ప్రహ్లాదుఁడు తనమునిమనుమఁ డగు బలికి మహాభారతమున—

శ్లో. "న శ్రేయ స్సతతం తేజో న నిత్యం శ్రేయసీ క్షమా

.... .... .... ....

తస్మా న్నిత్యం క్షమా తాత! పండితై రపవాదితా."

(వన. ౨౮. ౬—౮)

"సర్వదా క్షమయు, సర్వదా తైక్ష్ణ్యమును శ్రేయస్కరము గానేరదు. నాయనా! యీకారణముననే పండితులు క్షమ కపవాదమును జెప్పియున్నారు." అని చెప్పెను. పిమ్మట క్షమయే యోగ్యమను ప్రసంగములలోఁ గొన్ని ప్రసంగములు ప్రహ్లాదునిచే వర్ణితములు లైనవి. అయిన నీప్రసంగముల నెట్లు తెలిసికొనవలయునో యాతత్త్వమును బ్రహ్లాదుఁడు చెప్పలేదు. కాని ప్రసంగమును దెలిసికొనక యీయపవాదము నెవఁడైన నుపయోగించిన వాఁడే దుర్వర్తన గలవాఁడుగ నుండును. కావుననే యీప్రసంగము నెటుల రెఱుంగవలయునో యాతత్త్వము నెఱుంగుటయే యత్యంత మహత్త్వకారణముగ నున్నది.

జగత్తున సర్వదేశములలో సర్వధర్మములలో నాబాలవృద్ధముగ స్త్రీపురుషుల కన్నిటికంటె మాన్యముఁ బ్రమాణము నగురెండవతత్త్వము 'సత్యము.' దానిమహత్త్వ మెంతని వర్ణింతుము? సృష్టిలోఁ బ్రప్రథమమున "ఋతము" "సత్యము" నుత్పన్నము లైన వనియు, నాసత్యముచేతనే యాకాశము, పృథ్వి, వాయువు మొదలగు పంచభూతములును వ్యాపించి ధరింపఁబడినవనియు వేదములలోనే సత్యముయొక్క మహత్త్వము స్తుతింపఁబడినది. "ఋతంచ సత్యం చాభీద్ధా త్తప

సో ఽధ్యజాయత." (ఋ.౧౦౧౯౦౧) "సత్యే నో త్తభితా భూమిః." (ఋ. ౧౦. ౮౫. ౧) ఇత్యాదిమంత్రములంజూడుము. "ఉండునది." అనఁగా "సదానాస్తిత్వమును బొందునది కాదు," లేక, "త్రికాలములయందున బాధితముగ నుండునది." అని సత్యశబ్దముయొక్క ధాత్వర్థము. కావుననే "సత్యా పరతా నాహిం ధర్మ, సత్యతేచీ పరబ్రహ్మ" "సత్యముకన్న చే అగుధర్మము లేదు. సత్యమే పరబ్రహ్మస్వరూపము." అని సత్యముయొక్క యథార్థమహత్త్వము వర్ణితము. "నాస్తి సత్యాత్పరో ధర్మః" (శాం. ౧౬౨. ౨౪). ఈవచనము మహాభారతములో ననేకస్థలముల వచ్చియున్నది. ఇంతియకాక—

శ్లో. "అశ్వమేధసహస్రం చ సత్యం చ తులయా ధృతమ్
అశ్వమేధసహస్రాద్ధి సత్య మేవ విశిష్యతే."

(ఆ. ౭౪. ౧౦౨)

"వేయియశ్వమేధములను సత్యమును త్రాసున నుంచి తూఁచఁగ సత్యమే యెక్కువ బరు వగును" అనియు సామాన్యసత్యసంబంధమునఁ జెప్పఁబడినది. సత్యమాడుట యనుసంబంధమున మనువు—

శ్లో. "వాచ్యర్థా నియతా స్సర్వే వాఙ్మూలా వాగ్వినిస్సృతాః
తాం తు యస్స్తేనయే ద్వాచం స సర్వ స్తేయకృ న్నరః."

(మను. ౪. ౨౫౬.)

"మనుష్యమాత్రుని సర్వవ్యవహారములు వాక్కుచే నడచుచున్నవి. ఒకని యూహ మఱియొకని కెఱుకపఱచుటకు శబ్దమువంటి ముఖ్యసాధన మింకొకటి కానేరదు. సర్వవ్యవహారములకు నాశ్రయభూతమగు నీవాగూపమూలము నెవఁడు కొంచె మతిక్రమించునో (వాక్కును ప్రతారణచేయువాఁడగునో), వాఁడు సమస్తవిషయముల నొక్కపర్యాయమే మ్రుచ్చిలినవాఁడను" అని సవిశేషముగఁ జెప్పుచున్నాఁడు. కావుననే మనువు— "సత్యపూతాంవదేద్వాచమ్" (మను. ౬–౪౬) "నీవిషయమును మాటలాడవలయునో దానిని సత్యముచే పవిత్రమొనర్చి మాటలాడుము" అని చెప్పెను. ఉపనిషత్తులలో సైతము— 'సత్యంవద, ధర్మం చర" (తై. ౧.౧౧ ౧) అని యితరధర్మములకంటె సత్యమునకే యగ్రస్థానమియ్యఁబడుటచే, శరపంజరమున్మీఁదఁ బడియున్నభీష్మాచార్యులవారిచే, శాంత్యానుశాసనికపర్వములలో సైతము యుధిష్ఠిరునకును సర్వధర్మముల నుపదేశించిన

పిమ్మట వారు తమప్రాణములను వదలుటకు పూర్వము—"సత్యేషు యతితవ్యం వ స్సత్యం హి పరమం బలమ్." (మ. భా. అను. ౧౬౭. ౫౦) అని, సర్వధర్మముల సారమని సర్వోపదేశములతుద నొకసత్యమే పరిపాలింపఁబడవలయునని చెప్పఁబడినది. బౌద్ధధర్మములలోను, క్రైస్తవధర్మములలోను నీ నియమానువాదమే చేయఁబడినటుల స్పష్టమగుచున్నది.

ఇటు లన్నిమతసిద్ధాన్తముల నుండి సిద్ధమైనదియు, స్థిరకాలస్థాయియు నగు సత్యమున కెట్టియపవాదముండు నని యేరికైన స్వప్నమునైనఁ దోఁచియుండునా? కాని, దుష్టులచే నిండియున్న యీప్రపంచమునఁ జరించుట మిక్కిలికష్టముగనున్నది. కావున తెలియవలసినవిషయము ప్రకృతమున నేమనఁగా:—ఎవరైనను ఘాతుకునిచేతులలోనుండి తప్పించుకొని దాగికొనుటకు పాఱిపోవుచు మనకు కనఁబడిన వెంటనె వెనుకనుండి వానిఁ జంపుటకుఁ జేతికరవాలముతో వెంబడించి వచ్చినాఘాతుకుఁడు "ఇప్పు డిటు పరువెత్తుకొని వచ్చినమనుజుఁ డేవైపున పోయెను?" అని మనల విచారించిన, మన మేమిసమాధానమ్ముఁ జెప్పవలయును? సత్యముచెప్పుదమా? పాపమా నిరపరాధిప్రాణముల నసత్యమాడి తప్పింతమా? ఇటు లేల యడుగవలయు ననిన, నిరపరాధి యగు ప్రాణియొక్కహింసను తప్పించుటయు సత్య మంత మహత్త్వముగలిగిన ధర్మమే శ్లో. "నాపృష్టః కస్యచి ద్బ్రూయా న్నచాన్యాయేన పృచ్ఛతః." "అడుగనిదే యెవరితోను మాటలాడఁ గూడదు. మఱియు నన్యాయముగ ప్రశ్నఁజేసి విచారించినను సమాధాన మియ్యరాదు."(మను. ౨. ౧౧౦; మ. భా. శాం. ౨౮౭. ౩౮) "జానన్నపి హి మేధావీజడవల్లోక ఆచరేత్" "ఆవిషయము తెలిసినను పిచ్చివానివలె హూఁహూఁయనుచుఁ గాలక్షేపముఁ జేయవలయును." అని మనువు చెప్పుచున్నాఁడు. సరియే. బాగుగనే యున్నది ! హూఁహూఁ యని ధ్వనిచేయుట మాత్ర మసత్యమాడుట కాదా? "న వ్యాజేన చరే ద్ధర్మం" (మ. భా. ఆది. ౨౧౫. ౩౮) "మోసముఁజేసి నీ తెలివి తేటలను ధర్మమున నుపయోగింపకుము. ధర్మమును వంచన చేయరాదు. కాన నీవే వంచింపఁబడుదువు" అని భారతములోనే యనేకప్రదేశములలోఁ జెప్పఁబడియున్నది; కాని హూఁహూఁ యని కాలక్షేపముఁ జేయుటకు సైతము వీలులేనియెడల నేమిచేయవలయును? చోరుఁడు శస్త్రపాణియై ఱొమ్ముపై నెక్కి "నీద్రవ్య మెక్కడ నున్న?"దని యడుగ, సమాధానముఁ జెప్పనియెడల ప్రాణహాని యగునపు డేమి చెప్పవలయును? సకలధర్మరహస్యముల నెఱింగిన శ్రీకృష్ణభగవానుఁడు పూర్వోక్త

మైనఘాతుకుని విషయోదాహరణ మిచ్చి కర్ణపర్వములో నర్జునునకును, (కర్ణ. ౬౯. ౬౧) భీష్ములవారు శాంతిపర్వములోని సత్యానృతాధ్యాయమున యుధిష్ఠిరునకును

శ్లో. "అకూజనేన చేన్మోక్షో నావకూజేత్కథంచన
అవశ్యం కూజితవ్యే వా శంకేరన్వాఽ ప్యకూజనాత్
శ్రేయ స్తత్రానృతం వక్తుం సత్యా దితి విచారితమ్".
(మ. భా. శాం. ౧౦౯. ౧౫-౧౬)

"మాటలాడకుండఁగనే వదలించుకొనుట శక్య మైనపక్షమున నేమైనను సరే! మాట లాడ కూడదు; మాటలాడ వలసినదియే యావశ్యక మైనపక్షమునను, మాట లాడక పోయిన నితరులకు సందేహము కలుగుట సంభవించుపక్షమునను, అప్పుడు సత్యమాడుటకంటె నసత్యమాడుటయే మేలైనది." అని చెప్పి విచారణచేసి నిశ్చయించిరి. కారణ మేమన:—సత్యధర్మము కేవలశబ్దోచ్చారణమాత్రముతో సమాప్తము కానేరదు. కావున, ఏ వాగ్వ్యవహారముచే సమస్తజనులకుఁ గల్యాణ మగునో, యావాగ్వ్యవహారము కేవలశబ్దోచ్చారణముచేత యనర్థమైనంతమాత్రమున నింద్యమనుటకు సాధ్యము కాదు. దేనిచే సమస్తజనులకు హానికలుఁగునో యది సత్యము గాని, యహింస గాని కానేరదు.

శ్లో. "సత్యస్య వచనం శ్రేయ స్సత్యా దపి హితం వదేత్
య ద్భూతహిత మత్యంత మేత త్సత్యం మతం మమ."
(మ.భా. శాం. ౩౨౯. ౧౩; ౨౮౭. ౧౯)

"నిజ మాడుట ప్రశస్తము. సత్యముకంటె సర్వభూతహిత మైనమాట లాడుట ప్రశస్త మైనది. ఏలయన : దేనివలన సర్వభూతములకు నత్యంతహిత మగునో యదియే సత్య మని నాయభిప్రాయము" అని శాంతిపర్వమునఁ, దనకు సనత్కుమారులవారు చెప్పినట్టుల, నారదులు శ్రీశుకునకుఁ జెప్పినారు. "యద్భూతహితం" అనుపదమును జూడఁగ, నాభునికి లగునాంగ్లేయోపయుక్తవాదుల స్మరణ కలుఁగుటచే నీవచన మెవనిచేతనో ప్రక్షిప్తముగ వ్రాయఁబడిన దేమో యను కొన నక్కఱలేదు. ఈవచనము మహాభారతమున నరణ్యపర్వాంతర్గత బ్రాహ్మణవ్యాధ సంవాదమున సైతము రెండుమూఁడు పర్యాయములు వచ్చినది. అందొకచో—
శ్లో. "అహింసా సత్యవచనం సర్వభూతహితం పరం" (వన. ౨౦౬. ౭౩)అనియు, మఱియొకచోట— శ్లో. "య ద్భూతహిత మత్యంతం త త్సత్య మితి ధారణా"

(వన. ౨౦౯.౮)అనియుఁ గొంతపాఠభేదముగనున్నది. సత్యప్రతిజ్ఞుఁ డగుయుధిష్ఠిరుఁడు ద్రోణునకు "నరో వా కుంజరో వా" యని యుత్తర మిచ్చి వ్యామోహమును గలిగించుట కింతకంటె వేఱు కారణ మేదియులేదు. కావున నిట్టి యితరవిషయముల సైత మీన్యాయమే సంబంధించియుండును. హత్యఁజేసినమనుష్యునిజీవము నసత్యమాడి రక్షింపవలయు నని మనశాస్త్రములు వచింపవు. కారణ మేమన:— శాస్త్రములలో హత్యఁ జేసినమనుష్యునకు దేహాంతప్రాయశ్చిత్త మైనను,వధయైనను జెప్పఁబడియుండుటచే నట్టివాఁడు శిక్షణీయుఁడుగను వధ్యుఁడుగను నగును. ఈవిషయమున నైనను,నింక నిట్టియితరప్రసంగములలో నైనను, నబద్ధపుసాక్ష్య మిచ్చు మానవునికిఁ బూర్వ మేడుతరముల పితరులును,ఇంక నంతకన్నఁబూర్వులును, ఆతఁడును తప్పక నరకమును బొందుదు రని శాస్త్రకారులును వచించి యున్నారు. (మను.౮. ౮౯-౯౯; మ. భా. ఆ. ౭.౩) కాని పైఁ జెప్పఁబడిన కష్టపర్వములోని ఘాతుకునిప్రశ్నయందువలె మనము సత్యము వచించినచో, నిరపరాధి యగుమానవునిప్రాణము నిష్కారణముగఁ బోవునంతసమయము వచ్చెనేని యేమిచేయుదుము? 'గ్రీ'నను పేరు గలయొకయింగ్లీషుగ్రంథకర్త "నీతిశాస్త్రోపోద్ఘాత" మనుతనగ్రంథమున నిట్టి ప్రసంగములలో నీతిశాస్త్రము నోరు మూసుకొనికూర్చుండు నని వ్రాసినాఁడు; మనువు, యాజ్ఞవల్క్యులు నిట్టిప్రసంగములను సత్యాపవాదములలోఁ బరిగణింతురనుట సత్యమే. అయిన నట్లు చేయుటసైతము వారిమతమున సామాన్యముగ గౌణమై యుండుటచే, శ్లో. "తత్పావనాయ నిర్వాప్య శ్చరు స్సారస్వతో ద్విజైః." (యాజ్ఞ. ౨. ౮౩; మను ౮. ౧౦౪-౧౦౬) అని తుదకాతనికిఁ బ్రాయశ్చిత్తము విధింపఁబడినది. అహింసాపవాదమునుగుఱించి యాశ్చర్యపడకపోయినను కొంతమందిగొప్పయాంగ్లేయులు సత్యవిషయమున మనధర్మశాస్త్రకారులకుఁ బేర్లు పెట్టుటకు, (నాక్షేపించుటకు) ప్రయత్నించినారు. కావుననే ప్రమాణభూతు లగుక్రైస్తవధర్మోపదేశకులును, నీతిశాస్త్రగ్రంథకర్తలగు నాంగ్లేయులును నీవిషయమున వచించుదాని నిచ్చోఁ జెప్పుచున్నాను. "నాయసత్యసంభాషణచేఁ బ్రభువుసత్యమహిమ యధికమై వృద్ధిఁ బొందెనేని (అనఁగా: క్రైస్తవధర్మమునకధికప్రచారము కలిగెనేని) దానివలన నేనెట్లు పాపి నగుదును?" (రోమా. ౩.౭) అని క్రీస్తుశిష్యుఁ డగు 'పాల్' అనువానినోటనుండి వచ్చినసంభాషణ బైబిలుక్రొత్తనిబంధనయాజ్ఞలలో (కరారులలో) కనఁబడుచున్నది. ప్రాచీనక్రైస్తవధర్మోపదేశకు లెన్నిపర్యాయము లిట్టు లాచరించుచు వచ్చిరో యాసంగతి క్రైస్తవధర్మేతిహాసకారుఁ డగు "మిల్మ" నునువానిచేఁ జెప్పఁబడినది. ఎవరి నైనఁ

బీడించి యైనను, నిర్బంధించి యైనను బ్రవర్తించుట న్యాయ్యమని తలఁచువారు వర్తమానకాలికు లగుపాశ్చాత్యనీతిశాస్త్రజ్ఞులలో సామాన్యముగ లేరని చెప్పవచ్చును. అయినను సత్యధర్మము నిరపవాదమని వారును జెప్పరు. ఉదాహరణార్థము, "సిజ్విక్" అను పండితుని నీతిశాస్త్రగ్రంథము ప్రస్తుతపాఠశాలలలోఁ జదివింపఁబడుచున్నది గావున దానినే తీసికొందము. సిజ్విక్కు, కర్మాకర్మముల సంశయస్థలమున "నెక్కువజనుల కెక్కువసుఖ" మనునీతత్త్వముయొక్క యాధారముచే నీతినిర్ణయముఁ జేయుచు నీమార్గము ననుసరించి తుదకు నిట్టిప్రసంగములలోఁ బసిబాలురకును బిచ్చివారికిని నశక్తులకును (సత్యమాడినఁ బ్రకృతికపాయము గల్గువారికి) దమ శత్రువులకును చోరులకును (మాటలాడకపోయిన నిలువఁజాలని వారికి) తన్నుద్దేశించి యన్యాయముగఁ బ్రశ్న చేయువారికిని నుత్తరము చెప్పునప్పుడును, న్యాయవాదులు తమకర్తవ్యముననును, 'నసత్యసంభాషణ చేయుట తప్పు కా" దని నిశ్చయించెను. * మిల్లు తననీతిశాస్త్రగ్రంథమున వీని నపవాదములలోఁ జేర్చెను. † ఈయపవాదములే కాక సిజ్విక్కు తనగ్రంథములో "అందఱును సత్యముగనే నడచుకొనవలయు"నని చెప్పినను, "ఏరాజకీయపురుషునకుఁ దనకార్య [illegible] స్యంబులు [illegible] యూ కొ [illegible] దెసిప [illegible] సత్యము గాని, యహింసించుకొనవలయునో యాతఁడితరులకును, వ్యాపారులకును, "సత్తముములలో నియతముగ సత్యమే చెప్పవలయునని నేను చెప్పుటలే" ము వ్రాసినాఁడు. ‡ (మూఁడవస్థలములో నిట్టిసంగతియే పాదిరీభటులకును, సిపాయీలకును, జెందియున్న దని సిజ్విక్కు చెప్పియున్నాఁడు.) ఆధిభౌతిక దృష్టిచే నీతిశాస్త్రముయొక్క యూహాపోహాలను జేసిన "లెస్లీస్టీఫన్" అను నింగ్లీషుగ్రంథకర్త యిట్టి మఱియొకయుదాహరణ మిచ్చి తుదకు "నామతమును బట్టి యేకార్యపరిణామమునైనను పూర్తిగ విచారించియే దాని నీతిమత్త నిశ్చయింపఁబడవలసినది. అసత్యసంభాషణచే నందఱకును గళ్యాణ మగునని నాకు నిశ్చయము కలిగినపక్షమున నసత్యసంభాషణకు నేను భయపడువాఁడను గాను మఱియు నీనిశ్చయ మిటులే యుండుటకు శక్య మగు నేని యాసమయము

* Sidgwick's *Methods of Ethics*, Book III. Chap. XI § 6. p. 355 (7th Ed.). Also see pp. 315-317 (same Ed.).

† Mill's *Utilitarianism*, Chap. II. pp. 33-34 (15th Ed. Longmans 1907).

‡ Sidgwick's *Methods of Ethics*, Book IV. Chap. III § 7. p. 454 (7th Ed.); and Book II. Chap. V. § 3 p. 169.

నని దసత్యసంభాషణమే కర్తవ్య మని నేననుకొందు" నని వ్రాసినాఁడు. *నీతి శాస్త్రము నధ్యాత్మదృష్టిచే విచారణ చేయు "గ్రీన్" దొరగా రటులే యుపన్య సించి "యీసందర్భములలో నీతిశాస్త్రము మానవుల సందేహనివృత్తిఁ జేయనేర" దని స్పష్టముగఁ జెప్పుచున్నారు. మఱియు సామాన్యవిధి యెద్దియైనను విధియే కావున, సదా యావిధిని బరిపాలించుటలో నేమాత్రమైనను మహత్త్వ మున్న దనిచెప్పక, సామాన్యముగ దానిని బరిపాలించుటలో మనకు శ్రేయస్సు కల దని మాత్రమే నీతిశాస్త్రము చెప్పు"నని తుదకు సిద్ధాంతపఱిచెను. కారణ మేమన:— ఇట్టిసమయములలో మనము, కేవలము నీతికొఱకే, లోభమూలకములు నీ క్షుద్రములు నైన మనమనోవృత్తులను త్యజించుట కభ్యసించు చుందుము. † నీతిశాస్త్రమును గుఱించి గ్రంథములు వ్రాసిన "బెయను, హ్వెవెల్," మొదలగునితరాంగ్లేయ పండితులమతముసైత మిట్టిదే. ‡

పైఁజెప్పఁబడినయింగ్లీషుగ్రంథకర్తలయొక్క మతమును, మనధర్మశాస్త్ర కారులచే విధింపఁబడిననియమములను జూచినయెడల "సత్య" విషయమున నధిక మగుపట్టుదలి కలవా రెవరైనదియు సహజముగ గోచరించును.

శ్లో. "న నర్మయుక్తంవచనం హినస్తి న స్త్రీషు రాజన్! న వివాహకాలే
ప్రాణాత్యయేసర్వధనాపహారే పంచానృతా న్యాహురపాతకాని."

[మహాభారతము ... ఆదిపర్వము ౮౨ — ౧౬]

"హాస్యమునందును, స్త్రీలవిషయమునందును, వివాహాదములలోను, ప్రాణాపాయము సంభవించునపుడును, తనసర్వధన మపహృతమగునపుడును మాత్రము మీఁద నీయైదువిషయములయందును నసత్యసంభాషణము పాతకము కాదు." ఈవిషయము శాంతిపర్వమునను(శాం.౧౦౯)మనుస్మృతి(మను.౮.౧౧౨)యందును కలదు. ఈతీరున మనశాస్త్రములలోఁ జెప్పఁబడియుండుట సత్యమే; కాని దీని

---

* Leslie Stephen's *Science of Ethics,* Chap. IX § 29. p. 369 (2nd Ed.) "And the certainty might be such a kind as to make me think it a duty to lie."

† Green's *Prolegomena to Ethics,* § 315. p. 379 (5th Cheaper Edition.).

‡ Bain's *Mental and Moral Science,* p. 445. (Ed. 1875); and Whewell's *Elements of Morality,* Book II. Chaps. XIII and XIV. (4th Edition. 1864).

యర్థము, స్త్రీలయొద్దఁ దప్పక యసత్యమాడవలయు నని కానేరదు. సిడ్జివిక్ దొరగారే యీయూహానుమానంబున నిడుకొని బాలోన్మత్తరోగులవిషయముల నపవాదమును జెప్పిరో, యాయూహయే మహాభారతములో నభిప్రేత మైనది. ఐనను పారలౌకికము నాధ్యాత్మికము నైనదృష్టి కలవరింపఁ జేయునింగ్లీషు గ్రంథకర్త లింకను దూరముగఁ బోయి యాలోచించి వ్యాపారులు సైతము స్వలాభార్థ మసత్య మాడినను తప్పులే దనిరి. కాని "మత్తయి" చేఁ జెప్పఁబడిననీతిమాత్రము మనశాస్త్రకర్తలచే నెప్పుడు నంగీకరింపఁబడలేదు. సత్యశబ్దోచ్చారణము కేవలవాచికశబ్ద మనియు, సర్వభూతహిత మన వాస్తవికసత్యమనియుఁ జెప్పి, యీరెంటికి విరోధము సంభవించిన యెడల, వ్యవహారదృష్టిచే నపరిహార్యమని యసత్య మాడి నిర్వహించుకొనుట కొన్నిస్థలములందు మనవారిచే నంగీకరింపఁబడినమాట సత్యమే. అయినను సత్యాది నీతిధర్మములు మనవారిమతములో నిత్యము (అనఁగా: సర్వకాలములయందు నేకరీతిగనే యబాధితము)లై యుండుటచే పారలౌకికదృష్టి ననుసరించిన నిది కొంచెమైనను సామాన్యముగఁ బాపముగనే యున్నదని నిశ్చయించి యందుకొఱకుఁ బ్రాయశ్చిత్తమును సైతము విధించిరి. ఈప్రాయశ్చిత్తములు నిరర్థకములని శుద్ధాధిభౌతికశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈప్రాయశ్చిత్తములు విధించినవారియొక్కయు, ఏకారణమున నితరులచే నవి వ్యర్థములని చెప్పఁబడుచున్నవో వారియొక్కయు, దృష్టి యేకరీతిగ నుండకపోవుటచేఁ బూర్వోక్తము లగునిరెండుసత్యాపవాదములును గౌణముగనే యంగీకరింపఁ బడవలయునని సిద్ధాన్తము చేయవలసి వచ్చుచున్నది. మఱియు నీయర్థమే యీసంబంధములో నున్నకథానకములలోఁ బ్రతిపాదింపఁబడినది. ఉదాహరణము:—యుధిష్ఠిరుఁడు "నరో వా కుంజరో వా" యని తనపని కంతరాయజనక మగుప్రసంగమున నొక్కపర్యాయమే యెటులో చెప్పెను. ఈ హేతువుచేతనే యంతకుఁ బూర్వము నేల వదలి నాలుగంగళముల యెత్తున నంతరిక్షమున నడచెడియతనిరథము పిదప నితరులరథముల వలెనే నేలమీఁదనే నడచుచుండెను. తుద కాకారణముననే గడియ యైన నరకములో వాసము చేయవలసి వచ్చినదని మహాభారతములోఁ జెప్పఁబడినది. (ద్రో. ౧౯౧. ౫౭-౫౮; స్వర్గ. ౩. ౧౫) ఇటులే భీష్మవధయుఁ క్షాత్రధర్మప్రమాణముగనే చేయఁబడినది. అయిన శిఖండిని ముందుంచుకొని యటుల చేయుటచే నర్జునునకుఁ దనకుమారుఁ డగు బభ్రువాహనునిచే ననంతరముఁ గలిగిన పరిభవమును సహించుట ప్రాప్త మైనది. (మ. భా. అశ్వ. ౮౧. ౧౦). ఈయుదాహరణములవలన ప్రసంగవిశేషములందుఁ

జెప్పఁబడినపూర్వోక్తాపవాదములు ముఖ్యము లగుప్రమాణములు. కాకపోవుటచే మహాదేవుఁడు పార్వతికి చెప్పినటుల.—

శ్లో. "ఆత్మహేతోః పరార్థే వా, నర్మహాస్యాశ్రయా త్తథా
యే మృషా న వద న్తీహ తే నరా స్స్వర్గగామినః."
(భా. అను. ౧౪౪. ౧౯)

"స్వార్థమునకైనను, పరహితమునకైనను, హాస్యమునకైన, నెక్కుడ నైన నేపురుషుఁ డసత్యమాడఁడో యాతనికే స్వర్గప్రాప్తి యగు"నని మహాశాస్త్రకారుల నిశ్చయసిద్ధ మగుతాత్త్వికసిద్ధాన్త మని చెప్పఁబడియున్నది. తనమాట నైనను ప్రతిజ్ఞనైనను పరిపాలించుట యనునది సత్యములో నంతర్భూత మగును. "హిమాలయ మైనఁ గదలిక నొందును. అగ్ని యైనఁ జల్లఁదనము నొందును. కాని నావాక్య మన్యథా కానేరదు" అని శ్రీకృష్ణునిచేతను, భీష్మునిచేతను చెప్పఁబడినది. (మ. భా. ఆ. ౧౦౩; ఉ. ౮౧. ౪౮) భర్తృహరి సైతము.—

శ్లో. "తేజస్విన స్సుఖ మసూ నపి సంత్యజంతి
సత్యవ్రతవ్యసనినో న పునః ప్రతిజ్ఞా[illegible]"

"తేజోవంతుఁడు సంతోషముగఁ బ్రాణముల నైన విడుచును కాని తనప్రతిజ్ఞను మాత్రము విడువఁడు." (భర్తృ[illegible]ండు నని వ్రాసి [illegible] షులను వర్ణించియున్నాఁడు. అటులే శ్లో "ద్వి శ్శరం [illegible]దములలోఁ [illegible] ర్నాభిభాషతే." అని దశరథరామచంద్రునియొక్క [illegible] సమానముగ నేకబాణవ్రతమును నేకవచనవ్రతమును సైతము ప్రసిద్ధము లై యున్నవి. మఱియు స్వప్నమునఁ జేయఁబడినప్రతిజ్ఞను సత్యముగఁ జేయుటకై హరిశ్చంద్రుఁడు చండాలురయింట నీళ్ళు మోసినటుల పురాణములలో కథయున్నది. కాని యిందులకు వ్యతిరేకముగ నింద్రాదిదేవతలు వృత్రాసురాదులతోఁ బ్రతిజ్ఞలఁ జేసి వాని నుల్లంఘించి, లేక, యందులకై వానిలో నేవో కొన్ని కారణముల నాలోచించి యైన నావృత్రాసురాదుల వధించి రని వేదములలో వర్ణితములై యున్నవి. తదనుసారముగనే హిరణ్యకశిపునివధవిషయక మగుసంగతి పురాణప్రసిద్ధము. ఇంతియ కాక వ్యవహారములలో సైతము కొన్ని ప్రతిజ్ఞలు న్యాయస్థానములలో న్యాయబహిర్భూతములనికాని, పరిపాలించుట కయోగ్యములని కాని యంగీకరింపఁబడుచున్నవి. అర్జునవిషయమై యిటులే యొకకథ మహాభారతములో వర్ణిత మై యున్నది.

"నీచే నున్న గాండీవము నితరుని కిమ్మని నన్నడుగువానిని నిస్సంశయముగ నఱికి చంపుదు" నని యర్జునుఁడు ప్రతిజ్ఞఁ జేసెను. పిమ్మట యుద్ధములో కర్ణునిచేఁ బరాజితుఁడైన యుధిష్ఠిరుని నోట "నీ గాండీవముతో నేమి యుపయోగము? ఆధనుస్సును నీ చేతనుండి పాఱవేయుము" అని యర్జునునుద్దేశించి నిరాశచే సాహసిక మగువార్త వెలివడఁగనే యర్జునుఁడు ఖడ్గపాణియై యుధిష్ఠిరుని జంపుటకు సిద్ధుఁ డయ్యెను. శ్రీకృష్ణుఁ డాసమయమున సమీపవర్తి యగుటచే, సత్యధర్మమనఁగా నేమియో, తత్త్వజ్ఞానదృష్టిననుసరించి సమర్థకముగ విమర్శనఁజేసి "నీవు మూఢుఁడవుగ నున్నావు; ఇప్పటికిని నీకు ధర్మసూక్ష్మము తెలియ దయ్యె. అది వృద్ధులచే లెస్సగ నుపదేశింపఁ బడవలయును." "న వృద్ధా స్సేవితా స్త్వయా" "నీవు వృద్ధుల సేవఁ జేయ లేదు." నీ ప్రతిజ్ఞ నీవు పరిపాలింపఁదగినది యైనపక్షమున యుధిష్ఠిరుని నిందింపుము; ఏలయన:—గౌరవార్హులగువారికి నిర్భర్త్సనమే (నిందించుటయే) వధగనుండును." అనియర్జునున కుపదేశించెను. మఱియు నవిచారణగఁ దనచేతనే తాఁ దెచ్చుకొనఁబోవు జ్యేష్ఠభ్రాతృవధజన్యపాతకమునుండి, యర్జునుని నివర్తింపఁజేసె నని కర్ణుఁడు చెప్పెను. (మ. భా. కర్ణ. ౬౯) శ్రీకృష్ణునిచే నాసమయమునఁ జెప్పఁబడిన ~~సత్యానృతవివేకోపదేశము చున్నారు.~~ శాంతిపర్వమున సత్యానృతాధ్యాయములో భీష్మునిచే యుధిష్ఠిరున కుపదేశింపఁబడినది. (మ. భా. శాం. ~~౧౦౯~~) మఱియు వ్యవహారమున సర్వధర్మసూక్ష్మములో నెల్లవారిచే నావిషయము గమనింపఁబడవలసినది. అయిన నీధర్మసూక్ష్మములో నెల్లవారిచే నావిషయము గమనింపఁబడవలసినది. ~~(ఈ)~~ అయిన నీధర్మసూక్ష్మ మెటు లెఱుంగవలయునో వచించుట యసాధ్యము. కారణ మేమన:—భ్రాతృధర్మము సత్యముకంటెఁ బ్రకృతోదాహరణమున శ్రేష్ఠమైనది యైనను, గీతలలో నందుకు వ్యతిరేకముగ బంధుప్రీతికంటె క్షాత్రధర్మమె బలవత్తర మని నిర్ణయింపఁ బడినదని చదువరులు సహజముగ నూహింతురు.

అహింసయు, సత్యము-ననువానిలో నింతవాద ముండ నస్తేయమనుమూఁడవసామాన్యధర్మమునకైన నెంతవాద ముదిఱిన నేమి యాశ్చర్యము? ఒకఁడు యథాన్యాయముగ సంపాదించినధనమును, నిరాటంక మగుచౌర్యముచే నైనను, బందిపోటుచే నైనఁ గోలుపోవుట సంభవించినటు లైన, ద్రవ్యసంచయమే చేయుటయే యసంభవ మగుటచే నెల్లవారికీ నష్టమగును. మఱియు జనులకట్టుఁబాటు చెడి యెల్లెడలను నేనియమమును లేకయే పోవు ననునంశము నిర్వివాదమే. కాని యీనియమముల కపవాద మున్నది. ఎట్లనఁగ:—నలుదిక్కులఁ దుర్భిక్షము సంభవించుటచే, క్రయమున కైనను, గూలిచేయునర్చి సంపాదించుట కైనను, లేక, ధర్మార్థముగ నైనను

నాహారము లభింపక పోవుట యనునాపద సంభవింపఁగఁ జౌర్యముచే నాత్మసం రక్షణ చేసికొనఁదలఁచువారిని పాపు లని తలఁతుమా? ద్వాదశవర్ష క్షామము సంభవింపఁగా విశ్వామిత్రున కిట్టి దురవస్థ ప్రాపించి యాముని శ్వపాకుని (కుక్కను తినువాని) యింటనున్నకుక్కమాంసము గలపాత్ర నెత్తికొని పోయి యభక్ష్య మగునాయన్నముచే నాత్మసంరక్షణఁ జేసికొనెనని మహాభారతములో నున్నది. (శాం.౧౪౧) శ్వపచునిచే విశ్వామిత్రునకు "పంచ పంచనఖా భక్ష్యాః" (మను. ౫. ౧౮) * మొదలగు శాస్త్రప్రమాణములవలన నభక్ష్యభక్షణము కూడ దనియు, నదియుఁ జౌర్యముచే బొత్తుగఁ దగ దనియు శాస్త్రానుసారముగ ననేకోపదేశములు చేయఁబడెను. కాని—

శ్లో. "పిబం త్యేవోదకం గావో మండూకేషు రుద త్స్వపి,
న తేఽధికారో ధర్మేఽస్తి మా భూ రాత్మప్రశంసకః."

"ఓరీ! కప్ప లేడ్చుచున్నను గోవులు నీరు ద్రావక మానవు; నోరెత్తకుము; నాకు ధర్మోపదేశ మొనర్చుటకు నీ కధికారము లేదు. వ్యర్థముగ నీ ప్రగల్భతఁ జూపకుము" అని చెప్పి విశ్వామిత్రుఁ డాశ్వపచుని నవమానించెను. "జీవితం మరణా చ్ఛ్రేయో జీవ న్ధర్మ మవాప్నుయాత్." "బ్రతికియుండిన ధర్మ మొనర్పనగును. కావుననే ధర్మదృష్టి ననుసరించి చూచినను మరణముకంటె

* కుక్క, కోఁతి, మొదలగు నైదుగోళ్లజంతువులలో నేముపంది, అడవి పంది, కుందేలు, ఉడుము, తాఁబేలు అను నైదుజంతువులమాంసమే భక్షింపఁ దగినది. (మను. ౫. ౧౮; యాజ్ఞ. ౧. ౧౭౭) ఈయయిదుజంతువులమాంసమే కాక ఖడ్గమృగపుమాంసము నైతము భక్షింపఁదగు నని మనువు ఒప్పుకొనెను. ఈవిషయము వికల్ప మని వ్యాఖ్యాతలయభిప్రాయము. ఈవికల్పమును వదలిన యెడల మిగిలినయైదుజంతువులమాంసమే భక్షింపఁదగినది. "పంచ పంచనఖా భక్ష్యాః" అనుమనువచనమున కిదియే యర్థము; కాని ఎవరు మాంసము తినవచ్చునని విధి కలదో వా రీయైదుగోళ్లు గలజంతుమాంసమునుదప్ప వేఱుగుజంతుమాంసమును దినకూడదు. ఈజంతువులమాంసముల నెల్లవారును దప్పక తినవలయు నన్న నర్థము కాదని యీవ్యవస్థకు భావార్థమని మీమాంసకులు చెప్పుచున్నారు. ఈపారిభాషికార్థమును వారు పరిసంఖ్య యందురు. పరిసంఖ్యకు "పంచ పంచనఖా భక్ష్యాః" అనునదియే ముఖ్యోదాహరణము. మాంసభక్షణము నిషేధింపఁబడినది మొద లీయైదుజంతువుల మాంసము నైతము నిషిద్ధమే యని యెఱుఁగునది.

జీవితము శ్రేయస్కరము.'' అని యాసమయమున విశ్వామిత్రుఁడు సమాధానముచెప్పెను. మఱియు విశ్వామిత్రుఁడే కాక యిట్టిప్రసంగములలో 'నజీగర్తుఁడు, వామదేవుఁడు' మొద లగున నేకమహార్షులు నై తమిటులే యొనర్చి రని యాచరణకర్తలయుదాహరణము మనువుచే నియ్యఁబడినది. (మను. ౧౦. ౧౦౫-౧౦౮) 'హాబ్స'ను పేరు గలయాంగ్లేయగ్రంథకర్త తనగ్రంథమున "ఒకానొకకఠిన మగుదుష్కాలమున, కొనుటకుఁగాని,ధర్మార్థముగఁగాని యన్నము లభింపనప్పుడుదరపోషణార్థమై చౌర్యమునైనను సాహసము నైనను జేసినపక్షమున వానియాయపరాధము మన్నింపఁబడవలసినదే.'' యని చెప్పెను. † మఱియు 'మిల్ల'ను పండితుఁ డిట్టిసమయమున చౌర్యము నైనం జేసి తనప్రాణమును కాపాడుకొనుటయే మనుష్యునకుఁ గర్తవ్య మని వ్రాసెను. "మరణముకంటె జీవితము శ్రేయస్కర'' మను నీవిశ్వామిత్రునిసిద్ధాంతముమాత్ర మన్నివిధముల నిరపవాద మై యున్నదా? జగమున బ్రతుకుటయే పురుషార్థము కానేరదు. కాకులును బలులఁ దిని యనేకవత్సరంబులు జీవించును. వీరపత్ని యగు 'విదుల'యనుస్త్రీ, "తనపుత్రులతోఁ బ్రక్కాపై[illegible]వీయ. మః [illegible] బడి యవ్యక్తధ్వనులతో నఱచుచు నూఱేం డ్లింట వ్యర్థకాలక్షేపముఁ జేయుటకంటె నొకగంటయైనను బరాక్రమజ్యోతిని జూపి మరణించుటయే గొప్ప''యని చెప్పెను."ముహూర్తం శ్రేయో న చ ధూమాయితం చిరం''(మ.భా. ఉ. ౧౩౨. ౧౫). "నేఁడైనను, రేపైనను, దుదకు నూఱేండ్ల కైనను, మృత్యువు తప్పనిదే''యని భాగవతమున నున్నది. (భాగ. ౧౦.౧.౩౮;గీత. ౨.౨౭) అటులైన నీమరణవిషయమున, భయ మైనను, రోదన మైనను, భీతియైనను, నాక్రోశ మైనను బొంద నేల? అధ్యాత్మశాస్త్రప్రమాణముగ వీక్షించిన నాత్మ నిత్య మగుటచే దానికెల్లప్పుడు మరణము రానేరదు. కావుననే మరణవిచారము చేయుసమయముననే ప్రారబ్ధకర్మానుసారముగఁ బ్రాప్త మైనశరీరవిచారణయు ముఖ్యముగఁ జేయవలసి యున్నది. ఈశరీరము, నడచుచు మాటల్లాడుచున్నను నాశము గలదియే!. కాని, యాత్మయొక్క శ్రేయస్సునకై యీజగత్తునఁ జేయవలసినకార్యములకన్నిటికిని నశ్వర మైన యీమానుషదేహమే ముఖ్యసాధనమగుటచేతనే "ఆత్మానం సతతం రక్షేత్

† Hobbes' "*Leviathan*, Part II. chap. XXVII. p. 139 (Morley's Universal Library Edition). Mill's "*Utilitariainism*, Chap. V. p. 95. (15th Edn.)— "Thus to save a life, it may not only be allowable but a duty to steal etc."

దారై రపి ధనై రపి" "భార్యచేతను, ధనముచేతనుం గూడ దన్నెపుడును రక్షించుకొనవలయు" నని మనువు చెప్పెను(మను. ౭.౨౧౩). అయినన్ని దుర్లభము నశ్వరమునైన యీమానవదేహమును వ్యయపఱిచి యింతకంటె నధికము శాశ్వతము నగునొకవస్తువును సంపాదించుకొనవలసి యుండుటచే, దేశముకొఱకును, సత్యముకొఱకును, ధర్మముకొఱకును, తనబాణము నైనను, వ్రతమునైనను, బ్రాణము నైనను సంరక్షించుకొనుటకును, మర్యాదకొఱకును, గీర్తికొఱకును, సర్వభూతహితముకొఱకును, ననేకు లగుమహాత్ములచే ననేకసమయములలో నీతీవ్రకర్తవ్యాగ్నిహోత్రమందు నానందముగఁ దమప్రాణములుసైత మాహుతిగ వ్రేల్వఁబడినవి. (౧) వసిష్ఠమహామునియావును సింహమునుండి తప్పించుటకై తనదేహమును సింహమునకు బలియిచ్చుట కుద్యుక్తుఁ డైనదిలీపుఁడు "మాబోఁటివారికిఁ బాంచభౌతిక శరీరములపై నాసక్తి యుండదు. కావున జడమగు నాశరీరముపైఁ గరుణ చూపుటకంటె నాయశశ్శరీరవిషయమున నెక్కువ దయయుంచుట శ్రేయస్కరము. కావున నటు లొనర్పుము." అని సింహమును బ్రార్థించినటుల రఘువంశగ్రంథమునందుఁ జెప్పఁబడినది (రఘు. ౨.౫౭). (౨) మఱియు సర్వప్రాణసంరక్షణార్థమై గరుడునకు స్వదేహమును జీమూతవాహనుఁ డర్పించుకొనినటుల కథాసరిత్సాగరమునను నాగానందమునను వర్ణితమైనది. (౩) మృచ్ఛకటిక యనునాటకమున

శ్లో. "న భీతో మరణా దస్మి కేవలం దూషితం యశః
విశుద్ధ స్య హి మే మృత్యుః పుత్రజన్మసమః కిల."
(మృచ్ఛ. ౧౦.౨౭)

"నేను మరణమువలన భయపడను. కీర్తికిఁ గళంకము వచ్చిన దనియే నాకు దుఃఖముగ నున్నది. కీర్తి శుద్ధముగ నుండి చావు వచ్చినను నాకు సత్యముగఁ బుత్రోత్సవముతో సమాన మగునదియే" యని చారుదత్తుఁడు చెప్పెను. (౪) మఱియు నేతన్న్యాయానుసరణముగనే శిబిచక్రవర్తి తన్ను శరణుఁ జొచ్చినకపోతమును రక్షించుటకై శ్యేనరూపముతో నీకపోతమువెంటనంటి వచ్చినధర్మదేవతకుఁ దనదేహమునందలి మాంసమును గోసి యిచ్చెను. (౫) మఱియు దేవశత్రు వగు వృత్రాసురువధకై దధీచిమహర్షియెముక యగువజ్రము కావలసి రాఁగా సర్వదేవతలు నీఋషీశ్వరుని సమీపించి "శరీరత్యాగం లోకహితార్థం భవాన్ కర్తు మర్హతి." "మహానుభావా! సమస్తరోగములశుభమునకై తాము దేహత్యాగము జేయవలయును" అని విన్నవింప నాదధీచియు మహానందముతోఁ బ్రాణములు వదలి తనదేహమునందలితనయెముకను (వజ్రమును) దేవతల కిచ్చెను. ఈకథయంతయు

భారతమున వనపర్వములో నున్నది (వన. ౧౦౦;౧౩౧; శాం. ౩౮-౨). (౬) కర్ణునకు శరీరముతోనే పుట్టినకవచకుండలములు హరించుటకై బ్రాహ్మణరూప ధారియై యింద్రుఁడు దానశూరుఁ డగుకర్ణుని యాచింపవచ్చునని యెఱింగి, సూర్యుఁడు మునుపే యాకవచకుండలముల నేరికిని యొసంగవల దని సూచనగఁ గర్ణునకుఁ జెప్పెను. ఇంతియ కాక "నీవు దానశూరుఁడ వని కీర్తియున్నను గవచకుండలము లిచ్చుటచే నీజీవితమున కపాయము రానున్నది. కావున వానిని మాత్ర మేరికి నియ్యకుము. ఏలనః— "మృతస్య కీర్త్యా కిం కార్యం" "మరణానంతరము కీర్తి వలన నుపయోగ మేమి?" అని సైతము తండ్రి యగు సూర్యుఁడు కర్ణునకు నొక్కి చెప్ప, సూర్యువచనంబుల విని "జీవితే నాపి మే రక్ష్యా కీర్తి స్తద్విద్ధి మే వ్రతమ్." "నా ప్రాణముల నిచ్చియైనను నాకీర్తిని రక్షించుకొనుటయే నావ్రతము" (మ. భా. వన. ౨౯౯.౩౮). అని కర్ణుఁడు సూర్యునకు స్పష్టముగ సమాధానము నుడివెను. వేయేల? "చచ్చెద వేని స్వర్గమును బొందుదువు, జయించెద వేని రాజ్యభోగముల సుఖింతువు" (గీ. ౨.౩౭). ఇత్యాదిక్షాత్రధర్మము గాని, "స్వధర్మే నిధనం శ్రేయః" (గీ. ౩.౩౫) అనుసిద్ధాంతము గాని యీన్యాయము నవలంబించియే యున్నది. మఱియు దాని ననుసరించియే, "కీర్తి పాహీఁ జాతాఁ సుఖ నాహీఁ, సుఖ పాహతాఁ కీర్తి నాహీఁ" "కీర్తి కావలయు ననుకొనిన సుఖ ముండదు. సుఖము కావలయు ననుకొనినఁ గీర్తి యుండదు" (దాస. ౧౨.౧౦-౧౯; ౧౮.౧౦-౨౫) కావుననే "దేహ త్యాగితాఁ, కీర్తి మాగేఁ ఉరావీ, మనా సజ్జనా హేచి క్రియా కరావీ" "ఓమానస సజ్జనుఁడా! మరణానంతరమున సైతము కీర్తి వృద్ధినొందు పనిసలుపుమా" అని శ్రీ సమర్థ రామదాసస్వామివారు రుపదేశించిరి. పరోపకారముచేఁ గీర్తి వచ్చు ననునది సత్యమైనను జచ్చినపిదప నాకీర్తియొక్క యుపయోగ మేమి? మఱియు సంభావిత పురుషునకు దుష్కీర్తికంటె మరణ మైనను, (గీ. ౨.౩౪) జీవితముకంటె పరోపకార మైనను నధిక ప్రియ మని యేల తోఁచును.? అనుసీప్రశ్నలకు సమాధానము వచించుట కాత్మానాత్మవిచారమునఁ బ్రవేశించుట కన్న వేఱుమార్గ మేదియుఁ గానరాదు. మఱియు సమాధానము వచించినను నేసమయమున జీవుఁ డుదారుఁ డగుట మంచిదియో, యేసమయమునఁ గాదో, యెఱుంగుటకై కర్మాకర్మశాస్త్రము సైతము విచారింప నగు. లేనియెడల నుదారుఁడై యనంతకీర్తిని సంపాదించుకొనుట యటులుండ, మూర్ఖత్వముచే నాత్మహత్య నొనర్చికొనినపాపము మాత్రము పైఁ బడక తప్పదు.

మాతాపితలును గురువును మొదలగు వంద్యులుఁ బూజ్యులు నగువారిని దేవతలవలెఁ బూజించుటయు, శుశ్రూషఁ జేయుటయు ననునివియే సామాన్యము లును సర్వమాన్యములును నగుధర్మములలోఁ బ్రధానములుగ నెన్నఁబడుచున్నవి. కారణ మేమన:—అటుల కానిచో, కుటుంబముయొక్క గాని, గురుకులముయొక్క గాని, లేక, మొత్తమున సమాజముయొక్క గాని సరి యగువ్యవస్థ యేనాఁడు నుండ కయే పోవును. కావుననే స్మృతులలోనే కాక యుపనిషత్తులలోసైతము "సత్యం వద ధర్మంచర" యని తొలుత బోధించి, యనంతరమందు "మాతృదేవో భవ, పితృదేవోభవ, ఆచార్యదేవో భవ" అని యధ్యయనమును బూర్తి చేసికొని పోవుచున్న ప్రతిశిష్యునకును గురు వుపదేశింపవలయునని చెప్పఁబడినది (తై. ౧. ౧౧. ౧—౨). మహాభారతమునందలి బ్రాహ్మణవ్యాధోపాఖ్యానముయొక్క తాత్పర్యము సైత మిదియ (వన. అ.—౨౧౩); కానియీధర్మముల నాచరించునపుడు సైత మనేకవిధములగు నకల్పితప్రతిబంధములు సంభవించుచున్నవి.

శ్లో. "ఉపాధ్యాయాన్ దశాచార్యః ఆచార్యాణాం శతం పితా।
సహస్రం తు పితౄన్ మాతా గౌరవే ణాతిరిచ్యతే."

(మను. ౨. ౧౪౫)

"పదిమందియుపాధ్యాయులకంటె నాచార్యుఁడును, నూర్గురాచార్యుల కంటెఁ దండ్రియు, వేయిమందితండ్రులకంటెఁ దల్లియు గౌరవవిషయమున నధికులు" అని మనువు చెప్పుచున్నాఁడు. అయినను దల్లి మహాపరాధ మొనర్చె నని పితృాజ్ఞచేఁ బరశురాముఁడు తనతల్లికుత్తుక తెగ నఱికెను. ఈకథప్రసిద్ధమైనదే (వన. ౧౧౬. ౧౪). మఱియు శాంతిపర్వమున జిరకార్యుపాఖ్యానమున (శాం. ౨౬౫)నిట్టి మఱియొకసందర్భమున, పితృాజ్ఞానుసారిముగ దల్లిని జంపుట శ్రేయస్కరమా? లేక, పితృాజ్ఞాభంగము శ్రేయస్కరమా? యనునంశమున నీధర్మముల రెంటియొక్క తారతమ్యనిర్ణయమునకై యనేకసాధకబాధకప్రమాణములు నిరూపితీములైనవి. మఱియు వేఱొకయధ్యాయములో వేఱొకవిచారణ సవిస్తరముగఁ జేయఁబడినది. వీనివలన నిటువంటిసూక్ష్మధర్మప్రసంగమున, నీతిశాస్త్రదృష్టి ననుసరించి యూహాపోహలు చేయుట యనునాచారము మహాభారతరచనాకాలమందుఁ బూర్ణమైనప్రచారమున నుండిన దని స్పష్ట మగుచున్నది. తండ్రియొక్క ప్రతిజ్ఞను సత్య మొనర్చుటకై శ్రీరామచంద్రుఁడు పదునాలుగువత్సరంబులు వనవాస

మొనర్చుట యాబాలవృద్ధ మెఱింగినదేకదా! కాని, పూర్వమందు మాతృసంబంధమునఁ జెప్పఁబడిన న్యాయమే తండ్రికిసైతము సంబంధింపఁజేయుసమయ మప్పుడప్పుడు రావచ్చును. ఉదాహరణము:—కుమారుఁడు స్వపరాక్రమముచే రాజయిన పిదపఁ దండ్రియొనర్చిన నేరము సుతునియొద్దకు విచారణకు వచ్చిన, రాజగు సుతుఁడు తనయధికారముతీరునఁ దండ్రిని శిక్షింపవలయునా? లేక కన్నవాఁడని వదలవలయునా?

శ్లో. "పితాఽఽచార్యస్సుహృన్మాతా భార్యా పుత్రః పురోహితః
నాదండ్యో నామ రాజ్ఞోఽస్తి యస్స్వధర్మే న తిష్ఠతి."
(మను. ౮.౩౩౫.)

"తండ్రియు, నాచార్యుఁడును, మిత్రుఁడును, తల్లియు, భార్యయు, పుత్త్రుఁడును, పురోహితుఁడును, నింతకంటె నెక్కువవారైనను స్వధర్మప్రమాణముగ నడువనియెడల రాజుచే దండింపఁబడఁదగినవారలే" యని మనువునక్కాణించియున్నాఁడు (మ. భా. శా. ౧౨౧. ౬౦). కారణ మేమన:—ఈవిషయమునఁ బుత్త్రధర్మమునకంటె రాజధర్మ మధికయోగ్యత గలదై యున్నది. ఈధర్మము ననుసరించియే మహాపరాక్రమశాలియు, సూర్యవంశజుఁడు నగుసగరచక్రవర్తి తన పుత్త్రుఁ డగునసమంజుఁడు దుర్వృత్తి నవలంబించి ప్రజలను దుఃఖపెట్టుచున్నాఁ డని స్పష్టముగ నెఱిఁగినప్పుడు తనరాజ్యమునుండి యతని వెడలఁ గొట్టెను. ఇటుల మహాభారతమునను శ్రీరామాయణమునను వర్ణితమై యున్నది (మ. భా. వ. ౧౦౭; రామా. ౧.౩౮). మనుస్మృతియందుసైత మిట్టిదే యొకవిషయ మున్నది. ఏమన:—అంగిరసుఁ డనుపేరు గలయొకఋషికి నల్పవయస్సుననే యుత్తమ జ్ఞానముసిద్ధించుటచే నాతనిపినతండ్రులు, మేనమామలు మొదలగుపెద్ద లతనియొద్ద నధ్యయనము సలుపుచుండిరి. అప్పుడొకనాఁడు పాఠము జరుగుచుండఁగ, శిష్యులను గురు వెప్పుడును బిలుచునటు లొకసందర్భమున నంగిరస్సునోటనుండి, పినతండ్రి మొదలగువారి నుద్దేశించి "బిడ్డలారా" యనుశబ్దము స్వభావముగ వచ్చెను. "పుత్త్రకా ఇతి హోవాచ జ్ఞానేన పరిగృహ్య తాన్!". అపుడేమి చెప్పుదు? ఆశిష్యు లగువృద్ధుల కందఱకుఁ గోపాగ్ని తల కెక్కుటచే "ఈపిల్లవాఁడు పొగరుబోతు" అని నిశ్చయించి యతనికిఁ దగినశిక్ష విధింపఁబడవలయు నని దేవతలయొద్ద నభియోగము (వ్యాజ్యము) దెచ్చిరి. ఉభయపక్షములయుక్తులను వాదములను

నాకర్ణించినపిదప, దేవతలు తుదకు "అంగిరస్సు చెప్పినదే న్యాయ్య"మని తీర్పుఁ జెప్పిరి. కారణమేమన:—

శ్లో. "న తేన వృద్ధో భవతి యే నాస్య పలితం శిరః,
యో వై యువాఽప్యధీయాన స్తం దేవా స్థవిరం విదుః."
(మను. ౨.౧౫౬)

"తల నరసినమాత్రముననే మనుజుఁడు పెద్దవాఁడు కానేరఁడు. తరుణ వయస్కుఁడైనను జ్ఞానవంతుఁడైనవాఁడే వృద్ధుఁడని దేవతలు తలఁచుచున్నారు" (మ. భా. వన. ౧౩౩.౧౧; శల్య. ౫౧.౪౭). మనువునకును, వ్యాసునకే కాక యీ ధర్మము బుద్ధునకును మాన్యమే. ఎటులన:—మనుస్మృతిలో నున్నపై శ్లోక ప్రథమ పాదము * 'ధమ్మపద' యను పేరుగల పాళీభాషలోఁ బ్రసిద్ధమైననీతిపర మగు బౌద్ధగ్రంథములోఁ బ్రత్యక్షర ముండుటచే (ధమ్మపద. ౨౬౦) "కేవలవయస్సు చేతనే పరిపక్వమైనవానిజీవనము వ్యర్థము. సత్యముగ వృద్ధుఁడును ధార్మికుఁడు నగుటకు సత్యము నహింసయు మొదలగు సద్గుణము లుండి తీరవలయును." అని చెప్పుటచేతను, "చుల్లవగ్గ" యనుపేరిటి మఱియొకబౌద్ధధర్మగ్రంథమున, "ధర్మము నిరూపించుభిక్షువు నవీనుఁడైనను స్వయముగ నున్నతాసనోపవిష్టుఁడై ప్రాచీనులకుసైతము(నవీనునికంటెఁ బూర్వమే దీక్షవహించినవారికి; అనఁగా: వయోవృద్ధులగు భిక్షువులకుసైతము) ఈనవీనునిచే ధర్మ ముపదేశింపఁబడవలసినదే" యని బుద్ధునిచే నాజ్ఞాపింపఁబడినదగుటచేఁ గూడ స్పష్ట మగుచున్నది (చుల్లవగ్గ. ౬. ౧౩.౧.). ప్రహ్లాదుఁడు తండ్రి యగుహిరణ్యకశిపుఁ దిరస్కరించి భగవంతుని ప్రత్యక్షము చేసికొనినట్లు పౌరాణికకథ నందఱు విని్నయేయున్నారు. మఱియు నాగ్రంథమునఁ జిన్నపెద్దలదే కాక పితాపుత్త్రులసర్వసామాన్యసంబంధములలో సైతమొకానొకప్పుడు చిన్నవానికే పూజ్యపదవి సంభవించినయెడల నాకార్యము తుగియు

* 'ధమ్మపద' గ్రంథమునకు ప్రాచ్యధర్మపుస్తకమాలయందు (Sacred Books of the East, Volume X) తర్జుమాయై యున్నది. చుల్లవగ్గ యను దానికి నాగ్రంథమాలలోనే (Volume X VII, XX) తర్జుమాయై యున్నది. 'ధమ్మపద' గ్రంథముయొక్క పాళీభాషలోనిశ్లోకము.— "న తేన థేరో హోతి యేనస్స పలితం సిరో, పరిపక్కో వయో తస్స మోఘ జిణ్ణో తి వుచ్చతి." 'థేర' శబ్దమునకు బౌద్ధయతు లని యర్థము. ఇది సంస్కృతభాషయందలి 'స్థవిర' శబ్దముయొక్క అపభ్రంశరూపము.

నంతవనుక నొండొకయుపాయము లేమిచే క్షణమాత్ర మాజన్యజనకభావము మఱవవలసివచ్చు నని తాత్పర్య మగుచున్నది. కాని యిట్టిసమయము లభింపకున్నను నీన్యాయమును వలసినపుడెల్ల నుపయోగించుచు నెవ్వఁడేని దుష్టబాలుఁడు దండ్రినిఁ దిరస్కరించిన వానిని మనము పశువులలో గణింపకుందుమా? "గురుర్గరీయాన్ పితృతో మాతృతశ్చేతి మే మతిః" "తలిదండ్రులకన్నను గురువు శ్రేష్ఠుఁడు" (శాంతి. ౧౦౮. ౧౭). అని భీష్ముఁడు ధర్మరాజునకుఁ జెప్పెను. ఐనను మరుత్తుఁ డనురాజుగురువు లోభమున నతని స్వయముగ వదలినపిదప నారాజు:—

"గురో రప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః
ఉత్పథం ప్రతిపన్నస్య న్యాయ్యం భవతి శాసనమ్॥"

"కర్తవ్యాకర్తవ్యముల నెఱుఁగక గర్వమున నపమార్గమున సంచరించు గురువును సైతము శిక్షింపఁ దగును" అని చెప్పె నని మహాభారతమునఁ గలదు. ఆమహాభారతమున నీశ్లోకము నాలుగుచోట్లఁ గలదు (మ. భా. ఆ. ౧౪౨.౫౨–౫౩; ఉ. ౧౭౯. ౨౪; శాం. ౫౭. ౭; ౧౪౦. ౪౮.). వీనిలో మొదటిపాఠము ముందుఁ జెప్పఁబడినరీతిగనున్నది. ఇతరస్థలములయందుఁ జతుర్థపాదస్థానమునఁ "దండో భవతి శాశ్వతః" అనియు "పరిత్యాగో విధీయతే" అనియుఁ బాఠాంతరము లున్నవి. కాని వాల్మీకిరామాయణమునఁ (రామా. ౨. ౨౧. ౧౩) దీశ్లోకము చెప్పునపుడెల్ల మొదటిపాఠమే కనఁబడుచున్నందున నేనాపాఠమునే యిచట గ్రహించితిని. భీష్ముఁడు పరశురామునితోడను, నర్జునుఁడు ద్రోణాచార్యునితోడను జేసినయుద్ధమున నీన్యాయమే మూలము; హిరణ్యకశిపుచే నియమింపఁబడిన ప్రహ్లాదునిగురువు భగవత్ప్రాప్తికి విరుద్ధ మగునుపదేశము నతనికిఁ జేయునపుడీన్యాయము ననుసరించియే ప్రహ్లాదుఁ డాయుపదేశమును నిరాకరించెను. శాంతిపర్వమునందు భీష్ముఁడు స్వయముగ శ్రీకృష్ణునితో "గురువు పూజ్యుఁ డగుట సత్యమే కాని యతఁడును నీతికి బద్ధుఁడు గావలయును; కాదేని:—

"సమయత్యాగినో లుబ్ధాన్ గురూ నపి చ కేశవ!
నిహన్తి సమరే పాపాన్ క్షత్రియ స్స హి ధర్మవిత్ ॥"

(శాంతి. ౫౫. ౧౬)

"కేశవా! మర్యాదను, నీతిని, శిష్టాచారమును బరిపాలింపక లోభియుఁ బాపియు నగువాఁడు గురువయ్యును వానిని యుద్ధమునం జంపినక్షత్రియుఁడే

ధర్మజ్ఞుఁడు” అని చెప్పెను. ఇట్లే తైత్తిరీయోపనిషత్తునందును “ఆచార్యదేవో భవ” అనిమొదటఁజెప్పి, వెంటనే “యా న్యస్మాకగ్ం సుచరితాని, తాని త్వయోపాస్యాని, నో ఇతరాణి” “మాసత్కర్మల మాత్ర మనుకరింపవలయును. ఇతరముల వదలవలయును” (తై. ౧. ౧౧. ౨). అనిచెప్పఁబడియున్నది. దీనివలన నీవు పితృదేవుఁడ (తండ్రిని దైవముగఁ దలఁచువాఁడ) వైనను నాచార్యదేవుఁడ (గురువును దైవముగఁ దలఁచువాఁడ) వైనను దండ్రియేనియు గురువేనియు సురాపానముఁ జేయుచున్నారని సురాపానము సేయకుము. కారణ మేమనః—తల్లిదండ్రి గురువు మున్నగు నందఱి యధికారముకన్న నీతిమర్యాదయొక్కయు ధర్మముయొక్కయు నధికారము మిక్కిలి బలవత్తరమైనదని యుపనిషత్తులయందు స్పష్టముగ సిద్ధాంతీకరింపఁబడియున్నది. “ధర్మమును గాపాడుము; ధర్మము నెవ్వఁడేని యతిక్రమించిన నది యతని నశింపఁజేయక మానదు” (౮.౧౪.౧౬). అని మనువు విధించుట కిదియే బీజము. “రాజు గురువుకన్న శ్రేష్ఠ యగు నొకదేవతయే” (మను. ౭. ౮; మ. భా. శాం.౬౮.౪౦). కాని యతఁడు గూడ నీధర్మము నుల్లఘింపఁ గూడదు. ధర్మము నతిక్రమించిన నతఁడును నశించు నని మనుస్మృతిలోఁ జెప్పఁబడుటచే మహాభారతమునందు నీవిషయమే వేనుఁడు ఖనినేత్రుఁడు నను రాజుల కథానకమువలన స్పష్టపఱుపఁబడినది (మను. ౭. ౪౧; ౮.౧౨౮; మ. భా. శాం. ౫౮.౯౨-౧౦౦; అశ్వ. ౪.)

అహింసయు, సత్యము, నస్తేయము నను వానివలె నింద్రియనిగ్రహము గూడ సామాన్యధర్మములలోఁ బరిగణింపఁబడుచున్నది. (మను. ౧౦.౬౩). కామము, క్రోధము, లోభము నను నవి మనుష్యులకు శత్రువులై యుండుటవలనఁ బ్రతిమనుష్యుఁడును వానిం బూర్ణముగ జయించినం గాని యతనికి నాసమాజమునకును శ్రేయము గలుగ దనునుపదేశము సర్వశాస్త్రములందును జేయఁబడియున్నది. కాఁబట్టియే విదురనీతియందును, భగద్గీతయందును

“త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్॥”
(గీత. ౧౬.౨౧. మహాభా. ఉ. ౩౨.౭౦)

“కామము, క్రోధము, లోభము నను మూఁడును నరకమునకు ద్వారములై యాత్మ నాశనముఁ జేయునవి. కావున వానిం ద్యజింపవలయును;” అని చెప్పఁబడినది. కాని గీతలలోనే భగవంతుఁడు “ధర్మావిరుద్ధో భూతేషు కామో ఽస్మి భరత

ర్షభ!" "ఓయర్జునా! ప్రాణిమాత్రమునందు ధర్మము ననుసరించి యేకామముండునో యది నేనే" (గీత. ౭-౧౧) యని తనస్వరూపమును వర్ణించి యున్నాఁడు. ఈ పై గ్రంథము ధర్మవిరుద్ధ మగుకామమే నరకమునకు ముఖ్యద్వారమనియు, నట్టిది కాక మఱియొకవిధమగు కామము భగవంతునకు మాన్యముగ నున్నదనియు స్పష్టమగు చున్నది. మఱియు "పరిత్యజే దర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ" "ధర్మము నకు విరుద్ధములగునర్థకామములమాత్రమునదలవలయును" (మను. ౪-౧౭౬)అనిమను వుచేఁ జెప్పఁబడినది. సర్వప్రాణులును రేపే కామమహారాజున కధీనులుగ నుండకుం డునట్లు శపథముఁ జేసికొని మరణపర్యంతము బ్రహ్మచర్యవ్రతమును బూనున ట్లుద్దే శించినచో నేఁబదియేండ్లలో గాని, యెక్కువగఁ గడచిన నూఱేండ్లల్లోఁ గాని సమస్తజీవకోటిసృష్టియు లయించి యెచ్చటి దచ్చటనే శూన్యమగును. ఇంతియ కాక యేసృష్టి నశింపఁ గూడ దని యాయాసమయముల భగవంతుఁ డవతరించు టయుఁ గలదో యదియంతయుఁ గొలఁదికాలముననే నశించిపోవును. కామక్రోధ ములు శత్రువు లనుమాట సత్యమే; కాని, 'యెప్పుడు?. నిరోధింపఁబడకున్నంతకా లమే'. సృష్టిప్రారంభమాదిగ సృష్టిక్రమము జరుగుచుండుటకుఁ దగినంత నియమ ముతో వాని (కామక్రోధాదులయొక్క) యత్యంతావశ్యకత ప్రళయపర్యంత ముండియే యున్నది. ఈవిషయము మన్వాదిశాస్త్రకారులకును సమ్మతమే ! (మను. ౫-౫౬). సర్వమును సరిగ నుంచుట్లయనఁగ నీకామక్రోధములను యోగ్యవిషయ మున నుపయోగించుటయే కాని వానిని సమూలముగ నశింపఁజేయుట కాదు.

"లోకేవ్యవాయామిషమద్యసేవా నిత్యాస్తుజన్తోర్నహి తత్ర చోదనా
వ్యవస్థితి స్తేషు వివాహయజ్ఞసురాగ్రహై రాసు నివృత్తి రిష్టా"
(భాగ. ౧౧. ౫. ౧౧)

"ఈలోకములో మైథునము, మద్యమాంసములసేవయుఁ జేయుఁ మని యెవ నికిఁ జెప్ప నక్కఱలేదు. వీనిని నరులు స్వభావముగనే యపేక్షించుచుందురు. ఈ మూఁడింటికి నేదేని వ్యవస్థ చేయవలయు ననిన నొకకట్టుఁబాటుచేసి సమయము నేర్ప ఱుపవలయు. కావుననే వివాహము, సోమయాగము, సౌత్రామణియజ్ఞము నను నవి యనుక్రమముగ శాస్త్రకారులచే యోజనచేయఁబడినవి. కాని వానియందును నివృత్తి(నిష్కామాచరణమే)యిష్టమైనదని భాగవతమునఁ జెప్పఁబడినది. ఈనివృత్తి శబ్దమునకుఁ బంచమ్యంతపదములతో సంబంధ ముండుటచే, 'ఈవిషయమునుండి నివృత్తి'యనఁగా కనికర్మసీ బూర్ణముగ వదలుట' యని యే యర్థమగుచున్నది. వినను

కర్మయోగమునందు నివృత్తి యను విశేషణము కర్మకే సంబంధించియుండుటచే నివృత్తి కర్మయన నిష్కామబుద్ధితోఁ జేయఁబడుకర్మ యని యర్థమని యీకర్మ యోగప్రకరణమున మఱవకుండవలయును. ఈయర్థమే మనుస్మృతియందును భాగవతమునందును స్పష్టముగనున్నది (మను. ౧౨.౮౯; భాగ. ౧౧.౧౦.౧; ౭.౧౫.౪౭).

కిరాతార్జునీయమను కావ్యమున నీకోపమావశ్యకమనువిషయముగురించి—

“ అమర్షశూన్యేన జనస్య జన్తునా
న జాతహార్దేన చ విద్విషాదరః.”

(భారవి. ౧. ౩౩)

“తన కవమానమైనను నెవనికి రోషముగాని చీఁదరకాని కలుగదో యట్టివానితో స్నేహమున్నను ద్వేషమున్నను బ్రయోజనము సమమే” యని భారవి చెప్పినాఁడు. క్షాత్రధర్మప్రమాణముగఁ జూచిన యెడల—

“ ఏతావా నేవ పురుషో య దమర్షీ య దక్షమః,
క్షమావా న్నిరమర్షశ్చ నైవ స్త్రీ న పునః పుమాన్. ”

(మ. భా. ౧౩౨. ౩౩)

“ఎవని కితరుఁ డవమానము సేసె నని కోపము గలుగునో, యెవఁ డవమానమును సహింపఁడో వాఁడే పురుషుఁడని చెప్పవలయును. అట్టిసమయమున నెవనికి రోషముగాని చీఁదరగాని కలుగదో వాఁడును నపుంసకుఁడును సమానులే” యని పెద్దలు వక్కాణించియున్నారు. లోకవ్యవహారము జరుగుటకు నియతముగఁ గ్రోధము గాని పరాక్రమముగాని యుపయోగించునవి కావు. క్షమయే నియతముగఁ గార్యసాధకము గా దనుసంగతి పైనఁ జెప్పఁబడినది. లోభమునకుఁ గూడ నీన్యాయము సంబంధించి యున్నది. ఏలయన:—సన్యాసి యయ్యును మోక్షము నే కోరవలసియున్నది గదా!.

శౌర్యము, ధైర్యము, దయ, శీలము, మైత్రి, సమత మున్నగుసకలసద్గుణములకుఁ బరస్పరవిరోధము లేకుండ దేశకాలాదులమర్యాదయు సంబంధించియే యున్నదని వ్యాసుఁడు మహాభారతమున ననేకస్థలముల నాయాకథానకములలోఁ బ్రతిపాదించి యున్నాఁడు. ఏసద్గుణమైనను సర్వకాలసర్వావస్థలయందును నుపయోగించునట్లు లేదు.

“ విపది ధైర్య మ థాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః”

(నీతి. ౬౩)

"కష్టకాలమునందు ధైర్యము, ఉత్కర్షకాలమునందు (శిక్షించుసామర్థ్యము శరీరమున నుండఁగా)క్షమయు, సభయందు వక్తృత్వము, యుద్ధమునందు శౌర్యము నుండవలెను" నని భర్తృహరి సుగుణములఁ బ్రకాశింపఁ జేయఁదగిన కాలములఁజెప్పి యున్నాఁడు. శాంతసమయములయందు తత్తరనివలెఁ బ్రగల్భవాక్యములఁ బల్కువారివలన నుపయోగమేమి?. మఱియు నింట నుండి భార్యముక్కునత్తులోగుండ గుఱిగ బాణము వేయఁగల మహావీరు లనేకులున్నను యుద్ధరంగమున ధనుర్ధరుఁ డని ప్రసిద్ధికెక్కినవాఁ డెవఁడో యొక్కఁడే యగును. ధైర్యాది గుణములు పూర్వోక్తసమయములయందే శోభించును. ఇంతియకాక, యిట్టిసందర్భములు లేకున్నచో నాగుణములసత్యమగుపరీక్ష కానేరదు. సుఖసమయమునందు మిత్రులు సహాయులుగ నుందురు గాని "నికషగ్రావా తు తేషాం విపత్" "ఆపత్కాలమే వారికి నిజమైన నికషోపలము (బంగారమునన్నెఁదెలిసికొను నొరిపిడిరాయి)గ నున్నది." ప్రసంగశబ్దమునందే దేశకాలములే కాక పాత్రాపాత్రవిషయము గూడ నిమిడియున్నది. సమత్వముకంటె మఱియేగుణమును శ్రేష్ఠముగాదు. "సమః సర్వేషు భూతేషు" అనునిది సిద్ధపురుషులలక్షణమని భగవద్గీతలో స్పష్టముగనున్నది; కాని సమతయనఁగ నేమి? యోగ్యతఁ గనిపట్టకయే యొకఁడందఱికి సమముగ దానముఁజేసిన నతని బుద్ధిమంతుఁడందుమా? వెఱ్ఱివాఁడందుమా? భగవద్గీతలయందే "దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం విదుః" "దేశకాలపాత్రములవిచారించియిచ్చినదానమే సాత్త్వికదానము" (గీ. ౧౭-౨౦). అని యీవిషయము నిర్ణయింపఁబడినది. కాలమర్యాద యనఁ గేవలము వర్తమానకాలము పూర్ణమగువఱకే యని కాదు; కాలమే యేవిధముల మాఱునో యాయా విధముల నెల్ల వ్యావహారికధర్మములందును మార్పు గలుగుచున్నది; కావుననే పూర్వకాలములోని యొకానొకవిషయమునందలియోగ్యతాయోగ్యతల నిర్ణయింపవలసినచో నాపూర్వకాలములోని ధర్మాధర్మములవిజ్ఞానమును సైతము విచారింపవలసియుండును.

"అన్యే కృతయుగే ధర్మా స్త్రేతాయాం ద్వాపరే పరే
అన్యే కలియుగే నృణాం యుగహ్రాసానురూపతః"

(మను. ౧. ౮౫)

"యుగముల మానము ననుసరించి కృతత్రేతాద్వాపరకలియుగములలోని ధర్మములును భిన్నభిన్నములుగ నున్నవి" అని మనువును వ్యాసులును (మహాభా.

శాం. ౨౬౯. ౨) జెప్పుచున్నారు. మఱియుఁ బూర్వకాలమున స్త్రీలకు వివాహమర్యాదయే లేదు. వా రీవిషయమునందు స్వతంత్రులు నస్వాస్వతులు నై యుండిరి. కాని తరువాత నీయాచారమున దుష్పరిపాకము గనఁబడఁగనే, శ్వేతకేతు వీవివాహమర్యాద నేర్పఱచెను(మ. భా. ఆ. ౧౧౨). ఇట్లే సురాపానవిషయమున నిషేధము తొలుదొలుత శుక్రాచార్యుఁడు ప్రవర్తింపఁజేసెను. ఈకథ మహాభారతమున నున్నది (మ. భా. ఆ. ౭౬) కావున నీనిర్బంధ మాచారములో లేనికాలపు ధర్మములనిర్ణయమును, దరువాతికాలమునందలి ధర్మాధర్మములనిర్ణయమును భిన్నరీతిగనే చేయఁబడవలయు నని తేలును. మఱియు నారీతిగనే వర్తమానకాలధర్మ ముత్తరకాలమున మాఱినయెడలఁ దొల్లిటివలెనే భవిష్యత్కాలికము లగుధర్మాధర్మముల వివేచనయు భిన్నముగనే చేయఁబడవలయును. కాలమానానుసారముగ దేశాచారములును, గులాచారములును, జాతిధర్మములు నిట్లే మార్పుఁ జెందవలసి వచ్చును. కారణ మేమనఁగా:—ఆచారమే సర్వధర్మములకు మూలము. అయిన నొకయాచారమునకు మఱియొకయాచారముతో సమావేశము లేమిచే—

"న హి సర్వహితః కశ్చిదాచారస్సంప్రవర్తతే
తే నైవాన్యః ప్రభవతి సోఽపరం బాధతే పునః."

(మ. భా. శాం. ౨౬౯. ౧౭-౧౮)

"అందఱకు నెప్పుడు నొక్కతీరుననే సదా హితకర మగునాచారము లభింపదు. ఒకయాచారమును గ్రహించినచో రెండవది దానిని మించి యుండును. మఱియు నీరెండవదియాచారమునకు మార్గ మిచ్చిన నది మూఁడవదానికి మరల విరుద్ధమగును." అని యాచారభేదమును వర్ణించి యొక్కొకయాచారమునకు నున్న తారతమ్యమును సైతము చూడవలసివచ్చు నని భీష్మునిచేఁ జెప్పఁబడినది. అది యటుండనిమ్ము. కర్మాకర్మలయొక్కగాని, ధర్మాధర్మములయొక్కగాని సంశయమునకు సంబంధించిన పూర్వపక్షసిద్ధాన్తముల నన్నిటి నీరీతిగ మాటలాడ నారంభించిన రెండవ మహాభారతమే వ్రాయవలసివచ్చును. గీతారంభమున క్షాత్రధర్మము-బంధుప్రేమ యనువానిమధ్యమునఁ జిక్కుకొనినయర్జునునిపై వచ్చినసందర్భము లోకవిలక్షణము కా దనియు, నట్టిసందర్భములు సంసారమునఁ గర్తయగు గొప్పవాఁడు నగువానికిఁ బలుమాఱులు గలుగుచునే యుండు ననియు, నింతియ కాక యొకప్పు డహింసయు నాత్మరక్షణయు, మఱియొకప్పుడు సత్యము సర్వభూతహితమును, నింకొకప్పుడు దేహసంరక్షణయు యశస్సును, వేఱువేఱుకారణముల చేనుపస్థితము లగుకర్తవ్యము

లైనను వీనిలోన్నే తిరుగుడుపడుచు శాస్త్రోక్తములును సామాన్యములును సర్వసామాన్యములు నగునీతిశాస్త్రనియమముల ననుసరించి యేకర్తవ్యమును వదలని వానికి సైత మానియమము నుల్లంఘింపవలసినంతస్థితి యిటుల వచ్చు ననియు, సాధారణమనుష్యులకే కాక గొప్పగొప్పపండితులకు నిట్టిసమయములఁ గార్యాకార్యవ్యవస్థితిఁ (కర్తవ్యాకర్తవ్యధర్మములనిర్ణయమును) జేయుట కేదేని నిశ్చిత మార్గము గాని యుక్తిగాని యున్నదో లేదో తెలిసికొన నిచ్ఛ స్వాభావికముగ నిటుల కలుగు ననియుఁ జదువరులకుఁ దెల్ల మగుటకై పైవివేచన చేయఁబడినది.

కఱవునంటిసంకటసమయమున నాపద్ధర్మము లని శాస్త్రములఁ గొన్నియపవాదములు సెప్పఁబడియుండుట సత్యమే; ఉదాహరణము:—ఆపత్కాలమున బ్రాహ్మణుఁ డెక్కడ నన్నము గ్రహించినను దోషము లేదని స్మృతికారులు సెప్పియున్నారు. మఱియు ఛాందోగ్యోపనిషత్తులో "ఉషస్తిచాక్రాయణుని" చే నీప్రకారముగ నాచరింపఁబడినటుల కథ యున్నది (యాజ్ఞ. ౩. ౪౧; ఛాం. ౧.౧౦). దానిలోను బైనఁ జెప్పఁబడినసందర్భమున శాస్త్రధర్మమునకును, నాఁకలి దప్పి మొదలగునింద్రియవృత్తులకును విరోధము కలిగి యింద్రియము లోకవైపునకును, శాస్త్రధర్మము రెండవవైపునకును లాగుచు నుండును. పైఁజెప్పఁబడిన ప్రసంగములో నింద్రియవృత్తులకును శాస్త్రధర్మములకును గాక, శాస్త్రముననే రెండుధర్మములకుఁ బరస్పరవిరోధము గలుగుటచేఁ గర్తవ్య మిదియా? యదియా? యనుసూక్ష్మ విచారణ చేయుట యావశ్యకముగఁ గాన్పట్టును. మఱియు వీనిలోఁ గొన్ని విషయముల నిర్ణయము ప్రాచీనసత్పురుషు లిట్టిసమయమున నాచరించినయాచరణమును బట్టియే సామాన్యులకు సైతము నిశ్చయింప శక్యమైయున్నను, మఱికొన్ని సందర్భములలో బుద్ధిమంతులమనస్సు సైతము భ్రమపడుచున్నది. కారణ మేమన:—ఎంత విచార మధికముగఁ జేయుకొలఁదిఁ బూర్వపక్షసిద్ధాంతములు నంత యధికముగ నిష్పన్నములగుటచేఁ దుదకు నిర్ణయించుట దుర్ఘటముగ నున్నది. మఱియు యుక్తాయుక్తనిర్ణయము కానిచో మనచేతిమీఁదుగ నధర్మముగాని యపరాధముగాని చేయుట సంభవింపవచ్చును. ఇట్టిదృష్టితోఁ జూచిన, ధర్మాధర్మములయొక్కగాని కర్మాకర్మలయొక్కగాని వివేచనయే యొకస్వతంత్రశాస్త్రమై తర్కవ్యాకరణములకన్న గూఢముగ నుండును. నీతిశాస్త్రమనుశబ్దము నవీనసంస్కృతగ్రంథములందుఁ దఱచుగ రాజనీతి శాస్త్రపరముగ వాడఁబడియున్నది. అందుచేఁ గర్తవ్యాకర్తవ్యశాస్త్రమును ధర్మశాస్త్ర మని చెప్పుట ప్రాచీనపద్ధతిగనే యున్నది; కాని నీతిశబ్దములోనే కర్తవ్యమును సద్వర్తనము నిమిడి యుండుటచేనే నీనవీనపద్ధతి ననుసరించియే ధర్మాధర్మముల

దైనను గర్మాకర్మల దైనను వివేచనను నీతిశాస్త్ర మనియే యీ గ్రంథమునఁ జెప్పి నాఁడను. నీతియొక్క (కర్మాకర్మలయొక్క) గాని ధర్మాధర్మములయొక్క గాని వివేచన యనుశాస్త్రము గహనముగ నున్నది. ఈసంగతిఁ దెలుపుటకే "సూక్ష్మా గతి ర్హి ధర్మస్య" "ధర్మ (వ్యావహారిక మగునీతిధర్మ) స్వరూపము సూక్ష్మముగ నున్నది." అనువచనము మహాభారతమున ననేకస్థలములవచ్చియున్నది. "పంచపాండవులచే నొక ద్రౌపది యెటులవివాహమాడఁబడినది? ద్రౌపదీవస్త్రాపహరణసమయమున భీష్మద్రోణాదులు శూన్యహృదయులై యేలమౌనముఁదాల్చియుండిరి? మఱియు దుష్టుఁడగుదుర్యోధనునిపక్షమున యుద్ధముఁ జేయుచు భీష్మద్రోణులచేఁ దమపక్షము సమర్థింప "అర్థస్య పురుషో దాసో దాస స్త్వర్థో న కస్య చిత్" "పురుషుఁ డర్థమునకు దాసుఁడు. అర్థ మెవరికిని దాసుఁడు గాదు" (మ. భా. భీ. ౪౩.౩౫) అని చెప్పఁబడినది. ఈన్యాయము సరిగ నున్నదా? లేక, తప్పుగ నున్నదా? ఎట్లైనను "సేవా శ్వవృత్తి రాఖ్యాతా" (మను. ౪.౬). అని సేవాధర్మము కుక్కవృత్తివలె నింద్యముగ గ్రహింపఁబడినచో, ధనమునకు దాసుఁ డగుటకు బదులుగ, భీష్మాదులు దుర్యోధనుని సేవ నేల వదలలేదు?" ఇవి మొదలగు ప్రశ్నలకు సదుత్తరములు చెప్పుట మిక్కిలి కష్టముగ నుండును. ఇట్టిస్థలములలో నొక్కొక్కరు ప్రసంగానుసారముగ నొక్కొక్క నిర్ణయముఁ జేయుదురు. "సూక్ష్మా గతి ర్హి ధర్మస్య" "ధర్మతత్త్వము సూక్ష్మమైనది" (మ. భా. అను. ౧౦. ౭౦) అనియుఁ, దర్వాత "బహుశాఖా హ్యనంతికా" (మ.భా. వన. ౨౦౮.౨) "దానికనేకములగుకొమ్మ లుండుటచే వానివలనఁ గలుగఁబోవునను మానములును ననేకములుగ నుండు" ననియుమహాభారతమ్మున నేచెప్పఁబడి యున్నది. తులాధారజాజలిసంవాదమునఁ దులాధారుఁడే ధర్మమువిషయమై వివేచన చేయుచు "సూక్ష్మత్వా న్న స విజ్ఞాతుం శక్యతే బహునిహ్నవః" "ధర్మము, సూక్ష్మము ననేకాపవాదములు గలదియు నగుటచే ననేకసమయములఁ దెలియఁబడదు" (మ. భా. శాంతి ౨౬౧. ౩౭) అని వ్రాసి నాఁడు. మహాభారతకారున కీసూక్ష్మప్రసంగము పూర్ణముగఁ దెలియుటచే నిట్టివిషయములలోఁ బ్రాచీనమహాపురుషులచే నాచరింపఁబడినదానిఁ జెప్పుటకే భారతమున ననేకకథానకములు సంగ్రహింపఁబడినవి. కాని సర్వవిషయములు శాస్త్రీయరీతిగ వివేచనఁ జేసి వానిలోని సామాన్యమర్మమును భారతమువంటిధర్మగ్రంథములలో నెక్కడనైనఁ జెప్పుటయావశ్యకమే. పూర్వ మర్జునునకు శ్రీకృష్ణుఁడు కర్తవ్యమోహమును నివారించుట కుపదేశించిన యుపదేశము నాధారముగఁ జేసికొని వ్యాసుఁడు భగవద్గీతలో నీమర్మమును బ్రతిపాదించెను. మఱియు నాహేతువున గీతయనునది మహాభారతమునకు రహస్యోప

నిషత్తును శిరోభూషణమును నై యున్నది. ఇంతియకాక మహాభారతమే గీతలలోఁ బ్రతిపాదింపఁబడిన మూలభూతకర్మతత్త్వమునకు సోదాహరణమగు విస్తృతవ్యాఖ్యానము నై యున్నది. గీతాగ్రంథము మహాభారతములో నిటీవలఁ జేర్పఁబడిన దని యనుకొనువా రీవిషయమును ముఖ్యముగా గమనింపవలయునని సూచించుచున్నాను. వేయేల? గీతాగ్రంథమున కేదేని గౌరవ ముండినయెడల నా గౌరవము దీనివలనఁ గలిగినదే యని చెప్ప నగును. ఏల యనః—కేవలమోక్షశాస్త్రమును (వేదాన్తమును బ్రతిపాదించు నుపనిషదాదికమును), అహింసాదిసదాచరణములనియమ మాత్రమును జెప్పుస్మృత్యాదిగ్రంథములును ననేకము లున్నను వేదాన్తములో దురవగాహ మగుతత్త్వజ్ఞానముయొక్క యాధారమున, కార్యాకార్యవ్యవస్థితిని సమన్వయింపఁ జేయుగీతను బోలుప్రాచీనగ్రంథ మిప్పటికిని సంస్కృతవాఙ్మయమున స్పష్టముగఁ గన్పట్టదు. ‘కార్యాకార్యవ్యవస్థితి’ యను నీశబ్దము స్వకపోలకల్పితము గాదు. గీతలలోనే యున్నది (గీత. ౧౬. ౨౪). ఈవిషయము గీతాభక్తులకుఁ జెప్ప నవసరము లేదు. భగవద్గీతానుసారముగనే యోగవాసిష్ఠమందును జ్ఞానమూలక మగుప్రవృత్తిమార్గమే వసిష్ఠుఁడు రామున కుపదేశించెను. కాన గీతతరువాత వెలువడి, గీతలనే యనుకరించుగ్రంథములచేఁ బైఁ జెప్పఁబడినగీతలయపూర్వతకేమియు బాధ రానేరదు.

ఇది కర్మజిజ్ఞాస యన్న ద్వితీయప్రకరణము.

---

# తృతీయప్రకరణము.



## కర్మయోగశాస్త్రము.

"తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం"*

(గీత. ౨.౫౦)

ఏవరికైన నేశాస్త్రమందేనియుఁ బ్రవేశము కలుగఁజేసికొన నిచ్ఛ మొట్ట మొదట లేనిచో వారాశాస్త్రముల నభ్యసించుట కనధికారులు. మఱియు నట్టి యనధికారులగువారికి శాస్త్రములను జెప్పుట బోరగించినఘటముపై నీటిని బోయునటు లుండును. దానివలన శిష్యున కేమియు లాభము లేక పోవుటయే కాక గురువునకు నిష్ఫలశ్రమ మగుటచే నీయిద్దఱికాలము వ్యర్థముగఁ గడచి పోవును. జైమిని బాదరాయణులచే, పూర్వోత్తరమీమాంసలయారంభమున "అథాతో ధర్మజిజ్ఞాసా" అనియు, "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనియు సూత్రము లిందులకే వ్రాయఁబడినవి. ఎటుల ధర్మోపదేశము ధర్మేచ్ఛులకును, బ్రహ్మోపదేశము ముముక్షువులకును జేయఁదగినదో యటులే కర్మశాస్త్రోపదేశము సంసారమునందుఁ గర్మల నెటుల చేయవలయునో తెలిసికొన నిచ్ఛగలవారికే చేయఁదగినది. కావుననే యీగ్రంథమునఁ బ్రథమప్రకరణమున విషయప్రవేశమును, రెండవప్రకరణమునఁ గర్మజిజ్ఞాసాస్వరూపమును, గర్మయోగశాస్త్రమహత్త్వమును దిగ్దర్శనముగఁ బ్రతిపాదింపఁబడినవి. ఈస్థలమునఁ బూర్వపక్షము గల దని ముందుగఁ దెలిసికొనకున్నచో, సిద్ధాంతమహత్త్వము పూర్ణముగఁ దెలియదు. మఱియు మహత్త్వము దెలియక పోవుటచే కేవలము పోవనమూలమున వచ్చినశాస్త్రమును ధారణ చేయుట (జ్ఞప్తినుంచుకొనుట) కష్టము. ఈకారణముననే మంచిగురువు, శిష్యునకు జిజ్ఞాస యున్నదా? లేదా? యన్ని మొదటనే విచారించి యది లేనియెడల దానియుత్తేజనముఁ జేయుటకుసైతము ప్రయ

---

* "కావున యోగము నాశ్రయింపుము. యోగ మన: కర్మల నాచరించుటయందలి చాతుర్యము, లేక, నేర్పు." అని యోగమునకు లక్షణము. ఈవిషయమునఁ జాలవిచారణ మీప్రకరణముననే చేయఁబడినది.

త్రించును. గీతలలోఁ గర్మయోగశాస్త్రవివేచన యీతీరుననే చేయఁబడినది. ఏ యుద్ధమునఁ దనచేతిమీఁదుగఁ బితృవధయు, గురువధయు, సమస్తరాజవధయు,బంధువధయు నగునో యట్టిఘోరయుద్ధమును జేయుట న్యాయ్యమా? యన్యాయ్యమా? యనుశంక మనస్సునఁ దగిలి యర్జునుఁడు యుద్ధేచ్ఛ వదలి సన్యసించుటకు సిద్ధుఁడు కాఁగాఁ బ్రాప్త, మగుకర్మను వదలివేయుట వెఱ్ఱితనమునకును దుర్బలత్వమునకును లక్షణ మగుననియు, నటుల వదలుటచే స్వర్గదూరుఁడ వగుటయే కాక యపకీర్తికిసైతము పాల్పడుదు వనియు, సామాన్యయుక్తివాదమును జేసి యప్పటికిని వినక పోఁగా "అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాం శ్చ భాషసే" "నీవు శోకింపఁదగనివారిని గుఱించి శోకించుచున్నావు. ఇంతియకాక బ్రహ్మజ్ఞానుల పెద్దపెద్దమాటలను చెప్పుచున్నావు" (గీ. ౨.౧౧) అని కొంచెముపరిహాసముఁజేసి శ్రీకృష్ణుఁడు కర్మజ్ఞానము లతని కుపదేశించెను. అర్జునునిశంక నిరాధారముకాదు. గొప్పవిద్వాంసులకు సైతము మొక్కొకసందర్భమున "ఏమిచేయఁదగును?. ఏమిచేయఁదగదు?" అనువిషయమున వ్యామోహ మెటుల గలుగునో పూర్వప్రకరణమున నిరూపించితిని. కాని కర్మాకర్మలవివేచనలో ననేకప్రతిబంధకములు బయలుదేఱు నని కర్మను వదలుట యుక్తము గాదు. కాన, నేయుక్తిచే జగత్తులోఁ గర్మకు లోపము లేకుండునో, యేయుక్తిచేఁ గర్మలబంధము గాని పాపముగాని యెంతమాత్రమును మనకుఁ దగుల్లదో, యట్టి 'యోగము' (యుక్తి) నేర్పఱిచియె స్వీకరింపవలెను. "తస్మా ద్యోగాయ యుజ్యస్వ" "కావున నీవును దానినే స్వీకరింపుము." అని శ్రీకృష్ణుఁడు మొదట నర్జునునకుఁ జెప్పెను. ఈయోగమనఁగా కర్మయోగశాస్త్రము. మఱియు నర్జునునకు సంభవించిన సందర్భము లోకవిలక్షణము గాదు. సంసారములోఁ జిన్నవియుఁ బెద్దవియు నగునిట్టిసంకటము లందఱకును సంభవించుచునే యుండును. కావున భగవద్గీతలలోఁ జేయఁబడిన 'కర్మయోగశాస్త్రవివేచనను మనమందఱము నభ్యసించుట యావశ్యకము. కాని యేశాస్త్రమున నైనను బ్రతిపాదనలో రాఁబోవుముఖ్యశబ్దములయర్థము బాగుగఁ దెలియుటకై యాశబ్దములకు మంచివ్యాఖ్యానమును,నాశాస్త్రమున నుపపాదింపఁబడుమూలభూత మగుసరణియు, మొదట సంక్షేపముగ నుండవలయును. కాదేని యుత్తరగ్రంథమున ననేకవిధము లగునన్యథాజ్ఞానములు ననుపపత్తులును గలుగును. ఈకారణముననే యీసామాన్యపద్ధతి ననుసరించి ముందుగ నీశాస్త్రమున రాఁబోవు కొన్నిముఖ్యశబ్దములయర్థమును బరీక్షించుచున్నాను. వానిలో మొదటిది కర్మశబ్దము.

ఈకర్మశబ్దము 'కృ' ధాతువువలన నిష్పన్న మైనది. కావున దానికి 'చేయుట' యని కాని, 'నడవడి' యని కాని, 'వ్యాపార' మని కాని యర్థము. ఇదియు సామాన్యార్థమే భగవద్గీతయందును వివక్షితముగ నున్నది. ఈశబ్దమునకు మీమాంసాశాస్త్రమునఁ గాని యన్యస్థలములలోఁ గాని యున్నసంకుచితార్థము లన్నియు గోచరములై పాఠకులు పొరపడకుండునటుల చేయుటకై యిటుల చెప్పుచున్నాను. ఏమతధర్మమును విచారించినను దానిలో 'ఈశ్వరప్రాప్తి కేదేని యొక కర్మను జేయవలయు' నని చెప్పఁబడియే యుండును. ప్రాచీనవైదికధర్మానుసారముగ యజ్ఞయాగాదికములే కర్మలు. మఱియు నీయజ్ఞయాగాదు లెటుల చేయవలయునో యావిధులఁ జెప్పువైదికగ్రంథములలో ననేకస్థలములయం దనేకవిధములుగను, ఒకానొకచోఁ బైకి విరుద్ధములుగను, గన్పట్టుచున్నయనేకవచనములకు సంగతమైనయేకవాక్యత యెటుల గలుగునో, నిరూపించుటకే జైమినియొక్క పూర్వమీమాంసాశాస్త్రము ప్రవర్తించినది. జైమినిమతమున నీవైదికములు, లేక, శ్రౌతములు నగుయజ్ఞయాగాదులఁ జేయుటయే ముఖ్యమును ప్రాచీనము నగుధర్మముగ నున్నది. మనుష్యుఁ డేమిచేసినను యజ్ఞార్థముగనే చేయవలయును. అతఁడు ధనమార్జించినను యజ్ఞార్థమే; ధాన్యసంగ్రహము చేసినను యజ్ఞార్థమే యని తెలిసి తెలిసికొనవలయు నని మహాభారతమున నున్నది. (మ. భా. శాం. ౨౬. ౨౫) యజ్ఞమును జేయవలయు నని వేదమే విధించెను గాన యజ్ఞార్థమై చేయఁబడిన యేకర్మ మైనను మనుష్యునకు స్వయముగ బంధహేతువు కాదు. యజ్ఞమునకు సాధనమే యగును. స్వతంత్రమైనసాధ్యము కానేరదు. నీయజ్ఞమువలన వచ్చు ఫలములోనే యీసాధనములఫలము లంతర్భూతము లగును. సాధనములకు ప్రత్యేకముగ ఫలము లేదు. కాని యజ్ఞార్థమై చేయఁబడినకర్మలు స్వతంత్రములుగా ఫలదాయకములు గానున్నను యజ్ఞముచేతనే స్వర్గప్రాప్తి(అనఁగా: మీమాంసకమతానుసారముగ నొకవిధ మగుసుఖప్రాప్తి) యగును కాన నాస్వర్గప్రాప్తికొఱకే యజ్ఞకర్త యగుపురుషుఁ డిచ్ఛాపూర్వకముగ (అనఁగా: కావలయు నని) యజ్ఞమును జేయుచున్నాఁడు. కావుననే యజ్ఞ మనుకర్మ ప్రత్యేకముగఁ బురుషార్థములలో నొకటిగఁ బరిగణింపఁబడుచున్నది. మనుష్యున కిష్టమైనవస్తువును పొందవలయు నను నిచ్ఛయే పురుషార్థ మని చెప్పుదురు. (జై. సూ. ౪. ౧. ౧; ౨) యజ్ఞమునకే 'క్రతు' వని పర్యాయపదము. కనుక 'యజ్ఞార్థ' శబ్దమునకు మాఱుగ 'క్రత్వర్థ' శబ్దమును మార్చుట యుక్తము. మఱియు యజ్ఞార్థములు (క్రత్వర్థములు) స్వతంత్రముగ ఫలము నీయనివి కావుననే బంధకములు కావు. మఱియు 'పురుషార్థములు' పురు

షునకు లాభదాయకములు, కావుననే బంధకములు. అని కర్మ లన్నియు రెండువిధములు. సంహితలోను బ్రాహ్మణగ్రంథములోను నుండువిషయమంతయు యజ్ఞయాగాదికములగురించియే; ఋగ్వేదసంహితలో నింద్రాదిదేవతాస్తుతిపరములగు సూక్తములుండును. సత్యమే! కాని, వానివినియోగము యజ్ఞసమయముననే కర్తవ్య మగుటచే, సర్వశ్రుతిగ్రంథములును యజ్ఞాదికర్మప్రతిపాదకములే యని మీమాంసకులు చెప్పెదరు. ఏమియుం దెలిసికొనకయే చేసినను, బ్రహ్మజ్ఞానపూర్వకముగం జేసినను, వేదోక్తము లగుయజ్ఞయాగాదికములం జేసిననే స్వర్గము సిద్ధించునుగాని యూరక యేమిచేసినను సిద్ధింప దని కర్మఠులు, లేక, యాజ్ఞికులు, లేక, కేవల కర్మవాదులు చెప్పెదరు. ఉపనిషత్తులలో నీయజ్ఞములు గ్రాహ్యములుగ నంగీకరింపంబడినను వానియోగ్యత బ్రహ్మజ్ఞానమునకుం గ్రిందిమెట్టని నిశ్చయింపంబడుటచే స్వర్గప్రాప్తి కలిగినను నిత్యమగుమోక్షసంపాదనకు బ్రహ్మజ్ఞానమే యావశ్యక మని చెప్పంబడినది. భగవద్గీతరెండవయధ్యాయమునం జెప్పంబడిన—"వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః" (గీ. ౨. ౪౨) ఇత్యాదియజ్ఞయాగాదికర్మలను బ్రహ్మజ్ఞానము లేకుండం జేసినం బైనం జెప్పినటుల మోక్షము నీయనివే యగును. అటులే గీతలలోని—"యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః" "యజ్ఞార్థము చేయంబడినకర్మలు తక్క మిగిలినకర్మ లన్నియు బంధహేతువులు" (గీ. ౩. ౯) అనునదియు మీమాంసకమతముయొక్క యనువాదమే. ఈయజ్ఞాదివైదికకర్మలు (అనంగా: శ్రౌతకర్మలు) గాక వేఱువిధ మైన[illegible], ధార్మికదృష్టిచే నావశ్యకములు నైన కర్మలు చాతుర్వర్ణ్య[illegible] క్షత్రియులకు యుద్ధము, వైశ్యులకు వాణిజ్యము [illegible]నవి మనుస్మృత్యాదిధర్మగ్రంథములలోం జెప్పంబడినవి. మఱియు నిది ముందుగా స్మృతులలోనే వ్యవస్థానుసారముగం జెప్పంబడుటచే వీనిని స్మార్తకర్మలని కాని స్మార్తయజ్ఞము లని కాని యందురు. ఈశ్రౌతస్మార్తకర్మలు గాక కొన్ని ధార్మికకర్మలు (వ్రతోపవాసాదికములు) పురాణములలో మొదట విస్తారముగం బ్రతిపాదింపంబడుటచే వానికిం బౌరాణికకర్మ లని పేరిడిరి. ఈకర్మ లన్నియు, నిత్యములు, నైమిత్తికములు, కామ్యము లని మూండువిధములుగ విభజింపంబడినవి. నియమముగం జేయంబడుస్నానసంధ్యాదికములు నిత్యములు. వీనినాచరించుటచే నేమియు ఫలసిద్ధి కాని యర్థసిద్ధి కాని లేదు; కాని యాచరింపనియెడల దోషము వచ్చును. నైమిత్తికము లన నేదైన నొకకారణము మొదటం బ్రసక్త మగుటచేం జేయవలసివచ్చుకర్మలు. అవి అనిష్టగ్రహశాంతి ప్రాయశ్చిత్తము మొదలగునవి. దేనికొఱకు మనము శాంతిని గాని ప్రాయశ్చిత్తమును గాని చేసికొనుచున్నామో యా

నిమిత్తము పూర్వమందు సిద్ధముగానియెడల్నీకర్మలయొక్క కర్తవ్యత యావశ్యకముగాదు. మన కేదేని యొకక్రొత్తవిషయమం దిచ్ఛగలిగి దానిం బొందుట కనేకపర్యాయములు శాస్త్రానుసారముగ నేకర్మ లొనర్చెదమో యవి కామ్యకర్మలు. వర్షములు కురియుటకుఁ గాని, పుత్త్రప్రాప్త్యర్థము గాని యజ్ఞములు చేయుట కామ్యకర్మలలోనిది. నిత్యనైమిత్తికకామ్యములు గాక సురాపానము మొదలగు కొన్ని నిషిద్ధకర్మములుగలవు. అవి యెల్లప్పుడు త్యాజ్యము లని శాస్త్రములు విధించుటచే, నిషిద్ధకర్మలనఁబడును. నిత్యకర్మ లెవ్వియో, నైమిత్తికము లెవ్వియో, కామ్యములును, నిషిద్ధములు నెవ్వియో, వానిని ధర్మశాస్త్రములు సిద్ధాన్తీకరించియున్నవి. మఱియు 'వీనిచేఁ జేయఁబడిన యీకర్మ పాపకరమా? పుణ్యప్రదమా?' యని యెవ రేని ధర్మశాస్త్రజ్ఞు నడిగిన నతఁడు ధర్మశాస్త్రవిధి ననుసరించి 'యీకర్మయజ్ఞార్థమా? లేక, పురుషార్థమా?' యనియు, 'నిత్యమా? నైమిత్తికమా?' యనియు, 'కామ్యమా? నిషిద్ధమా?' యనియు విచారించి తర్వాత నిర్ణయమును జెప్పును. భగవద్గీతదృష్టి యీపండితదృష్టి కన్న మిగుల వ్యాపకము. వేయేల? ధర్మశాస్త్రదృష్టికంటె కూడ దూరదృష్టి యని చెప్పవచ్చును. శాస్త్రముచే నొకానొకకర్మ నిషిద్ధ మని చెప్పఁబడక యుండును. ఇంత యేల? అది విహితముగ నే(అనఁగా: మనకుఁ గర్తవ్యములు గాఁ జెప్పఁబడినకర్మలలో నొకటి గనే) యుండును. ప్రకృతప్రసంగమున క్షాత్త్రధర్మము నే యుదాహరణముగ నెన్నుకొందము. ఇది యర్జునునకు విహితమే; కాని యంతమాత్రముచే నాకర్మ నతఁడు నియమముగఁ జేయవలసినది లేదు. ఒకవేళ చేసినను నది నియమముగ శ్రేయస్కరమే యని నమ్మకమును లేదు. మఱియు శాస్త్రవిధులలోనే యనేకసందర్భములు పరస్పరవిరుద్ధములుగ నుండు నని పూర్వప్రకరణమునఁ జెప్పఁబడియే యున్నది. అట్టిసమయమున, మనుష్యుఁ డేమి చేయవలయునో నిర్ణయించుట కేదేని యుక్తి కలదా? ఉండిన నది యేది? యనువిషయమే గీతలచేఁ బ్రతిపాద్యము. ఆప్రతిపాదనఁ జేయుటకై పైఁ జెప్పఁబడినకర్మభేదము విశేషముగఁ బరిశీలింప నవసరము లేదు. యజ్ఞాదివైదికకర్మలవిషయమునఁ గాని, లేక, నాలుగువర్ణముల యితరకర్మల విషయమునఁ గాని మీమాంసకు లొనర్చినసిద్ధాన్తము గీతలలోఁ బ్రతిపాదింపఁబడిన కర్మయోగమున కెంతవఱకు సంబంధించి యుండునో నిరూపించుటకై మీమాంసకులసిద్ధాన్తముపైతము గీతలలోఁ బ్రసంగానుసారముగ విచారింపఁబడినది. చిట్టచివరయధ్యాయములో యజ్ఞయాగాదికర్మలు ధయను ప్రశ్నకు సంక్షేపముగ నుత్తరము చెప్పఁబడినది గీతలలో

ముఖ్యముగఁ జెప్పువిషయ మింతకన్న వ్యాపక మగుటచే గీతాప్రతిపాదనమునఁ గర్మశబ్దార్థము కేవల శ్రౌతకర్మయే యని కాని శ్రౌతస్మార్తకర్మలే యని కాని సంకోచము చేసికొనక యా శ్రౌతస్మార్తకర్మలకన్న విశేషవ్యాపక మైనది గ్రహింపఁ బడవలయును. సారాంశ మేమన:—తినుట, త్రాగుట, ఆడుట, కూర్చుండుట, లేచుట, ఉండుట, ఉచ్ఛ్వాసనిశ్వాసముల విడుచుట, నవ్వుట, ఏడ్చుట, వాసనఁ జూచుట, చూచుట, మాటలాడుట, వినుట, నడచుట, ఇచ్చుట, పుచ్చుకొనుట, నిద్రించుట, మేలుకొనుట, చంపుట, యుద్ధము చేయుట, మననధ్యానములఁ జేయుట, విధిని గాని నిషేధమును గాని చేయుట, దానముఁ జేయుట, యజ్ఞయాగాదులు చేయుట, వ్యవసాయమును గాని వ్యాపారమును గాని జేయుట, ఇచ్ఛయించుట, నిశ్చయించుట, నోరు మూసికొని యూరకుండుట, మొదలగునవి యన్నియు భగవద్గీతలోని కర్మశబ్దముచే వాచ్యములే; ఆకర్మలు కాయికములైనను, వాచికములైనను, మానసికములైన నిష్టమే (గీ. ౫.౮-౯). వేయేల! దేహము జీవముతో నునికియు, మరణము సైతము కర్మలే. మఱియుఁ బ్రసంగానుసారముగ, జీవించుటయు, మృతియు ననువీరెంటిలో నేది గొప్పదో యనుసంగతి విచారించుట యావశ్యకముగ నున్నది. ఈవిచారమే ప్రసక్తమైనయెడలఁ గర్మశబ్దమునకే కర్తవ్యకర్మ యని యైన, విహితకర్మ యని యైన, నర్థ మగుచున్నది (గీ. ౪.౧౬.). మనుష్యులకర్మవిషయ మగువిచారణ యైనది. ఇఁక నింతకంటెను మొదటికిఁ బోయి సర్వచరాచర (చేతనాచేతన) వస్తువుల వ్యాపారములకు సైతము కర్మశబ్దమే సంబంధించి యున్న దని నిరూపణ చేయవలయును. కాని దానివిచారణ యుత్తరగ్రంథమునఁ గర్మవిపాకప్రక్రియలోఁ జేయఁబడును.

కర్మశబ్దముకన్న నెక్కుడు వివాదాస్పద మైనది 'యోగ' శబ్దము. ఈశబ్దమునకుఁ బ్రస్తుతమందురూఢార్థము "ప్రాణాయామాదిసాధనములచేఁ జిత్తవృత్తి నైన నింద్రియముల నైన నిరోధించుట", లేక, "పాతంజలసూత్రోక్త మగుసమాధి.", లేక, "ధ్యానయోగము." కావున్న నీయర్థమందు నుపనిషత్తులలో సైత మీ శబ్దము ప్రయోగింపఁబడినది (కఠ. ౬.౧౧); కాని యీసంకుచితార్థము భగవద్గీతలో సామాన్యముగ వివక్షితము కానేర దనువిషయము తొలుత గమనింపవలయును. 'యోగ' శబ్దము 'యుజ' యనుధాతువునుండి నిష్పన్న మగుటచే దానిధాత్వర్థము, 'కలయుట' 'సంబంధించుట' 'సంపాదించుట' 'సంగతి' 'ఒకచోటనుం [illegible] మఱియు నుత్తరగ్రంథమున నట్టిస్థితి గలుగుటకు 'ఉపా [illegible] యుక్తి', లేక, 'నివర్తనోపాయ' మనియు నర్థము. "యోగ

స్సన్నహనోపాయధ్యానసంగతియుక్తిషు” (అమరము. 3.3.౨౨).అని యమరకోశములోఁ గూడ నీయర్థము లన్నియుఁ జెప్పఁబడియున్నవి. ఫలజ్యోతిషములో నేదేని కొన్ని గ్రహము లిష్టముగఁ గాని, యనిష్టముగఁ గాని యునికింజేసి యాగ్రహములయోగము నిష్ట మని కాని యనిష్ట మని కాని ఘనము చెప్పుదుము. “యోగక్షేమము”లనెడి సమాసపదమున నున్న “యోగ” పదమునకు “లభింపనివస్తువును సంపాదించుకొనుట” యని యర్థము (గీ. ౯-౨౨).భారతయుద్ధమున ద్రోణాచార్యుల జయింప నశక్య మని తెలిసికొని యాయనను జయించుట కొక్క-యోగమే ‘సాధనమే’,లేక,‘యుక్తియే’యున్న దని—“ఏకో హి యోగో ఽస్య భవేద్వధాయ” (మ.భా. ౧౮౧.౩౧) యని శ్రీకృష్ణునిచేఁ జెప్పఁబడినది. మఱియు నుత్తర గ్రంథమున జరాసంధాదిరాజులు పూర్వము ధర్మసంరక్షణార్థమై యోగముచేతనే యెటుల చంపఁబడిరో! యనిసైత మున్నది. భీష్ములవా రంబాంబికాంబాలికల నపహరించినపిదప నితరరాజులు “యోగము యోగ” మని చెప్పుచు నతని వెంబడించిరని యుద్యోగపర్వమునఁ జెప్పఁబడి యున్నది (మ. భా. ఉ. అ. ౧౭౨). మఱియు భారతమున నితరస్థలములయందు నీయర్థముననే యోగశబ్దము ప్రయోగింపఁబడినది. గీతలలో ‘యోగ’ ‘యోగి’ శబ్దములనుండి యేర్పడినసామాసికశబ్దములు దాదాపుగ నెనుబది గలవు; కాని యేనాలుగైదుస్థలములనో తక్క- (గీ. ౬.౧౦-౨౩) పాతంజలయోగ మనునర్థము విశేషముగ నెక్క-డను నిష్టము కానేరదు. యుక్తి, కౌశల్యము, సాధనము, ఉపాయము, కలియుట యనునీయర్థములే కొంచెము మార్పుతో నంతటను సుస్పష్టముగఁ బ్రయోగింపఁబడియుండుటచే గీతాశాస్త్రములోనివ్యాపకశబ్దములలో నిది యొకటి యని చెప్పుట కేమియు సందియము లేదు. అయినను‘యోగ’మనఁగా:సాధనము,కౌశల్యము,లేక,యుక్తి యని సామాన్యముగఁ జెప్పినను నంతయు సమకూడ నేరదు. కారణ మేమనఁగా:—వక్తయొక్క- యిచ్ఛననుసరించి యీసాధనము, సన్యాసమునకుఁ గాని, కర్మకుఁ గాని, చిత్తనిరోధమునకుఁ గాని, మోక్షమునకుఁ గాని, మఱియొకదానికిఁ గాని, తుదకు దేనికైనను సాధనము కావచ్చును. ఉదాహరణమే:—గీతలలో రెండుమూఁడుచోటులలో భగవంతుని నానావిధ మగువ్యక్తసృష్టిని. నిర్మించుకౌశల్యమునకుఁ గాని, యద్భుతసామర్థ్యమునకుఁ గాని ‘యోగ’ మనుశబ్దము ప్రయోగింపఁబడినది (గీ. ౭.౨౫; ౯.౫; ౧౦.౭; ౧౧.౮). ఈయర్థమునుబట్టియే భగవంతుఁడు యోగేశ్వరుఁ డని చెప్పఁబడినాఁడు. (గీ. ౧౮.౭౫) కాని గీతలలోని ‘యోగ’శబ్దమున కివి యేవియును ముఖ్యార్థములు కావు. కావున ‘యోగ’ శబ్దముచే నేవిలక్షణ మగు కౌశల్యము,సాధ

నము, యుక్తి, లేక, యుపాయము, గీతలలో ముఖ్యముగ వివక్షితమై యున్నదో దానిని జెప్పు "యోగః కర్మసు కౌశలం" "యోగ మనఁగాఁ కర్మలఁ జేయుటయందలి నేర్పరితనము, యుక్తి, చాతుర్యము, లేక, శైలి" (గీ. ౨. ౫౦) యనుదానిచే నీశబ్ద వ్యాఖ్యానము గీతలలో స్పష్టపఱుపఁబడినది. మఱియు నటుపిమ్మట శాంకరభాష్యములో సైతము "యోగః కర్మసు కౌశలం" అనుపదములకుఁ గర్మవిషయమున స్వభావముగ నున్న బంధకత్వమును లేకుండఁ జేయుయుక్తియే యోగ మని యర్థము చేయఁబడినది. సామాన్యముగఁ జూచినయెడల నొకకర్మనే చేయుట కనేకయోగములు, లేక, యుపాయము లుండును. వానిలో నుత్తమ మగుసాధనమునకు యోగ మనుశబ్దము విశేషముగ వాడఁబడుచున్నది. ఉదాహరణము:—ద్రవ్యసంపాదన చేయవలసినచో నది, చౌర్యము, ఉద్బంధము, భిక్ష, సేవ, ఋణము, శరీరపరిశ్రమము మున్నగు ననేకసాధనములచే సంపాదింపఁదగియున్నది. వానిలో ప్రతిసాధనమునకును 'యోగ'శబ్దము ధాత్వర్థానుసారముగఁ బ్రయోగించుటకు వీలుండినను, దనస్వాతంత్ర్యమును బోగొట్టుకొనకుండ శ్రమచేసి ద్రవ్యమును సంపాదించుటయే ముఖ్యార్థము. ఈయుపాయమునే ముఖ్యముగ 'ద్రవ్యప్రాప్తియోగ'మని చెప్పుటయుఁ గలదు.

"యోగః కర్మసు కౌశలమ్" "కర్మను జేయుటలో నొకవిధ మగువిశేషయుక్తియే యోగ"మని స్వయముగ భగవంతుఁడే వ్యాఖ్యానము చేయుటచే వాస్తవముగ విచారింప గీతలలో నీశబ్దమునకు ముఖ్యార్థ మేమియగు ననువిషయమున శంక యనవసరము: కాని భగవంతునిచేఁ జేయఁబడిన యీవ్యాఖ్యానమున దృష్టియుంచక గీతలకు గొప్పగొప్పవ్యాఖ్యానము నొనర్చినవారీశబ్దముఁ గ్రిందుమీఁదు చేసి యనేకవిధముల గీతలమథితార్థముఁ దీయుటచే వారు చేసినయీయోగశబ్దార్థములో లోపమును నిరూపించుటకై యోగశబ్దార్థవిచారణ యిచ్చో నావశ్యకమై యున్నది. యోగశబ్దము గీత రెండవయధ్యాయమ్ము మొట్టమొదట వచ్చి యుండుటచే నచటనే దానియర్థము స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. "యుద్ధ మేల చేయవలయునో, సాంఖ్యమతప్రమాణముగ నుపపత్తిని జెప్పినపిదప నిప్పుడు నీకు యోగమార్గానుసారముగ నుపపత్తిని జెప్పుచున్నాను." (గీ. ౨-౩౯) అని భగవంతుఁ డారంభించుటచేఁ బ్రథమమున యజ్ఞయాగాదికామ్యకర్మలలోనే యెల్లపుడు మునిఁగియున్న లోకులబుద్ధి ఫలాశామూలమున నెటుల వ్యగ్ర మగునో వర్ణితమైనది (గీ. ౨. ౪౧-౪౬). పిదప నిటుల బుద్ధిని వ్యగ్ర పడనీయక "ఆసక్తిని వదలుము. బొత్తిగ కర్మలనే వదలి వేయవలయు ననునభినివేశమునఁ బడకుము" అని వచించి "యోగస్థుఁడవై కర్మలను జేయుము"

(గీ. ౨. ౪౮) అని యుపదేశింపఁబడినది. మఱియు నచ్చో 'యోగ' మనఁగా సిద్ధి విషయకము గాని యసిద్ధివిషయకముగాని యగుసమత్వబుద్ధి" యని యోగశబ్దార్థము ముందుస్పష్టముగఁ జెప్పఁబడినది. పిదప "ఫలాశచేఁ గర్మ చేయుటకంటె సమత్వ బుద్ధిరూప మగునీయోగమే శ్రేష్ఠమైనది (గీ. ౨-౪౯). బుద్ధిసమత్వయుక్త యగువా డలఁ గర్మసంబంధ మగుపాపపుణ్యముల బాధ కర్తకుఁ దగులదు. కాన నీవీయోగ మును సంపాదింపుము" అని చెప్పి వెంటనే "యోగః కర్మసు కౌశలం" (గీ. ౨. ౫౦) అని యోగలక్షణము మరలఁ జెప్పఁబడినది. దీనినిఁ బట్టి చూడఁగఁ గర్మపాపము సంబంధింప కుండఁ గర్మఁ జేయుట యనుసమత్వబుద్ధిరూప మగునే విశేషయుక్తి ప్రథమమునఁ జెప్పఁబడినదో యాశక్తికే కౌశల మని నామముగావున నీయుక్తిచేఁ గర్మను జేయుటయే యోగ మని గీతలలోఁ జెప్పఁబడినటుల కనఁబడు చున్నది. మఱియు నీయర్థమే యుత్తరగ్రంథమున—"యో ఽయం యోగ స్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన" "సమత్వబుద్ధిస్వరూప మగుయోగము నీచే నాకుఁ జెప్పఁబడినది."(గీ: ౬. ౩౩) యనియీశ్లోకమున నర్జునునిచే మరల స్పష్టపఱు పఁబడినది. జ్ఞాని యగువానిచే నీజగత్తున నెటుల వ్యవహరింపఁబడవలయునో యావి షయమున శ్రీశంకరాచార్యులవారికంటెను సైతము పూర్వమునుండి వచ్చుచున్న వైదికధర్మముల ననుసరించియే రెండుమార్గములున్నవి. వానిలో, జ్ఞానోత్ప త్తియైనపిదపసర్వకర్మములను బొత్తిగ వదలుట యొకమార్గము; జ్ఞానోత్పత్తియైనను గర్మలను వదలక వాని పుణ్యపాపముల బాధ తగులనియకయే, యుక్తిచే వానినే యామరణాంతమును జేయుచుండుట రెండవమార్గము. ఈరెండుమార్గముల నుద్దే శించియే గీతలలో ముందు (గీ. ౫-౨) సన్న్యాస మనియు, కర్మయోగ మనియు వాడఁబడినది. సన్న్యాస మనఁగా వదలిపెట్టుట; యోగ మనఁగా సంబంధము. పర్య వసానమునకుఁ గర్మలత్యాగము, సంబంధము నను రెండును భిన్నమార్గములుగ నున్నవి. సాంఖ్యము, యోగము, "సాంఖ్యయోగా" అనియును సంక్షిప్తము లగువేఱు నామములు సైతము త్తరగ్రంథమున (గీ. ౫. ౪) నీరెండుమార్గముల ననుసరించియే వాడఁబడినవి. బుద్ధిని స్థిరముఁ జేయుటకుఁ బాతంజలయోగములో నున్నయాసనా దులవర్ణన యీయాఱవయధ్యాయముననున్నది నిజమే! కాని, యది యెవరికొఱకు? తప స్వికొఱకా? కానేరదు; కర్మయోగికొఱకు; (యుక్తిచేఁ గర్మలఁజేయువానికొఱకు). అతఁడు సమత యనుయుక్తిని సాధించుకొనుటకై చెప్పఁబడినది. కానిచో "తపస్వి భ్యో ఽధికో యోగీ" యనువాక్యమే యనన్వితమగును. ఇటులే—"తస్మా ద్యోగీ భవార్జున" (గీ. ౬. ౪౬) అని యీయధ్యాయాంతమున నర్జునునకుఁ జేయఁబడిన

యుపదేశముయొక్క యర్థము కూడ.—"యోగస్థః కురు కర్మాణి" (గీ. ౨-౪౮) "తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్"(గీ. ౨-౫౦) "యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత" (గీ. ౪-౪౨) యనుచోటుల నుండునర్థముతో సమానమైనది. యుక్తిచేఁ గర్మను జేయుయోగి (అనఁగా కర్మయోగి) యగు మని యర్థము గ్రహించుటయే యావశ్యకముగనున్నది. కారణ మేమన:—పాతంజలయోగము నాశ్రయించియుద్ధమున లెమ్మని చెప్పుటయు నసంగతమే; యటు లొనర్చుటయు నశక్యమే. "కర్మయోగేన యోగినామ్" "యోగులగువారు కర్మలను జేయుచునే యుందురు," (గీ. 3-3) అని పూర్వమే స్పష్టముగఁ జెప్పఁబడియుండుటచే, మహాభారతమున నారాయణీయధర్మములయొక్క, లేక, భాగవతధర్మములయొక్క వివేచనలోనే యాధర్మాచరణ లొనర్చువారు తమతమకర్మల వదలక వానినే యుక్తిచేఁ జేయుచుఁ "సుప్రయుక్తేన కర్మణా" (మ. భా. శాం. ౩౪౮. ౫౬) బరమేశ్వర ప్రాప్తిని చేసికొనుచున్నారని చెప్పఁబడినది. పైనఁ జెప్పఁబడినటుల, 'యోగీ' 'కర్మయోగీ' యనునీ రెండుశబ్దములును గీతలలో సమానార్థకము లగుటచే వానియర్థము 'యుక్తిచేఁగర్మఁ జేయువాఁడని స్పష్టమగుచునే యున్నది. 'కర్మయోగ' మనునీ పెద్దపదమునకు మాఱుగ, 'యోగ'మ నుచిన్నపదమే గీతలలోను, మహాభారతమంతటను నధికముగ వాడఁబడియున్నది. "నాచే నీకుఁ జెప్పఁబడినయోగమే పూర్వము వివస్వంతునకుఁ జెప్పఁబడినది. (గీ. ౪.౧) వివస్వంతునిచే మనువునకుఁ జెప్పఁబడినది. కాని యాయోగము తర్వాత నష్టమగుటచే నిప్పుడు నీకుఁ గ్రొత్తగ నాయోగమే చెప్పవలసివచ్చిన" దని భగవంతుఁడు యోగశబ్దమును మూఁడుపర్యాయములు ప్రయోగించుటచేఁ బాతంజలయోగము వివక్షితము కానేరదు. కర్మ యొనర్చుటలో నొకవిలక్షణయుక్తి యని కాని, సాధనమనికాని, లేక, విలక్షణమార్గ మని కాని యర్థము గ్రహింపవలసివచ్చును. అటులె గీతలలో శ్రీకృష్ణార్జునులసంవాదమును సంజయుఁడు యోగ మని చెప్పినప్పుడును (గీ. ౧౮. ౭౫) నీయర్థమే సమ్మతమై యున్నది. శ్రీశంకరాచార్యులవారు తాము సన్యాసమార్గప్రవర్తకు లయ్యును తమగీతాభాష్యారంభముననే వైదికధర్మమునకు నివృత్తి యనియు, ప్రవృత్తి యనియు రెండుభేదములఁ జెప్పెను. మఱియు యోగశబ్దార్థమును, భగవంతునిచేఁ జేయఁబడిన వ్యాఖ్యానము ననుసరించి యొకానొకచో "సమ్యగ్దర్శనోపాయకర్మానుష్ఠానం" (గీ.౪. ౪౨) అనియు మఱియొకచో "యోగః యుక్తిః" (గీ.౧౦. ౭) అనియును జెప్పఁబడినది. అటులే మహాభారతమునసైతము "ప్రవృత్తిలక్షణో యోగః జ్ఞానం సన్న్యాసలక్షణమ్." (మ. భా. అశ్వ. ౪౩. ౨౫). "యోగ మనఁగా ప్రవృత్తి

మార్గము జ్ఞాన మనఁగా సన్న్యాసము, లేక, నివృత్తిమార్గము;" అని యీరెండు శబ్దములయర్థమును గీతలలో స్పష్టపఱుపఁబడినది. మఱియు శాంతిపర్వమందు, నారాయణీయోపాఖ్యానమునమాత్రము సాంఖ్యయోగశబ్దము లీయర్థమందే యనేకపర్యాయములు వచ్చియుండుటచే నీరెండుమార్గములును సృష్ట్యారంభముననే భగవంతునిచే నెందులకై యేవిధమున నిర్మింపఁబడినదియుఁ జెప్పఁబడినది (మ. భా. శాం. ౨౪౦; ౩౪౮). భగవద్గీతలలో నీనారాయణీయధర్మముగాని, భాగవతధర్మము గాని, ప్రతిపాద్య మనువిషయము మొదటి ప్రకరణమ్మున నుదాహరింపఁబడినమహాభారతవచనములవలన స్పష్ట మగును. కావుననే సాంఖ్యమనఁగా నివృత్తిమార్గము, యోగమనఁగా ప్రవృత్తిమార్గము ననియీశబ్దములకు నారాయణీయధర్మములలోనిదియుఁ, బ్రాచీనమును, పారిభాషికము నగునర్థమే గీతలలో వివక్షితముగ నున్న దని చెప్పవలసివచ్చినది. మఱియు నీవిషయమై యేదేని సంశయ మున్నయెడల "సమత్వం యోగ ఉచ్యతే," "యోగః కర్మసు కౌశలమ్." అని గీతలలోని యీశ్లోకములవ్యాఖ్యానముచేతను, "కర్మయోగేన యోగినాం" మొదలగు పైఁజెప్పఁబడిన గీతావచనములచే సైత మది పూర్ణముగ నిరసింపఁబడుటచే గీతలలోనియోగశబ్దము ప్రవృత్తిమార్గ (కర్మయోగ) మను నర్థమందే ప్రయోగింపఁబడిన దనువిషయము నిర్వివాదముగ సిద్ధ మగుచున్నది. వైదికధర్మగ్రంథములలోనే కాక, పాళీ, సంస్కృత, బౌద్ధధర్మగ్రంథములలో సైతము యోగశబ్ద మీయర్థమందే ప్రయోగింపఁబడినటుల స్పష్ట మగుచున్నది. ఉదాహరణము:— శకము ౨౦౦ ప్రాంతమున వ్రాయఁబడిన 'మిళిందప్రశ్న' యనుపాళీభాషా గ్రంథమున "పుబ్బయోగో" (పూర్వయోగ) యనుశబ్దముండుటచే దానియర్థము "పుబ్బకమ్మ" (పూర్వకర్మ)యని యచ్చో వ్రాయఁబడినది. (మి. ప్ర. ౧. ౪.) మఱియు శాలివాహనశకారంభమున నుండిన యశ్వఘోషుఁడను కవియొక్క "బుద్ధచరిత" యనుసంస్కృతకావ్యమ్మునయొక్క ప్రథమసర్గములో ౫౦వ శ్లోకమున.—"ఆచార్యకం యోగవిధౌ ద్విజానా మప్రాప్త మన్యై ర్జనకో జగామ" "బ్రాహ్మణులచే యోగవిధి నభ్యసింపఁజేయుపనిలో జనకమహారాజు ఆచార్యుఁడాయెను. జనకునికంటెఁ బూర్వమం దిట్టియాచార్యత్వ మేరికిని సంభవింప లే" దని చెప్పఁబడినది. ఇచ్చో 'యోగవిధి' యన, 'నిష్కామకర్మయోగవిధి' యనియే యర్థము చేయవలసియున్నది. కారణ మేమనః—జనకునినడవడియందలిరహస్య మిదియే యని గీతాదిగ్రంథములు ఘోషించుటచే, నశ్వఘోషునిచే 'బుద్ధచరిత్ర'

మున(౯.౧౯—౨౦.) గృహస్థాశ్రమమున నుండియే మోక్ష మెటుల సంపాదింపఁ బడవలయునో నిరూపించుటకు జనకునియుదాహరణమే యియ్యఁబడినది. జనకుని చేఁ బ్రవర్తింపఁజేయఁబడిన మార్గమునకు యోగ మనియే పేరు. ఇంతవిషయ మిటులీబౌద్ధగ్రంథములనుండి సైతము సిద్ధ మగుటచే గీతలలోని యోగశబ్దమునకును నీయర్థమే గ్రహింపవలసివచ్చును. కారణ మేమన: జనకునిమార్గమే గీతలలోఁ బ్రతిపాద్యముగ నున్న దని గీతయే చెప్పుచున్నది (గీ. ౩. ౨౦). సాంఖ్యము, యోగము నను నీరెండుమార్గములవిషయమై యధికవిచారము ముందు చేయఁబడును. 'యోగ' శబ్దప్రయోగము గీతలలో నే యర్థమునఁ జేయఁబడిన దనువిషయము మాత్రమే ప్రస్తుతప్రశ్న యై యున్నది.

'యోగ' మనఁగఁ 'గర్మయోగ' మనియు, 'యోగి' యనఁ 'గర్మయోగి' యనియు గీతలలో నున్నశబ్దములకు ముఖ్యార్థ మని యొకపర్యాయము నిర్ణీతమైనపిదప భగవద్గీతలలోఁ బ్రతిపాద్య మగువిషయ మేదియని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. భగవంతుఁడు తనయుపదేశమునకు యోగ మని పేరుఁ బెట్టియున్నాఁడు (గీ. ౪.౧-౩). మఱియు నాఱవయధ్యాయమున నర్జునుఁడును (గీ.౬.౩౩.) గీతలతుద నుపసంహారములో (గీ.౧౮. ౭౫.) సంజయుఁడును గీతలలో నున్నయుపదేశమునకు 'యోగ' మని నామ మిడి రని పైనఁ జెప్పఁబడియే యున్నది. అటులే ప్రతిగీతాధ్యాయాంతమునను నధ్యాయసమాప్తిదర్శక మగుసంకల్పమున సైతము 'యోగశాస్త్ర' మనునదియే గీతలలోఁ బ్రతిపాద్యమైనవిషయమని స్పష్టముగఁ జెప్పఁబడినది. కాని యీసంకల్పములో నున్నశబ్దములయర్థవిషయము ప్రస్తుతటీకాకారు లెవరును గమనించినటుల తోఁపదు. "శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు" అను నారంభమున నున్నరెండుపదము లైనపిదప మ్ముం దీసంకల్పములో "బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే" యని రెండుశబ్దము లున్నవి. పైవానిలో మొదటి రెండుపదములకును నర్థము "భగవంతునిచే గానము చేయఁబడిన యుపనిషత్తులలో" నని యగుటచేఁ దర్వాత రెండుశబ్దములచేతను "బ్రహ్మవిద్యలో యోగశాస్త్రము, అనఁగా: కర్మయోగశాస్త్రము. ఇది దానిలో నుండువిషయ" మని యిపుడు స్పష్టపడుచున్నది. బ్రహ్మవిద్య యనఁగా బ్రహ్మజ్ఞానము. అది కలిగినపిదప జ్ఞాను లగువారికి రెండు నిష్ఠలు, గానిమార్గములు గాని (గీ. ౩.౩) చూపఁబడియున్నవి. సాంఖ్యము, లేక, సన్న్యాస మనునది యొకమార్గము. అనఁగా:—జ్ఞానానంతరమున జగత్తులోని సర్వకర్మల వదలి విరక్తుఁడై యుండుట; రెండవది యోగము, లేక, కర్మయోగము. అనఁగా:—కర్మల వదలక వానిమోక్షప్రాప్తి కెపుడును నడ్డులేకుండుయుక్తిచే

నియమముగ నొనర్చుట. ఈరెండుమార్గములలో మొదటిదానికి జ్ఞాననిష్ఠ యనియు, మఱియొకనామమిడుటంజేసి దానివివేచన యుపనిషత్తులలో ననేకఋషులచేతను, నితరగ్రంథకర్తలచేతను జేయఁబడినది; కాని బ్రహ్మవిద్యాన్తర్గత మగుకర్మయోగము యొక్క కాని, యోగశాస్త్రముయొక్క కాని తాత్త్విక, మగునుపపాదనము భగవద్గీతయందుఁదక్క మఱియెచటను గానరాదు. కావుననే యెవరిచే నీసంకల్పము మున్ముందు రచింపఁబడినదో (అది గీతాప్రతులన్నిటిలోను స్పష్టముగ నుండుటచే గీతలకేవ్యాఖ్యానము చేయఁబడకమునుపే రచింపఁబడియుండు నని యనుమానము చేయఁబడినట్లు వెనుకనే చెప్పఁబడినది.) వారిచే గీతాశాస్త్రవిషయముయొక్క యపూర్వతను నిరూపించుటకొఱకు "బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే" యను నీపదము లాసంకల్పమున నాధారసహితముగను సహేతుకముగను వ్రాయఁబడినవి. వ్యర్థములుగాని మనఃకల్పితములుగాని కావనియు నిప్పుడు స్పష్టమగుచున్నది. మఱియు గీతలపై సాంప్రదాయికములగుటీకలు వ్రాయకమునుపు గీతలతాత్పర్యమేమని నిర్ణయించుకొనినదియు నీసంకల్పముచేతనే సహజముగఁ దెలియును. నాయదృష్ట మేమి!. యోగమార్గప్రవర్తకుఁడును, సర్వయోగములకును సాక్షాదీశ్వరుఁడు నగు (యోగ + ఈశ్వర) శ్రీకృష్ణభగవానుఁడు సర్వభూతహితము కొఱకు స్వయముగఁ బట్టుపట్టి దేనియందలి రహస్యమును పూర్వ మర్జునునకు బోధించెనో యట్టికర్మయోగమును బ్రతిపాదించుట యనునది సంభవించినది. 'యోగము' 'యోగశాస్త్రము' అను గీతల్లలోనిశబ్దములకంటె, 'కర్మయోగము' 'కర్మయోగశాస్త్రము' అనుపదములు పెద్దవి యగుట సత్యమే. కాని గీతలలోఁ బ్రతిపాద్య మగువిషయములో మరల నేవిధమైనసందేహము నుండకూడ దను తలంపుతో నీగ్రంథమునకును, నీప్రకరణమునకును "కర్మయోగశాస్త్రము" అను గొప్పనామము నే నిడితిని.

"ఒకకర్మను జేయుటకే, యేయనేకయోగములు గాని, లేక, సాధనములు గాని కలవో వానిలో నేది మిక్కిలి మంచిదియు శుద్ధము నైనమార్గమో! దానిని నియమముతో నాచరించుట శక్యమగునా? కాదా? కానియెడల దాని కపవాదమేమి? మఱియు దేనికొఱకుఁ గలిగినది? మనము మంచిదనుకొనుమార్గ మేకారణమున మంచిది? ఏకారణమున మనము చెడు దనుకొనునది చెడుద్ది? మఱియు నీమంచిచెడుగులెవనిచే నేవిధముగ నిశ్చయింపఁబడవలయును? అట్లు నిశ్చయించుటకుఁగారణమేమి?" అనునిట్టివిషయము లేశాస్త్రముయొక్కయాధారముచే నిశ్చయింప వచ్చునో దానికి "కర్మయోగశాస్త్ర"మని కాని, గీతలలోనున్న సంక్షిప్తశబ్దానుసారముగ

"యోగశాస్త్ర" మని కాని సామాన్య మంచిచెడుగు లనునీపదములు సామాన్యము లుగ నున్నవి. మఱియు న్యాయర్థమునందే యొకానొకప్పుడు శుభాశుభము లనియు, నింకొకసమయమున హితాహితము లనియు, వేఱొకసమయమున శ్రేయస్కరా శ్రేయస్కరము లనియు, మఱియొకప్పుడు పాపపుణ్యము లనియుఁ బదముల వాడు చున్నారు. కార్యాకార్యములు, కర్తవ్యాకర్తవ్యములు, న్యాయాన్యాయములు ననునీద్వంద్వములను బోధించుశబ్దములకు నిదియ యర్థము. అయిన నీశబ్దమును బ్రయోగించువారిసృష్టిరచనావిషయకము లగుమతములు వేర్వేఱుగ నుండుటచేఁ గర్మయోగశాస్త్రనిరూపణప్రకారములును వేర్వేఱుగనే యున్నవి. ఏశాస్త్ర విచారము చేసినను దానిలోనివిషయముల చర్చ సామాన్యముగ మూఁడువిధములుగఁ జేయవచ్చును. (౧) "జడసృష్టిలో నున్నపదార్థములు, మనయింద్రియములకు గోచ రించునటులే యున్నవి; అంతకంటె వానియందు దేవతాదికము లేమియు లేవు." అనునూహతోఁ బదార్థములవిచారణ చేయుటయే వీనిలో మొదటిది. దీనినే యాధి భౌతికవివేచన యని పచింతురు. ఉదాహరణము:—సూర్యుఁ డనునది యొకదేవత యని యంగీకరింపక కేవలపాంచభౌతిక మగుజడపదార్థపుముద్ద యని వక్కాణించి, ఉష్ణత, ప్రకాశము, బరువు, ఆకర్షణము, మొద లగునాపదార్థపుగుణధర్మములనే పరీక్షించుట సూర్యునియాధిభౌతికవివేచన యనఁ బడును. రెండవయుదాహరణ మున నొకవృక్షమును గ్రహింతము. వృక్షమున కంకురోద్భేదము మొదలగునవి యంతర్గత మగునేశక్తిచే నగునో దాన్ని విచారింపక "క్షేత్రమున బీజములు నాటిన నంకురము గలుగును. పిదప నాయంకురమువృద్ధి పొంది, కొమ్మలు, ఆకులు, పూవులు, కాయలు మొదలగుదానిదృశ్యవికారము లగును." అని దానిని కేవల బాహ్యదృష్టితో విచారించుట వృక్షముయొక్క యాధిభౌతికవివేచన యనఁ బడును. రసాయనశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము, విద్యుచ్ఛాస్త్రము మొదలగు నాధునికశాస్త్రములలో నుండువివేచన యిటులే యుండును. వేయేల? ఇటు లొకవస్తువుయొక్క దృశ్యగుణవిచారణ యైనమాత్రముననే తమకృత్యము నెఱ వేఱిన దనియు నింతకంటె సృష్టిలో నున్నపదార్థములను విశేషము విచారించుట వలన ఫల మేమియు లే దనియు నాధిభౌతికపండితులు తలంతురు. (౨) ఈపూ ర్వోక్త మగునూహను వదలి "జడసృష్టిలోనుండుపదార్థములమూల మేమై యుం డును? ఈపదార్థములవ్యవహారము వానిగుణధర్మములచే మాత్రమే యగునా? లేక, వానియందు మఱియొకతత్త్వ మేదైనఁ గలదా?" యనునూహతో విచారించు నెడల నాధిభౌతికవివేచనకంటె నెక్కువగ మొదటికిఁ బోయి విచారింపవలసి

వచ్చును. ఉదాహరణము:—పాంచభౌతిక మగుసూర్యుని, జడము, లేక, యచేతన మగుగోళములోఁ దదధిష్ఠాత్రి యగుసూర్యనామకదేవత యుండుటచే నదియే జడ మగుసూర్యునివ్యవహారమును నడపించుచున్న దని తలఁచుటయే యాధిదైవిక వివేచన యనఁబడును. ఈమతము ననుసరించి చెట్టు, నీరు, గాలి, మొదలగుసర్వ పదార్థములలోను నాజడపదార్థములకంటె వే ఱగున నేకదేవతలుండుటచే వారే జడపదార్థములవ్యవహారముల నడపించుచున్నా రనిచెప్పఁబడును. (3) కాని, జడ సృష్టిలో నున్న వేలకొలఁదిజడపదార్థముల కిటుల వేలకొలఁది వేర్వేఱుదేవత లున్నా రని యంగీకరింపక "బాహ్యసృష్టియొక్క సర్వవ్యవహారములను నడపించుచు మనుష్యులశరీరములలో నాత్మస్వరూపముగ నుండి యాజనులకు సకలసృష్టి జ్ఞానమును నిచ్చునింద్రియాతీత మగునొకచిచ్ఛక్తియే యీజగత్తున నుండుటచే నాశక్తియే యీజగత్తును నడపించుచున్న" దని చెప్పుటయే యాధ్యాత్మికవివేచన యగును. ఉదాహృత మగుసూర్యచంద్రాదులవ్యవహారమువలెనే చెట్ల యాకులు కదలుటయు, నీయచింత్యశక్తిప్రేరణచేతనే యగు ననియు, సూర్యునియందేనియు నితరపదార్థములయం దేనియు స్వతంత్ర లగు వేర్వేఱుదేవతలు లే రనియు నధ్యాత్మవాదులందురు. ఏవిషయము వివేచనఁ జేసినను నీమూఁడుమార్గములు చాలకాలమునుండి వచ్చుచుండుటచే నుపనిషద్గ్రంథములలో సైతము వాని యుపయోగము చేయఁబడినటుల గోచరించుచున్నది. ఉదాహరణము:—"జ్ఞానేంద్రియములు, ప్రాణము, వీనిలో శ్రేష్ఠమగున దేది?" యని విచారణఁ జేయుచు నొకప్పుడీయింద్రియములయగ్న్యాదిదేవతలను, నొకప్పుడు వానిసూక్ష్మస్వరూపమును (అధ్యాత్మను) గ్రహించి బృహదారణ్యకాద్యుపనిషత్తులలో వీనిబలాబలవివేచన చేయఁబడినది (బృ. ౧. ౫. ౨౧-౨౨; ఛాం. ౧. ౨-౩; కౌషీ. ౨. ౮.). మఱియు గీతలసప్తమాధ్యాయముతుదను నెనిమిదవయధ్యాయారంభమునను జెప్పఁబడినయీశ్వరస్వరూపవిచారణయు నీయూహతోనే చేయఁబడినది. వానిలో "అధ్యాత్మవిద్యా విద్యానాం" (గీ. ౧౦. ౩౨.) అనునీవాక్యము ననుసరించియు నాధ్యాత్మికవివరణమునే మనశాస్త్రకర్తలితరులకంటె నధికముగ గౌరవించుచున్నారు. ఇటీవల పైనఁ జెప్పఁబడినమూఁడుశబ్దములయర్థమును కొంతమార్చి ఫ్రెంచి (French) దేశజుఁడును ప్రసిద్ధుఁడు నగు "కొంటు" అను నాధిభౌతిక పండితుఁడు * ఆధిభౌతికప్రతిపాదనమే సర్వోత్తమ మనెను. అతఁడు "సృష్టికి

* ఫ్రాన్సుదేశమున ఆగస్టుకొంట్ (Auguste Comte) అనువాఁడు వెనుకటిశతాబ్దమున నుండెను. ఈతఁడు, సమాజరచన, శాస్త్రీయ మగురీతిలో

బూర్వ మేతత్త్వమున్నదో తెలిసికొనవలసినది గాని చెలియవలసినది గాని యవసరము లేదనియు, నాతత్త్వ మగమ్య మగుటవలన(అనఁగా: ఎప్పుడును తెలిసికొనుటకు వీలుకాని దగుటచే) దానియాధారమున నొకశాస్త్రరూప మగుపెద్ద గృహనిర్మాణ మసమర్థము నశక్యము ననియు, పామరజనము, చెట్లు, మబ్బులు, జ్వాలాముఖులు, (అగ్నిపర్వతములు, Valcanoes) మొదలగుకదలుచున్న వస్తువులను దొలుతఁజూచినప్పుడివి యన్నియు, దేవతలే యని ధర్మవిషయక మగుమూఢభక్తిచే ననుకొనియెననియు, తనమతమున నిదియే యాధిదైవికవిచార మనియు, పిదప, మనుష్యులు కొలఁదికాలమునకే యీకల్పనను వదలి యీసమస్తవస్తువులలో నేదేని యొక యాత్మతత్త్వము నిండియుండుననియనుకొనసాగి రనియు, నిది తనమతమున మానవీయ జ్ఞానప్రగతికి(పద్ధతికి) రెండవమెట్టనియు, నిదియే యాధ్యాత్మికవివేచన యనియు, కాని సృష్టి నీవిధమున విచారించినను బ్రత్యక్షముగ నుపయోగించుశాస్త్రీయజ్ఞానమున కేమియు వృద్ధి లేకునికిఁ, దుదకు సృష్టిలో నున్నవస్తువులయదృశ్యము లగుగుణధర్మములనే మనుష్యుఁ డత్యధికముగ శోధనఁ జేయుట కారంభించె ననియు, దాని వలననే మనుష్యులకిప్పుడు, ధూమశకటము, విద్యుద్వార్తాయంత్రములవంటియుక్తులు చూపించుటచే బాహ్యసృష్టిపై దానియధిక మగువ్యాపారము నడచుట కారంభించినదనియు, తనమతమున నిదియే యాధిభౌతికవివేచన యనియు, నేశాస్త్రము నైన, నేవిషయము నైన వివేచన సేయుట కీమార్గమే యితరమార్గముల కన్న నధికముగ లాభదాయకము, శ్రేష్ఠము ననియు, కోంటు నిర్ణయించెను. కోంటుమతానుసారముగ సమాజశాస్త్రముయొక్క గాని కర్మయోగశాస్త్రముయొక్క గాని తాత్త్విక విచారమును జేయుట కీదృష్టినే గ్రహింపవలయును. మఱియు నాసంగతినిగ్రహించి,

---

నెటుల విమర్శింపవలసిన దనియుఁ గొలుపునట్టి యొకపెద్దగ్రంథమును సమాజశాస్త్రముపై రచించెను. ఏశాస్త్రమును దీసికొన్నను మొదట Theological పద్ధతి ననుసరించి చేయవలయును. పిమ్మట Metaphysical పద్ధతి ననుసరించి చేయవలయును. తుదకు దాని Positive స్వరూపము సిద్ధించును. అని యనేకశాస్త్రముల నాలోచించి యతఁడు నిశ్చయించెను. ఈమూఁడుమార్గములకుఁ బ్రాచీనములగు ఆధిదైవికాధ్యాత్మికాధిభౌతికము లను పేళ్లనే యీగ్రంథమున నుంచితిని. కాని యీమార్గములను 'కోంటు' క్రొత్తగా కనిపట్టలేదు. ఇవన్నియు పూర్వకాలమున నున్నవియే. అయినను దాని నాతఁ డైతిహాసక్రమమున నుపపాదించెను. దానిలో Positive (ఆధిభౌతిక) మార్గమే శ్రేష్ఠ మని యాతఁ డెంచెను. చాలును,

యితిహాసాలోకనముఁ జేసి ప్రతిమనుజుఁడును సర్వమానవజాతియందును ప్రేమ యుంచి సదా సమస్తజనుల క్షేమకళ్యాణములకొఱకుఁ బ్రయత్నము చేయుటయే జగత్తులోఁ బరమ మైనధర్మ మని సర్వవ్యవహారశాస్త్రములమథితార్థ మీతనిచే, నిర్ణయింపఁబడినది. మిల్లు, స్పెన్సర్ మొదలగు నింగ్లీషుశాస్త్రజ్ఞు లీమతమునే పురస్కరించి రని చెప్పవచ్చును. కొంటు, హెగిల్, శోఫెన్, హాయర్ మొదలగు జర్మనితత్త్వజ్ఞులీయాధిభౌతికపద్ధతి నీతిశాస్త్రవివేచనకుఁ జాల దని నిశ్చయించి మనవేదాన్తము ననుసరించి యధ్యాత్మదృష్టిచేతనే నీతిని సమర్థించుమార్గము నీ కాలమునఁ గొంటుమతమునకు విరుద్ధముగ నైరోపాఖండమున మరల స్థాపించిరి. ఈవిషయమై పెక్కు సంగతు లుత్తరగ్రంథమునఁ జెప్పెదను.

విషయప్రతిపాదనమున నొక్కొక్కరి దృష్టియు, మార్గము నొక్కొక్కటి యగుటచే, మంచిచెడుగు లనునొకవిషయమునే చెప్పఁదలఁచినను, కార్యాకార్యములు, ధర్మాధర్మ్యములు, మొదలగువేర్వేఱుపర్యాయపదములను బ్రయోగింపవలసివచ్చినది. "భీష్మద్రోణాద్యులవధ యేయుద్ధమునఁ జేయవలసివచ్చునో యాయుద్ధమును నేనుజేయుట శ్రేయస్కర మగునా? కానేరదా?" యని యర్జునుశంక (గీ. ౨.౬). ఒకయాధిభౌతికపండితుఁ డీప్రశ్నకు సమాధానముఁ జెప్పనెడల, భారతయుద్ధమువలన నర్జునునకుఁ దోఁచినలాభాలాభములను, మొత్తముపై సమాజమునకుఁ గలుగుపరిణామమును, సారాసారవిచారమును జేసి, యుద్ధముఁ జేయుట న్యాయ్యమో యన్యాయ్యమో నిర్ణయించి యుండును. కారణ మేమన:—ఏకర్మకైనను జగత్తులోఁ గల్గునాధిభౌతికపరిణామము (అనఁగా: ప్రత్యక్షమగుబాహ్యపరిణామము)ను వదలినయెడల నాకర్మయొక్క మంచిచెడుగుల నిర్ణయించుటకు, మఱియొక్క సాధన మైనను, పద్ధతి యైనను, ఆధిభౌతికపండితులకు సమ్మతము కానేరదు. కాని యిట్టియుత్తరముచే నర్జునుని సంశయము నివర్తింపనేరదు. ఏల యనఁగా:— అర్జునునిదృష్టి యింతకంటె వ్యాపకముగ నుండెను. కేవల మీలోకమున నీశరీరమునకే కాక, పరలోకమునసైతము తనయాత్మకు పరిణామమును గలుగఁజేయు నీయుద్ధము శ్రేయస్కర మగునా? కానేరదా? యనువిషయమున, నిర్ణయ మాతనికావశ్యకముగ నుండెను. యుద్ధమందు భీష్మద్రోణాదులు చచ్చినఁ దనకు రాజ్యప్రాప్తియై యిహలోకము లభించునా? లభింపదా? లోకులకుఁ దమరాజ్యశాసనము, దుర్యోధనరాజ్యశాసనముకంటె సుఖకర మగునా? కానేరదా? యను విష

---

ఈమాత్ర మైన కొంటు క్రొత్తగ విమర్శించెను. కొంటు రచించినగ్రంథము లనేకము లింగ్లీషులోనికిఁ దర్జుమా చేయఁబడినవి.

యమున నతనికి సంశయము లేదు. మఱి యే మన:—తాఁ జేయునది ధర్మ్యమా? అధర్మ్యమా? పుణ్యమా? పాపమా? యనువిషయ మాతనికి తెలిసికొనవలసిన దైయుండెను. మఱియు గీతలలో నున్నవివేచనయు నాదృష్టితోనే చేయఁబడినది. గీతలలో కాక, మహాభారతములో నితరప్రదేశములలో నుండు కర్మాకర్మలవివేచనయు నీతిరుననే (అనఁగా: పారలౌకికము నాధ్యాత్మికము నగు దృష్టితోనే) చేయఁబడుటవలన దానిలోనే కర్మయొక్క మంచిచెడుగులను నిరూపించుట కైనను ధర్మాధర్మశబ్దములే తఱచుగ నన్నిస్థలముల వాడఁబడియున్నవి. కాని ధర్మము, దానికి ప్రతియోగి (అనఁగా: విరుద్ధము) అగు నధర్మము నను నీ రెండుశబ్దములును వానివ్యాపక మగునర్థముచే నొకచో భ్రమమును బుట్టించును. కానఁ గర్మయోగశాస్త్రమున నాశబ్దములు ముఖ్యముగ నేయర్థమున వాడఁబడినవో యనువిషయమున నిక్కడ కొంతవిరివిగ విచారించుట యవశ్యకర్తవ్యము.

నిత్యవ్యవహారమునఁ బలుమాఱు "ధర్మ"శబ్దము స్పష్టముగ "పారలౌకికసుఖము యొక్క మార్గము"అనునర్థమునఁ బ్రయోగించుచుండుట నెఱిఁగియే యున్నాము. మఱియుఁ బ్రసక్తానుసారముగ నెవరినైనను "నీధర్మమేమి?" అని మనమడిగిన,వాఁడు పారలౌకికకళ్యాణార్థమై తా నేమార్గ మవలంబించి యున్నాడో, అనఁగా:—వైదిక, బౌద్ధ, జైన,క్రీస్తు, మహమ్మదీయ, పార్శీమతములలోఁ దా నేమతావలంబకుఁడని యడుగుచున్నా రని యనుకొని పైమతములలో నొకానొకదానిని దా నవలంబించియుండుదానినామము నుడువును? అటులే స్వర్గప్రాప్తిని గుఱించి సాధనభూతము లగుయజ్ఞయాగాదివైదికవిషయములమీమాంస నడచుచుండ "అథాతో ధర్మజిజ్ఞాసా" మొదలగుసూత్రములలో నున్న "ధర్మ" శబ్దమున కీయర్థమే వివక్షితముగ నున్నది; కాని, ధర్మశబ్దమున్న కీమాత్రపుసంకుచితార్థముననే కాక యేతద్వ్యతిరిక్తము లగురాజధర్మములు, ప్రజాధర్మములు, దేశధర్మములు, మొదలగు నైహికనీతినిబంధనలయందును బ్రయోగము కలదు. ధర్మశబ్దమున కీరెండర్థములయందును వేర్వేఱుగఁ బ్రయోగములఁ జూపవచ్చును. పారలౌకికధర్మమునకు మోక్షధర్మమని కాని కేవలమోక్ష మని కాని ప్రయోగ ముండుటయు, వ్యావహారికధర్మములకుఁ గాని, కేవలనీతికిఁ గాని 'ధర్మ'మ ను నీయసమస్తపదమునే బ్రయోగించుటయు నిందుల కాధారములు. ఉదాహరణము:—చతుర్విధపురుషార్థములను లెక్కించునపుడు, ధర్మార్థకామమోక్షము లని మనము చెప్పుచున్నాము. ఈశబ్దములలో మొదటి "ధర్మ" శబ్దములోనే మోక్షము సైతమంతర్భూతమైనచోఁ జివర మోక్షమని వేఱొకపురుషార్థవాచకశబ్దము చెప్ప నేల? దీనివలన ధర్మపదముచే నీస్థలమందు,

జగత్తునఁ గాని, సంసారమునఁ గాని యున్న పలునీతిధర్మములే, శాస్త్రకర్తల కిష్ట మని చెప్పవలయును. దీనినే మనము కర్తవ్యకర్మ యని, నీతిధర్మ మని, సదాచరణ మని ప్రస్తుతమునఁ జెప్పుచున్నాము; కాని ప్రాచీనసంస్కృతగ్రంథములలో 'నీతి' లేక, 'నీతిశాస్త్రము' అనునీశబ్దములు విశేషముగ రాజనీతినే యుద్దేశించి ప్రయోగింపఁబడుచుండుటచేఁ గర్తవ్యకర్మ, సద్వర్తనము—వీనిసామాన్యవివేచనను 'నీ, ప్రవచన'మని చెప్పక 'ధర్మప్రవచన' మనియే పూర్వమందుఁ జెప్పుచు వచ్చిరి. కాని నీతిధర్మశబ్దములరెంటిలో నీపారిభాషికభేదము సర్వసంస్కృతగ్రంథములలో గ్రహింపఁబడిన దనుసిద్ధాంతము కానరాదు. కావున నేనును నీతి, కర్తవ్య, ధర్మ శబ్దము లీగ్రంథమున నొకయర్థముననే ప్రయోగించితి. మఱియు మోక్షవిచారము చేయఁదగియున్నప్రకరణమునకు "అధ్యాత్మ"మనియు, "భక్తిమార్గ"మనియుస్వతంత్ర నామములు ప్రయోగింపఁబడినవి. మహాభారతమున ధర్మశబ్ద మనేకస్థలముల వచ్చి, యుండుటచే "ఒకని లోకకార్యమును జేయుట ధర్మప్రాప్త మయినది" అని విధింపవలసినపుడు ధర్మశబ్దముచే 'కర్తవ్యశాస్త్రము' లేక, 'తాత్కాలికసమాజ వ్యవస్థాశాస్త్రము' అను నర్థమే వివక్షితమగుచున్నది. మఱియుఁ బారలౌకిక కళ్యాణపుమార్గము చెప్పుసమయమున (అనఁగా: శాంతిపర్వపు ఉత్తరార్థమందు) మోక్షధర్మ మని వేఱుపేరు వాడఁబడినది. ఇటులే మన్వాదిస్మృతిగ్రంథములలో సైతము చాతుర్వర్ణ్యము లగుకర్మలఁ జెప్పుచు, ధర్మశబ్దమే పలుమాఱు లనేకస్థలములఁ బ్రయోగింపఁబడుటచే భగవద్గీతలో సైతము—"స్వధర్మ మపి చావేక్ష్య" "స్వధర్మము నాలోచించి యుద్ధముచేయుము" [గీ. ౨. ౩౧] అని యర్జునునకు భగవంతుఁడుపదేశించినపుడును, మఱియు ముందు—"స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" (గీ. ౩. ౩౫) అను స్థలమందును ధర్మశబ్దమైహలౌకిక మగు చాతుర్వర్ణ్యముయొక్క ధర్మ మనునర్థముననే ప్రయోగింపఁబడినది. సమాజపు సర్వవ్యవహారములను సరళముగ నడపించుటకొఱకును, నేదేని యొకవ్యక్తిమీఁదఁ గాని సమాజముమీఁదనే కాని, సర్వభారమును బడకుండ నాసమాజము నన్నివిధముల రక్షించుటకుఁ బోషించుటకును, నాశ్రమవిభాగరూప మగుచాతుర్వర్ణ్య వ్యవస్థ ప్రాచీను లగుమహర్షులచే నేర్పఱుపఁబడినది. కానురా నీచాతుర్వర్ణ్యము వారును కేవలజాతిమాత్రోపజీవులుగా (అనఁగా: సత్యములగుస్వకర్మల మఱచి కేవలనామధారు లగుబ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులుగా) నుండిరనువిషయము ప్రస్తుత మొకవైపున నుంచుదము. తొలుత నీయవస్థ సమాజధార

ణార్థమై బయల్వెడలినది. కావున చాతుర్వర్ణ్యములో నొకజాతి, స్వధర్మమును (కర్తవ్యము) వదలిపెట్టినఁ గాని, యొకవర్ణము పూర్తిగ నష్టమైనప్పుడు దానిస్థాన మితరులు పూర్తి చేయకపోయినఁగాని, సమాజమంతయు నావిధముననే బొత్తిగ వక్రమై క్రమక్రమముగ నశించును. కాదేని బొత్తిగ నీచావస్థ నైనఁ బొందును. ఈవిషయ మెల్లరకు స్పష్టముగఁ దెలిసినదే. చాతుర్వర్ణ్యవ్యవస్థ లేకుండఁ, దోఁచి నటులుగ వెలువడిన యనేకసమాజములు పాశ్చాత్యఖండములలో నున్నవి; కాని చాతుర్వర్ణ్యవ్యవస్థ లేక పోయినను, నాల్గువర్ణముల సర్వధర్మములును, పుట్టుకను బట్టి లేకున్నను గుణవిభాగరూప మగు వేఱొకవ్యవస్థచే నైన నాదేశములోనిసమాజము లోఁ బ్రబలియున్న వను సంగతి మనము మఱవఁగూడదు. సారాంశ మేమనఁగా:— ధర్మశబ్దమును మనము వ్యావహారికదృష్టితో నుపయోగించునపు డెద్దానిచే సర్వ సమాజ ముద్ధరింపఁబడి పోషింపఁబడునో యద్దాని మనము గ్రహించుచునే యున్నాము. అసుఖోదర్క-(పరిణామమున దుఃఖము నిచ్చు)ధర్మమును వదలవలయు నని మనువు చెప్పుచున్నాఁడు (మను. ౪. ౧౭౬). మఱియు శాంతిపర్వమునందు సత్యానృతాధ్యాయమున (శాం. ౧౦౯. ౧౨) ధర్మాధర్మములవివేచనయందు భీష్ముఁడును, తత్పూర్వమునఁ గర్ణపర్వములో శ్రీకృష్ణుఁడును—

"ధారణా ద్ధర్మ మి త్యాహు ర్ధర్మో ధారయతే ప్రజాః
యత్స్యా ద్ధారణసంయుక్తం స ధర్మ యితి నిశ్చయః.

[మ. భా. కర్ణ. ౬౯. ౫౯]

"ధర్మ" శబ్దము, "ధృ ధారణే" యను ధాతువునుండి నిష్పన్న మగుటచే ధర్మముచేతనే ప్రజ లందఱును బద్ధులు. దేనిచే సమస్తప్రజలధారణ యగునో యదియే ధర్మ మని నిశ్చితమగును." అని చెప్పుచున్నాఁడు. కావుననే యీధర్మము వదిలిపోయినయెడల సమాజబంధనములు (కట్టుబాట్లు) చెడిపోయిన వని యెఱుంగ వలయును. సమాజము కట్టుబాట్లు చెడినయెడల, ఆకర్షణశక్తి లేనప్పు డాకసమున నుండుసూర్యాదిగ్రహములకును, చుక్కాని లేనప్పుడు సంద్రములోని నావకును, గలుగునవస్థయే సమాజమునకుఁ బొడమును. ఈశోచనీయావస్థను బొంది సమాజము నశింపఁగూడదు. కావున ద్రవ్యోపార్జనయందైనను సమాజరూప మగుఘటికా యంత్రమునకు హాని లేక యార్జింపవలయును. కామాదివాసనలఁ దృప్తిఁబొందింప వలసినచో, ధర్మాతిక్రమణము లేక చేయవలయును. ఈతీరున ననేకస్థలములలో వచించి భారతముతుద వేదవ్యాసులు—

శ్లో. "ఊర్ధ్వబాహు ర్విరౌ మ్యేష నచ కశ్చి చ్ఛృణోతి మామ్,
ధర్మా దర్థశ్చ కామ శ్చ స ధర్మః కిం న సేవ్యతే."

"రెండు చేతుల నెత్తికొని యాక్రోశించుచున్నాను; కాని నాయాక్రోశము నెవ్వఁడును వినఁడు. ధర్మముచేతనే యర్థకామములు గలుగును. కావున నాధర్మము నేల యాచరింపరు?" అని చెప్పుచున్నారు. ఈధర్మదృష్టిచేతనే శ్రీమహాభారతమును, ఐదవవేద మనికాని, ధర్మసంహితయనికాని చెప్పుచున్నారు. ఆధర్మసంహితాశబ్దములో "ధర్మ" శబ్దముయొక్క ముఖ్యార్థ మీగ్రంథమువలన వాచకుల మనస్సునకు గోచరించును. పూర్వోత్తరమీమాంస లను సారలౌకికార్థప్రతిపాదకంబు లగుగ్రంథములవలెనే భారతముసైతము ధర్మగ్రంథమే కావున "నారాయణం నమస్కృత్య" యను ప్రతీకశబ్దములచే మహాభారతము సైతము బ్రహ్మయజ్ఞము నందు నిత్యపాఠములలోఁ జేర్చుకొనఁబడియున్నది. పైఁ జెప్పఁబడినధర్మాధర్మనిరూపణలను విని యే రైనను, "1.సమాజధారణము,2.రెండవప్రకరణమున సత్యానృతవివేకమందుఁ జెప్పఁబడినసర్వభూతహితమును, అనునీరెండుతత్త్వములును మీకు మాన్యము లగునెడల మీదృష్టికిని, ఆధిభౌతికదృష్టికిని భేదమేమి? ఈరెండుతత్త్వములును వెలుపలికిఁ బ్రత్యక్షముగ గోచరించునవియే గదా? (అనఁగా నాధిభౌతికములేకదా.)" యని ప్రశ్న చేయుదురు. ఈప్రశ్నకు సవిస్తరవిచారము నుత్తరప్రకరణమునఁ జేసియున్నాము. సమాజధారణమే ధర్మముయొక్క ముఖ్యమగుబాహ్యోపయోగమనుసిద్ధాన్తమును మేమంగీకరించినను, వైదికములుగాని, ఇతరములుగానియగు సర్వధర్మములలో శ్రేష్ఠమైనను, సాధ్యము నైనయాత్మకళ్యాణమును, లేక, మోక్షమును గమనింపకయే నాదృష్టి నెప్పుడును నడువనీయ ననిమాత్ర మిచ్చోఁ జెప్పుచున్నాను. ఇదియే యితరమతములకంటె మామతమున నున్నవిశేషము. సమాజధారణము, సర్వభూతహితము ననునీబాహ్యోపయోగములగు తత్త్వములు మా మోక్షమార్గమునకు బాధకము లగునెడల వాని మేము నిరాకరించెదము. వైద్యశాస్త్రము సైతము శరీరరక్షణముగుండ మోక్షప్రాప్తిసాధన మగుటచే గ్రహింపఁదగియున్న దని మాయాయుర్వేదగ్రంథములచేఁ బ్రతిపాదింపఁబడినచో, నీలోకమున వ్యవహార మెటుల చేయఁబడవలయునో, యామహత్త్వవిషయ మేశాస్త్రమున విచారింపఁబడవలయునో యట్టికర్మయోగశాస్త్ర మాధ్యాత్మిక మగుమోక్షజ్ఞానమును వదలి మాశాస్త్రకర్తలచేఁ జెప్పఁబడిన దనుసంగతి యెప్పుడును సంభవింపదు. కావుననే, మోక్షమునకు (ఆధ్యాత్మికోన్నతికి) అనుకూలము లగుకర్మలే, పుణ్యము

లును, ధర్మములును, శుభములు నైనకర్మలు. మఱియు దానికిఁ బ్రతికూలము లగు కర్మలే పాపములు, నధర్మములు, నశుభములు నగుకర్మ లని తలఁతును. కావుననే కర్తవ్యము, కార్యము, అకర్తవ్యము, అకార్యము ననుశబ్దములయెడ నర్థద్వయ ముండుటచేఁ గొంచెము సందిగ్ధముగ నున్నను ధర్మాధర్మశబ్దములనే తఱుచుగఁ బ్రయోగించుచున్నాను. దీనిలో నున్నమర్మ మిదియే. బాహ్యసృష్టిలో వ్యావహారిక మగుకర్మనుగాని వ్యాపారమునుగాని ప్రస్తుతము ముఖ్యముగ విచారింప వలసియున్నను, అకర్మకు బాహ్యమగుపరిణామముయొక్క విచారముతోఁ గూడనే యీవ్యాపార మాత్మయొక్క కళ్యాణమున కనుకూలమైనదా? లేక, ప్రతికూలమైనదా? యనువిచారముసైతము మనచే నియమముగఁ జేయఁబడుచున్నది. "నాకు హిత మగుదానిని నేను వదలి, లోకులకు హిత మగు దాని నేల చేయవలయు?" నని యాధిభౌతికవాదుల నెవ రైననడిగినయెడల, సామాన్యముగ నది మనుష్యస్వభావ మందురే కాని, మఱియే మని సమాధానముఁ జెప్పుదురు? మనశాస్త్రకర్తలదృష్టి యింతకంటెను సూక్ష్మాంశమును కనిపట్టినది. మఱియు నావ్యాపక మైనయాధ్యాత్మికదృష్టితోనే కర్మయోగశాస్త్రము మహాభారతమున విచారింపఁబడుటచే భగవద్గీతలలో వేదాన్తనిరూపణము నిందులకే-చేయఁబడినది. మానవుల కత్యంతహితమును, సద్గుణములయొక్క 'పరాకాష్ఠ' (అనఁగ:అధిక్యము) మొద లగుకొన్ని ముఖ్యప్రయోజనములను గల్పించి యాధోరణి చేతనే కర్మాకర్మవివేచన చేయఁబడవలయు నని ప్రాచీను లగు గ్రీకుపండితుల మత మగుటచే నాత్మహితమున నీసర్వవిషయసమావేశ మగునని "అరిస్టాటిల్" అనువాఁడు తననీతిశాస్త్రగ్రంథమునఁ జెప్పి యున్నాఁడు. (౧.౭-౮) అయిన నాత్మహితమున కీవిషయమున నియ్యవలసినంత ప్రాధాన్యమును 'అరిస్టాటిల్' ఈయలేదు. మనశాస్త్రకర్తలసంగతి యటుల కానేరదు. ఆత్మయొక్క కళ్యాణము, లేక, ఆధ్యాత్మికపూర్ణావస్థ, అనునదియే ప్రతిమానవునకును బ్రాథమికమును ముఖ్యమును నగుసాధన మై యున్నది. మఱియు నితరము లగుహితములకంటె నదియే ప్రధాన మైన దని యెంచి తదనుసారముగనే ముందు కర్మాకర్మలవిచారణఁ జేయవలయును. అధ్యాత్మవిద్యను వదలి కర్మాకర్మవిచారమును జేయుట యుక్తము గా దని 'యరిస్టాటిల్' సిద్ధాన్తీకరించెను. మఱియుఁ బ్రకృతము పాశ్చాత్యదేశములలోఁ గొందఱు పండితులచేఁ గర్మాకర్మవివేచన కీపద్ధతియే స్వీకరింపఁబడినటుల గోచరించుచున్నది. ఉదాహరణము:—జర్మను తత్త్వజ్ఞాని యగు "కాంటు" అనువానిచేఁ బ్రథమమున "శుద్ధబుద్ధిమీమాంస—(వ్యవసా

యాత్మికబుద్ధియొక్క - మీమాంస)" యనునధ్యాత్మవిషయకగ్రంథము వ్రాయఁబడినపిదప దానిపూరణ మని "వ్యావహారికబుద్ధిమీమాంస - (వాసనాత్మక బుద్ధియొక్క - మీమాంస)" యనునీతిశాస్త్రగ్రంథము వ్రాయఁబడినది.* మఱియు నింగ్లాండులో సైతము 'గ్రీ' నను వానిచేఁ దననీతిశాస్త్రపోద్ఘాతమైన, సృష్టికంటెఁ బూర్వమందున్నయాత్మతత్త్వము మొదలుకొనియే చెప్పుట కారంభింపఁబడెను; కాని యీగ్రంథమునకుఁ బ్రతినిధిగఁ గేవల మాధిభౌతికపండితులనీతిగ్రంథములే మనదేశమందున్న యింగ్లీషుపాఠశాలలలోఁ దఱుచుగఁ జదివింపఁబడుటచే గీతలలోనున్న కర్మయోగశాస్త్రమూలతత్త్వజ్ఞానము మనలో నింగ్లీషుచదివిన కొంతమంది విద్వాంసులకు సైతము సరిగా లేనంతస్థితికి వచ్చినది.

'ధర్మ'మను సామాన్యశబ్దమును ముఖ్యముగ వ్యావహారికనీతినిబంధనలకు నైనను, సమాజధారణార్థమై వెలువడినవ్యవస్థలకు నైనను, నేనేల ప్రయోగింతునో, యీవిషయము పైవివేచనవలనఁ దెలియును. మహాభారత, భగవద్గీత లనుసంస్కృతగ్రంథములందేగాక, మహారాష్ట్రాదిదేశభాషాగ్రంథములలో సైతము, వ్యావహారికకర్తవ్యములు, లేక, నియమములు నను నర్థముననే ధర్మశబ్దము నియమముగఁ బ్రయోగింపఁబడుచున్నది. 'కులధర్మ, కులాచార' శబ్దములను మనము సమానార్థకములుగ నెన్నుచున్నాము. భారతయుద్ధమునఁ బృథ్విలోఁ గ్రుంగినరథచక్రమును బైకెత్తుటకు కర్ణుఁడు రథమునుండి క్రిందికి దిగినపిదప నర్జునుఁడు తన్ను వధించుట కుద్యుక్తుఁడగుటఁ జూచి, "శత్రువు నిరాయుధుఁ డగునప్పుడు చంపుట 'యుద్ధధర్మము' కా" దని కర్ణుడు సెప్ప, శ్రీకృష్ణుఁడు, కర్ణునను ద్రౌపదీవస్త్రాపహరణము, ఏకాకిగ నుండినయభిమన్యుఁ బలువురేకీభవించి యొనర్చినవధము మొదలగు వెనుకటిసంగతుల జ్ఞప్తిపఱచి వానిలోఁ బ్రతివిషయమును —,

"తేహ్వా గేలా హోతా కోఠే రాధాసుతా తుఝా ధర్మ"

"ఓ రాధేయా! నీవు చేయుధర్మోపదేశ మప్పు డే మాయె?" నని యడిగినటుల మహారాష్ట్రకవి యగుమోరోపంతుచే వర్ణితమైనది. మఱియు

* కాంటను నతఁడు జర్మనీదేశపు తత్త్వవేత్తలలో నొకఁడు. ఈతఁడర్వాచీనమగుతత్త్వశాస్త్రమునకు మూలపురుషుఁడు. ఈతని Critique of Pure Reason. (శుద్ధబుద్ధిమీమాంస) అనునదియు, Critique of Practical Reason. (వాసనాత్మకబుద్ధిమీమాంస) అనునదియు రెండుగ్రంథములు సుప్రసిద్ధములు. "గ్రీసు" గ్రంథమునకు Prolegomena to Ethies. అనిపేరు.

మహాభారతముననే యీ ప్రసంగమున "క్వ తే ధర్మ స్తదాగతః?" అని "ధర్మ" శబ్దము ప్రయుక్త మగుటచే తుద కిట్టిధర్మముఁ జేయువారికి "ఎట్టివాని కట్టులే"యనున్యాయానుసారముగ శాసనముఁ జేయుటయే యోగ్య మని నిరూపింపఁబడినది. సారాంశ మేమనఁగా:—సంస్కృతమున నైనను, మహారాష్ట్రాది దేశభాషల నైనను, పెద్దలచేఁ బ్రతివిషయమునను నధ్యాత్మదృష్టితో సమాజధారణార్థమై విధింపఁబడిననీతినియమములు "ధర్మ" శబ్దముచే బోధపఱచుచుండుట యంతట వాడుక యగుటచే నాశబ్దముననే, నేనును నీగ్రంథమున నాయర్థముననే ముఖ్యముగఁ బ్రయోగించితిని. సమాజధారణార్థమై పెద్దలు నియమించినదియు, సర్వసమ్మత మైనదియు నగునీతియొక్క నియమములు (అనఁగా: శిష్టాచారములని మనచేఁజెప్పఁబడినవి) ఈదృష్టిచే ధర్మమునకు మూలము లగుచున్నవి. కావుననే మహాభారతమునను (అను. ౧౦౪. ౧౫౭), స్మృతులలోను "ఆచారః ప్రథమో ధర్మః"యని యైనను; "ఆచారః పరమో ధర్మః (మను. ౧.౧౦౮) యని యైనను, ధర్మముయొక్కమూలములను జెప్పునపుడు "వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియ మాత్మనః" (మను. ౨. ౧౨) అనువచనములు కనఁబడుచున్నవి; కాని కర్మయోగశాస్త్రమున నింతమాత్రముననే నిర్వాహము కాకపోవుటచే, నీయాచారము ప్రవృత్తమగుటకు నైత మేమికారణమై యుండు నను విషయము యొక్క సంపూర్ణము, రహస్యమును నగువిచారము చేయవలసినంత యవసర మేమి గలిగెనో వెనుక రెండవప్రకరణమునఁ జెప్పఁబడినది.

ధర్మశబ్దమునకుఁ బ్రాచీనగ్రంథములలోఁ జేయఁబడినరెండ్వవ్యాఖ్యాన విచారమును నైత మిచ్చోఁ గొంత చేయవలయును. ఇది మీమాంసకులవ్యాఖ్యానము. "చోదనాలక్షణోఽర్థో ధర్మః" (జై. సూ. ౧. ౧. ౨). అని వారిలక్షణము: చోదనయనఁగాఁ బ్రేరణ; ఒకానొకయధికారి యొకపురుషుని, "నీవీపని చేయుము"మని యైనను, "వద్దు"ని యైనను విధించుట, లేక, యాజ్ఞాపించుట; యని దానియర్థము. ఎంతపర్యంత మిట్టివిధి యెవరిచేతను విధింపఁబడదో, లేక, శాస్త్రద్వారా ప్రాప్తము కాదో, యంతపర్యంతము నే విషయము నైన నెవరికైనను జేయుటకుఁ బూర్ణాధికార ముండును. ధర్మమనునది మొట్ట మొదటఁ గట్టుబాటుమూలమున నిర్మింపఁబడిన దని దీనియభిప్రాయము. మఱియుఁ బ్రసిద్ధుఁడును నాంగ్లేయగ్రంథకర్త యగు 'హాబ్స్'యొక్క మతముతో నీశబ్దవ్యాఖ్యానము. కొన్నికొన్నియంశములలో సంబంధపడియున్నది. ప్రతి

మనుష్యుఁడును మూర్ఖావస్థయం దాయాసమయములఁ గలుగుప్రబలమనోవృత్తుల ననుసరించి ప్రవర్తించును. కాని పిదప క్రమముగా నిట్టిస్వైరవర్తనము శ్రేయస్కరము కానేరదని తెలిసికొని యింద్రియములయొక్క యదృచ్ఛావ్యాపారమునకుఁ గట్టుబాటొనరించి, యాహద్దును దాఁటకపోవుటచేతనే యందఱకు శుభ మగు నను నిశ్చయమును బొందును. మఱియు, శిష్టాచారముచే నైనను, అన్య రీతిచే నైనను, కృత మై యున్నహద్దును బ్రతిమనుష్యుఁడు రాజశాసనమువలెఁ బాలించును. ఇట్టి నిబంధనలు బాగుగ స్థిరత్వమును బొందినపిదప నవియే శాస్త్రము లగును. వివాహవ్యవస్థ పూర్వ మాచరణమున లేదు. దానిని మొట్టమొదట శ్వేతకేతు వాచరణలోనికిఁ దెచ్చెను. మఱియు సురాపానము శుక్రాచార్యులచే నిషేధింపఁబడినదని వెనుకటిప్రకరణమునఁ జెప్పితిమి. శ్వేతకేతువును, శుక్రాచార్యులు నీనిబంధనలఁ జేయుటకు నిమిత్తము లేమై యుండు నని విచారింపకయే, యిట్టినిబంధన ననుసరించుటచే వచ్చుకర్తృత్వమునుమాత్రమే మనసున నుంచుకొనుటచే "చోదనా లక్షణో ఽర్థో ధర్మః" అను "ధర్మ" శబ్దవ్యాఖ్యానము నిష్పన్న మైనది. పూర్వమున దానిమహత్త్వ మేమైనఁ దెలిసికొనినయెడల ధర్మమునం దైనను బ్రవృత్తి కలుగును. భుజించుట, పానముఁ జేయుట, యింద్రియసుఖప్రాప్తిఁ జెందుట యనునవి యొక్కని కైనఁ జెప్ప నక్కఱ లేదు. ఏలన: అవి యింద్రియస్వాభావిక ధర్మము లగుటయే కారణము. "న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే" "మాంసభక్షణ, మద్యపాన, మైథునములయం దేమియు దోషము (సృష్టికర్మకు విరుద్ధమగువిషయము) కానరాదు." (మను. ౫. ౫౬) అనుమనువచనమున కిదియే తాత్పర్యము. ఈవిషయములు మానవులకే కాక ప్రతిప్రాణికిని రాగముచేతనే ప్రాప్తములగుచున్నవి. "ప్రవృత్తి రేషా భూతానాం" సమాజధారణార్థమై (అనఁగా: సర్వజనసుఖనిమిత్తమై) యీరాగప్రాప్తమైన స్వేచ్ఛాచరణము నణఁగఁ ద్రొక్కుట, యనునదియే ధర్మము. కారణమేమియన:—

శ్లో. "ఆహారనిద్రాభయమైథునం చ సామాన్య మేత త్పశుభి ర్నరాణాం ।
ధర్మో హి తేషా మధికో విశేషో ధర్మేణ హీనాః పశుభి స్సమానాః."

"ఆహారము, నిద్ర, భయము, మైథునము నను నవి మనుష్యులకును పశువులకును సమానముగనే రాగప్రాప్తము లగుచున్నవి. ధర్మము (అనఁగా: వీనిన్ని నీతియొక్క కట్టుబాటులోనుంచుట) అనునదియే మనుష్యునకును పశువునకును గల భేదము. ఇట్టి ధర్మములేనివారు పశువులతోనే సమానులు. మహాభారతమున శాంతిపర్వములో తత్సమానార్థకమగు శ్లోకము కలదు. (మ. భా. శాం. ౨౯౪. ౨౯.

౭౯) ఆహారనిద్రాదులవిధిరాహిత్యమును బోధించు భాగవతములోని శ్లోకము క్రింది ప్రకరణమున వ్రాయఁబడినది. దానిననుసరించియే భగవద్గీతలయందును.—

"ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ." (గీ. 3.34.)

"ఇంద్రియములయందును వానిచే నుపభోగ్యములు గాని త్యాజ్యములుగాని యగుపదార్థములయందును ప్రీతియు, విరోధము ననునవి స్వభావసిద్ధము లై యను క్రమములుగ నున్నవి. వానికి మనము వశులము కాఁగూడదు. ఏలయనఁగా: రాగ ద్వేషములు రెండును మనకు శత్రువులు" అనిభగవంతుఁ డర్జునునకుఁ జెప్పెను. స్వభావముగఁ బ్రాప్తము లగుస్వైరమనోవృత్తుల నణఁచుట యనుధర్మలక్షణమే భగవంతున కిష్టముగ నున్నది. మనుష్యేంద్రియములు వారికి వారు పశువులవలె సంచరించుటకుఁ దోడ్పడుచున్నవి. మఱియు వారివారిబుద్ధియే వారివారినాకర్షించుచుండును. ఈకలహాగ్నిహోత్రమున దేహమందు సంచరించుపశుత్వమును హోమముఁ జేసి యెవరు కృతకృత్యు లగుదురో వారలే సత్యమైనయాజ్ఞికులు, ధన్యులు నగుదురు. ధర్మ మాచారప్రభవ మన్నను, ధారణవలన ధర్మ మని యన్నను, "చోదనాలక్షణోఽర్థో ధర్మః" యన్నను, ధర్మముయొక్క (వ్యావహారిక మగునీతినిబంధనయొక్క) వ్యాఖ్యానముఁ జేయునప్పుడు, ధర్మాధర్మములయొక్క సంశయము వచ్చినయెడల దాని నిర్ణయించుట కీమూఁడులక్షణములు నైతము విశేష ముపయోగింపవు. ధర్మమూలస్వరూపము తొలివ్యాఖ్యానముచేఁ దెలియఁబడును. దానిబాహ్యోపయోగము రెండవవ్యాఖ్యచేఁ జెప్పఁబడును. ధర్మమర్యాద ప్రథమమున నెవరిచే విధింపఁబడినదియు మూఁడవవ్యాఖ్యయందుఁ దెలియవచ్చును. కాని యొకయాచారమునకు మఱియొకయాచారమునకును భేద ముండును. ఇంతియకాక యొకకర్మపరిణామమే యనేకవిధము లగుటచేతను, ననేకఋషులచోదనలు భిన్నము లగుటచేతను, సంశయముపొడమినపుడు ధర్మనిర్ణయమున కేదైన మఱియొకమార్గ మాలోచింపవలసివచ్చును. ఆమార్గ మేది యని యక్షుఁ డడుగఁగా యుధిష్ఠిరుఁడు.—

"తర్కోఽప్రతిష్ఠః శ్రుతయోఽపి భిన్నా నైకో ఋషి ర్యస్య వచః ప్రమాణమ్,
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం మహాజనో యేన గత స్స పంథాః."
[మను. భా. వన. 3౧౨. ౧౧౫]

"తర్కముచంచలము, (బుద్ధి తీవ్రముగ నుండుకొలఁదియు ననేకవిధానుమానములఁ గల్పనఁజేయును) శ్రుతి (వేదవిధి) యనేకవిధము. ధర్మశాస్త్రమొక్క

ఋషివచన మైన నన్యులవచనమునకంటె నధిక ప్రమాణమని యనుటకు వీలులేదు. మంచిది! ఈవ్యావహారికధర్మముయొక్క మూలతత్త్వమును విచారింతమన్నాయదియు నంధకారబంధురముగ నున్నది (సామాన్యమానవబుద్ధికిఁ దెలిసికొన సాధ్యము కాకున్నది). కావున మహాజను లేమార్గము ననుసరించి యుందురో యది యే ధర్మమార్గ" మని సమాధానముఁ జెప్పెను. ఈయుత్తరము సరిగనే యున్నది; కాని మహాజను లన నెవరు? 'గొప్పవారు, గొప్పజనసమూహ' మని యీ పదమున కర్థము కానేరదు. ఏసామాన్యమానవుల మనస్సున ధర్మాధర్మములవిషయమై యెుకప్పుడును సంశయము గలుగదో, వారిచే విధింపఁబడినమార్గమున నడచుట (అంధే నైవ నీయమానా యథాఽన్ధాః) (కఠోపనిషత్తు) అని చెప్పినట్లు అంధకుకుంబరీ (గుడ్డివాని భాగవతమువలె) న్యాయముగ నుండును. మహాజనులన గొప్పశిష్టులనుకొన్నను, పూర్వశ్లోకమున నీయర్థమే యిమిడియున్నను, అశిష్టులవర్తన మెక్కడను నేకరూపతను వహించియుండునటుల కానరాదు. ఉదాహరణము:— పాపరహితయు, నగ్నిపరిశోధితయు నగుజానకిని లోకాపవాదనివృత్తికై శ్రీరామచంద్రుఁడు కాననంబుల విడువఁ బంపెను. సుగ్రీవుఁడు తనకు సఖుఁ డగుటకై, తుల్యారిమిత్రుఁ (శత్రుమిత్రుల సమముగఁజూచువాఁ) డని ప్రతిజ్ఞ యుండియు శ్రీరామచంద్రుఁడు, తన కేమియు నపరాధము చేయనివాలిని వధించెను. పరశురాముఁడు పితృాజ్ఞచే మాతృకంఠచ్ఛేద మొనరించెను. పాండవులనడత సరి యైన దని యెంతుమా యనిన, నైదుగురికి నొక్కతెయే భార్య. స్వర్గమందున్న దేవతలనడత సాలోచింత మనిన, నొకఁ డహల్యాజారుఁడు; మఱి యొకఁడు (బ్రహ్మ) మృగరూపమునఁ దనకూఁతునే యభిలషించుటంజేసి రుద్రు శరవిద్ధుఁడై నేఁటికిని నాకసమునఁ బడియున్నవాఁడు. (ఐ. బ్రా. ౩. ౩౩) ఈసంగతియే మనస్సున నుంచుకొని,లవకుమారునిముఖమున—"వృద్ధా స్తే న విచారణీయ చరితాః" "వృద్ధులకృత్యములగుఱించి విశేషముగ విచారింపఁగూడ" దని మనోహరముగ భవభూతి వర్ణించి యున్నాఁడు. ఇంగ్లీషులో "సైతాను" నితిహాసమును వ్రాయుచు నొక గ్రంథకర్త, సైతానుస్నేహితునకును దేవదూతకునుగలిగినపరస్పరకలహ స్థితియం దనేకపర్యాయములు దేవతలచేతనే దైత్యులు కపటప్రయోగములు మునుపంచింపఁబడినటుల స్పష్ట మగు చున్నదని వ్రాసియున్నాఁడు. మఱియు నిటులే కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తులో (కౌషీ. ౩. ౧; ఐ. బ్రా. ౭. ౨౮) నింద్రుఁడు ప్రతర్దనునకు "నేను వృత్రాసురుని (వాఁడు బ్రాహ్మణుఁడైనను) జంపి

తిని. బ్రహ్మప్రతిపాదకవుక్కుల నెఱుంగనిసన్న్యాసులను ముక్కలుముక్కలుగ నఱికి తోడేళ్లవాత వేసితిని. మా ప్రతిజ్ఞల ననేకముల నుల్లంఘనఁ జేసినవారును, ప్రహ్లాదునియాప్తులును, గోత్రజులు నైనపౌలోమకాలఖంజనామరాక్షసుల వధించితిని. ఇన్ని యొనర్చినను దానిచే "తస్య మే తత్ర న లోమ చ మా మీయతే" "నారోమమున కైనను హాని కలుగలేదు." అని చెప్పెను. "నీకీగొప్పవారి దుష్కర్మల విచారింపఁ బనిలేదు. తైత్తిరీయోపనిషత్తులోఁ జెప్పఁబడినరీతిగ (తై. ౧. ౧౧. ౨) వారిమంచిచేఁతలనే యనుకరింపుము. మిగిలినవానిఁ ద్యజింపుము. పరశురామునివలెఁ బితాజ్ఞఁ బరిపాలింపుము; కాని మాతృవధ చేయకుము." అని యెవ రైనఁ జెప్పినచో "మంచిచెడుగుల నెఱుంగుటకు సాధన మేమి?" యను మొదటిప్రశ్నయే మరలఁ గలుగును. కావుననే వెనుకఁ జెప్పినతీరునఁ దనకృత్యములఁ జెప్పినపిదప నింద్రుండు ప్రతర్దన కుత్తరగ్రంథమున "ఎవరు పూర్ణముగ నాత్మజ్ఞానులై యున్నారో వారికి మాతృవధ, పితృవధ, భ్రూణహత్య, స్తేయము మొదలగునితరకర్మలదోషము లాపాదింపవు. ఈవిషయము మనస్సున నిడుకొని 'ఆత్మ యన నేమి?' యనుటను ముందు నీవు తెలిసికొనుము. అటులైన నీకు సర్వసందేహనివృత్తి యగును." అని చెప్పి యనంతరము ప్రతర్దనున కింద్రుండాత్మవిద్య నుపదేశించెను. సారాంశ మేమన:— "మహాజనో యేన గత స్స పంథాః" అను యుక్తి సామాన్యజనులకు సులభముగ నున్నను దానిచే మాత్రము సర్వకార్యనిర్వాహము కానేరదు. తుదకు మహాజనులవర్తనయందలి సత్యాసత్యత్వ మెంత గూఢముగ నున్నను నాత్మజ్ఞానమున రహస్యాంశములను విచారించుచుండుపురుషులకు దానిని శోధించి ప్రకటించుట యావశ్యకమగును. "న దేవచరితం చరేత్" "దేవతలబాహ్యచరిత్రనుమాత్ర మనుసరించి మనము ప్రవర్తింపఁగూడదు" అను వచనమున కిదియే కారణ మై యుండును. కర్మాకర్మల నిర్ణయించుట కింత కన్న వేఱగుసులభ మైనయుక్తు లనేకులచేఁ జెప్పబడినది. ఏలన: ఏసద్గుణమును సైతము విశేషముగ మనము వృద్ధి పొందనీయఁగూడదని తప్పక నియమము చేసికొనవలయును. అట్టి యతిప్రసంగముచే సద్గుణములే తుదకు దుర్గుణపర్యవసాయులగును. దానము సద్గుణమే. "అతిదానా ద్బలి ర్బద్ధః" "దానపతి యగుటచే బలిచక్రవర్తి బంధింపఁబడెను." మఱియు గ్రీసుదేశమునఁ బ్రసిద్ధపండితుఁ డగు "అరిస్టాటిల్," తన నీతిశాస్త్రగ్రంథమునఁ గర్మాకర్మలనిర్ణయమున కీయుక్తినే చెప్పి ప్రతిసద్గుణము నతి యగుటచే నెటుల వ్యర్థమగునో స్పష్టముగ నిరూపించెను. కాళిదాసు సైతము "కేవలశౌర్యమనఁగా పెద్దపులివంటిభయంకర మగుక్రూరకార్యము. కేవలనీతి యన

మిత్రత్వమే,యని నిశ్చయించి 'అతిథి' యను రాజు ఖడ్గము-రాజనీతి యను నీరెంటి యొక్క యోగ్యమగు మిశ్రణముచే రాజ్యమును నడిపించుచుండె"నని (రఘు. ౧౭. ౪౭)రఘువంశమున వర్ణించియున్నాఁడు. "విశేషముగ మాటలాడెనేని వాచాలుఁడు, మితభాషియైనచో మందుఁడు, మిక్కిలి వ్యయముఁ జేసిన అతివ్యయకారుఁడు, కొద్దిగ వ్యయము చేసిన లోభి, ముందు నడచువాఁడు దుస్సాహసి, వెనుకకుఁ దిరిగినచో నసమర్థుఁడు, మిక్కిలి పట్టుదల (ఆగ్రహము) గలవాఁడు దీర్ఘక్రోధి, అది లేనివాఁడు చంచలుఁడు, విశేషముగ నాశ్రయించువాఁడు నీచుఁడు, ఆశ్రయింపనివాఁడు గర్వి యని యందురు." అని భర్తృహరి మొదలగువారిచేఁ గొన్ని గుణదోషములు వర్ణింపఁబడి యున్నవి. కాని యిట్టినికషోపలముచే సైతము సాంతముగఁ బైవిమర్శము స్పష్టము కానేరదు. ఏలన: "అతి (అనఁగ విశేషము) యన నేమి? ఎవనికైన నియమస్థుఁ డని యేల చెప్పనలయును? ఈసందేహము నెవ రెటుల దీర్పఁగలరు? ఒకనికిఁ గాని, యొక ప్రసంగమునఁ గాని, 'అతి' యగునదియే, మఱియొకనికిఁగాని, మఱియొక ప్రసంగమునఁ గాని కొఱఁతపడును. జన్మించుచుండఁగనే, సూర్యుని పట్టుకొనుటకై పై కెగిరిన మారుతికేమియు నాపని యశక్యముగఁ దోఁపలేదు (వా. రామా. ౭. ౩౫). ఇందువలననే శ్యేనము శిబికిఁ జెప్పినటుల ధర్మాధర్మసంశయము గలిగినపుడు ప్రతిమనుజుఁడు తుదకు.—

"అవిరోధాత్తు యో ధర్మస్స ధర్మః సత్యవిక్రమ!
విరోధిషు మహీపాల! నిశ్చిత్య గురులాఘవమ్.
న బాధా విద్యతే యత్ర తం ధర్మం సమువాచరేత్."

(మ. భా. వన. ౧౩౧. ౧౧-౧౨; మను. ౯. ౨౯౯).

పరస్పరవిరుద్ధధర్మముల తారతమ్యముల నైన, గురులాఘవముల నైనఁ జూచి ప్రతివిషయమునందు స్వబుద్ధిచే సత్యమగుధర్మనిర్ణయమును, లేక, కర్మనిర్ణయమును జేయవలయును; కాని, యంతమాత్రముచే 'ధర్మాధర్ముల సారాసారములను విచారణచేయుటయే, సంశయసమయమున వానినిర్ణయమునకు సత్యమగుపరీక్షాశిల' యని చెప్పుటకు సాధ్యము కానేరదు. కారణ మేమన:—ఎవరిబుద్ధి యెటు లుండునో తదనుసారముగనే వేర్వేఱుపండితులు సారాసారవిచారమును సైతము వేర్వేఱువిధములుగఁ జేసి, యొకవిషయముననే నీతిమత్తానిర్ణయమును వేర్వేఱు విధములఁ జేసినటుల వ్యవహారములలోఁ బలుమాఱులు మనకు గోచరించుచున్నది. మఱియు నీయర్థమే "తర్కోఽప్రతిష్ఠః" అను పూర్వోక్తవచనమున వర్ణిత మైనది. కావున 'ధర్మాధర్మసంశయసంబంధ' మగు నీప్రశ్నను పొరపాటు

లేక నిర్ణయించుట కితరసాధనము లున్నవా? లేవా? ఉన్న యెడల నేవి? మఱియు ననేకసాధనము లున్న యెడ వానిలో నుత్తమ మగున దేది?" యనువిషయము నిపుడు మనము విచారింపవలయును. శాస్త్రము నిర్ధారణఁ జేయునది యిదియే; "అనేక సంశయోచ్ఛేది పరోక్షార్థస్య దర్శకమ్" అనేకశంకలు కలుగుటచే బుద్ధికిఁ దోలుత గోచరము గానివిషయములయందలిసందేహములను బోఁగొట్టి వానిలో నున్నయర్థమును నిశ్శంకముగను సుగమముగను జేయుటయు, ప్రత్యక్షము కానిదియు ముందుఁ గలుగునదియు నగువిషయమును యథార్థముగఁ దెలియఁజేయుటయు, ననునదియే శాస్త్రలక్షణము. మఱియు జ్యోతిశ్శాస్త్రము నభ్యసించుటచే రాఁబోవుగ్రహణముల నైతము నెటుల చెప్పుట సాధ్యమగునో, యటుల విచారించిననీలక్షణములలో "పరోక్షార్థస్య దర్శకమ్" అను నుత్తరార్థసార్థకత కన్పట్టును గాని యనేకసంశయములు జనించుటలో నవి యేవి యనునంశము తోలుతనే తెలియవలయును. కావుననే, యేశాస్త్రమునందైనను సిద్ధాంతపక్షమును జెప్పుటకు ముందుగ, నావిషయముపై రాఁగల పూర్వపక్షముల ననువాదముఁ జేసి వానియందలిదోషము నైనను, అపూర్ణత నైనను నిరూపించుట, సనాతనాధునాతనగ్రంథకారులపద్ధతిగ నున్నది. ఈపద్ధతినే స్వీకరించి గీతలలోఁ గర్మాకర్మనిర్ణయార్థమై ప్రతిపాదింపఁబడినసిద్ధాంతపక్ష మగు యోగమును (యుక్తిని) చెప్పుటకుఁ బూర్వ మీకర్మాకర్మనిర్ణయార్థ మేయే యితరప్రబలయుక్తులను పండితులు చెప్పుచున్నారో, వానినినైతము నిచ్చో నేను విచారించుచున్నాను. ఈయుక్తులు మనదేశమునఁ బూర్వమున విశేషప్రచారములో లేకపోవుటయు, ముఖ్యముగఁ బాశ్చాత్యపండితులు వాని నిటీవలఁ బ్రచారమునకుఁ దెచ్చుటయు సత్యమే! కాని యంతమాత్రమున వానివిచారణ యీగ్రంథమందు మనము చేయఁగూడ దని చెప్పరాదు. కారణ మేమన:—కేవల ముభయపక్షములను బోల్చి చూచుటకుమాత్రమే కాక, గీతలలో నాధ్యాత్మికమగు కర్మయోగమహత్త్వమును గనిపట్టుటకు నైతము నీయుక్తులు సంక్షేపముగ నైనఁ దెలిసికొనుట యావశ్యకము.

ఇది కర్మయోగశాస్త్ర మను తృతీయప్రకరణము.

---

# చతుర్థప్రకరణము.

## ఆధిభౌతిక సుఖవాదము.

"దుఃఖా దుద్విజతే సర్వ స్సర్వస్య సుఖ మీప్సితమ్."*

మ. భా. శాం. ౧౩౯. ౬౧.

"మన్వాదిశాస్త్రకారులు "అహింసా సత్య మస్తేయం" మొదలగువిధులను (నియమములను) విధించుటకుఁ గారణమేమి? అవి నిత్యములా? అనిత్యములా? వానివ్యాప్తి యెంతవఱకు? వానిలో మూలతత్త్వము లేవి? వానిలోఁబరస్పరవిరుద్ధము లయినరెండుధర్మము లొకకాలమునందే ప్రాప్తము లయిన నేధర్మమార్గము స్వీకరింపఁబడవలయును?" ఇట్టి ప్రశ్నలకు "మహాజనో యేన గత స్స పంథాః" అనియో, లేక, 'అతి సర్వత్ర వర్జయేత్" అనియో చెప్పుసామాన్యయుక్తిచే సమాధానము సంపూర్ణముగఁ గాకయుండుటచే నీశంకలను బాగుగఁ జర్చించి నివారించి శ్రేయస్కరమగు మార్గ మెద్దియో నిర్ణయించుట కేవైననిశ్చితసాధనములు గలవా? లేవా? ఏదైన నొకదృష్టిచే పరస్పరవిరుద్ధము లగుధర్మములగురులాఘవములు, లేక, హెచ్చుతక్కువ లగుమహత్త్వము మనచే నిర్ణయింపఁబడుటకు శక్యమగునా?" అనునీవిషయము ప్రకృతము నిశ్చయింపఁబడును. ఇతర శాస్త్రీయప్రతిపాదనము ననుసరించి 'కర్మాకర్మవివేచన' విషయమునందును, ప్రశ్నయొక్క యూహాపోహలను జేయుటలో సైతము, ఆధిభౌతికమనియు, నాధ్యాత్మికమనియు, నాధిదైవిక మనియు మూఁడుమార్గములు గలవు. వానిలో నుండుభేదములు పూర్వప్రకరణమునఁ జెప్పబడినవి. ఆధ్యాత్మికశాస్త్రమే వీని యన్నిటిలోశ్రేష్ఠ మని మన శాస్త్రకారులయభిప్రాయము; కాని, యధ్యాత్మమార్గమహత్త్వము పూర్ణముగఁ దెలియుటకై మిగిలిన యాధిదైవికాధిభౌతికములనురెండుమార్గముల విచారణఁజేయుట యావశ్యకమగుటచేఁ గర్మాకర్మపరీక్షణవిషయమున నాధిభౌతికమూలతత్త్వముల చర్చ (పరీక్ష) యీప్రకరణమునఁ దొలుతఁ జేయఁబడినది. ఇటీవల (అర్వాచీనకాలమున) నాధిభౌతికశాస్త్రము మిక్కిలి యభివృద్ధిఁ జెందెఁ గాన వ్యక్తపదార్థములయొక్క బాహ్యములు, లేక,

---

* దుఃఖ మందుటకుఁ గష్టమై తోఁచును. సుఖము నందుట గోరుదురు.

దృశ్యము లగు గుణముల విచారణయే ముఖ్యముగఁ జేయవలసివచ్చును. కావున నాధిభౌతికశాస్త్రపఠనముతోనే యాయువునంతయు నెపుడు గడపునో, లేక, యీశాస్త్రమునందున్న విచారణపద్ధతిలోనే యెవనికి పట్టుదల (అభిమానము) గలదో వానికి బాహ్యపరిణామముయొక్క విచారణ నొనరించుటయందే యభిరుచి తప్పక యుండును. మఱియు తన్మూలముగఁ దత్త్వజ్ఞానదృష్టి కొద్దిగనో గొప్పగనో తఱుగుటచేత, నెద్దానిని విచారించినను, నాధ్యాత్మికములును బారలౌకికములునైన, లేక, యవ్యక్తములు నదృశ్యములునైన, కారణములను వాఁడెక్కువగ గౌరవింపఁడు; కాని, యిట్టికారణములచే నాధ్యాత్మికదృష్టి, లేక, పారలౌకికదృష్టి, వదలివేయఁబడినయెడల, ప్రతిమనుజునకు నితరునితోఁ గలుగుచుండుజగత్తుయొక్క వ్యవహారము సరళముగ వర్తించుటకును, లోకసంగ్రహమునకును, నీతినిర్బంధ మావశ్యకమగుటచే పారలౌకికమునం దెవ్వారి కాస్థ లేదో, లేక, యవ్యక్తమైనయధ్యాత్మజ్ఞానముపై, మఱియుఁ గ్రమముగ నీహేతువుంబట్టి పరమేశ్వరునిపై, నెవరికి విశ్వాసముండదో, యట్టి విద్వాంసులకు సైతము కర్మయోగశాస్త్ర మత్యంత మహత్త్వము గలదని తోఁచుటచేఁ, గేవల మాధిభౌతికశాస్త్రరీతిగనే, (అనఁగ: కేవల మైహికదృశ్యయుక్తివాదముచేతనే) కర్మాకర్మశాస్త్రములయొక్క యుపపత్తి చెప్పుట శక్యమగునా? కానేరదా? యనునీవిషయమై పాశ్చాత్యదేశముననే, విశేష వివాదములు జరిగినవి. మఱియు నాచర్చ యిప్పుడుసైతము వర్తిల్లుచునే యున్నది. వివాదమున, ఈ 'భవతి—న—భవతి' విషయమై నవీన (అర్వాచీను)లగు పాశ్చాత్యపండితులచే "నీతిశాస్త్రముయొక్క వివేచనం జేయుటలో నాధ్యాత్మిక శాస్త్రావశ్యకత యేమియును లేదు. ఏకర్మయైనను మంచిది, లేక, చెడుది యను నిర్ణయము, ఆ (ప్రకృత) కర్మయొక్క బాహ్యపరిణామము మనకెటుల ప్రత్యక్షముగఁ గాన్పించునో, తదనుసారముగనే చేయఁబడవలయును. మఱియుఁ జేయుటకును సాధ్యమగును" అని సిద్ధాంతము చేయఁబడినది. కారణ మేమన:—మనుజునిచేఁ జేయఁబడుకర్మలన్నియు సుఖప్రాప్తికైనను, దుఃఖనివృత్తికైనను జేయఁబడును. వేయేల? మనుజుల కందఱకును సుఖమే యైహికమయిన పరమసాధ్యము. మఱియు సర్వకర్మలయొక్క దృశ్యఫల మీతీరుననే నిశ్చితమైనయెడల, సుఖప్రాప్తి, దుఃఖనివృత్తి యీ రెంటియొక్క తారతమ్యము (అనఁగా: గురులాఘవముల) నాలోచించి సర్వకర్మలకు నీతిమత్తను నిర్ణయించుటయే, ముఖ్యమార్గ మగును. ఏయావు, వాలినకొమ్ములు గలిగి, సాధువై, యెక్కువపాల నిచ్చుచున్నదో,

అదియే మంచియాపు" అని బాహ్యోపభోగములనుబడి యేవ్యవహారమున నేపదార్థముయొక్క మంచిచెడుగులైనను నిశ్చయింపఁబడు నెడల, నాతీరుననే "అనేకకర్మలనుండి సుఖప్రాప్తిరూపమైనదైనను, దుఃఖనివారణాత్మకమైనదైనను, బాహ్యఫలమధికమగునో, యవియే నీతిదృష్టిచేనైతము శ్రేయస్కరము"లని యెఱుంగవలయును. కేవలముగ బాహ్యములు, దృశ్యములునగు పరిణామముల గురులాఘవములఁజూచి, నీతిమత్తను నిర్ణయించుట యనెడు సులభమును శాస్త్రీయమునగు కటోపల (బంగారమునొరియుఱాయి) ముండఁగ నందుకై యాత్మానాత్మవిచారములలో దిగుట యనెడి ద్రావిడప్రాణాయామమును జేయుట యోగ్యముకానేరదు. "అర్కేచేన్మధు విందేత కిమర్థం పర్వతం వ్రజేత్ ?" * "సమీపమునందు (అనఁగా : కూర్చున్న ప్రదేశముననే) తేనె దొరకునేని తేనెపట్టునువెదకుటకై గుట్టలకు వెళ్లనేల?" కర్మయొక్క బాహ్యపరిణామమునే చూచి, నీతిపక్షమునుగాని, యనీతిపక్షమునుగాని నిర్ణయించుపద్ధతికి మే మాధిభౌతికసుఖవాద మని నామం బిడినారము, కారణ మేమన:—నీతిమత్తను నిర్ణయించుటకై యీమతము ననుసరించి, యేసుఖదుఃఖములను నిర్ణయింపవలయునో యవి యన్నియుఁ బ్రత్యక్షముగఁ గాన్పించునవియు బాహ్యములును (అనఁగా: బాహ్యపదార్థములకును నింద్రియములకును సంయోగమగుటచేఁ బుట్టునవి, అనఁగ, నాధిభౌతికములు) నగుటచే నీమార్గము నైతము సర్వజగత్తును నాధిభౌతికదృష్టితో మాత్రమే విచారించుచున్న పండితులచేతనే ప్రతిపాదింపఁబడినది; కాని, యీవాదముయొక్క సవిస్తరమైనవిషయము నీగ్రంథమునందుఁ జెప్పుట సాధ్యము కానేరదు. వేర్వేఱు గ్రంథకారుల మతములను సంక్షేపముగఁ దెలుపుట కైనను స్వతంత్రగ్రంథము వ్రాయవలసివచ్చును. కావున భగవద్గీతలలోఁ గర్మయోగశాస్త్రస్వరూపమును, మహత్త్వమును సంపూర్ణముగ నెఱుంగుటకై నీతిశాస్త్రసంబంధముగల యీ యాధిభౌతికమార్గజ్ఞాన మెంతవఱకావశ్యకమో యంతవఱకే యీప్రకరణమున సంక్షేపముగ శ్లోకముచేఁ గూర్చి నిరూపింపఁబడినది.

---

* ఈశ్లోకమందలి 'అర్క' శబ్దమునకు జిల్లేడుచెట్టనియు, ప్రక్కచెట్టనియు ననేకు లర్థము చెప్పుచున్నారు; కాని బ్రహ్మసూత్రము 3. 4. 3 శాంకరభాష్యటీకయం దర్కశబ్దము సమీపార్థకమని యానందగిరిస్వామి చెప్పియున్నాడు. "సిద్ధ స్యార్థస్య సంప్రాప్తౌ కో విద్వాన్యత్న మాచరేత్" అని యీశ్లోకముయొక్క యుత్తరార్థము.

ఇంతకంటె విశేషజ్ఞాన మెవరికైనఁ గావలసినచో, వారు పాశ్చాత్యపండితులమూల గ్రంథములనే చూచికొనవలయును. పరలోకవిషయ మయి కాని, లేక, యాత్మ విద్యావిషయమయి కాని, యాధిభౌతికవాదు లుదాసీనులుగ నుందు రని వెనుకఁ జెప్పఁబడియున్నంతమాత్రముచేతనే యీమార్గానుచరు లగువిద్వాంసు లందఱును స్వార్థపరు లని కాని, కుక్షింభరు లని కాని, నీతిశూన్యు లని కాని యెవ్వ రెన్నకొనఁగూడదు. పరలోకచింత లేకపోయినను, నైహికదృష్టిచే నైనను శక్యమైనంత వఱకు వ్యాప్తి కలుగఁజేసి సర్వప్రపంచముయొక్క కల్యాణార్థమై యత్నించుటయే, మనుజుఁడైనవానికెల్ల కర్తవ్య మగుపని యని మిక్కిలి విస్పష్టముగను, సంతసముతోను చెప్పు, కోంట్, మిల్, స్పెన్సర్ మొదలగుసాత్వికవృత్తి గలిగినపండితు లీమార్గములోనివారలే. మఱియు వారిగ్రంథము లుదాత్తములును, ప్రగల్భములు నగుననేకవిధము లగువిచారములతో నిండియుండుటం బట్టి యవి యందఱిచేఁ జదువఁబడుటకు యోగ్యములై యున్నవి. కర్మయోగశాస్త్రము వేర్వేఱుగనున్నను 'జగత్తునకు కల్యాణ' మనెడి బాహ్యసాధ్యము విడువఁబడనంతవఱకును నీతిశాస్త్రప్రపాదన మనుమార్గము భిన్న మైనదనునంతమాత్రమున నాశాస్త్రజ్ఞులను పరిహసింపఁ గూడదు. అది యట్లుండనిండు! "నీతిశాస్త్రసిద్ధము లగుకర్మాకర్మలయొక్క నిర్ణయమునకై యేయాధిభౌతికబాహ్యసుఖములను విచారింపవలయునో యవి యెవరివి? తనవియే యగునా? పరులవి యగునా? ఒకనివి యగునా? అనేకులవి యగునా?" యనువిషయమై మతభేదముండుటచే "నవీనులుం బ్రాచీనులు నగుసమస్తాధిభౌతిక వాదులను ముఖ్యముగ నెన్నివర్గము లగుదురు? మఱియు వారిమార్గ మెంతవఱక నిలుచునదిగాఁ గాని, నిర్దోషముగాఁ గాని యున్నది?" అనువిషయమునే, యిప్పుడు క్రమముగ సంక్షేపముగ విచారింతము.

వీరిలో మొదటితరగతివారు కేవలము స్వార్థసుఖవాదులుగ నున్నారు. "పరలోకము పరోపకారము మొదలగునవి యన్నియు నసత్యము లగుటంజేసి యాధ్యాత్మికధర్మశాస్త్రములు వంచకులచే స్వోదరపూరణార్థమై వ్రాయఁబడినవి. ఈజగత్తున స్వార్థమే సత్యమైనది. మఱియు నేకృత్యములచే స్వీయ మగునాధిభౌతిక సుఖము వృద్ధిఁబొందునో, యవియె న్యాయ్యములు, ప్రశస్తములు నని తెలియవలయు"నని యీమార్గములోనివారు వచించెదరు. మనహిందూదేశములో నీమతముచార్వాకులచే స్పష్టముగనే వక్కాణింపఁబడినది. రామాయణములో నయోధ్యాకాండము చివర, జాబాలిచే రామునకుఁ జేయఁబడిన కుటిలోపదేశము గాని,

మహాభారతములో నున్నకణికనీతి గాని (మ. భా. ఆ. ౧౪౨) యీమార్గమునవలంబించియే యున్నవి. "పంచభూతము లేకీభవించినచో, వానికలయికవలన నాత్మయనెడి గుణము బయలుదేఱుచున్నది. మఱియు దేహమును దగ్ధముఁజేసిన దానితో నాత్మసైతము కాలిపోవును. ఆత్మవిచార మనునుపద్రవములోఁ బడక బుద్ధిమంతుఁడగుపురుషుఁ డీదేహము జీవవంతమై యున్నంతపర్యంతము "ఋణము చేసియైనను నేతినిఁ ద్రాగవలయును"—"ఋణం కృత్వా ఘృతం పిబేత్"—చచ్చినపిదప నేమియు చేయలేము, ఏమియునులేదు." అని చార్వాకు లనెడిమహాత్ములు నుడువుదురు. చార్వాకులు హిందూదేశమునందే పుట్టియుండుటచే నేతిపై వారి కంతయిష్ట ముండె ననితోఁచును. లేనిచో "ఋణం కృత్వా సురాం పిబేత్" అని యీసూత్రమునకు రూపాంతర మేర్పడియుండును. "ఎక్కడిధర్మము? ఎక్కడి పరోపకారము? ఈజగత్తున నేవస్తువు పరమేశ్వరునిచేఁ జేయఁబడినది? శివశివ! మఱచిపోతిని! పరమేశ్వరుఁ డెక్కడనుండి వచ్చినాఁడు? ఈజగత్తున నేఁ జూచిన వస్తువులన్నియు నేననుభవించుటకే కాని యావస్తువులకు మఱియొకయుపయోగము లేనే లేదు. నేను మృతినొందినయెడల జగము మునిఁగియే పోవును. కావున నేను బ్రదికియున్నంతపర్యంత మీరోజుననిదియు, రేపదియు, నీతీరున సర్వమును నేను స్వాధీనపఱచికొని, నాకోరికల నన్నింటిని దీర్చికొనియెద. ఒకవేళ తపస్సునుగాని, దానమునుగాని, నేనుజేయునెడలఁ బ్రతిష్ఠకొఱకే చేయుదును. రాజసూయము నైనను, అశ్వమేధమునైనను జేసినఁ బ్రతిష్ఠకెయే చేయుమును. కావున నీజగత్తునకు "నేను" అనునదియే యొకకేంద్రము; "నేను" అనునదియే సమస్తనీతిశాస్త్రము నకును రహస్యమగుచున్నది. మిగిలినదంతయు నసత్యమే." అని సారాంశము. మఱియు గీతలలో—

"ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ"

(గీతా. ౧౬. ౧౪)

"నేనీశ్వరుఁడను, నేనే యనుభవించువాఁడను, నేనే సిద్ధుఁడను, బలాఢ్యుఁడను, సుఖిని" యని గీతలలోఁ బదునాఱవయధ్యాయమునఁ జెప్పఁబడిన "ఆసురసంపత్తి" యీమతము నే యుపపాదించుచున్నది. శ్రీకృష్ణునిస్థానమున నిట్టివారిలో జాబాలివంటివాఁ డర్జునునివైపుననుండి యుపదేశింపవలసివచ్చినయెడల, తొలుతనే యర్జును నొకచెంపకాయఁగొట్టి "ఓరీ! నీవు మూర్ఖుఁడవా యేమి? యుద్ధమునం దందఱను జయించి యనేకవిధములగు రాజభోగములను, విలాసములను, అనుభ

వింపఁదగిన బంగారమువంటి సుంచిస్సమయము లభించినప్పుడు 'దీనిని చేయుదునా? మానుదునా?' యని వ్యర్థ మగుభ్రమనుపడియున్నావు. పిచ్చియెత్తెనా యేమి? ఇట్టితరుణము మరల లభింపదు. ఆత్మయెక్కడిది? సుహృద్బాంధవాదులఁ బట్టుకొని యేల కూర్చుండియున్నావు? లెమ్ము. శత్రువులజయింపుము. హస్తినాపుర సామ్రాజ్యమును, సుఖమ్ముగ నిష్కంటకముగ ననుభవింపుము. ఇందుచే నీకు గొప్ప శ్రేయస్సు కలదు. దృశ్య మగునైహికసుఖము గాక యీజగత్తున మఱేమున్నది?" అని యుపదేశించి యుండును; కాని హేయమయినదియు, స్వార్థపర మైనదియు, పొట్టపోసికొనుటకు మాత్ర మేర్పడిన యీరాత్మ సోపదేశమునకుఁ దొలుతనే యర్జునుఁ డవకాశము నీయక శ్రీకృష్ణునితో—

శ్లో. "ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన!
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే?" (గీ. ౧.౩౫)

"ఈభూమియే కాదు. మూఁడులోకముల రాజ్యము సైతము (ఇంత గొప్ప విషయసుఖము) ఈయుద్ధముచే నాకుఁ దనంతటనే లభించునదియై యున్నను, దాని నిమిత్తమునకు సైతము కౌరవులను జంపుటకు నే నియ్యకొనను. వారు నన్ను జంపినను నొప్పికొందును." అని వచించెను. అర్జునుండు దొలుతనే స్వార్థపరాయణము (తనవిషయమునే పాటించుకొనుట మూలము గాఁగలవి) లనియు, నాధిభౌతికసుఖవాదసంబంధము లనియు, నిషేధించినయాసురమతమునందలివిషయముల నెత్తిచెప్పుటయే యీమతమును ఖండించుటయగును. ఇతరు లేమైనను సరే! ఒక్క స్వీయ మగువిషయోపభోగసుఖమే పరమపురుషార్థమని యెన్ని నీతిమత్త (నీతి గలిగి యుండుట) కును, ధర్మమునకును గలవర పాటు గలుగఁజేయు నీయాధిభౌతికవాదుల యత్యంతనీచ (కనిష్ఠ)మార్గమును కర్మయోగశాస్త్రకర్తలగు సర్వగ్రంథకారులును, సామాన్యమనుజులును, మిక్కిలి నీతివిరుద్ధ మనియు, త్యాజ్య మనియు, గర్హ్యమనియు సిద్ధాంతపఱిచిరి. వేయేల ? ఈమార్గము నీతిశాస్త్ర మని కాని, నీతివివేచన మని కాని పేర్కొనుటకును, పాత్రము కానేరదు. కావున నీవిషయమై విశేషవిచారముఁ జేయుచుఁ గాలక్షేపముఁ జేయక, ఆధిభౌతికసుఖవాదులలో రెండవవర్గమును విమర్శింతము.

ఒకస్వార్థపరత్వమే కాని, లేక, యొకకుక్షింభరత్వమే కాని యీజగత్తున సాగదు, కారణ మేమన;—ఆధిభౌతికసుఖము ప్రతిమనుజునకు నిష్టమైనను దనసుఖ

మితరులసుఖోపభోగముల కడ్డమువచ్చిన యెడల, వారు మనసుఖమున కడ్డుచేయక మాన రనునది ప్రత్యక్షానుభవముననే యున్నది. దానంజేసియే, యితరులగు పలువురాధిభౌతికపండితులు, స్వీయ మగుసుఖమునైనను, స్వార్థమునైనను సాధింపవలసినప్పుడు లోకుల కాత్మౌపమ్యము (అనఁగా: తనతోఁ బోలిక)గా నవకాశము నీయనినాఁడు తమకు సుఖము లభించుట శక్యము కానేరదు. కావున స్వసుఖముకొఱకే దూర మాలోచించి పరులసుఖమువైపునకు సైతము మనము మనదృష్టిఁ బ్రసరింపఁజేయవలసివచ్చునని వచించుచున్నారు. ఈయాధిభౌతికవాదులను నేను రెండవవర్గములోఁ గణనఁ జేయుచున్నాను.ఇచ్చోనుండియే నీతియొక్క యాధిభౌతిక మైనయుక్తికి నిజమైనయారంభమని చెప్పినఁ జెప్పవచ్చును. కారణ మేమనః సమాజమును బాగుపఱుచుకొనుట కాధారభూతము లగునీతినియమములు(అనఁగా: నిబంధనలు-కట్టుబాటులు) అక్కఱయే లేదని చార్వాకులవలెఁ జెప్పక, తద్విరుద్ధముగనే, యవి యందఱచే నేల పాటింపఁబడవలయు ననువిషయమునకు స్వీయదృష్టిచేఁ గారణముఁ జెప్పుట కీవర్గములోనివారు ప్రయత్నించిరి. "జగత్తున నహింసాధర్మ మెటు లుత్పన్నమైనది? మఱియు లోకులు దాని నేల పాలించిరి?" అనునూత్నవిచారముఁ జేయుటకు, నాచే లోకులు హింసింపఁబడినయెడల లోకులచే నేను హింసింపఁబడుదు ననియు, నాసుఖమే నాసుఖోపభోగమున కంతరాయమగుననియు నుండు నీస్వార్థపరత్వమూలక మగుభీతి తప్ప మఱియొకమూలకారణ మేమియుఁ గలుగదనియుఁ గన్పట్టుచున్నది. మఱియు నహింసాధర్మానుసారముగనే యితరధర్మములన్నియు నీస్వార్థపరత్వ మనుకారణముచేతనే ప్రచారములోనికి వచ్చినవి."మనము స్వదుఃఖానుభవసమయమునం దేడ్చుచున్నారము. మఱి యన్యుల కదిఘటిల్లించిన దయఁజెందుదుము. ఏలయనినః మనకును మున్ముం దిట్టిదురవస్థ రాఁగలదనుభీతిచే—అనఁగా: మనకు స్వయముగరాఁబోవుదుఃఖము తలఁపునకువచ్చినహేతువుచే; పరోపకారము, ఔదార్యము, దయ, మాయ, కృతజ్ఞత, నమ్రత, మైత్రి, మొదలగు నేగుణములనైనను జూచుటతోడనే లోకులహితముకొఱకు నేవి సాధనము లని తెలియవచ్చునో, వానిని మూలమునుండి క్రమముగఁ జూచినయెడలఁ దనకిదియేయగుసుఖమునకు, లేక, స్వీయదుఃఖనివారణమునకు, అవిసాధనములుగనే కన్పట్టెడిని. మనకుఁ బనిపడినయెడల పరులు మనకు సాహాయ్యముఁ జేయవలయు ననులోపల నుండునూహచే నితరుల కెవరి కైనను దానమును, సాహాయ్యము నొనర్చుచున్నారు. మఱియు నితరులు తన్ను దయతోఁ జూడవలయు ననుతలంపుతోనే

తా నితరులయందు దయఁ జూపుచున్నాఁడు. ఏమియు లేక పోయినను లోకులచేఁ దాను మంచివాఁ డని శ్లాఘింపఁబడవలయు నను స్వార్థమూలకత్వహేతు వైనను? సతనిహృదయమం దుండును. 'పరోపకార-పరార్థము' లనుశబ్దములు కేవలభ్రాంతి మూలకము లైనవే. మఱియు స్వార్థమన: స్వీయ మగుసుఖప్రాప్తి గాని, దుఃఖనివారణము గాని యగును. తల్లి తనబిడ్డకుఁ బాలిచ్చుటకుఁ గారణము, బిడ్డపైఁ బ్రేమ కానేరదు. మఱేమన : ఆమెకుఁ గలుగుపయోధరపీడయే. ఆదుఃఖనివృత్తికొఱకైనను, లేక, భవిష్యత్కాలమున బిడ్డలు తన్నుఁ బ్రేమించి తనకు సుఖము నిత్తురని యైనను, ఆమె స్వార్థసాధకోపాయమును జూచుకొనుచున్నది.'' అని రెండవ వర్గములోనివారియుద్దేశము. తనసుఖముకొఱకే కానిండు. దూరదృష్టి కలిగి యితరులకు సైతము సుఖ మగునట్లుగా నుండునీతిధర్మము పాలింపఁబడవలయు నని యీ మార్గమునందున్నవా రొప్పుకొనుటయే యీమతమునకును చార్వాకమతమునకును గలగొప్ప భేదము. అయినను "మనుజుఁ డనఁగా: కేవలము విషయసుఖరూప మగుస్వార్థ మ నెడుమూసలో నుండి వెలువడినబొమ్మ'' యని వచించుచార్వాకమతమే దీనిలోని ముఖ్యోద్దేశము. ఇంగ్లాండులో 'హాబ్సు' అనునాతఁడును, ఫ్రాన్సులో 'హెల్వేసియస్' అనునాతఁడును నీమతమును బ్రతిపాదించిరి. అయిన నీమతములోనివారు 'ఇంగ్లాండు'లోఁ గాని, మఱియొకదేశమునఁ గాని విశేషముగ లేరు. 'హాబ్సు' యొక్క నీతిధర్మమునందలియుక్తి ప్రసిద్ధ మైనపిదప 'బట్లరు' * వంటివిద్వాంసులు దానిని ఖండించి "మొత్తముమీఁద మనుజత్వము, పొట్టపోసికొనుటకు మాత్రమే కానేరదు; స్వార్థానుసారముగనే భూతదయ, ప్రేమ, కృతజ్ఞత మొదలగుసద్గుణములు సైతము మనుజులయందు పుట్టినది మొదలు, కొంచెమో గొప్పో యుండి యున్న'' వని సిద్ధాంతపఱిచిరి. కావున నేవ్యవహారముల నైన, నేకర్మల నైన నీతిశాస్త్రానుసారముగ, విచారించునపుడు, కేవలస్వార్థము వైపునకుఁ గాని, లేక, దూరదర్శిస్వార్థము వైపునకుఁ గాని, చూడక, స్వార్థపరార్థము లనెడి

* 'హాబ్సు' యొక్క మత మాతని Leviathan అను గ్రంథమునందుఁ జెప్పఁబడి యున్నది ; 'బట్లరు' మతము నాతని Sermons on Human Nature అను గ్రంథమునం దున్నది. 'హెల్వేసియస్' యొక్క గ్రంథమందలి సారాంశము-'మోర్లే' యనువానిచే, తన Diderot అనుపుస్తకము పై నున్న గ్రంథమునందు (Vol. II. Chap. V.) వ్రాయఁబడి యున్నది.

మనుష్యస్వభావమునందలి నైసర్గికప్రవృత్తుల రెంటియందును దృష్టినుంచి తీరవల యును. ఆఁడుపెద్దపులివంటిక్రూరజంతు వైనను దనశిశువుయొక్క సంరక్షణకై ప్రాణములు నిచ్చుటకు సిద్ధపడుచుండఁగ, మనుజులయందుఁ బ్రేమయుఁ బరోప కారబుద్ధియును నెడుగుణములు కేవలము స్వార్థమూలములుగా నే పుట్టిన వని వచించుట వ్యర్థము. కేవలదూరదర్శిని యగుస్వార్థబుద్ధిచే ధర్మాధర్మములను పరీక్షించుట శాస్త్ర దృష్టికి సైతము యోగ్యము కానేరదని సిద్ధ మగును. ఒక సంసారమందుమాత్రమే వ్యాపించి యుండుటవలన నపరిశుద్ధ మగునంతఃకరణము గలవాఁడు, జగత్తున నిత రుల నిమిత్తమని చెప్పుచుఁ జేయుపనుల నన్నిటి ననేకసమయములందుఁ దనహితము కొఱకే చేయుచున్నాఁ డనువిషయము ప్రాచీను లగుమనపండితు లెఱింగియే యున్నారు. "సాసూరాంకీ రడే సూన, భావ అంతరీ చా భిన్న" "అత్తకొఱకుఁ గోడలేడ్చును. అంతరభావము భిన్నము." (గా. ౨౫౮౩. ౨) అని తుకోబా వచిం చెను. కావున నెందఱో పండితులు 'హెల్వేసియస్' గారికన్నను మిక్కిలి యెక్కువగ నాలోచించిరని తెలుచున్నది. ఉదాహరణ మేమన:—మనుజుల సమ స్తము లగు (అనఁగా: స్వార్థములును బరార్థములు నగు) ప్రవర్తనలు దోషమయ ములుగ నున్నవి. "ప్రవర్తనాలక్షణో దోషః" (గౌ. సూ. ౧. ౧. ౧౮) అను గౌతమన్యాయసూత్రముయొక్క యాధారమున బ్రహ్మసూత్రభాష్యములో శ్రీ శంకరాచార్యులవారు వివరించిన (వే. సూ. శాం. భా. ౨. ౨. ౩) దానిమీఁద వ్యాఖ్యానముఁ జేయుచు శ్రీయానందగిరిస్వామి "మనహృదయములయందు కా రుణ్యవృత్తి పుట్టుటవలన, మనకు రాఁబోవుదుఃఖముయొక్క నివారణకొఱకు మనము లోకులమీఁద దయఁజూపుచు పరోపకారమును జేయుచునే యున్నాము". అని వ్రాసెను. ఆనందగిరియొక్క యీయుక్తి లెఱుచుగ మనదేశమునందున్న సర్వ సన్యాసమార్గీయగ్రంథములలోఁ దప్పక యుండుటచే సర్వకర్మములును స్వార్థ పరములు కావున త్యాజ్యము లగు నను నీసంగతియే దానినుండి ముఖ్యముగ సిద్ధముఁ జేయుట కర్వాచీనులు ప్రయత్నముఁ జేయుచున్నారు; కాని బృహదారణ్యకోప నిషత్తులో యాజ్ఞవల్క్యులవారికిని, వారిభార్యయగు మైత్రేయికిని రెండుస్థలముల యందు జరిగినసంవాదములో, (బృ. ౨. ౪; ౪.౫) ఈకోటిక్రమమే చమత్కార ముగ మఱియొకతీరున నున్నది. "నాకమృతత్వప్రాప్తి యెటు లగు?"నని మైత్రేయి యడుగ "ఓ మైత్రేయీ! భార్యకు భర్త ప్రియుఁడగుట యనునది భర్తకొఱకుఁ గానేరదు; తనయొక్క ప్రీతికొఱకే. ఇటులె పుత్త్రుఁడు పుత్త్రునికొఱకుఁ దండ్రి

క్లిష్టుఁడు కానేరఁడు. తండ్రి తనయుఁడు కారముకొఱకు తనిని బ్రేమించుచున్నాఁడు.* ద్రవ్యము, పశువులు, మొదలగు నితరవస్తువులును నిటులె. "ఆత్మన స్తు కామాయ సర్వం ప్రియం భవతి"— "ఆత్మప్రీత్యర్థమై సర్వవస్తువులు తనకుఁ బ్రియము లగుచున్నవి." మఱియు సమస్త ప్రేమలు నీతీరున నే యాత్మమూలకము లయినచో, ఆత్మ యనఁగా (తా ననఁగా) నెవ రను విషయమును బ్రథమమున విచారణ చేయ నక్కఱ లేదా?" అని యడిగిరి. కావున నే— "ఆత్మా వా అరే! ద్రష్టవ్య శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" "ఆత్మ యే వస్తువో (మొదట) చూడు! విను! దానియొక్క మనన ధ్యానములఁ జేయుము" అని యాజ్ఞవల్క్యులు చివర కుపదేశించిరి. ఈయుపదేశానుసారముగ నాత్మయొక్క నిజమగు స్వరూప మొకపర్యాయ మెఱింగి పిదప జగత్తంతయు నాత్మమయ మగుటచే స్వార్థపరార్థములకు భేదమే లేనటులు మనస్సునకు నిశ్చయ మగును. యాజ్ఞవల్క్యునియొక్క యీయుక్తివాదములచే నాయిరువు రొనర్చినయనుమానము లొకదాని కొకటి విరుద్ధములుగ నున్నవను విషయ మెల్లరకును సహజముగఁ దోఁచును. 'హాబ్సు' స్వార్థమునకే ప్రాధాన్యము నిచ్చుచున్నాఁడు. మఱియు సర్వము లగుపదార్థములను దూరదర్శియగువాఁడు స్వార్థములే యని తలఁచి స్వార్థము తప్ప నీజగత్తున రెండవ దేమియు లేదని వక్కాణించుచున్నాఁడు. ఇఁక యాజ్ఞవల్క్యుఁడు స్వార్థమనుశబ్దమునందున్న 'స్వ' (తనది) యను పదముయొక్క యాధారమున నధ్యాత్మదృష్టితోఁ దనయాత్మయందే సర్వభూతములకును, సర్వభూతములయందుఁ దనయాత్మకును నవిరోధముగ నెటుల సమావేశమగు ననువిషయమును జూపి, స్వార్థపరార్థములనడుమఁ గలభేదమును భాసింపఁ జేయుద్వైతముయొక్క బంధము నే సమూలముగఁ బెఱికి పాఱవైచుచున్నాఁడు. సన్యాసమార్గమునకును, యాజ్ఞవల్క్యునిపూర్వోక్తమతమునకును గలవిషయములో మున్ముందు విశేషవిచారము సేయఁబడును. "సామాన్యమనుజులప్రవృత్తి స్వార్థపరము (అనఁగా: ఆత్మసుఖపరము)గ నుండును." అను నొకవిషయము నే కొంచె

---

* "What say you of natural affection? Is that also a species of self-love? Yes; All is self-love. *Your* children are loved only because they are yours. *Your* friend for a like reason. And *Your* country engages you only so for as it has a connection with *yourself*." అని 'హ్యూమ్' అనునతఁ డీకోటిక్రమమునే *Of the Dignity or Meanness of Human Nature* అను గ్రంథమున వ్రాసెను; కాని 'హ్యూమ్'యొక్క స్వమత మీమతమునకన్న భిన్నము.

మెక్కువగ గౌరవించిరియైనను, అదియ యన్ని విధముల నిరపవాదముగ నున్నదని యెఱింగిరయైనను, మన దేశమునం దున్న ప్రాచీన గ్రంథకారులు దాని నాధారముగ నొనర్చుకొని, 'హాబ్సు'నకు విరుద్ధమగు నితరానుమానముల నెటులొనర్చిరో తెలియఁ జేయుటకుఁ గావలసినంతవఱకే యాజ్ఞవల్క్యమలమత మిచ్చో నిరూపింపఁబడినది.

ఇంగ్లీషు గ్రంథకారుఁడగు 'హాబ్సు' ను, 'ఫ్రెంచి' పండితుఁడగు 'హెల్వేసియ'స్సును, ప్రతిపాదించినవిధముగ, మనుష్యస్వభావము జొత్తిగ స్వార్థపరము (అనఁగ: తమోగుణసంబంధము గలదికాని, రాక్షసధర్మము గలది కాని) కానేరదు. కావున స్వార్థముతోఁగూడ పరోపకారబుద్ధి యనుసాత్త్వికమనోవృత్తియు, మనుజుల హృదయమునందుఁ బుట్టుకతోడనే స్వతంత్రముగ నిర్మితమయిన దనియుఁ, బరోపకార మనఁగ, కేవలము దూరదర్శిస్వార్థము గా దనియు సిద్ధమయినపిదప, "స్వార్థమనఁగ, స్వసుఖము, పరార్థమనఁగ, నితరులయొక్క సుఖము" అను నీరెండుసిద్ధాన్తముల యందును సమాన మగుదృష్టియుండుటవలనఁ గార్యాకార్యములనిర్ణయమును జేయుశాస్త్రముయొక్క రచన ప్రాప్తమగుచున్నది. ఇది యాధిభౌతికవాదుల యొక్క తృతీయవర్గము. అయినను, "స్వార్థ మయిన నేమి? పరార్థమైన నేమి? ఈరెండును నైహికసుఖవాచకములే యగును. ఐహికసుఖముతప్ప మఱేమియు లేదు." అనునీయాధిభౌతికమత మీపక్షమునందు సుస్థిరత వహించి యుండును. "స్వార్థబుధ్యనుసారముగ బరార్థబుద్ధియు నైసర్గికమని భావించుటచే నీతిని విచారించునపుడు, స్వార్థానుసారముగనే పరార్థమును నైతము వీక్షించుట మనకుఁ గర్తవ్యమై యున్న"దని యీ పథమునందున్న వా రనుకొందు రనునది మాత్రమే యీ రెండుమార్గములకుఁ గలభేదము. "సామాన్యముగ స్వార్థపరార్థములలో విరోధము పుట్టదు. అందుచే మనుజుఁ డొనర్చుకర్మ యంతయు తఱచుగ సమాజమునకును హితమే యగుచుండును. ఒకఁడు ద్రవ్యార్జన మొనరించిన, దాని మూలమున మొత్తము మీఁద సమాజమునకు హితమే యగుచుండును. కారణమేమన : సమాజ మనఁగ, ననేకుల సమూహమగుటచే నందుఁజేరిన ప్రతిమానవుఁడు నితరులకు నష్టము రానీయకుండఁ దనలాభమును బొందుటను బాటించినయెడల, మొత్తముమీఁద సమాజమునకుఁ గల్యాణమే యగును. ఇందుకొఱకై స్వసుఖమును నైతము పాటించుకొనుచునేమాత్రమైన లోకహిత మొనరించుచు వచ్చినయెడల నటు లొనరించుట యతనికిఁ గర్తవ్య మగును." అని యీమార్గమం దున్నవారు సిద్ధాన్తపఱచిరి. కాని యీపక్షావలంబకులు, పరార్థముయొక్క శ్రేష్ఠత్వము నంగీకరింపక ప్రతిపక్షుండు

మందు "స్వబుద్ధ్యనుసారముగనే, స్వార్థము శ్రేష్ఠమయినదా? పరార్థమే శ్రేష్ఠమైనదా? యనువిచారణఁ జేయవలయు" నని చెప్పుచుండుటచే, స్వార్థమునకును బరార్థమునకును విరోధము వచ్చినప్పుడు లోకులసుఖమునకై తనసుఖ మెంతవఱకుఁ ద్యాగముఁ జేయవలయునో నిర్ణయించుటయనుకష్టమునకు లోఁబడక పలుమాఱులు స్వార్థముపైపునకే మనుజుఁడు ప్రవర్తించుటకు వీలుండును. ఏలన: స్వార్థపరార్థములు రెండును సమానముగఁ బ్రబలము లని యెన్నఁబడినచో, సత్యమునకై ప్రాణముల నిచ్చుట గాని, రాజ్యమును గోలుపోవుట గాని యుండక పోవుటయే గాక, "ద్రవ్యరూపకముగ విశేషనష్టము గలుగునెడల నది సహింపఁబడవలయునా? యక్కఱలేదా?" యనువిషయమీమార్గమునం దున్నవారిమతమున నిర్ణీతము గానేరదు. ఒకానొకయుదారునిచేఁ బరార్థమై తనప్రాణము లీయఁబడినయెడల నొకప్పుడీమార్గములో నుండువా రాతనిస్తుతి యొనరింతురు; కాని తమ కట్టిసమయము సమకూరెనేని స్వార్థపరార్థము లను నీరెండుపక్షములందును బ్రవర్తింపఁజూచు పండితునకు స్వార్థమునందే మిక్కిలిపట్టుదల యుండునని వేఱుగఁ జెప్ప నక్కఱయుండదు. 'హాబ్సు' మతానుసారముగఁ, బరార్థమనునది స్వార్థముయొక్కయే దూరదర్శిప్రకార మని యంగీకరింపక, స్వార్థపరార్థములరెంటిని తక్కెడతట్టలలో వైచి తూచి వానితారతమ్యము ననుసరించి, స్వార్థమునే మిక్కిలి చాతుర్యముగ స్థిరపఱచుచున్నా మని యెఱుంగుటంజేసి యీమార్గములో నున్నవారు తమమార్గము దాత్తమో, లేక, నిపుణమో యయినచో, 'స్వార్థము(కాని,యెట్టులైనను స్వార్థమే!)' అని నామంబిడి దానిమహత్త్వమునే కొనియాడుచుందురు.* కాని, భర్తృహరి—

"శ్లో. ఏకే సత్పురుషాః పరార్థఘటకాః స్వార్థాన్పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థ ముద్యమభృతః స్వార్థావిరోధేన యే
తే ఒమీ మానవరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నన్తి యే
యే తు ఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే న జానీమహే."

(నీతి. శత. ౭౪)

"తమలాభమును వదలి లోకులహిత మొనర్చువారు సత్యమయినసత్పురుషు లని వచింపవలయును. స్వార్థమును విడువకయే, లోకులవిషయమయి ప్రయత్నిం

* ఇంగ్లీషులో దీనిని enlightened self-interest అని చెప్పుదురు. దీనిలో Enlightened అనుపదమును 'ఉదాత్త' మని లేక, 'శహాణా (నిపుణ)' అని భాషాన్తరీకరించితిమి.

చువారు సామాన్యు లగుదురు. మఱియు స్వలాభమునకై లోకులకు నష్టము గలుగఁ జేయువారు మనుజులు గారనియు రాక్షసు లని యెఱుంగవలయును. గాని యందఱకంటెను జివరవారల (అనఁగ: లోకహితమును నిరర్థకముగ నష్టపఱుచువారల)కేమని పేరిడవలయునో మాకుఁ దెలియదు" అని వక్కాణించుచున్నాఁడు. ఇటులె రాజధర్మముయొక్క యుత్తమస్థితిని వర్ణించుచుఁ గాళిదాసు—

"స్వసుఖనిరభిలాషః ఖిద్యసే లోకహేతోః
ప్రతిదిన మథవా తే వృత్తి రేవంవిధైవ."

(శాకుం. ౫. ౭.)

"స్వీయమైనసుఖమును గమనింపకయే నీవు ప్రతిదినమును లోకహితార్థమై కష్టమును జేయుచున్నావు. ఇటు లన నేల? నీవృత్తి, లేక, నీవ్యాపారము, ఇటులె యున్న" దని చెప్పెను. కర్మయోగశాస్త్రములో స్వార్థపరార్థము లను రెండుతత్త్వములను స్వీకరించి వానితారతమ్యముచే ధర్మాధర్మములఁ గాని, కర్తా కర్మములఁ గాని నిర్ణయింపవలయునని 'భర్తృహరి - కాళిదాసుల' యభిప్రాయము కానేరదు; అయినను పరార్థమై స్వార్థమును వదలి వేయువారలకు నా కాళిదాసభర్తృహరులచే నీయఁబడియుండు నగ్రస్థానమే, నీతిదృష్టితోఁ జూచినను న్యాయ్యముగాఁ గన్పట్టుచున్నది. తాత్త్వికదృష్టికిఁ (అనఁగా: ఉన్నది యున్నటుల విచారించుసమయమున) బరార్థము శ్రేష్ఠమైనను, శుద్ధమగునీతియొక్క పరమావధి యేదియో తెలియకమున్ను సామాన్యవ్యవహారమున 'సామాన్య మానవుఁ' డెటుల వ్యవహరింపవలసినదియు మేము నిర్ణయించువిషయము కావున నిపుణస్వార్థమునకు మే మిచ్చునట్టియగ్రస్థానమే వ్యావహారికదృష్టికి యోగ్యమైనది* ఈమార్గము నవలంబించువార లీకాళిదాసభర్తృహరులవాదముపై యుక్తిఁ జెప్పుదురు. కాని మనమతానుసార మీయుక్తివాదమం దేమియు లాభము కాన్పింపదు. బజారులో నుపయోగములో నున్నతూనికయుఁ గొలఁతయు నెప్పుడును గొంచె మెచ్చుతగ్గులై యుండును. ఇటులె రాజస్థానములం దెల్లరకును బ్రమాణములుగ

* Sidgwick's *Methods of Ethics* Book I. Chap. II. § 2, pp. 18-29; also Book IV. Chap. IV. § 3 p. 474. ఈ మూఁడవమార్గము సిజ్విక్కుచేఁ గల్పింపఁబడినది కానేరదు. ఇఁక నేమన: సామాన్యముగ సుశిక్షితు లగునాంగ్లేయు లనేకు లీమతమునే యవలంబించుటచే దానికి Common sense morality అనియును పేరుగలదు.

స్థిరపఱుపఁబడినట్టూనికలును, గొలఁగోలును సైతము కొంచె మెచ్చుతగ్గులై యుండిన మన మావిషయములో నధికారులను దూషింపమా?. అటులే కర్మయోగశాస్త్రమున నేమాత్రము లోపమున్నను నొప్పుకొనఁగూడదు. నీతిధర్మముయొక్క నిత్యశుద్ధపూర్ణస్వరూపమును శాస్త్రీయముగ నిర్ణయించుటకొఱకే నీతిశాస్త్ర మేర్పడినది. కాన నీవిషయము నీతిశాస్త్రముచే నిర్ణయింపఁబడనియెడల నది నిష్ఫల మని చెప్పవలసివచ్చును. 'నిపుణ మైనస్వార్థము' సామాన్యమనుష్యులయొక్క మార్గ మని 'సిజ్విక్' వచించినవిషయ మసత్యము కానేరదు. భర్తృహారియు నావిషయమునే వచించుచున్నాఁడు; కాని పరమావధి యగు 'నీతిమత్త' (నీతికలిగియుండుట) గల యీసామాన్యజనులమతము శోధింపఁబడినయెడల 'సిజ్విక్కు' 'నిపుణస్వార్థము' గొప్పదనుట పొరపాటని తేలును. కాన నిష్కళంక మైన నీతియొక్క గాని, సత్పురుషాచరణములయొక్క గాని మార్గ మీసామాన్యకుక్షింభరులమార్గముకంటె వేఱుగానుండు నని సామాన్యమనుజులకు సైతము దెలియును. మఱియు నీయుద్దేశమే పైశ్లోకములో భర్తృహారిచే వర్ణిత మైనది.

(౧) కేవలస్వార్థి, (౨) దూరదర్శిస్వార్థి, (3) ఉభయవాది (అనఁగా: ఉచ్చస్వార్థియు), అని యీవిధమున నాధిభౌతికసుఖవాదులయొక్క మార్గత్రయము నింతపర్యంతము విచారించి యందు ముఖ్యదోషమును వక్కాణించితిమి; కాని యింతమాత్రముచే నాధిభౌతికమార్గము లన్నియు సమాప్తములు కానేరవు. "ఒక్కని సుఖముపై పునకే చూడక, సర్వజనులయొక్కయు నాధిభౌతికసుఖదుఃఖములయందలి తారతమ్యములను విచారించియే, నీతియందలి కార్యాకార్యములను నిర్ణయింపవలయు" నను సాత్త్విక లగు నాధిభౌతికపండితులమార్గము వీనియన్నిటికన్న వెంబడిదియు, శ్రేష్ఠమైనదియు నై యున్నది.* ఒక్కసమయముననే, యొకకార్యముచేతనే, సమాజములో నున్నవారికందఱకును గాని, జగత్తునందుండు నెల్లవారికిఁ గాని సుఖమును బ్రాపింపఁజేయుట శక్యము కానేరదు. ఒకరికి సుఖదాయక మని తోఁచినవిషయము మఱియొకరికి దుఃఖకర మగును; కాని గుడ్లగూబలకు వెలుతురిష్టము కాకపోయినంతమాత్రమున, ఆ వెలుతురు పలికిమాలినదని యెవ్వారును నుడువమిచేఁ, గొందఱకుమాత్రము లాభకరము కానివిషయ మెవ్వారికిని హితమును

---

* బెంథం, మిల్లు మొదలగుపండితు లీమార్గమునకుఁ బ్రధానులుగ నున్నారు. Greatest good of the greatest number అనుదానిని "పుష్కజనులకు పుష్కలసుఖము (ఎక్కువమందికి నెక్కువసుఖము)" అని తర్జుమా చేసినా

గలుగఁజేయునది కాదని కర్మయోగశాస్త్రముసైతము వక్కాణించును. మఱియు నీకారణముచేతనే "లోకులయందఱియొక్క సుఖ"మనుదానికే "ఎక్కువమంది కెక్కువసుఖము" అని యిప్పు డర్థము సేయవలసివచ్చుచున్నది. సారాంశమే మనఁగా:—"ఎక్కువ సంఘమున కెక్కువసుఖము దేనిచేఁ గలుగుచుండునో యది యే నీతిదృష్టికి న్యాయ్యమును గ్రాహ్యము నని మన మెఱుంగనగు. మఱియు నీతీయనఁ బ్రవర్తించుటయే యీజగత్తున నందఱును సత్యముగఁ జేయఁదగినపని". యని యీ మతమునందలి యభిప్రాయము. ఆధిభౌతికసుఖవాదులయొక్క యీ తత్త్వ మాధ్యాత్మికపథమునకు సైత మిష్టమే. వేయేల? ఈసిద్ధాంతము నాధ్యాత్మిక వాదులే బహుకాలముక్రిందట శోధించి యేర్పఱిచిరి. ఆధిభౌతికవాదు లిప్పుడు దానిని మఱియొకవిధముగ నుపయోగించిరి. దీనినే యీరెండుమతములలోని భేద మని చెప్పినను జెప్పవచ్చును. "సత్పురుషులయవతారము లోకులకు శుభమునకే కావున వారు తమశరీరాయాసమును సైతము సరకుసేయక పరోపకారమునే చేయుచుందురు"అని తుకోబా చెప్పినట్టుల యీవిషయ మెవరికిని చెప్ప నక్కఱ లేదు. ఫలితార్థ మేమన:—ఈసిద్ధాంతము సత్యమైనదని కాని యోగ్యమైన దని కాని యొప్పుకొననివారు లేరు. పూర్ణుఁడును యోగయుక్తుఁడు (అనఁగా: కర్మ యోగయుక్తుఁడు) నగు జ్ఞానియొక్క లక్షణముల నుడువుచు, "సర్వభూతహితే రతాః," "సర్వభూతములకును గల్యాణమును చేయుటలో వారు నిమగ్నులై యుందురు." అని భగవద్గీతలోనే రెండుపర్యాయములు స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది. (గీ. ౫. ౨౫; ౧౨. ౪.) ధర్మాధర్మములయొక్క నిర్ణయమునకు సైతము మనశాస్త్రకారు లీసిద్ధాంతము నంగీకరించుచున్నారని రెండవప్రకరణ ములో వ్రాయఁబడిన—"యద్భూతహిత మత్యంతం తత్సత్య మితి ధారణా" అను మహాభారతవచనముచే స్పష్టమగును; కాని మనశాస్త్రకారులు వచించినటుల "సర్వభూతహితమునే, జ్ఞానియొక్క వర్తనకు సంబంధించిన బాహ్యలక్షణ ముగ నిర్ణయించి, ధర్మాధర్మనిర్ణయమునకై దాని నాయాసందర్భములయందు సాధారణలక్షణగా నుపయోగించుటయు; నీతిమత్తకు నిదియే ముఖ్యమగుసర్వస్వ మని యంగీకరించి యితర మగునేవిషయమును విచారింపక, కేవల మీపునాది మీఁదనే నీతిశాస్త్రసంబంధమగుదృఢభవనమును నిర్మించుటయు"ననునీరెండు విష యములును మిక్కిలి వేర్వేఱుగ నున్నవి. ఆధిభౌతికపండితులు రెండవమార్గమును స్వీకరించి నీతిశాస్త్రమున కధ్యాత్మవిద్యతో సంబంధ మేమియును లేదని వక్కా ణించెదరు. కావున వారు వచించున దెంతవఱకు సయుక్తికముగ నున్నదో ప్రస్తు

అము ఘనము విచారణ సేయవలయును. 'సుఖము' 'హితము' అను నీరెండుశబ్దములకు నర్థములో చాలభేదము కలదు. ప్రకృతమునం దాభేదము దూరముగ నుంచినను ''సర్వభూతహితి''మనఁగా ''ఎక్కువమంది కెక్కువసుఖము''అని యర్థముఁ జెప్పినను, కార్యాకార్యముల నిర్ణయము నొనర్చుటలోఁ గేవల మీసిద్ధాన్తమే యుపయోగింపఁబడినచో ననేకము లగునసందర్భములు గలుగు నని తోఁచుచున్నది. ఈ సిద్ధాన్తము నాధిభౌతికవాది యర్జునున కుపదేశముఁ జేయునెడల, ''భారతయుద్ధములో నీకు జయము గలుగుటవలన నెక్కువప్రజ కెక్కువసుఖమగునటుల యుండెనేని భీష్ముని జంపినైన నీవు యుద్ధముఁజేయక తప్ప'' దని యర్జునునకుఁ జెప్పునా, చెప్పఁడా? ఈయుపదేశము, పైకి సులభముగఁ గన్పట్టుచున్నను,గొంతవిమర్శించిన, దానిలోనుండునసంపూర్ణతయుఁ, బ్రతిబంధకములును దెలియును. అనేకులనఁగా నెందఱు? పాండవులబల మేడక్షౌహిణులును, కౌరవులబలము పదునొకొండక్షౌహిణులును గావున,పాండవుల కపజయ మైనచోఁ గౌరవులపదునొకం డక్షౌహిణులకు సుఖమగునను నీయుక్తివాదముచే పాండవులపక్షము న్యాయ్యముగ నున్నదని చెప్పవచ్చునా? భారతయుద్ధ మనియేచెప్ప నేల? అనేకము లగునితరసందర్భములలో సైతము నీతిమత్తా (నీతిగలిగియుండుట) నిర్ణయము బొత్తిగ జనసంఖ్యను బట్టియే చేయుట పొరపాటు. లక్షమంది దుర్జనులకు సుఖము గలుగఁ జేయుదానికంటె,నొక్కనికైనను సజ్జనునకు సుఖము గలుగఁజేయునదియే నిజ మయినసత్కృత్యమని యెల్లరెఱుంగుదురు. ఇటు లందఱొప్పికొనుటచే నొక్కసజ్జనునిసుఖము లక్షమంది దుర్జనుల సుఖముకంటె నెక్కువది యగునని తేలినది. కావున నీ సిద్ధాన్తానుసారముగ 'ననేకుల కధికబాహ్యసుఖ మనునదియే నీతిమత్తాపరీక్షకు సాధన' మనెడుప్రథమసిద్ధాన్తము నిలువఁ జాలదు. కావున లోకులసంఖ్యయొక్క హెచ్చుతగ్గులను బట్టి యుండుటకును, నీతిమత్తకును, నిత్యసంబంధముండుటకు వీలులేదని చెప్పవలసివచ్చును. మఱియు సామాన్యముగ నందఱకు నప్పుడప్పుడు సుఖావహముగ నుండువిషయమే దూరదృష్టి గలవారికి, పరిణామమునం దందఱకు నసుఖమునే కలుగఁ జేయునదిగ నున్నదని తోఁచు ననుసంశయమును సైతము గుర్తించుకొనవలయును. ఉదాహరణమునకై, 'సాక్రటీసు' యొక్కయు, 'ఏసుక్రీస్తు' యొక్కయు విషయమును వివరింతము. వీరిరువురును, తమతమమతముల ననుసరించిన యెడల చిట్టచివరకు శుభము గలుగుననియే తమదేశబంధువులకు నుపదేశము చేయుచు వచ్చిరి కాని, వారిదేశబాంధవులు వారిని 'సమాజశత్రువులను'గా నిశ్చయించి దేహాన్త మగుప్రాయశ్చిత్తము వారికి విధించి యొనరించిరి, 'అనేకుల కధిక

సుఖ' మనెడి యీసిద్ధాన్తము ననుసరించియే యిప్పటివారును, వారికిప్రవర్తకు లగువారును బ్రవర్తించి యున్నారు; కాని యీకాలపుసామాన్యజనులయొక్క వర్తనము న్యాయ్యముగ నున్నదని యిప్పుడు మనము వచింపము. సారాంశ మేమన:—'అనేకుల కధికసుఖ'మనునదియే నీతియొక్క మూలతత్త్వ మని క్షణమాత్రము మన మొప్పుకొనినను, దానిచే "లక్షమందికి సుఖము దేనివలన కలుగును? దానిని నిర్ణయించు టెట్లు? దాని నెవరు చేయవలయును?" అనునీప్రశ్నముల కేమియు నదుత్తరముల నిచ్చుట సాధ్యము కానేరదు. సామాన్యముగ నీప్రశ్నలకు సమాధానము నిర్ణయించుట యనుకార్యము తమతమసందర్భములంబట్టి యనేకుల కధికసుఖము గలుగఁజేయవలసివచ్చినవారికి సులభము; కాని సామాన్యవిషయములలో నంతప్రయత్న మవసరములేదు. మఱియు మనోవ్యగ్రతకుఁ గారణములగు కొన్ని సందర్భములలో సామాన్యజనులకు, 'మనసుఖ మెందులో నున్న'దని నిర్దోషముగ విచారణ సేయఁదగినంతశక్తి లేకపోవుటచే, మేఁకలఁ గాయు మని పులికొప్పఁ జెప్పినటుల, 'అనేకుల కధికసుఖ' మనునట్టి నీతిసిద్ధాన్తమునే యీయనధికారు లగు లోకుల కుపదేశించినచోఁ దుద కేమి యుపద్రవము సంభవించునో యనుకొనవలసి వచ్చు నని 'సాక్రటీసు - ఏసుక్రీస్తుల' యుదాహరణములవలన స్పష్టమగుచున్నది. "మానీతిసిద్ధాన్తమందలిధర్మము సత్య మయినదే. తెలివిలేనివారు సరిగా నుపయోగము చేసికొననియెడల మేమేమి చేయుదుము?" అనునీసమాధానమునం దేమియు నర్థము లేదు. కారణ మేమన: "సిద్ధాన్తము సత్య మైనదైనను దాని నుపయోగించుటలో నధికారి యెవరు? అయధికారి దీని నెపు డెటుల నుపయోగపఱచికొనవలయును?" మొదలగుప్రశ్నలకు సమాధానము లగుమర్యాదలను సైతము చెప్పవలయును. అటుల చెప్పలేనియెడల మనమును, 'సాక్రటీస్'వలె నీతిమత్తను నిర్ణయించుటయందు సమర్థుల మని భ్రమఁ జెంది, మంచిపనిని సైతము చెడఁ గొట్టికొనుట కవకాశము గలిగించుకొన్నవార మగుదుము.

ఒక్కసంఖ్యను బట్టియే నీతియొక్క యోగ్యమగు నిర్ణయము గానేరదు. మఱియు 'ననేకుల కధికసుఖ మెందున్న' దనునంశమును సిద్ధాన్తముఁ జేయుటకు సిద్ధములుగ నుండు నేబాహ్యసాధనములు లేవు. ఈరెండే కాక యీమతములపై నితరము లగుకొన్నిగొప్పయాక్షేపణలు రావచ్చును. ఉదాహరణ మేమన:—ఒకానొకకార్యముయొక్క బాహ్యపరిణామమునుమాత్రమే బట్టియే యది న్యాయ్యమా? యన్యాయ్యమా? యనుదానికిఁ, బూర్తిగను సమాధానముగను సిద్ధాన్తముఁ

జెప్పుట తెలుచుగ• శక్యముగామి కొంచెము విచారించినఁ దప్పక తెలియును. ఒక గడియారము సరియగుసమయమును తెలుపుచున్నదా? లేదా? యని మాత్రము విచారించిన, "అది మంచిది యగునా? లేక, చెడుది యగునా?" యనువిషయము నిర్ణయము చేయఁబడుచున్న దనుమాట సత్యమే; కాని మనుష్యులు చేయుపనుల కీపద్ధతిని సంబంధింపఁజేయుటకుఁ బూర్వము, మనుష్యుఁ డన, నొకగడియారము గాని, యంత్రము గాని, కాదని మనము గుర్తెఱింగి యుండవలయును. సత్పురుషు లందఱును జగత్తుయొక్క కల్యాణార్థమై యుండుట సత్యమే; కాని విపరీతముగ, లోకుల కల్యాణార్థమై సిద్ధముగ నుండువారు సర్వకార్యములందును సాధువులుగనే యుండవలయు నని లక్షణమును నుడువరాదు. మనుష్యునియంతఃకరణము సైతమెటు లున్నదని చూడఁదగియున్నది. యంత్రములకు మనుష్యులకును గల గొప్పభేద మిదియే. కావుననే యజ్ఞానముచేఁ గాని, పొరపాటుచేఁ గాని యెవఁడైన నపరాధి యైనచో, నతఁడు శిక్షాస్మృతియందు క్షమింపఁబడఁదగినవాఁ డని యున్నది. ఏకర్జ మైన "మంచిది యగునా? చెడుది యగునా? ధర్మ్యమగునా? అధర్మ్యమగునా? నీతియుక్తమా? కానేరదా?" అనువిషయమున సత్య మగునిర్ణయమా పనియొక్క బాహ్యఫలము (లేక, పరిణామము)ను మాత్రమే (అనఁగ:— ననేకుల కధిక సుఖప్రదమగునా? కానేరదా? యనుదానినిమాత్రమే) చూచి నిశ్చయింపఁగూడదు. ఆయాకార్యమును జేయువానిబుద్ధి గాని, లేక, యుద్దేశము గాని యెటు లున్నదనియు, దానితోపాటుగ నవశ్యముఁ జూడఁదగియుండునని యీచర్చవలన తేలినతాత్పర్యము. అమెరికాలో నొకానొకగొప్పపట్టణమునం దెల్లరకు నుపయోగించుటకు నెల్లవారికిని సుఖప్రాప్తికొఱకును 'ట్రామ్‌వే' బండి వేయవలసివచ్చెను; అయిన నాకార్యమును జేయుటకు ముఖ్యు లగునధికారులు సమ్మతింపక పోయిరి. అప్పుడు 'ట్రామ్‌వే' వేయువారు ముఖ్యు లగునధికారులకు లంచ మిచ్చిరి. పిదప వారు సమ్మతించిరి. అంతట వెంటనే 'ట్రామ్‌వే' పని పూర్తియాయెను. పట్టణమునందున్న యెల్లరకును దానిమూలమున బహుసుఖమును లాభమును గలిగెను. పిదపఁ గొన్నిరోజులకు లంచము పుచ్చుకొనినసంగతి వెల్లడి యగుటచే 'ట్రామ్‌వే' వేయువారిపై (వ్యవస్థాపకులపై) దండశాస్త్రసంబంధ మగు (క్రిమినల్) వ్యవహార మారంభ మాయెను. మొదటిపంచాయతీలో (జ్యూరీలో) నైకమత్య ముండదను నభిప్రాయమున, రెండవపంచాయతీ యెన్నుకొనఁబడెను. వారు లంచమిచ్చినవారిని దోషులుగ నిర్ణయించినందున 'ట్రామ్‌వే' వేయువారు శిక్షింపఁబడిరి. ఈయుదాహరణమును ననేకుల కధికసుఖప్రద మైనదనుదానినే, నీతిసిద్ధాన్తముగ గ్రహించు

యెడలఁ గార్యనిర్వాహము గానేరదు. లంచము నిచ్చుటచే 'ట్రామ్వే' పూర్తి యయినదనుబాహ్యపరిణామ మనేకుల కధికసుఖప్రద మైనదియే.అయిన నంతమాత్రముచే లంచమిచ్చుట యనువిషయముమాత్రము న్యాయ్యము కానేరదు * దానముఁజేయుట తనకు ధర్మ (దాతవ్య)మని యెఱింగి నిష్కామబుద్ధితో దాన మొనర్చుటయుఁ, గీర్తికొఱకుఁ గాని, లేక,యేదైన నితరఫలముకొఱకుఁ గాని దాన మొనర్చుటయు,ననునీద్వివిధకార్యముల బాహ్యపరిణామ మొకవేళ నొక్కవిధము గనే యుండినను, మొదటివిధము సాత్త్వికము, రెండవది రాజస మని భగ వద్గీతలలోసైతము విడఁదీయఁబడినది. (గీ. ౧౭. ౨౦—౨౧) మఱియు నాదానమే యపాత్రున కీయఁబడిన, నది తామస మనియు, గర్హ్యమనియుఁ జెప్పఁబడినది. లోకములో సైత మొకదరిద్రుఁ డొకధర్మకార్యవిషయమయి కొంత ద్రవ్యము వెచ్చించు నేని, యాధర్మకార్యమునకే శ్రీమంతుఁడు నూఱురూపాయలు వెచ్చించి నను, వా రిరువురి నీతిసంబంధ మగుయోగ్యత సమానమే యని యెన్నుదురు. అయిన ననేకుల కధికహితము దేనివలన గలుగు నని, యీబాహ్యసాధనముచే విచారించు నెడల నీ రెండుదానములు నీతిదృష్టికి సమానయోగ్యతలు గలిగినవి కావని నుడువ వలనుపడదు. 'అనేకుల కధికహితము' అను నీయాధిభౌతికసిద్ధాంతమున విశేషదోషము, చెప్పఁబోవునదియై యున్నది. కర్తయొక్క మనస్సులో నున్నయుద్దేశముయొక్క గాని, బుద్ధియొక్క గాని విచారణయం దేమియునుండ నేరదు. మఱియు లోనికారణము నరయవలయునని వచించు నెడల ననేకుల కధికమగుబాహ్యసుఖ మనునదియే బంగారము నొరచునట్టి యొఱరపురాతితోఁ బోల్పఁబడిన నీతిమత్త యనుమొదటి ప్రతిజ్ఞకు విరోధము గలుగుచున్నది. వ్యవస్థ చేయుసభగాని, సంఘము గాని, యనేకులతో నేర్పడిన దగుటచే, వారు చేయువ్యవస్థలు గాని నియమములు గాని యోగ్యము లగునా? కావా? యనువిచారణఁ జేయు నెడ వారియంతఃకరణ మెటుల నున్న దని చూడను వీలులేదు. "వారు చేసినవ్యవస్థచే ననేకుల కధికసుఖ మగునా? కాదా?" యనుబాహ్యవిచారము మాత్రముఁ జేసినఁ బూర్తి యగును; గాని మఱియొకస్థలమునం దీపద్ధతి యుపయోగింప దనువిషయము, పై యుదాహరణచే నేరికైనను సులభముగనే తెలియును. "అనేకుల కధికసుఖ" మను సిద్ధాంతము లభింపదు; కాని ఒకవిషయమును నీతిదృష్టితో "న్యాయ్యమా? యన్యా

* ఈయుదాహరణము, డాక్టర్ పాల్ కరస్ అనువాని The Ethical Problem (pp. 58, 59. 2nd Ed.) అను పుస్తకమునందుండి వ్రాయఁబడినది.

యమా?" యని విచారింపవలసినయెడల, నీ బాహ్యవిషయమే కాక యనేకసందర్భములలో ననేకసంధర్భములను సైతము విచారించుట యావశ్యకము; గాన, నీతిమత్తను నిర్ణయించుటలో నీవిషయమునుమాత్రమే యన్నివిధముల నవలంబించుటకు వీలులేదు. ఇంతకంటె మిగుల నిశ్చితమును నిర్దోషము నగుసిద్ధాంతమును శోధన చేసి కనిపట్టుట యావశ్యక మనియే నేను ముఖ్యముగఁ జెప్పుచున్నాను. "కర్మకంటె బుద్ధి శ్రేష్ఠమైనది." (గీ. ౨. ౪౯.) అని గీతలోఁ బ్రారంభముననే చెప్పఁబడినయభిప్రాయమిదియే. బాహ్యకర్మలనుమాత్రము చూచిన, నవి యనేకసమయములలో భ్రాంతిని గలిగించును. 'స్నానసంధ్యలు, తిలకములు, జపమాల'లనెడు బాహ్యకర్మలను బాగుగఁ జేయుచున్నను, 'అంతఃకరణమునఁ గ్రోధమూర్తిగ'నుండుట శక్యము గానిది కానేరదు; కాని లోన బుద్ధి పరిశుద్ధముగ నున్నయెడల, బాహ్యకర్మ, సుదాముని(కుచేలుని)యడుకులవలె నెంతతక్కువదైయున్నను, దానియొక్క ధార్మికమును నైతికమునునగు యోగ్యత యనేకుల కధికసుఖమును గలిగించునట్టిగొప్పయన్న దానముపంటిదని తలంపవలయును. కావుననే జర్మనుదేశపు తత్త్వజ్ఞానియగు 'కాంటు' * కర్మయొక్క బాహ్యము దృశ్యము నగుపరిణామముయొక్క తారతమ్యవిచారము గౌణమని సిద్ధాంతముఁ జేసి, తాను జేసిన "నీతిశాస్త్రవివేచన" యనుగ్రంథమును కర్తయొక్క శుద్ధబుద్ధినిమొదలుకొని ప్రారంభము చేసెను. ఆధిభౌతికసుఖవాదమునం దున్నయీన్యూనత, ప్రముఖు లగునాధిభౌతికవాదులెఱుంగనిది కానేరదు. మనుష్యుఁ డొనర్చుపనులే యతనిస్వభావము నెఱుంగఁజేయును. కాన నవి యతనినీతిమత్తను సైతఁ మెఱుంగఁజేయు నని యందఱనుకొనెదరు; కాని బాహ్యపరిణామమునుండియే యవి మంచివని కాని, చెడ్డవని కాని చెప్పలేమని 'హ్యూమ్' † స్పష్టముగ వ్రాసెను. మఱియు నేపనియొక్క

---

* Kant's *Theory of Ethics* (tran. by Abbott) 6th Ed. p. 6.

† "For as actions are objects of our moral sentiment, so far only as they are indications of the internal character, passions and affections, it is impossible that they can give rise either to praise or blame, where they proceed not from these principles, but are derived altogether from external objects." Hume's *Inquiry concerning Human Understanding*, Section VIII Part ii (p. 368 of Hume's *Essays*, The World Library Edition).

నీతిమత్తరమైనను నాపని యొనర్చువానియభిప్రాయముంబట్టియే యుండును. (అనఁగా నతఁడాపని నేయుద్దేశముతోఁ జేయుచున్నాఁడో దాని నవలంబించియే యుండును)" అనువిషయమును 'మిల్లు' దొరగారుసైత మొప్పుకొని యున్నారు. కాని తనపక్షమును నిలుపుకొనుటకై "బాహ్యకర్మఫలమునం దేమియు భేదము లేనంతవఱకుఁ గర్త కాపనిఁ జేయవలయు ననుమానా దేనివలనఁ గలిగినను,కర్మ నీతిబాహ్యము గాకుండుటకు దానివలన నేమియు నాటంకము గలుగ"దని 'మిల్లు' దీనిపై యుక్తిఁ జెప్పుచున్నాఁడు. ‡ మిల్లుయొక్క యీయుక్తియందు సాంప్రదాయికసంబంధ మగునాగ్రహము గానవచ్చును. కారణ మేమనః—బుద్ధి వేఱుగనున్నప్పుడు రెండుకర్మలు నొక్కవిధముగఁ గాన్పించినను, యథార్థమున నవి యొకటేవెల గల వగుట యెప్పుడును సంభవింపదు. కావుననే "(బాహ్య)కర్మలలో భేదముండునంతవఱకు మొదటిది యగు'మిల్లు' చెప్పిననియమమే సర్వోత్తమ మగు"నని 'గ్రీన్'దొరగారు దీనికి సమాధానముఁ జెప్పిరి. $ గీతలోనియభిప్రాయము సైత మిదియే. కారణ మేమనః—ఇద్దఱొకధర్మకార్యముననే సమానముగ దానమిచ్చినప్పుడు—ఇరువురబాహ్యకర్మలు నన్నివిధముల నొక్కరీతిగనే యున్నను—ఇరువురయుద్దేశములును వేఱగుటచే నొకరిదానము సాత్త్వికముగను, మఱియొకరిది రాజసముగ నైన,లేక, తామసముగ నైనఁ గావచ్చునని గీతలలో నున్నది. అయిన నీ విషయమయి విశేషవిచారమును ముం దీదేశస్థులయొక్కయు, పాశ్చాత్యులయొక్కయు మతములను సరిచూచునపుడు చేయుదము. బొత్తిగఁ గర్మయొక్క బాహ్యపరిణామము నే యవలంబించి యుండెడియాధిభౌతికసుఖవాదముయొక్క శ్రేష్ఠమగుయుక్తులుసైతము నీతినిర్ణయనిమిత్తమున నెటుల సంపూర్ణము లగునో,యావిషయమే ప్రస్తుతము విచారింపఁదగినది; కావున దానిని సమర్థించుటకు వెనుక 'మిల్లు' చెప్పినవిషయమే యుత్తమ మగుయుక్తి యని తలంచెదను.

---

‡ "Morality of the action depends entirely upon the intention, that is, upon what the agent *wills to do.* But the motive, that is, the feeling which makes him will so to do, when it makes no difference in the act, makes none in the morality." Mill's *Utilitarianism.* p. 27.

$ Green's *Prolegomena to Ethics.* §. 292 note. p. 348. 5th Cheaper Edition.

“అనేకుల కధికసుఖ”మను నాధిభౌతికపథమునఁ గర్తయొక్క బుద్ధిని గుఱించి యేవిచారణ లేకపోవుట యనునది యన్నింటిలోఁ బెద్దదోషము. కారణ మేమన:—మిల్లుయొక్క యుక్తి సత్యమని యంగీకరించినను, కేవలబాహ్యఫలము ననుసరించియే నీతిని నిర్ణయించునీసిద్ధాన్తము కొన్నినియమములకు లొంగియున్నను (అనఁగా: ఏకదేశీయ మైనను), దాని నన్నిసందర్భములయందు సమానముగ నుపయోగించికొనుటకు వీలు గా దని, ‘మిల్లు’ వ్రాసినదానింబట్టియే సిద్ధ మగుచున్నది. మఱియు “స్వార్థముకన్నఁ బరార్థ మేల శ్రేష్ఠము? అది యెటుల సిద్ధించును?” అనువిషయమునకు నేమియు సమాధానమును జెప్పక యీసిద్ధాన్తము నవలంబించియే సర్వవిచారమును జేయుటవలన నుచ్చస్వార్థము (అనఁగ: నేర్పరియొక్క స్వార్థము) గొప్ప దని యనుటకు వీలు కలుగుననుమఱియొకయాక్షేపణ యీమతముపైఁ గలుగుచున్నది. స్వార్థపరార్థములు రెండును మనుష్యునితోఁబాటు నిర్మింపఁబడినవైనయెడల స్వార్థముకంటె నందఱయొక్కయు హితము గొప్ప దని యేల యొప్పుకొనవలయును? “అనేకుల కధికహితము దానిలో నున్నది గాన నటు లొనర్చు” మను సమాధానము తగినది కానేరదు. ఏలన: లోకహిత మొనర్చునపుడు చాలవఱకు మనకు నది హితమగును. కావున “అనేకులకధికసుఖమును నే నేల చేయవలయు?” ననుప్రశ్న పుట్ట దనుమాట సత్యమే యైనను, ఆయాధిభౌతికవాదమునఁ జెప్పఁబడినమూఁడవమార్గముకంటె నీనాలవమార్గమున నున్నభేద మిదియ కాఁబోలు! స్వార్థపరార్థములకు విరోధగు వచ్చినచో ‘ఉచ్చస్వార్థము’యొక్క మార్గము నంగీకరింపక స్వార్థమును వదలి, పరార్థమును సాధించుటకొఱకుఁ బ్రయత్నించుటయే ప్రతిమనుజునివిధి యని యనుట నాల్గవయాధిభౌతికవాదులమతము. “ఆధిభౌతికమతములో నుండునీభేదమునకు నెట్టిసమాధానముఁ జెప్ప నక్కఱయుండదా?” యంటి మేని యీయాటంక మాయాధిభౌతికపథములోనియొకవిద్వాంసునకుఁ దోఁచుటచే నతఁడు చిన్నపురుగు మొదలు మనుష్యునివఱకు నుండుసమస్త ప్రాణులయొక్క వ్యవహారపరిశీలన మొనరించి, “తనవలె తనసంతతిని, జ్ఞాతులను పరిపోషించుటయు; నెవరికి నపకార మొనర్పక తనబాంధవులకుఁ జేయఁగలిగినంత యుపకారముఁ జేయుటయు ననెడుగుణము చిన్నపురుగు మొదలు మనుష్యునివఱకు నంతకంత కెక్కువగఁ గాన్పించుచున్నది. కావున సజీవసృష్టియొక్క ప్రవర్తనలో నిదియ ముఖ్యమగు ధోరణిగఁ గన్పడుచున్నదని నుడువ వచ్చు” నని వచించెను. సజీవసృష్టిలో నీధోరణి తొల్తత “సంతతి నుత్పాదించుట—రక్షించుట” యను విషయములలోఁ గాన్పించుచున్నది. స్త్రీపురుషభేదము లేనిసూక్ష్మకీటకసృష్టిలో

సైత మొకకీటకదేహము వృద్ధిఁబొందుచుఁ బొందుచుఁ బగిలి రెండుకీటకము లగుచున్నది. లేక, సంతతికొఱకే (అనఁగా:పరులకై యే) యీచిన్న పురుగు తనదేహమును వదలి వేయుచున్నదని చెప్పినను జెప్పవచ్చును. అటులే సజీవసృష్టిలోనికీటకముల కన్నఁ బై మెట్టున నున్నవియు, స్త్రీపురుషరూపములు గలవియునగు ప్రాణులు సైత మీతీరుననే తమసంతతిని రక్షించుటకై స్వార్థత్యాగముం జేయుటవలన నానందము ననుభవించు చున్నవి. మఱియు నీగుణము క్రమక్రమముగ వృద్ధిని బొందుటచే మిక్కిలి మోటుతనము గలసంఘములలో సైతము సాహాయ్య మొనర్చుటకై సుఖముగనే ప్రవర్తించు చున్నారు. కావుననే సజీవసృష్టిలో శిరోమణి యగుమనుష్యుఁడు, 'పరార్థములోనే స్వార్థమునందువలె సుఖము ననుభవించుట' యనుసృష్టి యొక్క పైమెట్టు నెక్కుధోరణిని, మున్ముగ నడుపుచు స్వార్థపరార్థములవిషయములోఁ బ్రకృతము భాసించుచున్నవిరోధమును శీఘ్రముగఁ దీసివేయుటకుఁ బ్రయత్నింపవలయును. ఇదియే యీజగత్తున మనుజునకు ముఖ్యకర్తవ్యము. * యుక్తివాదము సరియైనదిగనే యున్నది. పరోపకార మనుసద్గుణము మూఁగజంతువుల (అనఁగా: తిర్యగ్జంతువుల)లో సైతము తమపిల్లలఁ బెంచునపుడు కానవచ్చుచున్నది. కావున జ్ఞానవంతు లగుమనుజులు దానిని పరమావధిగఁ బూర్తి యొనర్చుట యనునదియే పురుషార్థ మనుసిద్ధాంత మెంతయుం గ్రొత్తది కానేరదు. ప్రస్తుతకాలమునం దాధిభౌతికశాస్త్రజ్ఞానము మిక్కిలి వృద్ధిఁబొందుచుండుటఁజేసి యీసిద్ధాంతమున కాధిభౌతిక మైనసమాధాన మిచ్చి మిగుల యుక్తియుక్తముగఁ జెప్పవలసివచ్చి నను నది గొప్పసంగతియే. మనశాస్త్రకారులదృష్టి యాధ్యాత్మిక మైనను ప్రాచీనగ్రంథములలో—

శ్లో. "అష్టాదశపురాణానాం సారం సారం సముద్ధృతమ్
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్."

"పరోపకార మనునది పుణ్యము; మఱియు పరపీడ యన్ననది పాపము; ఇదియే యష్టాదశపురాణములయొక్క సారము" అని చెప్పఁబడినది. మఱియు భర్తృ

* ఈయుపపత్తి 'స్పెన్సరు' యొక్క Data of Ethics అనుగ్రంథము నందు వ్రాయఁబడినది. తనమతమునకు 'మిల్లు' మతమునకు నుండు భేదమును, స్పెన్సరు, మిల్లున కంపినలేఖయందు వ్రాసినప్రత్యుత్తరమును నీగ్రంథమున సుస్పష్టముగ వ్రాయఁబడినవి. pp. 57, 123. Also See Bain's *Mental and moral Science.* pp. 721, 722. (Ed. 1875).

మఱియు— "స్వార్థో యస్య పరార్థ ఏవ స పుమా నేక స్సతా మగ్రణీః." "పరార్థమే యెవరికి స్వార్థముగ నున్నదో వారే సత్పురుషులయందఱిలో శ్రేష్ఠు లగుదురు" అని చెప్పుచున్నాఁడు. ఇఁక నే మన: చిన్నకీటకము మొదలుకొని మనుష్యులవఱకును సృష్టియందుఁ బైపై మెట్టునెక్కుట యనుమార్గమును విచారించు నెడల "మానవులలోఁ బరోపకారబుద్ధి యనునొక సద్గుణముయొక్క యుత్కర్షమే వృద్ధినిఁ బొందినదా?, లేక, దానితోఁబాటు న్యాయబుద్ధి, దయ, విదగ్ధత, దూరదృష్టి, తర్కము, శౌర్యము, ధృతి, క్షమ, యింద్రియనిగ్రహము, మొద లగునితరము లగునేకసాత్త్వికగుణములకు సైతము క్రమాభివృద్ధి యైనదా?" యని మఱియొక ప్రశ్నము వెలువడును. ఈవిచారమును గమనించిన, నితరసజీవ ప్రాణులకంటె మనుష్యులలో సమస్తసద్గుణములు నధికముగ నున్న వని చెప్పవలసి వచ్చును. ఈసాత్త్వికగుణముల సమూహమునకు మన మిప్పుడే 'మనుష్యత్వ' మని పేరుఁ బెట్టుదము. పరోపకారముకంటె మనుష్యత్వ మీరీతిగ శ్రేష్ఠ మని స్థిరపడిన పిదప నేకర్మయొక్క యోగ్యతాయోగ్యతల నైనను లేక, నీతిమత్త నైనను, నిర్ణయించునపు డాయాకర్మ నొక్క పరోపకారబుద్ధిపద్ధతిచేతనే పరీక్షించుటకంటె, మనుష్యత్వముయొక్క—అనఁగ: మానవజ్ఞాతులలో నితరప్రాణులకంటె నేయే గుణములయాధిక్య ముండునని తోఁచుచున్నదో వానియన్నిటియొక్కయు—దృష్టితోఁ బరీక్షించుట యావశ్యకముగ నుండును. అనఁగా: ఒక్క పరోపకారబుద్ధి మీఁదనే యాధారమునుంచి యెటులైనను నిర్వాహము నను జేయుటకంటె, "అందఱియొక్కయు 'మనుష్యత్వ' మేకర్మచే వృద్ధిఁబొందున్నో, లేక, యా'మనుష్యత్వ' మేకర్మచే శోభించునో, యదియే సత్కృతత్యము; అదియే నీతిధర్మము" అని మన మిప్పుడు చెప్పవలయును. మఱియు నీవ్యాపక మగుదృష్టి, నొక్కసారి యొప్పుకొనినయెడల "అనేకుల కధికసుఖ" మనునది మనము నిర్ణయించిన మనుష్యత్వమున నొకయల్పభాగ మగును. కావునే యీయల్పదృష్టితో నన్ని పనులయొక్కయు ధర్మత్వాధర్మత్వములను విచారింపవల ననుమతము లేశ మైన నిలువ నేరదు. కావున మనుష్యత్వము నే ముఖ్యముగఁ జూడవలయునని తెలును. మఱియును మనుష్యత్వ మెందున్నదనువిషయముయొక్క సూక్ష్మవిచారమును సైతము చేయ నారంభింతు మేని యాజ్ఞవల్క్యులు చెప్పినటుల "ఆత్మా వా అరే! ద్రష్టవ్యః" అను ప్రశ్నయు సహజముగఁ దోఁచును. నీతిశాస్త్రశోధకుఁ డగునొక యమెరికా గ్రంథకారుఁడు సమచ్ఛయాత్మక మగుమనుష్యత్వధర్మమునకే "ఆత్మ" యని పేరిడి వ్యవహరించెను.

కేవలస్వార్థము (స్వీయమగువిషయసుఖము) అనెడి యత్యల్పమార్గమునుండి పైపైకిఁ బోవుచున్న యీయాధిభౌతికసుఖవాదులమతమునఁ బరోపకారము చిట్టచివరకు మనుష్యత్వపర్యంత మెటుల రావలసినదియు పూర్వోక్తవివేచనలవలన నెఱుంగనగును; కాని, మనుష్యత్వ మని చెప్పినను, నాధిభౌతికవాదులయొక్క మనస్సులలోఁ దలఁచుగ సర్వజనులకును బాహ్యవిషయసుఖముయొక్క కల్పనయే ప్రధానమగుటచే నంతశ్శుద్ధియొక్కయైనను, అంతస్సుఖముయొక్కయైనను విచారణయే చేయనియాధిభౌతికవాదులయొక్క యీకట్టకడపటిమార్గము మాయాధ్యాత్మికశాస్త్రకారులమతానుసారముగ నిర్దోషము గానేరదు. మనుజులసర్వప్రవృత్తియు సుఖప్రాప్త్యర్థమయి కాని, దుఃఖనివారణార్థమయి కాని జరుగు నని సామాన్యముగ నొప్పుకొనినను, "సత్యము, నిత్యము నైనసుఖమాధిభౌతికమా? (అనఁగ: ఐహికవిషయోపభోగమున నున్నదా?), లేక, మఱియొకదాని యందున్నదా?" యనుశంకకు సమాధానము ముందుగ నిర్ణయింపక, యేయాధిభౌతికపక్షము నైన నిర్ణయించుటకు వీలులేదు. శారీరకసుఖముకంటె మానసికసుఖముయొక్క యోగ్యత గొప్పదని యాధిభౌతికవాదులు సైత మొప్పుకొని యున్నారు. "పశువులనుభవింపఁదగినసుఖములనెల్ల నీకుఁ గలుగఁ జేసెద, నీవు పశువుగ నుండుట కొప్పుకొందువా?" యని యడిగిన నెవ్వఁడు నొప్పుకొనఁడు. అటులే తత్త్వజ్ఞానముయొక్క గూఢవిచారణచేఁ బొందఁబడినవిలక్షణ మగుబుద్ధిశాంతియొక్క యోగ్యత, యైహికసంపత్తికంటెను, బాహ్యవిషయోపభోగములకంటెను, వేయంత లెక్కువగ నుండు నని జ్ఞాను లగువారికిఁ జెప్ప నవసరము లేదు. మంచిది! లోకమతమును జూతు మేని యచ్చో సైతము నీతిమత్త, కేవల సంఖ్యను మాత్రమే యవలంబించి యుండదు. మనుష్యుఁ డొనర్చున దంతయు నాధిభౌతికసుఖముకొఱకే చేయునుగాని యాధిభౌతికసుఖ మనునది పరమసాధ్యమనెడుసిద్ధాంతము మాన్యమని లోకమంతయు నొప్పునటుల తోఁపదు. బాహ్యసుఖమునే కాక జీవితాశను సైతము నిర్లక్ష్యముగ వదలి, యాయాసందర్భములయందాధ్యాత్మికదృష్టితోఁ జూచిన, దానికంటె నధిక యోగ్యత గలసత్యము మొదలగు నీతిధర్మములను బాలించునంతటిమనోనిగ్రహ ముండుటచేతనే, యామనుష్యుని యందు 'మనుష్యత్వ' ముండునటుల మన మెఱుంగవలయును. మఱియు నర్జునుని ప్రశ్నము సైతము "యుద్ధము సేయుటవలన నెవరి కెంత సౌఖ్యము కలుగు?" నని కానేరదు. పు తెల్పి యన:—"నాయొక్క (అనఁగ: నాయాత్మయొక్క) శ్రేయము

దేనియం దున్నదో నా కెఱుంగఁజేయుము" (గీ. ౨. ౭; ౩. ౨) అని శ్రీకృష్ణు నడిగెను. ఆత్మకు శాశ్వతమగు శ్రేయ మైనను, సుఖ మైనను నాత్మ యొక్క శాంతి యందే యున్నది. కావుననే, యైహికసుఖమైనను, సంపత్తి యైనను, నేమాత్రము లభించిన నామాత్రముచేతనే యీయాత్మకు సుఖ మైనను శాంతి యైనను గలుగు ననెడియాశ లేదు. "అమృతత్వస్య తు నాశా౽స్తి విత్తేన"అని బృహదారణ్యకోపనిషత్తులో నున్నది (బృ. ౨. ౪. ౨). కఠోపనిషత్తులో నచికేతునకుఁ బుత్త్రులు, పౌత్త్రులు, పశువులు, ధనము, ధాన్యము మొదలగు ననేకవిధము లగు నైహికసంపదల నిచ్చుటకు మృత్యువు సిద్ధమై యుండఁగ "ఆత్మవిద్యయే నాకుఁ గావలయును, సంపద వలదు."అని నచికేతువు మృత్యువునకు స్పష్టముగ నుడివెను. మఱియు "ప్రేయ"మనఁగా: "ఇంద్రియములకు సుఖ మని తోఁచు నైహిక ప్రీతి" యనియు, "శ్రేయ"మనఁగా: "ఆత్మయొక్క నిజ మగుకల్యాణమే" యనియు, రెంటిని విడదీసి—

"శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతస్తౌ సంపరీత్య వివినక్తి ధీరః,
శ్రేయో హి ధీరో౽భిప్రేయసో వృణీతే ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే." (కఠ. ౧. ౨. ౨)

"ప్రేయము (తాత్కాలిక మగు బాహ్యేంద్రియసుఖము), శ్రేయము (సత్యమ్ముఁ జిరకాలికమునగుకల్యాణము) అనునవి మనుష్యునెదురుకొని వచ్చె నేని, జాగ్రత్తగలవాఁ డీరెంటిలో శ్రేయమునే కైకొని, ప్రేయమును తక్కువదానిగఁ దలఁచును. తెలివిలేనివాని కాత్మకల్యాణమునకంటె ప్రేయమే (అనఁగ: బాహ్యసుఖమే) యెక్కువదై తోఁచు"నని చెప్పఁబడినది. కావుననే సంసారములో నున్న యింద్రియగమ్యము లగువిషయసుఖములే మనుష్యుల కీలోకమునఁ బరమసాధ్యములనియు, మనుష్యుఁడు చేయున దంతయు బాహ్యసుఖముకొఱకును (అనఁగ ఆధిభౌతికసుఖముకొఱకును), దుఃఖనివారణముకొఱకునే చేయుచున్నాఁడనియు జెప్పుట యోగ్యము కానేరదు.

ఇంద్రియగమ్య మగు బాహ్యసుఖమునకంటె, బుద్ధిగమ్య మగునంతస్సుఖమున కైనను, ఆధ్యాత్మికసుఖమున కైనను యోగ్యత యధికమగుటయే కాక, నిత్యముండునది విషయసుఖము లే పుడుండ నేరదు. అనఁగా: అదియనిత్యము. నీతిధర్మముయొక్క విషయ మట్లు కానేరదు. అహింస, సత్యము, మొదలగుధర్మములు బాహ్యోపాధి

(అనఁగ: బాహ్యసుఖదుఃఖములనే) యవలంబింపక యెల్లప్పు డేకరీతిగ నన్ని సందర్భములలోను సంబంధించు చున్నవి. కావుననే నిత్యములుగ నుండు నని యందఱు నొప్పుకొనియే యున్నారు. "బాహ్యవిషయము నవలంబించి యుండనియన్నినీతి ధర్మములకు నిత్యత్వ ముండుటకుఁ గారణ మేమి? లేక, యవి యెచ్చో నుండి వచ్చినవి?" అనువిషయముల కాధిభౌతికవాదముచే నేమియు సమాధానము కుదురదు. కారణ మేమనఁగా: బాహ్యసృష్టియం దున్న సుఖదుఃఖము లన్నియు స్వభావమ్ము చేతనే యనిత్యము లగుటచే వానిదుర్బలము లగుపాదములపైఁ రచింపఁబడిననీతి సిద్ధాంతములును మిక్కిలి దుర్బలము లైన వగును (అనఁగా: అనిత్యము లగును). మఱియు నాకారణమున సుఖదుఃఖములవిచారణఁ జేయక, "సత్యమునిమిత్తమై ప్రాణము పోయినను యుక్తమే యగు" ననుసత్యధర్మమును సంబంధించినత్రికాలాబాధిత మగునిత్యత్వ మనునది "అనేకుల కధికసుఖము" అనుసిద్ధాంతముచే సిద్ధము కానేరదు. సామాన్యవ్యవహారమున సత్యమునకై ప్రాణము నీయవలసినసమయము తటస్థించినచో, గొప్పగొప్పవారుసైత మసత్యమునే యాశ్రయించు చున్నారు. మఱియు శాస్త్రకారులుసైత మాసమయములందు మిక్కిలిపట్టుదల గలిగి యుండరనువిషయమును మనము చూచినను, సత్యాదిధర్మములు నిత్యము లని యొప్పుకొనవలసినయవసరము లే దని దీనిపై ననేకులు పూర్వపక్షమును జేయుదురు; కాని యీయుక్తివాదము సరిలేదు. కారణ మేమన: సత్యముకొఱకుఁ బ్రాణముల నిచ్చునంతటిధైర్యము లేనివారును, బ్రాణముల నిచ్చుట కిష్టము గలవారును, ఈనీతిధర్మము యొక్క నిత్యత్వమును దమంతట తామే యొప్పుకొనుచున్నారు. ఈకారణముననే మహాభారతములో నర్థకామాదిపురుషార్థములను దప్పక నిచ్చవ్యావహారికము లగు నన్నిధర్మములయొక్క విచారణను జేసి తుదకు, భారతసావిత్రిలోను, విదురనీతిలోను సైతము వ్యాసులు—

శ్లో. "న జాతు కామా న్న భయా న్న లోభాత్ ధర్మం త్యజే జ్జీవితస్యాపి హేతోః ।
ధర్మో నిత్య స్సుఖదుఃఖే త్వనిత్యే జీవో నిత్యో హేతు రస్య త్వనిత్యః ॥"

"సుఖదుఃఖము లనిత్యములు; గాని (నీతి) ధర్మము నిత్యము. కావుననే సుఖేచ్ఛచే నైన, భయముచే నైన, లోభముచే నైనఁ బ్రాణముఁ బోఁగొట్టుకొనవలసినంత సమయమునం దైనను ధర్మము నెప్పుడును విడువరాదు. జీవము తొలుతనుండి నిత్యమైన దగుటచే సుఖదుఃఖాదివిషయము లనిత్యములే యగును. కావుననే యనిత్యము

లగుసుఖదుఃఖముల్ల విచారించుచుండక, నిత్యము లగుజీవములయొక్క ధర్మసంబంధమును సైతము తప్పక జత్తపఱచి యుండవలయును" అని యందఱకు నుపదేశించిరి (మ. భా. స్వ. ౫. ౬౦; ఉ. ౩౯. ౧౨-౧౩). వ్యాసులవారియీయుపదేశ మెంతవఱకు యోగ్యమైన దనువిషయమును జూచుటకై "సుఖదుఃఖముల నిష్కృష్టస్వరూప మేమై యుండును? మఱియు దేనిని నిత్యసుఖమని చెప్పవలయును?" అనువిచార మిప్పు డొనర్పవలయును.

ఇది యాధిభౌతికసుఖవాద మను చతుర్థప్రకరణము.



# పంచమ ప్రకరణము.

## సుఖదుఃఖవివేకము.

"సుఖ మాత్యంతికం య త్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్"*

గీతా. ౬. ౨౧.

"ఈజగత్తునందుఁ బ్రతిమనుజుఁడును, 'సుఖ మెట్లు కలుగును?' లేక, 'ప్రాప్తమైనసుఖ మెట్లు వృద్ధిఁబొందును?' లేక, 'దుఃఖ మెట్లు పోవును?' లేక, 'యెట్లు తలఁగును?' అనువిషయమున నే యెల్లప్పుడు పరిభ్రమించుచుండును." అను సిద్ధాన్తము మనశాస్త్రకారులకు సమ్మతమే యగును. "ఇహ ఖ ల్వముష్మింశ్చ లోకే వస్తుప్రవృత్తయ స్సుఖార్థ మభిధీయంతే. న హ్యాతః పరం త్రివర్గఫలం విశిష్టతర మ స్తి." "ఈలోకమున నైనను, బరలోకమున నైనను సర్వప్రవృత్తులును సుఖము కొఱకే యగును. ధర్మార్థకామములకు వీనికంటె వేఱగుఫలము లేదు." (మ. భా. శాం. ౧౯౦. ౯). అని శాంతిపర్వములో భృగువు భరద్వాజునకుఁ జెప్పియు న్నాఁడు; కాని తమకు నిజ మగుసుఖ మెందుండునదియు నెఱుంగక పోవుటచే మాయనాశెమ్ములను గొంగున్నఁ గట్టుకొని యవియే సత్యము లైనవని నశించువాని వలెఁ గాని, లేక, సుఖము నాకు లభించునని యాశించువానివలెఁ గాని, మను జుఁడు తనజీవితకాలము ముగిసి ప్రాణములు కంఠగతము లైనను, మృత్యు వక స్మాత్తుగఁ బై కుఱికినను, వేఱొకయాలోచననే చేయక వెనుకటి దురాశా గ్రంథము నే మనస్సున వల్లెవేయుచుండును. మఱియు నీతీరున సంసారచక్రము తిరుగుచుండుటచే సత్యము, నిత్యము నగుసుఖ మేది యని యెవరును విచా రము సేయ రని యీశాస్త్రకారులయభిప్రాయము. "సంసారము బొత్తిగ దుఃఖమయముగ నున్నదా? లేక, సుఖప్రధానముగఁ గాని, దుఃఖప్రధానముగఁ గాని యున్నదా?" యనువిషయమై తత్త్వజ్ఞానులగు నీదేశస్థులకును, పాశ్చా త్యులకును నత్యంతము మతభేదము లున్నవి. ఈయుభయపక్షములలో దేనిని గ్రహిం

* ఏది బుద్ధిచేతనే గ్రాహ్య మగుచు నింద్రియాతీత మగునో, అదియే యాత్యంతికసుఖము.

చినను ప్రతిమనుజుఁడును దనకు దుఃఖప్రాప్తి కలుగకుండ మిక్కిలి సుఖమే సంప్రాప్తమగునటుల చేసికొనుటయే నిశ్శ్రేయసమని తలంచు ననువిషయమున నెవరికిని మతభేదము కానరాదు. 'సుఖ' శబ్దమునకు మాఱుగ 'హితము', 'శ్రేయము', లేక, 'కల్యాణ'మని యధికముగఁ బ్రయోగించుట వాడుకలో నున్నది. మఱియు వానిలోనిపరస్పరభేదములు ముందుఁ జెప్పఁబడును. అయినను 'సుఖ' శబ్దార్థమునందే సర్వవిధములగు సుఖములకు నైన, లేక, కల్యాణములకునైన సమావేశ మగునని యంగీకరించిన, సామాన్యముగ మనుజునియొక్క ప్రయత్నము లన్నియు సుఖార్థమే యగుననుమతము సర్వజనగ్రాహ్యమే యగు ననుట కేయాటంకము నుండదు; కాని, యంతమాత్రముచే—

"య దిష్టం త త్సుఖం ప్రాహు ర్ద్వేష్యం దుఃఖ మి హేష్యతే" "ఏది మన కిష్టంబో యది సుఖము; మన మెద్దాని ద్వేషింతుమో యది, (అనఁగా: మన కేది వలదో యది) దుఃఖము;" (మ.భా.శాం.౧౩౯.౬౭) అని మహాభారతాంతర్గతపరాశరగీతలలో నున్న సుఖదుఃఖములలక్షణములు శాస్త్రదృష్టిచేఁజూచిన, నేమియు దోషరహితములు గా నేరవు. కారణ మేమి యన: ఈవ్యాఖ్యానములో నున్న 'ఇష్ట' శబ్దార్థము, 'ఇష్టవస్తువు', లేక, 'యిష్టపదార్థ' మని చెప్పుటకు శక్య మగును. ఇంతియ కాక, యిష్టపదార్థమును సైతము సుఖ మని చెప్పుట ప్రాప్తమగును. ఉదాహరణము:—దప్పి యైనచో మన కుదక మిష్ట మైనను, 'జం' మనుబాహ్యపదార్థమునకు 'సుఖ'మను పేరిడుట యుక్తము గా నేరదు. అట్లగు నేని యేటిలో మునిఁగినమనుజుఁడు సుఖములో మునిఁగినాఁ డని చెప్పవలసినదగును. జలపానమువలనఁ గలిగినయింద్రియతృప్తియే సుఖ మగును. ఈ 'యింద్రియతృప్తి', లేక, 'సుఖము' మనుజులకుఁ గావలయు నని తోఁచుట సత్యమే; కాని, దానిమూలమున నేదేది కావలయు నని తోఁచునో యది యంతయు సుఖముగనే యుండవలయు నని వ్యాప్తిచే (వ్యాపకముగ) సిద్ధాంతీకరించుట యుక్తము గా నేరదు. కావుననే నైయాయికులు— "అనుకూలవేదనీయం సుఖం"— "ఏజ్ఞానము మన కనుకూలమగునో యదియే సుఖము"— "ప్రతికూలవేదనీయందుఃఖం"— "ఏజ్ఞానము(వేదన) మనకుఁ బ్రతికూల మగునో యదియే దుఃఖము"—అని వ్యాఖ్యానముఁ జేసి సుఖదుఃఖము లనునవి రెండును నొకవిధ మగు వేదన యని నిశ్చయించిరి. ఈ వేదనలు తొలుత నుండియు (అనఁగా: పుట్టినది మొదలు) సిద్ధములును, కేవల మనుభవగమ్యములు నగుటచే నైయాయికులయొక్క యీవ్యాఖ్యానముకంటె సల్లక్షణము సుఖదుఃఖములకుఁ జెప్పుట సాధ్యము కానేరదు. ఈ వేదనారూపము లగుసుఖదుఃఖములు

భౌతిక మనుష్యులవ్యాపారముచేతనే వెలువడు ననునియమము లేదు. ఇఁక నేమన: ఒకానొకప్పుడు కొందఱు దేవతలకోపముచేఁ గూడ ననివార్యము (దుర్ధరము)లగు రోగము లుత్పన్నములగుటచే వానిదుఃఖము మనుజు లనుభవింపవలసివచ్చును. కావున నే వేదాన్తగ్రంథములయం దీసుఖదుఃఖములు సామాన్యముగ నాధిదైవికములు, నాధిభౌతికములు, నాధ్యాత్మికము లని త్రివిధములుగ విభజింపఁబడినవి. వానిలో దేవతలప్రసాదకోపములచే నేసుఖదుఃఖము లనుభవింపవలసివచ్చునో, వాన్నికి సామాన్యముగ నాధిదైవికము లని పేరిడిరి. బాహ్యసృష్టిలో నున్నపృథివ్యాదిపంచమహాభూతాత్మకపదార్థములకును మనుజుల యింద్రియములకును సంయోగముగలుగుటచే వెలువడుశీతోష్ణాదులద్వారముగ సంప్రాప్తము లగుసుఖదుఃఖములకు నాధిభౌతికము లని పేరిడిరి. మఱియు నిట్టివియు, బాహ్యసంయోగము లేకయే యుద్భవించినవియు నగునితరసర్వసుఖదుఃఖముల నాధ్యాత్మికము లని యందురు. సుఖదుఃఖములకు నీవిభాగ మంగీకరింపఁబడినయెడల, శరీరమున వాతపిత్తాదుల స్థితి చెడుటచేఁ గలుగుజ్వరాదిదుఃఖముల యొక్కయు, అవి సామ్యావస్థనుండుటచే ననుభవగోచర మగుశరీరప్రకృతియొక్కయు స్వాస్థ్యగణన యాధ్యాత్మికసుఖదుఃఖములలోఁ జేయవలసివచ్చును. కారణ మేమన: ఈసుఖదుఃఖములు పంచభూతాత్మకస్థూలశరీరములో (అనఁగా: శరీరమునందే) ఉండినను శరీరముకంటె బాహ్య మగు పదార్థములసంయోగముచే నుద్భవిల్లుచున్నవని నియతముగఁ జెప్పుటకు సాధ్యము కానేరదు. మఱియు నాకారణముచే నాధ్యాత్మికసుఖదుఃఖములలో సైతము శారీరకము లనియు, మానసికము లనియు, వేదాన్తదృష్టిచే మరల విభజింపవలసివచ్చును; కాని యీతీరున సుఖదుఃఖములకు విభాగ మొనర్చినయెడల నాధిదైవికసుఖదుఃఖములు వే ఱనిచెప్ప నావశ్యకము గాదు. కారణ మేమనఁగ: దేవతలయనుగ్రహముచే నైనను, నిగ్రహముచే నైనను సంభవించుసుఖదుఃఖములు సైతము తుదకు మనుజులు శరీరముచే నైనను, లేక, మనస్సుచే నైనను ననుభవింపవలయు ననువిషయము (సంగతి) స్పష్టముగనే యున్నది. కాన వేదాన్తగ్రంథములలోని పరిభాషల ననుసరించి సుఖదుఃఖములను ద్వివిధముగ విభజింపక, వానికి బాహ్యములు, లేక, శారీరములు-అభ్యంతరములు, లేక, మానసికములు, అని రెండువర్గములను గల్పించి మొదటివానికి (అనఁగా: సర్వవిధము లగుబాహ్యములు, లేక, శారీరము లగు సుఖదుఃఖములకు) నాధిభౌతికము లనియు, సకలాభ్యంతరములు, లేక, మానసికములగు సుఖదుఃఖములకు నాధ్యాత్మికము లనియుఁ బే ళ్లీగ్రంథములో నాచే యోజింపఁబడి

నవి. వేదాన్తగ్రంథములో నున్నపరిభాష ననుసరించి యాధిదైవిక మని మూఁడవ వర్గీకరణమును వదలినాఁడను. కారణ మేమియనఁ: మాపమతమున సుఖదుఃఖముల శాస్త్రీయవివేచనఁ జేయుటకు నీద్వివిధవర్గీకరణమే యధికోపయుక్తమగును. ముందు సుఖదుఃఖవివేచనఁ జదువునపుడు వేదాన్తగ్రంథములయొక్కయు, మాయొక్కయు పరిభాషయందలియీభేదమును గుర్తుంచుకొనవలయును.

సుఖదుఃఖములు ద్వివిధము లన్నను, త్రివిధము లన్నను బాధ లేదు. దుఃఖముమాత్ర మెవరికిని వల దనియే యుండును. కాన సర్వవిధములగు దుఃఖములను బొత్తిగ నివర్తింపఁజేసికొనుటయు, నిత్యము అత్యంతికము నగు సుఖము లభించునటుల చేసికొనుటయు ననునదియే, మనుజునకుఁ బరమపురుషార్థ మని వేదాన్త- సాంఖ్యశాస్త్రముల రెంటియందును ప్రతిపాదింపఁబడినది (సాం. కా. ౧; గీ. ౬.౨౧-౨౨). "అత్యంతికసుఖమే పరమసాధ్య మని యిటులు నిర్ణీతమైనపిదప సత్యమును, నిత్యము నగు సుఖమేదని చెప్పవలయును? ఆసుఖము లభించునా? లభింపదా? లభించె నేని యెట్లు?ఎప్పుడు?" ఇత్యాదివిషయవిచారణ సహజముగనే కలుగును. మఱియు నీవిచారణ యారంభింపఁబడె నేని తొలుతనే నైయాయికలక్షణానుసారముగ " 'సుఖదుఃఖము'లను నీరెండును వేర్వేఱును, స్వతంత్రములు నగు వేదనలా? అనుభవములా? లేక, వస్తువులా"? యనియు, "వెలుతురు లేకపోవుటయే 'చీఁకటి' యన్నన్యాయమురీతి నీరెండు వేదనలలో నొకదానియభావమే రెండవదానిస్వరూపమా?" యనియుఁ బ్రశ్నలు వెలువడుచున్నవి. దాహముచే నోరెండిపోయిన, అదుఃఖనివారణకొఱకై రుచి గలజలమును పానముఁ జేసినటులును, ఆఁకలి యాయెనేని మంచియన్నమును భుజించి యాపీడను నివర్తింపఁజేసికొనినట్లును, కామవాసన ప్రదీప్తమై దుస్సహ మగునేని స్త్రీసంగమముచేఁ దృప్తుల మగుచున్నామని చెప్పి భర్తృహరి తుద కిటుల వచించెను.—

"ప్రతీకారో వ్యాధేః సుఖ మితి విపర్యస్యతి జనః"

"వ్యాధియో, దుఃఖమో యేదియో సంప్రాప్త మగు నేని, దానినివారణయె సుఖ మని లోకులు చెప్పుదురు." దుఃఖనివారణాతిరిక్త మగుసుఖపదార్థము వేఱుగ కానరాదు. మనుజుఁడు స్వార్థమై యేవ్యవహారమును జేయుచున్నాఁడో దానికి మాత్రమె యీన్యాయము సంబంధించునది కానేరదు. ఇతరున కుపకారముఁ జేయువేళ నతనిదుఃఖమ్మును జూచి మనమనస్సున నుద్భవిల్లినకారుణ్యవృత్తి

దుస్సహ మగు నేని యాదుస్సహత్వపీడానివృత్తికొఱకై మనము పరోపకారముఁ జేయుదు మని యానందగిరిస్వామిమత మని పూర్వప్రకరణములోఁ జెప్పఁబడినది. ఈపక్షమే స్వీకరింపఁబడె నేని మహాభారతమున నొకస్థలమునందు:—

"తృష్ణార్తిప్రభవం దుఃఖం దుఃఖార్తిప్రభవం సుఖమ్."

(శాం. ౨౫. ౨౨; ౧౭౪. ౧౯.)

"ఏదైన నొకయాశ ప్రథమమున నుత్పన్నమై, దానిపీడచే దుఃఖమును, ఆదుఃఖపీడచే నుత్తరత్ర సుఖము నుద్భవించును"—అని సుఖదుఃఖము లెటుల వర్ణింపఁబడినవో, యదియే యథార్థమని చెప్పవలసి వచ్చును. "ప్రథమమున మనుజునిమనంబున నొకానొకయాశ, లేక, వాసన, లేక, తృష్ణ గాని యుత్పన్న మగును. దానివలన దుఃఖ మగు నేని యాదుఃఖనివారణమే సుఖ మగును. సుఖమన: వేఱైనస్వతంత్ర పదార్థము లేదని యిందలియభిప్రాయ"మని సారాంశము. విశేషమేల చెప్పవలయును? సంసారమం దున్నమానవుల సర్వప్రవృత్తులు వాసనాత్మకములే, లేక, తృష్ణాత్మకములే యగుటచే సర్వసాంసారికకర్మలను త్యాగముఁ జేయనియెడల తృష్ణాబీజము సంపూర్ణముగ నిర్దగ్ధము కానేరదు. మఱియుఁ దృష్ణాబీజము నిశ్శేషముగ నష్టము కానినాఁడు, సత్యమును, నిత్యము నగుసుఖప్రాప్తి యగుట సంభవింపదనియు, ఇంతకంటె నెక్కువగనే యేతన్మార్గావలంబులచే నూహచేయఁబడినది. బృహదారణ్యకోపనిషత్తులో వికల్పముగను (బృ. ౪. ౪. ౨౨; వే. సూ. ౩. ౪. ౧౫), మఱియు జాబాల - సన్న్యాసాద్యుపనిషత్తులలో ముఖ్యముగను నిదియే మార్గము ప్రతిపాదింపఁబడి యుండుటచే, అష్టావక్రగీతలలోను (౯. ౮; ౧౦. ౩-౮), అవధూతగీతలలోను (౩. ౪౬), ఈయర్థమేయనువాదము సేయఁబడినది. ఎవని కాత్యంతికసుఖము (మోక్షము)నే సంపాదింపవలయునని యభిప్రాయము గలుగునో వాఁడు శక్యమగునంత వేగముగా, సంసారమును వదలి సన్న్యాసమును గ్రహింపవలయునని యీమార్గముయొక్క చరమసిద్ధాన్తమై యున్నది. శ్రుతిగ్రంథములలో వర్ణింపఁబడినవియు, శ్రీశంకరులచే నీకలియుగమున స్థాపింపఁబడినవియునగు శ్రౌత-స్మార్త-కర్మ-సన్న్యాసమార్గము లీసిద్ధాన్తము ననుసరించియే వెలువడినవి. ఇందువలన సుఖ మనువాస్తవ మగుపదార్థమే లేదనియు, ఉన్నదంతయు దుఃఖమే యనియు, అదియు తృష్ణామూలక మనియుఁ, గావుననే యీతృష్ణాదివికారములనే మున్నుసమూలముగ నశింపఁజేసినఁగాని 'స్వార్థపరార్థము'లనుసుప ద్రవము నశించి మనస్సునకు మూలసామ్యావస్థ (అనఁగా: శాంతి యనున

దిరమ్) మిగిలి య్యుండదనియు విస్పష్ట మగుచున్నది; మఱియు నీయభిప్రాయము ననుసరించియే మహాభారతాంతర్గతశాంతిపర్వములో పింగలగీతలలోను, మఱి తీరున మంకిగీతలలోను—

"శ్లో. యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహ త్సుఖమ్
తృష్ణాక్షయసుఖ స్యైతే నార్హత ష్షోడశీం కలామ్."

"ఇహలోకములో కామముయొక్క, (అనఁగా: వాసనయొక్క) తృప్తిచే నావిర్భూత మగుసుఖము యొక్కయు, స్వర్గమునందలిమహాసుఖముయొక్కయు, యోగ్యత తృష్ణాక్షయముచే లభించుసుఖముయొక్క పదియాఱవకల (భాగ)యంత యైనను గానేర" దని చెప్పఁబడినది(శాం. ౧౭౪. ౪౮; ౧౭౭;౪౯). వైదికసన్న్యాస మార్గధర్మములే జైనులు, బౌద్ధులు మొదలగువారిచే ననుకరింపఁబడినవి. కావున నే యీయుభయగ్రంథములయందుఁ దృష్ణయొక్క దుష్పరిణామమును, త్యాజ్యత యును, పూర్వోక్తరీతిగ—వేయేల? సరసముగనే వర్ణింపఁబడినవి. (ఉదాహరణార్థమై 'ధమ్మపదము'నం దున్నతృష్ణావర్గమును జూడుము). టిబెట్ దేశమునం దున్న బౌద్ధధర్మగ్రంథములలోఁ జూచినయెడల మహాభారతమునందున్న పూర్వోక్తశ్లోకమే గౌతమబుద్ధునకు బుద్ధత్వము సంభవించినపిదప వానిచే వాక్రువ్వఁబడి నటుల చెప్పఁబడినది. *

పూర్వోక్తతృష్ణాపరిణామము భగవద్గీతాంగీకారమును సైతము వడసినదే. అయినను దానిని తప్పించుకొనుటకుఁ గర్మలను బొత్తిగ వదలుట యుచితము గాదని గీతాసిద్ధాంత మగుటచే సుఖదుఃఖములయొక్క వెనుకఁ జెప్పఁబడినయుక్తుల నిచ్చో సూక్ష్మముగ విచారింపవలయును. తృష్ణ మొదలగుదుఃఖములనివృత్తిచేతనే యన్నిసుఖములు కలుగునేనియు, సన్న్యాసమే ముక్తికి సాధన మనియుఁ గొంద అందురు. ఆమాట మున్నన్నివిధములచేతను సత్యమని నుడువుటను సాధ్యము కానేరదు. ఒక్కపరి యనుభవింపఁబడిన (చూడఁబడినవి, వినఁబడినవి మొదలగు)వస్తువులు మరలఁ గావలయుననుకోరిక పొడముట, 'కామము', 'వాసన,' లేక, 'యిచ్ఛ'

* Rockhill's Life of Budda P. 33. 'ఉదానము' అనుపేరు గలపాలీగ్రంథమున (2.2) ఈశ్లోక మున్నది; కాని యీశ్లోకము బుద్ధత్వము ప్రాప్తమగుసమయమునందు బుద్ధునివాక్కునందుండి వెలువడినదని వర్ణింపఁబడలేదు. దీనింబట్టి యీశ్లోకము ఆదిబుద్ధునిముఖమునందుండి వచ్చినది గాకయే యుండునని స్పష్టముగఁ గాన్పించుచున్నది.

దుస్సహ చెప్పుదురు. ఇష్ట మగుపదార్థము శీఘ్రముగ లభింపనియెడల దుఃఖము కలుఁ జేయుట. అందుచే నీయిచ్ఛ తీవ్రమగుచుండును. లేదా, లభించినసుఖము చాలక యుపర్యధికముగఁ గావలయు ననుకోరిక యేని పొడమును. ఈయిచ్ఛలరెంటికే తృష్ణ యనునామము ప్రాప్త మైనది; కాని కేవల మిచ్ఛ కీరీతిగఁ దృష్ణాస్వరూపప్రాప్తి కాకమునుపే యాయిచ్ఛ పూర్ణ మైనయెడల దానివలనఁ గలుగుసుఖము తృష్ణాదుఃఖ క్షయమువలన నైన దని నుడువుటకు సాధ్యము కానేరదు. ఉదాహరణ మేమి యన: అనుదినము నియత మగు సమయమునందె భుజించిన, ప్రతిదినమునందును భోజనమునకు ముందు మనకు దుఃఖము గలుగు నని మనయనుభవమున లేదు. నియత కాలమున భోజనము లభింపనిపక్షమున జీవ మాఁకలిచే వ్యాకులమగును. లభించిన వ్యాకులపడదు. మంచిది తృష్ణకు నిచ్ఛకు నిట్టిభేదమును జెప్పక, రెండును సమా నార్థనములే యని యంగీకరించిన, అన్నిసుఖములు తృష్ణామూలకములే యనుసిద్ధా న్తము స్థిరపడనేరదు. ఉదాహరణ మేమన: ఒకానొకబాలునినోట పటికబెల్లపు ముక్కను హఠాత్తుగఁ బడవేసినపుడు దానివలన వానికిఁ గలుగు సుఖము వెనుక నుండు తృష్ణాక్షయమువలనఁ గలిగినదని చెప్పుటకు సాధ్యము కానేరదు. ఇటులే మన మేత్రోవనకైనఁ బోవునపుడు, దారిలో రమ్య మగునొకయుద్యానవన ముండి యందు మనోహరము లగుకోకిలధ్వను లాకస్మికముగ వీనులకు సోకినఁ గాని, లేక, యాదారిలోనే యొకదేవాలయముండి యందు దేవునిరమ్య మగువిగ్రహము గాన్పిం చినఁగాని, మనమనంబునకుఁ గలుగు సంతోషరూప మగుసుఖ మంతకుఁ బూర్వమే గలిగిన తృష్ణాదుఃఖము శాంతించుటవలనఁ గలిగినది కా దనువిషయము, మనయను భవములో నుండునదియే. ఈయుదాహరణము గుర్తుంచుకొందుమేని, సన్యాస మార్గమం దున్నపూర్వోక్త మగుసుఖశబ్దవ్యాఖ్యానమును వదలి "ఇంద్రియములకు వస్తువులయం దుండు మంచిచెడుగుల గ్రహింపఁ జేయుశక్తి స్వాభావికముగ నుండును గాన, తదనుసారముగ నింద్రియములు దమతమవ్యాపారములఁ జేయు చుండ, వానికొకసమయమునం దనుకూలముగను, మఱియొకసమయమునం దనను కూలముగను విషయము ప్రాప్తమగును గావున నదివఱకుఁ దృష్ణ, లేక, యిచ్ఛ లేక పోయినను మనకు సుఖదుఃఖములు కలుగు" నని చెప్పవలసివచ్చును. ఈయభిప్రాయ మునె మనస్సున నిడుకొని "మాత్రాస్పర్శ"ముచే శీతోష్ణాదికముల యనుభవములు గలుగుటవలన సుఖదుఃఖము లుద్భవిల్లు" నని గీతలలో జెప్పఁబడినది. (గీ. ౨. ౧౪.) సృష్టిలోని బాహ్యపదార్థములకు 'మాత్ర' యని పేరు. ఈబాహ్యపదార్థ

ములకు నింద్రియములకు సంయోగ మగునేని సుఖరూపము, లేక, దుఃఖరూప
మగు వేదన యుత్పన్నమగు నని దీనియర్థము; అదియే కర్మయోగముయొక్క
సిద్ధాంతము. "చెవులకు కఠినధ్వని యేల యప్రియము గావలయును? నాలుకకు
మధురరసము ప్రియమగు టెట్లు? నేత్రములకుఁ బున్నమనాఁటి వెన్నెల యానంద
దాయకముగఁ దోఁపనేల?" అను ప్రశ్నలకు సమాధాన మెవ్వరును జెప్పలేరు.
జిహ్వకు మధురరసము లబ్ధమైనఁ దృప్తి కలుగు నని మాత్రమె మనకుఁ దెలి
యును. ఆధిభౌతికసుఖస్వరూప మీరీతిఁ గేవల మింద్రియాధీన మగుటచేఁ బిదప
దానిపరిణామ మేమైనను ననేకసమయములయం దట్టివ్యర్థ మగునింద్రియ వ్యాపా
రము నడచుటలోనే సుఖ మున్నటుల దోఁచును. ఉదాహరణ మేమనఁగా:
మన మేదేని యొకయాలోచనఁ జేయునపుడు తఱచుగ మన కలవాటగుశబ్దము
(మాటలు)లప్పు డప్పుడు మననోటనుండి యప్రయత్నముగ వచ్చినను మనయాలో
చన లితరుల కేమియుఁ దెలియఁజాలవు. మఱియొకప్పుడు వీనికి విరుద్ధముగ, ననే
సమయములం దిట్టిస్వాభావిక మగువ్యాపారముచే మనంబునందు రహస్యముగ
నిడుకొనఁదగినవిషయము వెల్లడియగుటచే నష్టముసైతము సంభవించును. ప
వాండ్రు తొలుత నడువ నభ్యసించుసమయమున దినమంతయు నటు నిటు వ్యర్థ
ముగఁ దిరుగుదురు. ఇటు లేల తిరుగుదు రనఁగా నట్లు తిరుగుట వారికి సంతసముగ
నుండుటయే. కావున సుఖము లన్నియు దుఃఖాభావరూపములుగనే యున్న వ
ని చెప్పక—"శ్లో. ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ" "ఇంద్రియ
ములకున్ను శబ్దస్పర్శాదివిషయములకును నడుమ రాగము, ద్వేషము ననునవి రెండు
వ్యవస్థితములై యున్నవి. అనఁగా: ప్రారంభముననుండియు స్వతస్సిద్ధములుగ
నున్నవి"(గీ. ౩. ౩౪)—అని భగవద్గీతలలోఁ జెప్పఁబడినందున నీవ్యాపారమాత్ర
కల్యాణార్థమెటు లగును? లేక, కల్యాణదాయక మెటు లగు?" నను విషయవి
మాత్రమే మనము విచారింపవలయును. మఱియు దాని నిమిత్తమై యింద్రియము
లయొక్కయు మనస్సుయొక్కయు వృత్తిని నశింపఁజేయుట యనునమ్మకమునకు లోఁ
బడక యీవృత్తిచే మనకు లాభోత్పత్తి యగుటకై యింద్రియములను, మనస్సును
మనయధీనములుగ నుంచుకొనవలయుననియు, వానియిష్టము వచ్చినటు లెల్ల నడువ
నీయఁగూడదనియు భగవంతునియుపదేశమైయున్నది. ఈయుపదేశమునకును తృష్ణను
సర్వమనోవృత్తులను సమూలముగ నశింపఁజేయవలయు నని చెప్పుటకును, భూమ్యా
కాశముల కున్నంతభేద ముండును. జగత్తులోని సర్వపరాక్రమములను, లేక, కర్తృ

త్వములను బొత్తిగ నశింపఁజేయవలయు నని గీతాతాత్పర్యము గానేరదు. మఱి యేమన:-పదునెనిమిదియవయధ్యాయములో (౧౮. ౨౬) కర్తయందు సమబుద్ధి వెంటనే, ధృతి, ఉత్సాహము ననుగుణము లుండవలయు నని గీతాశాస్త్రము చెప్పుచున్నది. కాని యీవిషయమై మున్నధికముగ విచారింతము. ప్రస్తుతము "సుఖదుఃఖము లనునవి భిన్నవృత్తులా? లేక, యొకదానియభావమే రెండవదా?" యను విషయమువూత్రమే విచారణీయము; ఈవిషయమున గీతలయభిప్రాయ మేద్ది యనునంశము పూర్వోక్తవివేచనచేఁ జదువరు లెఱుంగుదురు. క్షేత్రమన నేమియో చెప్పుచు సుఖదుఃఖములు వేర్వేఱుగ గణింపఁబడినవనుట (గీ.౧౩. ౬.) మాత్రమె కాక, సుఖమనునది సత్త్వముయొక్కయు,తృష్ణయనునది రజస్సుయొక్కయు లక్షణ మనిచెప్పుటచే (గీ.౧౪.౬.౭) సత్త్వరజోగుణములు వేర్వేఱుగ స్వీకరింపఁబడినవి. ఈహేతువుచే సైతము సుఖదుఃఖములు రెండును బరస్పరప్రతియోగులైనను వేర్వేఱగురెండువృత్తు లని భగవద్గీతలో నంగీకరింపఁబడినటుల స్పష్టముగనే యున్నది. ఏపనియైనను దుఃఖకరముగ నున్నదని వదలుటచే త్యాగఫలము రా దనియు, నీత్యాగము రాజస మనియు (గీ. ౧౮. ౮) చెప్పుటచే రాజసత్యాగమునకుఁ బదునెనిమిదియవయధ్యాయమునఁ జూపఁబడినన్యూనత సైతము 'సర్వసుఖమును దృష్ణాక్షయమూలకమైనదే' యనుసిద్ధాన్తమునకు విరుద్ధముగ నున్నది.

"సర్వసుఖములును తృష్ణాక్షయరూపములుఁ గాని, దుఃఖాభావరూపములు గాని కానందున సుఖదుఃఖము లనునవి రెండును స్వతంత్రవస్తువు లని యంగీకరించినను, ఈరెండువేదనలు పరస్పరవిరుద్ధములుగాఁ గాని, ప్రతియోగులుగాఁ గాని యగుటచే నేమియు దుఃఖానుభవము లేనివారికి సుఖముయొక్క రుచి తెలియుంగుటకు శక్య మగునా? కానేరదా?"యని మఱియొకప్రశ్న కలదు. మొదట దుఃఖానుభవము గలిగినఁ గాని సుఖముయొక్క రుచి తెలిసికొనుటకు శక్యము కాదని యనేకులయభిప్రాయ మయి యున్నది. సుఖముయొక్క రుచి తెలియవలయు నేని పూర్వము దుఃఖానుభవ మావశ్యకము కానేర దనుటకు స్వర్గమునందలి దేవతల నిత్యసుఖమును దృష్టాంతముగఁ గైకొని కొందఱు పూర్వోక్తవిషయమునకు విరుద్ధముగనే సమర్థింతురు. కారముగ నుండుపదార్థమును దేనినైనఁ దినకపోయినను, బెల్లము, పంచదార, మామిడిపండ్లు, అరఁటిపండ్లు మొదలగుపదార్థములయొక్క వేర్వేఱగుమాధుర్యము నెఱింగినటులును, మున్నుగా దుఃఖానుభవము లేకపోయినను, దూదిమెత్తపైఁ బరుండునప్పటికంటె హంసతూలికాతల్పమునఁ బరుండునప్పుడును, మేనాసవారీలోనున్నప్పటికంటె పాలకీలో నున్నప్పుడును, గలుగు

వేర్వేఱగుసుఖము నెడతెగకుండ సదా యనుభవించుటచే విసువుకొనకుండ నుండుట యశక్యము. గానేరదు; కాని యీజగత్తునందలివ్యవహారముల నాలో చింపఁగా నీవాదమే వ్యర్థముగఁ గాన్పించుచున్నది. దేవతలకును విశేషముగ సంకటములు తటస్థించినటుల• పురాణములలో ననేకదృష్టాంతము లుండుటచేతను, స్వర్గసుఖముగూడ పుణ్యమునశింపఁగనే నశించుటచేతను, స్వర్గమున నుండువాని దృష్టాన్తము దీని సమర్థింపలేదు. (అనఁగా: ప్రకృతార్థసాధకముగానేరదు.) ఒకవేళ సమర్థించిన నది మనకు ప్రకృతోపయోగి యెటు లగును? "నిత్య మేవ సుఖం స్వర్గే" అనునది సత్య మని యంగీకరించినను, దానివెంటనే "సుఖం దుఃఖ మిహోభయం" "ఈజగత్తున సుఖదుఃఖములు రెండును కలసియే యున్నవి" (మ. భా. శాం. ౧౯౦. ౧౪.) అని చెప్పఁబడినది. దాని ననుసరించియే సమర్థరామదాసు గారుసైతము—"జగీ సర్వసుఖీ అసా కోణ ఆహే, విచారే మనా సర్వ శోధూన పాహే" "లోకమందు సర్వసుఖి యెవఁడు గలఁడు ?. ఓమనసా! నీవే బాగుగ విచారించి చూడుము" అని తమయనుభవమును జెప్పిరి. ఇంతియకాక—

"సుఖం సుఖే నేహ న జాతు లభ్యం దుఃఖేన సాధ్వీ లభతే సుఖాని"

(మ. భా. వన. ౨౩౩. ౪)

"సుఖముచే సుఖ మెపుడును లభ్యము కానేరదు; పతివ్రత సుఖపడుటకై కష్టము నోర్వవలయును", అని ద్రౌపది సత్యభామ కుపదేశించినదియు లోకానుభవము ననుసరించి యుండుటచే సత్యమే యనవలయును. కారణ మేమి యన: నేరేడుపండు పెదవిపైఁ బడినను నోటికి లాగుకొనవలసివచ్చును. నోటియందుఁ బడినను చప్పరింపవలసినకష్టముఁ జేయవలసివచ్చును. కష్టపడినపిదప నరునకుఁ గలుగుసుఖమునకును, సదాసుఖమునే యనుభవించువాని కుండుసుఖమునకును మిక్కిలితారతమ్యము గల దనువిషయము నిర్వివాదమే! కారణ మేమి యన: సదా సుఖానుభవముచే, సుఖానుభవసాధనము లగునింద్రియములశక్తి సైతము తగ్గును.

"ప్రాయేణ శ్రీమతాం లోకే భోక్తుం శక్తి ర్నవిద్యతే
కాష్ఠా న్యపి హి జీర్యన్తే దరిద్రాణాం చ సర్వశః."

(మ. భా. శాం. ౨౮. ౨౯.)

"కలుచుగ భాగ్యవంతునకు రుచ్య మగునన్నముఁ దినుట కైనను శక్తియుండదు, దరిద్రునకు కొయ్యలైనను పూర్తిగ జీర్ణములగును". ఈసంగతి ప్రసిద్ధమే

యైనది కావున "ఐహిక మగువిచారణయే చేయునప్పుడు దుఃఖము ననుభవింపకయే సుఖమును మాత్ర మనుభవగోచరము చేసికొననగునా? కానేరదా?" యను విషయమును విచారించుటకై వ్యర్థముగ కాలయాపనఁ జేయుటచే నేమియుఁ బ్రయోజనము కాఁజాలదు. "సుఖ స్యానంతరం దుఃఖం, దుఃఖస్యానంతరం సుఖమ్." "సుఖము వెంబడి దుఃఖము దుఃఖము వెంబడి సుఖము సంబంధించియే యున్నవి." (మ. భా. వన. ౨౬౦. ౪౯; శాం. ౨౫. ౨౩) మఱియు మేఘసందేశకావ్యమున (మే. ౧. ౧౪) మహాకవికాళిదాసుఁడు—

"క స్యైకాంతం సుఖ ముపనతం దుఃఖ మేకాంతతో వా
నీచై ర్గచ్ఛ త్యుపరి చ దశా చక్రనేమిక్రమేణ.

"ఎవరి కైన సదా సుఖమే కలుగునా? లేక, దుఃఖమే కలుగునా? సుఖదుఃఖముల స్థితి చక్రనేమివలె నొకపరి పైకిని మఱియొకపరి క్రిందికిని వచ్చుచుండు"నని చెప్పినట్లు సుఖదుఃఖములవిషయ మెల్లప్పుడిటులు జరుగుచునే యుండును. కాని యీదుఃఖము మనసుఖముయొక్క మాధుర్యమును వృద్ధిపఱచుట కేర్పడినను సరియే!. లేక, ప్రకృతివికార మగుసంసారమందు దేని కుపయోగించినను సరియే. విసువు పుట్టక నొకటేవిధముగ విషయసుఖమె లభించుట బొత్తిగ నసంభవము గాకపోవచ్చును; కాని దుఃఖ మేమాత్రము లేక సుఖముమాత్రమే యనుభవసిద్ధ మగుట యిహలోకమునమాత్ర మశక్యము. మఱియొకలోకమున శక్యమగు నేమో!!

జగత్తునం దున్నవ్యవహార మంతయు, కేవలసుఖమయము గాకపోవుటచే సుఖదుఃఖాత్మక మని తప్పక నుడువ నను వగుటవలన, "సంసారమున సుఖ మధికమా? దుఃఖమధికమా?" యను మూఁడవప్రశ్న వెలువడును. ఆధిభౌతికసుఖమే పరమసాధ్య మనియంగీకరించు పాశ్చాత్యపండితులలో ననేకులు "సంసారమునందు సుఖముకంటె దుఃఖమే యధిక మగునైడల, సంసారమునందలియుపద్రవమునఁ బడక, యందఱో, లేక, యధికసంఖ్యాకు లగుజనులో, యాత్మహత్యఁ జేసికొని యుందు"రని యభిప్రాయపడుచున్నారు. మనుజుఁడు తనజీవితకాలము వృద్ధి యగుచున్న దని యేపగించుకొనుట లేదు. కావుననే సంసారమునం దతనికి దుఃఖముకంటె సుఖమే యధికముగ ననుభవములో నుండవలయును. కావుననే, సుఖమనునదియే యందఱకును పెక్కింటికంటె ముఖ్యముగ సాధింపఁదగిన దని యెంచి ధర్మాధర్మనిర్ణయమును సైతము తదనుసారముగనే చేయవలయును; కాని యాత్మహత్యను,

సంసారసుఖమునకును గల్పించినసంబంధము బాగుగ నాలోచించిన సత్యము గా
రదు. ఒకానొకసమయమ్మున, నెవఁడో యొకఁడు సంసారమున విసువుఁ జెంది ప్రా
త్యాగమునుసైత నొనర్చుచునే యున్నాఁడు; కాని యటులు వాఁడొనర్చుకా
మును లోకు లపవాదములలో (అనఁగా: వెఱ్ఱిపనులలో) నొకదానినిగఁ జెప్పుదు
ఇందువలన జీవమును బోఁగొట్టుకొనుటయు, బోఁగొట్టుకొనకపోవుటయు, న
దానికి సంసారసుఖముతో సంబంధ ముంచక సామాన్యజనులు దీని
స్వతంత్ర మగువిషయ మని తలఁచుచుండునటుల కాన్పించు చున్నది.
రికు లగుమనుజులకు మిక్కిలి కష్ట మని తోఁచుమోటుమనుజునిసంసారమున
రించిన నీయూహాయే కలుగును. ప్రసిద్ధుఁడును, సృష్టిశాస్త్రజ్ఞుఁడు నగు 'ఛా
డార్విన్' అనునతఁడు తనప్రవాసగ్రంథములో దక్షిణామెరికాలో మిక్కి
దక్షిణదేశముయొక్క ప్రాంతమునందుఁ దన కనుభవములో నున్నమోటుజ
వర్ణించుచు "ఈమోటుజనులు—పురుషులును స్త్రీలు—అత్యంతశీతల మగుతమ
ములో పండ్రెండు నెలలును దిగంబరులై తిర్గుగుదురు. తమయొద్ద నాహారపదార్థ
లను నిలువఁజేసికొనకపోవుటచే ననేకదివసము లాహారమే లేక జీవింపవలసినవా
అయినను వారిజనసంఖ్య వృద్ధియగుచునే యున్నది." * అనివ్రాసెను. కాని
మోటుజను లైనను జచ్చుట కిష్టపడరు. ఇంతమాత్రమునకే వారిసంసారము
మయ మని యెవ్వరును జెప్పఁజాలరు. వా రాత్మహత్యఁ జేసికొన రనుమాట సత్యే
ద్దానికిఁ గారణ మేమై యుండు నని సూక్ష్మముగ విచారించితి మేని, "నేను
వును గాను మనుజుఁడను" అనువిషయముననే యొకొక్కఁడును సరితసించుచు
డని తోఁచును. ఇతరము లగు నన్నిసుఖములకంటె మనుజుఁ డగుట యనుసుఖము
ఎంతకష్టమయ మైనను ఈసంసారముపై దృష్టి నుంచక మనుష్యత్వమున
నిశ్రేష్ఠమగునానందమును, బోఁగొట్టుకొనుట కెప్పుడును సిద్ధము కానంతగా
దానినిగ నెన్నును. మనుజుఁడే కాదు. పశుపక్ష్యాదులుసైత మాత్మహత్యఁ గా
వవు. కావున వానిసంసారము సైతము సుఖమయమే యగునా యేమి? అన
మనుజుఁ డైనను, లేక, పశుపక్ష్యాదు లైనను చచ్చుట కిష్టపడనంతమాత్రము
వారిసంసారము సుఖమయముగా నున్న దనుభ్రమను గలిగించునూహను
కూడదు. మఱి యేమనఁగా: సంసార మెటులున్నను లెక్కసేయక బొత్తిగ
మైనది సచేతన మైనదిగ నగుటలోనే, యపరిమితానంద మున్నదని

* Darwin's Naturalist's Voyage Round the World, Ch

తనము గలవానిలో సైతము మానవుఁడ నైతి ననునానందము సర్వశ్రేష్ఠ మైన దనియు, సత్య మగునీయనుమానమే యేజంతువును నమ్ముట కిష్టపడకపోవుటచేఁ దేలు ననియు మనశాస్త్రకారులు సిద్ధాన్తముఁ జేసిరి.—

"భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః
బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠా నరేషు బ్రాహ్మణాః స్మృతాః.
బ్రాహ్మణేషు చ విద్వాంసః విద్వత్సు కృతబుద్ధయః
కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవాదినః."

(మను. ౧. ౯౬. ౯౭; మ. భా. ఉద్యో. ౫. ౧–౨)

"అచేతనములకంటె సచేతనములు, సచేతనములలో సైతము బుద్ధిగలవియు, బుద్ధిగలవానిలో మనుజులును, మనుజులలో బ్రాహ్మణులును, బ్రాహ్మణులలో విద్వాంసులును, విద్వాంసులలో కృతబుద్ధులును (సంస్కృతబుద్ధిగలవారు), కృతబుద్ధులలో కర్తలును, కర్తలలో బ్రహ్మవాదులును"—అని మనశాస్త్రములలో నంతకంత కెక్కువవాఁడగుటకు జెప్పఁబడినమార్గము దీని ననుసరించియే చెప్పఁబడినది. యీన్యాయము ననుసరించియే "యెనుబదినాలుగులక్షలయోనులలోను నరదేహము శ్రేష్ఠము; నరులలో ముముక్షువు; ముముక్షువులలో సిద్ధుఁడు" నని ప్రాకృతగ్రంథములలోఁ జెప్పఁబడినది. "సబ్ సేజీవ్ ప్యారా" "అన్నిటికంటె తనప్రాణ మెక్కువయైనది" అని చెప్పుటలో నిదియే తాత్పర్య మగుటచే నీసంసారము దుఃఖమయ మైనను నాత్మహత్య చేసికొనినవారిని వెఱ్ఱివాండ్రనియు, ధర్మశాస్త్రానుసారముగఁ బాపులనియు నెన్నెదరు (మ. భా. కర్ణ. ౭౦. ౨౮). ఆత్మహత్యను జేసికొనుటకు యత్నించుటయే నేర మని దండనీతిశాస్త్రజ్ఞులు నుడువుదురు. మనుష్యుఁ డాత్మహత్యఁ జేసికొనక పోవుటచే సంసారము సుఖమయ మని యనుమానముఁ జేసికొనుటకు మార్గము లేదని యీతీరిన సిద్ధాన్తమయినపిదప "సంసారము సుఖమయమా? దుఃఖమయమా?" యనుప్రశ్నకు సమాధానముఁ జెప్పుటకుఁ బూర్వకర్మానుసారముగ నొక్కపరి తనకు లభించిననరదేహ మనుస్వాభావిక మగు నదృష్టము నొకమూల నుంచి, తదుత్తరకాలీన మైనదానిని (అది లభించినపిదప నగు దానిని; అనఁగా సంసారమం దున్నవిషయమునుమాత్రము) మనము విచారింపవలయును. మనుష్యుఁడు జీవించియుండుటయే సంసారమునఁ బ్రవర్తించుటకుఁ గారణముగ నున్నది. ఆధిభౌతికపండితులు చెప్పినట్లుల, "సంసారమం దున్న సుఖాధిక్యమునకుఁ బూర్తి యనునది లేదు; చావ కుండవల్లయు నపుబుద్ధి స్వాభా

సంసారసుఖమునకును గల్పించినసంబంధము బాగుగ నాలోచించిన సత్యము గానేరదు. ఒకానొకసమయమ్మున, నెవఁడో యొకఁడు సంసారమున విసువుఁ జెంది ప్రాణత్యాగమునుసైత మొనర్చుచునే యున్నాఁడు; కాని యటులు వాఁడొనర్చుకార్యమును లోకు లపవాదములతో (అనఁగా: 'వెఱ్ఱిపనులలో') నొకదానినిగఁ జెప్పుదురు. ఇందువలన జీవమును బోఁగొట్టుకొనుటయు, బోఁగొట్టుకొనకపోవుటయు, నను వానికి సంసారసుఖముతో సంబంధ ముంచక సామాన్యజనులు దీని నొక స్వతంత్ర మగువిషయ మని తలఁచుచుండునటుల కాన్పించుచున్నది. నాగరికు లగుమనుజులకు మిక్కిలి కష్ట మని తోఁచుమోటుమనుజునిసంసారమును విచారించిన నీయూహయే కలుగును. ప్రసిద్ధుఁడును, సృష్టిశాస్త్రజ్ఞుఁడు నగు 'ఛార్లిస్ డార్విన్' అనునతఁడు తన ప్రవాసగ్రంథములో దక్షిణామెరికాలో మిక్కిలి దక్షిణదేశముయొక్క ప్రాంతమునందుఁ దన కనుభవములో నున్న మోటుజనుల వర్ణించుచు "ఈమోటుజనులు—పురుషులును స్త్రీలు—అత్యంతశీతల మగుతమదేశములో పండ్రెండు నెలలును దిగంబరులై తిర్గుగుదురు. తమయొద్ద నాహారపదార్థములను నిలువఁజేసికొనకపోవుటచే ననేకదివసము లాహారమే లేక జీవింపవలసినవారు. అయినను వారిజనసంఖ్య వృద్ధియగుచునే యున్నది." * అని వ్రాసెను. కాని యట్టి మోటుజను లైనను జచ్చుట కిష్టపడరు. ఇంతమాత్రమునకే వారిసంసారము సుఖమయ మని యెవ్వరును జెప్పఁజాలరు. వా రాత్మహత్యఁ జేసికొన రనుమాట సత్యమే. ...కారణ మేమై యుండు నని సూక్ష్మముగ విచారించితి మేని, "నేను పశు యనః స్తే మనుజుఁడను" అనువిషయముననే యొక్కొకఁడును సంతసించుచున్నాఁ యందుఁ ...ను. ఇతరము లగు నన్నిసుఖములకంటె మనుజుఁ డగుట యనుసుఖమును, నరునకుఁ గల ...మైనను ఈసంసారముపై దృష్టి నుంచక మనుష్యత్వమున కుండు మునకును మిక్కిలిదమును, బోఁగొట్టుకొనుట కెప్పుడును సిద్ధము కానంతగొప్ప మేమి యనః సదా మనుజుఁడే కాదు. పశుపక్ష్యాదులుసైత మాత్మహత్యఁ గావిం సైతము తగ్గును. సంసారము సైతము సుఖమయమే యగునా యేమి? అనఁగా:

"ప్రాయేణ, పశుపక్ష్యాదు లైనను చచ్చుట కిష్టపడనంతమాత్రముననే కా... న్యష్టి ...యముగా నున్న దనుభ్రమను గలిగించునూహను జెంద
...: సంసార మెటులున్నను లెక్కసేయక బొత్తిగ నచేతన

"తలుచుగ భాగ్య... లుటలోనే, యపరిమితానంద మున్న దనియు, అచే షడు, దరిద్రునకు కొ...

* ...t's Voyage Round the World, Chap. X.

తనము గలవానిలోసైతము మానవుఁడ నైతి ననునానందము సర్వశ్రేష్ఠ మైన దనియు, సత్య మగునియనుమానమే యేజంతువును చచ్చుట కిష్టపడకపోవుటచేఁ దేలు ననియు మనశాస్త్రకారులు సిద్ధాన్తముఁ జేసిరి.—

"భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః
బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠా నరేషు బ్రాహ్మణాః స్మృతాః.
బ్రాహ్మణేషు చ విద్వాంసః విద్వత్సు కృతబుద్ధయః
కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవాదినః."

(మను. ౧. ౯౬. ౯౭; మ. భా. ఉద్యో. ౫. ౧—౨)

"అచేతనములకంటె సచేతనములు, సచేతనములలో సైతము బుద్ధిగలవియు, బుద్ధిగలవానిలో మనుజులును, మనుజులలో బ్రాహ్మణులును, బ్రాహ్మణులలో విద్వాంసులును, విద్వాంసులలో కృతబుద్ధులును (సంస్కృతబుద్ధిగలవారు), కృతబుద్ధులలో కర్తలును, కర్తలలో బ్రహ్మవాదులును"—అని మనశాస్త్రములలో నంతకంత కెక్కువవాఁడగుటకు జెప్పఁబడినమార్గము దీని ననుసరించియే చెప్పఁబడినది. యీన్యాయము ననుసరించియే "యెనుబదినాలుగులక్షలయోనులలోను నరదేహము శ్రేష్ఠము; నరులలో ముముక్షువు;ముముక్షువులలో సిద్ధుఁడు"నని ప్రాకృత గ్రంథములలోఁ జెప్పఁబడినది. "సబ్ సేజీవ్ప్యారా" "అన్నిటికంటె తనప్రాణ మెక్కువయైనది" అని చెప్పుటలో నిదియే తాత్పర్య మగుటచే నీసంసారము దుఃఖమయ మైనను నాత్మహత్య చేసికొనినవారిని వెఱ్ఱివాండ్రనియు, ధర్మశాస్త్రాను సారముగఁ బాపులనియు నెన్నెదరు (మ. భా. కర్ణ. ౭౦. ౨౮). ఆత్మహత్యను జేసికొనుటకు యత్నించుటయే నేర మని దండనీతిశాస్త్రజ్ఞులు నుడువుదురు. మనుష్యుఁ డాత్మహత్యఁ జేసికొనక పోవుటచే సంసారము సుఖమయ మని యనుమానముఁ జేసికొనుటకు మార్గము లేదని యీతీరున సిద్ధాన్తమయినపిదప "సంసారము సుఖమయమా? దుఃఖమయమా?"యనుప్రశ్నకు సమాధానముఁ జెప్పుటకుఁ బూర్వకర్మానుసారముగ నొక్కపరి తనకు లభించిననరదేహ మనుస్వాభావిక మగు నదృష్టము నొకమూల నుంచి, తదుత్తరకాలీన మైనదానిని (అది లభించినపిదప నగు దానిని; అనఁగా సంసారమం దున్న విషయమునుమాత్రము) మనము విచారింపవలయును. మనుష్యుఁడు జీవించియుండుటయే సంసారమునఁ బ్రవర్తించుటకుఁ గారణముగ నున్నది. 'ఆధిభౌతికపండితులు సెప్పినట్టుల, "సంసారమం దున్న సుఖాధిక్యమునకుఁ బూర్తి యనునది లేదు; చావు కుండవల్లయు ననుబుద్ధి స్వాభా

వికముగనే యున్నది. అది సంసారమందున్న సుఖదుఃఖములతారతమ్యముచేఁ బుట్టినది కానేరదు.” అని మఱియొకవిధమున నుపపాదింపవచ్చును. కావుననే సంసారము సుఖమయముగా నున్నదనువిషయము జీవించియుండవలయునని స్వాభావికముగ నుండుటచే సిద్ధము గానేరదు.

కేవలమనుష్యజన్మరూప మగుమహాభాగ్యము, పిదప సంభవించినమానవసంసారము ననువిషయములను బొరపాటుకలుగునటుల కలుపక మనుష్యత్వము, మనుజులసంసారము (అనఁగా: నిత్యవ్యవహారము) అను నీరెంటిని వేర్వేఱుగాఁ జేసినపిదప, “శ్రేష్ఠుఁడును, నరదేహధారియు నగుప్రాణికి సంసారమందు సుఖమధికమా? దుఃఖ మధికమా?”అను ప్రశ్నకు నుత్తరమిచ్చుటకు ప్రతిమనుజునకును గల ‘ప్రస్తుత’ వాసనలలో నెన్నిసఫలము లయినవో, యెన్నినిష్ఫలము లైనవో యను నీవిషయమును విచారించుటదక్క రెండవసాధన మేమియు లేదు. ప్రస్తుత మని చెప్పుటకుఁ గారణ మేమి యన: అందఱు నాగరికు లనుభవించుచున్న విషయ మెల్లప్పు డనుభవింపఁబడుటచే దానిలోనిసుఖమును మనము మఱచి పోవుచున్నాము. నూతనముగ మనకుఁ గావలయునని తోఁచువస్తువులలో నెద్ది లభించుచున్నదో యెఱింగి దానిమూలముననే సంసారమం దున్న సుఖదుఃఖముల నిర్ణయించుచున్నాము. ఇప్పుడు మన కెన్ని సుఖసాధనము లున్నవో, నూఱేండ్లక్రింద వీనిలో నెన్నిసుఖసాధనము లున్నవో వాని సరిచూచుటయును, నేఁడు నేను సుఖముగ నున్నానా? లేదా? యని విచారించుటయు నను నీరెండువిషయములును మిక్కిలి భిన్నములుగ నున్నవి. ఉదాహరణ మేమి యన: నూఱేండ్లక్రింద నెడ్లబండిపైఁ బ్రయాణముఁ జేయుటకంటె నిప్పుడు ధూమశకటముతోఁ బ్రయాణముఁ జేయుట చాల సుఖకర మనుసంగతి నెల్లరు నొప్పుకొందురు; కాని, ధూమశకటము వల్ల నగుసుఖము నిప్పుడు మఱచుటచే నొకప్పుడు ధూమశకట మాలస్యమైనప్పుడు మనకు మిక్కిలి కష్టమై తోఁచును. కావున, ఉన్న సుఖసాధనమును లక్ష్యపెట్టక మనుష్యుని ప్రస్తుతసుఖదుఃఖములవిచారమును ప్రస్తుతమందున్న వానియావశ్యకతను బట్టియే చేయుచున్నాఁడు. ఈయావశ్యకత యెంతవఱ కని విచారింప, దాని కెప్పుడు నంతము లేదని స్పష్టమగును; నేఁడొకకోరిక సఫలమైనను రేపు దానిస్థానమున మఱియొకకోరిక నాటుటచే నీక్రొత్తకోరికనే నెరవేర్పవలయు నని తోఁచును; మానవునికోరికయు నొకయడుగు మున్నగనె పరువిడుచుండుటచే నతనిశిరోబాధ యెప్పటికిని మాయునది కానేరదు. “సుఖ మంతయుఁ దృష్ణాక్షయరూపకముగనే యున్నది.ఎంతసుఖము లభించినను మనుష్యుఁడు మరల నసంతుష్టిగనే యుండును.”

అనునీరెండువిషయములభేదము నిప్పట్టున లెస్సగ గుర్తించుకొనవలయును: ప్రతిసుఖమును దుఃఖాభావరూపముగ నుండక పోవుటచే సుఖదుఃఖము లనునవి యింద్రియములస్వతంత్రము లగురెండువేదనలుగ నున్న వని చెప్పవలెను. ఒకప్పుడు లభించినయేసుఖములచే నైనఁ దృప్తినొందక యింకను సుఖమే కావలయునని చెప్పి యసంతుష్టుఁడుగ నుండుట వేఱు. ప్రథమవాదము సుఖముయొక్క వస్తుస్వరూపమును సంబంధించి యున్నది. "ప్రాప్తమయిన సుఖముచే సంపూర్ణమగుతృప్తి యగునా? కానేరదా?' యనునది రెండవప్రశ్న యయియున్నది. విషయవాసన యెల్లప్పుడు నొకతీరుననె వృద్ధినొందుచుండుటచే ననుదినము నూతనము లగుసుఖములు లభింపకపోయినను పూర్వపుసుఖములనే యనుభవింపవలయునని తోఁచుటచే మనోవాంఛ యెంతయుఁ దఱుఁగదు. 'వ్హిటెలియస్' అను రోమకచక్రవర్తి జిహ్వాసుఖమును దఱుచుగ నపేక్షించి భుజించినయన్నము నోషధిమూలమునఁ గ్రక్కి యనుదినము పెక్కు మాఱులు భుజించువాఁడని యొకకథ గలదు; కాని, పశ్చాత్తప్తుఁ డగుయయాతియొక్క కథ యింతకంటె నెక్కువనీతిని బోధించుచున్నది. ఒకప్పుడు యయాతిని శుక్రాచార్యు లొకకారణమున వృద్ధుఁ డగునటుల శపించెను. మరల దయ గలిగి యితరుల కాముసలితనము నిచ్చి, యాతని పడుచుందనమును స్వీకరింపనగు నని యాచార్యుం డనుగ్రహించెను. వెంటనే యయాతి తన పుత్త్రుఁ డగు 'పూరువు'యొక్క పడుచుందనముఁ గైకొని వేయివత్సరంబు లొక్కతీరున విషయసుఖముల ననుభవించి తుదకు భూమిలో నుండు సకలపదార్థములును నొకమనుష్యునికైనను సుఖాభిలాషముల శమింపఁజేయఁ జాలవని తెలిసికొనెను. మఱియు—

“శ్లో. న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే.”

(మ. భా. ఆ. ౭౫. ౪౯)

“సుఖోపభోగముచే విషయాభిలాష శమింపదు. హోమద్రవ్యముచే నగ్ని శమింపనటులె విషయోపభోగముచే విషయాభిలాష యధికాధికముగ వృద్ధి నొందును” అని యయాతి వాక్రుచ్చె నని మహాభారతములోని యాదిపర్వమున వ్యాసులు వక్కాణించి యున్నారు, మఱియు నీశ్లోకము మనుస్మృతి యందు సైతమున్నది. (మను. ౨. ౯౪). సుఖసాధనము లెంత యధికముగ నున్న నింద్రియాభిలాష యెల్లపుడు మితి లేక యభివృద్ధి నొందుచుండుటచే నెల్లపుడును సుఖ మనుభ

వింప మనుజుఁడు కోరుచుండును. అందుచే సుఖేచ్ఛ యెప్పుడును శాంతి పొంద నేరదు. దాని కెట్టియాటంకమునైన గలిగింపవలయు ననుటయే దీనితాత్పర్యము. ధర్మశాస్త్రగ్రంథకారునిత త్త్వము పూర్ణముగ మాన్యమగుటచే, కామోపభోగము లకుఁ బ్రత్యేకముగ నేదియైన నియమము నుంచవలయు నని వారందఱు తొలుత నుండియు నుడువుచునే యున్నారు. విషయోపభోగ మనునదియే యీజగత్తునఁ బరమసాధ్యముగ నున్నదని చెప్పుజను లీయనుభవసిద్ధాన్తమువై పునకుఁ గొంచెము చూచినయెడల వారిమతమునం దున్న నిస్సారత వారికిఁ దప్పక తెలియును. వైదికమత సంబంధ మగు నీసిద్ధాన్తము బౌద్ధధర్మములలోను స్వీకరింపఁబడుటచే యయాతికి ప్రతినిధిగ మాంధాత యనుపురాణప్రసిద్ధుఁ డగురాజు మరణసమయమునందు—

"న కహాపణవస్సేన తిత్తి కామేసు విజ్జతి
అపి దిబ్బేసు కామేసు రతిం సో నాధిగచ్ఛతి."

(ధమ్మపద. ౧౮౬–౧౮౭)

"కార్షాపణ మనెడునాణెములు వర్షించినను కోరికలు శమింపవు. స్వర్గసుఖ ములు లభించినను కాముకుఁ డగుపురుషునకు కామము శాంతింపదు". అని చెప్పి నట్లు బౌద్ధగ్రంథములలో వర్ణింపఁబడినది. విషయోపభోగము పూర్తి యగుట యీరీతి నెప్పటికి నశక్యమగుటచే ప్రతిమనుష్యునకును "నేను దుఃఖించుచున్నా ను" అనియే యెప్పుడును దోఁచును. ప్రతిమనుజునకు నీరీతిగనే యుండునని తెలిసి కొనినయెడల మహాభారతమునందుఁ జెప్పిన తీరున—

"సుఖాద్బహుతరం దుఃఖం జీవితే నాస్తి సంశయః"

(మ. భా. శాం. ౨౦౫. ౬; 330. ౧౬)

"ఈజీవితమునందు (అనఁగా: సంసారమునందు) సుఖముకంటె దుఃఖమే యధికముగ నున్నది". మఱియు తుకారాంబావా వర్ణించినతీరున—

"సుఖ పాహతా జవాపాడే, దుఃఖ పర్వతాఏవఢే"

(తుకా. గా. ౨౯౭౬)

"ఈసంసారమున సుఖమును విచారించిన నావగింజయంత యనియు, దుఃఖ మును విచారించినఁ బర్వతమంత యనియుఁ దెలియును" అని సిద్ధాన్తముఁ జేయుట యవశ్యము. ఉపనిషత్తులసిద్ధాన్త మిటులే యగుటచే మైత్ర్యుపనిషత్తుల లోను (మైత్ర్యు. ౧. ౨–౪) గీతలలోను స్థైతము మనుష్యజన్మ మశాశ్వత

మనియు, దుఃఖాలయ మనియు, పృథ్వి యందున్న సంసార మనిత్య మనియు నసుఖముగ నున్న దనియుఁ (గీ. ౮. ౧౫; ౯. 33) జెప్పఁబడినది. జర్మని పండితుఁ డగు 'శోపెన్‌హావర్' అనువానికి సైత మిదియే సమ్మత మగుటచే దానిని సిద్ధపఱచుటకొఱ కొకచమత్కార మగుదృష్టాంతము చెప్పఁబడినది. అది యేది యనఁగా: మనుష్యుల కున్న సుఖేచ్ఛ లన్నిటిలో నెన్ని సఫలము లగుచున్నవో వానింబట్టి యతఁడు సుఖియని తెలిసికొనుచున్నాను. సుఖేచ్ఛకంటె సుఖోపభోగము కొఱఁతపడు నెడల దానింబట్టి యాతఁడు దుఃఖి యనుకొనుచున్నాను. ఈప్రమాణమునే గణితశాస్త్రము ననుసరించి చూపవలసినయెడల సుఖోపభోగమును సుఖేచ్ఛచే భాగించి, అపూర్ణాంకరూపముచే $\frac{\text{సుఖోపభోగము}}{\text{సుఖేచ్ఛ}}$ అని వ్రాయవలయును; కాని యీయపూర్ణాంక మించుక విలక్షణముగ (అనఁగా: వేఱుగ) నున్నది. దానియొక్క (సుఖేచ్ఛయొక్క) ఛేదము, దానియొక్క (అనఁగా: సుఖోపభోగముయొక్క) యంశముకంటె నధికముగ వృద్ధి నొందుటచే నీయపూర్ణాంకము $\frac{1}{2}$ ఉన్నయెడల, పిదప $\frac{3}{10}$ (అనఁగా: అంశము త్రిగుణమైనయెడల ఛేద మైదంతలు వృద్ధిఁజెంది యధికాధికముగ నపూర్ణమే) అగుచుండును. కావున మనుజుఁడు పూర్ణసుఖము గలవాఁ డగునని యాశఁ జెందుట వ్యర్థముగ నున్నది. మునుపు సుఖమెంత యున్న దని విచారించుచు నీయపూర్ణాంకముయొక్క యంశస్థానమునే మనస్సు స్వతంత్రముగ విచారించితిమేని యంశముకంటె ఛేదము విశేషము వృద్ధిఁ జెందిన దనువిషయమాలోచనకే రాఁజాలదు; కాని కాలయాపనము నపేక్షింపక "మనుజుఁడు సుఖియా? దుఃఖియా?" యనుసంగతిమాత్రమే విచారింపవలసినపుడు, అంశము, ఛేదము అనురెంటియొక్క విచారణఁ జేయ వలసివచ్చును; మఱియు నీయపూర్ణాంక మెప్పుడును పూర్ణము కానేర దనుసంగతి మనస్సునకుఁ దోఁచును. "న జాతు కామః కామానాం" (మ. ౨. ౯౪) అనుమనువచనముయొక్క భావము నిదియే. సుఖదుఃఖములపరిమితిని దెలిసికొనుటకు, వేఁడిని గొలుచు యంత్రము (అనఁగా: థెర్మామిటరు) వంటి నిశ్చిత మైనసాధనములు లేకపోవుటచే, వానితారతమ్యమునకు గణితశాస్త్రపద్ధతిగ నొనర్చినప్రస్తారము ననేకు లొప్పుకొనరు; కాని యీపూర్వపక్షసిద్ధాన్తములరీతిఁగ సంసారమం దున్నమనుజునకు సుఖమెక్కు డని స్థిరపఱచుట కెట్టికొలఁత గాని తూనిక గాని కానరాదు. కావున నుభయపక్షములకును సాధారణ మగునాయాక్షేప మిదివరలోఁ జేయఁబడినయుప

సాధనలలో నున్న సామాన్యసిద్ధాన్తమునకు (అనఁగా: సుఖోపభోగమునకంటె సుఖేచ్ఛ యనివార్యముగ వృద్ధినొందుటచే సిద్ధ మగుసిద్ధాన్తమునకు) నేమియు బాధకము గానేరదు. 'స్పెయిన్' దేశమును దురుష్కులు పాలించుచుండఁగా నూఁడవ 'అబ్దుల్ రహిమానుఁడు' * (అక్కడ నొకన్యాయమూర్తియును బరాక్రమవంతుఁడగు నొకరాజు) చక్రవర్తియై యుండి, తనదినము లెటులగడచుచున్నవో తెలియుటకై దినచర్య వ్రాసెను. దానివలన నేఁబదిసంవత్సరముల వారిరాజ్యపాలనాకాలమునఁ దుదకుఁ బదునాలుగుదినములుమాత్రమె పూర్ణసుఖమునఁ గడచినటుల విశదమైనదని తురుష్కులయితిహాసగ్రంథములలోఁ జెప్పఁబడినది. "జగత్తున, ముఖ్యముగ నైరోపాఖండమున నున్న ప్రాచీననవీనతత్త్వజ్ఞులమతములను విచారించిన, వారిలో 'సంసారము సుఖమయ' మని వచించువారియొక్కయు, 'దుఃఖమయ' మని వచించువారియొక్కయు సంఖ్య సమానముగ నున్నటుల కాన్పించుచున్న" దని యొకరు వ్రాసియున్నారు. † త్రాసువలె నుండు నీసంఖ్యలలో నొకవైపున హిందూతత్త్వజ్ఞులమత మనుసంఖ్యను జేర్చిన నాపళ్లెర మెంతక్రిందికి వంగునో వచింప నక్కఱ యుండదు. సంసారసుఖదుఃఖములకుఁ బూర్వోక్త మగునిరూపణను విని సన్న్యాసమార్గము మంచి దనుపురుషుఁడు "సుఖ మనునది యథార్థపదార్థము కాకపోవుటచే నాశారూపము లగుసకలకర్మల వదలినఁ గాని శాంతి కలుగ నేర" దని చెప్పుట మీ కిష్టము గాకపోయినను మీరు వచించినరీతిగనే తృష్ణనుండి యసంతోషమును, అసంతోషమునుండి దుఃఖమును, గలుగుచున్న నీయసంతోషమును దూరముగఁ జేసికొనుటకైనను మనుష్యులు తృష్ణను సర్వసాంసారికకర్మములను (అవి పరోపకారార్థములైనను, లేక, స్వార్థము లైనను) వదలి యెల్లప్పుడును సంతుష్టుఁడుగ నుండవలయు నని చెప్పుట కేమి యభ్యంతర" మని యడుగును. మహాభారతములోనే — "అసంతోషస్య నాస్త్యంతః తుష్టిస్తు పరమం సుఖమ్." "అసంతోషమున కంతము లేక పోవుటచే, సంతోష మనునదియే పరమసుఖమై యున్నది" (మ. భా. వన. ౨౧౫. ౨౨) యని వచన మున్నది. జైనబౌద్ధధర్మములమూలాధారములుసైత మీమతమునే యవలంబించి యున్నవి. పాశ్చాత్యదేశస్థుఁ డగు 'శోపెన్‌హారయెర్' ‡ అనునతఁ డిటీవల నీమతమునే ప్రతిపాదించియున్నాఁడు; కాని, దీనికి విరుద్ధముగ,

* Moors in Spain, p. 128. (Story of the Nations Series).

† Macmillan's Promotion of Happiness. p. 26.

‡ Schopenhauer's World as Will and Representation, Vol. II Chap. 46.

"నోట నపశబ్దములు వచ్చునని నాలుకగోసికొనవలయునా?" యనియు, "అగ్నిచే నెప్పుడైన నిండ్లు గాలిపోవునని యగ్నిని బొత్తిగ వదలి వంటలనుసైతము మానుకొనవలయునా?" యనియు విచారింపవచ్చును. కావున నగ్నికే కాక విద్యుచ్ఛక్తికి సైతము తగిననియమము నేర్పఱచి తగుసాధనములతోఁ బ్రతిదినము మనము వాడుకొనునటుల, తృష్ణకు నసంతుష్టికి సైతము తగునియమముల నేర్పఱచి యుపయోగపఱుచుకొనుట యశక్యము కానేరదు. వీనిలో నసంతుష్టి యనునది యెల్లప్పుడు నేవిధమునను బొత్తిగ నుపయోగించునది కానేర దని యను నెడల నావిషయము ప్రత్యేకము; కాని బాగుగ విచారించిన నావిషయ మటుల స్థిరపడనేరదు. అసంతుష్టి యనఁగా దురాశయే కాని, లేక, దుఃఖమే యని కాని, యర్థము కానేరదు. ఇట్టి యసంతుష్టి శాస్త్రకారులచేసైత మేవగింపఁబడియున్నది. ఇఁక నేమనఁగ: మన మున్న స్థితిలోనే యెల్లప్పుడునుండి, కష్టపడక, శక్తికొలఁది, శాంతత్వమును, సమచిత్తత్వమును సాధించుచుఁ గ్రమముగ నెక్కువగ బాగుపఱుచుచు, మునుపున్న స్థితిని సాధ్య మగునంతయకాన్నత్యమునకుఁ దెచ్చునట్టికోరికకు మూలకారణ మగు నసంతోషము పనికి రాదని వచించుట కేనాఁడును వీలు కానేరదు. ఏలయన: బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర లను నాలుగుజాతులు గలమనసమాజమున, బ్రాహ్మణులు జ్ఞానమునను, క్షత్రియు లైశ్వర్యమునను, వైశ్యులు ధనధాన్యములయందును నభివృద్ధిఁ జెందవలయు నను నెడికోరికనే వదలినపక్షమున నీసమాజము శీఘ్రముగ నడుగంటు నని చెప్పనక్కఱలేదు. ఈయభిప్రాయమును మనఁబున నూనియే వ్యాసులవారు.—"యజ్ఞో విద్యా సముత్థాన మసంతోష. శ్ర్రియం ప్రతి" "యజ్ఞము, విద్య, ఉద్యోగము, నైశ్వర్యవిషయకసంతోషము ననునవి క్షత్రియులగుణములు" (మ.భా.శాం. ౨౩. ౯) అని ధర్మరాజునకుఁ జెప్పిరి. అటులె 'విదుల' తన పుత్త్రున కుపదేశించుచు, "సంతోషో వై శ్రియం హన్తి" "సంతోషముచే నైశ్వర్యము నశించును" (మ. భా. ఉ. ౧౩౨. ౩౩) అని చెప్పెను. "అసంతోష శ్శ్రియో మూలమ్." (మ. భా. సభా. ౫౫. ౧౧) * అని మఱియొకచో సైత మున్నది. బ్రాహ్మణధర్మములలో సంతోష మనునది గుణ మని చెప్పఁబడినను, చాతుర్వర్ణ్య ధర్మానుసారముగ ద్రవ్యవిషయమునఁ గాని, ఇహలోకమందలి యైశ్వర్యవిషయమునఁ గాని సంతోష మనియే దానియర్థము. తన కున్నజ్ఞానము చాలు నని బ్రాహ్మ

* Cf. "Unhappiness in the cause of progress." Dr. Paul Carus' The Ethical Problem, P. 251. (2nd Ed)

ణుండనుకొన్నను, వైశ్యశూద్రులు తమతమజాతిధర్మముల ననుసరించి తమకున్న విదయే చాలు నని యనుకొన్నను, బుద్ధిపూర్వకముగఁ దమకు నష్టముఁ జేసికొన్నవా రగుదురు. అసంతోషమె యన్నివిధముల గొప్పతనమునకును, ప్రయత్నమునకును, ఐశ్వర్యమునకును, మోక్షమునకును మూలమై యున్న దనునది యిందలిసారాంశము. ఈయసంతోషమును మనము బొత్తిగ వదలితిమేని యీలోకమునందును బరలోకమునందును మనకు మంచియవస్థ లభింపదని ప్రతిమనుజుఁడును దప్పక యెఱిఁగి పలుచుకొనవలయును. భగవద్గీతలోసైతము శ్రీకృష్ణుని యుపదేశమును వినుచు— "భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్" "అమృతమువంటి నీసంభాషణను వినుచున్న నాకు తృప్తి కలుగుట లేదు. కావున మరల నీవిభూతిని వచింపుము" (గీ. ౧౦. ౧౮) అని యర్జునుఁ డడిగినపిమ్మట భగవంతుఁడు వెండియుఁ దనవిభూతిని చెప్పుటకుఁ బ్రారంభించెను; కాని యర్జునునకు "నీవు నీకోరికను మానుకొనుము, అతృప్తి (అసంతోషము) యోగ్యము కానేర" దని భగవంతుఁ డుపదేశము చేయలేదు. దీనివలన మంచి (కల్యాణకారకమగు) విషయమున యోగ్యమగునసంతోష ముండుట భగవంతునకుసైత మిష్టమే యని సిద్ధమగుచున్నది. మఱియు— "యశసి చాభిరతిర్వ్యసనం శ్రుతౌ" "కోరిక యుండవలయును కాని, యది యశస్సును సంపాదించునదై యుండవలయును; వ్యసనము సైత ముండవలయును కాని, యది విద్యకు సంబంధించినదిగ నుండవలయును. ఇటులైన నవి నింద్యములు కానేరవు" అని భర్తృహరిలో నొకశ్లోకమున్నది. కామక్రోధాదివికారముల నశింపఁజేసినటుల యసంతోషమును సైతము బొత్తిగ నశింపఁజేయఁగూడదు. అటుల నశింపఁజేసిన నశుభములనే కాక శుభంబులను సైతము నశింపఁజేసినవాఁడగు నను మాట నిశ్చయమె. కావుననే విషయోపభోగములచేఁ దృప్తిఁజెందుటకు మాత్రమె యత్యాశను జెంది యిహలోకసుఖప్రవాహమునఁ బడిపోవువాని సంపత్తికి "ఆసురీసంపత్తి" యని గీతల పదునాఱవ యధ్యాయమునఁ బేరిడఁబడియున్నది. ఇట్టి యుత్తరోత్తరాభిలాషఁ జెందుటచే మనస్సులో నున్న సాత్త్వికవృత్తి నశించి యతఁ డధోగతినిఁ జెందుటయే కాక, తృష్ణోపశాంతి యెప్పుడును గలుగకపోవుటచేఁ గామోపభోగములయందలికోరిక యంతకంత కెక్కువై తుద కాతఁడు సంతుష్టిలేకయె చనిపోవును; కాని వీనికి వ్యతిరేకముగఁ దృష్ణయొక్కగాని, అసంతోషముయొక్కగాని యీదుష్పరిణామమును తప్పించుకొనుటకు కన్నితృష్ణలను, అన్నికర్మలను నొక్కసారిగనె వదలిపెట్టు

టయు సాత్త్వికమార్గము కానేరదు. వెనుకఁ జెప్పినరీతినఁ దృష్ణ, లేక, అసంతోషము అనునది రాఁబోవుగొప్పతనమునకు మూలమై యున్నది. కావున నే చోరభయము లేక యుండుటకై ధనికులరూపుమాపుటకు యత్నింపకయే, తృష్ణచే (అసంతోషముచే) నేది దుఃఖమగునో దానిని బాగుగ విచారించి దుఃఖకారకమగునాశను మాత్రము వదలుట యనుయుక్తిరూప మగుమధ్యమార్గమును స్వీకరింపవలయును: కావున సర్వకర్మలను వదలుటకుఁ గారణ మేమియుఁ గానరాదు. దుఃఖమును గలిగించునాశనుమాత్రము వదలి స్వధర్మానుసారముగఁ గర్మలు చేయుట యనుయుక్తిని; లేక, కౌశల్యమును యోగ మని కాని కర్మయోగ మని కాని చెప్పుచున్నారు. (గీ. ౨. ౫౦.) అదియ గీతలలో ముఖ్యముగఁ బ్రతిపాద్య మగుటచే గీతలలో నెట్టియాశ దుఃఖకారక మని స్థిరపఱుపఁబడినదో యనువంశము నిచ్చో మఱికొంత విచారింతము.

మనుష్యుఁడు వీనులచే వినుచున్నాఁడు; త్వగింద్రియముచే స్పృశించుచున్నాఁడు; ముక్కుచే నాఘ్రాణించు చున్నాఁడు. ఇంద్రియముల యీ వ్యాపారము వానిస్వాభావికవృత్తి కనుకూలముగ నున్నచో సుఖమును, ప్రతికూలముగ నున్నచో దుఃఖమును గలుగునని సుఖదుఃఖముల వస్తుస్వరూపమునకు లక్షణము పూర్వమునందుఁ జెప్పఁబడినది; కాని సుఖదుఃఖముల విచార మీవ్యాఖ్యానముచేతనే సంపూర్ణము కానేరదు. ఆధిభౌతికసుఖదుఃఖములు గలుగుటకు, బాహ్యపదార్థములకు నింద్రియములకు సంయోగము కలుగుట మొట్టమొదట నావశ్యకము. ఐనను, ఈసుఖదుఃఖములయనుభవము మనుజునకుఁ బిమ్మట నేరీతిగఁ గలుగునని విచారించిన నింద్రియవ్యాపారముచేఁ గలుగునీసుఖదుఃఖముల నెఱుంగుట యను పని ప్రతిమనుజుఁడును తుదకుఁ దనమనస్సుచేతనే చేయవలసివచ్చునని స్థిరపడును. “చక్షుః పశ్యతి రూపాణి మనసా నతు చక్షుషా” “చూచుట యనుకార్యము మనస్సుయొక్క సాహాయ్యము లేక నేత్రముమాత్రాననే జరుగదు. అమనస్సు వ్యాకులముగ నున్నయెడల నేత్రములతోఁ జూచినను జూడనటులే యుండును” (మ. భా. శాం. ౩౧౧. ౧౭.) అని మహాభారతములో నున్నది. బృహదారణ్యకోపనిషత్తున నైతము “నామనస్సు మఱియొకచో నుండుటచే నాకు గోచరింపలేదు. (అన్యత్రమనా అభూవం నాదర్శం)” “నామనస్సు రెండవవస్తువునం దుండుటచే నాకు వినఁబడలేదు. (అన్యత్రమనా అభూవం నాశ్రౌషం)” అని చెప్పఁబడినది (బృ. ౧. ౫. ౩). దీనివలన నాధిభౌతికసుఖదుఃఖము లనుభవగోచరము

లగుటకు నింద్రియములు మాత్రమె కారణము కానేరదు. మఱియేమన: వానికి మనస్సుయొక్క సాహాయ్య ముండి తీరవలయునని విస్పష్టమగుచున్నది. ఆధ్యాత్మికసుఖదుఃఖములు మానసికములే. ఇటుల పక్కాణించుటచే నన్ని సుఖదుఃఖానుభవములుం దుదకు మనస్సునే యవలంబించి యున్న వని కనఁబడుచున్నది. ఇది సత్య మగునేని, మనోనిగ్రహముచే సుఖదుఃఖానుభవములనిగ్రహము సైతము సాధ్యము కాకపోనేర దని ముందు స్వయముగనే సిద్ధ మగును. ఈయభిప్రాయమునే మనస్సున నుంచుకొని సుఖదుఃఖముల లక్షణములను, మనువు, నైయ్యాయికులలక్షములకంటె వేఱుగఁ జెప్పియున్నాఁడు.—

"సర్వం పరవశం దుఃఖం సర్వ మాత్మవశం సుఖమ్,
ఏత ద్విద్యా త్సమాసేన లక్షణం సుఖదుఖయోః. (మనుస్మృతి. ౪. ౧౬౦)

" పరకీయుల (బాహ్యవస్తువుల) యధీనమైయున్న దంతయు దుఃఖము.మనస్సునకు స్వాధీనమైయున్న దంతయు సుఖము. ఇవియే సుఖదుఃఖములకు క్లుప్తములగు లక్షణములు." నైయ్యాయికులలక్షణములలో నున్న 'వేదనా'శబ్దమునందు శారీరకము, మానసికము నని రెండువిధము లగువేదన లుండుటచే సుఖదుఃఖముల బాహ్యవస్తుస్వరూపము సైతము వారిచేఁ జూపింపఁబడినది. మనువుయొక్క దృష్టి సుఖదుఃఖముల యాభ్యంతరానుభవమందు మాత్రమే యున్నది దనువిషయమును గమనించు నెడల సుఖదుఃఖములయొక్క యీ రెండులక్షణములలో విరోధ ముండదు. సుఖదుఃఖానుభవములకు నింద్రియావలంబన మీరీతిఁ లేకుండుటచే—

"భైషజ్య మేత ద్దుఃఖస్య యదేత న్నానుచింతయేత్"(మ.భా. శాం. ౨౦౫.౨)

" మనస్సుచే దుఃఖచింతన చేయకుండుటయే దుఃఖనివారణకు దివ్య మైన యౌషధము". ఈ న్యాయానుసారముగ నితిహాసములయందు సైతము మనస్సును స్థిరపఱచుకొని సత్యముకొఱకును ధర్మములకొఱకును సుఖముగ నగ్నికాష్ఠములను (మండుచున్నకట్టెలను) భక్షించినటు లనేకదృష్టాంతము లున్నవి. కావున మనము చేయఁదగినదంతయు మనోనిగ్రహముతో నందలిఫలాశను వదలి సుఖదుఃఖముల యందు సమబుద్ధి నుంచి చేయవలయును. అటులు చేసినఁ గర్మములను వదలకపోయినను వానివలన మనకుఁ గలుగుబాధ మనకుఁదగులునని భీతియైనను, తగులుటయైనను, నుండనేర దని గీతలలోఁ జెప్పఁబడియున్నది. ఫలాశ వదలుట యనఁగా, ఫలము లభించినను దానివదలుట యనియైనను, లేక, ఫల మెవరికి నేనాఁడును లభింపదని

వాసనయుంచుటయైనను, అర్థము కానేరదు.' అట్టి ఫలాశయు, మఱియుఁ గర్మ చేయుటయందుఁ గేవల మిచ్ఛ, ఆశ, హేతువు, లేక, ఫలమునందలి ప్రీతి కొఱకు కొం నొకవిషయమును యోజించుటయు, అను వీనియందు విశేష మయినభేదము గలదు. కాలుసేతులు కదల్పవలయునని మాత్రమే యిచ్ఛపుట్టుటకును, ఎవనినైనఁ బట్టు కొనుటకొఱకో, లేక, తన్నుటకొఱకో కాలుసేతులను గదలింపవలయునని యిచ్ఛ పుట్టుటకును భేదమున్నది. మొదటికోరిక కదలించుటకు మాత్రమే కలుగుటచే దాని యందితరకారణ మేమియు నుండదు. "ఈకోరికయే లేనిన్నాఁ డెన్ని పనుల కాటంక మగును. ఈకోరిక యుండినచో ప్రతికర్మకు నేదో యొకపరిణామముగాని, ఫలము గాని యుండు" ననుజ్ఞానము సైతము ప్రతిమనుజున కుండవలయును. జ్ఞానము మాత్ర ముండుటయే కాక, యీఫలమునిమిత్తమై యీకర్మ నిట్లు చేయుము ననుకొనియే యేపనినైనను జేయుటకు యత్నింపవలయును. లేనినాఁ డతఁడు చేయుపను లన్నియు వెఱ్ఱివానిచేతలవలె వ్యర్థము లగును. ఇట్టిసకలేచ్ఛలును, హేతువులును, లేక, యోజనలును, తుదకు దుఃఖమును గలిగించునవియుఁ గానేరవు. వానిని వదలిపెట్ట వలయునని గీతయుఁ జెప్పుట లేదు. అయినను వానికి బహుదూరముగ నదుఁ డింత కంటె నెక్కువగాఁ బ్రవర్తించుటచే "నేఁ జేయుచున్నకర్మకీఫలము. నే నే పనిఁ జేయుచున్నానో యాకర్మకీఫలము తప్పక లభింపవలయు నని చేయు చున్నాను" అను కర్మఫలమువిషయమై కర్తయొక్క బుద్ధిలో నున్నమమత్వాసక్తి, (అహంకారము, అభిమానము, అభినివేశము, లేక, ఆగ్రహము)చే మనస్సు ఆకర్షింపఁబడును. ఇష్టానుసారముగ ఫలము లభించుట కాటంకము కలిగెనేని దుఃఖపరంపరయే యారంభ మగును. ఈ యాటంక మనివార్యమును, దైవకృత్యము నయ్యెనేని యేయాశయు నుండనేరదు. మనుష్యకృత్య మగునేని క్రోధ ద్వేషములు కనిపించి వీనిచేఁ బాపకర్మలను జేయించి, వీనిని నశింపఁజేయును. కర్మపరిణామవిషయికమమత్వయుక్త మగునీయాసక్తికే 'ఫలాశ' యనియు, 'సంగ' మనియు 'అహంకారబుద్ధి' యనియు, 'కామ' మనియు వేర్వేఱుగ నామంబు లిడఁబడినవి. సంసారమం దున్నదుఃఖపరంపర కిచ్చోటు నుండియే సత్య మగు ప్రారంభ మని స్పష్టపఱచుటకు గీతల రెండవయధ్యాయములో విషయసంగము నుండి కామమును, కామమునందుండి క్రోధమును, క్రోధమునుండి మోహమును, తుదకు మనుజునకు నాశమునుగూడ సంభవించు నని చెప్పఁబడినది. (గీ. ౨. ౬౨-౬౩) "జడసృష్టిలో నుండు చేతనములకర్మలును స్వాయముగ దుఃఖములకు మూల

షులు కాకపోవుటచే మనుష్యులకు వానియందుండుఫలాశ, కామము, సంగము అనునవియే సత్యముగ దుఃఖమూలములుగ నున్నవి" అని యిట్లు నిశ్చితమయినపిదప, దుఃఖశాంతికొఱకు విషయములయందలి సంగమును, కామమును, లేక, ఫలాశను మాత్రమే మనోనిగ్రహముచే వదలినఁజాలును. సన్న్యాసమార్గము ననుసరించువారు చెప్పునటుల సర్వవిషయములను, సర్వకర్మలను, సర్వకామములను వదలుట యావశ్యకము కానేరదు. ఇటులే ప్రతివిషయము న్యాయమున నిష్పన్నమగును. కావున "ఫలాశను వదలి యెప్పటివిషయముల నప్పుడు నిష్కామము నిస్సంగము నగు బుద్ధిచే సేవించువారలే సత్యమగు స్థితప్రజ్ఞు" లని, తర్వాత గీతలలోఁ జెప్పఁబడినది. (గీ. ౨. ౬౪.) జగత్తున నున్నకర్మయొక్క వ్యవహారమున కెప్పుడును బ్రతిబంధ ముండదు. మనుజుఁడీజగత్తును వదలినను, ప్రకృతి స్వగుణధర్మానుసారముగఁ బ్రవర్తించుచునే యుండును. జడప్రకృతికి స్వీయము లగుసుఖదుఃఖములు లేవు. మనుజుఁడు తనకు లేని మహత్త్వము నారోపించుకొని ప్రకృతివ్యాపారాసక్తుఁ డగుటచే సుఖదుఃఖములను బొందుచున్నాఁడు ; కాని యీ యాసక్తి గలబుద్ధిని వదలి "గుణాగుణేషు వర్తంతే"— "ప్రకృతియొక్క గుణధర్మముల ననుసరిను స్వవ్యాపారములును నడుచుచునే యున్నవి" (గీ. 3. ౨౮) అను నిట్టి మనబుద్ధిచే సర్వవ్యవహారముల నొనర్చునెడల నసంతోషముయొక్క దుఃఖమేమియు నుండనేరదు. కావున సంసారము దుఃఖప్రధాన మని విలపింపక, లేక, దాని వదలివేయవలయు నని నమ్మక, ప్రకృతియొక్క వ్యాపారమును, ప్రకృతియే చేయుచున్నదని యెఱింగి—

"శ్లో.- సుఖం వా యది వా దుఃఖం ప్రియం వా యది వాఽప్రియమ్
ప్రాప్తం ప్రాప్త ముపాసీత హృదయే నాపరాజితః."

(మ. భా. శాం. ౨౫. ౨౬)

"సుఖము గాని, దుఃఖముగాని, యేది యేవేళ నెటుల ప్రాప్త మగునో దాని నాయావేళలయందే మనస్సును వ్యాకులత్వమును బొందనీయక (అనఁగా: వ్యాకులుఁడవై నీ కర్తవ్యమును వదలక) సేవింపుము." అని వ్యాసులచే ధర్మరాజునకు బోధింపఁబడెను. సంసారమం దున్నకొన్నికర్తవ్యములు దుఃఖమును సహించి సైతము తప్పక చేయవలసివచ్చు ననుసంగతి మనంబున నిడికొన్నపక్షమున, నీయుపదేశముయొక్క మాహాత్మ్యము పూర్ణముగఁ దెలియును. భగవద్గీతలయందును— "యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్." "శుభాశుభములు

ప్రాప్తము లయినను, ఎవఁడు నియమముగ నిస్సంగుఁడై వాని స్తుతి నైనను, నింద నైనను జేయఁడో, వాఁడె స్థితప్రజ్ఞుఁడగును.'' (గీ. ౨. ౫౭) అని స్థితప్రజ్ఞలక్షణమును జెప్పి, యయిదవయధ్యాయమున— "న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్.'' "సుఖము నొంది యుప్పొంగరాదు. దుఃఖము నొంది వ్యసనపడరాదు.'' (గీ. ౫. ౨౦) అనిచెప్పెను. మఱియు రెండవయధ్యాయములో నీసుఖదుఃఖములు నిష్కామబుద్ధిచే సహింపవలయు నని చెప్పఁబడినది. (గీ. ౨. ౧౪-౧౫) మఱియొక స్థలమునందును నీయుపదేశమే మరల మరలఁ జేయఁబడినది. (గీ. ౫. ౯; ౧౩. ౯) వేదాంతశాస్త్రపరిభాషలో దీనికే "కర్మలను బ్రహ్మార్పణము చేయుట'' యని పేరిడుటచే, భక్తిమార్గమునందు 'బ్రహ్మార్పణ'మునకు మాఱుగా 'కృష్ణార్పణ'మను శబ్దమును బ్రయోగించుచున్నారు. ఇదియే సర్వగీతార్థసారము.

కర్మ యెట్టిదైనను, దాని నొనర్చుటలో నిచ్ఛను, ఉద్యోగమును, వదలిపెట్టక స్వకర్తవ్యములందు ఫలాశ నుంచక, పరిణామములందు సంప్రాప్తము లగు సుఖదుఃఖముల ననుభవించుటకు సిద్ధుఁడగుచు నిస్సంగబుద్ధితోఁ జేయవలయును. అట్లు సేయునెడల తృష్ణయొక్కగాని, యసంతోషముయొక్కగాని నివారణమొనర్చికొనకపోవుటచేఁ గలుగుదుష్పరిణామమును తప్పించుకొన వీలు కలుగును. ఇంతియకాక తృష్ణతోనే కర్మను నాశము నొనర్చుటచే జగత్తు నాశ మగు నను ప్రసంగమున కవకాశము లేకయే మనోవృత్తి శుద్ధ మగును. గాన, నట్టికర్మ సర్వభూతహితప్రదముగ నుండును. ఫలాశ నిటుల త్యజించుటకుఁ గూడ, వైరాగ్యముచే నింద్రియములను, మనస్సును, పూర్ణముగ నిరోధింపవలసివచ్చు నను విషయము నిర్వివాదముగనే యున్నది; కాని యింద్రియములను స్వాధీనములుగ నుంచుకొని స్వార్థమునకు మాఱుగ వైరాగ్యముతోడను, నిష్కామబుద్ధితోడను, లోకసంగ్రహార్థమై యాయింద్రియములు దమతమపనులను జేయునట్లు సేయుటయు, సన్యాసమార్గానుసారముగఁ దృష్ణానివృత్తికొఱ కింద్రియముల సర్వవ్యాపారములను (అనఁగా: కర్మముల) నాగ్రహమువలన సమూలముగ నాశనముచేయుటయు నను నీరెంటికిని భూమ్యాకాశముల కున్నంత యంతర మున్నది. గీతలలోఁ జెప్పఁబడినవైరాగ్యమును, ఇంద్రియనిగ్రహమును మొదటిపద్ధతిలోనివి. రెండవపద్ధతిలోనివి కానేరవు. ఈతీరుననే యనుగీతలలోని జనక-బ్రాహ్మణసంవాదములో (మ. భా. అశ్వ. ౩౨. ౧౭-౨౩). బ్రాహ్మణరూపము ధరించివచ్చిన ధర్మదేవతకు జనకచక్రవర్తి—

శ్లో. "శృణు బుద్ధిం చ యాం జ్ఞాత్వా సర్వత్ర విషయో మమ
నాహ మాత్మార్థ మిచ్ఛామి గంధా న్ఘ్రాణగతా నపి.
... ... ... ... ...
నాహ మాత్మార్థ మిచ్ఛామి మనో నిత్యం మనోంతరే
మనో మే నిర్జితం తస్మా ద్వశే తిష్ఠతి సర్వదా".

"ఏ (వైరాగ్య) బుద్ధిని మనంబున నిడుకొని, సర్వవిషయముల నే సేవించు చున్నానో దానిని నీకుఁ జెప్పుచున్నాను. నాసికచే నాత్మార్థమై గంధము నాఘ్రాణించుటలేదు. (నేత్రములచే నాత్మార్థమై చూచుట లేదు. మొ.) మనస్సు నాత్మార్థమై (అనఁగా: స్వలాభార్థమై) యుపయోగపఱుచుట లేదు. కావున నాసికను, (నేత్రములను ఇత్యాదుల) మనస్సును నేను జయించుటచే నవి నాయధీనములై యే యున్నవి." అని వచించెను. కేవల మింద్రియవృత్తినిమాత్రము నిరోధించుకొని మనస్సుచే విషయచింతనము సేయువాఁడు దంభుఁ డగును. మనోనిగ్రహముచేఁ గామ్యబుద్ధిని జయించి సకలమనోవృత్తులకును లోకసంగ్రహార్థముగ స్వస్వవిషయముల కవకాశము నిచ్చువాఁడె శ్రేష్ఠుఁ డగు నని గీతలలో (గీ. 3. ౬-౭.) నున్నదాని కిదియే తాత్పర్యము. "బాహ్యమైనజగత్తు నైన, లేక, యింద్రియవ్యాపారముల నైన నేను బుట్టింపలేదు. స్వభావసిద్ధముగనే యున్నవి; సన్న్యాసి యెంత నిగ్రహముగలవాఁడయ్యును ఆఁకలి యెక్కువగుటచే భిక్షకై పడలు చున్నాఁడు!(గీ. 3. ౩౩); విశేషకాల మొక్కస్థలముననే కూర్చున్నచో, కొంతసేపు లేచి నిలుచును. నిగ్రహ మెంత యొనర్చినను నింద్రియములసహజవ్యాపారము వదల రని మన మెఱింగినచో నింద్రియములవృత్తులను, సకలకర్మములను, అన్నికోర్కులను, అసంతోషమును, నాశముఁ జేయును మనుదురాగ్రహములోఁ బడక (గీ. ౨. ౪౭; ౧౮. ౫౯) మనోనిగ్రహముచే ఫలాశను వదలి సుఖదుఃఖములను సమానములుగ నెంచి (గీ. ౨. ౩౮) నిష్కామబుద్ధితో లోకోపకారార్థమై సర్వకర్మములను శాస్త్రోక్తరీతిగఁ జేయుచుండుటయే కౌశల్యముయొక్క (బుద్ధిశాలితనముయొక్క) మార్గ మని సిద్ధమగుచున్నది. కావున నే—

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సంగో ఽస్త్వకర్మణి. (గీ. ౨. ౪౭.)

"నీ వీకర్మభూమియందు జన్మించినకారణంబున, కర్మములు సేయుటయందే నీకధికార మున్నది; అది సత్యము; కాని యీ యధికారము నీకు విహితమగుకర్మను

చేయుటకే యున్నదని గుర్తించుకొనవలయు" నని భగవంతుఁ డర్జునునకు మొదటఁ జెప్పుచున్నాఁడు. 'ఏవ' అనుపదముచేఁ గర్మయందుఁదప్ప నితరవిషయమున (అనఁగా: కర్మఫలవిషయమై) మనుష్యున కధికారము లేదని యర్థము సహజముగ నగును. విషయ మిటు లూహింపఁబడుటయే కాక రెండవపాదమున— "కర్మఫలవిషయమున నీ కెప్పు డధికారము లేదు. కారణ మేమన:—కర్మఫలము యొక్క సంభవాసంభవములు నీయధీనములు కానేరవు. అవి సదా పరమేశ్వరాధీనములుగఁ గాని, సృష్టియం దున్నకర్మవిపాకము నవలంబించి కాని, యున్నవి" అని భగవంతుఁడు మరల స్పష్టముగఁ జెప్పెను. ఫలవిషయమున మన కధికారము లేక పోవుటచే నిట్టిఫలము గలుగవలయు నని కోరుటయే వెఱ్ఱితనము. ఈమూఁడవ విషయము సైతఁ మనుమానాధీనము కాదు. కావున నీవు కర్మఫలాభిలాషను మనంబున నిడుకొని యేకార్యమును జేయకుము. కర్మవిపాకానుసారముగ నీవు చేయు సర్వకర్మలకును దగినఫలము తప్పకవచ్చును. నీకోరికచే తక్కువగఁగాని యెక్కువగఁగాని శీఘ్రముగఁ గాని యాలస్యముగఁ గాని యగుటకు వీలు లేదు. కావున నిట్టితృష్ణచే నీకు మాత్రము దుఃఖమును బాధయును గలుగు" నని మూఁడవ పాదమునందుఁ జెప్పఁబడినది; కాని, "కర్మలను చేయుము. ఫలాశనువదలుము' అని పటాటోపముఁజేయుచు గూర్చుండుటకంటెఁ గర్మను బూర్ణముగ విసర్జించుటయే మంచిదికదా?" అని యిచ్చట నెవ రయినను—ముఖ్యముగ సన్న్యాసమార్గీయులు— ప్రశ్నఁ జేయుదురు. ఇందునిమిత్తమే తుదకు "కర్మను జేయకపోవుటలో (అకర్మణి) నీవాగ్రహమును బొందకుము. నీ యధికారానుసారముగ ఫలాశను వదలిపెట్టి కర్మనే చేయుచుండు"మని భగవంతుఁడు స్పష్టముగ విధించెను. కర్మయోగదృష్టిచే నీశ్లోకములయం దున్న నాలుగుపాదములయందలి సిద్ధాంతములును, కర్మయోగశాస్త్రమునకు, లేక, గీతాధర్మములకు చతుస్సూత్రి యని చెప్పఁదగినంత మహత్త్వము గలవిగ నున్నవి.

సంసారమునందలి సుఖదుఃఖము లెప్పుడు నొకదానివెంబడి నొకటి వచ్చుచుండును గాని సుఖముకంటె దుఃఖరాశియె తుద కధికముగ నున్నదని సిద్ధమయినను సాంసారికకర్మలను వదలిపెట్టక పోయినయెడల నత్యంతదుఃఖనివృత్తి కావలయు ననియు నత్యంతసుఖమును బొందవలయుననియుఁ గోరుమానవుని ప్రయత్నము వ్యర్థమని యందఱకుఁ దోఁచును. ఆధిభౌతికముమాత్రమేము (అనఁగా: ఇంద్రియగమ్య మగుబాహ్యవిషయోపభోగరూప మగుసుఖము) నపేక్షించినను వాఁడు

తెలిసికొనినసంగతి తప్పని పచించుటకు సాధ్యము కానేరదు. చంద్రబింబమును బట్టుకొనుటకు నాకసముపైకి చేయిచాచు బాలునిపిడికిలిలోనికిఁ జంద్రబింబము లభింపనటుల, అంతములేని సుఖాశచేఁ గేవలాధిభౌతికసుఖము నపేక్షించుటవలన నెప్పుడును అది లభింపదు. ఆధిభౌతికసుఖ మనునది యొక్కటియే సుఖముయొక్క స్వరూపము కానేరదు. కావున దానినిసైతము వదలి యాత్యంతికమును, నిత్యము నగుసుఖమును బొందుటకు మార్గము వెదకుట మంచిది. సుఖమును శారీరకమనియు మానసిక మనియు విభజించినపిదప, శరీరము యొక్క గాని యింద్రియముల యొక్కగాని వ్యాపారమునకంటె మనస్సునకే తుద కధిక మగుమహత్త్వ మీయవలసి వచ్చునని పూర్వమునందుఁ జెప్పఁబడినది. శారీరక మగు (అనఁగా: ఆధిభౌతికమగు) సుఖమునకంటె మానసిక మగుసుఖముయొక్క యోగ్యత యధిక మనుజ్ఞానులయొక్కసిద్ధాంతము జ్ఞానుల మనుగర్వముతో నొనర్చినది కాదు. కావున దానిలోనే శ్రేష్ఠ మగుమానవజన్మయొక్క సత్యమైన మహత్త్వము (సార్థకత) ఉన్నదని ప్రసిద్ధాధిభౌతికవాది యగు 'మిల్లు' తన యుపయుక్తతావాదమునందు వ్రాసిన గ్రంథమున బద్ధాంజలియై యంగీకరించియున్నాఁడు. *పక్కులు, పందులు, ఎద్దు మొదలగునవి సైతము మనుష్యునివలె నింద్రియసుఖములందుఁ బ్రీతిగలవి[illegible]యోపభోగమమాత్రమె యీజగత్తున సుఖ మని మనుజుఁ డెంచినయెడల మనుజుఁడు పశు వగుట కంగీకరించి యుండును. పశువులకు సకలవిషయసుఖములను సదా సంపాదింపవలయు నని కోరికయున్నను, పశువుగా నుండుట కెవ్వరు నొప్పుకొనకపోవుటచేఁ బశువులకంటె మనుజులలో నేదేని యొకయెక్కువ యుండుట విస్పష్టము. ఈ విశేష మేమి యని విచారింతుమేని మనస్సు, బుద్ధియను నీరెంటి మూలమున తనయొక్కయు, బాహ్యసృష్టిజ్ఞానముగల యాత్మయొక్కయు స్వరూపమును విచారింపవలసివచ్చును. ఒకసారి యీ విషయవిచారణఁ జేసితి మేని 'పశువులు మనుజులు,' అను నీరెండుజాతులకును సమానముగనే సాధ్య మగు విషయోపభోగసుఖముకంటె మనోబుద్ధులచేత సాధ్యమగు గొప్పవిషయములయందును మనోబుద్ధుల శుద్ధావస్థయందును నున్నసుఖమే మనుష్యునికి శ్రేష్ఠత్వము, లేక, అత్యంత

---

* It is better to be a human being dissatisfied than a pig satisfied; better to be Socrates dissatisfied than a fool satisfied. And if the fool, or the pig, is of a different opinion, it is because they only know their own side of the question. *Utilitarianism*, p. 14 (Longmans 1907)

సుఖ మగునని మొత్తమువిూఁద తాత్పర్యము తేలును. ఈ సర్వసుఖములు నాత్మాధీనములు (అనఁగా: బాహ్యవస్త్వపేక్ష లేవియు లేనివి, లేక, యితరులసుఖమును తగ్గింప నవసరము లేకయే స్వప్రయత్నముచేతనే స్వయముగఁ బొందఁదగినవి) గావున మనమనోబుద్ధుల నెంత బాగు చేసికొనుచున్నామో యంతేగా నా సుఖస్వరూపము సైతము నంతకంత కెక్కువ శుద్ధముగను అసంకీర్ణముగ నుండును. "మనసి చ పరితుష్టే కో ఽర్థవాన్ కో దరిద్రః?" "మనస్సు తృప్తిఁజెందినయెడల దరిద్రులును ధనవంతులును సమానులుగనే యుందురు." అని భర్తృహరి వక్కాణించి యున్నాఁడు. 'ప్లేటో' యనుపేరు గల గ్రీకుతత్త్వవేత్తయును "శారీరక మగు (అనఁగా: బాహ్యము, లేక, యాధిభౌతిక మగు) సుఖముకంటె మనస్సుఖము శ్రేష్ఠము. మనస్సుఖముకంటె బుద్ధిగ్రాహ్య మైన (అనఁగా: పరమాధ్యాత్మిక మైన) సుఖము శ్రేష్ఠ" మని ప్రతిపాదించెను. * కావున మోక్షవిచారమును దూరముగ నుంచినను ఆత్మవిచారములో నిమగ్న మైనబుద్ధికే పరమసుఖము లభించుట శక్యమగు నని సిద్ధ మగుచున్నది. ఆ కారణముచేతనే భగవద్గీతలలో సుఖము సాత్త్వికము, రాజసము, తామసము, అని త్రివిధముగ విభజించి వానిలో— "తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం ఆత్మబుద్ధిప్రసాదజమ్." "ఆత్మనిష్ఠ (అనఁగ: సర్వభూతముల యందును ఆత్మయొక్కటేయె యని యాత్మయొక్క సత్యస్వరూపమును తెలిసికొని దానియందె సక్త) మయిన బుద్ధియొక్క ప్రసన్నతచేఁ బ్రాప్త మగు నాధ్యాత్మిక సుఖమె సాత్త్వికము (శ్రేష్ఠము)" అని మొదట వక్కాణించి, (గీ. ౧౮. ౩౭) పిదప "ఇంద్రియములనుండియు, నింద్రియవిషయములనుండియుఁ గలుగునట్టి యాధిభౌతికసుఖముయొక్క మార్గము దీనికంటె క్రిందిది (అనఁగా: రాజసము); (గీ. ౧౮-౩౮.) చిత్తమోహజనక మగునట్టియు నిద్రాలస్యములవలనఁ గలుగునట్టియు సుఖము తామసము (అనఁగా అన్నింటిలో కనిష్ఠ మైనది)." అని క్రమముగ వర్ణింపఁబడినది. ఈ ప్రకరణారంభమునం దున్న గీతలలోని శ్లోకము తాత్పర్య మిదియే. కావున నీ పరమసుఖానుభవ మొకసారి యగునేని పిదప నెంతగొప్పదుఃఖములు వచ్చినను నీ స్థితిలో నుండి పురుషుఁడు చలింపనేరఁ డని గీతయే చెప్పుచున్నది. (గీ. ౬. ౨౨.) ఈ యత్యంతసుఖము. స్వర్గమునందలి విషయసుఖములలో సైతము లేని దగుటచే దానిని సంపాదించుటకొఱకు ముందుగ మనబుద్ధి ప్రసన్నము కావలయును. ఈ ప్రసన్నత యేవిధమునఁ గలుగునో విచారింపక విషయోపభోగమునందు మాత్రమె నిమగ్నుఁ డగువానియొక్క సుఖమును క్షణికము ననిత్యము నగును. కారణ మేమియన:—

* Republic, Book IX.

నేఁడున్న యింద్రియసుఖములు రేపుండవు. ఇంతియకాక యేవిషయము మనయింద్రియములకు నేఁడు సుఖకరముగ నుండునో యావిషయమె రేపు మనయింద్రియములకుఁ గారణాంతరములచే దుఃఖకరముగ నుండును. ఉదాహరణ మేమి యన: వేసవికాలములో నేశీతజలము మధురముగను సుఖముగ నుండునో, యదియె శీతకాలమునందు దుఃఖకరముగ నుండును. కానిమ్ము. ఇంతయైనను దానివలన సుఖేచ్ఛయొక్క పూర్ణతృప్తి కాదని సైతము పూర్వమునందుఁ జెప్పఁబడియే యున్నది. కావున 'సుఖ' మనుశబ్దము సాధారణార్థానుసారముగ సర్వవిధసుఖములయందు దుపయోగింపఁబడినను, ఒకసుఖమునకును, మఱియొకసుఖమునకును, పరస్పరభేదము కలదని యొప్పుకొనవలసివచ్చును. ఎప్పుడును వ్యవహారమునందు సుఖ మనఁగా నింద్రియసుఖ మనియె ముఖ్యముగ నర్థ మగుచున్నది; కాని యింద్రియాతీతమును, (ఇంద్రియసుఖమునకంటె మిక్కిలి దూరమున నున్నది) కేవలమునగు నాత్మనిష్ఠగల బుద్ధికి మాత్రము గోచరమగు సుఖమునకును, విషయోపభోగరూప మయినసుఖమునకును భేదము చూపవలసినపుడు, విషయోపభోగ మనెడియాధిభౌతికసుఖమును కేవల సుఖ మనియు, ప్రేయమనియు, నాత్మబుద్ధిప్రసాదజమును (అధ్యాత్మికసుఖమ్ము-...) శ్రేయస్సనియు, కల్యాణ మనియు, హితమనియు, ఆనంద మనియు, లేక... యనియు వక్కాణించుట యభ్యాసమై యున్నది. వెనుకటి ప్రకరణమున...సుపపాదింపఁబడిన కఠోపనిషత్తులోనివాక్యములో ప్రేయశ్శ్రేయశ్శబ్దములలో నచికేతునిచే నుపపాదింపఁబడిన భేదము సైతమీధోరణి నవలంబించియె యున్నది. మృత్యువుచే నతని కగ్నియొక్క రహస్యము తొలుతఁ జెప్పఁబడినది. ఈసుఖము ప్రాప్తమైనపిదప ముందు నచికేతుఁడు తనకాత్మజ్ఞానము చెప్పుమని పెర మడుగఁగా, దానికిఁ బ్రతినిధిగ మృత్యు వనేకము లగు నితరైహికసుఖములచే నతనిని లోభపెట్టెను. ఇట్టి యనిత్య మగునాధిభౌతికసుఖముపై, లేక, ప్రథమదర్శనములోనే రుచించు 'ప్రేయో' వస్తువుపై, భ్రమఁజెందక దూరదర్శియై యాత్మకు శ్రేయమే (అనఁగా: పరిణామమునందుఁ గల్యాణకర మగునాత్మవిద్యయే) కావలయునని నచికేతుఁడు పట్టుఁబట్టి తుదకు దానినిసంపాదించుకొనెను. కావున నాత్మబుద్ధిగమ్యసుఖమును-గాని, లేక, యాధ్యాత్మికానందమును గాని, మన శాస్త్రకారులు శ్రేష్ఠసుఖ మని చెప్పుటచేతను, ఈ నిత్యసుఖ మాత్మవశ మగుటచేతను ఎల్లరును బొందుట కుపయుక్తముగ నున్నదనియు సంపాదించుటకు యత్నింపవలయుననియు దాని సారాంశము. మానవమాత్రునకు పశుధర్మాతిరిక్త మగునొకగొప్పసుఖ మిదియె యై యున్నది. ఈ యాత్మానందము కేవలము బాహ్యోపాధినే యవలంబించి యెప్పు డుండునది

కాదు. కావున నది సర్వసుఖములలోను నిత్యమయినదియు స్వతంత్ర మయినదియు శ్రేష్ఠ మయినదియు నై యున్నది. దీనినే గీతలలో 'నిర్వాణప్రధమగుశాంతి' యని పేర్కొనఁబడి యున్నది. (గీ.౬.౧౫) స్థితప్రజ్ఞునియొక్క బ్రాహ్మీస్థితియందలి పరమావధియగు సుఖము నైతమిద్దియ. (౨.,౭౧; ౬. ౨౮; ౧౩. ౧౭; ౧౮. ౬౨).

ఆత్మశాంతిగాని యాత్మసుఖము గాని యత్యంతశ్రేష్ఠమగు సుఖమగుట చేతను, నది యాత్మవశ మగుటచేతను, అదియెల్లరుఁబొందుటకు యోగ్యముగ నున్న దని నిర్ణయింపఁబడినది. అన్నిలోహములలో బంగారు మిక్కిలి విలువగలది యైనను ఇనుము మొదలగు నితరలోహముల యావశ్యకత యెట్లులేకపోదో, చక్కెర మిక్కిలి మధుర మయిన దయినను, ఉప్పు లేనిది యెటుల పని జరగదో, యటులే యాత్మసుఖము, లేక, శాంతి గొప్పదైనను శారీరకసుఖ మవసరము కాకపోనేరదు. ఏమి లేకున్నను శరీరధారణార్థ మైనను ఐహికవస్తులయొక్క సంబంధ మీశాంతికిఁ గావలయుననునది నిర్వివాదాంశమే. ఈయభిప్రాయముచేతనే యాశీర్వాదముయొక్క సంకల్పమునందుఁ గేవలము "శ్శాంతిరస్తు" అని చెప్పక "శాంతిః పుష్టి స్తుష్టి శ్చాస్తు" (అనఁగా: శాంతితోఁ గూడ పుష్టితుష్టులు రెండును కావలయు) అని చెప్పుట వాడుకయై యున్నది. కేవలము శాంతిచేతనే తుష్టి యగు నని శాస్త్రకారుల కభిప్రాయ మగు నేని యీసంకల్పమునందు 'పుష్టి' యనుపదము చేర్చుటకు నేమియుఁ గారణ ముండకపోవును. అయినను పుష్టి (అనఁగా: ఐహికసుఖముయొక్క యభివృద్ధి)యే కావలయు నని యెప్పుడు ననుకొనఁ దగదు. కావున శాంతి, పుష్టి, తుష్టి (సంతోషము) అను నీమూఁడును యోగ్యముగ నీచేఁ బొందఁబడుఁ గాక యనియు నీవు వీనిని సంపాదించుకొనవలయుననియు, ఈ సంకల్పమునందలి భావార్థమై యున్నది. కఠోపనిషత్తునను నిదియే తాత్పర్యము. నచికేతుఁడు మృత్యువుయొక్క (అనఁగా: యమునియొక్క)లోకమునకు వెళ్లినపుడు యముఁడు నచికేతుని మూఁడువరముల నడుగుమనిచెప్పఁగాఁ దదనుసారముగ నాతఁ డడిగిన మూఁడు వరముల నిచ్చెను. ఈవిషయమె యీ యుపనిషత్తున సవిస్తారముగ వర్ణింపఁబడినది; కాని మృత్యువు వర మడుగు మని చెప్పఁగానే నచికేతుఁడొక్కమారే (మొదటనే) బ్రహ్మజ్ఞానము చెప్పు మని వర మడుగక, "నాతండ్రి కోపించినాఁడు కావున నతనిని నాకు ప్రసన్ను నిఁ జేయుము" అని మొదటివరమును, పిదప "అగ్నియొక్క (అనఁగా: ఐహికసమృద్ధినిఁ బొందించుటకు సమర్థమగుయజ్ఞాదికర్మలయొక్క) జ్ఞానము నుపదేశింపు మని రెండవవరము నడిగెను. ఈవరమును బొందిన

పిమ్మట(దుదకు "నా కాత్మవిద్యను పివ్యాఖ్యానింపు"మని మూఁడవవరము నడిగెను; గాని యీ మూఁడవవరమునకు మాఱుగ నింక విశేష మగుసంపత్తు నిచ్చెద నని చెప్పఁగా—ప్రేయఃప్రాప్తికి మాత్ర మావశ్యక మగుయజ్ఞాదికర్మలయొక్క జ్ఞానప్రాప్తి యయినపిదప వానివిషయ మగునభిలాషను జెందక—"ఇప్పుడు మోక్షము నిచ్చునట్టిబ్రహ్మజ్ఞానమునె నా కుపదేశింపుము" అని నచికేతుఁడు పట్టుఁబట్టెను. ఈయుపనిషత్తు తుదనుండుమంత్రములో నున్నరీతిగ బ్రహ్మవిద్య, యోగవిధి (అనఁగా: యజ్ఞయాగాదికర్మల్లు) అను నీరెంటిని పొంది నచికేతుఁడు మోక్షమునొందెను. (కఠ. ౬.౧౮) అని సారాంశము. దీనివలన జ్ఞానకర్మసముచ్చయమే యీయుపనిషత్తునకుఁ దాత్పర్యమని సిద్ధాన్త మగుచున్నది. ఇంద్రునివిషయమై యిట్టికథ యొకటి కలదు. ఇంద్రుఁడు స్వయముగ బ్రహ్మజ్ఞానముచేఁ బూర్ణుఁడై యున్నాఁడనునదియె కాక ప్రతర్దనున కాయనచే నాత్మవిద్య యుపదేశింపఁబడిన దని కౌషీతక్యుపనిషత్తులోఁ జెప్పఁబడినది. అయిన నింద్రునకు రాజ్యము పోయి ప్రహ్లాదుఁడుఁ త్రైలోక్యాధిపతియయినపిదప దేవతలగురు వగుబృహస్పతిపద్దకు నింద్రుఁ డేఁగి "శ్రేయస్సు దేనిలో నున్నదో దానిం జెప్పుము" అనియడిగెను. అప్పుడు బృహస్పతి రాజ్యపదభ్రష్టుఁ డగునింద్రునకు బ్రహ్మవిద్య (అనఁగా: ఆత్మజ్ఞానము) నుపదేశించి "ఇంతియ శ్రేయము (ఏతావచ్ఛ్రేయ ఇతి)" అని వచించెను; కాని ఇంద్రుఁ డంతమాత్రమునకే సమాధానము నొందక "ఇంక నేమి యయిన విశేషంబు గలదా? (కో విశేషో భవేత్.)" అని మరల నడుగ బృహస్పతి యింద్రుని శుక్రునియొద్ద కంపెను. అచ్చోటను లే యగుటచే "ప్రహ్లాదున కావిశేషము తెలియు" నని శుక్రుఁడు పలికెను. ఇంద్రుఁడు బ్రాహ్మణవేషధారియై ప్రహ్లాదునికడ కేఁగి తుదకు శిష్యుఁడై కొంతకాలము సేవించినపిదప శీలము (సత్యముగను ధర్మముగను నడచుట యనుస్వభావము) అనునదియె త్రైలోక్యాధిపత్యము సంపాదించుటకొఱకు మూలకారణము గాన నదియె శ్రేయస్సని ప్రహ్లాదుఁ డింద్రునకుఁ జెప్పెను. తరువాత "నీసేవచే నేను సంతుష్టుఁడ నయితిని. నీవడిగినవరమును నీ కిచ్చెదను" అని ప్రహ్లాదుఁడు చెప్పఁగా "నీశీలము నా కిమ్ము" అని విప్రవేషధారి యగునింద్రుఁడు కోరెను. ప్రహ్లాదుఁ డందులకు వల్లె యన, వెంటనే శీలము, పిదప ధర్మము, సత్యము, సచ్చరిత్రము, తుద నైశ్వర్యము ననుదేవతలు ప్రహ్లాదుని యొడలినుండి వెడలి యింద్రునిశరీరమునందుఁ బ్రవేశించినవి. దానిమూలమున నింద్రుఁడు రాజ్యమును బొందెను. అని భారతమున శాంతిపర్వమున (శాం. ౧౨౪) భీష్ముఁడు ధర్మరాజున కొకప్రాచీనకథను వ్యాఖ్యానించెను.

కేవల మొకయైశ్వర్యముకంటె నొకయాత్మజ్ఞాన మధికయోగ్య మైన దయినను, ఈజగత్తునం దుండి వ్యవహరింపవలయు నని కోరిక గలవానికి లోకానుసారముగ నైహికసమృద్ధి తనకుఁ గాని తనదేశమునకుఁ గాని సంపాదించుకొనునావశ్యకత ప్రసిద్ధమగుచున్నఁ గావున, మానవున కీజగత్తునఁ బరమసాధ్య మగునది యేమి యను ప్రశ్నకు శాంతియుఁ బుష్టియు, ప్రేయము శ్రేయము, లేక, జ్ఞానము ఐశ్వర్యము, అను నీరెంటియొక్క సముచ్చయమే యాకర్మయోగశాస్త్రమునందలి కడపటి యుత్తర మని యీసుందరమయినకథవలన స్పష్ట మగును. 'భగవంతునికంటె మఱి యొకఁడు ఈజగత్తునందు శ్రేష్ఠుఁడు లేఁడో, ఎవనిమార్గము నవలంబించి యితరులు నడచుచున్నారో (గీ. ౩. ౨౩.) ఆభగవంతుఁడు సంపత్తిని (ఐశ్వర్యమును) వదలెనా యేమి ?—

"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసశ్శ్రియః,
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా." (విష్ణు. ౬. ౫. ౭౪.)

"సమగ్ర మైనయైశ్వర్యము, ధర్మము, యశస్సు, సంపత్తి, జ్ఞానము, వైరాగ్యము, అను నీయాఱువిషయములకు 'భగ' మని పేరు." అని భగశబ్దమునకు వ్యాఖ్యానము పురాణములలోఁ జేయఁబడినది. ఈశ్లోకములో నైశ్వర్యశబ్దార్థము యోగైశ్వర్యములని పఠింతురు. కారణ మేమి యన: 'శ్రీ' యన సంపత్తియర్థము. ఈ శబ్దము మున్ను వచ్చియున్నదే. వ్యవహారములో నైశ్వర్యశబ్దమునందే సత్తయును, యశస్సునకును, సంపత్తికిని, జ్ఞానశబ్దమునందె వైరాగ్యమునకును, ధర్మమునకును సమావేశముండుటచేఁ బూర్వోక్తశ్లోకమునం దున్నసకలార్థములు జ్ఞానైశ్వర్యపదములచేతనే లౌకికదృష్టిచే స్పష్టపడుచున్నవని చెప్పుట కేమియు నభ్యంతరము లేదు. ఎందునిమిత్తము జ్ఞానైశ్వర్యములజంట భగవంతునిచే నంగీకరింపఁబడినదో యా హేతువుచే, నావిషయము ప్రమాణమే యని యెఱింగి యితరులు సైతము దాని నాచరింపవలయును. (గీ. ౩. ౨౧. మ. భా. శాం. ౩౪౧. ౨౫). ఆత్మజ్ఞానమను నదియె యీజగత్తునందుఁ బరమసాధ్య మగుసిద్ధాన్త మనియు, సంసారము దుఃఖమయము గాన దాని బొత్తిగ వదలవలయుననియుఁ జెప్పువారు సన్న్యాసమార్గములోనివారు గాని, కర్మయోగమార్గములోనివారు కారు. వేర్వేఱుమార్గములం దున్న యీసిద్ధాన్తముల నొకచోటికిఁ జేర్చి గీతార్థమును విపరీతముఁ జేయుట యోగ్యము కానేరదు. అయినను జ్ఞానవిహీన మగుసంపత్తి, ఆసురీసంపత్తియని గీతలలోనే చెప్పఁబడెను. కావున నైశ్వర్యముతోడ జ్ఞానమును, జ్ఞానముతోడ నైశ్వర్యమును,

శాంతితోడఁ బుష్టియు, బుష్టితో శాంతియును జతగా నుండి తీరవలయు నని సిద్ధమగుచుండఁగ జ్ఞానముతోఁబాటు నీశాంతిపుష్టులు రెండు నేల యుండరాదు?. జ్ఞానముతోడనైన నైశ్వర్యము కావలయు నని చెప్పినయెడల కర్మ చేయవలసినదనుట ముఖ్యముగనే ప్రాప్త మగును. ఏలన: "కర్మాణ్యారభమాణం హి పురుషం శ్రీర్నిషేవతే" "కర్మఁ జేయుమనుజునకే యీజగమున శ్రీ (అనఁగా: ఐశ్వర్యము) లభించును" (మను. ౯. ౩౦౦.) అని మనువు సెప్పినందునఁ బ్రత్యక్షానుభవముచే నావిషయమే సిద్ధమగును. గీతలలో నర్జునునకుఁ జేసినయుపదేశము నైత మటులె యున్నది (గీ. ౩. ౮.). మోక్షదృష్టిచేఁ గర్మ యావశ్యక మయినది కాకపోవుటచేఁ దుదకు (అనఁగా: జ్ఞానప్రాప్త్యనంతరము) సర్వకర్మలు వదలియే తీరవలయు నని యనేకులు సెప్పుచున్నారు; కాని ప్రస్తుతము సుఖదుఃఖముల విచారముమాత్రమే కర్తవ్య మైనది గావున, మోక్షకర్మలస్వరూప మిప్పటికిని బరీక్షింపకుండుటచే నాయాక్షేపణకు సమాధాన మిప్పుడు చెప్పుట సాధ్యము కానేరదు. ముందు ౯-౧౦ ప్రకరణములలో నధ్యాత్మమును, కర్మవిపాకమును లెస్సగ విచారించి పదునొకండవప్రకరణములో నీయాక్షేపము సంభవింపఁదగినది కానేర దని నిరూపించెదము.

సుఖదుఃఖములు రెండును భిన్నములును. స్వతంత్రములు నయినవేదనలుగ నున్నవి. కేవలసుఖోపభోగముచేత నేఁసుఖేచ్ఛ తీరదు. కాన సంసారమం దెల్లప్పుడును దుఃఖరాశియె యధికముగ నున్నట్లు కనఁబడుచున్నది. ఈదుఃఖమును తప్పించుకొనుటకుఁ దృష్ణను,అసంతోషమును, కర్మములను సమూలముగ నాశముసేయుట యోగ్యము కానేరదు. కావున నొక్క ఫలాశనుమాత్రము వదలి సర్వకర్మములఁ జేయుచుండవలయు ననుట శ్రేయస్కరముగ నున్నది. కేవలవిషయోపభోగసుఖ మెప్పుడును బూర్ణమగునది కాదు. అది యనిత్యమును, పశుధర్మము నగుటచే బుద్ధీంద్రియములు గలమానవులకు నీజగత్తునందు సత్య మైనధ్యేయము, దీనికంటె నున్నత స్థానమును గావలయును. ఆత్మబుద్ధిప్రసాదముచేఁ బ్రాప్త మగు శాంతిసుఖ మను నదియే సత్య మగుధ్యేయ మగును. ఆధ్యాత్మికసుఖ మీరీతిగ శ్రేష్ఠ మైన దైనను, ఈజగత్తునం దాధ్యాత్మికసుఖము నొందుటకు నుచితము లగునైహికవస్తువులతో సంబంధ మావశ్యక మగును. అందుచే నిష్కామబుద్ధితోఁ బ్రయత్నము (అనఁగా: కర్మ)చేయవలయును. ఈవిషయము కర్మయోగశాస్త్రానుసారముగ సిద్ధ మైనపిదప సుఖము కావలయు ననునుత్సాహముతో విచారించినను కేవలాధిభౌతికసుఖ మనునదియే

పరమసాధ్యమని, యొప్పుకొని కర్మసంబంధమైనదియు కేవలసుఖదుఃఖాత్మకము నైయి నదియు నగు బాహ్యపరిణామముయొక్క తారతమ్యముచేతనే నీతిమత్తను నిర్ణయించుట యోగ్యము కానేరదని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. ఏలయన: ఎప్పుడును స్వయముగఁ బరిపూర్ణావస్థనొందుటకు సమర్థము గానివస్తువు పరమసాధ్యమని యంగీకరించుట పరమ శబ్దోపయోగముఁ జెఱచుటయే కాక, యెండమావులయందు నిజముగ జల మున్నదనుటవలె నయోగ్య మగును. పరమసాధ్యమె యనిత్యము నపూర్ణము నయినయెడల దానిఁగోరుటచే,మనయొడిలో నైనను ననిత్యవస్తువు తప్ప రెండవ దేది పడును? ''ధర్మో నిత్యః సుఖదుఃఖే త్వనిత్యే'' అను వచనమునందున్నమర్మ మిదియె. ''అనేకుల కధికసుఖ'' మను నీశబ్దార్థ మేమియని తెలిసికొనుటలో నాధిభౌతికవాదులలో సైతము, చాల మతభేదము కలదు. మనుజుఁ డనేక పర్యాయములు సర్వవిషయసుఖముల నణఁగ ద్రొక్కి సత్యముకొఱకును, ధర్మము కొఱకును ప్రాణము నిచ్చుటకు నియ్యకొనుటచే నాతనికోరిక యప్పుడును నాధిభౌతికసుఖప్రాప్తియందే యుండునని చెప్పుట యుక్తముకాదని యీపండితులలో ననేకు లభిప్రాయ పడుచున్నారు. కావున, సుఖశబ్దస్థానమున హితశబ్దమునైనను కల్యాణశబ్దము నైనను జేర్చి ''అనేకుల కధికసుఖ'' మను సూత్రమును ''అనేకుల కధిక హితము''లేక,''యనేకుల కధికకల్యాణ''మని మార్పొనరింప నగుననిచెప్పిరి; కాని యిటు లొనర్చినను గర్తయొక్క బుద్ధి యెట్టిదై యుండవలయునో తేలదే దను మొదలగుదోషములును నీమతమందు సైతము స్థిరముగనున్నవి. మంచిది! విషయసుఖములతో మానసికసుఖముల సైతము విచారింపవలయుననిన, ఏకర్మయొక్క నీతిమత్తయైనను దానిబాహ్యపరిణామముఁబట్టియే స్థిరపఱుపవలయు ననెడి ప్రథమ ప్రతిజ్ఞకు విరోధము కలుగుటయేగాక కొలఁదిగ నధ్యాత్మపక్షము నొప్పుకొనినటు లగును. కాని యిట్లు చివరకు నధ్యాత్మపక్షము నవలంబింపక తప్పనియెడల కొంత మాత్రమే యొప్పుకొన్న నేల? కావున సర్వభూతహితమును, ననేకుల కధికసుఖమును, మనుష్యత్వముయొక్క పరమోత్కర్షయు, మొదలగు నీతినిర్ణయమునకు సర్వబాహ్యసాధనములు (అనఁగా: అధిభౌతిక మార్గములు) గౌణము లని స్థిరపఱచి యాత్మప్రసాదరూప మగునత్యంతసుఖమును, దాని ననుసరించి యుండు కర్తయొక్క శుద్ధబుద్ధియు ననునీ యాధ్యాత్మికనికషోపలముచేఁ గర్మాకర్మల పరీక్షఁ జేయవలయు నని మాకర్మయోగశాస్త్రమునందుఁ దుదకు సిద్ధాంతీకరింపఁబడినది. ఏ విషయ మైనను సరే, దృశ్యమైనసృష్టికంటె దూరముగ నుండుతత్త్వజ్ఞానమునం

దఁ బ్రవేశించుట యవసరము లేదని శపథము సేయువారివిషయము వేఱు. అట్టి ప్రతిజ్ఞ లేనివారి కీ కర్మయోగశాస్త్రమున మనోబుద్ధులను శుద్ధపఱుచుకొనుటయే కాక, నిత్య మగునాత్మయొక్క నిత్యకల్యాణమే ప్రధాన మని చెప్పవలయు ననుట యుక్తిచేసైతము ప్రాప్త మగుచున్నది. వేదాన్తములోనికిఁ జొచ్చిన, సర్వము బ్రహ్మమయ మగుటచే వ్యవహారము సేయుటకు వీలు లేదని యనేకులు సెప్పుయుక్తి సరియగునది కానేరదు. సామాన్యముగ, వేదాన్తమునఁ బ్రచారములో నున్న పఠనపాఠనగ్రంథము లన్నియు, సన్న్యాసమార్గానుసారులచేతనే వ్రాయఁబడియుండుటచే, సన్న్యాసమార్గమునకుఁ దృష్ణారూప మగుసంసారము సర్వము నిస్సారముగఁ దోఁచుటచే, వారిగ్రంథములలోఁ గర్మయోగముల కుపపత్తి యనుకూలముగఁ జెప్పఁబడకయుండుట యథార్థమే. వేయేల? ఈపరసంప్రదాయమును సహింపనిగ్రాంథికులు సన్న్యాసమార్గమం దున్నపూర్వపక్షసిద్ధాన్తములరీతిని కర్మయోగములో గ్రుచ్చి, సన్న్యాసము, కర్మయోగము ననునవి రెండును స్వతంత్రమార్గములు గావనియు, సన్న్యాసమనునది యొక్కటియే శాస్త్రోక్త మగుమోక్షమార్గమనియుఁ దెలుపుటకు యత్నించుచున్నారు. కాని యీమతము సత్యము కానేరదు. సన్న్యాసమార్గమువలెఁ గర్మయోగమార్గము సైతము వైదికధర్మములం దనాదిగ స్వతంత్రముగ వచ్చుచున్నది. మఱియు నీమార్గప్రవర్తకులు, వేదాన్తతత్త్వమును వదలక, కర్మయోగశాస్త్రమునకుఁ దగినయుపపత్తినిఁ జెప్పుచున్నారు. భగవద్గీతయను గ్రంథము సైత మీమార్గము ననుసరించినదియే. గీతల నదలినను, అధ్యాత్మదృష్టితోఁ గార్యాకార్యశాస్త్రముయొక్క వివేచనఁ జేయుపద్ధతి నింగ్లాండులో నుండిన 'గ్రీన్' వంటి గ్రంథకారులు స్వయముగ నారంభించిరి. *జర్మనీదేశమునం దన్ననో యది 'గ్రీన్'కాలమునకంటెఁ బూర్వమునందే యారంభింపఁబడినది. దృశ్య మగుసృష్టి నెంతవిచారించినను, ఈసృష్టినిఁ జూచువాఁడును, కర్మలఁజేయువాఁడును, నెవఁడైనదియుఁ దెలియునంతవఱకు మానవున కీజగంబున ముఖ్యముగఁ గర్తవ్యతావిచారము తత్త్వసంబంధ మగుదృష్టితోఁ జూచిన నపూర్ణముగనే యుండును. "ఆత్మా వా అరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అను యాజ్ఞవల్క్యుని యుపదేశసైతము నీప్రకరణమునకు ముఖ్యముగ సంబంధించియే యున్నది. దృశ్య మగుజగత్తును పరీక్షింపఁగా పరోపకారమువంటి సిద్ధాన్తములు

---

* Prolegomena to Ethics, Book I; and Kant's Metaphysics of Morals (trans. by Abbot in Kant's Theory of Ethics).

తుదకు వెలువడిన పక్షమున నధ్యాత్మవిద్యయొక్క మాహాత్మ్యము కొఱపడదు. విపరీతముగ సర్వభూతములయందును నొకయాత్మయే యున్నదనువాదమును దృఢపఱుచుచున్నే యున్నదని నుడువవలయును: ఆధిభౌతికవాది స్వయముగ తెచ్చిపెట్టుకొనిన నియమమును వదలి, దూరముగ నేఁగుటకు వీలుకానేరదను దానికి ప్రతిక్రియ యేమియు లేదు. మనశాస్త్రవాదుల దృష్టియింతకంటెను దూరదర్శి యగుటచే నధ్యాత్మదృష్టిచేఁ గర్మయోగశాస్త్రమునకుఁ బూర్ణ మగునుపపత్తి చెప్పఁబడినది. కాని యీ యుపపత్తినిఁ జెప్పుటకంటెఁ బూర్వమునందుఁ గర్మాకర్మ పరీక్ష యొక్క రెండవ పూర్వపక్షమును గొంచెము విచారించుట యావశ్యక మగుటచే నామార్గము నిప్పుడు తర్కింతము.

గీతారహస్యమున సుఖదుఃఖవివేక మను పంచమప్రకరణము.

---

# షష్ఠ ప్రకరణము.

---

## ఆధిదైవతపక్ష - క్షేత్రక్షేత్రజ్ఞవిచారము.

"సత్యపూతాం వదే ద్వాచం మనఃపూతం సమాచరేత్." *

మను. ౬. ౪౬.

ఆధిభౌతికమార్గమె కాక, కర్మాకర్మ పరీక్షను నాధిదైవత మని సైతము మఱి యొకమార్గము గలదు. ఈమార్గావలంబకు లీతీరున నుడివెదరు:—మానవుఁడు కర్మాకర్మలను, లేక, కార్యాకార్యములను నిర్ణయించుసమయమునం దేకర్మవలన నెవరి కెంత సుఖమో, లేక, దుఃఖమో కలుగునని కాని, దానిలో సగుటునకు సుఖరాశి యధికమా? దుఃఖరాశి యధికమా? యని కాని విచారింపఁడు. ఆత్మానాత్మవిచారము నందు సైత మెప్పుడును ప్రవేశింపఁడు. అనేకు లగుజను లీకోలాహల మెఱుంగరు. వేయేల? ప్రతిమనుజుఁడు నాత్మసుఖార్థమే ప్రతికర్మను జేయు నను నియమమును లేదు. ఆధిభౌతికవాది యేయుక్తి చెప్పినను జెప్పుఁగాక!. ధర్మాధర్మముల నిర్ణయించు మనుజుని మనస్స్థితి యెటు లుండునని క్షణమాత్రము విచారించితిమేని, మనుజుని మనస్సున నుండునవియు, స్వాభావికములు, నుదాత్తములు నగు కారుణ్యము, దయ, పరోపకారము మొ॥ లగు మనోవృత్తులే యొక్క—సారిగ నొకానొక కార్యముఁజేయు టయం దతని నెప్పుడును ప్రేరణఁజేయునని మనకు స్పష్టముగఁ దోఁచును. ఉదాహరణ మేమియన:—ఒకదరిద్రుని మనము చూచితిమేని. *జత్తయినను దర్మాచరణ నేసినచో జగత్తునకు, లేక, మనయాత్మకు నెంతకల్యాణమారంభింపఁ సంగతి తోఁపక మునుపే దయార్ద్రహృదయులమై స్వశక్త్యనుసారముగ ధర్మాచరణ మొనరించి ముక్తుల మగుచున్నాము. బాలుఁ డేడ్చె నేని యతనికి పాలిచ్చినచో నెందతి కెంత హిత మగు ననే యేమియు విచారింపక తల్లిపా లిచ్చుచున్నది. అనఁగా: ఈయుదాత్తమనోవృత్తియే కర్మయోగశాస్త్రమునకు ముఖ్య మగు మూలబంధము (పునాది)గ నున్నదని తాత్పర్యము. ఈమనోవృత్తిని మన కెవ్వారు నొసంగలేదు. గావున

---

* "ఎయ్యది సత్యముచేఁ బవిత్రము(అనఁగా: శుద్ధము)గాఁ జేయఁబడినదో, యట్టివాక్యమునే పలుకవలయును. అట్లే యెయ్యది మనస్సునకు శుద్ధముగఁ దోఁచునో, దానినే యాచరింపవలయును."

స్వభావ సిద్ధమగు (అనఁగా: ఒకదృష్టితో స్వయంభూస) యగు దేవతగా నున్నది. న్యాయమూర్తి తనగద్దియపైఁ గూర్చున్నప్పుడు న్యాయదేవతచే స్ఫురింపఁజేయఁబడిన న్యాయమును నిర్ణయించుచున్నాఁడు. ఈస్ఫురణము వానియనోవృత్తియందు లేనప్పుడతనివలన నన్యాయము వాటిల్లును. న్యాయదేవతవలెనె, కారుణ్యము, దయ, పరోపకారము, కృతజ్ఞత, కర్తవ్యప్రేమ, ధైర్యము మొదలగుసద్గుణములయొక్క స్వాభావిక మగుమనోవృత్తియు దేవతగ నున్నది. ఈదేవతలశుద్ధస్వరూపమెట్టిదైనది యుఁ బ్రతిమానవునకును సహజముగనే తెలియును; కాని, లోభముచేఁ గాని, ద్వేషముచేఁ గాని, మాత్సర్యముచేఁ గాని, లేక, యిట్టిమఱియొక కారణముచేఁ గాని యీ దేవతలయొక్క స్ఫురణము తనయభిప్రాయములో లేనివానిని దేవత లేమి చేయఁగలదు? ఇది సత్య మగునా? యని కాని, లేక, యనేకసమయములందు దేవతలకుఁ బరస్పరకలహ ముండుటచేత నొకకార్య మొనర్చినప్పుడే దేవతయొక్క స్ఫూర్తి బలవత్తర మని యెన్నవలయు ననికాని, మనము సంశయించుమాట సత్యమే. మఱియు నీసందేహమును నిర్ణయించుటకు, న్యాయము, కరుణ మొదలగుదేవతలకంటె వే అగువారితో నాలోచింపవలసివచ్చునని తోఁచును; కాని యిట్టి సమయములయందుసైత మధ్యాత్మవిచారముయొక్క గాని, సుఖదుఃఖములతారతమ్యముయొక్క గాని కోలాహలములోఁ బడక మనమనోదేవతయొక్క సాక్ష్యము నడుగుదు మేని, యాదేవతయే రెంటిలో నేమార్గము శ్రేయస్కరముగ నున్నదియు వెంటనే నిర్ణయించు చుండును. ఆకారణముననే వెనుకఁ జెప్పినసకలదేవతలకంటె మనోదేవతయే శ్రేష్ఠురాలు. 'మనోదేవతా' శబ్దమందు, మనస్సునందు కోరిక, క్రోధము, లోభము మొదలగు వికారముల నన్నింటిని జేర్పక, మనస్సున నున్న సదసద్వివేచకము, నీశ్వరదత్తము, లేక, స్వాభావిక మైనది యగు శక్తి మాత్రమే యీ ప్రకరణమునందు వివక్షయొనరింపవలసిన దని తెలియవలయును. ఈశక్తికే 'సదసద్వివేకబుద్ధి*' యని గొప్పపేరు కలదు. కావున నేసంశయము కలిగినను స్వస్థాంతఃకరణముతోడను, శాంతముతోడను విచారించినయెడల నీ 'సదసద్వివేకదేవత' యెప్పుడు నతని మోసగింపదు. ఇట్టిసమయములందు "నీవు నీమనస్సున విచారించుకొమ్ము" అనియే మన మితరులకుఁ జెప్పుచున్నాము. ఏసద్గుణమున కేసమయమున నెంతమహత్త్వ మీయవలయునో యీమహాదేవత యొకపట్టిక (జాబితా)

---

* ఈ సదసద్వివేకబుద్ధియే యింగ్లీషులో Conscience అని చెప్పఁబడును. మఱియు అధిదైవతపక్షము Intuitionist School అని చెప్పఁబడును.

నెప్పుడును సిద్ధము చేసియుంచును గానఁ దదనుసారముగ నాయాసమయ ములం దీమనోదేవత తననిశ్చయములను వెంటనె ప్రకటనఁ జేయును. ఒకానొకసమ యమం దాత్మసంరక్షణమునకు నహింసకు విరోధము గలుగుటచే(అనఁగా: దుష్కా లము వచ్చినప్పుడు) అభక్ష్యభక్షణముఁ జేయవచ్చునా? కూడదా?యని మనము సంశ యపడుదు మేని; మనము శాంతచిత్తులమై యీమనోదేవతకే యధీనము(కొలు నిచ్చు టు) చేసితిమేని వెంటనే "అభక్ష్యభక్షణము చేయుము" అని నిర్ణయము వెలువడును. అటులె స్వార్థమునకుఁ గాని, పరార్థమునకుఁ గాని, లేక, పరోపకారమునకుఁ గాని పరస్పరవిరోధము గలిగె నేని దానినిర్ణయమును సైతము నీమనోదేవత చెప్పినటులే చేయవలయును. శాంతముగ విచారింపఁగా మనోదేవత గృహములో నున్న యీ ధర్మాధర్మ తారతమ్యపట్టిక యొక గ్రంథకారునకు లభించుటచే నతఁడు తనగ్రంథమున ప్రచురపఱచెను *ఈపట్టికలో నమ్రతాపూర్వకమగు పూజ్యభావమునకు నగ్రస్థాన ము (అనఁగా: అన్నిటికన్న గొప్పది యగుస్థాన) మీయఁబడెను. దానివెంబడి కారు ణ్యమునకును, పిదప కృతజ్ఞత, ఔదార్యము, వాత్సల్యము మున్నగువానికిని, ఒకటి వెంబడి నొకదానికి క్రమముగ నీచస్థానము లీయఁబడినవి. ఈనీచస్థానము లందున్న సద్గుణములకు నగ్రస్థానమునందలి సద్గుణములకును విరోధము వచ్చె నేని యగ్రస్థాన దేవతకే యధికాధిక మగుగౌరవము నీయవలయు నని యీగ్రంథకారుని యభిప్రా యము. కార్యాకార్యములను గాని ధర్మాధర్మములను గాని నిర్ణయించుట కాతని మతమందు దీనికంటె యోగ్య మగుమార్గము గాన్పింపదు. కారణ మేమన: దృష్టిని మన మెంతదూరము ప్రసరింపఁజేసి యనేకుల కధికస[illegible]ున్నదో దాని నిశ్చ యించినను,అనేకులకు దేనియందు హితమున్నదో దాని[illegible]ను శక్తిగాని యధి కారము గాని యీతారతమ్యబుద్ధియందు లేనందున, [illegible] కనేకులహితము నేనేల చేయవలయు ననునంశముయొక్క నిర్ణయము కామిచే, ప[illegible]రల నన్నిశంకలును యథా ప్రకారముగఁ గలుగుచునే యున్నవి. ఏన్యాయమూర్తియును ప్రభువువలన నధికా రము నొందకయే యొక న్యాయనిర్ణయమును జేసె నేని,యానిర్ణయముయొక్క ఫలి

* ఈ గ్రంథకారునిపేరు James Martineau. (జేమ్సుమార్టినో). ఈ విషయమును తన *Types of Ethical Theory* (Vol. II. P. 266. 3d Ed.) అను గ్రంథమున సూచించియున్నాఁడు. ఈమార్టినో ఈమార్గమునకు Idio-psychological అని పేరుపెట్టెను ; కాని నేను దాని నీ యాధిదైవతపక్షములోనే చేర్చితిని.

తము వలెనే, సుఖదుఃఖములను దూరదృష్టిచే విచారించి చేసినకార్యాకార్యముల నిర్ణయమును, "నీ విట్లు చేయుము. నీ కిది చేయఁ దగినదియే" యన్ని కేవలదూరదృష్టి యొకరికిని జెప్పనేరదు. కారణమేమి యన: దూరదృష్టి యయినను మానుషకృత్య మగుటచే మానవులమీఁద నేయధికారము చేయనేరదు. ఇట్టి విషయములో మన కంటె గొప్పయధికారికి రెండవవారెవరైన నాజ్ఞాపకులుగ నుండవలయును. మనుజునికంటె శ్రేష్ఠ మగుటచే మానవునిపై నధికారము నలుపుటకు సమర్థ మగునీశ్వరదత్త సదసద్వివేకదేవతయే నలుపవలయును. ఈదేవత స్వయంభువ యగుటచే వ్యవహారమునసైతము "నా 'మనోదేవత' నాకు నిట్టిసాక్ష్య మీయదే" దని చెప్పుటయు వాడుకలోనే యున్నది. ఒకానొకఁ డొకతప్పుకార్యముఁ జేసెనేని, వాఁడు తనంతట తానే సిగ్గుపడుట కాని, తానే యేవగించుకొనుట గాని యీమనోదేవతయొక్క శిక్షాఫలములే యగును. కావున నీస్వతంత్ర లగుమనోదేవతలు గల రని సిద్ధమగును. కారణ మేమి యన: యేమనుజుఁడును తన్ను తానే యేల యేవగించుకొను? ననువిషయమున కేమియు యుక్తి లేదని యీమతమునందలియభిప్రాయము.

ఈచెప్పినమార్గ మాధిదైవతమార్గావలంబు లగుపాశ్చాత్యులది. పశ్చిమదేశమునంనుండి వచ్చినక్రైస్తవధర్మోపదేశకు లీమార్గమును సాధారణముగ నంతట వ్యాపింపఁజేసిరి. వారిమతమున, ధర్మాధర్మములనిర్ణయించుటలోఁ గేవలాధిభౌతిక సాధనములకంటె నీయీశ్వరదత్త మగుసాధనము సులభమును, శ్రేష్ఠమునుగ నుండుటచే గ్రాహ్యముగ నున్నది. పూర్వము మనదేశములో నిట్టిస్వతంత్రమగుకర్మయోగశాస్త్రము లేకపోయినను, వెనుకఁ జెప్పినమతము లన్నియు ప్రాచీనగ్రంథములలోఁ బ్రసిద్ధము లగున నేకస్థలముల స్పష్టముగఁ గాన్పించుచున్నవి. మనస్సుయొక్క వేర్వేఱువృత్తులను మహాభారతమున ననేకప్రదేశములయందు దేవతాస్వరూపముగ వర్ణించినట్లు కాన్పించుచున్నది. ధర్మము, సత్యము, వృత్తము, శీలము, శ్రీ, యిత్యాదిదేవతలు ప్రహ్లాదుని శరీరమునందుండి వెలువడి యింద్రుని శరీరమునఁ జొచ్చినటుల పూర్వమునందుఁ జెప్పఁబడి యున్నది. కార్యాకార్యములను, లేక, ధర్మాధర్మములను నిర్ణయించు దేవతకే 'ధర్మ' మని పే రగుటచే, శిబిచక్రవర్తియొక్క సత్త్వమును బరీక్షించుటకు డేగరూపమునను, యుధిష్ఠిరునిఁ బరీక్షించుట కొకపరి యక్షరూపమునను, తుదకు శునకరూపమునను, అది ప్రకటమైనదని తెలియుచున్నది. స్వయముగ భగవద్గీతలలో సైతము (౧౦.౩౪) కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధ, ధృతి, క్షమ యనునవి యన్నియు దేవత లని వర్ణింపఁ

బడినవి. వానిలో స్మృతి, మేధ, ధృతి, క్షమ యనునవి మనోధర్మములుగ నున్నవి. మన స్సొకదేవత యగుటచేఁ బరబ్రహ్మమొయొక్క ప్రతీక మని చెప్పి యుపనిషత్తులలో నాయుపాసనయుఁ (ప్రతీకోపాసన) జెప్పఁబడినది (తై: 3. ౪; ఛాం. 3. ౧౮) "మనఃపూతం సమాచరేత్"—"మనస్సున కేది శుద్ధ మనితోఁచునో దానిని జేయవలయును" అని మనువు చెప్పినపుడు(౬. ౪౬) 'మనస్సు' అనుశబ్దమునకు 'మనోదేవత' యనునర్థమే మనువుచే నుద్దేశింపఁబడి యుండు నని చెప్పవచ్చును. సామాన్యవ్యవహారమునసైతము "మనోదేవత కేది మాన్యముగ నుండునో దానినే చేయు" మని మనము చెప్పుచున్నారము. "మనఃపూత" శబ్దార్థము మహారాష్ట్రభాషలో విపరీతముగనున్నది. అనేకసమయములయందుఁ దోఁచిన దెల్లఁ జేసినవాఁడు మనఃపూతముగ సంచరించుచున్నాఁడని మహారాష్ట్రమునఁ జెప్పుచున్నారు; కాని యీశబ్దమునకు "మనస్సునకు శుద్ధ మని, లేక, పరిశుభ్ర మని తోఁచినదానినేచేయుము" అని సత్యమైనయర్థము. మనుసంహితయొక్క నాలవయధ్యాయమున—

"యత్కర్మ కుర్వతో ఽస్య స్యాత్ పరితోషో ఽంతరాత్మనః
తత్ప్రయత్నేన కుర్వీత విపరీతం తు వర్జయేత్." —(మను. ౪. ౧౬౧)

"ఏకర్మము లొనర్చుటచే మనయంతరాత్మ సంతసించునో వానినే ప్రయత్నపూర్వకముగఁ జేయవలయును; దానికి విపరీతముగ నున్న పక్షమున వదలవలయును" అని మనువే దానిని వివరించి చెప్పెను. అటులె చాతుర్వర్ణ్యధర్మము మొదలగు వ్యావహారికములయొక్క నీతుల మూలతత్త్వమును చెప్పుచు, మను యాజ్ఞవల్క్యాది స్మృతి కర్తలు సైతము—

"వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియ మాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షా ద్ధర్మస్య లక్షణమ్." (మను ౨. ౧౨)

"వేదము, స్మృతి, శిష్టాచారము, తనయాత్మకు రుచించుట యనునీనాల్గును ధర్మమునకు ముఖ్య మగులక్షణములు"—అనియే చెప్పిరి. "తనయాత్మ కేది రుచించునో" యనఁగా: "మనస్సునకేది శుద్ధమనితోఁచునో" యనియె యర్థము. శ్రుతి, స్మృతి, సదాచారములచే నేకర్మయొక్క ధర్మాధర్మములనిర్ణయము కానేరదో దాని నిర్ణయించుటకు నాల్గవసాధనము మనఃపూతత్వ మని నిశ్చయించినటుల దీనివలన స్పష్టమగుచున్నది. మహాభారతమున నింద్రప్రహ్లాదులకు వెనుకటి ప్రకరణమునఁ జెప్పినసంగతి జరిగినపిదప "శీల" లక్షణముఁ జెప్పుచు ధృతరాష్ట్రుఁడు—

"యదన్యేషాం హితం న స్యాత్ ఆత్మనః కర్మ పౌరుషమ్
అపత్రపేత వా యేన న తత్కుర్యాత్ కథంచన."

(మ. భా. శాం. ౧౨౪-౬౬.)

"మనము చేయు నేకర్మ లోకులకు హితము గాదో, లేక, దేనివిషయమై మనస్సులో మన మెప్పుడు లజ్జపడవలసియుండునో యాకర్మ నెప్పుడును జేయరాదు"— అని చెప్పఁబడినది. 'లోకహితము గాకపోయినను' 'లజ్జ యగుచున్న' దనుపదముచే 'అనేకుల కధికహిత' మనునదియు, 'మనోదేవత' యనునదియు నగు నీరెండుపక్షములు నీశ్లోకముననే యొప్పుకొనఁబడినవని చదువరులకు స్పష్టముగఁ దెలియును. మనుస్మృతియందు సైతము—"ఏపనినైన చేసినప్పుడును, లేక, చేయుచున్నప్పుడును లజ్జ యగునో యది తామసము. మఱియు నేకర్మఁ జేయునప్పుడు లజ్జయుండదో, లేక, యంతరాత్మ సంతసముతో నుండునో యది సాత్త్విక మనఁబడును. (మను. ౧౨. ౩౫-౩౭.)" అనియున్నది. మఱియు ధమ్మపద యను పేరు గలబౌద్ధగ్రంథములోసైత మీవిచారముఁ జేయఁబడి యున్నది. (ధమ్మపద. ౬౭, మఱియు ౬౮ చూడు.) కర్మాకర్మలవిషయమైన సంశయము వచ్చినప్పుడు—

"సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః"

(శాకు. ౧. ౨౨.)

"సత్పురుషులు సందేహస్థలములయందు దమ యంతఃకరణముయొక్క సాక్ష్యమునే యంగీకరింతురు" అని మహాకవికాళిదాసు సైతము వర్ణించుచున్నాఁడు. చిత్తవృత్తిని నిరోధించి, మనస్సు నొకవిషయముననే స్థిరముఁ జేయుటయే పాతంజలయోగముయొక్క కార్యము. మఱియు నీయోగశాస్త్రము మనదేశమున బహుకాలమునుండి ప్రచారములో నున్నందుచేఁ గర్మాకర్మల సందేహము పొసఁగినచో నంతఃకరణమును స్వస్థమును, శాంతమును గావించికొని యోగ్య మని తోఁచినదానిఁ జేయవలయునను మార్గమును మనవారికొరు లెవ్వరు నేర్ప నవసరము లేదు. స్మృతిగ్రంథము లన్నింటిప్రారంభమున, స్మృతికర్త లగుఋషులు దమచిత్తము నేకాగ్రముగఁ జేసికొనియే ధర్మాధర్మములఁ జెప్పుచున్నట్లు వర్ణింపఁబడియున్నది (మను. ౧. ౧). ఎవనియందైన నీరీతిగ మనస్సాక్ష్యమును గైకొనుమార్గము సకృద్దర్శనమునందుఁ జూచుటకు మిక్కిలి సులభమై తోఁచును; కాని, 'శుద్ధమన స్సన నేమి?' యనువిషయము తత్త్వజ్ఞానదృష్టితో సూక్ష్మముగ విచారించిన నీస్థలమున మఁగుపక్షము తుదవఱకు నిలుచునది

కానేరదు. కావుననే కర్మయోగశాస్త్ర మను మహాప్రాసాదము నీ స్తంభముల మీఁద మాత్రము కట్టఁబడియుండెను. కట్టుకోరులు నిర్మింపలేదు. ఈతత్త్వజ్ఞాన మేది? యని యిప్పో విచారింపనగును గాని దీనికంటె ముందు పాశ్చాత్యులగు నాధిభౌతికవాదు లీయాధిభౌతికపక్షము నెటుల ఖండించిరో యీవిషయము కొంచె మిచ్చో విచారించెదను. కారణ మేమియన: ఈవిషయమున నాధ్యాత్మికాధిభౌతికవాదుల రెండుమార్గములకు కారణములు వేర్వేఱుగ నుండినను దుదకు ఫలితార్థ మొక్కటేయగుచుండుటచేఁ దొలుతొల్త నాధిభౌతిక కారణములను జెప్పితి మేని పిదప నాధ్యాత్మిక కారణములయొక్క మహత్త్వము, లేక, యుక్తియుక్తత చదువరులకు వేగిరముగఁ దెలియును.

ఆధిదైవతమార్గమునందు వెనుకఁ జెప్పినటుల శుద్ధమనోదేవతకే యగ్రస్థాన మిచ్చి యున్నందున "అనేకుల కధికసుఖ" మను నాధిభౌతికనీతిమార్గమునఁ గర్తయొక్క బుద్ధినిగుఱించి యేవిచారణయుఁ గానేర దని వెనుకఁ జెప్పఁబడిన దోష మీయాధిదైవతపక్షమునకు సంబంధింపి యుండదని స్పష్టమగుచున్నది. కాని దేనిని సదసద్వివేకరూపిణి యగుశుద్ధమనోదేవతయని యనవలయునో సూక్ష్మముగ విచారించితి మేని యీమార్గమునందు సైతము మఱియొకయపరిహార్య మగుదోషము సిద్ధ మగును. ఏవిషయము నాలోచనకుఁ గైకొన్నను దాని నన్ని విధముల విచారించి "యిది గ్రాహ్య మగునా? కానేరదా? చేయుట కర్హ మగునా? కానేరదా? చేసినను లాభదాయకము, లేక, సుఖదాయక మగునా? కానేరదా?" యని నిశ్చయించుట యనుపని, ముక్కు కన్ను మొదలగునింద్రియములు సేయునవి కాకపోవుటచే నాపనిని సిద్ధాంతముఁ జేయుటకు,మన స్సొకస్వతంత్ర మగునింద్రియముగ నున్నదని యొవరికిని చెప్ప నక్కఱయుండదు. అనఁగా: కార్యాకార్యములను, లేక, ధర్మాధర్మములను మనస్సే నిర్ణయించును, గాన దాని నింద్రియమని కాని దేవత యని కాని చెప్పవచ్చును. ఈవిషయము నాధిదైవికమార్గములోనివారే చెప్పుదు రేని యందుల కెవరును వివదించువారు లేరు. కాని, పాశ్చాత్యులయాధిభౌతికపక్షము దీనికంటె నొకమెట్టు పైకిపోయినట్లున్నది. "మంచి, చెడుగు, (సత్తు, లేక, అసత్తు,) న్యాయము, లేక, యన్యాయము, ధర్మము, లేక, యధర్మము" అనువాని నిర్ణయించుటయు" మఱియు "నేదేని యొకపదార్థము "బరువుగ నున్నదా? తేలికగ నున్నదా? పచ్చగ నున్నదా? నల్లగ నున్నదా?" యనియు, లేక, యొకానొక లెక్క "సరియా! తప్పా?" యని విచారించి నిర్ణయించుటయు" నను నీరెండువిషయ

ములు నత్యంతము వేర్వేఱుగ నున్నవి. రెండవదానినిర్ణయమును మనస్సు న్యాయశాస్త్రపద్ధతిని చేయఁగలదు. మొదటిదానియం దున్నవిషయమును నిశ్చయపఱుచుటకు మనస్సు మిక్కిలి యసమర్థమగును. కావున నాకార్యమును మన మనస్సున నుండు సదసద్వివేచనశక్తిరూప మగుదేవతయే చేయుచున్నది.'' యని పాశ్చాత్యులలోని యాధిభౌతికవాదు లనుచున్నారు. "ఒక లెక్క 'సరిగా నున్నదా, తప్పుగా నున్నదా?' యని నిశ్చయించుచు మన మా లెక్కలో నున్నరాశి నైనను, గుణకారము నైనను బరిశీలించినపిదప మన మంతము స్థిరపఱుచుచున్నాము. అనఁగా: ఈ విషయమును నిర్ణయించుటకంటె ముందుగా రెండవవ్యాపారమును గాని, రెండవ క్రియను గాని మనస్సు చేయవలసి యుండును.'' అని దానికిఁ గారణముఁ జెప్పుదురు; కాని మంచిచెబ్బరల నిర్ణయ మట్టిది కానేరదు. ఒకఁ డొకనిని చంపెనని మనకుఁ దెలిసినవెంటనే "ఛీ. వాఁడు తప్పుచేసెను'' అని మనము వాక్రుచ్చుచున్నాము. ఆవిషయమై మన మేమియు విచారింప నక్కఱలేదు. అనఁగా: ఏమియు విచారింపక వెంటనే చేసిన నిర్ణయము, లెస్సగ విచారించి చేసిన నిర్ణయము, అను నీ రెండు నొక్కమనోవృత్తియొక్క వ్యాపారములే యని చెప్పుటకు వీలు లేదు. దానికొఱకు సదసద్వివేచనశక్తి యనునది యొకస్వతంత్రయగు మానసికదేవత యని యొప్పుకొనవలయును. ఎల్లమనుజుల యంతఃకరణములలో శక్తి గాని, దేవత గాని యొకవిధముగనే యుండుటచే నందఱకును హత్య యనునది యొకటే తీరునఁ దప్పుగాఁ దోఁచును. విషయ మెప్పుడు దెలియఁగనిది కానేరదు. ఈ యాధిభౌతికయుక్తివాదమునకు నాధిభౌతికవాదులు—"ఒకానొకవిషయముయొక్క నిర్ణయమును మనము వేగముగఁ జేసినంతమాత్రముచేతనే యది, యేవిషయమున కర్థము మనము నిర్ణయించుచున్నామో యావిషయముకంటె వేఱుగ నుండవలయు నని యంగీకరింప వీలులేదు. ఏలయన: ఒకపనిని వేగిరముగనో, యాలస్యముగనో చేయుట యభ్యాసముం బట్టి యుండును. లెక్కవిషయమునే గమనింపుము. వర్తకులు పుట్టి మొదలు నేర్చినరకు చిల్లరలెక్కలను నోటిచేతనే చెప్పుచున్నారు. కావున నట్టి యుత్తమగణితముఁ జేయువాని దేవతకంటె గుణకారముఁ జేయునతనిదేవత భిన్నము గానేరదు. నిత్యాభ్యాసముచే నొకానొకవిషయ మింతయభ్యాసములో నుండును. కొంచె మైనను విచారింపకయె దానిని సహజముగఁ జేయును. అటులే బాగుగ గుఱిఁగొట్టగలవాఁ డెగురుచున్నపావురమును సులభముగఁ దుపాకితోఁ గాల్చినంతమాత్రమున నాగుఱిఁ గొట్టుట యొకదేవత యని యెవరు నననరు. ఇంతియకాక గుఱికొట్టుట, యెగురు

చున్న పక్షి వేగమును గొలుచుట, మొదలగు శాస్త్రీయోపపత్తు లనవసరములని యెవ్వరనరు. రణభూమియందు నిలువఁబడి నలుగడల దృష్టిని ప్రసరింపఁజేసెనేని శత్రుసముదాయ మెచ్చట నున్నదియు 'నెపోలియన్' చక్రవర్తికిఁ జక్కఁగఁ దెలియునని చెప్పుచున్నారు; కాని యంతమాత్రముచే యుద్ధకల యొక స్వతంత్రదేవతగ నున్నదనియు నితరము లగు మానసికశక్తులతో దాని కేసంబంధము లేదనియు నెవరును జెప్పలేరు. ఏపనియందైన నొకానొకని బుద్ధి చుఱుకుగను, మఱియొకని బుద్ధి మందముగను బ్రవర్తించు ననునది సత్యమే; కాని యంతమాత్రముచేతనే యిరువురి బుద్ధియు వేర్వేఱుగ నున్నదని మనము చెప్పము. ఇంతియకాక, కార్యాకార్యములయొక్క గాని ధర్మాధర్మములయొక్క గాని నిర్ణయ మెప్పుడును వెంటనే యగు నని నియమము లేదు. కారణ మేమి యన: "దీనిని చేయుదుమా? లేక, మానుదుమా?" యనుసంశయ మెల్లప్పుడును గల్గక పోయినను, అర్జునునకువలె నీసంశయ మాయాసమయములయం దెల్లరకుఁ గలుగును. ఇంతియకాక, కొన్ని విషయముల కార్యాకార్యనిర్ణయములో నొక్కొక్కరి కొక్కొకయభిప్రాయ ముండును. సదసద్వివేచనాశక్తిరూప యగుస్వయంభూదేవత యొక్కటేయైన యెడల నీ మతభేదము లేల? అనఁగా: మానవబుద్ధి యెట్లు శిక్షితము, లేక, సంస్కృతమై యుండునో దాని ననుసరించియే యావిషయము నతఁడు నిర్ణయించు నని తాత్పర్యము. అనేకులు మోటువాండ్రు తమవంటిమనుజులను జంపుట యనునది దోష మని యెన్నక, చంపఁబడినమానవుని మాంసమును సైత మానందముతో భక్షింతురు; కాని, మోటువాండ్ర విషయమును మనము వదలినను, దేశాచారానుసారముగ నొకదేశమందు నింద్య మని యెన్నఁబడుచున్న యాచారము మఱియొకదేశమున సర్వజనమాన్య మయి యుండును. ఒకభార్య యుండఁగా మఱియొకభార్యను వివాహమాడుట యైరోపాఖండమునఁ దప్పుగ జనులెన్నుదురు; కాని, దానివిషయమై హిందూదేశములో నెవరికి నెక్కువగ విధినిషేధములు తోఁపవు. సభలయందు శిరస్సుపైఁ దలపాగను దీసికూర్చుండుట హిందువులకు లజ్జగఁ దోఁచును; కాని, యాంగ్లేయులు నెత్తిపై టోపీని తీసి కూర్చుండుటయే సభ్యతకు లక్షణ మని యెన్నుదురు. ఈశ్వరదత్తమయినది గాని, స్వాభావికమైనది గాని యగుసదసద్వివేచనాశక్తిమూలముననే దుష్కార్యము లొనర్చుట లజ్జావహ మనునది సత్యమయినయెడల, నందఱ కొక కార్యమున నొకటేవిధమగులజ్జ యేల యుండరాదు? ఆటవికుఁడైనను దా నెవరి యన్నమును దినునో యతనిపై నాయుధప్రయోగముఁ జేయుట నింద్యమని యెన్ను

చున్నాఁడు; కాని బాగుగ నాగరికత నేర్చినపాశ్చాత్యులరాష్ట్రములలో సైతము సమీపరాష్ట్రములవారిని యుద్ధములో వధించుట స్వదేశభక్తిలక్షణ మని యెన్నెదరు. సదసద్వివేచనాశక్తి రూపదేవత యొక్కతెయే యను నేని యీభేద మేల యుండవలయును? అలవాటును బట్టిగాని దేశాచారమ్మును బట్టి గాని సదసద్వివేచనాశక్తిభేదము నొప్పికొనినయెడల దాని స్వయంభూత్వ నిత్యత్వములకు బాధవచ్చును. మోటుతనమును వదలి మనుజుఁడు (నాగరకుఁడు) క్రమముగ సంస్కృతుఁడు కాఁగా నతని మనస్సును, బుద్ధియు వికసించు చుండును; ఈతీరునఁ దెలివి వృద్ధిఁ బొందినపిదప, మొదట మోటుతనముతో నున్నప్పుడు విచారింపని విచారముల నన్నిటిని, ఈసంస్కృతస్థితియందు (నాగరికత కలిగినపిదప) వేగముగ నిర్ణయింప సమర్థుఁ డగును. వేయేల? ఇట్లు బుద్ధిని వృద్ధిఁ బొందించుటయే నాగరికతకు లక్షణము. నాగరికుఁడు, చూచినవస్తువు నెల్ల నిమ్మని యడుగఁ డనువిషయ మెట్లు తన యవయవముల రూఢ మగునింద్రియనిగ్రహముయొక్క పరిణామముగఁ దోఁచు చున్నదో, యట్లే సదసద్వివేచనఁ జేయుమనశ్శక్తియును మెల్లమెల్లగ వృద్ధినొంది కొన్నివిషయములలో నైనను, గొంచె మైనను విచారముఁ జేయకయే తాను స్వయముగ నీతిసిద్ధ మగునిర్ణయమును జేయఁగలిగినంత దృఢ మైనది యగునని తోఁచును. సమీపమున, లేక, దూరమున నున్నవస్తువును జూడవలసివచ్చె నేని నేత్రముల యొక్క నరముల స్నాయువులఁ గొంచె మెచ్చుతగ్గుగ నణఁచిపెట్టవలసివచ్చును. ఈకార్య మంతయు మనకుఁ దెలియనుగూడ లేనంత త్వరలో జరుగుచున్నది; కాని, యంతమాత్రముచే నీవిషయ మోపపత్తి నెవ రయిన నిరుపయుక్త మని యందురా? కావున మనుజునియొక్క మనస్సు, లేక, బుద్ధి యనునది యెల్లప్పుడు నన్నిపనుల యందు నొక్కవిధముగనే యున్న దనియు, నొకవిధ మగుబుద్ధిచేతనే నలుపును ఎఱుపును వేఱుగఁ దెలిసికొనుచున్నాఁ డనియు, సదసత్పదార్థములను మఱియొకబుద్ధిచే నెఱుఁగుచున్నాఁ డనుట యథార్థము కానేర దనియు, నొకనికిఁ దెలివి తగ్గుగ నుండె నేని, మఱియొకనికి నశిక్షితత్వము నసంపూర్ణత్వమును వృద్ధిఁ బొందుచు నను టయే భేదమనియు, నీభేదమును లెస్సగ గమనించి యేవిషయము నైనను వేగముగఁజేయుట యనునది యభ్యాసముయొక్క ఫలమే యనునదనుభవమును సైతము గమనించితి మేని మనస్సుయొక్క స్వాభావికశక్తులలో సదసద్వివేచనాశక్తి యనుభిన్నమును స్వతంత్రమును విలక్షణము నైనశక్తి యున్న దని యంగీకరించుట కేమియు నావశ్యకత లేదనియు, పాశ్చాత్యాధిభౌతికవాదములచే సిద్ధాంతీకరింపఁబడిన మనప్రాచీన శాస్త్రకారుల యీవిషయమునందలి చివరసిద్ధాంతము సైతము

పాశ్చాత్యు లగునాధిభౌతికవాదులసిద్ధాంతముపలె నున్నది. స్వచ్ఛము, శాంతము నగునంతఃకరణముతో నొకానొకవిషయమును విచారణ చేయవలయు ననుట వారొప్పుకొనినదే; కాని ధర్మాధర్మముల నిర్ణయించు బుద్ధి యొకటి యనియు, తెలుపు నలుపులను నిర్ణయించుబుద్ధి యొకటి యనియు ననుమతము వారి కిష్ట మగునది కానేరదు. మన స్సేయేవిధముగ నలవాటుపడి యుండునో యాయావిధముగనే మంచిచెబ్బరలను నిర్ణయించును గావున మనస్సును సంస్కరించుకొనుటకై ప్రతి మానవుఁడును యత్నింపవలయు నని సైతము వారు సెప్పుదురు; కాని, యీసంస్కార మెట్టిది? యెట్లు చేయవలయు? ననువిషయమై నియమములుసైతము సెప్పఁబడినవి గాని, సదసద్వివేచనాశక్తి యనునది సామాన్యబుద్ధికంటె వేఱగు నొక యీశ్వరదత్త మగు విషయమని వా రొప్పుకొనరు. మనుజునకు జ్ఞాన మెట్లు కలుగునో యతనిమనోబుద్ధులవ్యాపార మేచందమున నడచునో దానియొక్క సూక్ష్మపరీక్ష పూర్వమే చేయఁబడినది. ఈపరీక్షనే క్షేత్రక్షేత్రజ్ఞవిచార మని చెప్పుదురు. క్షేత్ర మనఁగా శరీరము; క్షేత్రజ్ఞుఁ డనగా నాత్మ. ఈక్షేత్రక్షేత్రజ్ఞుల విచారమే యధ్యాత్మవిద్యకు మూలముగ నున్నది. క్షేత్రక్షేత్రజ్ఞవిద్యాజ్ఞానము లెస్సగఁ గలిగినపిదప, సదసద్వివేచనాశక్తియే గాక యేయితరమనోదేవతలు నాత్మకంటెఁ బైమెట్టువారని గాని, స్వతంత్ర లని కాని నుడువుటకు వీలులేనందున నాధిదైవతపక్ష మేల నిలువనిదియు సులభముగఁ దెలియును. కావుననే, యీస్థలమునందా క్షేత్రక్షేత్రజ్ఞవిద్యను మనము కొంచెము విచారింతము. భగవద్గీతలలో నున్నయనేకము లగుమంచిసిద్ధాంతములయొక్క సత్య మగునర్థ మేతన్మూలముగఁ జదువరులకు స్పష్టముగఁ దెలియఁగలదు. మనుష్యునియొక్క దేహ (పిండము, క్షేత్రము, లేక, శరీర) మనునది యొకగొప్పకార్యస్థానము (ఫాక్టరి)గ నున్నదని చెప్పవచ్చును. ఒకానొక కర్మాగారములో నెట్లు వెలుపల నుండు పదార్థములను లోపలికిఁ దీసి కొందురో, అట్లు తీసికొనినపదార్థములను పరీక్షించి వ్యవస్థ చేసి పిదపఁ గర్మాగారోపయోగమునకుఁ దగుపదార్థ మెద్దియో తగనిదెద్దియో నిశ్చయించినపిమ్మట, వెలుపలనుండిలోనికి వచ్చిన యసంస్కృత పదార్థముచే నూతనపదార్థమును సిద్ధపఱచి యెట్లు వెలుపలికిఁ బంపుదురో, యటులనే మనుజునిశరీరమునందుఁ బ్రతిక్షణమునందు ననేకవ్యాపారములు జరుగుచున్నవి. సృష్టిలో నుండుపాంచభౌతికపదార్థములయొక్క జ్ఞానము మనుజునకుఁ గలుగుటకు నింద్రియములె ప్రథమసాధనములుగ నున్నవి. జగత్తునం దున్న పదార్థములయొక్క సత్యస్వరూపము, లేక, మూలస్వరూప మేదియో యది యింద్రియములద్వారా తెలిసికొనుట కెవ్వరికిని సాధ్యము కానేరదు, ఘన

యింద్రియముల కాపదార్థము లెట్లుల గన్పట్టుచున్నవో యట్లే యవి యున్నవని యాధిభౌతికవాదు లనుకొనుచున్నారు; కాని దెప్పెన్ని యైన నొకానొక క్రొత్త యింద్రియము పుట్టెనేని యతనిదృష్టిచే సృష్టియం దున్నపదార్థములగుణధర్మము లిప్పు డున్నవానికంటె వేఱుగ నుండు నని చెప్ప నక్కఱ యుండదు. మనుజుని యింద్రియములు సైతము రెండువిధములు గలవై యున్నవి. మొదటివి కర్మేంద్రియములు; ఇతరములు జ్ఞానేంద్రియములు. హస్తములు, పాదములు, వాక్కు, గుదము, ఉపస్థ యనునవియైదును కర్మేంద్రియములు. మనము మనశరీరముచేఁ జేయు వ్యాపార మంతయు నీకర్మేంద్రియముల మూలముననే చేయుచున్నాము. మఱియును, ముక్కు, కన్నులు, చెవులు, నాలుక, చర్మ మనునవియైదును జ్ఞానేంద్రియములు. నేత్రములతో రూపమును, నాలుకచే రసమును, వీనులచే శబ్దమును, ముక్కుతో వాసనను, చర్మముచే స్పర్శము నెఱుంగుచున్నాము. ఏబాహ్యపదార్థమును విచారించినను, మనకుఁ గలుగుచున్న యాపదార్థముయొక్క జ్ఞాన మంతయు దానియొక్క రూపము, రసము, గంధము, శబ్దము, స్పర్శము ననువానికంటె వేఱుగ నేమియు లేదు. ఉదాహరణ మేమి యనఁ: ఒకబంగారుకణికను విచారించిన నది పచ్చగాఁ దెలియును. త్వగింద్రియమునకు గట్టిగఁదోఁచును. కొట్టిన సాగును. ఇట్లు కంటికిఁ గనఁబడుచున్న దానిగుణములె మనచూపునకు బంగారముగ నున్నవి. ఈగుణములు మాటిమాటికి నొకపదార్థమునం దొక్కవిధముగనే స్పష్టముగఁ గనఁబడెనేని బంగారమను నది మనమతము ననుసరించి స్వతంత్రపదార్థమగును. వెలుపల నున్నపదార్థమును లోపలికిఁ దీసికొనుటకును, లోపల నున్నపదార్థమును వెలుపలకు నంపుటకు నేతీరునఁ గర్మాగారములయందు ద్వారము లుండునో యట్లనే మానుషదేహమునకు జ్ఞానేంద్రియము లనునవి బాహ్యపదార్థములను లోపలికిఁ దీసికొనుటకును, కర్మేంద్రియము లనునవి లోపల నున్నపదార్థములను వెలుపలికిఁ ద్రోయుటకును ద్వారము లయియున్నవి. సూర్యకిరణము లొకపదార్థముపైఁ బడి, యచ్చో నుండి తిరిగి మననేత్రములలోఁ బడెనేని మనయాత్మకు నాపదార్థరూపము తెలియును. ఒకానొకపదార్థమునుండి బయలువెడలుగంధముయొక్క సూక్ష్మపరమాణువులు మననాసికలో నుండు మజ్జారూపతంతువులపైఁ బడెనేని మనకు దానివాసన తెలియును. ఇతరము లగుజ్ఞానేంద్రియవ్యాపారములు నిట్టులే నడచుచున్నవి. జ్ఞానేంద్రియము లీరీతిని వ్యాపారము సేయు నేని వానిమూలమున బాహ్యసృష్టియం దున్నపదార్థములు తెలియుచుండును; కాని జ్ఞానేంద్రియములు సేయువ్యాపారములయొక్క జ్ఞానము స్వయముగ నాజ్ఞానేంద్రియముల మండసం

దున జ్ఞానేంద్రియములు జ్ఞాత లని వచించుటకు సాధ్యము కానేరదు. కాన నవి బాహ్యపదార్థములను లోనికిఁ గైకొనిపోవు ద్వారములు మాత్రమే యని చెప్పఁబడినవి. ఈద్వారములలో నుండి పదార్థము లోపలికిఁబోయినపిమ్మట దానికి ముందు వ్యవస్థ కల్పించుపని మనస్సుదైయున్నది. ఉదాహరణమేమియన: రెండుజాము లయినప్పుడు ౧౨ గంటలు కొట్టినపిమ్మట గంట లిన్ని కొట్టఁబడిన వనువిషయము కర్ణము గ్రహింప లేదు. ఒక్కొకదెబ్బయు నెట్లెట్లు గంటకుఁదగులునో యాయా విధముగ వాయువుయొక్క దెబ్బవలన మనచెవికిఁ దగులుటచే మజ్జాతంతువులగుండ ప్రత్యేకమగుదెబ్బయొక్క వేర్వేఱగుసంస్కారములు మొదట మనసునఁ గలుగఁగా వానినన్నింటిని మొత్తముచేసి యిన్నిగంటలు కొట్టినారని నిశ్చయించుపని మనస్సు స్వయముగఁ జేయుచున్నది. జ్ఞానేంద్రియములు పశువుల కున్నవి. గడియారమునందుండి యొక్కొకదెబ్బ బయలుదేఱుక్రమమున, ఒక్కొక్కదెబ్బయొక్కయు సంస్కారము వాని శ్రోత్రములగుండ మనస్సువఱకును వెళ్లును; గాని యామన స్సన్నింటిని మొత్తముఁ జేసి ౧౨ గంట్లు లాయెనని తెలిసికొనునంత వికసితము కాలేదు. ఈవిషయమునే శాస్త్రీయపరిభాషాప్రకారము చెప్పవలసివచ్చినచో పశువులకు సైత మనేకసంస్కారములచే వేర్వేఱగుజ్ఞానము కలిగినను, ఆనానాత్వమునందలియేకత్వముయొక్క బోధ వానికి లేదని చెప్పుదురు. భగవద్గీతలో— "ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః." "ఇంద్రియములు బాహ్యపదార్థములకంటె శ్రేష్ఠములు. ఇంద్రియములకంటె మనస్సు శ్రేష్ఠము." (గీ. ౩. ౪౨.) అని చెప్పఁబడినదానికి సైత మిదే భావార్థము. 'మనస్సు స్థిరముగ లేనియెడల నేత్రములు తెఱచుకొని యున్నను గనఁబడదు. వీనులు తెఱచుకొని యున్నను వినఁబడ'దనువిషయము చెప్పఁబడియే యున్నది. జ్ఞానేంద్రియములగుండ బాహ్యపదార్థములను దేహమనెడి గర్భాగారమునందు మన స్సనెడి ప్రవేశకుఁడు (గుమాస్తా) ప్రవేశపెట్టి యతఁడే వీని వర్గీకరణమును (వీనిసంగతిని) విచారించుచున్నాఁ డని తాత్పర్యము. ఈవిచారణ మెట్లగు ననుదానినిమిత్తమై, యింతదనుక దేనిని సామాన్యముగ మన స్సని చెప్పుచుంటిమో, దానినే యిఁక ముం దెన్ని భేదములుగ విభజింపవలసివచ్చునో, యొక మనస్సునకే యధికారభేదానుసారముగ నేయేనామము లిడవలసివచ్చునో, యావిషయము నిప్పుడు నిరూపించెదము.

జ్ఞానేంద్రియములగుండ మనస్సునకుఁ గలిగినసంస్కారము లన్నిటి ముందొకచోటనుంచి, వానిని వేర్వేఱుగ విచారించి (పరీక్షించి) వానిలో "మంచి దేది?

చెడుదేది? గ్రహింపఁదగిన దేది? విడువఁదగిన దేది? లాభమును గలుగఁజేయున దేది? నష్టమును గలిగించున దేది?'' యనుదాని ముందు నిర్ణయింపవలయును. ఇది నిర్ణయించితి మేని, ముందు దీనిలో నే విషయము మంచిదియో, లాభదాయకమో, యోగ్యమో, కల్యాణకర మగునో, దానినే చేయుటకుమనము ప్రవర్తింతుము. అనే సామాన్యవ్యవహారములోనే యున్నది. ఉదాహరణము:— మన మొకయుద్యానవనములోనికి వెళ్లుద మేని నేత్రము శ్రోత్రము నను జ్ఞానేంద్రియములచేఁ బూలతోఁటయందలి వృక్షములలోని పుష్పములయొక్క సంస్కారము మనమనస్సునందుఁ గలుగును. కాని "యీపుష్పములలో నేపుష్పములవాసనమంచిది? యేది చెడుది?'' అనుజ్ఞానము మనయాత్మకుఁ గలిగినఁగాని యేపుష్పము నైనను బుచ్చుకొందమను కోరిక మనస్సునందుఁ బుట్టదు. వానిఁ బుచ్చుకొనవలయు నని ప్రయత్నము సైతము చేయము. కావున (౧) జ్ఞానేంద్రియములచే బాహ్యపదార్థజ్ఞానము కలిగి సంస్కారసామ్యము (అనఁగ: సరిచూచుట) కొఱకు నిశ్చితమగు నొక పట్టిక సిద్ధముసేయుట, (౨) ఈసరిచూచుట యైనపిదప వానిమంచిచెడుగులయొక్క సారాసారముల విచారించి యేవిషయము గ్రహింపఁదగినది, యేది గ్రహింపఁదగినది కాదు, అని నిశ్చయించుట, (౩) ఈ నిశ్చయమయినపిదప గ్రాహ్యవస్తువును బొందుదనియు, నగ్రాహ్యవస్తువును ద్యజింతు ననియుఁ గోరిక గలిగి తదనుసారముగఁ బ్రవర్తించుట, యని మొత్తముపై మనోవ్యాపారములు మూఁడువిధములుగ విభజింపఁబడుచున్నవి. ఇట్లు ప్రవృత్తికలుగుట కీమూఁడు క్రియలలో నేమియు హెచ్చుతగ్గులు లేకుండ సదా యొకవిధముగనే యొకదానివెంబడి మఱియొకటి యుండవలయునని నియమము లేదు. పూర్వమునం జెప్పి యైనను జూడఁబడిన యొకవిషయము కావలయు నని కోరిక యుండును. అయిన నంతమాత్రముచే నీ మూఁడు క్రియలలో దేనినైనను వలదనిమాత్రము చెప్పుటకు సాధ్యము కాదు. న్యాయస్థాన మొక్కటి యైనను, దానియందు మొదట నుభయపక్షములవారు గాని, లేక, వారిప్రతినిధులు గాని, తమ తమపక్షమును న్యాయాధీశుని యెదుట పట్టికారూపముగ నిడినపిదప, నుభయపక్షములను బూర్తిగ విచారించి న్యాయాధీశుఁడు తాను నిర్ణయించుచున్నాఁడు. న్యాయాధీశునిచేఁ జేయఁబడిననిర్ణయము నిస్సంశయముగ నాచరణము (అమలు) లోనికిఁ దెచ్చును. ఇది సామాన్యముగ న్యాయస్థానములలో జరుగుకార్యవిభాగము. ఇటులే యింతవనుక సామాన్యముగ గుమాస్తా యనిచెప్పుచున్న మనస్సుయొక్కవ్యాపారములలో సైతము కార్యవిభాగ ముండును. వానిలో నెమట నున్నవిషయములో సారాసారవివేచన చేసి,

యేవిషయమైన "ఇటులే యున్నది(ఏవమేవ). మఱియొకవిధముగ లేదు(నాన్యథా)" అని నిశ్చయించుట యను న్యాయాధీశుని కార్యము కేవలము 'బుద్ధి' యను నింద్రియముయొక్క సంబంధముగలది కావున వెనుకఁ జెప్పినమనోవ్యాపారములయన్నిటిలో నీ సారాసారవివేచనాశక్తిని విభజించినపిదప మిగిలినవ్యాపారము లన్నియు నే యింద్రియముచే నగునో దానికి మాత్రమే 'మనస్సు' అని పేర్కొనుట వేదాంత సాంఖ్యము లనెడుశాస్త్రములలో నభ్యాసమై యున్నది. (సాం. కా. ౨౩; ౨౭) ఈ (చిన్నదియగు) మనస్సే న్యాయవాదివలె ఒకానొకవిషయ మిట్లున్నది (ఇది సంకల్పము), లేక, దీనికి విపరీతముగ నట్లున్నది (వికల్పము), మొదలగు కల్పనలను బుద్ధియెదుట నిర్ణయమునకై ప్రదర్శించుచున్నది. కావున నది 'సంకల్పవికల్పాత్మకము (అనఁగా: నిశ్చయింపక కల్పించునట్టి యింద్రియము) మాత్రమే' అని చెప్పఁబడినది. 'సంకల్ప' శబ్దము కొన్నిచోట్ల నిశ్చయార్థమందుసైతము ప్రయోగింపఁబడుచున్నది. (ఛాందోగ్య. ౭. ౪. ౧. చూడు). కాని యీమనస్సునకుఁ జెప్పినలక్షణము నందు, సంకల్పశబ్దము నిశ్చయము నపేక్షింపక, యొకవిషయ మిట్టిదె యని, తోఁచుట, అంగీకరించుట, సంకల్పించుట, గ్రహించుట, తెలిసికొనుట, దేని నైనను యోజించుట, ఇచ్ఛయించుట, చింతించుట, ఊహించుట, మొదలగువ్యాపారముల నుద్దేశించియే ప్రయోగింపఁబడినది; కాని, న్యాయవాదివలె తనకల్పనను బుద్ధియెదుట నిశ్చయార్థముగఁ బెట్టుట యనువ్యాపారముమాత్రముచేతనే మనస్సు చేయుపని సమాప్తి కానేరదు. బుద్ధి మంచిచెడుగులఁ నిర్ణయించినపిదప బుద్ధికి గ్రాహ్యముగ నుండు విషయమును గర్మేంద్రియములద్వారమున నాచరింపఁజేయుట (అనఁగా: దానిని అమలులో నుంచుట) యను 'నాదరు' యొక్కపనిని సైతము మనస్సే చేయుచున్నది. అందుచే మనస్సును మఱియొకవిధముగ వ్యాఖ్యానముఁ జేయవచ్చును. బుద్ధిచేఁ జేయఁబడిన నిర్ణయము నాచరణలోని కెట్లు తీసికొని రావలయునని యాలోచించుట యొకవిధమగుసంకల్పరూపముగ నున్న దని చెప్పవచ్చును. అయినను దానికి సంస్కృతమునందు "వ్యాకరణము-విస్తరింపఁజేయుట" అని రెండవస్వతంత్ర నామము గలదు. ఈపని తప్ప మిగిలినకార్యము లన్నియు బుద్ధిచేఁ జేయఁబడునవి. మనకల్పనలయొక్క సారాసారములను విచారించునది మనస్సు కానేరదు. ఈసారాసారములను విచారించి యీవస్తు వీవిధముగ నున్నది యను మొదలగువాని నిశ్చయించుటయు, తర్కముచేఁ గార్యకారణముల నాలోచించి యొకనిశ్చితమగునను మానము నైనను కార్యాకార్యనిర్ణయము నైనను చేయుటయు, అను నీవ్యాపారము లన్నియు బుద్ధి చేయునవిగనే యున్నవి. సంస్కృతమున

ని వ్యాపారమునకు 'వ్యవసాయ'మని, లేక, 'అధ్యవసాయ'మని చెప్పెదరు. కావున నీ రెండుశబ్దముల నుపయోగించి బుద్ధియొక్కయు, (కనిష్ఠ మగు) మనస్సుయొక్కయు మధ్యమున నున్న భేదమును జూపుటకు—

"వ్యవసాయాత్మికా బుద్ధిః మనో వ్యాకరణాత్మకమ్."

(మ. భా. శాం. ౨౫౧. ౧౧)

"బుద్ధి (యనునింద్రియము) వ్యవసాయమును జేయునది (అనఁగా: సారాసారములను విచారించి నిశ్చయమును జేయునది). మనస్సు (కనిష్ఠమయినది) వ్యాకరణము (అనఁగా: విస్తారము, లేక, పిదప వ్యవస్థను గల్పించు-ప్రవర్తక మగునింద్రియము) అయి యున్నది. (అనఁగా : బుద్ధి వ్యవసాయాత్మికగను, మనస్సు వ్యాకరణాత్మకముగను నున్నది)" అని మనోబుద్ధులవ్యాఖ్యానము మహాభారతములోఁ జెప్పఁబడి యున్నది. భగవద్గీతలలో సైతము "వ్యవసాయాత్మికా బుద్ధిః" యనియే యున్నది (గీ. ౨. ౪౪). అక్కడనే బుద్ధి యనఁగ సారాసారవివేకమును జేసి నిశ్చయించునట్టియింద్రియ మని యున్నది. బుద్ధి యనునది యొకఖడ్గమువంటిది. ఏవస్తువు తనయెదుటికి వచ్చునో, లేక, యెవరిచే నైనఁ దేఁబడునో, దానిని ఖండించుట యనునదియే బుద్ధియొక్క పని. దానికి మఱియొకగుణ మైనను, ధర్మ మైనను లేదు (మ. భా. వన. ౧౮౧. ౨౬.) సంకల్పము, వాసన, ఇచ్ఛ, స్మృతి, ధృతి, శ్రద్ధ, ఉత్సాహము, కారుణ్యము, ప్రేమ, దయ, కృతజ్ఞత, కామము, లజ్జ, ఆనందము, భీతి, రాగము, సంగము, ద్వేషము, లోభము, మదము, మత్సరము, క్రోధము మొదలగునవి యన్నియు మనస్సుయొక్క గుణములు.(బృ. ౧. ౫. ౩. మైత్ర్యు. ౬. ౩౦) కావున ఈమనోవృత్తి యేమూల కొరుగునో దాని ననుసరించి మనుజునకు నేపని నైనను జేయుట యందుఁ బ్రవృత్తి కలుగును. ఉదాహరణము:—మనుష్యుఁ డెంతబుద్ధిమంతుఁ డైనను, దరిద్రుల స్థితి యెట్లుండు నదియుఁ బోధ్యముగఁ దెలిసి యుండినను, తనమనస్సులో నున్న కారుణ్యవృత్తి బయల్పడక పోయె నేని, యాదరిద్రునకు సాయము చేయుద మనుకోరిక యెప్పుడు నుండనేరదు. యుద్ధము చేయవలయు నని యిచ్ఛ యుండినను ధైర్యము లేనిది యుద్ధము చేయనేరఁడు. మనస్సు చేయ నిచ్ఛయించు దానిపరిణామ మిది యని మాత్రమే బుద్ధి చెప్పుచుండును; కాని యిచ్ఛ, ధైర్యము మొదలగుగుణములు బుద్ధిధర్మములు కాకపోవుటచే బుద్ధి స్వయముగ (అనఁగా: మనస్సుయొక్క సాయము లేకయే) యెప్పుడు నింద్రియములను బ్రేరణ చేయనేరదు. విరుద్ధముగఁ గ్రోధాదులకు వశ మగుమనస్సు స్వయముగ నింద్రియ

ములను ప్రేరణఁ జేసినను, "బుద్ధియొక్క సారాసారవిచారము లేక కేవలమనో వృత్తిప్రేరణమాత్రమున సంభవించుకర్మ నీతిదృష్టితో విచారించిన నిర్దోషముగనే యుండు నని నియమ ముండదు. ఉదాహరణము—బుద్ధి నుపయోగింపక కారుణ్యవృత్తిమాత్రముతో నేటి దానముఁ జేసిన నది యపాత్రదానమై దాని దుష్పరిణామముగూడ సంభవించును. సారాంశ మేమి యన:—బుద్ధియొక్క సాహాయ్యము లేనియెడల మనోవృత్తి గ్రుడ్డిదానివలె నుండును. కావున మానవునకు శుద్ధకర్మ సంఘటిల్లువిషయమునందు బుద్ధి శుద్ధముగను(అనఁగా: మంచిచెడుగులను దప్పలేక నిర్ణయించునదిగ), మనస్సు బుద్ధ్యధీనమై నడచునదిగను, ఇంద్రియములు మనోధీనములుగను నుండవలయును. ఇటుల వానికిఁ బరస్పరసంబంధ ముండవలయును. బుద్ధిమనశ్శబ్దములవలె కాక యంతఃకరణచిత్తము లనుశబ్దములు సైతము ప్రచారమున నున్నవి. వీనిలో నంతఃకరణశబ్దమునకు "లోపలనుండుకరణము, అనఁగ: ఇంద్రియము" అని ధాత్వర్థ మగుటచే, దానిలో సామాన్యముగ మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము మొదలగున వన్నియుఁ జేరును. మనస్సే తొలుత బాహ్యవిషయగ్రహణము (అనఁగా: చింతనమును) చేయుచుండు నేని యదియే చిత్త మగును. (మ.భా. శాం. ౨౭౪. ౧౭) కాని సామాన్యముగ నీశబ్దము లన్నియు సమానార్థకములుగనే ప్రయోగించుటచే ననేకసమయములం దేయర్థ మెక్కడ వివక్షితమో తెలిసికొనలేక సందేహపడుచున్నారు. ఈసందేహ ముండఁగూడ దన్నియే యీశబ్దముల నన్నిటిని వదలి శాస్త్రీయపరిభాషలో, "మనోబుద్ధి" శబ్దములవలె పూర్వోక్త మగునిశ్చితార్థమునందుఁ బ్రయోగింపఁబడుచున్నవి. మనోబుద్ధుల నీతీరున విభజించినపిదప న్యాయాధీశుఁ డనుసంబంధముచే, బుద్ధి మనస్సుకంటె శ్రేష్ఠ మగుటచే, బుద్ధికి మనస్సు గుమాస్తాయగును. "మనస స్తు పరా బుద్ధిః" "మనస్సుకంటె బుద్ధి శ్రేష్ఠమైనది, లేక, పరమగుచున్నది." (గీ. ౩. ౪౨) అను నీగీతావాక్యప్రభావము సైతమిదియే. అయినను వెనుకఁ జెప్పిన ట్లీగుమాస్తాయును రెండువిధము లగుపనులు చేయవలసివచ్చును. (౧) వెలుపల నుండి (అనఁగా: జ్ఞానేంద్రియములద్వారా) లోపలికిఁ బ్రవేశించినవానిసంస్కారములకు వ్యవస్థను జేసి బుద్ధి కెదురుగా నీ సంస్కారములను నిశ్చయార్థమై యుంచుటయు, (౨) బుద్ధిచే నిశ్చయింపఁబడినపిమ్మట బుద్ధియొక్క యాజ్ఞను గర్మేంద్రియముల కిచ్చి దానిమూలమున బుద్ధియందలియుద్దేశము సిద్ధించుటకు నావశ్యక ములగుబాహ్యక్రియలను జేయించుటయు, నిట్లు దుకాణము పెట్టుటకొఱకు ఘొదట కొనుట, పిదపఁ గూర్చుండి యమ్ముటయు నను రెండుపనుల

వనేకసమయములం దొక్కఁడే గుమాస్తా చేయుచున్నందునటుల మనస్సుయొక్క స్థితియైయున్నది. ఇందలితాత్పర్యమే మన:—మన మొకస్నేహితుని జూచితిమేని యశ్వు డతనిని బిలువ నిచ్ఛ కలిగి 'ఓరీ.' యనిపిలుతుము. అప్పుడంతఃకరణమున కెన్నివ్యాపారములు గలుగునో చూడుము. తొలుత నేత్రములచే (అనఁగా: జ్ఞానేంద్రియములచే) మనమిత్రుఁడు సమీపమున నున్నాఁ డనుసంస్కారము మనోమూలమున బుద్ధికడ కేఁగఁ దన్మూలమున నాపదార్థజ్ఞాన మాత్మకు: గలుగును. ఇంతటితో మొదటిపని(అనఁగా:జ్ఞానము పుట్టుట యనుక్రియ)సమాప్తమయినది. పిమ్మట నామిత్రుని పిలువవలయునని యాత్మ బుద్ధిద్వారా నిశ్చయించును. బుద్ధియొక్క విషయములను వ్యవహారములోనికిఁ గొనిపచ్చుటకై మనస్సునకు మాటలాడవలయునని కోరిక కలుగుటచే మనస్సు కర్మేంద్రియములద్వారా 'ఓరీ' యని పలుకరించు చున్నది. పాణినీయశిక్షాగ్రంథమున, శబ్దోచ్చారణక్రియ యీరీతిఁగనే వర్ణింపఁబడియున్నది—

"ఆత్మా బుద్ధ్యా సమేత్యార్థాన్ మనో యుఙ్క్తే వివక్షయా
మనః కాయాగ్ని మాహన్తి స ప్రేరయతి మారుతమ్.
మారుత స్తూరసి చరన్ మంద్రం జనయతి స్వరమ్."

"ఆత్మ మొట్టమొదట బుద్ధిద్వారా సకలవిషయములను గ్రహించుటచే మనస్సున మాటలాడుదు మనుకోరిక పొడమును. మనోమూలమునఁ గాయాగ్ని (జాఠరాగ్ని) చలించును. ఆకాయాగ్ని వాయువును బ్రేరణఁజేయును. పిదప నీవాయువు హృదయమునందుఁ బ్రవేశించి మంద్రస్వరమును బుట్టించును." ఈస్వరమే పిదపఁ గంఠ్యతాల్వాది భేదరూపమున నోటనుండి వెలువడును. పైశ్లోకములోని చివరపాదములు రెండును మైత్ర్యుపనిషత్తులోనైతము కానఁబడుచున్నవి. (మైత్ర్య. ౭. ౧౧.) అందువలన నీశ్లోకభావము,లేక,శ్లోకమే పాణినికంటెఁ బ్రాచీనమైనదని తోఁచుచున్నది.* కాయాగ్నినే యాధునికశారీరశాస్త్రమునందు మజ్జాతంతువు లని వాడు చున్నారు. కాని బాహ్యపదార్థములయొక్క జ్ఞానమును లోనికి కొనిపోవు నవియు, బుద్ధియొక్క యాజ్ఞను మనస్సుద్వారా కర్మేంద్రియ

*మైత్ర్యుపనిషత్తు పాణినికంటెఁ బ్రాచీనమని 'మాక్సుమిల్లరు' అను పండితుఁడు వ్రాసియున్నాఁడు. Sacred Books of the East Series, Vol. XV. pp. 47-51. దీనిగురించిన యధికవిచారమును పరిశిష్టప్రకరణమునఁ జూచుకొనునది.

ములకుఁదెలియఁజేయునవియు నగు మజ్జాతంతువులు వేర్వేఱుగ నున్నవి. కావుననే మనస్సులు సైతము రెండని యనవలయు నని పాశ్చాత్యు లగు శారీరశాస్త్రజ్ఞులు నుడువు చున్నారు. మనశ్శాస్త్రకారులు మనస్సులు రెండని యంగీకరింపక, మనో బుద్ధులను విభజించి మన స్సుభయాత్మకమ్ముగ నున్న దని మాత్రమే (అనఁగ: అది కర్మేంద్రియ విషయముల విషయమై కర్మేంద్రియానుసారముగను, జ్ఞానేంద్రియ విషయముల విషయమై జ్ఞానేంద్రియానుసారముగను సంచరించు నని మాత్రమే) చెప్పిరి కాని యిరువుర తాత్పర్యము నొక్కటియే. ఉభయశాస్త్రకారుల యభిప్రాయముచేతను బుద్ధి, నిశ్చయించు న్యాయాధీశుఁ డగు నేని, మనస్సు తొలుత జ్ఞానేంద్రియముల విషయమై వ్యాకరణాత్మకము, లేక, వ్యవహారములోఁ బెట్టునది (అనఁగ:కర్మేంద్రియములను స్వయముగఁ బ్రవర్తింపఁ జేయునది)అగును. అయినను, ఏవిషయముయొక్క వ్యాకరణము నైనను జేయునప్పుడు బుద్ధియొక్క యాజ్ఞ నెట్లు నెఱవేర్పవలయు ననువిషయమై యొకానొకప్పుడు మనస్సు సైతము సంకల్పవికల్పములనుగూడ చేయవలసి వచ్చును. కావున మనస్సును వ్యాఖ్యానముఁ జేయుచు, సామాన్యరీతిగ "సంకల్ప వికల్పాత్మకం మనః" అని మాత్రమే చెప్పుట పరిపాటిగ నున్నది. కాని యెప్పుడైనను మనస్సుయొక్క రెండువ్యాపారములును దానియందే చేరు నని యెఱుంగవలయును.

బుద్ధి యనఁగ: సారాసారవివేకమును జేయునింద్రియ మని చెప్పఁబడిన యర్థము శాస్త్రీయసూక్ష్మవివేచనార్థమయినది; కాని యీశాస్త్రీయ మగునర్థ మెప్పుడును బిదపనే నిర్ణయింపఁబడును. కావున నీశాస్త్రీయార్థమును నిర్ణయింపకమునుపే బుద్ధిశబ్దమునకు రూఢ మగుచున్న వ్యావహారిక మగునర్థవిచారణ సైత మిచ్చోఁ జేయవలయును. వ్యవసాయాత్మిక యగుబుద్ధిచేఁ దొలుత నేవస్తువునైన విచారించినఁనే కాని యావస్తుజ్ఞానము మనకుఁ గలుగ నేరదు. వస్తుజ్ఞానము పొందమినపిదపఁ గాని దానినిఁ బొందుద మనుకోరిక పుట్టదు. కావున వ్యవహారమునందు, మామిడిచెట్టును, మామిడిపండును సైతము "మామిడి" యనినవ్యవసాయాత్మకబుద్ధిని, మఱియు ఆ బుద్ధియొక్క వాసనాదిరూపఫలములను, జూపుటకుఁ గూడ 'బుద్ధి' యను నొకశబ్దమే జనసామాన్యమ్ముగ వ్యవహారమ్ములం దనేకపర్యాయము లుపయోగింపఁబడుచున్నది. ఉదాహరణము:— 'అతని 'బుద్ధి' యసత్యముగ నున్నది' యనునపుడు, 'అతని 'వాసన' యసత్యముగ నున్న' దని యనినటులే, 'ఇచ్ఛ', లేక, 'వాసన' యనునది శాస్త్రీయ మగునభిప్రాయమున మనోధర్మ మగుటచే దానిని బుద్ధియని నుడువుట

యుక్తము కానేరదు; కాని బుద్ధిశబ్దముయొక్క శాస్త్రీయ మగు విచారణ చేయక మునుపటినుండియు, బుద్ధియను నొకశబ్దమునే, (౧) సారాసారవివేచనఁ జేయునింద్రియము, (౨) ఆ యింద్రియవ్యాపారమూలమునఁ బిదప మానవునిమనస్సునందుఁ గలుగువాసన, లేక, ఇచ్ఛ, అను రెండర్థములయందును సాధారణముగ లోకు లుపయోగించుచునేయున్నారు. కాన మామిడియొక్క భేదమును జూపింపవలసివచ్చెనేని. తొలుత చెట్టను నూహతోనైనను, లేక, పండను నూహతోనైనను 'మామిడి' యను శబ్దమును వాడినట్లు, 'బుద్ధి' శబ్దముయొక్క రెండర్థములయందలి భేదమును దెలియఁ జేయవలసివచ్చినపుడు సదసద్వివేకము చేయుశాస్త్రీయబుద్ధి వ్యవసాయాత్మిక యని విశేషణమును జెప్పుచున్నారు. 'వాసన'ను, 'బుద్ధిమాత్రమే' యని యైనను, స్పష్టముగఁ జెప్పవలయునని పూనినచో 'వాసనాత్మకబుద్ధి' యని యైనను జెప్పుచున్నారు. గీతలయందు 'బుద్ధి' శబ్దము పూర్వోక్తార్థద్వయమునందును బ్రయోగింపఁబడియున్నది. (గీ. ౨. ౪౧-౪౪-౪౯; మఱియు ౩. ౪౨); కర్మయోగవివేచన బాగుగఁ దెలియుటకొఱకు వెనుకఁ జెప్పినరెండర్థములను దప్పక గుర్తుంచుకొనవలయును. మనుజుఁ డేదేనియొకకర్మ నారంభించినపుడాకర్మ మంచిదా? లేక చెడుదా? చేయుటకుఁ దగినదా? లేక, తగనిదా? యనువిషయమునఁ దాను తనవ్యవసాయాత్మకబుద్ధిచేఁ దొలుత విచారించుచున్నాఁడు; కాని, యాకర్మలు చేయుటయం దిచ్ఛయైనను, వాసన (వాసనాత్మకబుద్ధి) యైనను నతని మనస్సున నుదయించుటచే నాపని యొనర్చుటకుఁ బ్రవర్తించుచున్నాఁడు. ఇది యీమనోవ్యాపారముల యొక్క క్రమము. వీనిలోఁ గార్యాకార్యముల నిర్ణయించుట యనునది (వ్యవసాయాత్మక) బుద్ధియొక్క వ్యాపారమయి యున్నది. ఆయింద్రియములు స్వాధీనములుగ నుండెనేని తప్పువాసనలు (అనఁగ: చెడుబుద్ధులు) మనస్సునఁ గలిగి మనస్సు చెడనేరదు. కాన తొలుత వ్యవసాయాత్మకబుద్ధిని శుద్ధముగను, స్థిరముగను నొనరింపవలయునని గీతలలో నీకర్మయోగశాస్త్రమునకు ముఖ్య మగుసిద్ధాంతమయి యున్నది. (గీ. ౨. ౪౧.) గీతలలోనే కాక, 'కాంటు' *అను తత్త్వవేత్తయును, బుద్ధి నీతీరున ద్వివిధముగ విభజించి శుద్ధబుద్ధి (అనఁగా: వ్యవసాయాత్మకబుద్ధి) యొక్కయు, వ్యావహారికబుద్ధి (అనఁగా: వాసనాత్మకబుద్ధి) యొక్కయు వ్యాపా

---

* ఈ 'కాంట'ను నతఁడు వ్యవసాయాత్మకబుద్ధికి Pure Reason అనియు, వాసనాత్మకబుద్ధికి Practical Reason, అనియు నామంబు లిడెను. ఈ రెండు బుద్ధులయొక్క వివేచనకు స్వతంత్రము లగు రెండుగ్రంథములు వ్రాసెను.

రీములను రెండు స్వతంత్ర గ్రంథములందు వివేచనఁ జేసెను. నిజముగ విచారించిన, వ్యవసాయాత్మకబుద్ధిని స్థిర మెట్లు చేయవలసినదియు పాతంజలయోగశాస్త్రమున నుండవలయును గాని, కర్మయోగశాస్త్రమున నుండవలసినపని లేదు. అధునను కర్మలను విచారించుచు, కర్మలయొక్క పరిణామము చూచుటకంటె నాకర్మలఁ జేయించువాసన (అనఁగా: వాసనాత్మకబుద్ధి)యెటు లున్నదో తొలుతఁ జూడవలయు నని గీతలలో సిద్ధాన్తీకరింపఁబడెను. (గీ. ౨. ౪౯); తదనుసారముగనే వాసనలను విచారించితిమేని, యెవరివాసనాత్మకబుద్ధి స్థిరముగను శుద్ధముగను గుదురలేదో, వారి మనస్సునందు వేర్వేఱగువాసనారూపతరంగము లుద్భవిల్లుచున్న వనియు,నందుండి యావాసన లెప్పుడును శుద్ధములుగ నైనను బవిత్రములుగ నైనసుండునని నియమము లేదనియుఁ గాన్పించును (గీ. ౨. ౪౧). వాసనయే శుద్ధము కానియెడలఁ బిదప శుద్ధ మగుకర్మమాత్ర మెటుల సంఘటిల్లును? కావున కర్మయోగశాస్త్రమున సైతము "వ్యవసాయాత్మకబుద్ధిని శుద్ధముగ నుంచుటకు సాధనములు గాని, యుపాయములు గాని యేవి?" యని విస్తరముగ విచారింపవలసినయావశ్యకత కలుగును. ఇందుకొఱకే భగవద్గీతలలో నాఱవయధ్యాయమున బుద్ధిని శుద్ధముగఁ జేయుట కొకసాధన మనునూహతోఁ బాతంజలయోగము వివేచనఁ జేయఁబడినది; కాని యీసంబంధమును తెలిసికొనలేక గీతలలోఁ బాతంజలయోగము ప్రతిపాద్యముగ నున్న దని కొందఱు సాంప్రదాయికటీకాకారులు తాత్పర్యమును వెలివుచ్చిరి. గీతాశాస్త్రమునందు 'బుద్ధి' యనుశబ్దమునకుఁ బూర్వోక్తము లగు రెండర్థములును, ఆయర్థములందలి పరస్పరసంబంధమును గుర్తించుకొనుట కున్నయావశ్యకత దీని వలనఁ జదువరులకుఁ దెలియును.

అది యటు లుండనిమ్ము: ఇంతవఱకు మనుజునియంతఃకరణమునందలి వ్యాపారము లెట్లు నడచుచున్నవో చూచి, "మనోబుద్ధులయొక్క కార్యము లెవ్వి? బుద్ధిశబ్దమునకు మఱియొక యర్థ మేమి?" యనుట చెప్పఁబడినది. మనస్సును, వ్యవసాయాత్మకబుద్ధిని, ఇటుల విడఁదీసినపిమ్మట నిప్పుడు సదసద్వివేకదేవత కేమి గతి యగునో చూతము. మంచిచెడుగులను వివేచించుటయే యీదేవతయొక్క కార్యమగుటచేఁ దనిష్ఠ మగుమనస్సునం దిది చేరదు. ఏవిషయము నైనను విచారించి నిర్ణయించువ్యవసాయాత్మకబుద్ధి యొక్కటియె యగుటచే సదసద్వివేచనాశక్తికి వేఱుగ నవకాశ ముండనేరదు. విషయముయొక్క సారాసారవివేకము నైనను జేసి నిర్ణయించి చెప్పవలసినవిషయము లనేకము లుండియుండును. వ్యాపారము,

యుద్ధము, దండనీతి, నీతిశాస్త్రము, వర్తకము, కృషి మొదలగునాని ప్రతిప్రసంగమునందును సారాసారవివేకము నేర్పఱుపవలసివచ్చును. అంతమాత్రముచే దీనియందున్న వ్యవసాయాత్మిక యగుబుద్ధి భిన్నము కానేరదు. సారాసారవివేక మను నీపని యెచ్చోటఁ జూచిననొక్కటిగనే యున్నది. కావున నావివేకము లేక నిశ్చయించుబుద్ధియు నొకటిగనే యుండవలయును. మనస్సు ననుసరించి బుద్ధియు శారీరధర్మము నుండుటచేఁ బూర్వకర్మానుసారముగఁ దల్లిదండ్రులనుండి వచ్చుచున్న సంస్కారములచే నైనను, శిక్షణము మొదలగు నితరకారణములచే నైనను, బుద్ధి కొంచెము హెచ్చుతగ్గుగ సాత్త్వికముగ నైనను, రాజసముగ నైనను, తామసముగ నైన నుండవచ్చును. కావుననే యొకనిబుద్ధికి తోఁచునట్టివిషయము మఱియొకనిబుద్ధికిఁ దోఁపదు. కాని యంతమాత్రముచే బుద్ధీంద్రియము సదా వేఱుగనే యున్నదని చెప్పఁగూడదు. ఉదాహరణార్థము నేత్రమును జూడుము. కొందఱకు మెల్లకన్ను లుండును. మఱికొందఱకుఁ దిరుగుడుకన్ను లుండును. కొందఱకు గ్రుడ్డివిగఁ, గొందఱకు రేఁజీకటివిగఁ, గొందఱకుఁ జూపు బాగుగ నుండును. ఇట్లున్నను నేత్ర మను నింద్రియ మొకటిగాక యనేకము లున్న వని మనము చెప్పుదుమా? బుద్ధియు నిట్లే యొక్కటియే యున్నది గాని యనేకములు లేవు. ఏబుద్ధి బియ్యమును గోధుమలను వేఱుగఁ దెలిసికొనుచున్నదో, యదియే రాతిని వజ్రమును వేర్వేఱని తెలిసికొనును, అదియే, తెలుపును నలుపును తీపును చేఁదును వేర్వేఱని యెఱుంగును. అదే యెక్కడ భయపడవలయునో, యెచ్చోట నక్కఱ లేదో, సత్పదార్థ మేదియో, యసత్పదార్థ మేదియో, లాభ మెద్దియో, నష్ట మెద్దియో, యేది ధర్మమో, యేది యధర్మమో, చేయఁదగిన దెద్దియో, చేయఁదగని దెద్దియో, యను నీయన్నివిషయములయందలి తారతమ్యమును విచారించి తుదకు నిర్ణయించుచున్నది. సామాన్యవ్యవహారములో దానిని మనోదేవతయని యెంత వేఱుగఁ జెప్పినను, తత్త్వజ్ఞానము ద్వారా దానిని విచారించిన నదియే వ్యవసాయాత్మకబుద్ధి యగును. ఈయభిప్రాయమునే మనస్సున నుంచుకొని గీతలయొక్క పదునెనిమిది యనయధ్యాయములో నొకబుద్ధినే సాత్త్విక మనియు, రాజస మనియు, తామస మనియుఁ ద్రివిధముగ విభజించి.—

"ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ." (గీ. ౧౮. ౩౦)

"ఏపనిని జేయవలయునో, దేనినిఁ జేయ నక్కఱ యుండదో, యేది చేయుటకు యోగ్యమో, యేది చేయుటకు యోగ్యము కానేరదో, దేనికి భయపడవల

యునో, దేనికి నక్కఱ లేదో, దేనియందు బంధ మున్నదో, దేనియందు మోక్ష మున్నదో, యెఱుంగఁ గలబుద్ధి సాత్త్విక మగుచున్నది.'' అని నుడివినపిదప—

"యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్య మేవ చ
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ." (గీ. ౧౮. ౩౧)

"ధర్మాధర్మములయొక్కయైన, కార్యాకార్యములయొక్కయైన, యథార్థ నిర్ణయమును సరిగఁ జేయలేనిది (అనఁగా: పొరపడు) బుద్ధి రాజసము." అనియుఁ దుదకు—

"అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసా వృతా
సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ. తామసీ." (గీ. ౧౮. ౩౨)

"అధర్మమునే ధర్మ మని తలఁచునది గాని, లేక, సర్వవిషయములందు విపరీతముగ (అనఁగా: తలక్రిందై) నిర్ణయించునది గాని యగుబుద్ధి తామసము" అని యర్జునునకు భగవంతుఁడు సెప్పెను. ఈవివేచనవలన మంచిచెడుగులనుమాత్రమే వివేచించు సదసద్వివేకరూపిణియు స్వతంత్రయు నగు నొకదేవత కలదని గీత యొప్పుకొన్నదని స్పష్టమగుచున్నది. ఎప్పుడును మంచిదానినే గ్రహించుబుద్ధి యుండనే యుండదని దీనియర్థము కానేరదు; కాని బుద్ధి యొక్కటియే యగుటచే మంచివస్తువులను వివేచించుట యను నీసాత్త్వికధర్మ మందు ననేకపూర్వసంస్కారములచేఁ గాని, యభ్యాసముచేఁ గాని, యింద్రియనిగ్రహముచేఁ గాని, లేక, యాహారాదులవలనఁ గాని కలుగును. ఈపూర్వసంస్కారములు మొదలగుకారణములు లేనప్పుడా బుద్ధియే యొక కార్యాకార్యనిర్ణయరూపకార్యమునందే కాక యితరవిషయములందు సైతము రాజసము గాని, లేక, తామసము గాని కావచ్చునని వెనుకఁ జెప్పిన శ్లోకముయొక్క భావార్థము. 'చోరునకును, వర్తకునకును వేర్వేఱుదేశస్థులగుమనుష్యులకును, బుద్ధియందు భేద మేలగుండు?'' నను ప్రశ్నకు నీసిద్ధాంతముచే సమాధానము కుదిరినటుల, సదసద్వివేచనాశక్తిని స్వతంత్రదేవతగ నంగీకరించినయెడలఁ గుదురదు. తనబుద్ధిని సాత్త్వికముగఁ జేయుటయే ప్రతిమనుష్యుఁడును జేయఁదగిన పని. ఇంద్రియనిగ్రహము లేక యటులఁ జేయుట శక్యము కానేరదు. మనుజుని యొక్క వ్యవసాయాత్మకబుద్ధి యెంతపర్యంతము, నిజ మగుహిత మెచ్చోనున్నదో యని సారాసారవివేచన నైనను పరీక్ష నైనను జేయక, బొత్తిగ నింద్రియమార్గానుసారముగ నడచుచున్నదో, యంతపర్యంతము దానిని శుద్ధ మని నుడువరాదు. కావున బుద్ధిని, మనస్సునకు నైనను, ఇంద్రియములకు నైనను లోఁబడనీయక, బుద్ధి

యొక్క యధీనతలోనికే యింద్రియములును మనస్సును వచ్చునటుల మనము నిరుపమము చేయవలయును. భగవద్గీతలలో ననేకస్థలములయం దీవిషయమె తెలుపఁబడి యున్నది (గీ. ౨. ౬౭-౬౮; ౩. ౭-౪౧; ౬. ౨౪-౨౬); ఈకారణముననే కఠోపనిషత్తులో శరీరమును రథముగాఁ బోల్చి శరీరసంబంధు లగునింద్రియరూపము లగుగుఱ్ఱములను విషయోపభోగమార్గమునందు నియమముగ నడపుటకు (వ్యవసాయాత్మక) బుద్ధి యనుసారథి, మన స్సనుకళ్లెమును ధైర్యముతో బాగుగ లాగి పట్టుకొనవలయునని రూపకాలంకారముతోఁ జెప్పఁబడినది (కఠ ౩. ౩-౯); మహాభారతమునందు సైతము రెండుమూఁడుస్థలములం దీరూపకాలంకారమే కొద్దిభేదముతోఁ జెప్పఁబడినది (మ. భా. వన. ౨౧౦. ౨౫; స్త్రీ. ౭. ౧౩; అశ్వ. ౫౧. ౫). ఇంద్రియనిగ్రహమువలనఁ గలుగువిషయమును జెప్పునపు డీదృష్టాంత మెంతయుక్తముగ నున్నదియు గ్రీసుదేశములోఁ బ్రసిద్ధుఁ డగు 'ప్లేటో' యను తత్త్వవేత్త సైతము తనగ్రంథమునందు (ఫీడ్రస్. ౨౪౬) ఇంద్రియనిగ్రహమునుగుఱించి వ్రాయుచు నీదృష్టాంతమునే యిచ్చుటవలనఁ దెలియును. భగవద్గీతయం దీదృష్టాంతము ప్రత్యక్షముగ లేదు; కాని పూర్వమునం దుదాహరింపఁబడిన గీతాశ్లోకమునందలి యింద్రియనిగ్రహము యొక్క వర్ణన, యీదృష్టాంతమును మనమునం దిడికొనియె చేయఁబడిన దనువిషయము పూర్వాపరసందర్భము నెఱింగినవారికిఁ దెలియక యుండదు. సామాన్యముగ (అనఁగ: శాస్త్రీయ మగుసూక్ష్మమైనభేదము నొనర్చుట యావశ్యకముకానప్పుడు) దీనినె మనోనిగ్రహ మని చెప్పుదురు; కాని మనోబుద్ధులను వెనుకఁ జెప్పినటుల విడఁదీయవలసినప్పుడు, నిగ్రహ మనుకార్యమును వ్యవసాయాత్మకబుద్ధి చేయవలయును గాని, మనస్సు చేయనేరదు. ఈవ్యవసాయాత్మకబుద్ధి శుద్ధ మగుటకుఁ బాతంజలయోగమందలి సమాధిచే నైనను, భక్తిచే నైనను, జ్ఞానముచే నైనను, ధ్యానముచే నైనను, పరమేశ్వరస్వరూపము నెఱింగి యన్ని జంతువులయందు నొక్కయాత్మయే కలదనువిషయమును బుద్ధియందు దృఢముగ నుంచుకొనవలయును. వ్యవసాయాత్మకబుద్ధి యీవిధముగ నాత్మనిష్ఠ కలదియై, మనోనిగ్రహముచే మనస్సును నింద్రియములును దానియధీనములుగ నుండుట యభ్యాసమైనయెడల, ఇచ్ఛ, వాసన మొదలగుమనోధర్మములు (అనఁగా: వాసనాత్మకబుద్ధులు) స్వయముగనే శుద్ధములు పవిత్రములు నగుటచే శుద్ధసాత్త్వికకర్మవైపునకు దేహేంద్రియాదులు స్వాభావికముగనే ప్రవర్తించును. అధ్యాత్మదృష్టితో విచారింప నివి యన్నియు సదాచరణమునకు మూలములు (అనఁగా: కర్మయోగశాస్త్రముయొక్క రహస్యములు).

మనోబుద్ధులయొక్క నియత మగు ప్రవృత్తి దప్ప సదసద్వివేకశక్తి యను స్వతంత్ర దేవతను మనశాస్త్రకారు లంగీకరింపకపోవుటకుఁ గారణ మేమియో యీ వెనుకటివివేచనవలనఁ జదువరులకు స్పష్టపడును. మనస్సును గాని, బుద్ధినిగాని గౌరవార్థమై దేవత యనువారిమతమునం దేమియు దోషము లేదు; కాని, దేనిని మనము మనస్సని, బుద్ధి యని చెప్పుచున్నామో దానికంటె వేఱగునదియు, స్వయముగఁ బుట్టినదియు, మూఁడవదియు నగుసదసద్వివేకదేవత, యథార్థమగువిచారముచే సిద్ధము కానేరదని యతనిచే నిర్ణయింపఁబడినది. "సతాం హి సందేహపదేషు..." అను నీవాక్యమందలి స్వారస్య మిప్పుడు స్పష్టపడును. ఎవనిమనస్సు శుద్ధముగను, ఆత్మనిష్ఠముగనున్నదో, యతఁడు తనయంతఃకరణమును సాక్ష్యముగఁ గైకొనుట తప్పుకానేరదు. వేయేల? అతఁడు తనమనస్సును శక్యమగునంత శుద్ధము చేసికొని, యేకర్మనైన నారంభించుటకు ముందుగ దానిసాక్ష్యముఁ గైకొనవలయు నని సైతము చెప్పవచ్చు; కాని మోసగాఁడు 'నే నిటులే నడచుచున్నా' నను టవలన నేమియు ప్రయోజనము లేదు. కారణ మేమి యన: ఆయిరువురి సదసద్వివేచనాశక్తియు నేకము కానేరదు. సత్పురుషునిది సాత్త్వికము. మోసగానిది తామసము. సారాంశ మేమియన: దేని నాధిదైవతపక్షావలంబులు సదసద్వివేకమని చెప్పుదురో, దానిని తత్త్వజ్ఞానముద్వారా విచారణఁ జేసిన నది స్వతంత్రదేవత కానేరదనియు, వ్యవసాయాత్మకబుద్ధిస్వరూపములోనే యిదియొకయాత్మ (అనఁగా: సాత్త్వికస్వరూపము)గ నున్నదనియు మనశాస్త్రకారులసిద్ధాన్తము. మఱియు నాసిద్ధాన్తముచే నాధిదైవతపక్షము తనంతటఁ దానే ఖండింపఁబడును.

ఆధిభౌతికపక్షమున కేకదేశీయత్వమును (పూర్వపక్షకోటిలోఁ జేరుట), అపూర్ణతయు, నాధిదైవతపక్షముయొక్క యీసులభ మగుయుక్తియు, నిష్ప్రయోజనములని యిట్లు సిద్ధమైనపిదపఁ "గర్మయోగశాస్త్రము యుక్తియుక్తమగుటకు మఱియొక మార్గ మెద్దియైన నున్నదా లేదా?" యనునది విచారింపవలసివచ్చును. ఈమార్గమునే యాధ్యాత్మిక మందురు. కారణ మేమి యన:—బాహ్యకర్మలకంటె బుద్ధి శ్రేష్ఠమయినదయినను సదసద్వివేకబుద్ధి యనునది యొకానొకస్వతంత్ర మయినదియు, స్వయముగాఁ బుట్టినదియు నగుదేవత కాదని నిశ్చయించినపిదప "శుద్ధకర్మ సంఘటిల్లుటకు బుద్ధి నెట్లు శుద్ధముగ నుంచవలయును? శుద్ధబుద్ధి యని దేనికి పేరు? బుద్ధిని శుద్ధ మెటుల చేయవలయును?" అను నీప్రశ్నలు కర్మయోగశాస్త్రమునందు సైతము విచారించుట యావశ్యక మగును. ఈవిచారమొక బాహ్యసృష్టినే విచారించునట్టి శాస్త్ర

మును (ఆధిభౌతికశాస్త్రమును) వదలి, యాధ్యాత్మికజ్ఞానములోఁ బ్రవేశించినఁ గాని పూర్ణము గాసేరదు. ఆత్మయొక్క యైనను, పరమేశ్వరునియొక్క యైనను సర్వవ్యాపి యగుసత్యస్వరూపము పూర్ణముగ గోచరము కానిచో బుద్ధి శుద్ధము కాజాలదని భరతఖండమునందలిశాస్త్రకారులసిద్ధాంతము. కావున నట్టిబుద్ధి యని (అనఁగా: ఆత్మనిష్ఠ బుద్ధి యని) దేనిని జెప్పవలయునో తెలుపుటకే గీతయందధ్యాత్మశాస్త్రముయొక్క నిరూపణఁ జేయఁబడినది; కాని యీపూర్వాపరసంబంధము నెఱింగికొనక, గీతలయొక్క సాంప్రదాయిక టీకాకారులలోఁ గొందఱు వేదాంత మనునదియే గీతలయందు ముఖ్యప్రతిపాద్యవిషయ మని నిశ్చయించుచున్నారు. గీతలలోఁ బ్రతిపాద్య మగువిషయసంబంధములో నేటీకాకారులచే నిర్ణయింపఁబడినయర్థమును బాగుగ లేదని పైన సవిస్తరముగఁ జూపించెదము. బుద్ధి యెటుల శుద్ధ మగునని విచారించుటకు నాత్మయొక్కయు విచార మావశ్యకమగునని మాత్రమే యిప్పుడు నిరూపింపవలసినవిషయము. ఈయాత్మవిచారము రెండువిధములుగఁ జేయ నగును (౧) తన పిండము, క్షేత్రము, లేక, శరీరము యొక్కయు మనస్సుయొక్కయు వ్యాపారములను పరీక్షించి దానివలన క్షేత్రజ్ఞరూపి యగు నాత్మయొక్కస్వరూప మెటుల నిష్పన్న మగు నని వివేచించుట మొదటివిధము (గీ. అ. ౧౩.) దీనికే శారీరక మని, లేక, క్షేత్రక్షేత్రజ్ఞవిచారమని పేరు. ఈ కారణముననే వేదాంతసూత్రములను "శారీరకసూత్రములు (శరీరముయొక్కవిచారము చేయునవి)" అని నుడివెదరు. ఇట్లు తనశరీరమును మనస్సును విచారించినపిదప, (౨) దానివలన నిష్పన్న మగుతత్త్వము, మనచుట్టు నున్నదృశ్యసృష్టిని (అనఁగా: బ్రహ్మాండమును) నిరీక్షించుటచే నిష్పన్న మగుతత్త్వము, ననునవి రెండును గలిసి యొక్కటిగ నున్నవా? లేక, వేఱుగ నున్నవా? యని విచారించుట రెండవవిధము. ఈసృష్టిపరీక్షను క్షరాక్షరవిచార మని, లేక, వ్యక్తావ్యక్తవిచారమని యందురు. క్షరము, లేక, వ్యక్తము, అనఁగా: సృష్టియందున్న సకలనశ్వరపదార్థములకు, అక్షరము, లేక, యవ్యక్తము, అనఁగా: సృష్టియందున్న యీనాశవంతములగుపదార్థములకు సారభూతమైనది నిత్యమైనతత్త్వముగ నుండును. (గీ. ౮. ౨౧; ౧౫. ౧౬). క్షేత్రక్షేత్రజ్ఞవిచారముచేతను, క్షరాక్షరవిచారముచేతను నిష్పన్నములయినయీరెండుతత్త్వములను మరల విచారించుచు, నీ రెండును నెవరివలన వెలువడినవో, ఏది యీరెండుతత్త్వములకంటెఁ బరముగ నున్నదో, ఏది సర్వమునకు మూలభూత మయిన తత్త్వమని నిష్పన్న మగునో, దానిని పరమాత్మ యని కాని, పురు

షోత్తముఁ డని కొని చెప్పెదరు. (గీ॰ ౮. ౨౦) భగవద్గీతలయం దిది సంపూర్ణముగ విచారింపఁబడి తుదకు సర్వమునకు మూలభూత మగు పరమాత్మరూప మయిన తత్త్వముయొక్క జ్ఞానముచే బుద్ధి యెటుల శుద్ధ మగునో నిరూపించి, కర్మయోగ శాస్త్రమున కుపపత్తి చెప్పఁబడినది. కావున నీయుపపత్తి నెఱుంగఁదలంచితి మేని మనము సైత మామార్గమునే యవలంబింపవలయును. వానిలో బ్రహ్మాండజ్ఞానము, లేక, క్షరాక్షరవిచారము ముందుప్రకరణములోఁ జెప్పఁబడును. సదసద్వివేక దేవతయొక్క సత్యస్వరూపమును నిర్ణయించుట కీప్రకరణమునందుఁ బ్రారంభింపఁబడిన పిండజ్ఞానము, లేక, క్షేత్రక్షేత్రజ్ఞవిచార మపూర్ణముగ నున్నది గాన, దానిని మాత్రమే యిప్పుడు విచారించి ముగించెదము.

పాంచభౌతిక మగుస్థూలదేహము, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, ఈజ్ఞానేంద్రియములయొక్క శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాత్మకము లగు నయిదువిషయములు, సంకల్పవికల్పాత్మక మగుమనస్సు, వ్యవసాయాత్మిక యగు బుద్ధియు ననువానివిచారణ సంపూర్ణ మయినది. కాని యింతమాత్రముచే శరీరవిచారము పూర్ణము కానేరదు. మనోబుద్ధులు రెండును విచారించుటకు సాధనములు (అనగా: ఇంద్రియములు)గ నున్నవి. జడమగుశరీరమున వీనికంటె వేఱగు ప్రాణరూప మగుచేతన (చలనాత్మకవ్యాపారము) లేనిచో, మనోబుద్ధు లుండినను లేకపోయినను సమానముగనే యుండును. అనఁగా: పై నుదహరింపఁబడినవి గాక, 'చేతన' యను మఱియొకతత్త్వమును శరీరమునందుఁ జేర్పవలయును. 'చేతనా' శబ్దమునకే యనేకపర్యాయములు చైతన్యమనియు నర్థమగుచున్నది; కాని, చేతనాశబ్దమిచ్చో చైతన్యమనునర్థమునందుఁ బ్రయోగింపఁబడలేదని యెఱుంగనగును. చేతన యనఁగా: జడదేహమునందుఁ గన్పట్టెడి ప్రాణములయొక్క సంచలనాత్మకక్రియ, చేష్ట, లేక, బ్రదికియుండుట యనువ్యాపారము మాత్రమె యిచ్చో నుద్దేశింపఁబడినది. ఏచిచ్ఛక్తిచే జడపదార్థములందు సైతము చలనాదిక్రియ (అనఁగా: వ్యాపారము) కలుగునో యదియే చైతన్యము: ఈశక్తి యేది యని ప్రస్తుతము మనము విచారింతము. శరీరమునందుఁ గాన్పించుచున్న 'బ్రతికియుండుట' యను వ్యాపారము (అనగా: చేతన) కంటె వేఱగునదియు, పరకీయము నాత్మీయము నను భేదమునకుఁ గారణమైనదియు, మఱియొకవిధ మగుగుణము కలదు. కారణమేమి యన: వెనుకఁ జెప్పినటుల బుద్ధి యనునింద్రియము కేవలము సారాసారములను విచారించి నిర్ణయమును జేయునది యగుటచే స్వపరభేదమునకు మూల మగు

నహంకార మాబుద్ధికంటె వేఱైన దని నుడువవలసివచ్చును. ఇచ్ఛాద్వేషములు, సుఖదుఃఖములు మొదలగుద్వంద్వములు మనస్సుయొక్క గుణములే. నైయాయికులివి యాత్మగుణము లని యందురు. కావున నీతప్పును దిద్దుటకై వేదాంతశాస్త్రము మనోగుణము లనియే బోధించుచున్నది. ఇటులే పంచమహాభూతము లేమూలతత్త్వమునుండి వెలువడినవో యాప్రకృతిరూప మగుతత్త్వము శరీరముననే చేరును. (గీ. ౧౩. ౫-౬) ఈతత్త్వములన్నియు నేశక్తిచే స్థిరములుగ నుండునో యాశక్తి యీయన్నికంటెను వేఱుగ నున్నది. దానిని 'ధృతి' యని నుడువుదురు. (గీ. ౧౮. ౩౩) ఈవిషయముల నన్నిటి నొక్కచోటికి, జేర్చినఁ నేసముచ్చయ మగుపదార్థము నిష్పన్న మగునో, దానిని (సవికార) శరీర మనియు క్షేత్ర మనియు శాస్త్రములలోఁ జెప్పుదురు. దీనినే వ్యవహారమునందు, నడచుచున్నది, మాటలాడుచున్నది (సవికార) మనుష్యశరీర మనియు, లేక, పిండ మనియుఁ జెప్పుచున్నాము. క్షేత్రశబ్ద మిట్లు గీతాప్రమాణముచే నిర్ణయింపఁబడెను గాని యిచ్ఛాద్వేషాదిగుణముల నెంచుచు నీవ్యాఖ్యానములయందుఁ గొన్నిస్థలములలో రమారమిగ వ్రాయఁబడినది. విస్తారము భేదము లేదు. ఉదాహరణము:—శాంతిపర్వమునందలి జనకసులభాసంవాదమునందు (శాం. ౩౨౦) శరీర మన నేమియో తెలుపుచు పంచకర్మేంద్రియములను వదలి వానికి మాఱుగ కాలము, సదసద్భావము, విధి, శుక్రము, బలము నను నాఱుగుణములను జేర్పఁబడినవి. ఈగణనానుసారముగఁ బంచకర్మేంద్రియములును బంచమహాభూతములలోనే చేరునవియగును. గీతలలోనిగణన ననుసరించి కాలమున కాకాశమునందును, విధి శుక్ర బలాదులకు నితరమహాభూతములయందును, లేక, ప్రకృతియందును నంతర్భావ మని చెప్పవలసివచ్చును. ఏది యెట్లున్నను క్షేత్రశబ్దమున కందఱు నొక్కయర్థమునే చెప్పుదురు. మానసికము లైనను శారీరకము లైనను, అన్నివస్తువులును, గుణములును, ప్రాణరూపమగు చేతనతోఁ గూడిన సముదాయముతోఁ గలసి 'క్షేత్ర' మని చెప్పఁబడును. 'శరీర' మనుశబ్దము 'దేహ' మను నర్థమం దుపయోగింతురు. కావున దానికంటె వేఱగు 'క్షేత్ర' మను శబ్ద మిచ్చో నుపయోగింపఁబడును. 'క్షేత్ర' మనుశబ్దమునకు 'చేను' అని ముఖ్యార్థము; కాని యీప్రకరణమున నాశబ్దము, సవికారము సజీవము నగుమనుష్యదేహమునందు లాక్షణికముగ నుపయోగింపఁబడినది. వెనుక నేను దీనినే 'గొప్పకార్యాలయ' మని చెప్పితిని. వెలుపలినుండి కార్యాలయములోనికిఁ బదార్థములను దీసికొనుటకును, అక్కడనుండి (అనఁగ: ఫ్యాక్టరీలో నుండి) పదార్థములను వెలుపలికిఁ బంపుటకును యథాక్రమముగ జ్ఞానేంద్రియములు కర్మేంద్రియము లనునవి యీకార్యాలయమునకుఁ

దలుపులును, మనస్సు బుద్ధి చేతన యనునవి దానియందుఁ బని చేయువారును నై యున్నారు. ఈపనిచేయువారు సేయునదియుఁ, జేయించునదియు నగుపనినే క్షేత్రముయొక్క వ్యాపార మనికాని, వికార మనికాని, లేక, ధర్మ మనికాని చెప్పుదురు.

క్షేత్రశబ్దమున కీతీరున నర్థము నిశ్చయించినపిదప "ఈక్షేత్ర (చేను) మెవరిది? ఈకార్యాలయమునం దధికారి యెవరు? కలఁడా? లేఁడా?" యను నీసందేహము సహజముగ నిష్పన్న మగుచున్నది. 'ఆత్మ' యనుశబ్ద మనేకస్థలములయందు మనస్సు, అంతఃకరణము, లేక, తాను, స్వయముగ అను నీయర్థములం దుపయోగించుట కర్తృముగ నున్నను నాపదమునకు క్షేత్రజ్ఞుఁడు, లేక, శరీరమునకుస్వామి యని యర్థమై యున్నది. మనుష్యులు సేయుమానసికములును శారీరకములు నగుపనుల నన్నిటిని, వానిబుద్ధిమొదలగునంతరింద్రియములును, చర్మము మొదలగుజ్ఞానేంద్రియములును, హస్తపాదాదికర్మేంద్రియములును జేయుచున్నవి. మనోబుద్ధు లను నీ రెండింద్రియములు నీగుంపులోని కెల్ల శ్రేష్ఠములు. ఇవి శ్రేష్ఠము లైనను నితరములగునింద్రియములవలెఁ దోలుదోల్త జడదేహముయొక్క (అనఁగా: ప్రకృతియొక్క) వికారములుగనే యున్నవి. (ముందు ప్రకరణమును జూడుము). కావున మనోబుద్ధు లనునీయింద్రియములు సర్వశ్రేష్ఠము లయినను దమతమముఖ్యవ్యాపారములకంటె నితర మగుబాహ్యవిషయమున నేమియుఁ జేయుటకు రావు. అట్లు చేయుట శక్యమును గానేరదు. మనస్సాలోచనఁ జేయుటయు, బుద్ధి నిశ్చయముఁ జేయుటయు సత్యమే కాని,యంతమాత్రముచే నీకార్యములను, మనస్సును బుద్ధియు నెవరికై చేయు చున్నదియు, నాయాసమయములందు మనోబుద్ధులకు సంఘటిల్లెడు వేర్వేఱువ్యాపారములయొక్క యేకత్వజ్ఞానమునకు నావశ్యక మగు నేకీకరణము నెవరు చేయునదియు, నాయేకీకరణానుసారముగఁ బిదప సర్వేంద్రియములను దమతమవ్యాపారములయం దామనోబుద్ధుల కనుకూలములుగఁ జేయించుటకు మార్గమును జూపువా రెవ రైనదియు నిర్ణీతము కానేరదు. మనుజునకు జడదేహ మేకార్యమునుజేయుచున్న దనియుఁ జెప్పుటకు సాధ్యము కానేరదు. కారణ మేమి యనః శరీరమున నుండెడుచేతన(అనఁగా: ఇటు నటు సంచరించుట యనువ్యాపారము)నాశ మగు నేని జడదేహము మిగిలియున్నను నేమియుఁ జేయనేరదు. జడదేహముయొక్క మాంసము, స్నాయువు మొదలగునవయవము లన్న పరిణామము లగుటచే నెల్లప్పుడు నశించుచు నెల్లప్పుడుఁ గ్రొత్తగఁ బుట్టుచు నుండును. కావున 'నిన్న విషయమును

జూచినదియు, నేఁడు విషయమును జూచినదియు నేనొకఁడనే' యను నేకత్వబుద్ధి
యెప్పుడు మాఱుచుండు జడదేహముయొక్క ధర్మమే యయి యున్న దని చెప్పఁ
గూడదు. మంచిది! జడదేహమును వదలి చేతనయే స్వామి యని చెప్పుద మని గాఢ
నిద్రయందు ప్రాణాదివాయువుల యొక్క శ్వాసోచ్ఛ్వాసములు, లేక, రుధిరాభి
సరణము (రక్తము ప్రవహించుట) మొదలగువ్యాపార (అనఁగా: చేతన) ము
లున్నను 'నే'నను జ్ఞాన ముండదు. (బృ. ౪.౧.౧౫-౧౭). కావున చేతన, లేక, ప్రా
ణాదులయొక్కవ్యాపారము, అనునదియు జడమునందుఁ బుట్టినట్టి యొకవిధమగుగుణ
మగుటచే సర్వేంద్రియవ్యాపారముల నేకీకరణముఁ జేయుసంఘాత మగుస్వామి
శక్తి కాదని సిద్ధమగుచున్నది. (కఠ.౫.౫) 'నాయొక్క—యితరునియొక్క'యను వి
షష్ఠ్యంతవిశేషణములచే నహంకారరూప మగుగుణముయొక్కబోధ కలుగుచున్నది.
కాని, 'అహ' మనఁగా నెవ రనునది (అనఁగా: నే నెవ రనునది) దానిచే నిర్ణీతము
కాలేదు. 'నే'ననునది బొత్తిగ భ్రమ మంటి మేని ప్రతిమనుజునకు నట్టియనుభవము
లేకపోవుటచే నీయనుభవమును వదలి యేకల్పనయైనను జేయుట యనునది—"ప్రతీతి
వీణజే బోలణే, తే అవఘేచి కంటాళవాణే, తోండ వసవూన జైసే సుణే, రడోన
గేలే." "అనుభవమునకు విరుద్ధముగ నేమి చెప్పినను గుక్క నోరుఁ దెఱచి మొఱఁ
గునటు లుండునే కాని సరిగా నుండ నేరదు." (దా. ౯.౫.౧౫.) అని సమర్థరామ
దాసుగారు చెప్పినటు లుండును. అనుభవవిరుద్ధముగా నీవిషయము నొప్పుకొన్నను
నింద్రియవ్యాపారములయొక్క యేకత్వమునకు యుక్తి కుదురనే కుదురదు.
"'నేను' అనునది వేఱుగ నొకపదార్థము కానేరదు గాన క్షేత్రశబ్దమున సమావేశ
ము చేయుటకుఁ దగిన మనస్సు, బుద్ధి, చేతన, జడదేహము మొదలగు నన్నిటియొ
క్కయు సంఘాతమును 'నేను' అని చెప్పవచ్చును." అని యనేకు లందురు. కాని
చెక్కపైఁ జెక్క నిడినమాత్రముచేతనే పెట్టె కానేరదు. గడియారముయొక్క
చక్రముల నన్నింటి నొక్కచో నుంచినను దానియందు నడకపుట్టదు. ఈవిషయము
మనము ప్రత్యక్షముగనే కనుచున్నారము. కావున సంఘాతమాత్రముచేతనే
కర్తృత్వము వచ్చు నని చెప్పరాదు. క్షేత్రముయొక్క సర్వవ్యాపారములును
బొత్తిగఁ బిచ్చివానివ్యాపారములవలె జరుగుట లేదు గాన, నొకవిధ మగు గతి,
లేక, యుద్దేశము కారణమై యుండు నని యెవరికిని జెప్ప నవసరము లేదు. క్షేత్ర
మనుకార్యాలయమున బుద్ధి మొదలగునందఱుగుమాస్తాలకు నీధోరణి నెవరు కలు
గఁజేయుచున్నారు? 'సంఘాత' మనఁ బ్రోగగుట. సర్వపదార్థముల నొకచోఁ

బ్రోగుచేసినను నవియన్నియుఁ గలిసి యొకజీవ మగుటకు దానిలో నుండి యొక త్రాడు గ్రుచ్చవలసివచ్చును. అట్లు గ్రుచ్చినను నది మరల నెక్కడ నైనను సంబంధము వదలి పోవును. ఈత్రా డేమయి యుండు నని యిప్పుడు మనము విచారింపవలయును. సంఘాతము భగవద్గీతలలో లేనిది కానేరదు. దానిగణన క్షేత్రములోనే చేయఁబడుచున్నది (గీ. ౧౩. ౬). క్షేత్రమునకు యజమానుఁ డెవడైనదియు నింమచే స్థిరము కానేరదు. సముచ్చయములో నేవైయినను గ్రొత్త గుణములు పుట్టు నని కొంద అందురు; కాని యీమతే మంతకుమునుపే పనికి రాదు. కారణమేమి యన: పూర్వమునం దేరూపము చేతను లేనివస్తు వీజగత్తు నందుఁ గ్రొత్తగ నుత్పన్నము కానేర దని తత్త్వజ్ఞాను లగుపురుషులు పూర్ణముగ విచారించి సిద్ధాన్తీకరించిరి (గీ. ౨. ౧౬). కాని యీసిద్ధాన్తము కొంచెము కాలము దూరముగ నుంచినను, "సంఘాతమున నుత్పన్నము కాఁబోవునూతనగుణమె, క్షేత్రమునకు స్వామి యెందుకు కానేరదు?" అను మఱియొక ప్రశ్న పిదప సహజముగ వెలువడును. "ద్రవ్యమును వానిగుణములును వేఱు గావు. గుణముల కేమయినఁ గొంచె మాధార ముండవలసివచ్చును. కావున సముచ్చయమువలనఁ బుట్టుగుణములకు బదులుగ మేము సముచ్చయమునే యీక్షేత్రమునకు స్వామి యని చెప్పుచున్నాము." అని యిప్పటియాధిభౌతికశాస్త్రజ్ఞులు దీనిపై యుక్తిఁ జెప్పుచున్నారు. బాగుగనే యున్నది; కాని వాడుకలో నగ్నిశబ్దమునకు మాఱుగ 'కొయ్య' యనుశబ్దమును, 'మెఱపు' అనుశబ్దమునకు మాఱుగ 'మబ్బు' అనుపదమును, 'భూమి నాకర్షించుట' యనుటకు మాఱుగ 'భూమి' యనియు నేల చెప్పుట లేదు? క్షేత్రముయొక్క సర్వవ్యాపారముల నొకనియమముగను, క్రమముగను, సంబంధించునటుల నడుపుటకు మనోబుద్ధులక్కంటె వే ఱగు నేదైన నొకశక్తి యుండవలయు నను నది మాత్రము నిర్వివాద మయినను, ఆశక్తియొక్క యధిష్ఠాన మిప్పటికిని మనకుఁ దెలియకపోవుటచే నైనను, లేక, యీశక్తియొక్కయో యధిష్ఠానముయొక్కయో పూర్ణస్వరూప మిప్పటికిని జెప్పుట సాధ్యము కాకపోవుటచే నైనను, ఆ శక్తి యనునదే లేదని చెప్పుట న్యాయ్యమా? తనభుజములపైఁ దాను కూర్చుండె ననుట యసంగత మైనటులె సంఘాతము సంఘాతము నెఱుంగుచున్న దని చెప్పుట సైత మసంగతము. కావున దేహేంద్రియాదిసంఘాతముయొక్క వ్యాపారము, దేనియొక్క యుపభోగార్థమైనను, లేక, లాభార్థ మైన నగునో, యది యేదయినను సంఘాతముకంటె వేఱుగ నుండవలయు నని తర్కదృష్టిచే సైతము దృఢమగునను మానము నిష్పన్న మగును. సంఘాతముకంటె భిన్నముగ నుండునితత్త్వము

స్వయముగ సర్వవిషయములఁ దెలిసికొనున దగుటచే సృష్టియందున్న యితర పదార్థములవలె నది మనకు స్వయముగ గోచరము కాకపోవుట సత్యమే; కాని యింతమాత్రమునకే దానియొక్క యస్తిత్వమున కేమియు బాధరానేరదు: కారణ మేమి యన: సర్వపదార్థములును 'జ్ఞేయ'ములుగనే యుండవలయు నను నియమము లేదు. జ్ఞాతయు, జ్ఞేయము (అనఁగా: తెలిసికొనువాఁడును, అతనిచేఁ దెలియఁదగినవస్తువు) అని యవి రెండువర్గములుగ నున్నవి. రెండవవర్గములోఁ జేరనివస్తువు మొదటివర్గములోఁ జేరును గావున దానికి అస్తిత్వము, జ్ఞేయవస్తువునకు వలెనే పూర్ణముగ సిద్ధ మగును. వేయేల? సంఘాతమునకు దూరముగ నున్నయాత్మ తానే జ్ఞాత యగుటచే దానికిఁ గలుగఁబోవుజ్ఞానమున కది విషయము కాకపోయినను నేమియు నాశ్చర్యము లే దననచ్చును. ఈయభిప్రాయమును బట్టియే "ఓరీ! సర్వమును దెలిసికొనువానిని దెలిసికొనుటకు మఱియొకఁ డెచ్చోనుండి వచ్చును?"—"విజ్ఞాతార మరే! కేన విజానీయాత్?" అని బృహదారణ్యకోపనిషత్తులో (బృ. ౨. ౪. ౧౪) యాజ్ఞవల్క్యునిచేఁ జెప్పబడియున్నది. కావున హస్తపాదాదీంద్రియములు మొదలు పైకిఁబోయిపోయి, ప్రాణము, చేతన, మనస్సు, బుద్ధియు ననువీనికంటెను, వీని కధీనులు నేకదేశీయులు నగు గుమాస్తాలకంటెను నైతము దూరముగ నుండునదియు, వానియన్నివ్యాపారముల నేకీకరణముఁ జేయునదియు, నాయావ్యాపారములందు వానివానిఁ బ్రేరణ చేయునదియు, వానియొక్క కర్తలకు సాక్షిభూత మయినదియు, వానికంటె నధికవ్యాపకముగను సమముగ నుండునదియు నగుశక్తి యీచేతనావిశిష్ట మగు (అనఁగా: సజీవమగు) దేహమునందు (అనఁగా: క్షేత్రమునందు) వాసముఁ జేయుచున్న దని తుదకు సిద్ధాంతము చేయవలసివచ్చును. ఈసిద్ధాంతము సాంఖ్యవేదాంతశాస్త్రములరెంటి ననుసరించియే యున్నది. అర్వాచీనకాలమునందు జర్మనీదేశస్థతత్త్వజ్ఞుఁడు 'కాంటు' అనునతఁడు బుద్ధివ్యాపారములను సూక్ష్మముగఁ బరీక్షించి యీసిద్ధాంతమే తేలునని నిరూపించినాఁడు. మనస్సు, బుద్ధి, అహంకారము, లేక, చేతన అనునవి యన్నియు దేహము (క్షేత్రము) యొక్క గుణములుగను, లేక, యవయవములుగ నున్నవి. వీనికిఁ బ్రవర్తకుఁడు వీనికంటె వేఱుగను స్వతంత్రుఁడుగను, వీనికంటె వెలుపలివాఁడుగను నున్నాఁడు. "యో బుద్ధేః పరత స్తు సః" (గీ. ౩-౪౨) వీనికే సాంఖ్యశాస్త్రములోఁ బురుషుఁడని పేరిడిరి. వేదాంతమునందు 'క్షేత్రజ్ఞుఁ'డనియు, 'క్షేత్రమును దెలిసికొనునాత్మ' యనియుఁ జెప్పుచున్నారు. 'నేనున్నాను' అని ప్రతిమను

జునికిఁ గలుగునట్టి సాక్షాత్ప్రతీతియే దానియొక్క యస్తిత్వమునకుఁ బరమావధి. (వే. సూ. శాం. భా. ౩. ౩. ౫౩-౫౪) 'నేను లే'నని నోటను మాటనైన ననఁడు. 'లేను' అను క్రియాపదమునకుఁ గర్తయొక్క (అనఁగా: నాయొక్క, లేక, యాత్మయొక్క)యస్తిత్వము నశిఁడు మఱియొకవిధముగ నొప్పుకొనుచునే యున్నాఁడు. 'నేను' అను నీయహంకారయుక్త మగు సగుణరూపముచే దేహమునం దిట్లు మనవ స్వయముగ వ్యక్త మగునాత్మయొక్క (అనఁగా: క్షేత్రజ్ఞునియొక్క), మొదటి నుండియు శుద్ధమును, గుణరహితము నయినస్వరూప మేది? యనువిచారము, శక్తికొలఁది నిర్ణయించుటకే వేదాన్తశాస్త్రము ప్రవర్తించినది. (గీ. ౧౩. ౪); అయిన నీనిర్ణయము కేవలము దేహముయొక్క (క్షేత్రముయొక్క) విచారమునం దుండియే స్థిరము కానేరదు. క్షేత్రక్షేత్రజ్ఞులవిచారమే కాక బాహ్యసృష్టిని (అనఁగా: బ్రహ్మాండమును సైతము) విచారించి యేమని తేలునో చూడవలయునని పూర్వమునందుఁ జెప్పఁబడినది. బ్రహ్మాండముయొక్క యీవిచారమునకే క్షరాక్షరవిచార మని పేరు. క్షేత్రక్షేత్రజ్ఞవిచారముచే క్షేత్రమునందు (అనఁగా: దేహమునందు, లేక, పిండమునందు) ఏమూలతత్త్వ (క్షేత్రజ్ఞుఁడు, లేక, యాత్మ)యున్నదియు నిర్ణీతమగును. క్షరాక్షరవిచారముచే బాహ్యసృష్టి (అనఁగా: బ్రహ్మాండము) యందున్న మూలతత్త్వము తెలియును. పిండబ్రహ్మాండములయొక్క మూలతత్త్వము లిట్లు ముందు వేర్వేఱుగ బాగుగ విచారించి, యీ రెండుతత్త్వములు నొకటియే యని నిశ్చయముఁ జేసినపిదప—అనఁగా: ఏది పిండమందుఁ గలదో యది బ్రహ్మాండమందును గల దని—వేదాన్తశాస్త్రమున సిద్ధాన్తీకరింపఁబడినది. *అదియే సర్వచరాచరసృష్టిలోఁ దుదకు సత్య మైనది. పాశ్చాత్త్యుల దేశమందును నిట్టియూహ

* క్షరాక్షరవిచారము - క్షేత్రక్షేత్రజ్ఞవిచారము నను మనశాస్త్రమున నున్నవర్గీకరణమును 'గ్రీన్'ద్వారగా తెలియఁగనే యెఱుఁగరు. అయినను Prolegomena to Ethics అనుగ్రంథమున తాను జేసినయధ్యాత్మవివేచనను, Spiritual Principle in Nature అనియు, Spiritual Principle in man అనియు నిట్లుత రెండుగ విభజించి, పిదప దాని కేకత్వమును జూపెను. క్షేత్రక్షేత్రజ్ఞవిచారమునందు Psychology మొదలగుమానసశాస్త్రములును, క్షరాక్షరవిచారమునందు Physics, Metaphysics మొదలగుశాస్త్రములును జేరును. మఱియు నీని నన్నిటిని విచారించినపిదప నాత్మస్వరూపమును నిర్ణయింపవలసివచ్చు ననువిషయమును పాశ్చాత్త్యవిద్వాంసులుసైత మొప్పుకొందురు.

పోవ లుత్పన్నము లైనవి. కాంటుమొదలగు కొందఱు పాశ్చాత్యతత్త్వజ్ఞుల యొక్క సిద్ధాన్తము మనదేశమునందున్న వేదాన్తశాస్త్రములయొక్క సిద్ధాన్తములతో ననేకవిషయముల సంబంధించి యున్నదని తెలిసికొంటిమేని యాధిభౌతికశాస్త్రముల కిప్పు డున్నంతవృద్ధి పూర్వకాలమున లేక పోయినను, వేదాన్తమున నున్న సిద్ధాన్తముల నాంతరదృష్టిచే బహుకాలముక్రిందనే శోధించి తీసినవారియు లౌకిక బుద్ధివైభవమునకు నాశ్చర్యపడకమానము. ఆశ్చర్యపడుటయేగాక మనము వారిపై మంచియభిమానముసైతము ముంచవలయును.

ఇది ఆధిదైవతపక్ష-క్షేత్రక్షేత్రజ్ఞవిచారమను సప్తప్రకరణము.



# సప్తమ ప్రకరణము.

## కాపిలసాంఖ్యశాస్త్రము, లేక, క్షరాక్షరవిచారము.

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి." *

గీతా. ౧౩. ౧౯.

శరీరము, శరీరస్వామి, లేక, యధిష్ఠాత—క్షేత్రము, క్షేత్రజ్ఞుఁడు—అను వానిని విచారించినట్లే, దృశ్యసృష్టి, దానియందలి మూలతత్త్వము—క్షరము, అక్షరము—అను వాని నన్నిటిని గూడ విచారించి యాత్మయొక్క స్వరూపనిర్ణయమును జేయవలయు నని పూర్వప్రకరణమునఁ జెప్పితిమి. ఈక్షరాక్షరసృష్టిని యోగ్య మగు విధమున విచారించునవి మూఁడు శాస్త్రములు. (౧) న్యాయశాస్త్రము, (౨) కాపిలసాంఖ్యము, (౩) వేదాన్తము; కాని, మొదటిరెంటిలో నున్న సిద్ధాన్తముల నపూర్ణములుగ నిశ్చయించి, బ్రహ్మస్వరూపనిర్ణయము వేదాన్తశాస్త్ర మనుమూఁడవ రీతిని జేయఁబడినది. కావున వేదాన్తముయొక్క యుపపత్తి నెఱుంగుటకుఁ బూర్వము నైయాయికులయొక్కయు, సాంఖ్యులయొక్కయు, కల్పనలేవో మన మవశ్య మెఱుంగవలయును. బాదరాయణాచార్యులవారి వేదాన్తసూత్రములయం దీపద్ధతి యంగీకరింపఁబడినది. వారు నైయాయిక-సాంఖ్యమతములను రెండవయధ్యాయములో ఖండించినారు. ఆవిషయ మంతయు నిచ్చో నుడువుట కసాధ్య మైనను, భగవద్గీతారహస్యము నెఱుంగుట కావశ్యక మగునంతవఱకుఁ బరిచయము ముందుప్రకరణమునఁ జేయుచున్నాము. నైయాయికులసిద్ధాన్తముకంటె సాంఖ్యుల సిద్ధాన్తము మిక్కిలి గొప్పది. కారణ మేమి యన: బాదరాయణాచార్యులవారు (వే. సూ. ౨.౧.౧౨; మఱియు, ౨.౨.౧౫-౧౭) చెప్పినటుల కాణాదన్యాయ మతములను, శిష్టుఁడును, ప్రముఖుఁడు నగు నేవేదాన్తియు నొప్పుకొనక పోయినను, కాపిలసాంఖ్యశాస్త్రమందలియనేకసిద్ధాన్తములు మనువు మొదలగువారిస్మృతులలోను, గీతలలోను నున్నని గాన, వాని ముందుగఁ జదువరు లెఱుంగవలయును. సాంఖ్యశాస్త్రమునందలి యనేకకల్పనలు, వేదాన్తమునందు స్పష్టముగఁ గాన్పించు చున్నను, సాంఖ్యవేదాన్తులయొక్క చివరసిద్ధాన్తములు మిక్కిలి భేదముగలవై

---

* ప్రకృతి పురుషు లనాదు లని యెఱుంగవలయును.

యున్న దనుసంగతి చదువరులకుఁ దెలియుటకై, మొదటనే యీవిషయమును జెప్ప వలసివచ్చెను. "వేదాన్తసాంఖ్యశాస్త్రముల రెంటియందును నంగీకరింపఁబడినకల్పన ముం దెవ్వనిచేఁ గల్పింపఁబడినది?— వేదాన్తులచేతనా? సాంఖ్యులచేతనా?—" అనియు నొక ప్రశ్న వెలువడుచున్నది; కాని యింతయగాధ మగువిచారము నీగ్రంథ మునఁ జేయుట సాధ్యము కానేరదు. ఉపనిషత్తులు (వేదాన్తము) సాంఖ్యము నను నివి రెండు నొకప్పు డిరువురుసోదరులవలె నొక్కసారిగనే ప్రవర్తిల్లినందున, నుప నిషత్తులలో నున్నమతము సాంఖ్యమతానుసారముగ నున్నది. కావున నాయుప నిషత్తులు రచించినవారిచే స్వతంత్రముగ శోధించి తీయఁబడియుండునా? లేక, సాంఖ్యశాస్త్రములోనుండి కొన్నిసిద్ధాన్తములఁ గైకొని వానిని వేదాన్తశాస్త్ర మున కనుకూలముగ మార్పుచేసి యుందురా? లేక, ప్రాచీనము లగునుపనిషత్తుల యందున్న సిద్ధాన్తములనే కపిలాచార్యులవారు తనయిష్టానుసారముగ సంస్క రించి సాంఖ్యశాస్త్రరచనఁ జేసి యుందురా? యని త్రివిధముగ నూహింపవలసి వచ్చుచున్నది; కాని యుపనిషత్తులు సాంఖ్యము నను నీరెండును ప్రాచీనములే యైనను వానిలో నుపనిషత్తు లధికప్రాచీనములు (శ్రౌతములు) గ నున్నవని విచా రించితి మేని కడపటియూహ యన్నింటికంటె నెక్కువగ నప్పుడగియున్న దని తోఁచును. ఎటులయిన నుండనిమ్ము. తొలుత న్యాయసాంఖ్యసిద్ధాన్తములు మనకుఁ దెలిసెనేని వేదాన్తముయొక్క—ముఖ్యముగ గీతలలోనివేదాన్తముయొక్క— తత్త్వము త్వరగఁ దెలియును. కావున నీరెండుస్మార్తశాస్త్రములయొక్క క్షరాక్షర సృష్టిరచనావిషయ మైన మతభేదమును ముందు మన మించుక విచారింతము.

"ఒకానొక వివక్షితము, లేక, గృహీత మయిన విషయమునందుండి ముందు తర్కానుసారముగనే యనుమానముల నెటుల తీయవలయును? ఈయనుమానముల లో నొప్పగున దేది? తప్పగునదేది? ఎందువలన? అది యేన్యాయశాస్త్రమున ముఖ్య ముగఁ జెప్పఁబడువిషయము?" అని యనేకు లడుగుదురు. ఆప్రశ్నలు యుక్తములు కానేరవు. అనుమానము మొదలగు ప్రమాణఖండము న్యాయశాస్త్రమున నొక భాగముగ నున్నది; కాని, ఇది ముఖ్యము కాకపోవుటచేఁ బ్రమాణములె కాక, సృష్టియందున్న యనేకవస్తువుల (అనఁగా: ప్రమేయపదార్థముల) నొకటిగఁ జేసి యైనను, లేక వర్గీకరించి యైనను, క్రిందివర్గముననుండి పైవర్గమునకుఁ బోనుపోను, "సృష్టిలోని యన్నిపదార్థములకును మూలభూతము లగువర్గము లెన్ని?" లేక, "పదార్థము లెన్నియై యుండును? వాని గుణధర్మము లెవ్వి? వానియందుండి పదప

నితరపదార్థము లెట్లు పుట్టినవి? ఏరీతిగ సిద్ధ మగును?'' అనుపీవిధ మగుప్రశ్న లన్నియు న్యాయశాస్త్రమునందు విచారింపఁబడుచున్నవి. వేరేల? ఇందుకొఱకె యీశాస్త్రము నిర్మింపఁబడినది. కేవల మనుమానఖండమును విచారించుటకుఁగా నేర దని చెప్పినను జెప్పవచ్చును.కణాదునియొక్క న్యాయసూత్రారంభమును, పిదప రచనయు నిట్టిదే. కణాదానుయాయు లందఱు కాణాదులె. జగత్తునకు మూలకారణము పరమాణు వని వారిమతము. కణాదునియొక్క పరమాణువ్యాఖ్యానమును, పాశ్చాత్యులగునాధిభౌతికశాస్త్రజ్ఞుల పరమాణువ్యాఖ్యానమును రెండు నొకరీతిగనే యున్నవి. పదార్థములను విభజించుచు, తుట్టతుదకు విభాగార్హత లేనివానిని బరమాణువు (పరమ + అణువు) లని చెప్పుచున్నారు. ఈపరమాణువులు గుమికూడినకొలఁది వానియందు నవీనగుణములు సంయోగముచేఁ బుట్టుటవలన వేర్వేఱుపదార్థములు పుట్టుచున్నవి. మనస్సునకును శరీరమునకును బరమాణువు లున్నవి. అవి కలిసి యొక్కచో నుండిన చైతన్య మగును. పృథివి, అప్పు (జలము) తేజస్సు, వాయువు, వీనిపరమాణువులు స్వభావముగనే వేర్వేఱుగ నున్నవి. పృథివికి మూలభూత మగుపరమాణువునందు నాలుగుగుణములును (రూపము, రసము గంధము,స్పర్శము), జలపరమాణువునందు మూఁడుగుణములును, తేజఃపరమాణువునందు రెండును, వాయుపరమాణువునం దొకేగుణము నున్నవి. ఈతీరున సర్వజగత్తును ననాదినుండియు సూక్ష్మములు, నిత్యములు నగుపరమాణువులచే వ్యాపింపఁబడినది. పరమాణువులు దక్క జగత్తున కితరమూలకారణము లేదు. సూక్ష్మములు నిత్యములు నగుపరమాణువు లొకదానితో నొకటి కలియుట కారంభ మయినప్పుడు సృష్టియందు వ్యక్తపదార్థములు పుట్టును. వ్యక్తసృష్టియొక్క యుత్పత్తి విషయమై నైయాయికులచేఁ గల్పింపఁబడిన యీకల్పనకు 'ఆరంభవాద' మని పారిభాషికనామము.కొందఱు నైయాయికు లీపరమాణువులకంటెఁ బైన నేమి యున్నదియు విచారింపరు. మరణసమయమునం దీశ్వరుని స్మరింపు మని దగ్గఱ నున్న యాప్తులు చెప్పఁగ "పీలవః! పీలవః!! పీలవః !."—"పరమాణువులు! పరమాణువులు!! పరమాణువులు!!."—అని యొకానొకనైయాయికుఁ డన్నట్లు కథను జెప్పుచున్నారు. అయినను గొందఱు నైయాయికులు పరమాణువులయొక్క సంయోగమునకు నీశ్వరుఁడు నిమిత్తకారణ మని యంగీకరించి సృష్టియొక్క కారణపరంపరారూప మగుగొలుసును బూర్తి చేసికొనుచున్నారు. వీరిని సేశ్వరనైయాయికులని సచించుచు, వేదాన్తసూత్రములయొక్క రెండవయధ్యాయమునందలి

రెండవపాదమునందు మొదట నీపరమాణువాదమును (౨. ౨. ౧౧-౧౭), పిదప నీశ్వరుఁడు కేవలనిమిత్తకారణముగ నున్నాఁ డనుమతమును (౨. ౨. ౩౭-౪౧) ఖండింపఁబడినవి.

వెనుకఁ జెప్పిన పరమాణువాదముఁ జదివినయెడల పూర్వాణభాషాభ్యాసము చేసిన చదువరులకు, అర్వాచీనుఁడును రసాయనశాస్త్రజ్ఞుఁడు నగు 'డాల్టన్' అను పండితుఁడు ప్రతిపాదించినపరమాణువాదము స్మరణలోనికి రాకమానదు, కాని పాశ్చాత్త్యులదేశమునం దున్న 'డాల్టను' యొక్క పరమాణువాదము, 'డార్విన్' అను పేరు గలప్రసిద్ధుఁ డగుసృష్టిశాస్త్రజ్ఞునియొక్క యుత్క్రాంతివాదమువలన నెట్లు మూలబడినదో, యటులె పూర్వకాలమునందు హిందూదేశమునసైతము సాంఖ్యమతముచేఁ గాణాదమతము వెనుకకు మరలింపఁబడెను. మూలపరమాణువులకు కదలిక యెట్లువచ్చినదియుఁ గాణాదులు చెప్పలేరు. ఇంతియకాక, "వృక్షములు, మనుష్యులు, పశువులు మొదలగుసచేతనప్రాణులకు పైకెక్కుటకు మార్గ మెటుల లభించినది? అచేతనములకు సచేతనత్వ మెటుల లభించును?" మొదలగు నితరము లయినసందేహములకు నీమతానుసారముగ సరి యగుసమాధానము రానేరదు. ఈసంగతినిగుర్తించి బాగుగ పాశ్చాత్త్యులదేశమునందు ౧౯౦౦ శతాబ్దమునందు 'లామార్క్' 'డార్విన్' అను వారిచేతను, మనదేశమునందుఁ బూర్వమునఁ గపిలమహాముని చేతను చెప్పఁబడినది. ఒక్క మూలభూతపదార్థముయొక్క గుణములే వికసించుటచే సృష్టియొక్క సమస్త మగురచనయు నగుచున్న దని యీయిరువుర మతము. ఈహేతువుచేత నే పూర్వమున హిందూదేశమునను, ప్రకృతమున పాశ్చాత్త్యులదేశమునను పరమాణువాదము వెనుకఁబడినది. అటులె పరమాణువు లవిభాజ్యములు కావనిసైత మిప్పటిపదార్థశాస్త్రజ్ఞులచే సిద్ధాన్తీకరింపఁబడెను. ఇప్పు డెట్లు సృష్టిలోనియనేకపదార్థములను విడఁదీసియు బరీక్షించియు ననేకసృష్టిశాస్త్రముల యాధారమునఁ బరమాణువాదమును, లేక, ఉత్క్రాంతివాదమును, సిద్ధముఁ జేయుచున్నారో యట్లు పూర్వమున లేకుండెను. సృష్టియందలిపదార్థములయందు వేర్వేఱును గ్రొత్తక్రొత్తవియు నగుప్రయోగములను చేసి చూచి వాని ననేకవిధములుగ విభజించి వానియందలిగుణధర్మముల నిశ్చయించుట, సజీవసృష్టిలో నున్ననవీనములును ప్రాచీనములు నగున నేకప్రాణులయొక్క శారీరావయవముల నొకచోటికిఁ జేర్చి పోల్చుట, మొదలగునాధిభౌతికశాస్త్రజ్ఞులనూతనయుక్తులు

కణాదునకుఁ గాని, కపిలునకుఁ గాని తోఁపలేదు. వారిదృష్టియెదుట నాసమయమునం దున్ననితరసామగ్రితో మాత్రమే వారు సిద్ధాంతీకరించిరి. అయినను సృష్టియొక్క వృద్ధి గాని, క్షయము గాని యెట్లు లై యుండు ననువిషయములో సాంఖ్యశాస్త్రకారులచేఁ జెప్పఁబడినతాత్త్వికసిద్ధాన్తములలోను, అర్వాచీను లగునాధిభౌతికసిద్ధాన్తులతాత్త్వికసిద్ధాన్తములలోను విశేషము భేదము కానరా దనుసంగతి యాశ్చర్య కరమై యున్నది. సృష్టిశాస్త్రజ్ఞానాభివృద్ధి యగుటచే నీగుతమున కాధిభౌతికోపపత్తి యిప్పుడు మిక్కిలి యుక్తియుక్తముగ నున్నటుల చెప్పవచ్చును. కావున నాధిభౌతికజ్ఞానాభివృద్ధిచే మనుజులకు వ్యావహారికదృష్టియందు విశేషలాభము కలిగిన దనునంశమునం దేమియు సందేహము లేదు; కాని యొక్కయవ్యక్త మనెడుప్రకృతివలన నానావిధము లగువ్యక్తపదార్థసృష్టి యెటులాయె ననువిషయమున కర్వాచీనాధిభౌతికశాస్త్రజ్ఞుఁడు కపిలునికంటె విశేషముగ నేమియు సమాధానము చెప్ప లేదని తెలియుటనిమిత్తమై కాపిలసిద్ధాన్తమును, బిదప నాయాప్రదేశములయందు 'హెకెల్' యొక్క సిద్ధాన్తమును బోల్చి చూచుటకై కొంచెము నిరూపించెదను. 'హెకెల్' అనునతఁ డీసిద్ధాన్తముఁ గ్రొత్తగఁ గని పెట్టలేదు. 'డార్విన్' 'స్పెన్సరు' మొదలగు పూర్వాధిభౌతికపండితుల యాధారముచే, తాను స్వసిద్ధాన్తమును బ్రతిపాదించినటుల 'హెకెల్' తన గ్రంథములలోఁ దేటతెల్లముగ వ్రాసికొనెను. అయిన నీసిద్ధాన్తకుల నన్నింటి నొకచోటఁ జేర్చి 'హెకెల్' 'ప్రపంచముయొక్క కట్టుకథలను' * తన గ్రంథములో సంక్షేపముగను సులభముగఁ దెలియునట్లును జెప్పుటచే, సౌలభ్యముకొఱకు ఆ 'హెకెలు' నకే యాధిభౌతికతత్త్వజ్ఞుల యందఱకంటె నాధిక్యమును గల్పించి, వానిమతము ప్రధానముగ నీముందుప్రకరణములోఁ జెప్పఁబడుచున్నది. 'హెకెల్' చెప్పు నీవిషయము మిక్కిలి యుమిడికితో నున్న దని చెప్పనక్కఱలేదు. కావున నిచ్చో నీసిద్ధాన్తము నంతకంటె విశేషముగ విచారించుటకు శక్యము కానేరదు. ఈవిషయమై విశేషముగ నెఱుంగఁగోరువారు 'స్పెన్సర్' 'డార్విన్' 'హెకెల్' మొదలగు ప్రముఖులమూలగ్రంథములనే చూడవలయును.

---

* *The Riddle of the Universe* by Ernst Haeckle అను గ్రంథముయొక్క R. P. A. cheap Reprint అను మరల ముద్రింపించిన పుస్తకమును నేను ప్రతిస్థలమున నుదాహరణార్థమై గ్రహించితిని.

కాపిలసాంఖ్యమును విచారించుటకు ముందుగా 'సాంఖ్య' శబ్దముయొక్క వేర్వేఱగు రెండర్థముల నిచ్చటఁ జెప్పుచున్నాను. మొదటియర్థము కపిలాచార్యులచేఁ జెప్పఁబడిన సాంఖ్యశాస్త్రము. అదియే యీ ప్రకరణమునందును, భగవద్గీతయందును నొకసారి (గీ ౧౮. ౧౩) చెప్పఁబడినది; కాని యీయర్థమే కాక సమస్తమగు జ్ఞానమును సామాన్యముగ 'సాంఖ్య' మనియే పేర్కొనుట వాడుకయై యున్నది. కాన దానియందు వేదాన్తశాస్త్రముసైతము చేరియున్నది. 'సాంఖ్యనిష్ఠ', 'సాంఖ్యయోగము' ననుశబ్దములం దున్న సాంఖ్యశబ్దమునకు నీసామాన్యార్థమే వివక్షితముగ నున్నది. భగవద్గీతలలో నీనిష్ఠయందున్నవారిని సాంఖ్యులని (గీ. ౨. ౩౯; ౩. ౩; ౫. ౪-౫; ౧౩. ౨౪) చెప్పినచోట, సాంఖ్యు లనఁగా, నొక కాపిల సాంఖ్యమార్గ మవలంబించినవారె యర్థము గా దనియు, ఆత్మానాత్మవిచారముచే సర్వకర్మల సన్యసించి బ్రహ్మజ్ఞానమునందు మగ్నులయినవేదాన్తులు ననియుఁ జెప్పిరి. 'సాంఖ్య' మనుశబ్దము 'సం-ఖ్యా' యను ధాతువునుండి యుత్పన్నమగుటచే లెక్కపెట్టువాఁడని మొదట యర్థమగును. కాపిలశాస్త్రమునందలి మూలతత్త్వముల లెక్క యిరువదియైదు గాన వానిని లెక్కించువాఁ డనునర్థమునందు 'సాంఖ్య' మను నొకపేరు మొదట నిష్పన్నమైనది. పిదప సాంఖ్య మనఁగా: సామాన్యముగ సర్వవిధమైన తత్త్వజ్ఞానము, అను వ్యాపకార్థము వెలువడినటుల శబ్దశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. కావున మొట్టమొదటినుండియు కాపిలభిక్షువులను సాంఖ్యులని చెప్పుట వాడుక యగుటచే వేదాన్తు లగుసన్యాసులకుసైత మాశబ్దమే యుపయోగింపఁబడుచున్నటుల తోఁచుచున్నది. ఎటులయినను సరే! సాంఖ్య శబ్దమున కీయర్థభేదమున సందేహము లేకపోవునిమిత్త మీప్రకరణమునందు 'కాపిల సాంఖ్య శాస్త్ర' మని గొప్పపేరు స్వయముగ నిడితిని. కణాదన్యాయశాస్త్రమునందు వలెనె యీకాపిలసాంఖ్యశాస్త్రమునందును, సూత్రము లున్నవి; కాని గౌడపాదాచార్యులుగారైనను, శారీరకభాష్యకర్తలగు శ్రీశంకరాచార్యులుగారైనను, ఈసూత్రములను దమగ్రంథములలోఁ సాధారముగఁ గైకొనక పోవుటచే నీసూత్రములు ప్రాచీనములు కావని యనేకుల యభిప్రాయము. ఈశ్వరకృష్ణునియొక్క 'సాంఖ్యకారిక' లను గ్రంథ మీసూత్రములకంటె ప్రాచీన మని యెన్నుచున్నారు. ఆకారికలపై శంకరాచార్యులవారిపరమగురు వగుగౌడపాదులుగారు భాష్యముఁ జేసిరి. కావున శాంకరభాష్యమునందు సైత మీకారికలే యనువాదము చేయఁబడినవి. మఱియు ఇ. స ౫౭౦ కంటె పూర్వమునందు చైనాభాష

లోనికి తర్జుమా చేయఁబడిన యీగ్రంథ మిప్పుడు లభించును. *"షష్టితంత్ర"మను నఱువది ప్రకరణములు గలగ్రంథ మంతకుఁ బూర్వమే సిద్ధమై యుండెను. దాని యందలితాత్పర్యమే (కొన్ని ప్రకరణములను వదలి) డెబ్బదియార్యావృత్తములతో నీగ్రంథమునఁ జెప్పఁబడినది యని యీశ్వరకృష్ణుచే నీకారికలచివరఁ జెప్పఁబడినది. 'షష్టితంత్ర' మనుగ్రంథ మిప్పుడు లభింపదు కావున నీకారికలయాధారముననే కాపిలసాంఖ్యశాస్త్రముయొక్క మూలసిద్ధాంతముల నే నిచ్చో వివేచనఁ జేయుచున్నాను. మహాభారతమున సాంఖ్యమత మనేకాధ్యాయములందు నిరూపింపఁబడినది; కాని దానియం దన్నిచోట్లను వేదాంతమతము కలిసియుండుటచేఁ గాపిలసాంఖ్య మిది యని నిశ్చయించుటకు మఱియొకగ్రంథ మాలోచింపవలసివచ్చును. ఆవిషయములో సాంఖ్యకారికలకంటె నధికప్రాచీనమగుమఱియొకగ్రంథ మేదియుఁ గాన్పింపదు. "సిద్ధానాం కపిలో మునిః" "సిద్ధులలోఁ గపిలముని నేనే." (గీ. ౧౦. ౨౬) అని భగవంతుఁడు గీతలలోఁ జెప్పియుండుటచేఁ గపిలాచార్యుల యోగ్యత స్పష్ట మగును. అయినను కపిలఋషి యెక్కడ నెప్పుడు పుట్టినదియు తెలియదు. సనత్కుమారుఁడు, సనకుఁడు, సనందనుఁడు, సనత్సుజాతుఁడు,

---

* బౌద్ధగ్రంథములనుండి యీశ్వరకృష్ణులవారివిషయ మిప్పుడు లెస్సగనే తెలిసికొనఁబడినది. బౌద్ధపండితుఁ డగువసుబంధుని గురువు ఈశ్వరకృష్ణునకు సమకాలికుఁడును ప్రతిపక్షిగను నుండెను. వసుబంధునియొక్క జీవచరిత్రము పరమార్థునిచే (ఇ. స. ౪౯౯-౫౬౯లో) చైనాభాషలో వ్రాయఁబడినది. అది ఇప్పుడు ప్రసిద్ధమై ముద్రింపఁబడియున్నది. ఈహేతువుచే నీశ్వరకృష్ణునికాలము సుమారు ఇ. స ౪౫౦ అయి యుండును. అని డాక్టర్ 'టకకసు' అనువానిచే స్థిరపఱుపఁబడినది. Journal of the Royal Asiatic Sociaty of Grate Britain and Ireland, 1905 p. p. 33. 53. కాని డాక్టర్ 'విన్సెంట్ స్మిత్' అనువానియొక్క మతముంబట్టి వసుబంధునికాలమే ఇసవీ సన యొక్క నాల్గవశతాబ్దముగ (సుమారు ౨౮౦-౩౬౦) ఉండవలయును. ఏలన: అతని గ్రంథములు ఇ. స. ౪౦౪ లో చైనాభాషయందు భాషాంతరీకరింపఁబడినవి. వసుబంధునికాల మిట్లుల వెనుకకు లాగఁబడియుండుటచే నీశ్వరకృష్ణునికాలముగూడ నటులే సుమారు రెండు వందల సంవత్సరములు వెనుకకు(అనఁగా:, ఇ. స. ౨౪౦ సుమారుకు)లాగవలసివచ్చినది. Vineent Smith's Early History of India 3rd Edition, P. ౩౨౮.

సనుఁడు, సనాతనుఁడు, కపిలుఁడు నను వీరేడ్గురు బ్రహ్మమానసికపుత్త్రులనియు, వారికి జ్ఞాన మాజన్మసిద్ధమనియు, శాంతిపర్వమున (౩౪౦. ౭౨) నొకచోఁ జెప్పఁబడినది. మఱియొకచోట (శాం. ౨౧౮) కపిలునకు 'ఆసురి' శిష్యుఁడనియు, నాయాసురికి పంచశిఖుఁడు శిష్యుఁడనియు, నాతఁడు జనకునకు సాంఖ్యశాస్త్ర ముపదేశించెననియు నున్నది. మఱియు శాంతిపర్వమునందు (౩౦౧. ౧౦౮-౧౦౯) "సాంఖ్యులచే సృష్టిరచనాసంబంధము మొదలగువానిలోఁ జెప్పఁబడినవిషయమే పురాణములందు, నితిహాసములందు, నర్థశాస్త్రమునం దన్నిటియందుఁ గాన్పించు చున్న"దని భీష్ముఁడు చెప్పినట్లు స్పష్టముగఁ గాన్పించుచున్నది. వేయేల? "జ్ఞానం చ లోకే యదిహాస్తి కించిత్సాంఖ్యాగతం తచ్చ మహన్మహాత్మన్." "ఈజగత్తున జ్ఞాన మంతయు సాంఖ్యులవలననె వెలువడినది" (మ.భా.శాం ౩౦౧. ౧౦౯) అని చెప్పినను జెప్పవచ్చును. పాశ్చాత్యగ్రంథకారు లుత్క్రాంతివాదము నిప్పు డన్ని విషయముల నేల యుపయోగింతురో చక్కఁగ విచారించితి మేని, యుత్క్రాంతి వాదముయొక్క సిద్ధాన్తముతో సమాన మగుసాంఖ్యశాస్త్రమును, మనదేశమునం దున్నవారును బూర్వము ప్రతివిషయమునందును గ్రహించి యుండుట యొక నూతనవిషయముగఁ దోఁపదు. (౧) గురుత్వాకర్షణము, (౨) సృష్టిరచనయందలి యుత్క్రాంతితత్త్వము*, (౩) బ్రహ్మాత్మైక్యము ననుసిగొప్పకల్పన లనేకవత్సరముల క్రిందనే యొకొక్కమహాత్మునకు స్ఫురించినవి. కావున నేగోళమునం దేసామాన్య సిద్ధాన్తములు కాని, వ్యాపకతత్త్వములు కాని, ప్రచారములో నున్నవో, వానినె యనుసరించి తాము ప్రతిపాదించుట యనువాడుక సామాన్యముగ నన్నిదేశము లలో నున్నగ్రంథములయందును లెస్సగఁ గాన్పించును.

కానిమ్ము; కాపిలసాంఖ్యశాస్త్రముయొక్క యభ్యాస మర్వాచీనకాలము నందుఁ దఱుచుగ నశించుటచే దాని నిప్పుడు ప్రస్తావించుట యవసర మైనది. ఇప్పుడు కాపిలసాంఖ్యశాస్త్రమునం దున్నముఖ్యసిద్ధాన్తము లేవియో విచారిం

---

* 'ఉత్క్రాంతితత్త్వ' మనుశబ్దము Evolution Theory అను నర్థమున ప్రస్తుతము రూఢ మయినందున నాశబ్దమునే నే నిచ్చోనుపయోగించితిని. కాని యుత్క్రాంతిశబ్దమునకు సంస్కృతమున 'మరణ'మనియర్థము; కాన, ఉత్క్రాంతి తత్త్వమనుశబ్దముకంటె గుణవికాసము, గుణోత్కర్షము, లేక, గుణపరిణామ మను సాంఖ్యులయొక్క శబ్దమునే యుపయోగించుట మిక్కిలి ప్రశస్తముగ నుండునని నాయభిప్రాయము.

లేము. ఈజగత్తున నూతనపదార్థ మెప్పుడును బుట్టదు. కారణ మేమి యన: “శూన్యమునుండి (అనఁగా: తొలుత నేమియు లేకపోవుట యనుదానినుండి) శూన్యము తప్ప మఱియొకటి యేమియుఁ బుట్టుటకు వీలులేదు. కావున పుట్టినవస్తువునందుఁ (అనఁగా: కార్యమునందు) గానవచ్చుగుణములు దేనివలనఁ బుట్టినవో, దానియందు (అనఁగా : కారణమునందు) సూక్ష్మరూపముగ నైన నుండి తీరవలయు నని తప్పక యెఱుంగవలయు”నని సాంఖ్యశాస్త్రమునందలి మొదటిసిద్ధాన్తము(సాం. కా. ౯). “ఒకపదార్థము నశించుటచే దానివల్ల మఱియొకపదార్థము పుట్టును.”అని బౌద్ధకాణాదులసిద్ధాన్తము. “బీజము నష్టమైనపిదప దానియందుండి యంకురమును,అది నశించినపిదప దానినుండి వృక్షమును బుట్టుచున్న”దని వారుదాహరణము నిత్తురు;కాని సాంఖ్యులును, వేదాన్తులును నీమతము నొప్పుకొనరు. వృక్షముయొక్క బీజమునందున్న ద్రవ్యము నశింపక,యదియే భూమి,లేక,గాలి యందుండి మఱియొక ద్రవ్యము నాకర్షించుకొనుటచే, బీజమునకు నంకుర మను క్రొత్తరూపమును(అనఁగా:అవస్థను) గలుగఁజేయును (వే.సూ.శాం.భా.౨. ౧.౨౪ చూడుఁడు). అటులె కొయ్యలు కాలెనేని, దుమ్ము, పొగ మొదలగునవి దానిరూపాంతరములె యయి యున్నవి. కట్టెలలోని ద్రవ్యము బొత్తిగ నశించుటచే, బొగ యనునూతనపదార్థము పుట్టనేరదు. “కథ మసతః సజ్జాయేత” “ఏది బొత్తిగ లేనే లేదో, దానినుండి, యుండునట్టి పదార్థ మెటులపుట్టును” (ఛాం. ౬.౨. ౨) అని ఛాందోగ్యోపనిషత్తులోఁ జెప్పఁబడినది. జగత్తుయొక్క మూలకారణమునకు “అసత్” అనుశబ్ద ముపనిషత్తులలో నక్కడక్కడ నుపయోగింపఁబడి యున్నది. (ఛాం. ౩.౧౯.౧;తై.౨.౭.౧); కాని, దాని కర్థము‘అభావము=లేమి’అని కానేరదు. నామరూపాత్మక మగువ్యక్తస్వరూపముయొక్క(అనఁగా: అవస్థయొక్క)యభావ మని మాత్రమే దానియర్థమని వేదాన్తసూత్రములందు సిద్ధాంతీకరింపఁబడెను. (వే.సూ.౨. ౧. ౧౬—౧౭.) పాలవలనఁ బెరుఁగు పుట్టును గాని యుదకమునుండి పుట్టనేరదు. నువ్వులనుండి నూనె వచ్చును గాని ఇసుకనుండి రానేరదు. ఇట్టిప్రత్యక్షానుభవములనుండియు నీసిద్ధాన్తము నంగీకరింపవలసివచ్చును. కారణమునందు లేనిగుణములు కార్యమునందు స్వయముగఁ బుట్టునని యంగీకరించినయెడల, నీటివలనఁ బెరుఁగేల పుట్ట దనుప్రశ్నకు సమాధానము చెప్పుట సాధ్యము కానేరదు. సారాంశ మేమి యన: స్వయముగ లేనిపదార్థమునుండి యిప్పు డస్తిత్వములో నుండుపదార్థములు పుట్టనేరవు. కావున నేకార్యమును విచారించినను దానియొక్క ప్రకృతిద్రవ్యాంశమును, గుణమును, మూల

కారణమునం దేరూపమున నయిన నుండి తీరవలయు నని సాంఖ్యులచే సిద్ధాంతీకరింపఁబడెను. ఈసిద్ధాంతమునకే సత్కార్యవాద మని పేరు. పదార్థములందున్న జడద్రవ్యములును, కర్మశక్తియు నెప్పుడును నశింపవు. ఏపదార్థమున కైన నెన్ని రూపాంతరములు వచ్చినను, తుదకు సృష్టియం దున్నముఖ్య వగుద్రవ్యాంశము యొక్కయుఁ, గర్మశక్తియొక్కయు మొత్త మెప్పుడు నొకరీతిగనే యుండవలెనను సిద్ధాంత మర్వాచీను లగుపదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞులచే సైతము సిద్ధాంతీకరింపఁబడెను. దీపము వెలుగునప్పుడు చమురునశించుచున్న దని మనకు గోచరించు చున్నను, తైలపరమాణువులు బొత్తిగ నశింపక, కాటుక, పొగ, మొదలగుసూక్ష్మద్రవ్యములరూపము నొంది యస్తిత్వమును జెందియున్నది. మఱియు నీసూక్ష్మద్రవ్యములఁ గలిపి చూచితి మేని యదియును, చమురుగ నుండుచున్నప్పుడు దానిలోఁ గలిసిన గాలియందలిపదార్థమును,అను నీరెంటియొక్కయు తూనిక సమానముగ నుండును. మఱియు నీపద్ధతియే కర్మశక్తిని సంబంధించు నని యిప్పుడు సిద్ధ మయినది. కాని యాధునికపదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞుల యొక్కయు సాంఖ్యశాస్త్రజ్ఞుల యొక్కయు సిద్ధాంతములు రెండును జూపుల కేకముగఁ గాన్పించినను, సాంఖ్యులసిద్ధాంత మొక పదార్థమునుండి మఱియొకపదార్థము పుట్టు నను నొకవిషయమునకు మాత్రమే (అనఁగాఁ గార్యకారణమాత్రమునకే) యనుకూలించును; కాని యర్వాచీన మగు పదార్థవిజ్ఞానశాస్త్రమునం దున్నసిద్ధాంతములు వీనికంటె నధికవ్యాపకములుగ నున్న వనుసంగతి మఱవఁగూడదు. కార్యమందలిక్రొత్తగుణ మైనను గారణమునందు లేనిగుణములనుండి పుట్టనేరదనునదియే కాక, కారణములకు కార్యస్వరూపము వచ్చినపిదప నా కార్యమం దున్నద్రవ్యాంశమును, కర్మశక్తియును, లేశమైన నశింపక, పదార్థములందు వేర్వేఱుస్థితులయందున్నద్రవ్యాంశమునకును, గర్మశక్తికిని సంబంధించినతూనికయు నెప్పుడు నొక్కవిధముననే యుండును గాని, ఎక్కువ యైనను, తక్కువయైనను గానేరదు.”అని ప్రత్యక్షప్రయోగములవలన గణితపద్ధతితో నిప్పుడు సిద్ధాంతము చేయఁబడెను. ఇదియే యీరెండుసిద్ధాంతములలో నుండుగొప్పభేదము. ఈయూహతోఁ జూచితిమేని భగవద్గీతలయందు “నాసతో విద్యతే భావః”—, “ఎది లేదో యది ఎప్పుడు నస్తిత్వమునకు రానేరదు.” ఈ మొదలగురెండవయధ్యాయారంభమునఁ జెప్పఁబడినసిద్ధాంతములు (గీ. ౨. ౧౬) చూచుటకు ‘సత్కార్యవాదము’వలె నుండినను,కేవలము కార్యకారణాత్మక మగుసత్కార్యవాదముకంటె నర్వాచీనము లగుపదార్థవిజ్ఞానశాస్త్రము నందలిసిద్ధాంతములకును, ఆసిద్ధాంతములకును, అధికసామ్యమున్నటుల గాన్పించుచున్నది. పూర్వాపునం దుదాహరింపఁబడిన

ఛాందోగ్యోపనిషత్తునందలివచనముల కిదియె భావము. 'సత్కార్యవాదము'యొక్క సిద్ధాన్తములను వేదాన్తులుసైత మొప్పుకొందురు; కాని, యీసిద్ధాన్తములు, సగుణ సృష్టికంటె పైకిఁ బోలేవు. నిర్గుణమునుండి సగుణము పుట్టినటు లేలగాన్పించు నను నంశములకు సమాధానము వేఱుగఁ జెప్పవలయుననియు ద్వైతవేదాన్తశాస్త్రము యొక్క యభిప్రాయమని సారాంశము. ఈ వేదాన్తమతము సవిస్తరముగ ముందుండునధ్యాత్మప్రకరణమున విచారింపఁబడును. ఇప్పుడు సాంఖ్యులమత మెంత వఱకు వ్యాపించినదో యదిమాత్రమె విచారింపఁదగినది కావున సత్కార్యవాదము యొక్క సిద్ధాన్తమును లెస్సగ విచారించి క్షరాక్షరవిచారశాస్త్రమునందు సాంఖ్యులు దాని నెటుల నుపయోగము చేసినదియు విచారింతము.

సాంఖ్యమతానుసారముగ నీసత్కార్యవాదము సిద్ధ మగునేని దృశ్యసృష్టి యొక్క యుత్పత్తి, పూర్వమునం దేమియు పదార్థము లేనిదే శూన్యమునందుండియే పుట్టిన దనుమతము తనంతటనే యణఁగిపోవును. కారణము—'శూన్య'మనఁగా 'లేద'ని యర్థము. 'ఏదియు లేనిదానియందుండి యునికి గలవస్తువులు పుట్టవు' అనియు స్పష్టార్థము. అనఁగా: సృష్టి యేదైన నొకపదార్థమునందుండి పుట్టినదై యుండ వలయును. ఇప్పుడు మనకు సృష్టియందుఁ గనఁబడుగుణము లన్నియు నామూల పదార్థమునం దుండవలయు ననునీయంశము స్పష్టముగ సిద్ధ మగుచున్నది. ఇప్పుడు సృష్టివైపునకుఁ జూచితిమేని దానియందువృక్షములు, పశువులు, మనుజులు, రాళ్లు, బంగారము, వెండి, వజ్రము, నీళ్లు, వాయువు మొదలగు ననేకపదార్థములు మన యింద్రియములకు గోచరము లగుచున్నవి. వానిరూపములును, గుణములును వేఱుగనే యున్నవి. ఈభేదము, (అనఁగా: నానాత్వము) స్థిరమగు నదియు, మూలము నందున్నదియు కాకపోవుటచే నాదియందు సర్వవస్తువులయందున్నద్రవ్య మొకటిగనే యున్నదని సాంఖ్యులసిద్ధాన్తము. అర్వాచీను లగురసాయనశాస్త్రజ్ఞులు కొన్ని కొన్నిద్రవ్యములను వేఱుపఱచి చూచి యఱువదిరెండుతత్త్వములు మూలపదార్థములని స్థిరపఱచిరి. కాని, "యీయఱువదిరెండుతత్త్వములును స్థిర మయినవి కాకపోవుటచే, మొదట నేదో యొకపదార్థమున్నది. ఆపదార్థమునందుండియే సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, భూమి మొదలగుప్రపంచమంతయుఁ బుట్టినవి" అని పాశ్చాత్యు లగుపదార్థశాస్త్రవేత్తలు ఇప్పుడు నిశ్చయించిరి. కావున నాసిద్ధాన్త విషయమై విశేషవివేచన చేయ నక్కఱ యుండదు. జగత్తునందలి యన్నిపదార్థములకు మూలభూత మగుద్రవ్యమును సాంఖ్యశాస్త్రమునందు ప్రకృతి యని

నుడువుదురు. 'ప్రకృతిశబ్దార్థము 'మూలము (మొదలు)' అని యగుటచే నీప్రకృతి నుండి ముందుఁబుట్టఁబోవుపదార్థములను 'వికృతు'లని యైనను, 'మూలభూతద్రవ్యములవికారము' లనియైనను జెప్పుదురు;

కాని, యన్నిపదార్థములలోను ద్రవ్య మొక్కటియే యైనను, ఈద్రవ్యము నందలిగుణముగూడ నొక్కటియే యైనను, సత్కార్యవాదానుసారముగ నొక గుణమునుండియే యనేకగుణములు వెలువడుటకు వీలులేను. రాయి, మన్ను, నీరు, బంగారము, మొదలగుజగత్తులోని వేర్వేఱుపదార్థములను జూచితి మేని, వాని యందు వేర్వేఱగు ననేకగుణము లుండునటుల గనఁబడును. కావున పదార్థమాత్రముయొక్క గుణములను దొలుతఁ బరీక్షించి యాగుణములె సత్త్వమని, రజస్సని, తమస్సని మూఁడువర్గములుగ సాంఖ్యులచే విభజింపఁబడినవి. కారణ మేమి యన: ఏపదార్థమును తీసికొన్నను, శుద్ధమును నిర్మలము నగుపూర్ణావస్థయు, తద్విరుద్ధ మగునికృష్టావస్థయు ననురెండుభేదములు సహజముగ నావస్తువున కుండుటచే, నికృష్టావస్థనుండి పూర్ణావస్థలోనికి వృద్ధినొందుచు నుండుటయే దానియొక్క ప్రవృత్తిగ నుండునటుల కానఁబడును. ఈమూఁడవస్థలలోను శుద్ధావస్థకు సాత్త్వికమనియు, నికృష్టావస్థకుఁ దామస మనియు, ప్రవర్తకావస్థకు రాజసమనియు విశేషణముల నిచ్చు సత్త్వము, రజస్సు, తమస్సు ననునీమూఁడుగుణములు నన్నిపదార్థములకును మూలభూత మగుద్రవ్యమునందు (అనఁగ: ప్రకృతియందు) ప్రారంభము నుండియు నున్న వని సాంఖ్యులు చెప్పుచున్నారు. వేయేల ? ఈమూఁడుగుణములె ప్రకృతి యనియు ననవచ్చును. ఈమూఁడు గుణములలోను ఒక్కొకదానిసామర్థ్యము, తొలుత నొకరీతిగ నుండుటచే, మొదట ప్రకృతి సామ్యావస్థయందుండును. ఈసామ్యావస్థ జగత్తుయొక్క ప్రారంభదశయం దుండును. జగత్తు లయ మగునేని తిరుగ నుత్పన్న మగును. సామ్యావస్థయందు చలనము మొదలగునదేమియు నుండదు. సర్వము స్తబ్ధముగ నుండును. అనంతరమునం దీమూఁడు గుణములు హెచ్చుతగ్గులయ్యె నేని ప్రవృత్త్యాత్మక మగురజోగుణముచే మూలప్రకృతియందుండి యానా పదార్థములు పుట్టినపిదప సృష్టి కారంభ మగును. సత్త్వరజస్తమోగుణములను నీ మూఁడును తొలుత సామ్యావస్థలో నుండుటచే వానియందు హెచ్చుతగ్గు లెటుల కలుగు నని యిప్పు డొకశంక వెలువడుచున్నది; కాని, ప్రకృతియొక్క స్వాభావికమూలధర్మమె యిది యని సాంఖ్యులు సమాధానము చెప్పుదురు. (సాం. కా. ౬౧.) ప్రకృతి జడ మైనను స్వయముగ నే యది సర్వవ్యవహారములఁ జేయుచున్నది.

ఈమూఁడుగుణములలోను తెలివి యనునది సత్త్వగుణముయొక్క లక్షణము. అజ్ఞానము (తెలివిలేమి) తమోగుణధర్మము. రజోగుణ మనునది ప్రవర్తకము (అనఁగా: మంచిచెడుగులయందుఁ బ్రవర్తింపఁజేయునది). ఈమూఁడు గుణములు నెప్పుడును వేర్వేఱుగ నుండనేరవు. అన్నిపదార్థములందును సత్త్వరజస్తమోగుణములు కలిసియున్నవి. మఱియు నీకలయిక యెప్పుడును మూఁడుగుణముల న్యూనాధికభావమున ననుసరించియే వెలువడునది యగుటచే, మూలద్రవ్య మొకటియైనను, గుణభేదముచే నొకమూలద్రవ్యమునుండియే, బంగారము, ఇనుము, మన్ను, నీరు, ఆకసము, మానవశరీరము మొదలగు వేర్వేఱువికారములు పుట్టుచున్నవి. దేనిని మనము సాత్త్వికపదార్థమనెదమో దానియందు రజస్తమస్సు లనురెండుగుణముల కంటెను సత్త్వగుణముయొక్క పరాక్రమ మెక్కువగ నుండుటచే, దానియం దెప్పుడు నుండురజస్తమోగుణము లణఁగఁ ద్రొక్కఁబడుటవలన మనదృష్టిమాత్రము ప్రసరింపదు. రూఢిగఁ జూచితిమేని సత్త్వరజస్తమోగుణములు మూఁడును ఇతర పదార్థములందువలె సాత్త్వికపదార్థమునందు నున్నవని యెఱుంగవలయును. కేవల సాత్త్వికములును, కేవలరాజసములును, కేవలతామసములును లేనే లేవు. ప్రతి పదార్థమునందును మూఁడుగుణములయొక్కయు పరస్పరసంబంధము కలదు. ఈ హెచ్చుతగ్గు లగుటలో నేగుణము ప్రబల మగునో, దానినిబట్టి ప్రతిపదార్థమును, సాత్త్విక మనియు, రాజస మనియు, తామస మనియు మనము చెప్పుచున్నాము. (సాం కా. ౧౨; మ. భా. అశ్వ-అనుగీత ౩౬; మఱియు, శాం. ౩౦౫. చూఁడు) ఉదాహరణము:—మనశరీరములో రజస్తమస్సులకంటె సత్త్వమధికమగునేని మన దేహమునందు జ్ఞానము కలిగి సత్య మేదియో తెలియును. చిత్తవృత్తి శాంతమగును. ఇంతియేకాని, ఇట్టిసమయమునందు శరీరమున రజస్తమస్సులు బొత్తిగ లేకపోవు. అవి యణఁగియుండుటచే వాని సామర్థ్యము బయలుపడనేరదు. (గీ. ౧౪. ౧౦) సత్త్వమునకు మాఱుగ రజోగుణము ప్రబల మగునేని మానుషశరీరమందు లోభ ముత్పన్న మగుటచే, 'కావలయు' ననుకోరిక పుట్టి యనేకకృత్యములను జేయుటకు మనుజుఁడు ప్రవర్తించును. అటులె సత్త్వరజస్సులకంటె తమస్సు ప్రబల మగునేని, నిద్ర, ఆలస్యము, స్మృతిభ్రంశము మొదలగుదోషములు శరీరమునం దుత్పన్నము లగును. అనఁగా: జగత్తునందలి పదార్థములలో, బంగారము, లోహము, పాదరసము మొదలగునానాత్వము లన్నియు ప్రకృతియందలి సత్త్వరజస్తమోగుణముల యన్యోన్యసంబంధముయొక్కయైనను, హెచ్చుతగ్గుల యొక్కయైనను ఫలమే యని తాత్పర్యము. మూలప్రకృతి యొక్కటియైనను ఈనానాత్వ మెట్లు

పుట్టు ననువిచారమును 'విజ్ఞాన' మని చెప్పుచున్నారు. దీనియందే సకలాధిభౌతిక శాస్త్రములు చేరును. ఉదాహరణము:—రసాయనశాస్త్రము,విద్యుచ్ఛాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము అను నీ సర్వవిధజ్ఞానములును విజ్ఞానములే యగును.

సామ్యావస్థయందలి యీ మూలప్రకృతి,'అవ్యక్తము' (అనఁగా: ఇంద్రియములకు నగోచర మగునది,) అగుటచే దానియందలి సత్త్వరజస్తమోగుణముల యన్యోన్యసంబంధముచేఁ బుట్టెడు ననేకపదార్థములు మనయింద్రియములకు గోచరము లగుచున్నవి. అనఁగా: మనము చూచునదియు, వినునదియు, నాకునదియు, మూర్కొనునదియు, తాఁకునదియు వ్యక్త మని సాంఖ్యశాస్త్రమునఁ జెప్పఁబడెను. 'వ్యక్తము' అనఁగ: ఇంద్రియములకు స్పష్టముగ గోచర మగుపదార్థము. అదివానియాకృతిచే నైనను, రూపముచే నైనను, లేక,యింక నేగుణముచే నైనను వ్యక్త మగును.వ్యక్తపదార్థము లనేకములగుటచే వానిలో వృక్షము రాయి మొదలగు కొన్ని 'స్థూలములు'గను,మనస్సు, బుద్ధి యాకాశము మొదలగునవి కొన్ని పదార్థము లింద్రియములకు గోచరము (వ్యక్తము)లైనను 'సూక్ష్మములు'గను నున్నవి. సూక్ష్మ మనఁగా: 'చిన్నది' యని యీస్థలమునం దర్థము కానేరదు. కారణమేమన: ఆకాశము సూక్ష్మమైనను, జగత్తునంతయు వ్యాపించియున్నది. కావున సూక్ష్మ మనఁగా: స్థూలముకంటె విరుద్ధమని యైనను, వాయువుకంటె విరళ మని యైన నెఱుంగవలయును.స్థూల సూక్ష్మశబ్దములచే నేపదార్థముయొక్క సంఘటన యెట్టు లున్నదో యెఱుంగ నగును. వ్యక్తావ్యక్తశబ్దములచే నావస్తువుయొక్క ప్రత్యక్ష జ్ఞానము మనకుఁ గలుగుటకు వీలున్నదో లేదో తెలియును. కావుననే వేర్వేఱగు రెండుపదార్థములు సూక్ష్మము లయినను వానిలో నొకటి వ్యక్తము,రెండవది యవ్యక్తము కాఁగలదు. ఉదాహరణము: వాయువు సూక్ష్మ మయ్యినను స్పర్శేంద్రియముచే నది యెఱుంగఁబడుటవలన దానిని వ్యక్త మందురు. సర్వపదార్థములయొక్కయు మూలద్రవ్య మగు ప్రకృతి వాయువుకంటె నత్యంత సూక్ష్మ మగుటచే నేయింద్రియమునకును గోచరము కానేరదు. అందుచేతనే యవ్యక్త మగుచున్నది. ప్రకృతియే యింద్రియమునకు గోచరింపకపోయె నేని 'యిది యున్నటులె ప్రమాణ మేమి?' యని యొకప్రశ్న వెలువడును; కాని యనేకపదార్థముల నవలోకించినపిదప సత్కార్యవాదానుసారముగ నాయన్నిటియొక్క మూలరూప మింద్రియ ప్రత్యక్షములో గోచరింపకపోయినను, సూక్ష్మరూపముచే నుండియే తీరవలయును

వని యనుమానముచే సాంఖ్యులీప్రశ్నకు సమాధానముఁజెప్పిరి (సాం. కా. ౮). మఱియు వేదాన్తులచే బ్రహ్మాస్తిత్వము సిద్ధపఱచుట కీయుక్తియే స్వీకరింపఁబడినది (కఠ.౬.౧౨-౧౩.వీనిమీఁది శంకరభాష్యమును జూడుు). ప్రకృతి యత్యంతసూక్ష్మమనియు,నవ్యక్తమనియు నీరీతిగ నంగీకరించితిమేని నైయాయికులపరమాణువాదము స్వయముగనే భ్రష్టమగును. కారణమేమి యన:పరమాణువు లవ్యక్తములు నసంఖ్యములు నయినను ప్రతిపరమాణువును స్వతంత్రవ్యక్తిగాఁ గాని,యవయవముగఁగాని యుండుటచే రెండుపరమాణువులనడుమ నేమిపదార్థమున్న దనుప్రశ్న మరల శేషించియేయున్నది. కావుననే, "ప్రకృతిలో పరమాణురూప మైనయవయవభేదము లేమిచే నది యెప్పుడునొకదానికను రజస్తమస్సుంచియే, లేక, యొకేటీరు ననే, నడుమ నేమియు ఖండము లేక, య(మెక్కుడవగఁనింద్రియములకు గోచరము కానిది) నిరవయవము నగురూపముతో నెల్లెడఁబడున్నంతటను వ్యాపించి యున్నదని సాంఖ్యులు వక్కాణించెదరు. పరబ్రహ్మానువర్ణించుచు 'దాసబోధ' యనుగ్రంథమున శ్రీసమర్థరామదాసస్వామివారిచే—

"జికడే పహావే తికడే అపార, కోణీకడే నాహీం పార.
ఏకజినసీ స్వతంత్ర, దూసరే నాహీం." (దాస. ౨౦. ౨. ౩)

"ఎటుచూచిన నది (బ్రహ్మము)యపారముగనే యున్నది. ఎక్కడను దానికంతము గానరాదు. అదియొకటేవిధము గలదియు, స్వతంత్రమైనదియునై యున్నది.దానియం దద్వైతము (మఱి యేమియు) లేదు." అని చెప్పఁబడెను. ఈవర్ణన సాంఖ్యులయొక్క ప్రకృతికి నైతము సంబంధించియేయున్నది. త్రిగుణాత్మకమగు నవ్యక్తము, స్వయంభువు నేకవిధ మైనదియు నగుటచే నంతట తెఱపి లేక నిండి యున్నది. ఆకాశము వాయువు నను భేదము పిదపఁ గలిగినది; అవి సూక్ష్మము లయినను, వ్యక్తము లగుటచే వీని కన్నిటికి మూలభూత మగుప్రకృతియే, స్థిర మైనదియు సర్వవ్యాపకము నగునవ్యక్త మయినది. అయినను వేదాన్తుల పరబ్రహ్మకును సాంఖ్యులప్రకృతికిని భూమ్యాకాశముల కున్నంతభేద మున్నది. కారణ మేమి యన:పరబ్రహ్మము,చైతన్యరూపమును నిర్గుణము నయినది.ప్రకృతి జడరూపమును, సత్త్వరజస్తమోమయ మయినదియు (అనఁగా: సగుణముగ)నై యున్నది; కాని యీ విషయములలో విశేషవిచారము పిదపఁ జేయుదము. ప్రస్తుతము సాంఖ్యులయొక్క ఘుతమేమియనునది మనకువిచారణీయము. స్థూలసూక్ష్మములు,వ్యక్తావ్యక్తములు నను

శబ్దములకు నిట్లర్థము చేసినపిమ్మట సృష్టియొక్క ప్రథమారంభమున ప్రతిపదార్థము సూక్ష్మము నవ్యక్తము నగుప్రకృతియొక్క రూపమగుటచే వ్యక్తము (అనఁగా; ఇంద్రియగోచరము) ఆయెను. ప్రళయకాలమున వ్యక్తస్వరూపము నాశన మగు నేని మరల నవ్యక్తప్రకృతితోఁ గలిసి యవ్యక్తమగుచున్న దని చెప్పవలసియున్నది. గీతలయందును నీమతమే యనువదింపఁబడినది. (గీ. ౨. ౨౮. మఱియు, ౮. ౧౮) ఈయవ్యక్తప్రకృతికే 'అక్షర' మనియు, ప్రకృతినుండి పుట్టినసర్వపదార్థములకును 'క్షర'మనియు సాంఖ్యు లిడినరెండవనామములు. క్షరమనఁగ 'పూర్తిగ నశించు నది' యను నర్థమున్రగహింపక 'కేవలము వ్యక్తస్వరూపముయొక్క నాశ' మని మాత్రమే యిచ్చట నర్థము చెప్పవలయును. ప్రధాన మనియు, గుణక్షోభిణి యనియు, బహుధానక మనియు, ప్రసవధర్మిణి యనియు ప్రకృతికి నామాంతర ములున్నవి. సృష్టియందున్నయన్నిపదార్థములకును మూలము గావుననే ప్రధాన మనియు, ప్రకృతియొక్క గుణత్రయసామ్యావస్థను స్వయముగనే మార్చునదిగా వున గుణక్షోభిణియనియు, గుణత్రయరూప మగుపదార్థభేదముయొక్క బీజములు దానియందుండుటచే బహుధానక మనియు, దీనినుండి సకలపదార్థములుపుట్టుచు న్నవి (ప్రసూతములు) కావున ప్రసవధర్మిణి యనియు, నామములు ప్రకృతికిడు చున్నారు. ఈప్రకృతినే వేదాన్తశాస్త్రమునందు 'మాయ' (అనఁగా: మాయిక మగుదృశ్యము) అని చెప్పుచున్నారు.

సృష్టియందలిసకలపదార్థములు 'వ్యక్త' మనియు, 'అవ్యక్త'మనియు, లేక, 'క్షర' మనియు, 'అక్షర'మనియు రెండు వేఱుగ నున్నపిదప క్షేత్రజ్ఞవిచారమునఁ జెప్పఁబడినయాత్మ, మనస్సు, బుద్ధి, యహంకారము, ఇంద్రియములు ననునవి, సాంఖ్యమతానుసారముగ నేవర్గములోఁ జేర్పఁదగినవనునది మొదటిప్రశ్నయై యున్నది. క్షేత్రమును నింద్రియములును జడములే యగుటచే వ్యక్తమునందే యవి చేరును. కాని, మనస్సు, నహంకారము, బుద్ధియు ననువానికిని విశేషముగ నాత్మ కును, వ్యవస్థ యెటులచేయవలయును?. యూరపుఖండమునఁ దిప్పుడు ప్రసిద్ధుఁడును సృష్టిశాస్త్రవేత్తయు నైన 'హెకెల్' అనునాతఁడు మనస్సు, బుద్ధి, యహంకా రము, ఆత్మ యనునివి యన్నియు శరీరధర్మములుగానే యున్నవని తనగ్రంథము లలో నిరూపించుచున్నాఁడు. మనుజునిశిరస్సులోనిమెదడు చెడెనేని, యతని స్మరణశక్తి నశించును. అతనికి పిచ్చియెత్తుటను మనము చూచుచున్నాము. అటులె శిరస్సుపై గాయము తగిలి యందలి మెదడులోనియొక్కభాగము చెడిపోయెనేని

యాభాగమునకు మానసికశక్తి లేనటుల గాన్పించుచున్నది. మనోధర్మ మనునది జడముయొక్క గుణముగనే యున్నది. సారాంశమేమన:—జడమునందుండి దాని నెక్కాలమునందును వేఱుపఱచుటకు సాధ్యము కానేరదు. కావున నేతలయందు మెదడువలెనే, మనోధర్మము, నాత్మయను ననువానిని, వ్యక్త మనువర్గములోనే చేర్ప వలయుననుట యైయున్నది. ఈతీరున వ్యవస్థఁ జేసితి మేని, యవ్యక్తము,జడప్రకృతి యనునవియె తుదకు నేకాకులై (ఒంటిగ)మిగిలి యుండును. కారణ మేమి యన:— సర్వవ్యక్త పదార్థములు నీమూలభూత మగునవ్యక్తమునుండియే పుట్టినవి. ప్రకృతి తప్ప జగత్తునకు నుత్పాదకుఁడు గాని, కర్త గాని మఱియొకఁడు లేఁడు. మూల ప్రకృతియొక్క శక్తి వృద్ధియగుచుండఁగనే, దానికి 'చైతన్యము', లేక,'యాత్మ' అను రూపాన్తరము వచ్చును. ఈమూలప్రకృతికిని, సత్కార్యవాదమునకు వలె, విధానములును, నియమములును సిద్ధము లయినవి; వానివలెనే సర్వజగత్తును,దాని తోఁబాటు మనుజులును కారాగృహబద్ధులవలె నున్నారు. 'ఆత్మ'యని వేఱుపదా ర్థము లేదనునదియే కాక, యది యవినాశి గాదు,స్వతంత్రనుయినది గాదు. ఇంక మోక్ష మెచ్చటినుండి వచ్చును? 'నాయిచ్ఛానుసారముగ నేనే పని చేయుదు'నని యొక్కొకనికిఁ దోఁచున దంతయు భ్రమయే.ప్రకృతి యేమూలకు లాగునో యచ్చట కే మూలకేఁగవలయును. సారాంశ మేమి యన: "కై. శంకర మోరో రానడే" యనువానిచేఁ 'గలహాపురి' యనునాటకారంభమునందు ధ్రువపదములో (పల్లవి) చెప్పినరీతిగ నున్నది.

"విశ్వ సర్వ హే తురుంగ మోఠా ప్రాణిమాత్ర హై కైదీ,
పదార్థధర్మా చియా శృంఖలా త్యాతే కోణి న భేదీ."

"ఈప్రపంచ మంతయు నొకగొప్పకారాగృహము. ప్రాణు లందఱును ఖైదీలు. పదార్థములయొక్క గుణధర్మములు అను ఈసంకెళ్ల నెవరును త్రెంపఁ జాలరు." ఇట్లు సకల మగుచరాచరసృష్టియొక్కయు వ్యవహారము నడచుచున్న దని "హేకెల్" అను వానిమతము. సర్వసృష్టికిని మూల మీతీరున జడమును నవ్య క్తము నగుప్రకృతి యొక్కటియే యగుటచేఁ దనమతమునకు 'నద్వైత' మని * 'హేకెల్' పే రిడుకొనెను; కాని యీయద్వైతము జడమూలకము (అనఁగా:

* అద్వైతమునకు Monism అని 'హేకెల్' మొదట పేరిడెను. అందుపై నీ 'హేకెల్' ఒక స్వతంత్రమగు గ్రంథముసైతము వ్రాసెను.

జడ మగునొక్క—యాకృతియంతె సర్వవిషయములను జేయునది) అగుటచే దీనిని జడాద్వైత మని కాని యాధిభౌతికశాస్త్రాద్వైత మని కాని నే నందును.

కాని, సాంఖ్యశాస్త్రకారు లీజడాద్వైతము నొప్పుకొనరు. మనస్సు, బుద్ధి, అహంకారము, ఇవి పంచభూతాత్మకి మగుజడప్రకృతి ధర్మములుగ నున్న నను విషయమును వా రొప్పుకొందురు. తదనుసారముగ నవ్యక్త మగుప్రకృతియం దుండి క్రమముగ బుద్ధి, అహంకారము మొదలగు గుణములు పుట్టె నని సాంఖ్యశాస్త్రమునం దొలుతం జెప్పంబడినది; కాని జడప్రకృతియందుండి చైతన్యముపుట్టుటకు వీలులేకపోవుటయే కాక, యెవం డైనను తనభుజములమీందం దా నెటుల యాసీనుండు కాలేండో, యటులే, ప్రకృతి నెఱుంగునది, లేక, చూచునది, ప్రకృతికంటె వేఱగుపదార్థమైననే కాని "నేను దీని నెఱుంగుచున్నాను" అను సంభాషణమే ప్రచారములో నుండ నేరదు. సృష్టివ్యవహారముం గంటి మేని "నే నెఱుంగునదియు, లేక, చూచునదియు, నాకంటె వేఱుగ నున్న" దని యందఱకు ననుభవములోనే యున్నది. కావున జ్ఞాత జ్ఞేయము, చూచువాండు చూడంబడువస్తువు, లేక, ప్రకృతిని జూచువాండు జడప్రకృతియు, అను నీరెండుపదార్థములను నారంభమునందుండి వేర్వేఱుగ నున్నవని సిద్ధాన్తీకరించుట యావశ్యక మగునని సాంఖ్యులచే నిశ్చయింపంబడినది. (సాం. కా. ౧౭.) పూర్వప్రకరణమునందు క్షేత్రజ్ఞుం డనియు, నాత్మ యనియుం జెప్పంబడినపదార్థమె ద్రష్టయు, జ్ఞాతయు, ఉపభోక్తయు నగుటచే, ఈతనినే సాంఖ్యశాస్త్రమునందు 'పురుషుండు' అని, లేక, 'జ్ఞః' (జ్ఞాత) అని చెప్పుచున్నారు. ఈజ్ఞాత ప్రకృతికంటె వేఱగుటవలన స్వభావముగనే ప్రకృతిసంబంధము లగుసత్త్వరజస్తమోగుణములకు దూరముగ నుండువాండు, అనంగా: నిర్గుణుండును, వికారమును బొందని వాండును, జూచుట యెఱుంగుట మొదలగునవి తప్ప నితరమగు దాని నేమియును జేయనివాండును, అగుటచే జగత్తునందు జరుగుపటాటోపమంతయు నొకప్రకృతిధర్మమే యయి యున్నదని సిద్ధమగుచున్నది. సారాంశ మేమన: (౧) 'ప్రకృతి' యచేతనము, 'పురుషుండు' సచేతనుండు; (౨) ప్రకృతి పటాటోపమును జేయును, పురుషుండుదాసీనుండు నకర్తయు నగును; (౩) ప్రకృతి త్రిగుణాత్మకము, పురుషుండు నిర్గుణుండు; (౪) ప్రకృతి గ్రుడ్డిది, పురుషుండు సాక్షి; ఇట్లు రెండు వేర్వేఱుతత్త్వము లీసృష్టియం దనాదిసిద్ధములుగను స్వతంత్రములుగను స్వయంభువులుగను నున్నవి యని సాంఖ్యశాస్త్రసిద్ధాన్తము. దాని ననుసరించియే భగవద్గీత

లల్లో—"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి," "ప్రకృతియు, పురుషుఁడు నను వీ రిద్దఱు ననాదులుగ నున్నారు" (గీ. ౧౩. ౧౯) అని తొలుతఁ జెప్పి, వెంటనె—"కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే" "దేహేంద్రియవ్యాపారములను బ్రకృతి యొనర్చుచున్న" దనియు, "పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే" "పురుషుఁడు సుఖదుఃఖముల యుపభోగమునందు కారణమగుచున్నాఁ"డనియుఁ జెప్పఁబడినది; కాని, "ప్రకృతిపురుషు లిద్దఱు ననాదులు." అనుమతము గీతయందుఁ జెప్పఁబడినను, ఈరెండుతత్త్వములు స్వతంత్రములు స్వయంభువులు నని గీత యొప్పుకొన దని యెఱుఁగవలయును. కారణమేమి యన: గీతయందలి ప్రకృతి తన 'మాయ' యని భగవంతుఁడు చెప్పినాఁడు. (గీ. ౭. ౧౪; ౧౪. ౩) మఱియుఁ బురుషునివిషయములో సైతము—"మమైవాంశో జీవలోకే" "వాఁడు నాయంశమై యున్నాఁడు"(గీ.౧౫.౭.)అని చెప్పినాఁడు. అనఁగ: గీత సాంఖ్యశాస్త్రముకంటె నెక్కుడుగనే విచారించినది; కాని యిప్పుడే గీతవైపునకు దృష్టిని బోనీయక సాంఖ్యశాస్త్రము ముందేమి చెప్పు ననువిషయము విచారింతము.

సాంఖ్యశాస్త్రప్రమాణముగ సృష్టియందున్న పదార్థములన్నియు, అవ్యక్తము (మూలప్రకృతి), వ్యక్తము (దానివికారము), పురుషుఁడు (జ్ఞుఁడు) అని మూఁడు వర్గములుగ నున్నవి. కాని వీనిలో వ్యక్తపదార్థముయొక్క స్వరూపము ప్రళయకాలమున నశించును; కావున మూలమునందలియవ్యక్తప్రకృతి, పురుషుఁడు నను నీరెండుతత్త్వములును మిగిలియుండును. ఈరెండుమూలతత్త్వములు 'అనాదులు, స్వయంభువులు' నని సాంఖ్యులయొక్క సిద్ధాంతము. కావున వారిని ద్వైతులు (రెండుమూలతత్త్వముల నంగీకరించువారు) అనుచున్నారు. వీరు ప్రకృతి పురుషులకంటె వ్యతిరిక్త మగునీశ్వరుని గాని, స్వభావమును గాని, కాలమును గాని, మఱియొకమూలతత్త్వమును దేని నొప్పుకొనరు.* కారణ మేమి యన: సగుణుఁ డగునీశ్వరుఁడు, కాలము, లేక, స్వభావము నను నవి యన్నియు,

* ఈశ్వరకృష్ణుఁడు శుద్ధనిరీశ్వరవాది; ఈతనిసాంఖ్యకారికలయందు మూలమగువిషయము డెబ్బది యార్యావృత్తములలో నిమిడ్చి చెప్పఁబడినదని తుద నున్న నుపసంహారాత్మకము లగుమూఁడుశ్లోకములలోఁ జెప్పఁబడినది; కాని, 'కోల్‌బ్రుక్" అనువానిచేతను 'విల్సన్'అనువానిచేతను జేయఁబడినయింగ్లీషుభాషాంతరముతోఁగూడి బొంబయిలో రా. రా. తుకారామతాత్యాచే ముద్రింపఁబడిన

వ్యక్తము లగుటచే నవ్యక్త మగుప్రకృతియందుండి వెలువడువ్యక్తపదార్థములం

పుస్తకములలో మూలవిషయముపై నలుబదితొమ్మిదియార్యలుమాత్రమే యుండెను. అప్పుడు డెబ్బదియవశ్లోక మేది యని 'విల్సను'నకు శంక కలిగెను. కాని యాశ్లోక మాతనికి లభింపనందున నాసందేహ మటులే నిలచియుండెను. ఈలక్షింపనియార్యావృత్తము ప్రస్తుతమందున్నవానిలో నలుబదియొకటవశ్లోకమునకుం దరువాతనే యుండవలయునని నాయభిప్రాయము. అలుబదియొకటవశ్లోకముపై నున్న గౌడపాదాచార్యులుగారిభాష్యము రెంటికిం గలదు. మఱియు (౧౬౧) ఈభాష్యమునందలి ప్రతీకము లగుపదములం దీసి కూర్తుమేని,

"కారణ మీశ్వర మేకే బ్రువతే కాలం పరే స్వభావం వా
ప్రజాః కథం నిర్గుణతో వ్యక్తః కాల స్స్వభావ శ్చ."

అని యగును. ఇది పూర్వోత్తరసందర్భములనుసైతము ననుసరించియే యున్నది. ఈయార్య నిరీశ్వరమతమును బ్రతిపాదించును గాన, వెనుకటివారలలో నెవరో తీసివైచినటుల తోంచుచున్నది; కాని మూలశ్లోకములలో జామాతృశోధను (అనంగా: జదు వేమియురానివాండని తెలియక మామగారు తనయల్లునిం దాటియాకులలో వ్రాసినగ్రంథమునకు హరితాళము (కప్పు) పెట్టుమనంగా, ఆమూర్ఖుండు ఆపుస్తకములోని గ్రంథమువ్రాయనివట్టియాకులకుసైతము హరిదళము పూసెనంట. ఇట్టిదానికి జామాతృశోధ యందురు) చేయు నీబుద్ధిమంతుం డాశ్లోకముయొక్క భాష్యమునుసైతము తీసివైచుటకు మఱచినందున మనము శోధించి యాశ్లోకమును గనిపెట్టంగలిగితిమి. కాని యాజామాతృశోధకుని మన మిపుడుపకారిగ నెన్నవలయును. పూర్వము కొందఱు స్వభావమును, మఱికొందఱు కాలమును జగత్కారణముగం దలంచుచుండ, వేదాంతు లందఱికన్న నెక్కువలోంతుగ విమర్శించి 'ఈశ్వరుండు జగత్కారణ'మని చెప్పిరి. ఇది 'శ్వేతాశ్వతరోపనిషత్తు'లోని యాఱవయధ్యాయమందలి తొలిమంత్రమువలనం దెలియుచున్నది. ఈమంత్రమేమన:—

"స్వభావ మేకే కవయో వదన్తి కాలం తథాఽన్యే పరిముహ్యమానాః,
దేవ స్యైషా మహిమా తు లోకే యే నేదం భ్రామ్యతే బ్రహ్మచక్రమ్."

కాని, యీమూండుమూలకారణములను సాంఖ్యులొప్పుకొనరని తెలియం జేయుటకే పైం జెప్పినయార్యావృత్తమును, ఈశ్వరకృష్ణుండు అలుబదిరెండవదానినిగా వ్రాసెను.

ప్రకృతిధర్మ మగుటచేఁ బ్రకృతియే పురుషుని వదలిపోవుచున్నది. అనఁగా: ప్రకృతియె పురుషునియందుండి తన్ను ముక్తురాలినిగఁ జేసికొనుచున్నదని సాంఖ్యులచే సిద్ధాన్తీకరింపఁబడెను. (సాం. కా. ౬౨; గీ. ౧౩. ౩౪) సారాంశమేమి యన:—మోక్ష మన్న, వెలుపలినుండి పురుషునకు సంప్రాప్త మగువేఱైన యవస్థ కానేరను; పురుషునియొక్క స్వాభావికమగు మొదటి స్థితికంటె వేఱగు స్థితియును గానేరదు. ముంజగడ్డియొక్క చర్మము, లోపల నున్న కాఁడకంటె వేఱయినట్లును, లేక, లోనున్న నాఁచు నీటికంటె వేఱయినట్లును, ప్రకృతిపురుషుల సంబంధమైయున్నది. ప్రకృతియొక్క గుణములచే మోహమును జెందినసామాన్య పురుషుఁడీభేదమును గుర్తింపలేక సంసార మనెడుచక్రములోఁ దిరుగుచున్నాఁడు. కాని, యీభేదము నెఱింగినవాఁడే ముక్తుఁడగును. అతనినే 'జ్ఞాత' '(లేక, బుద్ధుఁడు) యనియు, 'కృతకృత్యుఁ' డనియు వచింతు రని మహాభారతములోఁ జెప్పఁబడియుండుటచే (మ.భా. శాం. ౧౯౪. ౫౭; ౨౪౭.౧౧; ౩౦౬. ౩౦౭), ఈ "ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్" (గీ. ౧౫. ౨౦) అను గీతావచనమునం దున్నబుద్ధిమచ్ఛబ్దమున కిదియె యర్థము. అధ్యాత్మశాస్త్రదృష్టితోఁ జూచినను మోక్షమున కిదియె సత్యస్వరూపమైయున్నది. (వే. సూ. శాం. భా. ౧. ౧. ౪) కాని, "పురుషుఁడు స్వభావముగనే కేవలుఁ"డనుటకు కారణము చెప్పక, "యాత్మయాదియందుండియుఁ బరబ్రహ్మరూపుఁడగుటచే నతఁడు మూలభూత మగురూపమును (అనఁగా: పరబ్రహ్మను) ఎఱింగుటయె"? 'మోక్ష'మనునదియే, సాంఖ్యుల వేదాంతముకంటె నద్వైతవేదాంతమం దున్నవిశిష్టవిషయము. సాంఖ్యవేదాంతములయం దున్నభేదము ముందుప్రకరణములో స్పష్టముగఁ దెలుపఁబడును.

పురుషుఁడు (ఆత్మ)నిర్గుణుఁడు, ఉదాసీనుఁడు, అకర్తయు ననుసాంఖ్యమత మద్వైతులకుఁ బూర్ణముగ నిష్టమైన దైనను, ఒకప్రకృతినే చూచువారును, స్వతంత్రులు నగుపురుషు లాదియందుండియు నసంఖ్యు లున్నా రనెడి యీపురుషుల సంఖ్యావిషయసంబంధమగు కల్పనను వేదాన్తు లొప్పుకొనరు (గీ.౭.౪; ౧౩. ౨౦-౨౨; మ. భా. శాం ౩౫౧; మఱియు, వే. శాం. భా. ౨. ౧. ౧.). ఉపాధిభేదముచే జీవులు వేర్వేఱుగ వెలయుచున్నారు. సత్యముగఁ జూచిన సర్వము బ్రహ్మమే యని వేదాన్తులసిద్ధాన్తము; కాని, యేల ప్రతిమనుజునియొక్క జన్మమరణ సంసారము లనునవి వేర్వేఱుగ నున్నవో, ఎందుచేత, ఒకఁడు సుఖి, మఱియొకఁడు దుఃఖి యనుభేదము స్పష్టముగ గాన్పించుచున్నదో, యీకారణముల

చేతనే ప్రతియాత్మయు, లేక, ప్రతిపురుషుఁడు ననాదిగ నేర్పఱుగుటచే వారిసంఖ్యయు ననంత మగును. (సాం. కా. ౧౮) సకలసృష్టికిని ప్రకృతి, పురుషుఁడు నను రెండును మూలతత్త్వములే; కాని, దానియందున్న పురుషశబ్దముచే నసంఖ్యలగు పురుషులసముదాయము చెప్పఁబడు నని సాంఖ్యులయొక్క యర్థమైయున్నది. ఈయసంఖ్య లగుపురుషులయొక్కయు, త్రిగుణాత్మకప్రకృతియొక్కయు సంయోగముచే సృష్టియందున్న సర్వవ్యవహారములు నడుచుచున్నవి. ప్రతిపురుషునకును ప్రకృతికిని సంయోగ మగునేని ప్రకృతి తనగుణములయొక్క వ్యాప్తి నాపురుషునియెదుటఁ బెట్టును. పురుషుఁడు దాని నుపభోగించును. ఇట్లు జరుగఁగా జరుగఁగా నే పురుషునకుఁ జుట్టునున్న ప్రకృతి సాత్త్వికరూపమగునో, యాపురుషునకే (అందఱకుఁగాదు) నిజ మగుజ్ఞానము కలుగును. ఆజ్ఞానము పూర్ణముగఁ గలిగినపిదప, ప్రకృతియొక్క నాట్య మాఁగుటచే, తన మూలభూత మగుకైవల్యస్వరూపమును బొందుచున్నాఁడు; కాని, యతనికి మోక్షము లభించినను, మిగిలినవానికి సంసారము నడుచుచునే యుండును. పురుషుఁ డీరీతిఁగ కైవల్యస్వరూపమును బొందెనేని, యాక్షణమునందె యాపురుషుఁడు ప్రకృతిపాశమునుండి ముక్తుఁడై యుండవలయు నని యెవరికైనను దోఁపవచ్చును; కాని, సాంఖ్యమతానుసారముగ నట్లు కానేరదు. ప్రకృతివికారము లగుదేహేంద్రియములు మరణపర్యంత మతనిని వదలవు. అట్లగుటకుఁ గారణ మేమి యన: "ఎట్లు, కుమ్మరియొక్క చక్రముపైకుండ సిద్ధ మయి తీసివేయఁబడినను, పూర్వసంస్కారానుసారముగఁ జక్రము కొంత సేపు తిరుగుచుండునో, యట్లే కైవల్యమును జెందినపురుషునియొక్క శరీరము కొన్నిదినములు మిగిలి యుండు" నని సాంఖ్యులు చెప్పెదరు. (సాం. కా. ౬౭) అయినను కైవల్యముఁ జెందినపురుషునకు నాశరీరమువలన నేమి యాటంక మైనను సుఖదుఃఖములయొక్క బాధయైన నుండనేరదు. కారణ మేమి యన: జడప్రకృతియొక్క వికార మగుదేహము సైతము జడ మగుటచే సుఖదుఃఖములు రెండును దానికి సమానములుగనే యుండును. మఱియు సుఖదుఃఖములు పురుషుని వని చెప్పవలసివచ్చెనేని 'ప్రకృతియొక్క వ్యవహారమును, తాను వేఱగుటచే సర్వకర్తృత్వములు ప్రకృతిచే కాని తనవి కావు' అను నీతత్త్వము నాపురుషుఁ డెఱింగినందునఁ బ్రకృతి యెంతనాట్యము చేయుచున్నను తా నుదాసీనుఁడుగనే యుండును. ఏపురుషుఁడు ప్రకృతియొక్క గుణత్రయమునుండి ముక్తుఁడయి జ్ఞానమును బొందఁడో, యతనికి జననమరణప్రవాహము తప్పదు; కాని సత్త్వగుణాధిక్యముచే దేవ

యోనియందును, రజోగుణాధిక్యముచే మానవయోనియందును, తమోగుణప్రాబల్యముచే పశువులయందును పుట్టును. (సాం. కా. ౪౪,౫౪) ప్రతిమనుజునకును చుట్టునున్న ప్రకృతి (అనఁగా: స్వబుద్ధి) యందున్న సత్త్వరజస్తమములయొక్క హెచ్చుతగ్గులచే జననమరణరూపమగుసంసారచక్రఫలము నతఁడు పొందును. "ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః" "సాత్త్వికవృత్తి గలిగినపురుషులు స్వర్గమునకుఁ బోదురు." మఱియు, తామసపురుషుల కధోగతిప్రాప్త మగునని సైతము గీతలలో చెప్పఁబడినది. (గీ. ౧౪. ౧౮) కాని, యీస్వర్గాదిఫలము లనిత్యములు. జననమరణములనుండి ముక్తుఁడు గావలయునని తలఁచెనేని, లేక, సాంఖ్యపరిభాషానుసారముగఁ బ్రకృతికంటె నుండుతనభేదమును, కైవల్యమును, స్థిరముగ నుంచవలయునని తలంచె నేని, త్రిగుణాతీతుఁడై విరక్త (సన్న్యస్తుఁ) డగుట దక్క నతనికి వేఱొండుమార్గమేదియు లేదు. కపిలాచార్యులుగారి కీజ్ఞానమును, వైరాగ్యమును బుట్టుకతోడనే సంప్రాప్తము లైనవి. కాని, యెల్లరకు నిట్టిస్థితి పుట్టుకతోడనే కలుగుట దుర్లభము. కావున తత్త్వవివేకరూపమగుసాధనముచే ప్రకృతిపురుషుల నడుమనుండుభేదము నెఱింగి, తనబుద్ధిని శుద్ధము చేసికొనవలయునని ప్రతిమనుజుఁడును బ్రయత్నింపవలయును. ఈప్రయత్నముచే బుద్ధి సాత్త్విక మగునెడల, వెంటనేజ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము అనుగుణములు పుట్టుటచే తుదకు మనుజునకుఁ గైవల్యప్రాప్తి యగును. ఈస్థలమునం దైశ్వర్యశబ్దమునకు, 'ఇచ్ఛయించిన పదార్థముల నెల్లఁ బొందుటకుఁ దగినయోగసామర్థ్య'మని యర్థము. సాంఖ్యమతానుసారముగఁ గర్మము సాత్త్వికగుణములలోనే చేరును; కాని కేవలధర్మముచే కేవల స్వర్గమే ప్రాప్తమగును. జ్ఞానవైరాగ్య (సన్న్యాస) ములచే, మోక్షమును, లేక, కైవల్యమును బొందిన పురుషులయొక్క దుఃఖములు ఆత్యంతికముగ నివర్తించు నని దానియందున్నకడపటిభేదము కపిలాచార్యులచే నిరూపింపఁబడినది.

దేహేంద్రియబుద్ధులలో మొదట్ల సత్త్వగుణ మధిక మగుటచే నంతకంతకు శ్రేష్ఠుఁ డగుచుఁ దుదకు 'త్రిగుణాత్మకప్రకృతి వేఱు, తాను వే'ఱనుజ్ఞానమునొందిన పురుషుఁడు 'త్రిగుణాతీతుఁడు', అనఁగా: సత్త్వరమస్తమస్సు లనుమూడుగుణములకు దూరముగనుండువాఁ డని సాంఖ్యులు చెప్పుచున్నారు. ఈత్రిగుణాతీతావస్థలో సత్త్వరజస్తమోగుణములలో నేగుణమును శేషించియుండదు. కావున సూక్ష్మదృష్టితో విచారించిన, సాత్త్వికము, రాజసము, తామసము నను మూఁడుస్థితులకంటె నీస్థితి వేఱుగనే యున్నదని ధ్రువపఱుపకొనవలసివచ్చును. ఈయభిప్రాయము

మనస్సున నుంచుకొనియే భక్తిని, సాత్త్వికము, రాజసము, తామసము నని విభజించి యీగుణత్రయాతీతుఁ డగుపురుషుఁడు నిర్హేతుకముగ నభేదభావముతోఁ జేయు భక్తికి నిర్గుణభక్తి యని నాలవపేరు పెట్టఁబడినది (భాగ. ౩. ౨౯; ౧౧. ౨౫). కాని, సాత్త్వికము, రాజసము, తామసము అను నివర్గీకరణము కన్న నధికముగు స్థానము లోఁ బ్రయత్నించుట యుక్తము కానేరదు. కావున నె సత్త్వగుణము యొక్క యత్యంతోత్కర్షచేతనే, తుదకు త్రిగుణాతీతావస్థ ప్రాప్తమగు నని యంగీకరించి సాత్త్వికవర్గమునందే దీనిని సాంఖ్యశాస్త్రజ్ఞులు చేర్చుచున్నారు. గీతయందును నా పద్ధతియే స్వీకరింపఁబడినది. ఉదాహరణము:— 'ఉన్న దంతయు నొకటే' యను నభేదాత్మకజ్ఞానమే సాత్త్విక మనునని గీతలలోఁ జెప్పఁబడినది. (గీ. ౧౮. ౨౦); గీతలలో సత్త్వగుణమును వర్ణించుచుఁ ద్రిగుణాతీతావస్థ పదునాలుగవయధ్యాయము లోఁ దుదకు వర్ణింపఁబడినది; కాని, ప్రకృతిపురుషు లను నిద్వైతము భగవద్గీతల యం దొప్పుకొనఁబడకపోవుటచే నాగీతలలో 'ప్రకృతి, పురుషు, త్రిగుణాతీత' మొదలగుసాంఖ్యులపారిభాషికశబ్దము లన్నిచోట్లను గొంచెము భిన్నమగునర్థమున నుపయోగింపఁబడినవి. అనఁగా: సాంఖ్యులయొక్క ద్వైతముపై నద్వైతపరబ్రహ్మ మయొక్క యాచ్ఛాదన గీతలలో స్థిరముగనే సిద్ధాన్తీకరింపఁబడిన దని యెఱుఁగ వలయును. ఉదాహరణము:— సాంఖ్యులయొక్క ప్రకృతిపురుషభేదమే పదమూఁడవయధ్యాయమున గీతలలోఁ జెప్పఁబడినది (గీ. ౧౩. ౧౯. ౩౪); కాని, యక్కడ నందు ప్రకృతిపురుషశబ్దములు క్షేత్రక్షేత్రజ్ఞశబ్దములకు సమానార్థకములుగనే యున్నవి. అటులె పదునాలవయధ్యాయమునందున్న త్రిగుణాతీతావస్థయు, త్రిగుణాత్మక యగుమాయయొక్క వ్యాప్తినుండి వదలఁబడి, ప్రకృతి పురుషులకంటె నతీతుఁ డగుపరమాత్మ నెఱుంగు సిద్ధపురుషుని దని చెప్పఁబడినది. ప్రకృతియు, పురుషుఁడు నను నీరెండును వేఱగు తత్త్వము లని యంగీకరించుటచే 'పురుషునకుఁ గైవల్యము', అనఁగనే, త్రిగుణాతీతావస్థ యని యంగీకరించువారు సాంఖ్యులు గారు. అధ్యాత్మప్రకరణమున నీభేదమును స్పష్టముగఁ జూపించెదను; గాని, గీతల లో నధ్యాత్మపక్షమే ప్రతిపాద్య మైనను, అధ్యాత్మతత్త్వముఁ జెప్పుచు సాంఖ్య పరిభాషను గాని, సాంఖ్యవాదమును గాని ప్రతిదిక్కున నుపయోగించి యుండు టచే గీతలు చదువుచున్నపుడు శుద్ధసాంఖ్యులమతమే గీతలలో గ్రహింపఁదగి యున్న దని భ్రమాత్మకజ్ఞానము పుట్టుట కవకాశ ముండును. కావున సాంఖ్యశాస్త్రముల నుండు సిద్ధాన్తమునకును గీతయందున్న సాంఖ్యసిద్ధాన్తమునకు నున్నభేద మిచ్చో

కొంచెము చెప్పఁబడినది. ప్రకృతి పురుషులకు దూరమున పరబ్రహ్మరూపమగు నొకమూలభూతజగత్తత్త్వముండుటచే దాని నుండి ప్రకృతిపురుషు లెల్లరు సృజింపఁబడి రను నీ యుపనిషత్తులయం దున్నయద్వైతసిద్ధాన్తమున కనుకూలమయినవి దక్క నితరసాంఖ్యసిద్ధాన్తములు లగ్రాహ్యము లని వేదాన్తసూత్రభాష్యమునందు శ్రీశంకరాచార్యులు వచించినారు. (వే. సూ. శాం. భా. ౨. ౧. ౩) గీతలయందలి యుపపాదనయు నిటులేయున్నది.

ఇది కాపిలసాంఖ్యశాస్త్రము, లేక, క్షరాక్షరవిచారము

అను సప్తమప్రకరణము.



# అష్టమ ప్రకరణము.

## విశ్వముయొక్క సృష్టి సంహారములు.

"గుణా గుణేషు జాయన్తే తత్రైవ నివిశన్తి చ".*

మహాభారత, శాంతి. ౩౦౫. ౨౩.

కాపిలసాంఖ్యము ననుసరించి జగత్తుయొక్క స్వతంత్రమైనమూలతత్త్వము లగుప్రకృతిపురుషులయొక్క స్వరూపమును, ఈరెంటికిని సంయోగ మను నిమిత్త కారణము పుట్టినపిదప పురుషునియెదుట ప్రకృతిచే ప్రదర్శింపఁబడిన స్వీయగుణముల యాపణ (దుకాణ)మునందుండి యతఁడెట్లు ముక్తుఁడు గావలయు ననునంశమును, వివేచింపఁబడినవి; కాని యీప్రకృతియొక్క యాపణము, లేక, నాట్యము 'సంసార రూప మగుకొట్టు' అని యొకమహారాష్ట్రకవి స్పష్టముగఁ జెప్పినాఁడు. దానినే జ్ఞానేశ్వరమహారాజుగారు 'ప్రకృతియొక్క టంకసాల' యని చెప్పుచున్నారు. ఆప్రకృతియొక్క సంసారము, అనఁగా: ప్రకృతి యేక్రమముగ పురుషుని యెదుట వ్యాపించునో దానియొక్క లయ మెటు లగునో యావిషయ, మింకను బాగుగ వివరింపఁబడలేదు. కావున నీప్రకరణమునందు దానిని విచారించుచున్నాఁడను. ప్రకృతియొక్క యీవ్యాపారమునే "విశ్వముయొక్క సృష్టియు సంహారము" నని చెప్పుచున్నారు. కారణ మేమన: ఈజగత్తంతయు, లేక, సృష్టి యంతయు, సాంఖ్యమతానుసారముగ నసంఖ్యు లగుపురుషులయొక్క లాభముకొఱకే ప్రకృతిచే నిర్మింపఁబడినది. ప్రకృతిచే సర్వబ్రహ్మాండము నెటుల సృజింపఁబడిన దనువిషయము 'దాసబోధ' లో రెండుమూఁడుస్థలములందు సరసముగ 'సమర్థుని' చేఁ జెప్పఁబడినది: కాని యందుండియే విశ్వముయొక్క 'ఉభారణీ (సృష్టి)' 'సంహారిణీ (లయము)' అనుశబ్దముల నేను గ్రైకొంటిని. అటులె భగవద్గీతలయొక్క, యేడవ యెనిమిదవ యధ్యాయములలో నీవిషయమే ముఖ్యముగ నిరూపింపఁబడుటచే, పదునొకొండవ యధ్యాయము యొక్క యారంభమున—"భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ

---

* గుణములయందే గుణములు వుట్టుచున్నవి. వానియందే లయమును నైతము పొందుచున్నవి.

విస్తరశో మయా" "భూతములయొక్క సృష్టిప్రలయములు నీచేత విస్తారముగఁ జెప్పఁబడినవి. నాచేత వినఁబడినవి. ఇప్పుడు నాకు నీవిశ్వరూపమును జూపి కృతార్థునిఁ జేయుము." (గీ. ౧౧. ౨) అని యర్జునుఁడు భగవంతుఁ డగు శ్రీకృష్ణుని ప్రార్థించుటవలన, విశ్వముయొక్క సృష్టిసంహారములు క్షరాక్షరవిచారముల యొక్క ముఖ్యభాగములే యని స్పష్టమగుచున్నది. సృష్టియందలియనేకము లగు (నానా) వ్యక్తపదార్థములలో నొక్కటియే యవ్యక్త మగుమూలద్రవ్య మున్న దని యెఱుంగుట జ్ఞానము; (గీ. ౧౮. ౨౦). ఒకమూలభూత మగు నవ్యక్తద్రవ్యము నుండియే వేర్వేఱగు ననేకవ్యక్తపదార్థములు ప్రత్యేకముగ నెట్లు నిర్మింపఁబడిన (గీ. ౧౩. ౩౦) వని యెఱుంగుట విజ్ఞానము; దానియందు క్షరాక్షరవిచారము చేరి యుండుటయే గాక, క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానము నధ్యాత్మము నను విషయములును దాని యందే చేరుచున్నవి.

భగవద్గీతానుసారముగఁ బ్రకృతి తనసంసారమును నడపించుటకు సమర్థ మయినది కాకపోవుటచే నీకార్యము పరమేశ్వరేచ్ఛచేతనే నడచుచున్నదని చెప్పఁబడినది (గీ. ౯. ౧౦); కాని, ప్రకృతి స్వతంత్ర యని కపిలాచార్యులు చెప్పినటుల యిదివఱకే చెప్పితిని. సాంఖ్యశాస్త్రానుసారముగఁ బురుషునియొక్క సంయోగ మనునిమిత్తకారణమే ప్రకృతియొక్క సంసారారంభమునకుఁ జాలును. ఈవిషయములోఁ బ్రకృతి మఱియొకదాని నపేక్షింపదు. ప్రకృతిపురుషులకు సంయోగ మగు నేని దానియొక్క టంకసాల ప్రారంభమగును. వసంతర్తువునం దేరీతిన వృక్షములకు చిగుళ్లు పుట్టి క్రమక్రమముగ పత్ర పుష్ప ఫలములుపుట్టునో (మః భా. శా. ౨౩౧. ౭౩; మను. ౧. ౩౦), అటులె ప్రకృతియొక్క యాదిసామ్యావస్థ భంగ మగుటచే దానిగుణములు విస్తరిల్లు నని సాంఖ్యులు వచించుచున్నారు. వేదసంహితయందు, నుపనిషత్తులయందు, స్మృతులయందు నాప్రకృతిని మూల మని యనక, దీనికి వ్యతిరేకముగ పరబ్రహ్మము మూల మని వచించి, దానియందుండి "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్". "ముందు హిరణ్యగర్భుఁడు పుట్టెను." (ఋ. ౧౦. ౧౨౧. ౧) ఈ హిరణ్యగర్భునియందుండి సర్వసృష్టియును బుట్టినది (ఋ. ౧౦. ౮౨; ౧౦. ౧౯౦). లేక, మొదట ఉదక ముత్పన్న మయినది (ఋ. ౧౦. ౮౨. ౬; తై. బ్రా. ౧. ౧. ౩. ౭; ఐ. ఉ. ౧. ౧. ౨). దానియందుండి సృష్టి, లేక, యీయుదకమునం దొకయండముపుట్టి దానియందుండి బ్రహ్మదేవుఁడు, బ్రహ్మదేవునియందుండి, లేక, మూల సువర్ణాండమునుండి

యే జగత్తంతయు గలిగెను (మను. ౧. ౮-౧౩; ఛాం. ౩. ౧౯); లేక, యీ బ్రహ్మదేవుఁడే (పురుషుఁడు) సగము భాగము స్త్రీ యాయెను (బృ. ౧. ౪. ౩; మను ౧. ౩౨); లేక, జలోత్పత్తికి మునుపే పురుషుఁ డుండెను (క. ఉ. ౪. ౬). పరబ్రహ్మమునుండి మొదట తేజస్సు, జలము, పృథ్వి (అన్నము) యను నీమూఁడు తత్త్వములే పుట్టి వానియొక్క కలయికచేతనే పిదప నీకలపదార్థములు నిర్మింపఁ బడినవి. (ఛాం. ౬. ౨. ౬) అని జగదుత్పత్తి యనేకవిధములుగఁ జెప్పఁబడినది. అయిన నాత్మరూప మగుమూలబ్రహ్మమునుండియే యాకాశాదిపంచమహాభూతములు క్రమముగ వెలువడినవని (తై. ఉ. ౨. ౧) తుదకు వేదాన్తసూత్రములలో సిద్ధాన్తీకరింపఁబడినది. (వే. సూ. ౨.౩.౧-౧౪) ప్రకృతి, మహత్తు మొదలగుతత్త్వములును, కఠ. (౩. ౧౧) మైత్రాయణీ (౬.౦. ౧౦;) శ్వేతాశ్వతరములు (౪.౧౦; ౬. ౧౬;) మొదలగు నుపనిషత్తులలో స్పష్టముగనే చెప్పఁబడినవి. వేదాన్తులు ప్రకృతిని స్వతంత్రయని యొప్పుకొనకపోయినను శుద్ధబ్రహ్మమునందే మాయాత్మక ప్రకృతి యనునీవికార మొకసారి కనఁబడినపిదప, తర్వాత నున్నజగత్తుయొక్క యుత్పత్తిక్రమవిషయమై వారికిని సాంఖ్యులకును దుద కేకవాక్యత యయిన దని దీనివలనఁ గాన్పించుచున్నది. ఈకారణముచేతనే యితిహాసములందును, పురాణములందును, నర్థశాస్త్రము మొదలగువానిలో నున్నజ్ఞాన మంతయు సాంఖ్యమునందుండియే వచ్చిన దని మహాభారతమునందుఁ జెప్పఁబడినది (శాం.౩౦౧.౧౦౮-౧౦౯). ఇటు లనుటచే నీజ్ఞానము వేదాన్తులకుఁ గాని, పౌరాణికులకుఁ గాని కపిలునివలననే కలిగిన దని యర్థము కానేరదు. సృష్టియొక్క యుత్పత్తిజ్ఞాన మంతట నొకతీరుననే యున్న దని మాత్రమే దీనియభిప్రాయము. వేయేల ? సాంఖ్యశబ్దము జ్ఞానమనువ్యాపకార్థమునందె యిక్కడఁ బ్రయోగింపఁబడిన దనియుఁ జెప్పవచ్చును. అయినను శాస్త్రీయదృష్టితో సృష్ట్యుత్పత్తిక్రమముయొక్క సంబంధము విశేషపద్ధతిమీఁదఁ గపిలాచార్యులచేఁ జెప్పఁబడినందున, భగవద్గీతలందును నీసాంఖ్యక్రమమే ముఖ్యముగ స్వీకరింపఁబడియున్నది. కావున దాననే యీప్రకరణమునందు వివేచన చేయుచున్నాఁడను.

ఇంద్రియముల కగోచరమును (అనఁగా: అవ్యక్తము), సూక్ష్మమును, ఏకవిధమును నై నలుగడల నఖండముగ వ్యాపించి యున్న నిరవయవ మగునొకమూలద్రవ్యముచే సర్వ మగువ్యక్తసృష్టియు నుత్పన్న మయిన దను నీసాంఖ్యసిద్ధాన్తము పాశ్చాత్యులదేశమందున్నయర్వాచీనాధిభౌతికశాస్త్రజ్ఞుల కిష్ట మైనదియె. ఇంతియకాక,

యీమూలద్రవ్యమం దున్నశక్తి క్రమక్రమముగ వృద్ధి యగుచున్నదనియు, ఈ పూర్వాపరక్రమము, లేక, సరణిని వదలి, నడుమనే చిన్న మొక్కవలె నిర్మాణము కాలే దనియు, వారిచే నిప్పుడు నిశ్చయింపఁబడినది. ఈమతమునే 'ఉత్క్రాంతి వాద' మని నుడివెదరు. పాశ్చాత్త్యులశాస్త్రమునందు గతశతాబ్దములో మున్ముందు శోధించి యీసిద్ధాంతమును దెలిసికొన్నప్పు డక్కడ మహాకలహము వాటిల్లెను. దేవునిచే పంచమహాభూతములును, జంగమకోటియందున్న ప్రత్యేకప్రాణిజాతియు వేర్వేఱుసమయములందు వేర్వేఱుగను, స్వతంత్రములుగను నిర్మింపఁబడిన వను మతమునే, ఈ యుత్క్రాంతివాదము వెలువడుటకు పూర్వము క్రైస్తవు లెల్లరు సత్యముగ నమ్మి రని క్రైస్తవమతపుస్తకములలో నున్నది. కావుననే యుత్క్రాంతి వాదముచే నీసిద్ధాంతము తప్పని నాలుగుమూలల వ్యాపించినప్పుడు నలుదెసలనుండియు నుత్క్రాంతివాదులకోలాహల మెక్కువై నేఁటికిని కొద్దిగనో గొప్పగనో జరుగుచు నేయున్నది.అయినను శాస్త్రీయ మగుసత్యముయొక్క బల మధిక మగుటచే సృష్టియొక్క యుత్పత్తివిషయములో నిప్పుడు సకలవిద్వాంసులకు నధికాధికముగ నది యిష్టముగనున్నది. ఈమతానుసారముగ "సూర్యమాలయందు మొదట నొకవిధ మగుసూక్ష్మద్రవ్య ముండెను. దానినడక యొక్కయో, లేక,యుష్ణముయొక్కయో, పరిమాణము కొంచెమగుటచే నాద్రవ్యము విశేషముగఁ దఱిగినందున భూమియు, సర్వగ్రహములును క్రమక్రమముగ నిర్మితము లైనవి; సూర్యుఁడనునది తుదకు శేషించినయంశముగ నున్నది.పృథ్వి యనునది తొలుత సూర్యునివలె వేఁడి యగునొక ముద్దగానుండెను.దానియందున్నయుష్ణత క్రమముగాఁ దఱుగఁగా మూలద్రవ్యములోఁ గొంత పలచనగను, కొంత గట్టిగను నయినది. దానియందు, పృథ్విపై నున్న వాయువును,జలమును, వానిక్రింద భూమి యనునొకముద్దయు వెలువడినది. పిదప నీమూఁటియొక్క సంయోగముచేత సజీవ నిర్జీవసృష్టి యంతయు వెలువడినది" అని పాశ్చాత్త్యులు చెప్పుచున్నారు. 'డార్విన్' మొదలగుపండితులు మనుష్యులుసైత మిటులే చిన్నచిన్నకీటకములయందుండి క్రమముగ వృద్ధిఁ బొందుచున్నారని నిరూపించిరి. అయిన నాత్మ యనుభిన్న మగు నొకమూలతత్త్వము నంగీకరింపవలయునా? లేదా? యనువిషయమందు యీ యాధిభౌతికవాదులకును నాధ్యాత్మికవాదులకును నిప్పటికిని విశేష మగుమతభేద మున్నది. 'హెకెల్'వంటి కొందఱుపండితులు జడమునుండియే వృద్ధి నొందుచు నాత్మచైతన్యము లుత్పన్నము లైన వని యంగీకరించి జడాద్వైతమును నిరూపించుచున్నారు. దీనికి విపరీతముగ "మనకుఁ గలుగుసృష్టిజ్ఞాన

మంతయు మనయాత్మసంబంధ మగునేకీకరణవ్యాపారముయొక్క ఫల మగుటచే నాత్మయొక్క స్వతంత్రతత్త్వమని యంగీకరించుటయావశ్యకము.'' అని కొంటు వంటియధ్యాత్మజ్ఞానులు నుడువుచున్నారు. కారణ మేమి యన:—బాహ్యసృష్టి నెఱుంగునాత్మ తనకే గోచర మగుసృష్టియొక్క యొకభాగమై యున్నదని, లేక, యీసృష్టినుండియే యిది యుత్పన్నమైనదని చెప్పుట తనభుజముపైఁ దానెక్కినుండయ్యె నని చెప్పునట్లుండును. కావున హేతువాదముచే నిపలు కొప్పఁదగినది కాకపోవును. ఈకారణముచేతనే సాంఖ్యశాస్త్రమునఁ బ్రకృతిపురుషు లను నీ రెండుతత్త్వములును స్వతంత్రములుగ నంగీకరింపఁబడినవి. కావున నాధిభౌతిక సృష్టిజ్ఞాన మెంత వృద్ధి నొందినను సృష్టియందున్నమూలతత్త్వముయొక్క స్వరూప వివేచన తప్పక వేర్వేఱుపద్ధతులచేఁ గావింపఁబడవలయునని నేఁటికిని గొప్పపాశ్చాత్యపండితులు చెప్పుచున్నారని సారాంశము. కాని యొకజడప్రకృతియందుండి సర్వవ్యక్తపదార్థములు నేక్రమముగ వెలువడినవని మాత్రము విచారించితిమేని, పాశ్చాత్యులయుత్క్రాంతిమతమునకును, సాంఖ్యశాస్త్రమునందు వర్ణితమైన ప్రకృతియొక్క వ్యాప్తిని గుఱించినతత్త్వమునకును, విశేషభేద మేమియు లేదని చదువరులకుఁదోఁచును. కారణ మేమన: అవ్యక్తమును, సూక్ష్మమును, ఏకరూపము నగు మూలప్రకృతియందుండియే క్రమక్రమముగ (సూక్ష్మము, స్థూలమునయిన) బహువిధ మగువ్యక్తసృష్టి నిర్మాణ మైనది.'' అను నిముఖ్యసిద్ధాన్త మీరువురకు నేక రీతిగనే సమ్మతముగ నున్నది. కాని యాధిభౌతికజ్ఞాన మిప్పుడు విశేషముగ వృద్ధి నొందుటచే 'సత్త్వరజస్తమస్సు'లను నీసాంఖ్యులయొక్క మూఁడుగుణములకు మాఱుగ నర్వాచీను లగుసృష్టిశాస్త్రజ్ఞులచే,గతి,ఉష్ణత, లేక,యాకర్షణశక్తి యనుగుణములే ప్రధానముగ నంగీకరింపఁబడినవి. సత్త్వరజస్తమస్సు లనెడుత్రిగుణములయొక్క హెచ్చుతగ్గు లనుటకంటె,గతి,యుష్ణత, లేక,యాకర్షణశక్తి యనువాని హెచ్చుతగ్గులనుటచే నాధిభౌతికశాస్త్రజ్ఞులకు శీఘ్రముగఁ దెలియుననుమాట సత్యమే. అయినను—"గుణా గుణేషు వర్తంతే'' (గీ. 3. ౨౮). అని చెప్పఁబడిన గుణముల సంబంధ మగువ్యాప్తియొక్క, లేక, గుణోత్కర్షయొక్క, తత్త్వము రెండుపక్షములందును సమానముగనే యున్నది. గడియారపుఁజక్రమును గదలించితిమేని యది యేరీతిగ మెల్లమెల్లగ విప్పుకొని బాహుళ్యమునొందునో, యటులె సత్త్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థయందుఁ బడినప్రకృతి యనుగడియారము మెల్లమెల్లగ సడలుచు నడచె నేని సర్వవ్యక్తసృష్టి నిర్మాణ మగు నని సాంఖ్యమునందుఁ

చెప్పఁబడినది. దీనికిని, ఉత్క్రాంతివాదమునకును వాస్తవముగ నేభేదమును లేదు. అయిన నీగుణోత్కర్షతత్త్వము క్రైస్తవధర్మములవలె తిరస్కరింపఁబడక, గీతల యందు నుపనిషదాదివైదికగ్రంథములందు నక్కడక్కడ నద్వైతవేదాంతము వలెనె యవిరోధముగ స్వీకరింపఁబడె ననునీభేదము తాత్త్వికధర్మదృష్టిచే నెఱుంగఁ దగి యున్నది.

అది యట్లుండ నిమ్ము; ప్రకృతియనునంకురము వృద్ధి నొందుక్రమసంబంధవిషయమునయి సాంఖ్యశాస్త్రకారులుచెప్పిన దిప్పుడు విచారింతము. ఈక్రమము నే గుణోత్కర్షవాదము, లేక, గుణపరిణామవాద మని నుడువుచున్నారు. ఏకార్యము నైన నారంభింపకపూర్వమే 'నే నీకార్యమును జేయుదును' అని మనుజుఁడు నిశ్చయించి యుండును. లేక, వాని కది యొనర్చుటకు బుద్ధి పొడమ నని యెవ్వరికిని చెప్పనక్కఱ లేదు. వేయేల? ఉపనిషత్తులయందుసైతము మూలభూత మగు నొకపరమాత్మకు "మనము పెక్కుమందిగ నగుదుము" "బహుస్యాం ప్రజాయేయ"—అని సంకల్పముదయించినపిదప సృష్టియైన దని చెప్పఁబడినది (ఛాం. ౬. ౨. ౩; తై. ౨. ౬). ఇటులె యవ్యక్తప్రకృతి యైనను స్వీయ మగుసామ్యావస్థను వదలి వ్యక్తసృష్టిని నిర్మించుటకొఱకు నాదిలో నిశ్చయించు చున్నది. నిశ్చయ మనఁగా: వ్యవసాయము. దానిం జేయుట బుద్ధికి లక్షణ మయియున్నది. కావున నే ప్రకృతియందు వ్యవసాయాత్మికబుద్ధి యాదియందుత్పన్న మగు నని సాంఖ్యులచే సిద్ధాన్తీకరింపఁబడెను. సారాంశ మేమియన: దేని నైనను జేయుటకు మనుజునకుఁ దొలుత బుద్ధి పుట్టునటులె, ప్రకృతికిని తాను వ్యాపారము చేయుటకు మొదట బుద్ధి పుట్టవలయును. మనుజప్రాణి సచేతన మగుటచే (అనఁగా: ఆప్రాణియం దున్న ప్రకృతిసంబంధ మగుబుద్ధితో సచేతనపురుషునకు (ఆత్మకు) సంయోగ మగుటచే) మనుజునకుఁ గలిగినవ్యవసాయాత్మికబుద్ధి మనుజునకుఁ దెలియును గావునను, తా నే జడ మగుటచేఁ దనబుద్ధి నే తా నెఱుఁగదు గావున నీరెంటియందు విశేషభేదము గలదు. ఈభేదము పురుషసంయోగముచేఁ బ్రకృతియం దుత్పన్న మగుచైతన్యమూలమునఁ గలుగుచున్నది; అది శుద్ధజడప్రకృతియొక్క గుణము కానేరదు. మానవేచ్ఛతో సమముగ నుండునట్టి 'అస్వయంవేద్యశక్తి' జడపదార్థమున నున్న దని యంగీకరించినఁ గాని గురుత్వాకర్షణము లేక రసాయనక్రియయు, లోహచుంబకముయొక్క యాకర్షణప్రసారణములును మొదలగు కేవలజడసృష్టియందె స్పష్టముగఁ గాన్పించుచున్న గుణ

ములకు మూలకారణమును జక్కఁగఁ జెప్పుటకు వీలు లేదని* యర్వాచీనాధిభౌతిక సృష్టిశాస్త్రజ్ఞులుసైత! మిప్పుడు చెప్పుచున్నా రనువిషయము తెలిసె నేని ప్రకృతి యందు మొదట బుద్ధి యనుగుణ ముత్పన్న మగు ననుసాంఖ్యసిద్ధాంత మాశ్చర్య ముగఁ దోఁపదు. ప్రకృతియందుఁ దొల్త నుత్పన్న మగు నీగుణమును, అచేతన మని యైనను, లేక, యసంవేద్య మను స్వయముగ నెఱుఁగుటకు వీలులేనిబుద్ధి యని యైనను జెప్పుము. కాని యేమిచెప్పినను మనుజునకు నుత్పన్న మగుబుద్ధియుఁ బ్రకృతికి నుత్పన్న మగుబుద్ధియు నీరెండును దొలుత నొకవర్గములోనివే యనుసంగతి స్పష్టముగనే యున్నది. కావుననే యది రెండుస్థలములందును నొకేరీతిఁగ వ్యాఖ్యానము సలుపఁబడినది. ఈబుద్ధికే 'మహత్తు, జ్ఞానము, మతి, అసురి, ప్రజ్ఞ, ఖ్యాతి,' ఈమొదలగునవి నామాంతరములు. వీనిలో 'మహత్తు' (పుల్లింగమునందు ప్రథమైకవచనము 'మహాన్=గొప్పది.')అనుపేరు, 'ప్రకృతి యిప్పుడు గొప్పది యగుచున్నది' యనుకారణముచేఁ గాని, లేక, యీగుణశ్రేష్ఠత్వమూలమునఁ గాని యిడఁబడిన

---

* "Without the assumption of an atomic soul, the commonest and most general phenomena of Chemistry are inexplicable. Pleasure and pain, desire and aversion attraction and repulsion must be common to all atoms of an aggregate; for the movements of atoms which must take place in the formation and dissolution of a chemical compound can be explained only by attributing to them *Sensation and Will.*"—Haeckel in the *Perigenesi of the plastidule* cited in the Plantineau's *Types of Ethical Theory*. Vol. II. p. 399, 3rd.Edn. Haeckel himself explains this statement as follows—'I explicitly stated that I conceived the elementary psychic qualities of sensation and will which may be attributed to atoms to be *unconcious*, just as unconcious as the elementary memory which, I, in common with the distinguished Psychologist Ewald Hering, consider to be a common function of all organised matter or more correctly the living substances.'—*The Riddle of the Universe*. Chap. IX. p. 63, (R. P. A. Cheap Edn.)

-దని తోఁచు చున్నది. ప్రకృతియందు మొదట నుత్పన్న మగు మహత్తు, లేక, బుద్ధి యనుగుణము, సత్త్వరజస్తమోగుణములకలయికయొక్క పరిణామమే యగుటచేఁ బ్రకృతియొక్క యీబుద్ధి, దృష్టికి నొకటిగఁ గాన్పించినను పిదప ననేకవిధము లగుటకు సమర్థ మగును. కారణమేమియనః సత్త్వరజస్తమోగుణములు చూపునకు మూఁడుగఁ గాన్పించినను వానియొక్క కలయికలోఁ బ్రతిగుణము ననంతముగ నగుటచే నీమూఁడింటిలో నొక్కొక్కదానియొక్క యనేకము లగురీతులచే ననంతము లగుటకు సమర్థమగును. అవ్యక్త మగు ప్రకృతియందుండి నిర్మాణ మగు నీబుద్ధి ప్రకృతివలెనె సూక్ష్మముగ నున్నది. కాని, వ్యక్తావ్యక్తశబ్దములకును, సూక్ష్మస్థూలశబ్దములకును బూర్వప్రకరణమునఁ జెప్పఁబడినయర్థము ననుసరించి బుద్ధి ప్రకృతివలెనె సూక్ష్మ మయిన దైనను ప్రకృతివలె నవ్యక్తము కానేరదు; కావున, దానియొక్క జ్ఞానము మనుజునకుఁ గలుగను వీలుండును. కావున నీబుద్ధి యిప్పుడు వ్యక్తము (అనఁగా: మనుజునకు గోచర మగుపదార్థము) అనుదానిలోనే చేరును. మఱియు బుద్ధియే కాక, పిదప నుత్పన్నము లగుప్రకృతివికారము లన్నియు వ్యక్తములే యని సాంఖ్యశాస్త్రమునందు పక్కాణింపఁబడినది. ఒకమూలప్రకృతితప్ప, నితరము లగునేతత్త్వములు నవ్యక్తములు కానేరవు. అవ్యక్తప్రకృతిలో నీతీరున వ్యక్తము వ్యవసాయాత్మకము నగుబుద్ధియు నుత్పన్న మయినను ప్రకృతి యిప్పటికి నొకరీతిగనే యున్నది. ఏకత్వమును వదలి బహుత్వము నొందుటనే 'పృథక్త్వ' మని చెప్పుచున్నారు. ఉదాహరణము:— పాదరసము నేలపైఁ బడెనేని చిన్న చిన్న బిందువులుగ నగును. బుద్ధి పిదపనైతము పృథక్త్వము, లేక, బహుత్వము నొందిననే తప్ప నొకప్రకృతివల్లనే యనేకపదార్థము లుత్పన్న మగుటకు శక్యము కానేరదు. బుద్ధియందుండి వెనుక నుత్పన్న మగు నానాత్వ మనుగుణమునే యహంకారమని వచించెదరు. కారణ మేమనః—పృథక్త్వమును 'నేను—నీవు' అను నీశబ్దములచేతనే వ్యక్తము చేయఁబలసివచ్చును. మఱియు, 'నీవు-నేను' అనఁగనే, 'అహంకారము'—అహం అహం (నేను, నేను) కారము=చేయుట—అగును. ప్రకృతియందుత్పన్న మగునహంకార మనుగుణమునే యస్వయంవేద్యము, అనఁగాఁ దనకుఁ దెలియని దని చెప్పినను చెప్పవచ్చును; కాని, మనుజునకున్న యహంకారమును, ఏయహంకారముచే వృక్షములు, పాషాణములు, జలము, లేక, వేర్వేఱగు మూలపరమాణువులు నేకత్వము నొందినప్రకృతియందుండి నిర్మితము లగునో యాయహంకారము

నను నీరెంటియొక్క జాతియు నొక్కటియె. పాషాణమునకు చైతన్యము లేదు గాన 'అహం'మను జ్ఞాన ముండదు. నోరులేదు గాన "నేను వేఱు—నీవు వేఱు" అని స్వాభిమానముతో మఱియొకరికిఁ జెప్పుట సాధ్యము కాకపోవుటయే భేదముగ నున్నది. ఇతరము లగువానియందుండి పృథక్త్వముగ నున్నదానియొక్క, అనఁగాఁ అభిమానముయొక్క, లేక, యహంకారముయొక్క తత్త్వ మంతట నొకటిగనే యున్నది. ఈయహంకారమునే తైజస మని, అభిమాన మని, భూతాది యని, ధాతు వనియుఁ జెప్పిరి. అహంకార మనునది బుద్ధిలోని యొకభేద మగుటచేఁ దొలుత బుద్ధి యుత్పన్న మయినఁగాని యహంకార ముత్పన్నము కానేరదు. కావున నహంకార మనునది రెండవది, అనఁగా: బుద్ధికిఁ బిదప నుత్పన్న మగుగుణ మని సాంఖ్యులచే సిద్ధాన్తీకరింపఁబడినది. సాత్త్విక రాజస తామసభేదములచే నహంకారముసైతము బుద్ధివలె ననేకవిధము లగునని చెప్ప నక్కఱ లేదు. ముందుఁ జెప్పఁబోవు నీగుణములును, ఈరీతిగనే వేర్వేఱుగఁ ద్రిఘాతముచే ననంతము లగును. వేయేల? వ్యక్తసృష్టియందుఁ బ్రతిపదార్థము నీరీతిగనే యనంత మగుసాత్త్విక రాజస తామసము లనుభేదముల నొందును. ఈసిద్ధాంతము ననుసరించియే గుణత్రయవిభాగమును శ్రద్ధాత్రయవిభాగమును జెప్పఁబడినవి (గీ. అ. ౧౪; ౧౭.)

వ్యవసాయాత్మకబుద్ధియు నహంకారమును నను రెండువ్యక్తగుణములును మూల మగుసామ్యావస్థయం దున్న ప్రకృతియం దుత్పన్నము లగునేని ప్రకృతికి నేకత్వము పోవుటచే నందుండి యనేకపదార్థము లుత్పన్నము లగును. అయినను దాని సూక్ష్మత్వ మప్పటికిని స్థిరముగనే యుండును. అనఁగా: నైయాయికులసూక్ష్మపరమాణువుల కిప్పు డారంభము గల్గునని చెప్పినను జెప్పనచ్చును. కారణ మేమన—అహంకారము పుట్టుటకు మును ప్రకృతి యఖండముగాను నిరవయవముగాను నుండును. కేవలబుద్ధియు, కేవలాహంకారము నను నవి నిజముగఁ జూచితి మేని కేవలగుణములుగ నున్నవి. కావునఁ బ్రకృతియొక్క గుణమును వదలి యవి యుండునని పూర్వోక్త సిద్ధాన్తముయొక్క యర్థమును గైకొన నక్కఱ లేదు. మొదట నొక్కటియు, నిరవయవము నగుప్రకృతియం దీగుణము లుత్పన్నము లగునేని దానికే బహుత్వమును, సావయవద్రవ్యాత్మక మగువ్యక్తరూపమును వచ్చునని మొత్తముమీఁద భావార్థకముగ నున్నది. మూలప్రకృతియం దహంకారముచే వేర్వేఱుపదార్థములను సృజించుశక్తి యిటులు పుట్టినపిదప వృద్ధినొంది రెంతుశాఖ లయ్యెను. ఒకటి—

వృక్షములు మనుజులు మొదలగు సేంద్రియప్రాణుల సృష్టి; రెండవది—నిరింద్రియ పదార్థముల సృష్టి. ఈస్థలమునందు ఇంద్రియశబ్దముచే "ఇంద్రియములు గల ప్రాణుల యొక్క యింద్రియముల శక్తి" యని మాత్రమే యర్థమని యెఱుంగవలయును. కారణ మేమనఁగా:— సేంద్రియప్రాణులును జడదేహమునకే చేరును. జడమనఁగా: ఇంద్రియసృష్టి. ఈప్రాణులయొక్క యాత్మ పురుషుఁ డను పేరుగల మఱియొకవర్గములోఁ జేరును. సృష్టిని విచారించుచు, దేహమును, ఆత్మను వదలి యింద్రియములను సాంఖ్యులు విచారించిరి. సేంద్రియములు నిరింద్రియములు దక్క మూఁడవపదార్థము సృష్టియం దుండుటకవకాశము కలుగదు గావున నహంకారమునందుండి దేహముకంటె నధికశాఖలు వెలువడుటకు వీలులేదని చెప్ప నక్కఱ యుండదు. వీనిలో నింద్రియశక్తి శ్రేష్ఠ మగుటచే నింద్రియసృష్టిని సాత్త్వికము (సత్త్వగుణోత్కర్షచేఁ బుట్టునది), అనియు, నిరింద్రియసృష్టిని తామసము (తమోగుణోత్కర్ష వలన పుట్టినది), అనియుఁ జెప్పిరి. సారాంశ మేమన—అహంకారము స్వశక్తిచే నేర్వేఱుపదార్థములను బుట్టించు చున్నయెడల దానియందె యొకప్పుడు సత్వగుణోత్కర్ష కలుగుటచే, నొకవైపునఁ బంచజ్ఞానేంద్రియములును పంచకర్మేం ద్రియములును మనస్సును గలిసినయింద్రియసృష్టికి మూలభూతము ... నీతీరున ద్రియములును, రెండవవైపునఁ దమోత్కర్ష కలుగుటచే, నిరింద్రియ ... యిప్పటికి భూతము లగు పంచతన్మాత్ర ద్రవ్యములును, ఉత్పన్నము లగుచున్నవి. కా... యొక్క సూక్ష్మత్వ మిప్పటికిని స్థిరముగనే యుండుటచే నహంకారము ... ము లగు పదునాఱుతత్త్వములును సూక్ష్ములుగనే యున్నవి. * శబ్దము, స్పర్శ...

* ఇంగ్లీషులో నీవిషయము సంక్షేపముగఁ జెప్పవలసివచ్చెనేని యిట్లు చె... నలయును.—

The Primeval matter (*Prakriti*) was at first *homogenou* It resolved (*Buddhi*) to unfold itself, and by the principle differentiation (*Ahamkara*) became heterogenous. It then branched off into two sections—one organic (*Sendriya*) and the other inorganic (*Nirindriya.*) There are eleven elements of the organic and five of the inorganic creation. *Purusha* or the observer is different from all these and falls under none of the above categories.

రూపము, రసము, గంధము, వానితన్మాత్రలును (అనఁగా: ఒకదానితో నొకటి కలియక వేర్వేఱుగ నున్న ప్రతిగుణముయొక్క యతిసూక్ష్మము లగు మూలస్వరూపములు), అనునవి నిరింద్రియసృష్టికి మూలతత్త్వము లగుటచే, మనస్సుతోఁగూడ నేకాదశేంద్రియము లనునవి సేంద్రియసృష్టికి బీజము లయియున్నవి. వీనిలోఁ మొదటి యైదింటి నేల గ్రహింపవలయునో, లేక, రెండవపదునొకటి నేల గ్రహింపవలయునో యనువిషయము సాంఖ్యమునందు సోపపత్తికముగ విచారణ సలుపవలసిన ట్లున్నది. అర్వాచీను లగుసృష్టిశాస్త్రజ్ఞులు సృష్టియం దున్న పదార్థములను, ఘనపదార్థము (కఠినము)లని ద్రవపదార్థము (పలుచనివి) లని వాయుపదార్థము లని మూఁడువిధములుగ విభజించియున్నారు; కాని పదార్థముయొక్క వర్గీకరణములో సాంఖ్యులు వీరికంటె వేఱుగఁ జెప్పుదురు. "సృష్టియందలి సకలపదార్థముల జ్ఞానమును మనుష్యునకు జ్ఞానేంద్రియపంచకమువలనఁ గలుగును. ఈ జ్ఞానేంద్రియములరచన యొకయింద్రియమున కొకగుణమే తెలియునంతవిలక్షణముగ నున్నది. నేత్రములు వాసన నెఱుంగలేవు. వీనులు చూడలేవు. త్వగింద్రియము రుచి నెఱుంగలేదు. నాలుక మాటల వినలేదు. నాసిక రూపమును [redacted] యములకును శబ్ద స్పర్శ రూప రస గంధము లనునవియి, విషయములు నియమింపఁబడినచో, సృష్టియందలి యన్నిగుణములు నైదింటికంటె నెక్కువగ నున్నవని వచించుటకు వీలులేదు. కారణ మేమి యన: ఈయైదింటికంటె నెక్కువగ గుణములుండు నని కల్పించినను, వాని నెఱుంగుటకు సాధనము లెవ్వియు లేవు. ఈయయిదుగుణములలోను బ్రతిగుణము ననేకభేదములను బొందఁగలదు. ఉదాహరణము:—శబ్ద మనుగుణ మొక్కటియైనను, సూక్ష్మము, స్థూలము, కర్కశము, పరుషము, భగ్నము, మంజులము ననియైనను, లేక, సంగీతశాస్త్రమునఁ జెప్పినటుల, నిషాదము, గాంధారము, షడ్జము మొదలగునవి యనియైనను, లేక, వ్యాకరణశాస్త్రానుసారముగ తాలవ్యము, ఓష్ఠము, మొదలగున్నవి యన్నియైనను, అనేకభేదము లాకేశబ్దమునకే యుండును. రసము, లేక, రుచి యనునది మొత్తమున నొకటియేయైనను, తీపి, పులుసు, చేఁదు, కారము, ఉప్పు, ఒగరు-అను వీనిచే ననేకవిధము లగును. రూప మొకగుణమె యైనను, తెలుపు, నలుపు, ఆకుపసుపు, నీలము, పసిమి, యెఱుపు నని యనేకవిధములుగ నున్నది. అటులే మాధుర్యము (తీపి) అను నొక విశిష్టమగురుచిని తీసికొనినను, చెఱకుయొక్క తీపి వేఱు, పాలయొక్క తీపి వేఱు, పంచదారతీపి వేఱు, బెల్లపుతీపి వేఱు నని దానికిని మరల ననేకభేదములు

కలుగును. వేర్వేఱుగుణములకు వేర్వే ఱగుకలయికను విచారించితిమేని యీగుణ వైచిత్ర్యము ననేకవిధములుగనై యనంత మగును. కాని యేమైనను పదార్థముల యొక్క మూలగుణము లింతకంటె నెప్పుడును విశేషము కానేరవు. కారణమేమి యన: ఇంద్రియము లైదుగనే యుండుటచేతను, ప్రతీంద్రియమున కొకేగుణ ముండుటచేతను, అని యెఱుంగవలయును. కావున నొకశబ్దగుణమే కాని, లేక, స్పర్శగుణమే కాని కలిగిన వేర్వేఱగు (అనఁగా: రెండవగుణముయొక్క కలయిక లేని) పదార్థములు మనకుఁ గాన్పింపకపోయినను మూలమునందు కేవలకశబ్దము, కేవల స్పర్శము, కేవలరూపము, కేవలరసము, కేవలగంధము—శబ్దతన్మాత్రము, స్పర్శతన్మాత్రము, రూపతన్మాత్రము, రసతన్మాత్రము, గంధతన్మాత్రము—అను మూలప్రకృతియొక్క వేర్వేఱు సూక్ష్మములగు తన్మాత్రవికారము లైనను, లేక, ద్రవ్యము లయినను నుండవలయు నని సాంఖ్యులచే సిద్ధాన్తీకరింపఁబడినది. పంచతన్మాత్రల యొక్కగాని, వానియందుండి వెలువడిన పంచమహాభూతముల యొక్కగాని సంబంధములో నుపనిషత్తులలోఁ జెప్పబడిన విషయము ముందు విచారింపఁబడును.

—— ఇటుల నిరింద్రియసృష్టియొక్క విచారణ సలుపుటచే దానియం దైదుసూక్ష్మములగు మూలతత్త్వములు మాత్రమే యున్నవని తేలి పిదప సేంద్రియ సృష్టి విచారించితిమేని, జ్ఞానేంద్రియపంచకము మనస్సును నీ పదునొకటికంటె నధిక మగునింద్రియము లెరికి లేనట్లు కాన్పించు చున్నది. వీనిలో స్థూలదేహము నందు హస్తపాదాదీంద్రియములు స్థూలముగఁ గాన్పించినను నా ప్రతీంద్రియమునకు మొట్టమొదట సూక్ష్మతత్త్వ మేది యైన నుండిననే కాని యింద్రియములు వేర్వేఱుగ నుండుటకు వీలుండదు. పాశ్చాత్త్యు లగు నాధిభౌతికవాదుల యుత్క్రాంతివాదమునందు దీని విచారణ బాగుగనే జరిగినది. మిక్కిలి చిన్నది యగు (అనఁగా: మొదట గోళాకారముగ నున్న) జంతువులకుఁ ద్వగింద్రియ మొక్కటియే యున్నది. ఆతత్త్వమునందుండియే యితరములగు నింద్రియములు క్రమక్రమముగ నుత్పన్నము లగుచున్న వని యర్వాచీనసృష్టిశాస్త్రజ్ఞులు వక్కాణించెదరు. ఉదాహరణము:— మూలజంతువుయొక్క త్వగింద్రియమునకును, ప్రకాశమునకును సంయోగ మారంభ మగునేని నేత్రము లుత్పన్నము లగును. (ఇవి మొ.) ప్రకాశము మొదలగువానిసంయోగముచే స్థూలేంద్రియములు ప్రాదుర్భవించునను నాధిభౌతికవాదుల తత్త్వము సాంఖ్యులకు నైత మిష్ట మగుటచే మహాభారతమునందు,—

"శబ్దరాగాచ్ఛ్రోత్ర మస్య జాయతే భావితాత్మనః
రూపరాగా త్తథా చక్షుః ఘ్రాణం గంధజిఘృక్షయా.

(మ. భా. శాం. ౨౧౩. ౧౬).

"ప్రాణులకు, శబ్దమును వినవలయునని కోరిక యుత్పన్నమగుటచేతనే చెవులును, రూపమును జూడవలయునని యిచ్ఛ కలిగినందున నేత్రములును, వాసనను గ్రహింప వలయునని బుద్ధి పొడమె నేని నాసికయు నుత్పన్నము లగును." అని శాంతిపర్వమునం దున్నటులే యింద్రియములు ప్రాదుర్భవించె ననిచెప్పఁబడెను. కాని, సాంఖ్యు లు—"త్వగింద్రియము ఉత్పన్న మైనను, మూలప్రకృతియందే యాయాయింద్రి యము లుత్పన్న మగు నైసర్గిక శక్తి లేనియెడల సజీవసృష్టిలో నున్న యత్యంత సూక్ష్మమగు జంతువుయొక్క త్వగింద్రియముపై సూర్యప్రకాశ మెంత తగిలినను దానిశరీరమునకుఁ గన్ను లేచోటఁ బుట్టును?" అని యడుగుదురు. ఒకజంతువు నేత్రములు గలదిగను, మఱియొకటి యవి లేనిదిగను, నిర్మితము లయినపిదప, జడ సృష్టి యధికముగ నగునపుడు నేత్రములు గలప్రాణులే జీవించియుండు, నితరము లచిరకాలముననే నశించుననియు 'డార్విను' అనువాని సిద్ధాన్తము. కాని, "కన్నులు మొదలగు నాయాయింద్రియములు తొలుతనే యేల యుత్పన్నములు కానేరవు?" అనుదానికి సమాధానము పాశ్చాత్యుల యాధిభౌతికసృష్టిశాస్త్రము చెప్పదు. ఈసకలేంద్రియములు మొదట నొకయింద్రియము నుండియుఁ బిమ్మటఁ బరంపరగను పుట్టినవిగాక యహంకారముచే ప్రకృతికి బహుత్వము సంభవించె నేని యీయహంకారమునుండి యైదుసూక్ష్మములగు కర్మేంద్రియములు నైదుసూ క్ష్మము లగుజ్ఞానేంద్రియములను మనస్సునందు కలసి వేర్వేఱుగ పదునొకండు శక్తులు గాని గుణములుగాని మూలప్రకృతియందుండియే స్వతంత్రముగ నొక్క సారిగనే పుట్టుచున్నందున వానినుండి పిమ్మట స్థూల మగు నేంద్రియసృష్టి కలుగు చున్నదని సాంఖ్యులయభిప్రాయము. ఈ పదునొకండింటిలోను "మనస్సు జ్ఞానేంద్రియములవిషయమై సంకల్పవికల్పాత్మకమును, (అనఁగా: జ్ఞానేంద్రి యములవిషయములచే గ్రహింపఁబడినసంస్కారముల నొకదానితో మఱియొక దానిని జతపఱచి బుద్ధికి నెమరుగ నిర్ణయార్థము పెట్టునది,) కర్మేంద్రియములవిష యమయి వ్యాకరణాత్మకమును (అనఁగా: బుద్ధియొక్క నిర్ణయములను గర్మేంద్రియ

ములద్వారా వ్యవహారములో నుంచునదియు) అను నుభయవిధము లగు (అనఁగా: జ్ఞానేంద్రియభేదానుసారముగ వేర్వేఱగు) పనులను చేయునది.'' అని పూర్వమున సాఙ్ఖ్యప్రకరణమునఁ జెప్పఁబడినది. ఉపనిషత్తులలో నింద్రియములను ప్రాణములని చెప్పిరి. ఈప్రాణము పఞ్చభూతాత్మకము కానేరదు. పరమాత్మయందుండి వేఱుగ నుత్పన్న మయినది యని సాంఖ్యశాస్త్రమువలె నుపనిషత్తులు నభిప్రాయపడుచున్నవి. (ముండ. ౨. ౧. ౩) ఈప్రాణములయొక్క (అనఁగా: ఇంద్రియములయొక్క) సంఖ్య యుపనిషత్తులలోఁ గొన్నిస్థలములయం దేడనియు, కొన్నిస్థలములయందు పది, పదునొకండు, పండ్రెండు, మఱియు పదుమూఁడనియుం జెప్పబడినది; కాని యుపనిషత్తులయం దున్న యీసర్వవాక్యములకు నేకవాక్యత సలుపఁబడెనేని యింద్రియసంఖ్య పదునొకండనియే సిద్ధమగును. వేదాన్తసూత్రముల యాధారమున శ్రీశంకరాచార్యులు నిశ్చయించిరి (వే. సూ. శాం. భా. ౨. ౪.౫-౬);మఱియు గీతలయందు—''ఇంద్రియాణి దశైకం చ'' ''ఇంద్రియములు పదియు నొకటియు (అనఁగా: పదునొకండు—''(గీ. ౧౩. ౫) అని సుస్పష్టముగనే చెప్పఁబడెను. ఈవిషయములో సాంఖ్యవేదాన్తశాస్త్రములరెంటికిని మతభేద మించుకయు లే దని తాత్పర్యము.

సేంద్రియసృష్టియందు మూలభూతము లగుపదునొకం డింద్రియశక్తులును లేక, గుణములును, నిరింద్రియసృష్టికి మూలభూతము లగుపంచతన్మాత్రద్రవ్యములును కలిసి క్రమముగ సాత్త్వికమును తామసము నయినయహంకారమునుండి యుత్పన్నము లైనపిదప, వానిలో పంచతన్మాత్రద్రవ్యములనుండి పంచమహాభూతములును, (వీనికి 'విశేషము'లనియుం బేరు గలదు.) స్థూలనిరింద్రియపదార్థములును నిర్మింపఁబడుచున్నవి. యథాసంభవముగ సూక్ష్మము లగు నేకాదశేంద్రియములతో సంయోగముకలుగుటచే సేంద్రియసృష్టియుఁ గలుగుచున్న దని సాంఖ్యులచే సిద్ధాన్తీకరింపఁబడుచున్నది.

ప్రకృతియందుండి మున్ను ప్రాదుర్భూతములు కాఁబోవుతత్త్వముల గుఱించి యింతపర్యంతము వర్ణింపఁబడిన సాంఖ్యులక్రమము మీఁక్రిందఁ గాన్పింపఁబడిన వంశవృక్షమువలన స్పష్టముగఁ దెలియును.

## బ్రహ్మాండవంశవృక్షము.




మహత్తు, లేక, బుద్ధి (వ్యక్తము సూక్ష్మము)
(పర్యాయశబ్దములు— ఆసురి, మతి, జ్ఞానము, ఖ్యాతి, మొదలగునవి.)

అహంకారము (వ్యక్తము సూక్ష్మము.)
(పర్యాయశబ్దములు— అభిమానము, తైజసము మొదలగునవి.)

(సాత్త్వికసృష్టి, అనగా: వ్యక్తమును సూక్ష్మేంద్రియములును.)
(తామసము, అనఁగా: నిరింద్రియసృష్టి)

పంచబుద్ధీంద్రియములు పంచకర్మేంద్రియములు మనస్సు
పంచతన్మాత్రలు (సూక్ష్మములు.)

విశేషములు, లేక, పంచమహాభూతములు, (స్థూలములు)

ఇవి యిరువది ముక్కలు గల లింగశరీరము (సూక్ష్మము)

స్థూలపంచమహాభూతములు పురుషుఁడును గలసి మొత్తము పై తత్త్వము లిఱువదియైదగును. వీనిలో మహత్తు, లేక, బుద్ధి యందుండి పుట్టినమూఁడుగుణములు మూలప్రకృతియొక్క వికారములు. అందును సూక్ష్మతన్మాత్రలును పంచస్థూలమహాభూతములును ద్రవ్యాత్మక మగువికారములు. కావున, బుద్ధియు, నహంకారమును, ఇంద్రియములును కేవలశక్తులుగఁ గాని గుణములుగఁగాని యున్నవి. ఈ యిరువదిమూఁడు తత్త్వములు వ్యక్తము లనియు, మూలప్రకృతి యవ్యక్త మని

యు నీరెంటికిని భేదము. ఈయిరువదిమూఁడుతత్త్వములలోను దిక్కునకు, కాలము నకు నాకాశమునందే యంతర్భావమును సాంఖ్యులొప్పుకొనుచు, ప్రాణము వేఱని యంగీకరింపక, సర్వేంద్రియములవ్యాపారములు నారబ్ధము లగునేని వానినే యీప్రాణము లని యందురు. (సాం. కా. ౨౯) కాని, వేదాన్తులీమతము నొప్పుకొనరు. ప్రాణము స్వతంత్రతత్త్వ మని యందురు. (వే. సూ. ౨. ౪. ౯) అటులె, సాంఖ్యులు వచించురీతిఁగ, ప్రకృతిపురుషు లిద్దఱును, స్వయంభువులును, స్వతంత్రులును కారనియు, ఒకపరమేశ్వరునియొక్క రెండువిభూతులే యని యు వేదాన్తులందు రని వెనుక వక్కాణించితిమి. సాంఖ్యులకును, వేదాన్తులకును నడుమ ...ములయందున్న యీభేదము గాక మిగిలినసృష్టియొక్క యుత్పత్తిక్రమ ము భయపక్షములందు ...డినది; ... సమానముగనే యున్నది. ఉదాహరణము:—మహాభారతమునందున్న యనుగీతలలఁడె నేని ... రెండుపర్యాయములు బ్రహ్మవృక్షము, లేక, బ్రహ్మవనము వర్ణింపఁబడినది. (మ. భ. ముస ... అశ్వ. అధ్యాయ ౩౫; మఱియు ౪౭. ౧౨-౧౫) అది సాంఖ్యుల తత్త్వము ననుసరించియే యున్నదెట్లనఁగ:—

"అవ్యక్తబీజప్రభవో బుద్ధిస్కంధమయో మహాన్ ।
మహాహంకారవిటప ఇంద్రియాన్తరకోటరః.
మహాభూతవిశాఖశ్చ విశేషప్రతిశాఖవాన్
సదాపర్ణ స్సదాపుష్ప శ్శుభాశుభఫలోదయః.
ఆజీవ్యః సర్వభూతానాం బ్రహ్మవృక్ష స్సనాతనః
ఏనం ఛిత్వా చ భిత్వా చ తత్త్వజ్ఞానాసినా బుధః.
హిత్వా సంగమయాన్ పాశాన్ మృత్యుజన్మజరోదయాన్
నిర్మమో నిరహంకారో ముచ్యతే నాత్ర సంశయః.

"అవ్యక్తము, (ప్రకృతి) దేనికి బీజమో, బుద్ధి (మహాన్) దేనికి స్కంధమో (బోదెయో), అహంకారము దేనికి ముఖ్యపల్లవమో, మనస్సును దశేంద్రియములును దేనిలో నుండుతొఱ్ఱలో, (సూక్ష్మము లగు) మహాభూతములు (పంచతన్మాత్రలు) దేనికి పెద్దకొమ్మలో, విశేషములు (అనఁగా: స్థూలమహాభూతములు) దేనికి రెమ్మలో, ఏఁడు యెప్పుడు నాకులు పుష్పములు శుభాశుభము లనుఫలములును గలిగియుండునో యాసనాతన మగుబ్రహ్మవృక్షము సర్వప్రాణులకు నాధారభూత మైనది. దీనిని తత్త్వజ్ఞానరూప మగుకత్తిచే ఛేదించి, ముక్కలుగఁ జేసి, జ్ఞాని జన్మ జరా మృత్యువులను గలుగఁజేయుసంగమయము లగుపాశములను దెగనేసి, మమత్వబుద్ధిని, అహంకారమును వదలెనేని, నిస్సంశయముగ ముక్తుఁడగును." సారాంశ

మేమనఁగా: ఈబ్రహ్మవృక్షమనఁగా, సంసారరూపవృక్షము, లేక, ప్రకృతి; లేక, మాయయొక్క పసారము. దీనిని వృక్షమని చెప్పుట యనుక్రమము బహుకాలమక్రిందటనుండియు (అనఁగా: ఋగ్వేదకాలమునుండియు) కలదు. ఉపనిషత్తులలో దీనిని 'సనాతన మైనయశ్వత్థవృక్ష' మని చెప్పినారు. (కఠ. ౬. ౧) కాని, యిక్కడ (అనఁగా: వేదాన్తమునందు) యీవృక్షముయొక్క మూలము (అనఁగా: పరబ్రహ్మము) పై నున్నదనియు, శాఖ లన్నియు (దృశ్యసృష్టియొక్క పసారము) క్రింద నున్నవనియు మాత్రమే భేదము చెప్పఁబడినది. ఈవైదికవర్ణనను, సాంఖ్యులతత్త్వమును ననుసరించి గీతలలో నశ్వత్థవృక్షము వర్ణితమయిన దని గీతలలోని ౧౫. ౧; మఱియు ౨వ శ్లోకములపై నేను వ్రాసినటీకయందు స్పష్టముగఁ గనఁబఱచియున్నాను.

పైన వృక్షరూపముగ వర్ణించిన యిరువదియైదుతత్త్వములనే సాంఖ్యులును వేదాన్తులును వేర్వేఱుగ వర్గీకరణ మొనరించిరి. ఈవర్గీకరణమునందుసైతము కొంత పరిచయ మిచ్చోఁ గలుగవలయును. ఈ యిరువదియైదుతత్త్వములకును మూలప్రకృతి, ప్రకృతివికృతి, వికృతి, న-ప్రకృతి—న-వికృతి, అని నాల్గువర్గములుగా నున్నవని సాంఖ్యులు చెప్పుచున్నారు. (౧) ప్రకృతితత్త్వము మఱియొకదానియందుండి పుట్టినది కాకపోవుటచే దానిని మూలప్రకృతి యని చెప్పుదురు. (౨) ఈ మూలప్రకృతిని వదలి రెండవమెట్టుపైకి వచ్చితి మేని మహత్తత్త్వ ముండును. మహత్తత్త్వము ప్రకృతిచేఁ బుట్టినది యగుటచే, ప్రకృతియొక్క వికృతి, లేక, వికారమయి యున్నది. మఱియు నహంకార మీమహత్తత్త్వమునందుండి వెలువడినది గాన మహత్తత్త్వ మనునది యహంకారమునకు ప్రకృతి, లేక, మూలముగ నున్నది. ఇటులనుటచే మహత్తత్త్వము, లేక, బుద్ధి యను నిగుణ మొకవైపున నహంకారమునకు ప్రకృతి, లేక, మూలము అగుచున్నది. మఱియు రెండవవైపున మూలప్రకృతియొక్క వికృతి (అనఁగా: వికారము)యై యున్నది. కావున సాంఖ్యులచే నిది 'ప్రకృతి—వికృతి' యనువర్గములోఁ జేర్పఁబడినది; ఇట్లులే యహంకారమును పంచతన్మాత్రలను ప్రకృతివికృతివర్గములోనే చేర్పవలసివచ్చును. ఏతత్త్వము లైనను గుణము లైనను ముందు తా మొకదానియందుండి పుట్టి (వికృతులై) పిదప మఱియొకతత్త్వమునకు మూలభూతము (ప్రకృతి) లగునో, వానిని 'ప్రకృతి-వికృతు'లని చెప్పుదురు. మహత్తు (మహాన్,) అహంకారము పంచతన్మాత్రలు నను నీయేడుతత్త్వములు నిట్టివె యగును. (౩) పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు, స్థూలపంచమహాభూతములు నను నీపదియాఱుతత్త్వములనుండి పిదప నితరము లగు తత్త్వము లెవ్వియు పుట్టలేదు. కాని, యివియే మఱియొక

దానియందుండి పుట్టినవి. కావున నీపదియాఱుతత్త్వములను 'ప్రకృతి-వికృతు' లనక, కేవలము 'వికృతులు', లేక, 'వికారము'లని నుడువుదురు. (౮) పురుషుఁడు ప్రకృతి కాఁడు, వికృతియును కాఁడు. స్వతంత్రుఁడు, ఉదాసీనుఁడు, ద్రష్టయు నై యున్నాఁడు. ఈశ్వరకృష్ణు లిటుల వర్గీకరణ మొనర్చిరి—

"మూలప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతివికృతయ స్సప్త
షోడశకస్తు వికారో న ప్రకృతిర్న వికృతిః పురుషః." (సాం. కా. ౩)

"మూలప్రకృతి యనునది అవికృతి. (అనఁగా: దేనియొక్క వికారమును కానేరదు.) మహత్తు మొదలగునవి యేడును (అనఁగా, మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు—అనునవి) ప్రకృతివికృతులు. మఱియు మనస్సుతోఁ జేరి పదునొకం డగునింద్రియములును, స్థూలపంచమహాభూతములును గలసి పదునాఱుతత్త్వములును వికృతులే, లేక, వికారములే. పురుషుఁడు, ప్రకృతియును కాఁడు, వికృతియును కాఁడు." అని చెప్పిరి. పిదప నీ యిరువదియైదుతత్త్వములను, మరల నవ్యక్తము, వ్యక్తములు, జ్ఞుఁడు, అని మూఁడువర్గములుగ చేయఁబడినవి. వానిలో మూలప్రకృతి యనునది యొక్కటియే యవ్యక్తము. ప్రకృతినుండి యుత్పన్నము లైనయిరువదిమూఁడుతత్త్వములును వ్యక్తములు. పురుషుఁడనువాఁడు 'జ్ఞుఁ'డగును. ఇది సాంఖ్యులవర్గీకరణము. పురాణములందును, స్మృతులయందును, మహాభారతము మొదలగువైదికమార్గగ్రంథములయందు నీ యిరువదియైదుతత్త్వములె తెలుపఁగఁ జెప్పఁబడుచున్నవి: (మైత్ర్యు. ౬. ౧౦; మను. ౧. ౧౪-౧౫. చూడుము). కాని యుపనిషత్తులలో నివి యన్నియు పరబ్రహ్మమునందుండియే యుత్పన్నము లయిన వని యున్నది. వానిలో వీనివిషయమున విశేషముగ వివేచనమైనను, వర్గీకరణమైనను నొనర్పఁబడలేదు. ఉపనిషత్తులపిదపఁ బుట్టినగ్రంథములందుమాత్ర మవి వర్గీకరింపఁబడినటుల స్పష్టముగఁ గాన్పించుచున్నది; కాని పూర్వోక్తమగు సాంఖ్యులవర్గీకరణముకంటె నది వేఱుగనే యున్నది. మొత్తముపై తత్త్వము లిరువది యైదు. వానిలో పదునాఱుతత్త్వములు సాంఖ్యమునందువలెనే వికారములు (అనఁగా: ఇతరతత్త్వములనుండి యుత్పన్నము లైనవి.) కావున వానిని ప్రకృతి, లేక, మూలభూతపదార్థము, అను వర్గమునందుఁ జేర్పలేదు. ఇవి గాక తొమ్మిదితత్త్వములు మిగిలియున్నవి;— ౧ పురుషుఁడు, ౨ ప్రకృతి, ౩-౯ మహత్తు (మహత్తత్త్వము), ౮అహంకారము, మఱియు పంచతన్మాత్రలు. వీనిలో పురుషుఁడును, ప్రకృతియును గాక మిగిలిన యేడుపదార్థములను ప్రకృతివికృతులని సాంఖ్యులు సెప్పుదురు; కాని వేదాన్తశాస్త్రమునందుఁ బ్రకృతిస్వతంత్ర

యని యొప్పుకొనకపోవుటచే నొకపరమేశ్వరునం డుండియే పురుషుండును ప్రకృతియు నుత్పన్నము లగునని సిద్ధాన్తము. ఈసిద్ధాన్తము ననుసరించియే, 'మూలప్రకృతి-ప్రకృతి-వికృతి'యను సాంఖ్యుల భేద మేమియు నుండ నేరదు. కారణ మేమి యన: ప్రకృతి యైనను పరమేశ్వరునందుండియే యుత్పన్న మైనది. కావున దానిని మూలమని చెప్పుటకు వీలులేదు. కావుననే యది ప్రకృతివికృతివర్గములోనికి వచ్చును. కాబట్టి సృష్ట్యుత్పత్తిని జెప్పుచు నొకపరమేశ్వరునియందుండి యొకవైపున జీవులును, రెండవవైపున (మహదాదు లగునేడు ప్రకృతి-వికృతులు) నెనిమిదివిధములైనప్రకృతియు నిర్మితము లయినవని వేదాన్తులు నుడువుచున్నారు. (మ. భా. శాం. ౩౦౬. ౨౯; మఱియు, ౩౧౧. ౧౧. చూడుము). అనఁగా: వేదాన్తులవర్గీకరణమువలె నిరువదియైదుతత్త్వములలో పరునాలుగుతత్త్వములను వదలి, మిగిలిన తొమ్మిదితత్త్వములను 'జీవ' మనియు, 'అష్టధా ప్రకృతి'యనియు రెండువిధములుగ వర్గీకరింపఁబడినవి. వేదాన్తులయీవర్గీకరణమే భగవద్గీతలో స్వీకరింపఁబడినది. కాని దానియందుఁ గొదవ గొంచెముభేద ముండును. సాంఖ్యులు దేనిని పురుషుఁ డందురో దానినే గీతలయందు జీవుఁ డనెదరు. కావున జీవ మనునది యీశ్వరునియొక్క పరాప్రకృతి (అనఁగా: శ్రేష్ఠస్వరూపము)గ నున్న దని చెప్పఁబడినది; మఱియు సాంఖ్యులు దేనిని మూలప్రకృతి యందురో యదియే గీతలయందుఁ పరమేశ్వరునియొక్క 'అపర' (అనఁగా: కనిష్ఠ) మగుస్వరూప మని చెప్పఁబడినది. (గీ. ౭. ౪-౫) ఇటులు రెండువిధములుగ వర్గీకరణ మొనర్చినపిదప వానియందున్న రెండవవర్గముయొక్క (అనఁగా: కనిష్ఠస్వరూపముయొక్క)భేదము చెప్పవలసినప్పు డీకనిష్ఠస్వరూపము గాక దానియందుండి యుత్పన్న మయినయితర తత్త్వములఁ జెప్పవలయును. కారణ మేమన: కనిష్ఠస్వరూపము (అనఁగా: సాంఖ్యులమూలప్రకృతి) ప్రకృతిభేదములలోనిది కానేరదు. ఉదాహరణము:—ఒక తండ్రికి బిడ్డ లెందఱో చెప్పవలసివచ్చినచో బిడ్డలతోనే తండ్రినిసైతము గణింప రాదు. కావున పరమేశ్వరునియొక్క కనిష్ఠస్వరూపమునకు ముందు భేదము లెన్ని యున్నవో చెప్పుచు వేదాన్తుల 'యష్టధా ప్రకృతి'లో, మూలప్రకృతిని వదలి, మిగిలినమహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు నను నీయేడె యామూలప్రకృతియొక్క భేదములు, లేక, ప్రకారములు నని చెప్పవలసివచ్చును. ఇటు లొనర్చితి మేని పరమేశ్వరునియొక్క కనిష్ఠస్వరూపము, లేక, మూలప్రకృతి యేడు విధములుగ నున్న దని చెప్పవలసివచ్చును; కాని, పైఁజెప్పినవిధమున వేదాన్తులును ప్రకృతి యెనిమిదిభేదములు గలదానిగ వచించెదరు. 'వేదాంతులు చెప్పు

నెనిమిదివిధములకును, గీతలలోఁ జెప్పియుండెడువిధములకును గొంతవిరోధము గాన్పించును. ఈవిరోధము లేకుండుటయు 'అష్టధా ప్రకృతి' యని చెప్పుటయు గీతలకు నిష్టముగనే యున్నది.

కావున మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు నను నీయేడింటి లోనే మన స్సను నెనిమిదియవతత్త్వమును జేర్చుటచేఁ బరమేశ్వరుని కనిష్ఠస్వరూపము(అనఁగా: మూలప్రకృతి) ఎనిమిదివిధ(అష్టధా)ములయిన దని గీతలలోఁ జెప్పఁబడియున్నది. (గీ. ౭. ౫) వీనిలో మనస్సులోనే దశేంద్రియములును, పంచతన్మాత్రలును, పంచమహాభూతములును జేరును. కావుననే గీతలయందుండువర్గీకరణమునకును సాంఖ్య-వేదాన్తులవర్గీకరణమునకును భేదము కాన్పించినను తత్త్వములయొక్క మొత్తపుసంఖ్య దానికంటె హెచ్చుతగ్గులుగ లేదని కాన్పించును. తత్త్వములన్నిగ్రంథములలో నిరువదియైదే, అయినను వర్గీకరణభేదముచే భ్రమఁ జెందకుండుటకై యీ మూఁడువర్గీకరణములు కోష్ఠరూపముగ నొకచోఁ జేర్చి యిచ్చోఁ జూపఁబడినవి. ఈకోష్ఠమున గీతలలో పదుమూఁడవయధ్యాయమునందలి (౧౩. ౫) వర్గీకరణము నొప్పుకొనక, సాంఖ్యులు సెప్పునటులే పంచవింశతితత్త్వములును వేఱుగఁ జెప్పఁబడినవి; దానివలన వర్గీకరణము భిన్నముగ నుండినను రెండుప్రదేశములందును తత్త్వసంఖ్య యొకటిగనే యున్న దని స్పష్ట మగును.

### పంచవింశతిమూలతత్త్వములయొక్క వర్గీకరణము.

| సాంఖ్యులవర్గీకరణము. | తత్త్వములు. | వేదాన్తులవర్గీకరణము. | గీతలవర్గీకరణము |
|---|---|---|---|
| న-ప్రకృతి-న-వికృతి | ౧ పురుషుఁడు | పరబ్రహ్మయొక్క శ్రేష్ఠస్వరూపము. | పరాప్రకృతి |
| మూలప్రకృతి. | ౧ ప్రకృతి. | పరబ్రహ్మయొక్క కనిష్ఠరూపము(ఎనిమిదివిధములైనది.) | అపరాప్రకృతి |
| ౭ ప్రకృతి-వికృతులు. | ౧ మహత్తు<br>౧ అహంకారము<br>౫ తన్మాత్రలు | | అపరాప్రకృతి (ఎనిమిదివిధములైనది) |
| ౧౬ వికారములు. | ౧ మనస్సు<br>౫ బుద్ధీంద్రియములు<br>౫ కర్మేంద్రియములు<br>౫ మహాభూతములు | వికారములని వేదాన్తులీ పదునాఱుతత్త్వములను, మూలతత్త్వములోనే లెక్కించుచున్నారు. | వికారములగుటచే నీ పదునైదు తత్త్వములనుమూలతత్త్వములలో గీత లెక్కింపదు. |
| | ౨౫ | | |

అది యటు లుండనిమ్ము. ఆదియందు సామ్యావస్థలోనే యుండునదియు, నేకస్వరూపమును, నిరవయవమును, అవ్యక్తమును, జడము నగుప్రకృతికి వ్యక్తసృష్టిని పుట్టించు నస్వయంవేద్యబుద్ధి కలిగినపిదప, నహంకారముచే దానియందు నానాత్వ మగుబహుభవన మేర్పడుటచే, పిదప నొకవైపున సాత్త్వికములును (అనఁగా: ఇంద్రియసృష్టికి మూలభూతములు, సూక్ష్మములు నగు నేకాదశేంద్రియములును) రెండవవైపున నిరింద్రియములును (అనఁగా: తామసస్పష్టికి మూలభూతములును సూక్ష్మములు నగుపంచతన్మాత్రలును) గుణమునందుండి గుణములును, ఈగుణపరిణామవాదానుసారముగ నెటుల నిర్మితము లైనవి యనువివేచన సమాప్తమయినది. ఇఁకను సృష్టి (స్థూలమహాభూతము లైనను, వానియందుండి వెలువడునితర జడపదార్థము లైనను) యేక్రమముగ వెలువడిన దనునంశ మిచ్చో స్పష్టముగ వివరింపఁబడును. సూక్ష్మతన్మాత్రలనుండియే స్థూలమహాపంచభూతము లైనను, లేక, 'విశేషము'లనునవి యైనను గుణపరిణామముచే నుత్పన్నము లైన వని మాత్రమే సాంఖ్యశాస్త్రమునందుఁ జెప్పఁబడినది. కాని, వేదాన్తశాస్త్రములో నున్నగ్రంథములయం దీప్రశ్న మధికముగ వివేచింపఁబడుటచేఁ బ్రసంగానుసారముగ వానియుత్పత్తి నిచ్చో సంక్షేపముగ నిరూపించెదను. ఈనిరూపణము వేదాన్తశాస్త్రము ననుసరించి యుండును గాని, సాంఖ్యశాస్త్రానుసారముగ నుండ నేరదు. స్థూల పృథ్వి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము ననువానిని పంచమహాభూతములు, లేక, విశేషములు, అని చెప్పుచున్నారు. వీనియొక్క యుత్పత్తిక్రమము తైత్తిరీయోపనిషత్తునం దిటుల చెప్పఁబడినది. "ఆత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః...." "పరమాత్మయందుండి(సాంఖ్యులు చెప్పునటుల జడ మగుమూలప్రకృతియందుండి కాఁ నేరదు.) తొలుత ఆకాశము, నాకాశమునందుండి వాయువు, వాయువునందుండి యగ్నియు, అగ్నియందుండి జలమును, జలమునందుండి పృథ్వియు నుత్పన్నము లైనవి." (తై. ఉ. ౨.౧) ఉపనిషత్తునందలి యీక్రమమునకుఁ గారణముమాత్రము చెప్పఁబడలేదు; కాని యుత్తరవేదాన్తగ్రంథములందుఁ బంచమహాభూతముల నిర్మాణక్రమమున కుపపత్తి సాంఖ్యశాస్త్రోక్త మగుగుణపరిణామముయొక్క సిద్ధాన్తము ననుసరించియే యోజింపఁబడినది. "గుణా గుణేషు వర్తన్తే" యను న్యాయమున నాదియందు నొకగుణమే గలపదార్థ ముత్పన్న మైనది. దానినుండి రెండుగుణములు గలదియు, మూఁడుగుణములు గలదియు నగుపదార్థము లుత్పన్నములయి వృద్ధిఁ జెందుటకుఁ బ్రారంభ మైనది. పంచమహాభూతములలో నాకాశము

నను ముఖ్యముగ నొకశబ్దమే గుణ మగుటచే నాకాశము మొదట నుత్పన్న మైనది. పిదప వాయువు పుట్టెను. కారణ మేమి యన: వాయువునందు శబ్ద స్పర్శము లను రెండుగుణము లున్నవి. గాలి విసరు నేని, వినఁబడుటయే కాక, యది మనయొక్క స్పర్శేంద్రియమునకు సైతము గోచర మగుచున్నది. వాయువు వెంటనే యగ్ని పుట్టెను. కారణ మేమి యన: శబ్ద స్పర్శములనునీరెండుగుణములె కాక యీయగ్నియందు రూప మనుమూఁడవగుణమును గలదు. ఈమూఁడుగుణములే కాక రుచి, లేక, రస మనునాల్గవగుణము జలమం దుండుటచే నగ్నివెంబడి జల ముత్పన్నము గానలసి యున్నది. తుదకు పృథ్వియం దీనాల్గుగుణములకంటెను గంధ మనుగుణము విశేషించియుండుటచే నుదకమునందుండి పృథ్వి యుత్పన్నమయిన దని సిద్ధాన్త మగుచున్నది.'' అని యుత్తరవేదాన్తగ్రంథములలోఁ జెప్పఁబడినది. యాస్కునిచే నీ సిద్ధాన్తమే యంగీకరింపఁబడినది. (నిరుక్త.౧౪.౪) స్థూలపంచమహాభూతము లీవిధమున నిర్మితములయినపిదప— "పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నాత్పురుషః'' "పృథివియందుండి వనస్పతియు, వనస్పతియందుండి యన్నము, నందుండి పురుషుఁడు నుత్పన్నము లయ్యెను'' (తై.౨.౧)అని తైత్తిరీయోపనిషత్తులోఁ దరువాత నున్నది. పిదపఁ గాఁబోవుసృష్టి పంచమహాభూతములకలయికచేఁ బుట్టినది కావున నాకలయిక యనుక్రియను వేదాన్తులు 'పంచీకరణ'మని పేర్కొనిరి. పంచీకరణ మనఁగా: పంచమహాభూతములలోను ఒక్కొక దానియొక్క భాగమును హెచ్చుతగ్గులుగఁ గైకొని యవి యన్నియుఁ గలుపుటచేఁ గ్రొత్తక్రొత్తపదార్థములు సిద్ధించుట యని యర్థము. ఈపంచీకరణ మనంతవిధముగ నగును.

"కాళే పాంఢరే మేళవితాఁ, పారవే హోతే తత్త్వతాఁ,
కాళే పివళే మేళవితాఁ, హిరవే హోయ.'' (దాసబోధ. ౯. ౬. ౪౦)

"నలుపును దెలుపును గలుపుటచే, నీల మగురంగు పుట్టును. నీలపురంగు నాకుపచ్చరంగును గలుపుటచే పసుపురం గగును''అని దాసబోధలో నున్నది. పదుమూఁడవదశకములో—

"త్యా భూగోళాచే పోటీఁ, అనంత బీజాచియా కోటీ.
పృథ్వీ పాణ్యా హోతాఁ భేటీ, అంకుర నిఘతీ.
పృథ్వీ వల్లీ నానా రంగ, పత్రేఁ పుష్పాచే తరంగ,

నానా స్వాద తే మగ, ఫళే జాలీ.

... ... ... ... ...

అండజ, జారజ, స్వేదజ, ఉద్భిజ, పృథ్వీ షాణీ సకలాంచే బీజ,

ఐసే హే నవలచోజ, సృష్టిరచనేచే.

చారీ ఖాణీ చారీ వాణీ, చౌర్‍యాశీ లక్ష* జీవ యోనీ,

నిర్మాణ ఝూలే లోక తిన్హీ, పిండ బ్రహ్మాండ. (దాస. ౧౩.౩. ౧౦. ౧౫)

"పృథ్వియం దనంతకోటిజాతులు పుట్టుచున్నవి. పృథివికిని జలమునకును సంయోగ మైనపిదప నాబీజములనుండి యంకురములు పుట్టుచున్నవి.అయంకురముల నుండి యనేకములగు చెట్లు పుట్టుచున్నవి. పత్రములును బుష్పములును వాని వలనఁ బుట్టును. ఆపుష్పములనుండి యనేకవిధములై మిక్కిలిరుచి గలపండ్లును బుట్టును.........అండజములు, జరాయుజములు, స్వేదజము, లుద్భిజములు నను వానికన్నిటికిని పృథ్వియు జలమును బీజములై యున్నవి. ఈసృష్టిరచన మిక్కిలి యద్భుత మైనది. చమత్కార మైనది. ఇట్లు నాలుగు గనులును, నాలుగువాక్కులును, ఎనుబదినాలుగులక్షల జీవయోనులును * త్రిలోకములును, పిండమును, బ్రహ్మాండ మంతయును నిర్మింపఁబడినవి." అని సమర్థులచేఁ జెప్పఁబడినదియు దీని

* ఎనుబదినాలుగులక్షల జీవయోను లనుకల్పన పౌరాణికులచేఁ జేయఁబడినది. కావున నది యూహతో రమారమిగఁ జెప్పఁబడినదని స్పష్టమగుచున్నది. అయిన నది బొత్తిగ నిష్ప్రమాణముగఁ జెప్పఁబడినది కానేరదు. పాశ్చాత్యులగు వాధిభౌతికశాస్త్రజ్ఞు లుత్క్రాంతివాదానుసారముగ మనుష్యప్రాణులు సృష్ట్యారంభమున నొకచిన్నగోళాకారముగ నున్నసజీవ మగుసూక్ష్మజంతువునుండి వెలువడి రని యందురు. ఈకల్పనను బట్టి చిన్నగోళముగనున్నజంతువు పెద్దగోళముగ నున్న జంతువగుటకును,ఈస్థూలజంతువు మరల చిన్నపురు గగుటకును,ఆచిన్నపురుగు పిదప మనుష్యప్రాణి యగుటకును నడుమ ప్రతియోనికి (అనఁగా: ప్రతిజాతికిని) సెన్ని యో తరములై యుండవలయునని స్పష్టమయియే యున్నది. దీనివలన నుదకమందున్న చిఱుచేపలయొక్క గుణ[illegible]లు క్రమముగా వృద్ధిఁబొందఁగా నాచేపయే చివరకు మనుష్యనిర్మా[illegible]ను నీమా[illegible]దుటకు, మధ్యనున్న వేర్వేఱుయోనులలో నెంత్తముపై సుమ్మా[illegible]మహాభూతముల[illegible]ల డెబ్బదియైదు వేలతరము లుండవలయు

ననుసరించియే యున్నది; కాని పంచీకరణముచేఁ గేవలజడపదార్థములే (అనఁగా: దేహములే) యుత్పన్నములగును. ఈజడదేహమును సచేతనప్రాణిగఁ జేయుటకు, దీనితో, తొలుత సూక్ష్మేంద్రియములకును, పిదప నాత్మకును (అనఁగా: పురుషునకును) సంయోగ మావశ్యకమనుదానిని మఱవరాదు.

ఉత్తరవేదాంతగ్రంథములయందుండు నీ పంచీకరణము, ప్రాచీనము లగు నుపనిషత్తులయందు లేదనియు నిచ్చో నుడువవలయును. తన్మాత్రలను, మహాభూతముల నేనింటిని, ఒప్పక ఛాందోగ్యోపనిషత్తులో తేజస్సు, జలము, అన్న(పృథ్వి) మనునీమూఁడుసూక్ష్మము లగుమూలతత్త్వములనే కొని, యీమూఁటియొక్క మిశ్రణముచే (అనఁగా: 'త్రివృత్కరణము'చే) ఁ బిదప వివిధసృష్టియు నిర్మిత మయినదని చెప్పఁబడినది; మఱియు "అజా మేకాం లోహితశుక్లకృష్ణాం, బహ్వీః ప్రజాః

---

ననియు, నీతరములసంఖ్యయు నింతకంటె పదిరెట్లు సైతము కానగు ననియు, నొకయాంగ్లేయజీవశాస్త్రజ్ఞుఁడు గుణించెను. నీటియందున్న చిన్నజలచరము మొదలు మనుష్యప్రాణివఱ కున్న యోనులివి. వీనియందే చిన్నజలచరములకన్న పూర్వమందుండు సజీవజంతువులను సైతము కలుపుదుమేని యింక నెన్నిలక్షలతరములఁ గల్పింపవలయునో యూహించి రమారమి వచించుటకు సైతము శక్యము కానేరదు. మనపురాణములందున్న యెనుబదినాలుగులక్షలయోనులయొక్క కల్పనకంటె నాధిభౌతికశాస్త్రజ్ఞులయొక్క పురాణములయందున్న తరములకల్పన యెంతయెక్కువగ నున్నదియు దీనివలన నెఱుంగనగు. కాలకల్పనవిషయమునఁగూడ నిటులే యుండును. సజీవసృష్టియందున్న సూక్ష్మజంతువు లీభూమిపై నెప్పుడు పుట్టినదియు స్థూలదృష్టిచే సైతము వచించుటకు శక్యము కానేరదు. సూక్ష్మములగుజలచరములయుత్పత్తియు కోట్లకొలఁదివత్సరంబుల క్రిందట నాయెనని భూగర్భగతజీవశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈవిషయమున సంక్షేపమగు వివేచనను గుఱించి "The Last Link by Ernst Haeckel with notes, etc., by Dr. H. Gadow (1898) అనుగ్రంథమును జూడుము. 'ఈగాదో' యనువాఁడీపుస్తకముతోఁ జేర్చినయుపయోగకరము లగు రెండుమూఁడుపరిశిష్టములనుండి యీపైవిషయములు గ్రహింపఁబడినవి. పురాణములయందున్న యెనుబదినాలుగులక్షలయోనులలెక్కలోఁ దొమ్మిది లక్షలు జలచరములనియుఁ, బదిలక్షలు పక్షులనియు, పదునొకండులక్షలు కృములనియు, నిరువదిలక్షలు పశువులనియు, ముప్పది స్థావరము లనియు, నాలుగు లక్షలు మనుజు లనియుం జెప్పఁబడినది. (దాసబోధ, నిషుతీ. చే తరంగ, ... చూడుము)

సృజమానాం సరూపాః." "ఎఱుపురంగు గలదియు (అనఁగా: తేజోరూపము గలదియు) తెల్లనైనదియు, (అనఁగా: జలరూపము గలదియు) నీలరూపము (అనఁగా: పృథ్వీరూపము) గలదియు, మూఁడురంగులు (అనఁగా: మూఁడుతత్త్వములు) గలదియునైన యజ (అనఁగ: ఆఁడుమేక) యందుండి నామరూపాత్మక మగు ననేక ప్రజ (అనఁగా: సృష్టి) యుత్పన్న మైనది" అని శ్వేతాశ్వతరోపనిషత్తునఁ జెప్పఁబడినది. ఛాందోగ్యోపనిషత్తుయొక్క యేడవయధ్యాయమున, శ్వేతకేతువునకును, వాని తండ్రికిని జరిగినసంవాదము కలదు. దానియందు నారంభమునందే శ్వేతకేతువునకు నతనితండ్రి స్పష్టముగఁ జెప్పెను:— "తండ్రీ! జగత్తున కారంభమున, "ఏకమేవాద్వితీయం సత్", తప్ప, అనఁగా: ఎక్కడ చూచినను, సర్వము, నేకము, నిత్యము నగుపరబ్రహ్మ తప్ప, మఱియొకటి యేమియును లేక యుండెను. ఏది యసత్తో (లేదో) దానియందుండి సత్తు (పదార్థము) ఎట్లుత్పన్న మగును? కావున నారంభమున సత్పదార్థమే యంతటను నిండియున్నది. పిదప నాతని 'కనేకులు కావలయు' ననుసంకల్ప (అనఁగా: నేను పెక్కుమంది యగుదు ననుసంకల్ప) ముదయించుటచే దానియందుండి క్రమముగ సూక్ష్మ మగు తేజస్సు (అగ్ని), అప్పు (జలము), అన్నము (పృథ్వి), ఉత్పన్నము లైనవి. పిదప నీమూఁడుతత్త్వములయందె జీవరూపముగఁ బరబ్రహ్మ ప్రవేశింపఁగనే వానియొక్క 'త్రివృత్కరణ' మగుటచే జగత్తునందనేక నామరూపాత్మక వస్తువులు నిర్మితము లయినవి. స్థూలాగ్నియే (అనఁగా: సూర్యుఁడే), లేక, బీజభూత మగు తేజస్సునందలియెఱుపే సూక్ష్మతేజోరూప మగుమూల తత్త్వముయొక్కయు, తెలుపే (శుక్లము) సూక్ష్మ మగుజడతత్త్వముయొక్కయు, నలుపే సూక్ష్మ మగుపృథ్వీతత్త్వముయొక్కయుఁ బరిణామ మయి యున్నది. అటులె మనుజుఁడు భక్షించుచుండు నన్నమునందును సూక్ష్మతేజస్సు, సూక్ష్మమగు నప్తత్త్వము (నీటియొక్క తత్త్వము), సూక్ష్మపృథ్వీతత్త్వము ననునీమూఁడుతత్త్వములె నిండి యున్నవి. పెరుఁగును చిలికిన వెన్న వచ్చినటులే వెనుకఁ జెప్పఁబడిన మూఁడుతత్త్వములచేతను సిద్ధించినయన్న ముదరములోనికిఁ జొచ్చినపిదప, దానిలోని తేజ స్సెముకయు, మజ్జయు, వాణియు, అను వరుసగా స్థూలము, మధ్యమము, సూక్ష్మము నగుపరిణామము నొందును. మఱియు నటులె యప్తత్త్వమునందుండి, మూత్రము, రక్తము, ప్రాణము ననునవియు, పృథ్వీతత్త్వమునందుండి పురీషము, మాంసము, మనస్సు నను నీమూఁడుద్రవ్యములును బుట్టుచున్నవి. (ఛాం. ౬. ౨-౬.) మూలము లగుమహాభూతములయిదింటి నంగీకరింపక మూఁటినే యంగీక

రించి త్రివృత్కరణముచే సర్వదృశ్యపదార్థములయొక్క యుత్పత్తివ్యవస్థను జేయు (బోధించు)ఛాందోగ్యోపనిషత్తునందును నీమార్గమే కలదని వేదాన్తసూత్రములలో (వే. సూ. ౨౦. ౪. ౨౦) చెప్పఁబడియున్నది. కావుననే పంచీకరణ మనుపేరును బాదరాయణాచార్యు లుపయోగింపరు. అయినను తైత్తిరీయమునందును (తై. ౨. ౧) ప్రశ్నోపనిషత్తునందును (ప్ర. ౪. ౮) బృహదారణ్యకము (౪. ౪. ౫) మొదలగు నితరోపనిషత్తులందును శ్వేతాశ్వతరమునందును (౨. ౧౨) వేదాన్తసూత్రములందును (౨. ౩. ౧-౧౪) తుదకు గీతలయందును (౭.౪;౧౩.౫;) ఈమూడింటికి మాఱుగఁ బంచమహాభూతములు చెప్పఁబడినవి. గర్భోపనిషత్తునందును, మనుష్యదేహము పంచాత్మక మని యారంభముననె చెప్పఁబడినది. మహాభారతమునందుఁగాని, పురాణములయందుఁ గాని, వీనియందుండి గ్రహించియే పంచీకరణము స్పష్టముగఁ జెప్పఁబడినది (మ. భా. శాం. ౧౮౪-౧౮౬). ఇందువలన పంచీకరణకల్పన సర్వవేదాన్తులకును తుదకు గ్రాహ్యమై యున్నది. త్రివృత్కరణము మిగుల ప్రాచీన మైనను, మూఁటికి బదులుగ నైదింటి నంగీకరించినపిదప త్రివృత్కరణముయొక్క పద్ధతి ననుసరించియే పంచీకరణముయొక్క కల్పనయు వెలువడినది గావున త్రివృత్కరణము వెనుకఁబడినదని స్పష్టముగఁ గాన్పించుచున్నది. మానుషదేహము పంచమహాభూతములయందుండి పుట్టుటయే కాక, యీ పంచమహాభూతములలోఁ బ్రతిభూతము నయిదువిధములుగ, శరీరమునందు విభజింపఁబడి యున్నది. ఉదాహరణము:—త్వక్కు, మాంసము, అస్థి, మజ్జ, స్నాయువు నను నీయయిదు నన్నమయ మగుపృథ్వియొక్క వికారములె. ఇట్లు పంచీకరణ శబ్దముయొక్క యర్థము పిదప వృద్ధి నొందినది. (మ. భా. శాం. ౧౮౪. ౨౦. ౨౫; మహారాష్ట్రభాషయందున్నదాసబోధలో, ౧౭. ౮. చూడుడు) ఈకల్పనయుఁ బూర్వోక్తమగు ఛాందోగ్యోపనిషత్తునందలి త్రివృత్కరణముయొక్క వర్ణనపై స్ఫురించినదే యని కాన్పించుచున్నది. కారణ మేమన: అక్కడఁ గూడ, తేజస్సు, అప్తత్త్వము, పృథ్వి యనునితత్త్వము లొక్కొక్కటి మూఁడువిధములుగ మనుష్యదేహమునందు స్పష్ట మగుచున్న దని తుదకుఁ జెప్పఁబడినది.

మూలభూత మగునవ్యక్తప్రకృతియందుండియైన, వేదాన్తసిద్ధాన్తానుసారముగఁ బరబ్రహ్మయందుండియైన ననేక నామరూపముల ధరించినసృష్టియందచేతనము(అనఁగా: నిర్జీవములు, లేక, జడపదార్థములు) లెట్లు నిర్మింపఁబడె ననువిషయము వివేచింపఁబడెను. ప్రస్తుతము సృష్టియందలిసచేతనములయొక్క(అనఁగా: సజీవప్రాణులయొక్క)

యుత్పత్తివిషయములో సాంఖ్యశాస్త్రము చెప్పువిశేష మంతయు విచారించి,పిదప వేదాన్తశాస్త్రములో నున్నసిద్ధాన్తమునకును దానికిని నున్నసంబంధ మెంతవఱకని విచారించెదము. మూలప్రకృతివలన వెలువడినపృథివ్యాదిస్థూలపంచమహాభూతములకును, సూక్ష్మ మగునింద్రియములకును, సంయోగ మగు నేని, సజీవప్రాణుల దేహము సిద్ధ మగును; కాని యీశరీరము సేంద్రియ మైనను జడమే. ఈయింద్రియములను ప్రేరేపించుతత్త్వము జడప్రకృతికంటె భిన్న మయినందున దానిని పురుషుఁడని చెప్పుచున్నారు. ఈపురుషుఁడు తొలుత అకర్త యగుటచే, వానికిని బ్రకృతికిని సంయోగ మగు నేని సజీవసృష్టి యారంభ మగును. మఱియు "నేను వేఱు, ప్రకృతి వేఱు" అను జ్ఞానము కలిగినపిదపఁ బ్రకృతి పురుషుల కిదివఱకున్న సంయోగము నశించుటచే ముక్తి కలుగును. లేనియెడల జననమరణప్రవాహమునం దతఁడు పడవలసియె యుండు నను నీసాంఖ్యులసిద్ధాన్తము వెనుకటిప్రకరణమునఁ జెప్పఁబడి యున్నది; కాని 'పురుషుఁడు వేఱు-ప్రకృతి వే'ఱనుజ్ఞానము లేనందున మరణము నొందునాత్మకు (సాంఖ్యపరిభాషానుసారముగ పురుషునకు) ఈనవీనము లగుజన్మము లెటుల ప్రాప్తము లగునను వివేచన మింతవఱకుఁ జేయకపోవుటచే దాని విషయమై యిచ్చోఁ జక్కగా విచారించుట మిక్కిలి యావశ్యక మయి యున్నది. జ్ఞానములేక చచ్చినమనుజునియాత్మ ప్రకృతిచక్రములోనుండి ముక్తి నొందదనునంశము స్పష్టముగనే యున్నది. కారణ మేమి యన: అటులగు నేని, జ్ఞానమున కైనను, పాపపుణ్యముల కైనను గౌరవము లేమిచే, మరణానంతరమునఁ బ్రతివ్యక్తియు ప్రకృతియందుండి మోక్షమును బొందుచున్న దని చార్వాకుని వలెఁ జెప్పవలసివచ్చును. మంచిదే! మరణానంతరమునం దాత్మయే (పురుషుఁడే) మిగిలియుండుటచే తానే నూతనము లగుజన్మములను బొందుటకుఁ దగిన పని సలుపుచున్నాఁడని చెప్పితి మేని, పురుషుఁ డకర్తయె నుదాసీనుఁడును కాన, సర్వకర్తృత్వ మీమూలభూతసిద్ధాన్తమునకు బాధను కలిగించును. ఇంతియె కాక యాత్మ స్వయముగనే నూతనజన్మములను బొందు నని యంగీకరించితి మేని, యిది దానిధర్మ మగుటచే, జననమరణప్రవాహమునందుండి, యెప్పుడును ముక్తినొందుట సాధ్యము కాదని యనవస్థయుఁ బ్రాప్త మగును. కావున జ్ఞానములేకయే మనుజుఁడు మరణించినను, నూతనజన్మలను గలిగింపఁజేయుప్రకృతికిని పురుషునకును సంబంధ ముండవలయు ననియే సిద్ధ మగును. అయినను మరణానంతరమున స్థూలదేహమునకు నాశము గలుగుటచే నీసంబంధ మిప్పుడు స్థూలమహాభూతాత్మక ప్రకృతితో కానేర దని స్పష్ట మగుచున్నది; కాని ప్రకృతి యనఁగా నొకస్థూల

పంచమహాభూతములే యని యర్థము కానేరదు. ప్రకృతియందుండి మొత్తమున నిరువదిమూఁడుతత్త్వములు నిర్మితములగుచున్నవి. స్థూలమహాభూతములును నీయిరువదిమూఁటిలోను గడపటి యైదై యున్నవి. ఈకడపటి వైనయైదుతత్త్వములను (పంచమహాభూతములను) మొత్తమువీఁద నిరువదిమూఁడుతత్త్వములలో నుండి తీసివైచితి మేని మిగులునవి పదునెనిమిదితత్త్వములు. కావున జ్ఞానములేక మృతి నొందినమనుజుఁడు పంచమహాభూతాత్మకశరీరమునుండి (అనఁగా: కడపటియైదు తత్త్వములయందుండి) విముక్తుఁ డయినను ప్రకృతియొక్క యితరము లగుపదునెనిమిదితత్త్వములతో నున్నసంబంధమీమరణముచేఁ బోదని మొత్తముపై ఫలితార్థము తేలినది. మహత్తు (బుద్ధి) అహంకారము, మనస్సు, దశేంద్రియములు, పంచతన్మాత్రలు నను నివి పదునెనిమిదితత్త్వములు.(౨౪౭వ పుటలో బ్రహ్మాండము యొక్క వంశవృక్షమును చూడుము.)ఇవన్నియు సూక్ష్మములుగనే యున్నవి. కావున బురుషునకును, వీనికిని సంయోగము స్థిర మగుటచే, పుట్టినదేహమును స్థూలశరీరమునకు విరుద్ధ మగుసూక్ష్మశరీరము, లేక, లింగశరీర్రము అని చెప్పుచున్నారు. (సాం కా. ౪౦) ఒకానొకప్రాణి జ్ఞానవిహీనుఁడై మృతి నొందె నేని, మరణసమయమునందతనియాత్మతోనే ప్రకృతియొక్క పదునెనిమిదితత్త్వము లను నీలింగశరీరము స్థూలదేహమునుండి లేచి పోవును. జ్ఞానప్రాప్తి యగుపర్యంత మాపురుషుఁడు నూతనజన్మల నొందవలసివచ్చును. మనుష్యుఁడు మృతి నొందినపిదప జీవముతో జడదేహమునుండి బుద్ధి, యహంకారము, మనస్సు, దశేంద్రియములును, వాని వ్యాపారములును నష్టమగుట ప్రత్యక్షసిద్ధమే. కావున లింగశరీరమునందీపదమూఁడుతత్త్వములఁ జేర్చుట కేమియు నభ్యంతరము లేదు, కాని, "యీపదమూఁడు తత్త్వములతో, పంచసూక్ష్మతన్మాత్రలను లింగశరీరములోఁ జేర్చుట కేమియు గారణము కాన్పింపదు"అని దీనిపై ననేకులు శంకఁ జేయుదురు. "మహత్తు,అహంకారము, మనస్సు, దశేంద్రియములు నను నీపదుమూఁడుతత్త్వములే ప్రకృతి యొక్క గుణములు. నీడకు పదార్థముయొక్కయు, చిత్రరువునకు గోడ, లేక, కాగితముయొక్కయు నాశ్రయము లెటు లవసరములో యటులే యీగుణాత్మకము లగు పదుమూఁడుతత్త్వములఁ నొకచోట నుండుట కేదైన నొకయాధారము కావలయు" నని సాంఖ్యులు దీనికి నుత్తరమును వచించెదరు. వీనిలో నాత్మ (పురుషుఁడు)స్వయముగ నిర్గుణుఁడు,నకర్తయునగుటచే స్వయముగనే గుణముల కాధారము కానేరఁడు. మనుజుఁడు జీవించి యున్నప్పు డతనిదేహమునందున్నస్థూలపంచమహాభూతములె యీపదుమూఁడుతత్త్వములకు నాశ్రయ మగుచున్నవి కాని మరణానంతరమున

(స్థూలదేహనాశానంతరమున) స్థూలపంచమహాభూతములకు నీయాశ్రయ ముండ నేరదు. అప్పుడీగుణాత్మకము లగుతత్త్వములకు నేదయిన, మఱియొకద్రవ్యాత్మక మాశ్రయముగ నుండవలయును. మూలప్రకృతి యాశ్రయ మంటిమేని యది యవ్యక్తము,అవికృతము నగుస్థితిలోనుండుటచే (అనఁగా: అనంతము, సర్వవ్యాపక మనగుటచే) నొకచిన్నలింగశరీరమున బుద్ధ్యాదిగుణములకు నాధారము కానేరదు. కావున మూలప్రకృతియొక్క ద్రవ్యాత్మకవికారములలోనే, స్థూలమహాపంచభూతములకు మాఱుగ వానికి మూలభూతము లగుపంచసూక్ష్మతన్మాత్రద్రవ్యములను, పూర్వోక్తములగుగుణములకువలెనే యాశ్రయము లనుతలంపున, లింగశరీరము నందు సమావేశము చేయనలసివచ్చును. (సాం. కా.౪౧) అనేకులు సాంఖ్యగ్రంథకారులు లింగశరీరమునకును స్థూలశరీరమునకును నడుమఁ బంచతన్మాత్రవికార మగు మూఁడవశరీరమును గల్పించి యది లింగశరీరమున కాశ్రయ మని ప్రతిపాదించుచున్నారు. కాని, సాంఖ్యకారికల యందున్న నలుబదియొకటవయార్యావృత్తమునకు సత్య మగునర్థ మటుల కానేరదు. కావున, టీకాకారులు భ్రాంతిచే మూఁడవశరీరమును గల్పించి రని మాయభిప్రాయము. ఏలన: ఈ యార్యావృత్తమునకు బుద్ధి మొదలుగాఁగలపదుమూఁడుతత్త్వములవలెఁ బంచతన్మాత్రలను లింగశరీరమునందుఁ జేర్చుటకుఁ గారణమును దెలుపుటఁ దప్ప మఱియొకయుద్దేశ మేమియు లేదని మా యూహ. *

---

* భట్టకుమారిలునిచే రచియింపఁబడిన 'మీమాంసాశ్లోకవార్తిక' మను గ్రంథములో నున్నయీశ్లోకములో (ఆత్మవాద. శ్లో. ౬౨)వారును మేము చెప్పినటులనే యీయార్య కర్థము వ్రాసినటుల కాన్పించుచున్నది.

"అంతరాభవదేహో హి నేష్యతే వింధ్యవాసినా
తదస్తిత్వే ప్రమాణం వా న కించి దవగమ్యతే."

అంతరాభవ, అనఁగా లింగశరీరమునకును స్థూలశరీరమునకును మధ్యనున్న, దేహము, లేక, శరీరము వింధ్యవాసికి సమ్మతము కాదు. ఇట్టిదేహ మున్న దని వచించుటకుఁ బ్రమాణము లేదు. ఈశ్వరకృష్ణుఁడు వింధ్యపర్వతమున నివసించుఁ గాన నతనికి వింధ్యవాసి యని పేరు.అంతరాభవశరీరమునకు గంధర్వ మనియు మఱియొక నామము గలదు. అమరకోశమున ౩. ౩. ౧౩౨ వ శ్లోకమును, దానిపై. రా. రా. 'కృష్ణజీగోవిందజీ'అనువానిచే ప్రచురింపఁబడిన'క్షీరస్వామియొక్క టీక'యను నీ గ్రంథముయొక్క ప్రస్తావనలోనియొనిమిదియవపుటను జూడుము.

శబ్దములచే రచింపఁబడినటుల కాన్పించుచున్నది.* భగవద్గీతలయందు—"మనష్షష్ఠానీంద్రియాణి" "మనస్సు పంచజ్ఞానేంద్రియములు ననునవియే సూక్ష్మశరీర మగును" (౧౫. ౭) అని చెప్పినపిదప "వాయుర్గంధా నివాశయాత్" "వాయు వెటుల పుష్పములలోని సుగంధమును హరించునో యటులే జీవము స్థూలశరీరమును వదలిపెట్టినను నీలింగశరీరమును దనతోఁ దీసికొని వెళ్లును" (౧౫. ౮) అని చెప్పఁబడియున్నది. అయినను గీతలలో నున్నయధ్యాత్మజ్ఞాన ముపనిషత్తులయందుండియే వెలువడిన దగుటచే నీశబ్దమునందే మనస్సుతోఁగూడ జ్ఞానేంద్రియములును, అయిదు కర్మేంద్రియములును, పంచతన్మాత్రలును, ప్రాణమును, పుణ్యపాపములును అను వీనియొక్క సంగ్రహము భగవంతున కిష్టమైన దని చెప్పవలయును. మనుజుఁడు మృతిఁ జెందె నేని యీజన్మయందలి పుణ్యపాపముల ఫలమును భోగించుటకొఱకుఁ పంచతన్మాత్రరూప మగుసూక్ష్మశరీరము ప్రాప్త మగు నని మనుస్మృతియందును చెప్పఁబడినది (మను. ౧౨. ౧౬-౧౭). "వాయుర్గంధా నివాశయాత్" అని గీతలలో నున్నదృష్టాంతమునందుబడి, యీశరీరము సూక్ష్మముగనున్నదని మాత్ర

* ముప్పదిరెండుపనిషత్తులు గలయానందాశ్రమప్రతియందు మైత్ర్యుపనిషత్తునందలి పైమంత్రమునకు "మహదాద్యం విశేషాంతం" అను పాఠము వ్రాయఁబడినది. దానినే టీకాకారులును స్వీకరించిరి. ఈపాఠమును స్వీకరించితి మేని యారంభమున నున్నమహత్తత్త్వమును లింగశరీరమునఁ జేర్చి 'విశేషాంతం' అను పదముతో సూచింపఁబడినవిశేషమును (అనఁగా: పంచమహాభూతములను) వదలవలసివచ్చును. అనఁగా: 'మహదాద్యం' అనుదానిలో మహత్తును స్వీకరించి, 'విశేషాంత' మనుదానిలో విశేషములను వదలవలయునని యర్థము చేయవలసివచ్చును. కాని యాద్యంతములు చెప్పఁబడినపుడు రెంటిని గ్రహించుట గాని, రెంటిని వదలివేయుటగాని యుక్త మగును. కావున 'మహదాద్యం' అనుపదములో చివర నున్న యనుస్వారమును తీసివైచి "మహదాద్యవిశేషాన్తం" (మహదాది + అవిశేషాన్తం) అని పాఠము గ్రహింపవలయు నని ప్రొఫెసర్ 'డాయసన్' అను నతఁడు చెప్పెను. ఇట్లు చేయుదు మేని, 'అవిశేషం' అని పదచ్ఛేదముఁ జేసి మహత్తునకు నవిశేషమునకు (అనగా: ఆద్యంతముల రెంటికిని) ఏక న్యాయమే సంబంధించియుండుటచే రెంటికిని లింగశరీరమునందు సమావేశము కాఁగలదు. ఇదియే యీపాఠమునందలి విశేషగుణము. కాని యీపాఠమును గ్రహించిన నర్థమునందు భేదమేమియు నుండ దని గుర్తించుకొనవలయును.

మే సిద్ధ మగును. దానియొక్క యాకార మెంతో తెలియరాదు; కాని మహా భారతమునందున్న సావిత్ర్యుపాఖ్యానములో (మ. భా. వన. ౨౯౬. ౧౬) సత్య వంతునిస్థూల మగుశరీరమందుండి యంగుష్ఠమాత్ర పురుషుఁడు యమునిచే వెలి కీడ్వఁబడె నని యున్నది,—"అంగుష్ఠమాత్రం పురుషం నిశ్చకర్ష యమో బలాత్."—ఈ వర్ణనవలన నీలింగశరీరము దృష్టాంతమున కైన నంగుష్ఠ మంతయాకారము గల దని యంగీకరించినటుల కాన్పించుచున్నది.

లింగశరీరము మనచర్మచక్షుస్సులకుఁ గాన్పింపక పోయినను నది యుండునట్లు యనుమానముచే సిద్ధ మైనదియు, ఆశరీరమునకు ఘటకావయవములు లేవనియు విచారించితిమి కాని, ప్రకృతిని పంచస్థూలమహాభూతములను వదలి శేషించినపదునెనిమిదితత్త్వములయొక్క సముచ్చయముచే లింగశరీరము నిర్మిత మగు నని చెప్పుటచే సర్వవిధములగు సంశయములు తీరవు. లింగశరీర మున్నస్థలములయందెల్ల నీపదునెనిమిదితత్త్వముల సముచ్చయమును, స్వస్వగుణధర్మానుసారముగ, మాతాపితలస్థూలదేహమునందుండి కాని, పిదప స్థూలసృష్టియందున్న యన్నమునందుండి కాని, హస్తపాదాదిస్థూలావయవములను, లేక, స్థూలేంద్రియములను పుట్టించి వాని పోషించువిషయమునం దేమియు సంశయము లేదు; కాని పదునెనిమిదితత్త్వములసముచ్చయముచేఁ గలిగినలింగశరీరము, పశువులు, పక్షులు, మనుజాలు నను వేర్వేఱుదేహముల నేల పుట్టించునదియు నిప్పటికిని జెప్పవలసియే యున్నది. సజీవసృష్టియందున్న సచేతనతత్త్వములను, సాంఖ్యులు పురుషుఁ డని చెప్పుచున్నారు; సాంఖ్యమతమునం దీపురుషు లసంఖ్యు లయినను, ప్రతిపురుషుఁడును స్వభావముగ నుదాసీనుఁడు నకర్తయు నగుటచేఁ బశుపక్ష్యాదిప్రాణులప్రత్యేక దేహములను నిర్మించుటయందుఁ గర్తృత్వము పురుషునివైపునకు రానేరదు. వేదాన్తసూత్రమునందుఁ బాపపుణ్యాదికర్మల పరిణామముచే నీభేద ముత్పన్నమగు నని యున్నది. ఈకర్మవిపాకవివేచన పిదపఁ జేసెదము. సాంఖ్యశాస్త్రానుసారముగఁ గర్మ యనునది ప్రకృతిపురుషులకంటె భిన్న మగుమూఁడవతత్త్వ మనుటకు వీల్లులేదు. పురుషుఁ డుదాసీనుఁడుగ నున్నాఁడు. కావుననే కర్మ యనునది ప్రకృతిసంబంధములగు సత్త్వరజస్తమోగుణములవికారమే యై యున్న దనవలసివచ్చును. లింగశరీరములో నున్నపదునెనిమిదితత్త్వముల సముచ్చయములో బుద్ధి యనునది ముఖ్య మైనది. కారణ మేమి యన—బుద్ధియందుండియే యహంకారము మొదలగు పదునేడుతత్త్వము లుత్పన్నము లగును. వేదాన్తములో

గర్మ యని చెప్పఁబడుదానినె సాంఖ్యశాస్త్రములో సత్త్వరజస్తమస్సులను మూఁడుగుణముల హెచ్చుతగ్గులచేఁ గలుగుబుద్ధియొక్క వ్యాపార మని యైనను, ధర్మ మని యైనను, వికారమని యైన నందురు. బుద్ధియొక్క యీధర్మములకు 'భావము' లని పేరు గలదు. ఈసత్త్వరజస్తమోగుణముల తారతమ్యముచే నీభావ మనేకవిధములుగ నున్నది. పుష్పములకు వాసనవలె, వస్త్రములకు రంగువలె, లింగశరీరమునకు నీభావము లంటుకొని యుండును. (సాం. కా. ౪౦) ఈభావములవలెఁ గాని, వేదాన్తులపరిభాషయందలికర్మవలెఁగాని, లింగశరీరముసైతము నూతనముగ జన్మింపవలసి వచ్చును. ఒకజన్మ మెత్తుచు మాతాపితలశరీరమునందుండి యేద్రవ్యమును లింగశరీర మాకర్షించుకొనుచున్నదో యాద్రవ్యములయందుసైతము పరల నితరములగుభావములు వచ్చుచున్నవి. దేవయోని, మనుష్యయోని, పశుయోని, వృక్షయోని యనుభేదము లీభావసంబంధ మగుసముచ్చయముయొక్క పరిణామము లగుచున్నవి. (సాం. కా. ౪౩. ౫౫) ఈసర్వభావములలో సాత్త్వికగుణములు వృద్ధి చెందిన మనుజునకు జ్ఞానవైరాగ్యములు ప్రాప్తము లగును. వానిమూలమున ప్రకృతి పురుషులభేదము తెలియును. అప్పుడు పురుషుఁడు మూలభూతమగుకైవల్యమును బొందును. మఱియు లింగశరీరము వదలి పోయె నేని, యతనిదుఃఖ మత్యంతము నివర్తించును. కాని యీప్రకృతిపురుషభేద మెఱుంగక సాత్త్వికగుణమే యుత్కర్షము నొందె నేని లింగశరీరము దేవయోనియందు (అనఁగా: స్వర్గమునందు) జన్మము నొందును. రజోగుణము ప్రబల మగు నేని మనుష్యయోనియందు (అనఁగా: పృథ్వియందు) జనించును. తమోగుణాధిక్య మగు నేని తిర్యగ్యోనియందుఁ బుట్టవలసివచ్చును (గీ. ౧౪. ౧౮). ఈతీరున మానవయోనిలో జన్మించినపిదప, రేతోబిందువునందుండి, క్రమముగ కలలము (మావి), బుద్బుదము, మాంసము, పేశి (గ్రుడ్డు), పిమ్మట వేర్వేఱగుస్థూలేంద్రియము లెటులు పుట్టు ననువిషయము "గుణా గుణేషు జాయన్తే" అనుసిద్ధాన్తము నవలంబించియే సాంఖ్యశాస్త్రములోఁ జెప్పఁబడినది. (సాం. కా. ౪౩; మ. భా. శాం. ౩౨౦). గర్భోపనిషత్తులోను దఱుచుగ నిటులే చెప్పఁబడినది. సాంఖ్యశాస్త్రమునందలి 'భావ' శబ్దమునకుఁ బూర్వోక్త మగుపారిభాషికార్థము, వేదాన్తగ్రంథములలో నుద్దేశింపఁబడకపోయినను భగవద్గీతలలో "బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః" ఇత్యాదిగుణములను దీని పిదప నుండుశ్లోకమునందు భగవంతుఁడు 'భావము'లని పేర్కొనెను. (గీ. ౧౦. ౪-౫; ౭. ౧౨) అది తఱుచుగ సాంఖ్యశాస్త్రముయొక్క పరిభాషను మనంబున

నిడుకొనియే చెప్పఁబడియుండు నని పూర్వోక్తమగువివేచనవలనఁ దెలియును. ఈ తీరున సాంఖ్యశాస్త్రానుసారముగ మూలము, నవ్యక్తము నగుప్రకృతియందుండి యైన, లేక, వేదాన్తానుసారముగ మూలము, సద్రూపము నగుపరబ్రహ్మమందుండి యైన, సృష్టియం దున్నసర్వసజీవపదార్థములును, నిర్జీవము లగువ్యక్తపదార్థములును, క్రమముగ నిర్మితము లయినపిదప, సృష్టియొక్క సంహారసమయము వచ్చినప్పుడు, పూర్వోక్త మగుసృష్టియొక్క గుణపరిణామక్రమమునకువిపరీతక్రమముగనె, సర్వవ్యక్తపదార్థములు నవ్యక్తప్రకృతియం దైనను, లేక, మూలభూత మగు బ్రహ్మమం దైనను లయమగుచున్నవని, సాంఖ్యవేదాన్తోభయశాస్త్రములయొక్క సిద్ధాన్తము. (వే. సూ. ౨. ౩-౧౪; మ. భా. శాం. ౨౩౨) ఉదాహరణము:— పంచమహాభూతములలో పృథ్వి జములలోను, జల మగ్నిలో, నగ్ని వాయువులో, వాయువాకాశములో, నాకాశము తన్మాత్రలలో, తన్మాత్ర లహంకారమునందు, నహంకారము బుద్ధి (మహత్తు) యందు, బుద్ధి, లేక, మహత్తు ప్రకృతియందు, వేదాన్తానుసారముగఁ బ్రకృతి మూలబ్రహ్మమందును లయము నొందుచున్నవి. సృష్టి ప్రారంభమయినపిదప లయ మగుటకు నెంతకాల మగు ననునది యొక్కడను సాంఖ్యకారికలలోఁ జెప్పఁబడలేదు. అయినను మనుసంహితయందును (౧. ౬౬-౭౩), భగవద్గీతలందును (౮. ౧౭), మహాభారతమునందును (శాం. ౨౩౧) చెప్పఁబడినకాలగణన సాంఖ్యులకు సైతము మాన్యము కాకపోదు. మనయుత్తరాయణము దేవతలకుఁ బగలు, మనదక్షిణాయనము దేవతలకు రాత్రియు నగును; కారణ మేమి యన: సూర్యుఁడు మేరుపర్వతమునందు (అనఁగా: ఉత్తరధ్రువస్థానమునందు) నుండు నని స్మృతిగ్రంథములందే కాక, జ్యోతిశ్శాస్త్రముయొక్క సంహితయందును వర్ణింపఁబడినది. (సూర్యసిద్ధాన్తము ౧. ౧౩; ౧౨. ౩౫-౬౭) అనఁగా: రెం డయనములు గలసి మనకు నొకయేఁ డగునేని దేవతలకు నొకయహోరాత్రమును, మఱియు మనకు ౩౬౦ సంవత్సరము లగునేని దేవతలకు ౩౬౦ యహోరాత్రములును, లేక, యొకవత్సరము నగును. కృత, త్రేతా, ద్వాపర, కలి యుగములని నాలుగుయుగము లున్నవి. కృతయుగమునకు నాలుగువేల వత్సరములును, త్రేతాయుగమునకు మూఁడువేలవత్సరములును, ద్వాపరమునకు రెండువేల వత్సరములును, కలియుగమున కొకవేయివత్సరములచొప్పున నీయుగములు కల్పింపఁబడినవి. కాని యొకయుగము సమాప్తి నొందినవెంటనె రెండవయుగము ప్రారంభము కామిచే, రెంటిమధ్యను సంధికాలముగ కొన్నివత్సరంబులు నడచుచున్నవి. కృత

యుగముయొక్క యాద్యంతసంధికాలములో నొక్కొకదానికి నన్నూరువత్సరము లును, త్రేతాయుగముయొక్క సంధులలో నొక్కొకదానికి మున్నూరువత్సరము లును, ద్వాపరముయొక్క యాద్యంతసంధులలో నొక్కొకదానికి ఇన్నూరువత్స రములును, కలియుగసంధికాలములో నొక్కొక్కదానికి నూరువత్సరములును గలిసి వేయివత్సరములు కావున నాలుగుయుగముల సంధిద్వయమునకు మొత్తముపై రెండు వేలవత్సరములు సంధికాల మగును. ఈరెండు వేలవత్సరములును, కృతయుగ, త్రేతా యుగ, ద్వాపరయుగ, కలియుగములకు మొదట వ్రాయఁబడినసంఖ్య వనుసరించి పదివేలసంవత్సరములును, కలిసి మొత్తముపై నాలుగుయుగములకున్న పండ్రెండు వేలవత్సరములును మనుష్యమానములా? దేవమానములా?. మానుష్యములే యందు మేని కలియుగ మారంభమై యిప్పటి కైదువేలవత్సరము లగుటచే, వేయిమానవ సంవత్సరములు గలిగినకలియుగము సమాప్తిఁబొందుటయుగాక దానిపిదప రాఁ బోవు కృతయుగముసైతము సమాప్తమగుటచే మన మిప్పుడు త్రేతాయుగమున నున్నా మని చెప్పవలసివచ్చును. ఈవిరోధపరిహారార్థమై యీపండ్రెండువేలవత్స రములును దేవమానముచే గణనయని పురాణములయందు నిశ్చయింపఁబడినది. దేవతల పండ్రెండువేలవత్సరంబులందుమేని మనుష్యులకు ౩౬౦ × ౧౨౦౦౦=౪౩, ౨౦,౦౦౦ నలువదిమూఁడులక్షల యిరువది వేలవత్సరము లగును. ఇప్పటికి పంచాం గమునందున్న యుగపరిమాణ మీపద్ధతి ననుసరించియె యున్నది.(దేవతలయొక్క) యీపండ్రెండువేలయేండ్లనఁగా: మనుష్యులకు మహాయుగము, లేక, దేవతల యుగ మగును. దేవతల డెబ్బదియొక్కయుగములకు మన్వంతర మని పేరు. పదు నాలుగుమన్వంతరములు కలవు. మొదటిమన్వంతరముయొక్క ప్రారంభమునందు ను, చివరయందును, మఱియు, తర్వాత నుండు ప్రతిమన్వంతరముయొక్క అంత మున నుండునాద్యంతకాలముతోఁజేరి యొక్కొక్కటి కృతయుగమంత ప్రమా ణము గలపదునైదుసంధికాలము లగుచున్నవి. ఈ పదునైదుసంధికాలములును, పదునాలుగుమన్వంతరములును కలిసి,దేవతలకు నొకవేయియుగములు, లేక, బ్రహ్మ దేవునకు నొకదివస మగును. (సూర్యసిద్ధాంతము. ౧. ౧౫-౨౦) తిరుగ నిట్టివేయి యుగము లగునేని బ్రహ్మదేవునకు నొకరాత్రి యగునని మనుస్మృతియందును, మహాభారతమునందు నున్నది. (మను. ౧. ౬౮-౭౩; మఱియు, ౭౯; మ.భా.శాం. ౨౩౧. ౧౮-౩౧; మఱియు యాస్కునియొక్క నిరుక్తము. ౧౪. ౯ చూఁడు) ఈ గణనానుసారముగ బ్రహ్మదేవున కొకపగలనఁగా; మనుష్యునకు నాలుగుపద్మముల

ముప్పదిరెండుకోట్ల సంవత్సరము లగును. దీనికే కల్పమని పేరు * బ్రహ్మదేవుని యీదివసము, లేక, కల్పము, ఆరంభ మగునేని—

"అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రై వావ్యక్తసంజ్ఞకే." (గీ. ౮.౧౮)

"అవ్యక్తమునందుండి సృష్టియందున్న సర్వవ్యక్తపదార్థములు పుట్టుచున్నవి; మఱియు బ్రహ్మదేవునకు రాత్రి యారంభ మగునేని యీసర్వవ్యక్తపదార్థములును మరల నవ్యక్తములో లయము నొందుచున్నవి." అని భగవద్గీతలయందును (మఱియు, గీత.౯.౭ చూడుము) స్మృతిగ్రంథములందును మహాభారతమునందును నితరగ్రంథములందును చెప్పఁబడినది. ఇంతియకాక ప్రలయము పురాణాదికముల యందు మఱియొకవిధముగను నిరూపింపఁబడియున్నది; కాని సూర్యచంద్రాదిక మగు సకలసృష్టియు నప్పుడు (ఈప్రలయమునందు) నష్టముకానేరదు. గావున నీ ప్రలయమును, బ్రహ్మాండముయొక్క 'యుత్పత్తిలయములతోఁ బోల్చినపుడు, గణనకు రానవశ్యము లేనిదియగును. అనఁగా: లెక్కలోనే యుంచరు. కల్పమనఁగా: బ్రహ్మదేవున కొకపగలు గాని, రేయి గాని యగును. ఇట్టివి ౩౬౦ పగళ్లును, ౩౬౦ రాత్రులును నగునేని, అతనికి నొకవత్సర మగును. కావుననే బ్రహ్మదేవునియొక్క యాయుష్యము బ్రహ్మమానానుసారముగ నూఱువత్సరములే యని కల్పించుటచే వానిలో సగ మాయుష్యము చని రెండవసగముయొక్క (అనఁగా: ఏఁబదియొకటవ సంవత్సరముయొక్క) మొదటిదివసము, లేక, శ్వేతవరాహ మను పేరు గలకల్ప మిప్పు డారంభమాయెను; ఈకల్పముయొక్క పదునాలుగుమన్వంతరములలో నాఱు మన్వంతరములు గడచి యేడవమన్వంతరముయొక్క (అనఁగా: వైవస్వతమన్వంతరముయొక్క) డెబ్బదియొక్క మహాయుగములలో నిరువదియేడుమహాయుగములు గడచినవి. ఇరువదియెనిమిదవమహాయుగమునందున్న కలియుగముయొక్క ప్రథమ పాదము (అనఁగా: చతుర్థభాగము) ప్రకృతము జరుగుచున్న దని పురాణాదిగ్రంథములలోనున్నది. (విష్ణుపురాణము ౧.౩. చూడుఁడు) శక॥ ౧౮౨౧-వ సంవత్సరమునకు నీ కలియుగముయొక్క ౫౦౦౦ యేండ్లు గడచినవి. ఇట్లు లెక్కింతు మేని కలియుగమునందు ప్రలయ మగుటకు, శక॥ ౧౮౨౧-వ సంవత్సరమునకు మనుష్యమానప్రకార

* జ్యోతిశ్శాస్త్రానుసారముగ యుగాదిగణనయొక్క విచారమునకై శంకర బాలకృష్ణదీక్షితునిచే, తన 'భారతీయజ్యోతిశ్శాస్త్ర' మను పేరు గల గ్రంథమున పలుమాఱు నిరూపింపఁబడినది. (చూడుము. పు. ౧౦౩-౧౦౫; ౧౯౩ మొదలగునవి.)

ముగ ౩,౯౧,౦౦౦ వత్సరములు మిగులు నని కాన్పించుచున్నది; ప్రస్తుతమన్వంతరప్రతుదను గాని, లేక, వర్తమానకల్పాంతమునఁ గాని, కాఁబోవుప్రళయముప్రసంగము దూరముగనే యున్నది. మనుష్యమానము ప్రకారము నాలుఁగుపద్మముల మున్నూట రెండుకోట్లవత్సరంబులకు బ్రహ్మదేవునకు ప్రకృతము నడుచుచున్న యీదినముయొక్క పూర్ణమధ్యాహ్నము (అనఁగా: ఏడవమన్వంతరము) ఇంకను ముగియలేదు.

ఇంతదనుక చేయఁబడినసృష్టిప్రళయములయొక్క విచారము, పరబ్రహ్మవలన జగత్తు పుట్టిన దనునొక్కవిషయమును వదలి వేదాంతశాస్త్రమునందును, సాంఖ్యశాస్త్రమునందును నుండుతత్త్వజ్ఞానము నవలంబించి యుండుటచే సృష్ట్యుత్పత్తిక్రమముయొక్క యీపరంపరనే మనశాస్త్రకారు లెప్పుడును ప్రమాణ మని నమ్ముదురు. భగవద్గీతలందు నిటులే నుడువఁబడినది. శ్రుతి, స్మృతి, పురాణములలోఁ గొన్నిస్థలములయందుఁ దొలుత బ్రహ్మదేవుఁడు, లేక, హిరణ్యగర్భుఁడు, జన్మించినాఁ డనియు, లేక, యుదకము నుత్పన్న మగుటచే దానియందు పరమేశ్వరునిబీజమువల్ల నొకసువర్ణమయమగునండము వెలువడిన దనియు మొదలగుసృష్ట్యుత్పత్తిక్రమముయొక్క మఱియొకకల్పన స్పష్టముగఁ గాన్పించుచున్నదని యీప్రకరణారంభమున చెప్పఁబడియేయున్నది; కాని యీసర్వకల్పనలు గౌణము లని కాని, లేక, యుపలక్షణాత్మకములని కాని యెఱింగి వాని కుపపత్తిఁ జూపు ప్రసంగము వచ్చినప్పుడు, హిరణ్యగర్భుఁడు, లేక, బ్రహ్మదేవుఁడు ప్రకృతియే యగునని చెప్పవలసివచ్చును. భగవద్గీతలయందును—"మమ యోనిర్మహద్బ్రహ్మ" (గీ. ౧౪. ౩) "త్రిగుణాత్మకప్రకృతికి బ్రహ్మ యని పేరు గాన తనబీజమునుండి యీప్రకృతియందు త్రిగుణములచే ననేకమూర్తు లుత్పన్నములగు" నని భగవంతుని చేఁ జెప్పఁబడినది. బ్రహ్మదేవునివలన నారంభమున దక్షాదిసప్తమానసపుత్త్రులును సప్తమనువులు నుత్పన్ను లయిరి. వారిచేఁ బిదపఁ జరాచరసృష్టి నిర్మింపఁబడినది (మ. భా. ఆ. ౬౫-౬౬; మ. భా. శాం. ౨౦౭; మను. ౧. ౩౪-౬౩). మఱియు నేది యొకపర్యాయము గీతలలోఁ జెప్పఁబడినదో (గీ. ౧౦. ౬) అదియంతయు బ్రహ్మదేవుఁడు, అనగా ప్రకృతి యనియర్థము కావున, పూర్వోక్త మగుసాత్త్విక సృష్టియొక్క యుత్పత్తిక్రమమునకు సంబంధించియే యున్న దని వేదాంతగ్రంథములలో నిరూపింపఁబడినది. ఇటులే యితరస్థలములందు నెఱుంగవలయును. ఉదాహరణము:—శైవములు, లేక, పాశుపతములు నగుదర్శనములందు శివుఁడు నిమిత్తకారణ మని యుండుటచే నతనియందుండి, కార్యము, కారణము మొదలుగఁ

గలిగినయయిదుపదార్థము లుత్పన్నములయిన వని తలఁచుచున్నారు. మఱియు నారాయణీయములు, లేక, భాగవతధర్మములందు వాసుదేవుఁడు ప్రధానుఁ డని యనుకొనుటచే వాసుదేవునియందుండి తొలుత సంకర్షణుఁడు (జీవుఁడు), సంక ర్షనియందుండి ప్రద్యుమ్నుఁడు (మనస్సు), ప్రద్యుమ్నునియందుండి యనిరుద్ధుఁడు (అహంకారము), ఉత్పన్నము లయి రని చెప్పఁబడినది; కాని వేదాన్తశాస్త్రాను సారముగ జీవుఁ డనునతఁడు ప్రతిసమయమునందును నూతనముగఁ బుట్టువాఁడు కానేరఁడు. అతఁడు నిత్యుఁడు, సనాతనుఁడు నగుపరమేశ్వరునినిత్యమగు— కావుననే యనాది యగు—నంశమైనవాఁడు కాన, వేదాన్తసూత్రములయందలి రెండవయధ్యాయముయొక్క రెండవపాదములో (వే. సూ. ౨. ౨. ౪౨-౪౫) భాగవతధర్మములందున్న జీవునియుత్పత్తివిషయమున, పూర్వోక్తమతమును ఖండించి యీమతము వేదవిరుద్ధము గనుకనే త్యాజ్య మని చెప్పఁబడినది; మఱియు వేదాన్త సూత్రములలో నున్న యీసిద్ధాన్తము గీతలలో ననువాదము చేయఁబడినది (గీ.౧౩.౪;౧౫.౭). అటులే సాంఖ్యులు ప్రకృతిపురుషు లనురెండుస్వతంత్రతత్త్వ ముల నంగీకరించు చున్నారు; కాని, యీద్వైతము గాక ప్రకృతిపురుషు లను రెండుతత్త్వములును, నిత్యుఁడు నిర్గుణుఁడు నగుపరమాత్మయొక్క విభూతులే యని వేదాన్తములయొక్క సిద్ధాన్త మగుటచే నది భగవద్గీతలయందును గ్రాహ్యమై యున్నది (గీ. ౯. ౧౦); కాని యీవిషయమై యధికవివేచన ముందు ప్రకరణము లోఁ జేయఁబడును. భాగవతధర్మములు, లేక, నారాయణీయధర్మములయందున్న వాసుదేవభక్తియు, ప్రవృత్తిపరధర్మములయొక్క తత్త్వమును భగవద్గీతలకు మా న్యములయినను, "వాసుదేవునియందుండి తొలుత సంకర్షణుఁడు, లేక, జీవుఁ డుత్పన్నుఁ డాయెను. వానియందుండి పిదప ప్రద్యుమ్నుఁడు (మనస్సు), ప్రద్యు మ్నునియందుండి యనిరుద్ధుఁడు (అహంకారము) వెలువడె" ననెడి భాగవతధర్మ ములయందలి యీకల్పన గీతలకు సమ్మతము కానందున, సంకర్షణుఁడు, ప్రద్యుమ్నుఁ డు, అనిరుద్ధుఁడు ననువారినామము లైనను గీతలలో నెచ్చోట లేవనిమాత్రమే ప్రస్తు తము చెప్పఁదగినది. పాంచరాత్రాగమములోఁ జెప్పఁబడినభాగవతధర్మములకంటె గీతలలోనున్న భాగవతధర్మముల కిదియే మహత్త్వము. భగవద్గీతలయందు భాగవత ధర్మములు చెప్పఁబడినంతమాత్రముచే సృష్ట్యుత్పత్తులయొక్క క్రమవిషయమైనను జీవ-పరమేశ్వర-స్వరూపముల విషయమైనను, భాగవతాదిభక్తిసంప్రదాయమ

లందున్న మతములు సైతము గీతలకు మాన్యములుగ నుండవలయు నని ప్రమాదముఁ జెందఁగూడదు. కావున నీవిషయము ముఖ్యముగ వ్రాయఁబడినది. సర్వావ్యక్తా వ్యక్తస్వరూపము, లేక, క్షరాక్షరరూపము, అగుజగత్తునకు, సాంఖ్యశాస్త్రోక్త లగుప్రకృతి-పురుషు లను నీరెంటికంటె పరమును, మూలము నగుమఱియొకతత్త్వ మేది యైన నున్నదా? లేదా? యని విచారించెదము. దీనికె యధ్యాత్మ మనియు లేక, వేదాన్త మనియు పేరు.

ఇది విశ్వముయొక్క సృష్టిసంహారము లను అష్టమప్రకరణము.



# నవమప్రకరణము.

౧

## అధ్యాత్మము.

"పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః,
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి." *

గీతా. ౮. ౨౦.

క్షేత్రక్షేత్రజ్ఞవిచారములో క్షేత్రజ్ఞుఁ డని చెప్పఁబడువాఁడె సాంఖ్య శాస్త్రమునఁ బురుషుఁ డని చెప్పఁబడును. కావున సమస్తక్షరాక్షర (చరాచర) సృష్టియొక్క యుత్పత్తిసంహారములను విచారించినచో సాంఖ్యమతానుసారముగఁ దుదకుఁ బ్రకృతిపురుషు లనునీరెండుతత్త్వములె స్వతంత్రములు, ననాదులు నగు మూలతత్త్వములుగ సిద్ధము లైనవి. పురుషుఁ డెడతెగని తనదుఃఖముల నన్నింటిఁ బోఁగొట్టుకొని, మోక్షము నొందుటకుఁ బ్రకృతికంటెఁ దననున్న భేదమును (కైవల్యమును) తెలిసికొని, త్రిగుణాతీతుఁడు కావలయు.ననువిషయము పూర్వోక్తము లగురెండుప్రకరణములకును ఫలితార్థము. ప్రకృతిపురుషులకు సంయోగ మైన పిదప ప్రకృతి, పురుషునియెదుట తననాట్యము నెటుల ప్రదర్శించుచున్న దను విషయములో సాంఖ్యులపద్ధతికంటె నర్వాచీన (నవీన) సృష్టివేత్తలు కొంచెము వేఱుగఁ జెప్పుచున్నారు. ఆధిభౌతికశాస్త్ర మెట్లంతకంతకు వృద్ధిఁ బొందుచుం డునో యటులె యీపద్ధతియం దింకను గొప్పమార్పులు గలుగ వచ్చును ; కాని యొకయవ్యక్త మగుప్రకృతినుండియే సర్వవ్యక్తపదార్థములును సత్త్వరజస్తమో గుణముల హెచ్చుతగ్గులచె నిర్మితము లయిన వనునాటసిద్ధాంతమును మార్చుట సాధ్యము కానేరదు. అయిన నీవిషయము శాస్త్రాంతరమునకు సంబంధించినది గాని వేదాంతశాస్త్రమునకు సంబంధించినది కా దని యోజించి మన మీవిషయము

---

* ఆ (సాంఖ్యులయొక్క) యవ్యక్తముకంటె శ్రేష్ఠమును సనాతనము నగు మఱియొకయవ్యక్తపదార్థము కలదు. అది సర్వప్రాణులు నశించినను నాశము నొందనేరదు. అదియే యంతిమగతి యగును."

లో వాదముఁ జేయుచు కాలమును గడపరాదు. కావున "పిండబ్రహ్మాండములకు మూల మగుశ్రేష్ఠతత్త్వ మెద్ది? మనుష్యుఁడు తద్రూపుఁ డెట్లగును?" అని నిశ్చయించుట కది (అవేదాంతశాస్త్రము) ప్రవర్తిల్లెను; కాని తన యెదుట మఱియొక శాస్త్రమును ప్రవర్తింపనీయదు. సింహ మెదుట నక్కలవలె, వేదాంతముయెదుట నితరశాస్త్రములు మౌనము వహించును. కావుననే—

"తావ ద్గర్జంతి శాస్త్రాణి జంబుకా విపినే యథా
న గర్జతి మహాశక్తిః యావ ద్వేదాంతకేసరీ."

అని యొకప్రాచీనసుభాషితకారునిచే వేదాంతయాథార్థ్య మిట్టుల వర్ణింపఁబడినది. ౧ క్షేత్రక్షేత్రజ్ఞవిచారణ నొనర్చిన పిదప సిద్ధించు ద్రష్ట (అనఁగా: పురుషుఁడు, లేక, యాత్మ)యు, ౨ క్షరాక్షరసృష్టియొక్క విచారణ చేసిన పిదప సిద్ధించుసత్త్వరజస్తమోగుణాత్మక మగునవ్యక్తప్రకృతియు ననునీరెండును స్వతంత్రములగుటచే, జగత్తుయొక్క మూలతత్త్వ మీతీరున రెండువిధములుగ నంగీకరించుట యావశ్యక మని సాంఖ్యులు చెప్పుచున్నారు. కాని యింతకంటె లోతుగ విచారించి, సాంఖ్యమతానుసారముగ, పురుషులు నిర్గుణు లయినను వారనేకులుగ నున్నారు గాన నీయసంఖ్య లగుపురుషులకు లాభము దేనిలో నున్నదని యాలోచించి యీతీరునఁ బ్రతిపురుషునిఁ బ్రవర్తింపఁజేయుసామర్థ్యము ప్రకృతియందున్నదని యఙ్గీకరించుట యుక్తము కాదనియు, విభక్తపదార్థముల కన్నింటికి నవిభక్త మగునవ్యక్తమును మూలతత్త్వము నగునొకటి "అవిభక్తం విభక్తేషు" అనున్యాయముగ నున్నదనియు,ఆ యవిభక్తపదార్థముయొక్క స్వాభావిక మగుజ్ఞానక్రియలే సృష్టికంతకును మూలమనియు, ఆ జ్ఞానక్రియయొక్క సాహాయ్యము చేతనే, సృష్టియందున్న యనేకవ్యక్తపదార్థములకు నొకయవ్యక్తప్రకృతియందు సమావేశముఁ జేయవచ్చు ననియు, ఆ జ్ఞానక్రియచేతనే 'ప్రకృతియు-అసంఖ్యపురుషులు' నను నన్నిటికి నొకపరతత్త్వము నందే తుద కవిభాగముగ సమావేశము నిరాటంకముగఁ జేయవచ్చుననియు, ఆలోచింపఁగనే సాత్త్విక మగు తర్కదృష్టిచే మిక్కిలి సయుక్తికముగ నున్నదనియు వేదాంతులు చెప్పుచున్నారు. (గీత. ౧౮. ౨౦-౨౨) వేర్వేఱుగ నుండుట యనునది యహంకారముయొక్క పరిణామముగ నున్నది. మఱియు పురుషులు నిర్గుణు లగుదురేని యసంఖ్య లగు నాపురుషులందు వేర్వేఱుగ నుండుటయనుగుణముండనేరదు. లేక, మొట్టమొదట మనుష్యు లసంఖ్యలు కాకపోవుటచేఁ బ్రకృతియందున్నయహంకారగుణ మనెడి

యుపాధిచే నీయసంఖ్యత్వము వారియం దుత్పన్న మగునటుల గాన్పించుచున్న దని చెప్పవలసివచ్చును. ఇంతియ కాక స్వతంత్రుఁ డగుపురుషునకు స్వతంత్రమగు ప్రకృతితోఁ గలిగినసంయోగము సత్యమా? మిథ్యయా? యను మఱియొక ప్రశ్న వెలువడును. సత్య మని యందు మేని యది యెప్పుడును వదలిపోవుటకు శక్యము గాక పోవును గాన, సాంఖ్యమతానుసారముగ నాత్మకు ముక్తి యేనాఁడును లభిం పదు. మఱియు మిథ్య యని యంగీకరింతు మేని, పురుషునిసంయోగకారణమున, ప్రకృతి తనవ్యాపారము నతనియెదుటఁజేయుటకు నారంభించు నని చెప్పుట నిర్మూల మగును. ఆవు దూడకొఱకుఁ బాలిచ్చునటుల, ప్రకృతి పురుషునిలాభము కొఱ కెప్పుడును నాట్యము సేయుచున్న దనుదృష్టాంతముసైతము యుక్తియుక్తముగ లేదు. కారణ మేమి యన: గోగర్భమునందుండి దూడపుట్టుటచే దూడ యందు గోవునకుఁ బ్రీతియుండునటుల ప్రకృతికి పురుషునియందు బ్రీతియున్న దని చెప్పుట సాధ్యము కానేరదు (వే. సూ. శాం. భా. ౨. ౨. ౩). ప్రకృతి పురుషు లిరువురును సాంఖ్యశాస్త్రానుసారముగ మొదటనుండియు నత్యంత భిన్నులు. ఎటులన: ప్రకృతి జడముగను, బురుషుఁడు సచేతనుఁడుగ నున్నారు. సృష్ట్యారంభమునం దీరెండుపదార్థములు నత్యంతభిన్నములును స్వతంత్రములు నగు నేని, వానిలో నొకదాని ప్రవృత్తి రెండవదానిలాభార్థ మేల కావలయును? ఇది ప్రకృతికిస్వభావ మని యుపపాదించుట సరియగుసమాధానము కానేరదు. స్వభావ మని చెప్పితి మేని 'హెకెల్' పండితునిజడాద్వైత మేల తప్పగును? మూలప్రకృతియొక్క గుణములు వృద్ధిఁబొందుచు, దానిలోనే స్వయముగ చూచునదియు, స్వయముగనుసైతము విచారించునదియు నగు చైతన్యశక్తి యుత్పన్న మగును. అనఁగా: ఇదిదానిస్వభావమై యున్నది. అని హెకెల్ చెప్పుచున్నాఁడు గదా!. కాని,యీమతము నంగీకరింపక, సాంఖ్యశాస్త్రము, ద్రష్ట(చూచువాఁడు) వేఱన్నియు,'దృశ్యసృష్టి వే'ఱనియు కొంతభేదము చెప్పినచో, నేన్యాయముచే నీభేద ముత్పన్నమగునో యాన్యాయము నే తరువాత సైత. మింక కొంచె మేల యధికముగ నుపయోగింపకూడదు.? దృశ్యసృష్టి నెవ రెంత పరీక్షించినను, 'నేత్రములమజ్జాతంతువులం దీధర్మము లున్న'వని నిశ్చయించినను నిశ్చయించువాఁడు పరల భిన్నుఁడుగనే యున్నాఁడు. సృష్టిని చూచెడుపురుషుఁడు, దృశ్యసృష్టికంటె నీవిధముగ వేఱయినపిదప నీచూచువాఁ డెవఁ డని మనము కొంత విచారింపవలసియున్నది. "దృశ్యసృష్టియొక్క సత్యస్వరూపము మనయింద్రియములకుఁ గనఁబడున

ట్లున్నదా? లేక, కనఁబడుదానికంటె భిన్నముగ నున్నదా?" యని మనము విచారింపవలసినయెడల దానికేదైనను మార్గము కలదా? లేదా?" యను ఏప్రశ్నకెప్పుడును సమాధానము చెప్పుట శక్యము కానేరదు. కావున ప్రకృతి-పురుషుఁడు ననురెండుతత్త్వములు నాదియందుండి భిన్నములుఁ స్వతంత్రములుఁగ నున్నవని యంగీకరించుట యుక్తముగ నున్నదని సాంఖ్యులుఁ జెప్పుచున్నారు; మఱియు నొకయాధిభౌతికశాస్త్రపద్ధతిచేతనే విచారించితిమేని సాంఖ్యమతము యుక్తివిరుద్ధముగ నున్నదనుటకు సాధ్యము కానేరదు. కారణమేమి యన:—సృష్టిలోనియితర పదార్థములు మనయింద్రియములకుఁ గాన్పించును గాన వానిగుణధర్మముల నెట్లు పరీక్షించుచున్నాఁడో యటులే 'చూచువాఁడు' (వేదాంతులచే 'ఆత్మ' యని చెప్పఁబడువాఁడు) చూచువానియొక్క యింద్రియములకు (అనఁగా: తనయింద్రియములకు) భిన్నరూపముతో నెప్పుడుఁ గనఁబడఁడు; ఏపదార్థ మింద్రియములకు నీరీతిగ గోచరముకానేరదో (అనఁగా: ఇంద్రియాతీతమో) దానిని మానవేంద్రియములతో నెట్లు పరీక్షింపఁగలము? భగవద్గీతలయందే—

> "నైనం ఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
> న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః." (గీ. ౨. ౨౩)

"ఆత్మ, సృష్టియందున్న యితరపదార్థములవలె తేజస్సు, ఉదకము మొదలగుపల్చనిపదార్థములసంయోగముచే ద్రవత్వమును జెందదు. పదునైనకత్తులుఁ దానిని నఱకలేవు. నిప్పు దీనిని కాల్పలేదు. గాలి దీనిని శుష్కింపఁజేయలేదు." సృష్టియందున్న పదార్థములను బరీక్షించుటలో నాధిభౌతికశాస్త్రవేత్తల కున్న యుక్తులన్నియు నీవిషయములో నుపయోగింపవని సారాంశము; కాని యాత్మ నెట్లు పరీక్షింపవలయు ననుప్రశ్న కఠినముగఁ దోఁచును. కొంత విచారించితిమేని దాని యం దేమియు కాఠిన్య మున్నటులుఁ గాన్పింపదు. సాంఖ్యశాస్త్రమునందుమాత్రము పురుషుఁడు నిర్గుణుఁడుగ స్వతంత్రుఁడుగ నున్నాఁడని యెట్లు నిశ్చయింపఁబడినది?. తనయంతఃకరణమునందలి యనుభవముచేతనే చేయఁబడినదా? లేక, మఱియొకవిధముననా? అటులే ప్రకృతి-పురుషుల సత్యస్వరూపమును నిర్ణయించుట నైత మేల చేయఁగూడదు? ఆధిభౌతికశాస్త్రములకు, ఆధ్యాత్మికశాస్త్రములకు నుండుగొప్పభేద మిదియే. ఆధిభౌతికశాస్త్రములయొక్క విషయము లింద్రియగోచరము లగుచున్నవి. ఆధ్యాత్మశాస్త్రవిషయ మింద్రియాతీతములు. (అనఁగా: కేవలస్వసంవేద్యములు=తమయంతట తామే తెలిసికొనఁదగినవి.) "ఆత్మ స్వసంవేద్య

పోయినయెడల ప్రతిపురుషునకును దానిజ్ఞాన మెట్లుకలుగునో యట్లే కానిమ్ము! అధ్యాత్మశాస్త్రముయొక్క యావశ్యకతయేమి?” యని యెవరయిన నడుగుదురు. ప్రతిమనుజునిమనస్సుగాని యంతఃకరణముగాని యొకేరీతిగ శుద్ధముగ నుండెనేని యీప్రశ్న యోగ్యమైనది యగును. ప్రతిమనుజునిమనశ్శుద్ధి యైనను, లేక, శక్తి యైనను, ఏహేతువుచే నొకవిధముగ నుండదని మనకు ననుభవగోచరమగునో, యాహేతువుచే నెవరిమన స్సత్యంతశుద్ధముగను పవిత్రముగను విశాలముగ నున్నదో వారిప్రతీతినె (అనుభవమునె) యీవిషయమున మనము ప్రమాణముగ నంగీకరింపవలయును. ఏమియు లేకయే 'నాకటుల తోఁచుచున్నది', లేక, 'నీకిటులతోఁచును'అని వితండవాదము పెంచుటచే నేమియు లాభము లేదు. యుక్తివాదమును బొత్తిగ వదలు మని వేదాన్తము సెప్పదు. అధ్యాత్మశాస్త్రము నందున్నవిషయము స్వసంవేద్యము కావుననె కేవలాధిభౌతికయుక్తులచే నిర్ణయించుటకు తగినది కానేరదు గావున నత్యంతశుద్ధము, పవిత్రము, విశాలము నగుమనస్సు కలిగినమహాత్ము లీవిషయమునందు స్వీయము నపరోక్షము నయిన యేయనుభవమును చెప్పిరో దానికి విరుద్ధమగుయుక్తివాద మీశాస్త్రమందు గ్రహించుటకు వీలులేదని వేదాన్తశాస్త్రము చెప్పుచున్నది. అధిభౌతికశాస్త్రములనం దెట్లు ప్రత్యక్షవిరుద్ధ మగు ప్రమాణము నంగీకరింపరో, యట్లే వేదాన్తశాస్త్రమునందును యుక్తికంటె స్వానుభవము, లేక, యాత్మప్రతీతియె మిక్కిలి గొప్పదని యంగీకరింతురు. ఈయనుభవమునకు ననుకూలమగు యుక్తినే వేదాన్తు లొప్పుకొందురు. శ్రీమచ్ఛంకరాచార్యులు వేదాన్తసూత్రభాష్యములో నీసిద్ధాన్తము నుడివిరి గాన నధ్యాత్మశాస్త్రము నభ్యసించువా రీవిషయమును తప్పక గుర్తుంచుకొనవలయును.

“అచింత్యాః ఖలు యే భావాః న తాం స్తర్కేణ సాధయేత్
ప్రకృతిభ్యః పరం యత్తు త దచింత్యస్య లక్షణమ్.”

“ఇంద్రియాతీతము లగుటచే చింతించుటకు నశక్యము లగుపదార్థముల న్లోకతర్కముచేఁగాని, యనుమానముచేఁగాని నిర్ణయింపఁగూడదు; సర్వసృష్టికిని మూలమగు ప్రకృతికంటెఁ బరముగనున్న యీపదార్థ మిట్లు అచింత్య మగును.” అని యొకప్రాచీనశ్లోకము కలదు. అదే మహాభారతమునందును (మ. భా. భీష్మ. ౫. ౧౨), మఱియు 'సాధయేత్' అను దానికి మాఱుగ 'యోజయేత్'అనుపాఠభేదముతో శంకరాచార్యులవేదాన్తసూత్రభాష్యమునందును వ్రాయఁబడినది (వే. సూ. శాం. భా. ౨. ౧. ౨౭). ముండక, కఠోపనిషత్తులలో నీతీరుననే యాత్మజ్ఞా

నము కేవలతర్కముచే ప్రాప్తము కానేరదని చెప్పఁబడినది. (ముండ. ౩. ౨-౩; కఠ. ౨. ౮-౯; మఱియు, ౨౨). అధ్యాత్మశాస్త్రమునం దుపనిషద్గ్రంథముల మాహాత్మ్యము విశేష ముండుటకు కారణ మిదియే. మనస్సు నేకాగ్రముగఁ జేయుటెట్లను విషయమున పూర్వకాలమున భరతఖండమునందు విశేషచర్చ జరుగుచుండుటచే (పాతంజల)యోగశాస్త్ర మను నొకస్వతంత్రశాస్త్రము వెలువడెను. ఈశాస్త్రమునందు ప్రవీణులే కాక, సహజముగఁ బవిత్రము విశాలము నగుమనస్సు గలిగినగొప్పఋషీశ్వరులు తమమనస్సు నంతర్ముఖముఁ జేసి యాత్మయొక్క స్వరూపవిషయమున తమయనుభవమును, లేక, దానివిషయమున శుద్ధము శాంతమునగు తమబుద్ధికి స్ఫురించినవిషయములను నుపనిషత్తులలోఁ జెప్పిరి. కావుననే యధ్యాత్మతత్త్వము నిర్ణయించి యెవరైనను దుద కీశ్రుతులయందున్న యనుభవమును శరణాఁ జొచ్చుటఁ దక్క నింకొకమార్గము లేదు. (కఠ. ౪. ౧) మనుష్యులు తమతమబుద్ధికుశలతచే నీయాత్మానుభవమును బలపఱచుయుక్తివాదములను వేర్వేఱుగఁ జెప్పుదురు; కాని, వానిచే మూలభూతమగు ననుభవముయొక్క ప్రామాణ్యము హెచ్చుగాని, తగ్గుగాని కానేరదు. భగవద్గీత యనునది స్మృతిగ్రంథమే కాని, యీవిషయమున నుపనిషత్తులతో సమానముగనే దానియోగ్యతనుబట్టి యంగీకరింపఁబడుచున్నదని ప్రథమప్రకరణారంభముననె వక్కాణింపఁబడినది. కావున గీతలయందు నుపనిషత్తులయందును ప్రకృతికంటె పరముగ నున్నయీయచింత్యపదార్థవిషయమై చేయఁబడినసిద్ధాంతముల నన్నిటిని తొలుత, (కారణము నుడువక) సాధారణముగ నుపన్యసించి, దానికి శాస్త్రరీతిగ నుపపత్తి యెట్లు సంభవించునో యావిచార మీప్రకరణాంతమునఁ జేయఁబడును.

ప్రకృతి పురుషుఁడు నను సాంఖ్యులయొక్క ద్వైతమును, భగవద్గీతలొప్పుకొనవు. ఈరెంటికి పరమం దున్నదియు సర్వవ్యాపకమును, అమృతమును నగు మూఁడవతత్త్వము చరాచరసృష్టికి మూలకారణ మని గీతలయందున్నయధ్యాత్మజ్ఞానము యొక్కయు, వేదాంతశాస్త్రముయొక్కయు ముఖ్యసిద్ధాంతముగ నున్నది. సాంఖ్యులచే నంగీకరింపఁబడినప్రకృతి యవ్యక్తముగ నున్నను, త్రిగుణాత్మకమే (అనగా: సగుణమే) యగును; కాని యేది సగుణమో యది. నశ్వరమగుటచే నీసగుణము నవ్యక్తము నగుప్రకృతి నశించినపిదప మిగులునవ్యక్తమే సర్వసృష్టికి సత్యమును, నిత్యము నగుతత్త్వమగు నని ప్రకృతి-పురుషవిచారము చేయునప్పుడీప్రకరణారంభమున వ్రాయఁబడినవిషయము గీతలలోని (గీ. ౮. ౨౦) శ్లోకము

నందుఁ జెప్పఁబడినది. పిదప్పదునైదవయధ్యాయమునందు, క్షరము-అక్షరము—వ్యక్తము-అవ్యక్తము— అని సాంఖ్యశాస్త్రానుసారముగ రెండుతత్త్వములను చెప్పినపిదప—

"ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ యీశ్వరః." (గీ. ౧౫.౧౭)

"ఈరెంటికంటెను భిన్నుఁడగుపురుషుఁడె యుత్తముఁడు, పరమాత్మ యను పేరు గలవాఁడు, నవ్యయుఁడు, సర్వశక్తిఁగలవాఁడు నగును. మఱియు నతఁడె మూఁడులోకములను వ్యాపించి వానిని సంరక్షించుచున్నాఁడు" అని చెప్పఁబడినది. ఈపురుషుఁడు క్షరాక్షరము లగు—వ్యక్తావ్యక్తములగు—రెంటికంటెను పరముగ నుండుటచే నతనికి పురుషోత్తముఁడను పేరు సార్థక మైనది. (గీ.౧౫.౧౮) మహాభారతమునందును పరమాత్మశబ్దమును వ్యాఖ్యానముఁ జేయుచు—

"ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతై ర్గుణైః
తై రేవ తు వినిర్ముక్తః పరమాత్మే త్యుదాహృతః."

(మ. భా. శాం. ౧౮౭. ౨౪).

"ఆత్మ దేహమునందు బద్ధుఁడగునేని యతనిని క్షేత్రజ్ఞుఁడు (జీవాత్మ) అని చెప్పుదురు. ఆజీవాత్మయే ప్రాకృతము లగు (అనఁగా; ప్రకృతియొక్క, లేక, దేహముయొక్క) గుణములయందుండి ముక్తుఁడగునేని పరమాత్మ యనఁబడును." అని భృగువు భరద్వాజునకుఁ జెప్పెను. పరమాత్మవిషయమై యిదివఱకుఁ జేయఁబడిన రెండువ్యాఖ్యానములును భిన్నము లని తోఁచుట కవకాశమున్నను న్యాయముగ నవి భిన్నము లయినవి కానేరవు. క్షరాక్షరసృష్టి, జీవుఁడు, (లేక, సాంఖ్యశాస్త్రానుసారముగ నవ్యక్త మగుప్రకృతియు, పురుషుఁడు) నను నీరెంటికిని పరముగ నొకపరమాత్మయే యుండుటచే నొకప్పుడు క్షరాక్షరములకు పరముగను, నొకప్పుడు జీవమునకు, లేక, జీవాత్మకు (పురుషునకు) పరముగను నున్నాఁడనియు, నొకపరమాత్మకే ద్వివిధముగ లక్షణము, లేక, వ్యాఖ్యానము చెప్పవచ్చును. ఈ యభిప్రాయమునే మనస్సున నుంచుకొని కాళిదాసు సైతము "పురుషునిలాభము కొఱకుఁ బ్రవర్తించుప్రకృతివి నీవే. సహజముగ నుదాసీనుఁడ వగుటచే నాప్రకృతిని చూచుపురుషుఁడును నీవే" అను ...రుని కుమారసంభవములో వర్ణించినాఁడు. (కుమా. ౨. ౧౩) అటు ...తుఁడును, "మమయోని
వనూత్ర భాష్యము. తక, కఠోపనిషత్తులలో

ర్మహ ద్బ్రిష్మా” “ప్రకృతి నాకు యోని, లేక, నాస్వరూపములలో నొకటి” యనియు, జీవము, లేక, యాత్మ యనునది నాయంశమునే యున్నది. (గీ. ౧౫. ౭) అనియుఁ జెప్పెను. మఱియు నేడవయధ్యాయములో—

“భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ
అహంకార ఇ తీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.” (గీ. ౭. ౪)

“పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, అని ప్రకృతి యెనిమిదివిధములుగ నున్నది” అనియు, (అపరేయమితస్త్వన్యాం) “సర్వజగత్తు నెవరిచే ధరింపఁబడినదో యట్టిజీవమును నాయొక్క రెండవ ప్రకృతిగా నున్నది.” (౭. ౫) అనియు భగవంతుఁడు చెప్పుచున్నాఁడు. మహాభారతమున శాంతిపర్వములో సాంఖ్యులయొక్క పంచవింశతితత్త్వము లనేక ప్రదేశములందు వివేచన చేయఁబడెను. అయిన నీపంచవింశతితత్త్వములకుఁ బరముగ షడ్వింశ (౨౬. వది) మగు నొకపరమతత్త్వమున్న దనియు దానిని దెలిసికొనిన కాని మనుష్యుఁడు ‘బుద్ధుఁడు’ (జ్ఞాని) కానేరఁ డనియు (శాం. ౩౦౮), అన్నిచోట్లను జెప్పఁబడినది. సృష్టియం దున్న పదార్థములను జ్ఞానేంద్రియములచే నెఱుంగుటయే మనసంబంధ మగు సృష్టి కావున, ప్రకృతికి, లేక, సృష్టికే యనేకపర్యాయములు జ్ఞాన మని పేరిడుటచే నీదృష్టిచేత నీపురుషుఁడు జ్ఞాతయగుచున్నాఁడు (శాం. ౩౦౬. ౩౫–౪౧); కాని సత్య మగు జ్ఞేయ మేది కలదో (గీ. ౧౩. ౧౨) యది, ప్రకృతియు, పురుషుఁడు (అనఁగా:—జ్ఞానము, జ్ఞాత)అను నిరువురికంటెను బరముగనే యున్నది. అదియే పరమపురుషుఁడని గీతలలోఁ జెప్పఁబడినది. “ముల్లోకములను వ్యాపించి, దానిని సదా ధరించుమహాపురుషుని, లేక, పరమపురుషు నెఱుంగుము. వాఁడొక్కఁడు, అవ్యక్తుఁడు, నిత్యుఁడు, అక్షరుఁడు” అని భగవద్గీతయందే కాక వేదాన్తశాస్త్రమునం దున్నసర్వగ్రంథములలో స్పష్టముగఁ జెప్పఁబడినది. అక్షరము, అవ్యక్తము నను నీరెండువిశేషణములును సాంఖ్యశాస్త్రమునందు ప్రకృతినిఁ దెలుపుచున్నవి. కారణ మేమి యన: ప్రకృతికంటె నెక్కువ సూక్ష్మ మగు మఱియొకమూలకారణ మేదియు జగత్తునకు లే దని సాంఖ్యులు సిద్ధాన్తమొనర్చిరి (సాం. కా. ౬౧); కాని వేదాన్తదృష్టిచేఁ బరబ్రహ్మమే యక్షరము (ఎప్పుడు నాశము నొందనిది) అగుటచే నది యవ్యక్తము (అనఁగా: ఇంద్రియముల కగోచరము) అగును. కావున గీతల్లయం దక్షరావ్యక్తశబ్దములే ప్రకృతికంటె పరముగనున్న పరబ్రహ్మస్వరూపమును భావించుటకు ప్రయోగింపఁబడు

స్నవి. ఈవిషయమును జదువరులు ముఖ్యముగ గమనింపవలయు (గీ. ౭. ౨౦; ౧౧. ౩౭; ౧౫. ౧౬-౧౮). ఈవేదాన్తమతానుసారముగఁ బ్రకృతి యవ్యక్తమయి నను దాని నక్షరమని చెప్పుట యోగ్యము కానేరదు. సత్యమే; కాని గీత ప్రకృతి పురుషులకంటె పరమం దున్నమూఁడవవాఁ డగునుత్తమపురుషునియొక్క సర్వశక్తి త్వమునకు కలుగుబాధ నొప్పుకొనదు; కాని, మిగిలిన సృష్ట్యుత్పత్తిక్రమసంబంధము లోని సాంఖ్యశాస్త్రసిద్ధాన్తము గీతలకు నంగీకార్య మగును. కావున సాంఖ్యులచే సంగీకరింపఁబడిన పరిభాషను వదలక యీశబ్దములచేతనే గీతలయందు క్షరాక్షరముల (వ్యక్తావ్యక్తముల) యొక్క సృష్టి వర్ణింపఁబడినది; మఱియు దానియం దుండియే బ్రహ్మస్వరూపమును చెప్పవలసినప్రసంగము తటస్థించినపుడు సందేహము లేకుండుటకై సాంఖ్యులయవ్యక్తముకంటె పరముగునవ్యక్తమును, సాంఖ్యులయక్షరముకంటె పరమగునక్షరము ననుమాటల కూర్పవలసివచ్చును. ఉదాహరణము:— ఈప్రకరణారంభమున నున్నశ్లోకమును వీక్షింపుము. 'అవ్యక్తము' 'అక్షరము' అను నీరెండుశబ్దములు నొకానొకప్పుడు సాంఖ్యులప్రకృతిని, మఱియొకప్పుడు వేదాన్తులపరబ్రహ్మము నుద్దేశించి(అనఁగా:రెండును వేర్వేఱువిధములుగ నుద్దేశించి) గీతలలోఁ గూర్పఁబడిన పని గీతలను జదువు చున్నప్పుడు తప్పక గమనింపవలయు నని సారాంశము. సాంఖ్యులయొక్క యవ్యక్తప్రకృతికంటె పరముగనున్న మఱియొకయవ్యక్తమే వేదాన్తానుసారముగ జగత్తునకు మూలమగును. జగత్తుయొక్క మూలతత్త్వసంబంధములో సాంఖ్యవేదాన్తులనడుమ నున్న భేదమిదియే. మూలముననే యధ్యాత్మశాస్త్రమునం దున్న మోక్షస్వరూపము పైతము సాంఖ్యులమోక్షస్వరూపముకంటె నెట్లు వేఱగునో యయ్యది ముందుఁ జెప్పఁబడును.

'ప్రకృతి-పురుషుఁడు'అను నీసాంఖ్యులయొక్క ద్వైతము నంగీకరింపక యీ రెండు నెవరివిభూతిగనున్నవో యట్టిపరమేశ్వరరూపము, లేక, పురుషోత్తమరూపమగు మూఁడవనిత్యతత్త్వము జగదుత్పత్తికంటె పూర్వమునం దున్నదని చెప్పినపిదప, ఈమూలభూత మగుమూఁడవతత్త్వమేది యనియు, దానికిని, ప్రకృతి పురుషులకును నెట్టిసంబంధ మున్నదనియు, ప్రశ్నలు సహజముగ వెలువడును. ప్రకృతి, పురుషుఁడు, పరమేశ్వరుఁ డను నీముగ్గురినే యధ్యాత్మశాస్త్రమునందు జగత్తు, జీవుఁడు, పరబ్రహ్మము అని క్రమముగఁ జెప్పుచున్నారు. ఈమూఁడువస్తువులస్వరూపమును, వీని పరస్పరసంబంధమును నిర్ణయించుటయే వేదాన్తశాస్త్రమునకు ముఖ్యప్రయోజనము. కావున నుపనిషత్తులలో నెక్కడఁ జూచిన నిదియే వర్ణింపఁబడినది. అయినను,

ఈవిషయములో సకలవేదాన్తులకు నైకమత్యము లేకపోవుటచేఁ గొందఱీమూఁడు పదార్థములు తొలుత నొక్కటిగ నున్న వనియు, మఱికొందఱీజీవజగత్తులు పరమేశ్వరునికంటె పూర్వమునందు కొంచెముగనో యత్యంతముగనో భిన్నముగను నున్నవనియుఁ దలఁచుచున్నారు. అందువలననే యద్వైతులు, విశిష్టాద్వైతులు, ద్వైతులు నని వేదాన్తులు మూఁడుతెగలుగ నున్నారు. జీవము, జగత్తులవ్యవహారము సర్వము పరమేశ్వరేచ్ఛచే నడచుచున్న దనుసిద్ధాన్తము నందఱు నొప్పుకొనుచున్నారు; కాని మొదట నీమూఁడువస్తువులస్వరూప మాకాశమువలె నొక్కటిగ నఖండముగ నున్న దని యనేకు లొప్పుకొనుచున్నారు. జడము, చేతనము నొకటియగుటకు శక్యముకామిచే దానిమ్మపండులో ననేకబీజము లున్నకారణమున ఫలమున కేకత్వము లే దని యెంచఁ దగనియట్లు జీవజగత్తు లనునవి పరమేశ్వరునిలో నంతర్గతములయినను, అవి పరమేశ్వరునికంటె మొదట నుండి భిన్నములుగనే యున్న వనియు, మూఁడు నొకటిగనే యున్న వనియు నుపనిషత్తులలోఁ జెప్పినప్పుడు, దానిమ్మపండువలె నొకటియే యని దానికర్థమని యెఱుంగవలయు నని కొందఱు వేదాన్తు లందురు. జీవస్వరూపవిషయమై యిట్లు వేర్వేఱు మతము లొక్కపరియే వెలువడిన పిదప నుపనిషత్తులందును, గీతలందు నున్నశబ్దములకర్థము సైత మాయాసాంప్రదాయికులచేఁ దమతమటీకలలో ననేకవిధములుగ మార్పఁబడినది. అందువలన గీతలలో నున్నస్వకీయాభిప్రాయము తెలియఁబడకపోవుటచే గీతలలో నున్న వేదాన్తము ద్వైతమో యద్వైతమో యై యున్నదనునది గీతలలోని సాంప్రదాయకటీకాకారులమతానుసారముగ, ముఖ్యముగ నిరూపింపఁబడినవిషయముగ స్థిరపడినది. కానిమ్ము; ఈవిషయ మయి విశేషముగ విచారించుటకు మున్ను జగత్తు (ప్రకృతి), జీవుఁడు (ఆత్మ, లేక, పురుషుఁడు), పరబ్రహ్మము (పరమాత్మ, లేక, పురుషోత్తముఁడు)అను వీరి కుండుపరస్పరసంబంధమును గుఱించి, భగవంతునిచే నందేమిచెప్పఁబడెనో విచారింతము. ఈవిషయములో, గీతలయొక్కయు నుపనిషత్తులయొక్కయు తాత్పర్య మొకటియే యగుటచే గీతలయం దున్న విచారమంతయును పూర్వ ముపనిషత్తులలో నుండినదే యనియు, ఇఁక ముందు చేయఁబోవువివేచనయందుండి చనువరు లెఱుంగుదురు.

ప్రకృతి-పురుషు లిరువురికంటె పరమం దున్నపురుషోత్తముని, పరమపురుషుని, పరమాత్మను, లేక, పరబ్రహ్మమును వర్ణించుచు భగవద్గీతలందు 'వ్యక్తము-అవ్యక్తము (నేత్రములకు కాన్పించునది-కాన్పింపనిది)' అని దానికి రెండుస్వరూప

ములు మొదట చెప్పఁబడినవి. వీనిలో వ్యక్తము (అనఁగా: ఇంద్రియములకు గోచర మగురూపము) సగుణముగనే యుండవలయు నని స్పష్టముగ నున్నది. అవశిష్ట మయినది యవ్యక్తము. ఈరూప మవ్యక్తము (అనఁగా: ఇంద్రియములకు గోచరము కానిది) అను మాట సత్యమే; కాని యది యింద్రియములకు గోచరము కాదనునంతమాత్రముచేతనే నిర్గుణముగ నుండవలయు ననిచెప్పుటకు వీలు లేదు. కారణ మేమనఁగా:—మన నేత్రములకుఁ గాన్పింపక పోయినను, దానియందు సర్వవిధములగుగుణములు సూక్ష్మరూపముగ నుండవచ్చును. కాన నవ్యక్తమే సగుణమనియు, సగుణ-నిర్గుణ మనియు, నిర్గుణ మనియు మూఁడువిధములుగ విభజింపఁబడినది. 'గుణ' శబ్దముచే మనుష్యుల బాహ్యేంద్రియములకే కాక మనస్సునకైనను గోచరము లగు సకలగుణములు నిక్కడ నుద్దేశింపఁబడినవి. పరమేశ్వరునియొక్క మూర్తిమంత మగు నవతారమైన శ్రీకృష్ణమూర్తి యీవిషయమునే యుపదేశించుటకొఱకు సాక్షాత్తుగ నర్జుననియెదుట నిలువఁబడి యుండెను. కావున గీతలలో నాయాస్థలములందు "ప్రకృతి నాస్వరూపముగనే యున్నది" (గీ. ౯. ౪) "జీవుఁడు నాయంశముగ నున్నాఁడు." (గీ. ౧౫. ౭) "సర్వభూతములకు నంతర్యామి యగునాత్మ నేనే" (గీ. ౧౦. ౨౦) "జగత్తులో నేదేది శ్రీమంతముగఁ గాని, లేక, విభూతిమంతముగఁ గాని యగుమూర్తిగ నున్నదో యదీ యంతయు నాయొక్క యంశముచేతనే యుత్పన్న మయినది" (గీ. ౧౦. ౪౧). "నాయందు మనస్సునుంచి నాభక్తుఁడవు కమ్ము" (గీ. ౯. ౩౪) "అటులగుదు వేని నన్నే పొందుదువు. నీవు నాకిష్టుఁడ వని నేను ప్రతిజ్ఞఁ జేయుచున్నాను." (గీ. ౧౮. ౬౫) అని తనయొక్క వ్యక్తస్వరూపవిషయమునునే భగవంతుఁడు ప్రథమపురుషముచే నిర్దేశించినాఁడు; మఱియు సకలచరాచరసృష్టియు తనవ్యక్తస్వరూపము సాక్షాత్తుగ నిండియున్నదని విశ్వరూపదర్శనముచే నర్జునునకు ప్రత్యక్షముగ నమ్మకమును బుట్టించిన పిదప తుదకు నవ్యక్తముకంటె వ్యక్తము నుపాసించుట మిక్కిలి సులభము. కావున 'నీవు నాయందు భావమును నిల్పుము." (గీ. ౧౨. ౮) "నేనే బ్రహ్మకు, అవ్యయ మగు మోక్షమునకు, శాశ్వతమగుధర్మమునకు, పరమసుఖమునకు మూలస్థానముగ నున్నాను." (గీ. ౧౪. ౨౭) అని యర్జునున కుపదేశించెను. ఇందుచేఁ బ్రారంభమునుండి తుదవఱకును గీతలయందు భగవంతునియొక్క వ్యక్తస్వరూపమె ప్రధానముగ వర్ణింపఁబడిన దని చెప్పుటకేమియు నాటంకము కానరాదు.

కాని యింతమాత్రముచేత గీతలలో వ్యక్త మగు పరమేశ్వరుఁడె తుదకుఁ బొందఁదగినవాఁ డని చెప్పఁబడిన దనెడికేవల భక్త్యభిమానులగు కొందఱుపండి

తులయొక్కయు,టీకాకారులయొక్కయు మతము స్వీకరించుటకు సాధ్యము కానే రదు. కారణ మేమన:—పూర్వమునందు చెప్పఁబడినదానిపలెనే తనవ్యక్తస్వరూపము మాయికమగుటచే దానికి పరమందున్నయవ్యక్తమే (అనఁగా: ఇంద్రియములకు గోచరము కానిస్వరూపమే) ముఖ్యముగ నున్న దని భగవంతుఁడు స్పష్టముగఁ జెప్పినాఁడు. ఉదాహరణము:—

"అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః
పరం భావ మజానన్తో మ మావ్యయ మను త్తమమ్." (గీ. ౭. ౨౪)

"నే నవ్యక్తుఁడ (అనఁగా: ఇంద్రియములకు నగోచరుఁడ) నైనను, మూఢులు నన్ను వ్యక్తుఁడని యెన్నుచున్నారు.మఱియు వ్యక్తమునకుఁ బరముగ నున్న శ్రేష్ఠము నవ్యయము నగు నా స్వరూపము నెఱుంగ లేరు." అని చెప్పి తరువాతి శ్లోకములో "నేను నాయొక్క యోగమాయచే నాచ్ఛాదితుఁడ నగుటచే మూఢులు నన్నెఱుంగలేరు."(౭.౨౫)అని భగవంతుఁ డేడవయధ్యాయములోఁ జెప్పియున్నాఁడు. అటులే నాలుగవయధ్యాయములో "నేను జన్మవిరహితుఁడను, అవ్యయుఁడ నైనను స్వయముగ ప్రకృతి నధిష్ఠించి నా మాయచేతనే (స్వాత్మమాయయా) జన్మమెత్తుచున్నాను. అనఁగా: వ్యక్తుఁడ నగుచున్నాను." (గీ. ౪.౬)అని తనవ్యక్త స్వరూపమునకు నుపపత్తి చెప్పినాఁడు.ముం దేడవయధ్యాయములోఁ ద్రిగుణాత్మక ప్రకృతి యనునది నా దగు దైవి మాయ యగుటచే దాని నెవరు తరింతురో వారు నన్ను కలిసికొందురు. మఱియు ఆ మాయచే నష్టజ్ఞానులు, మూఢులు, నరాధములు నగువారు నన్నుఁ బొందరు" (గీ.౧౪.౧౫) అని చెప్పి తుదకు పదునెనిమిదవయధ్యాయములో (గీ. ౧౮.౬౧.) "ఓయర్జునా! సర్వభూతములహృదయములందు జీవరూపముగ నీశ్వరుఁడె వాసముఁ జేయుటచే నతఁడు తనమాయచేతనే సకలభూతములను యంత్రమువలెనె త్రిప్పుచున్నాఁడు" అని యర్జునునకు శ్రీకృష్ణమూర్తి బోధించినాఁడు. అర్జునునకుఁ జూపినవిశ్వరూపమునే నారదునకు భగవంతుఁడు చూపినటుల భారతమునందలి శాంతిపర్వాంతర్గతమయిన నారాయణీయప్రకరణములోఁ జెప్పఁబడినది (భా. శాం. ౩౩౯); మఱియు నారాయణీయము లగు, లేక, భాగవతము లయిన ధర్మములే గీతలలోను ప్రతిపాద్యములని నేను మొదటిప్రకరణములో నిరూపించి యున్నాను. నారదునకు నీరీతిగ సహస్రనేత్రములును రంగులును నితరము లగుదృశ్యగుణములును గలవిశ్వరూపమును జూపినపిదప—

"మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద।
సర్వభూతగుణై ర్యుక్తం నైవం త్వం జ్ఞాతు మర్హసి."

(శాం. ౩౩౯. ౪౪.)

"నీవు చూచుచున్న నారూప మంతయు నాచే నిర్మిత మయిన మాయ. కావుననే సర్వభూతముల గుణములతో నేను కూడినవాఁడ నని యెఱుంగుము." అని యిట్లు భగవంతుఁడు చెప్పి "నాసత్యస్వరూపము, సర్వవ్యాపకము, అవ్యక్తము, నిత్యము నయినది. దానిని సిద్ధులు తెలిసికొందురు." (శాం. ౩౩౯. ౪౮) అనియుఁ జెప్పెను. కావున గీతలయం దర్జునునకుఁ జూపినవిశ్వరూపముగూడ మాయికముగనే యున్నది. కావున నుపాసనార్థమయి వ్యక్తస్వరూపము భగవంతునిచే గీతలలోఁ బ్రశంసింపఁబడినను పరమేశ్వరునియొక్క శ్రేష్ఠస్వరూప మవ్యక్త (అనఁగా: ఇంద్రియముల కగోచర)మగుటచే నవ్యక్తుఁడు వ్యక్తస్వరూపమును ధరించుట యనునది యతని మాయ గనే యున్న దనియు, ఈమాయ నతిక్రమించి తుదకు, దీనికంటె పరము శుద్ధము నగునవ్యక్తస్వరూపముయొక్క జ్ఞానము కలిగినఁగాని మోక్షము లభింప దనియు గీతలలోని సిద్ధాంతముగ నున్న దని పూర్వోక్తవచనముల నుండి నిర్వివాదముగనే తెలియు నని సారాంశము. మాయ యన నేమియో విశేషముగ ముందు విచారించెదము. పూర్వోక్త మగువాక్యములను బట్టి యాలోచింపఁగా నీ మాయావాదమును శ్రీశంకరాచార్యులు నూతనముగఁ గల్పింపలే దనియు, అంతకు పూర్వమునందే భగవద్గీతలలోను, మహాభారతములోను, భాగవతధర్మములలో నున్న దనియుఁ దెలియుచున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తునందును—"మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్" "మాయ యన ప్రకృతి (సాంఖ్యులది) యగును. మఱియు నామాయకు నధిపతి పరమేశ్వరుఁ డగుటచే నతఁడే తనమాయచేఁ బ్రపంచమును నిర్మించుచున్నాఁడు." (౪. ౧౦) అని సృష్టిక్రమము సెప్పఁబడినది.

పరమేశ్వరునియొక్క శ్రేష్ఠ మగుస్వరూపము వ్యక్తము కా దనియు నవ్యక్తముగ నున్న దనియు స్పష్ట మయినను, ఈశ్రేష్ఠ మగునవ్యక్తరూపము సగుణమా? నిర్గుణమా? యనియు నిచ్చోఁ గొంత విచారణీయము. కారణ మేమనఁగా:— సాంఖ్యశాస్త్రమం దున్నప్రకృతి యవ్యక్త మైనను(అనఁగా: ఇంద్రియ [illegible] చర మైనను) సగుణమై (అనఁగా: సత్త్వరజస్తమోగుణాత్ [illegible]

ఈసగుణ మైనయవ్యక్తరూప మగునొకదృష్టాంతము మనయెదుటనుండుటచేఁ బర మేశ్వరునియవ్యక్తము శ్రేష్ఠము నగుస్వరూపము నటులే సగుణముగ గ్రహింప వలయు నని యనేకులు తలంచెదరు. అవ్యక్తుఁడగు పరమేశ్వరుఁడు దనమాయచే నైనను వ్యక్తసృష్టిని నిర్మించుటవల్లను, సర్వప్రాణులహృదయములయందుండి వారి వారివ్యాపారములను వారిచేఁ జేయించుటవల్లను (గీ. ౧౮.౬౧), తాను సర్వయజ్ఞములకును భోక్తగా ప్రభువుగా నుండుటవల్లను (గీ. ౯. ౨౪), ప్రాణిమాత్రము మనకు బుద్ధిని ప్రేరణఁ జేసి శ్రద్ధను బుట్టించువాఁ డగుటవల్లను, సుఖదుఃఖాది సర్వ'భావ'ములను గలిగించువాఁడగుటవల్లను, "లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్" (గీ. ౭. ౨౨) అని యున్నట్లు ప్రాణులయొక్క వాసనానురూపముగ ఫలముల నిచ్చుటవల్లను నవ్యక్తుఁడైనను (అనఁగా: ఇంద్రియముల కగోచరుఁ డయినను) దయ, కర్తృత్వము మొదలగుగుణములతోఁ గూడినవాఁడు గావున సగుణుఁడే కావలయునని సిద్ధ మగుచున్నది. దీనికి విపరీతముగ—"న మాం కర్మాణి లిమ్పన్తి" "నన్నుఁ కర్మలయొక్క గాని, గుణములయొక్క గాని యపరిశుద్ధత యెప్పుడును బాధింపనేరదు" (గీ. ౪. ౧౪) అనియు, ప్రకృతియొక్క గుణములచే మోహముఁ జెందినమూర్ఖు లాత్మనే కర్త యనుకొందురనియు (౩. ౨౭; ౧౪. ౧౯.), లేక, యవ్యయుఁడు నకర్తయు నగునీపరమేశ్వరుఁడే ప్రాణిమాత్రహృదయమునందు జీవరూపుఁడుగ నుండుటచే (గీ. ౧౩.౩౧) నన్నిజంతువుల కర్తృత్వము, కర్మయు నను నీరెంటిచే న్యాయ్యముగ నసంబద్ధుఁడయినను నజ్ఞానముచే లోకులు మోహమును బొందుదు రనియు, భగవంతుఁడు సెప్పెను (గీ. ౫. ౧౪–౧౫). అవ్యక్తుఁడగు (అనఁగా: ఇంద్రియములకు గోచరముకాని) పరమేశ్వరునిస్వరూప మిట్లు సగుణ మనియు, నిర్గుణ మనియు, వేర్వేఱుగఁ జెప్పఁబడలేదు; కాని కొన్నిస్థలములయందు నీరెండురూపముల నొక్కచోట మిశ్రమము చేసియు వ్యక్తుఁ డగుపరమేశ్వరుఁడే వర్ణింపఁబడెను. ఉదాహరణము:—"భూతభృన్న చ భూతస్థః" "నేను భూతముల కాధారభూతుఁడ నగుటచే వానిలోలేను" (గీ. ౯. ౫) అనియు, మఱియు "పరబ్రహ్మ సత్తును గాదు, అసత్తును గాదు" (గీ. ౧౩. ౧౨) అనియు, పదుమూఁడవయధ్యాయమునందు, "సకలేంద్రియములుగలవాఁడుపలె భాసమానుఁడైనను సర్వేంద్రియవిరహితుఁడును, నిర్గుణుఁడును గుణములను భోగించువాఁడు" (గీ ౧౩-౧౪) అనియు, "దూరమందున్నను సమీపముననున్నాఁడు" (గీ. ౧౩. ౧౫) అనియు, "అవిభక్తుఁడుగను, విభక్తుఁడుగను గన్పట్టుచున్నాఁడు"

(గీ. ౧౩. ౧౬) అనియు పరమేశ్వరస్వరూపము పరస్పరవిరుద్ధముగ (అనఁగా: సగుణముగను నిర్గుణముగను) చెప్పఁబడినది. అయినను రెండవయధ్యాయముయొక్క ప్రారంభముననే "ఈయాత్మ, యవ్యక్తము, అచింత్యము, అవికార్యముగ నున్నది" (గీ. ౨. ౨౫) అని చెప్పి పదుమూఁడవయధ్యాయములో "ఈపరమాత్మ, యనాది, నిర్గుణుఁడు, నవ్యయుఁడు నగుటచే నతఁడు శరీరమునందున్నను నేమియుం జేయువాఁడు గా నేరఁడు. అతనికి దేని గంధముఁ దగులదు" (౧౩. ౩౧) అని శుద్ధమును, నిర్గుణమును, నిరవయవము, నిర్వికారము, అచింత్యము, ననాదియు నగునవ్యక్తస్వరూపముయొక్క శ్రేష్ఠత్వమే చెప్పఁబడినది.

భగవద్గీతానుసారముగ నుపనిషత్తులయందు నవ్యక్తుఁ డగుపరమేశ్వరుని స్వరూప మొకప్పుడు సగుణమనియు, నొకప్పుడుసగుణ-నిర్గుణ మనియు, నుభయవిధముగను, మఱియొకప్పుడు శుద్ధనిర్గుణమనియు మూఁడువిధములుగఁ జెప్పఁబడినటుల గాన్పించుచున్నది. ఉపాసనకు నెప్పుడు ప్రత్యక్షమూర్తి యెదురుగ నుండి తీరవలయునని నియమము లేదు. నిరాకారము (అనఁగా: చక్షురాదిజ్ఞానేంద్రియములకు నగోచర) మగుస్వరూపమును సైతము నుపాసింపవచ్చును; కాని యెవరిని మన ముపాసింపవలయునో వారు చక్షురాదీంద్రియముల కగోచరులైనను, మనస్సునకు గోచరమైననే కాని వారి నుపాసించుటకు శక్యము కానేరదు. ఉపాసన యనఁగా: చింతనము, మననము, లేక, ధ్యానముగా నుండును. మఱియుఁ జింతిత పదార్థమునకు రూపము లేకపోయినను, మఱియొక యేగుణములైనను మనస్సునకుఁ దెలిసిననేకాని మనుజుఁడు, మనస్సున దానిని చింతింపఁజాలఁడు. కావున నవ్యక్త (అనఁగా: నేత్రముల కగోచర) మగుపరమాత్మయొక్క చింతనము, మననము, ఉపాసన, యుపనిషత్తులలో నెక్కడెక్కడఁ జెప్పఁబడినదో యాయాప్రదేశములం దవ్యక్తుఁ డగుపరమేశ్వరుఁడు సగుణుఁడుగనే కల్పింపఁబడినాఁడు. పరమేశ్వరుని యందుఁ గల్పింపఁబడినయాగుణము లుపాసకులయొక్క యధికారానుసారముగఁ గొంచె మెచ్చుతగ్గుగ వ్యాపకములు, లేక, సాత్త్వికములుగ నున్నవి. మఱియుఁ దమతమనిష్ఠానుసారముగ నుపాసనాఫలము వారికి ప్రాప్త మగును. "పురుషుఁ డనువాఁడు క్రతుమయుఁ డగుటచే నెవరి క్రతు (నిశ్చయము) వెట్టిదో వారికి తదనుసారముగనె మరణానంతరమున ఫలము లభించును" అని ఛాందోగ్యోపనిషత్తు నన్నది. (౩. ౧౪. ౧) మఱియు దేవతలను భజించినవారు దేవతలను, పితరుల భజించినవారు పితరులను బొందుచున్నారు. (గీ. ౯. ౨౫) లేక, "యో యచ్ఛ్రద్ధః

స్వ ఏవ సః" "తనశ్రద్ధానుసారముగ సిద్ధిని బొందుచున్నాఁడు" (౧౭. ౩) అని భగవద్గీతలయందును జెప్పఁబడినది. ఉపాసకుని యధికారభేదానుసారముగ నుపాస్యము, నవ్యక్తము నగుపరమేశ్వరునియొక్క గుణములు నుపనిషత్తులయందు వేర్వేఱుగ వర్ణింపఁబడినవి. ఉపనిషత్తులయం దీప్రకరణమును 'విద్య' యని చెప్పుచున్నారు. విద్యయనఁగా నీశ్వరప్రాప్తి యొక్క (ఉపాసనారూప) మార్గము. మఱియు నది యేప్రకరణమునఁ జెప్పఁబడినదో తదను దానికిఁగూడ 'విద్య' యనియే పేరు. 'శాండిల్యవిద్య' (ఛాం. ౩. ౧౪) 'పురుషవిద్య' (ఛాం. ౩. ౧౬-౧౭) 'పర్యంకవిద్య' (కౌషీ. ౧). 'ప్రాణోపాసన' (కౌషీ. ౨) మొదలయిన యనేకవిధోపాసన లుపనిషత్తులలోఁ జెప్పఁబడినవి. అవి యన్నియు వేదాంతసూత్రములలోని మూఁడవయధ్యాయముయొక్క మూఁడవపాదమునందు వివేచనచేయఁబడినవి. ఈప్రకరణమునం దవ్యక్తపరమేశ్వరుఁడే, మనోమయుఁడు, ప్రాణశరీరుఁడు, భారూపుఁడు, సత్యసంకల్పుఁడు ఆకాశాత్ముఁడు, సర్వకర్ముఁడు, సర్వకాముఁడు, సర్వగంధుఁడు, సర్వరసుఁడుగా నున్నాఁడని సగుణత్వమే వర్ణింపఁబడినది (ఛాం. ౩. ౧౪. ౨). కావున తైత్తిరీయోపనిషత్తునందు అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, ఆనందము నను నీరూపములచే బ్రహ్మోపాసన క్రమముగ మెట్లెక్కినట్లు చెప్పఁబడినది. (తై. ౨. ౧-౫; ౩. ౨-౬) బృహదారణ్యకమునందు (౨. ౧.) గార్గ్యుఁ డగుబాలాకి యజాతశత్రుఁ డనురాజునకు, ఆదిత్యుఁడు, చంద్రుఁడు విద్యుత్తు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, లేక, దిక్కులు, వీనియం దున్న పురుషులు బ్రహ్మస్వరూపములుగ నుపాస్యులని తొలుత చెప్పినాఁడు; కాని సత్యమగు బ్రహ్మ దీనికంటె పరముగనున్నాఁడని యజాతశత్రువు బాలాకికిఁ జెప్పి తుదకు ప్రాణోపాసన ముఖ్యమని చెప్పినాఁడు. అయిన నీపరంపర యిచ్చటనే సమాప్తము కానేరదు. పూర్వోక్త మగుసకలబ్రహ్మస్వరూపములను 'ప్రతీకములు' (అనఁగా: నుపాసనార్థమై తీసికొనఁబడినగౌణస్వరూపములు), లేక, 'బ్రహ్మనిదర్శకచిహ్నము' లని చెప్పుచున్నారు. ఈస్వరూపమునే మూర్తిరూపముగ నేత్రములయెదుట నునిచితి మేని ప్రతిమ యగును; కాని వాస్తవికమగు బ్రహ్మస్వరూపము దీనికంటె భిన్నముగ నున్నదని సర్వోపనిషత్తుల సిద్ధాంతమయి యున్నది. (కేన. ౧. ౨-౮) ఈబ్రహ్మలక్షణములను జెప్పుచు ననేకస్థలములందు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" (తైత్తి. ౨. ౧) "విజ్ఞాన మానందం బ్రహ్మ" (బృ. ౩. ౯. ౨౮) — "బ్రహ్మ సత్యము (సత్), జ్ఞానము (చిత్), మఱియు ఆనందరూపము, లేక, సచ్చిదానందరూపముగ

నున్నది.'' అని సకలగుణములను త్రిగుణములలో నంతర్భావముఁజేసి వ్యాఖ్యాన మొనర్చిరి. మఱికొన్నిస్థలములయందు భగవద్గీతానుసారముగ "బ్రహ్మ సత్తును కానేరదు, అసత్తును కానేరదు'' (ఋ. ౧౦. ౧౨౯. ౧), లేక, "అణోరణీయాన్ మహతో మహీయాన్''—"అణువునకంటె చిన్నది. మహత్తుకంటె మహత్తు'' (కఠ. ౨. ౨౦). "తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే'' "అది చలించునది. చలింపనిది. అది దూరమునందును సమీపమునందు నున్నది.'' (ఈశ. ౫; ముం. ౩. ౧. ౭) మఱియు "సర్వేంద్రియగుణాభాసుఁడైనను సర్వేంద్రియవివర్జితుఁడు (శ్వేత. ౩. ౧౭)'' అని యిటులు పరస్పరవిరుద్ధము లగుగుణము లాతనియందున్నవని చెప్పఁబడినది. తుదకు ఈసర్వలక్షణములను వదలి, "ధర్మాధర్మములకంటెను, కృతాకృతములకంటెను భూతభవిష్యత్తులకంటెను పరమందున్నదే బ్రహ్మమని యెఱుంగుము'' అని మృత్యువుచే నచికేతువునకు బోధింపఁబడినది. (కఠ. ౨. ౧౪); మఱియు నటులె మహాభారతమునం దున్న నారాయణీయధర్మములయందు బ్రహ్మ, రుద్రునకును (మ. భా. శాం. ౩౫౧. ౧౧), మోక్షధర్మములయందు నారదుఁడు, శుకునకును చెప్పిరని యున్నది. (౩౩౧. ౪౪) బృహదారణ్యకోపనిషత్తునందు (౨. ౩. ౨) మొదట, బ్రహ్మయొక్క పృథివియు, జలము, నగ్నియు ననుమూఁడుమూర్తములగు రూపములని చెప్పి, యీయమూర్తముయొక్క సారభూత మగుపురుషుని రూపము, లేక, రంగు మాఱు నని చూపినపిదప, తుదకు 'నేతి నేతి' అనఁగా: "ఇంతవఱకు నేది చెప్పఁబడినదో యది కాదు, అది బ్రహ్మ కానేరదు.'' ఈసర్వమగునామరూపాత్మకమగుమూర్తామూర్తపదార్థములకంటె నేది 'యగ్రాహ్యము' 'అవర్ణనీయము'నగునో దానిని పరబ్రహ్మగా నెఱుఁగుమని యుపదేశింపఁబడినది. (బృ. ౨. ౬; వే. సూ. ౩. ౨. ౨౨.) వేయేల? చెప్పుట శక్యము లగుపదార్థముల యన్నింటికంటెను బరముగ నున్నదె బ్రహ్మమగుటచే నవ్యక్తము నిర్గుణము నయినస్వరూపమును జ్ఞాపకుటకు 'నేతి నేతి' యనునది యొకచిన్ననిర్దేశము, లేక, ఆదేశము, సూత్రము, గుర్తు. కావుననే బృహదారణ్యకోపనిషత్తునందే యది నాలుగుపర్యాయములు చెప్పఁబడినది (౩. ౯. ౨౬; ౪. ౨. ౪; ౪. ౪. ౨౨; ౪. ౫. ౧౫). మఱియు నటులే యితరములగు నుపనిషత్తులలోను "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ'' (తై. ౨. ౯), "అద్రేశ్యం (అదృశ్యము) అగ్రాహ్యం'' (ముం. ౧. ౧. ౬), "న చక్షుషా గృహ్యతే నాఽపి వాచా''(ముం. ౩. ౧. ౮.)—నేత్రములకు గోచరింపనిదియు, వాక్కుతోఁ జెప్పనలవిగానిదియు—

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథాఽరసం నిత్య మగంధవచ్చ యత్,
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తన్మృత్యుముఖా త్ప్రముచ్యతే" (కఠ. 3. ౧౫)

"పంచమహాభూతములయొక్క శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము ననునైదుగుణములు లేనివాఁడును, అనాదిభూతుఁడు, ననంతుఁడు, నవ్యయుఁడును" అని పరబ్రహ్మమయొక్క నిర్గుణము నచింత్యము నగుస్వరూపము చెప్పఁబడినది. (వే. సూ. 3. ౨. ౨౨-3౦; చూడుము). మహాభారతము శాంతిపర్వములో నున్న నారాయణీయ, లేక, భాగవత ధర్మములఁ జెప్పినప్పుడును భగవంతుఁడు తననిజ మగుస్వరూపమును "అదృశ్యము, అఘ్రేయము, అస్పృశ్యము, నిర్గుణము, నిష్కలము, (నిరవయవము,) అజము, నిత్యము, శాశ్వతము నిష్క్రియము నగుచు నున్న"దని నారదునకుఁ జెప్పి, తన్నే "వాసుదేవ పరమాత్మ"యని చెప్పుచున్నారనియు, తానె, సృష్టిస్థితిలయములను జేయు త్రిగుణాతీతుఁ డగుపరమేశ్వరుఁడుగ నున్నాఁడనియు చెప్పియున్నాఁడు. (మ. భా. శాం. 33౯. ౨౧-౨౮)

భగవద్గీతలయందే కాక, మహాభారతాంతర్గతనారాయణీయ, లేక, భాగవత ధర్మములయందును, బరమేశ్వరునియొక్క వ్యక్తస్వరూపముకంటె నవ్యక్తస్వరూపము శ్రేష్ఠ మని చెప్పఁబడెను. మఱియు నీశ్రేష్ఠమగు నవ్యక్తస్వరూపము మరల సగుణ మనియు, సగుణ-నిర్గుణమనియుఁ దుదకుఁ గేవలనిర్గుణ మనియు, మూఁడువిధములుగ చెప్పఁబడినట్లు పూర్వోక్తములగువచనములవలనఁ దెలియు. అవ్యక్తమును, శ్రేష్ఠము నగుస్వరూపమునకును బరస్పరవిరుద్ధములగు నీమూఁడుస్వరూపములకును సంబంధమెట్లుండును? ఈమూఁడింటిలోను సగుణనిర్గుణమను నుభయాత్మకరూపమే, సగుణమునుండి నిర్గుణమునందు (లేక, యజ్ఞేయమునందు)ఁ జేరుటకు మార్గము, లేక, సాధనముగ నున్నదని యెఱుంగవచ్చును. కారణమేమియనఁగా—తొలుత సగుణరూపజ్ఞానము కలిగినపిదప, క్రమముగా నొక్కొక్కగుణమును వదలుటచే నిర్గుణస్వరూప మనుభవగోచరమగును; ఈవిధమున నే బ్రహ్మప్రతీకముయొక్క యుపాసన యుపనిషత్తులలో నెట్లెన్నఁటుల చెప్పఁబడినది. ఉదాహరణ మేమనగా:—తైత్తిరీయోపనిషత్తులోని భృగువల్లియందు మొదట నన్నమే బ్రహ్మ మని భృగువునకు బ్రహ్మచే నుపదేశింపఁబడినది. అనంతరమున, క్రమముగ, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, ఆనందము నని బ్రహ్మస్వరూప మతనికిఁ దెలుపఁబడినది.

(తైత్తి.౩. ౨-౬) లేక, నిర్గుణమును, గుణబోధకము లగువిశేషణములచే వర్ణించుట యెప్పుడు శక్యము కానేరదు. కావున పరస్పరవిరుద్ధము లగువిశేషణములచే నాత నిని వర్ణించుట యుక్త మనియు చెప్పవచ్చును. కారణమేమనఁగా: 'దూర' శబ్ద మునుగాని 'సత్' అను శబ్దమును గాని యుచ్చరించితిమేని యేదైన మఱియొకవస్తువు సమీపముగ నున్నదని కాని, లేక, అసత్తుగ నున్నదని కాని మనస్సునకుఁ దెలియు చుండును. కాని యొక బ్రహ్మమే యంతట నిండియుండఁగా నాబ్రహ్మకు దూర మని కాని, 'సత్' అని కాని విశేషణములున్న నది దేనికిసమీపమున నున్నదనియు, 'అసత్' దానికంటె నేదియనియు చెప్పుదుము? ఈకారణమున, "దూరమున లేదు. సమీప మున కానరాదు. సత్తుకానేరదు. అసత్తును గానేరదు." అను నీసంభాషణచే దూర మును సమీపమును, 'సత్-అసత్' మొదలగు పరస్పరసాపేక్షగుణముల జంటలు గాక మిగిలిననిర్గుణమే యన్నిచోట్ల, సదా నిరపేక్షముగను స్వతంత్రముగ నుండు నదియగు బ్రహ్మ మని తెలియుటకుఁ బరస్పరవిరుద్ధము లగువిశేషణములు కలిగిన యీభాషనే వ్యవహారములో నుపయోగింపవలయును. ఇంతకంటెగత్యంతరము లేదు. (గీ. ౧౩. ౧౨). ఉన్నదంతయు బ్రహ్మమే యగుటచే, దూరమందును నదియె, సమీపమునందు నదియె, సదసత్తులు నదియే యగును. కావున మఱియొక దృష్టితోఁ జూచితిమేని యీబ్రహ్మను బరస్పరవిరుద్ధములగు విశేషణములచే నొక కాలమునందే రెండుగుణములు నున్నటుల చెప్పినను [illegible]వచ్చును. (గీ. ౧౧. ౩౭; ౧౩. ౧౫) కాని, సగుణ-నిర్గుణమని యుభయవిధముల 'నేతి నేతి' [illegible]ని కిట్లుపపత్తి గాన్పించినను; సగుణ-నిర్గుణము లనునీపరస్పరవిరుద్ధస్వరూపము." ఈకొక పరమేశ్వరు నికే యెట్లు సంభవించు నను ప్రశ్నకు వివరణము మిగిలియే యున్నది. అవ్యక్తుఁ డగుపరమేశ్వరుఁడు వ్యక్తమగు, లేక, యింద్రియగోచరమగు స్వరూపమును ధరిం చుటయె యాతనిమాయగనున్నది; కాని వ్యక్తము, లేక, యింద్రియగోచరముగాక యవ్యక్తముగనే యుండి నిర్గుణము సగుణ మైనప్పుడు దాని నేమనిచెప్పవలయును? ఉదాహరణము:—నిరాకారుఁడగు నొకపరమేశ్వరుని, ఒకఁడు "నేతి నేతి" యని యు, నిర్గుణుఁడనియు, నొకఁడు సర్వగుణసంపన్నుఁడు, సర్వకర్మ యనియు, దయాళు వనియు, సగుణుఁడనియుఁ దలఁచుచున్నారు. అప్పుడు దీనికి కారణ మేమనియు, లేక, యిందుల్లో శ్రేష్ఠమగు పక్షమేదియనియు, ఈనిర్గుణావ్యక్తబ్రహ్మయందుండి సర్వవ్యక్తసృష్టియు నెటులుత్పన్న మైనదనియు బాగుగ వ్యాఖ్యానముఁ జేయుట యావశ్యకము. సర్వసంకల్పములకు దాతయు నవ్యక్తుఁడు నగుపరమేశ్వరుఁడు యథార్థముగ సగుణుఁ డగుటచేతనే యుపనిషత్తులయందును, గీతలయందును వర్ణిం

బడిన నిర్గుణస్వరూపముయొక్క వర్ణన యతిశయోక్తిగఁ గాని, లేక, స్వర్గమైన ప్రశంసాపరముగఁ గాని యున్నదని చెప్పుట యధ్యాత్మశాస్త్రముయొక్క మూలాధారమును ఛేదించుటయే. కారణ మేమన — గొప్పఋషీశ్వరులు మనస్సు నేకాగ్రపఱచి జేసికొనుటచే సూక్ష్మము శాంతము నగు విచారముచే "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (తై. ౨. ౯) "ఏదిమనస్సునకైనను దుర్గమమగునో, దేనిని వర్ణింప శక్తిలేదో", ఏది బ్రహ్మస్వరూపముగ నున్నదని తుదకు సిద్ధాంతము చేయఁబడినదో, యట్టి యనుభవము అతిశయోక్తి యని, నామనస్సునకు ననంతము నిర్గుణము నగు బ్రహ్మముయొక్క యవగాహనము గాక యుండుటవలన, సత్యబ్రహ్మము సగుణమే యయి యుండవలయునని నుడువుట, సూర్యునికంటె నాదివిటీ బహుకాంతి గలది యనుటవలె నుండునందురు. ఒకసమయమున నీనిర్గుణస్వరూపోపపత్తి యుపనిషత్తులలోనైన, లేక, గీతలలోనైన లేనియెడల నావిషయము వేఱెయగును కాని వాస్తవముగ సత్యబ్రహ్మము సగుణము కానేరదు. భగవద్గీతలలో పరమేశ్వరునియొక్క శ్రేష్ఠము సత్యము నగుస్వరూపమవ్యక్తముగనే యున్న దనియు, నతఁడు వ్యక్తరూపమును ధరించుట యాతని మాయయై యున్నదనియు, స్పష్టముగఁ జెప్పఁబడినది (గీ. ౪. ౬) ఇంతియ కాదు. ఇఁక నేమన: ప్రకృతియొక్క గుణములచే "మోహము నొందిన మూర్ఖలోకము, (అవ్యక్తము, నిర్గుణము నగు) ఆత్మకే కర్తృత్వ మున్నదని యెన్నుచున్నది." (గీ. ౩. ౨౭—౨౯;) ఈశ్వరుఁడేమియు చేయుట లేదు. అజ్ఞానముచే లోకులు బద్ధులగుచున్నారు (గీ. ౫. ౧౫); అనఁగా: అవ్యక్త మగునాత్మ, లేక, పరమేశుఁడు మొదట నిర్గుణుఁడుగ నుండెను (గీ. ౧౩. ౩౧). ఆతనియందుఁ గర్తృత్వాదిగుణములను మోహముచేనైన నజ్ఞానముచేనైన నారోపించి యాతనిని సగుణునిగ నవ్యక్తునిగఁ జేయుచున్నారు. (గీ. ౭. ౨౪) (౧) గీతలయందు పరమేశునివ్యక్తస్వరూపము విశేషముగ వర్ణింపఁబడినను, పరమేశుని మూలభూతమును శ్రేష్ఠము నగుస్వరూపము నిర్గుణము నవ్యక్తము నయి యున్నది. మనుష్యులజ్ఞానముచేఁ గాని, మోహముచేఁగాని యతనిని సగుణుఁ డని యనుకొనుచున్నారు. (౨) సాంఖ్యులప్రకృతి, లేక, దానియొక్క వ్యక్తమగుదు కార్యము (అనఁగా: సర్వజగత్తు) పరమేశునిమాయయైయున్నది. (౩) సాంఖ్యుల 'పురుషుఁడు' (అనఁగా: జీవాత్మ) ప్రారంభమునుండియుఁ బరమేశ్వరరూపుఁడును, పరమేశునివలె నిర్గుణుఁడు నకర్తగ నున్నాఁడు; కాని అజ్ఞానముచే నతనిని లోకులు కర్తగఁ దలంచుచున్నారు. ఇదియే పరమేశ్వరస్వరూపసంబంధములో గీతయొక్క

సత్య మగుసిద్ధాన్తముగ నున్న దని పైవివేచనవలన నిష్పన్న మగును. వేదాన్తశాస్త్ర సిద్ధాన్తము నిదియే. కాని పిదప నుత్పన్నము లైనవేదాన్తగ్రంథములలో నీసిద్ధాన్తమును జెప్పుచు 'మాయా ఽవిద్యలకు' రెంటికిని కొంచెము భేదము సెప్పఁబడినది. ఉదాహరణము:—పంచదశిలో నాత్మయు, పరబ్రహ్మము నను నీరెండును బ్రారంభమున నేకస్వరూపమే యగుటచే నీచిత్స్వరూపి యగుబ్రహ్మము మాయయందుఁ బ్రతిబింబితుఁ డయినపుడు సత్వరజస్తమోమయగుణ మగు (సాంఖ్యులయొక్క మూల) ప్రకృతి నిర్మిత మగు నని తొలుతఁ జెప్పఁబడినది; కాని, తర్వాతగ్రంథములో నీమాయకే 'మాయ' యనియు 'అవిద్య' యనియు, భేదముఁ గల్పించి, “మాయయందుఁ ద్రిగుణములలో శుద్ధమైనసత్వగుణము వృద్ధియయినపు డది మాయగానే యుండును. మఱియు నీమాయయందుఁ బ్రతిబింబించినబ్రహ్మము సగుణము, అనఁగా: వ్యక్తుఁ డగునీశ్వరుఁడు (హిరణ్యగర్భుఁడు)” అని చెప్పినారు. మఱియు నీసత్వగుణమే కొంచెము 'అశుద్ధ'మగునేని యది యే 'యవిద్య' యగును. దానియందుఁ బ్రతిఫలించిన బ్రహ్మమును 'జీవుఁ'డని చెప్పుదురు (పంచ ౧. ౧౫-౧౭). ఇట్లు విచారించితి మేని పరబ్రహ్మమందుండి 'వ్యక్త మగునీశ్వరుఁడు' నిర్మితుఁ డగుటకు కారణము 'మాయ' యనియు, 'జీవుని' నిర్మించుటకు కారణ 'మవిద్య' యనియు, స్వరూపమునుబట్టి యొక్కటే యగుమాయకు భేదములు సేయవలసి వచ్చుచున్నది; కాని గీతలలో నిట్లు భేదములు సెప్పఁ బడలేదు. “భగవంతుఁడు స్వయముగ, నేమాయచే వ్యక్త మగు (అనఁగా: సగుణమైన) రూపమును ధరించెనో (౭. ౨౫) లేక, యేమాయచే నష్టధాప్రకృతి (అనఁగా: సృష్టియందలిసకలవిభూతియు) యెవరియందుండి యుత్పన్న మగుచున్నదో (౪. ౬) యామాయయొక్క యజ్ఞానముచే జీవుఁడు మోహమును బొందు చున్నాఁడు.” (౭. ౪-౧౫) అని గీతలలోఁ జెప్పఁబడినది. అవిద్య యనుశబ్దము గీతలలో నెక్కడను లేదు. మఱియు శ్వేతాశ్వతరోపనిషత్తులో మాయామయ మగుప్రపంచమే 'అవిద్య' అని స్పష్టముగఁ జెప్పఁబడినది. (శ్వేత ౫. ౧) గాన నవీనవేదాన్తగ్రంథములలోఁ గేవలనిరూపణాసౌలభ్యముకొఱకుఁ జీవేశ్వరదృష్టిచేఁ జేయఁబడిన యవిద్యయు, మాయయు నను నీసూక్ష్మభేదము నొప్పుకొనక, మాయయు, అవిద్యయు, అజ్ఞానము అనుశబ్దములు సమానార్థకము లని చెప్పి, యీత్రిగుణాత్మక మాయయొక్క గాని, అవిద్యయొక్క, లేక, యజ్ఞానమునయొక్కయు మోహమునయొక్కయుఁ గాని సత్య మగు స్వరూపము సామాన్యమేగ నేది యనియు, గీతలయందు నుపనిషత్తులయందు

నున్న సిద్ధాన్తములకు దానిచే నెటు లుపపత్తి గలుఁగు ననియు నను నీవిషయమును శాస్త్రరీతిగ సంక్షేపముగ నిప్పుడు వివేచనఁ జేయుదము.

నిర్గుణ-సగుణశబ్దములు, చూపులకుఁ జిన్నవిగఁ గాన్పించినను వానియం దెంతేని యర్థము లున్నవో వానిని విచారించితి మేని, సత్యముగ సర్వబ్రహ్మాండమును కన్నుల యెదుట నిలువఁబడి యుండును. జగత్తునకు మూల మగునట్టి పరబ్రహ్మ మేకము, నిష్క్రియము, నుదాసీనము నయి యుండఁగ, దానియందే మనుష్యుల కింద్రియ గోచరము లగు ననేకవిధము లగువ్యాపారములుఁ గాని, గుణములుఁ గాని యుత్పన్నము లగుటచే నాయఖండము ఖండములు గల దెటు లాయెను? అనియు, లేక, మొదట నేది యొకటిగ నుండెనో యదియే యనేకముగను వేర్వేఱగువ్యక్తపదార్థములుగను నయి యేవిధముగఁ గాన్పించు ననియు, ఏపరబ్రహ్మమునందు నిర్వికారమగుటచే మాధుర్యము, తిక్తము, కటువు, గట్టితనము, పలుచదనము, శీతము, ఉష్ణము మొదలగుభేదములు లేవో, దానియందే, వేర్వే ఱగురుచియు, కొంచె మెచ్చుతగ్గుగ గట్టితనము-పలచదనము, లేక, చల్లదనము-వేఁడి, సుఖము-దుఃఖము, వెలుతురు-చీఁకటి, మృత్యువు-అమరత్వము, మొదలగు ననేకవిధద్వంద్వము లెట్లుపుట్టు ననియు, ఏబ్రహ్మము శాంతముగ నిర్వాతముగ నుండునో దానియందుండి నానావిధము లగు ధ్వనులు, లేక, శబ్దము లెట్లు పుట్టు ననియు, ఏపరబ్రహ్మమునందు, లోపల వెలుపల యని కాని, దూరము సమీపము నని కాని భేదములు లేవో దానియందే, వెనుక ముందు, దూరము దగ్గఱ, తూర్పు పడమర, మొదలగుభేదము లెట్లుకలుగు ననియు, ఏపరబ్రహ్మము అవికారియు, త్రికాలాబాధితము, నిత్యము, అమృతము నగునో దానియందుండి యాయాకాలములలో నాశమునొందుపదార్థము లెట్లుపుట్టుననియు, దేనికి కార్యకారణరూపస్పర్శయే లేదో యట్టిపరబ్రహ్మము మృత్తిక, ఘటము మొదలగు కార్యకారణరూపములచే మనకు దృగ్గోచర మేల యగుచున్న దనియు, మొదలగు ననేకవిషయములు పూర్వోక్తము లగుచిన్న (సగుణ-నిర్గుణ) శబ్దముల లోనే యిమిడి యున్నవి. లేక, సంక్షేపముగ చెప్పుదు మేని యొకనికే నానాత్వము, నిర్ద్వంద్వమునకు అనేకవిధము లగుద్వంద్వములును, అద్వైతమునకే ద్వైతమును, అసంగునకే సంగమును నెట్లు కలిగె ననువిషయ మిచ్చట విచారింప వలయును. సాంఖ్యులు, నిత్యుఁడు నిర్గుణుఁడు నగుపురుషుఁడువలెనే త్రిగుణాత్మక మగు (అనఁగా: సగుణమగు) ప్రకృతియు, నిత్యమును స్వతంత్రముగ నున్న దని ప్రారంభముననే ద్వైతమును గల్పించుటచే నీయసందర్భము దూరముగఁ దొలంగునట్లు చేసిరి,

కావున జగత్తుయొక్క మూలతత్త్వమును శోధించి నిర్ణయించుమనుజునియొక్క స్వాభావికమనఃప్రవృత్తికి, ఈద్వైతముచే సమాధానము కాకపోవుటయే కాక, యుక్తివాదమునకుఁగూడ నిట్టిద్వైతము నిలువ నేరదు. కావున ప్రకృతి-పురుషులకంటె పరముగ విచారించి, సచ్చిదానందబ్రహ్మమునకు సైతము పైసోపాన మగునిర్గుణబ్రహ్మమే, జగత్తునకు మూలముగ నున్న దని యుపనిషత్కారులు సిద్ధాంతీకరించిరి; కాని యిప్పుడు నిర్గుణమునందుండి సగుణ మెట్లుత్పన్నమైన దనుదానికి నుపపత్తి చెప్పవలయును. కారణ మేమి యనఁగా: "ఏది లేదో యది లేనే లేదు; దానియందు, ఉండునది యెప్పుడును కలుగ నేరదు." అని సాంఖ్యము యొక్కయు, వేదాంతము యొక్కయు సిద్ధాంతము. ఈసిద్ధాంతానుసారముగ నిర్గుణమునుండి (అనఁగా: దేనియందు గుణము లేదో యాబ్రహ్మమునందుండి) సగుణములు (అనఁగా: దేనియందు గుణము లున్నవో అట్టిసృష్టియందలిపదార్థములు) ఉత్పన్నము లగుట శక్యము కానేరదు. కాని "సగుణ మెక్కడినుండి వచ్చినది? సగుణ మని చెప్పకపోవుదు మేని నేత్రముల కెదుట యెట్లు కాన్పించును? నిర్గుణమువలె సగుణము సత్యమే" యని చెప్పుదు మేని యింద్రియగోచరము లగుశబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము మొదలగు సకలగుణస్వరూపములు, నేఁ డొకవిధముగను, రే పొకవిధముగను నెప్పుడును పరిణమించును. కావుననే నాశమునొందునదియు, వికారియు, నశాశ్వతము నగును. కావున సగుణసిద్ధికొఱకైనను (సర్వవ్యాపి యగుపరమేశుఁడు విభాజ్యుఁ డని కల్పించి) నశ్వరుఁడుగ నున్నాఁ డని చెప్పవలసి వచ్చును. మఱియు విభాజ్యముసైతము నశ్వర మగుటచే సృష్టినియమముయొక్క యల్లరిలో నెప్పుడును పరతత్త్వముగ సంచరించువానిని పరమేశ్వరుఁ డని యెట్లు చెప్పవలయును! ఇంద్రియగోచరము లగుసకలసగుణపదార్థములు, పంచమహాభూతములయందుండి నిర్మితము లైనవి యని తెలిసికొనవలయును. వేదాంతులవలెఁ గాని, యాధిభౌతికులవలెఁగాని యీసర్వపదార్థములును, వ్యక్తముగాని, సగుణముగాని యగు మూలప్రకృతియందుండి నిర్మితములయిన వని యనుమానము నైనను జేయవలయు నని సారాంశము. ఏపక్షమును స్వీకరించిన, నశ్వరము లగుగుణము లెంతవఱకు నీమూలప్రకృతిని వదలిపోవో, యంతవఱకును, పంచమహాభూతములు, లేక, ప్రకృతిమూలమగు నీమూలపదార్థము జగత్తున నశింపనిదియై, స్వతంత్రముగను, లేక, యనుమగుతత్త్వముగను నున్నదని యనుటకు వీలులేదనువిషయము నిర్వివాదముగ యున్నది. కావున నెవరికి ప్రకృతివాద మిష్టమో వారు పరమేశ్వరుఁడు నిత్యుఁ

స్వతంత్రుఁడు నమృతుఁడుగ నున్నాఁడని చెప్పుటను వదలవలయును. కానిచో, పంచమహాభూతములకంటె, లేక, ప్రకృతికంటె, సగుణమగు మూలప్రకృతికంటె పరముగా నున్నవిషయ మేమి యని శోధింపవలయును. ఇందుకన్న వేఱుమార్గము లేదు. ఎండమావులలోని నీటిచే దప్పిపోవుటయును, ఇసుకనుండి తైలముఁ దీయుటయు నెట్లు శక్యము కానేరదో, యటులే యేది జాగుగ నశ్వరమై యున్నదో దానియందుండి యెప్పుడైన నమృతత్వము నిష్పన్న మగుట యశక్య మగును. కావున నెంతసంపద కలిగినను, "అమృతత్వస్యతు నాశా ఽ స్తి విత్తేన" "సంపదచే నమృతత్వము లభించు నని యాశింప వలదు" (బృ. ౨.౪.౨) అని యాజ్ఞవల్క్యులు, మైత్రేయికి స్పష్టముగనే చెప్పిరి. అమృతత్వ మసత్య మంచు వేసి, రాజిచ్చిన యీనామము (బహుమానము) మనకు పిదప మనపుత్రపౌత్రాదులకు నాచంద్రార్కముగ ననుభవింపఁదగినదిగ నుండవలయు నని మనుజుఁడు గోరుచుండును. లేక చిరకాలస్థాయి యగు (అనఁగా: శాశ్వత మగు) కీర్తి లభించునట్టికార్యము కలిగెనేని మనజీవితముపోయినను సరియే లక్ష్యము చేయనట్లు కాన్పించుచున్నది. ఋగ్వేదమువంటి యత్యంతప్రాచీనగ్రంథములో "ఓయింద్రా! నీవు నాకు 'అక్షిత శ్రవము', అనఁగా: అక్షయ్య మగుకీర్తిని, లేక, ధనమును నిమ్ము." (ఋ. ౧.౯.౭) అనియు, "ఓసోమా! నీవు నన్ను వైవస్వత (యమ) లోకమున నమృతునిగాఁ జేయుము." (ఋ. ౯.౧౧౩.౮) అనియు, పూర్వఋషులు ప్రార్థించుచున్నారు. మఱియు నర్వాచీనకాలమునందు నీదృష్టినే స్వీకరించుటచే "శీఘ్రముగ ననుభవము లోనికి వచ్చినసుఖమును మఱవక ఇప్పు డున్నదియు, ఇఁక ముందు పుట్టఁబోవునదియు నగు మానవజాతికి చిరకాల ముందుసుఖమును గలుగఁజేయుటయనునదియే యీజగత్తునంచు మనుష్యమాత్రునకు నీతిసిద్ధ మగుపరమకర్తవ్యముగ నున్న" దని స్పెన్సరు, కాంటువంటిముఖ్యు లగునాధిభౌతికపండితులు చెప్పుచున్నారు. తన శక్తి (జీవితమునకు) దూరమునం దున్న నిరంతరకల్యాణము (అనఁగా: అమృతత్వము) ఎందుండి వచ్చినది? అది స్వాభావిక మని నుడివినచో, ఈవినాశులగు [illegible]వస్తువులకంటెను, పరమున నొకయమృతవస్తు వున్నదని చెప్పవలసి వచ్చును. మఱియు నీయమృతవస్తువు లేదని చెప్పినయెడల మనకు ప్రత్యక్షముగ నున్నమనోవృత్తియొక్క యనుభవమును మఱియొకవిధమున సమర్థించుటకు సాధ్యము కానేరదు. ఇట్టి యనుపపత్తి మనస్సున నిడుకొని యీప్రశ్న యేనాఁటికిని సమాధానము చెప్పఁదగినది కానేరదు. కావున దానిని విచారింపక, దృశ్యసృష్టియం దున్న పదార్థముల యొక్క గుణధర్మములకంటె మనస్సును పరువిడనీయకూడదని యనేకు లాధిభౌతిక

పండితు లుపదేశముఁ జేయుచున్నారు. ఉపదేశము సులభముగఁ గాన్పించును; కాని మనుజులమనస్సునందు,తత్త్వజ్ఞానము కావలయునని స్వాభావికముగఁ గలుగు కోరిక నెవరు మానుపఁ గలరు? మఱియు నీయధిక మగుజిజ్ఞాస (ఎఱుంగవలయు ననుకోరిక) నొకపరి యణఁగిఁ ద్రొక్కినచో విజ్ఞాన మెట్లు వృద్ధి యగును?మనుజుఁడీభూమియం దవతరించినది మొదలు సర్వదృశ్యవస్తువులకు నశ్వరసృష్టికిని మూలభూతము నమృతము నగుతత్త్వ మేది యనియు, అది నా కెటుల ప్రాప్త మగు ననియు విచారము నెప్పుడును చేయుచునే యున్నాఁడు. ఆధిభౌతికశాస్త్ర మెంత వృద్ధిఁ బొందినను, అమృతత్వముయొక్క జ్ఞానముకొఱకైన యీస్వాభావికప్రవృత్తి సదామనుష్యునకు తప్పక కానేరదు. మనుజునియాధిభౌతికజ్ఞానము నంతయైనను వృద్ధిఁ బొందనిమ్ము; ఈసకలాధిభౌతికసృష్టివిజ్ఞానములను నొకవైపునకు నెట్టి, తత్త్వజ్ఞానము మనుజునియెదుట సదా పరువిడుచుండక మానదు. రెండువేలవత్సరంబులకు మును పీస్థితియే యుండెను. మఱియు నిప్పుడు పాశ్చాత్త్యులదేశమునందుసైత మావిధముగనే కాన్పించుచున్నది. వేయేల?మనుష్యబుద్ధియందు కొంత తగ్గినదినమునందే "స వై ముక్తో ఽథవా పశుః" "వాఁడే ముక్తుఁ డగును. కాని యెడల పశువగు"నని చెప్పవలసి వచ్చును.

కానిమ్ము, దిక్కులయొక్కయు కాలముయొక్కయు నియమములేనిదియు, అనవచ్ఛిన్నము, అమృతము, అనాది, స్వతంత్రము, ఏకవిధము, స్వతంత్రము, నిరంతరము, సర్వవ్యాపకము, నిర్గుణము నగుతత్త్వముయొక్క అస్తిత్వవిషయమైనను, లేక, యీనిర్గుణతత్త్వమునుండి సగుణసృష్టి యెట్లువచ్చె ననువిషయమునుగుఱించి యైనను మనప్రాచీనము లగునుపనిషద్గ్రంథములలో నుండునుపపాదనకంటె నధికముగను సయుక్తికముగను ,నితరదేశములలో నుండుతత్త్వజ్ఞానులు నేఁటివఱకును-శోధించియు నిర్ణయింప లేదు. అర్వాచీనుఁ డగు కొంటు తత్త్వజ్ఞుఁడు బాహ్యసృష్టియొక్క-నానాత్వము నేకత్వముగ నెట్లెఱుంగవలయు ననిసూక్ష్మముగ విచారించి యీయుపపత్తినె యర్వాచీనశాస్త్రరీతిగ నధిక స్పష్టముగ వ్రాసినాఁడు. కొంటుకంటె, 'హెకెల్' ఎక్కువలోతుగ విచారించినను వీనిసిద్ధాన్తముసైతము వేదాన్తమునకంటె మించలేదు. 'సోపెన్హాయర్' అను వానివిషయమును ఇటులే యున్నది.అతఁడు, లాటిన్భాషలో తర్జుమా చేయఁబడినయుపనిషత్తులను జదువుకొనినపిదప, "జగత్తులో నున్నవాఙ్మయమునం దీ యత్యుత్తమ మగు గ్రంథమునుండి, మనగ్రంథములలోనికి కొంతవిచారము తే

కొనఁబడిన"దని తానె చెప్పినాఁడు; కాని యీగూఢమగువిచారమును దానికి
సాధకబాధకము లగుప్రమాణములును, వేదాంత మందలిసిద్ధాంతములును, కాంటు
మొదలగుపాశ్చాత్యతత్త్వజ్ఞానులసిద్ధాంతమునకును దీనికిని నెంతసాదృశ్యము కలదో
యెంతవైషమ్యముగలదో యదియును, గీత, యుపనిషత్తులు, వేదాంతసూత్రములు
మొదలగుప్రాచీనగ్రంథములందున్న వేదాంతమునకును, తదుత్తరకాలికము లగు
వేదాంతమునకును స్థూలసూక్ష్మము లగుభేదము లేవియనునదియును, మొదలగువిషయ
ముల నీచిన్నగ్రంథమున సవిస్తరముగ నిరూపించుట శక్యము కానేరదు.
కావున గీతలయం దున్నయధ్యాత్మసిద్ధాంతములయొక్క సత్యతను, యుక్తిని, మహ
త్త్వమును తెలియఁజేయుట కావశ్యకము లగుభాగములనె ముఖ్యముగ నుపనిషత్తుల
యొక్కయు, వేదాంతసూత్రములయొక్కయు, శాంకరభాష్యముయొక్కయు
నాధారమున నిచ్చో నేను దిగ్దర్శనన్యాయముననే నిరూపింతును. ప్రకృతి-పురు
ష లనుసాంఖ్యోక్తమగుద్వైతముకంటె పరముగ నేమియున్నదని నిర్ణయించుట
కై, సృష్టిని చూచువాఁడును (ద్రష్ట), దృశ్యమగుసృష్టియు ననునీద్వైతభేదము
నందే నిలచియుండక, మొదట సృష్టిజ్ఞానముయొక్క స్వరూప మేమి? అది దేనిచే
నేవిధముగఁ గలుగు ననునీవిషయములను సూక్ష్మముగ విచారింపవలసివచ్చును.
బాహ్యసృష్టి యందలిపదార్థములు మనుష్యులనేత్రముల కెట్టులు గాన్పించునో
యట్టులే పశువులకుసైతము కాన్పించును; కాని, నేత్రములు నాసిక మొదలగు
జ్ఞానేంద్రియములచే మనస్సున సమకూరుసంస్కారముల నొక్కటిగఁ జేయుశక్తి
మనుజునియందు విశేషముగ నుండుటచే,మనుజునకు బాహ్యసృష్టియందున్న యన్ని
పదార్థములయొక్క జ్ఞానమును గలుగును. అదియే పశువులకంటె మనుజునియం
దుండువిశేషమే. ఈవిశేషము ఫలము గాఁగలయేకీకరణశక్తి మనోబుద్ధులకంటె
పరమగు నాత్మకుసంబంధించినదే యని పూర్వము క్షేత్రక్షేత్రజ్ఞవిచారములోఁ
జెప్పఁబడినది.కేవల మొకపదార్థముయొక్క కార్యకారణభావమే కాక, సృష్టినియ
మము లనఁబడు నానాపదార్థములయొక్క కార్యకారణభావము మొదలగు అన్ని
సంబంధములజ్ఞానముసైతము నాత్మసంబంధమైనదియే. కారణ మేమన: ఆయా
పదార్థములు కంటికి కాన్పించినను, వానియందలి కార్యకారణభావాదిసంబంధము
ప్రత్యక్షగోచరము కానేరదు. మఱియేమన: ద్రష్ట (చూచువాఁడు) తన మానసిక
వ్యాపారముచే వానిని నిశ్చయించుచున్నాఁడు. ఉదాహరణము:—ఏదైన నొక
పదార్థము మననేత్రములకుఁ గాన్పించెనేని,యాపదార్థముయొక్కరూపమును,గతిని,
వీక్షించి యది యొకసేనలో నున్నసిపాయి (కాలిబంటు) యని ముందుగ మనము

నిశ్చయింతుము. మఱియు నాసంస్కారము మనంబున స్థిరంబుగ నుండును. దీనికి పిదప మఱియొకపదార్థము కంటికిఁగాన్పించెనేని మరల నామానసిక క్రియ యారంభమగుటచే నాపదార్థము మఱియొకసిపాయి యని మరల నిశ్చయింతుము. ఇటులొకదానివెంబడి ఒకటి వేర్వేఱగులక్షణములతో వేర్వేఱుకాలములయందు మనస్సునకుఁ గలిగినయనేకసంస్కారములను స్మరణశక్తిచే జ్ఞప్తికిఁ దెచ్చుకొని వాని నన్నింటి నొక్కటిగఁ జేసినపిదప పురోభాగమునందుండి సైన్యము నడచిపోవుచున్న దని యెఱుంగుట యీవేర్వేఱు సంస్కారములచేఁ గలిగినయేకత్వజ్ఞానమునకు ఫలమగును. ఈసైన్యముయొక్క వెంబడి వచ్చుపదార్థమును దానిరూపమును బట్టి 'రాజు' అని నిశ్చయించినపిదప, సైన్య మను వెనుకటిసంస్కారముతో నీ నవీనసంస్కారము గలియుటచే నీరాజుయొక్క సైన్యము పోవుచున్నదని మనము చెప్పుచున్నాము. ఇందువలన సృష్టిజ్ఞానము (అనఁగా: ఇంద్రియములకుఁ బ్రత్యక్షముగఁ గాన్పించునది) కేవలజడపదార్థము గానందున, నింద్రియములద్వారా మనస్సునఁ గలుగునసేకసంస్కారములయొక్క యేయేకీకరణమును ద్రష్టయగు నాత్మ సేయుచున్నదో, దానికి జ్ఞానమనునది ఫలముగనున్నదనిచెప్పుట న్యాయ్యమయియున్నది. మఱియు నీకారణముననే భగవద్గీతలయందును "అవిభక్తం విభక్తేషు"— ఏది విభక్తముగ నున్నదో (వేర్వేఱుగనున్నదో) దానియందలి యవిభక్తత్వము లేక, ఏకత్వము దేని మూలమునఁ దెలియునో యదియే సత్యమగుజ్ఞానమని *జ్ఞానలక్షణము సెప్పఁబడినది (గీ. ౧౮. ౨౦). కాని యింద్రియములవలన మనస్సునందు మొదటఁ గలుగుసంస్కారమునకుఁ గారణమేమి యని తిరుగ సూక్ష్మవిచారము చేసితిమేని, కన్ను, చెవి, ముక్కు మొదలగునింద్రియములమూలమున ప్రతిపదార్థముయొక్క రూపము, శబ్దము, గంధము మొదలగు గుణములు మనకుఁ దెలిసినచో బాహ్యగుణములు గలద్రవ్యముయొక్క యంతరంగస్వరూపము మనయింద్రియములకు గోచరము కానేరదు. తడిమట్టినుండి ఘట ముత్పన్న మయినట్లు, మనము చూచుచున్నను తడిమట్టి యని చెప్పఁబడుపదార్థముయొక్క మూలమగుతాత్త్విక స్వరూప మెద్దియో మనకుఁ దెలియదు. జిగురు, తడియుట, మురికిరంగు, లేక, వర్తులాకారము (రూపము), మొదలగుగుణము లింద్రియములవలన మనస్సునకు వేర్వే

---

* Cf. "Knowledge is first produced by the synthesis of what is manifold." Kant's *Critique of Pure Reason*, p. 64. Maxmuller's translation 2nd. Edition.

ఱుగఁ దెలిసినపిదప నాసకలసంస్కారములను 'చూచు' నాత్మ యేకీకరణముఁ జేసి "ఇది తడిమన్ను" అని చెప్పుచున్నాఁడు. మన్నుద్రవ్యముయొక్క గుణములు మనస్సునకుఁ దెలిసినపిదప వాని నేకీకరించి ద్రష్ట (చూచువాఁడు) దానిని ఘట మని చెప్పుచున్నాఁడు. ఏద్రవ్యముయొక్క తాత్త్వికస్వరూపము మాఱినది చెప్పుట కేమియు కారణము లేకపోవుటచే, ఎట్టుప, లోతు నగు నాకృతియు, గట్టిగా పిసఁ బడుధ్వనియు, ఎండుట మొదలగుగుణములు మనస్సునకుఁ దెలిసినపిదప వాని నేకీకరించి ద్రష్ట (చూచువాఁడు) దానిని ఘట మని చెప్పును. ఈమార్పంతయు రూపమునందే యుండుటచే మనస్సునందుఁ బుట్టినయీగుణములయొక్క సంస్కారములను ద్రష్ట యేకీకరణముం జేసె నేని, యొక్క మూలద్రవ్యమునకే యనేక నామములు ప్రాపించునని సారాంశము. ఈయన్నింటికంటె సులభమగు నుదాహరణ మేమి యని యందుమేని సముద్రము తరంగములుగను, సువర్ణ మలంకారములుగ నుండు టయే. కారణ మేమియన: రంగు, కాఠిన్యము, ద్రవత్వము, బరువు, తేలిక మొదలగునవి యొకవిధముగనే యుండును. రూపము, (ఆకారము) నామ మనునవియే యిచ్చో భేదమును బొందుచుండును. ఆహేతువుచేతనే యీసులభ మగుదృష్టాంతము వేదాన్తమునం దెప్పుడును వచ్చుచుండును. సువర్ణ మొక్కటియే యైనను, దానియొక్కయాకారములో నాయాసమయములందుఁ బుట్టుభేద మింద్రియముల మూలమున గ్రహించి సంస్కారముల నొక్కటిగఁ జేర్చి (ద్రష్ట) చూచువాఁడు తత్త్వము నెఱుంగుదృష్టిచే నొక్కటియే యగుమూలద్రవ్యమున కొకసరి కడియ మని, మఱియొకపరి యుంగర మని, వేఱొకపరి కుండలమని, మొదలగు వేర్వేఱు నామము పెట్టును. అయిన నాయాకాలములయందు మాఱుచున్న పదార్థముల ఆకృతులును, నామములును నుపనిషత్తులలో నామరూపము లని చెప్పుదురు గాన నితరములగు నన్నిగుణములును నీనామరూపములలోనే చేరుచున్నవి.(ఛాం.ఉ. ౬.౧ మఱియు ౪;బృ.౧.౪. ౭) కారణ మేమి యన: ఏగుణమును విచారించినను దానికి కొన్నియైనను నామరూపము లుండక తప్పవు. ఈనామరూపములు ప్రతిక్షణము నందు మాఱునవి యైనను వానికి మూలమైనదియు, నీనామరూపములకు వేఱగునదియు, నెప్పుడును మాఱని యొకద్రవ్య ముండును. ఉదకము పై ననేకవిధములగు తరంగములు వచ్చునటులె యొకమూలద్రవ్యముపై ననేక నామరూపము లను తరంగములు వెలువడునని రూఢిగఁ జెప్పనగును. మనయింద్రియములు నామరూపములకంటె వేఱగు నేవిషయమునైన నెఱుంగఁజాలవు. కావున నామరూపముల

కాధార మైనదియు, ఈనామరూపములకంటె వేఱగునదియు నగుమూలమం దున్న ద్రవ్య మింద్రియగోచరము కానిమాట నిజమే; కాని సర్వజగత్తునకు నాధారభూత మగునీతత్త్వ మవ్యక్త (అనఁగా: ఇంద్రియములకు తెలిసికొన శక్యము కానిది) మైనను నది 'సత్' (అనఁగా: సత్యముగ, సర్వకాలములందు, ఈ నామరూపము లందును, వీనిమూలమందును నుండునదియే) కాని, ఎప్పుడు నుండక పోవునది కానేర దని మనము నిశ్చయముగ నూహింపవచ్చును. కారణమేమియన: ఇంద్రియగోచరములగు నామరూపములుదక్క మూలమునం దేమియును లేదని చెప్పితిమేని, కంటెయు, కడియము నను పదార్థములు వేర్వేఱుగ నున్నను అవి యొకసువర్ణముచేతనే నిర్మింపఁబడినవని మనకుఁ గలుగుజ్ఞానమునకు నేమియు నాధారముండ నేరదు. 'కంటెయున్నది, కడియమున్నది' యని మాత్రమే చెప్పఁగలము కాని, కంటె బంగారుకంటె యని చెప్పుటకు వీలులేదు. కావున కంటె సువర్ణ సంబంధమయినది. ఈహారము స్వర్ణసంబంధముగ నున్నదనువాక్యములందు 'ఉన్నది' అని శబ్దముంబట్టియే బంగారమునకును, నామరూపాత్మక మగుకంటెకును, లేక, హారమునకును సంబంధము కలిగించుబంగారము, కుందేటికొమ్మువలె యభావరూపము కానేరదు. కావున, సర్వాభరణములకు నాధారభూతము లగుద్రవ్యాంశములచేతనే 'బంగార' మనుశబ్దమునుండి బోధ యగుచున్నదని యీ న్యాయము వలన ప్రాప్త మగును. ఈ న్యాయమునే సృష్టియందుండు సర్వపదార్థములకు సంబంధింపఁ జేసితిమేని "తాయి, ముత్యము, రూప్యము, లోహము, కట్టెలు మొదలగు మనదృష్టికి కాన్పించుచున్న పదార్థములన్నియు నేదేని యొకనిత్యద్రవ్యముపై వేర్వేఱగు నామరూపము లనుపైపూఁతతోఁ బుట్టుచున్నవి. పూఁత మొదలగు నిఖిలభేదములు నామరూపాత్మకములుగనే యున్నవి; కాని మూలద్రవ్యసంబంధములయినవి కానేరవు. నానాప్రకారము లగు నామరూపములుగల మూలపదార్థమునందు నొకవిధమగుద్రవ్యమే యెప్పుడు నుండు"నని సిద్ధాంత మగును. సర్వపదార్థములందు నిట్లు నిత్యరూపముగ నెప్పుడునుండుటనే సంస్కృతమునందు 'సత్తాసామాన్య' మని చెప్పుచున్నారు.

మనవేదాంతశాస్త్రమునందున్న పూర్వోక్తసిద్ధాంతములె 'కాంటు' మొదలగు నర్వాచీనులగు పాశ్చాత్యతత్త్వజ్ఞానులచే సైత మంగీకరింపఁబడినవి. మఱియు నామరూపాత్మకమగు జగత్తునకు మొట్టమొదట నుండెడిపదార్థ మేదియైనను, నామరూపములకంటె భిన్నము, నదృశ్యమునగుద్రవ్యమునకే వస్తుతత్త్వమనియు, నేత్ర

దీంద్రియములకు గోచరమగు నామరూపములకు పైఁ గాన్పించుదానికి దృశ్యమనియు వారి గ్రంథములలోఁ బేరు పెట్టఁబడినది.* వేదాంతశాస్త్రమునం దెల్లప్పుడును మార్పు నొందెడు నామరూపాత్మకమగుదృశ్యమును 'మిథ్య', లేక, 'నాశవంత' మనియు, మూలద్రవ్యమును 'సత్యము', లేక, 'అమృతము' అనియుఁ జెప్పుట యాచారమై యున్నది. సామాన్యజనులు 'చక్షుర్వై సత్యం', అనఁగా: 'కంటికిఁ గాన్పించు నదియే సత్యము' అని సత్యశబ్దమునకు వ్యాఖ్యానముఁ జేయుచున్నారు. మఱియు వ్యవహారముఁ జూచితిమేని లక్షరూప్యములు మనకు లభించినటుల కలఁ గనుటయు,లక్షరూప్యము లని వినుటయు,లక్షరూప్యములు ప్రత్యక్షముగ లభించుటయు ననువానిలో నెక్కువ నెచ్చుతగ్గు లున్నవని యెవరికిని చెప్ప నక్కఱలేదు. కర్ణాకర్ణికగ నొకకథను వినుటయు దానిని ప్రత్యక్షముగఁ గంటితోఁ జూచుటయు సంభవించినపుడు, చెవియు, కన్నును వీనిరెంటిలో దేనియం దధిక శ్రద్ధ వహింపవలయునో చెప్పుటకై బృహదారణ్యకోపనిషత్తులో 'చక్షుర్వై సత్యం' అను వాక్యము చెప్పఁబడినది (బృ. ౫.౧౪.౪); కాని, 'రూప్య మనుపదార్థము, 'రూప్య' మనుదృశ్యమైన పేరుచేతను, రూపముచేతను (అనఁగా: వర్తులాకారముచేతను) సత్యమగునా? కానేరదా?'యని శాస్త్రమునందు నిర్ణయింపవలసినచో సత్యశబ్దముయొక్క యీసాపేక్ష మగువ్యాఖ్యాన మేమి యుపయోగించును? వ్యవహారమునందును మన మిటులే చూచుచున్నారము. ఏసమయమందైనను పరస్పరసంబంధము లేక యొకప్పు డొకమాటయు,మఱియొకప్పు డింకొకమాటయు నాడువాఁ డబద్ధమాడువాఁ డని లోకు లందురు. రూప్య మను నామరూపములకు (లోపల నున్న ద్రవ్యము మాత్రము కానేరదు) ఈన్యాయము సంబంధించును గాన వానిని సత్యమనియైనను, లేక, మిథ్య యనియైనను ఏల నుడువరాదు? ఇటులనుటకు కారణ మేమి యన: కంటికి నేఁడు కాన్పించెడి రూప్యముయొక్క 'రూప్య'మను నామరూపములను తీసివైచి, దానిస్థానమున 'గొలు'సని, లేక, 'గిన్నె'యని నామరూపములు,

---

* కాంటు యొక్క *Critique of Pure Reason* అను గ్రంథమున నీ విచారము చేయఁబడినది. నామరూపాత్మకమగుజగత్తునకు మూలమగు ద్రవ్యమునకు 'డింగ్ అన్ ఝిశ్' (Ding an Sich=Thing in itself) అని యతఁడు పేరిడెను. దీనికే వస్తుతత్త్వ మని నేనుభాషాంతరీకరించితిని. నామరూపములను పైకి కాన్పించుదృశ్యమునకు 'ఎరశాయనుంగ్' (Erscheinung=appearance) అని కాంటు నామమిడెను. వస్తుతత్త్వ మజ్ఞేయ మని కాంటు చెప్పుచున్నాఁడు.

రేపు పెట్టుటకు వీలున్నది. అనఁగా: నామరూపములయం దెప్పుడును భేద ముండు ననియు, లేక, ఐక్య ముండ దనియు మనకన్నులకుఁ గాన్పించుచు నే యున్నది. ఇంతి యకాక మన నేత్రములకుఁ గాన్పించునది తప్ప మఱియొక పదార్థము సత్యమైనది లేదని వచించితి మేని, యేకీకరణముయొక్క యే మానసిక క్రియయందు సృష్టిజ్ఞానము గలుగుచున్నదో యా క్రియయును నేత్రములకు గోచరింపనిదియే కావున నది అసత్యమని చెప్పవలసివచ్చును. దానినుండి మనకుఁ గలుగు జ్ఞానమంతయుఁగూడ నసత్య మని చెప్పవలసి వచ్చును. దీనినైనను, లేక, యిటువంటి యితరాభ్యంతరములనైనను గనిపెట్టి 'నేత్రములకు గోచరించునదియే సత్య'మనెడు లౌకికమును సాపేక్షము నగు సత్యలక్షణమును నిజ మనక, యేది యవినాశియో (అనఁగా: ఇతరవిషయము నశించినను ఏది యెప్పుడును నశించునది కాకుండునో) యదియే సత్యమని సత్యశబ్దమునకు సర్వోపనిషత్తులయందును వ్యాఖ్యానము చేయఁబడినది. మఱియు నందుమూలముననే మహాభారతమునందును—

"సత్యం నా మావ్యయం నిత్యం అవికారి తథైవ చ"

(మ. భా. శాం. ౧౬౨. ౧౦)

"ఏది యవ్యయమును (అనఁగా: ఎప్పుడును నాశమునొందనిది) నిత్యమును (అనఁగా: ఎప్పుడును స్థిరముగనుండునది), మఱియు నవికారియు (అనఁగా: దేనియొక్క స్వరూప మెప్పుడును మాఱనిదియో) నగునో యదియే సత్యము."—అని సత్యలక్షణము చెప్పఁబడినది. ఇప్పుడొక మాటను, క్షణములో మఱియొక మాటను చెప్పువానిని వ్యవహారములో నన్ృతమాడువాఁ డనుటకును నిదియే కారణముగ నున్నది. సత్యమునకు నీనిరపేక్షమగులక్షణము స్వీకరింపఁబడె నేని, నేత్రములకు గాన్పించినను, క్షణక్షణమును మాఱిపోవు నామరూపము లసత్యములనియు, వానిచే నాచ్ఛాదితమును,-వానికి మూలకారణమును, ఎల్లప్పుడొక తీరుననే యుండు నమృతమగు వస్తుతత్త్వ మనునదియే—కంటికిఁ గాన్పింపకపోయినను—నిజమగు సత్యముగ నున్నదనియు, చెప్పవలసివచ్చును. భగవద్గీతలయందు—"య స్స సర్వేషు భూతేషు

---

* 'గ్రీన్' అను నతఁడు real (సత్తు, లేక, సత్యము) అను దానికి "Whatever anything is really, it is unalterably" అని వ్యాఖ్యానము చేసియున్నాఁడు. (*Prolegomena to Ethics*, § 25) గ్రీను యొక్క యీ వ్యాఖ్యయు, మహాభారతమునందలి యీ వ్యాఖ్యయు తత్త్వమున నొక్కటిగనే యున్నవి.

నశ్యత్సు న వినశ్యతి" "సర్వపదార్థములును (అనఁగా: సర్వపదార్థములయొక్క నామరూపాత్మక మగుశరీరమును) నాశము నొందినను నేపదార్థము లేకపోవునది కాదో యదియే యక్షర మగు బ్రహ్మమగును." (గీ.౮.౨౦; ౧౩.౨౭) అని చెప్పఁబడినపరబ్రహ్మలక్షణమును నిటువంటిదియె. మహాభారతమునందు నారాయణీయము, లేక, భాగవత ధర్మముల నిరూపణయందును నీశ్లోకము "యస్స సర్వేషు భూతేషు" అను దానికి మాఱుగ, "భూతగ్రామశరీరేషు" అనుపాఠభేదముతో చెప్పఁబడినది (మ. భా. శాం. ౩౩౯.౨౩). అటులే గీతలలోని రెండవయధ్యాయములో నున్న పదునాఱవ పదునేడవశ్లోకములకు నిదియె తాత్పర్యము. వేదాన్తమునందు అలంకారము 'మిథ్య' మఱియు సువర్ణము 'సత్య' మని చెప్పినప్పుడు, అలంకార ముపయోగము లేనిదని కాని, బొత్తిగ నసత్యమని కాని (అనఁగా: నేత్రములకు గాన్పించునది కాదని కాని) లేక, మట్టికి పూఁత వేయఁబడినదని కాని, లేక, మొదటినుండియు నస్తిత్వము లేనిదని కాని యర్థముచేయరాదు. మిథ్యాశబ్దమిచ్చో పదార్థము యొక్క రంగు, రూపము మొదలగుగుణములను, ఆకృతిని (అనఁగా: దానిపై దృశ్యమగురూపమును) ఉద్దేశించి యోజింపఁబడినది కాని, లోనుండుమూలమగు ద్రవ్యము నుద్దేశించి ప్రయోగింపఁబడినది కాదేను. కారణమేమియన: తాత్త్వికద్రవ్యము తప్పక సత్యముగనే యున్నదనుసంగతి గుర్తుంచుకొనవలయును. వేదాన్తులమతమున ప్రతిపదార్థముయొక్క నామరూపాత్మకమగు ముసుఁగులో నాదియం దేతత్త్వ మున్నదో విచారింపవలసియుండును; మఱియు తత్త్వజ్ఞానమునకు నదియే సత్యమగువిషయము. ఒకానొకనగను జేయించుకొనుటకు మనము విశేషము కూలి యిచ్చినను నాపత్కాలమునం దాయాభరణమును వర్తకులకు విక్రయింపవలసివచ్చినప్పు డాయాభరణమును 'బంగారుఖరీదునకు మాత్రమె తీయుదుము కాని దానికైన కూలి నీయ' మని వర్తకులు మనకు నిశ్చయముగ చెప్పుటను లోకమున మన మనేకపర్యాయములు వినుచున్నాము. వేదాన్తులపరిభాషతో నీవిచారముఁ దెలుపవలసిన, వర్తకున కాభరణము మిథ్య యనియు, దానియందలిబంగారము మాత్రమే సత్య మనియు చెప్పవలసివచ్చును. క్రొత్తయింటి నమ్ముదు మందుమేని, యీరీతిగనె యాగృహముయొక్క రూపమును, దానిమంచి రచనను, నిర్మించుటకైన సొమ్ము (కూలి) నంతను విచారింపక యింటికిఁ బట్టిన యిటికెలు సున్నము మొదలగుపదార్థములయొక్కయు, కట్టెసామానులయొక్కయు ఖరీదును కట్టి యింటి నమ్ము మని కొనువాఁడు చెప్పును. నామరూపాత్మకమగు జగత్తు మిథ్య, బ్రహ్మ సత్యము నని వేదాన్తులు చెప్పుటకు నర్థమిదియే యని చదువరు లెఱుంగ

వలయును. దృశ్యజగము 'మిథ్య' యనఁగా: జగత్తు కంటికి నగపడదని యర్థము చేయరాదు; కాని యొక ద్రవ్యముయొక్క యేనామరూపములనుండి పుట్టినజగత్తు నందు, ఏకములగు స్థలకృతములు గాని కాలకృతములు గాని యగుదృశ్యములు నశ్వరములుగ నున్నవో యవి మిథ్య యగుటచే, సర్వదృశ్యములయొక్క నామరూపాత్మక మగుముసుఁగుక్రింద నెప్పుడు నుండునదియు, అవినాశియు, అవికార్యము నగుద్రవ్య మనునదియె నిత్యమును, సత్యము నని గానియథార్థ మగునర్థము వర్తకునకు కడియము, కుండలము, హారము మొదలగునాభరణములు మిథ్యయనియు వానియందున్న బంగారముమాత్రమే సత్య మనియు తోఁచును. కాని సృష్టికర్త యను స్వర్ణకారుఁడు, తనకార్యాలయములో నొక ద్రవ్యమునకే వేర్వేఱునామరూపములను గల్పించి, దానితోనే, సువర్ణము, ఇనుము, కలప, జలము, గాలి మొదలగునిఖిలాలంకారములను జేయుచున్నాఁడు. కావున వేదాన్తి, వర్తకుని కంటె నింకను లోతుగ వెళ్లి బంగారము, వెండి, ఇనుము మొదలగునామరూపముల నలంకారములవలెనే మిథ్య యని తలంచుటచే నీసర్వపదార్థములమూలమందున్న ద్రవ్యమె, 'అనఁగా: 'వస్తుతత్త్వ'మనునదియె సత్య మని (అవికారి యైనసత్యమని) సిద్ధాన్తమును జేయుచున్నాఁడు. ఈవస్తుతత్త్వమునకు నామరూపాదికము నేగుణమును లేకుండుటచే నది యింద్రియగోచర మగుట కెప్పుడును శక్యము కాదు; కాని నేత్రములకుఁ గాన్పింపకపోయినను, ముక్కుచే వాసనఁజూచి కనుగొనుటకు వీలుకాకపోయినను, చేతులచే స్పృశింపఁబడకపోయినను, అవ్యక్తరూపముచే నది యుండియే తీరవలయునని నిశ్చితమైనయనుమానమును జేయుటయే కాక యెప్పుడును మాఱనిది యనియు, జగత్తులోనుండు వస్తువులకన్నిటికి నిదియె సత్యమగువస్తుతత్త్వముగ నున్నదనియు, నిశ్చయము చేయవలసివచ్చును. దీనినె జగత్తు మూలభూతమగు సత్య మందురు; కాని సత్యమిథ్యాశబ్దములకు వేదాన్తశాస్త్రమునందున్న యీపారిభాషికార్థము నెఱుంగ లేక — లేక, సత్యశబ్దమునకు మఱేదైన యర్థముండునా యుండదా యని విచారింపక — "మననేత్రములకు ప్రత్యక్షముగ గాన్పించుచుండు జగత్తునైతము వేదాన్తి మిథ్యయనిచెప్పుచున్నాఁడు. ఏమిచేయుదుము?" అని కొన్ని ప్రతిబంధములను జూపి పరకీయులును స్వకీయులు నగుకొందఱు పండితమ్మన్యు లద్వైతవేదాంతము నాక్షేపించుచున్నారు; కాని యాస్కుఁడు చెప్పినటుల యంధునకు స్తంభము గాన్పింపకపోవుట స్తంభముయొక్క దోషము కానేరదు. నిత్యము మాఱునవి యగు (అనఁగా: నశ్వరమగు) నామరూపములు

సత్యములు కావు గాన నెవరికి సత్యముగ, అనఁగా: నిత్యముగ నుండెడితత్త్వమును జూడవలయు నని యున్నదో వారినామరూపములకంటె పరమును విచారింపవలె నని, ఛాందోగ్య (౬. ౧; ౭.౧), బృహదారణ్యక (౧. ౬. ౩), ముండక (౩. ౨. ౮), ప్రశ్నాదులు (౬. ౫) మొదలగు నుపనిషత్తులయం దనేకపర్యాయములు చెప్పఁబడియున్నది. ఈనామరూపములె కఠ (౨. ౫); ముండ (౧. ౨. ౯) కాద్యుపనిషత్తులలో 'అవిద్య'యనియు, తుదకు శ్వేతాశ్వతరోపనిషత్తులలో 'మాయ' (శ్వే. ౪.౧౦) అనియు చెప్పఁబడినవి; భగవద్గీతలయందును, 'మాయా' 'మోహ' 'అజ్ఞాన'శబ్దముల కాయర్థమే వివక్షితముగ నున్నది. జగత్తుయొక్క యారంభము నందు నీపదార్థమంతయు నామరూపములు లేని దనియు (అనగా: నిర్గుణము నవ్యక్తము ననియు), పిదప దానికె నామరూపములు గలిగినవి కావున నదియే వ్యక్తముగను సగుణముగ నున్నదనియు బృహదారణ్యక ఛాందోగ్యములలోఁ జెప్పఁబడినది. (బృ. ౧. ౪. ౭; ఛాం. ౬. ౧. ౨-౩.) కావున వికారి, లేక, నశ్వరము లగునామరూపములకే 'మాయ' యని పేరుండుటచే, సగుణము, లేక, దృశ్యసృష్టి యనునది యొకమూలద్రవ్యముయొక్క (అనఁగా: ఈశ్వరునియొక్క) మాయకు సంబంధించిన క్రీడ, లేక, లీలగ నున్నదని చెప్పుదురు. ఇట్టిదృష్టిచేఁ జూచితి మేని సాంఖ్యులప్రకృతి యవ్యక్తమైనదైనను సత్త్వరజస్తమోగుణములు గలిగినది కావుననే నామరూపములుగల మాయయె యగును. అందుచే నీప్రకృతియందుండి పుట్టునదియు నెనిమిదవప్రకరణములోఁ జెప్పఁబడినదియు వ్యక్తము నగువిశ్వము యొక్కసృష్టి, లేక, పుకారము ననునదియు నామాయయొక్కసగుణరూపాత్మకము లగు వికారములగుచున్నవి. కారణమేమి యనఁగా: ఎట్టిగుణమయినను ఇంద్రియములకు గోచరము కాక యుండదు. కావున నామరూపాత్మకముగనే యుండవలయును. అన్నియాధిభౌతికశాస్త్రములందు నిటులే మాయావిషయక మగుయుక్తికలదు. ఇతిహాసము, భూగోళశాస్త్రము, విద్యుచ్ఛాస్త్రము, రసాయనశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము, మొదలగు నేశాస్త్రమును విచారించినను వానియందలివిచారణ లన్నియు నామరూపములవిచారణయే (అనఁగా: ఏపదార్థమున కైన నొకనామరూపములు పోయి మఱి వేఱగునామరూపము లెటుల కలిగిన వనుదానిగూర్చిన విచారణయే) యైయున్నది. ఉదాహరణము:—దేనికి జలమని పేరున్నదో దానికి బాష్పమని పేరెప్పు డెట్లువచ్చును? లేక, యొకరాక్షసిబొగ్గురంగు గలనల్లనికణికనుండి, యెఱుపు, పసుపు, నలుపు మొదలగు ననేకవిధములగు రంగు (రూపు) లెట్లు గలుగును? ఈ

మొదలగు నామరూపముల భేదముయొక్క విచారమె యీశాస్త్రములోఁ జేయఁబడినది. కావున, నామరూపములయందె పాతుకొనిపోయిన యీశాస్త్రములయొక్కయభ్యాసముచే నీనామరూపములపరముగ నుండుసత్యవస్తువుయొక్కబోధ కానేరదు. సత్యమగుబ్రహ్మస్వరూపమును శోధింపవలయుననువారు తమదృష్టి నీయాధిభౌతికములగు (అనఁగా: నామరూపాత్మకమగు) నన్నిశాస్త్రములకు పరముగఁ బ్రసరింపఁజేయవలయు నని స్పష్ట మగుచున్నది. మఱియు నీవిషయమే ఛాందోగ్యోపనిషత్తునందలి యేడవయధ్యాయముయొక్క ప్రారంభమునందున్న కథలో స్పష్టపఱుపఁబడినది. కథారంభమున, నారదఋషి సనత్కుమారుని యొద్దకు స్కందుని యొద్దకుఁబోయి "నాకు నాత్మజ్ఞానముచెప్పు" మని యడిగెను; అప్పుడు సనత్కుమారుఁడు "నీవేమిచదివికొంటివో దానిని చెప్పినపిదప నేను చెప్పుచున్నా" ననెను. అందునకు నారదఋషి "నేను ఋగ్వేదము మొదలుగాఁగలనాల్గువేదములు, ఇతిహాసపురాణరూప మగునైదవవేదము, వ్యాకరణము, గణితము, తర్కశాస్త్రము, కాలశాస్త్రము, నీతిశాస్త్రము, వేదాంగములు, ధర్మశాస్త్రము, భూతవిద్య, క్షత్త్రవిద్య, నక్షత్రవిద్య, సర్పదేవజనవిద్య మొదలగునన్నింటిని జదివితి; కాని దానిచే నాత్మజ్ఞానము కలుగమిచే నేనిప్పుడు తమయొద్దకువచ్చితిని" అని చెప్పఁగా సనత్కుమారుడు నారదఋషితో "నీ వభ్యసించినవిద్యయంతయు నామరూపాత్మకమగుటచే సత్యమగుపరబ్రహ్మ మీనామబ్రహ్మముకంటె మిక్కిలి దూరముగ నున్న" దనిచెప్పెను. పిదప క్రమక్రమముగ నతఁడు ఈనామరూపములకంటె (అనఁగా: సాంఖ్యుల యవ్యక్తప్రకృతికంటె) వాక్కు, ఆశ, సంకల్పము, మనస్సు, బుద్ధి (జ్ఞానము) ప్రాణము ననువానికంటెను పరముగ నున్నదని, క్రమక్రమముగ మెట్లెక్కించినటుల పరమాత్మస్వరూపమగు నమృతతత్త్వమును నారదున కుపదేశించెను.

మనుజులయొక్క యింద్రియములకు, నామరూపవ్యతిరిక్తమయినదానియొక్క ప్రత్యక్షజ్ఞానము లేక పోయినను, ఈయనిత్యమగు నామరూపము లనుముసుఁగులో, నేత్రములకు గోచరింపని (అనఁగా:అవ్యక్తమగు) దేదైనను నిత్యద్రవ్య ముండితీరవలయును. మఱియు తన్మూలముననే సర్వసృష్టియొక్క యేకత్వజ్ఞానమును కలుగునని పూర్వమునందలివివేచనకుఁ దాత్పర్యము. జ్ఞానమంతయు నాత్మకే కలుగును గావున నాత్మయనునతఁడు 'జ్ఞాత' (అనఁగా: తెలిసికొనువాఁడు). ఈజ్ఞాతకుఁ గలుగు జ్ఞానమంతయు నామరూపాత్మకమైనసృష్టిసంబంధమే కావున, నామరూపాత్మక

బాహ్యసృష్టియే జ్ఞానమై యున్నది (మ. భా. శాం. ౨౦౬. ౯౦). మఱియు నీనా మరూపాత్మకసృష్టికి నారంభము నందున్నవస్తుతత్త్వమే జ్ఞేయమై యున్నది. ఈసిద్ధీకరణమునే స్వీకరించి భగవద్గీతలయందు "జ్ఞాతయనఁగా క్షేత్రజ్ఞుఁడను సాక్షి; జ్ఞేయమనఁగా నింద్రియాతీతము నిత్యము నగుపరబ్రహ్మము" (గీ. ౧౩. ౧౨-౧౭) అనియు, పిదప జ్ఞానమును త్రివిధముగ విభజించి భిన్నత్వము, లేక, నానాత్వముచేఁ గలిగెడిసృష్టిజ్ఞానము రాజసమనియు, తుదకీనానాత్వముయొక్క యేకత్వముచేఁ గలుగుజ్ఞానము సాత్త్వికమనియు చెప్పఁబడినది (గీ. ౧౮. ౨౦-౨౧). దీనిపై జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము నని త్రివిధముగ భేదములు కల్పించుట న్యాయ్యము కానేరదు. మనకుఁ గలుగుజ్ఞానముకంటె నీజగత్తున వేఱొకటేమియున్నదో చెప్పుటకు మనయొద్ద పూర్ణమగుసామగ్రి లేదు. ఆవు గుఱ్ఱము మొదలగుమనకుఁ గాన్పించుబాహ్యవస్తువులన్నియు మనకుఁగలిగినజ్ఞానస్వరూపములే. మఱియు నీజ్ఞానము సత్యమయినను నది దేనివలన నుత్పన్నమయినదో చెప్పుటకు జ్ఞానాతిరిక్తమగుమఱియొక మార్గమే లేకపోవుటచే నీజ్ఞానముకన్న బాహ్యపదార్థ మనఁబడుస్వతంత్రవస్తువేమైన నున్నదా ? ఈబాహ్యవస్తువుయొక్క ప్రారంభమున నేదైన మఱియొక స్వతంత్రతత్త్వ మున్న దని చెప్పుటకు సాధ్యము కానేరదు. జ్ఞాత లేకపోయెనేని జగ ముండనే యుండదు. ఈవిధముగ విచారించితిమేని, జ్ఞాతృజ్ఞేయజ్ఞానములలో జ్ఞేయ మనుమూఁడవవర్గ ముండదు గాన జ్ఞాతయు నతనికిఁ గలుగుజ్ఞానము నను రెండే మిగులును. మఱియు నీయుక్తివాదమునే కొంచెము పైకి పోనిచ్చితిమేని జ్ఞాతయు ద్రష్టయు ననువాఁడు నొకవిధ మగుజ్ఞానమే యగుటచేఁ గడపటిజ్ఞానముతప్ప మఱియొకవస్తువే యుండక పోవును. దీనినే 'విజ్ఞానవాద' మందురు. మఱియు దానిని యోగాచారమార్గమందున్నబౌద్ధులు ప్రమాణముగ గ్రహించుటచే, "జ్ఞాతయొక జ్ఞానముతప్ప స్వతంత్ర మగు మఱియొకవస్తువు జగమున కానరాదు. వేయేల? జగమే లేదు. ఉన్నదంతయు మనుష్యజ్ఞానముగ నున్న" దని బౌద్ధవిద్వాంసులు చెప్పిరి. ఆంగ్లగ్రంథకారులలోను 'హ్యూము'వంటిపండితు లీవిధ మగుమతమునకుఁ బ్రాధాన్యము నిచ్చుచున్నారు ; కాని వేదాన్తు లీమతము నొప్పుకొనరు. కావున వేదాన్తసూత్రములలో వ్యాసులవారును (వే. సూ. ౨. ౨. ౨౮-౩౨), ఈసూత్రముల భాష్యములో శ్రీమచ్ఛంకరాచార్యులవారును ఈమతమును ఖండించినారు. మనుష్యునియొక్క మనస్సునందుఁ గలిగినసంస్కారములే తుద కతనికిఁ దెలియు నను విషయ మేమియు నసత్యము కాదు. దీనినే మనము జ్ఞాన మని చెప్పుచున్నాము;

-కాని యీజ్ఞానముకంటె వే ఱగువస్తు వేమియు లేదని యందు మేని,గోవనుజ్ఞానము వేఱు, అశ్వ మనుజ్ఞానము వేఱు, నేననుజ్ఞానము వేఱు, అను జ్ఞానములయందే మనబుద్ధికిఁ దోఁచుచున్న పృథక్త్వమునకుఁ గారణమేమి ? జ్ఞానముపుట్టుట యను మానసికక్రియ యంతట నొకటిగనే యున్నది. ఇంతియకాక మఱియొక టేమియు లేనియెడల ఆవు, గుఱ్ఱము ననుభేద మెచ్చోనుండి కలుగును?. స్వప్నమునందలి సృష్టివలె మనస్సు స్వయముగనే తనయిచ్ఛానుసారముగ జ్ఞానభేదమును గలుగఁ జేయు నని యెవరైనఁ జెప్పినను, స్వప్నసృష్టికంటె భిన్నమగుజాగ్రదవస్థయందలి జ్ఞానమునందుఁ గాన్పించు నొకవిధ మగుసుసంగతత్వమునకు కారణముఁ జెప్పుటకు సాధ్యము కానేరదు. (వే. సూ. శా. భా. ౨. ౨. ౨౮; ౩. ౨. ౪) ఇంతియకాక "జ్ఞానాతిరిక్త మగువస్తువే లేమ కావున 'ద్రష్ట యొక్క మనస్సే యాయా పదార్థముల నన్నిటిని నిర్మించు చున్న'దని చెప్పినను, ప్రతిద్రష్టకును 'నామనస్సు' అని యెన్నుకొను నప్పుడు 'నే నే స్తంభముగ నున్నాను,' లేక, 'నేనే గోవుగ నున్నా' నని, సర్వజ్ఞానములు నస్మచ్ఛబ్దపూర్వకములుగనే యుండవలసివచ్చును; కాని యటులుగాక 'నేను వే ఱగుటచే నాకంటె స్తంభమును, గోవు మొదలగు పదార్థములును వేర్వేఱుగ నున్న' వని యందఱకును బ్రతీతి యుండుటచే ద్రష్ట యొక్క మనస్సునఁ గలుగు సర్వజ్ఞానములకు నాధారభూత మగుబాహ్యసృష్టి యందితరమును బాహ్యము నగునేదైన నొకస్వతంత్రవస్తు వుండవలయును"అని శ్రీశంకరాచార్యులవారు సిద్ధాన్తీకరించినారు (వే. సూ. శాం. భా. ౨. ౨. ౨౮).

కాంటుయొక్క మతమును నిదియే కావున, సృష్టిజ్ఞానము కలుగుటకు మనుజుని బుద్ధియొక్క యేకీకరణ మావశ్యక మైనను, ఈబుద్ధి సర్వవిధజ్ఞానములలోనిది, (అనఁగా: నిరాధారముగఁ గాని, లేక, నూతనముగఁ గాని పుట్టునది) కాదు. ఆ సృష్టియం దున్నబాహ్యవస్తువులయపేక్ష యెప్పుడును కలిగియే యుండవలయు నని యతనిచే స్పష్టముగఁ జెప్పఁబడినది. "ఇదేమి? శ్రీశంకరాచార్యులవా రొకప్పుడు బాహ్యసృష్టి మిథ్య యని నుడివి, బౌద్ధులమతమును ఖండించుచు, తమకు బాహ్య సృష్టియొక్క యస్తిత్వము ద్రష్టయొక్క యస్తిత్వానుసారముగనే సత్యముగ నుండు నని చెప్పుచున్నారేని, యీరెండుపక్షముల కైకమత్య మెట్లు?" అని యిచ్చో నెవ రయిన నడుగుదురు; కాని యీప్రశ్నకుఁ బూర్వముననె యుత్తరము చెప్పఁబడినది. ఆచార్యులవారు బాహ్యసృష్టి మిథ్య యని కాని యసత్య మని కాని చెప్పినప్పుడు బాహ్యసృష్టియొక్క దృశ్యమ లగునామరూపము లసత్యములే(అనఁగా:నశ్వరములే)

యని దాని యర్థమని తెలిసికొనవలయును. కాని నామరూపాత్మకమును బాహ్యమై నగు దృశ్యము మిథ్య యయినను దానియొక్క మూలమునం దేదియో యింద్రియాతీతము సత్యము నగునొకవస్తు వున్న దను సిద్ధాన్తమునకు దానిచే నేమియు బాధ రాదు. కావున క్షేత్రక్షేత్రజ్ఞవిచారమునందు నశ్వరములగు దేహేంద్రియాదినామరూపముల కాధార మగునేదో యొకనిత్య మగునాత్మతత్త్వ మున్నదని సిద్ధాన్తపఱచినటులు, నామరూపాత్మక బాహ్యసృష్టియొక్క మూలమునందును నేదో యొకనిత్య మగుతత్త్వ మున్న దని చెప్పవలసివచ్చుననియు, కావున నే దేహేంద్రియములును బాహ్యసృష్టియు ననునీరెండును ప్రతిదినమును మాఱునవి (అనఁగ: మిథ్యాభూతములగు) దృశ్యములు కావున వానికి మూలమున నున్నదియు, నిత్యమైనదియు (అనఁగ: సత్యమగునదియు) నగు నొకపదార్థ మీరెంటిచే నాచ్ఛాదింపఁబడిన దనియు వేదాన్తశాస్త్రముచే సిద్ధాన్తీకరింపఁబడినదని సారాంశము. "ఈరెంటిచే నాచ్ఛాదింపఁబడిననిత్య మగుతత్త్వము వేర్వేఱుగ నున్నదా? లేక, యేకరూపముగ నున్నదా?" యని ప్రశ్న వెంటనే వెడలును; కాని దీనిని విచారించుటకంటె మున్నిమతముపై, దానియొక్క యర్వాచీనత్వవిషయమై రాఁగలయాక్షేపములను గొంచెము విచారించెదము.

బౌద్ధులయొక్క విజ్ఞానవాదమును వేదాన్తశాస్త్ర మొప్పకొనకపోయినను గంటికిఁ గానఁబడు బాహ్యసృష్టియొక్క నామరూపాత్మక మగుస్వరూపము మిథ్యయనియు, దాని కాధారముగ నున్న యవ్యయము నిత్యము నగు ద్రవ్యము మాత్రమే సత్యముగ నున్న దనియు నుడువు మాయావాద మనఁబడు శ్రీశంకరాచార్యుల మతము ప్రాచీనము లగునుపనిషత్తులలో లేకపోవుటచే వేదాన్తశాస్త్రముయొక్క మూలభాగ మనిచెప్పుటకు సాధ్యము కాదని కొందఱు అందురు; కాని యుపనిషత్తులను బాగుగ గమనించి యధ్యయనముఁ జేసితి మేని యీయాక్షేపములే నిరాధారములని తోఁపక మానదు. "సత్య'శబ్దము వ్యవహారములోఁ బ్రత్యక్షముగఁ గంటికిఁ గాన్పించువస్తువులవిషయమై ప్రయోగింపఁబడు" నని పూర్వమున నె వచించియున్నాము. కావున సత్యశబ్దమున కీవ్యావహారికార్థము నే కైకొని యుపనిషత్తులయం దచ్చటచ్చట నేత్రములకుఁ గాన్పించు నామరూపాత్మకబాహ్యపదార్థము సత్యమనియు, ఆనామరూపములచే నాచ్ఛాదిత మగుద్రవ్యమునకు నమృత మనియుఁ బేరు లిడఁబడినవి. ఉదాహరణము:—బృహదారణ్యకోపనిషత్తులో (౧. ౬. ౩) "తదేతదమృతం సత్యేన ఛన్నం" "ఆయమృతము సత్యముచేఁ గప్పఁబడినది" యని చెప్పి

యమృతసత్యశబ్దములకు వెంటనే "ప్రాణో వా అమృతం నామరూపే సత్యం తాభ్యా మయం ప్రాణచ్ఛన్నః" "ప్రాణ మనునది యమృతము. నామరూపము లనునది సత్యము. ఈనామరూపము లనుసత్యముచేఁ బ్రాణ మాచ్ఛాదింపఁబడినది," అని వ్యాఖ్యానము చేయఁబడినది.'ప్రాణ'మనఁగా, 'ప్రాణరూపపరబ్రహ్మము'అని యిచ్చట నర్థము; మొదట నుపనిషత్తులలో దేనిని 'మిథ్య'యనియు 'సత్య'మనియుఁ జెప్పుచున్నారో, దానికే పూర్వమునం దనుక్రమముగ 'సత్యము', 'అమృతము' నను పేరులుండెడి నని దీనివలనఁ గాన్పించుచున్నది. అనేకస్థలములయం దీయమృత పదార్థమువలన "సత్యస్య సత్యం" "కంటికిఁ గాన్పించుసత్యమునకు లోపలనుండునది చరమసత్య మగును" (బృ. ౨. ౩-౬) అని చెప్పఁబడినది. కాని యుపనిషత్తులలోఁ గొన్ని ప్రదేశములలో నేత్రములకు గోచరించుసృష్టియె సత్య మనఁబడినది. ఇంతమాత్రముచేఁ బైఁ జెప్పఁబడినయాక్షేపము సిద్ధము కానేరదు. కారణ మేమి యనఁగా:—బృహదారణ్యకములోనే యాత్మరూపక మగుపరబ్రహ్మముదక్క నితర మగుసర్వమును 'ఆర్తం' అనఁగా: నశ్వరముగ నున్న దని తుదను సిద్ధాన్తీ కరింపఁబడెను (బృ. ౩. ౭-౨౩). జగత్తుయొక్క మూలతత్త్వమును మొట్టమొదట శోధించుటకుఁ బ్రారంభించినపుడు నేత్రములకుఁ గాన్పించుజగత్తె సత్య మని తొలుత నంగీకరించి దానిలో నున్నమఱియొకసూక్ష్మమగుసత్య మేది యని శోధకులు విచారించుటకు నారంభించిరి. ఏదృశ్యసృష్టియొక్క రూపమును మనము సత్య మని యంగీకరించుచున్నామో యది వినాశియగుటచే దానిలో నేదో మఱియొకటి యవినాశి, లేక, యమృతమైనతత్త్వ మున్న దని పిదప స్పష్టముగఁ గాన్పించెను. రెంటి మధ్యనుండుభేదము విశేషము స్పష్టపఱుపఁబడవలసివచ్చినప్పు డెల్ల 'సత్యామృత'శబ్దముల రెంటికిని మాఱుగ 'అవిద్యావిద్య' లనియు, తుదకు 'మాయాసత్యము' లనియు', లేక, 'మిథ్యాసత్యము' లనియు నీపరిభాష ప్రచారములోనికి వచ్చినది. కారణ మేమి యనఁగా:—'సత్య'శబ్దమునకు 'నిత్యముగ నుండునది' యని ధాత్వర్థము కావున నెప్పుడును మాఱునవి (నశ్వరములు) అగు నామరూపములను సత్య మని చెప్పుట యుత్తరోత్తరముగ విశేషము తప్పనితోఁచుటకు నారంభించెను; కాని యీ రీతిఁగ 'మాయా-మిథ్యా' శబ్దములు పిదపఁ బ్రచారములోనికి వచ్చినను జగత్తునం దున్నవస్తువులలో మనకంటికిఁ గాన్పించుదృశ్యము, నశ్వరము నసత్యము ననియు, దానికి మూల మగు'తాత్త్వికద్రవ్యము'మాత్రము సత్తు, లేక, సత్యము ననియు విచారము చాలకాలముక్రిందటనుండి వచ్చుచునే యున్నది; మఱియు ఋగ్వేదములో

“ఏకం సద్విప్రా బహుధా వదన్తి” “మొట్టమొదట నొకటియు, నిత్యము(సత్) అగుదానినే విప్రులు (జ్ఞానులు) పలుపేరులతోఁ బిలుతురు” (౧. ౧౬౪. ౪౬; మఱియు, ౧౦. ౧౧౪. ౫). అనఁగా: ఒకసత్యవస్తువే నామరూపములచే వేర్వేఱుగఁ గాన్పించు నని చెప్పఁబడినది. ‘ఒకరూపమునే యనేకరూపములుఁ జేసి చూపించుట’ యను నర్థమున ఋగ్వేదమందును ‘మాయా’శబ్దము ప్రయోగింపఁబడి యున్నది. “ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే”—“ఇంద్రుఁడు తనమాయచే ననేకరూపముల నొందుచున్నాఁడు.” (ఋ. ౬. ౪౭. ౧౮) అని చెప్పఁబడినది. ‘మాయా’శబ్దము తైత్తిరీయసంహితలో నొకస్థలము నందు (తై. సం. ౩. ౧. ౧౧) ఈయర్థముననే ప్రయోగింపఁబడి యున్నది. తుదకు శ్వేతాశ్వతరోపనిషత్తులో సైతము ‘మాయా’శబ్దము నామరూపార్థముననే యున్నది; కాని నామరూపములను ‘మాయా’శబ్దముచే బోధించునభ్యాసము మొదట శ్వేతాశ్వతరోపనిషత్కాలముననే గాఢమైనను, నామరూపము లనిత్యములు, లేక, యసత్యము లను కల్పన తత్పూర్వమునందుండియే యున్నది. ‘మాయా’శబ్దమునకు విపరీతార్థము చేసి శ్రీ శంకరాచార్యులచే నూతనముగఁ గల్పింపఁబడలేదు. ఇంతవఱకును నిర్వివాదముగ నున్నది. నామరూపాత్మకమగు సృష్టిస్వరూపము మిథ్య యని శ్రీ శంకరాచార్యుల వలె స్పష్టముగఁ జెప్పుటకు ధైర్యము లేనివారు కాని, లేక, గీతలలో భగవానుఁడు సెప్పినటుల నాయర్థమునందు ‘మాయా’శబ్దము నుపయోగించుకొనుటకు భయపడు వారు కాని కావలసియున్నయెడల, బృహదారణ్యకోపనిషత్తునందున్న ‘సత్యామృతము’ లనుశబ్దములను సంతోషముగ నుపయోగింపవచ్చును. ఏమి చెప్పినను నామరూపములు నశ్వరములు. వానిచే నాచ్ఛాదింపఁబడుతత్త్వ మమృతము, లేక, అవినాశి యనుభేదము ప్రాచీనవైదికకాలమునుండియు వాడుకలోనే యున్న దనుసిద్ధాన్తమున కేమియు బాధ రానేరదు.

అటులుండ నిమ్ము. మనయాత్మకు నామరూపాత్మకబాహ్యసృష్టియందున్న ప్రతిపదార్థముయొక్కయు జ్ఞానము కలుగుటకు నాధారభూతమై, దానిని పరీక్షించుటకు బాహ్యసృష్టియందున్న నానాపదార్థములకు నారంభమునందే ‘ఒకానొక’మూలభూత మగునిత్యద్రవ్య ముండవలయును. లేనిది యీజ్ఞానము పుట్టుటకు వీలులేదనునది మాత్రము నిశ్చయమగుటచే నధ్యాత్మశాస్త్రముయొక్క పని సమాప్తము కానేరదు. బాహ్యసృష్టియొక్క యారంభమునుండి ఈనిత్యద్రవ్యమునే వేదాన్తులు ‘బ్రహ్మము’ అని చెప్పుచున్నారు; శక్యమగునేని యీబ్రహ్మస్వరూప

మేమి యని నిశ్చయించుటయు నావశ్యకమయి యున్నది. నామరూపాత్మకసర్వ ప్రపంచారంభమునం దుండునది నిత్యము నవ్యక్తమగుతత్త్వము గావున దాని యొక్క స్వరూపము నామరూపాత్మకమగుపదార్థమునవలె వ్యక్తమును స్థూలము (జడము) నగుటకు వీలులేదనుసంగతి స్పష్టముగనే యున్నది; కాని వ్యక్తమును స్థూలమునగు పదార్థమును వదలినను స్థూలములు గానట్టి మనస్సు, స్మృతి, వాసన, ప్రాణము, జ్ఞానము మొదలగుననేకములగు నవ్యక్తపదార్థము లున్నవి. పరబ్రహ్మ మాపదార్థములలో నేదేని యొకస్వరూపముతో నుండుట యశక్యము కాదు. వీని లో ప్రాణముయొక్కయు, పరబ్రహ్మముయొక్కయు స్వరూప మొక్కటిగనే యున్నదని యనేకులు చెప్పుచున్నారు. జర్మన్ పండితుఁడు 'శోఫెన్‌హాయెర్' అనువాఁడు పరబ్రహ్మము వాసనాత్మక మని ని[illegible]నాఁడు. వాసన యనునది మనోధర్మమగుటచే నీమతానుసారముగ బ్రహ్మ సిద్ధము కానేర యుఁడుగ నున్నాఁడని చెప్పవచ్చును (తై. 3. ర); కాని యింతవఱకు రూపక మగుప ందుండి "ప్రజ్ఞానం బ్రహ్మ" (ఐ. 3.3), లేక, "విజ్ఞానం బ్రహ్మ" రముగ (తై. 3. 5) నున్న—అనఁగా: ఏకత్వముచే మనకుఁ గలిగినజడసృష్టియందున్న నానాత్వముయొక్క జ్ఞానమే బ్రహ్మముయొక్క స్వరూపముగ నుండవలయునని చెప్పవచ్చును. 'హెకెల్'యొక్క సిద్ధాన్తమునైత మిట్టిదే. కాని యుపనిషత్తులలో చిద్రూపజ్ఞానమువలెనే సత్తునకును (అనఁగా: జగత్తునందలి సర్వవస్తువులయస్తిత్వముయొక్క సామాన్యధర్మమునకును, లేక, సత్తాసామాన్యమునకును) నానందమునకును బ్రహ్మస్వరూపమునందే యంతర్భావ మగుటచే బ్రహ్మము సచ్చిదానందరూపముగ నున్నదని చెప్పఁబడినది. దీనికి విరుద్ధమగు మఱియొక బ్రహ్మస్వరూపము, ఓంకారము. సకలవేదములు, మొదట నోంకారము నుండియే వెలువడినవి. అది బయలువెడలినపిదప నా వేదము నందున్ననిత్యములగు శబ్దములయందుండియే పిదప బ్రహ్మదేవునిచే సర్వసృష్టియు నిర్మింపఁబడినది. (గీ. ౧౭. ౨౩; మ. భా. శాం. ౨౩౧. ౫౬-౫౮) ఈహేతువుచే నోంకారముదక్క మూలారంభమునందు మఱియొకటేదియు లేదని సిద్ధమగుచున్నది. దీనివలన నోంకారమనునదియే సత్యమయినబ్రహ్మస్వరూపముగ నున్నదని మాండూక్యతైత్తిరీయోపనిషత్తులలో నున్నది (మాండూక్య. ౧; తైత్తి. ౧. ౮); కాని శుద్ధ మగు నధ్యాత్మ దృష్టితో విచారించితిమేని పరబ్రహ్మముయొక్క యీసర్వస్వరూపములు కొంచె మించుమించుగ నామరూపాత్మకములుగనే యున్నవని తోఁచును. కారమేమి యనఁ: ఈసర్వస్వరూపములు మనుజులకు నింద్రియగోచరము లగుట

మనుష్యులీరీతిగఁ దెలిసికొనువిషయమంతయు నామరూపములలోనే చేరుచున్నది. కాని యీ నామరూపములకు మూల మగున దాదిమంతము, లోపలను వెలుపలను నంతట నొకరీతిగ నిండియున్నదియు నేకవిధము నిత్యము నమృతము నగుతత్త్వము యొక్క (గీ. ౧౩. ౧౨-౧౭) వాస్తవికస్వరూప మెట్లు నిర్ణయింపఁబడును? ఎప్పుడయిన నీతత్త్వము మనయింద్రియములకు గోచరముగ నుండునదిగాదని యనేకులగు నధ్యాత్మశాస్త్రజ్ఞులు చెప్పుటచే 'కాంట'యనువాఁడు ప్రశ్నను మొదట విచారింపనేలేదు. అటులే యుపనిషత్తులయందును "నేతినేతి"—అనఁగా: "దీని విషయమై యేమియుఁ జెప్పుటకు సాధ్యము కానేరదు" యట్టిబ్రహ్మము దీనికిఁ బరముగ నున్నది.అది నేత్రములకు గోచరము కానిది. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"—"వాక్కునకును మనస్సునకు నగోచరముగ నున్నది" అని పరబ్రహ్మముయొక్క, యజ్ఞేయ (తెలియని) స్వరూపము వర్ణింపఁబడినది. అయిన నీయగమ్యస్థితియందును బ్రహ్మస్వరూపముయొక్క యేకప్రకారము మనుజులకు బుద్ధిచే నిర్ణయించుటకు సాధ్య మగునని యధ్యాత్మశాస్త్రముచే నిశ్చయింపఁబడినది. వాసన, స్మృతి, ధృతి, ఆశ, ప్రాణము, జ్ఞానము మొదలైనవ్యక్తావ్యక్తము లగుపదార్థములలో నతిశయముగ వ్యాపక మయినది, లేక, శ్రేష్ఠ మైనది లేదని విచారించి వీనియన్నింటిలోను శ్రేష్ఠముగ స్థిరపడినదియే బ్రహ్మస్వరూపమని యంగీకరింపవలయును. కారణమేమి యన: సకలావ్యక్తపదార్థములయందును పరబ్రహ్మము శ్రేష్ఠ మనునది నిర్వివాదమే. ఆశ, స్మృతి, వాసన, ధృతి మొదలగు వాని నీదృష్టితో విచారించితిమేని యివన్నియు మనోధర్మములగుటచే వీనికంటె మనస్సు శ్రేష్ఠము; మనస్సుకంటె జ్ఞానము శ్రేష్ఠము, జ్ఞానముకంటె బుద్ధి శ్రేష్ఠము, తుదకు బుద్ధియు దేనియధీనమై యున్నదో యట్టియాత్మ యన్నింటికంటె శ్రేష్ఠము. (గీ. ౩. ౪౨) అని క్షేత్రక్షేత్రజ్ఞవిచారప్రకరణములోఁ జెప్పఁబడినది. వాసన, మనస్సు మొదలుకొని సర్వమగునవ్యక్తపదార్థములలో నాత్మ శ్రేష్ఠ (భూమన్) మగునేని పరబ్రహ్మముయొక్క స్వరూపము నదియే కావలయునని యీసముదాయమువల్ల తేలును. ఛాందోగ్యోపనిషత్తునందలి యేడవయధ్యాయమునం దీయుక్తివాదమె స్వీకరింపఁబడియున్నది. వాక్కుకంటె మన స్సధికయోగ్యత గలది (భూయస్), మనస్సుకంటె జ్ఞానము, జ్ఞానముకంటె బలము నని యీరీతిగఁ బైకిఁ బోయి పోయి యన్నింటిలో నాత్మ శ్రేష్ఠము (భూమన్) అగుటచే నాత్మయే పరబ్రహ్మముయొక్క సత్యమగుస్వరూప మగునని సనత్కుమారుఁడు నారదులకు

వక్కాణించెను. ఆంగ్లేయగ్రంథకారులలో 'గ్రీ'ననువానిచే నీసిద్ధాన్తమే స్వీకరింపఁబడినది; కాని యతనియుక్తివాదము కొంత వేఱుగ నుండుటచే దాని నిచ్చో వేదాన్తపరిభాషతో సంక్షేపముగఁ జెప్పుచున్నాను. "ఇంద్రియములద్వారా మన మనస్సునందుఁ గలుగుబాహ్యనామరూపములయొక్క సంస్కారముల నొక్కటిగఁ జేసి మనయాత్మ కలుగఁ జేయుజ్ఞానమునకు సంబంధించినబాహ్యసృష్టియొక్క వేర్వేఱునామరూపములమూలమునసైత మేకత్వము నొంది యుండువస్తుతత్త్వ మేదైన నుండవలయును. లేనియెడల నాత్మయొక్క యేకీకరణమాత్రముచే నుత్పన్న మగు జ్ఞానము స్వకపోలకల్పితము నిరాధారము నగుటచే విజ్ఞానవాదమువలె నసత్యమగును." అని 'గ్రీను' చెప్పుచున్నాఁడు. ఇందు దేని నైన నొకవస్తువును బ్రహ్మ మని చెప్పుచున్నాము; కాని కాంటుయొక్క పరిభాషను స్వీకరించి దానిని వస్తుతత్త్వమని 'గ్రీను' చెప్పుచున్నాఁడు. ఇదియే భేదము. ఏమిచెప్పినను వస్తుతత్త్వమును (బ్రహ్మము) నాత్మయు నను పరస్పరసంబంధము గలిగినరెండుపదార్థములే తుదకు మిగిలియున్నవి. వీనిలో నాత్మ యనునది మనోబుద్ధులకంటెఁ బరమైనను (అనఁగా: ఇంద్రియాతీత మయినను) ఆత్మానుభవము ప్రమాణమని యంగీకరించుటచే నీయాత్మ జడము కానేరదు. చిద్రూపి, లేక, చైతన్యరూపిగ నున్నది యని మనము నిర్ణయించుచున్నాము. ఆత్మస్వరూప మీరీతిని నిర్ణయించినపిదప బాహ్యసృష్టియందున్నబ్రహ్మస్వరూప మేది యని నిర్ణయింపవలసివచ్చును. ఈబ్రహ్మము, లేక, వస్తుతత్త్వము. (౧) ఆత్మయొక్క స్వరూప మయి యుండునా?, లేక, (౨) ఆత్మకంటె వేఱుస్వరూపముగ నుండునా? యనురెండేపక్షము లీవిషయములో సంభవించుచున్నవి. కారణ మేమి యనఁగా: బ్రహ్మము, ఆత్మ, యనునీరెండును గాక మూఁడవవస్తువే యిప్పుడు బొత్తిగ నుండనేరదు; కాని యేవైన రెండుపదార్థములు స్వరూపముంబట్టి వేఱుగ నుండెనేని వానియొక్క పరిణామములు, లేక, కార్యములు నభిన్నములుగనే యుండవలయు నన్నునది మన కనుభవములోనున్నది. కావున పదార్థములయొక్క పరిణామమునందుండియే యీపదార్థము వేఱుగ నున్నదా? ఒకటిగనున్నదా! యనువిషయము నేశాస్త్రమందైనను నిర్ణయించుచున్నాము. ఉదాహరణము:— "రెండుచెట్లయొక్క వేళ్లు, మొటికలు, చిగుళ్లు, తాఁట, ఆకులు, పువ్వులు, కాయలు నొకేవిధముగ నుండెనేని-యాచెట్లు నొకటె విధముగుచెట్లగును. లేక, వేర్వేఱై యుండెనేని చెట్లు వేఱగును." అని మనము నిశ్చయించుచున్నారము. ఇటులే ప్రస్తుతమందును విచారించితిమేని యాత్మయు, బ్రహ్మయు నొకస్వరూపముగ యుండవలయు నని కాన్పించుచున్నది. కారణ మేమి యనఁగా: సృష్టియందు

వేర్వేఱుపదార్థములచే మనస్సునం దుత్పన్నమైన సంస్కారములకు నానాత్వా పారముచే నుత్పన్నమగు నేకీకరణమును, వేర్వేఱుబాహ్యపదార్థములయొక్క యారంభమందుండువస్తుతత్త్వము (అనఁగా: బ్రహ్మ) ఈపదార్థములయొక్క నానాత్వమును లేకుండఁజేయునట్టియేకీకరణము, నను నీరెండును గలిసి యొకదానితో నొకటి సంబంధించి యుండవలయును. లేనియెడల సర్వజ్ఞానములును నిరాధారములు, నసత్యములు నగునని ముందే చెప్పఁబడినది. ఒకవిధమే యగునవియును నిట్టి విధముల నొకదానితోనొకటిసమానమగునేకీకరణమును జేయునవియు నగుతత్త్వములు రెండు ప్రత్యేకప్రదేశములయందున్నను నవి పరస్పరము భిన్నములుగ నుండుటకు వీలులేదు. వీనిలో నాత్మకు రూప మగునదియే బ్రహ్మమునకును రూపము కావలయు నని తనయంతటనే సిద్ధించును * కావున నేరీతిని విచారించినను బాహ్యసృష్టియందుండు నామరూపములచే నాచ్ఛాదిత మగుబ్రహ్మతత్త్వము నామరూపాత్మక మగుప్రకృతివలెనే జడము కాకపోవుటయేకాక, వాసనాత్మకబ్రహ్మము, మనోమయబ్రహ్మము, జ్ఞానఘనబ్రహ్మము, ఓంకారరూపియగుశబ్దబ్రహ్మము, అనునీబ్రహ్మస్వరూపములు సైతము దిగువమెట్టులోనివి యగుటచే, సత్యమగుబ్రహ్మస్వరూపము వీనికంటె పరముగను, వీనికంటె యధికయోగ్యత గలదిగను (అనఁగా: శుద్ధాత్మస్వరూపముగ) నున్నదని సిద్ధ మగుచున్నదని సారాంశము. గీతలయొక్క సిద్ధాన్తముసైత మిదియే యని యీసంబంధములో ననేకస్థలములయందు గీతలలోఁ జెప్పఁబడినశ్లోకములయందుండి స్పష్టమగును. (గీ. ౨.౨౦; ౭.౫; ౮.౪; ౧౩.౩౧; ౧౫. ౭–౮; చూడుము). అయినను బ్రహ్మముయొక్కయు, నాత్మయొక్కయు స్వరూప మొక్కటియే యనుసిద్ధాన్తమును, కేవలమిట్టియుక్తివాదముచేతనే మన ఋషులు మొదట శోధించి చెప్పినారని తలఁపరాదు. కారణమేమియన: అధ్యాత్మశాస్త్రమునందు కేవలబుద్ధిసాహాయ్యముచే నేయనుమానము లైనను నిశ్చయించుటకు సాధ్యము కానేరదు. ఆత్మానుభవము దాని కెప్పుడును సంబంధించియే యుండవలయు నను నది యీప్రకరణారంభముననే చెప్పఁబడినది. ఇంతియకాక యాధిభౌతికశాస్త్రమునందును ననుభవమే మొదటి దయినట్లును, దానియుపపత్తి వెంబడి దైనట్లును మన మెప్పుడును చూచుచునే యున్నాము. ఇట్లే పూర్వోక్తమగుబ్రహ్మాత్మైక్యమునకు బుద్ధిగమ్య మగునుపపత్తి వెలువడుటకంటె వందలకొలఁదిసంవత్సరంబుల క్రిందట మనపూర్వు లగుఋషులు "నేహ నానాస్తి కించన" (బృ. ౪. ౧౯;

* Green's *Prolegomena to Ethics*, §§ 26—36.

కఠ. ౪. ౧౧)—"ఈసృష్టియందుఁ గాన్పించుచున్నయనేకత్వము సత్యము కానేరదు." దానికి మూలమునందు నలుగడల నొకటే యగునదియు నమృతము, అవ్యయము, నిత్యము నగుతత్త్వము గల దని (గీ. ౧౫. ౨౦) మొదట నిర్ణయించి తుదకు బాహ్యసృష్టి యందలినామరూపములచే నాచ్ఛాదితము, నవినాశియు నగుతత్త్వమును, మనశరీరమునం దున్నబుద్ధికంటెఁ బరముగ నున్నయాత్మతత్త్వము నను నీరెండును నొక్కటియే, (అనఁగా: ఏకవిధములు, సమరసములు, నన్వయములుగ నున్నవి), లేక, బ్రహ్మాండములో నున్నతత్త్వమే పిండమున (అనఁగా: మనుజునిదేహమున) నున్న దను నీసిద్ధాంతము వారియోగ (అంతర) దృష్టిచే శోధించి చెప్పఁబడినది. ఇదియె సర్వవేదాంతములలోనిముఖ్య మగుసారాంశమని బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞవల్క్యులు మైత్రేయికిని, గార్గి వారుణి మొదలగువారికిని జనకునకును జెప్పిరి. (బృ. ౩. ౫-౮; ౪. ౪) "అహం బ్రహ్మాఽస్మి"— "నేనే పరబ్రహ్మనుగా నున్నాను."—అని తెలిసికొనినవారె సర్వము తెలిసినవారుగ నున్నారని యీయుపనిషత్తులో మొదట చెప్పఁబడినది. (బృ. ౧. ౪-౧౦) ఛాందోగ్యోపనిషత్తుయొక్క యేడవయధ్యాయములో శ్వేతకేతువునకు నతనితండ్రి యద్వైతవేదాంతముయొక్క యీతత్త్వమునే యనేకవిధములుగ బోధించినాఁడు. "ఒకమట్టిముద్దయందున్నపదార్థమును దెలిసికొనుటచే మృత్తికయొక్క నామరూపాత్మక మగుసర్వవికార మేరీతిగ నెఱుంగఁబడునో యటులె యొకవస్తువుయొక్క విజ్ఞానము గలిగె నేని సర్వవస్తుజ్ఞానము దేనిచేఁ గలుగునో యట్టివస్తువును నాకుఁ జెప్పుము. అది నాకు తెలియదు." అని యధ్యాయారంభమున శ్వేతకేతువు తనతండ్రి నడిగెను; అప్పుడు నదులు, సముద్రము, ఉదకము, తీపి మొదలగున నేకదృష్టాంతముల నిచ్చి "సృష్ట్యారంభమున నున్నద్రవ్యమును (తత్), నీవును (త్వమ్), అనఁగా: నీదేహమునందున్న యాత్మయనునదియును ఒక్కటియే—"తత్త్వమసి," నీవు నీయొక్క యాత్మ నెఱింగితి వేని నీకు సమస్త జగత్తునకు మూలకారణము స్వయముగనె తెలియును; మఱియు మాటిమాటికి "తత్త్వమసి"—"అదె నీ వగుదువు," అని తండ్రి యతనికి వేర్వేఱగు తొమ్మిది దృష్టాంతములతో నుపదేశించెను. మఱియు మాటిమాటికిని, "తత్త్వమసి," "అదె నీ వగుదువు"—అను బ్రహ్మసూత్రము పునరావృత్తి చేయఁబడినది. (ఛాం. ౬. ౮-౧౬) "తత్త్వమసి" యని తొమ్మిదిమాఱులు చెప్పుటచే నభ్యాస మను తాత్పర్యలింగము సూచింపఁబడినది. "తత్త్వమసి" అనునది యద్వైతవేదాంతముయొక్క

మహావాక్యములలో ముఖ్యవాక్యము. "పిండమందున్నదియె బ్రహ్మాండమందు నున్న" దని "తత్త్వమసి" యను దానియర్థము.

బ్రహ్మ మాత్మస్వరూపముగనే యున్నదని యిటుల నిర్ణయమైనది; కాని యాత్మ చిద్రూపి యని యనుటచే, బ్రహ్మమును చిద్రూపిగనే యున్నదని యనేకు లెన్నుదురు. కావున బ్రహ్మముయొక్కయు నాత్మయొక్కయు సత్యస్వరూపము నిక్కడ మఱికొంచెము విస్తరించుట యావశ్యకముగ నున్నది. 'చిత్' (అనఁగా: జ్ఞానము) అనునది యాత్మయొక్క సాన్నిధ్యముచే జడాత్మకబుద్ధియం దుత్పన్నమైన ధర్మము; కాని బుద్ధియొక్క యీధర్మము నాత్మయం దారోపించుట ధర్మము కాదు. కావున తాత్త్వికదృష్టితో నాత్మయొక్క మూలస్వరూపము నిర్గుణము నజ్ఞేయము నని చెప్పవలయును గాన బ్రహ్మ మాత్మస్వరూపిగ నున్నను, నీ రెండును గాని, వీనిలో నేదియయిన నొకటి గాని, చిద్రూపిగ నున్న దని చెప్పుట కొన్నివిధములచే గౌణముగనే యున్నదని యనేకు లెన్నుచున్నారు. కేవలచిద్రూపముపైననే యీయాక్షేపముఁ జేయుట లేదు. ఇఁక నేమనఁగా: "సత్" అనుపదము పరబ్రహ్మమునకు విశేషణ మనుట సైత మేమియు న్యాయ్యమని తోఁపదు"అని యిటులు మొత్తముమీఁద నేర్పడును. కారణమేమియన: 'సత్,' 'అసత్' అను నీరెండుధర్మములు పరస్పరవిరుద్ధములై (అనఁగా: రెండువేర్వేఱు వస్తువుల నుద్దేశించి చెప్పఁబడి) యున్నవి. ఎల్లప్పుడును వెలుతురు చూడనివాఁ డంధకారము నెఱుంగకపోవుటయే కాక, వెల్తురు, అంధకార మనుశబ్దములు సైత మతనికిఁ దెలియవు. 'సత్–అసత్'అనుశబ్దద్వంద్వమునకు నీ న్యాయమే వర్తించును. కొన్నివస్తువులు నశ్వరములగునని తెలిసెనేని, 'అసత్'( నాశముఁబొందునది), 'సత్' (నాశముఁబొందనిది)అని సర్వవస్తువులను రెండుగ విభాగింతుము. లేక,సదసత్తు లను నీరెండుశబ్దములను దెలియఁజేయుటకు మనుష్యుని కనుదోయికి మున్న రెండువిధములగు విరుద్ధధర్మము లుండవలెనవచ్చుననునది స్పష్టముగనే యున్నది. కాని మూలారంభమున నొకవస్తువే యుండెనేని ద్వైత ముత్పన్నమైనపిదప రెండు వస్తువుల నుద్దేశించి ప్రచారములోనికి వచ్చిన 'సదసత్తు'లను సాపేక్షశబ్దములను నీమూలవస్తువునకు నెట్లు సంబంధింపఁజేయుదురు? కారణమేమి యనఁగా: దానిని 'సత్' అందుమేని యాసమయమున దానికి జతగా నింకొద్దియైన 'అసత్'గా నున్న దా రేమి? యని శంక కలుగును. కావున పరబ్రహ్మ మిట్టిది యని చెప్పక "జగదారంభమున 'సత్తు' కాకపోయెను, 'అసత్తు'ను కాకపోయెను. ఏదియున్నదో యది

యొక్క-టిరియే యుండెను. సదసచ్ఛబ్దములయొక్క- ద్వంద్వము పిదప వెలువడినది." అని ఋగ్వేదమునందల్లి నాసదీయసూక్తమునందు సృష్టియొక్క- మూలతత్త్వము వర్ణింపఁబడినది. (ఋ.౧౦.౧౨౯) మఱియు, సదసత్తులు, శీతోష్ణములు మొదలగు ద్వంద్వములనుండి ముక్తమయిన బుద్ధికలవాఁడీసకలద్వంద్వములకు పరముగ నున్న (అనఁగా: నిర్ద్వంద్వమగు) బ్రహ్మపదమును బొందుచున్నాఁడని గీతలలోఁ జెప్పఁబడినది. (గీ.౭. ౨౮; ౨. ౪౫). అధ్యాత్మశాస్త్రమునందున్న విచార మెంత గూఢముగను, సూక్ష్మముగ నున్నదియో దీనిం బట్టి తెలియును. కేవలతర్క-దృష్టితో విచారించితిమేని పరబ్రహ్మముయొక్క-, లేక, యాత్మయొక్క- యీయజ్ఞేయత్వము దెలిసికొనుటకు వేఱుమార్గ ముండదు; కాని బ్రహ్మ మీరీతిని అజ్ఞేయమును, నిర్గుణమును కావుననే యింద్రియాతీత మయినను ఒక్కొ-క్క-నికి తనయాత్మయొక్క- సాక్షాత్ప్రతీతి (అనుభవము)యుండుటచే,ఈనిర్గుణాత్మయొక్క- యీయనిర్వాచ్యమగు స్వరూపమును సాక్షాత్కా-రముచే మనమెఱుంగుచున్నామో, యదియే పరబ్రహ్మముయొక్క- స్వరూపముగ నున్నదని కింవదంతి కలుగవచ్చును. దానివలన బ్రహ్మము నాత్మయు నేకస్వరూపులగ నున్నా రనుసిద్ధాన్తము నిరర్థకము గానేరదు. ఈదృష్టితోఁ జూచితిమేని "బ్రహ్మము ఆత్మస్వరూపుఁడుగ నున్నాఁడు" అనుటకంటె దాని స్వరూపవిషయమై యధికముగ నేమియుఁ జెప్పుటకు సాధ్యము కానేరదు. మిగిలిన విషయములలో నంతయు స్వానుభవాధీనముగనే యుండవలయును. బుద్ధిగమ్యమను శాస్త్రీయమనగుదానిని స్పష్టపఱుచుటలో శబ్దములచే శక్యమయినంతవివరించుట యావశ్యకము. కావున బ్రహ్మ మంతట నొకవిధముగ వ్యాపించినదయ్యును, అజ్ఞేయము, ననిర్వాచ్యముగనున్నను, జడసృష్టియొక్క-యు, నాత్మస్వరూపియగు బ్రహ్మముయొక్క-యు భేదమును స్పష్టపఱుచుటకే యాత్మయొక్క- సాన్నిధ్యముచే జడప్రకృతియందు మనకు గోచరించుచైతన్యరూపమగుగుణమె యాత్మకు ప్రధానలక్షణ మని చెప్పి యాత్మయు బ్రహ్మము నను నీరెండును చిద్రూపములు చైతన్యరూపములు నని యధ్యాత్మశాస్త్రమునందుఁ జెప్పుచున్నారు. కారణమేమి యనఁగా: అట్లు చేయని నాఁడు ఆత్మబ్రహ్మములు రెండును నిర్గుణములు, నిరంజనములు, ననిర్వాచ్యములు నగుటచే వానియొక్క- స్వరూపనిర్ణయవిషయమై మౌనముగ నుండవలయును. లేదా,శబ్దముచే నెవరేమి వర్ణించినను "నేతి నేతి, ఏతస్మాదన్యత్పర మస్తి"—"ఇదికాదు ఇది (బ్రహ్మము) కాదు. (ఇవి నామరూపములు), సత్యమగుబ్రహ్మ మింతకంటె మఱియొకటి యున్నది." అని యెప్పుడును లేదు

లేదను పాఠమును వల్లించుటకంటె మఱియొకమార్గ మేదియును లేదు (బృ. ౨. ౩. ౬). కావున, చిత్ (జ్ఞానము), సత్ (సత్తామాత్రత్వము, లేక, ఉనికి), మఱియు నానందము ననునవి బ్రహ్మస్వరూపముయొక్క లక్షణములని సామాన్యముగఁ జెప్పుచున్నారు. ఈలక్షణము లితరలక్షణములకంటె శ్రేష్ఠము లయిన వనుటలో సందేహము లేదు. అయిన నీలక్షణములు శబ్దముచే నెఱుంగుటకు వీలుకలుగునం తటి బ్రహ్మస్వరూపముయొక్క పరిచయమును కలుగఁజేయుటకు మాత్రమయి చెప్పఁబడి నవి. సత్యమగు బ్రహ్మస్వరూపము నిర్గుణమగుటచే దాని నెఱుంగుటకు దానియొక్క ప్రత్యక్షానుభవమె యుండవలయు ననుసంగతి మఱచిపోఁగూడదు. ఈయనుభవ మెట్లుకలుగవచ్చును? (అనఁగా: ఇంద్రియాతీతము గావుననే యనిర్వాచ్యమయిన బ్రహ్మస్వరూపము బ్రహ్మనిష్ఠున కేవిధమున నెప్పు డనుభవమునకు వచ్చును?) అనెడి యీవిషయమై మనశాస్త్రకారులచేఁ జెప్పఁబడినవివేచన నిక్రింద సంక్షేపముగఁ జెప్పుచున్నాను.

బ్రహ్మము నాత్మయు నొకటే యను నీసమీకరణమునే "పిండమందుండు నదియే బ్రహ్మాండమం"దున్న దని చెప్పుచున్నారు. మఱియు నీబ్రహ్మాత్మైక్యము యొక్క యనుభవమైనపిదప జ్ఞాత(చూచువాఁడగు నాత్మ) వేఱనియు, జ్ఞేయము (అనఁగా: దృశ్యమగువస్తువు) వేఱనియు భేదముండుటకు వీలులే దనునది న్యాయ్యముగ సిద్ధమయినదియే. మనుజుఁడు బ్రతికియుండునంతవఱకును నేత్రములు మొద లగునింద్రియములును వానిని వదలిపెట్టలేనిగుణములును వేఱు, ఇంద్రియములకు గోచరమగువిషయము వేఱు ననునీభేద మెట్లు వదలిపోవును? ఈభేదము వదలక పోవునేని పరబ్రహ్మాత్మైక్యానుభవ మెటులు కలుగును? అని యొకసందేహ మీవిష యములోఁ బుట్టుటకు వీలుగ నున్నది. మఱియు కేవలమింద్రియదృష్టితో విచా రణఁజేసినను నీసందేహము చూచునంతటితోనే న్యాయవిరుద్ధముగఁ గాన్పింప నేరదు; కాని లోతుగ విచారించినయెడల నింద్రియములు బాహ్యవిషయములను జూడవలయు ననుకోరిక దానియంతట నదియే పుట్టనేరదు. "చక్షుః పశ్యతి రూపాణి మనసా న తు చక్షుషా" (మ. భా. శాం. ౩౧౧. ౧౭)— ఏవస్తువు నైనఁ జూచుటకై (వినుట మొదలగు వానికిని) కన్నులకు (చెవులు మొదలగు వానికిని) మనస్సుయొక్క సాయము కావలసియుండును. మనస్సు శూన్యమైన యెడల వస్తువు కన్నులయెదుట నున్నను కాన్పింపదని పూర్వమునఁ జెప్పఁ బడినది. ఈవ్యావహారికానుభవ మెఱింగినను, నేత్రాదీంద్రియములు వ్యాపా

రముఁ జేయుచున్నను, మనస్సు నింద్రియములసమీపమునందుండి తొలఁగించితి మేని, యింద్రియములయొక్కయు, విషయములయొక్కయు ద్వంద్వములు బాహ్యసృష్టియందున్నను తనకు లేనటులె యగును. మఱియు మనస్సనునది కేవలమాత్మయందె (అనఁగా: ఆత్మస్వరూపిఁయగు బ్రహ్మమందె) యనురక్తమగు బ్రహ్మాత్మైక్యముయొక్క సాక్షాత్కారము తనకగునని సహజముగ ననుమానింపఁ బడుచున్నది. ధ్యానముచేతను, సమాధిచేతను, ఏకాంతోపాసనచేతను అత్యంతబ్రహ్మవిచారమం దీమానసిక స్థితి యుండువారికి దృశ్యసృష్టియందలిద్వంద్వములు, లేక, భేదములు కంటియెదుట నున్నను గాన్పింపనివియే యగును. మఱియు నద్వైతబ్రహ్మస్వరూపముయొక్క పూర్ణసాక్షాత్కారము స్వయముగనె కలుగును. పూర్ణబ్రహ్మజ్ఞానముచేఁ దుదకుఁ బ్రాప్తమగునీపరమావధి యగు స్థితియందు జ్ఞాతృ, జ్ఞేయము, జ్ఞానము ననునీమూఁడువిధములగు భేదము (అనఁగా: త్రిపుటి) బొత్తిగనే యుండదు. లేక, యుపాస్యోపాసకభావ మను నీద్వైతము మిగులదు. కావున నీయవస్థ యితరుల కెవరికిని చెప్పుటకు సాధ్యముకానేరదు. కారణ మేమి యన: 'రెండవది' యనుశబ్దము నుచ్చరింపఁగనె యీయవస్థ చెడిపోవును. మనుజుఁడద్వైతమునుండి ద్వైతములోనికి వచ్చు ననుసంగతి స్పష్టముగనే యున్నది. వేయేల! ఈయవస్థ నాకు తెలిసినది యని చెప్పుటసైతము కష్టము. కారణ మేమనఁగా: నేనని చెప్పినను యితరునికంటె భిన్నుఁడని భావన మనస్సునకుఁ గాన్పింపవచ్చును. మఱియు బ్రహ్మాత్మైక్యమగుట కది బాధకముగ నుండును. ఆకారణముచే "యత్ర హి ద్వైత మివ భవతి త దితర ఇతరం పశ్యతి...జిఘ్రతి...శృణోతి...విజానాతి,... యత్ర త్వస్య సర్వ మాత్మై వాభూత్ తత్కేన కం పశ్యేత్...జిఘ్రేత్...శృణుయాత్...విజానీయాత్,...విజ్ఞాతార మరే కేన విజానీయాత్, ఏతావ దరే ఖల్వమృతత్వ మితి" "చూచువాఁడును, చూడఁబడుపదార్థము ననుద్వైత మెంతవఱకు నుండునో యంతవఱకు నొకఁ డితరుని చూచుచున్నాఁడు, వాసనఁజూచుచున్నాఁడు, వినుచున్నాఁడు, తెలిసికొనుచున్నాఁడు; కాని యివి యన్నియు నాత్మమయము లయినప్పుడు (అనఁగా: స్వపరభేదము లేనప్పుడు) యెవఁ డెవని చూచును? దేనిని వాసనఁజూచును, దేనిని వినును, దేనినిఁ దెలిసికొనును? ఓరీ! ఏది తానే జ్ఞాతయో (అనఁగా: తెలిసికొనునదియో) దానినిఁ దెలిసికొను మఱియొక పదార్థము నెచ్చోనుండి తీసికొనిరాఁగలము" అని యాజ్ఞవల్క్యులు బృహదారణ్యకమునం దీపరమావధి స్థితిని వర్ణించిరి (బృ. ౪. ౫. ౧౫; ౪. ౩. ౨౭). అందు

నీతీరుననే యాత్మభూతులు, లేక, బ్రహ్మభూతులు నయినపిదప వారివిషయమయి భీతి, శోకము, లేక, సుఖదుఃఖాదిద్వంద్వములు నుండుటకు వీలుకానేరదు. (ఈశ. ౭) కారణమేమి యనఁగా: దేనివిషయమై భయపడవలసి వచ్చునో, దేనివిషయమై శోకింపవలసివచ్చునో, యది తనకంటె భిన్నముగ నుండవలయును. వజీవము బ్రహ్మాత్మైక్యముయొక్క యనుభవమయినపిదప నిట్టి యేభిన్నత్వమునకు నవకాశమే యుండదు. ఈదుఃఖశోకవిరహితమగు నవస్థకే యానందమని పేరు. ఈయానందమే బ్రహ్మమని తైత్తిరీయోపనిషత్తునందుఁ జెప్పఁబడినది. (తై. ౨. ౯; ౩. ౬). కాని యీవర్ణనయును గౌణముగనే యున్నది. కారణమేమి యనఁగా: ఆనందము ననుభవించువాఁడైనను నిప్పుడెక్కడ నున్నాఁడు? కావున లౌకికానందములకంటె వాత్మానందము చాలవిలక్షణముగ నుండునని బృహదారణ్యకోపనిషత్తులోనే వర్ణింపఁబడినది. (బృ. ౪. ౩. ౩౨) బ్రహ్మవర్ణనయందు వచ్చుచున్న యానందశబ్దముయొక్క యీగౌణత్వమును గమనించియే యితరప్రదేశములందును, "బ్రహ్మ భవతి య ఏవం వేద" "ఎవఁడు బ్రహ్మమును తెలిసికొనునో వాఁడు బ్రహ్మమే" (ముం. ౩. ౨. ౯) యగుచున్నాఁడని మాత్రమే. (అనఁగా: 'ఆనంద' శబ్దమును దొలఁగించి) బ్రహ్మవేత్త యగుపురుషునియొక్క కడపటివర్ణన సేయఁబడినది. ఉప్పుకల్లు నీటిలో కరగినపిదప నానీటిలో నీభాగ ముప్పగ నున్నదనియు నీభాగ ముప్పగ నుండలేదనియు భేద ముండనటుల బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలిగినపిదప సర్వము బ్రహ్మమయమే యగునని యీస్థితి కీదృష్టాంత ముపనిషత్తులలో నీయఁబడినది (బృ. ౨. ౪. ౧౨; ఛాం. ౬. ౧౩); కాని "జయాచీ వదే నిత్య వేదాంతవాణీ"—"ఎవని వాక్కెల్లప్పుడు వేదాంతమును నుడువునో"—యని తుకారామబువాగా రీదృష్టాంతమునకు మాఱుగ—

"గోడపణే జైసా గూళీ, తైసా దేవ జాలా సకళీ
ఆతాం భజో కోణోపరీ, దేవ సబాహ్యాఅంతరీ." (తు. గా. ౩౬౧౭.)

"ఓ భగవంతుఁడా! బెల్లమున మాధుర్యము లోపలను వెలుపలను సమానముగ నెటులుండునో యటులే నీవంతటను వ్యాపించి యుండుటచే నేవిధముగ భజించి నను నిన్ను భజింపవచ్చును"—అని గుడముయొక్క మధురిమ దృష్టాంతమును గైకొని తనయనుభవమును జెప్పెను. పరబ్రహ్మ మింద్రియముల కగోచరము మనస్సున కగమ్యము నయిన నయ్యది స్వానుభవగమ్యమనుట (అనఁగా: వారివారి యనుభవముచేఁ దెలియఁబడునదియనుట) కిదియే తాత్పర్యము. పరబ్రహ్మమందున్న దనెడి

యజ్ఞేయత్వము, జ్ఞాత జ్ఞేయము లను నీద్వైతస్థితిలోనిదే కాని అద్వైతసాక్షాత్కారములోనిది కానేరదు. నేను వేఱు జగత్తు వేఱను బుద్ధి యుండువఱకు నేమి చేసినను బ్రహ్మాత్మైక్యము పూర్ణముగ నెఱుంగుటకు శక్యము కానేరదు; కాని యేఱు సముద్రమును గ్రుంగలేకపోయినను సముద్రమునఁ బడుటచే నది సముద్రరూపమును బొందునటుల పరబ్రహ్మములో మునిఁగినమనుజునకుఁ దదనుభవము కలుగును; మఱియు— "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని" "సర్వభూతములు తన యందును, తాను సర్వభూతములయందును" (గీ. ౬. ౨౯.) అనినటు లతనికి బ్రహ్మమయస్థితి సంభవించును. పూర్ణబ్రహ్మజ్ఞాన మిటులు కేవలస్వానుభవమునె యవలంబించి యున్నది యను నీయర్థమును తెలియపఱుచుటకొఱకు—"అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతాం"— "తనకు పరబ్రహ్మము తెలిసిన దని యను వానికి తెలియలేదు. మఱియు తనకు తెలియదనియును వానికి తెలిసియున్నది." (కేన. ౨.౩.)—అని పరబ్రహ్మస్వరూపము చక్కని విరోధాభాసాత్మకముగ వర్ణిత మయినది. కారణమేమి యన: పరబ్రహ్మము తనకు తెలిసినదని యెవరయినను చెప్పినప్పుడు తాను (జ్ఞాత) వేఱును, తనకుఁదెలిసిన (జ్ఞేయము) బ్రహ్మము వేఱును అను నీద్వైతము మనస్సున నుత్పన్నమగుటచే నతనిపరబ్రహ్మాత్మైక్యరూప మగునద్వైతానుభవ మంతవఱకే యై యున్నది. ఈసమయమున న్యూన మయినది, లేక, యపూర్ణముగ నున్నది యని చెప్పువానికి సత్యమగు బ్రహ్మము తెలియలేదని యతనిమాటచేతనే సిద్ధమగుచున్నది. దీనికి విపరీతముగ తాను బ్రహ్మమను ద్వైతభేదము లేకపోవుటచే బ్రహ్మాత్మైక్యముయొక్క పూర్ణానుభవము కలిగినప్పుడు తన కది 'తెలిసినది (అనఁగా: తనకంటె నితరమగునది యొకటి తెలిసినది) యనుమాటయె' యతనినోట వచ్చుటకు వీలులేదు. కావున నీస్థితియందు (తనకు బ్రహ్మము తెలిసినదని జ్ఞాని చెప్పుటకు నసమర్థుఁడగు స్థితియందు) అతనికి బ్రహ్మము తెలిసినదని చెప్పవలసివచ్చును. ఈతీరున పూర్తిగ ద్వైతభావము లోపించుటయు, జ్ఞాత పూర్తిగ పరబ్రహ్మములోఁ గలిసి లయమును బొందుటయు, నిశ్శేషముగ నేకీభావమును బొందుటయును సామాన్యముగ దుష్కరమని తోఁచుచున్నది; కాని యాలోచింపఁగనే కష్టమని కాన్పించెడి యీ 'నిర్వాణ' స్థితి యభ్యాసముచే నైనను, వైరాగ్యముచే నైనను తుదకు మనుజునకు సాధ్యము కాఁగలదని మనశాస్త్రకారు లనుభవముచే సిద్ధాన్తముఁ జేసిరి. 'నేను' అను దానియొక్క ద్వైతభావ మీస్థితియందు, నాశమునో, మరణమునో పొందియుండుటచే నాత్మనాశములోనిది యొక భేదముగ నున్నదని యనేకులు దల

చున్నారు; కాని యీస్థితి ననుభవించినప్పుడు వర్ణించుట సాధ్యము కాకపోయి నను పిదప నది స్మరణలోనికి రావచ్చు ననువిషయము తెలిసిన నేని పూర్వోక్తమగు శంక నిర్మూలమగు నని యందఱకును దెలియును.* కాని సత్పురుషుల యనుభవము దీనికంటెను బలవత్తర మగు ప్రమాణమై యున్నది. ప్రాచీను లగుభక్తపురుషుల యనుభవవర్ణన మటుండనిమ్ము; మొన్న మొన్నసైతము భగవద్భక్తశిరోమణి యగు తుకారామబువాయును—

“ఆప్రలే మరణ పాహిలే మ్యా డోళా, తో జాలా సోహళా అనుపమ.”

(గా. ౩౫౭౯.)

“నేను నామృత్యువును నాకన్నులతోఁ జూచితి. ఇదియు నొకయనుపమ మగు నుత్సవముగ నేయున్నది”—అని యీపరమావధి యగుస్థితి యాలంకారికభాషలో నత్యుత్సాహముతోను, ధన్యతాపూర్వకముగను వర్ణించెను. వ్యక్తము, లేక, యవ్యక్త మగుసగుణబ్రహ్మము నుపాసించి ధ్యానముచే క్రమముగ గొప్పవాఁడగుచు నుపాసకుఁడు తుదకిట్టిస్థితిని బొందుచున్నాఁడు. అనఁగా:—“అహం బ్రహ్మాస్మి” “నేనే బ్రహ్మగ నున్నాను” (బృ. ౧. ౪. ౧౦) అను బ్రహ్మాత్మైక్యస్థితియొక్క సాక్షాత్కార మతని కగుచున్నది. మఱియు నతఁడు దానిలో నేస్థితియం దుండు నది, లేక, యేయనుభవము బొందుచున్నదియు సైతె మనసునకి గోచరింపనంతటి జ్ఞాన ములో మునిఁగి యుండును. జాగ్రదవస్థ స్థిరముగ నుండుటచే నీయవస్థ స్వప్న మని, లేక, సుషుప్తి యని వచించుట కసాధ్యము. మఱియు జాగ్రదవస్థ యనుమేని జాగ్రదవస్థయందు సామాన్యముగఁ గలుగఁబోవు ద్వైతముయొక్క నిశిలవ్యవహార

* ధ్యానముచేతను, సమాధిచేతను లభించెడి యద్వైతముయొక్క కాని యభేదముయొక్క కాని యీ యవస్థ, Nitrous-oxide gas అను పేరుగల యొక విధమగు గాలిని వాసనఁ జూచుటచే సైతము ప్రాప్త మగును. ఈగాలికి లాఫింగ్ గాస్' అని పేరు. *Will to Believe and other Essays on Popular Philosophy* by William James. pp. 294, 298. కాని యీ యవస్థ కృత్రిమ మైనది. సమాధిచేఁ గలుగునవస్థ సత్య మైనది. ఇదియే యీ రెంటి లో నున్న భేదము. అయిన నీకృత్రిమావస్థయొక్క దృష్టాంతముచే నభేదావస్థ యొక్క యస్తిత్వవిషయమై వాద మేమియు నుండదు. కాన నిక్కడ దాని వక్కాణించితి.

ములు నాఁగుచున్నవి. కావుననే స్వప్నము, సుషుప్తి, లేక, జాగ్రత యనునీమూఁడు వ్యావహారికావస్థలకంటె వేఱైనదియగు నిదియె యొకనాల్గవయవస్థ, లేక, తురీయావస్థ యని శాస్త్రములందు వర్ణింపఁబడినది. మఱియు నీస్థితి నొందుటకు నిర్వికల్పసమాధియోగము (అనఁగా: దేనియందు ద్వైతసంబంధము లేశమాత్రము నుండదో యట్టి సమాధియోగమును) నభ్యసించుట యనునదియె పాతంజలయోగదృష్టిచే ముఖ్యసాధన మగుటచే గీతయం దున్నయీనిర్వికల్పసమాధియోగ మభ్యాసముచే సంపాదించుకొనుటకు మనుజుఁడు నిరాశఁ జెందరా దని చెప్పఁబడినది. (గీ. ౬. ౨౦-౨౩) ఈబ్రహ్మాత్మైక్యస్థితియే జ్ఞానముయొక్క పూర్ణావస్థ. కారణమేమియన: సర్వజగత్తును బ్రహ్మస్వరూపము (అనఁగా: ఒక్కటియే) అయినపిదప "అవిభక్తం విభక్తేషు"—అనేకము నేకత్వముఁ జేయుట—అని గీతలయం దున్న జ్ఞానక్రియయొక్క విశేషజ్ఞాన మైనను గలుగుటకు వీలు లేదు. అటులే నామరూపములకంటె పరమం దున్న యీయమృతత్వముయొక్క యనుభవమయినపిదప మనుజులకు జననమరణప్రవాహముసైతము స్వయముగనె నశించుచున్నది. కారణమేమియన: జననమరణములును నామరూపములలోనివే. మఱియు వానికి పరముగనె యితఁ డుండును. (గీ.౮.౨౧) ఈకారణముననే తుకారామబువా యీస్థితిని 'మరణముయొక్క మరణ' మని పేర్కొనెను. (గా. ౩౫౮౦); మఱియు యాజ్ఞ్యవల్క్యుఁడీకారణముచేతనే యీస్థితి నమృతత్వముయొక్క సీమ, లేక, పరాకాష్ఠ యని నుడువుచున్నాఁడు. ఇదియె జీవన్ముక్తావస్థ. ఈయవస్థయం దాకాశగమనము మొదలగుకొన్ని యపూర్వములు నలౌకికములు నగుసిద్ధులు లభించు నని పాతంజలయోగసూత్రములలోను, ఇంక నితరస్థలములయందును చెప్పఁబడినది. (పాతంజలసూ. ౩. ౧౬-౫౫) మఱియు నీకారణముననే యనేకులు యోగాభ్యాసవ్యసనమునఁ బడుచున్నారు. కాని యోగవాసిష్ఠములో వర్ణించినటు లాకాశగమనము మొదలగుసిద్ధులు బ్రహ్మనిష్ఠస్థితికి సాధ్యములు, లేక, భాగములు కావు. కావున జీవన్ముక్తుఁ డగుపురుషుఁ డిసిద్ధి నొందుటకు యత్నము చేయఁడు. మఱియు నెప్పుడు నతని కీయూహయుఁ గలుగదు. (యోగ. ౫. ౮౯ చూడుము) కావున యోగవాసిష్ఠకారుఁడుమాత్రమే కాక గీతలలోసైత మీసిద్ధి యెచ్చటను చెప్పఁబడలేదు. ఇదియు చమత్కారమే (మాయయొక్క విలాసమే) కాని, బ్రహ్మవిద్య కాదు. అని వసిష్ఠులు శ్రీరాములకుఁ జెప్పిరి. అది సత్యమే యయి యుండును. సత్యము కా దని నేఁ జెప్పను; కాని యేమిచెప్పినను నిది బ్రహ్మవిద్యయొక్క విషయము కా దనుసంగతి మాత్రము నిర్వివాదముగ నున్నది. కావున "ఇట్టిసిద్ధులు లభించినను, లభింపక పోయినను, వానిని

లక్ష్యపెట్టక, లేక, వాని నిచ్ఛయింపక, లేక, వానికై యాసపడక, సర్వభూతములందు నొకయాత్మయె కలదను పరమానందమగు బ్రహ్మనిష్ఠయొక్క స్థితి మనసు నేతీరున ప్రాపించు నని యెన్నుచు, దాని నిమిత్తమై మనుజుఁడు యత్నింపవలయును. అణిమాదిసిద్ధు లనువ్యసనములోఁ బడరాదు." అని బ్రహ్మవిద్య చెప్పుచున్నది. బ్రహ్మజ్ఞాన మనునది యాత్మయొక్క శుద్ధావస్థ యున్నది; కాని కనుకట్టు, లేక, మాయికచమత్కారము కానేరదు. మఱియు నిట్టిచమత్కారములచే బ్రహ్మజ్ఞానమునకు మహిమ లేకపోవుటయే కాక బ్రహ్మవిద్యయొక్క మహత్త్వమునకు నీచమత్కార మనునది పూర్ణముఁ జేయునదియుఁ గానేరదు. పక్షులును, ఇప్పుడు విమానములుఁ గలిగినజనులును నాకసమునందు పరుగిడుదురు; కాని యంతమాత్రముచే వారిని బ్రహ్మవేత్త లనరు. వేయేల? గమనము మొదలగుసిద్ధులను బొందినకొందఱు పురుషులు మాలతీమాధవీయనాటకములోనియఘోరఘంటునివలె క్రూరులుగను, ఘాతుకులుగను కూడ నుండవచ్చును.

బ్రహ్మాత్మైక్యరూపమగు సానందమయస్థితియొక్క యనిర్వాచ్యానుభవ మితరులకు పూర్ణముగఁ జెప్పుటకు శక్యము కానేరదు. కారణ మేమి యన: వాఁడితరులకుఁ జెప్పవలసి వచ్చెనేని 'నేను-నీవు,' మొదలగుద్వైతభాషనె మాటలాడవలసి వచ్చును. మఱియు నీద్వైతభాషయం దద్వైతసర్వానుభవమును వ్యక్తీకరించుట సాధ్యము కానేరదు. కావున నుపనిషత్తులలో వర్ణింపఁబడిన యీపరమావధిస్థితియు అపూర్ణము, లేక, గౌణమని తెలిసికొనవలయును. మఱియు నీవర్ణన గౌణమయినను సృష్ట్యుత్పత్తి, రచన మొదలగువాని దెలియఁ జేయుట కనేకస్థలములం దుపనిషత్తులలో నున్నశుద్ధద్వైతవర్ణనయు గౌణ మనియే నుడువవలయును. ఉదాహరణ మేమి యన: ఆత్మస్వరూపము శుద్ధము, నిత్యము, సర్వవ్యాపియు, అవికారియునై యున్నది. ఇట్టిబ్రహ్మమందుండియే, పిదప హిరణ్యగర్భుఁ డను పేరుగలసగుణ పురుషుఁడు, లేక, నీరము మొదలగుసృష్టిలోని వ్యక్తపదార్థములు క్రమక్రమముగ నిర్మితము లైనవి యనియు, లేక, యీనామరూపముల నిర్మించినపిదప జీవరూపముగ పరమేశ్వరుఁ డందు ప్రవేశించెననియు (తై. ౨.౬; ఛాం. ౬.౨-౩; బృ. ౧. ౪. ౭) నుపనిషత్తులలోఁ జెప్పఁబడిన దృశ్యసృష్టియొక్క యుత్పత్తి యద్వైతదృష్టిచే యథార్థము కానేరదు. కారణ మేమి యన: జ్ఞానగమ్యుఁ డగు నిర్గుణపరమేశ్వరుఁడే నలుదెసల వ్యాపించియుండెనేని-యొకటే, రెండవదానిని బుట్టించె నని చెప్పుటయె తాత్త్వికదృష్టినిబట్టి నిర్మూల మగును; కాని సామాన్య

జనులకు సృష్టిరచనను దెలియఁజేయుటకై వ్యావహారిక (అనఁగా: ద్వైతభాష) మనునదియె ముఖ్యమగుసాధన మగుటచే వ్యక్తసృష్టియొక్క (అనఁగా: నామరూపములయొక్క) యుత్పత్తినిగుఱించి పైఁ జెప్పినవర్ణన యుపనిషత్తులలో నున్నది. అయినను వానియందు సైతము నద్వైతభావ మధిక స్థిరముగనుండుటచే నిట్టి ద్వైతవ్యావహారికభాష ప్రయోగింపఁబడినను మూలమందు నద్వైతమే సత్యమని యనేక ప్రదేశములందుఁ జెప్పఁబడినది. సూర్యుఁడు తిరుగుటలే దని నిశ్చయజ్ఞానము కలిగినను సూర్యుఁ డుదయించుచున్నాఁ డనియు నస్తమించుచున్నాఁ డనియు మనము చెప్పుచున్నటులే యొకయాత్మరూపియగు పరబ్రహ్మ మఖండముగ నలుదెసల నిండియుండుటచే నది యవికార్య మనుట నిశ్చయ మని స్థిరమయినను "పరబ్రహ్మమునుండి వ్యక్త మయినజగత్తు నిర్మిత మైన'దను భాష యుపనిషత్తులలో నక్కడక్కడ నున్నది; మఱియు గీతలయందు నటులె 'నాయొక్క సత్యస్వరూప మవ్యయము నజమునై యున్నది' (గీ. ౭. ౨౪) అని చెప్పుచు, 'నేను సర్వజగమును పుట్టించినాను' (గీ. ౪. ౬) అని భగవంతుఁడు చెప్పినాఁడు గాన దీనియందలి రహస్యమును కనిపెట్టినయెడల నవి శబ్దమును బట్టి సత్యములుగనే యున్నవి.అవియే ముఖ్యముగనున్నవి''యనియెన్ని,యనేకులగు పండితులు ద్వైతము, లేక,విశిష్టాద్వైత ముపనిషత్తులలోఁ బ్రతిపాదింపఁబడియున్నదని సిద్ధాంతీకరించుచున్నారు. అంతట నొకనిర్గుణమగుబ్రహ్మమే వ్యాపించియున్న దని యనునెడల నీయవికారియగుబ్రహ్మమందుండి వికారియు నశ్వరము నగుసగుణపదార్థ మెట్లు పుట్టిన దనుప్రశ్నకు సమాధాన ముండదు. కారణ మేమియన: నామరూపాత్మక సృష్టిని మాయయని చెప్పినను నిర్గుణబ్రహ్మమందుండి సగుణమగుమాయ పుట్టుటయే తర్కదృష్టిచే శక్యము కాకపోవుటవలన నద్వైతవాదయుక్తి శూన్య మగుచున్నది. వీనికంటె సాంఖ్యశాస్త్రమున చెప్పినటులు నామరూపాత్మక మగువ్యక్తసృష్టియొక్క ప్రకృతివంటి యొకానొక సగుణము వ్యక్తము నగురూపము నిత్య మని యొప్పుకొని, యంత్రములోనుండు నావిరివలె దానిలో నుండునదియు, పరబ్రహ్మరూపమయినదియు నగుమఱియొక నిత్య మగుతత్త్వము జగమున నోతప్రోతము(పడుగుపేక)గ నిండియున్న దనియు (బృ.౩.౭) నీరెంటికిని దానిమ్మపండులోని విత్తులవలె నైక్యమే యని యంగీకరించుట మిక్కిలి ప్రశస్తముగ నుండు ననియు వారు చెప్పుదురు;కాని యుపనిషత్తులతాత్పర్య మీరీతిగ నిశ్చయించుట యుక్తము కాదని మామతము. ఉపనిషత్తులలో నొకానొకప్పుడు ద్వైతమును, మఱియొకప్పుడు శుద్ధాద్వైతమును వర్ణించు చుండుటచే నీరెంటికి నేకవాక్యత చేయవలసియే

యున్నది; కాని యద్వైతవాదము ముఖ్య మని యంగీకరించి నిర్గుణబ్రహ్మము సగుణ మగుటకు మాత్రము మాయికమగు ద్వైతముయొక్క స్థితి ప్రాప్త మగుననుల కాన్పించుచున్న దని యంగీకరించుటచే సర్వవచనములకు వ్యాఖ్యానించినటు ద్వైత పక్షము ప్రధాన మని యంగీకరించిన సమ్మతము. ఉదాహరణము:—"తత్త్వమసి" ఈవాక్యమందున్న పదములయొక్క యన్వయము ద్వైతమతానుసారముగ చెప్పుడును బాగుగ నుధురము. ద్వైతుల కీప్రతిబంధము తోఁపకపోదు; కాని, తత్త్వం=తస్యత్వం— అనఁగా: నీకంటె భిన్నమగు వానిసంబంధుఁడవుగా నీవు న్నావు, వాఁడే నీవు కావు—అని యేదో యొకవిధమున నీమహావాక్యమును సమన్వయించి ద్వైతులు తృప్తిఁజెందుదురు; కాని కొంత సంస్కృతజ్ఞాన ముండి, పక్షపాతము లేక విచారించు నెడల యొక్కొకనికి నిట్టులు క్రమము తప్పిచేయుట వలన నేర్పడునర్థము సత్యము కానేర దని వెంటనే తెలియును. కైవల్యోపనిషత్తున "స త్వ మేవ త్వ మేవ తత్" (కై. ౧. ౧౬) అని 'తత్' 'త్వమ్' అనుశబ్దములను క్రమము తప్పనటు లొనర్చి పైమహావాక్య మద్వైతపరముగనే యున్న దని సిద్ధాన్తము చేయఁబడినది. వేయేల? మొత్తముపై నుపనిషత్తులయొక్క మంచిమంచిభాగములను ఛేదించి తాఱుమాఱు సేయని యెడలను, తెలిసియు దానియందు దురుద్దేశమును బొందని యెడలను, ఉపనిషచ్ఛాస్త్రమునం దద్వైతమతము తప్ప వేఱొక రహస్యమున్న దని నిరూపించుటకు సాధ్యము కానేరదు. కాని యీవాద మెప్పుడును సమాప్తమగునది కానేరదు. కావున దానివిషయమై యిక్కడ విశేషము నేను విచారణఁ జేయుటచే వచ్చుఫలము లేదు. అద్వైతము గాక యితరమతములు రుచించువారు దానిని సంతోషముతో స్వీకరింపవచ్చును. మహాత్ములచే నుపనిషత్తులయందు "నేహ నా నాస్తి కించన" (బృ. ४. ४. ౧౯; కఠ. ४. ౧౧)—ఈ సృష్టియం దేవిధమయిన నానాత్వము లేదు. ఉన్నదంతయు మూలమునందే "ఏక మేవాద్వితీయమ్" (ఛాం. ౬. ౨. ౨.) అని స్వానుభవమును స్పష్టముగఁ జెప్పి పిదప "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నా నేవ పశ్యతి" "ఈజగత్తున నెవరికి నానాత్వము గాన్పించుచున్నదో వారు జననమరణము లనుచక్రమున పడుచున్నారు." అని చెప్పఁబడినమాహాత్మ్యముయొక్క యభిప్రాయ మద్వైతముతప్ప వేఱొకవిధముగ నుండుటకు సాధ్య మగునని నాకు తోఁపదు. కాని యనేకవైదికశాఖలం దనేకోపనిషత్తులుండుటచే మొత్తముపై సర్వోపనిషత్తులయొక్కయు తాత్పర్యమొక్కటియే యగునా? కానేరదా? యనువిషయ

మును శంకించుటకు నొకప్పుడు కొంతయవకాశము ప్రాపించును. గీతలలో నట్టి యవకాశము లేదు. గీత యనునది యొక గ్రంథమగుటచే దానియం దొకవిధమగు వేదాంతమే ప్రతిపాద్య మనువిషయము స్పష్టముగఁ గాన్పించుచున్నది; అది యేమి యని విచారింప నారంభించితి మేని, సర్వభూతములు నష్టమయినను స్థిరముగ నున్నయొకవస్తువే నిజమయిన (గీ. ౮. ౨౦) సత్యమగుటచే పిండమందును బ్రహ్మాండమందును కలసి యంతటను నదియె నిండియున్నది. (గీ. ౧౩. ౩౧), అని యద్వైతపరముగ సిద్ధాంతమును జేయుట యావశ్యక మైనది. వేయేల? గీతలలోఁ జెప్పఁబడిన యాత్మౌపమ్యబుద్ధి యను నీతితత్త్వమునకు పూర్ణమగు నుపపత్తియు నద్వైతముకంటె వేఱొక వేదాంతదృష్టితో కుదురదు. శ్రీశంకరాచార్యులవారికాలమునను, తదుత్తరకాలమునను వెలువడినయద్వైతప్రతిపాదకము లైనయనేకములగు కోటీలును, ప్రమాణములును మొదలగునవియన్నియు గీతయందు ప్రతిపాదింపఁబడినవి యని చెప్పవలయు నని నాయభిప్రాయముకాదు. ద్వైతులు, అద్వైతులు, విశిష్టాద్వైతులును, వీరిసంప్రదాయములును బయలువెడలుటకంటె పూర్వమె గీత పుట్టినది కావున, నేవిధ మగుసాంప్రదాయికయుక్తులును గీతలయందుండుట వీలులే దనిచెప్పుటకు మాకును నిష్టమే. కాని గీతల యందున్న వేదాంతము సామాన్యముగ శాంకరసంప్రదాయమునం దున్నజ్ఞానము ననుసరించి యద్వైతపరముగనె యున్నదిగాని ద్వైతపరము గా దనిచెప్పుట కేమియు బాధకము లేదు; కాని తత్త్వజ్ఞానదృష్టితో గీతయందును శాంకరసంప్రదాయమునందును, ఇట్లైకమత్యముండినను నాచారదృష్టిచేఁ గర్మసన్న్యాసముకంటె, గీత, కర్మయోగమునకు నధిక మగు మహత్త్వము నిచ్చినది యగుటచే గీతాధర్మము శాంకరసంప్రదాయముకంటె వేఱుగ నున్నదని నామతము; కాని దానిం బిదప విచారింతము. ప్రస్తుతము తత్త్వజ్ఞానముం గూర్చి చర్చించుచున్నాము; మఱియు నీతత్త్వజ్ఞానము గీతలయందు శాంకరసంప్రదాయమందు నొకరీతిదే యగుటచే నద్వైతముగ నుండు ననిమాత్రమే యిక్కడ చెప్పఁ దగినది. ఇతరసాంప్రదాయభాష్యములకంటె గీతయందున్న శాంకరభాష్యమునకు నింతయధికమహిమ వచ్చుటకు కారణ మిదియే యయియున్నది.

సమస్తనామరూపములను జ్ఞానదృష్టిచేఁ జూచితి మేని యొకయవికారియు నిర్గుణము నగుతత్త్వమె స్థిరముగ నుండును. మఱియు నాకారణమున పూర్ణము సూక్ష్మము నగువిచారమునం దద్వైతసిద్ధాంతమే స్వీకరింపవలసివచ్చును. ఇంతమా

త్రము సిద్ధ మైనపిదప, నిర్గుణము, నవ్యక్తము నగు నొక ద్రవ్యము నందుండి నానావిధములగు నవ్యక్త మైన సగుణసృష్టి యెట్లు కలిగిన దియు నద్వైతవేదాంతదృష్టితో వ్యాఖ్యానము చేయవలసివచ్చును. నిర్గుణం బగుపురుషుని వలె త్రిగుణాత్మకమగు ప్రకృతి (అనఁగా: సగుణప్రకృతి) యనాదియు స్వతంత్రము నని చెప్పి సాంఖ్యులీప్రశ్నను వదలించుకొని రని పూర్వమే చెప్పఁబడినది; కాని సగుణమగు ప్రకృతి యీతీరున స్వతంత్ర మని చెప్పినను జగత్తునకు మూలతత్త్వములు రెండగును. గాన పూర్వము చెప్పఁబడిన యనేక కారణములం బట్టి పూర్ణముగ నిశ్చయింపఁబడిన యద్వైతమతమునకు బాధవచ్చును; మఱియు సగుణప్రకృతి స్వతంత్ర మైన దని యొప్పుకొనమేని మూలమైన యొక నిర్గుణద్రవ్యమునందుండి నానావిధ సగుణసృష్టి యెట్లుత్పన్న మైనదియో చెప్పుటకు సాధ్యము కాదు. కారణమేమి యనఁ: నిర్గుణమునందుండి సగుణము (అనఁగా: ఏమియు లేకపోవుట నుండి మఱియొకటి యేదియు) ఉత్పన్నమగుటకు శక్యము కానేర దను నీసత్కార్యవాదముయొక్క సిద్ధాంతము నద్వైతులు సైత మొప్పుకొందురు. ఇందుమూలమున రెండుపక్షములందును చిక్కుగనే యున్నది. అట్లైన నీచిక్కు వదలు టెట్లు? అద్వైతమును వదలివేయక నిర్గుణమునందుండి సగుణ ముత్పన్నమగుటకు మార్గము నుడువవలయును. అట్లు నిర్గుణమునందుండి సగుణము వచ్చుట సత్కార్యవాదమునకు విరుద్ధముగఁ గాన్పించును. ఇది గొప్పచిక్కు! వేయేల? అద్వైతసిద్ధాంతమును స్వీకరించుట కిదియే ముఖ్యమగు ప్రతిబంధక మని యనేకులయభిప్రాయము. ఈకారణముచేతనే ద్వైతమతము వెడలినది; కాని యద్వైతులగు పండితులు తమబుద్ధిబలముచే నీవికటమగు చిక్కును సైతము దాఁటుటకు సయుక్తికమును సాటి లేనిదియు నగు నొకమార్గమును కనిపెట్టిరి. సత్కార్యవాదముయొక్క, లేక, గుణపరిణామవాదముయొక్క సిద్ధాన్తము, కార్యకారణము లను నీరెండు నొకకోటియందే, లేక, యొకవర్గమునందే యున్నప్పుడు సమన్విత మగును. కావున సత్యమును, నిర్గుణము నగుబ్రహ్మమునందుండి సత్యమును సగుణము నగుమాయ యుత్పన్నమగుటకు వీలు లేదని యద్వైతవేదాంతులు సైత మొప్పుకొందురు; కాని రెండుపదార్థములును సత్యములయినప్పుడె యీవిషయము నొప్పుకొందురు. ఎక్కడ నొకపదార్థము సత్యమును రెండవపదార్థము కేవలము దానికి దృశ్యముగ నున్నదో యక్కడ సత్కార్యవాదము దానికి సమన్వయము కానేరదు. సాంఖ్యులు పురుషునివలె ప్రకృతి సైతము స్వతంత్రమును, సత్యము నగు పదార్థ మనియందురు.* కావున నిర్గుణపురుషునియం

దుండి సగుణప్రకృతియొక్కయుత్పత్తి సత్కార్యవాదానుసారముగ నుపపన్నమని సమన్వయించుటకు సాధ్యము కానేరదు. కాని మాయ యనాది యయినను, నది సత్యమును, స్వతంత్రమును కాదు. గీతయందుఁ జెప్పినటుల 'మోహము' 'అజ్ఞానము' లేక, "యింద్రియములకు గోచరించుదృశ్యము"నై యున్నదని యద్వైతవేదాన్తము యొక్కసిద్ధాంతమగుటచే సత్కార్యవాదమునందుండి యుత్పన్నమగు నాక్షేపణ యీయద్వైతసిద్ధాన్తమునకు తగుల నేరదు. కుమారుఁడు తండ్రియొక్క గుణపరిణామముచే పుట్టినాఁ డని చెప్పుదుము; కాని తండ్రియనువాఁ డొకవ్యక్తియే యగుటచే నాతనికొడుకు కొకానొకప్పుడు బాలునియొక్కయు, తరుణునియొక్కయు, వృద్ధునియొక్కయు, వేషము వేసికొను నెడల నివ్యక్తికిని, ఆకుమారునియొక్క యనేకవేషములకును గుణపరిణామరూప మగుకార్యకారణభావ ముండదని మనకెప్పుడును కాన్పించుచున్నది. అటులె సూర్యుఁ డొక్కఁడే యని నిశ్చితమైనపిదప నీటియందుఁ గాన్పించుసూర్యుఁడు భ్రమాత్మకుఁడనియు, గుణపరిణామమూలముచే నుత్పన్నుఁడగు వేఱొకసూర్యుఁడు కాఁడనియు చెప్పుచున్నాము. మఱియు దుర్భిణిచే నేగ్రహముయొక్క యైనను సత్యస్వరూపము నిశ్చయించిన పిదప కంటికి మాత్రమే కాన్పించుసాగ్రహస్వరూపము, కన్నులయొక్కదుర్బలతచేతను, నడుమ నత్యంతదూర ముండుటచేతను నుత్పన్నమగుకేవలదృశ్యముగనే యున్నదని జ్యోతిశ్శాస్త్రమున స్పష్టముగఁ జెప్పఁబడినది. ఏవిషయమైనను నేత్రాదీంద్రియములకు ప్రత్యక్షగోచరమైనంతమాత్రముచేతనే యీవిషయము స్వతంత్రమైనదియు సత్య మయినదియు నని యంగీకరించుటకు వీలు లేదని చెప్పుట బాగుగనే యున్నది. మఱియు నాన్యాయమే యధ్యాత్మశాస్త్రమునకును సంబంధింపఁజేసి, జ్ఞానచక్షుస్స్వరూప మగుదుర్భిణిచే నిశ్చయింపఁబడిననిర్గుణపరబ్రహ్మ మనునదియే సత్యమైన దనియు, జ్ఞానశూన్యము లగుచర్మచక్షుస్సులకు గోచరము లగునామరూపాత్మకపరబ్రహ్మముయొక్క కార్యములు కావనియు, నింద్రియదౌర్బల్యముచే నుత్పన్న మగుకేవలభ్రమ (అనఁగా: మోహాత్మకదృశ్యము) యనియు చెప్పుటకేమి యభ్యంతరముండును? నిర్గుణమునందుండి సగుణ ముత్పన్నముకాలేదను నాక్షేపణ యిచ్చోఁ సంబంధింప నేరదు. కారణ మేమియనః రెండువస్తువులు నొకకోటి (వర్గము) యందున్నవి కావు. ఒకటి సత్యముగను, మఱియొకటి కేవలదృశ్యముగను నున్నది. మఱియు మూలమునం దొకసత్యవస్తువే యుండినను, చూచువారిదృష్టిభేదముచేఁ గాని, యజ్ఞానముచేఁ గాని, లేక, యంధత్వముచేఁ గాని యాయొకవస్తువుయొక్క

స్వరూపమే మాఱుచున్నటుల మనయనుభవములో నున్నది. ఉదాహరణము:—
చెవికి వినఁబడుశబ్దము, నేత్రములకుఁ గాన్పించురంగు నను రెండుగుణములు మా
డుము. వీనిలో చెవికి వినఁబడుధ్వనిని మిక్కిలి సూక్ష్మముగఁ బరీక్షించి, 'శబ్ద'మనఁ
గా, గాలియొక్క బరువు, లేక, గతి యని యాధునికాధిభౌతికశాస్త్రజ్ఞులచేఁ బూర్వముగ
సిద్ధాన్తము చేయఁబడినది. అటులే చక్షుర్గోచరమగు ఎఱుపు, పసుపు, నలుపు మొదలగు
రంగులును మూలము నందొకసూర్యప్రకాశముయొక్క వికారములే యగుటచే,
సూర్యప్రకాశముగూడ నొకవిధమగుగతి, లేక, కదలికయనే యున్నదని యిప్పుడు
సూక్ష్మశోధనయందు నిశ్చయింపఁబడినది. "గతి' మూలమునందొక్కటియే యయి
నను, ఆగతిచే కర్ణము శబ్దమును, నేత్రములు రంగును నిశ్చయించునేని, యీన్యా
యమునే విశేషముగ వ్యాపకమగునట్లు సర్వేంద్రియములకు సంబంధింపఁ జేసినప్పు
డేదయిన నొకయవికార్య మగుపదార్థముపై మనుజునియొక్క వేర్వేఱింద్రియ
ములు తమంతట తామే శబ్దరూపాద్యనేకనామరూపాత్మకగుణముల యొక్క 'అ
ధ్యారోపము' చేసి నానాప్రకారము లగుదృశ్యములను బుట్టించుచున్నవి. మూలము
నందున్నయొకపదార్థమునందే దృశ్యములగు గుణములు, లేక, నామరూపము లుండవ
వలసిన యవసరమేమియు లే"దని సమస్తనామరూపములయొక్క యుత్పత్తివిషయ
ములో సత్కార్యవాదముయొక్క సాయము లేకపోయినను మంచిసమాధానమును,
జెప్పవచ్చును. మఱియు నీయర్థమును సిద్ధింపఁజేయుటకై రజ్జువునందు సర్పము
యొక్క, లేక, శుక్తియందు రూప్యముయొక్క భ్రమ యుత్పన్నమగుటయు, లేక,
నేత్రములందు చేతివ్రేలునుంచుటచే నొకపదార్థము రెండుగఁ గాన్పించుటయు,
లేక, వేర్వే ఱగురంగుగలిగిన యుపనేత్రములను ధరించితిమేని యొకపదార్థమే
వేర్వే ఱగురంగులతోఁ గాన్పించుటయు మొదలగు ననేకదృష్టాంతములు వేదాన్త
శాస్త్రమునందుఁ జెప్పఁబడినవి. మనుజునియింద్రియము లతని నెప్పుడును వదలునవి
కావు గావున, జగత్తునందలి నామరూపములు, లేక, గుణములు నెప్పుడు నతనికిఁ
గాన్పించునను సంగతి సత్యమె; కాని యింద్రియవంతుఁ డగుపురుషునియొక్క
దృష్టిచే జగత్తుయొక్క యేయింద్రియసాపేక్ష మగుస్వరూపము కాన్పించుచున్న
దో యదియే యీజగత్తునకు మూలమం దుండునది (అనఁగా: నిరపేక్షమౌ నిత్యము
నగుస్వరూపము) యని చెప్పుటకు వీలు లేదు. ప్రకృతమునందు మనుజున కున్న
యింద్రియము లన్నింటికంటె నెచ్చుతగ్గువి కాని యొరునింద్రియము లుండెనేని,
యీసృష్టి యతనికిఁ గాన్పించునట్లు కాన్పింపకపోవును. మఱియు నిది సత్యమగు

లేని చూచుపురుషులయొక్క యింద్రియాపేక్షనుంచక, సృష్ట్యారంభమున నున్న తత్త్వముయొక్క నిత్యము సత్యము నగుస్వరూపమెద్దియో చెప్పుమని యెవరయిన నడిగిన, ఆమూలతత్త్వము నిర్గుణ మగుటచే మనుజునకు సగుణముగఁ గాన్పించుట యతని యింద్రియధర్మముగనే యున్నదని సమాధానము చెప్పవలసి వచ్చును. ఆధిభౌతికశాస్త్రమునందు కేవల మింద్రియగోచరము లగువిషయములై పరీక్షింపఁ దగినవి యగుటచే నిట్టిప్రశ్నయే యెప్పుడును కలుగదు; కాని మనుజుఁడును వాని యింద్రియములును నశించినయెడల పరమేశ్వరుఁడును లేనివాఁడే యగును. లేదా, మనుజున కిది యిట్టిది యని కన్పట్టుటచే నది త్రికాలాబాధితము, నిత్యము, నిరపేక్షము నగుస్వరూపముగనే యుండవలయు నని చెప్పుటకు వీలులేదు. కావున జగదారంభముననున్న సత్యముయొక్క మూలస్వరూప మేది యనువిషయ మీ యధ్యాత్మశాస్త్రమునందు విచారించునప్పుడు మనుజునియొక్క యింద్రియముల యపేక్ష గలదృష్టిని వదలి కేవలజ్ఞానదృష్టిచే (అనఁగా: శక్య మగునంత బుద్ధికుశలతచేఁ) దుదకు విచారింప వలసివచ్చును. అట్లు చేసితి మేని యింద్రియగోచరము లగుసర్వసగుణములును స్వయముగ వెలువడిన వనియు బ్రహ్మయొక్క నిత్యస్వరూప మింద్రియాతీత (అనఁగా: నిర్గుణ) మగుటచే నదే యన్నింటిలోను శ్రేష్ఠ మనియు స్పష్ట మగును. నిర్గుణవస్తువుయొక్క వర్ణన నెవఁ డిట్లు చేయును? ఇందువలననే పరబ్రహ్మముయొక్క కడపటి (అనఁగా: నిరపేక్షమును, నిత్యము నగు) స్వరూపము కేవలనిర్గుణమే కాక, యనిర్వాచ్యమునుగ నున్న దనియు, నీనిర్గుణస్వరూపమునందే మనుజునకు నతనియింద్రియములకు నుండుసంబంధముచే సగుణమగుదృశ్యవస్తువు కాన్పించుచున్న దనియు నద్వైతవేదాంతమున సిద్ధాంతము చేయఁబడినది. కాని నిర్గుణమును సగుణముగఁ జేయు నీశక్తి యింద్రియములకైన నెట్లువచ్చునని యిచ్చో మఱియొకప్రశ్న వెలువడును. "మానవజ్ఞానముయొక్క గతి యిచ్చో కుంఠిత మగును ~~మానవేంద్రియ~~ములు జ్ఞానశూన్యము లగుటచేత; నిర్గుణపరబ్రహ్మమందు సగుణజగత్తును, దృశ్య (కన్పట్టునది) మనునది యీయాత్మ యజ్ఞానముయొక్క పరిణామముగా నున్నది, లేక, యింద్రియము లయినను పరమేశ్వరునిసృష్టియందుఁ గలిగినవే యగుటచే సగుణసృష్టియు (ప్రకృతి), నిర్గుణపరమేశ్వరునియొక్క యే దైవమాయగానున్న" దని మాత్రమే నిశ్చితముగ ననుమానించిరే యిచ్చో స్వస్థముగ కూర్చుండవలసివచ్చును" అని యద్వైతవేదాంతశాస్త్రమునందు దీనికి సమాధానము జెప్పుదురు. (గీ. ౭. ౧౪). "అప్రబుద్ధులగు (అనఁగా: కేవలేంద్రియములచే చూచునట్టి) లోకులకు పరమేశుఁడు వ్యక్తముగను, సగుణముగను గాన్పించినను, పరమే

శ్వరునియొక్క సత్యమును, శ్రేష్ఠము నగుస్వరూపము నిర్గుణ మగుటచే దానిని జ్ఞానదృష్టిచే తెలిసికొనుటయే జ్ఞానముయొక్క పరమావధి యనునది మొదలుగా గీతలయందు వర్ణింపఁబడినదానికి ముఖ్యకారణ మిప్పుడు తెలియును. కాని పరమే శ్వరుఁడు మూలమున నిర్గుణుఁడగుటచే నతనియందే మనుజునియొక్క యింద్రియము లకు సగుణసృష్టియొక్క వివిధమగుదృశ్యము కన్పట్టు ననునది యిట్లు నిర్ణయింపఁ బడినను, ఈసిద్ధాంతమున 'నిర్గుణ'శబ్దముయొక్క యర్థ మేమి యని తెలిసికొనుటకు మఱికొంత వ్యాఖ్యానముఁ జేయుట యావశ్యకము. "గాలియొక్క తరంగములపై శబ్ద రూపాదిగుణములయొక్కయు, లేక, శుక్తియందు రూప్యముయొక్కయు నధ్యా రోపము మనయింద్రియములచే చేయఁబడినప్పుడు, గాలియొక్క తరంగములందు శబ్దరూపాదికముగాని,శుక్తియందు రూప్యముయొక్కగుణము గాని లేదనుసంగతి యథార్థమే; కాని యధ్యారోపితములగుగుణములు దానియందు లేకపోయినను, వానికంటె నితరములగుగుణములు మూలపదార్థమున లేనే లేవని చెప్పుటకు వీలు లేదు. కారణ మేమి యనఁగా: శుక్తియందు రూప్యముయొక్కగుణ మేమియు లేక పోయినను రూప్యముయొక్కగుణముకంటె నితర మగుగుణ ముండు నని మనము ప్రత్యక్షముగఁ జూచుచున్నాము. కాని యింద్రియములచేఁ దమయజ్ఞానమూల మున మూలబ్రహ్మమం దారోపింపఁ బడినగుణము లీబ్రహ్మమందు లే వనిచెప్పినను, నితరగుణము లీ పరబ్రహ్మమందు లేకపోవుట యెట్లు? మఱియు నుండెనేని యది నిర్గుణ మగుట యెట్లు?" అని యొకశంక యిచ్చోట నుత్పన్న మగును. మఱియు మిక్కిలి యధికమగుసూక్ష్మదృష్టితో విచారించితి మేని, యింద్రియములచే నధ్యారోపితము లగుగుణములుదక్క మూలబ్రహ్మమునం దితరములగుగుణము లుండు నని యంగీక రించినను నవి మన కెట్లు తెలియును? మనుజునకుఁ దెలియుగుణములన్నియు వాని యింద్రియములమూలముననే తెలియును. మఱియు నింద్రియగోచరములు కానివి తెలియనే తెలియ వని తోఁచును. కావున నింద్రియములచే నధ్యా[illegible] గుణములుదక్క పరబ్రహ్మమం దేయితరగుణము లుండినను నవి మనకుఁ దెలిసికొను టకు శక్యములు కావు; మనకు తెలిసికొనుటకు శక్యముకాని గుణములు పరబ్రహ్మ మం దున్న వని యనుటయు న్యాయ్యదృష్టిచే యోగ్యము కానేరదు. కావున గుణ శబ్దమునకు "మనుజునకుఁ దెలియుగుణములు" అని యర్థము. కావున నీయర్థమునందు బ్రహ్మము నిర్గుణమే యని వేదాంతులు నిర్ధారణఁ జేయుచున్నా రని సారాంశము. మనుజులకు నతర్క్యములగు గుణములుగాని, శక్తులుగాని మూలపరబ్రహ్మస్వరూప మునందు లే వని యద్వైతవేదాంతులు చెప్పరు. ఇతర వేదాంతులును చెప్పరు.

వేరేల? ఇంద్రియములయొక్క పూర్వమునందు చెప్పఁబడినయజ్ఞానము, లేక, మాయ యనునది యామూలపరబ్రహ్మముయొక్కయే, యొకయతర్క్య మగుశక్తిగ నుండవలయు నని వేదాంతులు సైతము చెప్పుచున్నా రని పూర్వమునందె చెప్పఁబడినది.

త్రిగుణాత్మకమాయ (అనఁగా: ప్రకృతి) స్వతంత్రమగువస్తువు కాదుగాని, యనేకవిధము, నేకము నైన నిర్గుణబ్రహ్మమందే మనుజునియింద్రియము లెప్పుడు నజ్ఞానమూలమున సగుణమగుదృశ్యము నధ్యారోపించుచున్నవి. ఈమతమునె వివర్తవాద మని చెప్పుచున్నారు. నిర్గుణబ్రహ్మ మొకటియే మూలతత్త్వ మయియుండఁగా నానావిధమగుసగుణజగత్తు తొలుత నెటుల కలిగె ననుదాని కద్వైతవేదాంతానుసారముగ నీసమాధానము చెప్పఁబడినది. కాణాదన్యాయశాస్త్రమునం దసంఖ్యములగు పరమాణువులే జగత్తునకు మూలకారణ మని సిద్ధాంతీకరింపఁబడినది. కావున నైయాయికు లీపరమాణువులను సత్యము లందురు. కనుక నీయసంఖ్యములగుపరమాణువులయొక్కసంయోగ మగుట ప్రారంభ మగునేని సృష్టియందలి యనేకపదార్థములు పుట్టుచుండు నని వారిచే నిశ్చయింపఁబడినది. ఈమతమునందు పరమాణువులకు సంయోగ మారంభ మయినపిదప సృష్టినిర్మాణ మగు నని చెప్పఁబడుటచే దీనిని 'ఆరంభవాద'మని చెప్పుదురు. కాని నైయాయికులయొక్క యీ యసంఖ్యపరమాణుకారణమతము నొప్పుకొనక 'ఒక్కటియు, సత్యమును, త్రిగుణాత్మకము నగుప్రకృతియే,' జడసృష్టికి మూలకారణముగ నున్న దనియు, ఈత్రిగుణాత్మకప్రకృతియం దున్నగుణములవికాసముచేతఁగాని, పరిణామముచేతఁగాని వ్యక్తసృష్టి నిర్మిత మగుననియు సాంఖ్యులు చెప్పుదురు. ఈమతమును గుణపరిణామవాద మని చెప్పుదురు. కారణ మేమి యనఁగా: ఒక మూలమగు సగుణప్రకృతియొక్క గుణవికారముచేతనే సర్వవ్యక్తసృష్టియు కలిగిన దని దీనియందు ప్రతిపాదింపఁబడినది; కాని యీరెండువాదములను నద్వైతవేదాంత మొప్పుకొనదు. పరమాణువు లసంఖ్యములగుటచే నద్వైతమతానుసారముగ జగత్తునకు మూలము కానేరవు. మఱియు ప్రకృతియొక్కటైన నది పురుషునికంటె భిన్నమయినదియు, స్వతంత్ర మయినదియు నగుద్వైతముగూడ నద్వైతసిద్ధాంతమునకు విరుద్ధమైనదే; కాని యీరీతిగా నీరెండువాదములను వదలితి మేని యొకనిర్గుణమగు బ్రహ్మస్వరూపమునుండి సగుణసృష్టి యెటులఁ గలుగు ననుదానికి మఱియొక సమాధాన మేదైనను చెప్పవలసివచ్చును. కారణ మేమి యనఁగా: సత్కార్యవాదానుసారముగ నిర్గుణమునుండి సగుణ ముత్పన్నము కానేరదు. దీనిపై వేదాంత

చెప్పున దేమనఁగా: సత్కార్యవాదముయొక్క యాశిద్ధాంతము కార్యకారణము లను రెండుపదార్థములును సత్యములనుస్థలమునందే నరిపోవును. మూలపదార్థ మొక్కటియే యగుటచే, దానికంటె లదృశ్యరూపము మాఱుచోట నిత్యాయము నుపన్న యింపను. కారణ మేమియనఁగా: ఒక్కపదార్థమే వేర్వేఱుదృశ్యములుగ గా న్పించుట యాపదార్థధర్మము కానేరదు. చూచువానియొక్క దృష్టిభేదముచే నీ వేర్వేఱుదృశ్యము లుత్పన్నములు కాఁగలవని తప్పక మనకుఁ దోఁచును.* నిర్గుణ బ్రహ్మమునుండి సగుణమగుజగత్తెట్లువచ్చె ననువిషయమును పైరీతి విచారించుటచే నిశ్చ రించితి మేని బ్రహ్మము నిర్గుణమనియు,మనుజునియొక్కయింద్రియముల ధర్మమూల మున దానియందె సగుణమగుదృశ్య ముత్పన్నమగు ననియు చెప్పవలసివచ్చును. దీనినే వివర్తవాద మందురు. వివర్తవాదమునం దొక్కమూల మగుసత్యద్రవ్యమే యున్న దనియు, దానిపైననే యనేకములగు నసత్యము లగువానియొక్క (అనఁగా: తప్పకుండ పరిణమించుదృశ్యములయొక్క) యారోప మగు ననియుఁ జెప్పఁబడెను. మఱియు గుణపరిణామవాదమున తొలుతనె రెండుసత్యద్రవ్యము లున్నవనియు వానిలో నొకదానిగుణములు వికసితము లగుటచే జగత్తున నానాగుణయుక్తము లగు నితరవస్తువు లుత్పన్నములగుననియు నందురు. రజ్జువునందు సర్పభాసనయే వివ ర్తము. నారత్రాడగుటయు, పాలు పెరుఁగగుటయు గుణపరిణామము. ఈకా రణముననే వేదాంతసారగ్రంథముయొక్క యొకప్రతిలో—

"యస్తాత్త్వికో ఽన్యథాభావః పరిణామ ఉదీరితః
అతాత్త్వికో ఽన్యథాభావో వివర్తః స ఉదీరితః." (వే. సా. ౨౧)

"ఒకానొకమూలవస్తువునందుండి తాత్త్విక (అనఁగా: సత్యమే) స్వరూప మగుమఱియొకపదార్థము వెలువడుట (గుణ) పరిణామమందురు. మూలవస్తువు మిథ్యగనె (అతాత్త్వికముగ) భాసించుట వివర్తమని చెప్పుదురు." అని యీ రెండువాదలక్షణములు చెప్పఁబడినవి. ఆరంభవాదము నైయాయికులది; గుణ పరిణామవాదము సాంఖ్యులది. వివర్తవాద మద్వైతవేదాంతులది. అద్వైతవేదాం తమునందు పరమాణువులు గాని, ప్రకృతియనునదిగాని సగుణములే గాన నిర్గుణ బ్రహ్మముకంటె వేఱైనవియు, స్వతంత్రములయినవియు నని యొప్పుకొనరు; కాని

* ఇంగ్లీషుభాషలో నీ యర్థమునె వ్యక్తముఁ జేయవలసివచ్చినయెడల appearances are the results of subjective conditions, viz. the senses of the observer and not of thing in itself.

యీసత్కార్యవాదానుసారముగ నిర్గుణమునందుండి సగుణ ముత్పన్నమగుట యశక్య మని యాక్షేపణ వచ్చును గావున నాయాక్షేపణను బరిహరించునిమిత్తము వివర్త వాదము వెలువడినది. కాని యంతమాత్రముచే గుణపరిణామవాదమును వేదాంతి యెప్పుడు నొప్పుకొనఁడు. ఇఁక ముం దొప్పుకొనఁబోఁడు. అని యనేకులు పొర పడుచున్నారు. నిర్గుణబ్రహ్మమందుండి సగుణప్రకృతి (అనఁగా: మాయ) పుట్టుటయె యశక్య మని యద్వైతమతముపై సాంఖ్యులయొక్కయు, లేక, యితరద్వైతులయొక్కయు ముఖ్యమగు నాక్షేపణకు పరిహారము (సరియగు సమాధానము) కానేరదు. ఒకనిర్గుణబ్రహ్మమునందే మాయావికారము లగు ననేకదృశ్యములు మన యింద్రియములకుఁ గాన్పించుట శక్య మనిమాత్రమే తెలియఁజేయుట వివర్తవాదమునకు ముఖ్యోద్దేశము. ఈయుద్దేశము సిద్ధించినపిదప (అనఁగా: ఒకనిర్గుణపరబ్రహ్మమందే త్రిగుణాత్మక మగుసగుణప్రకృతి యొక్కదృశ్యము కాన్పించుటశక్య మని వివర్తవాదమువే సిద్ధమయినపిదప) నీప్రకృతి ముందు విస్తారమగుపరిణామమును బొందినదని యంగీకరించుటకు వేదాంతశాస్త్రముయొక్క యభ్యంతర మేమియు లేదు. 'మూలప్రకృతియే దృశ్యముగ నున్నది, సత్యము కానేరదు,' అని మాత్రమే యద్వైతవేదాంతముయొక్క ముఖ్యసిద్ధాంతము. ప్రకృతియొక్క దృశ్య మొకపరి కనఁబడినపిదప మరల నాదృశ్యమునందుండి పిదప వెలువడుదృశ్యాంతరమును స్వతంత్రమని యొప్పుకొనక, యొకదృశ్యముయొక్క గుణమునందుండి, మఱియొకదృశ్యముయొక్క గుణమును, నీరీతిగ నానాగుణాత్మకము లగుదృశ్యములు నుత్పన్నములగునని చెప్పుట కద్వైతవేదాంతముయొక్క యభ్యంతర మేమియు లేదు. కావుననే 'ప్రకృతియు నామాయయే' అని గీతలలో (గీ. ౭. ౧౪; ౪. ౬) భగవంతునిచేఁ జెప్పఁబడినను ఈశ్వరాధిష్ఠిత మగు (గీ. ౯. ౧౦) నీప్రకృతియొక్క కార్యమగు ప్రపంచమంతయు "గుణాగుణేషు వర్తంతే" (గీ. ౩. ౨౮; ౧౪. ౨౩) యను న్యాయముననే యగునని గీతలలోఁ జెప్పఁబడినది. "వివర్తవాదానుసారముగమూలమగునిర్గుణపరబ్రహ్మం దొకప్పుడు మాయావికార మగుదృశ్య ముత్పన్న మైన [illegible]నప నీమాయికదృశ్యముయొక్క (అనఁగా: ప్రకృతియొక్క) కార్యమగుప్రపం[illegible]డియు, [illegible] త్పత్తికొఱకు గుణోత్కర్షముయొక్క తత్త్వము గీతలకును మాన్యమైనదే; కాని యీ[illegible] వలన స్పష్టమగును. దృశ్యమగు నీజగత్తే మాయాత్మక బ్రహ్మస్వరూపమునుండి సగుణ[illegible] ధాన మేదైనను చెప్పవలసివచ్చును. కాని యిట్లురూపాంతరములకు గుణోత్క[illegible] సారముగ నిర్గుణమునుండి సగుణ ముత్పన్నము కా[illegible]ర లేదు, వికాల్పనమగు[illegible]

యాత్మకదృశ్యము నైనను నియమబద్ధమై యున్నదని వేదాంతు లొప్పుకొందురు. మూలప్రకృతివలె నీనియమములును మాయికములుగనే యున్నవనియు, పరమే శ్వరుఁ డీసర్వమాయికనియమములకు నధిపతి యనియు, నాతఁడు సర్వజ్ఞుఁ డు నాఁ డగుటచే నాతనిసత్తచేతనే నియమములకు నిత్యత్వము ప్రాప్తించుచున్న దనియు, త్రికాలాబాధిత మగునియమములు కల్పించు నామనుష్యుఁడు స్వతంత్రుఁడు సగుణము కావున నే, వినాశియగు ప్రకృతియందుండుటచే [illegible] మాత్రమే వేదాంతులు చెప్పుదురు.

పూర్వోక్తమగు వివేచనచే జగత్, జీవ, పరమేశ్వరులు, లేక, అధ్యాత్మ శాస్త్రపరిభాషానుసారముగ మాయా, (అనఁగా: మాయచే సృష్టమైనజగత్తు), ఆత్మ, పరబ్రహ్మము నను నీమూఁటియొక్క స్వరూపమును, వీనికిఁగలపరస్పర సంబంధ మును తెలియును. అధ్యాత్మదృష్టిచే 'నామరూపములు,' వాని మూలమునఁ గ్రింద నున్న 'నిత్యతత్త్వము,' అని జగత్తునందు సర్వపదార్థములును రెండువిధములుగ నున్నవి. వీనిలో నామరూపములనే సగుణమాయ, లేక, ప్రకృతియని చెప్పుచు న్నారు. కాని, నామరూపములను దూరముగ నుంచితిమేని మిగిలిన 'నిత్యద్రవ్యమే' నిర్గుణముగ నుండవలయును. కారణమేమి యన: గుణమయినను నామరూపములు లేకయుండుటకు వీలులేదు. ఇది నిత్యమును, నవ్యక్తమును నగుతత్త్వమంటి రేని పరబ్రహ్మమె యగును. మఱియు మనుజునియక్షులేంద్రియముల కీనిర్గుణపరబ్రహ్మము నందుండి సగుణమాయ యుద్భవిల్లుచున్నట్లు కాన్పించుచున్నది. ఈమాయ సత్య పదార్థము కానేరదు. పరబ్రహ్మముమాత్రమే సత్యము. (అనఁగా: త్రికాలాబాధి తము. మఱియు ఎప్పుడును పరిణామమును బొందనిపదార్థము.) దృశ్యసృష్టిసంబంధ మైననామరూపములయొక్క సిద్ధాంతమునుగుఱించియు, వానిచే నాచ్ఛాదింపఁబడిన పరబ్రహ్మముయొక్క స్వరూపమునుగుఱించియు నీసిద్ధాంతము చెప్పఁబడినది. ఇప్పుడు మనుజునిస్వరూపమును న్యాయ్యముగ విచారించితిమేని, మనుజునిదేహేంద్రియము లనునవి దృశ్యసృష్టియందున్న యితరపదార్థములవలె నామరూపాత్మకము (అనఁగా: ననిత్యమగు మాయయొక్క కోటియందుండునవి) లగుటవలన నీదేహేంద్రియము లచే నాచ్ఛాదింపఁబడినయాత్మ నిత్యస్వరూపమగుపరబ్రహ్మయొక్క కోటిలోని దయినది. లేక, బ్రహ్మము నాత్మయు నొకటే యని సిద్ధమగుచున్నది. బాహ్య సృష్టి కీహేతువుచే స్వతంత్రము సత్యము నగుపదార్థమని యంగీకరింపని యద్వై తులసిద్ధాంతమందును, బౌద్ధులసిద్ధాంతమందును నున్న భేదము చదువరులకుఁ దెలిసి

యే యుండును. మఱియు వేదాంతశాస్త్రజ్ఞులు, బాహ్యసృష్టి నిత్యమును, మాఱు నట్టి నామరూపములవలెనె యసత్యమును అని చెప్పి, యీ బాహ్యసృష్టియందును, మనుజుని దేహమునందు సైత మొకయాత్మస్వరూప మగు ద్రవ్యమే నిండియున్నదని యు, ఈయొకయాత్మతత్త్వమే తుదకు సత్యముగ నిలుచుననియు సిద్ధాంతీకరించుచు న్నారు. అటులే సాంఖ్యులును 'అవిభక్తం విభక్తేషు' అను న్యాయముగ సృజిం పఁబడినపదార్థమునందలి నానాత్వముయొక్క యేకీకరణము జడప్రకృతిపర్యంతమె స్వీకరించుచున్నారు; కాని వేదాంతులు సత్కార్యవాదులు సేయునాక్షేపమును దొలఁగించి 'ఏది పిండమందున్నదో యదియే బ్రహ్మాండమందున్న'దని నిశ్చయించి సాంఖ్యులయొక్క యసంఖ్యపురుషులకును వారిప్రకృతికిని నొకపరమాత్మయందె యిప్పు డద్వైతముగ, లేక, యవిభాగముగ సమావేశము నొప్పుకొనిరి. శుద్ధాధి భౌతికపండితుఁ డగు 'హెకెల్' అనువాఁడును, అద్వైతియె యనునది సత్యమె; కాని యతఁ డొకజడప్రకృతియందె చైతన్యమును సైతము సంగ్రహించుచున్నాఁడు. మఱియు వేదాంతము, జడవస్తువులకు ప్రాధాన్యము నీయక దిక్కాలములచే నన వచ్ఛిన్నము, నమృతము, స్వతంత్రము నగుచిద్రూపపరబ్రహ్మమే సర్వసృష్టికి మూల ముగ నున్నదని సిద్ధము చేయుచున్నది. ఈ'హెకెల్'యొక్క జడాద్వైతమునకును, అధ్యాత్మశాస్త్రమునందున్నయద్వైతమునకును నడుమ నత్యంతభేద మున్నది. అద్వై తవేదాంతముయొక్క యీసిద్ధాంతమే గీతలయందుఁ జెప్పఁబడియున్నది. కావున నొక ప్రాచీనకవీశ్వరుఁడు—

''శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః
బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః.''

''కోటిగ్రంథముల సారము నర్ధశ్లోకమునఁ జెప్పుచున్నాను—(౧) బ్రహ్మ సత్యము, (౨) జగత్తు (అనఁగా: జగత్తునందలిసర్వనామరూపములును) మిథ్యాభూత ములు, లేక, నశ్వరములు. మఱియు, (౩) మనుజునియొక్క యాత్మయు బ్రహ్మమును మూలమున నొకటిగనే యున్నవి. వేర్వేఱు కావు.''—అని యద్వైతవేదాంత సారమును వర్ణించెను. ఈశ్లోకమునందలి 'మిథ్యా'శబ్దము బాగుగ లేదనుకొను వారు 'బ్రహ్మామృతం జగత్సత్యం'అని బృహదారణ్యకోపనిషత్తునందున్నటుల మూఁ డవచరణమునకు సంతోషముగ పాఠాంతరమును జేయవలసివచ్చును. దానివాచ్యా ర్థము మాఱదని పూర్వమునందె చెప్పఁబడినది. అయినను దృశ్యమగుసర్వజగత్తును అదృశ్యము, నిత్యము, మూలతత్త్వము నగుబ్రహ్మమును, సత్తు (సత్యము) అనవలయునా?

లేక, అసత్తు (అసత్య=అనృతము) అనవలయునా? యనువిషయమై యుపనిషత్కాలమునందే వేదాంతులు స్వర్థముగ విశేషవాదమును జేయుచుండిరి. కావున నామరూపములయందున్న సత్య మగుబీజ మేమి? యనుదాని నిచ్చో కొంతవ్యాఖ్యానముఁ జేయుచున్నారము. 'సత్' (సత్యము) అనునొకశబ్దముచేతనే, వేర్వేరుగ రెండర్థములు స్ఫురించుటచే నీవాద మారంభమాయెను. మఱియు 'సత్' అనుశబ్దమును ప్రయోగించునపుడు నేయర్థమున ప్రయోగించునో యావైపునకు కొంతదృష్టినిచ్చినచో యీవిషయమున వివాద ముండ నేరదు. కారణమేమియన: బ్రహ్మ మదృశ్యమైనను సత్యము, మఱియు నామ రూపాత్మక మగుజగత్తు దృశ్యమైనను క్షణక్షణమునకు మాఱునది యను నీభేద మంతయు నొకరూపముగనే యొప్పుకొనఁదగినదిగ నున్నది. 'సత్' అనునట్టియు 'సత్య'అనునట్టియు శబ్దములు (౧) క్రమముగా నేత్రములకు ప్రక్కృతము స్పష్టముగాఁ గాన్పించునది, యనఁగా: వ్యక్తము (కాని లేపు దానిదృశ్యస్వరూపము మాఱినను సరే లేకపోయినను సరే), అని వ్యావహారికార్థము కలవిగను, (౨) నేత్రముల కగపడనిది (అనఁగా: అవ్యక్తము) ఐనను దేనియొక్క స్వరూప మెల్లప్పుడేక రీతిగ నున్నదో, యెప్పుడును మాఱదో యట్టిది, అని మఱియొకయర్థము కలవిగను నున్నవి. వీనిలో మొదటియర్థము నిచ్చగించువారు, నేత్రములకుఁ గాన్పించు నామ రూపాత్మక మగుజగత్తు సత్యమనియు, పరబ్రహ్మము దానికి విరుద్ధము (అనఁగా: నేత్రములకుఁ గనఁబడనిది కావుననే అసత్తు, లేక, యసత్యము) అనియు చెప్పుచు న్నారు. ఉదాహరణము:—తైత్తిరీయోపనిషత్తునందు దృశ్యసృష్టికి 'సత్' అనియు, దానికంటె పరమందున్నదానికి 'త్యత్'(అది) అనియు (అనఁగా: పరమందున్నది), లేక, యనృతము (కంటికి నగపడనిది) అనియు; 'సత్,' 'త్యత్' శబ్దములను బ్రయోగించి మూలారంభమందుఁ గలబ్రహ్మమను ద్రవ్యమే "సచ్చ త్యచ్చాభవత్, నిరుక్తం చానిరుక్తం చ, నిలయనం చానిలయనం చ, విజ్ఞానం చావిజ్ఞానం చ, సత్యం చానృతం చ" (తై. ౨-౬)—సత్తు (కంటియెదుట) మఱియు అది (పరమందున్నది), వాచ్యము అనిర్వాచ్యమును, సాధారమును నిరాధారమును, జ్ఞాతము అవిజ్ఞాతమును(అజ్ఞేయము), సత్యము అనృతము,—అని రెండువిధములుగ నైనదని తైత్తిరీయమునఁ జెప్పఁబడెను; కాని యిట్లు బ్రహ్మ మనృత మనినను, అనృత మనఁగా,— అబద్ధ మనికాని యసత్య మనికాని యర్థము కానేరదు. కావున తైత్తిరీయోపనిషత్తు లోనే పిదప "ఈయనృతమగుబ్రహ్మము జగత్తునకు 'ప్రతిష్ఠ' (అనఁగా: ఆధారము) యై యున్నది మఱియొకయాధారముయొక్క యపేక్ష లేదు. దాని తెలిసికొనినవాఁ

డభయమును బొందు”నని చెప్పఁబడినది. దీనివలన శబ్దభేదముచే వాచ్యార్థము మాఱ లేదనుమాట స్పష్టముగఁ గాన్పించుచున్నది. అటులె తుదకు “అస ద్వా ఇద మగ్ర ఆసీత్”—“ఈసమస్తమైనజగత్తును మొదట అసత్తు(బ్రహ్మము)గనే యుండెను.” అని యున్నది. మఱియు ఋగ్వేదములో (౧౦. ౧౨౯. ౪) చెప్పినట్లు దానియం దుండి పిదప ‘సత్’ (అనఁగా: నామరూపాత్మకమును వ్యక్తము నైనజగత్తు) వెలువడిన దని చెప్పఁబడెను. (తై. ౨. ౭) దీనివలన ‘అసత్’ అనుశబ్ద మిక్కడ ‘అవ్యక్తము’ (అనఁగా: కంటికి నగపడనిది) అనునర్థముననె ప్రయోగింపఁబడినట్లు స్పష్టముగఁ గాన్పించుచున్నది. వేదాంతసూత్రములయందు బాదరాయణాచార్యులవారు పూర్వోక్తము లగువచనములకు నిటులె యర్థము చేసినారు (వే. సూ. ౨. ౧.౧౭); కాని, ‘సత్’ ‘సత్య’ శబ్దములకు, కంటికి నగపడనిది యయినను ఎల్లప్పుడు నుండునది, లేక, నిలువఁబడునది (అనఁగా: పూర్వమున వ్రాయఁబడిన రెండర్థములలో రెండవది) యను నర్థము నిచ్చగించువారు అదృశ్య మైనను ఎప్పుడును మాఱనిబ్రహ్మమే ‘సత్’ లేక, సత్యము అనియందురు. కావున నామరూపాత్మకమగుమాయను ‘అసత్’ అనఁగా, అసత్యము, వినాశి యని తాత్పర్యము అని చెప్పుచున్నారు. ఉదాహరణము.—“సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్ కథ మసతః సజ్జాయేత”—“ఓనాయనా ! సర్వజగత్తును తొలుత సత్తు (బ్రహ్మము)గ నున్నది; ఏది అసత్తో, (అనఁగా: లేకుండునదియో,) దానియందుండి సత్తు, (అనఁగా, ఉండునది) యెటు లుత్పన్నమగును.” అని ఛాందోగ్యములోఁ జెప్పఁబడినది. (ఛాం. ౬. ౨. ౧-౨) అయినను ఛాందోగ్యోపనిషత్తునందే యొకచోట నీపరబ్రహ్మ మవ్యక్త మనునర్థమున ‘అసత్’ అనుపే రిడఁబడినది. (ఛాం. ౩.౧౯.౧) * ఒకపరబ్రహ్మము నుద్దేశించియే వేర్వేఱుసమయములందును, వేర్వే ఱగునర్థములందును నొకపరి ‘సత్’ అనియు, నొకపరి ‘అసత్’ అనియు పరస్పరవిరుద్ధము లగుపేర్లు పెట్టుటయను (అనఁగా: ~~అర్థమొక్క~~టియె యైనను శబ్దములను మార్చుటలో మాత్రము సాహాయ్యము

* అధ్యాత్మశాస్త్రవిషయమయి యాంగ్లేయ గ్రంథకర్తలయందును Real అనఁగా: ‘సత్’అనుశబ్దము, జగత్తను దృశ్యమునకు (మాయకు) వర్తించునా! లేక, వస్తుతత్త్వమునకు (బ్రహ్మమునకు)వర్తించునా? అనువిషయమున మతభేదము కలదు. కాంటు దృశ్యమును సత్తు (Real) అనుకొని వస్తుతత్త్వమును అవినాశి యని చెప్పుచున్నాఁడు. కాని, హేకెల్, గ్రీన్, మొదలగువారు, దృశ్యమును ‘అసత్’ (unreal) అనుకొని వస్తుతత్త్వమును ‘సత్’ (Real) అని చెప్పుచున్నారు.

చేయు)పద్ధతి విడవఁబోయి, తుదకు బ్రహ్మము 'సత్తు', లేక, 'సత్యము' (అనఁగా: ఎల్లప్పుడు నుండునది), దృశ్యసృష్టి 'అసత్తు' (అనఁగా: నశ్వరము) అని మాత్రమే యొకపరి భాష స్థిరమైనది. భగవద్గీతయం దీపరిభాషయే స్వీకరింపఁబడియున్నది. ఏలనఁగ కించిదియే రెండవయధ్యాయములో (గీ. ౨. ౧౬—౧౮) పరబ్రహ్మము 'సత్తు', మఱియు 'అవినాశి', యనియు, నామరూపములు 'అసత్తు' (అనఁగా: నశ్వరములు) అనియుఁ జెప్పఁబడినవి. మఱియు వేదాంతసూత్రములసిద్ధాంతమునైన నిదియే యున్నది. అయినను దృశ్యసృష్టిని 'సత్'అనియు, పరబ్రహ్మమును 'అసత్' లేక, 'త్యత్'(అనఁగా: పర మందున్నది) అనియు చెప్పునట్టి తైత్తిరీయోపనిషత్తునందున్న ప్రాచీనపరిభాష యొక్క యాకారము నేటికిని బొత్తిగ నశింప లేదు. గీతలలో 'ఓం — తత్ — సత్' అని యేపరబ్రహ్మనిర్దేశముఁ జేయఁబడెనో దానికి మూలార్థ మేమయియుండెనో యీ ప్రాచీనపరిభాషచే బాగుగ స్పష్టపడును. 'ఓం' అనునది గూఢాక్షరరూప మగు వైదికమంత్రము. ఇది యుపనిషత్తులలో ననేకరీతులుగ వ్యాఖ్యానము చేయఁబడినది (ప్రశ్న. ౫; మాం. ౮. ౧౨; ఛాం. ౧. ౧). 'తత్' అనఁగా, అది; లేక, దృశ్యసృష్టికంటె దూరమం దున్నయనిర్వాచ్యతత్త్వము, అనియు, మఱియు 'సత్' అనఁగా, కంటియెదుట నున్న దృశ్యసృష్టి సమస్తము బ్రహ్మముగనే యున్నదనియు నీ సంకల్పమునకు నర్థము. మఱియు నాయర్థముననే "సదసచ్చాహ మర్జున" "సత్" (అనఁగా: పరబ్రహ్మము.) 'అసత్' (అనఁగా: దృశ్యసృష్టి), అను రెండును "నేనే" (గీ. ౯. ౧౯) యని భగవంతుఁడు గీతలలోఁ, జెప్పినాఁడు. అయినను గీతలలో కర్మయోగము ప్రతిపాద్య మగుటచే ప్రసంగానుసారముగ 'ఓం తత్సత్' అనుదాని యం దున్న 'సత్' అను శబ్దము యొక్క యర్థము లౌకికదృష్టిచే మంచిది (అనఁగా: సద్బుద్ధిచేఁ జేయఁబడినది, లేక, దేనియొక్క ఫలము మంచిది యగునో యాకర్మ) అని యర్థము. తత్ = దీనికి పరమందున్న, లేక, ఫలాశను వదలిచేయఁబడిన కర్మ యని యర్థము చేసికొని యీ బ్రహ్మనిర్దేశముచే నైతము కర్మయోగమునకుఁ బూర్ణ మను సమర్థన మగునని యేడవయధ్యాయములో కడపటఁ జెప్పఁబడినది. సంకల్పమునం దేది 'సత్' అని చెప్పఁబడినదో యది దృశ్యసృష్టి (అనఁగా: కర్మ) యే యగుటచే (ముందు ప్రకరణము చూడుము) ఈ బ్రహ్మనిర్దేశమున కాకర్మపరమగునర్థము మూలభూత మగునర్థమునందుండియే సహజముగ నిష్పన్న మగును. ఓంతత్సత్, నేతినేతి, సచ్చిదానంద, సత్యస్య సత్యం, అనునవియే కాక యింకను కొన్ని బ్రహ్మనిర్దేశము లుపనిషత్తులలోఁ జేయఁబడినవి; కాని గీతార్థము తెలిసికొనుటకు వానియుపయోగము లేకపోవుటచే నవి యిచ్చోఁ జెప్పఁబడవు.

జగత్తు, జీవుఁడు పరమేశ్వరుఁడు (పరమాత్మ)నను వీరికి పరస్పరసంబంధ మీతీరున నిశ్చిత మయినపిదప "జీవుఁడు నాయంశముగనే యున్నది." (గీ. ౧౫.౭) మఱియు "నేనే యొకయంశముచే సర్వజగత్తును వ్యాపించి యున్నాను" (గీ. ౧౦-౪౨) అని భగవంతుఁడు గీతలయందును, బాదరాయణాచార్యులు వేదాంత సూత్రములలోను, చెప్పినదానియందు (వే. సూ. ౨. ౩. ౪౩; ౪. ౪. ౧౯), లేక, "పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాద స్యామృతం దివి."—'స్థావరజంగమము లందల్ల వ్యాపించియుండు జగదాత్మ దశాంగుళప్రమాణుఁడు—'అని పురుష సూక్తమునందు నుండు 'పాద,' 'లేక, అంశ,' అనుపదములకు నేమి యర్థమైనదని స్పష్ట ముగనిర్ణీత మగుచున్నది. పరమేశ్వరుఁడు, లేక, పరమాత్మ సర్వవ్యాపియైనను, నిర వయవుఁడును, ఒక్కఁడును, నామరూపవిరహితుఁడును కావుననే, ఛేదించుటకు సాధ్యము కానివాఁడు (అచ్ఛేద్యుఁడు), వికారమును బొందనివాఁడు(అవికార్యుఁ డు)నగుటచే నతఁడు వేర్వేఱగువిభాగము లగుటకు (అనఁగా: చిన్నచిన్నముక్కలుగ నగుటకు) వీలులేదు. (గీ. ౨. ౨౫) కావున నల్లుగడలను నిండియున్న యీరొక విధమయిన పరబ్రహ్మముయొక్కయు, మనుజశరీరమం దున్నయాత్మయొక్కయు భేదమును జూపుటకు శారీరాత్మ యనునతఁడు పరబ్రహ్మముయొక్క యంశమని వ్యవ హారములోఁ జెప్పవలసివచ్చినను, 'అంశ-భాగ' శబ్దములకు, 'కోయఁబడిన(అనఁగా: వేఱయిన)ముక్క', లేక, 'దాడిమఫలముయొక్క యనేకబీజములలో నొకబీజము,' అని యర్థముఁ జేయక, "గృహమందున్న యాకాశము, ఘటమందున్న యాకాశము (మఠాకాశ-ఘటాకాశములు) నను నవెట్లు సర్వవ్యాపక మగు నొకయాకాశము యొక్క భాగములుగనే యున్నవో యటులే యాత్మ యనునతఁడు పరమాత్మ భాగముగ నున్నాఁడు." అని తాత్త్వికదృష్టితో దానికి నర్థముఁ జేయవలయును. (అమృతబిందూపనిషత్తును ౧౩ చూడుము.) సాంఖ్యుల 'ప్రకృతియు,' హెకెల్ యొక్క యాధిభౌతికజడాద్వైతమునందుఁ జెప్పఁబడిన యేకవిధతత్త్వమును, అను నీరెండును నీతీరుననే సత్యము నిర్గుణము నగుపరమాత్మయొక్కయే సగుణమగు (అనఁగా: పరిచ్ఛిన్నమైన) యంశములుగ నున్నవి. వేరేల? ఆధిభౌతికశాస్త్రము యొక్కపద్ధతిచే నేవేవి వ్యక్తము, లేక, యవ్యక్తము నగుమూలతత్త్వముగ (కాల యది యాకాశమువలె నెంతవ్యాపక మయినను సరే) నున్నవో యవి యన్నియు సర్వస్థలములచేతను, సర్వకాలములచేతను, పరిచ్ఛిన్నము లయిననామరూపము కావుననే నశ్వరములుగ నున్నవి. అవి యున్నంతవఱకును (అనఁగా: ఆనామరూప ములెంతవఱకు వ్యాపించునో యంతవఱకును)బ్రహ్మము వానిచే నాచ్ఛాదింపఁబడు

ని సత్యమే కాని, పరబ్రహ్మము వానిచేఁ [illegible] కాక [illegible] తప్రోతముగ (పదుగుచేకయు) [illegible] గిలియుండెనో తెలియదు. పరమేశ్వరుని [illegible] యుంతయున్న [illegible] మాత్రమున, [illegible] లోఁ బ్రయోగింపఁబడినను, వానికి [illegible] కారణ మేమియనఁ: యథార్థముగఁ [illegible], [illegible] లు, లేక, సంఖ్యయు నపనవియు నామరూపములకే [illegible] మీసమ స్తనామరూపములకంటె పరము [illegible] బడియే యున్నది. ఈకారణముననే నామరూపాత్మకము [illegible] గ్రసింపఁబడినచో యాకాలమును సైతము గ్రసించునది, లేక, పాకము చేయునది యగుతత్త్వ వేది కలదో యదియె పరబ్రహ్మ మని యుపనిషత్తులలో [illegible] నది. (మై. ౬. ౧౫). మఱియు "న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః"—"పరమేశ్వరునియొక్కస్థానమును ప్రకాశింపఁజేయుటకు సూర్యచంద్రాగ్నులవలె ప్రకాశముగలసాధనము లెవ్వియును లేవు గాన నది స్వయం ప్రకాశము గనే యున్నది." ఈమొదలగువర్ణనలు గీతలలోను, ఉపనిషత్తులలోను (గీ. ౧౫. ౬.; కఠ. ౫. ౧౫; శ్వే. ౬. ౧౪) ఉన్నవి; వానికిని నిదియె తాత్పర్యము. సూర్య చంద్రులు, నక్షత్రములు ననునివి యన్నియు నామరూపాత్మకము లయినవినా [illegible] పదార్థములుగ నున్నవి. ఏదేవుని "జ్యోతిషాం జ్యోతిః" "తేజస్సునకు తేజస్సు" (గీ. ౧౩. ౧౭; బృ. ౪. ౪. ౧౬) అని చెప్పుచున్నారో యా స్వయంప్రకాశమును జ్ఞానమయము నగునట్టిబ్రహ్మము, ఈసర్వమునకును పరముగను ననంతముగను నుండి యుండుటచే దానికి నితరములగు ప్రకాశింపఁజేయుపదార్థములయొక్క యపేక్ష లేకపోవుటయేకాక, సూర్యచంద్రాదులకు సైతము మున్న ప్రకాశ మీస్వయంప్రకాశ మగుబ్రహ్మమందుండియే వచ్చుచున్న దని యుపనిషత్తులలో స్పష్టముగఁ జెప్పఁబడినది. (ముం. ౨. ౨. ౧౦) అధిభౌతికశాస్త్రముయొక్కయుక్తిచే నింద్రియగోచర మగునదియు, నతిసూక్ష్మముగఁ గాని, లేక, యత్యంతవిస్తారముగఁ గాని యున్నపదార్థమును విచారించిన, నది సర్వము దిక్కాలాదినియమములయొక్క నిబంధనమునకు లోఁబడిన నామరూపాత్మక మగుజగత్తుగ నున్నది. సత్యమగుపర మేశ్వరుఁడు దానియందుండియు, దానికంటె భిన్నుఁడును, దానికంటె విశేష వ్యాపకుఁడును, నొక్కఁడును, నామరూపమయమగుపాశముచే బంధింపఁబడని వాఁడును కావుననే, స్వతంత్రుఁడగుటచే, కేవలనామరూపములయొక్క విచారణ

మాత్రమే చేయునాధిభౌతికశాస్త్రముయొక్క యు...)నను వీరికి పరస్పరము మాఱ
గాని, యిప్పటికంటె శతగుణములు సూక్ష్మములుగ గనే యున్నది." (ఇద మగ్ర
బొందినను, జగత్తుయొక్క మూల మగు 'అమృతత వ్యాపించి యున్నుండెను."
తెలిసికొనుటకు సాధ్యము కాదు. ఆయవినాశియు నవికా ణాచార్యు దానియం
మధ్యాత్మముయొక్క జ్ఞానముచేతనే తుదకుఁ దెలిసికొనఁబడునని ౪. ౪. జగత్తు) వెలు

ఇంతదనుక నధ్యాత్మశాస్త్రముయొక్క మిక్కిలిముఖ్య స్థాక్కడ 'అవ్య 'అసిడినట్లు సూ లును, వానికి శాస్త్రీయరీతిగను సంక్షిప్తముగ నున్నయుపపత్తులు ... వీనివలన పరమేశ్వరునియొక్క నామరూపాత్మక మగుసర్వవ్యాప్య వ్యక్తస్వరూపము మాయికము ననిత్యముననియు, దానికంటె నవ్యక్తస్వరూప మేల శ్రేష్ఠమని యు, దానియందును నిర్గుణ మేల (అనఁగా: నామరూపశూన్య మైనది) శ్రేష్ఠ మైనది యనియు, నిర్గుణమే యజ్ఞానముచే సగుణముగ భాసించుచున్నదని గీతలలో నేలచెప్పఁబడలేదనియు, మొదలగుప్రశ్నలకు సమాధానము బాగుగఁ దెలియును. కాని యీసిద్ధాంతము శబ్దములలోఁ గుదిగ్రుచ్చుట యనుపని (ప్రతిపాదించుట) యదృష్టమువలన కించిజ్జ్ఞానము గలనావంటి యేమనుజుఁడైనను జేయఁగలఁడు. దాని యం దేమియును విశేషము లేదు. ఈసిద్ధాంతము దెలిసినపిదప మనస్సున బింబాకృతిం జెంది, హృదయమునందు నాటుకొని, యెమ్ముకలందును మాంసమునందును బ్రవేశించి, సర్వప్రాణులయందును నొక్క పరబ్రహ్మముయొక్క స్వరూపమే నిండియున్నదని తెలిసికొనుటకును, ఆపరబ్రహ్మముయొక్క భావనతోడనే యాపత్కాలమున సైతము సర్వవిషయములయందును సమత్వముతో నుండుటకు వీలైన దేహస్వభావముగలుగుటకును, అనేకజన్మములనుండి యార్జింపఁబడినసంస్కారము, ఇంద్రియనిగ్రహము, దీర్ఘోద్యోగము, ధ్యానము, నుపాసనయు ననువానియొక్క యావశ్యకత యుండును కావి, యీయన్నింటియొక్క సాహాయ్యముచే "సర్వభూతములయందునూ నొక్కటియే యాత్మ కల"దను నీతత్త్వము సంకటసమయమం దయినను, ఎవనికి తనప్రతికార్యమునందును సహజముగ గోచరించుచున్నదో, యాతనికే బ్రహ్మజ్ఞానముయొక్క సత్య మగుపరిపాక మైన దనియు, నతనికే మోక్షము లభించిన దనియు గీతలలో నున్నది: (గీ: ౫. ౧౮–౨౦; ౬. ౨౧–౨౨). ఇది పూర్వోక్త మగుసర్వసిద్ధాంతములయొక్క సారభూతమును, శిరోమణిభూతము నగునధ్యాత్మశాస్త్రముయొక్క కడపటిసిద్ధాన్తము. ఈయాచరణ మెవనియందుఁ గన్పట్టదో యాతఁడు సంపూర్ణుఁడు కాలే దనియు, నతనిమనస్సు ఇప్పటికిని బ్రహ్మాగ్నిహోత్ర

మునందు బాగుగ పక్వము కాలే దనియుఁ దెలిసికొనవలయును. నిజ మగుసాధువున కును, కేవలవేదాంతశాస్త్రజ్ఞునకు నుండుభేద మిద్దియ. మఱియు నీయభిప్రాయముచే తనే గీతలయందు జ్ఞానలక్షణమును జెప్పుచు "జ్ఞాన మనఁగా, బాహ్యసృష్ట్యారంభ మున నున్న పదార్థము బుద్ధికి కేవలము తెలియుటయే" యని వ్యాఖ్యానముఁ జేయక "అవమానిత్వము, శాంతి, ఆత్మనిగ్రహము, సమబుద్ధి మొదలగునుదాత్తమనోవృత్తులు విజృంభించుటచే నెవనిచిత్తముయొక్క పూర్ణశుద్ధి యాచరణలో నెల్లప్పుడును వ్యక్తమగునో యతఁడే సత్యమగుజ్ఞానిగ నున్నాఁడు" అని చెప్పఁబడినది. (గీ. ౧౩. ౭-౧౧) జ్ఞానముచే వ్యవసాయాత్మక మగు నెవనిబుద్ధి యాత్మనిష్ఠ మైనదో (అనఁగా: ఆత్మానాత్మవిచారమునందు స్థిరమగుటచే నెవనిమనస్సునకు సర్వభూతాత్మైక్యజ్ఞాన ము కలిగినదో) యాపురుషుని వాసనాత్మకబుద్ధియు శుద్ధముగనే యుండవలయు ననువిషయమునందు శంక యేమియు లేదు; కాని యెవరిబుద్ధి యెటు లున్నదో తెలిసికొనుటకు వాని యాచరణతప్ప, నితరము లగుబాహ్యసాధనము లేమియులేవు గాన, జ్ఞాన సమబుద్ధిశబ్దములలోనే శుద్ధ (వ్యవసాయాత్మక) బుద్ధియు, శుద్ధవాస నయు, (లేక, వాసనాత్మకబుద్ధియు), శుద్ధాచరణము నను నీమూఁడుశుద్ధవిషయ ములయొక్కయు సమావేశము చేయఁబడు ననియు, విశేషముగ పుస్తకజ్ఞానమును మాత్రమే విస్తరింపఁజేయు (అనఁగా: అనుభవజ్ఞానము లేని) నేకాలమున నీవిషయ మును బాగుగ గుర్తుంచుకొనవలయును. బ్రహ్మవిషయమై శుష్కమగు వాక్పాండి త్యమును జూపువారును విని 'వహ్వా వహ్వా' యని తల లూపువారును నాటకశాల లో నున్నసభాసదులవలె 'మరల నదే చెప్పు' మనువారును ననేకులు గలరు (గీ. ౨. ౨౯; కఠ; ౨. ౭). కాని పూర్వమునందుఁ జెప్పఁబడినటుల నెవఁ డంతర్బాహ్య శుద్ధుఁడు (అనఁగా: సౌమ్యశీలుఁడు) అగునో వాఁడే సత్యమగునాత్మనిష్ఠుఁడు, వానికే ముక్తిలభించును. కేవలపండితులకు లభింపదు. వాఁ డెంతబుద్ధిమంతుఁ డైనను నెంత బహుశ్రుతుఁ డైనను లాభములేదు. "నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన"—అని యుపనిషత్తులలో స్పష్టముగనే చెప్పఁ బడియున్నది. (కఠ ౨. ౨౨; ముం. ౩. ౨. ౩) కావుననే—"ఘూలాసి పండిత పురాణసాంగసీ, పరీతూ నేణసీ మీహే కోణ." "పండితుఁడ వగుదు వేని పురా ణముఁ జెప్పుదువు. కాని నీ వెవఁడవో తెలిసికొన లేవు" అని తుకారామబువా గారు సైతము వచించిరి. (గా. ౨౫౯౯) నాయొక్కజ్ఞాన మెంత యల్పమో చూ డుము. 'ముక్తిలభించును,' అనుమాట సహజముగనె నానోటనుండి వెలువడు

చున్నది.' అని యనుటకు నాత్మకంటె ముక్తి వేఱుగ నున్న దని యభిప్రాయమా ఏమి? బ్రహ్మము-ఆత్మయు నను నివి యొకటిగనే యున్నవి యనుజ్ఞానోత్పత్తికి పూర్వము, ద్రష్టకును, దృశ్యమగుజగత్తునకును భేదముండెను కాని బ్రహ్మాత్మైక్యజ్ఞానము పూర్ణముగ కలిగినపిదప నాత్మ బ్రహ్మమందుఁ గలిసి పోవుటచే బ్రహ్మజ్ఞాని కూర్చున్నచోటనే, తానే బ్రహ్మస్వరూపుఁ డగుచున్నాఁ డనియు, ఈయాధ్యాత్మికావస్థనే 'బ్రహ్మనిర్వాణ'మనియు 'మోక్ష'మనియుం జెప్పుదురు. కావున వాఁడేమియు నెవరికి నీయనక్కఱ లేదు. ఎక్కడనుండియు మఱియొక పదార్థము రానక్కఱ లేదు. దీనికొఱకు మఱియొకలోకములోనికి వెళ్లవలసిననిమిత్తము లేదు. అని మనయధ్యాత్మశాస్త్రముచే నిశ్చయింపఁబడినది. పూర్ణముగ నాత్మజ్ఞాన మెప్పుడెక్కడ కలుగునో యాక్షణమునందె యాస్థలమునందె మోక్షమున్నది. కారణమేమియన: మోక్ష మనునది యాత్మయొక్కమూలభూతమునకు శుద్ధావస్థగ నున్నది. వేఱగుస్వతంత్రవస్తువుగాని, స్థలముగాని కానేరదు.

"మోక్షస్య నహి వాసోఽస్తి న గ్రామాంతర మేవ వా
అజ్ఞానహృదయగ్రంథినాశో మోక్ష ఇతి స్మృతః." (శివగీత. ౧౩. ౩౨)

"మోక్షమున కొకచోటు లేదు: ఒకయూరును లేదు. అనఁగా దానికొఱకెక్కడకును పోనక్కఱ లేదు. తనహృదయమం దున్నయజ్ఞానగ్రంథియొక్క నాశమునె మోక్ష మని చెప్పుచున్నారు" అని శివగీతలలో నున్నది. కావున నధ్యాత్మశాస్త్రమునందుండి నిష్పన్న మగు నీఫలితార్థమే "అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్" "ఎవరికి పూర్ణమగునాత్మజ్ఞానము కలిగినదో వారికి బ్రహ్మనిర్వాణరూప మగుమోక్షము కూర్చున్నచోటనే లభించును" (గీ. ౫. ౨౬) అనియు, "య స్సదా ముక్త ఏవ సః" (గీ.౫.౨౮) అనియు భగవద్గీతాశ్లోకములయందును, "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి"— "బ్రహ్మమును దెలిసికొన్నవారు బ్రహ్మమే యగుచున్నారు"—(ముం. ౩. ౨. ౯.) మొదలగునుపనిషద్వాక్యములయందును జెప్పఁబడినది. మనుష్యునియాత్మకు జ్ఞానదృష్టిచేఁ గలుగు నీపూర్ణావస్థనే 'బ్రహ్మభూతము' (గీ. ౧౮. ౫౪), లేక, 'బ్రాహ్మీ స్థితి' (గీ. ౨. ౭౨) యని చెప్పుచున్నారు. మఱియు స్థితప్రజ్ఞుఁడు (గీ౨. ౫౫-౭౨), భక్తుఁడు (గీ. ౧౨. ౧౩—౨౦), లేక, త్రిగుణాతీతుఁడు (గీ. ౧౪. ౨౨—౨౭) నగుపురుషునిగుఱించి భగవద్గీతయందును నితరగ్రంథములందు నున్న వర్ణనయంతయు నీయవస్థను గుఱించినదే యై యున్నది. 'త్రిగుణాతీత' అను పదమువలన ప్రకృతి, పురుషులనురెంటిని స్వతంత్రములుగ నంగీకరించి సాంఖ్యులు చెప్పినట్లు 'పురుషునకు కేవలత్వ

మోక్ష' మనునదియే గీతలకు సమ్మత మని యనుకొనఁ గూడదు. మఱి యేమనఁగా: అధ్యాత్మశాస్త్రమునం దున్న “అహం బ్రహ్మాస్మి”—“నేనే బ్రహ్మముగా నున్నాను”—(బృ. ౧. ౪. ౧౦) అనుబ్రాహ్మస్థితి యొకానొకప్పుడు భక్తిమార్గముచేతను మఱియొకప్పుడు చిత్తనిరోధరూప మగుపాతంజలయోగమార్గముచేతను, ఇంకొకప్పుడు గుణాగుణవివేచనరూప మగుసాంఖ్యమార్గముచేతను ప్రాప్తమగు నని గీతల యొక్క యభిప్రాయము. ఈమార్గములలో నధ్యాత్మవిచార మనుమార్గము కేవలము బుద్ధిగమ్య మనియు, సామాన్యమనుజులకు పరమేశ్వరస్వరూపజ్ఞానము కావలసిన యెడల భక్తి యనునదియె సులభసాధనముగ నున్న దనియు గీతలయందుఁ జెప్పఁబడి యుండుటచే దానియొక్క సవిస్తర మగువిచారము పదమూఁడవయధ్యాయము నందుఁ జేయఁబడును. సాధన మేదైనను కానిమ్ము; బ్రహ్మాత్మైక్యముయొక్క (అనఁగా: సత్య మగుపరమేశ్వరస్వరూపముయొక్క) జ్ఞానము కలుగుటచే, జగత్తునం దున్న నిఖిలభూతములలోను నొకయాత్మయే యున్న దని తెలిసికొనుటయు, తదనుసారముగ నాచరించుటయు ననునదియే యధ్యాత్మజ్ఞానముయొక్క పరాకాష్ఠ యగుటచే నీస్థితిని బొందినపురుషులే ధన్యులును కృతకృత్యులు నగుదు రని మాత్రము నిర్వివాదముగనే యున్నది. కారణ మేమియనఁగా: కేవల మింద్రియసుఖము మనుజులకును పశువులకును సమానముగ నుండుటచే మనుష్యజన్మముయొక్క సార్థకత గాని, లేక, మనుజునియొక్క మనుష్యత్వముగాని జ్ఞానప్రాప్తియందె యున్న దని పూర్వమునందె చెప్పఁబడియున్నది. సర్వభూతములయందును మనోవాక్కాయములచే నెప్పుడు నిట్టిసామ్యబుద్ధినుంచి సర్వకర్మలనుచేయుటయే నిత్యముక్తావస్థ, పూర్ణయోగము, లేక, సిద్ధావస్థ యనియు చెప్పఁబడినది. గీతలలోఁ జెప్పఁబడిన యీయవస్థలలో పండ్రెండవయధ్యాయమునం దున్న (జ్ఞా. ౧౨. ౧౮) భక్తుని యొక్కవర్ణనకు వ్యాఖ్యానముఁ జేయుచు—

పార్థా జయాచియా ఠాయీఀ, వైషమ్యాచీ వార్తా నాహీఀ,
రిపుమిత్రా దోహీఀ, సరిసా పాడు.
కాఀ ఘరిచియాఀ ఉజియేడు కరావా, పారఖియాఀ అంధారు పాడావా,
హేఀ నేణేచి గా పాండవా, దీపు జైసా.
జో ఖాండావయా ఘావో ఘాలీ, కాఀ లావణీ జయానే కేలీ,
దోఘాఀ యేకచి సాఉలీ, వృక్షు దే జైసా.

"ఓ పార్థా! ఎవని హృదయమున వైషమ్యము నామమాత్రమైనను లేదో, యెవఁడు శత్రుమిత్రుల నిరువురను సమానముగఁ జూచుచున్నాఁడో; ఓ పాండవా! దీప మేవిధమున 'ఈయిల్లు నాది గాన దీనిఁ బ్రకాశింపఁ జేయుదును' అని కాని, 'ఇది మఱియొకరియిల్లు గాన దీనిని బ్రకాశింపఁజేయను' అని కాని యనుకొనుట నెఱుంగదో, యావిధమున నెవఁడు భేదభావము నెఱుంగఁడో; చెట్టు, తన్ను నాటినవానికిని తన్ను నఱకువానికిని సమానముగ నీడనిచ్చునట్లెవఁడు సముఁడుగ నుండునో" అనియు తత్పూర్వమునందున్న (జ్ఞా. ౧౨. ౧౩) యధ్యాయమునందే—

ఉత్తమాతేఁ ధరిజే, అధమాతేఁ అవ్హేరిజే,
హేఁ కాఁహీఁచ నేణిజే, వసుధా జేవీఁ.
కాఁ రాయాచేఁ దేహ చాళూఁ, రంకా పరాతేఁ గాళూఁ,
హేఁ న మ్హణేచి కృపాళూ, ప్రాణు పైఁ గా.
గాఈచీ తృషా హరూఁ, కాఁ వ్యాఘ్రా విష హోఊని మారూఁ,
ఎసేఁ నేణేచి కాఁ కరూఁ, తోయ జైసేఁ.
తైసీ అఘవియాచి భూతమాత్రీఁ, ఏకపణేఁ జయా మైత్రీ,
కృపేశీఁ ధాత్రీ, ఆపణచి జో.
ఆణి మీ హేఁ భాష నేణేఁ, మాఝేఁ కాఁహీంచి న మ్హణే,
సుఖదుఃఖ జాణణేఁ, నాహీఁ జయా.

"ఎవఁడుత్తమునిసాంగత్యముఁ జేయవలయు ననియు నధమునిసాంగత్యముఁ జేయరా దనియు నీభేదమును భూమివలె నెఱుంగఁడో; దయగలవాఁ డగు నెవఁడు రాజును గౌరవింతు ననియు దరిద్రు నవమానింతు ననియు మనస్సున నెన్నఁడో; నీరు, 'ఆవుయొక్క దప్పిని తీర్తు ననియు పులిని విషమై చంపుదు ననియుఁ దలంప నట్లు సర్వప్రాణులవిషయమై యెవని కేకరూపముగ మైత్రిగలదో; యెవఁడు స్వభావముచేతనే దయగలవాఁడో, యెవఁడు సుఖదుఃఖముల నెఱుంగఁడో, వాఁడే ముక్తుఁడు. అధ్యాత్మవిద్యచే తుదకు ప్రాప్తమగునది యింతకంటె నేమియు లేదు."

అనియు జ్ఞానేశ్వరమహారాజుగా రనేకదృష్టాంతములతో బ్రహ్మభూతుని యొక్క సామ్యావస్థను శుద్ధమహారాష్ట్రభాషయందు మిక్కిలి సరసముగను చమత్కారముగను నిరూపణచేసి యున్నారు. దానియందు గీతలలోని నాల్గుస్థలముల

యం దుండు బ్రాహ్మీస్థితిసంబంధ మగువర్ణనయొక్క సారాంశ మున్నదియని వచిం చుట కేయభ్యంతరమును లేదు. అధ్యాత్మవిద్యచేఁ దుదకుఁ బొందఁదగిన ఫలమిదియే.

సర్వమోక్షధర్మములకు మూల మగునధ్యాత్మజ్ఞానముయొక్క పరంపర మన దేశమున నుపనిషత్తులు మొదలుకొని, తుకారామబువాగారిపర్యంతము నవ్యా హతముగ నెట్లు వచ్చుచున్న దనియు నీపూర్వోక్త మగుపరిశీలనవలనఁ దెలియును. కాని యుపనిషత్తులకాలముకంటె పూర్వమునసైతము (అనఁగా: అత్యంత మగు ప్రాచీనకాలము నుండియు) ఈదేశమున నీజ్ఞానము ప్రాదుర్భవించి యిప్పటికి క్రమ క్రమముగ నుపనిషత్తులలోని విచారములమూలముగ వృద్ధిఁ జెందిన దనువిషయము చదువరులకు తెస్సగఁ దెలియుటకై ఋగ్వేదమందున్న బ్రహ్మవిద్యకు నాధారభూత మగునుపనిషత్తులయందలి యొక ప్రసిద్ధమగుసూక్తము భాషాంతరముతో ముందు వ్రాయఁబడును. సృష్టికి నగమ్య మగుమూలతత్త్వమేది? దానియందుండి యీ వివిధమగుదృశ్యసృష్టి యెట్లు గలిగి యుండును? అనువిషయ మీసూక్తమున నిరూ పింపఁబడినట్లు, ప్రగల్భమును, స్వతంత్రమును, మొదలంటఁ జేయఁబడినదియు నగుతత్త్వజ్ఞానముయొక్క సమర్మకవిచారము, ధర్మగ్రంథములలో నేమూలగ్రంథ మునను స్పష్టముగ విచారింపఁబడలేదు. ఇంతియకాక యిట్టి యధ్యాత్మవిచారము తో నిండినదియు, నింతప్రాచీనమైనదియునగు గ్రంథ మిప్పటికి నెక్కడను లభ్య ము కాలేదు. కావుననే యనేకులగుపాశ్చాత్యులుసైతము ధార్మికమగునితిహాస దృష్టితోఁ గూడ నీసూక్తమును మిక్కిలిమహత్త్వముఁ గల దని యెఱింగి యాశ్చ ర్యచకితులై మనుజుని మనఃప్రవృత్తి నశ్వరమును నామరూపాత్మకము నగుసృష్టికి పరమందున్న నిత్యము నచింత్యము నగుబ్రహ్మశక్తివైపున కెటుల సహజముగ నొఱిగి యున్నదియుఁ దెలియఁ జేయుటకై తమతమభాషలలోనికి దీనిని మార్చుకొనిరి. ఈ సూక్తము ఋగ్వేదమున పదియవమండలమునందలి ౧౨౯ వది యైయున్నది. సూ క్తారంభమునం దుండుశబ్దముంబట్టి దీనిని "నాసదీయసూక్త"మని చెప్పుచున్నారు. మఱియు నిది తైత్తిరీయబ్రాహ్మణమునందు (౨. ౮-౯) చెప్పఁబడియున్నది. మహా భారతమునందు నారాయణీయ, లేక, భాగవత ధర్మములందును భగవదిచ్ఛచే తొలుత సృష్టియెటు లయ్యె ననువిషయ మీసూక్తాధారముంబట్టియే వర్ణిత మైనది (మ. భా. శాం. ౩౪౨. ౮) సర్వానుక్రమణికా ప్రమాణముంబట్టి యీసూక్తమునకు ఋషి పరమేష్ఠి ప్రజాపతి, పరమాత్మ దేవత, గలిగి త్రిష్టుపు ఛందము (అనఁగా: ప్రతిపాదమునకును బదునొకండక్షరములు, నాలుగుచరణములు) గల ఋక్కులేడు

కలవు. 'సత్' 'అసత్' అనుశబ్దములు ద్వ్యర్థము లగుటచే, జగత్తుయొక్క మూల ద్రవ్యమును 'సత్' అని చెప్పటలో నుపనిషత్కారులకుఁ గల దని పూర్వమునం దీప్రకరణములోఁ జెప్పఁబడినమతభేదమే ఋగ్వేదమునందును స్పష్టముగఁ గాన్పించుచున్నది. ఉదాహరణము:—ఈమూలకారణవిషయములో నొకచోట "ఏకం సద్విప్రా బహుధా వదన్తి" (ఋ. ౧. ౧౬౪. ౪౬), మఱియొకచోట "ఏకం సన్తం బహుధా కల్పయన్తి" (ఋ.౧౦. ౧౧౪. ౫), అని చెప్పఁబడినది. ఏకమః సత్తును (ఎప్పు డుండునది) అగు దానినే లోకులు వేర్వేఱుగఁ బేర్కొ కాని కొన్నిస్థలములయందు దీనికి విపరీతముగనే "దేవానాం పూర్వ్యే ఽసత స్సదజాయత" (ఋ. ౧౦. ౭౨. ౭) దేవతలయుత్పత్తికంటె పూర్వమునం దైత మసత్తునం దుండియే (అనఁగా: అవ్యక్తమున నుండి) సత్తు (అనఁగా:వ్యక్తము) యొక్క సృష్టి యుత్పన్న మైన దని యితరస్థలములందును జెప్పఁబడినది. ఇంతియ కాక జగత్తుయొక్క మూలారంభమున హిరణ్యగర్భుఁ డుండెను. అమృతము మృత్యువు నను నీరెండును నతనిచ్ఛాయలే. వానిచేఁ బిదప జగత్తంతయు నిర్మింపఁ బడినది (ఋ. ౧౦. ౧౨౧. ౧-౨). పురుషుఁ డాదియందు విరాడ్రూపుఁ డై యుండెను. వానియందుండి యజ్ఞములద్వారా సర్వసృష్టియు నుత్పన్న మైనది. (ఋ.౧౦. ౯౦). ప్రారంభమున జల ముండెను. దానియందు ప్రజాపతి పుట్టెను. (ఋ.౧౦.౭౨.౬; ౧౦.౮౨.౬), లేక, ఋతసత్యములు రెండు ప్రథమమున నుత్పన్నము లైనవి. అనంతరము రాత్రి (అంధకారము), సముద్రము (జలము), సంవత్సరము మొదలగునవి యుత్పన్నము లైనవి. (ఋ.౧౦. ౧౯౦.౧) ఇట్లేదియో యొక దృశ్యతత్త్వమునుండి సృష్టి యుత్పన్న మైన దని ఋగ్వేదమునందె వేర్వేఱుగ వర్ణింపఁబడి యున్నది. ఋగ్వేదమున వర్ణిత మగు నీమూలద్రవ్యములోనే తొలుత (౧) తైత్తిరీయబ్రాహ్మణమునందు "ఆపో వా ఇద మగ్రే సలిల మాసీత్" (తై. బ్రా. ౧. ౧. ౩. ౫)—ఈసర్వమును ప్రారంభమున పలుచనిది యైన జలముగ నుండెను—అని యుదకముయొక్కయు, (౨) తైత్తిరీయోపనిషత్తునందు "అసద్వా ఇద మగ్ర ఆసీత్" (తై.౨.౭)—ఇది తొలుత నసత్తుగనే యుండెను—అని యసత్పదార్థముయొక్కయు, (౩) ఛాందోగ్యములో "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" (ఛా. ౬. ౨)—ఈసర్వమును తొలుత సత్తుగనే యుండెను—అని సత్పదార్థముయొక్కయు, (౪) "ఆకాశః పరాయణం" (ఛాం. ౧. ౯)—ఆకాశము సర్వమునకు మూలము—అని యాకాశముయొక్కయు, (౫) బృహదారణ్యకమందు "నైవేహ కించ నాగ్ర ఆసీ న్మృత్యు నైవేద మావృత మాసీత్ (బృ.౧. ౨. ౧.)—

ప్రారంభమున నిదంతయు లేకుండెను. సర్వము మృత్యువుచేతనే యాచ్ఛాదింపఁబడినది— అని మృత్యువుయొక్క-యు. (౬) మైత్ర్యుపనిషత్తునందు "తమో వా ఇద మగ్ర ఆసీ దేకమ్." (మై. ౫. ౨)— ఈసర్వమును ప్రారంభమున నొకే తమస్సుగ (తమోగుణి, అంధకారమై)నుండెను.—పిదప నందుండి రజస్సును, సత్త్వమును బుట్టినవి యని తమస్సుయొక్క- యనువాదము చేయఁబడినది. అటులే యీ వేదవచనముల ననుసరించి మనుస్మృతిలో—

"ఆసీ దిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్
అప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వతః." (మను. ౧. ౫. ౮)

"ఈసమస్తమును మొలుత తమస్సుచే (అంధకారముచే) వ్యాప్త మైనందున భేదాభేదముల నెఱుంగుటకు యోగ్యము కామిచే నగమ్యముగ నిదురించినటు లుండెను. పిదప దానియం దవ్యక్తపరమాత్మ ప్రవేశించి జలమును ప్రారంభమున సృజించెను"—అని సృష్ట్యారంభము వర్ణిత మైనది. సృష్ట్యారంభమున నున్నమూల ద్రవ్యసంబంధవిషయమై యీవిధము లగువేర్వేఱువర్ణనలు, నాసదీయసూక్తము పుట్టినసమయమునందును ప్రచలితములుగ నుండవలయును. మఱియు నిం 'దేమూల ద్రవ్యము సత్యమని యెఱుంగవలయును?' అను ప్రశ్న యప్పుడే పుట్టియుండును. కారణ మేమి యనఁగా: దానియందు బీజము (అనఁగా: సత్యము) ఏమగు ననువిషయమై యీసూక్తముయొక్క-ఋషి యిట్లు ప్రకాశించియున్నాఁడు.—

| సూక్తము | భాషాంతరము. |
|---|---|
| నాస దాసీ న్నో స దాసీ త్తదానీం<br>నాసీ ద్రజో నోవ్యోమాపరో యత్,<br>కి మావరీవః కుహ కస్య శర్మ<br>న్నంభః కిమాసీ ద్గహనం గభీరమ్. ౧. | ౧. అప్పుడు, అనఁగా : మూలారంభమున, అసత్తు లేకుండెను. సత్తును లేకుండెను. అంతరిక్షము లేకుండెను. దానికంటె పరమం దున్నయాకాశము లేకుండెను. (ఈ స్థితియందు) ఎవరు (ఎవరిని) ఆవరించి యుండిరి? ఎక్క-డ? ఎవరి సుఖముకొఱకు? అగాధము, గహనమగు జలము సైతమెక్క-డ నుండెను? * |

* మొదటిఋక్కు-యొక్క నాలవచరణమున 'ఆసీ త్కిం'అని యన్వయించి, నే నీవిధముగ నర్థమును వ్రాసినాను. దానికి 'జలము అప్పుడు లే' దని భావార్థము (తై. బ్రా. ౨. ౨. ౯ చూడుము).

న మృత్యు రాసీ దమృతం న తర్హి
న రాత్ర్యా అహ్న ఆసీత్ప్రకేతః,
ఆసీ దవాతం స్వధయా తదేకం
తస్మాద్ధాన్య న్న పరః కించ నాస. ౨.

౨. అప్పుడు మృత్యువు, అనఁగా: మృత్యుగ్రస్తము, నశ్వరమునగు ద సృష్టి లేక యుండెను. కావుఁ గాన్పిం వది) అమృతము, అనఁగా: అవిట "ఏకం నిత్యపదార్థము (ఈభేదమును "ఏకం డెను. (అటులె) రాత్రి, పగ లన్న దము తెలియుటకై యేసాధనమ (=ప్రకేతములు) లేకపోయెను. (ఏది యున్నదో) అది యేకాకిగనే స్వధచే, అనఁగా: దనశక్తిచే, వాయువువినాగా శ్వాసోచ్ఛ్వాసములను జేయుచున్నది, అనఁగా: స్ఫూర్తి కలదై యుండెను. దానికంటె మఱియొకవస్తు వేమియు లేకయుండెను.

తమ ఆసీత్తమసా గూఢ మగ్రే
ప్రకేతం సలిలం సర్వ మా ఇదమ్,
తుచ్ఛ్యేనాభ్వపిహితం యదాసీత్
తపస స్తన్మహినాఽజాయ తైకమ్. ౩.

౩. అంధకార ముండెను. ఆరంభమునం దిదియంతయు నంధకారముచే వ్యాప్తమును, (మఱియు) భేదాభేదవిరహిత జలముగను నుండెను. లేక, ఆభు, అనఁగ: సర్వవ్యాపి యగు బ్రహ్మము (ఆరంభమున నే) తుచ్ఛముచేతనే, అనఁగా: అసత్య మగు మాయచేతనే, యాచ్ఛాదితమయినది— అని (యత్) ఏది (చెప్పఁబడుచున్నదో) అది (తత్) మూలమున నొకటియె (బ్రహ్మమే). తపస్సుయొక్క మహిమచే (రూపాంతరముచే)ఁ బిదపఁ బ్రచుర మైనది.*

* కొంద ఱీమూఁడవఋక్కుయొక్క తొలిమూఁడుచరణములు స్వతంత్రములని యంగీకరించి, "అంధకారము, దానిచే వ్యాప్త మగుజలము, లేక, తుచ్ఛముచే నాచ్ఛాదిత మైన ఆభువు (శూన్యము) గానుండెను." అని వానికి విధానార్థక మగునర్థముంజేసిరి. కాని "ఆరంభమున నేమియు లేదు." అని యీసూక్తమునందలి

కామస్తదగ్రే సమవర్తతాధి
మనసో రేతః ప్రథమం యదాసీత్
సతో బన్ధుమసతి నిరవిందన్
హృదిప్రతీష్యా కవయో మనీషా.౪.

౪. (దీనియొక్క) మనస్సుయొక్కయే రేతస్సు, అనఁగా: బీజము, ప్రారంభమున బయలువెడలెనో, యదే ప్రారంభమున కామము (అనఁగా: సృష్టిని నిర్మించు ప్రవృత్తి, లేక, శక్తి) అయ్యెను. (అది) అసత్తునందు, అనఁగా: మూలపరబ్రహ్మమందు సత్తుయొక్క, అనఁగా: వినాశిదృశ్యసృష్టియొక్క, (మొదటి) సంబంధమని జ్ఞాతలు అంతఃకరణమందు విచారించుకొని బుద్ధిచే నిశ్చయించినారు.

మొదటిరెండుఋక్కులయందును స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. మూలారంభమున నంధకారముగాని, జలముగాని యుండెనని పూర్వము చెప్పఁబడినదానికి విరుద్ధముగ నీసూక్తమునందే చెప్పఁబడియుండుట యసంభవముగాన నది తప్పని నాయుద్దేశము. ఇంతియకాక యటు లర్థముఁ జేసినను మూఁడవచరణమునందలి 'య'చ్ఛబ్దము నిరర్థకమని చెప్పవలసివచ్చును. అందుచే మూఁడవచరణమునందలి 'య'చ్ఛబ్దమునకు నాల్గవచరణములోని తచ్ఛబ్దముతో సంబంధము గలిపి నేను వ్రాసినట్లుగనే యర్థముఁ జెప్పక తప్పదు. 'మూలారంభమున జలము మొదలగు పదార్థము లుండెను' అని చెప్పువారికి సమాధానము చెప్పుట కీసూక్తమున నీఋక్కున్నది. మీరు చెప్పినటులు మూలమున తమస్సు జలము మొదలగుపదార్థములు లేవు. ఇఁక నేమన: ఈసమస్తప్రపంచము నొకబ్రహ్మమందుండియే పిదప వెలువడినదని ఋషియొక్కయుద్దేశమని చెప్పవలసివచ్చును. 'తుచ్ఛము' 'ఆభు' అను నీరెండును పరస్పరవిరుద్ధార్థములు కావుననే, తుచ్ఛమునకు విపరీతమగు గొప్పది, లేక, సమర్థమయినదని, 'ఆభు' శబ్దార్థమును జెప్పవలసివచ్చును. ఋగ్వేదమునం దింకను రెండుస్థలములలో 'ఆభు' శబ్దప్రయోగము కానిపించుచున్నది. (ఋ. ౧౦. ౨౭. ౧-౪.). అచ్చో సాయణాచార్యులుసైత మీశబ్దమున కీయర్థమునే వ్రాసియున్నారు. పంచదశిలో (చిత్రదీప. ౧౨౯-౧౩౦) తుచ్ఛశబ్దమును మాయార్థకముగఁ బ్రయోగించియున్నారు. (నృసిం. ఉత్త. ౯. చూడుము) చూడఁగా 'ఆభు'శబ్దమునకు శూన్యమని యర్థము కానేరదు. 'పరబ్రహ్మమే' యర్థమగును. "సర్వం ఆః ఇదమ్". ఇచ్చో 'ఆః' (అ + అస్) అనునది అస్ధాతువుయొక్క భూతకాలరూపమైనందున దీనికి 'ఆసీత్' అనియర్థము.

తిరశ్చీనో వితతో రశ్మిరేషామ్
అధః స్విదాసీదుపరి స్విదాసీత్
రేతోధా ఆసన్మహిమాన ఆసన్
స్వధా అవస్తాత్ ప్రయతిః పరస్తాత్. ౫.

౫. (ఇది) రశ్మి, అనఁగా: దారము, లేక, కిరణముయొక్క (లోపల) అడ్డుగ వ్యాపించినది. ఇది క్రిందను మీఁదను వ్యాపించియున్నది. వీనిలో కొన్ని రేతోధా, అనఁగా: బీజప్రదము లాయెను. మఱియు (వృద్ధిఁబొంది) గొప్పవయ్యెను. వానియొక్క స్వశక్తి యీవైపునకును, ప్రయతి, అనఁగా: ప్రభావము, ఆవైపునకును, (వ్యాపించి) ఉన్నది.

కో అద్ధా వేద క ఇహ ప్ర వోచత్
కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః
అర్వాగ్దేవా అస్య విసర్జనేనా
థ కో వేద యత ఆబభూవ. ౬.

౬. (సత్తుయొక్క) ఈవిసర్గము, అనఁగా: వ్యాప్తి, యెక్కడనుండి వచ్చెను? లేక, యెవరినుండి వచ్చెను? (దీనికంటె) 'ప్ర', అనఁగా: విస్తారముగ, ఇచ్చోఁ జెప్పువా రెవరు? నిశ్చయముగఁ దెలిసికొనుచున్న వా రెవరు? దేవతలుసైతమీ (సత్ సృష్టియొక్క) విసర్గానంతరమునను బుట్టినవారు. మఱి యదియెచ్చోనుండి వెలువడినదియు నెవ రెఱుంగుదురు?

ఇదం విసృష్టిర్యత ఆబభూవ
యది వా దధే యది వా న దధే
యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్
సో అంగ వేద యది వా న వేద. ౭.

౭. (సత్తుయొక్క) ఈవిసర్గము, అనఁగా: వ్యాపనమెచ్చోనుండి వచ్చినది? లేక, అది నిర్మించినను, నిర్మింపకపోయినను సరే. అది పరమాకాశమునం దుండెడి యీజగత్తునకు నధ్యక్షుఁ డెవఁడున్నాఁడో (హిరణ్యగర్భుఁడు) వాఁ డెఱింగియుండును; లేక, యెఱుంగక సైతముండును! (ఎవరు సెప్పఁగలరు?)

నేత్రములకును, లేక, సామాన్యముగ సకలేంద్రియములకును గోచరమును, వికారియు, వినాశియు, నామరూపాత్మకము నగునానాదృశ్యములజాలములోనే చిక్కుకొని యుండక దానికి పరమందు ఏదేని యేకము నమృతము నగు తత్త్వము గలదో దానిని జ్ఞానదృష్టిచేఁ దెలిసికొనుటయే సర్వవేదాంతశాస్త్రములరహస్యము. మఱియు నీసారాంశ మనెడి వెన్నముద్దవిషయమై పైసూక్తము లోని ఋషి తొలుదొల్తనే యింతతప్పులేనిచక్కని యూహను జేయుటచే నాతనియంతర్జ్ఞాన మెంతో తీవ్రముగ నున్నదియు స్పష్టముగఁ గాన్పించుచున్నది. మూలారంభమునందు (అనఁగా:సృష్టియందున్న నానాపదార్థములయస్తిత్వము కలుగుటకు ముందు) ఏది గలదో యది 'సత్తు'గా నుండెనా? లేక 'యసత్తు'గా నుండెనా? మృత్యువుగ నుండెనా? లేక, అమరముగ నుండెనా? ఆకసముగ నుండెనా? లేక, జలముగ నుండెనా? ప్రకాశముగ నుండెనా? లేక, యంధకారముగ నుండెనా? అను మొదలగుననేకప్రశ్నలను వేయుటలో వాదము పెట్టుకొనక, యొక్కపరి యీయన్నింటికంటె మున్ను పసిగిడి యీఋషి విచారించున దేమియనఁగా: "సత్-అసత్, మర్త్యము-అమరము, అంధకారము-వెల్తురు, ఆచ్ఛాదించునది - ఆచ్ఛాదింపఁబడునది, సుఖ మిచ్చునది-సుఖ మనుభవించునది, అను నీద్వైతము యొక్క-పరస్పరసాపేక్ష మగుభాష, దృశ్యసృష్టి నిర్మిత మైనతరువాతిదియే యగుటచే సృష్టియందలి యీద్వంద్వములు పుట్టుటకుముందు (అనఁగా: ఒకటి-రెండను భేదములు లేనప్పుడు) ఎవరు నెవరి నాచ్ఛాదింతురు? కావున మూలారంభమునందున్న యేకవిధమగు ద్రవ్యమే 'సత్' అనియు, లేక, 'అసత్' అనియు, ఆకాశము, లేక, జలమనియు, ప్రకాశము, లేక, యంధకార మనియు, అమృతము, లేక, మృత్యువు మొదలగుపరస్పరసాపేక్ష మగు నేపే రిడుటకును యోగ్యము కానేరదు. ఉండున దేదియో నది సర్వ పదార్థములకంటె విలక్షణ మగుటచే నది యేకాకిగనే యారంభమున తనయపారమగుశక్తిచే నలుదిక్కులయందు స్ఫురించుచుండెను. దానితో సమాన మయినది, లేక, దాని నాచ్ఛాదించున దేదియు రెండవది లేదు." అని యీసూక్తముయొక్క-ఋషి ప్రారంభముననే నిర్భయముగఁ జెప్పుచున్నాఁడు. రెండవఋక్కునందు 'ఆనీత్' అను క్రియాపదమునందున్న 'అన్'ధాతువుయొక్క-యర్థము శ్వాసోచ్ఛ్వాసములఁ జేయుట, లేక, స్ఫురణను బొందుట యని యగుటచే, ప్రాణశబ్ద మీధాతువువలననే వెలువడినది. కాని యేది 'సత్తు'ను 'అసత్తు'ను కానేరదో, అది సజీవప్రాణులవలె శ్వాసోచ్ఛ్వాస

ములను జేయు చున్నదనిమాత్ర మెవరు సెప్పఁగలరు?. మఱియు శ్వాసోచ్ఛ్వాసములను నడుపుటకు వాయు వైన నెక్కడనుండి వచ్చును? కావున 'అనీత్' అనుపదమునకే 'అవాతం'=వాయువు లేనిదియే, 'స్వధయా' = స్వీయ మగుమహిమచే, యనుపదములను జతపఱచుటచే జగత్తుయొక్క మూలతత్త్వము జడము కాదను నీయద్వైతావస్థయం దున్నయర్థము, "అది యొకవాయువు దక్క (అనఁగా: వాయ్వపేక్షలేక,) స్వశక్తిచేతనే శ్వాసోచ్ఛ్వాసములఁ జేయుచున్నది." అని ద్వైతమును బోధించునవిపరీ నుండుమాటలతో మిక్కిలి యుక్తిగ వర్ణిత మయ్యెను. మఱియుం దానిజూడఁగనే కాన్పించువిరోధమంతయు నాయద్వైతతత్త్వము బోధించుశబ్దములందలియసామర్థ్యముచే వెలఁపడినది. "నేతి నేతి" "ఏకమేవాద్వితీయం," లేక, "స్వే మహిమ్ని ప్రతిష్ఠితః" (ఛాం ౭. ౨౪. ౧), —తనయొక్క మహిమచేతనే (అనఁగా: నితరాపేక్షలేకయే,) యేకాకిగనే యుండువాఁడు.—ఈమొదలగునుపనిషత్తులం దున్నపరబ్రహ్మవర్ణన యంతయు నీయర్థమునే బలపఱచునదిగ నున్నది. సర్వసృష్టియొక్క మూలారంభమున, ఏయనిర్వాచ్యతత్త్వము నలుగడల స్ఫురించుచుండె నని యీసూక్తమునఁ జెప్పఁబడినదో, యదియే సర్వదృశ్యసృష్టియొక్క ప్రళయమగునప్పుడు సైత మవశిష్టముగ నుండు నని స్పష్ట మగుచున్నది. కావున గీతలయందు, "సర్వపదార్థములు నశించినను నేది నాశ మొందదో" (గీ. ౮. ౨౦) అని యీపరబ్రహ్మమే కొన్నిపర్యాయపదములచే వర్ణిత మైనది. మఱియు "అది సత్తుగా నేరదు, అసత్తును గా నేరదు" (గీ. ౧౩. ౧౨) అని యీసూక్తము నాధారముగఁ గైకొని స్పష్టముగఁ జెప్పఁబడినది. కాని నిర్గుణపరబ్రహ్మముతప్ప రెండవపదార్థ మేమియు లేనియెడల "ఆరంభమున జలము, అంధకారము, లేక, అభువు, తుచ్ఛము ననువానియొక్క ద్వంద్వ ముండెను." అను మొదలగువర్ణన వేదాంతమం దుండుటచే నందులకు వ్యవస్థ యెటులఁ జేయనగు ననుశంక పొడమును. కావున మూఁడవఋక్కులో నీకవి "జగదారంభమున నంధకారముండెను, లేక, యంధకారాచ్ఛాదిత మగుజల ముండెను, లేక, అభువు (బ్రహ్మము), దాని నాచ్ఛాదించుమాయయు(తుచ్ఛము) నను నీరెండును ప్రారంభమునందుండియున్నవి."యని చెప్పియున్నాఁడు.ఇవి యంతయు నేకాకియు నేకవిధము నగుమూలపరబ్రహ్మముయొక్క తపోమహిమచేతనే క్రమక్రమముగ వివిధసంసారము నుత్పన్నమైనపిదప యొనర్చినవర్ణనగ నున్నది. కేవలమూలారంభప్రతిపాదకము కానేరదు. ఈఋక్కునందపశబ్దముచే మూలపరబ్రహ్మముయొక్క జ్ఞానమయమగు

విలక్షణశక్తి వివక్షిత మగుచున్నది. ఈశక్తియే నాలుగవబుక్కున వర్ణింపఁబడెను. (ము౦.౧.౧.౫. చూడుము) కావున, "ఏతావానస్య మహిమా ఽతో జ్యాయాం శ్చ పూరుషః" (ఋ. ౧౦.౯౦. ౩)అనున్యాయానుసారముగ నీసర్వసృష్టి యనునది యెవరి మహిమయో యామూలద్రవ్య మీయన్నింటికంటె ,పరముగను శ్రేష్ఠముగను భిన్నముగనున్న దని మరల చెప్పనక్కఱ లేదు. కాని, చూడఁదగినవస్తువు-చూచువాఁడును, భోక్త-భోగ్యము, ఆచ్ఛాదకము-ఆచ్ఛాద్యము, తమస్సు-వెలుతురు, మర్త్యము-అమరము మొదలగుసర్వద్వైతము నీతీరుననే యొక పర్యాయమే పుట్టించి యేకము, నిర్భయము, చిద్రూపము, విలక్షణము నగు పరబ్రహ్మమే మూలారంభమున నున్న దని నిశ్చయించినను, ఈయనిర్వాచ్యము, నిర్గుణము, నేకము నగుతత్త్వమునుండి, యాకాశము, జలము, మొదలగు ద్వంద్వాత్మకము, వినాశి, సగుణము, నామరూపాత్మకము నగువివిధసృష్టిగాని, లేక, యీసృష్టికి మూలభూతక మగుత్రిగుణాత్మకప్రకృతి గాని, యెటు లుత్పన్నమయి నదియు చెప్పవలసినసమయము తటస్థింపఁగనే, మనస్సు, కామము, అసత్తు, సత్తు, అని యిట్టిద్వైతభాషయే యీఋషి యోచింపవలసియుండుటచే దద కీవిషయము మనుష్యబుద్ధికి గోచర మగుదానికంటె పరమం దున్న దని యీఋషి స్పష్టముగఁ జెప్పు చున్నాఁడు. నాల్గవబుక్కునం దీమూలబ్రహ్మమే యసత్తుగఁ జెప్పఁబడినది; కాని దాని 'కేమిలే'దని యర్థము కానేరదు. కారణ మేమనఁగా: రెండవబుక్కునందే 'యది యున్న'దని స్పష్టముగఁజెప్పఁబడినది.ఈసూక్తమునసేకాక,మఱియొక స్థలమునందును, దృశ్యసృష్టిని యజ్ఞముతోఁ బోల్చి, 'యీయజ్ఞ మొనర్చుటకు వలయు నాజ్యము సమిధలు మొదలగుసామగ్రి ప్రారంభము నెచ్చో నుండివచ్చి నది?' (ఋ. ౧౦. ౧౩౦. ౩) అనియు, గృహదృష్టాంతమును గైకొని 'మూలమగు నొకనిర్గుణమువలన నేత్రములకు బ్రత్యక్షముగఁ గాన్పించునదియు, నాకాశపృథ్వీరూపమగునదియు నగు నీభవ్యమగునింటిని నిర్మించుటకు కలప (మూలప్రకృతి) యెచ్చోనుండి కైకొనఁబడినది?' అనియు—కిం స్విద్వనం క ఉ స వృక్ష ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః—అనివ్యావహారికభాషను స్వీకరించియే ఋగ్వేదమునందును, వాజసనేయసంహితయందును గూఢములగుప్రశ్నలు వేయఁబడినవి. (ఋ. ౧౦. ౩౧. ౭; ౧౦.౮౧.౪; వాజసం. ౧౭ ౨౦). ఈయనిర్వాచ్యము, ఏకాకియు, నేకమునగు బ్రహ్మముయొక్కమనస్సునందే 'సృష్టినిర్మింపవలయు' నని'కామ'రూపమగుతత్త్వ మెటులో పుట్టె ననియు, వస్త్రములో నున్ననూలుపోఁగులవలెను, సూర్యప్రకాశమువలెను, దానియొక్కశాఖయే (అనఁగా: అంశమే) బయల్పడి

యంతటను (అనఁగా: క్రిందను పైనను నలుగడల) వ్యాపించి 'సత్తు'యొక్క సర్వ వ్యాపనమును (అనఁగా: ఆకాశపృథ్వ్యాలనెడుభవ్యమగుగృహము) నెట్లు నిర్మించిన దియు నీసూక్తములో నాల్గవ, యేడవఋక్కులయందుఁ (వాజస. సం. ౩౩. ౭౪.) జెప్పఁబడినది. అంతకన్న విశేషముగ సమాధానముఁ జెప్పుటకు సాధ్యముకానేరదు. కావున నీసూక్తమందలియర్థమునే యుపనిషత్తులలోను "సోఽకామాయత బహు స్యాం ప్రజాయేయేతి" (తై. ౨. ౬; ఛాం ౬. ౨-౩)— ఈపరబ్రహ్మమునకే యనేక మగుదు నని యిచ్ఛ పొడమినది—అనియు జలపఱుపఁబడినది. (బృ. ౧.౪. చూ.) అథర్వవేదమందును నీసర్వదృశ్యసృష్టికిని మూలభూత మగు ద్రవ్యమునందుండి యే ప్రారంభమున 'కామము' వెలువడినట్లు వర్ణిత మైనది. (అథర్వ. ౯. ౨. ౧౯) కాని "నిర్గుణమునుండి సగుణముయొక్కయు, అసత్తునుండి సత్తుయొక్కయు, నిర్ద్వంద్వమునుండి ద్వంద్వముయొక్కయు, లేక, యసంగమునుండి సంగము యొక్కయు నుత్పత్తి యెటు లగునో యావిషయము మనుష్యబుద్ధి కగమ్యముగ నుండుటచే సాంఖ్యులవలె కేవలతర్కవశుఁడై మూలప్రకృతివలె రెండవస్వయం భువును స్వతంత్రము నగుతత్త్వ మని యంగీకరింపక యేది తెలియదో దానినె యుంగ నని చెప్పుము. కాని దానికొఱకు శుద్ధబుద్ధిచేతను, ఆత్మానుభవముచేతను, నిశ్చిత మగుననిర్వాచ్యబ్రహ్మముయొక్కయోగ్యతను దృశ్యసృష్టిరూప మగుమాయ కు నిచ్చి పరబ్రహ్మవిషయ మగునద్వైతబుద్ధిని వదలుట న్యాయము కానేర"దని యీ సూక్తఋషి ప్రతిపాదించుచున్నాఁ డనునదియె యీసూక్తమునందలివిశేషము. ఇంతియె కాక ప్రకృతి యనునది త్రిగుణాత్మక మగురెండవస్వతంత్రపదార్థ మని యంగీకరించినను,దానియందుండి సృష్టినిర్మాణ మగుటకు తొలుత బుద్ధిగాని(మహత్తు) లేక,యహంకారము గాని యెట్లుత్పత్తియయ్యె ననుప్రశ్నకు నుత్తరమిచ్చుట సాధ్య ము కానేర దని యెఱుంగవలయును. మఱియు నీదోష మెప్పటికైనను వదలని యెడల ప్రకృతి స్వతంత్ర మని యంగీకరించుటలో లాభ మేమి? మూలబ్రహ్మము నందుండి ప్రకృతి(అనఁగా: సత్తు) యెట్లు నిర్మిత మయినదో తెలియ దని యందు మేని చాలును. దానికొఱకు ప్రకృతి స్వతంత్రమని యంగీకరించుట యావశ్య కము కానేరదు. మనుష్యబుద్ధికి సాధ్యము కా దన నేల ? దేవతలకును సత్తుయొక్క యుత్పత్తి యెట్లని యెఱుంగుటకు శక్యము కాదు. కారణ మేమియన: దేవతలును దృశ్యసృష్టి యారంభ మైనపిదపఁ బుట్టినవారె యగుటచే, వారియుత్పత్తికంటెఁ బూర్వమున నున్నపదార్థము వారి కెట్లు తెలియును ? (గీ. ౧౦.౨. చూ.) దేవతల

కంటెను హిరణ్యగర్భుఁడు పూర్వుఁడును, శ్రేష్ఠుఁడు నగుటచే నతఁ డొకఁడే యా
రంభమున “భూతస్య జాతః పతి రేక ఆసీత్” (ఋ. ౧౦.౧౨౧. ౧)—సర్వసృష్టి
కిని పతి(అనఁగా: రాజు, లేక, యధ్యక్షుఁడు)యైయుండెను—అని ఋగ్వేదమునందు
చెప్పఁబడినది. “అతని కీవిషయ మేలయెఱుక పడదు? తెలియు నేని యది దుర్బోధ
మని యెట్లు చెప్ప నగు?” నని యెవరయిన నడిగెదరు. కావున నీప్రశ్నకు “అగును.
అతఁ డీవిషయమును తెలిసికొని యుండును” అని తొలుత గౌణముగ నుత్తరమిచ్చి,
వెంటనే “తెలియకుండ సైత ముండవచ్చును? ఎవరు చెప్పఁగలరు?” అని యుత్త
రము సందిగ్ధముగఁ జెప్పుదురు. కారణ మేమియన: “పరమాకాశమున నుండువాఁ
డైనను నతఁడు సైతము సత్తుయొక్క కోటిలోఁ జేరినవాఁడే యగుటచే, సత్, అస
త్, ఆకసము, జలము ననువీనికంటె సైతము పూర్వమున నుండువిషయములయొక్క
నిశ్చితజ్ఞాన మీజగదధ్యక్షుని కెచ్చోనుండి కలుగును?” అని తనబుద్ధిచేతనే బ్రహ్మ
దేవుని జ్ఞానసాగరముయొక్క లోఁతును కనుగొన్నయీఋషి యాశ్చర్యముచే
సాశంకముగఁ జెప్పుచున్నాఁడు; కాని యొకయసత్తునకే (అనఁగా: అవ్యక్తము
నిర్గుణము నగుద్రవ్యమునకే) వివిధనామరూపాత్మకమగుసత్తుయొక్క (అనఁగా:
మూలప్రకృతియొక్క) సంబంధ మెట్లు కలిగినదియు తెలియకపోయినను మూల
బ్రహ్మ మొక్కటియే యనుతనయద్వైతబుద్ధిని మాత్రము వదలఁడు. అచింత్యవస్తు
వనుగహనమున మనుష్యబుద్ధి, సాత్త్వికశ్రద్ధయొక్కయు నిర్మల మగుప్రతిభయొ
క్కయు బలముతో సింహమువలె నిర్భయముగ సంచరించి దానియందలి యత
ర్క్యవిషయములను యథాశక్తిగ నెట్లు నిశ్చయింపవలయునో యెఱుంగుట కిది
యొకగొప్పయుదాహరణము గాన ఋగ్వేదమునం దీసూక్త ముండుట నిజముగనే
యాశ్చర్యకరముగ నున్నది. ఈసూక్తమునం దున్నవిషయమును తొలుత బ్రాహ్మణము
నందును, (తైత్తి. బ్రా. ౨. ౮. ౯), ఉపనిషత్తులయందును, పిదప వేదాన్తశాస్త్ర
గ్రంథములయందును, మనదేశమందున్నవారిచేతను, నర్వాచీనకాలమందు పాశ్చా
త్యదేశములయం దున్నకాంటు మొదలగుతత్త్వజ్ఞానులచేతను బహుసూక్ష్మముగ
విచారింపఁబడినది; కాని ఋషియొక్క శుద్ధబుద్ధి కీసూక్తమున నేపరమసిద్ధాం
తము స్ఫురించినదో యాసిద్ధాంతము నే ప్రతిపక్షులకు వివర్తవాదమువంటి యోగ్య
మగునుత్తరము నిచ్చుటకై మిక్కిలిదృఢ మగుదానిగను, స్పష్ట మగుదానిగను,
తర్కదృష్టిచే నిస్సందేహ మగుదానిగను చేయుటకంటె నెక్కువగ నేఁటివఱకు నెవ్వ
రును కార్య మొనర్చి యుండలేదు. ఇంతకంటె నెక్కువగఁ దెలిసికొనవలయు
ననుపేరాశయు నుండఁదగదు.

మగు విభూతియు, యోగము. ఈశ్వరునియందుండియే బుద్ధ్యాదిభావములు, సప్తఋషులును, మనువును, మఱియుఁ బరంపరగా నందఱుపుట్టుట. ౭-౧౧. ఈయనుఁ దెలిసికొనిన భక్తులకు జ్ఞానము లభించును. దానికైనను బుద్ధిసిద్ధిని భగవంతుఁడే యిచ్చుచున్నాఁడు. నీయొక్క విభూతిని యోగమునుఁ జెప్పుమని యర్జునుఁడు భగవంతుని ప్రార్థించుట. ౧౨-౧౮. భగవంతునియొక్క యనంతము లగు విభూతులలోఁ గొన్నికొన్ని విభూతులను వర్ణించుట. ౧౯-౪౦. విభూతిగలదియు, శ్రీమంతమును నూర్జితము నయినదెల్ల పరమేశ్వరునియొక్క తేజస్సును అంశమునై యున్నది. ౪౧-౪౨.

(పుట. ౧౦౩౩——౧౦౫౭)

.... .... ....

## పదునొకండవయధ్యాయము - విశ్వరూపదర్శనయోగము.

౧-౪. వెనుకటి యధ్యాయముఁ జెప్పినటులఁ దనకు నీశ్వరరూపమునుఁ జూపుమని భగవంతునిఁ బ్రార్థించుట. ౫-౮. నీయాశ్చర్యకారకమును దివ్యమునగు నీ రూపమునుఁ జూచుటకై యర్జునునకు దివ్యదృష్టిని జ్ఞానము నిచ్చుట. ౯-౧౪. విశ్వరూపమును సంజయుఁడు వర్ణించుట. ౧౫-౩౧. విస్మయముతోను, భీతితోను నమ్రుఁడై యర్జునుఁడు విశ్వరూపమును స్తుతించుట; ప్రసన్నుఁడవై నీవెవరవో చెప్పుమని ప్రార్థించుట. ౩౫-౪౬. అర్జునునిచేఁ జేయఁబడినస్తుతి; క్షమార్పణయు ప్రాచీన మగు సౌమ్యరూపమునుఁ జూపింపుమని ప్రార్థన. ౪౭-౫౧. విశ్వరూపమునుఁ జూచుటకు అనన్యభక్తిదక్క మఱియొకవిధమున నశక్యమనుటయు ౫౨-౫౪. మఱల వెనుకటిరూపమును ధరించుట. విశ్వరూపదర్శనము భక్తిలేనిది దేవతలకును నశక్యము. ౫౫. కావున భక్తితో నిస్సంగుఁడవు నిర్వైరుఁడవునై, పరమేశ్వరార్పణబుద్ధితోఁ గర్మలనుఁ జేయుమని సర్వార్థసారభూతమగు నుపదేశమును తుదకు నర్జునునకుఁ జేయుట.

(పుట. ౧౦౫౮——౧౦౭౫)

## పండ్రెండవయధ్యాయము - భక్తియోగము.

౧. పూర్వాధ్యాయమునందలి సారభూతమగునుపదేశమునుఁ గూర్చి యర్జునుఁడు ప్రశ్నఁ జేయుట... వ్యక్తోపాసన శ్రేష్ఠమా? అవ్యక్తోపాసన శ్రేష్ఠమా? ౨-౮. ఈ రెండు మార్గములగతియు నొక్కటియే కాని యవ్యక్తోపాసన క్లేశదాయకమైనది. మఱియు వ్యక్తోపాసన సులభమైనది. త్వరలో ఫలము నిచ్చునది. ఆకారణమున నిష్కామకర్మపూర్వక మగు వ్యక్తోపాసనను చేయుమని యుపదేశించుట. ౯-౧౨. భగవంతుని యందు చిత్తమును స్థిరముగ నుంచెడి యభ్యాసము. జ్ఞానము, ధ్యానము మొదలగు నుపాయములును వానియందు కర్మఫలత్యాగము శ్రేష్ఠము. ౧౩-౧౯. భక్తియుక్తుఁడగుపురుషుని స్థితిని వర్ణించుటయు, భగవత్ప్రియత్వమును. ౨౦. ఈధర్మము నాచరించు శ్రద్ధాళువు లగుభక్తులు భగవంతున కత్యంతప్రియులు. (పుట. ౧౦౭౬--౧౦౮౬)

## పదుమూఁడవయధ్యాయము - క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము.

౧. ౨. క్షేత్రముయొక్కయు క్షేత్రజ్ఞునియొక్కయు వర్ణనము. వానినిఁ దెలిసికొనుటయే పరమేశ్వరునియొక్క జ్ఞానము. ౩-౪. ఉపనిషత్తులయందును బ్రహ్మసూత్రములయందును నున్న క్షేత్రక్షేత్రజ్ఞవిచారము. ౫-౬. క్షేత్రస్వరూపలక్షణము. ౭-౧౧. జ్ఞానముయొక్క స్వరూపలక్షణము. తద్విరుద్ధమైనది యజ్ఞానము. ౧౨-౧౭. జ్ఞేయముయొక్క స్వరూపలక్షణము. ౧౮. ఇదంతయుఁ దెలిసికొనినందులకు ఫలము. ౧౯-౨౧. ప్రకృతిపురుషులవివేకము. ప్రకృతి కర్త్రి, పురుషుఁడు అకర్తయైనను, భోక్తయు, ద్రష్టయు నైనవాఁడు. ౨౨-౨౩. పురుషుఁడే యీదేహమందున్న పరమాత్మ. ఈ ప్రకృతిపురుషజ్ఞానముచే పునర్జన్మ నశించును. ౨౪-౨౫. ఆత్మజ్ఞానముయొక్క మార్గము—ధ్యానము, సాంఖ్యయోగము, కర్మయోగము, శ్రద్ధాపూర్వక మగుశ్రవణముచే భక్తియు. ౨౬-౨౮. క్షేత్రక్షేత్రజ్ఞసంయోగముచే స్థావరజంగమసృష్టియు, దానియందవినాశియైనవాఁడే పరమేశ్వరుఁడు. స్వప్రయత్నముచే తత్ప్రాప్తియు. ౨౯-౩౦. ప్రకృతి కర్త్రి ఆత్మ అకర్త; సర్వభూతము లొకనియందే యున్నవనియు నొకనివలననే సర్వభూతములు బయల్పడుచున్నవనియుఁ దెలిసికొందున బ్రహ్మప్రాప్తి. ౩౧-౩౩. ఆత్మ అనాదియు నిర్గుణమును, ఆహేతువుచేతనే క్షేత్రమునకుఁ బ్రకాశమయినను నిర్లేపము. ౩౪. ఈ క్షేత్రక్షేత్రజ్ఞభేదజ్ఞానముచే పరమసిద్ధి. (పుట. ౧౦౮౭—౧౧౦౪)

## పదునాల్గవయధ్యాయము - గుణత్రయవిభాగయోగము.

౧-౨. జ్ఞానవిజ్ఞానాంతర్గతమైన ప్రాణివైచిత్ర్యమును గుణభేదముచే విచారించుట. ఇదియును మోక్షప్రదము. ౩-౪. ప్రాణుల కన్నిఁటికిని పరమేశ్వరుఁడు తండ్రియుఁ దదధీన మగుప్రకృతి తల్లియు. ౫-౯. సత్త్వము, రజస్సు, తమస్సు అనునవి సర్వప్రాణులకునుఁ గలుగు పరిణామము. ౧౦-౧౩. కేవల మొక్కొక్క గుణమేయుండుటకు వీలులేదు. ఏరెండింటినో యణఁగఁద్రొక్కి మూఁడవది బయలుదేరుటయుఁ బ్రతిగుణముయొక్కయు వృద్ధి లక్షణములును ౧౪-౧౮ గుణప్రవృద్ధినిఁ బట్టి కర్మలయొక్క ఫలములును మరణానంతరమునఁ గలుగుగతియు. ౧౯-౨౦. త్రిగుణాతీతుఁ డగునేని మోక్షప్రాప్తి. ౨౧-౨౫. అర్జునుని ప్రశ్ననుబట్టి త్రిగుణాతీతుని లక్షణములను ఆచారములను వర్ణించుట. ౨౬-౨౭. ఏకాంతభక్తితోఁ ద్రిగుణాతీతము సిద్ధించుట. పిదప మోక్షమునకును, ధర్మమునకును, చరమస్థాన మగుపరమేశ్వరుని ప్రాప్తి. (పు. ౧౧౦౫—౧౧౧౩)

## పదునైదవయధ్యాయము - పురుషోత్తమయోగము.

౧-౨. అశ్వత్థరూప మగుబ్రహ్మవృక్షమునకు, వేదోక్తములును సాంఖ్యో

క్తములు నయినవర్ణనలను నిరూపించుట. ౩-౬. అసంగశస్త్రముతో దీనిని ఛేదించుట. ఇదియే దానికి పరమం బున్నయవ్యయపదప్రాప్తికి మార్గము. అవ్యయపదవర్ణనము. ౭-౧౧. జీవముయొక్కయు, లింగశరీరముయొక్కయు స్వరూపమును సంబంధమును నేర్పరికి గోచరమగును. ౧౨-౧౫. పరమేశ్వరుని సర్వవ్యాపిత్వము. ౧౬-౧౮. క్షరాక్షరలక్షణములు. వానికిఁ బరమందున్న పురుషోత్తముఁడు. ౧౯-౨౦. ఈగుహ్యమగుపురుషోత్తమజ్ఞానముచే సర్వజ్ఞతయుఁ గృతకృత్యతయు.
.... .... .... (పుట. ౧౧౧౪—౧౧౨౭)

## పదునాఱవయధ్యాయము - దైవాసురసంపద్విభాగయోగము.

౧-౩. దైవసంపదయొక్క యిరువదియాఱుగుణములు. ౪. ఆసురీ సంపదయొక్కలక్షణములు. ౫. దైవీసంపద మోక్షకారకమును, ఆసురీసంపద బంధకారకమును. ౬-౨౦. అసురులను విస్తారముగ వర్ణించుట. వారికిఁ బ్రతిజన్మయందును నధోగతి. ౨౧-౨౨. నరకమునకుఁ ద్రివిధమగుద్వారము. కామము, క్రోధము, లోభము, వీనిని వర్జించుటచే కల్యాణ మగును. ౨౩-౨౪. శాస్త్రానుసారముగ కార్యాకార్యనిర్ణయమునుఁజేసి, అతీరున నాచరించుటకై యుపదేశము. (పుట. ౧౧౨౮—౧౧౩౭)

## పదునేడవయధ్యాయము - శ్రద్ధాత్రయవిభాగయోగము.

౧-౪. అర్జునుని ప్రశ్నలనుఁబట్టి ప్రకృతిస్వభావానురూపమగు సాత్త్వికాదిత్రివిధశ్రద్ధలను వర్ణించుట. ఎట్టిశ్రద్ధయో యట్టిపురుషుఁడు. ౫-౬. అసురమంతకంటె భిన్నమయినది. ౭-౧౦. సాత్త్వికమును, రాజసమును, తామసమును నయిన యాహారము. ౧౧-౧౩. త్రివిధములగు యజ్ఞములు. ౧౪-౧౬. శారీరము, వాచికము, మానసికమునగు తపస్సులయొక్క మూఁడుభేదములు. ౧౭-౧౯. వీనిలోఁ బ్రత్యేకము సాత్త్వికాదిభేదముచే త్రివిధము. ౨౦-౨౨. సాత్త్వికాది త్రివిధదానములు. ౨౩. ఓం తత్ సత్ అనుబ్రహ్మనిర్దేశము. ౨౪-౨౭. వీనిలో ఓం అనుశబ్దము ఆరంభసూచకమును, తత్ అనునది నిష్కామసూచకమును, సత్ అనునది ప్రశస్తమైన కర్మయని చెప్పఁబడినది. ౨౮. అవశిష్టమయినది అనఁగా: నసత్తు ఇహపరలోకములయందలి నిష్ఫలమైనది. (పుట. ౧౧౩౮—౧౧౪౯)

## పదునెనిమిదవయధ్యాయము - మోక్షసన్న్యాసయోగము.

౧-౨. అర్జునుని ప్రశ్నానుసారముగ సన్న్యాసత్యాగశబ్దములకు కర్మయోగమార్గానుసారముగ వివరణము. ౩-౬. కామముల త్యజించువిషయమై నిర్ణయము. యాగాదికర్మలునైన మితరములగు కర్మలవలె నిస్సంగబుద్ధితో నవశ్యముఁ

జేయవలయును. ౭-౯. కర్మత్యాగము సాత్త్వికమనియు, రాజసమనియు, తామసమనియు మూఁడువిధములైనది. వీనిలో ఫలాశనువదలి కర్తవ్యకర్మముగ జేయుటయే సాత్త్వికత్యాగము. ౧౦-౧౧. కర్మఫలత్యాగమునకే సాత్త్వికత్యాగమని పేరు. కారణ మేమనగా: కర్మయెవ్వరిని వదలదు. ౧౨. కర్మయొక్క త్రివిధమగు ఫలమును సాత్త్వికత్యాగికి బంధకము కానేరదు. ౧౩-౧౫. ఏకర్మసంఘటిల్లుటకును అయిదుకరణములు. ఒకమనుష్యుఁడే కాదు. ౧౬-౧౭. కావున నేను చేయుచున్నా ననునహంకారబుద్ధి వదలిపోవునేని, చేసియు నలిప్తుఁ డగుచున్నాఁడు. ౧౮-౧౯. కర్మచోదనయొక్కయుఁ గర్మసంగ్రహముయొక్కయు, సాంఖ్యోక్తములగు లక్షణములనుఁ త్రైవిధ్యమును. ౨౦-౨౨. జ్ఞానము సాత్త్వికాదిగుణభేదముచేఁ త్రివిధము. "అవిభక్తం విభక్తేషు" అనునది సాత్త్వికము. ౨౩-౨౫. కర్మయొక్క త్రైవిధ్యము, ఫలాశారహిత మగుకర్మము సాత్త్వికము. ౨౬-౨౮. కర్తలయొక్క త్రైవిధ్యము. నిస్సంగుఁ డగుకర్త సాత్త్వికుఁడు. ౨౯-౩౨. బుద్ధియొక్క త్రైవిధ్యము. ౩౩-౩౫. ధృతియొక్క త్రైవిధ్యము. ౩౬-౩౯. సుఖముయొక్క త్రైవిధ్యము. ఆత్మబుద్ధిప్రసాదజము సాత్త్వికము. ౪౦. జగత్తు కంతకును గుణభేదముచేఁ త్రైవిధ్యము. ౪౧-౪౪. చాతుర్వర్ణ్యమునకు గుణభేదముచే నుపపత్తి. బ్రాహ్మణునకు, క్షత్రియునకు, వైశ్యునకు, శూద్రునకు స్వభావజన్యములగుకర్మలు. ౪౫-౪౬. చాతుర్వర్ణ్యవిహిత మగు స్వకర్మాచరణముచేతనే తుదకు సిద్ధి. ౪౭-౪౯. పరధర్మాచరణము భయావహము. స్వకర్మము దోషసహితమయినను త్యాజ్యము కాదు. స్వధర్మానుసారముగఁ గర్మలను నిస్సంగబుద్ధితోఁ జేయుటచేతనే నైష్కర్మ్యసిద్ధి. ౫౦-౫౬. సర్వ కర్మలనుఁజేసినను సిద్ధి యెట్లులభించునో నిరూపించుట. ౫౭-౫౮. ఈమార్గమునే స్వీకరించువిషయమై అర్జునున కుపదేశించుట. ౫౯-౬౩. ప్రకృతిధర్మముముం దహంకారము నిలువలేదు. ఈశ్వరునే శరణుఁబొందవలయును. ఈగుహ్యమును తెలిసికొని నీ మనస్సువచ్చినట్లు ప్రవర్తింపుము" అని యర్జునున కుపదేశించుట. ౬౪-౬౬. సర్వధర్మములను వదలి "నన్ను శరణుఁబొందుము వేని సర్వపాపములనుండియు నిన్ను నేను తరింపఁ జేయుదును." అని భగవంతుఁడు చిట్టచివరకుఁ జేసినయూరడింపు. ౬౭-౬౯. కర్మయోగమార్గపరంపరను ప్రచారములోనుంచుట శ్రేయస్కరము. ౭౦-౭౧. దానిఫలశ్రుతి. ౭౨-౭౩. కర్తవ్యమోహము నశించినందున నర్జునుఁడు యుద్ధమునకు సన్నద్ధుఁ డగుట. ౭౪-౭౮. ధృతరాష్ట్రునకీ కథను చెప్పి సంజయుఁ డుపసంహారముఁ జేయుట. (పుట. ౧౧౫౦—౧౧౭౮)

# శ్రీమద్భగవద్గీతా.

## ప్రథమోఽధ్యాయః.

### ధృతరాష్ట్ర ఉవాచ.

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ. ౧

### మొదటియధ్యాయము.

[భారతయుద్ధారంభమున శ్రీకృష్ణుఁ డర్జునున కుపదేశించినగీత లోకములో నెట్లు ప్రచారము (వాడుక)లోనికి వచ్చెనో విచారింతము. యుద్ధారంభమున వ్యాసులు ధృతరాష్ట్రునియొద్ద కేఁగి "యుద్ధమును జూడవలయు నను కోరిక నీకుం డె నేని దృష్టి నిచ్చెదను, జూడుము" అని చెప్పె ననియు, "నాకంటితో నాకుల క్షయమును జూచుటకు నిచ్ఛగింపను" అని ధృతరాష్ట్రుఁడు చెప్పెననియు, అప్పుడు వ్యాసులు సంజయుఁడను పేరుగలసూతునకుం గూర్చుండిన ప్రదేశముననె ప్రత్యక్షముగ నిఖిలజ్ఞానమును గలుగఁజేయునది యగు దివ్యదృష్టి నిచ్చి "ధృతరాష్ట్రునకు యుద్ధవిషయమును జెప్పుము" అని నియమించి తనయాశ్రమమున కేఁగె ననియు (మ.భా.భీష్మ.౨), వారియాజ్ఞానుసారముగ మొదట యుద్ధమునందు భీష్ములు పరాజితులైరని సంజయుఁడు సెప్పఁగా నాతఁడు భీష్మునివిషయమై శోకించి "యుద్ధమందు జరిగినవిషయ మంతయుఁ జెప్పుము" అని సంజయు నడిగె ననియు, సంజయుఁడు మొదట నుభయపక్షములయందున్న సైన్యమును వర్ణించి పిదప ధృతరాష్ట్రుని ప్రశ్నానుసారముగ గీతను జెప్పుటకు ప్రారంభించె ననియు, ఈవిషయము నె పిమ్మట వ్యాసులు తనశిష్యులకును, అనంతరమున నాశిష్యులలో వైశంపాయను లను వారు జనమేజయునకును, తుదకు సౌతి యనునాతఁడు శౌనకునకును జెప్పి రనియు నీవిషయము భారతమునఁ జెప్పఁబడినది. ముద్రింపఁబడిన మహాభారతప్రతు లన్నింటియందును భీష్మపర్వమునందలి ౨౫ మొదలు ౪౨-వ యధ్యాయముచివర కును నీగీత సెప్పఁబడినది.—]

ధృతరాష్ట్రుఁ డడిగెను—(౧) సంజయా! కురుక్షేత్ర మనుపుణ్యభూమి

యందు గుమికూడిన నాకుమారులుఁ బాండురాజుకుమారులును యుద్ధముఁ జేయఁ దలఁచి యేమి చేసిరి ?

[హస్తినాపురముయొక్క నాలుగువైపులను నున్నసమప్రదేశమునకు కురుక్షేత్ర మని పేరు. ఇప్పటి డిల్లీపట్టణ మీ బయలునందే కట్టఁబడినది. కౌరవులకును బాండవులకును మూలపురుషుఁ డగుకురువను పేరిరాజీబయలును నాగలిచే చాల నాయాసపడి దున్నుచుండెను. కావుననే క్షేత్ర (చేను) మని చెప్పఁబడుచున్నది. పిదప నీక్షేత్రమునం దెవరు తపస్సు చేయుదురో, లేక, యుద్ధమునందు మృతినొందెదరో, వారు స్వర్గము నొందుదురని యింద్రుఁడు కురువునకు వరమిచ్చెను. పిదప నీక్షేత్రమును కురువు దున్నుట మాని వైచెనని మహాభారతమునం దొకకథ చెప్పఁబడినది. (మ. భా. శల్య. ౫౩). ఈయింద్రునివరముచేతనే యీక్షేత్రము ధర్మక్షేత్రము, లేక, పుణ్యభూమి యని చెప్పుచు వచ్చిరి. ఈప్రదేశమునందు పరశురాముఁ డిరువదియొక్కమారు రాజులఁ జంపి భూమిని క్షత్రియశూన్యముగఁ జేసి పితృతర్పణము చేసెనని యొకకథ కలదు. మఱియు తర్వాత సైత మీక్షేత్రమునందు గొప్పగొప్పయుద్ధములు జరిగెను.]

సంజయుడువాచ.

§§ దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా,
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. ౨

సంజయుఁ డనెను—(౨) అప్పుడు వ్యూహమున నమర్పఁబడిన పాండవసైన్యమును జూచి దుర్యోధనమహారాజు (ద్రోణ) ఆచార్యులయొద్ద కేఁగి యిట్లు చెప్పుటకు నారంభించెను.

[కౌరవులయొక్క సైన్యమును మొదట భీష్ములు వ్యూహముగ నిర్మింపఁగాఁ బాండవసైన్యము కౌరవసైన్యముకంటెఁ దక్కువయై యుండుటచే ధృష్టద్యుమ్నుఁడు యుద్ధశాస్త్రానుసారముగఁ దన సైన్యమును వజ్ర మనుపేరటి వ్యూహముగ నమర్చె నని మహాభారతమున గీతలకంటె వెనుకనున్న యధ్యాయమునఁ జెప్పఁబడినది. (మ. భా. భీ. ౧౯. ౪–౭; మను. ౭. ౧౯౧) పిదప యుద్ధమునందు ప్రతిదివసమునను నీవ్యూహములు మాఱుచుండెను.]

పశ్యైతాం పాండుపుత్త్రాణా మాచార్య మహతీం చమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్త్రేణ తవ శిష్యేణ ధీమతా. ౩
అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః. ౪
ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్,
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. ౫
యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః. ౬

(౩) ఓయాచార్యా! నీశిష్యుఁడును బుద్ధిమంతుఁడు నగు ధృష్టద్యుమ్నునిచే వ్యూహముగ రచింపఁబడిన పాండుపుత్త్రులయొక్క యీగొప్పసేనను జూడుము. (౪) ఈపాండవసైన్యమున శూరులును, మహాధనుర్ధరులును, యుద్ధము చేయుటలో భీమార్జునులతో సమానులు నగు యుయుధానుఁడును (సాత్యకి), విరాటుఁడును, మహారథుఁడగు ద్రుపదుఁడును, (౫) ధృష్టకేతువును, చేకితానుఁడును, వీర్యవంతుఁడగు కాశీరాజును, పురుజితుఁడును, కుంతిభోజుఁడును, నరశ్రేష్ఠుఁడగు శైబ్యుఁడును, (౬) ఇట్టిపరాక్రమమె గలిగిన యుధామన్యుఁడును, వీర్యశాలియగు నుత్తమౌజుఁడును, సుభద్రాపుత్త్రు (అభిమన్యు)ఁడును, ద్రౌపదియొక్క (ఏవురు) పుత్త్రులును, వీరందఱు మహారథులై యున్నారు.

[పదివేల ధనుర్ధరులగు యోధులతో నేకాకిగ యుద్ధము చేయువాఁడు మహారథుఁడని చెప్పఁబడును. రెండుపక్షములలో నున్న సేనలలో నెవరు రథికులో, యెవరు మహారథులో, యెవ రెవ రతిరథులో యుద్యోగపర్వము నందు ౧౬౪-వ యధ్యాయము మొదలు ౧౭౧-వ యధ్యాయమువఱకుం గల యెనిమిదియధ్యాయములయందుఁ జెప్పఁబడినది. ధృష్టకేతు వనువాఁడు శిశుపాలుని కుమారుఁ డనియు, పురుజిత్కుంతిభోజ పదములు రెండును నిరుపురపేళ్లు కావనియు, కుంతి, యేకుంతిభోజమహారాజునకు దత్తు యియ్యఁబడినదో యాతనికి పురుజి త్తనువాఁడు ఔరసుఁడనియు, కుంతిభోజ మనునది యతనియొక్క వంశనామమనియు, నతఁడు యుధిష్ఠిరభీమార్జునులకు మేనమామ యనియు నుద్యోగపర్వమునఁ జెప్పఁబడినది (మ. భా. ఉ. ౧౭౧. ౨). యుధామన్యుఁడును, ఉత్తమౌజుఁడును పాంచాల్యులు; చేకితానుఁ డనువాఁ డొకయాదవుఁడు; యుధామన్యుఁడును, ఉత్తమౌజుఁడును నర్జునునకు యుద్ధమందు చక్రరక్షకులుఁగ నుండిరి. శైబ్యుఁ డనువాఁడు శిబిదేశమునకు రాజు.]

అస్మాకం తు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తా న్బ్రవీమి తే. ౭
భవా న్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ. ౮
అన్యే చ బహవః శూరా మదర్థే త్యక్తజీవితాః,
నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః. ౯
అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,

(౭) ఓ ద్విజశ్రేష్ఠుఁడా! ఇఁక మనపక్షమున ప్రముఖులగు సేనానాయకులయొక్క పేళ్లను జెప్పుచున్నాను. సావధానముగ వినుము. (౮) నీవును, భీష్ముఁడును, కర్ణుఁడును, యుద్ధమందు జయము నొందు కృపాచార్యుఁడును, నశ్వత్థామయు, వికర్ణుఁడును (దుర్యోధనుని నూర్గురుసోదరులలో నొకఁడు), సోమదత్తుని కొమరుఁడును (భూరిశ్రవసు), (౯) వీరు గాక యింక నితరులగు ననేకులగు శూరులును, నావిషయమై ప్రాణముల నిచ్చుటకు సిద్ధులును, నానావిధములగు శస్త్రములచే యుద్ధము చేయువారును, యుద్ధమందు ప్రవీణులునై యున్నారు. (౧౦) ఇట్టి భీష్మరక్షితమగు మనసైన్యము, అపర్యాప్తము, అనఁగా: అపరిమితము; కాని భీమునిచే రక్షింపఁబడిన వారిసేన పర్యాప్తమై యున్నది, అనఁగా: పరిమితమైనది, లేక, లెక్కపెట్టశక్యమైనది.

[ఈశ్లోకమునందు పర్యాప్తాపర్యాప్తశబ్దములయొక్క యర్థమును గుఱించి మతభేదము కలదు. 'పర్యాప్త'శబ్దమునకు 'పరిపూర్ణ'మని యర్థము సామాన్యముగ నుండుటచే, 'పాండవులసైన్యము పూర్ణమైన' దనియు, 'మనసైన్యమపూర్ణము (అపర్యాప్తము)గ నున్న'దనియు, దుర్యోధనుఁ డనెనని యనేకు లర్థము చేయుచున్నారు; కాని యీ యర్థము బాగుగ లేదు. పూర్వమునం దుద్యోగపర్వములో ధృతరాష్ట్రునకు తనసైన్యమును వర్ణించి చెప్పుచు పైఁజెప్పఁబడిన ప్రముఖులగు సేనానాయకులనామములఁ జెప్పి "నాసైన్యము గొప్పది, గుణవంతము నగుటచే నాకే జయము కలుగును" అని దుర్యోధనుఁడు చెప్పెను (ఉ.౫౪. ౬౦-౭౦); అటులే భీష్మపర్వమునందును మొదట ద్రోణాచార్యులయొద్ద సైన్యమును వర్ణించుచు దుర్యోధనుఁడు గీతలలోనున్న పైశ్లోకమువంటి శ్లోకముల నియక్షరములతోడనే యుచ్చరించెను (భీష్మ.౫౧.౪-౬);మఱియు,సైన్యము నంతయు ప్రోత్సాహ

పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్.    ౧౦

పఱచు నిమిత్తమై హర్షముతో నిట్లు వర్ణించినందున నీస్థలమునందున్న యపర్యాప్తశబ్దమునకు "అమర్యాదితము, అపరిమితము, లేక, అగణితము" అని అర్థము చెప్పవలయును గాని మఱియొకయర్థము చెప్పఁదగదు. పర్యాప్త శబ్దమునకు "నాలుగుమూలలను (పరి) చుట్టుకొనుటకు యోగ్య మయినది (ఆప్=ప్రాపణే)" అని ధాత్వర్థము; కాని "ఈకార్యముకొఱకు పర్యాప్త మయినది", లేక, "ఇతనికి పర్యాప్త మయినది"యని యిట్లు పర్యాప్తశబ్ద మునకు పూర్వమందు చతుర్థ్యర్థకమగు మఱియొక పదమును ప్రయో గించితిమేని "ఆయాపనికి పూర్ణముగ నుండునది"యని కాని, లేక, "సమర్థ మైనది" యని కాని యర్థ మగును. 'పర్యాప్త'శబ్దమునకు పూర్వమునం దేమియు శబ్దము లేనిచో (అనఁగా: వెనుకపదములేని పర్యాప్తశబ్దమునకు) "పూర్ణము, పరిమితము, లెక్క పెట్టుటకు శక్యము" అని యర్థ మగును. ప్రకృతశ్లోకమునందు 'పర్యాప్త'శబ్దమునకుపూర్వమునందు మఱియొకశబ్దము లేనందున నీ రెండవయర్థమే యిచ్చట వివక్షితము. భారతమందే కాక మఱియొకచోట నయినను నటులే ప్రయోగములున్నట్లు బ్రహ్మానందగిరి టీకలో వ్రాయఁబడినది. దుర్యోధనుఁడు భయపడి తనసైన్యము అపర్యాప్తము (అనఁగా: అపూర్ణము) అని చెప్పుచుండునటు లనేకులు యుక్తిఁ జెప్పిరి; గాని యది యుక్తమైనది కాదు. కారణ మేమన: దుర్యోధనుఁ డెప్పుడును భయపడినట్లు భారతమున నెచ్చటను చెప్పఁబడకపోవుటయే కాక, దుర్యోధనునిసైన్యము గొప్పది యనుతలంపున పాండవులు వజ్రమను పేరుగల వ్యూహమును రచించిరనియు, కౌరవులగొప్ప సైన్యమును జూచి ధర్మరాజు విషాదము నొందెననియు భీష్మపర్వమునఁ జెప్పఁబడినది (మ. భా.భీష్మ.౧౯.౫ మఱియు ౨౧. ౧). పాండవసైన్యమునకు సేనాపతియగు ధృష్టద్యుమ్నుఁ డుండఁగా 'భీమునిచే రక్షింపఁబడిన' యని చెప్పుటకు కారణమేమి? యన: మొదటిదినమున పాండవులచే రచియింపఁబడిన వజ్ర వ్యూహపురక్షణకొఱకు దానియగ్రభాగమునందు భీముఁ డుండెను; కావున సేనారక్షకుఁడుగా భీముఁడే యప్పుడు దుర్యోధనునియెదుట కనబట్టు చుండెను.(మ. భా.భీష్మ. ౧౯. ౪-౧౧, ౩౩, ౩౪). కావున నే భారతమున నీరెండుసేనలును 'భీష్మనేత్ర' మనియు 'భీమనేత్ర' మనియు గీతకు పూర్వ మందున్నయధ్యాయములోఁ (మ. భా. భీ. ౨౦. ౧. చూడు) జెప్పఁబడినవి.]

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మ మే వాభిరక్షంతు భవంతః సర్వ ఏవ హి. ౧౧
§§ తస్య సంజనయ న్హర్షం కురువృద్ధః పితామహః,
సింహానాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్. ౧౨
తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః,
సహసైవాభ్యహన్యంత స శబ్ద స్తుములో உభవత్. ౧౩
తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవ శ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. ౧౪

(౧౧) అయిన నిప్పు డన్నియయనములయందును (అనఁగా : సైన్యము యొక్క వేర్వేఱగు ప్రవేశద్వారములయందును) మీరందఱును కలిసియుండి భీష్ములనే యన్ని ప్రక్కలనుండియు రక్షింపవలయును.

[సేనాపతియగుభీష్ముఁడు స్వతఃపరాక్రమశాలియు, నెవరికి నజయ్యుఁడు నని యెఱింగియు, మీరందఱు నన్ని ప్రక్కలనుండియు భీష్ముని సంరక్షించుఁడని దుర్యోధనుఁడు చెప్పుటకు కారణ మేమియన: ఈసంగతిని దుర్యోధనుఁడు మఱియొకచో (మ. భా. భీ. ౧౫. ౧౫-౨౦; ౯౯. ౪౦, ౪౧). శిఖండిమీఁద శస్త్రము వదలనని భీష్ముని ప్రతిజ్ఞ కలదు కావున శిఖండివలన భీష్మున కపాయము సంభవింపకుండ నందఱును మిక్కిలి జాగరూకతతో మెలఁగవలయు ననెను.—

అరక్ష్యమాణం హి వృకో హన్యాత్ సింహం మహాబలమ్,
మా సింహం జంబుకే నేవ ఘాతయేథాః శిఖండినా.

"మహాబలవంత మగు సింగము రక్షింపఁబడనియెడల తోడేలు సయితము దానినిం జంపును; అట్లు నక్కవంటి శిఖండివలన సింగమువంటి భీష్మున కపాయము రాకుండ కనిపెట్టియుండుఁ" డని తాత్పర్యము. శిఖండిని దక్క యితరుల నెవరినైనను లొంగఁదీయుటకు భీష్ముఁడు స్వయముగ సమర్థుఁ డగుటచే భీష్ముల కితరసహాయమువలని యపేక్ష యనవసరము.]

(౧౨) ఇంతలో దుర్యోధనుఁడు సంతసించుటకొఱకు, ప్రతాపశాలియు, వృద్ధుఁడునగు కౌరవపితామహుఁడు (సేనాపతియగు భీష్ముఁడు) సింహమువలె గొప్పగర్జనము జేసి (యుద్ధములోని స్వాగతమును సూచించు) తః శంఖము నూఁదెను. (౧౩) దానితో ననేకములగు శంఖములును, భేరులును (నౌబతులు), పణవములును, ఆనకములును, గోముఖములును (రణవాద్యములు) నొక్కసారిగ మ్రోగుటచే, ఆనాదము నలుదిక్కులను విశేషముగ వ్యాపించెను. (౧౪) అనం

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. ౧౫
అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. ౧౬
కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీచ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః. ౧౭
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్దధ్ముః పృథక్ పృథక్. ౧౮
స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్. ౧౯
§§ అథవ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః. ౨౦

తరమందు తెల్లనిగుఱ్ఱములం బూన్చిన రథముపై నుండు మాధవుఁడును (శ్రీకృష్ణుఁడును), పాండవుఁడును(అర్జునుఁడును)వీరు(తమపక్షముసైతము సిద్ధముగ నున్నదని ప్రత్యుత్తరము నిచ్చుటకై) దివ్యములగు శంఖములఁ బూరించిరి. (౧౫) హృషీకేశుఁడు, అనఁగా: శ్రీకృష్ణుఁడు పాంచజన్యమును (ఈపేరు గలశంఖమును), అర్జునుఁడు దేవదత్తమును నూఁదిరి. భయంకరమగు కర్మను జేయువృకోదరుఁడు, అనఁగా: భీముఁడు పౌండ్ర మను పెద్ద శంఖము నూఁదెను; (౧౬) కుంతీపుత్త్రుఁడగు ధర్మరాజు అనంతవిజయమును, నకులసహదేవులు సుఘోషము, మణిపుష్పకము నను వానిని,(౧౭) మహాధనుర్ధరుఁ డగు కాశీరాజును, మహారథుఁడగు శిఖండియు, ధృష్టద్యుమ్నుఁడున్ను, విరాటుఁడును, జయించుటకు సాధ్యుఁడు గాని సాత్యకియు, (౧౮) ద్రుపదుఁడును, ద్రౌపదియొక్క (అయిదుగురు) కుమారులును, మహాబాహుఁడగు సౌభద్రుఁడును (అభిమన్యుఁడును) నను వీరందఱును, ఓరాజా! (ధృతరాష్ట్రా) నాలుగువైపులనుండియుఁ దమతమశంఖముల వేర్వేఱుగ నూఁదిరి. (౧౯) ఆకాశమును భూమిని నిండించు నాతుములధ్వని కౌరవులహృదయముల పగులఁగొట్టెను. (౨౦) పిదప కౌరవులు యుద్ధసన్నద్ధులై నిలువఁబడుటను జూచి యొకరిపై నొకరు శస్త్రములు వదలు సమయము వచ్చినప్పుడు, ధ్వజముపై హను

హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే,

అర్జున ఉవాచ.

సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత. ౨౧
యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్,
కై ర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే. ౨౨
యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః. ౨౩

సంజయ ఉవాచ.

ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత,
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. ౨౪

మంతుఁడు గలయర్జునుఁడు ధనుస్సునెత్తి (౨౧) ఓరాజా (ధృతరాష్ట్ర)! శ్రీకృష్ణునితో నిట్లనెను— అర్జునుఁడు చెప్పుచున్నాఁడు— ఓయచ్యుతా! నారథము రెండుసేనల నడుమ కొంచెము నిలుపుము. (౨౨) ఇంతలో యుద్ధము చేయవలయునని సంసిద్ధులైన వీరిని నేను చూడఁగలను. మఱియు నీయుద్ధభూమియందు నే నెవరితో యుద్ధము చేయవలయునో, (౨౩) దుర్బుద్ధియగు దుర్యోధనుఁడు యుద్ధమందుఁ దనకులాభము కలుగవలయు ననుకోరికతో నెవరిని సిద్ధముచేసెనో, నేను చూతును—సంజయుఁడు చెప్పుచున్నాఁడు— (౨౪) ఓధృతరాష్ట్ర! గుడాకేశుఁడు (అనఁగా: ఆలస్యమును జయించునర్జునుఁడు) ఇటు లనఁగా హృషీకేశుఁడు (ఇంద్రియములకు స్వామి యగు శ్రీకృష్ణుఁడు) అర్జునునియొక్క యుత్తమమగురథమును తోలుకొని రెండుసేనలయొక్క మధ్యభాగమున నిలువఁబెట్టెను.

[ఇచ్చట హృషీకేశ గుడాకేశశబ్దముల కీయర్థములు టీకాకారుల ననుసరించి వ్రాయఁబడినవి. నారదపాంచరాత్రములయందు సైతము హృషీకేశము లన నింద్రియము లనియు, వానికి నీశుఁడన స్వామి యనియు హృషీకేశపదమునకు నిర్వచనము చేయఁబడియున్నది. (నా. పంచ. ౫.౮.౧౭; మఱియు నమరకోశముయొక్క క్షీరస్వామివ్యాఖ్యయందు హృషీకము లనఁగా నింద్రియములనియు, నీశబ్దము "హృష్=ఆనందము నిచ్చు" అనుధాతువునుండి వెలువడిన దనియు, నింద్రియములు మనుజున కానందము నిచ్చునవి గాన హృషీకములని వానికి పేరనియు వ్రాయఁబడినది. అయినను హృషీ

భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్,
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి.     .౨౫

కేశ-గుడాకేశ శబ్దములకు పూర్వోక్తమగు నర్థము సరియైనది యగునా? కానేరదా? యని సంశయము కలుగును. కారణ మేమి యన: హృషీక ములనఁగా నింద్రియములనియు, గుడాక యన నిద్ర, లేక, యాలస్య మనియు, ప్రచారమునందు లేవు. కావున హృషీకేశ-గుడాకేశ శబ్దము లకు మఱియొకవిధమున వ్యుత్పత్తులను జెప్పవచ్చును. హృషీక + ఈశ అనియు, గుడాక + ఈశ అనియు ననుటకు మాఱుగ, హృషీ + కేశ అని యు, గుడా + కేశ అనియు పదముల విడఁదీయవచ్చును; మఱియు హృషీ అనఁగా: హర్షముచే నిక్కపొడుచుకొనిన, లేక, ప్రశస్తములైన, కేశ ములు గల శ్రీకృష్ణుఁ డనియు, గుడా యనఁగా: గూఢము, లేక, దట్టము లైన, వెండ్రుకలుగల యర్జునుఁ డనియు నర్థము చేయవచ్చును. భారతము నకు టీకాకారులగు నీలకంఠాచార్యులు గుడాకేశశబ్దమునకు గీత.౧౦.౨౦శ్లో కములలో నీయర్థమును సూచించెను. మఱియు 'రోమహర్షణుఁడు' అని సూతుని తండ్రి పేరు కలదు. కావున హృషీకేశశబ్దమునకు పైఁజెప్పినరెండవ వ్యుత్పత్తియు నసంభవమని చెప్పుటకు వీలులేదు. వేయేల? మహాభారత ములో శాంతిపర్వాంతర్గతమగు నారాయణీయోపాఖ్యానమందు విష్ణుమూ ర్తియొక్క ముఖ్యములగు నామములను నిర్వచనము చేయుచు 'హృషీ' అనఁగ నానందదాయక మైన,'కేశ'అనఁగ కిరణములని యర్థము చేసి సూర్య చంద్రరూపమగు తనవిభూతి కిరణములచే సర్వజగత్తును హర్షింపఁజేయు చున్నాఁడు కావున నతనిని హృషీకేశుఁ డని చెప్పుచున్నారని చెప్పఁ బడినది. (శాం. ౩౪౧. ౪౭ మఱియు ౩౪౨. ౬౪, ౬౫ చూడు; ఉద్యో. ౬౯. ౯) మఱియు నటులే కేశశబ్దము సైతము కిరణ మను నర్థముగల కేశ శబ్దమునుండి నిష్పన్నమైనదని పూర్వశ్లోకమునందు చెప్పఁబడినది.(శాం. ౩౪౧. ౪౭) వీనిలోనే యర్థమును గైకొన్నను, శ్రీకృష్ణునకు నర్జునునకు నీ పేరులు వచ్చుటకు నన్నివిధములచే యోగ్యములగు కారణములు చెప్పుటకు వలనుపడదు; కాని, యీదోషము నిరుక్తిసంబంధమైనది కాదు.అత్యంతము రూఢ మగువిశేషనామములకు నిరుక్తి చెప్పవలయు నందుమేని, యిట్టి ప్రతిబంధము వచ్చుట మిక్కిలి సహజమే.

(౨౫) భీష్మద్రోణులయొక్కయు, నందఱురాజులయొక్కయు నెదుట

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్,
ఆచార్యాన్ మాతులాన్భ్రాతౄన్ పుత్రాన్పౌత్రాన్సఖీం స్తథా.
శ్వశురాన్ సుహృద శ్చైవ సేనయో రుభయో రపి,
తాన్ సమీక్ష్య స కౌంతేయ స్సర్వాన్ బంధూ నవస్థితాన్.
కృపయా పరయావిష్టో విషీద న్నిద మబ్రవీత్,

అర్జున ఉవాచ.

§§ దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్. ౨౮
సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి,
వేపథు శ్చ శరీరే మే రోమహర్ష శ్చ జాయతే. ౨౯
గాండీవం స్రంసతే హస్తా త్త్వక్చైవ పరిదహ్యతే,
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః. 30
నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ,
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. 3౧

"అర్జునా! (ఇక్కడ)ఒక్కచోటనే చేరినకౌరవులఁ జూడుము." అని(కృష్ణుఁడు) చెప్పెను. (౨౬) అప్పుడర్జునునకు తన పెద్దలును, పినతండ్రులును, నాచార్యులును, మామలును, భ్రాతలును, పుత్త్రులును, మనుమలును, మిత్త్రులును, (౨౭) శ్వశురులును, స్నేహితులును, రెండుసైన్యములయందు నున్నటుల గాన్పించిరి. (ఇట్లు) చేరినవారందఱు తనబంధువులుగ నుంటఁ జూచి కుంతీపుత్త్రుఁడగు నర్జునుఁడు (౨౮) అతికరుణతోఁ గూడినమనస్సు గలవాఁడగుటచే ఖిన్నుఁడై యిటులచెప్పట కారంభించెను.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు—ఓకృష్ణా! యుద్ధము చేయుద మనుకోరికతో (ఇక్కడ) చేరినస్వజనమును జూచి (౨౯) నాయవయవములు శిథిలము లగుచున్నవి. నోటి తడి యాఱుచున్నది. శరీరము వణఁకుచు రోమాంచితమగుచున్నది; (30) గాండీవము (అర్జుననిధనుస్సు) చేతినుండి జాఱుచున్నది. నాయవయవముల నంతట దాహము గలుగుచున్నది. నిలువలేను. నామనస్సు భ్రమ చెందినవానిమనస్సువలె నున్నది. (3౧) ఓయి కేశవా! నాకన్నిలక్షణములును విపరీతముగ నే తోఁచుచున్నవి. స్వజనమును యుద్ధమునందుఁ జంపిన శ్రేయము(అనఁగా:

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ,
కిం నో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీవితేన వా. ౩౨
యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ,
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ. ౩౩
ఆచార్యాః పితరః పుత్త్రా స్తథైవ చ పితామహాః,
మాతులాః శ్వశురాః పౌత్త్రాః శ్యాలాః సంబంధిన స్తథా.
ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన,
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే. ౩౫
నిహత్య ధార్తరాష్ట్రా న్నః కా ప్రీతిః స్యా జ్జనార్దన,
పాప మే వాశ్రయే దస్మా న్హత్వైతా నాతతాయినః. ౩౬
తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రా న్స్వబాంధవాన్,
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ. ౩౭

కల్యాణము)కలుగునట్లు కాన్పింపను. (౩౨) ఓకృష్ణా! నాకు విజయాపేక్ష లేదు. నాకు రాజ్యమువలదు. సుఖము సైతము వలదు. ఓగోవిందా! నాకీరాజ్య మేల? దాని యుపభోగ మేల? బ్రతు కేల? (౩౩) ఎవరికొఱకు రాజ్యమును గాని, యుపభోగమును గాని, సుఖమును గాని కోరవలసివచ్చునో వారే యీజీవితమందును, సంపదయందును నాశ వదలి యుద్ధమునకు సిద్ధులైగ నున్నారు. (౩౪) ఆచార్యులును, పినతండ్రులును, పుత్త్రులును, తాతలును, మామలును, శ్వశురులును, మనుమలును, బావమఱఁదులును, వియ్యంకులు (సంబంధులును), (౩౫) నన్ను చంపుటకు సిద్ధు లయినను నగుదురు గాక! ఓమధుసూదనా! ఒక భూమిపై ప్రభుత్వ మన నేల? త్రైలోక్యరాజ్య మిచ్చెద నన్నను వారినిఁ జంపుట కిచ్ఛయింపను. (౩౬) ఓజనార్దనా! ఈకౌరవులఁ జంపిన మా కేమి శ్రేయము గలుగును? వీ రాతతాయు లైనను వీరిని జంపినందున మాకు పాపమే లభించును; (౩౭) కావున మాబంధువులగు కౌరవులను నేనే చంపుట యోగ్యము కాదు: కారణ మేమి యన: ఓమాధవా! మేమే మావారిని జంపి యెట్లు సుఖము నొందుదుము?

[అగ్నిదో గరద శ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః, క్షేత్రదారహర శ్చైతే షడైతే ఆతతాయినః. (వసిష్ఠస్మృతి. ౩. ౧౬)—అనఁగా ఇండ్లు తగులపెట్టువాఁడును, విషముపెట్టువాఁడును, చేతిలో శస్త్రమునుంచుకొని

§§ యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః,
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్. ౩౮
కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్,
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన. ౩౯

: చంపుటకు వచ్చువాఁడును, ధనమును దోఁచుకొనిపోవువాఁడును, భార్యను గాని భూమినిగాని హరించువాఁడును అను నీయాఱుగురు నాతతాయు లనఁబడుదురు—ఈదుష్టులను నిస్సంశయముగఁ జంపవలయును. దానివలన నేమియు పాపము లేదు అని మనువు (మను. ౮. ౩౫౦.౩౫౧) చెప్పెను"

(౩౮) లోభముచే మతి చెడినవారికి కులక్షయమువలన కలుగు దోషమును, మిత్రద్రోహమువలన కలుగు పాతకమును కాన్పింపవు. (౩౯) అయినను ఓ జనార్దనా! కులక్షయముఁ జేయుటవలనఁ గలుగుదోషము మాకు స్పష్టముగఁ గాన్పించుచుండఁగా నీపాపమును జేయవల దను దృఢసంకల్ప మేల నాకు కలుగదు ?

: [యుద్ధమునందు గురువధమును, సుహృద్వధమును, కులక్షయమును జేయవలయునని మొదటనే తెలిసియుండఁగ యుద్ధము చేయువిషయమున నర్జునునకుఁ గలిగిన యీవ్యామోహమునకుఁ గారణ మేమి ? గీతలలో ముందు రాఁబోవువిషయమునకును, దీనికి సంబంధ మేమి? ప్రథమాధ్యాయమునకుఁ గల్గు మహత్త్వ మేమి? మొదలగు ప్రశ్నలవిచారము గీతారహస్యము యొక్క మొదటిప్రకరణమునందును, పదునాల్గవప్రకరణమునందును జేసితిని, దానిని జూడుఁడు. లోభముచే బుద్ధి చెడుటవలన దుష్టులకుఁ దమదౌష్ట్యము తెలియక పోయినను బుద్ధిమంతుఁడైనవాఁడు దుష్టులసహవాసమున దుష్టుఁడు కాఁగూడదు—న పాపే ప్రతిపాప స్స్యాత్—సుఖముగ కూర్చుండవలయును, మొదలగు నేసామాన్యసిద్ధాంతము లీసమయములయం దెంతదూరము సంబంధించునదియు, వాని నెంతవఱకు నాచరింపవలసినదియుఁ దెలిసికొనుట పైనఁ జెప్పినరీతిగ నొకగొప్ప విషయమే. దానికి గీతానుసారముగ నేమి సమాధానము చెప్పవలసినదియు, గీతారహస్యమునందలి పండ్రెండవప్రకరణమునందు (పుట. ౫౨౩-౫౨౯) నిరూపింపఁబడినది. గీతయందలి పిమ్మటి యధ్యాయములలో నున్నవివేచనలు

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత. ౪౦
అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. ౪౧
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. ౪౨
దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. ౪౩
ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. ౪౪

[మొదటియధ్యాయమునం దర్జునునకు కలిగినశంకను బోఁగొట్టుటకై రచియింపఁబడిన పనువిషయమును గమనించితిమేని, గీతాతాత్పర్య మేమియో స్పష్టముగఁ దెలియును. భారతయుద్ధమునం దొకరాష్ట్రమునందే యొక మతమువారికే విరోధము వచ్చి, యొకరి నొకరు చంపికొనుటకు సిద్ధపడుట వలన నీవిషయము వెలువడెను. కాన, నర్వాచీనేతిహాసములయందును, ఇట్టి విషయములు కలిగినస్థలములయం దంతటను నీవిషయమె తటస్థించుచున్నది. అది యట్లుండ నిమ్ము. కులక్షయమువలన ముందు కలుగఁబోవు ననర్థములనన్నింటిని, ఇప్పు డర్జునుఁడు స్పష్టముగఁ జెప్పుచున్నాఁడు.]

(౪౦) కులక్షయ మగునేని సనాతనములగు కులధర్మములు నష్టము లగును. (కుల)ధర్మములు చెడిపోయెనేని కులములన్నియు నధర్మములచే వ్యాప్తము లగును. (౪౧) ఓకృష్ణా! అధర్మము వ్యాపించినచోఁ గులస్త్రీలు చెడిపోవుదురు. ఓవార్ష్ణేయా! స్త్రీలు చెడుదురేని వర్ణసంకర మగును. (౪౨) వర్ణసంకర మయినచో నా కులఘాతకులును, (సర్వ)కులములును నిశ్చయముగ నరకమును జెందును. మఱియు పిండదానతర్పణాదిక్రియలు లుప్తము లగుటవలన వారిపితృదేవతలు సైతము నరకములోఁ బడుదురు. (౪౩) కులఘాతకులయొక్క యీవర్ణసంకరకారకమగు దోషముచే పురాతనమైన జాతిధర్మములును, కులధర్మములును నశించును. (౪౪) ఓ

§§ అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః. ౪౫
యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్. ౪౬
సంజయ ఉవాచ.

ఏవ ముక్త్వా ఽర్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః. ౪౭

జనార్దనా! యేమనుజులయొక్క కులధర్మములు నశించునో వారికి నరకవాసము నిశ్చయముగ సమకూరునని మనము వినుచున్నాము.

(౪౫) రాజ్యసుఖలోభమున స్వజనులను జంపుటకు నుద్యుక్తుల మగుచున్నాము! అయ్యయో నిజముగ మే మెంత గొప్పపాపమును జేయ నూహించితిమో చూడుము! (౪౬) ఇంతకంటె శస్త్రహీనుడనై ప్రతీకారమును చేయకయేయున్న నన్ని శస్త్రధారులగు కౌరవులు చంపుదురేని నాకు గొప్ప మేలగును. సంజయుడు చెప్పుచున్నాడు— (౪౭) అని చెప్పుచు రణభూమిలో శోకముచే దుఃఖించినమనస్సు గలవాడై యర్జునుడు తనచేతిలో నున్న ధనుర్బాణములను విడలి రథముపై జతికిలబడి కూర్చుండెను.

[రథముపై నిలువబడి యుద్ధము చేయుటవభ్యాసము కాన "రథముపై దన చోట కూర్చుండెను" అనుటచే ఖిన్నుడైనందున యుద్ధముచేయుట యతని కిష్టము లేదని యర్థము స్పష్ట మగుచున్నది. భారతకాలమునందలిరథములు తఱచుగ రెండుచక్రములు గలవిగ నుండునవి. గొప్పరథములకు నాల్గుగుఱ్ఱములు కట్టుచున్నట్లును, రథికుడును సారథియు ముందువైపున నొక రొకవైపున మఱియొకరింకొకవైపునను కూర్చుండునట్లును మహాభారతమందక్కడక్కడ రథములవర్ణననుబట్టి స్పష్టముగ గన్పట్టుచున్నది. రథమెవరిది యని యెఱుంగుటకై ప్రతిరథముమీదను నొకవిధముగ గుర్తుతో గూడినజండాను (ధ్వజమును) నిలువ బెట్టుచుందురు. అర్జునునిధ్వజముపై మారుతి ప్రత్యక్షముగ గూర్చుండియుండువిషయము ప్రసిద్ధముగనే యున్నది.]

## ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః. ౧.

ఈ రీతిగ భగవంతుఁడు చెప్పినయుపనిషత్తునందు బ్రహ్మవిద్యాంతర్గతమగు యోగ-అనఁగా: కర్మయోగ - శాస్త్రమున శ్రీకృష్ణుఁడు నర్జునుఁడు ననువారి సంవాదమునందున్న యర్జునవిషాదయోగ మను ప్రథమాధ్యాయము ముగిసినది.

[గీతలయందు కేవల బ్రహ్మవిద్యయే కాక బ్రహ్మవిద్యకు సంబంధించిన కర్మయోగముసైతము ప్రతిపాదింపఁబడినట్లీసంకల్పమున కర్థ మని గీతారహస్యమునందలి (పుట. ౪) (శ్రీ. ౧౩) పేజీలలోను ౧౧-వ ప్రకరణము (పుట.౪౧౯) పేజీలోను వ్రాయఁబడినది చూడుఁడు. ఈసంకల్పము మహాభారతములో లేకపోయినను గీతలకు సన్న్యాసమార్గావలంబుల టీకలు వెలువడుటకు మునుపే పుట్టియుండును. కారణమేమి యన: సన్న్యాసమార్గావలంబియగు నేపండితుఁడును నిట్టి సంకల్పమును వ్రాయఁడు. గీతలయందు సన్న్యాసమార్గము ప్రతిపాదింపలేదనియు కర్మయోగశాస్త్రమే సంవాదాత్మకముగ ప్రతిపాదింపఁబడినదనియు దీనివలన స్పష్టముగఁ దెలియును. సంవాదాత్మకపద్ధతికిని, శాస్త్రీయమగు పద్ధతికిని నుండుభేదము గీతారహస్యమునందలి పదునాల్గవప్రకరణ ప్రారంభమునఁ జెప్పఁబడినది.



# ద్వితీయోఽధ్యాయః.

సంజయ ఉవాచ.

తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః. ౧

శ్రీభగవా నువాచ.

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. ౨
క్లైబ్యం మా స్మ గమః పార్థ నైత త్త్వ య్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వో త్తిష్ఠ పరంతప. ౩

రెండవయధ్యాయము.

సంజయుఁడు చెప్పెను— (౧) ఇట్లు కరుణచే నార్ద్రచిత్తుఁడును, కన్నీటితోఁ గూడిననేత్రములు గల్గినవాఁడునై, దుఃఖించుచున్న యర్జునుని గుఱించి మధుసూదనుఁడు (శ్రీకృష్ణుఁడు) ఇట్లు చెప్పుచున్నాఁడు.—శ్రీభగవంతుఁడు చెప్పెను— (౨) ఓయర్జునా! ఆర్యులచే, అనఁగా: సత్పురుషులచే, (ఎప్పుడు) నాచరింపఁబడనిదియు, అధోగతిని బొందించునదియు, దుష్కీర్తికర మైనదియు, నగునీవైకల్య (కశ్మల) మీసంకటసమయమునందు నీ కెక్కడ దాపరించినది? (౩) ఓపార్థా! ఇట్లు నపుంసకుఁడవు (అనఁగా: మగతనము లేనివాఁడవు) కాకుము! ఇదినీకుఁ దగదు. ఓశత్రువులఁ దపింపఁజేయువాఁడా! అంతఃకరణమునందలి యీ నీచమగుదౌర్బల్యమును వదలివైచి యుద్ధమునకు సన్నద్ధుఁడవు కమ్ము.

[పరంతపశబ్దమునకు నిచ్చో నీయర్థమును వ్రాసితిని; కాని యనేకస్థలముల యందు ప్రయోగింపఁబడిన విశేషణరూపములగు సంబోధనలు గాని, లేక, కృష్ణార్జునులయొక్క పేరులు గాని, గీతలయందు హేతుగర్భములు, లేక, సాభిప్రాయములుగఁ బ్రయోగింపఁబడినవని యనేకులగు టీకాకారులు

అర్జున ఉవాచ.

॥ కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన,
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. ౪
గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమ పీహ లోకే,
హత్వా౽ర్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్. ౫

చెప్పుచున్నారు. అది నాకు సయుక్తికముగఁ దోఁపదు. పద్యరచన కనుకూలములగు పేళ్లుపయోగింపఁబడిన వనియు వానియం దేమియు విశేషార్థ ముద్దేశింపఁబడ లేదనియు నాయభిప్రాయము. ఈహేతువుచేత నే యనేక పర్యాయములు శ్లోకమునందుండు పేరులకు భాషాంతరము చేయక 'అర్జునా' యనియు, లేక, 'కృష్ణా' యనియు సామాన్యముగ వానికి భాషాంతరము చేసితిని.]

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు — (౪) ఓమధుసూదనా ! ఓశత్రుసూదనా! పరమపూజ్యులగు భీష్మద్రోణులతో యుద్ధమందు బాణములతో నే నెట్లు ప్రతియుద్ధమును చేయుదును! (౫) మహాత్ములగు గురువులను చంపక యీలోకమునందు బిచ్చమెత్తికొని కడుపు నిండించికొనుటయైనను మంచిదిగదా ! ధనలోలుపులగు గురువులను జంపి యీజగత్తున వారినెత్తుటితో రంగువేసి యుండు భోగములను భోగింపవలసివచ్చును.

['గురువులను' అను బహువచనశబ్దముచే 'గొప్పవా'రను నర్థమును గ్రహింపవలయును. కారణ మేమి యన: విద్య నభ్యసింపఁ జేసినగురువు ద్రోణుఁడు దక్క మఱియెవరును లేరు. యుద్ధారంభమున నిట్టిగురువుల యొక్క, అనఁగా: భీష్మద్రోణ శల్యులయొక్క పాదములకు వందనములొనర్చి వారి యాశీర్వచనముల నొందుటకు, యుధిష్ఠిరుఁడు తనరణభూమి యందు, తన కవచమును తీసివైచి, నమ్రుఁడై వారియొద్దకు వెళ్లఁగా, శిష్టసంప్రదాయము ననుసరించుచున్న యుధిష్ఠిరుని నభినందించి వారందఱును దుర్యోధనుని వైపున యుద్ధము చేయు కారణము నిట్లు చెప్పిరి —

అర్థస్య పురుషో దాసః దాస స్త్వర్థో న కస్య చిత్,
ఇతి సత్యం మహారాజ బద్ధో౽స్మ్యర్థేన కౌరవైః.

న చైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః,
యా నేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. ౬

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః,
య చ్ఛ్రేయః స్యా న్నిశ్చితం బ్రూహి త న్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. ౭

న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్,

"మనుష్యుఁ డర్థమునకు దాసుఁ డగుచున్నాఁడు, అర్థ మేరికిని దాసురాలుగాదు, అనునది నిజమే! ఓమహారాజా! యుధిష్ఠిరా! కౌరవులు నన్నర్థముచే బంధించిరి" (మ. భా. భీ. అ. ౪౫. శ్లో. ౩౫, ౫౦, ౭౬). 'అర్థకామాః' అనుపైఁ జెప్పఁబడినశబ్ద మీశ్లోకమునందలి యర్థమునే సూచించుచున్నది.]

(౬) నేను జయింపవలయునా? లేక, మమ్ము వారు జయింపవలయునా? ఈరెంటిలో నేది శ్రేయస్కరమో నాకు తెలియకున్నది. ఎవరిని చంపి బ్రతుకుటకు నిచ్ఛగింపమో యట్టి కౌరవులే యుద్ధమునకు నెదుట నిలువఁబడియున్నారు.

[ఈశ్లోకమునందలి 'గరీయస్' శబ్దముచేఁ, గర్మాకర్మలయొక్క లాఘవగౌరవములను నిర్ణయించునట్టి 'అనేకుల కధికసుఖము గలుగఁజేయుట' యనునది మొదలుగాఁగలసాధనము లున్నను నర్జునుఁ డెవరికి జయము గలిగిన మంచిదియో నిర్ణయించుట నాసాధనములమూలమునఁ జేయలేకపోయె నని స్పష్టమగుచున్నది యనియు, ఎవరికి జయము గల్గుట మంచిదో దానిని 'అనేకుల కధికసుఖ'మను న్యాయముచే నిశ్చయించుటకు సాధ్యము కాదు అనియు మొత్తముమీఁద నభిప్రాయము. గీతారహస్యము పుట. ౧౧౫ మరియు ౧౧౬-౧౧౭ చూడుము.

(౭) దైన్యముచే నా స్వాభావికవృత్తి నష్టమై (నా) ధర్మము విషయమై, అనఁగా: కర్తవ్యము విషయమై మోహము మనస్సునకుఁ దగిలినందున నేను నిన్నడుగుచున్నాఁడను; నిశ్చయించి యేది శ్రేయస్కరమగునో యది నాకు చెప్పుము.

అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. ౮

సంజయ ఉవాచ.

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః,
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవ హ. ౯
త మువాచ హృషీకేశః ప్రహస న్నివ భారత,
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదం వచః. ౧౦

నేను నీకు శిష్యుఁడను. నిన్ను శరణుఁజొచ్చిన నాకు బోధ చేయుము. (౮) కారణమేమన: పృథ్విపై నున్న నిష్కంటకము, సమృద్ధము నైనరాజ్యము గాని, దేవతలపై (స్వర్గమున) నధికారము గాని లభించినను, ఇంద్రియములను శోషింపఁజేయునాశోకమును పోఁగొట్టుసాధనములుగ నా కేమియుఁ గన్పట్టవు. సంజయుఁడు చెప్పుచున్నాఁడు—(౯) ఈరీతిగ శత్రువులను తపింపఁజేయునాగుడాకేశుఁడు, అనఁగా: అర్జునుఁడు, హృషీకేశునితో (శ్రీకృష్ణునితో) చెప్పి "నేను యుద్ధము చేయను" అని యూరకుండెను. (౧౦) (తర్వాత) ఓభారతా (ఓధృతరాష్ట్రా)! రెండుసైన్యములమధ్య కూర్చుండిన యర్జునుని శ్రీకృష్ణుఁడు కొంచెము నవ్వుచున్నవాఁడువలె నిట్లనెను.

[క్షత్రియధర్మ మొకవైపునకును, గురుహత్యయు కులక్షయము ననెడి వానివలనఁ గల్గు పాతకభీతి మఱియొకవైపునకును, లాగుచుండఁగ "చావవలయునా? లేక, చంపవలయునా?" యను సంశయములోఁబడి, యుద్ధమును చేయుట చాలించి బిచ్చము నెత్తికొనుటకు సిద్ధముగ నున్న యర్జునునకు నీజగత్తులో ముఖ్యముగఁ జేయవలసినదానిని భగవంతుఁ డుపదేశము చేయుచున్నాఁడు. యుద్ధమువంటిఘోరకృత్యముచే నాత్మకల్యాణము గలుగదని యూహ. కావుననే పరబ్రహ్మజ్ఞానమును సంపాదించికొని, తన యాత్మయొక్క పూర్ణకల్యాణమును వశపఱచికొనిన పెద్ద లీజగత్తునం దెట్లు ప్రవర్తించుచున్నదియుఁ దెలియఁజేయుట మొదలుకొనియే గీతలయం దుపదేశ మారంభింపఁబడినది. జగత్తునందలి నడవడికను చూచితి మేని యాత్మజ్ఞానము గలవారు తమజీవితకాలమును గడపుమార్గము లనాది నుండియు రెండువిధములఁ గాన్పించుచున్నవని భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.

శ్రీభగవానువాచ.

§§ అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. ౧౧

(గీత. 3. 3; మఱియు గీతారహస్య. ప్రకరణము. ౧౧ చూడుము). ఆత్మజ్ఞానమును సంపాదించినపిదప శుకమహర్షి వంటివారు సంసారమును వదలి భిక్షాటనము చేయుచు తిరుగుచున్నారు. జనకునివంటి మఱికొందఱాత్మజ్ఞానులు జ్ఞానము కలిగినపిదపనైతము స్వధర్మానుసారముగ లోకకల్యాణార్థమై జగత్తునందలి యనేకములగు వ్యవహారములయందు తమకాలమును గడుపుచున్నారు. మొదటిమార్గమును సాంఖ్య మనియు, లేక, సాంఖ్యనిష్ఠ యనియు, రెండవమార్గమును కర్మయోగ మనియు, లేక, యోగ మనియు పేర్కొనుచున్నారు (శ్లో. ౩౯ చూడు); కాని యీరెండునిష్ఠలు ప్రచారములో నున్నను, కర్మయోగము వానిలో శ్రేష్ఠమని గీతాసిద్ధాంతముగ నుత్తరగ్రంథమునఁ జెప్పబోవుచున్నాము (గీ. ౫. ౨). అర్జునుని మనస్సిప్పుడు సన్న్యాసనిష్ఠయందాసక్తి గలిగియుండెను. కావున నామార్గమందున్నతత్త్వజ్ఞానముచేతనే యతనితప్పు నతనికి తెలియఁ జెప్పి పిదప ౩౯-వ శ్లోకమునుండి కర్మయోగమును ప్రతిపాదించుటకు భగవంతుఁ డారంభించెను. సాంఖ్యమార్గము నవలంబించువాఁడు జ్ఞానము కలిగిన పిదప కర్మలు చేయకపోయినను, ఆమతమునందలి బ్రహ్మజ్ఞానమునకును, కర్మయోగమునందలి బ్రహ్మజ్ఞానమునకును నేమియు భేదము లేదు. కావున సాంఖ్యమతమును బట్టి చూచినను, ఆత్మ యవినాశియు నిత్యము నైనచో "నేను వారి నెట్లు చంపుదును?" అని నీవు దడదడలాడుట వ్యర్థమే కదా యని కొంచెము పరిహాసముగ భగవంతుఁడు మొదట చెప్పుచున్నాఁడు].

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు—(౧౧) ఎవరికొఱకు దుఃఖింపనక్కఱయుండదో వారిని గుఱించి నీవు శోకించుచున్నాఁడవు. మఱియు జ్ఞానసంబంధమగు దాంభికవాదమును చేయుచున్నావు. ఎవరిప్రాణము పోయినను, నెవరి ప్రాణము లున్నను జ్ఞాని వారినిగుఱించి శోకింపఁడు.

[ఈశ్లోకమునందు ప్రాణముపోయినవారిని గుఱించియు, బ్రతికియున్న వారినిగుఱించియు శోకింపఁ డని యున్నది. వీరిలో పోయినవారినిగుఱించి

న త్వే వాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః,
న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్. ౧౨
దేహినోఽస్మి న్యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తిర్ధీర స్తత్ర న ముహ్యతి. ౧౩

శోకించుట సహజ మగుటచే నట్లు శోకింపఁగూడదని యుపదేశింప వచ్చునా; కాని, బ్రతికియున్నవారిని గుఱించి యేల శోకింపవలయునని శంకించి టీకాకారులు దానివిషయమై విశేషచర్చ చేసియున్నారు; మఱియు ననేకులు మూర్ఖులు నజ్ఞానులు నగులోకులకు ప్రాణము లుండుటయే శోకకారణ మని చెప్పిరి; కాని యింతసూక్ష్మవిచారణ చేయుచు కూర్చుండక, శోకించుట యనఁగా: మంచిచెడుగుల నాలోచించుట, లేక, లెక్కచేయుట యని వ్యాపకమగు నర్థమును జెప్పుకొనినచో నాశంకయే యుండదు. జ్ఞానుల కాయిరువురివిషయములును సమానములుగనే యుండు నని మాత్రమే యిందలి తాత్పర్యము.

(౧౨) ఇదివఱకు నేనెప్పుడును లేకపోలేదు. నీవును నీరాజులును లేకపోలేదు. మనమందఱము నిఁక ముందుండకపోము అని తెలిసికొనవలయును.

[ఈశ్లోకమునకు వ్యాఖ్యానము చేయుచు రామానుజభాష్యమున 'నేను' అనఁగా : పరమేశ్వరుఁడును, 'నీవు రాజులు' అనఁగా : నితరములగు నాత్మలు, నీయిరువురును పూర్వమందును, పిమ్మటను నుండువారే యయిన యెడల, పరమేశ్వరుఁడును నాత్మయు ననురెండును వేఱుగ స్వతంత్రములును నిత్యములు నని యీశ్లోకమునందు సిద్ధమగుచున్నది యని వ్రాసిరి; కాని యీకల్పన సాంప్రదాయికులయాగ్రహమును దెలియపఱచుచున్నది. కారణ మేమన: ఇచ్చో నందఱును నిత్యులని మాత్రమే చెప్పఁబడినది; గాని వారికిఁ గలపరస్పరసంబంధ మేమో చెప్పఁబడలేదు. చెప్పవలసిన యవసరమును లేదు. ఇట్టిసందర్భము వచ్చినచోట నందఱిశరీరముల యందు నున్న దేహియగు నాత్మను నేను, అనఁగా : ఒకేపరమేశ్వరుఁడను, అను నద్వైతసిద్ధాంతము, తర్వాత గీతలయందె (గీ. ౮. ౪; ౧౩. ౩౧) స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది.]

(౧౩) దేహమును ధరించిన యెల్లవారికిని నీదేహమునందు, పసితనమును, పడుచుతనమును, ముసలితనమును సంభవించునట్లే యీదేహము నశించిన

§§ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినో౽నిత్యా స్తాం స్తితిక్షస్వ భారత. ౧౪

పిదప మఱియొక దేహము ప్రాప్తించును. (కావున) ఈవిషయమున జ్ఞానియగు పురుషుఁడు మోహమునొందఁడు.

[నేను వీరి నెట్లు చంపుదు ననియే యర్జునుని మనస్సునందున్న యొక విధమగు భీతి, లేక, మోహము; కావున భీతి లేకుండఁ జేయుటకు మరణమన నేమియో యనువిషయము నె తత్త్వదృష్టితో భగవంతుఁడు విచారించుచున్నాఁడు. (శ్లో. ౧౧. 30) మనుష్యుఁ డనఁగా కేవలదేహరూపమగు వస్తుమాత్రమే కాదు. దేహమును, ఆత్మయు నను నీరెంటియొక్క సంఘాతము. వీనిలో నేను అనునది యహంకారరూపముచే వ్యక్తమగు నాత్మ. ఇది నిత్యము నమరము (మరణశూన్యము) నయియున్నది. అది నేఁడును కలదు, నిన్నను నుండెను, రేపును నుండఁగలదు. కావున నాత్మకుఁ జచ్చుట గాని, చంపించుట గాని సంభవింపదు. కావున దాని విషయమై శోకింప నక్కఱలేదు. మిగిలినది దేహము. ఇది మాటలాడుచు, నడుచుచు నున్నను, అనిత్యము, నశ్వరమును గాన, నేఁడు గాని, రేపు గాని, నూఱేండ్లకుఁ గాని నశించునది యని నిశ్చితమైయే యున్నది—అద్య వా౽బ్దశతాంతే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః—(భాగ. ౧౦. ౧. 3౮) మఱియు నొకదేహము నశించినను, పిదప కర్మానుసారముగ మఱియొక దేహము రాకమానదు. కావున దానివిషయమయ్యును శోకించుట న్యాయ్యము కాదు. దేహము నాత్మయు ననునవి వేఱను దృష్టితో విచారించితి మేని చచ్చినవానిని గుఱించి శోకించుట వెఱ్ఱితనము. ఇది వెఱ్ఱితనమని నిశ్చయింపఁబడినను ప్రకృతదేహము నశించుచున్నప్పుడంతక్లేశము గల్గుచున్నందువలన దానినిగుఱించి యేల శోకింపఁగూడదో చెప్పవలయును. కావున భగవంతుఁ డిప్పుడీకాయిక సుఖదుఃఖముల స్వరూపములఁ జెప్పుచు వానినిగూర్చి శోకించుటసైతము యుక్తము కాదని చెప్పుచున్నాఁడు.]

(౧౪) ఓకుంతీపుత్త్రా! శీతోష్ణములను, లేక, సుఖ-దుఃఖముల నిచ్చునట్టివి, మాత్రలకు అనఁగా: బాహ్యసృష్టియందున్న పదార్థములకు, (ఇంద్రియములతో) గలుగు సంయోగములు. వీనికుత్పత్తియు నాశమునుగలవు. (కావున) ఇవి యనిత్యములు, అనఁగా: నశ్వరములైనవి. ఓభారతా! (శోకింపక) వాని నీవు సహిం

యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ,
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. ౧౫

పుము. (౧౫) ఏలన : నరశ్రేష్ఠా! సుఖదుఃఖములు సమానములుగ నుండుటచే వీనిచే బాధింపఁబడని జ్ఞానులే, యమృతత్వమును, అనఁగా : అమృతమగు బ్రహ్మముయొక్క స్థితిని, పొందఁగలరు.

[బ్రహ్మాత్మైక్యజ్ఞానమును, నామరూపాత్మకమైన జగత్తు మిథ్యయను జ్ఞానమును లేనివారు బాహ్యపదార్థములకు నింద్రియముల సంయోగముచేఁ గలుగుశీతోష్ణములును, సుఖదుఃఖములును, మొదలగువికారములను సత్యములనుకొని యాత్మయందు, వాని నధ్యారోపించినందున వారికి దుఃఖపీడ గలుగును; కాని యీవికారములన్నియు ప్రకృతిసంబంధము లయిన వనియు, ఆత్మయకర్తయు నవిలిప్తుఁడుననియుఁ దెలిసికొనినవారికి రెండును సమానములుగనే యుండుననియు, మఱియు నీసమబుద్ధిచే వీనిని సహింపవలయుననియు భగవంతుఁ డర్జునున కిప్పుడు చెప్పి యీయర్థమునే తర్వాత నున్న యధ్యాయములలో మిక్కిలి విస్తారముగ వివరించెను. 'మాత్రా'శబ్దమునకు "మీయన్తే ఏభి రితి మాత్రాః" అనఁగా : వేనిచే బాహ్యపదార్థములు లెక్కింపఁబడుచున్నవో, అనఁగా : తెలిసికొనఁబడుచున్నవో యవి—ఆ యింద్రియములు—అని శాంకరభాష్యమునం దర్థము చేయఁబడినది; కాని మాత్ర లన నింద్రియములచే లెక్కింపఁబడు శబ్దరూపాదిబాహ్యపదార్థములే యని యర్థము చేసి, వానికి నింద్రియములతోఁ గలసంయోగమే మాత్రాస్పర్శ మని యనేకు లర్థము చేయుచున్నారు. నే నాయర్థమునే యిచ్చో స్వీకరించుచున్నాను కారణ మేమన: గీతలలో తర్వాత నీశ్లోకము నందున్న విచారమునే చేయుచోట(గీ. ౫. ౨౧-౨౩) 'బాహ్య-స్పర్శము' అనుశబ్దము కలదు. కాన 'మాత్రాస్పర్శ' శబ్దమునకు నేను చేసినయర్థము చేసినచో, నీరెండుశబ్దములును పరస్పరతుల్యము లగును; కాని యీ రెండు శబ్దములు పరస్పరసంబంధము కలిగియుండినను, మాత్రాస్పర్శశబ్దము పురాతనముగఁ గాన్పించుచున్నది. కారణ మేమన: మనుస్మృతియందు (౬. ౭౭) నీయర్థమునందే మాత్రాసంగశబ్దము ప్రయోగింపఁబడినది. బృహదారణ్యకోపనిషత్తునందు, జ్ఞాని చనిపోయినపిదప వానియొక్క యాత్మకు మాత్రలతో నసంసర్గము (మాత్రా ఽసంసర్గము) అగును, అనఁగా : అతఁడు

యొకవస్తువు నిర్మింపఁబడినదని చెప్పుట సత్కార్యవాదము. ప్రకృతశ్లోకమం దివ్విధమగు విషయము లేమి గాన 'సత్' అనఁగా, ఏదియున్నదో దాని యస్తిత్వము(భావము), 'అసత్' అనఁగా, నేది లేదో దానియొక్క అభావము, అను నీరెండును నిత్యములును, నెప్పుడును స్థిరములుగ నుండునవియు నని మాత్రమే చెప్పఁదగినవిషయము. రెంటికి యథాక్రమముగ భావాభావము లర్థ మనియు, అవి నిత్యములని యొప్పుకొనినయెడల నేది సత్తో యది నాశ మగుటవలన దానికస్తిత్వము రానేరదనియు చెప్పనక్కఱ లేకయే సిద్ధమగును; కాని యీయనుమానమును, సత్కార్యవాదమున మొదటనే స్థిరముగ స్వీకరింపఁబడిన యొకవస్తువునుండి మఱియొకవస్తువుయొక్క కార్యకారణరూపమగు నుత్పత్తియు నను నీరెండును నొకవిధమైనవి కావు. (గీ. ర. ప్ర. ౯. పు. ౨౧౦ చూడు.) ఈశ్లోకమునందున్న 'నాసతో విద్యతే భావః' అను మొదటిచరణమునందు 'విద్యతే భావః' అనుపదములను 'విద్యతే+అభావః' అని విడఁదీసి, 'అసత్' అనఁగా: నవ్యక్త ప్రకృతికి, 'అభావము' అనఁగా: నాశము కానేరదని మాధ్వభాష్యములో నర్థము వ్రాయఁబడినది; మఱియు రెండవచరణమునందు నేహేతువుచే సత్పదార్థముసైతము నశింపదని చెప్పఁబడినదో యాహేతువుచే 'అసత్' 'సత్' అను నీరెండును నిత్యములే యని తమద్వైతసంప్రదాయానుసారముగ మధ్వాచార్యులు మొత్తముపై నర్థము వ్రాసిరి; కాని యీయర్థము సరళమైనది కాదు. బలాత్కారముగఁ దీయఁబడినది. కారణ మేమి యన: అసత్, సత్ అనుపరస్పరవిరుద్ధములగు శబ్దార్థములచేతనే అభావము, భావము నను నీరెండువిరుద్ధశబ్దములె యిక్కడ ప్రయోగింపఁబడినవి యని స్వాభావికముగఁ గాన్పించుచున్నది; మఱియు రెండవచరణమునందు, అనఁగా: 'నాభావో విద్యతే సతః' అనుచోట, 'నాభావః' అనుపదమున, అభావశబ్దమునే తీసికొనవలసివచ్చె నేని, మొదటిపాదమందు భావశబ్దమే యుండవలయునని స్పష్టమగుచున్నది. ఇంతియకాక 'అసత్' 'సత్' అను నీరెండును నిత్యములని చెప్పుటకు 'అభావః' 'విద్యతే' యను రెండుపదములును పర్యాయములు ప్రయోగింప నవసరములేదు; కాని మధ్వాచార్యుల సెప్పిన ట్లీద్విరుక్తి యాదరార్థ మన్నను, వ్యక్తము, లేక, దృశ్యమగు యందున్నవాఁడగు మనుష్యునియొక్క శరీరము నశ్వర మని(అనఁగా: అనిత్యమని) పదునెనిమిదవశ్లోకమున స్పష్టముగఁ జెప్పఁబడినది. కావున

అవినాశి తు త ద్విద్ధి యేన సర్వ మిదం తతమ్,
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి. ౧౭
అంతవంత ఇమే దేహా నిత్య స్యోక్తాః శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. ౧౮

నాత్మవలె దేహముసైతము నిత్యమని భగవద్గీతనుబట్టి సాధించుటకు వీలు లేదు. ఒకటి నిత్యమును, మఱియొకటి యనిత్య మని స్పష్టముగనే కన్పట్టు చున్నది. అయినను సాంప్రదాయికులు తమతమమతమున కనుగుణముగ నర్థము చెప్పుచుందురను విషయము చదువరులకుఁ దెలియఁజేయుటకై మాధ్వభాష్యమునందలి యీశ్లోకార్థమును దృష్టాంతముగ నిచ్చట వ్రాసితిని. అది యట్లుండనిమ్ము; ఏది సత్పదార్థమో యది యెప్పుడును నాశ మొందదు. కావున సత్స్వరూపమగు నాత్మను గుఱించి శోకింప నక్కఱ లేదు. మఱియు నామరూపాత్మకమగు, అనఁగా: దేహాదిరూపమగు, లేక, సుఖదుఃఖాదిరూపమగు వికారము తత్త్వదృష్టిచే మొదటనుండియు నశించునదే యగుటచే దానినాశము విషయమై శోకించుటయు నుచితము కాదు. కాన 'ఎవ్వరిని గుఱించి శోకింపఁగూడదో వారిని గుఱించి నీవు శోకించుచున్నావు.' అని యర్జునున కారంభమునందు చెప్పఁబడినవిషయమే సిద్ధమైనది. ఇప్పుడు సదసచ్ఛబ్దములయర్థమునే, తర్వాతను రెండు శ్లోకములయందు వివరించి చెప్పుచున్నాఁడు—]

(౧౭) ఈసమస్తము (జగత్తు) దేనిచే విస్తరింపఁజేయఁబడినదో, లేక, వ్యాపింపఁజేయఁబడినదో యది,(మూలమున నాత్మస్వరూపమగు నాబ్రహ్మము)అవినాశి యని తెలిసికొనుము. అవ్యయమగు నీతత్త్వము నెవరును నశింపఁజేయలేరు.

[పూర్వశ్లోకమున నేది 'సత్' అని చెప్పఁబడెనదో దానిని గుఱించియే చెప్పుచున్నాఁడు. శరీరమున కధిపతి (అనఁగా: ఆత్మ) నిత్యుఁడని చెప్పి యిప్పుడు నిత్య మని, లేక, అసత్ అని దేని ననవలయునో చెప్పుచున్నాఁడు—]

(౧౮) నిత్యమును, అవినాశియు, అచింత్యము, శరీరమున కధిపతియు నగు దానికి (ఆత్మకు) సంభవించుచున్నట్టి యీశరీరములు నశ్వరములని, అనఁగా: అనిత్యము లని చెప్పఁబడిన్నవి. కావున నోభారతా! నీవు యుద్ధము చేయుము!.

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. ౧౯
న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః,
అజో నిత్యః శాశ్వతో ఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. ౨౦
వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్. ౨౧

[ఇట్లు నిత్యానిత్యవిచారము చేసినచో, "నే నీమనుష్యుని చంపుచున్నా" ననుతలంపే యసత్యమైనది గాన యుద్ధము చేయకపోవుట కర్జునుఁడు చెప్పినకారణము నిర్మూలమగునని సారాంశము. ఈవిషయమునే యిప్పు డిక్కడ స్పష్టముగ వివరించుచున్నాఁడు.]

(౧౯) (శరీరమున కధిపతి, లేక, యాత్మయే) చంపుచున్నాఁ డనుకొను వాఁడును, ఆత్మయే చంపఁబడుచున్నాఁ డనుకొనువాఁడును నుభయులు నేమియు నెఱుఁగరు. కారణ మేమియన: ఇది (ఆత్మ) చంపునదియు కాదు. చంపఁబడున దియు కాదు.

[ఎందుచేత ననఁగా: ఆత్మయనునది స్వభావముచే నిత్యము, అకర్తయు నై యున్నది. ఈనాట్యమంతయు ప్రకృతి చేయునదియే. ఈశ్లోకమును, పిమ్మటి శ్లోకమును కఠోపనిషత్తునం దున్నవి.(కఠ ౨.౧౮, ౧౯)మహాభార తమునందును నింక నితరస్థలములందును, కాలముచే సర్వము గ్రసింపఁబడి యున్నదనియు,ఈకాలముయొక్క క్రీడకే "చంపుచున్నాఁడు, చచ్చుచు న్నాఁడు" అనునవి లౌకిక సంజ్ఞలనియుఁ జెప్పఁబడినది (శాం.౨౫.౧౫). గీతయందు సైతము (౧౧.౩౩)"భీష్మద్రోణాదులను కాలస్వరూపముగ నేనే చంపియున్నాను. నీవు కేవలము నిమిత్తమాత్రము గమ్ము"అని భక్తిమార్గము నుపదేశించునపు డీతత్త్వమే భగవంతునిచే నర్జునునకు మరల చెప్పఁబడినది.

(౨౦) ఇది (ఆత్మ) యెప్పుడును జన్మించునదియు, మరణము నొందు నదియుఁగాదు;ఇది యొకప్పుడుండు నదియు,మఱియొకప్పు డుండనిదియుఁ గాదు. ఇది అజమును, నిత్యమును, శాశ్వతమును, పురాతనము నై యున్నది. మఱియు శరీరము వధింపఁబడినను చంపఁబడదు. (౨౧) ఓపార్థా! ఈ యాత్మ యవినా

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. ౨౨
నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః. ౨౩
అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ,
నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః. ౨౪
అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే,
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. ౨౫

శియు, నిత్యమును, అజమును, అవ్యయము నని యెఱింగినవాఁ డెవరినైన నెట్లు చంపును? ఎట్లు చంపించును? (౨౨) మనుజుఁడు ప్రాతదైన వస్త్రములను వదలి క్రొత్తవస్త్రములను గ్రహించునట్లు దేహి (అనఁగా : శరీరమున కధిపతి యగు నాత్మ) క్రొత్త శరీరమును బొందుచుండును.

[వస్త్రములయొక్క యీ సామ్యము వాడుకలోనే యున్నది. మహాభారతమున మఱియొకచో నొకగృహమును (శాలను) వదలివైచి మఱియొక గృహమునందు ప్రవేశించుట దృష్టాంతముగ స్వీకరింపఁబడినది (శాం. ౧౫. ౫౬); మఱియు నొకయమెరికాదేశపు గ్రంథకర్త యీవిషయమునే, పుస్తకమునకు క్రొత్తయట్టవైచినట్లని దృష్టాంతము నిచ్చి వ్యక్తీకరించెను. వెనుక నున్న పదమూఁడవశ్లోకములో బాల్య, యౌవన, వార్ధక్యము లను నవస్థలను గుఱించి చెప్పినట్లే యిప్పుడు శరీరములన్నింటిని గుఱించియుఁ జెప్పఁబడినది.

(౨౩) దీనిని, అనఁగా : ఈయాత్మను, శస్త్రములు నఱకలేవు. అగ్ని తగులఁబెట్టలేదు. జలము తడుపనేరదు. వాయు వెండింపఁజేయలేదు. (౨౪) (ఎప్పుడును) తెగనిదియుఁ, గాల్పఁబడనిదియుఁ, దడియనిదియు, ఎండిపోనిదియునగు నీయాత్మ, నిత్యమును, నంతటను వ్యాపించినదియు, స్థిరమును, అచలమును, సనాతనమును (అనఁగా: చిరంతనమును) నై యున్నది. (౨౫) ఈయాత్మనే యవ్యక్తము, అనఁగా: ఇంద్రియములకు గోచరము కానిది అనియు, అచింత్యము, అనఁగా: మనస్సుచేఁ దెలిసికొనుటకు శక్యముకానిది అనియు, అవికార్యము, అనఁగా: దీనికి

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్,
తథాపి త్వం మహాబాహో నైనం శోచితు మర్హసి. ౨౬
జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మమృతస్య చ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. ౨౭

దియును నేవికారము ననఁగా నుపాధియు నుండనేరదు అనియుచెప్పుచున్నారు.
వున నిది (ఆత్మ) యివ్విధమున నున్నదని యెఱింగి దానినిగుఱించి శోకింపకుము.

[ఈవర్ణన యుపనిషత్తులలోనుండి కైకొనఁబడినది. ఈలక్షణములు నిర్గుణాత్మసంబంధములైనవి; సగుణాత్మసంబంధములైనవి కావు. కారణమేమన: అవికార్యము, నచింత్యము ననువిశేషణములు సగుణమునకు సంబంధింపవు. (గీతారహస్య. ప్రకరణము ౯ చూడుు). ఆత్మవిషయమున వేదాంతశాస్త్రము నందలి కడపటిసిద్ధాంతముయొక్క యాధారమున శోకింపకుండుట కీయుపపత్తి చెప్పఁబడినది. 'మేము ఆత్మ నిత్యమని యొప్పుకొనకపోవుటచే నీయుపపత్తి మాకు పనికిరా'దని పూర్వపక్ష మెవరైనను చేయుదురు. కాన నీపూర్వపక్షమును ముందుగ శంకించుకొని భగవంతుఁడిట్లుత్తర మిచ్చుచున్నాఁడు—]

(౨౬) ఒకవేళ నీయాత్మ (నిత్యము గాక శరీరమువలెనే) యెప్పుడును జన్మించునదియు, నెప్పుడును మృతినొందునదియు నని నీవన్నను, ఓమహాబాహూ! అప్పుడును దానినిగుఱించి శోకించుట యుక్తము గాదు. (౨౭) కారణ మేమి యన: ఎవరు జన్మించిరో వారికి మృత్యువు తప్పదు. ఎవరు చత్తురో వారికి పుట్టుకయుఁ దప్పదు. కాన (ఈ) యపరిహార్యవిషయమునుగుఱించి (పైఁ జెప్పిన మతము ననుసరించియు) శోకించుట యుచితము గాదు.

[పూర్వోక్తములగు రెండుశ్లోకములయందును జెప్పఁబడినది సిద్ధాంతపక్షము కాదనియు, 'అథ చ=అథ వా' యను శబ్దములచె నడుమనే వచ్చిన పూర్వపక్షమున కిది సమాధానమనియుఁ దెలిసికొనవలయును. ఆత్మ నిత్యమనియన్నను, అనిత్యమని యన్నను, నుభయపక్షములయందును శోకింప నవసరము లేదు, అని మాత్రమే నిరూపింపవలసియున్నది. గీతయొక్క నిజమగుసిద్ధాంతము ఆత్మ సత్తు, నిత్యము, అజము, అవికార్యము, అచింత్యము, నిర్గుణము నని మొదటనే చెప్పఁబడియున్నది. అది యట్లుండనిమ్ము; దేహ మనిత్య మని శోకించుట యుక్తము కాదనువిషయమునకె మఱియొక

§§ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా. ౨౮
§§ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః,

యుక్తిని (అనఁగా: సాంఖ్యశాస్త్రానుసారముగ నుపపత్తిని) చెప్పు చున్నాఁడు—]

(౨౮) సర్వభూతములు నారంభమునందు నవ్యక్తములును, మధ్యకాలమున వ్యక్తములును, మరణసమయమందు మరల నవ్యక్తములే యై యున్నవి. ఓ భారతా! (అన్నిపదార్థములయొక్క యీ స్థితి) యిటులే యగుచుండ వానివిషయమున శోక మేల యుండవలయును?

[అవ్యక్తశబ్దమునకే యింద్రియములకు గోచరము కానిది యని యర్థము. మొదట నొకయవ్యక్తద్రవ్యమునుండియే క్రమక్రమముగ సర్వవ్యక్తపదార్థములును బుట్టి తుదకు ప్రళయకాలమునం దావ్యక్తసృష్టియంతయు తిరిగి యవ్యక్తమునందె లయమగుచున్నది (గీ. ౮.౧౮), అనుసాంఖ్యసిద్ధాంతము ననుసరించియే యీశ్లోకమునం దున్నవాదము యుక్తమయి యున్నది. సాంఖ్యులయొక్క యీసిద్ధాంతము గీతారహస్యమునందలి ౭, ౮ ప్రకరణములలో బాగుగ వివరింపఁబడినది చూడుము. ఏపదార్థముయొక్క వ్యక్తస్థితి యైనను నీరీతిగ నెప్పుడైనను నాశనము నొందునని యయినచో, స్వభావముగనే నశించువ్యక్తస్వరూపమువిషయమయి శోకింపవలసిన యవసరము లేదు. ఈశ్లోకమే 'అవ్యక్త'శబ్దమునకు మాఱుగ 'అభావ' శబ్ద ప్రయోగము చేసి మహాభారతమున స్త్రీపర్వమునందు చెప్పఁబడినది (మ. భా. స్త్రీ. ౨. ౬). పిమ్మట "అదర్శనా దాపతితాః పున శ్చాదర్శనం గతాః, న తే తవ న తేషాం త్వం తత్ర కా పరిదేవనా" (స్త్రీ. ౨. ౧౩), అని 'అదర్శన (అనఁగా: దృష్టికి కాన్పింపకపోవుట)శబ్దము సైతము మరణము నుద్దేశించియే యుపయోగింపఁబడినది. సాంఖ్యవేదాంతము లను రెండుశాస్త్రములంబట్టియు, శోకించుట వ్యర్థమైనచో, నాత్మ యనిత్యమైనదని చెప్పినను నీవిషయమే సిద్ధముగు నెడలను లోకులు మృత్యువు విషయమై యేల శోకించుచున్నా రన, ఆత్మస్వరూప విషయమైన యజ్ఞానమూలముననే యట్లు శోకింతురనునది దీనికి నుత్తరముగును. కారణమేమియన—]

ఆశ్చర్యవ చ్చైన మన్యః శ్రుణోతి
శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్. ౨౯
దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత,
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. ౩౦

(౨౯) కొంద ఱీయాత్మ నాశ్చర్యముగ (అద్భుతమనియెన్ని) చూచుచున్నారు. మఱికొంద ఱాశ్చర్యముగఁ జెప్పుచున్నారు. ఇంక కొంద ఱాశ్చర్యముగ వినుచున్నారు. చూడుము! కాని (యీరీతిగఁ జూచినను, వినినను, చెప్పినను) వీరిలో నొక్కఁడును దీనిని (యథార్థముగ) నెఱుఁగఁడు.

[క్రొత్తవస్తు వనుకొని యాశ్చర్యముతో గొప్పగొప్పవా రాత్మవిషయమున నెంతవిచారము చేసినను, దానిసత్యస్వరూపమును దెలిసికొనువారు కొద్దిమందియే యుండుటచే మృత్యువువిషయమై పెక్కురు శోకించెదరు; కాని నీవట్లు చేయక పూర్ణమగు విచారణచే నాత్మయొక్క స్వరూపమును యథార్థముగఁ నెఱింగికొమ్ము, శోకమును వదలుము అని దీనియర్థము. కఠోపనిషత్తునం (కఠ. ౨. ౭.) దీరీతిగనె యాత్మ వర్ణింపఁబడినది.]

(౩౦) సర్వశరీరములయందుండెడు శరీరాధిపతి (ఆత్మ) యెప్పుడును నవధ్యమే, అనఁగా: ఎప్పుడును వధింపఁబడుటకు సాధ్యమైనది కాదు; కాన నో భారతా (ఓయర్జునా)! యేభూత విషయమున నయినను శోకించుట నీకుఁ దగదు.

[సాంఖ్యము, లేక, సన్న్యాసము అనెడుమార్గములందున్నతత్త్వజ్ఞానమునుబట్టి యాత్మ యనునది మరణశూన్యమయినది యనియు, దేహమనునది స్వభావముచేతనే యనిత్యమయి యుండుటచే నెవరయిన చచ్చినను, చంపినను శోకింప నవసరము లేదనియు నింతవఱకును సిద్ధాంతము చేయఁబడినది; కాని, దీనినిబట్టి యెవరిని చంపినను పాపము లేదని యెంతురేమో, య ట్లెన్నరాదు. అట్లు చంపుట గొప్పతప్పె యయి యున్నది చచ్చుట, చంపుట యనుశబ్దముల యర్థములు వేఱు గాన, చచ్చుట, చంపుట యనఁగనే భీతిని వదలుటకు మాత్రమే మొదట నిట్లు చెప్పఁబడినది. మనుష్యుఁడన నాత్మయొక్కయు, దేహముయొక్కయు సముచ్చయము. వీనిలో నాత్మ మరణశూన్య మయినదగుటచే చచ్చుట గాని, చంపుట గాని యాత్మకు సంభవింపదు. మిగిలినది దేహము. అది స్వభావముగనే యనిత్యము గాన నది నశించినచో దానివిషయమై శోకింపవలసినయవసర మేమియు లేదు.

§§ స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్య త్క్షత్రియస్య న విద్యతే. ౩౧

కాని యదృచ్ఛచేఁ గాని కాలగతిచేఁ గాని యెవఁడైన చచ్చినప్పుడు గాని యెవరినైన చంపినపుడు గాని లక్ష్యము సేయక శోకించుటను వదలిపెట్టినను, యుద్ధమువంటి ఘోరకర్మ చేయుటకు స్వయముగ ప్రవృత్తుఁడైనపుడు లోకుల దేహమును మనమేల నశింపఁజేయవల్లయు ననుప్రశ్నకు దీనిచే సమాధానము కుదురదు. కారణ మేమన: దేహ మనిత్యమైనను, నాత్మకు స్థిరమగు కల్యాణము, లేక, మోక్షమును సంపాదించుటకు దేహమును నదియే ముఖ్యసాధన మగుటచే నాత్మహత్యఁ జేసికొనుట గాని, లేక, తగిన కారణము లేనిదే యితరులను జంపుట గాని శాస్త్రానుసారముగ ఘోర పాతకములే యగుచున్నవి. కాన చచ్చినందులకు శోకించుట యోగ్యము కాకపోయినను, ఒకరి నొకరు నేలచంపవలయు ననువిషయమునకు నేద యిన సరసమగు నుపపత్తి చెప్పవలయును. దీనికే ధర్మాధర్మ వివేక మని యందురు. గీతలయందు ముఖ్యప్రతిపాద్యవిషయ మిదియే యై యున్నది. కావున మొదట సాంఖ్యమార్గమునకు సమ్మత మైనదియు, చాతుర్వర్ణ్యవ్యవస్థ ననుసరించినదియు నగుయుద్ధము చేయుట యనునది క్షత్రియునకు కర్తవ్య మగుటచే, చచ్చుటనుగుఱించి కాని, చంపుటను గుఱించి కాని, నీవు శోకింపఁదగక పోవుటయే కాక యుద్ధమందు చచ్చుట, చంపుట యను నీరెండు విషయములును క్షాత్రధర్మానుసారముగ నీకు ప్రాప్తములైన కర్తవ్యములే యగుచున్నవని భగవంతుఁడు సెప్పుచున్నాఁడు—]

(౩౧) ఇంతియ కాక స్వధర్మమును విచారించినను నీసమయమునందు యుద్ధము మానుకొనుట యుక్తము కాదు. కారణ మేమన: ధర్మోచితమగు యుద్ధము కంటె క్షత్రియునకు శ్రేయస్కర మగునది వేఱొండు లేదు.

[స్వధర్మమను నీయుపపత్తి తర్వాత సైతము రెండుసారులు చెప్పఁబడినది (గీ. ౩. ౩౫ మఱియు ౧౮. ౪౭). సన్న్యాసమార్గానుసారముగఁ గాని, లేక, సాంఖ్యమార్గానుసారముగఁ గాని, కర్మసన్న్యాసరూపమగు చతుర్థాశ్రమము కడపటిది యైనను, తత్పూర్వమున బ్రాహ్మణుఁడు బ్రాహ్మణధర్మమును, క్షత్రియుఁడు క్షత్రియధర్మమును, చాతుర్వర్ణ్యవ్యవస్థానుసారముగ పాలించి గృహస్థాశ్రమమును పూర్తి చేసికొనవలయునని మన్వాది

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్,
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధ మీదృశమ్. 3౨
అథ చే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి,
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి. 33
అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తే உవ్యయామ్,
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 3౪
భయా ద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః,
యేషాం చత్వం బహుమతో భూత్వాయాస్యసి లాఘవమ్. 3౫

: స్మృతికారు లందఱుఁ జెప్పియుండుటచే గృహస్థాశ్రమమునం దర్జునునకు
: యుద్ధము చేయుట యోగ్యమని యీశ్లోకమునకును దీనివెంబడి శ్లోకము
: నకును తాత్పర్యము.]

(3౨) మఱియు స్వయముగను సులభముగను లభించిన స్వర్గద్వారమై
యున్న యీయుద్ధ మదృష్టవంతుఁడగు క్షత్రియునకే ప్రాప్తించును. (33) కావున
(నీ)ధర్మమున కనుకూలమగు నీయుద్ధమును నీవు చేయకపోయితి వేని స్వధర్మమును,
కీర్తిని పోఁగొట్టుకొని పాపము నొందుదువు; (3౪) ఇంతియకాక యెల్లరును
నీ కెప్పటికిని నశింపనిదుష్కీర్తిని ప్రచురింతురు. సంభావితుని కపకీర్తి మరణము
కంటె నసహ్య మగును.

: [ఈవిషయమే శ్రీకృష్ణునిచే యుధిష్ఠిరునకు నుద్యోగపర్వమునందు
: చెప్పఁబడినది (మ.భా.ఉ. ౭౨.౨౪). "కులీనస్య చ యా నిందా వధో వా
: உమిత్రకర్షణం, మహాగుణో వధో రాజన్ న తు నిందా కుజీవికా"
: అని యక్కడ నున్నశ్లోకము; కాని దానికంటెను గీతలయందున్న యీయ
: ర్థము సంక్షిప్తముగఁ జెప్పఁబడియుండుటచేతను గీతాగ్రంథముసైత మధిక
: ప్రచారములో నుండుటచేతను "సంభావితస్య..." మొ. గీతలలో
: నున్న వాక్యము లోకులనోటికి వచ్చియుండుటచే వేదమువలె దాని నుపయో
: గించుచున్నారు. గీతలయందలి మఱికొన్నిశ్లోకము లిట్లే యందఱినోటికిని
: వచ్చియున్నవి. ప్రకృతమున దుష్కీర్తిస్వరూపమును జెప్పుచున్నాఁడు—]

(3౫) యుద్ధములోనుండి నీవు భయముతో పరుగిడితి వని (అందఱు)
మహారథులును ననుకొందురు, మఱియు నిన్ను గొప్పవాఁడవని గౌరవించువారం

అవాచ్యవాదాంశ్చ బహూ న్వదిష్యంతి తవాహితాః,
నిందన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్. ౩౬
హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్,
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః. ౩౭
సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. ౩౮

దలును పరాక్రమము లేనివాఁడవని యనుకొందురు. (౩౬) నీశత్రువులు నీ సామర్థ్యమును నిందించి ని న్ననరానిమాటల నందురు. ఇంతకంటె మిక్కిలి దుఃఖకరమైన సంగతి యేమున్నది? (౩౭) చచ్చితివేని స్వర్గము నొందుదువు. జయించితి వేని పృథ్వి ననుభవించెదవు. కాన నోయర్జునా! యుద్ధమునకు సన్నద్ధుఁడవు కమ్ము, లెమ్ము.

[సాంఖ్యమతానుసారముగ చంపుటను గుఱించియైనను, చచ్చుటను గుఱించియైనను శోకింపఁదగదనుటయే కాక, స్వధర్మానుసారముగ యుద్ధమును జేయుట ముఖ్యమగు కర్తవ్య మని పైన చెప్పఁబడిన వివేచనచే సిద్ధించినను, యుద్ధమునందు చేయఁబడిన హత్యవలనఁ గలుగు పాపము కర్తకుండునా? యుండదా? యను ప్రశ్నకు సమాధాన మిచ్చో చెప్పుచున్నాఁడు. వాస్తవముగఁ జూచితిమేని యీయుత్తరమునందలి యుక్తివాదము కర్మయోగమార్గము ననుసరించి యుండుటచే నామార్గమునకు నిచ్చోటనే ప్రస్తావనయయి యున్నది.]

(౩౮) సుఖదుఃఖములను, లాభాలాభములను, జయాపజయములను సమానముగ నాలోచించి యనంతరమున యుద్ధము నారంభింపుము. అటుల చేసితి వేని నీ కేమియు పాప ముండదు.

[జగత్తునందు జీవితకాలమును గడపుమార్గములు రెండు; ౧ సాంఖ్యమార్గము, ౨ యోగమార్గము. వీనిలో నే సాంఖ్యముయొక్క, లేక, సన్న్యాసమార్గముయొక్క సిద్ధాన్తముల ననుసరించి యర్జునుఁడు యుద్ధమును వదలి బిచ్చమెత్తికొనుటకు సిద్ధ మాయెనో, యాసన్న్యాసమార్గమునందలి తత్త్వజ్ఞానమునుబట్టియే యాత్మను గూర్చి కాని, లేక, దేహమును గూర్చి కానిఁ శోకించుట యుచితము కాదనియు, సుఖదుఃఖముల సమబుద్ధిచే సహింపవలయుననియు, స్వధర్మ మనుసరించి క్షత్త్రియుఁడు యుద్ధము చేయుటయే యోగ్య మనియు, నీ యుద్ధము సమబుద్ధిచేఁ జేయఁబడెనేని

§§ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి. ౩౯

రేమియు పాప ముండదనియు, నర్జునునకు భగవంతుఁడు స్పష్టముగ నిరూపించెను. అయిన నెప్పుడో యొకప్పుడు సంసారమును వదలి సన్న్యాసమును గైకొనుటయే ప్రతిమనుజునకు పరమకర్తవ్యమని వీరిమతము గాన, ఇష్టమగునేని యిప్పుడే యుద్ధమును వదలి సన్న్యసింపఁ గూడదా? యని కాని, స్వధర్మమును మాత్ర మేలపరిపాలింప వలయునని గాని, వీనివిషయమై కలుగు సందేహములు సాంఖ్యమతమున నివారింపఁబడవు. కావుః నర్జునుని మొదటియాక్షేపణ మటులే యున్నదని చెప్పినను చెప్పవచ్చును. కాన నిప్పుడు భగవంతుఁ డేమి చెప్పుచున్నాఁడన:—]

(౩౯) సాంఖ్యమతానుసారముగ, అనఁగా: సన్న్యాసనిష్ఠానుసారముగ, నీకీబుద్ధి, అనఁగా: జ్ఞానము, లేక, యుపపత్తి చెప్పఁబడినది. ఇప్పు డేబుద్ధితోఁ గూడినయెడల (కర్మ వీడకపోయినను) ఓ పార్థా! నీవు కర్మబంధమును వదలుదువో, యట్టి యీ (కర్మ)యోగమందున్న బుద్ధిని, అనఁగా: జ్ఞానమును (నీకు చెప్పుచున్నాను) వినుము.

[భగవద్గీతారహస్యమును తెలిసికొనుటకు నీ శ్లోకము మిక్కిలి ముఖ్యమయినది. సాంఖ్యశబ్దముచే కాపిలసాంఖ్యము, లేక, కేవలవేదాంతమును, యోగశబ్దముచే పాతంజలయోగమును,అను నర్థ మిచ్చుట నుద్దేశింపఁబడదు. సాంఖ్యమన : సన్న్యాసమార్గమనియును,యోగ మన : కర్మమార్గమనియు నర్థములే యిచ్చుట గ్రహింపవలయు నని గీతలలోని ౩. ౩-వ శ్లోకమునుండి స్పష్టమగుచున్నది. ఈరెండుమార్గములును స్వతంత్రము లైనందున, వీని ననుసరించువారిని సైతము వరుసగ 'సాంఖ్యులు'=సన్న్యాసమార్గీయులనియు, 'యోగులు' = కర్మయోగమార్గీయులనియు చెప్పుచున్నారు. (గీ. ౫.౫) వీరిలో సాంఖ్యమతమువా రెప్పుడో యొకప్పుడు, తుదకైనను కర్మలను వదలి వైచుటయే శ్రేష్ఠ మని యందురు. గాన "యుద్ధ మేల చేయవలయును?" నను నర్జునుని శంకకు పూర్ణ మగుసమాధాన మీ మతము నందలి సిద్ధాంతమును బట్టి చెప్పుటకు వీలులేదు. కాన, సన్న్యాసముం గైకొనక జ్ఞానము కలిగినపిదప సైతము నిష్కామబుద్ధితో నెల్లప్పుడును కర్మలను చేయుచుండుట యనునదియే ప్రతిమనుజునకును సత్యముగు పురు

§§ నేహాఽభిక్రమనాశో ఽస్తి ప్రత్యవాయో న విద్యతే,
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్. ౪౦
§§ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన,
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో ఽవ్యవసాయినామ్. ౪౧

[పార్థ మని యేకర్మ నిష్ఠయందలి సిద్ధాంతమో, యా కర్మయోగమందలి, లేక, యోగమార్గమందలి సిద్ధాంతమును చెప్పుట కిప్పు డారంభించి గీత యందున్న కడపటి యధ్యాయమువఱకు ననేక కారణములను జూపియు, అనేకశంకలను నివారించియు నీమార్గమే బలపఱుపఁబడినది. గీతల యందున్నదియు, భగవంతునిచే స్వయముగ చేయఁబడినదియు నగువిషయ నిరూపణమునందలి యీ విశేషమును గమనించినచో, గీతలయందు కర్మ యోగమే ప్రతిపాదింపఁబడిన దనువిషయమున నేమియు సందేహ ముండదు. కర్మయోగమునందలి ముఖ్యములగు సిద్ధాంతములను మొదట చూపుచున్నారు.—]

(౪౦) ఈ మతమున, (అనఁగా: ఈ కర్మయోగమార్గమున నొకసారి యారంభింపఁబడినకర్మకు నాశనము సంభవింపదు. మఱియు (పిమ్మట) విఘ్నములు రానేరవు. ఈధర్మము కొంచె మయినను (ఆచరింపఁబడెనేని) గొప్ప భయమునుండి రక్షించును.

[ఈసిద్ధాంతమునందలి మహత్త్వము గీతారహస్యమునందలి పదియవ ప్రకరణమునందు (పుట. ౩౯౦) నిరూపింపఁబడినది. గీతలలోనే ముందు ముందు విశేషముగ విచారము చేయఁబడినది. (గీ. ౬. ౪౦-౪౬) కర్మ యోగమార్గమున నొకజన్మమందు సిద్ధి గాకపోయినను, చేసినకర్మ వ్యర్థము కాక రాఁబోవు జన్మయందది యుపయోగించును. ప్రతిజన్మము నందు నిట్టి కర్మయోగము వృద్ధినొందుచు తుద కెప్పటికైనను నిజమగు సద్గతి లభించునని దీని తాత్పర్యము. కర్మయోగమునందలి మఱియొక గొప్ప సిద్ధాంతము నిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౪౧) ఓ కురునందనా! వ్యవసాయాత్మకమగు, అనఁగా: కార్యాకార్య ముల నిశ్చయించు, బుద్ధి (ఇంద్రియరూపి యగునది) యీమార్గమునందు నేకము అనఁగా: ఏకాగ్రముగ నుండవలయును. కారణ మేమన: ఎవరియొక్క బుద్ధి (ఈ ప్రకారముగ నేకము) నిశ్చయము లేదో వానిబుద్ధి, అనఁగా: వాసన యనే శాఖలు గలదియు, ననంతమును (అనేకవిధములయినది) అగుచున్నది.

§§ యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః,
వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః. ౪౨

[బుద్ధి శబ్దమునకు సంస్కృతమునం దనేకార్థములు గలవు. వానిలో జ్ఞానార్థమునం దీశబ్దము ౩౯-వ శ్లోకమునఁ బ్రయోగింపఁబడినది. మఱియు ముందు ౪౯-వ శ్లోకమున 'బుద్ధి' శబ్దమునకే "తెలిసికొనుట, కోరుట, వాసన, లేక, హేతువు" అని యర్థము; కాని బుద్ధిశబ్దమునకు పూర్వము నందు "వ్యవసాయాత్మికా" అను విశేషణముండుటచే, వ్యవసాయమున కార్యాకార్యముల నిశ్చయించు బుద్ధీంద్రియమని యీశ్లోకమున పూర్వార్థమందున్న బుద్ధిశబ్దమున కర్థము (గీతారహస్యము ప్రకరణము. ౬. పు. ౧౩౭-౧౪౬ చూడు); ఏ విషయమునైనను బుద్ధీంద్రియముచే మంచి చెడుగుల విచారించినపిదప తదనుసారముగ కర్మ చేయవలయు నను నిచ్ఛ (వాసన) మనస్సునందు వెలువడును. కాన నీయిచ్ఛకు, లేక, వాసనకు బుద్ధి యనియే పేరొక్కనుచున్నారు; కాని యప్పుడు 'వ్యవసాయాత్మికా' అను విశేషణము పూర్వమునందు ప్రయోగింపరు. భేదమును దెలియఁజేయుట యావశ్యక మగునేని, 'వాసనాత్మకబుద్ధి'యని చెప్పుదురు. ఈశ్లోకమునందలి రెండవచరణమున 'బుద్ధి'యని మాత్రమే యున్నది. వెనుక 'వ్యవసాయాత్మికా' అను విశేషణము లేదు. కాన, 'బుద్ధయః' అను బహువచనముచే "వాసనలు, కల్పనాతరంగము" అని యర్థము; కావున "ఎవరికి వ్యవసాయాత్మకబుద్ధి, అనఁగా: నిశ్చయించు బుద్ధీంద్రియము స్థిరముగ లేదో, వారి మనస్సునందు ప్రతిక్షణమును క్రొత్త తరంగములు, లేక, వాసన లుత్పన్నము లగుచున్నవి." అని మొత్తముపై శ్లోకార్థము. బుద్ధి శబ్దమునకు 'నిశ్చయించునింద్రియము' 'వాసన' యను నీ రెండర్థములని బాగుగ గుర్తించుకొననిచో, కర్మయోగమునందున్న బుద్ధివివేచనయందలి మర్మము స్పష్టముగ తెలియనేరదు. వ్యవసాయాత్మకబుద్ధి స్థిరము, లేక, ఏకాగ్రముకానిచో ప్రతిదినమునను వేర్వేఱగు వాసనలచే మనస్సు వ్యగ్రమగుటచే "నేఁడు పుత్త్రప్రాప్తికై యీ కర్మ చేయుదము. రేపు స్వర్గప్రాప్తి కాకర్మ చేయుదము" అను వ్యసనములో మనుష్యుఁ డెట్లు చిక్కుకొనునో దాని నిప్పుడు వర్ణించుచున్నాఁడు.—]

(౪౨) ఓ పార్థా! (కర్మకాండ ప్రతిపాదకములగు) వేదములయందున్న (ఫలశ్రుతిరూపములగు) వాక్యములచే భ్రమపడి స్వర్గముకంటె వేఱగు ఫలము

కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్,
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి. ౪౩
భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసాం,
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే. ౪౪

లేదని వివదించి చెప్పు మూఢులు—(౪౩) "అనేకములగు (యజ్ఞయాగాది) కర్మలచేతనే (తిరిగి) జన్మించుట యనుఫలము ప్రాప్తించును గాన (ప్రతిజన్మమందును) భోగమును, ఐశ్వర్యము ననుభవింపవచ్చు"నని చమత్కారముగ చెప్పుదురు. వారు స్వర్గమునందు మాత్రమే యభిలాష గలవారలు, అనఁగా: కామ్యబుద్ధి గలవారలు. (౪౪) పూర్వోక్తవిషయమునందె వారి మనస్సు లగ్నమయియుండుటచే, వారు భోగమందును నైశ్వర్యమందును నిమగ్నులగుచున్నారు. మఱియు నాకారణమున వారియొక్క వ్యవసాయాత్మకబుద్ధి, అనఁగా: కార్యాకార్యముల నిశ్చయించు బుద్ధి యెప్పుడును సమాధిని పొందలేదు, అనఁగా: ఒకచోటను స్థిరమైనది కానేరదు.

[పూర్వమున చెప్పఁబడిన మూఁడు శ్లోకములు కలిసి యొకే వాక్యము. దానియందు శ్రౌత స్మార్త కర్మలవలె నేఁడు కార్యము సిద్ధించుటకై కర్మ చేయవలెనని కే పేదో మఱియొక యితరఫలముకొఱకును, ఇటులే యెప్పుడును స్వర్గముకొఱకే యజ్ఞయాగాదికర్మల చేయుటయందు నిమగ్నులును, జ్ఞానరహితకర్మఠులును నగు మీమాంసకులమతము చెప్పఁబడినది. ఆమత ముపనిషత్తుల యాధారముననే చెప్పఁబడినది. ఉదాహరణము, ముండకోపనిషత్తునందు—

"ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః,
నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వేమం లోకం హీనతరం వా విశంతి."

"ఇష్టాపూర్తమనునదియే శ్రేష్ఠము, మఱియొక యేదియు శ్రేష్ఠమైనది కాదని దెలిసికొను నీమూఢులు స్వర్గమున పుణ్యము ననుభవించి పిదప క్రిందనున్న యీ మనుష్యలోకమునకు మరల వత్తురు." (ముండ. ౧.౨.౧౦)—అని చెప్పఁబడినది. అట్టి జ్ఞానవిరహితకర్మ కఠోపనిషత్తునందును ఈశావాస్యమునందును నిందింపఁబడినది. (కఠ. ౨.౫ ఈశ. ౯, ౧౨.) పరమేశ్వరవిషయకమగు జ్ఞానమును సంపాదించుకొనక కేవలకర్మలయందే నిమగ్నులైన యీజనులకు (గీ. ౯. ౨౧. చూడు) ఆయాకర్మలచే

§§ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. ౪౫

[స్వర్గాదిఫలములు గలుగుట నిజమే కాని, వారివాసన నేఁడీకర్మయందును, రేపాకర్మయందును నుండి, స్వేచ్ఛగా నలుప్రక్కలకును పరుగిడుచుండును. కావున స్వర్గమునకు రాకపోకలు లభించినను వానికి మోక్షము మాత్రము కలుగదు. మోక్షప్రాప్తికి బుద్ధీంద్రియమును, స్థిరమును నేకాగ్రమును జేయవలయును. అయేకాగ్రత నెట్లు చేయవలసినదియు ముందు నాఱవయధ్యాయమునఁ జెప్పఁబడును. ఇప్పుడీవిషయమును మాత్రమే చెప్పుచున్నాఁడు—]

(౪౫) ఓయర్జునా! (కర్మకాండప్రతిపాదకమగు) వేదము(ఇట్లు) త్రైగుణ్యవిషయములతో నిండియుండును గాన నీవు నిస్త్రైగుణ్యుఁడవు, అనఁగా: త్రిగుణాతీతుఁడవును, నిత్యసత్త్వస్థుఁడవును, సుఖదుఃఖాది ద్వంద్వములచే నలిప్తుఁడవును, యోగక్షేమములు మొదలగు స్వార్థములందు నిమగ్నుఁడవు కానివాఁడవును, ఆత్మనిష్ఠుఁడవును కమ్ము!

[త్రైగుణ్య మనఁగా: సత్త్వము, రజస్సు, తమస్సు అనునీ మూఁడుగుణములును గలప్రకృతి యొక్క సంసారమని యర్థము; గావున, ఈసంసారము సుఖదుఃఖములు, జననమరణములు మొదలగు-నశించుస్వభావము గలద్వంద్వములతో నిండియున్నదనియు, సత్యమగు బ్రహ్మము దానికంటె పరముగ నున్నదనియు గీతారహస్యమునందు (పుట. ౩౧౨-౩౪౦) స్పష్టముగ నిరూపింపఁబడినది. ప్రకృతిసంబంధమయిన, అనఁగా: మాయాసంబంధమయిన, యీసంసారమున సుఖములఁ బొందుటకు మీమాంసకమార్గావలంబులు శ్రౌతములగు యజ్ఞయాగాదికములను చేయుచున్నారు, మఱియు వారు వానియందే నిమగ్నులగుచున్నారు, అని యీయధ్యాయమందలి ౪౩-వ శ్లోకమునఁ జెప్పఁబడినది. పుత్రప్రాప్తికొఱకు నొకరును, వర్షముకొఱకు మఱియొకరును యాగములను చేయుచున్నారు. ఈకర్మలన్నియు నిహలోకమునందు యోగక్షేమము కలుగుటకై చేయఁబడుచున్నవి. మోక్షము కావలసినవారు వైదికకర్మకాండమున నున్నవియు, త్రిగుణాత్మకమయినవియు మఱియు యోగక్షేమసంపాదకములయినవియు నగు నీకర్మలను వదలి తమచిత్తమును వీనికి పరమందున్న బ్రహ్మమునందుఁ జేర్ప

వలయునని స్పష్టమగుచున్నది. మఱియు నిందులకై యే నిర్ద్వంద్వ నిర్యోగ క్షేమశబ్దములు పూర్వమందు చెప్పఁబడినవి. వైదికకర్మకాండయందున్న కామ్యకర్మలను వదలివేయుదుమేని యోగక్షేమము లెట్లు సంభవించునని యిక్కడ సందేహము కలుగును. [గీ. ర. పుట. ౪౦౩-౪౩౨ చూడుడు); కాని దానికి సమాధానము నిచ్చట చెప్పక, ముందు ౯-వయధ్యాయమునందు చెప్పఁబడినది. అక్కడ ఈ యోగక్షేమములను భగవంతుఁడె కలుగఁ జేయునని చెప్పఁబడినది. మఱియు 'యోగక్షేమ'శబ్దములు గీతలలో నీరెండుస్థలములందె ప్రయోగింపఁబడినవి (గీ. ౯. ౨౨. మఱియు దానిపై నాటిప్పణి చూడుము). నిత్యసత్త్వస్థ పదమునకు త్రిగుణాతీతుఁడనియే యర్థము. కారణ మేమన:సత్త్వగుణముయొక్క నిత్యోత్కర్షచేతనే త్రిగుణాతీతావస్థ ప్రాప్తమగును గాన నదే సత్యమగు సిద్ధావస్థ యని చెప్పఁబడినది (గీ. ౧౪. ౧౪ మఱి ౨౦, గీ. ర. పుట. ౨౨౪. ౨౨౫ చూడు). మీమాంసకులయొక్క యోగక్షేమకారకములు, త్రిగుణాత్మకములునగు కామ్య కర్మలను వదలి, సుఖదుఃఖద్వంద్వములను దాఁటి బ్రహ్మనిష్ఠుఁడవు, లేక, యాత్మ నిష్ఠుఁడ వగు మని యిచ్చో నుపదేశము చేయఁబడినదని తాత్పర్యము; కాని, యాత్మనిష్ఠుఁడ వగు మన: ఈకర్మముల నన్నింటిని స్వరూపము చేతనే బొత్తిగ వదలివైవు మని యర్థము కాదను విషయమును మరల జ్ఞప్తియందుంచుకొనవలయును. పూర్వశ్లోకమునందు వైదికకామ్య కర్మలు నిందింపఁబడినవి; అనఁగా: వానికి న్యూనత చెప్పఁబడినది. ఈ నిందయంతయు కర్మల నుద్దేశించి చేయఁబడినది కాదు. ఇఁక నేమన: వాని విషయమై కామ్యబుద్ధి నుద్దేశించి చేయఁబడినది. ఈకామ్యబుద్ధులు మనస్సున లేనిచో యజ్ఞయాగాదికము లేమియు మోక్షమునకు ప్రతిబంధకములు కానేరవు. (గీ. ర. పుట. ౪౦౨-౪౦౬) కావున మీమాంసకుల యీయజ్ఞయాగాదికర్మలనే ఫలాశను సంగమును వదలి చిత్తశుద్ధికొఱకును, లోకసంగ్రహముకొఱకును నవశ్యము చేయవలయునని భగవంతుఁడు తనచే నిశ్చితమును, నుత్తమమును నగుమతమును ౧౮-వ యధ్యాయము యొక్క యారంభమునందు చెప్పియున్నాఁడు (గీ. ౧౮. ౬). గీతలయం దీరెండుచోటుల నున్న యీవిధుల కేకవాక్యతను చేసితిమేని యీ యధ్యాయమునందలి శ్లోకమునందు నిరూపింపఁబడిన మీమాంసకుల

యావా నర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే,

సంబంధమగు కర్మకాండయొక్క న్యూనతయందున్న కామ్యబుద్ధి నుద్దేశించి చేయఁబడినది; కాని క్రియనుమాత్రమే యుద్దేశించి చేయఁబడినది కాదని స్పష్టమగును. ఈయభిప్రాయమునే మనస్సున నిడికొని భగవంతుఁడును—

వేదోక్త మేవ కుర్వాణో నిస్సంగోఽర్పిత మీశ్వరే,
నైష్కర్మ్యం లభతే సిద్ధిం రోచనార్థా ఫలశ్రుతిః.

"వేదములయందు వేదోక్తకర్మలకు చెప్పఁబడిన ఫలశ్రుతి రోచనార్థము (అనఁగా: ఈకర్మలయందు కర్తలకు నుత్సాహమును గలుగఁ జేయు నిమిత్తమే) చెప్పఁబడినది. కావున నీకర్మలను ఫలాశతో చేయక నిస్సంగబుద్ధితో (అనఁగా: ఫలాశను వదలి యీశ్వరార్పణబుద్ధితో) చేయువారలకు నైష్కర్మ్యమువల్లఁ గలుగుసిద్ధి గలుగును"—అని చెప్పియున్నాఁడు (భాగ. ౧౧. ౩. ౪౬). అందుచే, వేదమునం దీకర్మ నిందులకై చేయవలయునని చెప్పఁబడినను, కేవలము యష్టవ్యము లను నూహతో (అనఁగా: యజ్ఞములు తమకు కర్తవ్యము లనుతలంపుతో) నీయజ్ఞములను చేయవలయును. కామ్యబుద్ధిని విడిచిపెట్టవలయును. యజ్ఞములను విడిచిపెట్టకూడదు (గీ. ౧౮. ౧౧). మఱియు నీరీతిగనే యితరకర్మలను సైతము చేయవలయు ననునది గీతలయందలి యుపదేశసార మని తాత్పర్యము. మఱియు నాయర్థమే యుత్తరశ్లోకమున వ్యక్తము చేయఁబడినది.

(౪౬) నలుప్రక్కల నుదకము పూర్ణముగ నుండఁగా నుదపానమునకు (బావికి) నెంతప్రయోజనమో (అనఁగా: ఏమియు ప్రయోజన ముండదని తాత్పర్యము), జ్ఞానప్రాప్తి కలిగిన బ్రాహ్మణునకును నీసమస్త(కర్మకాండాత్మకమగు) వేదమువలన నంతయే ప్రయోజన ముండును. (అనఁగా: కేవలకామ్య కర్మరూపమగు వైదికకర్మకాండయొక్క యపేక్ష వారి కుండదు).

[ఈశ్లోకముయొక్క ఫలితార్థము విషయమయి మతభేదములు లేవు. కాని దానియందున్న శబ్దములను టీకాకారులు వ్యర్థముగ చీకాకుపఱచిరి. 'సర్వతః సంప్లుతోదకే' యనునది సప్తమ్యంతమగు సామాసికపదము; కాని సప్తమ్యంతము మాత్రమే యని కాని, లేక, యుదపానమునకు విశేషణ మని కాని యనుకొనక 'సతి సప్తమి' యని యందుమేని "సర్వత

తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. ౪౬

స్సంప్లుతోదకే సతి ఉదపానే యావా నర్థః (న స్వల్ప మపి ప్రయోజనం విద్యతే) తావాన్ విజానతః బ్రాహ్మణస్య సర్వేషు వేదేషు అర్థః" అని యేవో కొన్ని లేనిపదముల నధ్యాహారము తెచ్చుకొన నవసరములేకయే సరళమగు నన్వయము కుదురును. "నలుదిక్కులయందును జలమే వ్యాప్తమయి యుండుటచేత (అనాయాసముగ త్రాగుటకు సరసమగునుదకము లభించినచో) నేరీతిగ వాపీకూపాదులను విచారింపరో, యటులనే జ్ఞానము సిద్ధించినవానికి యజ్ఞయాగాదివైదికకర్మలవలన నుపయోగ మేమియు నుండదని దానికి సరళమైనయర్థము చెప్పవచ్చును. కారణ మేమన: వైదిక కర్మలు స్వర్గప్రాప్త్యర్థమే కాక, మోక్షసాధకమగు జ్ఞానప్రాప్తి కలుగుటకుసైతము చేయఁదగినవి. ఈజ్ఞానప్రాప్తి మొదటనే కలిగినవారికి వైదిక కర్మల నాచరించుటవలన క్రొత్తగ వచ్చున దేమియు లేదు. ఈకారణము చేతనే "జ్ఞానులగు వారి కీజగత్తునందు కర్తవ్య మేమియు నుండదు".అని మూఁడవయధ్యాయములో (౩.౧౭) చెప్పఁబడినది. గొప్ప చెఱువునందుఁగాని, లేక, యేటియందుఁ గాని,యనాయాసముగ త్రాగుటకు వలసినంత నీరున్నప్పుడు నూతి నెవరు శ్రద్ధగాఁ జూతురు?. ఇట్టిసమయములయం దెవరును కూపాదుల నపేక్షింపరు. సనత్సుజాతీయమందలి కడపటియధ్యాయము నం దీశ్లోక మే కొంచెము శబ్దభేదముతోఁ జెప్పఁబడినది (మ. భా. ఉద్యో. ౪౫. ౨౬). మాధవాచార్యుల వ్యాఖ్యయందు దానియర్థము నేను పైనఁ జెప్పినరీతిగనే వ్రాయఁబడినది; మఱియు శుకానుప్రశ్నమునందు జ్ఞాన కర్మలతారతమ్యవివేకము దెలుపునపుడు "న తే (జ్ఞానినః) కర్మ ప్రశంసంతి కూపం నద్యాం పిబ న్నివ"—ఏటిలో నీరుండఁగా జనులు కూపాదులగౌరవింపనటు లాజ్ఞానులు కర్మల నొకగొప్పవానినిగఁ జూడరు." అని స్పష్టముగఁ జెప్పఁబడినది (మ. భా. శా. ౨౪౦. ౧౦). అటులే పాండవగీతయందు ౧౭-వ శ్లోకమున వాసుదేవుని వదలి యితరదేవతల నుపాసించువాఁడు—"తృషితో జాహ్నవీతీరే కూపం వాంఛతి దుర్మతిః"—గంగయొడ్డునఁ గూర్చుండి దప్పిఁ దీర్చుకొనుటకై బావిని వెదకునట్టిమూర్ఖుఁ డగును— అని కూపాదిదృష్టాంత మీయఁబడినది. వైదికములగు సరస్కృతగ్రంథములయందు మాత్రమే యీదృష్టాంతము చెప్పఁబడలేదు;

పాళీభాషలోని బౌద్ధగ్రంథములయందును నీదృష్టాంతమే గ్రహింపఁబడినది. ఆశను సమూలముగ నశింపఁజేసినవానికి పిమ్మట పొందఁదగినవస్తువేమియు నుండదనువిషయము బౌద్ధధర్మమునందును గలదు. కావున నావిషయమును చెప్పునపుడు దానికి దృష్టాంతముగ "ఉదానము" అనుపేరి పాళీగ్రంథమునందు (౭. ౯)— "కిం కయిరా ఉదపానేన ఆపాచే సబ్బదా సియుం"— అన్నిదిక్కుల నెల్లప్పుడు నుదకు లభించునపుడు కూపము తీయుటవలన ప్రయోజన మేమి?—అని యున్నది. ఇంటిలో నీటికొళాయినుంచినచో బావి నెవరును లక్ష్యము చేయరను విషయము గొప్పపట్టణములయందు నేఁటికిని జెలిసియే యున్నది. దీనినిబట్టియు, విశేషముగ శుకానుప్రశ్నయందున్న వివేచననుబట్టియు, గీతలయందున్న దృష్టాంతమునందలి స్వారస్యము తెలియును. కాన నీశ్లోకమునకు పైన నేఁజెప్పినయర్థమే సరళముగను యుక్తముగను నున్నట్లు కాన్పించును. కాని యీయర్థముచే వేదమునకు కొంచెమైనను గౌణత్వము వచ్చునని తలఁచికాని, లేక, జ్ఞానమునందే సర్వకర్మములును జేరియుండుటచే జ్ఞాని కర్మ చేయవలసిన యావశ్యకత యుండదని సాంప్రదాయికసిద్ధాంతమును విచారించి కాని, గీతలటీకాకారు లీశ్లోకమునందున్న పదములకు కొంచెము వేఱుగ నన్వయమును జెప్పిరి. మఱియు నీశ్లోకమున ప్రథమచరణమునందు 'తావాన్' అనుపదమును, రెండవచరణమునందు 'యావాన్' అనుపదమును అధ్యాహారము చేసికొని "ఉదపానే యావా నర్థః తావానేవ సర్వత స్సంప్లుతోదకే యథా సంపద్యతే తథా యావాన్ సర్వేషు వేదేషు అర్థః తావా న్విజానతః బ్రాహ్మణస్య సంపద్యతే" (అనగా: కూపము స్నానపానాదికార్యార్థమై యెంత యుపయోగించునో గొప్ప తటాకమును (సర్వత స్సంప్లుతోదకే) నంతయే యుపయోగించును. అటులే వేదములవలన నెంత యుపయోగమున్నదో యంత యుపయోగమే జ్ఞానులకు వారిజ్ఞానమువలనఁ గలుగవచ్చును—అని యర్థము చెప్పుచున్నారు; కాని యీయన్వయమునందు మొదటిచరణమున 'తావాన్' అనియు, రెండవచరణమున 'యావాన్' అనియు రెండుపదము లధ్యాహృతములు గావలసివచ్చును; గావున నే యీయన్వయము నొప్పుకొనను. నేఁజెప్పిన యన్వయమును నర్థమును, ఏపదముయొక్కయు నధ్యాహార మవ

కర్మ ణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సంగో ఽ స్త్వకర్మణి. ౪౭

సరము లేకయే కుదురును గాన వానియందు ప్రతిపాద్య మగు వేదముల యందలి కర్మకాండమునకు మాత్రము గౌణత్వ మిచ్చుట వివక్షిత మయి యున్నదని పూర్వశ్లోకమునందుండియే సిద్ధమగుచున్నది; కాని జ్ఞానులకు యజ్ఞయాగాదికర్మాపేక్ష యుండదని చెప్పుటచే జ్ఞానులీకర్మ చేయ కూడదు. బొత్తిగ విడిచిపెట్టవలయునని యనేకులు చేయు ననుమానము మాత్రము గీతలకు సమ్మతము కాదు. కారణ మేమన: ఈకర్మలయొక్క ఫలము జ్ఞానికి నక్కరలేక పోయినను, ఫలార్థమే కాక యజ్ఞయాగాది కర్మలు శాస్త్రవిహితములును కర్తవ్యములును గాన, కర్మల నెప్పుడును వదలుటకు వీలులేదు. ఫలాశ లేకపోయినను నితరములగు నిష్కామకర్మలవలె యజ్ఞయాగాదికర్మలను సయితము నిస్సంగబుద్ధితో జ్ఞానులు సేయుచునే యుండవలయునని ౧౮–వ యధ్యాయమున భగవంతుఁడు తనసిద్ధాంతమగు మతమును స్పష్టముగఁ జెప్పెను (పూర్వశ్లోకముమీఁదను, గీ. 3.౧౯ మీఁద నున్న నాయొక్క టీకను చూడుఁడు); ఈనిష్కామపరమగు నర్థమే ముందు శ్లోకమునందు వివరించుచున్నాఁడు.—]

(౪౭) కర్మను చేయుటకే మాత్రమే నీకధికారము; ఫలము (లభించు టకుఁగాని, లభింపకపోవుటకుఁగాని) ఎప్పుడును నీయధీనము కాదు; కాన నాకర్మల కీవిధమగుఫలము కావలయునని యభిలాషను మనమున నిడికొని కర్మ చేయకుము; మఱియుఁ గర్మలను చేయకపోవుటయందు సయితము నీవాగ్రహమును బొందఁదగదు.

[ఈశ్లోకమునందలి నాలుగు పాదములును నొకదానియర్థమును మఱి యొకటి పూరణము చేయుచున్నవి; గాని కర్మయోగముయొక్క రహస్య మంతయును కొంచెములోనె చక్కఁగఁ జెప్పుటకు వీలయినది. వేయేల? ఈనాలుగుచరణములును కర్మయోగముయొక్క చతుస్సూత్రియే యని చెప్పవచ్చును. "కర్మను చేయుటయందు మాత్రమే నీ కధికారము కల" దని మొదట చెప్పఁబడినది; కాని కర్మలయొక్క ఫలము కర్మలనుసంబంధించియే యుండుటచే 'చెట్టెవరిదో పండును వారిదె' యను న్యాయమునుబట్టి కర్మ

§§ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮

చేయుట కధికారము గలవారే ఫలమున కధికారు లేల కారని శంకింప వచ్చును. కాన నాశంకను నిరాకరించునిమిత్తమయి "ఫలము విషయమయి నీకధికారము లేదు" అని స్పష్టముగ విధింపఁబడినది. పిదప "ఫలాశను మనంబున నిడికొని కర్మ చేయవద్దు" అని దానినుండి నిష్పన్నమగు మూఁడవసిద్ధాంతము చెప్పఁబడినది ("కర్మఫలహేతుః కర్మఫలే హేతుః యస్య స కర్మఫలహేతుః" అని బహువ్రీహిసమాసము); కాని కర్మయు వానియొక్క ఫలమును కలిసియే యుండుటచే ఫలాశనువలెనే కర్మను సైతము వదలవలయునని యెవరైనఁ జెప్పఁబోవుదు రేమో! అది సత్యము కాదని చెప్పుటకు ఫలాశను విడువుము; కాని దానివలెనే "కర్మలను సైతము విడిచిపెట్టుట యనునాగ్రహమును చెందకుము" అని తుదకు స్పష్టముగ నుపదేశింపఁబడినది. కర్మ చేయు మనుటచే ఫలాశతో కర్మ చేయుమని యర్థము కాదనియు, ఫలాశను విడిచిపెట్టు మనుటచే కర్మను వదలు మని యర్థము కాదనియు, ఫలాశను వదలి కర్తవ్యకర్మ నవశ్యము చేయువలయుననియు, కర్మలయం దాసక్తిని జెందకూడదనియు, కర్మలను వదలుటయుఁ గూడ దనియు—త్యాగో న యుక్త ఇహ కర్మసు నాపి రాగః (యోగ. ౫. ౫. ౫౪)—అని యోగవాసిష్ఠమున నున్నవిషయమే యిచ్చట ప్రతిపాద్యమనియు నిందలిసారాంశము. మఱియు నీయర్థమునే, ఫలము లభించుట యనువిషయము మనస్వాధీనముగ లేనందున నితరములగు ననేకవిషయములు దానికి ననుకూలములగునని నిరూపణ చేసి, ౧౮-వ యధ్యాయమునందు మరల దృఢీకరింపఁబడినది (గీ. ౧౮. ౧౪-౧౬ మఱియు గీతారహస్య. ప్ర. ౫ పుట. ౧౫౫ మఱియు ప్ర. ౧౨ చూడుము). ఇప్పుడు దీనినే యోగము, లేక, కర్మయోగము అని చెప్పుచున్నారని కర్మయోగమునకు స్పష్టమగు లక్షణమును చెప్పుచున్నాఁడు—]

(౪౮) ఓధనంజయా! ఆసక్తిని వదలివైచి, కర్మ సిద్ధించినను, నిష్ఫలమైనను సమానముగఁ బ్రవర్తించుచు 'యోగస్థుఁడ'వై కర్మలను చేయుము; (కర్మ సిద్ధించుట, లేక, నిష్ఫలమగుట యనువిషయమున) సమానమగు (మనో)-వృత్తికే (కర్మ-)యోగ

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯
బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. ౫౦

మని పేరు. (౪౯) కారణమేమన: ఓధనంజయా! బుద్ధియొక్క (సమానత్వ మను) యోగముకంటె (బాహ్య మగు) కర్మ మిక్కిలి కనిష్ఠమైనది. (కాన నీసామ్య) బుద్ధిని శరణుఁజెందుము. ఈఫలహేతువులు, అనఁగా: ఫలమును గోరి కర్మలఁ జేయువారు, కృపణులు, అనఁగా: దీనులు, లేక, క్రిందిమెట్టువారు అగుదురు. (౫౦) (సామ్య)బుద్ధియుక్తుఁ డయినవాఁ డీలోకమున పుణ్యపాపములచేత నలిప్తుఁ డగును. కాన యోగము నాశ్రయింపుము. (పుణ్యపాపములంటక యుండునటులు) కర్మ చేయుట యనుచాతుర్యమే(కౌశలము, లేక, యుక్తియే)(కర్మ-) యోగము.

[ఈశ్లోకమునందు చెప్పఁబడినకర్మయోగలక్షణములు మిక్కిలి గొప్పవి. వానివిషయమును గీతారహస్యమునందలి మూఁడవప్రకరణమున (పుట. ౭౬-౮౬) నుండువివేచనను జూడుము; కాని వానిలో సైతము కర్మ కంటె బుద్ధిశ్రేష్ఠ మని ౪౯-వ శ్లోకమున నిరూపింపఁబడిన కర్మయోగము యొక్క సిద్ధాంత మింకను గొప్పది. బుద్ధిశబ్దమునకు పూర్వమునందు 'వ్యవసాయాత్మికా' అనువిశేషణము లేమిచే దాని కీశ్లోకమునందు వాసన, లేక, తెలిసికొనుట యని యర్థము గ్రహింపవలయును. బుద్ధి యనఁగా: జ్ఞాన మని యర్థము చేసికొని, యనేకు లీశ్లోకమునకు జ్ఞానముకంటె కర్మ తక్కువ దను తాత్పర్యమును జెప్పుచున్నారు; కాని యీయర్థము నిజమైనది కాదు. కారణ మేమన: పూర్వమున ౪౮-వ శ్లోకమునఁ జేయఁబడిన సమత్వ వర్ణన, పరమందున్న ౪౯-వ శ్లోకమునందును పిమ్మటను జేయఁబడుచున్నది గాన, బుద్ధి యనఁగా సమత్వబుద్ధి యనియే యిచ్చో నర్థముచేసికొన వలయును. ఏకర్మయొక్క మంచిచెడుగు లైనను, కర్మ నవలంబించి యుండవు. కావున కర్మ యొకటియే యైనను, కర్తయొక్క బుద్ధినిబట్టి యది శుభము గాని, యశుభముగాని యగుచున్నది; కావున కర్మకంటె బుద్ధియే శ్రేష్ఠ మయినది ; ఈమొదలగు నీతితత్త్వములవిచారణ గీతారహస్యము నందలి ౪,౧౨,౧౫ ప్రకరణములయందు చేయఁబడినది గాన నిచ్చో నా విషయమును చర్చింపము (గీ. ర. పుట. ౧౨౦-౧౨౬, ౬౫౨-౬౫౮).

§§ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛ న్త్యనామయమ్. ౫౧
యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి,
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. ౫౨

వాసనాత్మకబుద్ధిని సమముగను, శుద్ధముగ నుండుటకు కార్యాకార్యముల నిర్ణయించువ్యవసాయాత్మకబుద్ధిని మొదట స్థిరము చేసికొనవలయునని పూర్వమున ౪౧-వ శ్లోకమున చెప్పఁబడినది. కావున సామ్యబుద్ధి యను నొకశబ్దముచేతనే స్థిరమగు వ్యవసాయాత్మికబుద్ధియు, శుద్ధవాసన (వాసనాత్మకబుద్ధి)యు అను నీరెండును తెలియఁబడుచున్నవి. ఈసామ్యబుద్ధియే శుద్ధమగు నాచరణమునకుఁ గాని, కర్మయోగమునకుఁ గాని మూలము గాన ౩౯-వ శ్లోకమునందు, కర్మలు చేసినను కర్మలయొక్క బాధ తగలని యుక్తి, లేక, యోగమును నీకు చెప్పుచున్నానని భగవంతుఁడు చెప్పినదాని ననుసరించి యీశ్లోకమునందు కర్మలు చేయుచో, బుద్ధిని స్థిరముగను పవిత్రముగను సమముగను శుద్ధముగను నుంచుట యనునదియే యుక్తి యనియు, లేక, కౌశల మనియు, దీనినే యోగ మని చెప్పుచున్నా రనియు యోగ శబ్దము రెండుపర్యాయములు వ్యాఖ్యానము చేయఁబడినది. ౫౦-వ శ్లోకమునందు "యోగః కర్మసు కౌశలమ్" అనుశ్లోకమున కీవిధముగ సరళమైనయర్థము కుదురుచుండ ననేకులు "కర్మసు యోగః కౌశలం" "కర్మలయందున్నయోగమునే కౌశల మందు"రని తలక్రిందుగ నర్థముచేయుటకొఱకు ప్రయత్నము చేసిరి; కాని 'కౌశల'శబ్దమును వ్యాఖ్యానము చేయుటకు నిక్కడ నేమియు నవసరము లేకపోవుటయే కాక, యోగమునకు లక్షణము చెప్పుటయే ప్రస్తుత మవసరమగుటచే నీయర్థము సత్య మని చెప్పుటకు వీలులేదు. ఇంతియకాక "కర్మసు కౌశలం" అని సరళమగు నన్వయము కుదురుచుండ "కర్మసు యోగః" అని తలక్రిందులు చేయుటయు యోగ్యము కాదు. ఇట్లు సామ్యబుద్ధిచే సర్వకర్మలను చేయుటయేని వ్యవహారలోపము రాకుండ పూర్ణమగు సిద్ధి, లేక, మోక్షము కలుగక తప్పదని చెప్పుచున్నాఁడు—]

(౫౧) (సమత్వ) బుద్ధిచే యుక్తులగు జ్ఞానులు కర్మఫలమును వదలి పెట్టుచే జన్మబంధమునుండి ముక్తులగుచు (పరమేశ్వరునియొక్క) దుఃఖవిరహితమగు పదమును బొందుదురు. (౫౨)ఎప్పుడు, నీయొక్క బుద్ధి, మోహసంబంధమై

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. ౫౩

మలినమైనవిషయము, ఆవరణమును దాఁటిపోవునో, అప్పుడిదివఱకు వినఁబడినవియు, ఇఁకముందు వినఁబోవునవియు నీ కసహ్యములుగఁ దోఁచును.

[అనఁగా: విశేష మేమియు విననక్కఱలేదని తోఁచును. కారణ మేమన; ఏవిషయము 'వినుటనుండి యేఫలప్రాప్తి కావలసియున్నదో, యదంతయు నీకు మొదటనే ప్రాప్తమయి యున్నది. 'నిర్వేద' శబ్దమును సంసారవిషయకమగు నేవగింపునందును, వైరాగ్యమందును దఱచుగ నుపయోగించుచున్నారు. ఈశ్లోకమునం, దాశబ్దమునకు సామాన్యముగ 'అసహ్యపడుట' లేక, 'వలదనుకొనుట', యని మాత్రమే యిచ్చో వివక్షితార్థము. ఈయసహ్యపడుట ముఖ్యముగ పూర్వమందుఁ జెప్పఁబడిన త్రైగుణ్యవిషయమగు శ్రౌతకర్మనుగుఱించియే యని ముందు శ్లోకముం బట్టి కాన్పించును.]

(౫౩) (నానావిధములగు) వేదవాక్యములచే భ్రమఁ జెందిన నీయొక్క బుద్ధి సమాధివృత్తియందు స్థిరమును నిశ్చలము నయినప్పుడు (ఈసామ్యబుద్ధిరూపమగు) యోగము నీకు ప్రాప్త మగును.

[పూర్వమున ౨.౪౪-వ శ్లోకమున చెప్పినట్లు వేదవాక్యములయందలి ఫలశ్రుతులచే భ్రమపడి, యీఫలమునకై యీకర్మను జేయుమనియు, ఆఫలమునకై యాకర్మను జేయుమనియుఁ జెప్పఁబడిన యనేకములగు కర్మప్రతిపాదకశ్రుతులను వినుటచే బుద్ధి స్థిరము గాక పోవుటయే గాక మఱింత భ్రమను సైతము చెందుననియు, కావుననే యనేకములగు నుపదేశములను వినుట యనుకార్యమును వదలి, చిత్తమును నిశ్చలమగు సమాధిలో నుంచు మనియు, అటులైన సామ్యబుద్ధిరూపమగు కర్మయోగము నీకు లభించుటచే విశేషమగు నుపదేశములయావశ్యకత యుండదనియు, కర్మలు చేసినను వానిపాపము నీకు తగులనేర దనియు, ఇటులే కర్మయోగియొక్క బుద్ధి గాని ప్రజ్ఞ గాని స్థిరమయినదో వానిని స్థితప్రజ్ఞుఁ డని చెప్పుచున్నారనియు నిందలిసారాంశము. వారివర్తన మెట్లుండునని యర్జునుఁ డడుగుచున్నాఁడు.]

అర్జున ఉవాచ.

§§ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ,
స్థితధీః కిం ప్రభాషేత కి మాసీత వ్రజేత కిమ్. ౫౪

శ్రీభగవా నువాచ.

ప్రజహాతి యదా కామా న్సర్వా న్పార్థ మనోగతాన్,
ఆత్మ న్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్త దోచ్యతే. ౫౫
దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః,
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే. ౫౬
యః సర్వత్రానభిస్నేహ స్త త్త త్ప్రాప్య శుభాశుభమ్,
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౫౭

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు—(౫౪) ఓకేశవా! ఎవఁడు సమాధిస్థుఁడగు స్థితప్రజ్ఞుఁ డనిచెప్పఁబడును? ఆస్థితప్రజ్ఞునియొక్క సంభాషణ, కూర్చుండుట, నడుచుట మొదలగునవి యెటు లుండును? (అది నాకు చెప్పుము.)

[ఈశ్లోకమునందు 'భాషా'శబ్దము 'లక్షణ' మనునర్థమునఁ బ్రయోగింపఁబడినది. మఱియు దానియందున్న 'భాష్' ధాతువు ననుసరించి "ఎవఁడు చెప్పఁబడును?" అని దానియొక్క యర్థమును భాషాంతరము చేసినాను. స్థితప్రజ్ఞునియొక్క వర్తనమనఁగా: కర్మయోగశాస్త్రముయొక్క పుట్టకీటని గీతారహస్యముయొక్క ౧౨-వ ప్రకరణమునందు (పు. ౫౦౩-౫౨౪) స్పష్టముగ నిరూపింపఁబడినది. మఱియు దానింబట్టి ఇఁకపైఁ జేయఁబడువర్ణనయొక్క మహత్త్వము తెలియును.]

(౫౫) శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు—ఓపార్థా! మనస్సునందున్న కోరికల నన్నిటిని, (అనఁగా: వాసనలను వదలి తనయందే సంతుష్టుఁడై యెప్పుడుండునో అప్పుడు వానిని స్థితప్రజ్ఞుఁడని చెప్పవలయును. (౫౬) దుఃఖమునం దెవరిమనస్సు ఖేదము నొందదో, సుఖమునం దెవరికి నాసక్తి లేదో, అనురాగము,భయము, క్రోధము నెవరికి లేవో,వానిని స్థితప్రజ్ఞుఁడగు ముని యని చెప్పుచున్నారు. (౫౭) అన్నివిషయములయందు నెవరిమనస్సు నిస్సంగమైనదో, కాలానుసారముగ ప్రాప్తములగు శుభాశుభములయం దెవరికి నానందము గాని, విషా

యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౫౮
విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. ౫౯

దము గాని లేదో, వారియొక్క బుద్ధి స్థిరమైనది (అని చెప్పవలయును). (౫౭) తాఁబేలు తన(హస్తపాదాది)అవయవముల నన్నింటిని ప్రక్కలకు ముడుచుకొనునటు లెవఁ డింద్రియములయొక్క (శబ్దస్పర్శాది)విషయములనుండి తనయింద్రియముల నుపసంహరించుకొనునో యతనిబుద్ధి స్థిర మయినది (అని చెప్పవలయును). (౫౮) నిరాహారుఁడగువానికి విషయములు నివర్తించినను వానియందున్నరసము, అనఁగా: అభిలాష వదలదు; కాని పరబ్రహ్మముయొక్క యనుభవము గలిగినపిదప (సర్వవిషయములును, వానియందున్న) అభిలాషయు వదలిపోవును.

[ఇంద్రియము లన్నముచేఁ బోషింపఁబడును కాన నుపవాసము చేయుటచే నింద్రియము లశక్తము లయినందున నవి స్వయముగనె తమతమవిషయముల సేవించుటకు నసమర్థము లగుచున్నవి. కాన విషయోపభోగ మీతీరున వదలిపోవుటయు బలవత్తరమగు నశక్తతారూపమగు నొకబాహ్యక్రియయై యున్నది. మనస్సునందున్న విషయవాసన (రసము) దానివలన తక్కువ కానేరదు. కావున నావాసన దేనిచే నశించునో యట్టిబ్రహ్మజ్ఞానము సంపాదింపవలయును. మఱియు నీరీతిగ బ్రహ్మానుభవము సంఘటిల్లినపిదప మనస్సును నింద్రియములును తమంతటఁ దామే స్వాధీనము లగును. ఇంద్రియములు స్వాధీనములగుటకు నిరాహారాద లగునుపాయము లక్కఱ లేదని మొత్తముమీఁద నీశ్లోకమునకు భావార్థము. మఱియు నీయర్థమే ముందు యోగులయొక్క యాహారము మితముగ నుండవలయు ననియు, ఆహారవిహారాదుల నతఁడు బొత్తిగ వదలిపెట్టఁగూడదనియు, నాఱవ యధ్యాయమునందు స్పష్టముగ చెప్పఁబడినది. (గీ. ౬. ౧౬, ౧౭ మఱియు ౩. ౬,౭ చూడు). శరీరమును కృశింపఁజేయు నిరాహారాదిసాధనములు గౌణము లయినందుననే త్యాజ్యము లని నిశ్చయించి యుక్తములగు నాహారవిహారములును, బ్రహ్మజ్ఞానము ననునవియె యింద్రియనిగ్రహమునకు నుత్తమసాధనము లని గీతాసిద్ధాంతమని తెలిసికొనవలయును. ఈ శ్లోకమునందలి రసశబ్దమునకు జిహ్వచే ననుభవింపఁదగిన తీపి, చేఁదు మొద

యతతో హ్యాపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః. ౬౦
తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౬౧

లగు రసములని యర్థము చేసికొనినందున, నుపవాసములచే మిగిలినయింద్రియములయొక్క విషయములు వదలిపోయినను జిహ్వయొక్క రసము, అనఁగా: తినవలయును, త్రాగవలయు ననునిచ్ఛ తప్పక కొంతపోఁగా ననేకదినములు నిరాహారముగ నుండుటచేత నది మిక్కిలి తీవ్రమగునని యనేకు లర్థము చేయుదురు; మఱియు భాగవతమునం దిట్టియర్థము గల యొకశ్లోకము గలదు (భాగ. ౧౧. ౮. ౨౦). కాని గీతలయందున్న యీ శ్లోకమునకు నిటు లర్థము చేయుట యోగ్యము కాదని మామతము. కారణ మేమన: రెండవచరణముతో నది సంబంధింపదు. ఇంతియకాక భాగవతమందు 'రస'శబ్దము లేదు. మఱియు గీతలయందున్న శ్లోకముయొక్క రెండవ చరణమును నక్కడ లేదు. కావున భాగవతమునందును, గీతలయందును నుండుశ్లోకము లొకయర్థము గలవియే యనుట యుక్తము కాదు. బ్రహ్మసాక్షాత్కారము లేక పూర్ణమగునింద్రియనిగ్రహము గలుగుట శక్యము కాదను నీయర్థమే యిఁకముందున్న రెండుశ్లోకములలో నిప్పుడు మిక్కిలి స్పష్టముగ చెప్పుచున్నాఁడు—]

(౬౦) ఓకుంతీపుత్రా! కారణమేమన:(ఇంద్రియదమనార్థమే)ప్రయత్నించు విద్వాంసులయొక్క మనస్సును సైత మీదుండగములగు నింద్రియములు బలాత్కారముగ పెడత్రోవలకుఁ గైకొనిపోవును. (౬౧) (కావున) ఈయింద్రియముల నన్నింటిని వశపఱచుకొని యుక్తుఁడవును, అనఁగా: యోగయుక్తుఁడవును, మత్పరాయణుఁడవును నయి యుండవలయును. ఈరీతిగ నింద్రియము లెవరికి స్వాధీనము లైనవో వారియొక్క బుద్ధియే స్థిర మయినది యగును (అని చెప్పవలయును).

ఈశ్లోకమునందు మితాహారముచే నింద్రియముల నిగ్రహించుకొని, బ్రహ్మజ్ఞానప్రాప్తికొఱకు మత్పరాయణుఁడవు, (అనఁగా: ఈశ్వరునియందు చిత్తమును నెలకొల్పినవాఁడవు, కావలయు నని చెప్పఁబడినది. మఱియు దానియందున్న కారణము ౫౯-వ శ్లోకమునకు నేను చేసినయర్థమునుబట్టి స్పష్ట మగును. మనువునయితము "బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి

ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. ౬౨

కర్షతి''-(మను. ౨.౨౧౫) అని కేవలమింద్రియనిగ్రహము చేయుపురుషులకు మార్గమును చూపించెను; మఱియు దానియొక్క యనువాదమే పూర్వమందున్న ౬౧-వ శ్లోకమున చేయఁబడినది. స్థితప్రజ్ఞత్వమును గోరువా రాహారవిహారములను మితముగఁ జేయుచు బ్రహ్మజ్ఞానమును సంపాదించుకొనవలయుననియు, మనకు బ్రహ్మజ్ఞానము కలిగినవెంటనే మనస్సు నిర్విషయ మగుననియు, శరీరక్లేశము బాహ్య మగునుపాయ మనియు, సత్యమయినది కాదనియు నీమూఁడుశ్లోకములయందును గలసారాంశము. మఱి 'మత్పరాయణ'పదముచే భక్తిమార్గముసైతము దీనియందు సూచింపఁబడెను (గీ. ౯.౩౪ చూడు). పైశ్లోకమునందున్న 'యుక్త'శబ్దమునకు 'యోగముచే సిద్ధుఁడు, లేక, నిష్పన్నమయినవాఁ'డని యర్థము. గీత. ౬.౧౪ లో నున్న'యుక్త'శబ్దమునకు నియమితుఁ డని యర్థము; కాని గీతలోఁ జెప్పఁబడిన యీశబ్దమునకు ''సామ్యబుద్ధిరూపమగు యోగమును దెలిసికొని తదనుసారముగ శాంతితో దుఃఖముల నన్నిటిని సహింపనేర్చినగృహస్థుఁ''డని మిగిలినయన్నిచోటులను నర్థము చేసికొనవలయును (గీ. ౫.౨౩. చూడుము). ఇటు లలవడినగృహస్థునే 'స్థితప్రజ్ఞుఁ' డందురు. అట్టియవస్థయే సిద్ధావస్థ యందురు. మఱియు నీయవస్థయే యీయధ్యాయముయొక్కయు ౫,౧౨-వ యధ్యాయములయొక్కయు చివరను వర్ణింపఁబడినది. విషయములయం దభిలాషనువదలి, స్థితప్రజ్ఞుఁడగుటకు నేమి కావలసినదియు చెప్పఁబడినది. ఇప్పుడు విషయములయం దభిలాష యెట్లు పుట్టునో చెప్పి యాయభిలాషచేత కామక్రోధాదివికారములు పుట్టుననియు, వాని వలన తుదకు మనుజునకు హాని యెట్లు కలుగు నదియు, నిరూపించి వానియందుండి విముక్తి యెట్లు సంపాదింపవలసినదియు, రాఁబోవు శ్లోకములయందు చెప్పుచున్నాఁడు—]

(౬౨) విషయముల చింతించుపురుషునకు నావిషయములయందు సంగము (సంబంధము) వృద్ధి పొందుచుండును. ఈసంగమునుండి కామము, అనఁగా: విషయములుతనకు కావలయుననుకోరిక, యుత్పన్న మగును. ఈకామము తృప్తినొందుట

క్రోధా ద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి. ౬౩
రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్,
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. ౬౪
ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. ౬౫

కవకాశము గలిగెనేని యాకామమునుండియే క్రోధము పుట్టును. (౬౩) క్రోధమునుండి సమ్మోహము, అనఁగా: అవివేకము, బయలు వెడలును. సంమోహమునుండి స్మృతిభ్రమ, స్మృతిభ్రంశమునుండి బుద్ధినాశము, బుద్ధినాశమువలన పురుషుని యొక్క సర్వస్వమును నశించును; (౬౪) కాని తనయాత్మ, అనఁగా: అంతఃకరణము, స్వాధీనముగ నుండువాఁడు, రాగద్వేషమునుండి విముక్తములును, తనకు స్వాధీనములై యున్నవియు నగు నింద్రియములచేత విషయములలో సంచరించుచున్నను, చిత్తముచేతను ప్రసన్నుఁడగును. (౬౫) చిత్తము ప్రసన్న మగునేని, యతనియొక్క దుఃఖములన్నియు నశించును. కారణ మేమన: వారియొక్క బుద్ధియు తత్కాలముననే స్థిర మగును.

[ఈ రెండు శ్లోకములయందును, విషయములను, లేక, కర్మలను వదలక వానియందలి సంగమును మాత్రము వదలి, స్థితప్రజ్ఞుఁడు విషయములయందే నిస్సంగబుద్ధితో ప్రవర్తించుచున్నాఁ డనియు, అతనికి కలిగిన శాంతి కర్మత్యాగమువలన కలిగినది కాదనియు, ఫలాశాత్యాగమువలన కలిగినదనియు, స్పష్టముగఁ జెప్పఁ బడినదని తెలిసికొనవలయును. కారణ మేమన: ఈవిషయమునఁ గాక యితరవిషయమునందు నిష్కితప్రజ్ఞునకును, సన్న్యాసమార్గమునవలంబించిన స్థితప్రజ్ఞునకును భేద మేమియు లేదు. ఇంద్రియసంయమనము, కోరికలు లేకుండుట, శాంతియు, అను గుణములుభయులకును కావలసియే యున్నవి; కాని గీతలయందు చెప్పఁబడిన స్థితప్రజ్ఞుఁడు కర్మసన్న్యాసమును చేయక, లోకసంగ్రహార్థమయి కర్మలనన్నింటిని నిష్కామబుద్ధితో చేయుచునే యుండును. సన్న్యాసమార్గావలంబియగు స్థితప్రజ్ఞుఁడు కర్మలఁ జేయఁడు. ఈ యిరువురిలో నిదియే భేదము (గీ.౩.౨౫ చూడు); కాని యీభేదము గౌణమనుకొని సన్న్యాసమార్గీయులగు గీతటీకాకారులు స్థితప్రజ్ఞునియొక్క పైఁజెప్పఁబడినవర్ణ

నా స్తి బుద్ధి రయు క్తస్య న చాయు క్తస్య భావనా,
న చాభావయత శ్శాంతి రశాంతస్య కుత స్సుఖమ్. ౬౬
ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
త దస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి. ౬౭
తస్మా ద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః,
ఇంద్రియా ణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౬౮

నలు సన్న్యాసమార్గసంబంధమైనవే యని సాంప్రదాయాగ్రహముచే ప్రతిపాదించుచున్నారు. అది యట్లుండ నిమ్ము. ఎవరిచిత్త మిట్లు ప్రసన్నము కాలేదో వానిని వర్ణించి స్థితప్రజ్ఞుని స్వరూపము నిప్పు డధికముగ వ్యక్తము చేయుచున్నాఁడు—]

(౬౬) పూర్వోక్తప్రకారముగ యోగయుక్తుఁడు కానివానికి (స్థిరమయిన) బుద్ధియు, భావనయు, అనఁగా: దృఢబుద్ధిరూపమగు నిష్ఠయు నుండదు. భావన లేనివారికి శాంతి యుండదు. శాంతిలేనివారికి సుఖ మెచ్చోనుండి వచ్చును? (౬౭) (విషయములయందు) సంచరించుమనస్సు, అనఁగా: ఇంద్రియములకు వెనుక లగ్నమయియుండుమనస్సు— నీటియందున్న నౌకను గాలివలె— పురుషునియొక్క బుద్ధిని హరించుచుండును. (౬౮) కావున నోమహాబాహూ! అర్జునా! ఇంద్రియములను విషయములనుండి మర్లల్చి వశపఱచుకొనినవాని బుద్ధియే స్థిర మయినది (అని చెప్పవలయును).

[మనోనిగ్రహము చేసి యింద్రియముల నిగ్రహించుట సర్వసాధనములకును మూలమగును. ఇంద్రియములు విషయములయందు వ్యగ్రములై స్వేచ్ఛగా సంచరించుచుండెనేని యాత్మజ్ఞానమును సంపాదించుకొనెడి (వాసనాత్మకమగు) బుద్ధియే పుట్టదు. బుద్ధి లేనిచో దానివిషయమయి దృఢ మగు నుద్యోగము సయితము చేయుట సంభవింపదు. అందుమూలమున శాంతియు సుఖము నైత ముండదని సారాంశము. అయిన నింద్రియనిగ్రహ మనఁగా: ఇంద్రియములను బొత్తిగ నణఁచివైచి కర్మల నన్నింటిని బొత్తిగ వదలివైచుట యని యర్థము కాదు. ౬౪-వ శ్లోకమునఁ జెప్పఁబడినట్లు నిష్కామబుద్ధితో కర్మలు చేయవలయునని గీతయొక్క యభిప్రాయము. ఈవిషయము గీతారహస్యమునందలి నాలవప్రకరణమునందు నిరూపింపఁబడినది.]

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. ౬౯
ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్,
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ. ౭౦

(౬౯) జనులకు నేది రాత్రియో దానియందు స్థితప్రజ్ఞుఁడు మేల్కొనుచున్నాఁడు. సర్వప్రాణులు మేల్కొనుసమయ మీజ్ఞానికి రాత్రిగఁ దోఁచును.

[ఈశ్లోకమున విరోధాభాసాలంకారము. అజ్ఞానమున సంధకారమనియు, జ్ఞానమన ప్రకాశ మనియు నర్థము. (గీ. ౧౪. ౧౧) "అజ్ఞానుల కేది యక్కఱ లేదని తోఁచునో, అనఁగా: వారికి నేది యంధకారమో, యది జ్ఞానికి కావలసియుండును; మఱియు నజ్ఞానులు దేనియం దనురక్తు లగుదురో (అనఁగా: అజ్ఞానులకు వెలుతురుగా నుండునది జ్ఞానికి చీకటిగఁ దోఁచును), అది జ్ఞానులకు నక్కఱలేనిది యగును" అని యీశ్లోకమున కర్థము. ఉదాహరణము—జ్ఞానులు కామ్యకర్మలు తుచ్ఛము లనుకొందురు. వానియందే సామాన్యులు సుఖులై యుందురు. మఱియు జ్ఞానులకు కావలసిననిష్కామకర్మ యితరుల కక్కఱ లేదు.]

(౭౦) నలువైపులనుండియు (ఉదకముచేత) నిండింపఁబడినను తనహద్దును దాఁటని సముద్రమునందు జలమంతయుఁ జేరినట్లు, ఎవ్వనియందు విషయము లన్నియు (అతని శాంతిని చెడఁగొట్టకుండ) ప్రవేశించునో, యతఁడే (నిజమగు) శాంతినిఁ బొందును. విషయేచ్ఛను జెందినవారు (శాంతిని పొందుట) దుర్లభము.

[శాంతిని సంపాదించుకొనుటకయి కర్మలను చేయకూడదని యీశ్లోకమున కర్థము కాదు. సామాన్యజనులమనస్సు ఫలాశచే భ్రమఁ జెందును గాన వారి మనస్సునందలి శాంతి చెడిపోవును; కాని, సిద్ధావస్థను జెందిన వారిమనస్సు ఫలాశచే క్షోభము నొందదు గాన, నెన్నికర్మలు చేసినను వారిమనస్సునందలిశాంతి చెడిపోదు. కావున సముద్రునివలె నతఁడు శాంతుఁడై యాకర్మలను జేయుచునే యుండును. మఱియు దానివలన నతనికి సుఖదుఃఖముల వ్యథ యుండదు, అని భావార్థము (పై శ్లోకమును, ౬౪-వ శ్లోకమును, గీ. ౪. ౧౯ చూడుము). ఇఁక నీవిషయమును ముగించి స్థితప్రజ్ఞునియొక్క స్థితికంటె వేఱైన స్థితిని చెప్పుచున్నాఁడు.—]

§§ విహాయ కామా న్యః సర్వా న్పుమాం శ్చరతి నిఃస్పృహః,
నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి. ౭౧
ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వా ఽస్యా మంతకాలే ఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. ౭౨

(౭౧) కర్మల నన్నింటిని వదలి నిస్పృహుఁడై (వ్యవహారమున) సంచరించుచు, మమత్వము నహంకారము లేనిపురుషునకే శాంతి లభించును!

['చరతి'(ఆచరించుచున్నాఁడు) అను పదమునకు సన్న్యాసమార్గీయులగు టీకాకారులు "భిక్ష నెత్తికొని తిరుగుచున్నాఁ" డని యర్థము చేయుచున్నారు; కాని యది సరియైనది కాదు. పూర్వమున ౬౪,౬౭ శ్లోకముల యందు 'చరన్' 'చరతాం' అను పదములకు చెప్పఁబడినయర్థమునే యిచ్చో సైతము గ్రహింపవలయును. స్థితప్రజ్ఞుఁడు బిచ్చమెత్తికొనవలయునని గీతలలో నెక్కడను చెప్పలేదు. పైఁగా ౬౪-వ శ్లోకమునందు నింద్రియములను స్వాధీనములుగ నుంచుకొని "యతనివిషయములలో సంచరించుచు నుండవలయు"నని సైతము చెప్పఁబడినది. కాన 'చరతి' అనఁగా: 'ఆచరించుచున్నాఁడు,' 'జగత్తుయొక్క వ్యవహారమును చేయుచున్నాఁడు' అనియే యర్థమును చేయవలయును. 'నిస్పృహుఁడును', నేర్పరియు నగుపురుషుఁడు (స్థితప్రజ్ఞుఁడు) వ్యవహారము నెట్లు చేయుననదియు, శ్రీసమర్థులవారు దాసబోధలో నుత్తరార్థమునఁ జక్కఁగఁ జెప్పిరి. గీతారహస్యములో ౧౪-వ ప్రకరణములో నున్నవిషయ మిదియే.]

(౭౨) ఓపార్థా! బ్రాహ్మీస్థితి యన నిదియే. ఇట్టిస్థితి లభించినపిదప నెవరును మోహము నొందరు; మఱియు నంతకాలమునందు, అనఁగా: మరణసమయమునందు సయితమీ స్థితియందే యుండును గాన నతనికి బ్రహ్మనిర్వాణము, అనఁగా: బ్రహ్మమందు కలసిపోవుట యనుస్వరూపము గలమోక్షము, లభించును.

[బ్రాహ్మీస్థితి యనునది కర్మయోగమునందలి చిట్టచివరకుఁ గలుగు నుత్తమోత్తమమగు స్థితి యయి యున్నది (గీ. ర. ప్రక. ౯. పుట. ౩౬౧ మఱియు ౩౮౦-౩౮౧ చూడుము); అది లభించెనేని తిరిగి మోహమును జెందఁడనునది దానియందలి విశేషము. ఈవిశేషము నిచ్చోఁ జెప్పుటకు కారణమేమన: మనుజునకైనను నొకానొకనాఁడు క్షణమాత్రము బ్రాహ్మీస్థితియొక్క యనుభవ మొకవేళఁ గలుగుట సంభవించినను, దానివలనస్థిరమగు

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే సాంఖ్యయోగో నామ
ద్వితీయోఽధ్యాయః.

---

లాభ మేమియు లేదు. కారణ మేమన: ఏమనుజునకైనను మరణసమయ ముగం దీస్థితి లేకపోవునేని, యామరణసమయమున మనస్సులో నున్న వాసనానుసారముగ మరల జన్మమెత్తక తప్పదు (గీ. ర. పు. ౨౯౭ చూడుము.) కాన బ్రాహ్మీస్థితిని జెప్పుచు నీశ్లోకమునందు "అంతకాలేఽపి" అంతకాలమందు కూడ స్థితప్రజ్ఞునియొక్క యీయవస్థ స్థిరముగ నుండి తీరవలయునని ముఖ్యముగఁ జెప్పఁబడినది. అంతకాలమునందు మనస్సు శుద్ధముగ నుండుట యావశ్యకమని యుపనిషత్తులయందును (ఛాం. ౩.౧౪. ౧; ప్ర. ౩. ౧౦), గీతలయందును (గీ. ౮. ౫-౧౦.) చెప్పఁబడినది. వాసనాత్మకములగు కర్మ లనేకజన్మము లెత్తుటకు కారణభూతము లయి నందున తుదకు మరణసమయమందయినను వాసన శూన్యము కావలయునని స్పష్ట మయినది. మఱియు నది మరణసమయమునందు శూన్యమగుటకు మొదటినుండియు నట్టి యభ్యాసము కావలయు నను తాత్పర్యమువలన సిద్ధ మగుచున్నది. మరణసమయమందు వాసన శుద్ధముగ నుండవలయు ననువిషయము వైదికధర్మములయందు మాత్రమే కాక యితరధర్మముల యందుసైత మొప్పుకొనఁబడినది (గీ. ర. పు. ౭౦౭ చూడు).

ఈరీతిగ భగవంతునిచే గానము చేయఁబడిన (చెప్పఁబడిన) యుపనిషత్తుల యందు బ్రహ్మవిద్యాంతర్గతమైన యోగ—అనఁగా: కర్మయోగ—శాస్త్రమందలి శ్రీకృష్ణార్జునులసంవాదమునందున్న సాంఖ్యయోగ మను పేరుగల రెండవయధ్యాయము సమాప్త మయినది.

[ఈ యధ్యాయముయొక్క యారంభమునందు సాంఖ్యముయొక్క, లేక, సన్న్యాసమార్గముయొక్క వివేచన ముండుటచే దీనికి సాంఖ్యయోగ మను పేరిడఁబడినది; కాని యంతమాత్రముచేతనే యీయధ్యాయమందంతయు నావిషయమే ప్రతిపాద్య మని యెన్నరాదు. ఒకయధ్యాయమున తఱచుగ ననేకవిషయములుండును. వానిలో నారంభమునందున్న విషయమును గాని, లేక, ముఖ్యమగువిషయమును గాని గ్రహించి, దాని కనుగుణముగ నాయధ్యాయమునకు పేరు పెట్టఁబడును. గీతారహస్యమందు ప్రకరణము ౧౪. పు. ౭౧౩ చూడు.]

---

# తృతీయోఽధ్యాయః.

---

అర్జున ఉవాచ.

జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన,
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ. ౧
వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే,
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్. ౨

[భీష్మద్రోణాదులను నేఁ జంపుచున్నానని భీతిగలుగుట వెఱ్ఱితన మని సాంఖ్యమతమునందలి యాత్మయొక్క నిత్యత్వమునుబట్టియు, అశోచ్యత్వమునుబట్టియు సిద్ధమయినందున స్వధర్మమును గూర్చియు వివేచన చేసిన పిదప గీతలయందున్న ముఖ్యవిషయమగు కర్మయోగము రెండవయధ్యాయమునం దారంభింపఁబడినది; మఱియుఁ గర్మలను చేసినను, వానిపాపపుణ్యముల బాధ తగులకుండ నుండుటకై వానిని సామ్యబుద్ధితోఁ జేయుటయే యొక యుక్తి, లేక, యోగ మని చెప్పి యిట్లు సమమయినబుద్ధి గలవాఁడును, కర్మయోగియు నైనస్థితప్రజ్ఞునియొక్క స్థితియుఁ జెప్పఁబడినది. అయిన నంతమాత్రముచే కర్మయోగముయొక్క వివేచన పూర్ణము కాలేదు. ఏకర్మయైనను సామ్యబుద్ధితోఁ జేయఁబడినచో దానియొక్క పాపము తగులనిమాట నిజమె; కాని కర్మకంటె సమబుద్ధియే శ్రేష్ఠ మనునది నిర్వివాద మైనందున (గీ. ౨. ౪౮), స్థితప్రజ్ఞునివలె బుద్ధిని సమముగఁ జేసికొనిన చాలును. కావున కర్మలను జేసియే తీరవలయునని దానివలన సిద్ధము కానేరదని యర్జునుఁ డీవిషయము నడిగినపిదప, కర్మలు చేయవలయునని భగవంతుఁ డీయధ్యాయమునందును పిమ్మటియధ్యాయమునందును ప్రతిపాదించుచున్నాఁడు.]

అర్జునుఁ డడుగుచున్నాఁడు— (౧) ఓజనార్దనా! కర్మకంటె (సామ్య-) బుద్ధియే శ్రేష్ఠమని నీమత మగునేని, ఓకేశవా! నన్ను (యుద్ధ మను) ఘోరకర్మయం దేల ప్రవర్తింపఁ జేయుచున్నావు? (౨) చూపులకు వ్యామిశ్రమునవలె, అనఁగాఁ వ్యర్థమగుదానివలె నున్న భాషణచే నాబుద్ధిని నీవు భ్రమ చెందించుచున్నావు.

శ్రీభగవానువాచ.

§§ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

కావున శ్రేయమును కల్యాణమును గలుఁగునట్టియొకదానినే నిశ్చయించి నాకుఁ జెప్పుము.

భగవంతుఁడు సెప్పుచున్నాఁడు—(3) ఓ పాపశూన్యుఁడవగు నర్జునుఁడా, పూర్వమునందు (అనఁగా: రెండవయధ్యాయమునందు) జ్ఞానయోగముచే సాంఖ్యులకును, కర్మయోగముచే యోగులకును నీలోకమున రెండునిష్ఠలు నాచేఁ జెప్పఁబడినవి.

[‘పురా’=పూర్వమునందు (అనఁగా: రెండవయధ్యాయమునందు) అని యర్థమును నే చేసితిని. అది సరళముగ నున్నది. కారణ మేమన: రెండవ యధ్యాయమునందు మొదట సాంఖ్యమతము ననుసరించి జ్ఞానము చెప్పఁబడినది. అనంతరము కర్మయోగనిష్ఠ యారంభింపఁబడెను; కాని ‘పురా’ అనఁగా, సృష్ట్యారంభమునందని సైతే మర్థము చేయవచ్చును. కారణ మేమన: మహాభారతమందు నారాయణీయములగు ధర్మములు నిరూపింపఁబడినచోట, సాంఖ్యము, యోగము (నివృత్తియు ప్రవృత్తియు) అను నీ రెండునిష్ఠలు స్వతంత్రరీతిని భగవంతుఁడు జగదారంభమునందే సృజించెనని చెప్పఁబడినది (శాం. 340. మఱియు 348 చూడుు). నిష్ఠాశబ్దమునకు వెనుక మోక్షశబ్ద మధ్యాహృత మయినందున, ఏమార్గమునఁ బ్రవర్తించినచో తుదకు మోక్షము లభించునో యామార్గమని యర్థము కావున గీతానుసారముగ నట్టినిష్ఠలు రెండు కలవు. మఱియు నారెండును స్వతంత్రములే; కాని, యొకదాని కొకటి యంగము కాదనునది మొదలుగాఁగలవిషయముల యొక్క విస్తృతమగు వివేచనము గీతారహస్యమునందలి పదునొకండవ ప్రకరణమున (పుట. 402—435) చేయఁబడియుండుటచే నది మరల నిచ్చో విచారింపనవసరము లేదు. ఈరెండునిష్ఠలలోనున్న భేదమును కోష్ఠకరూపముగ గీతారహస్యమందలి పదునొకండవప్రకరణమున చిట్టచివర చెప్పఁబడినది (గీ. ర. పు. 433). మోక్షము నిచ్చురెండునిష్ఠలును చెప్పఁబడినవి. ఇప్పుడు తదంగమును, నావశ్యకము నగునైష్కర్మ్యసిద్ధిని స్పష్టముగ నిరూపించుచున్నాఁడు—]

న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
నచ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి. ౪
న హి కశ్చి త్క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః. ౫

(౪) (కాని) కర్మలను ప్రారంభింపకపోవుటమాత్రముచేత నెవ్వరికిని నైష్కర్మ్యమును సిద్ధింపదు. కర్మలయొక్క సన్న్యాసము (త్యాగము) చేయఁబడినంతమాత్రముచేతనే మోక్షమును లభింపదు. (౫) కారణ మేమన: ఎవరైనను (ఏదో యొకకర్మ) చేయకుండ క్షణమాత్రమైన నుండలేరు. ప్రకృతియొక్క గుణములు పరతంత్రుఁడగు ప్రతిమనుజుని (ఒకానొకప్పుడైనను) కర్మను చేయునట్లు ప్రవర్తింపఁజేయుచున్నవి.

[నాలుగవశ్లోకముయొక్క మొదటిచరణమునందు 'నైష్కర్మ్య'మనఁగా 'జ్ఞాన' మని యర్థము చెప్పుకొని "కర్మ నాచరింపనియెడల జ్ఞానముకలుగనేరదు, అనఁగా: కర్మలచేతనే జ్ఞానము కలుగును. కారణము:—కర్మలు జ్ఞానమునకు సాధనములై యున్నవి" అని సన్న్యాసమార్గీయులగు టీకాకారు లీశ్లోకమునకు తమసంప్రదాయానుసారముగ నర్థమును జేసిరి; కాని యీయర్థము మాత్రము సరళమయినదియు, సరియైనదియుకాదు. నైష్కర్మ్యశబ్దము, వేదాంతము-మీమాంస యనెడురెండుశాస్త్రములయందును పెక్కుస్థలములను ప్రయోగింపఁబడినది. మఱియు సురేశ్వరాచార్యులయొక్క 'నైష్కర్మ్యసిద్ధి'యను పేరుగల గ్రంథ మీ విషయమునే బోధించును. అయినను నైష్కర్మ్యసిద్ధియొక్క యీసిద్ధాంతము నవీనమైనది కాదు. సురేశ్వరాచార్యులకంటె పూర్వముననే కాక, మీమాంసా వేదాంతశాస్త్రములయొక్క సూత్రములు రచింపఁబడుటకంటెను పూర్వమునందే కలదు. కర్మలన్నియు బంధకములుగనే యుండవలయునని నియమము లేదు. కాన, వైద్యుఁడు పాదరసమును నుపయోగపఱచుటకై ముందుగ మారణము (శుద్ధి) చేసి పిదప నుపయోగపఱచునట్లు కర్మలు చేయకమునుపు వాని బంధకత్వము నశించునట్టియుపాయము చేయవలయును. ఇట్టియుక్తితో కర్మ చేయువారియొక్క స్థితినే నైష్కర్మ్య మని చెప్పుదురు. ఇట్టి యాచరణముచే బంధకత్వరహితమగు కర్మ మోక్షప్రతిబంధకము కాదు. ఇఁక నీస్థితి నెట్లు సంపాదించుకొనవలయునో చెప్పు

టయే మోక్షశాస్త్రమునందున్న ముఖ్యవిషయము. "నిత్యములును, నైమిత్తికములు నగుకర్మలను చేయవలయును. కామ్యములును, నిషిద్ధములును నగు కర్మలను చేయకూడదు. ఈవిధముగఁ బ్రవర్తించినచో కర్మలయొక్క బంధకత్వము పోవుటవల్ల నైష్కర్మ్యావస్థ సులభముగ సంభవించును" అని మీమాంసకులు చెప్పుదురు; కాని మీమాంసకుల యీయుక్తి యసంగతమని వేదాంత శాస్త్రముయొక్క సిద్ధాంతము గీతారహస్యమునందలి పదియవ ప్రకరణమునందు (పుట. 322) విచారింపఁబడినది. "కర్మలనే చేయనిచో, వానివలనఁ గలుగుబాధమాత్ర మెట్లు సంభవించును? కాన నైష్కర్మ్యావస్థ ప్రాప్తమగుటకు సర్వకర్మలను వదలవలయును" అని మఱికొందఱు చెప్పుదురు. వీరిమతమును బట్టి 'నైష్కర్మ్య' మన కర్మశూన్యతయే; కాని యీమతము సరియగునది కానందున దానివలన మోక్షము సైతము సంభవింపదని నాల్గవశ్లోకమునందు చెప్పఁబడినది. మఱియు నైదవశ్లోకమునందు దానికి కారణము చెప్పఁబడినది. కర్మ వదలవలయునని మనస్సున నున్నను, దేహమున్నంతవఱకు నిద్రపోవుట, కూర్చుండుట మొదలగు కర్మ లెప్పుడును వదలవు (గీ. ౫. ౮ మఱియు ౧౮.౧౧) కావున నెవ్వఁడును కర్మశూన్యుఁ డెప్పుడును కానేరఁడు. కాన కర్మశూన్యత్వస్వరూపమగు నైష్కర్మ్య మశక్య మని యిందలి సారాంశము. కర్మరూపమగు వృశ్చిక మెప్పుడును మృతినొందదు. కాన నది దేనిచే నిర్విషమగునో యట్టియుక్తి నొక్కదానిని సంపాదింపవలయును. కర్మలయందున్న తన యాసక్తిని వదలుట యనునదియే యట్టియుక్తి యని గీతలయందలి సిద్ధాంతమని యనేక స్థలములయందు చెప్పఁబడినది. సర్వకర్మలనువదలుట యనునది నైష్కర్మ్యము కాకపోయినను, సన్న్యాసమార్గీయులు కర్మల నన్నింటిని సన్న్యసించి (అనఁగా: త్యజించి) మోక్షమును సంపాదించుకొనవచ్చు నని చెప్పుదురు గాన, మోక్షమును సిద్ధింపఁజేసికొనుటకు కర్మలను వదలిపెట్టుట యావశ్యక మని యెవరైన చెప్పుదురు; కాని యీపూర్వపక్షమునకు గీత యిట్లుత్తర మిచ్చుచున్నది. సన్న్యాసమార్గీయులకు మోక్షము లభించును, నిజమె; కాని యది వారు కర్మలను వదలినందున లభించునది కాదు. మోక్షసిద్ధి యనునది వారిజ్ఞానమునకు ఫల మని చెప్పవలసివచ్చును. కర్మలను వదలుటమాత్రముచే మోక్షము లభించుచో, ఱాతికి సైతము మోక్షము లభింపవలయును. కాన (౧) నైష్కర్మ్యమన కర్మశూన్యత కాదనియు,

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,
ఇంద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే. ౬.
యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున,
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తః స విశిష్యతే. ౭

(౨) కర్మలను వదలి వేయవలయునని చెప్పినను నెవరిని నవి వదలిపోవని యు,(౩)కర్మలను వదలి వేయుట యనునది మోక్షము నొందుట కుపాయము కాదనియు, ఈమూఁడువిషయములు సిద్ధము లగుచున్నవి; ఈవిషయమే పూర్వశ్లోకమునందు చెప్పఁబడినది. ఈమూఁడు విషయములును సిద్ధము లైనపిదప పదునెనిమిదవయధ్యాయమున చెప్పఁబడినతీరున 'నైష్కర్మ్యసిద్ధి' (గీ. ౪౮.౪౯ మఱియు ౪౯ చూడు) లభించుటకు కర్మలను వదలివేయక జ్ఞానముచే నాసక్తిని నశింపఁజేసికొని, కర్మలను సర్వదా చేయుట యను నదియే ముఖ్యకర్తవ్యము. కారణ మేమన: జ్ఞానమె మోక్షమునకు సాధన మైనను, కర్మశూన్యుఁడుగ నుండుటకు నెప్పుడును శక్యము కానందున నాకర్మలయొక్క బంధకత్వము లేకుండుటకై యాసక్తిని విడనాడి వాని నవశ్యము చేయవలయును. దీనినే కర్మయోగమని చెప్పుదురు. మఱియు నిఁదియే జ్ఞానకర్మ సముచ్చయాత్మకమగు మార్గ మనియు, ఇదియే విశేష యోగ్యత గలది యనఁగా శ్రేష్ఠ మనియు నిప్పుడు చెప్పుచున్నాఁడు—]

(౬) (హస్తపాదాది)కర్మేంద్రియములను నియమించుకొని, మనస్సుచే నే మూఢుఁ డింద్రియములయొక్క విషయములను చింతన చేయుచుండునో, వానిని మిథ్యాచారుఁడని చెప్పుదురు. (౭) కాని, యోయర్జునా! మనస్సుచే నింద్రియ ములను నిరోధించి యనాసక్తమగు బుద్ధితో కర్మేంద్రియములచే(మాత్రము)కర్మల నాచరించువాని యోగ్యత గొప్పది.

[కర్మయోగమునందు కర్మకంటె బుద్ధి శ్రేష్ఠము (గీ. ౨. ౪౯), అని వెనుకటి యధ్యాయమున చెప్పఁబడినవిషయమే యీ రెండుశ్లోకములయం దును స్పష్టము చేయఁబడినది. మనస్సు శుద్ధము గాక లోకభీతి మాత్రము చేఁ గాని, లోకులు మంచివాఁ డనుకొనవలయునని కాని బాహ్యేంద్రియ ముల వ్యాపారమాత్రమును నిరోధించువాఁడు వేషధారి గాని, సత్యమగు సదాచారుఁడు కాఁడు, అని యీశ్లోకమునందు స్పష్టముగ చెప్పఁబడినది. "కలౌ కర్తా చ లిప్యతే"—కలియుగమున దోషము బుద్ధియం దుం

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః. ౮

దదు, కర్మయందే యుండును—అనువచనము ననుసరించి బుద్ధి యెటు లున్నను కర్మ దుష్టముగ నుండకపోయిన చాలును, అని చెప్పువారు పై శ్లోకమునందు చెప్పఁబడిన గీతాసిద్ధాంతమును ముఖ్యముగ జ్ఞప్తి యందుంచుకొనవలయును. నిష్కామబుద్ధితో కర్మ చేయుయోగియే కర్మయోగి యని గీతలయందు చెప్పఁబడుచున్నాఁడని, యేశ్లోకమువలన స్పష్టమగుచున్నది. ఈకర్మయోగ మాఱవశ్లోకమునందు చెప్పఁబడిన దాంభిక మార్గముకంటె శ్రేష్ఠమైనది యయినను సన్న్యాసమార్గముకంటె శ్రేష్ఠము కాదని యీశ్లోకమునకు నసేకులగు సన్న్యాసమార్గీయులగుటీకాకారు లర్థమును చేయుచున్నారు; కాని యీపూర్వపక్షము సాంప్రదాయికమగు నాగ్రహమ్మచే బయల్పడినది. కారణ మేమన : సన్న్యాసమార్గముకంటెను కర్మయోగ మధికయోగ్యత గలదియు శ్రేష్ఠమైనదియు నని యీశ్లోకమునందే కాక మరల నైదవయధ్యాయముయొక్క యారంభమునందును నింక నితరస్థలములందును స్పష్టముగఁ జెప్పఁబడినది (గీ. ర. ఫు. ౪౨౨, ౪౨౩ చూడుఁ). ఇట్లు కర్మయోగము శ్రేష్ఠమైనందున నర్జునుఁ డిప్పుడు దీనినే యాచరింపవలయునని భగవంతుఁ డుపదేశించుచున్నాఁడు—]

(౮) (స్వధర్మానుసారముగ) నియతమైన,అనఁగా: నియమింపఁబడిన, కర్మను నీవు సేయుము. కారణమేమన: కర్మను చేయకపోవుటకంటె చేయుటయే మిక్కిలి మంచిది. ఇంతియకాక (బాగుగ విచారించుకొనుము) కర్మ చేయక పోయితివేని (తినుటకైనను లభింపకపోవును. అందుచే) నీయొక్క శరీరసంరక్షణయు సంభవింపదు.

[‘ఇంతియకాక’ (అపి చ) యను పదముచే శరీరయాత్ర యనునది నికృష్టమగు హేతువని చెప్పఁబడినది. ఇప్పుడు ‘నియతమ్’ అనఁగా: ‘నియమింపఁబడినకర్మ’ యేది యైనదియు, అది, యేయితరమగు గొప్పకారణముచే నవశ్యము చేయవలసినదియు నిరూపించుటకై యజ్ఞప్రకరణము నారంభించుచున్నాఁడు. యజ్ఞయాగములు మొదలగు శ్రౌతకర్మలిప్పుడు లుప్తప్రాయములైనందున నీవిషయముయొక్క గొప్పతన మిప్పటిచదువరులకు తెలియదు; కాని గీతలయొక్క కాలమునం దీయజ్ఞయాగాదులు పూర్ణముగ

§§ యజ్ఞార్థాత్కర్మణో௨న్యత్ర లోకో௨యం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర. ౯

ప్రచారములో నున్నందున 'కర్మ' శబ్దముచే నివియే ముఖ్యముగ తెలుపఁబడు చుండెను. ఆ కారణమున నీధర్మకార్యములు చేయవలయునా? వలదా? యను విషయమును, చేయవలయునేని యెట్లు చేయవలయు ననువిషయమును గీతాధర్మమునందు వివేచించుట యావశ్యకమై యున్నది. యజ్ఞములనఁగా: జ్యోతిష్టోమాది శ్రౌతయజ్ఞములే యని కాని, లేక, అగ్నియందే ద్రవ్యము నైనను హోమము చేయుట యని మాత్రమే కాని యర్థము కాదు (గీ.౪. ౩౨ చూడుడు). సృష్టిని నిర్మించినపిదప దానిని సరళముగఁ బ్రవర్తింపచేయుట కయి, అనఁగా: లోకసంగ్రహార్థమయి ప్రజల కందఱకును బ్రహ్మదేవుఁడు చాతుర్వర్ణ్యవిహితములగు నేయేకర్మలను విధించెనో యవి యన్నియు 'యజ్ఞ' శబ్దముచేఁ జెప్పఁబడును (మ.భా.అను.౪౮. ౩; మఱియు గీ. ర. పు. ౩౯౭-౪౦౫; చూడుడు). మఱియునీకర్మలేధర్మశాస్త్రమునందు చెప్పఁబడినందున నివియే 'నియతకర్మలు', అనఁగా: 'నియమింపఁబడినకర్మ' లనుశబ్దముచే నిచ్చో వివక్షితము. కావున శ్రౌతములగు యజ్ఞయాగాదులు ప్రస్తుతము లుప్తప్రాయములైనను యజ్ఞచక్రముయొక్క యీవివేచన యీకాలమందును నిరర్థకము కాదని చెప్పవలయును. అది యట్లుండ నిమ్ము; శాస్త్రమును బట్టి యీకర్మలన్నియు కామ్యములే, అనఁగా: మనుజున కీజగత్తునందు కల్యాణము కల్గుటకును నతనికి సుఖముకొఱకును చెప్పఁబడినవే; కాని వెనుక రెండవయధ్యాయమునందు (గీ. ౨. ౪౧-౪౪) మీమాంసకు లీకామ్యములగు కర్మలు మోక్షమునకు ప్రతిబంధకములు గావుననే తక్కవవి యని సిద్ధాంతీకరించిరి. ఇప్పు డాకర్మలనే చేయవలయునని ప్రాప్తమగుచున్నది; కాన, నీకర్మలయొక్క శుభాశుభమగు లేపము, లేక, బంధకత్వము నష్టమైనందున వానిని చేయుచున్నను నైష్కర్మ్య మెట్లు ప్రాప్తమగును? అనువిషయ ముత్తరశ్లోకమునందు విస్తృతముగ వివేచింపఁబడినది. అది యంతయు భారతమునందు చెప్పఁబడిన భాగవతధర్మముల ననుసరించి యున్నది. (మ. భా. శాం. ౩౪౦ చూడుడు)

(౯) యజ్ఞముకొఱకు చేయఁబడినకర్మలు దక్క నితరములగు కర్మలచే నీలోకము బంధింపఁ బడుచున్నది. అందులకై, అనఁగా: యజ్ఞార్థమయి (చేయ తగిన) కర్మలను (సైతము) ఫలాశను వదలి చేయుము,

[ఈశ్లోకముయొక్క ప్రథమచరణమునందు మీమాంసకులయొక్కయు, రెండవపాదానియందు గీతయొక్కయు సిద్ధాంతములు చెప్పఁబడినవి. యజ్ఞార్థకర్మ లేహేతువువలన వేదములచేఁ బ్రతిపాదానసము విధింపఁబడినవో, యేహేతువుచేత నీశ్వరనిర్మితమగు సృష్టియొక్క వ్యవహారమును నడిపించుటకు నీయజ్ఞచక్ర మావశ్యకమైనదో, యాహేతువుచేతనే యీకర్మలను వదలిపెట్టుట యెవరికిని సాధ్యము కాఁజాలదు.వదలివేసినచో నట్టివాఁడు శ్రౌత ధర్మములచే వంచితుఁడని తెలిసికొనవలయును. మఱియు ప్రతికర్మయొక్క ఫలము మనుష్యుఁడు భోగించియే తీరవలయు నని కర్మవిపాకశాస్త్రము యొక్కసిద్ధాంతము. కావున నాశాస్త్రమును బట్టి యజ్ఞార్థమై చేయఁబడిన కర్మలయొక్క శుభాశుభఫలములను సైతము మనుజుఁడు తప్పక భోగింప వలయునని ప్రాప్తమగుచున్నది, అని మీమాంసకులు చెప్పుదురు. యజ్ఞములు చేయవలయునని వేదములే యాజ్ఞాపించినందున, యజ్ఞార్థము చేయఁబడుకర్మలన్నియు నీశ్వరునకు సమ్మతము లైనవే. కావున నాకర్మలు కర్తకు బంధకములు కానేరవని మీమాంసకులకు సమాధానము చెప్పవలయును. కాని, 'యజ్ఞములు' దక్క తనపొట్టకొఱకు మాత్రమే మనుజుఁడు సేయు కర్మలన్నియు యజ్ఞార్థములు కావు. పురుషునకే లాభదాయకములు; కాని మీమాంసకులు వానిని పురుషార్థకర్మలని యందురు. యజ్ఞార్థములు గాని యితరములగు కర్మలయొక్క శుభాశుభఫలము లన్నియు పురుషులు భోగించియే తీరవలయునని మీమాంసకులు నిశ్చయించిరి. ఈసిద్ధాంతమే పైశ్లోకమునందలి మొదటిచరణమందు చెప్పఁబడినది (గీ. ర. ప్ర. 3. పు. ౭౨-౭౬ చూడుము). యజ్ఞమన విష్ణువని గౌణార్థము చెప్పి, యజ్ఞార్థమన విష్ణుప్రీత్యర్థమయిన, లేక, పరమేశ్వరార్పణపూర్వక మయిన యని టీకాకారులు చేసినయర్థము క్లిష్టమును, పాండిత్యప్రకర్షమును దెలుపునదియు నని తలఁచెదను; కాని యజ్ఞములకొఱకై చేయఁబడినకర్మలు దక్క యితరములగుకర్మల నేమియు చేయకపోయెనేని మనుజుఁడు కర్మబంధము నుండి ముక్తుఁడగునా? యని యిచ్చో నొక్కప్రశ్న బయలువెడలును. కారణమేమన: యజ్ఞ మనునదియు కర్మయే కావున నది దానియొక్క స్వర్గప్రాప్తిరూపమగు శాస్త్రోక్తఫలము నీయకమానదు; కాని స్వర్గప్రాప్తి రూపమగు నీఫలము మోక్షప్రాప్తికి విరుద్ధమని గీతలయందలి రెండవ యధ్యాయమున స్పష్టముగఁ జెప్పఁబడినది. (గీ. ౨.౪౦-౪౪; మఱియు ౯.

౨౦, ౨౧ చూడుము). కాన యజ్ఞముకొఱకు సైతము గృహస్థుడు నియతముగఁ జేయఁదగినకర్మలన్నియు ఫలాశను వదలి, అనఁగా: కేవలము కర్తవ్యములుగా చేయవలయునని పైశ్లోకమునందలి రెండవచరణమునందు మరల విధింపఁబడినది. మఱియు నాయర్థమే, పిమ్మట సాత్త్వికయజ్ఞములవ్యాఖ్యానము చేయునప్పుడు ప్రతిపాదింపఁబడినది (గీ. ౧౭. ౧౧ మఱియు ౧౮. ౬) ఈరీతిగ సర్వకర్మలును యజ్ఞార్థమై ఫలాశను వదలి చేయఁబడెనేని (౧) అవి యజ్ఞార్థమై చేయఁబడినందున మీమాంసకులమతమును బట్టి కాని, యితరములగు మతములనుబట్టి కాని బంధకములు గానేరవు. మఱియు (౨) ఫలాశను వదలి చేయఁబడినందున, వానికి స్వర్గప్రాప్తిరూపమును, శాస్త్రోక్తమునయిన యనిత్యమగుఫలము గాక మోక్షప్రాప్తియే ఫలమని యీశ్లోకముయొక్క భావార్థము. మఱియు నీయర్థమే ౧౯-వ శ్లోకమునందును, మఱియు నాల్గవయధ్యాయమునందున్న ౨౩-వ శ్లోకమునందును మరల చెప్పఁబడినది. కావున బంధకములు కానందున "యజ్ఞార్థమై కర్మల చేయవలయును" అను నీమీమాంసకసిద్ధాంతములోనే "యజ్ఞార్థమై చేయఁబడుకర్మలును ఫలాశ వదలి చేయఁబడవలయును" అని భగవద్గీతలో నొక్క స్పష్టముగ చెప్పఁబడియున్నదని తాత్పర్యము; కాని మీమాంసకులసిద్ధాంతము నిట్లు బాగుగ నుపపాదించుట యనుపటాటోపమున చేసి యజ్ఞయాగములు మొదలుగాఁగలగార్హస్థ్యకర్మల నాచరించుటకంటె మోక్షము సిద్ధించుటకు కర్మలనన్నింటిని వదలి సన్న్యసించుట మేలు కదా యని కొందఱు శంకింతురు. కాదు అని భగవద్గీత యీప్రశ్నమున సుస్పష్టముగ నుత్తర మిచ్చుచున్నది. కారణ మేమన: యజ్ఞచక్రము దక్క జగత్తే వ్యవహారమును నడిపింప నక్కఱ లేదు. వేయేల? జగమొక్క ధారణపోషణలనిమిత్తమే యీయజ్ఞచక్రము బ్రహ్మదేవుని మొదట సృజింపఁబడినది. మఱియు జగత్తుయొక్క సుస్థితియే, అనఁగా సంగ్రహమే భగవంతుని కిష్టమైనందున నీచక్రము నెవరును వదలుట సాధ్యము కాదు; ఇపు డీయర్థమే ముందుశ్లోకములో చెప్పఁబడినది. యజ్ఞశబ్దమున కిచ్చో శ్రౌతయజ్ఞములని మాత్రమే యర్థము కాదు. వానియం స్మార్తయజ్ఞములును, సమస్తవర్ణములవారిచే యథాధికారముగఁ జేయఁబడునవియు నగు సర్వవ్యావహారికకర్మలును వానిలోనే చేరునని యీప్రకరణమునందు చదువరులు ముఖ్యముగ జ్ఞప్తియం దుంచుకొనవలయును.

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్. ౧౦
దేవా న్భావయతాఽనేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ. ౧౧
ఇష్టా న్భోగా న్హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తై ర్దత్తా నప్రదా యైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః. ౧౨

(౧౦) పూర్వమున యజ్ఞముతోడనే ప్రజల సృజించి బ్రహ్మదేవుఁ డిట్లు చెప్పెను. "(ఈయజ్ఞములయొక్క) యోగముచే మీరు వృద్ధినొందుదురు గాక; యిది మీకు కామధేనువు, అనఁగా: ఇష్టములగు మనోరథముల పూరణ చేయునది అగుఁ గాక; (౧౧) యజ్ఞములచేత దేవతలను మీరు సంతోషింపవలసినది. దేవతలు మీకును సమృద్ధి నిత్తురు గాక; ఇట్లు పరస్పరమును సంభావన చేసికొనుచుండిన మీయిరువురకును పరమగు శ్రేయః ప్రాప్తి యగును. (౧౨) కారణ మేమన: యజ్ఞములచే సంతుష్టులగు దేవతలు మీచే కోరఁబడిన (సమస్తమైన) భోగములను మీకు నిచ్చెదరు. వారు మీకిచ్చినదానిని వారికి మరల నీయక తాముమాత్రమే యుపభోగించువారు సత్యముగ చోరు లగుదురు."

[బ్రహ్మదేవుఁ డీసమస్తసృష్టిని, అనఁగా: స్వర్గాదిసర్వలోకములను, నిర్మించినపిదప నీలోకుల కిఁకపై ధారణపోషణ లెట్లు సంభవించునని విచారించి యేమియుఁ దోఁపక యనేకవత్సరములు తపస్సుచేసి భగవంతుని సంతోషపెట్టఁగా భగవంతుఁ డీలోకులయొక్క ధారణపోషణలకై ప్రవృత్తిపరమగు యజ్ఞచక్రమును నిర్మించె ననియు, దేవతలను మనుజులను నిట్లు యజ్ఞములయందుఁ బ్రవర్తింపఁజేసి యొకరినొకరు సంరక్షించుకొండని చెప్పెననియు మహాభారతమునందలి నారాయణీయధర్మములలోఁ జెప్పఁబడియున్నది. ఆవిషయమే పూర్వశ్లోకమునం దర్థమును శబ్దములను కొంత మార్చి చెప్పఁబడినది (మ. భా. శాం. 3౪౦.3౯ మరియు ౬౨ చూడు). పైనఁ జెప్పఁబడినవిషయమునుబట్టి ప్రవృత్తిపరమగు భాగవతధర్మముల సిద్ధాంతమే గీతలయందు ప్రతిపాదింపఁబడిన దనుసిద్ధాంత మధికముగ దృఢమగుచున్నది; కాని భాగవతధర్మములయందు యజ్ఞములయందుండు హింస గర్హింపఁబడియున్నది (మ.భా.33౬-33౮ చూడుము). పశుయజ్ఞములకు ప్రతినిధిగ ద్రవ్యమయములగు యజ్ఞము లారంభింపఁబడినవి. తుదకు జపమయ

యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
భుంజతే తే త్వఘం పాపా యే పచ న్త్యాత్మకారణాత్. ౧౩

[... ములు, జ్ఞానమయములు నగు యజ్ఞములే యన్నింటిలోను శ్రేష్ఠములైన వను మతము పిదప వాడుకలోనికి వచ్చినది (గీ. ౪. ౨౩-౩౩). చాతుర్వర్ణ్యమునకు విధింపఁబడిన కర్మలన్నియు యజ్ఞములే యనియు, సమాజముయొక్క యోగ్యములగు ధారణపోషణలు జరుగుటకు నీయజ్ఞకర్మలు, లేక, యజ్ఞచక్రము బాగుగ వాడుకలో నుండితీరవలయుననియు స్పష్టమగుచున్నది (మను.౧. ౮౭ చూడుము). వేయేల? ముందు ఇరువదియవ శ్లోకమునఁ జెప్పఁబోవులోకసంగ్రహమును, ఈయజ్ఞచక్రమును నొక్కవిధముగనే యున్నవి (గీతా. ర. ప్ర. ౧౧ చూడుము). కాన దేవలోకమనుష్యలోకములయొక్క సంగ్రహార్థమై భగవంతునిచేతనె మొదట నిర్మింపఁబడిన యీయోగ సంగ్రహకారకకర్మను మనుజుఁడలవాటులో నుంచుట యావశ్యకమని స్మృతులయందుసైతము చెప్పఁబడినది. ఈవిషయమే ముందు శ్లోకమున స్పష్టముగ నిరూపింపఁబడినది—]

(౧౩) యజ్ఞము చేయఁగా మిగిలిన ద్రవ్యమును గ్రహించుగృహస్థులు సర్వపాపములనుండియు ముక్తులగుదురు. (యజ్ఞమును చేయక) తనకొఱకుమాత్రమే (అన్నమును) వండికొని భక్షించుపాపాత్ములు పాపమును భక్షించుచున్నారు.

[ఋగ్వేదమునందలి ౧౦. ౧౧౭. ౬-వ మంత్రమునం దీవిషయమే చెప్పఁబడినది. "నార్యమణం పుష్యతి నో సఖాయం కేవలాఘో భవతి కేవలాదీ"—"ఎవఁడు అర్యముని గాని, స్నేహితుని గాని, పోషింపఁడో, యేకాకిగనే భుజించుచున్నాఁడో వాఁడు పాపి యని యెఱుంగవలయును"—అని పైమంత్రమున కర్థము. అటులే మనుస్మృతియందును—"అఘం స కేవలం భుఙ్క్తే యః పచ త్యాత్మకారణాత్, యజ్ఞశిష్టాశనం హ్యేత త్సతా మన్నం విధీయతే." (౩.౧౧౮)—ఎవరు తమకొఱకే (అన్నమును) వండుకొనుచున్నారో వారు పాపమునే భక్షించుచున్నారు. యజ్ఞమును చేయఁగా మిగిలినద్రవ్యము 'అమృత' మనియు, ఇతరులందఱును భుజింపఁగా మిగిలినద్రవ్యము (భుక్తశేషము) 'విఘస' మనియు (మను.౩.౨౮౫) చెప్పఁబడును గాన నట్టియన్నమే శిష్టులకు విహితమని చెప్పఁబడినది (గీ. ౪. ౩౧ చూడుము). అది యటులుండె నిమ్ము; యజ్ఞాది

అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః,
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః. ౧౪
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. ౧౫

[కర్మలు తిలతండులముల నగ్నిలో వైచి తగులఁబెట్టుటకుఁగాని, స్వర్గమాత్రప్రాప్తికొఱకుఁగాని యేల కావో, జగత్తుయొక్క ధారణపోషణలనిమిత్తమై యవి యేల కావలయునో, జగత్తంతయు యజ్ఞముల నెటులవలంబించి యున్నదో యావిషయ మిఁకఁ బ్రచ నంతకంటె సుస్పష్టముగ చెప్పుచున్నాఁడు—]

(౧౪) ప్రాణులన్నియు నన్నముచేతనే పుట్టుచున్నవి. అన్నము పర్జన్యుఁడు వర్షించుటవలన పుట్టుచున్నది. పర్జన్యుఁడు యజ్ఞమువలన పుట్టుచున్నాఁడు. కర్మల నుండి యజ్ఞ ముద్భవిల్లుచున్నది.

[మనుస్మృతియందును మనుజుల కావశ్యకమగు నన్నముయొక్క యుత్పత్తి యిట్లె చెప్పఁబడినది. "యజ్ఞమున నగ్నిలో వేల్వఁబడినయాహుతి సూర్యునిచేరును. సూర్యునివలన(అనఁగా: పరంపరగా యజ్ఞమునుండియే) పర్జన్యుఁడును, పర్జన్యునివలన నన్నమును, నన్నమువలన ప్రజయు నుత్పన్నమగుచున్నది," అని మనుస్మృతిలోఁ జెప్పఁబడినది (మను. 3. ౭౬); ఈవిషయము మహాభారతమునను నిటులే చెప్పఁబడియున్నది (మ. భా. శాం. ౨౬౨. ౧౧ చూడు). తైత్తిరీయోపనిషత్తునందు (౨.౧) నీపరంపర నింతకు పూర్వమునకు నెట్టి, "పరమాత్మనుండి మొదట నాకాశమును, దానినుండి వాయువును, వాయువునుండి యగ్నియును, దానినుండి జలమును, అందుండి పృథ్వియును బుట్టఁగా, పృథ్వియందుండి యోషధులును, ఓషధులయందుండి యన్నమును, అన్నమునందుండి పురుషుఁడును బుట్టె" రని చెప్పఁబడినది. కావున దాని ననుసరించియే కర్మపర్యంతము చెప్పఁబడిన సర్వప్రాణులయొక్కయు పూర్వపరంపరను ప్రకృతితోడను, ప్రకృతిని తుదకు శుద్ధమగు నక్షరపరబ్రహ్మముతోడను జేర్చి యిపుడు పూర్ణము చేయుచున్నాఁడు.—]

(౧౫) కర్మ, బ్రహ్మమునుండి, అనఁగా: ప్రకృతినుండి పుట్టినదని తెలిసికొమ్ము. ఈ బ్రహ్మము అక్షరమునుండి, అనఁగా: పరమేశ్వరునుండి బయలువెడలి

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి. ౧౬

సా. కాన సర్వగతమగు బ్రహ్మమే యజ్ఞమునం దెప్పుడు నధిష్ఠించి యున్నది (అని తెలిసికొనుము.)

[ఈశ్లోకమందలి 'బ్రహ్మ' శబ్దమునకు 'ప్రకృతి' యని యర్థము చెప్పక కొందఱు 'వేద' మని యర్థము చెప్పుచున్నారు; కాని 'బ్రహ్మము', అనఁగా వేదము పరమేశ్వరునివలన వెలువడిన దను నర్థమీవాక్యమునకు కుదిరినను "సర్వగతమగు బ్రహ్మ యజ్ఞమునం దున్నది" అనువాక్యము నందలి యర్థము వారికి బాగుగ కుదురదు. కావున "మమ యోనిర్మహద్బ్రహ్మ" (గీ.౧౪.3) అనుశ్లోకమునందలి 'బ్రహ్మ' పదమునకు ప్రకృతి యని యర్థము కాన తదనుసారముగ 'బ్రహ్మ' శబ్దము చేత నిక్కడ సైతము జగత్తునకు మూలభూతమగు ప్రకృతియే వివక్షితమని రామానుజభాష్యమున చెప్పఁబడినయర్థమే నాకు బాగుగఁ గాన్పించుచున్నది. ఇంతియకాక మహాభారతమున శాంతిపర్వమునం దీయజ్ఞప్రకరణముననే యున్న "అనుయజ్ఞం జగత్సర్వం యజ్ఞశ్చానుజగత్సదా" (శాం.౨౬౭.3౪)—యజ్ఞము వెనుక జగత్తును, జగత్తు వెనువెంటనే యజ్ఞమును—అని యున్నది. బ్రహ్మ మనఁగా ప్రకృతి యని యర్థము చేసికొనుటచే నీశ్లోకమునకు నేకవాక్యత కలుగును. కారణమేమన: జగత్తనఁగా ప్రకృతి యని యర్థము. పరమేశ్వరునుండి ప్రకృతియును, త్రిగుణాత్మకప్రకృతినుండి జగత్తునందున్న సర్వకర్మలును నెట్లు నిష్పన్న మగునదియు గీతారహస్యమునందలి యేడు నెనిమిదియగు ప్రకరణములందు సవిస్తరముగఁ జెప్పఁబడినది. బ్రహ్మాదేవతలు మొదట యజ్ఞములు చేసియే సృష్టించినారని పురుషసూక్తమునందును చెప్పఁబడినది—]

(౧౬) ఓపార్థా! యిట్లు (జగత్తుయొక్క ధారణార్థమై) ఆరంభింపఁబడిన చక్రమును (అనఁగా: కర్మలయొక్క, లేక, యజ్ఞములయొక్క ఘటీయంత్రమును) జగత్తునందు ప్రవర్తింపఁజేయనివానియాయుష్యము పాపరూపమయినది. కాన నీయింద్రియలంపటునియొక్క (అనఁగా: దేవతలకు నీయక స్వయముగనే సుఖపడువారియొక్క) జీవనము వ్యర్థ మగును!

[బ్రహ్మదేవుని చేతనే—మానవుల చేఁగాదు—లోకముల ధారణపోషణా

యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మ న్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. ౧౭
నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన,
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః. ౧౮
తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచర న్కర్మ పర మాప్నోతి పూరుషః. ౧౯

ర్థమై యజ్ఞమయములగు కర్మలు, లేక, చాతుర్వర్ణ్యముయొక్క వృత్తులు సృజింపఁబడినందున సృష్టిక్రమమును ప్రవర్తింపజేయుటయును (శ్లోక. ౧౪), తనకార్యనిర్వాహమును (శ్లోక. ౮) అను నీరెంటినిమిత్తమును నా ప్రవృత్తి యావశ్యకమై యున్నది. కాన నీయజ్ఞచక్రమును నాసక్తితో నడపుట యీ జగత్తునం దెప్పుడును నలవాటులో నుంచుకొనవలయునని దీనివలన సిద్ధమైనది; అనఁగా: మీమాంసకులయొక్క, లేక, త్రయీధర్మమం దున్న, కర్మకాండను (యజ్ఞచక్రము) గీతాధర్మములయం దనాసక్తబుద్ధి యనెడుయుక్తిచే స్థిరముగ నెట్లాచరింపవలసినదియు చెప్పఁబడినది (గీతా. ర. ప్ర. ౧౧. పు. ౪౨౫-౪౩౦ చూడుము); కాని యాత్మజ్ఞానియగు పురుషునకు నిక్కడనే మోక్షము లభించును గాన, సంపాదింపఁదగినదంతయు నతనికి ప్రాప్తించియే యున్నది. ఈజగత్తునం దతఁ డేకర్మయు చేయ నక్కర లేదనియు, చేయను నైతము కూడదనియు సన్న్యాసమార్గీయులగు వేదాంతు లనేకులందురు. కావున వారికి గీతలలోని యుత్తరము నిప్పుడు మూఁడు శ్లోకములతో చెప్పుచున్నాఁడు.]

(౧౭) కాని కేవల మాత్మయందె రతుఁడును, ఆత్మయందె తృప్తుఁడును, ఆత్మయందె సంతుష్టుఁడు నైనవానికి (స్వీయములని చెప్పఁదగిన) కార్యము లేవియు నుండవు. (౧౮) కావున నిక్కడ (అనఁగా: ఈజగత్తునందు) నేవిషయమయినను చేయుటచే నతనికి లాభ మేమియు నుండదు చేయకపోవుటచే నష్టము నైత ముండదు. సర్వభూతములయందును తనకు స్వీయములని చెప్పఁదగిన యర్థము లేమియు నాగియుండవు. (౧౯) తస్మాత్, అనఁగా జ్ఞాని కీరీతిగ నేవిధమగు నపేక్షయు నుండనందున, నీవు నైతము (ఫలమునందు) ఆసక్తి నుంచక (నీయొక్క) కర్తవ్యకర్మలను తప్పక చేయవలయును. కారణ మేమన: ఆసక్తిని విడచి కర్మ చేయుచుండువానికి పరమగతి లభించును.

[౧౭-వ శ్లోకము మొదలు ౧౯-వ శ్లోకమువఱకును టీకాకారులు బహువిపర్యాసముగ నర్థమును చేసిరి. కాన వానికి సరళమగు భావార్థమును మొదట చెప్పుచున్నాను. మూఁడు శ్లోకములును కలసి హేత్వనుమానముతోఁ గూడుకొనిన యొక వాక్యమే యై యున్నది. వీనిలో ౧౭, ౧౮ శ్లోకములయందు జ్ఞాని కర్మ చేయకుండుటకు సామాన్యముగఁ జెప్పఁదగిన కారణముల ననువదించి, దానినిబట్టియే గీత చేయునట్టి యనుమానమే, 'తస్మాత్' అను కారణబోధకశబ్దమును మొదటఁ బ్రయోగించి ౧౯-వ శ్లోకములో వ్రాయఁబడినది; నిద్రించుట, కూర్చుండుట, లేచుట, వేయేల? బ్రతికియుండుట మొదలగు కర్మలు చేయవలదని చెప్పినమాత్రముచే వదలిపెట్టుటకు సాధ్యములైనవి కావు. కాన కర్మలు వదలిపెట్టుటచే నైష్కర్మ్యము సిద్ధింపదు. ఆనైష్కర్మ్యము, సిద్ధిని సంపాదించుకొనుటకు నైతముపాయముగూడ కాదని యీయధ్యాయారంభమున నాలుగైదు శ్లోకములయందు స్పష్టముగఁ జెప్పఁబడినది; కాని, దీనిపై సన్న్యాసమార్గీయులు "నేను సిద్ధిని సంపాదించుకొనువిషయమై కర్మలను వదలిపెట్టుట లేదు. ఎవరైన నీజగత్తునందు చేయునదంతయు, తనకుఁగాని, లేక, యితరులకుఁగాని లాభము కల్గుటకై చేయుదురు; కాని, మనుజునకు పరమసాధ్యమగు సిద్ధావస్థ, లేక, మోక్షము జ్ఞానికి జ్ఞానముచేతనే ప్రాప్తమగును. కావున తర్వాత జ్ఞాని యేమియు సంపాదించుకొన నక్కఱలేదు (శ్లోక. ౧౭). అతఁడేవిషయము నైనను చేసినను చేయకపోయినను నొక్కటియే. లోకోపకారార్థమై యతనిచే కర్మలు చేయఁబడవలయునని యందుమేని, యతఁడు లోకమున వ్యవహరింపవలసినదియు లేదు (శ్లోక. ౧౮). కావున నతఁడేల కర్మ చేయవలయు నని పూర్వపక్షము చేయవచ్చును; కాని, కర్మను చేయుటయు, చేయకుండుటయు నీకు సమానములే యైనచో కర్మ చేయఁగూడ దనునాగ్రహము మాత్రము నీ కేలయుండవలయును? శాస్త్రమువలన ప్రాప్తములగు కర్మల నన్నింటిని నాగ్రహశూన్యమగు బుద్ధితో చేసి విముక్తుఁడవు కమ్ము. ఈజగత్తునందు జ్ఞానినైనను, నజ్ఞానినైనను కర్మ వదలకపోవుటయు, జ్ఞాని కాకర్మలవలన స్వీయమగు ప్రయోజన మేమియు లేకుండుటయు, పరస్పరవిరుద్ధములుగ కాన్పించును కాని గీతల కిది యొకగొప్పవిషయముగ తోఁపనందునను, కర్మను వదలిపెట్టుటకు సాధ్యము కానందునను, నాకర్మను చేయవలయు

నని చెప్పుచున్నది. స్వార్థబుద్ధియుండక పోవుటచేతనే యిప్పుడు నిష్కామబుద్ధితో కర్మను చేయవలయును. మఱియు 'తస్మాత్' అను పదమును జేర్చి ౧౯-వ శ్లోకమునం దర్జునున కీయుపదేశము చేయఁబడియుండుటచే దానిని దృఢపఱచునిమిత్తమై, జ్ఞానులందఱిలోను శ్రేష్ఠుఁడగు భగవంతునకు కర్తవ్యమేమియు లేకపోయినను, తర్వాత ౨౨-వ శ్లోకమున నాకర్మలను చేయుచునే యున్నాఁడను దృష్టాంతి మీయఁబడినది. సన్న్యాసమార్గీయులు చెప్పునట్టి జ్ఞానియొక్క స్థితినే బాగుగ విచారించి దానివలనను కర్మసన్న్యాసపక్షము సిద్ధము గానందున, నిష్కామకర్మల నెప్పుడును చేయవలయు ననుపక్షమే మిక్కిలి బలవత్తరమైనదని గీత చెప్పియున్నదని యిందలి సారాంశము; కాని కర్మయోగమునందున్న యీయుక్తివాదమును, సిద్ధాంతమును, సన్న్యాసమార్గీయులగు టీకాకారులకు సమ్మతము కానందున పైని చెప్పఁబడినకార్యకారణభావమును, మొత్తముపై నర్థసందర్భమును, పిదపఁ జెప్పఁబడిన భగవంతునిదృష్టాంతమును (శ్లో. ౭, ౮, ౯, ౨౨, ౨౫ మఱియు 30 చూడుము), బాగుగ నవుపూహనందును నిమూఁడు శ్లోకములను విడదీసి స్వతంత్రములని చెప్పిరి. వానిలో మొదటి రెండు శ్లోకములకును, జ్ఞానికి స్వీయమగుకర్తవ్య మేమియు లేకపోవుట యనునది మొదలుగాఁ గలయుపదేశమే గీతయందలి చరమసిద్ధాంతమని కల్పించి, దాని యాధారమున జ్ఞానులు కర్మను విడువవలయునని భగవంతుఁడు చెప్పుచున్నారని ప్రతిపాదించిరి. అట్లగునేని మూఁడవ (అనఁగా: ౧౯-వ) శ్లోకమునందు "ఆసక్తిని విడలి కర్మలను జేయుము" అని అర్జునునకు వెంటనే చేయఁబడిన యుపదేశము సందర్భశూన్యమగును. కావున నిప్రతిబంధకములను బోఁగొట్టునిమిత్తమై కర్మ చేయుమని యర్జునునకు చేయఁబడిన యుపదేశమతఁ డజ్ఞాని యను నూహతో చేయఁబడినదని టీకాకారులు సమాధానము చెప్పినారు; కాని యిట్లు చెప్పినను ౧౯-వ శ్లోకమునందలి 'తస్మాత్'అను పదము నిరర్థకమగుటయే గాక, యీయధ్యాయమునందున్న పూర్వాపరసందర్భమునకును, జ్ఞాని యాసక్తిని విడలి కర్మలను చేయవలయునని యనేకప్రదేశములయందున్న యుపదేశమునకును, భగవంతుఁడు ముందు చెప్పఁబోవు స్వీయదృష్టాంతమునకును, నీయర్థము విరుద్ధమే యగును (గీ. ౨. ౪౭; 3. ౭, 3౫; ౪, ౨౩; ౬. ౧; ౧౮. ౬-౯; మఱియు గీ. ర. ప్ర. ౧౧. పు. ౪౪3-౪౪౭ చూడుము). ఇంతియకాక, కర్మను చేసినను, ఏకర్మయోగమూల

మున నది బంధకము కాదో (గీ. ౨. ౩౯) యాకర్మయోగముయొక్క వివేచనయే, యీయధ్యాయమునందు చేయఁబడుచుండఁగా, నావివేచన యొక్క నడుమ సందర్భశూన్యముగ "కర్మలను వదలివేయుట యుత్తమ" మని యోగ్యుఁడగు వాఁ డెవ్వఁడును చెప్పఁడు. ఇఁక భగవంతుని విషయమై వేఱుగ చెప్పనేల ? కాన సాంప్రదాయికాగ్రహముతో బలాత్కారముగానిట్టియర్థమును చెప్పుటకు వీలులేదు. జీవన్ముక్తుఁడగుజ్ఞానియు కర్మలు చేయవలయుననువిషయము యోగవాసిష్ఠమునందు చెప్పఁబడినది. ముక్తులెట్లు చేయవలయునో తనకు చెప్పుమని రాముఁ డడుగ—

"జ్ఞస్య నార్థః కర్మత్యాగైః నార్థః కర్మసమాశ్రయైః,
తేన స్థితం యథా యద్యత్ తత్తథైవ కరోత్యసౌ."

"జ్ఞానికి కర్మను వదలిపెట్టుటచేతఁ గాని, చేయుటచేతఁగాని లాభ మేమియు లేదు. గాన (తేన) నతఁడు సంభవించినదెల్ల, సంభవించినట్లుగా నాచరించును." (యోగ. ౬. ఉ. ౧౯౯. ౪) అని వసిష్ఠుఁడు సమాధానము చెప్పెను. ఈగ్రంథాంతమున నుపసంహారమునందు—

"మమ నాస్తి కృతేనార్థో నాకృతేనేహ కశ్చన,
యథా ప్రాప్తేన తిష్ఠామి హ్యకర్మణి క ఆగ్రహః."

"నాకు నేవిషయమ్మును చేసినను, చేయకపోయినను సమానముగనే యుండును." అని గీతాశ్లోకములో నున్నశబ్దములతోడనే మొదట కారణమును జెప్పి, రెండును సమానములుగ నున్నయెడల, "కర్మలు చేయ నని యాగ్రహముమాత్ర మెందులకని శాస్త్రమువల్ల సంప్రాప్తములైన కర్మల నన్నింటిని నేను చేయుచున్నా"నని రెండవచరణమునందు చెప్పఁబడినది (యోగ. ౬. ఉ. ౨౧౬. ౧౪). అటులే దీనికంటె పూర్వమందు "నైవ తస్య కృతే నార్థః" అను గీతలలోనున్న శ్లోకమే యోగవాసిష్ఠమునందున్నది. పిదప "యద్యథా నామ సంపన్నం తత్తథాఽస్త్వితరేణ కిమ్"— కాన నేది ప్రాప్తమగునో దానినే (జీవన్ముక్తుఁడు) చేయును. మఱియొక విషయమునుగుఱించి యాలోచింపఁడు— అని చెప్పఁబడినది (యో. ౬. ఉ. ౧౨౫. ౪౯. ౫౦). యోగవాసిష్ఠమునందే కాక, గణేశగీతలయందును—

"కించి దస్య న సాధ్యం స్యాత్ సర్వజంతుషు సర్వదా,
అతోఽసక్తతయా భూప కర్తవ్యం కర్మ జంతుభిః."

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహమేవాపి స పశ్యన్ కర్తుమర్హసి. ౨౦

“ఇతరములగు నేజంతువులతోడను నతఁడు చేయతగినపని యేమియు నుండదు. ఈకారణముచేతనే (అతః) ఓరాజా! తమకర్తవ్యముల నసక్త బుద్ధితోఁ జేయవలయు” నను నర్థముగల శ్లోకము గలదు (గణేశగీత ౨-౧౮). దీనినిబట్టి ప్రకృతమునందు గీతలలో నున్న మూఁడుశ్లోకములను నేను పైనఁజెప్పినకార్యకారణభావమే యుక్తముగ నున్నట్లు కాన్పించుచున్నది. గీతలలోనున్న యీమూఁడుశ్లోకములకును ప్రతినిధిగ నీవిషయమంతయు యోగవాసిష్ఠములో నొకశ్లోకమునందే చెప్పఁబడినది. దానియందలి కార్యకారణభావమువిషయమయి యేమియు సంశయము లేదు. గీతలయందున్న యీయుక్తినే పిదప మహాయానపంథ (మార్గము) యందు బౌద్ధగ్రంథకారులును స్వీకరించిరి (గీ. ర. పు. ౭౮౦ మఱియు ౭౯౯ చూడుము). అది యట్లుండె నిమ్ము; జ్ఞానులకు స్వార్థము లేకపోయినంతమాత్రముచేతఁ దమకర్తవ్యమును నిష్కామబుద్ధితో చేయుట యను నిష్కామకర్మ, మోక్షమునకు ప్రతిబంధకము కాకపోవుటయే కాక దానిమూలముననే సిద్ధి గలుగునని పైనచెప్పినవిషయమును బలపఱచుటకై యిప్పుడు దృష్టాంతమును చెప్పుచున్నాఁడు.—]

(౨౦) జనకాదులచే నిటులే కర్మలచేతనే సిద్ధి సంపాదింపఁబడినది. అట్లు లోకసంగ్రహదృష్టితో కర్మ చేయుటయే నీకుచితమైనపని.

[నిష్కామకర్మలచే సిద్ధి కలుగుననువిషయమునకు నుదాహరణ మీశ్లోకమునందు ప్రథమచరణమునందు చెప్పఁబడినది. రెండవచరణము మొదలుకొని వేఱురీతిగ ప్రతిపాదించుట కారంభింపఁబడినది. జ్ఞానులకు లోకులతో నేమియు ప్రయోజనము లేకపోయినను కర్మ చేయక తప్పనందున వారు నిష్కామకర్మను చేయవలయునని నిశ్చితమగుచున్నది; కాని కర్మ చేయక తప్పదనుయుక్తివాదము న్యాయసిద్ధమైనను సామాన్యజనంబులకు నంతమాత్రముచేతనె తగినంతనమ్మక ముండనేరదు. మొత్తముపైనపరిహార్యమగుటచేతనె కర్మ చేయవలయునని చెప్పఁగనె మఱియొక ప్రయోజనమేమియు లేదనువిషయము స్పష్టమగుచునే యున్నది. కాన లోకసంగ్రహముకొఱకు తాముకర్మ చేయుటయనునది జ్ఞానులకును మిక్కిలి గొప్పసంగతి

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే. ౨౧

[యని యీజగత్తునందు ప్రసిద్ధమైయున్న దనువిషయమును నిరూపించుట యీశ్లోకమునందలి రెండవచరణము మొదలుకొని యారంభింపఁబడినది. "లోకసంగ్రహ మే వాపి" అను శ్లోకమునందలి 'ఏవాపి' అను పదములకు తాత్పర్యమిదియె కాన దీనినిబట్టి ప్రతిపాదించుట కిప్పు డారంభమయిన దని స్పష్ట మగుచున్నది. 'లోకసంగ్రహ' శబ్దమందున్న 'లోక' శబ్దము యొక్క యర్థము వ్యాపకమయిన దగుటచే, కేవలమనుష్యజాతినే కాక సర్వ జగత్తును సన్మార్గమందు ప్రవేశపెట్టి దాని నశింపనీయక మంచిరీతిని ధారణమును, పోషణమును పాలనమును చేయుట యనుసర్వవిషయములును చేరియున్న వనునది మొదలుగాఁగలవిషయములు గీతారహస్యమునందు పదునొకండవప్రకరణమునందు (పు. ౩౧౩-౩౭౪) నేను విచారించితిని గాన తిరిగి యిచ్చట చెప్పనక్కఱలేదు. లోకసంగ్రహమును చేయుట యనునధికారము జ్ఞాని కెందుల కుండునో మొదట చెప్పుచున్నాఁడు—]

(౨౧) శ్రేష్ఠుఁడు (అనఁగా : ఆత్మజ్ఞానియగు కర్మయోగి) చేయుపనినే యితరులు(సామాన్యజనులు) సైతము చేయుదురు. అతఁడు ప్రమాణముగ గ్రహించినవిషయమునె లోకు లనుసరింతురు.

[తైత్తిరీయోపనిషత్తునందు సైతము 'సత్యం వద' 'ధర్మం చర' మొదలగు ధర్మముల నుపదేశించి "సంసారమున నేవిషయమునేని యెట్లాచరింపవల యునో యని నీకు సందేహము గలిగినచో, జ్ఞానియు, యుక్తుఁడును, ధర్మిష్ఠుఁడు నగు బ్రాహ్మణుఁ డావిషయము నాచరించునటుల యాచరించుము." అని చెప్పఁబడినది (తై. ౧. ౧౧. ౪); మఱియు నీయర్థముగలయొకశ్లోకము నారాయణీయధర్మములయందును చెప్పఁబడినది (మ. భా. శాం. ౩౪౧. ౨౫); మహారాష్ట్రభాషయందు "జనా వర్తవీ లోకకల్యాణకారీ, జగీ వర్తతీ సర్వహీ త్యా ప్రకారీ" అను సమర్థులవారిశ్లోక మీశ్లోకమునే యనువదించుచున్నది. సమర్థులు నుడివిన యీలోకకల్యాణకారియు, గీతలలో చెప్పఁబడిన 'శ్రేష్ఠుఁ'డగు, కర్మయోగియు నొకఁడె. శ్రేష్ఠశబ్దమునకు 'ఆత్మజ్ఞాని యగుసన్న్యాసి'యని యర్థము కాదు (గీ.౫.౨.చూడుము). ఆత్మజ్ఞానికి స్వార్థబుద్ధి లేకపోయినను లోకకల్యాణసంబంధమగు కర్మల

నమేపార్థాస్తికర్తవ్యం త్రిషులోకేషు కించన,
నానవాప్తమవాప్తవ్యం నర్తఏవచకర్మణి. ౨౨
యదిహ్యహంనవర్తేయం జాతుకర్మణ్యతంద్రితః,
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః. ౨౩
ఉత్సీదేయురిమేలోకా నకుర్యాం కర్మచేదహమ్,
సంకరస్యచకర్తాస్యా ముపహన్యామిమాః ప్రజాః. ౨౪

నాతఁడు విడువఁగూడదు. ఈవిషయమునే తనయుదాహరణముచే భగవంతుఁడు బాగుగ దృఢపఱుచుచున్నాఁడు.—]

(౨౨) ఓపార్థా! నాకు ముల్లోకములలో కర్తవ్యము లేదు; ఇదివరలో లేనిదియు, ఇప్పుడు సంపాదించుకోఁతగినదియు నగు వస్తువేమియు లేదు. అయినను నేను కర్మలను చేయుచునేయున్నాను. (౨౩) కారణమేమన: ఓపార్థా! నేనొకవేళ కర్మల నలక్ష్యభావమున చేయకపోయితినేని మనుజులందఱును నన్నివిధములచేతను నామార్గమునె యనుకరింతురు. (౨౪) నేను కర్మలను చేయకపోతినేని యీలోకము లుత్సన్నములగును. నేను సంకరము చేయువాఁడ నగుదును. ప్రజలకు నావలన ఘాత కలుగును.

[లోకసంగ్రహ మనునది యొక వ్యర్థపుపని కాదని భగవంతుఁడు తనయుదాహరణముచే నీశ్లోకమునందు మిక్కిలి బాగుగ స్పష్టముచేసెను. అటులే జ్ఞానముకలిగినపిదప జ్ఞానికి కర్తవ్య మేమియు లేకపోయినను నిష్కామబుద్ధిచే నతఁడు కర్మల నన్నింటిని చేయవలయునని ౧౭-౧౯ శ్లోకములను నేచెప్పిన యర్థముసైతము భగవంతుని దృష్టాంతముచే పూర్ణముగ సిద్ధమగుచున్నది. వేయేల? అట్లు కాదేని యీదృష్టాంతమే వ్యర్థమును నుపపన్నమును నగును (గీ. ర. పు. ౪౪౫ చూడు). యజ్ఞచక్రము చెడిపోయినను, జగత్తు చెడినను లక్ష్యముసేయక, సాంఖ్యమార్గీయు లగుజ్ఞానులు కర్మల నన్నింటిని వదలిపెట్టుచున్నారు. కర్మమార్గీయు లగుజ్ఞాను లాత్మార్థమై చేసితీరవలసినవి కాకపోయినను, లోకసంగ్రహ మనుగొప్పవిషయమావశ్యకమగు సాధ్యమనుతలంపున, ధర్మానుసారముగ ప్రాప్తములగు సర్వకర్మల నాచరించుచునే యున్నారు. ఇదియే యీరెండుమార్గముల యందును నుండు గొప్పభేదము (గీ. ర. ప్ర ౧౧. పు. ౪౫౫ చూడు).

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాంస్తథాఽసక్తః చికీర్షు ర్లోకసంగ్రహమ్. ౨౫
న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్,
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్. ౨౬

[భగవంతుఁడు తాను కర్మలను చేయుచున్నసంగతి చెప్పియే యున్నాఁడు. ఇప్పుడు జ్ఞానియొక్కయు, నజ్ఞానియొక్కయు కర్మయందలి భేదమును నిరూపించి యజ్ఞానులను సంస్కరించునిమిత్తమై జ్ఞాని యవశ్యముగ నేమి చేయవలయునో చెప్పుచున్నాఁడు—]

(౨౫) కాన నోయర్జునా! లోకసంగ్రహమును చేయవలయునని తలఁచుచున్న జ్ఞాని (వ్యావహారికమగు) కర్మయందు నాసక్తులగు నజ్ఞానులవలెనే కర్మ చేయును; కాని యాసక్తిని వదలి యాచరింపవలయును. (౨౬) కర్మలయందాసక్తిగల యజ్ఞానులబుద్ధిని జ్ఞాని చెడఁగొట్టఁగూడదు. (తాను) యుక్తుఁడు, అనఁగా: యోగయుక్తుఁడును, సర్వకర్మలను చేయువాఁడును నయి లోకులను సంతోషపూర్వముగ నాకర్మలను చేయునట్లు చేయవలయును.

[అజ్ఞానులబుద్ధిని చెడఁగొట్టకూడ దని యీశ్లోకమున కర్థము. ఆవిషయమునే -౨౯-వ శ్లోకమున మరలఁ జెప్పెను; కాని లోకుల నజ్ఞానమునందే ప్రవర్తింపఁజేయవలయు నని యీశ్లోకమున కర్థము కాదు. -౨౫-వ శ్లోకమున జ్ఞాని లోకసంగ్రహమును చేయవలయునని చెప్పఁబడినది. మఱియు లోకసంగ్రహమన లోకులను బుద్ధిమంతులుగఁజేయుట; "లోకసంగ్రహము కర్తవ్యమైనను దానినిమిత్తమై జ్ఞాని కర్మలనుచేయుట యావశ్యకము కాదు. లోకులకు జ్ఞానము కలుగజేసినఁ జాలును." అని యెవరైన ననవచ్చునని తలఁచి భగవంతుఁడు సదాచరణమునం దెవరికి దృఢమగు నభ్యాసము కలుగలేదో (సామాన్యజను లీకోటిలోనివారె) వారికి నోటిమాటలచే జ్ఞానమునుమాత్రమే యుపదేశించినచో వీరు తమచెడుమార్గమును సమర్థించుటకొఱకె యీబ్రహ్మజ్ఞానమును దురుపయోగమును జేయుదురు. మఱియు "ఒకజ్ఞాని యిట్లు చెప్పుచున్నాఁడు" అని వ్యర్థవిషయములను మాత్రమే చెప్పుటకు మొదలిడుదురని తోఁపకమానదు. అటులే జ్ఞాని బొత్తిగ కర్మలను వదలివేయునేని యజ్ఞానులు నిరుద్యోగులగుటకు నది యొకదృష్టాంతమగును. లోకు లీవిధమున యుక్తిపరులును, వ్యర్థులును, నిరుద్యోగులును

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకార విమూఢాత్మా కర్తాహ మితిమన్యతే. ౨౭

నగుటయే బుద్ధిభేద మని చెప్పఁబడినది. మఱియు లోకులబుద్ధి కిట్లు భేదము గల్గించుట జ్ఞాని చేయఁదగినపని కాదు. కాన జ్ఞాను లగువారు లోకసంగ్రహార్థము, అనఁగా: లోకులను బుద్ధిమంతులనుగను, సదాచరణముగలవారినిగను జేయుటయును, తాము సంసారమునం దుండి నిష్కామకర్మలయొక్క, అనఁగా: సదాచరణముయొక్క బరువును లోకులపై నుంచుటయును, వారిచేత దాని నాచరింపఁజేయుటయు ననునది యీ జగత్తుందలి గొప్పకార్యమని గీతయందు సిద్ధాంతము చేయఁబడినది (గీతా.ర.ప్ర. ౫౫-౫౬ చూడు); కాని గీతలయొక్క యీయభిప్రాయము నెఱుఁగక యజ్ఞాను లజ్ఞానులుగనే యుండి తమకర్మలను చేయవలయు ననియు, జ్ఞాను లట్లు కర్మలను జేయువారివలె నుండవలయుననియు ననేకు లగు టీకాకారు లీశ్లోకమునకు విపరీతముగ వ్యాఖ్యానమును జేయుచున్నారు. గీత దంభాచరణమును నేర్పుటకై కాని, లోకుల నజ్ఞానులుగనే యుంచి పశువులచేత పనులుచేయించినట్లు వారిచే కర్మ చేయించుటకై కాని ప్రవృత్తమయినదని చెప్పవలయునా యేమి! జ్ఞాని కర్మ చేయఁగూడదని దృఢముగ నిశ్చయించినవారికి లోకసంగ్రహముసైత మొక వేషముగఁ దోఁచుట స్వాభావికమగును; కాని గీతయందలి సత్యమగు నభిప్రాయమది కాదు. లోకసంగ్రహము జ్ఞానులయొక్క కార్యములో, నొకగొప్ప కార్యము గాన, లోకులను జ్ఞానులనుగఁ జేయుటయొకాక, యుత్తమమగు తమయాచరణ మనునాదర్శముచే వారిని సంస్కరించుటకై జ్ఞానులు సైతము కర్మలను చేయవలయునని భగవంతుఁడు చెప్పుచున్నాఁడు (గీతారహస్యము. ప్ర. ౧౧. ౧౨. చూడు). అది యట్లుండనిమ్ము; లోకసంగ్రహార్థమై యాత్మజ్ఞాని సాంసారికకర్మలను చేయునేని యతఁడును నజ్ఞానియే యనెడిభ్రమ కలుగవచ్చును. కాన జ్ఞానియు, నజ్ఞానియు సంసారులుగనే యున్నచో వారి యాచరణమునందున్న భేద మేమైనదియు జ్ఞానులతనిఁ జూచి యేమి నేర్చుకొనవలసినదియు నిపుడు స్పష్టముగఁ జెప్పుచున్నాఁడు].

(౨౭) ప్రకృతియొక్క (సత్త్వము, రజస్సు, తమస్సు అను) గుణములచే సర్వవిధములగు కర్మలును చేయఁబడుచుండ, అజ్ఞాని యహంకారముచే 'నేను కర్త'

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః,
గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే. ౨౮
ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు,
నాసకృత్స్నవిదో మందా న్కృత్స్నవి న్న విచాలయేత్. ౨౯

యని యనుకొనుచున్నాఁడు; (౨౮) కాని యో మహాబాహూ! అర్జునా! గుణములును, కర్మలును తనకంటె భిన్నములుగ నున్నవి యను తత్త్వమును తెలిసికొన్న వాఁడు (జ్ఞాని) ఇది తమంతట తామె ప్రవర్తించుచున్న గుణములయొక్క యాట యని యెఱింగి దానియం దాసక్తుఁడు కాఁడు. (౨౯) ప్రకృతియొక్క గుణముచే భ్రష్టులయినవారు గుణకర్మములయందే యాసక్తు లగుదురు. ఇట్టి యసర్వజ్ఞులును మందులును నయినవారిని సర్వజ్ఞుఁడగువాఁడు తనయొక్క కర్మత్యాగముచేత పెడత్రోవలో ప్రవేశపెట్టి చెఱుపరాదు.

[౨౮–వ శ్లోకమునందున్న విషయమె యిచ్చో ననువాదము చేయఁబడినది. ప్రకృతి వేఱనియు, ఆత్మ వేఱనియు, ప్రకృతి కార్యముల నన్నింటిని చేయుచున్నదనియు, ఆత్మ యేమియు చేయుట లేదనియు, తెలిసికొనినవాఁడే బుద్ధిమంతుఁడును, జ్ఞానియు నై యున్నాఁడనియు, అతనికి కర్మబంధము తగులదనియు పైశ్లోకములయందు చెప్పఁబడినవిషయము కాపిలసాంఖ్యశాస్త్రమునందలి మూలసిద్ధాంతమని గీతారహస్యమునందలి ౭–వ ప్రకరణమునందు (పు. ౨౨౦–౨౨౪) పూర్ణముగ వివేచింపఁబడినది. ౨౮–వ శ్లోకమునందు గుణములనఁగా నింద్రియములనియు, గుణములయం దనఁగా విషయములయం దుండులనియు ననేకులు సెప్పుచున్నారు. ఈయర్థ మెంతమాత్రమును తప్పుకాదు. కారణమేమన: ఇంద్రియములును, శబ్దస్పర్శాదికములు నగు నైదువిషయములు ననునవి సాంఖ్యశాస్త్రానుసారముగ మూలప్రకృతియొక్క యిరువదిమూఁడుగుణములలోనే యిమిడియున్నవి; కాన వీనికంటె ప్రకృతియొక్క యన్నిగుణములను, అనఁగా: ౨౪ గుణములను నుద్దేశించియే "గుణాగుణేషు వర్తంతే" యని సిద్ధాంతము చేయఁబడినది (గీ. ౧౩. ౧౯–౨౨; మఱియు ౧౪. ౨౩ చూడుము). నేను వానిలో ప్రతిపదమునకు వ్యాపకరీతిగ భాషాంతర మొనర్చితిని. జ్ఞానిచేతను, అజ్ఞానిచేతను నొకకర్మయే చేయఁబడినను, దానియం దిట్టు బుద్ధినిబట్టి గొప్పభేదము కలదని చెప్పి (గీ. ర. పు. ౪౨౬,౪౫౩) యీవివేచనమున కంతకును సారమును భగవంతుఁ డిప్పుడి ట్లుపదేశించుచున్నాఁడు—]

§§ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30
§§ యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః,
శ్రద్ధావంతో ఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. 3౧
యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్,
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్విద్ధి నష్టా నచేతసః. 3౨
§§ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవా నపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

(30) (కావున నో పార్థా!) అధ్యాత్మబుద్ధితో సర్వకర్మల నాకు సమర్పణము చేసి (ఫలముయొక్క) ఆశను, మమత్వమును వదలి, నీవు విసుగుఁజెందక యుద్ధమును చేయుము.

[ఈయుపదేశానుసారముగ నాచరించిన నేమి ఫలము కల్గునదియు, ఆచరింపకపోయిన నేమిగతి ప్రాప్తించునదియు నిప్పుడు చెప్పుచున్నాఁడు—]

(3౧) దోషముల నెంచుచు కాలక్షేపము సేయక శ్రద్ధావంతులై నా యీయుపదేశానుసారముగ నిత్యమును కర్మల నాచరించువారు సైతము కర్మబంధముల నుండి ముక్తులగుదురు. (3౨) కాని యసూయగలవారలై యీ నామతము నాచరింపనివారు సర్వజ్ఞానవిమూఢులై, అనఁగా: యథార్థమయిన మూర్ఖులగునవివేకులై చెడినారని తెలిసికొమ్ము.

[నిష్కామబుద్ధితో కర్మల నన్నింటిని చేయుమని చెప్పుకర్మయోగమే శ్రేయస్కరమనువిషయమై పూర్వోక్తములగు నన్వయవ్యతిరేకములచే చెప్పఁబడిన ఫలశ్రుతిని బట్టి గీతలయందు ప్రతిపాద్యమగువిషయ మేదియో యిప్పుడు పూర్ణముగ వ్యక్తమగును. ఈకర్మయోగనిరూపణమును పూర్తి చేయుటకొఱకే ప్రకృతియొక్క ప్రాబల్యమును, దాని నిరోధించుటకై యింద్రియనిగ్రహమును భగవంతుఁ డిప్పుడు చెప్పుచున్నాఁడు—]

(33) జ్ఞానియగు పురుషుఁడు స్వభావానుసారముగనే ప్రవర్తించుచున్నాఁడు. సర్వభూతములును (తమతమ) ప్రకృతి ననుసరించియే ప్రవర్తించు

ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ. ౩౪

చున్నవి. (అక్కడ) నిగ్రహము, అనఁగా బలాత్కారమేమి చేయఁగలదు? (౩౪) ప్రతీంద్రియముగందును, వాని (శబ్దస్పర్శాది) విషయములయందును, రాగద్వేషములు (రెండును) వ్యవస్థితములై యుండును, అనఁగా: అవి యెప్పుడు నట్లే యుండును. ఈరాగద్వేషములకు వశమైనవాఁడు కాఁగూడదు. కారణ మేమన: అవియే శత్రువు లగుచున్నవి.

[౩౩-వ శ్లోకమునందు 'నిగ్రహ'శబ్దమునకు 'కేవలసంయమన' మని యర్థము కాదు. ప్రబలత, లేక, పట్టుదల యని యర్థము. ఇంద్రియములయొక్క యోగ్యమగు నిరోధము గీతలకును సమ్మతమే; కాని పట్టుదలతో (అనఁగా: బలాత్కారముగ) నింద్రియములయొక్క స్వాభావికమగు ప్రవృత్తి సైతము బొత్తిగ వదలుటకు శక్యము కాదని యిప్పుడు చెప్పుచున్నాఁడు. ఉదాహరణము:—దేహ మున్నంతవఱకును, ఆఁకలి, దప్పి, మొదలగుధర్మములు ప్రకృతిసిద్ధములయినందున, మనుజుఁ డెంతజ్ఞానియైనను నాఁకలిపొడమఁగనే బిచ్చమెత్తికొనుటకు బయటికి వెళ్లును. కాన నింద్రియములను బలాత్కారముచే, బొత్తిగ చంపవలయునని వ్యర్థముగ పట్టుపట్టక యోగ్యమగు సంయమనముచే వానిని తమస్వాధీనములుగ నుంచుకొని లోకసంగ్రహార్థమై వానికి స్వాభావికములగు వృత్తుల నుపయోగించుకొనుటయే బుద్ధిమంతునకు కర్తవ్యమని యీశ్లోకముయొక్క భావార్థము. అటులనే సుఖదుఃఖములును, వికారములును స్వతంత్రము లయియున్నవి. ఒకటి, రెండవదానియొక్క యభావరూపమయినది కాదు, అనువిషయము సైతము ౩౪-వ శ్లోకమునందున్న వ్యవస్థితశబ్దమువలన స్పష్టమగుచున్నది (గీతా. ర. ప్ర. ౪. పు. ౧౩౭ మఱియు ౧౫౪ చూడు). ప్రకృతియొక్క, అనఁగా: సృష్టియొక్క యఖండమగు పటాటోపమునందు మనకేమియు నవసరములేని పనులు సైతము చేయవలసివచ్చును. అట్లు చేయవద్దని యనుకొన్నను చేయక తప్పదు (గీ. ౧౮. ౫౯ చూడు). ఇట్టిసమయమునందు జ్ఞాని యీకర్మలను నిష్కామబుద్ధితో కేవలకర్తవ్యములని చేయుటచే వానియొక్క పుణ్యపాపములచే నలిప్తుఁడగును. మఱియు నజ్ఞాని దానియందే యాసక్తుఁడగుటచే దుఃఖమును పొందును. ఇదియే వీరిలోనున్న భేదమని భాసకవి

§§ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 3౫

చెప్పినటుల, బుద్ధులను బట్టిచూడ విశేషభేదము కలదు; కాని యింద్రియములను బలాత్కారముగ నణఁగఁద్రొక్కి కర్మత్యాగముఁ జేయక నిస్సంగబుద్ధితో కర్మల నన్నింటిని జేయవలయునని సిద్ధమయినను, జ్ఞాని యుద్ధము వంటి హింసాత్మకమగు ఘోరకర్మను చేయుటకంటె, కృషి, వ్యాపారము, భిక్ష మొదలగు నుపద్రవశూన్యములును సౌమ్యములు నగు కర్మలను చేయుట మిక్కిలి ప్రశస్తము కాదా? యని శంక వెలువడును. భగవంతుఁ డిట్లు దానికి సమాధానమును జెప్పుచున్నాఁడు—]

(3౫) పరకీయమగుధర్మము సుఖముగ నాచరించుటకు వీలయినను, దానికంటె తనధర్మమే, అనఁగా: చాతుర్వర్ణ్యవిహితమగు కర్మయే, విగుణము, అనఁగా: దోషసహితమయినను మిక్కిలి శ్రేయస్కరమయినది. స్వధర్మానుసారముగ (ప్రవర్తించునపుడు) మరణించినను కల్యాణము గలదు. (కాని) పరులధర్మము భయంకరమైనది.

[స్వధర్మమనఁగా స్మృతికారులు చాతుర్వర్ణ్యవ్యవస్థానుసారముగ ప్రతిమనుజునకును శాస్త్రముచే విధించిన వ్యాపారమని యర్థము. మోక్షధర్మమని యర్థము కాదు. గుణకర్మవిభాగముచే చాతుర్వర్ణ్యవ్యవస్థ యెల్లవారికిని కల్యాణము కలుగుటకొఱకే (గీ. ౧౮. ౪౧) శాస్త్రకారులచే ప్రవర్తింపచేయఁబడినది. బ్రాహ్మణ క్షత్రియాదులు జ్ఞాను లయినను వారు తమతమకర్మలను చేయుటవలననే వారికిని సమాజమునకును కల్యాణము కలదు. కావున నెప్పుడును శాస్త్రవిధి నతిక్రమించుట యుక్తము కాదని భగవంతుఁడు సెప్పుచున్నాఁడు (గీతా. ర. పు. ౪౬౧ మఱియు ౬౭౧ చూడుు). "జేనుం కామ తేనా థీ థాయ, బిజో కరేతో గోథా ఖాయ" అని గుజరాతిభాషయందలి లోకోక్తికిని నిదియె భావార్థము. చాతుర్వర్ణ్యవ్యవస్థ ప్రచారములో లేనిదేశమున సైతము జన్మము నంతయు పటాలములో వెళ్లఁబుచ్చిన మనుజుఁడు యుద్ధసమయము వచ్చినప్పుడు కుట్టుపనిచేయుట కంటె సేనలో భటుఁడుగానుండుట యనుపనిచేయుటయే శ్రేయస్కరమగునని యెల్లరు నొప్పుకొందురు. కావున చాతుర్వర్ణ్యవ్యవస్థయు నట్టిదియే. చాతుర్వర్ణ్యవ్యవస్థ మంచిదగునా? చెడుదగునా? యను విషయము

అర్జున ఉవాచ.

§§ అథ కేన ప్రయుక్తో ఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ బలా దివ నియోజితః. ౩౬

శ్రీభగవానువాచ.

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. ౩౭

[వేఱైనది. కావున దాని నిచ్చో చర్చించుట యనవసరము. సమాజము యొక్క యోగ్యములగు ధారణపోషణలు జరగుటకు కృషివంటి నిరుపద్రవమును సౌమ్యము నగుకర్మవలెనే, ఇతరకర్మలు నావశ్యకములనువిషయము నిర్వివాదమైనదే. కాన చాతుర్వర్ణ్యవ్యవస్థానుసారముగఁగాని బుద్ధిపూర్వకముగఁగాని యేకర్మనైనను నొకపర్యాయ మవలంబించినచో నది ధర్మమగును; కాని తనయిష్టమువచ్చినప్పుడు దానియందు తప్పుల వెదకి తన కర్తవ్యకర్మను వదలిపెట్టుట ధర్మముకాదు. అవశ్యకమగునేని యా వ్యాపారమునందే చావవలయును, అని యీశ్లోకముయొక్క భావార్థము. ఏవ్యాపారము నారంభించినను దానియం దేదో సహజముగ నొకదోష ముండకమానదు (గీ. ౧౮. ౪౮ చూడు). కాన నంతమాత్రముచే నాని యతమగు కర్తవ్యమును వదలిపెట్టుట ధర్మము కాదు. మహాభారతమునం దున్న బ్రాహ్మణవ్యాధసంవాదమునందును, తులాధార జాజలి సంవాదము నందును నీవిషయమే చెప్పఁబడియున్నది. ౩౫-వ శ్లోకముయొక్క పూర్వార్థము మనుస్మృతియందును (మను. ౧౦. ౯౭). గీతలయందును (గీ. ౧౮. ౪౭) చెప్పఁబడియున్నది. "ఇంద్రియములను బలాత్కారముగ నణఁచివేయుట యనునది శక్యముకా"దని ౩౩-వ శ్లోకమునందు చెప్పినపిదప, అట్లేల శక్యముకాదనియు, మనుజునకు నిష్టము లేకపోయినను చెడుపనులచేనేల యాకర్షింపఁబడుచున్నాఁడనియు నర్జునుఁ డడుగుచున్నాఁడు—]

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు:—(౩౬) ఓవార్ష్ణేయా! (ఓకృష్ణా!) ఇప్పుడు (ఈవిషయమును చెప్పుము) తన కిష్టము లేకపోయినను బలాత్కారము చేసినటుల మనుజుఁడు పాపము నెవరిప్రేరణచేఁ జేయును? భగవంతుఁడు చెప్పుచున్నాఁడు—(౩౭) ఈవిషయమునందు రజోగుణమువలనఁ బుట్టినదియు, మిక్కిలి యాహారపుష్టి

ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేనచ,
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్. ౩౮
ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేన చ. ౩౯
ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. ౪౦
తస్మా త్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్. ౪౧
§§ ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః. ౪౨

గలదియు, మిక్కిలి పాపియు, క్రోధముగ పరిణమించునదియు నగు నీకామమే శత్రువని యెఱుంగుము. (౩౮) పొగచే నగ్నియు, దుమ్ముచే నద్దమును గప్పఁబడి నట్లును, మావిచే గర్భ మావరింపఁబడినట్లును దీనిచే నీసమస్తము నావరింపఁబడి నది. (౩౯) ఓకౌంతేయా! తృప్తినొందనిదియు, జ్ఞానికి నిత్యవైరియు, కామరూపియు నైనయీయగ్నిచేత జ్ఞాన మెల్లప్పుడు నాచ్ఛాదింపఁబడియుండును.

["న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి, హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏ వాభివర్ధతే" (మను. ౨. ౯౪)—కామము కామముల యుపభోగముచే నెప్పుడును తృప్తినొందదు; కట్టెలువేసినకొలఁది నిప్పు యెక్కువయిన ట్లది యధికాధికముగ వృద్ధినొందుచునే యుండును—అని మనువు చెప్పినశ్లోకమున కిదియనువాదమే యయి యున్నది. (గీతా. ర. ప్ర. ౫. పు. ౧౪౩. చూడు.]

(౪౦) ఇంద్రియములును, మనస్సును, బుద్ధియు ననునవి దీనికి నధిష్ఠానము లని, అనఁగా: వాసస్థానములని, చెప్పఁబడినవి. ఇవి వీని యాశ్రయముచే జ్ఞానము నావరించుకొని మనుజున కీమోహమును గలుగఁజేయుచున్నవి. (౪౧) కాన నోభరత శ్రేష్ఠా! ఇంద్రియములను మొదట నిగ్రహించుకొని, జ్ఞానమును (అధ్యాత్మమును), విజ్ఞానమును (విశిష్టమగుజ్ఞానమును) నశింపఁజేయు నీపాపులన్నే నీవు సమూలముగ నశింపఁజేయుము.

(౪౨) ఇప్పు డేమన్ని చెప్పుచున్నాఁ డనఁగా: (స్థూలమగు బాహ్యపదార్థము

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్. ౪౩

లనుబట్టి యాపదార్థములను తెలిసికొనెడి) ఇంద్రియములు పరములు, అనఁగా: శ్రేష్ఠములు; ఇంద్రియములకంటె శ్రేష్ఠమయినది మనస్సు; మనస్సుకంటెను శ్రేష్ఠమైనది(వ్యవసాయాత్మకమగు)బుద్ధి; బుద్ధికంటెను శ్రేష్ఠమైనది యది (ఆత్మ).(౪౩) ఓమహాబాహుఁడవగు నర్జునా! ఇట్లు బుద్ధికంటె పరమందున్న యాత్మను తెలిసికొని నీయంతట నీవే ధైర్యము తెచ్చుకొని సులభముగ పట్టుఁబడని కామమను శత్రువును సంహరింపుము.

[కామరూపమగు నాసక్తిని విడనాడి లోకసంగ్రహార్థమై కర్మలనన్నింటిని స్వధర్మానుసారముగఁ జేయుచు నింద్రియములను స్వాధీనములుగ నుంచుకొనవలయును. ఆసక్తిని విడనాడునట్టి యింద్రియనిగ్రహముమాత్రమె యిచ్చట వివక్షితమై యున్నది.ఇంద్రియములనే బలాత్కారముగఁ జంపి సర్వకర్మలను వదలుమని యర్థముకాదు. (గీతా. ర. ప్ర. ౫. పు ౧౫౪ చూడు)''ఇంద్రియాణి పరాణ్యాహుః...''అను ౪౨-వ శ్లోకము కఠోపనిషత్తునందు కలదు. ఇదియేకాక యాయుపనిషత్తులోనుండి, మఱికొన్ని (మూఁడునాలుగుశ్లోకములు) శ్లోకములు గీతలలోనికి గ్రహింపఁబడినవని గీతారహస్యమునందు (పరి. పు. ౭౨౧) నిరూపింపఁబడినది. ఇంద్రియములు సేయుపని బాహ్యపదార్థములసంస్కారములను గ్రహించుటయే గాన,మనస్సుచే వానివ్యవస్థ చేయఁబడినపిదప బుద్ధి వానియందలి సారాసారవివేచనను జేయును. మఱియు నాత్మ వీనికంటె పరముగ నున్నదని చెప్పఁబడుటచే వీనియన్నిటికంటె యాత్మవేఱైనదని క్షేత్రక్షేత్రజ్ఞవిచారముయొక్క తాత్పర్యము. ఈవిషయమై సవిస్తరమగు విచారము గీతారహస్యమునందలి యాఱవప్రకరణమున చివర (పు. ౧౭౮-౧౯౩) చేయఁబడినది; మనుజున కిష్టములేకపోయినను కామక్రోధాదుల ప్రవృత్తిధర్మమునుబట్టి యతఁడేపనియైనను చేయుట కెటుల ప్రవృత్తుఁడగు ననునదియు, ఆత్మస్వాతంత్ర్యముచే నింద్రియనిగ్రహరూపమగు సాధనమువలన నైతె మెట్లు విముక్తిమార్గము లభించుననునదియు మొదలుగాఁగల కర్మవిపాకమునందలి గూఢములగు విషయములు గీతారహస్యమునందలి ౧౦-వ ప్రకరణమునందు (పు. ౨౭౦—౨౯౩) విచా

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ
తృతీయోఽధ్యాయః. 3.

---

రింపఁబడినవి. కాన వాని నిచ్చో మరల చెప్పి గ్రంథమును విస్తరింప నేల? ఇంద్రియనిగ్రహ మెట్లు చేయవలసినది యను గీతలయాఱవ యధ్యాయమునందు విచారింపఁబడును.]

ఈరీతిగ భగవంతునిచే గానముచేయఁబడిన (చెప్పఁబడిన) ఉపనిషత్తులందు బ్రహ్మవిద్యాంతర్గతమగు యోగ—అనఁగా: కర్మయోగ—శాస్త్రమందలి శ్రీకృష్ణార్జునుల సంవాదమునందున్న కర్మయోగ మనుపేరు గల మూఁడవయధ్యాయము సమాప్తమయినది.



# చతుర్థోఽధ్యాయః.

---

శ్రీ భగవానువాచ.

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్. ౧
ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప. ౨
స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్. ౩

[కర్మ యెవరికిని తప్పదు. కాన బుద్ధి నిష్కామముగనున్నను కర్మ చేయవలయును. కర్మ లన యజ్ఞయాగాదికర్మలు; కాని మీమాంసకులయీకర్మలు స్వర్గప్రదములు కావుననే యొకవిధమున బంధకములగుటచే వాని నాసక్తి వీడి చేయవలయును. జ్ఞానముచే స్వార్థబుద్ధి విడిచిపోయినను కర్మలు వదలవు. కాన జ్ఞానియు నిష్కామకర్మలను తప్పక చేయవలయును. లోకసంగ్రహార్థమే యవి యావశ్యకములై యున్నవి;—అని యిట్లు కర్మయోగము నింతవఱకు వివేచించి యదియే యీ యధ్యాయమున దృఢము చేయఁబడినది. జీవితకాలమును గడపుకొను నీమార్గము, అనఁగా:నిష్ఠ అర్జునునియుద్ధమునందు ప్రవర్తింపఁజేయుటకొఱకు క్రొత్తగఁ జెప్పఁబడినదేమో యనుసంశయము లేకపోవునిమిత్తమై యీమార్గముయొక్క ప్రాచీన గురుపరంపరను మొదట చెప్పుచున్నాఁడు—].

శ్రీభగవంతుఁడు సెప్పుచున్నాఁడు.—(౧) అవ్యయమును, అనఁగా: ఎప్పుడునునశింపనదియు, లేక, త్రికాలాబాధితమయినదియు, నిత్యమునైన యీ (కర్మ) యోగమును నేను వివస్వంతునకు, అనఁగా: సూర్యునకు చెప్పితిని. వివస్వంతుఁడు (తనపుత్త్రుఁడగు) మనువునకు చెప్పెను. మనువు (తనపుత్త్రుఁడగు) నిక్ష్వాకువునకు చెప్పెను. (౨) ఈపరంపరగా ప్రాప్తమయిన దీనిని (యోగమును) రాజర్షులు దెలిసికొనిరి. శత్రుతాపనా! (అర్జునా!) క్రిందట నీయోగము లోకమునందు నశించెను. (3) ఆ, (సర్వరహస్యములలో) నుత్తమముగాన (కర్మయోగ

మార్గమే) నీవు నాకు భక్తుఁడవును, స్నేహితుఁడవును కాన నీకుపదేశించితిని.

[ఈమూఁడుశ్లోకములందును యోగ మనుపదముచే సాంఖ్యము, యోగము నను జీవితకాలమును గడపుటకై చెప్పఁబడిన రెండుమార్గములలో యోగ మన: కర్మయోగము (సామ్యబుద్ధితో కర్మలఁ జేయుమార్గము)అను నర్థమే యుద్దేశింపఁబడినదని గీతారహస్యమునందలి ఏకాదశప్రకరణము నందు (పు. ౭౬-౯౩) నేను నిరూపించితిని. గీతలయందు వెనుకఁ జెప్పఁబడినయీమార్గముయొక్క పరంపర యీమార్గముయొక్క మూలమును తెలిసికొనుటకు మిక్కిలి యుపయోగకారి యయినను టీకాకారులు దాని విషయమై విశేషించి చర్చించినటుల కాన్పింపదు. మహాభారతాంతర్గతమైన నారాయణీయోపాఖ్యానమందు నిరూపింపఁబడినభాగవతధర్మములలో నీధర్మము మొదట శ్వేతద్వీపమునందు భగవంతుఁడు నారదున కుపదేశించినట్లు చెప్పఁబడినది—

నారదేన తు సంప్రాప్తః సరహస్యః ససంగ్రహః,
ఏష ధర్మో జగన్నాథాత్ సాక్షాన్నారాయణాన్నృప.
ఏవమేష మహాన్ ధర్మః స తే పూర్వం నృపోత్తమ,
కథితో హరిగీతాసు సమాసవిధికల్పితః.

“భగవంతుఁడు నారదున కుపదేశించెను. ఓరాజా! ఆమహాధర్మమే నీకు పూర్వము హరిగీతలయందు, అనఁగా: భగవద్గీతలయందు సమాసవిధి సహితముగఁ జెప్పఁబడినది.” అని వైశంపాయనుఁడు జనమేజయునకుఁ జెప్పెనని మహాభారతమున నున్నది (మ. భా. శాం. ౩౪౬. ౯,౧౦). పిదప “యుద్ధమునందు విమనస్కుఁడగు నర్జునునకు నీధర్మము చెప్పఁబడిన” దనియు మరల చెప్పఁబడినది (మహా. భా. శాం. ౩౪౮. ౮). దీనిని బట్టి గీతలయందున్న యోగము, అనఁగా: కర్మయోగము భాగవతధర్మములయందున్నదని స్పష్టమగుచున్నది (గీతా. ర. పు. ౭౨-౧౭౫). గ్రంథవిస్తరభయముచే గీతలయందు దానిసంప్రదాయపరంపర సృష్ట్యాదినుండియు చెప్పఁబడలేదు; వివస్వంతుఁడు, మనువు, ఇక్ష్వాకువు ననుమువ్వురి పేళ్లుమాత్ర మెత్తుకోఁబడినవి. దీనికి నిజమగునర్థము నారాయణీయధర్మములయొక్క పరంపరఁ గలిపి చూచినచో స్పష్టమగును. అందు బ్రహ్మ

దేవుఁ డిప్పటి కేడుజన్మము లెత్తెననియు, వానిలో మొదటి యాఱుజన్మములయందును జరిగిన నారాయణీయధర్మములయందు చెప్పఁబడిన గురుపరంపర సంపూర్ణముగ చెప్పఁబడినపిదప బ్రహ్మదేవునియేడవజన్మమందలి, అనఁగా: ప్రస్తుతజన్మమందలి కృతయుగము సమాప్తమయిన పిదప—

త్రేతాయుగాదౌ చ తతో వివస్వాన్ మనవే దదౌ,
మనశ్చ లోకభృత్యర్థం సుతా యేక్ష్వాకవే దదౌ.
ఇక్ష్వాకుణా చ కథితో వ్యాప్య లోకా నవస్థితః,
గమిష్యతి క్షయాంతే చ పున ర్నారాయణం నృప.
యతీనాం చాపి యో ధర్మః స తే పూర్వం నృపోత్తమ,
కథితో హరిగీతాసు సమాసవిధికల్పితః.

"త్రేతాయుగారంభమున వివస్వంతుఁడు మనువునకు (ఈధర్మమును) చెప్పెను. మనువు లోకధారణార్థమై తనపుత్త్రుఁడగు నిక్ష్వాకువున కుపదేశించెను; ఇక్ష్వాకువువలన పిదప సకలలోకములయందు వ్యాపించినది. ఓరాజా! ప్రళయమగునప్పుడు (ఈధర్మము) మరల నారాయణునియొద్దకే చేరును. ఈ ధర్మమును 'యతీనాం చాపి' అనఁగా సన్న్యాసధర్మమును, నీకు పూర్వమునందు భగవద్గీతలలో చెప్పఁబడినది." అనియు వైశంపాయనుఁడు జనమేజయునకు మరలఁ జెప్పెను (మ. భా. శాం. ౩౪౮.౫౧-౫౩). దీనిని బట్టి ద్వాపరయుగముచివర జరిగినభారతయుద్ధమునకు వెనుకనున్న త్రేతాయుగముయొక్క చివరనే భాగవతధర్మములపరంపర గీతలయందు వర్ణింపఁబడినదనియు, గ్రంథవిస్తరభయముచే విశేషముగఁ జెప్పఁబడలేదనియు కాన్పించుచున్నది. ఈభాగవతధర్మమనఁగ: యోగమే, లేక, కర్మయోగమే. మఱియు మనువునకు కర్మయోగము నుపదేశించినట్లు చెప్పఁబడినకథ గీతలయందుమాత్రమే చెప్పఁబడలేదు. ఇఁక నేమన: భాగవతపురాణమందును జెప్పఁబడినది (భాగ. ౮.౨౪.౫౫). మఱియు మత్స్యపురాణమునందు ౫౨-వ యధ్యాయమున మనువున కుపదేశింపఁబడినకర్మయోగము గొప్పదని కొనియాడఁబడియున్నది; కాని వీనిలో నున్నవిషయము నారాయణీయోపాఖ్యానమునందున్నంత పూర్ణముగ లేదు. వివస్వంతుఁడు, మనువు, ఇక్ష్వాకువు ననుపరంపర సాంఖ్యమార్గమున కొంతమాత్రమును సంబంధింపదు. మఱియు సాంఖ్యము, యోగము నను నీరెండునిష్ఠలు దక్క మూఁడ

అర్జున ఉవాచ.

§§ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః,
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి. ౪

వది గీతలయందుఁ జెప్పఁబడలేదని తెలిసికొనినచో నీపరంపర కర్మయోగ సంబంధమైనదియే యని మఱియొకవిధమున సైతము సిద్ధమగును (గీ. ౨. ౩౯); కాని సాంఖ్యము, యోగము ననునీరెండునిష్ఠలపరంపరయు నొకటి కాకపోయినను, కర్మయోగముయొక్క, అనఁగా: భాగవతధర్మముల యొక్క నిరూపణయందె సాంఖ్యనిష్ఠయొక్క, లేక, సన్న్యాసనిష్ఠయొక్క నిరూపణము మఱియొకవిధమునఁ జేరును గాన (గీతా. ర. ప్ర. ౧౧. పృ. ౬౪౪ చూడు) భగవద్గీతయందు యతిధర్మములును, అనఁగా: సన్న్యాసధర్మములును చెప్పఁబడినవని వైశంపాయనులు చెప్పిరి. మను స్మృతియందు నాలుగాశ్రమముల ధర్మములను చెప్పి తుద కాఱవయధ్యాయమందు మొదట యతులయొక్క, అనఁగా: సన్న్యాసాశ్రమముయొక్క ధర్మములను చెప్పి పిదప వానికి వికల్పమను సంబంధముతో "వేద సన్న్యాసికులయొక్క కర్మయోగము" అను పేరున గీతలయందును, భాగవతధర్మములయందును చెప్పఁబడినకర్మయోగమునే చెప్పి "నిస్పృహాతో స్వకర్మలను చేయుచుండుటచేతనే తుద కుత్కృష్టమగు సిద్ధి కలుగు"నని స్పష్టముగఁ జెప్పఁబడినది (మను. ౬. ౯౬.). దానింబట్టి మనువునకు సైతము కర్మయోగము సమ్మతమే యని స్పష్టముగ కన్పట్టుచున్నది. ఇట్లే యితరులగు స్మృతికారులకును నిది సమ్మతమే యని నిరూపించుటకై గీతారహస్యము నందలి౧౧-వ ప్రకరణమున చివర(పృ.౫౦౦-౫౦౬)ప్రమాణములు సెప్పఁబడినవి. అర్జునున కీ పరంపరవిషయమై కలిగినసందేహ మేమన:—

అర్జునుఁ డడుగుచున్నాఁడు— (౪) వివస్వంతుఁడు పూర్వకాలమునఁ బుట్టెను. నీ వీకాలమునఁ బుట్టితివిగదా? "ఈయోగమును నేను వివస్వంతునకు చెప్పితి" నను నీమాటను నేనెట్లు నమ్ముదును?

[అని యర్జునుఁడడుగ సమాధానముఁ జెప్పుటకై భగవంతుఁడు తనయవ తారకృత్యములఁ జెప్పి "నేను నీరీతిగ కర్మలను జేయుచునే యున్నాను" అని యాసక్తివిరహితకర్మయోగమునే, లేక, భాగవతధర్మములనె యిప్పుడు మరల సమర్థించుచున్నాఁడు—]

శ్రీభగవానువాచ.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున,
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప. ౫
అజోఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా. ౬

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు—(౫) ఓయర్జునా! నీవు నేనును ననేక జన్మము లెత్తితిమి. వాని నన్నింటిని నేనెఱుంగుదును. ఓపరంతపా! నీవెఱుంగవు. (ఇదియే మన కిద్దఱకును గలభేదము). (౬) నేను (సర్వ) భూతములకును నధిపతిని; జన్మవిరహితుఁడను; కాన నాయొక్క యాత్మస్వరూప మెప్పుడును వికారమును బొందకపోయినను, నాయొక్క ప్రకృతినే యధిష్ఠించి నే నామాయచే జన్మించుచున్నాఁడను.

[ఈశ్లోకములందున్న యధ్యాత్మజ్ఞానమునందు కాపిలసాంఖ్యము, వేదాంతము ననునీరెండుమతములయొక్క సంబంధమే చెప్పఁబడినది. ప్రకృతిస్వయముగ నే సృష్టిని నిర్మించుచున్నదని సాంఖ్యులమతము; కాని వేదాంతుల ప్రకృతి యనునది పరమేశ్వరునియొక్కయొక విధమగు స్వరూప మని యందురు. కాన ప్రకృతిని పరమేశ్వరుఁ డధిష్ఠించియున్నాఁడనఁగా, ప్రకృతినుండి వ్యక్తసృష్టి నిర్మింపఁబడినదని యర్థమని చెప్పుదురు. తనయవ్యక్తస్వరూపమునుండి జగత్తునంతను నిర్మించునట్టి పరమేశ్వరునియొక్క యచింత్యశక్తికే 'మాయ' యని పేరని గీతయందు చెప్పఁబడినది. ఇటులే శ్వేతాశ్వతరోపనిషత్తునందును "మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరం" అనఁగా: "ప్రకృతియనునదియే మాయ. పరమేశ్వరుఁ డనువాఁ డామాయకు నధిపతి" (శ్వే. ౪. ౧౦), మఱియు "అస్మా న్మాయీ సృజతే విశ్వ మేతత్"—దీనినుండి మాయయొక్క యధిపతి సృష్టిని జేయుచున్నాఁడు (శ్వే. ౪. ౯), అని చెప్పఁబడినది. ప్రకృతిని మాయ యని యేల యందురు? ఈమాయయొక్క స్వరూప మేమి? మాయచే సృష్టి యుత్పన్నమగుటకు నర్థమేమి? అనునది మొదలగు ప్రశ్నలు మిక్కిలి సుస్పష్టముగ గీతారహస్యమునందలి ౯-వ ప్రకరణమునందు చర్చింపఁబడినవి. అవ్యక్తుఁడగు పరమేశ్వరుఁడు వ్యక్తుఁ డెటులగుచున్నాఁడో, అనఁగా: కర్మ లెట్లుత్పన్నములైనట్లు కాన్పించుచున్నవో,

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్. ౭
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. ౮
జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పున ర్జన్మ నైతి మా మేతి సో ఽర్జున. ౯

చెప్పి, యీపరమేశ్వరుఁడేల యెప్పు డెట్లు చేయుచున్నాఁడో దానిని స్పష్టము చేయుచున్నాఁడు—].

(౭) ఓభారతా! ఎప్పు డెప్పుడు ధర్మము సెడి యధర్మము ప్రబలమగుచున్నదో యప్పు డప్పుడు నేను స్వయముగ జన్మము (అవతారమును) నెత్తుచున్నాను. (౮) సాధువుల సంరక్షణకొఱకును దుష్టుల నశింపచేయుటకొఱకును, ప్రతియుగమునందును, ధర్మసంస్థాపనముఁ జేయుటకును జన్మించుచున్నాను.

[ఈరెండుశ్లోకములయందును 'ధర్మ'శబ్దమున కొకపారలౌకికమగు వైదిక ధర్మ మనియే యర్థము కాదు. చాతుర్వర్ణ్యముల ధర్మములు, న్యాయము, నీతి, మొదలగువిషయములును దానియందు ముఖ్యముగఁ జేరును. జగత్తునందన్యాయము, అనీతి, దుష్టత్వము, విచ్చలవిడి యనునవి వ్యాపించి సాధువులకు వంచనయు దుష్టులకు గొప్పతనమును బయల్వెడలునేని తాను నిర్మించిన జగత్తుయొక్క కట్టుబాటును స్థిరముగ నిల్పవలయుననియు, ఆజగత్తునకు కల్యాణము కావలయు ననియు, తేజశ్శాలియు, పరాక్రమశాలియు నగుపురుషుఁడుగ (గీ. ౧౦. ౪౧) నవతారము నెత్తి భగవంతుఁడు సమాజముయొక్క చెడిపోయినవేరును తిరిగి బాగుగ నాటుచున్నాఁడని యీశ్లోకముయొక్క తాత్పర్యము. ఈరీతిగ నవతారము నెత్తి భగవంతుఁడు సేయుచున్నపనికే 'లోకసంగ్రహ'మని మఱియొకపేరు. ఈపని నాత్మజ్ఞాను లగువారు సైతము, యథాశక్తిగను, యథాధికారముగను చేయవలయు నని వెనుకటి యధ్యాయమునందు చెప్పఁబడినది (గీ. 3. ౨౦). పరమేశ్వరుఁ డెప్పుడవతారము నెందుల కెత్తునో చెప్పఁబడినది. ఇప్పు డీతత్త్వము నెఱింగి యారీతిగ మెలఁగుచున్నవారికిఁ గల్గుగతిని చెప్పుచున్నాఁడు:—]

(౯) ఓయర్జునా! నాయొక్క యిట్టిదివ్యము లగుజన్మకర్మలయందున్న తత్త్వమును తెలిసికొనువాఁడు దేహత్యాగానంతరమునందు తిరిగి జన్మము నెత్తక

వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః. ౧౦
§§ యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౧౧

నాలో నైక్యము నొందును. (౧౦) రాగమును, భయమును, క్రోధమును, పోఁగొట్టుకొని మత్పరాయణులయి నన్నాశ్రయించిన యనేకు లట్లు జ్ఞానరూప మగు తపస్సుచే శుద్ధులై నాలో నైక్యము నొందిరి.

[భగవంతునియొక్క దివ్యమగుజన్మమును తెలిసికొనుటకు, నవ్యక్తుఁడగు పరమేశ్వరుఁడు మాయచే సగుణుఁ డెట్లగుచున్నాఁడో తెలిసికొనవలయును. ఇది తెలిసెనేని యధ్యాత్మజ్ఞానము గల్గును. దివ్య మగుకర్మ తెలిసెనేని కర్మను చేసియు నలిప్తుఁడుగ నుండును, అనఁగా: నిష్కామకర్మయొక్క తత్త్వజ్ఞానము నొందును. కావున పరమేశ్వరునియొక్క దివ్యమగు జన్మయును దివ్యమగుకర్మయును పూర్ణముగఁ దెలియఁబడునేని యధ్యాత్మజ్ఞానము, కర్మయోగము ననునీరెండింటియొక్క పూర్ణజ్ఞానము నైతము గల్గును. మోక్షప్రాప్తికి నావశ్యకములు గాన వానిని సంపాదించినవానికి మోక్షము కలుగక తప్పదు. అనఁగా: భగవంతునియొక్క దివ్యమగుజన్మయును, దివ్యమగుకర్మయును తెలియఁబడునేని దానిచే నంతయు తెలియఁబడినదే యగును. అధ్యాత్మజ్ఞానము, నిష్కామకర్మయోగము ననునీరెంటిని వేఱుగ నభ్యసింప నక్కఱలేదు. కాన భగవంతునియొక్కజన్మను, కృత్యమును విచారించుము. దానియం దున్నతత్త్వము నెఱింగి యాచరించితి వేని భగవత్ప్రాప్తి కలుగుటకు మఱియొకసాధన మేమియు నక్కఱలే దని తాత్పర్యము. భగవంతునియొక్క సత్య మగునుపాసన యిదియే. మఱియు దీనికంటె తక్కువ దగునుపాసనయొక్క ఫలమును నుపయోగమును చెప్పుచున్నాఁడు:—]

(౧౧) ఎవరు నన్నెట్లు నేప్రకారముగ భజించుచున్నారో వారికి నేను తదనుసారముగనే ఫలము నిచ్చుచున్నాను. ఓపార్థా! ఎటులైనను మనుష్యులు నాయొక్క మార్గమునే యవలంబించి నన్నుఁ జేరుదురు.

[మమ వర్త్మానువర్తంతే..." మొదలగు నీయుత్తరార్ధము పూర్వమునందు (౩. ౨౩) కొంచెము భిన్న మగునభిప్రాయముతో చెప్పఁబడినది,

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా. ౧౨
§§ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. ౧౩

దానివలన గీతలయొక్క పూర్వాపరసందర్భానుసారముగ నర్థ మెట్లు మారుచున్నదియు తెలిసికొనవచ్చును. అది యట్లుండనిమ్ము; ఏమార్గమునఁ బోయినను పరమేశ్వరుని చేరుటయే నిజమైనచో ననేకు లనేకమార్గముల నేల పోవుచున్నారో చెప్పుచున్నాఁడు—]

(౧౨) (కర్మబంధముయొక్క నాశమును కోరువారికే గాక, కేవల) కర్మఫలమునుగోరు లోకమునకును (పై) కర్మఫల మీ మనుష్యలోకమునందు శీఘ్రముగనే ప్రాప్త మగును. కాన నిహలోకమున దేవతలను పూజించుచున్నారు.

[ఈవిచారము ముందేడవయధ్యాయమున మరలఁ జేయఁబడును (గీ.౭. ౨౧, ౨౨ చూడుము). పరమేశ్వరారాధనకు సత్యమగుఫలము మోక్షము కావున నది కాలము గడచినకొలఁదిని, దీర్ఘము, నేకాంతము నగునుపాసనచేత కర్మబంధము పూర్ణముగ నశించినప్పుడే ప్రాప్తమగును; కాని యింత దూరాలోచన చేయువారును, దీర్ఘోద్యోగులైనవారును మిక్కిలియరుదుగ నుందురు. అనేకులకు తమ యుద్యోగముయొక్క ఫలము, అనఁగా: కర్మల ఫలము ఈ లోకమునందే యెప్పుడో యొకప్పుడు కావలసియుండును. కావున నిట్టివారు దేవతలను వెంబడించెద రని, అనఁగా: దేవతల నుపాసించెద రని, యీశ్లోకమునకు భావార్థము (గీతార. ప్ర. ౧౩. పు. ౫౪౦). కాని, యిదియైనను మఱియొకవిధముగ పరమేశ్వరుని యొక్క పూజయే. ఈయోగము క్రమముగ వృద్ధినొందుటచే పర్యవసానమందు నిష్కామభక్తిగల్గి తుదకు మోక్షము గల్గు నని సైతము గీతయందు చెప్పఁబడినది (గీ.౭.౧౯). ధర్మసంస్థాపనము చేయుటకు పరమేశ్వరుఁ డవతరించుచున్నాఁ డని పూర్వమందు చెప్పఁబడినది. ధర్మసంస్థాపనము చేయుటకు నేమి చేయవలయునో యిప్పుడు సంక్షేపముగఁ జెప్పుచున్నాఁడు—]

(౧౩) బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు, శూద్రుఁడు నను నాల్గు వర్ణములవ్యవస్థను గుణములయొక్కయు, కర్మలయొక్కయు భేదములఁబట్టి నేనే సృజించితిని. నేను దానికి కర్తను నగుదును, అకర్తను, అనఁగా: దానిని చేయని యవ్యయుఁడను నగుదు నని తెలిసికొనుము.

న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బద్ధ్యతే. ౧౪
ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. ౧౫

[పరమేశ్వరుఁడు కర్తయయినను, అనంతరశ్లోకమునందుఁ జెప్పఁబడిన ట్లెప్పుడును నిస్సంగుఁడే యగుటచే నకర్తయు నగు నని యర్థము (గీ. ౫.౧౪ చూడు). "సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితం" అని మఱియొక పరమేశ్వరస్వరూపముసైతము (గీ. ౧౩. ౧౪) విరోధాభాసాత్మకముగ ముందు చెప్పఁబడినది. చాతుర్వర్ణ్యముయొక్కయు, గుణభేదముయొక్కయు నిరూపణము ముందు ౧౮-వ యధ్యాయమునందుఁ జెప్పఁబడినది (౧౮. ౪౧-౪౯). ఇప్పుడు "చేసియును చేయనివాఁడనే" యని భగవంతుఁడు తాను చెప్పినదానియందున్న మర్మమును జెప్పుచున్నాఁడు—]

(౧౪) నన్ను కర్మలు బాధింపవు. కారణ మేమి యన: నాకు కర్మఫలమునం దిచ్ఛ లేదు. నన్నిట్టివానినిగఁ దెలిసికొనినవానినిసైతము కర్మలు బాధింపనేరవు.

[నాయొక్క జన్మను, కర్మను తెలిసికొనినవాఁడు ముక్తుఁ డగునని పైన తొమ్మిదవశ్లోకమునందుఁ జెప్పఁబడినకర్మయొక్క తత్త్వమే యీశ్లోకమునందు స్పష్టము చేయఁబడినది. 'తెలిసికొనువాఁడు' అనుశబ్దముచే "తెలిసికొని తదనుసారముగ నాచరించువాఁ" డనునర్థ మిచ్చో వివక్షితము. ఆ కర్మలబాధ భగవంతునకు లేకపోవుటకు ఫలాశతో కర్మలు చేయకపోవుటయే కారణము; దీనిని తెలిసికొని తదనుసారముగ నాచరించువారికి కర్మలయొక్క బంధ ముండనేర దని మొత్తముమీఁద భావార్థము. ఈశ్లోకమునందున్న సిద్ధాంతమునే ప్రత్యక్ష మగునుదాహరణముచే నిప్పుడు దృఢపఱచుచున్నాఁడు—]

(౧౫) దీనిని తెలిసికొని పూర్వపు ముముక్షువులుసైతము కర్మను జేసిరి. కావున పూర్వకాలమందలి పూర్వులును, వారిపూర్వులును చేసినకర్మలనే నీవును చేయుము.

[మోక్షమునకును, కర్మకును నీరీతిగ విరోధము లేనందున నీవు కర్మలను చేయు మని యర్జునునకు నిశ్చయముగ నుపదేశించెను; కాని కర్మలు

కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. ౧౬
కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. ౧౭

వదలిపెట్టుటచే (అనఁగా: అకర్మచేతనే) మోక్షము గల్గునని సన్న్యాసమార్గీయులు సెప్పుటకు కారణ మేమి యని సందేహము గల్గును. కాన, కర్మయేదియో, యకర్మయేదియో వివేచించుట నిప్పు డారంభించి యకర్మ యన కర్మత్యాగము కాదనియు, నిష్కామకర్మనే యకర్మ యని యన వలయు ననియు తుద కీపదియూఁడవశ్లోకమునందు సిద్ధాంతము చేయుచున్నాఁడు—]

(౧౬) కర్మయేదియో, యకర్మయేదియో తెలిసికొనువిషయమున బుద్ధిమంతులు సైతము భ్రమఁ జెందుదురు; కాని దేనిని తెలిసికొనుటచే పాపమునుండి ముక్తుఁడ వగుదువో యాకర్మను నీకు చెప్పుచున్నాను.

['అకర్మ' యనుపదము నఞ్ సమాసము. దానియం దున్న అ=నఞ్ అనుదానికి వ్యాకరణమునుబట్టి, 'అభావము', లేక, 'అప్రాశస్త్యము' అను రెండర్థములు చెప్పవచ్చును. ఈయర్థములు రెండును నిచ్చో వివక్షితములు కావని చెప్పుట సాధ్యము కాదు. అయినను తర్వాతిశ్లోకమునందు 'వికర్మ'యని కర్మయొక్క మూఁడవభేద మొకటి చెప్పఁబడియుండుటచేత, ఈశ్లోకమునందలి యకర్మశబ్దమునకు సన్న్యాసమార్గీయులు 'కర్మలయొక్క స్వరూపత్యాగ' మని చెప్పునట్టి కర్మత్యాగమె యిక్కడ ముఖ్యముగ నుద్దేశింపఁబడినది. వేయేల? సన్న్యాసమార్గీయులు చెప్పునటుల కర్మలను బొత్తిగ త్యజింప నక్కఱ లేదు. ఇట్టికర్మత్యాగము నిజ మగు 'అకర్మ' కానేరదు. దానికి కారణము వేఱుగనే యున్నదని నిరూపించుటకై యీకర్మాకర్మవివేచన చేయఁబడినదని పదునెనిమిదవశ్లోకముపై నున్నటిప్పణిని బట్టి కాన్పించును.]

(౧౭) కర్మయొక్క గతి గహనమైనది; (కాన) ముందుగ కర్మ యనఁగ నేమియో, వికర్మ (విపరీతమైనకర్మ) యన నేమియో, అకర్మ (కర్మలను చేయకపోవుట)

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. ౧౮

యన నేమియో తెలిసికొనవలయును. (౧౮) కర్మ యకర్మయనియు, అకర్మ కర్మ యనియు నెవనికిఁ దోఁచునో యాపురుషుఁడు మనుష్యులందఱిలోను జ్ఞానియు, యుక్తుఁడు, అనఁగా: యోగయుక్తుఁడును, సర్వకర్మలను చేయుచున్నవాఁడును నగును.

[ఈశ్లోకమునందును, దీనితర్వాతనున్న యయిదుశ్లోకములయందును, కర్మయు, అకర్మయు; వికర్మయు స్పష్టపఱుపఁబడినవి. వీనిని గుఱించి చెప్పఁదగినవానిలో మిగిలినవిషయములు ముందు పదునెనిమిదవయధ్యాయమున, కర్మత్యాగము, కర్మ, కర్త యను త్రివిధ మగు భేదమును జెప్పునప్పుడు పూర్తిగఁ జెప్పఁబడినవి (గీ. ౧౮. ౪–౯; ౧౮. ౨౩–౨౫; ౧౮. ౨౬–౨౮). ఈ రెండుస్థలములయందును నున్న యీకర్మవివేచననుబట్టి కర్మాకర్మవికర్మల విషయమున గీతలలోఁ జెప్పఁబడినసిద్ధాంత మిచ్చట సంక్షేపముగ స్పష్టపఱచుట యావశ్యకము. కారణ మేమన: ఈవిషయమై టీకాకారులు మిక్కిలి గందరగోళమును జేసియున్నారు. సన్న్యాసమార్గీయులకు సర్వకర్మలను స్వరూపముతో త్యజించుట యిష్టము. కాన వారు గీతలయందున్నయకర్మపదమున కెట్టెట్టులనో తమ కనుగుణ మగునర్థమును చెప్పవలయు నని ప్రయత్నించుచున్నారు. మఱియు మీమాంసకులకు యజ్ఞయాగాదికామ్యకర్మ లిష్టము లైనందున నవి దప్ప యితరము లగుకర్మ లన్నియు వికర్మ లని తోఁచును. ఇంతియకాక మీమాంసకులయొక్క నిత్యనైమిత్తికాదిభేదములును కర్మయందె యంతర్భూతము లగును. ధర్మశాస్త్రజ్ఞులు మీమాంసకుల మతముననే తమమతమును జొప్పింపఁ జూచుచుందురు. నలుప్రక్కల నుండియు నలువురును బలవంతముగఁ దమమతముల కనుగుణ మగునర్థమును జెప్పుటచే గీత నిజముగ దేని నకర్మయని చెప్పుచున్నదో, దేనిని కర్మ యనుచున్నదో తుదకు తేలుటలే దని సారాంశము. కాన గీతలయందు నిష్పక్షపాతబుద్ధితో నీకర్మాకర్మవికర్మలవిషయమును విచారించువాఁడు, కర్మలను జేయు కర్మయోగియే యనియు, కామ్యకర్మనుమాత్రమే చేయు మీమాంసకుఁడుగానీ, కర్మలను వదలు సన్న్యాసమార్గీయుఁడుకాని కాఁ డనియు మొదట గుర్తుంచుకొనవలయును. గీతయందలి యీయభిప్రాయముంబట్టి విచారించితిమేని 'కర్మశూన్యత' యను నర్థమున 'అకర్మ' శబ్ద మీజగత్తునం

పెక్కుడను నుండుటకు వీలు లేదని, అనఁగా: ఏమనుజుఁడైనను ఎప్పుడును కర్మశూన్యుఁ డగుట శక్యము కాదని మొదటనే సిద్ధమగును (గీ. ౩. ౫; ౧౮. ౧౧); కారణ మేమన: శయనించుటగాని, కూర్చుండుటగాని, వేయేల? జీవించియుండుట యయినను నెవ్వనిని వదలిపెట్టదు. కాన కర్మశూన్యత యగుటకు వీలు లేనియెడల యకర్మ యన నేమియో నిశ్చయింప వలసివచ్చును. కావున కర్మ యన, నేదియో యొకపని కాదనియు, ఆకర్మ వలనఁ గలుగఁబోవు శుభాశుభపరిణామమును బట్టి కర్మత్వమును, అకర్మత్వమును నిశ్చయింపవలయుననియు, సృష్టి యనునదియే కర్మగాన, మనుష్యుఁడు సృష్టియందున్నంతవఱకును, నతనిని కర్మ వదలిపెట్టనేరదనియు, కాన కర్మాకర్మలను విచారించువాఁడా కర్మ యెంతవఱకు బాధించు నను విషయమును సైతము విచారించి చేయవలయుననియు, ఏకర్మ చేసినను తన్ను బాధింపదో దానికి కర్మత్వము, అనఁగా: బంధకత్వము పోయిన దనియే చెప్పవలయుననియు గీత సమాధానము చెప్పుచున్నది. మఱియు నేకర్మ యొక్క కర్మత్వము, అనఁగా: బంధకత్వము ఈవిధమున నశించెనేని యా కర్మ యకర్మయే యగును. అకర్మ యనఁగా కర్మశూన్యత యని లౌకికార్థమను మాట సత్యమే; కాని శాస్త్రీయదృష్టిచే విచారించిన నది యిచ్చో పనికిరాదు. కారణ మేమన: స్వస్థముగఁ గూర్చుండుట, అనఁగా కర్మను జేయకుండుటయు ననేక సమయముల కర్మ యగుచుండునట్లు కాన్పించుచున్నది. ఉదాహరణము:— తనతల్లిదండ్రుల నెవరైనను చంపుచుండునపుడు నివారింపక స్వస్థముగఁ గూర్చుండుట తత్కాలమందు లౌకికదృష్టిచే నకర్మ యన కర్మశూన్యత్వ మయినను నది కర్మయే,— వేయేల? అది వికర్మయు— అగును గాన, కర్మవిపాకశాస్త్రమును బట్టి దానియొక్క యశుభమగు పరిణామము తనచే భోగింపఁబడక తప్పదు. కాన నీగీతాశ్లోకమునందు విరోధాభాసముచే మిక్కిలి సుందరముగఁ జెప్పిన దేమన: అకర్మ సయితము (అప్పుడప్పుడు భయంకరమైన) కర్మ యగును. మఱియు కర్మఁ జేసినను కర్మవిపాకశాస్త్రదృష్టిచే నాకర్మ చచ్చినదానివలె (అనఁగ: అకర్మ) అగును. దీనిని తెలిసికొనినవాఁడు జ్ఞాని. ఈవిషయమే ముందుశ్లోకములందు వేర్వేఱువిధములఁ జెప్పఁబడినది. కర్మఫలములయొక్క బంధనము కలుగక పోవుట కాకర్మను నిస్సంగబుద్ధితో, అనఁగా: ఫలాశను వదలి నిష్కామబుద్ధితో, చేయుట యనునదియే గీతాశాస్త్రానుసారముగ నొక

నిజ మగుముఖ్యసాధనము (గీ. ర. ప్ర. ౫. పు. ౧౪౪-౧౫౪; ప్ర ౧౦. పు. ౩౯౨ చూడు). కాన నీసాధనము నుపయోగించి (అనఁగా: నిస్సంగబుద్ధితో) చేయఁబడినకర్మయే గీతానుసారముగ ప్రశస్తము, అనఁగా: సాత్త్విక మగు కర్మయగును (గీ. ౧౮. ౯); గీతానుసారముగ నదియే సత్య మైన 'అకర్మ'. కారణ మేమన: దానియొక్క కర్మత్వము, అనఁగా: కర్మవిపాకశాస్త్రానుసారముగ బంధకత్వము నశించును. మనుష్యులు చేయునట్టి ('చేయునట్టి' యనుపదమునందు స్వస్థముగఁ గూర్చుండుటయును జేరును) కర్మనుండి పైనఁ జెప్పినవిధమున 'సాత్త్విక మగు కర్మను', లేక, గీతానుసారముగ 'అకర్మ'యగుదానిని తీసివైచినచో మిగిలినట్టి కర్మలను రెండువర్గములుగఁ జేయవచ్చును. ఒకటి రాజసము, రెండవది తామసము. వీనిలో తామసకర్మలు మోహముచేతను నజ్ఞానముచేతను జేయుట సంభవించును. కాన నాకర్మలు వికర్మ లగును. మఱియు మోహముచే కర్మలను వదలినను అది వికర్మయే యగును. అకర్మ కాదు (గీ. ౧౮. ౭). ఇఁక మిగిలినవి రాజసకర్మలు. ఈకర్మలు మొదటివర్గములోనివి కావు, అనఁగా: సాత్త్వికములు కావు, లేక, గీత వేనిని నిజమగు 'అకర్మ' యని చెప్పుచున్నదో యవి కావు. గీత వీనిని రాజసకర్మ లని చెప్పుచున్నది. కాని యిష్టమైనచో నిట్టి రాజసకర్మలను కేవల 'కర్మ'లనియు చెప్పవచ్చును. ఇది కర్మయో యకర్మయో యాకర్మయొక్క బంధకత్వమును బట్టి నిర్ణయింపవలయును గాని, క్రియాత్మక మగుస్వరూపమును బట్టి కాని, కేవల ధర్మశాస్త్రమును బట్టి కాని నిర్ణయించుటకు వీలులే దని యీ తదలి తాత్పర్యము. అష్టావక్రగీత సన్న్యాసమార్గమును బోధించునది యైనను దానియందు సైతము.—

నివృత్తి రపి మూఢస్య ప్రవృత్తి రుపజాయతే,
ప్రవృత్తి రపి ధీరస్య నివృత్తిఫలభాగినీ.

అనఁగా, మూర్ఖులయొక్క నివృత్తియు, లేక, హఠవ్వాఁడుగాని మోహముచేఁగాని కర్మలకు పరాఙ్ముఖులగుటయు నిజముగఁ జూచిన ప్రవృత్తియే యగును, అనఁగా: కర్మ యగును. బుద్ధిమంతులయొక్క ప్రవృత్తియు, అనఁగా: నిష్కామకర్మయు నివృత్తియే, అనఁగా: కర్మత్యాగమువలన కలుగుఫలము నిచ్చునదియే యగునని చెప్పఁబడినది (అష్టా. ౧౮. ౬౧).

యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః. ౧౯
త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి సః. ౨౦
నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. ౨౧

[గీతలలోని పైశ్లోకమునం దీవిషయమే విరోధాభాస మనునలంకారముచే చమత్కారముగఁ జెప్పఁబడినది. కాన గీతలయందున్న యీయకర్మలక్షణ మును బాగుగ నెఱింగిననే కాని గీతలయందున్నకర్మాకర్మవివేచనయందలి మర్మ మెప్పటికిని తెలియదు. ఇప్పు డీయర్థమునె ముందుశ్లోకమునందు నధికముగ వ్యక్తము చేసి నిరూపించుచున్నాఁడు—]

(౧౯) ఎవరియొక్క సమారంభములు, అనఁగా: ప్రయత్నము లన్నియు ఫలేచ్ఛాశూన్యములుగ నుండునో యతనినే జ్ఞానాగ్నిచే దగ్ధమయిన కర్మలుగల పండితుఁ డని జ్ఞాతలు చెప్పుచున్నారు.

[జ్ఞానముచే కర్మలు భస్మమగుననుదానికి కర్మలను వదలిపెట్టుట యని యర్థము కాదు. ఫలేచ్ఛను వదలి కర్మలను చేయుటయే యని యెఱుంగ వలయునని పైనఁజెప్పినవిషయమునుబట్టి స్పష్టమగుచున్నది (గీతా. ౪. ప్ర. ౧౦. పు. ౨౭౨-౨౭౬ చూడు). అటులే ముందు "సర్వారంభ పరిత్యాగీ"— సర్వారంభములను, లేక, యుద్యోగములను వదలివేయు వాఁడు—అని భగవద్భక్తులనుగుఱించి చెప్పునట్టివాక్యమునకు (గీ. ౧౨-౧౬-౧౯.౨౫) నైతె మర్థ మేమైనదియు దీనిచేతనే నిర్ణయింపఁబడును. ఇప్పు డీవిషయమునె మిక్కిలి స్పష్టముగఁ జెప్పుచున్నాఁడు—]

(౨౦) కర్మఫలాసక్తిని వదలి సదా తృప్తుఁడును నిరాశ్రయుఁడు, అనఁగా: ఇట్టిలాభముకొఱ కీకర్మను చేయుచున్నానని కర్మఫలములయొక్క సాధనములకు నాశ్రయభూతమగు బుద్ధిని వదలివేయువాఁడు, కర్మలు చేయుటయందు మగ్నుఁడైనను నేమియు చేయఁడు (అని చెప్పవలయును). (౨౧) ఫలవాసనను వదలివేసినవాఁడును, చిత్తమును నియమించినవాఁడును సర్వసంగముక్తుఁడు నయినవాఁడు శారీరకములు మాత్రమే యగు, అనఁగా: శరీరముచేఁ గాని కర్మేంద్రియములచేతనే కాని కలుగు, కర్మలను చేయుచున్నను వానికి పాప ముండదు.

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః.
సమః సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే. ౨౨
గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః,
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. ౨౩

[౨౦-వ శ్లోకమునందున్న నిరాశ్రయశబ్దమునకు గృహదారాదికమును వదలినవాఁడు(సన్న్యాసి)అని యనేక లర్థము చెప్పుచున్నారు; కాని యది సరియైనది కాదు. ఆశ్రయమనఁగా నిల్లు, లేక, బస యని యర్థము చెప్పవచ్చును; కాని, ప్రకృతమందు కర్త నివసించునట్టి నివాసస్థానమని యర్థము కాదు. అతఁడు చేయుచున్నకర్మకు హేతువగు సంస్థాన (ఆశ్రయము) మెక్కడను నుండఁగూడదని యర్థము. మఱియు నీయర్థమే గీతయందలి ౬. ౧ శ్లోకమునందు—"అనాశ్రితః కర్మఫలం"అనుశబ్దములచే స్పష్టము చేయఁబడినది. వామనపండితుఁడు గీతలకు వ్రాసిన 'యథార్థదీపిక' యను మహారాష్ట్రిభాషలోని టీకయం దీయర్థమును స్వీకరించెను.అటులే యిరువదియొకటవ శ్లోకమునందు 'శారీర'మన శరీరపోషణమును పూర్తిచేయు భిక్షాటనమొదలుగాఁగలకర్మ యనియు నర్థము కాదు. "కేవలం శారీరం కర్మ"యనునది, "యోగి,అనఁగా: కర్మయోగి, యాసక్తిని, లేక, కామ్యబుద్ధిని మనస్సులో నుంచుకొనక యింద్రియములచేత మాత్రమే కర్మలను చేయును"అని ముందైదవయధ్యాయమున (౫. ౧౧) చెప్పఁబడినదానితో సమానార్థకమే. ఇంద్రియములు కర్మలను చేయుచున్న వనుమాట నిజమే; కాని బుద్ధి సమముగ నుండుటచేత నాకర్మలయొక్క పుణ్యపాపములు నాకర్తను జెందవు.]

(౨౨) యదృచ్ఛచే ప్రాప్తమయినదానిచేత నే సంతుష్టుఁడును,(హర్షము, శోకము మొదలుగాఁ గం) ద్వంద్వములనుండి ముక్తుఁడును, మాత్సర్యశూన్యుఁడును, (కర్మలు)సిద్ధించినను, సిద్ధింపకపోయినను సమానమే యనుకొనువాఁడును, (కర్మలను) చేసినను,(వానిపాపపుణ్యములచే) బంధింపఁబడఁడు. (౨౩) సంగరహితుఁడును, (రాగద్వేషములనుండి) ముక్తుఁడును, (సామ్యబుద్ధిరూపమగు) జ్ఞానమునందు స్థిరచిత్తుఁడును,(కేవల) యజ్ఞముకొఱకని మాత్రమే చేయువాఁడును నగుపురుషునియొక్క కర్మ సమగ్రముగ లయము నొందును.

[ఇదివరలో మూఁడవయధ్యాయాంతమున (౩. ౯) యజ్ఞార్థము చేయఁబడుకర్మలు మీమాంసకమతానుసారముగ బంధకములు కావనియు, అవియే యాసక్తి వదలి చేయఁబడు నేని స్వర్గప్రదములుగాక మోక్షప్రదము లగుననియుఁ జెప్పఁబడినవిషయమె యీశ్లోకమునందును జెప్పఁబడినది. "సమగ్రమగు లయమును జెందుచున్నవి" యనువాక్యమునందు సమగ్ర పదము చాల ముఖ్యమయినది. మీమాంసకులు స్వర్గసుఖమె పరమ సాధ్యమని యందురు. మఱియు వారిమతమును బట్టి స్వర్గసుఖము నొందింపఁ జేయుకర్మలు బంధకములు గావు; కాని గీతయొక్క దృష్టి స్వర్గము కంటె పరమునం దున్నది, అనఁగా: మోక్షమునం దున్నది. మఱియు నీ దృష్టిచే స్వర్గప్రదములగు కర్మలును బంధకములే యగును. కాన, యజ్ఞార్థములగు కర్మలు అనాసక్తబుద్ధితోఁ జేయఁబడు నేని సమగ్రమగు లయము, అనఁగా: స్వర్గప్రదములు సయితము కాక మోక్షప్రదములగుట, నొందునని చెప్పఁబడినది. అయినను నీయధ్యాయమునందున్న యజ్ఞప్రకరణప్రతిపాదన యందును, మూఁడవయధ్యాయమునందలి ప్రతిపాదనయందును, నొకగొప్ప భేదము కలదు. మూఁడవయధ్యాయమునందు శ్రౌతము, స్మార్తము నయిన యనాదియజ్ఞచక్రమును స్థిరపఱుపవలయునని చెప్పఁబడినది; కాని భగవంతుఁ డిప్పుడు చెప్పున దేమనఁగా: యజ్ఞము దేవత నుద్దేశించి తిలతండులములను గాని, పశువును గాని హోమము చేయుటమాత్రమే యని కాని, లేక, చాతుర్వర్ణ్యముయొక్క ధర్మములను స్వధర్మానుసారముగఁ గాని, కామ్యబుద్ధితోఁ గాని చేయుటమాత్రమే యని కాని యనుకొనకుము. అగ్నియం దాహుతి వేయునపుడు తుదకు 'ఇదం న మమ'—ఇది నాది కాదు—అని యుచ్చరించు శబ్దమునందున్న స్వార్థత్యాగరూపమగు నిర్మమత్వము యొక్క తత్త్వమే యజ్ఞమం దున్న ప్రధానభాగము. మఱియు నీరీతిగ "న మమ"తో, అనఁగా: మమత్వబుద్ధినివదలి, బ్రహ్మార్పణపూర్వకముగ జీవితకాలమునఁ జేయు వ్యవహారముల నన్నింటిని చేయుట సయిత మొకగొప్ప యజ్ఞమే, లేక, హోమమే గాన, నీయజ్ఞముచే సర్వదేవతలకు దేవతయైన పరమేశ్వరునియొక్కయే, లేక, బ్రహ్మముయొక్కయే యజనము సంభవించును. అనఁగా: మీమాంసకులయొక్క ద్రవ్యయజ్ఞవిషయమున చెప్పఁబడినసిద్ధాంత మీగొప్పయజ్ఞమునకును సంబంధించును. కాన నాసక్తి లేకుండ జగమున నున్నకర్మలను లోకసంగ్రహార్థమయి చేయువాఁడు

§§ బ్రహ్మార్పణం బ్రహ్మహవి బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా. ౨౪
దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞే నై వోపజుహ్వతి. ౨౫

[కర్మలయొక్క సమగ్రమగు ఫలము నుండి ముక్తుఁడగుచు తుదకు మోక్షము నొందును (గీతార. ప్ర. ౧౧. పు. ౪౩౬–౪౮౦ చూడు). ఈ బ్రహ్మార్పణ రూపమగు గొప్పయజ్ఞమే ముందుశ్లోకమున మొదట చెప్పఁబడినది. పిదప దీనికంటె తక్కువయోగ్యత గలిగిన గౌణయజ్ఞముల స్వరూపమును చెప్పి తిరిగి యిట్టిజ్ఞానయజ్ఞమే యన్నింటిలోను శ్రేష్ఠమని మొత్తముపై నీప్రకరణమునందలి ౩౩–వ శ్లోకమునం దుపసంహారము చేయఁబడినది.]

(౨౪) అర్పణము, అనఁగా హవనము అను క్రియా బ్రహ్మము, హవిస్సు, అనఁగా: అర్పింపఁబడు ద్రవ్య బ్రహ్మము, బ్రహ్మాగ్నియందు బ్రహ్మచే హోమము చేయఁబడినవి. కర్మ (అంతయు నీరీతిగ) బ్రహ్మమని దృఢమయినబుద్ధి గలవారు బ్రహ్మమునే పొందుదురు.

['అర్పణ' శబ్దమునకు ''అర్పించుటకు సాధనములు, అనఁగా: హోమపాత్రములు మొదలయినవి'' అని శాంకరభాష్యమునం దర్థము చెప్పఁబడినది; కాని యీ యర్థము కొంచెము క్లిష్టముగ నున్నది. దీనికంటె నర్పణ మనఁగా నిచ్చుట, లేక, హోమము చేయుట యను క్రియ యని యర్థము చేసికొనుట మిక్కిలి సులభము. బ్రహ్మార్పణ మనఁగ, నిష్కామబుద్ధితో యజ్ఞము చేయుట యని చెప్పఁబడినది. ఇప్పుడు దేవతల నుద్దేశించి, అనఁగా: కామ్యబుద్ధితో, చేయఁబడినయజ్ఞముల స్వరూపమును జెప్పుచున్నాఁడు—]

(౨౫) అనేకులు (కర్మ-) యోగులు (బ్రహ్మబుద్ధికి బదులు) దేవాదుల నుద్దేశించి యజ్ఞమును జేయుచున్నారు. మఱియు ననేకులు బ్రహ్మాగ్నియందు యజ్ఞములచేతనే యజ్ఞములను యజించుచున్నారు.

[పురుషసూక్తమునందు విరాడ్రూపియగు యజ్ఞపురుషుని దేవతలు యజ్ఞము చేసిరి. ''యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః'' అని చెప్పఁబడినది (ఋ.౧౦.౯౦.౧౬). ఈశ్లోకముయొక్క యుత్తరార్ధమున నున్న ''యజ్ఞం యజ్ఞే నోపజుహ్వతి'' యనువాక్యము ఋగ్వేదమునందున్న ''యజ్ఞేన యజ్ఞ మయజంత'' అనుపదములతో సమానార్థములుగ యోజింపఁబడి

శ్రోత్రాదీ నింద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీ న్విషయా నన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి. ౨౬
సర్వా ణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. ౨౭

నటుల కాన్పించుచున్నవి. సృష్ట్యారంభమున ప్రవృత్తమగు నీయజ్ఞమునందు హవనము చేయఁబడిన విరాడ్రూపమగు పశువును, యజ్ఞము చేసినదేవతలును నీబ్రహ్మరూపులుగనే యుండవలయునని స్పష్టమగుచున్నది. సృష్టియందలి సర్వపదార్థమునందును బ్రహ్మ మెప్పుడును నిండియే యున్నందున నిష్కామబుద్ధితో సర్వవ్యవహారములను చేయునప్పుడు బ్రహ్మముచేతనే బ్రహ్మముయొక్క యజ్ఞము తప్పక యగును గాన నిరువదినాల్గవశ్లోకమునందు చెప్పఁబడినవిషయమే తత్త్వదృష్టిచే నిజమయినది. బుద్ధిమాత్ర మట్లుండవలయునని యిందలిసారాంశము. పురుషసూక్తము ననుసరించి గీతలయందీయొకశ్లోకమే చెప్పఁబడలేదు. పదియవయధ్యాయమునందును (౧౦.౪౨)పు సూక్తము ననుసరించియే చెప్పఁబడినది. ఇంతవఱకును దేవతలను నుద్దేశించి చేయఁబడినయజ్ఞము చెప్పఁబడినది. ఇప్పుడు అగ్ని, హవిస్సు మొదలుగాఁ గలశబ్దములకు లాక్షణికార్థమును స్వీకరించి ప్రాణాయామము మొదలుగా గల్గినపాతంజలయోగమునందున్న క్రియ గాని తపస్సు గాని చేయుటయు నొకవిధమగు యజ్ఞమెట్లగునో చెప్పుచున్నాఁడు—]

(౨౬) కొందఱు శ్రోత్రము మొదలయిన యింద్రియములను సంయమరూపమగు నగ్నిహోత్రమునందు హోమము చేయుచున్నారు. మఱికొంద ఱింద్రియరూపమగు నగ్నిహోత్రమున (ఇంద్రియములయొక్క) శబ్దము మొదలగు విషయములను హోమము చేయుచున్నారు. (౨౭) మఱికొంద ఱింద్రియములయొక్కయు ప్రాణములయొక్కయు కర్మల నన్నింటిని (అనఁగా: వ్యాపారములను) జ్ఞానముచే ప్రజ్వలిత మయిన యాత్మసంయమనరూపమగు యోగాగ్నిహోత్రమునందు హోమము చేయుచున్నారు.

[రెండుమూఁడు విధములగు గౌణయజ్ఞములు పైశ్లోకమునందు చెప్పఁబడినవి. (౧) ఇంద్రియముల సంయమించుట, అనఁగా: వానిని యోగ్యమగు కట్టుబాటులోపల వ్యవహరింపఁజేయుట; (౨) ఇంద్రియములయొక్క విషయములను, అనఁగా: ఉపభోగయోగ్యములగు పదార్థములను,

అన్నివిధముల వదలి యింద్రియముల బొత్తిగఁ జంపివేయుట; (౩) ఇంద్రియములయొక్క వ్యాపారమునే కాక ప్రాణములయొక్క వ్యాపారమును సైతము బంధించి, అనఁగా: పూర్ణమగు సమాధిలోఁ బ్రవేశించి, కేవల మాత్మానందమందె నిమగ్నుఁడగుట. ఇప్పుడు వీని యజ్ఞముతో పోల్తు మేని మొదటిదానియం దింద్రియములకుఁ గలుగఁ జేసినకట్టుఁబాటునది (సంయమనము) యగ్ని యగును. కారణ మేమన: దృష్టాంతముచే నీకట్టుఁబాటుకు లోఁబడినవానిని దానియందు దానిని హోమము చేయుట యని చెప్పవచ్చును. ఇట్లే రెండవదానియందు సాక్షాత్తుగా నింద్రియములును, మూఁడవదానియం దింద్రియములు, ప్రాణములు నను రెండును హోమము చేయఁదగినద్రవ్యములును, నాత్మసంయమన మనునది యగ్నియు నగుచున్నవి. ఇదియునుం గాక, యొక ప్రాణాయామమునే చేయువార లనేకులు గలరు. వారిసంగతి యిరువదితొమ్మిదవశ్లోకమునందు చెప్పఁబడినది. యజ్ఞశబ్దమునకు ద్రవ్యాత్మకమగు యజ్ఞమను మొదటియర్థమును లక్షణచేత వ్యాపింపఁజేసి, తపస్సు, సన్న్యాసము, సమాధి, ప్రాణాయామము మొదలగు భగవత్ప్రాప్తిసాధనములగు సర్వసాధనములను యజ్ఞశబ్దార్థమునందె చేర్చుట యనుకల్పన భగవద్గీతలయందె క్రొత్తగాఁ జేయఁబడినది కాదు. మనుస్మృతియందలి నాల్గవయధ్యాయమునందు గృహస్థాశ్రమమును వర్ణించుచు మొదట ఋషియజ్ఞము, దేవయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము, పితృయజ్ఞము ననెడు స్మార్తములగు పంచయజ్ఞములను గృహస్థుఁడగువాఁ డెవ్వఁడును వదలిపెట్టఁగూడదని చెప్పిన పిదప వీనిబదులుగఁ గొందఱు "ఇంద్రియములయందు వాక్కును, వాక్కునందు ప్రాణమును, హోమము చేయుచున్నారు," అనియు "తుదకు జ్ఞానయజ్ఞముచేత సైతము పరమేశ్వరునియజ్ఞము చేయుచున్నారు" అనియు చెప్పఁబడినది (మను. ౪.౨౧-౨౪ చూడు). ఇతిహాసదృష్టిచే విచారించితిమేని యింద్రుఁడు, వరుణుఁడు మొదలుగాఁ గలదేవతల నుద్దేశించి చేయఁబడు శ్రౌతగ్రంథములయందు చెప్పఁబడిన ద్రవ్యమయములగు యజ్ఞములు తక్కువయోగ్యత గలవి యనియు, పాతంజలయోగముచేతఁ గాని సన్న్యాసముచేతఁ గాని, యాధ్యాత్మికజ్ఞానముచేతఁగాని, పరమేశ్వరునిపొందుట యనుమార్గ మత్యధికముగ ప్రచారములోనికి వచ్చినప్పుడు యజ్ఞశబ్దార్థమును వ్యాపకము చేసికొని దానియందె లక్షణావృత్తిమూల

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే,
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః. ౨౮
అపానే జుహ్వతి ప్రాణం ప్రాణే ఽపానం తథాఽపరే,
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః. ౨౯

మున మోక్షోపాయములనన్నింటిని చేర్చుట యారంభమై యుండునని యూ తోఁచును. పూర్వమందు ధర్మమనుశబ్దమున రూఢమగు 'యజ్ఞ' శబ్దము నే పిమ్మట 'ధర్మమార్గ'మను నర్థమున ప్రయోగించుటయే దీనికి కారణము. ఏది యెటులున్నను గీతలకంటె పూర్వమునందుఁగాని, లేక, గీతలకాలము నందుఁగాని యీకల్పన సర్వసామాన్యముగ నుండుట మాత్రము మనుస్మృతి యందున్న వివేచననుబట్టి స్పష్టమగుచున్నది.]

(౨౮) ఇట్లు తీక్ష్ణముగ వ్రతాచరణ చేయుయతులు (అనఁగా: సంయమన శీలు రగుపురుషులు) ఒకరు ద్రవ్యరూపయజ్ఞమును, మఱియొకరు తపోరూప యజ్ఞమును, ఇంకొకరు యోగరూపమగు యజ్ఞమును, ఇంకొక్కరు స్వాధ్యాయ రూపమగు యజ్ఞమును, అనఁగా: నిత్యమును స్వకర్మానుష్ఠానరూపమునగు యజ్ఞ మును, ఇతరులు జ్ఞానరూపమగు యజ్ఞమును చేయుచున్నారు. (౨౯) ప్రాణాయా మమునందు తత్పరు లగుచు ప్రాణాపానములరెంటియొక్క గతులను నిరోధించి కొందఱు ప్రాణవాయువు నపానమునందును, కొంద ఱపానవాయువును ప్రాణ వాయువునందును హోమము చేయుచున్నారు.

[పాతంజలయోగానుసారముగ ప్రాణాయామము చేయుటయు నొక విధమగు యజ్ఞమే యని తాత్పర్యము. ఈ పాతంజలయోగరూపమగు యజ్ఞము ౨౯-వ శ్లోకమున చెప్పఁబడినది. "యోగరూపమగు యజ్ఞము" అను ౨౮-వ శ్లోకమున నున్న పదమునకు కర్మయోగరూపమగు యజ్ఞమని యర్థము కావించికొనవలయును. ప్రాణాయామశబ్దమునందున్న ప్రాణశబ్ద మునకు శ్వాసము ఉచ్ఛ్వాసము ననుక్రియ లని యర్థము; కాని ప్రాణ మనియు, అపాన మనియు భేదముగ చెప్పినపుడు ప్రాణ మనఁగాఁ బైకిఁ బోవు(ఉచ్ఛ్వాస)వాయు వనియు, అపాన మనఁగ లోపలికిఁ బోవు శ్వాస మనియు నర్థ మని యెఱుంగవలయును (వే. సూ. శాం. భా. ౨. ౪. ౧౨ మఱియు ఛాందోగ్య. శాం. భా. ౧. ౩. ౩ చూడుము). ప్రాణము నపానము ననుశబ్దములకీయర్థ మెప్పుడును వాడుకలో నున్నయర్థముకంటె నిచ్ఛా వేఱుగ నున్నదని గుర్తించుకొనవలయును. ఈ యర్థమున నపాన

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు
సర్వే ఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత
యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ
నాయం లోకో ఽస్త్యయజ్ఞస్య కు

మందు, అనఁగా లోని కీడ్చుకొను మేమన: దృష్టాంత (అనఁగా: ఉచ్ఛ్వాసమును) హోమము దాని సెహోమము ప్రాణాయామ మగును. ప్రాణమునియందు సాక్షాత్తుగా నిం యా ప్రాణాయామము రేచక మనఁబడును. ప్రాణములు నను నిరోధింపఁబడు నేని యా ప్రాణాయామమే కుంభక మనునది రెండునుగాక వ్యానము, ఉదానము, సమానము ననుమూఁడు మిగిలియున్నవి. వీనిలో వ్యాన మనునది ప్రాణాపానముల సంధిస్థాన సుండునది గాన, ధనుస్సు లాగుట, బరువు నెత్తుట మొదలగునూపిరిని లాగి బలాత్కారముగ చేయవలసినపనులు చేయునప్పు డది వ్యక్తమగును. (ఛాం. ౧. ౩. ౫). మరణసమయమునందు వెలువడి పోవునదియే ఉదాన వాయువు (ప్రశ్న. ౩. ౭). మఱియు సమాన వాయు వన్నరసమును శరీర మంతటను వ్యాపింపఁజేయును (ప్రశ్న. ౩. ౫), అని యీవాయువుల స్వరూపము వేదాంతశాస్త్రమునందు సామాన్యముగఁ జెప్పఁబడుచున్నది; కాని కొన్ని స్థలములలో నీపైఁ జెప్పఁబడినదానికంటె భిన్నమగు నర్థ మును చెప్పవలయును. ఉదాహరణము—మహాభారతమునందు వనపర్వము నందలి ౨౧౨-వ యధ్యాయమునందు ప్రాణాదివాయువులకు వేర్వేఱు లక్షణములు సెప్పఁబడినవి. ప్రాణ మనునది శిరస్సునందుండునదియు, అపాన మనఁగ క్రిందికి సర్దుకొనువాయు వనియు నక్కడ చెప్పఁబడి నది (ప్రశ్న. ౩. ౫. మఱియు మైత్ర్యు. ౭. ౯ చూడుము). వీనిలో నేవాయువును నిరోధించుచున్నారో యావాయువును నితరవాయువు నందు హోమ మగునని యీశ్లోకమునఁ జెప్పఁబడినదానికిఁ దాత్పర్యము].

(౩౦) అనేకు లాహారమును నియమించుకొని ప్రాణములనే ప్రాణముల యందు హోమము చేయుచున్నారు. వీరందఱును యజ్ఞములచే క్షీణపాపులును, యజ్ఞవేత్తలును, (౩౧). (మఱియు) అమృతాశనులు, అనఁగా: యజ్ఞమును చేయఁగా

ద్రవ్యయజ్ఞభుజించువారు నగుటచే సనాతనమగు బ్రహ్మమును బొందు స్వాధ్యాయయజ్ఞాది కిహలోకమే సిద్ధము కానేరదు. ఓకురు శ్రేష్ఠ! అపానే జుహ్వతి ను?

ప్రాణాపానగతీ రుద్ధియజ్ఞము చేయుట మనుజునకు *ముఖ్యకర్తవ్యమై మున మోక్షోపాయముల నన్నిటినవి కావనియు, ప్రాణాయామము చేసినను, తోఁచును. పూర్వమందు ధర్మసేవము చేసినను, పశుయజ్ఞమును చేసినను, పిమ్మట 'ధర్మమార్గ'మను నర్థమును గాని హోమము చేసినను, నైవే ఏది యెటులున్నను గీతలక్షణము గాఁగలిగిన పంచగృహయజ్ఞములను చేసినను నందుఁగాని యిట్లు చేసినచో నవి యన్నియు వ్యాపకమగు నర్థముచే యజ్ఞ యందున్నగునవియు నిందలి సారాంశము; కాని యజ్ఞశేషమును భక్షించు విషయమున మీమాంసకులచేఁజెప్పఁబడినసిద్ధాంతము వీనిలోఁ బ్రతియజ్ఞము నకును సంబంధించినదే యుండును. వీనిలో "యజ్ఞార్థమై చేయఁబడినకర్మలు బంధకములు గా"వను నియమము ముఖ్యమయినది. ఆవిషయము పూర్వమందు ఇరువదిమూఁడవశ్లోకమునందు చెప్పఁబడినది (గీ. ౩. ౯ మీఁద టీకను జూడుము). ప్రతిగృహస్థుఁడును పంచమహాయజ్ఞములను చేసి యతిథులు మొదలగువారు భుజించినపిదప తనభార్యయు తానును భుజింప వలసిన దనునది రెండవనియమము. ఇట్లు ప్రవర్తించినచో గృహస్థాశ్రమము సఫలమయి సద్గతిప్రద మగును. "విఘసం భుక్తశేషం తు యజ్ఞశేష మథామృతమ్," (మను. ౩.౨౮౫)—అతిథి మొదలగువారు భుజింపఁగా మిగిలినపదార్థము విఘస మనియు, యజ్ఞముచేయఁగా మిగిలినది యమృత మనియు చెప్పఁబడినది. ప్రతిగృహస్థుఁడును నిత్యమును విఘసాశిగ నుండవలయు నని మనుస్మృతియందును నితరస్మృతులయందును జెప్పఁబడినది (గీ. ౩. ౧౩. మఱియు గీ. ర. పు. ౪౦౧ చూడు). సామాన్యగృహయజ్ఞములకు సంబంధించుసిద్ధాంతమే పైన చెప్పినయన్ని విధములగు యజ్ఞములకును సంబంధించు ననియు, యజ్ఞార్థమై చేయఁబడినకర్మ యేదియు బంధకము కాకపోవుటయే కాక యాకర్మలలో నవశిష్టములగు కర్మలు స్వీయోపయోగమునకై చేయఁబడినను బంధకములు కావనియు భగవంతుఁ డిప్పుడు చెప్పుచున్నాఁడు (గీతా. ర. ప్ర. ౧౨. పు. ౨౩౩ చూడు). "యజ్ఞములు లేనిది యిహలోకము సైతము సిద్ధము కాదు"

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజా న్విద్ధి తాన్ సర్వాన్ ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే.౩౨

అను చివరనున్న వాక్యము సారవత్తరమైనదియు, గొప్పదియు నై యున్నది. "యజ్ఞము లేనిచో వాన గురియదు. వర్షము గురియనియెడల నిహలోక యాత్ర యుం జరుగదు," అని మాత్రమే దాని యర్థము కాదు. ఇంక నేమన:—'యజ్ఞ'శబ్దమునకు వ్యాపకార్థమును చేసికొని తమకిష్టమగు నేవిషయము నయినను ప్రతిమనుజుండును వదలినంగాని యందఱకును సమానమగు స్నేహము గలిగి జగత్తుయొక్క వ్యవహారము చక్కగ జరుగదను సామాజికతత్త్వమును దానియం దొకవిధముగం జేరియున్నది. "ప్రతి మనుజుండును తనస్వాతంత్ర్యమున వదలుకొనినంగాని యితరులకు సమానముగ స్వాతంత్ర్యము గలుగదు," అని పాశ్చాత్త్యులగు సామాజిక శాస్త్రకారులచే చెప్పంబడినసిద్ధాంత మీతత్త్వమున కొకయుదాహరణము. ఈవిషయమును గీతయందలి పరిభాషానుసారముగ చెప్పవలసినచో "ప్రతి మనుజుండును తనస్వాతంత్ర్యమును కొంచెము కొంచె మయినను యజ్ఞము చేసినంగాని యిహలోకమందున్నవ్యవహారము చక్కగ జరుగదు" అని చెప్పవలయును. ఇట్లు వ్యాపకమును విస్తృతము నగునర్థముచే యజ్ఞ మను నదియే సమస్తసమాజరచనకును బునాది యని యెఱింగినపిదప, విధివిహితమను తలంపున నీయజ్ఞమును చేయుట ప్రతిమనుజుండును నభ్యసించినంగాని సమాజవ్యవస్థ బాగుగ నుండనేరదని వేఱుగం జెప్పనక్కఱలేదు.]

(౩౨) ఈరీతిగ ననేకవిధములగు యజ్ఞములు బ్రహ్మముఖమునుండియే వెలువడినవి. అవన్నియు కర్మలవలన వెలువడిన వని తెలిసికొనుము. నీవు దీనిని తెలిసికొంటివేని ముక్తుండ వగుదువు.

[జ్యోతిష్టోమము మొదలుగం గల్గిన ద్రవ్యమయములగు శ్రౌతయజ్ఞముల నగ్నియందు హోమము చేయుచున్నారు; మఱియు నగ్నిహోత్రుండు దేవతలకు ముఖమయినందున నీయజ్ఞము లాయాదేవతలకుం జేరునని యాయా శాస్త్రములయందుం జెప్పంబడినవి; కాని దేవతలకు ముఖమగు నగ్నిహోత్రమునందు హోమము చేయందగినవి పైనచెప్పంబడిన గౌణయజ్ఞములు కామిచే నీగౌణయజ్ఞములచే శ్రేయఃప్రాప్తి యెట్లులగునని యొకవేళ సందేహము గలిగినచో, దానిని బోంగొట్టుకొనునిమిత్తమై యీయజ్ఞము

శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప,
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే.       33

సాక్షాత్తుగ బ్రహ్మయొక్క ముఖమునందె పుట్టినదని యిప్పుడు చెప్పఁబడినది. మీమాంసకులయొక్క సంకుచితార్థము నేకాక యజ్ఞవిధియొక్క వ్యాపక మగుస్వరూపమును సైతము తెలిసికొన్నవానియొక్క బుద్ధి సంకుచితము కాదు. కావున బ్రహ్మస్వరూపమును సైతము తెలిసికొనుట కతఁడధికారి యగునని రెండవచరణమునకు భావార్థము. ఇప్పు డీయన్నియజ్ఞములలోను శ్రేష్ఠమైనదానిని చెప్పుచున్నాఁడు—]

(33) ఓపరంతపా! ద్రవ్యమయమగు యజ్ఞముకంటె జ్ఞానమయమగు యజ్ఞము శ్రేష్ఠమైనది. కారణ మేమన: ఓపార్థా! అన్నివిధముల నన్నియజ్ఞములకును జ్ఞానమునందే పర్యవసానము.

[ఈ 'జ్ఞానయజ్ఞ' మనుశబ్దము గీతలయందు పైన రెండుస్థలములయందు ప్రయోగింపఁబడినది (గీ. ౯. ౧౫. మఱియు ౧౮. ౭౦). తాను చేయు ద్రవ్యమయ మైనయజ్ఞమును పరమేశ్వరప్రీత్యర్థమై చేయుచున్నాఁడు. పరమేశ్వరునియొక్క ప్రాప్తి యాతనిస్వరూపజ్ఞానము కలిగినఁగాని కలుగదు. కాన పరమేశ్వరస్వరూపము నెఱింగి, యాజ్ఞానమునకుఁ దగునటుల ప్రవర్తించుటయే పరమేశ్వరప్రాప్తి కలిగించుకొనుటకు సాధనమనియు, ఇదియే జ్ఞానయజ్ఞ మనియు చెప్పుచున్నారు. ఈయజ్ఞము మానసమును, బుద్ధిసాధ్యము నయినదియు కావున ద్రవ్యయజ్ఞముకంటె దీనియోగ్యత గొప్పది యని యెఱుంగవలయును. జ్ఞానయజ్ఞమునందున్న యీజ్ఞానమే మోక్షశాస్త్రమునందు ముఖ్యమైనది కావున నీజ్ఞానముచేతనే సర్వకర్మలును నశించును. ఏమి యున్నను తుదకు పరమేశ్వరునిజ్ఞానము కలుగవలయును. జ్ఞానము లేనిచో మోక్షము సిద్ధింపదు, అని గీతయొక్క చరమసిద్ధాంతము. అయినను "కర్మ జ్ఞానమునందే పర్యవసానము నొందును" అనునీవచనమునకు జ్ఞానము కల్గినపిదప కర్మలను వదలివేయవలయునని యర్థము కాదని గీతారహస్యమునందలి ౧౦-౧౧ ప్రకరణములలో సవిస్తరముగఁ బ్రతిపాదింపఁబడినది. స్వప్రయోజనార్థమై కాకపోయినను, లోకసంగ్రహార్థమై కర్తవ్యము అనుతలంపుతో సర్వకర్మలను చేయుచునే యుండవలయును. మఱియు నవి జ్ఞానముతోడను సామ్యబుద్ధితోడను చేయఁ

§§ త ద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. ౩౪
యజ్ జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాండవ,
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి. ౩౫
అపిచే దసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృ త్తమః,
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి. ౩౬

బడినందున వానిపాపపుణ్యములు కర్తను బాధింపవు (చెప్పఁబోవు ౩౭-వ శ్లోకమును జూడుము). "ఈజ్ఞానయజ్ఞము మోక్షప్రద మగును. కాన యజ్ఞమును చేయుము; కాని దానిని జ్ఞానపూర్వమగునిష్కామబుద్ధితో చేయుము", అని గీత యందటను నుపదేశించుచున్నది.

(౩౪) అజ్ఞానము ప్రణిపాతముచేతను, ప్రశ్నచేతను, సేవచేతను తత్త్వవేత్తలగు జ్ఞానులు నీ కుపదేశింతు రనువిషయమును జ్ఞప్తియందుంచుకొనుము. (౩౫) ఓ పాండవా! ఏజ్ఞానము గలుగుటచే నన్ని భూతములు నీలో నుండునవిగను, నాయందుండునవిగను నీకుఁ గాన్పించునో, యాజ్ఞానము గల్గినపిదప నీ కిట్టి మోహ మెన్నటికిని గలుగదు.

[''సర్వభూతములు నీయందును నీవు సర్వభూతములయందును'' అని ముందు చెప్పఁబోవు సర్వభూతాత్మైక్యజ్ఞానమె యక్కడ చెప్పఁబడినది. ఆత్మయు, భగవంతుఁడు నను నీరెండును మొట్టమొదట నేకరూపముగనె యుండెను గాన, నాత్మయందు సర్వభూతములును చేరు నని చెప్పుటచేతనే భగవంతునియందు సైతము సర్వభూతములు నున్నవని తాత్పర్యమగును. కాన నాత్మయు (తాను), ఇతరభూతములును, భగవంతుఁడు నను త్రివిధమగు భేద ముండనేరదు. కావుననే భాగవతపురాణమునందు భగవద్భక్తులలక్షణములం జెప్పునపుడు "సర్వభూతములు భగవంతునియందును, తనయందును జూచువాఁడు భాగవతోత్తముఁ డని యనవలయు''నని చెప్పఁబడినది (భాగ. ౧౧. ౨. ౪౫). ఈగొప్ప నీతితత్త్వము గీతారహస్యమునందలి పండ్రెండవప్రకరణమునను (పు. ౫౩౯-౫౫౦) భక్తిదృష్టిచే పదమూఁడవప్రకరణమునను (పు. ౫౯౩) మిక్కిలి స్పష్టముగ నిరూపింపఁబడినది.]

(౩౬) పాపాత్ములందఱికంటెను మిక్కిలి పాపాత్ముఁడ వయినప్పటికిని,

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున,
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా.          ౩౭
§§ న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
త త్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి.          ౩౮
శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి.          ౩౯
అజ్ఞ శ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః.          ౪౦

ఈజ్ఞాననౌకచేత సర్వపాపములన్ను దాటఁగలవు.(౩౭) ప్రజ్వలించిన నగ్నిహోత్రము కఱ్ఱల నన్నింటిని భస్మముచేయునట్టుల, ఈజ్ఞానరూపమగు నగ్నిహోత్రము సర్వకర్మలయొక్క (శుభాశుభము లను బంధనములను)భస్మము చేయును.

[జ్ఞానియొక్క లక్షణములు చెప్పఁబడినవి. ఈజ్ఞాన మేయుపాయముచేత సంపాదింపవలయునో—దానిని చెప్పుచున్నాఁడు]

(౩౮) జ్ఞానమువలె పవిత్రమైనది యీలోకమునందు నిజముగ మఱియొకటి లేనేలేదు. అజ్ఞానకాలమున(కర్మ)యోగము సిద్ధించినవాఁడు కాలక్రమమున స్వయముగ తనయందు సంపాదించుకొనును.

[౩౭-వ శ్లోకమునందు'కర్మ'శబ్దమునకు కర్మలవలన బంధన మని యర్థము. (గీ. ౪. ౧౯ చూడు). తనయొక్క తెలివిచే నారంభింపఁబడిన నిష్కామ కర్మలచే జ్ఞానమును సంపాదించుకొనుట యనునది జ్ఞానము గలుగుటకు ముఖ్యము, లేక, బుద్ధిగమ్య మైనమార్గము; కాని స్వయముగ తమబుద్ధిచే నీరీతిగ జ్ఞానము సంపాదింపలేనివారికొఱకు శ్రద్ధ యనెడి మఱియొక మార్గము నిప్పుడు చెప్పుచున్నాఁడు—]

(౩౯) ఈజ్ఞానము శ్రద్ధావంతుఁడును నింద్రియసంయమనమును చేసికొనిన వాఁడును వానియందే తత్పరుఁడును నైనవానికే కలుగును. మఱియు జ్ఞానమును సంపాదించుకొనునేని వెంటనే యతనికి పరమశాంతి కలుగును.

[బుద్ధిచే ప్రాప్తమగు జ్ఞానమును, శాంతియు శ్రద్ధచే సైతము గల్గునని సారాంశము (గీ. ౧౩. ౨౫. చూడు). అయినను ఎవనికి బుద్ధియు శ్రద్ధయు లేవో, వాఁడు—]

(౪౦) కాని, జ్ఞానమును, శ్రద్ధయు లేక సంశయమును నొందుచున్నాఁడు

§§ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్,
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ. ౪౧
తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. ౪౨

నాశము నొందును. సంశయము నొందువారి కిహలోకమును, పరలోకమును లేవు. సుఖమును లేదు.

[జ్ఞానప్రాప్తికి స్వీయమగు బుద్ధియు, శ్రద్ధయు నను రెండుమార్గములు చెప్పఁబడినవి. ఇప్పుడు జ్ఞానముయొక్కయు, కర్మయోగముయొక్కయు నుపయోగమే వేఱుగఁ జెప్పి యన్నివిషయముల నుపసంహారము చేయుచున్నాఁడు—]

(౪౧) ఓధనంజయా! (కర్మ-) యోగము నాశ్రయించి కర్మలను, అనఁగా: కర్మబంధనములను వదలుకొని, జ్ఞానముచే విడఁగొట్టఁబడినసంశయములు గల యాత్మజ్ఞానిని కర్మలు బంధింపనేరవు. (౪౨) కావున నీహృదయమందున్న యజ్ఞానమూలమునఁ గలిగిన యీసంశయమును జ్ఞానరూపమగుకత్తితో నఱకివైచి (కర్మ-) యోగము నాశ్రయింపుము. ఓభారతా! (యుద్ధమునకు) నిలువఁబడుము.

[ఈశావాస్యోపనిషత్తునందు విద్యావిద్యలయొక్క వేఱగునుపయోగమును జెప్పి రెంటిని వదలివేయక యాచరింపవలయునని చెప్పఁబడినటులే (ఈశ. ౧౧; గీతార. ప్ర. ౧౧. పు. ౪౯౩ చూడు) గీతలయందలి యీరెండు శ్లోకములయందును జ్ఞానముయొక్కయు (కర్మ) యోగముయొక్కయు నుపయోగమును వేఱుగఁ జెప్పి వానియొక్క, అనఁగా: జ్ఞానముయొక్కయు యోగముయొక్కయు, సముచ్చయముచే కర్మలను చేయుమని యర్జునున కుపదేశించెను. నిష్కామబుద్ధియోగముచే కర్మలు చేయఁబడునేని కర్మబంధములు విడిపోవును గాన, నవి మోక్షప్రతిబంధకములు కానేరవనియు, జ్ఞానము గల్గుటవలన మనస్సునందలి సంశయములు నశించుటచే మోక్షము కల్గుననియు నీరెండుశ్లోకములకును వేర్వేఱగు నుపయోగములు కాన, ఒకకర్మనే కాని, లేక, యొకజ్ఞానమునే కాని స్వీకరింపక జ్ఞానకర్మసముచ్చయాత్మకమగు కర్మయోగము నాశ్రయించి యుద్ధమును చేయుమని తుద కుపదేశించెను. యోగము నాశ్రయించి యుద్ధమునకు నిలువఁబడి, యుండవలసియుండుటచే యోగశబ్దమున కిచ్చో 'కర్మ

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానకర్మసన్న్యాసయోగో నామ చతుర్థోఽధ్యాయః. ౪.

---

: యోగ' మనునర్థమే యావశ్యక మని గీతారహస్యము ప్ర. ౩. పు. ౬౦లో నిరూపింపఁబడినది. జ్ఞానముయొక్కయు, యోగముయొక్కయు సముచ్చయమే "జ్ఞానయోగవ్యవస్థితిః" అను పదముచే ముందు (గీ. ౧౬. ౧.) దైవీ సంపత్తియొక్క లక్షణములయందు మరల చెప్పఁబడును.

ఈరీతిగ భగవంతునిచే గానము చేయఁబడిన (చెప్పఁబడిన) యుపనిషత్తుల యందు బ్రహ్మవిద్యాంతర్గతమైన యోగ—అనఁగా: కర్మయోగ—శాస్త్రమందల్లి శ్రీకృష్ణార్జునుల సంవాదమునందున్న జ్ఞానకర్మసన్న్యాసయోగ మనుపేరుగల నాల్గవయధ్యాయము సమాప్త మయినది.

['జ్ఞానకర్మసన్న్యాస' పదమునందున్న 'సన్న్యాస' శబ్దమునకు స్వరూపముచే 'కర్మత్యాగ' మర్థము కాదనియు, నిష్కామబుద్ధితో పరమేశ్వరుని యందు కర్మలను 'అర్పణము చేయుటయే' యర్థమనియు జ్ఞప్తియందుంచుకొనవలయును. అదియే స్పష్టముగ పదునెనిమిదవయధ్యాయముయొక్క యారంభమున చెప్పఁబడినది.]



# పంచమోఽధ్యాయః.

అర్జున ఉవాచ.

సన్న్యాసం కర్మణాం కృష్ణ పున ర్యోగం చ శంససి,
య చ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్. ౧

[చతుర్థాధ్యాయమునందలి సిద్ధాంతముమీఁద సన్న్యాసమార్గీయులు చేయఁదగినశంకను నర్జునునిచేత నడిగించి దానికి స్పష్టముగ సమాధానమును భగవంతుఁ డీయధ్యాయమునందు చెప్పుచున్నాఁడు. జ్ఞానమనునది సర్వకర్మలకును ఫలము గాన (౪. 33) జ్ఞానముచేతనే సర్వకర్మలును భస్మమగుటయు (౪.3౭), ద్రవ్యమయమగు యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమగుటయు (౪. 33) సత్యమయినచో, రెండవయధ్యాయమునందు "ధర్మ్యమగుయుద్ధమును జేయుటయే క్షత్రియునకు శ్రేయస్కరము," అని చెప్పెను (౨.3౧) కాన "నీవు కర్మయోగము నాశ్రయించి యుద్ధమునకు లెమ్ము." (౪. ౪౨) అని నాలవయధ్యాయమున నేలయుపసంహారము చేసెను? అను ప్రశ్నమునకు గీత యిట్లుత్తర మిచ్చుచున్నది.—సర్వ సంశయములును నశించి మోక్షము గల్గుటకు జ్ఞానముయొక్కయు, మోక్షము నిమిత్తము గాకపోయినను నెప్పుడు వదలుటకు సాధ్యము కాకపోవుటచే లోకసంగ్రహముకొఱకు కర్మలయొక్కయు, సముచ్చయ మెల్లప్పుడు నపేక్షింపఁబడుచునే యున్నది (౪. ౪౧). కర్మయోగము, సాంఖ్యము నను నీ రెండుమార్గములును శాస్త్రవిహితములే యైనచో బుద్ధిపూర్వకముగ వానిలో నొకటియగు సాంఖ్యమార్గము నవలంబించి కర్మత్యాగము నేల చేయఁగూడదు? అనుశంక దీనిపైఁ గల్గును. అనఁగా: ఈరెండుమార్గములలోను శ్రేష్ఠమైనదానిని సైతము పూర్ణముగ నిశ్చయింపవలయు నని తాత్పర్యము. అర్జునుని మనస్సునం దీశంక గల్గుటచే పూర్వమందు మూఁడవయధ్యాయ ప్రారంభమునం దడిగినటులె యిప్పుడును నడుగుచున్నాఁడు—]

(౧) అర్జునుఁ డడుగుచున్నాఁడు—ఓకృష్ణా! ఒకసారి సన్న్యాసమును

శ్రీభగవానువాచ.

సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే. ౧

మఱియొకసారి కర్మయోగమును (అనఁగా: కర్మలను చేయుచుండవలయు ననుమార్గమును) నుత్తమ మని చెప్పుచున్నావు; అయినను నీరెంటిలోను నిజముగ నేది శ్రేయమో, అనఁగా: మిక్కిలి ప్రశస్తమైనదో నిశ్చయముగ నాకుఁ జెప్పుము.
(౧) శ్రీ భగవంతుఁడు చెప్పుచున్నాఁడు— కర్మసన్న్యాసము, కర్మయోగము నను నీరెండుమార్గములు, లేక, నిష్ఠలు నిశ్శ్రేయసకరములే, అనఁగా: మోక్షమును లభింపఁజేయునవియే; కాని (అనఁగా: మోక్షదృష్టిచే రెండును సమానమైన యోగ్యతలు గలవి యైనను) యీ రెంటిలోను కర్మసన్న్యాసముకంటె కర్మయోగమే యధికమైనది.

[పైన చెప్పఁబడినశంకాసమాధానములు రెండును నిస్సందేహమ్ములుగను స్పష్టములుగ నున్నవి. మొదటిశ్లోకమునందున్న శ్రేయశ్శబ్దమునకు వ్యాకరణానుసారముగ నధికప్రశస్తము, మిక్కిలి మంచిది అని యర్థము కాన, రెండుమార్గములయందును గలతారతమ్యము విషయమై యర్జునుఁ డడిగినప్రశ్నకు 'కర్మయోగో విశిష్యతే'—కర్మయోగము గొప్పది—యని చెప్పఁబడినది. అయినను నీసిద్ధాంతము, జ్ఞానముకల్గినపిదప సర్వకర్మలను బొత్తిగ వదలివేయవలయు నను సాంఖ్యమార్గమున కిష్టము కానందున, స్పష్టముగఁ దెలియుచున్నయీప్రశ్నోత్తరములను ననేకులు వ్యర్థముగ గందరగోళము చేసిరి. అంత కలవరపఱచినను ప్రయోజనము లేకపోవుటవలన 'విశిష్యతే' (యోగ్యత, లేక, మహత్త్వము-విశేషము) అనుపదముచే భగవంతుఁడు కర్మయోగమును స్తుతి చేసెను. కాన నది యర్థవాదము, అనఁగా: స్తోత్రము చేయుటకు మాత్రమే యట్లు చెప్పఁబడినది అనియు, భగవంతునియొక్క నిజమగునభిప్రాయ మది కాదనియు చెప్పుకొని, యేదియో యొకవిధముగ సమాధానపడిరి. జ్ఞానము కల్గినపిదప కర్మ లక్కఱలేదని భగవంతుని యభిప్రాయమైనచో, "ఈ రెంటిలోను సన్న్యాసము శ్రేష్ఠము" అని యర్జునునకు భగవంతుఁడు చెప్పలేఁడా? కాని యట్లు చేయక "కర్మలు చేయుటయు, కర్మలను వదలివేయుటయు నను నీరెండుమార్గములును మోక్షప్రదములే" యని రెండవశ్లోకముయొక్క

మొదటిచరణమునందు చెప్పి, పిదప 'తు' అనఁగా 'కాని' అనుపదము నుపయోగించి 'తయోః' అనఁగా నీరెండుమార్గములలోను కర్మను వదలు మార్గముకంటె, కర్మ చేయుట యనుపక్షమే మిక్కిలి ప్రశస్తము (శ్రేయము), అని భగవంతుఁడు నిస్సందేహముగ విధించియుండుటచే, సాధనావస్థయందు జ్ఞానప్రాప్త్యర్థమై చేయఁదగిననిష్కామకర్మలే, పిదప సిద్ధావస్థయందు సైతము లోకసంగ్రహార్థమై జ్ఞాని యామరణాంతము కర్తవ్యములనుతలంపున నాచరింపవలయు ననుమతమే భగవంతున కిష్టమని పూర్ణముగ సిద్ధమగుచున్నది. గీతయందలి మూఁడవయధ్యాయమున నీవిషయమే చెప్పఁబడినది (గీ. 3.౭). అచ్చో సైతము 'విశిష్యతే' యనుపదమే తర్వాతి శ్లోకమున, అనఁగా: గీత. 3. ౮ యందు "అకర్మకంటె కర్మశ్రేష్ఠ" మనియు మరల స్పష్టముగఁ జెప్పఁబడినది. ఉపనిషత్తులలో ననేకస్థలములయందు (బృ.౪. ౪.౨౨) జ్ఞానులు లోకైషణ పుత్రైషణాదులను చెందక భిక్ష మెత్తుకొనుచు తిరుగుచున్నారని చెప్పఁబడిన దనుమాట నిజమే; కాని జ్ఞానము కలిగినతర్వాత నీ యొక్క మార్గమే యనియు, మఱియొక మార్గము లేదనియు నుపనిషత్తులలోఁ జెప్పఁబడలేదు; కాన పైనచెప్పిన యుపనిషద్వాక్యములతో మాత్రమే గీతల కేకవాక్యతఁ జేయుట యుక్తము కాదు. ఉపనిషత్తులయందు చెప్పఁబడిన యీసన్న్యాసమార్గము మోక్షప్రదము కాదని గీతలు చెప్పుట లేదు. కాన, కర్మయోగము, సన్న్యాసము ననునీరెండుమార్గములును మోక్షప్రదములైనను, అనఁగా: మోక్షదృష్టిచే రెండింటియొక్క ఫలమొక్కటియే యైనను, జగత్తుయొక్క వ్యవహారమును విచారించుచు, జ్ఞానము కలిగిన తర్వాత సైతము నిష్కామబుద్ధితో కర్మలు చేయుచుండవలయు ననుమార్గమే మిక్కిలి ప్రశస్తము, లేక, శ్రేష్ఠ మగు నని గీతలయొక్క సిద్ధాంతము. నేను చేసిన యీయర్థమును గీతలకు టీకలు వ్రాసినవా రనేకు లొప్పుకొనరు. వారు కర్మయోగము గౌణమని సిద్ధాంతీకరించిరి; కాని యీయర్థము సరళమైనది కాదని నామతము. గీతారహస్యమునందలి పదునొకండవప్రకరణమునందు (ముఖ్యముగ పృ.౪౧౯-౪౨౯) దీనికి కారణము సవిస్తరముగ వివేచింపఁబడినది. గ్రంథవిస్తరభీతిచే నిచ్చో మరలఁ జెప్పలేదు. రెంటిలోను మిక్కిలి ప్రశస్తమగు మార్గ మెద్దియో చెప్పినపిదప వ్యవహారమునందు జనుల కీ

జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి,
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ప్రముచ్యతే. ౩
సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః,
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విందతే ఫలమ్. ౪
యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే,
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి. ౫
సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః,
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి. ౬

[రెండుమార్గములను భిన్నములుగఁ గాన్పించినను యథార్థముగ నివి వేఱైనవి కావని యిప్పుడు నిరూపించుచున్నాఁడు.—]

(౩) ఎవఁడు (దేనిని) ద్వేషింపఁడో, మఱియు (దేనిని) కోరఁడో వాఁడు (కర్మ చేయుచున్నను) నిత్యసన్న్యాసియే యని తెలిసికొనవలయును. కారణ మేమనఁ: ఓమహాబాహూ! అర్జునా! ఎవఁడు (సుఖదుఃఖాది) ద్వంద్వములనుండి ముక్తుఁడగునో, వాఁడనాయాసముగనె (కర్మలయొక్క యన్ని) బంధములనుండియు ముక్తుఁడగును. (౪) సాంఖ్యము (కర్మసన్న్యాసము), యోగము (కర్మయోగము) నను నీరెండును వేఱైనవి యని మూర్ఖులు చెప్పుదురు. పండితు లట్లు చెప్పరు. ఈరెంటిలో నేమార్గమునకైనను బాగుగఁ బ్రవర్తించినచో రెంటియొక్క ఫలమును లభించును. (౫) ఏ(మోక్ష-) స్థానమును సాంఖ్యులు చెందుదురో యాస్థానమునే యోగులు, అనఁగా: కర్మయోగులు సైతము చెందుదురు. సాంఖ్యము, యోగము నను నవి వేఱుకావని తెలిసికొనినవాఁడే నిజమగు తత్త్వము నెఱింగినవాఁ డని చెప్పవలయును. (౬) ఓమహాబాహూ! (కర్మ) సన్న్యాసమును గైకొన్నను యోగము వినాగా, అనఁగా: కర్మ లేకయే మోక్షము సిద్ధించుట దుర్లభము. ఏముని కర్మయోగయుక్తుఁడగునో యతఁడు బ్రహ్మము నొందుటకు నాలస్య ముండదు.

[సాంఖ్యమార్గముచే లభించు మోక్షమె కర్మయోగముచేత, అనఁగా: కర్మలను వదలివేయక పోవుటచేత నెట్లు లభించునదియు నేడవయధ్యాయము మొదలు పదునేడవయధ్యాయముపర్యంతము సవిస్తరముగ నిరూపింపఁబడినది. మోక్షదృష్టిచే రెంటియందును భేద మేమియు లేనందున, అనాదిగ, నాచరణలో నున్న యీ రెండుమార్గములయందు నున్న

§§ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. ౭
నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యఞ్శృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపఞ్శ్వసన్. ౮
ప్రలపన్విసృజన్గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. ౯

భేదమును విస్తారముగ కల్పించి దానివిషయమై వివాదము చేయుచుండుట యోగ్యము కాదు. మఱియు ముందును నీయుక్తివాదమే తఱుచుగఁ జెప్పఁబడినది (గీ. ౫. ౨. మఱియు ౧౮. ౧, ౨ మీఁదనున్న నాటీకను జూడుము). "ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి," అనుశ్లోకమే కొంచెము శబ్దభేదముతో మహాభారతమున రెండుసారులు చెప్పఁబడినది (శాం. ౩౦౫. ౧౯; ౩౧౬. ౪). సన్న్యాసమార్గమునందు జ్ఞానము ప్రధానముగ నంగీకరింపఁబడినను, కర్మ చేసిననే కాని యాజ్ఞానము సిద్ధింపదు; మఱియు కర్మమార్గమునందు కర్మలు చేయుచున్నను నవి జ్ఞానపూర్వకము లగుటచే బ్రహ్మప్రాప్తికి ప్రతిబంధకములు గావు (గీ. ౫. ౨.); కాన రెండుమార్గములు వేఱుగ నున్నవని కలహము పెట్టనేల ? కర్మలు చేయుటయే బంధక మనునెడల నాయాక్షేపము సైతము నిష్కామకర్మకు తగుల దని యిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౭) యోగయుక్తుఁడును, శుద్ధమైనయంతఃకరణము గలవాఁడును, తన మనస్సును నింద్రియములను జయించినవాఁడును, సర్వభూతములయందున్న యాత్మయె తనయాత్మ యనుకొనువాఁడును నగుపురుషుఁడు సర్వకర్మలను జేయుచున్నను కర్మలయొక్క పాపపుణ్యములనుండి యలిప్తుఁడుగ నుండును. (౮) యోగయుక్తుఁడును తత్త్వవేత్తయు నగుపురుషుఁడు "నేనేమియు చేయుట లేదు" అని యనుకొనవలయును; మఱియు చూచుచు, వినుచు, స్పృశించుచు, ఆఘ్రాణించు[illegible] భుజించుచు, సంచరించుచు, నిద్రించుచు, శ్వాసోచ్ఛ్వాసములను [illegible] (౯) సంభాషించుచు, విసర్జించుచు, గ్రహించుచు, నేత్ర[illegible] ...ఎడుచుచు మూసికొనుచు నుండియు నింద్రియములు(మాత్రము)తమతమ[illegible] విశే...ముల తెలుచుచు ...ు విషయములయందు ప్రవర్తించుచున్న వనుకొనుచు (మెలఁగవలయును).

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా. ౧౦
కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి,
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే. ౧౧

[చివరశ్లోకములు రెండును కలసి యొక్క వాక్యమే. వానియందు చెప్పఁబడినకర్మ లన్నియు నాయా యింద్రియములయొక్క వ్యాపారములు. ఉదాహరణము.—విసర్జించుట గుదమార్గముయొక్కయు, కైకొనుట హస్తముయొక్కయు, కన్నులు త్రిప్పుట ప్రాణవాయువుయొక్కయు, చూచుట నేత్రముయొక్కయు వ్యాపారములు. "నే నేమియు చేయుట లేదు," అను వాక్యమున కింద్రియములను వానియిష్టానుసారముగఁ బ్రవర్తింపఁ జేయుట యనునర్థము కాదు. ఇఁక నేమన: 'నేను' అను నహంకారబుద్ధి వదలిపోవునేని యచేతనములగు నింద్రియములు స్వయముగనే చేతు పని చేయ నేర వనియు, స్వాధీనములుగనే యుండుననియు నర్థము. మనుజుఁడు జ్ఞాని యయినను శ్వాసోచ్ఛ్వాసములు మొదలుగాఁగల్గిన యింద్రియ వ్యాపారములను నింద్రియములు చేయుచునే యుండునని సారాంశము. వేయేల? క్షణమాత్రము జీవించియుండుట కర్మయే యగును. అటులయిన సన్న్యాసమార్గీయుఁడైనజ్ఞాని కర్మలను వదలివేయుచున్నాఁడనియు, కర్మయోగి చేయుచున్నాఁ డనియు భేద మెక్కడ నుండును? ఇరువురును కర్మలు చేయుచుండుటయే సంభవించును. కాని యహంకారయుక్త మగునాసక్తి వదలిపోవునేని యాకర్మలు బంధకములు కానందున నాసక్తిని వదలివేయుట యనునదియే వీనియందున్న ముఖ్యమగు విషయము. దానినే యిప్పుడు నిరూపించుచున్నాఁడు—]

(౧౦) బ్రహ్మార్పణము చేసి యాసక్తిశూన్యముగ కర్మలను జేయువానికి పద్మపత్రమునకు నీరంటుకొననట్లు పాప మంటుకొనదు. (౧౧) కాన కర్మయోగి (నేను చేయుచున్నా నను నహంకారబుద్ధిని వదలి) శరీరమాత్రముతోను, మనస్సుమాత్రముతోను, బుద్ధిమాత్రముతోను, ఇంద్రియమాత్రముతోను నాసక్తిని వదలి యాత్మశుద్ధ్యర్థమయి కర్మలను చేయుచునే యుండును.

[కాయికము, వాచికము, మానసికము మొదలుగాఁగల్గిన కర్మయొక్క భేదము ననుసరించి శరీరము, మనస్సు, బుద్ధి యనుశబ్దము లీశ్లోకమునందుఁ

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్,
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. ౧౨
సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్. ౧౩

చెప్పఁబడినవి. మూలములో, 'కేవలైః' అనువిశేషణము 'ఇంద్రియైః' అను శబ్దమునకు వెనుకనున్నను, అది శరీరమునకును, మనస్సునకును, బుద్ధికిని సైత మన్వయించును (గీ. ౪. ౨౧. చూడు). కాన భాషాంతరము చేయునపు డది శరీరశబ్దమునకువలెనే యితరశబ్దములకును వెనుకఁ జెప్పఁబడినది. పైన ౮-వ, ౯-వ శ్లోకములయందు చెప్పఁబడిన ట్లహంకారబుద్ధియందును, ఫలాశయందును నాసక్తి వదలి యొకకాయికములు, వాచికములు, మానసికములును మాత్రమే యగుకర్మలను చేసినను కర్తకు వానిదోషము తగులదని యర్థము. గీత. ౩. ౨౭; ౧౩. ౨౯ మఱియు ౧౮. ౧౬ చూడుము. అహంకారమును వదలినచో నొనర్చు కర్మలన్నియు నింద్రియసంబంధములు మాత్రమే యగును. మఱియు మనస్సు మొదలగు నింద్రియము లన్నియు ప్రకృతియొక్క వికారములే యైనందున నిట్టికర్మలయొక్క బంధనము కర్త కుండ దనునీయర్థము నిప్పుడు శాస్త్రానుసారముగ సిద్ధము చేయుచున్నాఁడు—]

(౧౨) యుక్తుఁ డగువాఁడు, అనఁగా: యోగయుక్తుఁ డగువాఁడు, కర్మఫలములను వదలివేసినందున తుదకు పూర్ణమగు శాంతిని పొందును; మఱియు అయుక్తుఁడగువాఁడు, అనఁగా : యోగయుక్తుఁడు కానివాఁడు, కామముయొక్క వాసనచే, అనఁగా సంబంధముచే, ఫలాశయందు సక్తుఁడైనందున (పుణ్యాపాపములచే) బంధింపఁబడును. (౧౩) సర్వకర్మలను మనస్సుచే (సాక్షాత్తుగఁ గాదు) సన్న్యసించిన జితేంద్రియుఁడగు దేహధారి (పురుషుఁడు) తొమ్మిదిద్వారములు గల్గిన యీ(దేహరూపమగు)నగరమునం దేమియు చేయకయు, నేమియు చేయింపకయు సుఖముగ నుండును.

[అనఁగా : జ్ఞాని ఆత్మ యనునది యకర్తయనియు, ఈనాట్యమంతయు ప్రకృతిసంబంధమే యనియు నెఱుంగును గాన స్వస్థుఁడుగ,లేక, యుదాసీనుఁడుగ నుండును (గీ. ౧౩. ౨౦ మఱియు ౧౮. ౫౯ చూడు). రెండు నేత్రములు, రెండుచెవులు, రెండునాసారంధ్రములు, నోరు, మూత్రేం

§§ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ౧౪
నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః,
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః. ౧౫

ద్రియము, మతేంద్రియము ననునవి శరీరముయొక్క తొమ్మిది ద్వారములని యెఱుంగవలయును. అది యట్లుండె నిమ్ము; కర్మయోగి కర్మలను చేసినను యుక్తుఁడెట్లగు ననువిషయమున నధ్యాత్మదృష్టితో సమాధానమునే చెప్పుచున్నాఁడు—]

(౧౪) ప్రభువు, అనఁగా నాత్మ, లేక, పరమేశ్వరుఁడు లోకుల కర్తృత్వమును గాని, కర్మలను గాని, కర్మఫలముల సంబంధమును గాని, నిర్మింపఁడు. స్వభావము, అనఁగా ప్రకృతియే (సమస్తమును) చేయుచున్నది. (౧౫) విభువు, అనఁగా సర్వవ్యాపి యగు నాత్మ, లేక, పరమేశ్వరుఁడు ఎవరియొక్కయు పాపమునుగాని, పుణ్యమును గాని పొందఁడు. జ్ఞాన మజ్ఞానమను ముసుఁగుచే నావరింపఁబడినందున (అనఁగా మాయచే) ప్రాణి మోహము నొందుచున్నాఁడు.

[ఈరెండు శ్లోకములయందు నున్న విషయము మూలభూత మగు సాంఖ్యశాస్త్రమందలి సిద్ధాంతము(గీతారహస్య. పు. ౨౧౯, ౨.౨౦, ౨౨౧ చూడుము). వేదాంతులయొక్క మతమునందు ఆత్మయన పరమేశ్వరుఁడే కాన, నాత్మ యకర్త యనువిషయమును వేదాంతులు పరమేశ్వరునకును సంబంధింపఁజేయుచున్నారు. సాంఖ్యులు, ప్రకృతియు-పురుషుఁడు నను రెండుతత్త్వములు గలవని చెప్పి కర్తృత్వమంతయు ప్రకృతిసంబంధమైనదే యనియు నాత్మ యుదాసీనుఁ డనియు చెప్పుదురు; కాని, వేదాంతులు వారికంటె కొంచెము మెక్కువగ నాలోచించి యీరెంటికి మూలభూతుఁడగువాఁ డొక నిర్గుణుఁ డగు పరమేశ్వరుఁ డనియు, అతఁడు సాంఖ్యులయొక్క యాత్మవలె నుదాసీనుఁడును నకర్త యనియు, కర్తృత్వమంతయు మాయయందే (అనఁగా : ప్రకృతియందే) యుండు ననియుఁ జెప్పుదురు (గీతార. పు. ౩౭౭). అజ్ఞానమూలమున సామాన్యమనుజుల కీవిషయము తెలియనేరదు; కాని, కర్మయోగి కర్తృత్వాకర్తృత్వసంబంధమగు నీభేదమును తెలిసికొన్నవాఁడగుటచే కర్మలు చేసినను నలిప్తుఁడుగనే యుండు నని యిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

§§ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. ౧౬

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. ౧౭

§§ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః. ౧౮

(౧౬) కాని యజ్ఞానమును స్వీయమగు జ్ఞానముచేఁ బోఁగొట్టుకొనినవారి జ్ఞానము సూర్యునివలె పరమార్థతత్త్వమును ప్రకాశింపఁజేయుచున్నది. (౧౭) మఱియు నాపరమార్థతత్త్వమందే బుద్ధి లీనమై యంతఃకరణము దానియందే రమించుటంజేసి తన్నిష్ఠులు తత్పరాయణులు నగువారియొక్క పాపము జ్ఞానముచే నిశ్శేషముగ దగ్ధ మగును. అట్టివారికి పునర్జన్మము లేదు.

[ఇట్లుజ్ఞానము నశించినకర్మయోగులయొక్క (సన్న్యాసులయొక్క గాదు) జీవన్ముక్తి యనెడి యవస్థ నిప్పు డధికముగ వర్ణించుచున్నాఁడు—]

(౧౮) పండితులగు (జ్ఞానులగు) వారియొక్క దృష్టి విద్యావినయయుక్తుఁడగు బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుఁగునందును, కుక్కయందును, చండాలునందును సమానముగనే యుండును. (౧౯) ఈరీతిగ సామ్యావస్థయందు స్థిరమైన మనస్సుగలవారీజన్మమందే మృత్యులోకమును జయించుచున్నారు. కారణమేమన: బ్రహ్మము నిర్దోషము సమమును కాన (సామ్యబుద్ధిచే) నీపురుషుఁడు (ఎప్పుడును) బ్రహ్మమందే యుండును, అనఁగా: అక్కడనే బ్రహ్మభూతుఁడై యుండును.

[ఆత్మస్వరూపుఁడగు పరమేశ్వరుఁ డకర్త యనియు, వ్యవహార మంతయు ప్రకృతియే చేయు ననియు తెలిసికొనినవాఁడు 'బ్రహ్మసంస్థుఁ' డగును. అతనికి మోక్షము గలుగును.—"బ్రహ్మసంస్థో ఽమృతత్వ మేతి" (ఛాం. ౨. ౨౩. ౧)—అని యుపనిషత్తులలో నైతము చెప్పఁబడినది. అయినను నీయవస్థయందును కర్మలు వదలవని గీతయొక్క యభిప్రాయమని పైనున్న ౧, ౧౨ శ్లోకములం బట్టి స్పష్టమగును. ఛాందోగ్యోపనిషత్తునందున్న వాక్యమునకు శంకరాచార్యులవారు సన్న్యాసపరముగ నర్థమును జేసిరి. దానికి మూలభూత మగునుపనిషత్తునందున్న పూర్వాపర

ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః. ౧౯

న ప్రహృష్యేత్ప్రియంప్రాప్యనోద్విజేత్ప్రాప్యచాప్రియమ్,
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః. ౨౦

బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని య త్సుఖమ్,
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. ౨౧

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః. ౨౨

సందర్భమును జూచితిమేని బ్రహ్మసంస్థుఁడైనతర్వాత సైత మాశ్రమత్రయ కర్మలను చేయుట నుద్దేశించియే యీవాక్యము చెప్పఁబడి యుండవచ్చు నని తోఁచును. మఱియు నీయర్థమే యుపనిషత్తులయొక్క సమాప్తియందు స్పష్టముగ నిరూపింపఁబడినది (ఛాం. ౮. ౧౫. ౧ చూడు). బ్రహ్మజ్ఞానము గలిగినపిదప నీయవస్థ జీవించి యుండఁగనే ప్రాప్తమగుటచే దీనినే జీవన్ముక్తావస్థ యని చెప్పుచున్నారు (గీతార. ప్ర. ౧౦. పు. ౪౧౦ చూడు). ఇదియే యధ్యాత్మవిద్యకు పరమావధియై యున్నది. చిత్తవృత్తి నిరోధరూప మగుయోగసాధనముచే కలుగునట్టి యీయవస్థయే ముందు రాఁబోవునధ్యాయమునందు సవిస్తరముగఁ జెప్పఁబడినది. ఈయధ్యాయమునం దీయవస్థమాత్రమే విశేషముగ వర్ణింపఁబడినది.]

(౨౦) ప్రియము, అనఁగా ఇష్టమైన వస్తువు ప్రాప్తమైనపిదప నానందమును జెందఁగూడదు. మఱియు అప్రియము ప్రాప్తమయినప్పుడు ఖేదము నొందఁగూడదు. (ఇట్టి) స్థిరమైనబుద్ధి గల్గి మోహమును జెందని పురుషుఁడే బ్రహ్మవేత్త యనియు, బ్రహ్మమందు స్థితుఁ డనియు (చెప్పవలయును). (౨౧) బాహ్యపదార్థములతో (ఇంద్రియములకుఁ గల్గు) సంయోగమునందు, అనఁగా: విషయోపభోగమునందు, ఆసక్తము గాని మనస్సు గలవానికే యాత్మయందున్న సుఖము లభించును. (౨౨) బాహ్యపదార్థములయొక్క సంయోగముచేతనే కలుగు భోగములను నాదియు నంతమును కలిగినవి దుఃఖములకే కారణములగును. ఓకౌంతేయా!

శక్నో తీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ౨౩
§§ యోఽన్తఃసుఖోఽన్తరారామస్తథాఽన్తర్జ్యోతిరేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. ౨౪
లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః. ౨౫
కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్,

వానియందు బుద్ధిమంతుఁడు తత్పరుఁడు కాఁడు. (౨౩) శరీరమును విడిచిపెట్టు వఱకును, అనఁగా: ఆమరణాంతమును కామక్రోధములచేఁ గలుగు వేగము నిహలోకమునందే సహించుటకు (ఇంద్రియసంయమనముచే) సమర్థుఁడగువాఁడే యుక్తుఁడును (నిజమైన) సుఖియు నగును.

[గీతలయందలి రెండవయధ్యాయమునందలి సుఖదుఃఖములను నీవు సహించుకొనవలయునని భగవంతుఁడు సెప్పిన విషయమే (గీ. ౨. ౧౪.) యిచ్చో విస్తృతముగ నిరూపింపఁబడినది. గీ. ౨. ౧౪-వ శ్లోకమునందు సుఖదుఃఖములకు 'ఆగమాపాయినః' అనునొక్క విశేషణము వేయఁబడినది. ఇక్కడ ౨౨-వ శ్లోకమున 'ఆద్యంతవంతః' అనువిశేషణము వేయఁబడినది. మాత్రాశబ్దమునకు బదులుగ నెవరిని యుక్తుఁడని చెప్పవలయునో దీనియందే చెప్పఁబడినది. సుఖదుఃఖములను వదలక సమబుద్ధితో సహించుట యనునదియే యుక్తము నిజమగులక్షణము. గీత. ౨. ౬౧ మీఁద టీకను జూడుము.]

(౨౪) ఇట్లు(బాహ్యములగు సుఖదుఃఖముల నపేక్షింపక) అంతఃకరణమునందే సుఖము ననుభవించువాఁడును, తనలో తానే యారామము నొందువాఁడును, అంతఃప్రకాశము నొందినవాఁడు నగు (కర్మ-) యోగి, బ్రహ్మరూపుఁడగును. అతనికే బ్రహ్మనిర్వాణము, అనఁగా: బ్రహ్మమందు కలిసికొనుట యను మోక్షము ప్రాప్త మగును. (౨౫) ఏఋషీశ్వరులకు ద్వంద్వబుద్ధి వదలినదో, అనఁగా: అన్నివస్తువులయందును నొకపరమేశ్వరుఁడే యున్నాఁ డనుతత్త్వము తెలిసినదో, యెవరిపాపములు నశించినవో, యెవ్వరాత్మసంయమనముచే సర్వభూతములకును హితము చేయుటయందు తత్పరులైరో, వారికి బ్రహ్మనిర్వాణరూప

అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. ౨౬
స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాంతరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ. ౨౭
యతేంద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః,
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః ౨౮
§§ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్,

మగు మోక్షము లభించును. (౨౬) కామక్రోధరహితుఁడును, ఆత్మసంయమనము గలవాఁడును, ఆత్మజ్ఞానసంపన్నుఁడు నగుయతికి అభితః, అనగా: అంతటను, లేక, యెదుట నుంచినట్లు, అనఁగా : కూర్చున్నప్రదేశమునందే బ్రహ్మనిర్వాణరూపమగు మోక్షము లభించును. (౨౭) బాహ్యపదార్థములతో (ఇంద్రియముల యొక్క సుఖదుఃఖదములగు) సంయోగములను లక్ష్యము చేయక, దృష్టిని కనుబొమ్మల మధ్యనుండి, మఱియు ముక్కునుండి బయటికి వచ్చుచున్న ప్రాణమును, అపానమును సమానముగ చేసినట్టియు, (౨౮) ఇంద్రియములు, మనస్సు, బుద్ధి యను వానిని సంయమించినట్టియు, ఇచ్ఛ, భయము, క్రోధము నను వానిని విడిచినట్టియు, మోక్షపరాయణుఁ డగునట్టియు ముని యెప్పుడును ముక్తుఁ డనియే చెప్పవలయును.

[ఈవిషయము జీవన్ముక్తావస్థను సంబంధించినదని గీతారహస్యమునందలి తొమ్మిదవ (పు. ౩౧౩, ౩౪౧) మఱియు (పదియవ పు. ౪౧౧) ప్రకరణములయందును స్పష్టముగఁ గాన్పించును ; కాని యది సన్న్యాసమార్గము నవలంబించినపురుషునియవస్థ యని టీకాకారులు చెప్పినసంగతిమాత్రము మాకు సమ్మత మయినది కాదు. సన్న్యాసము, కర్మయోగము నను నీరెండు మార్గములయందును శాంతియొకవిధముగనే యుండు ననిమాత్రమే చెప్పుదుము; కాని యీవిషయము సన్న్యాసమార్గమునకే సంబంధించును, దానికి సంబంధింపదని చెప్పము; కాని యీయధ్యాయారంభమునందు కర్మయోగము శ్రేష్ఠ మని నిశ్చయింపఁబడినపిదప ౨౫-వ శ్లోకమునందు జ్ఞాని సర్వభూతములకు హితము చేయుటయందు ప్రత్యక్షముగ తత్పరుఁడై యుండునని చెప్పుటంబట్టి యిది యంతయు కర్మయోగి జీవన్ముక్తినిగుఱించి చెప్పఁబడినదే కాని సన్న్యాసినిగుఱించి చెప్పఁబడినది కాదని స్పష్టముగ

సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాంశాంతిమృచ్ఛతి. ౨౯

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సన్న్యాసయోగోనామ
పంచమోఽధ్యాయః. ౫.

---

సిద్ధమగుచున్నది(గీ. ర. పు. ౫౧౪ చూడు).అది యట్లుండనిమ్ము; కర్మమార్గమునందు సైతము సర్వభూతాంతర్గతుఁడగు పరమేశ్వరుని తెలిసికొనుటయే పరమసాధ్యమగుటచే, భగవంతుఁడు తుదకు చెప్పిన దేమన—]

(౨౯) (సర్వ)యజ్ఞములకును తపస్సులకును ఫోక్తను, (స్వర్గము మొదలుగాఁగల) సర్వలోకములకును గొప్పయధిపతిని,సర్వభూతములకును స్నేహితుఁడను నైనట్టి నన్ను (ఈవిధమున) తెలిసికొనునేని శాంతి నొందుచున్నాఁడు.

ఈరీతిగ శ్రీభగవంతునిచే గానము చేయఁబడిన(చెప్పఁబడిన) యుపనిషత్తులయందు బ్రహ్మవిద్యాంతర్గతమైనయోగ-అనఁగా : కర్మయోగ—శాస్త్రమందలి శ్రీకృష్ణార్జునుల సంవాదమునందు సన్న్యాసయోగ మనుపేరు గల యయిదవ యధ్యాయము సమాప్తమయినది.



# షష్ఠోఽధ్యాయః.

---

శ్రీ భగవానువాచ.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,

## ఆఱవయధ్యాయము.

[మోక్షప్రాప్తికి జ్ఞానముదక్క మఱియొకటి యేమియు నవసరము లేకపోయినను లోకసంగ్రహ మనుదృష్టిచే జ్ఞాని జ్ఞానము గలిగినపిదప సైతము కర్మలు చేయవలయును; కాని యవి బంధకములు కాకుండు నిమిత్తమై ఫలాశను వదలివేయునట్టిసమబుద్ధితో వానిని చేయుటకే కర్మయోగ మని పేరనియు, కర్మసన్న్యాసమార్గముకంటె నిది మిక్కిలి శ్రేయస్కరమనియుమాత్రమే సిద్ధమైనది. అయినను నింతమాత్రముచే కర్మయోగము సంపూర్ణముగఁ బ్రతిపాదింపఁబడలేదు. మూఁడవయధ్యాయము నందే కామక్రోధముల వర్ణించుచు నీశత్రువులు మనుజునియొక్క యింద్రియములు, మనస్సు, బుద్ధి వీనియందు నివసించి యతనియొక్క జ్ఞానవిజ్ఞానములను నశింపఁజేయుచున్నారు. (3. 40) కాన నింద్రియనిగ్రహముచే వీనిని నీవు మొదట జయింపు మని భగవంతుఁ డర్జునునకు చెప్పెను. ఈయుపదేశము సంపూర్ణమగుటకై (1) ఇంద్రియనిగ్రహ మెట్లు చేయవలయునో, (2) జ్ఞానవిజ్ఞానము లన నేవియో స్పష్టీకరించుట యావశ్యకమై యున్నది; కాని నడుమనున్నయర్జునుని ప్రశ్నమును బట్టి కర్మసన్న్యాసము, కర్మయోగము ననునీరెంటియందును మిక్కిలి మంచి మార్గ మేదో దానిని చెప్పి యీరెండుమార్గములకు నైక్య మగునంతే నేక వాక్యతయును జేసి నిరూపింపఁబడినది. మఱియు కర్మలు వదలిపెట్టక పోయినను నవి నిస్సంగబుద్ధితో చేయఁబడుటచే బ్రహ్మనిర్వాణరూపమగు మోక్ష మెటుల ప్రాప్త మగుననునది మొదలుగాఁ గలవిషయములు ప్రతిపాదింపఁబడినవి. ఇపుడు కర్మయోగమునకు నవశ్యము సంబంధించు నీని

న సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్న చాక్రియః. ౧
యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ,
న హ్యసన్న్య స్తసంకల్పో యోగీ భవతి కశ్చన. ౨

[సంగమగు, లేక, బ్రహ్మనిష్ఠమగు స్థితి, యేసాధనముచే సంపాదించుకొనుటకు శక్యమగునో దానిని నిరూపించుట కీయధ్యాయమారంభింపఁబడినది. అయినను నీనిరూపణముసైతము పాతంజలయోగమును స్వతంత్రముగ నుపదేశించుటకు చేయఁబడినది కాదని తెలిసికొనుటకై నిజమైన సన్న్యాసి, అనఁగ : ఫలాశను వదలి కర్మలు చేయువాఁడు గాని, కర్మలను వదలివైచువాఁడు కాఁడనియు తెలిసికొనవలయు ననునది (౫.౩) మొదలుగాఁగల పూర్వాధ్యాయమునందుఁ బ్రతిపాదింపఁబడినవిషయములే యిక్కడ ననువదింపఁబడుచున్నవి:—]

(౧) కర్మఫలము నాశ్రయింపక (అనఁగా: ఫలాశను మనస్సునందు స్థిరపడనీయక) ఎవఁడు (శాస్త్రానుసారముగ తనకు విహితమగు) కర్తవ్యకర్మల చేయుచున్నాఁడో యతనినే సన్న్యాసి యనియు, కర్మయోగి యనియును చెప్పవలయును. నిరగ్నిః, అఁనగా: అగ్నిహోత్రాదికర్మలను వదలివేయువాఁడుగాని, లేక, అక్రియుఁడు గాని, అనఁగా : ఏకర్మలను చేయక స్వస్థముగఁ గూర్చుండువాఁడు గాని (నిజమగు సన్న్యాసియు, కర్మయోగియు) కాఁడు. (౨) ఓపాండవా ! దేనిని సన్న్యాసమని చెప్పుచున్నారో అదియె (కర్మ-) యోగ మని తెలిసికొనుము. కారణ మేమన : సంకల్పమును, అనఁగా, కామ్యబుద్ధిరూపమగు ఫలాశను సన్న్యసించిన (త్యజించిన)ఁ గాని (కర్మ-) యోగి కానేరఁడు.

[పూర్వాధ్యాయమునందు "ఏకం సాంఖ్యం చ యోగం చ" (౫.౫) అనియు,"యోగము తప్ప వేఱుసన్న్యాసము లేదు"(౫.౬) అనియు,లేక "జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ" (౫. ౩) అనియు చెప్పఁబడినదానికే యిది యనువాదము. ముందు పదునెనిమిదవ యధ్యాయమునందును (౧౮. ౨) మొత్తముపై నున్నవిషయము నుపసంహరించుచు నీవిషయమే మరలఁ జెప్పఁబడినది. గృహస్థాశ్రమమునందు అగ్నిహోత్రము నుంచుకొని యజ్ఞయాగాదులను చేయవలసివచ్చును; కాని సన్న్యాసాశ్రమమునఁ బ్రవేశించినవారికి నట్లగ్నిహోత్రముల గాపాడుకొనవలసిన యవసరము లేదు. అతఁడు 'నిరగ్ని'గ నుండవలయును. మఱియు నరణ్యమున నుండి భిక్షాటనముచే పొట్టపోసికొనవలయును. ప్రాపంచికవ్యవహారములయందు

ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే.     3

[ప్రవేశింపఁగూడదని, అని మనుస్మృతియందు చెప్పఁబడినది. (మను. ౬. ౪౩.౪౪.) మను మతముననే మొదటి శ్లోకమునందు చెప్పియుండుటచే నిరగ్నిగను, నిష్క్రియుఁడుగను నుండుట నిజమైన సన్న్యాసలక్షణము కాదని భగవంతుఁడు దానిపై యుక్తిని చెప్పుచున్నాఁడు. కామ్యబుద్ధిని, అనఁగా: ఫలాశను త్యజించుటయే నిజమైనసన్న్యాసము. సన్న్యాసము బుద్ధియందున్నది కాని యగ్నినిగాని, కర్మలను గాని వదలివేయుట యను బాహ్యక్రియలయందు లేదు. కాన ఫలాశను, అనఁగా: సంకల్పమును త్యజించి కర్తవ్యకర్మను చేయువానినే నిజమగు సన్న్యాసి యని చెప్ప వలయును. గీతయొక్క యీసిద్ధాంతము స్మృతికారుల సిద్ధాంతముకంటె వేఱుగ నున్నందున వారియొక్క స్మార్తమార్గముతో గీతకు నేకవాక్యత నెట్లు చేయవలయునో గీతారహస్యమునందలి పదునొకండవప్రకరణము నందు (పు. ౪౭౭-౪౭౩) స్పష్టముగ నిరూపింపఁబడినది. ఇట్లు నిజమైన సన్న్యాసి యెవరైనదియు చెప్పి జ్ఞానము గలుగక మునుపు, అనఁగా: సాధనావస్థయందు, చేయఁబడు కర్మలయందును, జ్ఞానము గలిగినపిదప, అనఁగా సిద్ధావస్థయందు ఫలాశను వదలి చేయఁబడు కర్మలయందును నున్న భేదమును చెప్పుచున్నాఁడు.—]

(3) (కర్మ-) యోగారూఢుఁడు కావలయునని యిచ్ఛయించుమునికి కర్మ యనునది (శమమునకు) కారణము, అనఁగా: సాధన మని చెప్పఁబడినది; మఱియు నాపురుషుఁడే యోగారూఢుఁ డగునేని, అనఁగా : పూర్ణుఁడైనయోగి యగునేని యతనికి శమమే (కర్మకు) కారణ మగునని చెప్పఁబడును.

[ఈశ్లోకమునకు టీకాకారులు వారియిష్టానుసారముగ నర్థము చేసిరి. శ్లోకముయొక్క పూర్వార్థమందున్న యోగశబ్దమునకు కర్మయోగమే యర్థమైనందున నది సిద్ధించుటకు కర్మయే కారణ మగు ననువిషయ మందఱకును సమ్మతమే, కాని "యోగారూఢుఁడైనపిదప నతనికి శమమే కారణ మగును," అనుదానికి టీకాకారులు సన్న్యాసపరముగ నర్థము చెప్పిరి. 'శమము' అనఁగా, కర్మయొక్క 'యుపశమము'; యోగసిద్ధు లయినవారు కర్మను వదలివేయవలయునని వారు చెప్పుదురు. కారణ మేమన: వారిమత

ములో కర్మయోగమనునది సన్న్యాసమునకు నంగము, అనఁగా: మొదటిసాధనమైయున్నది; కాని యీయర్థము సాంప్రదాయిక మగు నాగ్రహముచే చేయఁబడినది; కాని సత్యమయినది కాదు. కారణ మేమన: (౧) కర్మఫలమును గోరక, 'కర్తవ్యకర్మను' జేయు పురుషుఁడే నిజమగు యోగి, అనఁగా, యోగారూఢుఁ డగును. కర్మలను చేయనివాఁడు (అక్రియుఁడు) నిజమయిన యోగికాఁ డని యీయధ్యాయమునందలి ప్రథమశ్లోకమునందే భగవంతుఁడు చెప్పినచో మూఁడవశ్లోకమునందు యోగారూఢునకు కర్మయొక్క శమమును జేయవలయునని లేక, కర్మలను వదలివేయవలయునని భగవంతుఁడు చెప్పినాఁ డని చెప్పుట బొత్తిగ నన్యాయ్యముగ నుండును. శాంతి గలిగినపిదప యోగారూఢుఁడు కర్మ చేయఁగూడదని సన్న్యాసమార్గీయులమత మయినను గీతకు నీమతము సమ్మతము కానందున కర్మయోగి సిద్ధావస్థయందు సైతము యావజ్జీవము భగవంతునివలె నిష్కామ బుద్ధితో కర్మల నన్నింటిని కర్తవ్యము లనుతలంపున మాత్రము చేయుచునే యుండవలయు నని యనేక ప్రదేశములయందు స్పష్టముగ నుపదేశింపఁబడినది(గీ. ౨. ౭౧;౩. ౭ మఱియు౧౯;౪. ౧౯-౨౧;౫. ౭-౧౨;౧౨. ౧౨;౧౮. ౫౬, ౫౭; మఱియు గీతారహస్య. ప్ర. ౧౧ మఱి ౧౨ చూడు). (౨) రెండవ కారణమేమన: 'శమము' అనుశబ్దమునకు 'కర్మయొక్క శమము', అను నర్థ మెక్కడనుండి వచ్చినది? 'శమ'శబ్దము భగవద్గీతయందు మూఁడునాల్గు స్థలములయందు ప్రయోగింపఁబడినది. (గీ. ౧౦. ౪; ౧౮. ౪౨.) ఆస్థలములయందును, వ్యవహారమునందును దానికి 'మనశ్శాంతి' యని యర్థము కన్పట్టుచున్నది; కాని యీశ్లోకమునందె 'కర్మయొక్క శాంతి'యని యర్థమేల చేయవలయును? అనుశంకను నిరాకరించుటకై గీతలకు పైశాచభాష్యములో "యోగారూఢస్య తస్యైవ" యనుశ్లోకమునందలి "తస్యైవ" యను సర్వనామమును 'యోగారూఢ'శబ్దముతో నన్వయింపక, 'తస్య' అనుశబ్దము నపుంసకలింగశబ్దమునకు వచ్చిన షష్ఠీవిభక్తియని యనుకొని "తస్యైవ కర్మణ శ్శమః" (తస్య అనఁగా: పూర్వార్థమందు చెప్పఁబడిన కర్మయొక్క శమము) అని యర్థము చేయఁబడినది! కాని యీయన్వయము సరళమైనది కాదు. కారణ మేమన: యోగాభ్యాసము చేయునట్టి యేపురుషునియొక్క వర్ణన యీశ్లోకముయొక్క పూర్వార్థమందు చేయఁబడినదో యతనికే తర్వాత, అనఁగా: అభ్యాసము పూర్ణమైనపిదప, స్థిర

మగు స్థితిని చెప్పుటకై యుత్తరార్ధ మారంభింపఁబడిన దనువిషయమునయి సందేహ మేమియును లేదు. కాన 'తస్యైవ' అనుపదమునకు 'కర్మణః ఏవ' అనునర్థము చేయుటకు వీలుఁ లేదు. ఒకవేళ నట్లు చేసికొందుమేని దానిని 'శమ'పదముతో నన్వయింపక "కారణ ముచ్యతే" అనుపదముతో నన్వయించితి మేని "శమః యోగారూఢస్య తస్యైవ కర్మణః కారణ ముచ్యతే" అని యన్వయించుటచే దానికి "శమ మనునది యోగారూఢునియొక్క కర్మకే కారణ మగు"నని గీతయందు పొత్తముమీఁద నున్న యుపదేశము ననుసరించుటచే సరియైన యర్థము కుదురదు. (3) టీకాకారులయర్థము నొప్పుకొనకూడ దనుటకు మూఁడవ కారణ మేమన: సన్న్యాసమార్గానుసారముగ, యోగారూఢునకు తర్వాత కర్తవ్య మేమియును గుండ నేరదు, శమమునంతె యతనికర్మ లన్నియును పరిసమాప్తి యగు నను విషయము సత్యమయినచో 'యోగారూఢునకు శమము కారణమగు'ననువాక్యమందలి యీ'కారణ'శబ్దము బొత్తిగ నిరర్థకమగును. 'కారణశబ్ద' మెల్లపుడును నితరాపేక్ష గల్గినదే. 'కారణ' మనఁగనే దానికి 'కార్య' మేదియో యొకటి యుండవలయును. మఱియు సన్న్యాసమార్గానుసారముగ యోగారూఢునకు కర్మ యేమియును చేయవలసినదిగా నుండదు. శమము మోక్షమునకు సాధన మని చెప్పితి మేని యది సంబంధింపదు. కారణ మేమన: మోక్షమునకు జ్ఞానము సాధనము కాని శమము కాదు. మంచిది! శమము జ్ఞానప్రాప్తికి కారణము (సాధనము) అని చెప్పితిమేని యోగారూఢునిగుఱించియే, అనఁగా: పూర్ణావస్థ నొందినవానిగుఱించియే యిక్కడ జెప్పఁబడుచున్నది. గాన నతనికి జ్ఞానప్రాప్తికర్మ యనెడిసాధనముచే పూర్వము సందే యయి యుండవచ్చును. ఇఁక శమము దేనికి 'కారణ' మగును? అను ప్రశ్నకు సన్న్యాసమార్గీయులగు టీకాకారు లేవిధమైన సమాధానమును చెప్పుటకు వీలు లేదు; కాని వారియొక్క యీయర్థమును వదలి, విచారించితిమేని యుత్తరార్ధమున కర్థము చేయునపుడు పూర్వార్ధమందున్న 'కర్మ' పదము సాన్నిధ్యసామర్థ్యముచే సహజముగ మనస్సున స్ఫురించును; కాని యోగారూఢునకు స్వార్థము లేకపోయినను లోకసంగ్రహార్థ మగుకర్మ త్యాజ్యము కామిచే(గీ.3.౧౭-౧౯ చూడు)దానిని చేయుటకు'శమ'మనునది 'కారణము,అనఁగా:సాధన మని యర్థ మిప్పుడు నిష్పన్నమగుచున్నది."యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్"(గీ.౫.౧౨)—యోగి

కర్మఫలమును త్యజించుటచే పూర్ణమగు శాంతి నొందును — అని పూర్వాధ్యాయమునందు చెప్పఁబడినవచనమును బట్టియు నీయర్థమే సిద్ధ మగుచున్నది. కారణ మేమన: దానియందు శాంతికి కర్మత్యాగముతో సంబంధము చెప్పక కేవలఫలాశను మాత్రము త్యజించుటతోనె చెప్పఁబడినది. అక్కడనే యోగిచే చేయఁబడుకర్మసన్న్యాసము 'మనసా' అనఁగా: మనస్సుచే చేయఁబడవలయును.(గీ. ౫. ౧౩)శరీరముతో, అనఁగా: ఇంద్రియములతో మాత్ర మతఁడు కర్మలను చేయుచుండవలయునని స్పష్ట మగుచున్నది.మామతమున నలంకారశాస్త్రమునం దన్యోన్యాలంకారమును చెప్పుచున్న ట్లర్థచమత్కృతి, లేక, సౌరస్యము ప్రస్తుతశ్లోకమునందు సాధింపఁబడినది. పూర్వార్ధమందు కర్మము 'శమము'నకు ఎప్పుడు కారణ మగునో చెప్పిన పిదప దానిని విపరీతముగ 'శమ' మనునది 'కర్మకు' నెప్పుడు కారణ మగునదియు, నుత్తరార్ధమందు చెప్పఁబడినది. మొదట సాధనావస్థయందు 'కర్మ' యేశమమునకు,అనఁగా:యోగసిద్ధికి కారణ మగునని భగవంతుఁడు సెప్పెను. అనఁగా: యథాశక్తి నిష్కామకర్మలను జేయుచుండుటచే చిత్తము శాంత మగుటయు, దానివలన తుదకు యోగసిద్ధి గల్గుటయు సంభవించును; కాని యోగి యోగారూఢుఁడయి సిద్ధావస్థకు చేరె నేని కర్మమునకును, శమమునకు నుండు కార్యకారణభావము మాఱును గాన, కర్మ శమమునకు కారణము కాదు. శమమే కర్మకుఁ గారణ మగును. అనఁగా:యోగారూఢుఁడు తనసర్వకర్మలను కర్తవ్యము లని ఫలాశను వదలి శాంతచిత్తముతోఁ జేయుచునే యుండు నని తాత్పర్యము. సిద్ధావస్థయందు కర్మలు వదలిపెట్టవలయు నని యీశ్లోకమునకు భావార్థము కాదనియు, 'కర్మ'మునకు 'శమ'మునకును మధ్య నున్న సాధనావస్థయందలి కార్యకారణభావమే సిద్ధావస్థయందు మాఱుననియు గీత చెప్పుచున్నదని యిందలిసారాంశము. (గీతా. ర. ప్ర. ౧౧. పు. ౪౪౩-౪౪౫ చూడు) కర్మయోగి తుదకు కర్మలను వదలి వేయవలయునని గీతయం దెక్కడను చెప్పఁబడలేదు. మఱియు గీతల కట్టి యుద్దేశము లేదు. కాన సందు దొరకినప్పుడెల్ల నేదో యొక సంబంధమును కల్పించుకొని,గీతలలో నున్న యొకానొకశ్లోకమునకు సన్న్యాసపరముగ నర్థముం జెప్పకూడదు. గీతార్థము ప్రస్తుతమునం దనేకులకు దుర్బోధముగ నుండుట కిదియే కారణము. యోగారూఢుఁడు కర్మలను చేయవలయు ననునర్థమే ముందుశ్లోకమును బట్టియు, వ్యాఖ్యానమును బట్టియు వ్యక్త మగుచున్నది.—]

యదా హి నేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. ౪
§§ ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః. ౫
బంధు రాత్మాఽఽత్మన స్తస్య యే నాత్మైవాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్. ౬

(౪) కారణమేమన: ఎప్పుడింద్రియములకు (శబ్దస్పర్శాది)విషయములతోడను, కర్మలతోడను ననుషంగ ముండదో, యెప్పుడు సర్వసంకల్పములను,అనగా: కామ్యబుద్ధిరూపమగు ఫలాశను—(సాక్షాత్కర్మలను కాదు)సన్న్యాసము చేయునో యప్పు డతనిని యోగారూఢుం డని చెప్పుదురు.

[ఈశ్లోకము వెనుకటిశ్లోకముతో సంబంధించినదే యనియు, వేరే ల? ముందున్నమూడుశ్లోకములను సంబంధించియున్న దనియు సైతము చెప్ప వచ్చును. దీనినిబట్టి యోగారూఢుండు కర్మలను వదలివేయక ఫలాశను మాత్రమే కాని, కామ్యబుద్ధిమాత్రమే కాని వదలి, శాంతచిత్తముతో నిష్కామకర్మలను చేయుచునే యుండవలయునని గీతాభిప్రాయ మయి నట్లు స్పష్ట మగుచున్నది. 'సంకల్పముయొక్క సన్న్యాస' మనుశబ్దము పైన రెండవశ్లోకమునందు ప్రయోగింపఁబడియున్నది. కాన నచ్చే నున్న యర్థమునే యీశ్లోకమునందును గ్రహింపవలయును. ఫలాశాత్యాగరూప మగు సన్న్యాసము కర్మయోగమునందే చేరును. కాన ఫలాశను వదలి కర్మలను చేయువాఁడె నిజమయిన సన్న్యాసి యనియు, అనఁగా: యోగారూఢుఁడనియు చెప్పవలయును. ఇప్పుడిట్టి నిష్కామకర్మయోగము గాని, లేక, ఫలాశాసన్న్యాసముగాని సిద్ధమగుట యనువిషయము ప్రతి మనుజునకు స్వాధీనముగనే యున్నది. స్వయముగ ప్రయత్నించెనేని యతని కది సిద్ధింపకపోదని చెప్పుచున్నాఁడు.—]

(౫) (మనుజుఁడు) తనంతట తానే తన్నుద్ధరించుకొనవలయును. తాను తన్ను (ఎప్పుడును) చెడఁగొట్టుకొనగూడదు. కారణ మేమన. (ప్రతిమనుజుఁడును) తనకు తానే బంధువు (అనఁగా: సహాయముచేయువాఁడు) గాని,శత్రువు గాని యగును (అని చెప్పఁబడినది). (౬) ఎవఁడు తనను తానే జయించెనో వాఁడు తనకు తానే బంధువగుచున్నాఁడు. ఎవఁడు తనను, తానె తెలిసికొనలేఁడో, వాఁడు తనకు తానే శత్రు వగుచున్నాఁడు.

§§ జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానాపమానయోః. ౭

[ఈరెండు శ్లోకములయందును నాత్మస్వాతంత్ర్యము చెప్పఁబడినది. కాన ప్రతిమనుజుఁడును తన్ను తానే యుద్ధరించుకొనవలయును. మఱియు ప్రకృతియెంత బలవత్తర మయినదయినను, దానిని జయించి యాత్మోన్నతిని గలుగఁజేసికొనుట యనువిషయము తమతమ స్వాధీనముగనే యున్న దనునది ప్రతిపాదింపఁబడినది. (గీతా. ర. ప్ర. ౧౦. పు. ౩౮౧-౩౮౭ చూడు) ఈవిషయము బాగుగ ననుభవములోనికి రావలయునను నూహతో నొకసారి యన్వయముఖముగను, అనఁగా: తంకే తాను మిత్రుఁడెప్పు డగునదియు మఱియొకసారి వ్యతిరేకముగను, అనఁగా: తనకు తాను శత్రు వెప్పు డగునదియు చెప్పఁబడినది. మఱియు నీవిషయమే మరల ౧౩. ౨౮ శ్లోకమునందును జెప్పఁబడినది. సంస్కృతమునం 'ఆత్మ' శబ్దమునకు (౧) అంతరాత్మ యనియు, (౨) తా ననియు, (౩) అంతఃకరణము, లేక, మనస్సనియు మూఁడర్థములు గలవు. ఆత్మశబ్ద మిక్కడను, ముందున్నశ్లోకములయందును ననేకపర్యాయములు ప్రయోగింపఁబడినవి. ఆత్మను స్వాధీనముగ నుంచుకొనుటచేఁ గలుగు ఫలము నిప్పుడు చెప్పుచున్నాఁడు—]

(౭) తనయాత్మను, అనఁగా,అంతఃకరణమును జయించినవానియొక్కయు, శాంతికలిగినవానియొక్కయు 'పరమాత్మ' శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానాపమానములు అనువానియందు సమాహితమైనది, అనఁగా: సమమైనదియు, స్థిరమైనదియు నగుచున్నది.

[ఈశ్లోకమునందు 'పరమాత్మ' శబ్దము ఆత్మ యనునర్థమునందే ప్రయోగింపఁబడినది. దేహమునందున్న యాత్మ సామాన్యముగ సుఖదుఃఖోపాధులయందు మగ్నమై యుండును; కాని యింద్రియసంయమనము చేత నుపాధిని జయించినపిదప నీయాత్మయే ప్రసన్నముగ నుండును; గాన పరమాత్మరూపమయినది, లేక, పరమేశ్వరరూప మయినది యగుచున్నది. పరమాత్మ యనునది యాత్మకంటె వేఱగురూపముగల్గిన పదార్థము కాదు మానుషశరీరమునందున్న యాత్మయే నిజముగ పరమాత్మ యగుచున్నది; ముందు గీతలయందే (గీ. ౧౩. ౨౨ మఱియు ౩౧) చెప్పఁబడియున్నది మహాభారతమునందు సైతము—]

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. ౮
సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు,
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే. ౯

ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః,
తైరేవ తు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః.

"ఆత్మయే ప్రాకృతమైన, అనఁగా: ప్రకృతిసంబంధములైన గుణములతో (అనఁగా: సుఖదుఃఖములు మొదలుగాఁ గలవికారములతో) బద్ధమై యుండెనేని క్షేత్రజ్ఞుఁడు, లేక, శరీరమందున్నజీవాత్మ యని చెప్పఁబడును. ఈగుణములనుండి దానికి విముక్తి గల్గునేని యదియే పరమాత్మ యగును" అని చెప్పఁబడినది (మ. భా. శాం. ౧౮౭-౨౪). అద్వైతవేదాంతముయొక్క సిద్ధాంతమును నిదియే యని గీతారహస్యమునందలి తొమ్మిదవప్రకరణమున స్పష్టము చేయఁబడినది. గీతయం దద్వైతము ప్రతిపాదింపఁబడలేదనియు, విశిష్టాద్వైతము గాని, లేక, శుద్ధమగు ద్వైతము గాని ప్రతిపాదింపఁబడినదనియు ననువారు 'పరమాత్మ' యనునది యొకసమాసపదమని చెప్పక 'పరం' 'ఆత్మా' యని రెండు పదములుగ విభజించి 'పరం' అనునది 'సమాహితః', అనుదానికి విశేషణ మని యనుకొనుచున్నారు. ఈయర్థము క్లిష్టముగ నున్నది; కాని యీయుదాహరణముచే సాంప్రదాయికటీకాకారులు తమ మతానుసారముగ గీతల నెట్లు తలక్రిందులు చేయుచున్నదియు స్పష్టమగును.]

(౮) ఎవనియొక్క యాత్మ జ్ఞానముచేతను, విజ్ఞానముచేతను, అనఁగా: వివిధమగు జ్ఞానముచేతను తృప్తి నొందినదో, యెవఁడు తనయింద్రియముల జయించెనో, యెవఁడు కూటస్థుఁ డాయెనో, అనఁగా: మూలమునకుఁ జేరినాఁడో, యెవఁడు, మట్టిగడ్డ, ఱాయి, బంగారము మొదలగువానిని సమానముగఁ దలఁచునో, యా (కర్మ-) యోగినే 'యుక్తుఁ'డని, అనఁగా: సిద్ధావస్థనొందినవాఁ డని చెప్పుదురు. (౯) స్నేహితుఁడు, శత్రువు, ఉదాసీనుఁడు, మధ్యస్థుఁడు, ద్వేషి, యోగ్యుఁడు, బంధువు ననువారియందును, సాధువులయందును, దుష్టులయందును, నెవనిబుద్ధి సమ మయినదో యతఁడే విశేషమైనయోగ్యత గలవాఁడని చెప్పవలయును.

§§ యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. ౧౦

[సుహృత్ అనఁగా ప్రత్యుపకారమునందు కోరిక నుంచక సహాయము సేయువాఁడు. ఉదాసీనుఁడు అనఁగా : రెండు పక్షములలో దేనికిని మంచిచెడుఁగులను కోరనివాఁడు. మధ్యస్థుఁడు అనఁగా రెండుపక్షములును బాగుగనే యుండవలయు ననువాఁడు. మఱియు బంధువనఁగా సంబంధి యని టీకాకారు లర్థము చేసిరి. ఈపదములకు కొంచెము వేఱుగ నర్థమును చెప్పినను చెప్పవచ్చును. కారణమేమన: ఈశబ్దము లొక్కొకనికి వానికి వేఱుగునర్థములను చెప్పవలయునన్న నూహతోఁ బ్రయోగింపఁబడలేదు. అన్నియుఁ గలసి వ్యాపకమగు నొకయర్థమును చెప్పవలయును. దానియం దేమియు లోప ముండకూడ దనునూహతోడనే యనేకశబ్దములు ప్రయోగింపఁబడినవి. ఈరీతిగ నెవరిని యోగి యనియు, యోగారూఢుఁడనియు, లేక, యుక్తుఁ డనియు చెప్పవలయునో (గీ. ౨.౬౧; ౪. ౧౮. మఱియు ౫. ౨౩) సంక్షేపముగ చెప్పి యీకర్మయోగమును సిద్ధింపఁజేసికొనుటకుఁ బ్రతిమనుజుఁడు స్వతంత్రుఁడైయే యున్నాఁ డనియు, దాని, నిమిత్తమై మఱియొకని నెదురుచూచుచుండ నక్కఱలేదనియుఁ జెప్పఁబడినది. ఈకర్మయోగము సిద్ధించుటకు సాధనము నిప్పుడు నిరూపించుచున్నాఁడు:—]

(౧౦) యోగి, అనఁగా : కర్మయోగి యైనవాఁ డేకాంతమునందు నొంటరిగ నుండి చిత్తమును నాత్మను స్వాధీనపఱచుకొని యేవిధమైన కోరికలను గోరక పరిగ్రహమును, అనఁగా బంధనమును వదలి, యెప్పుడు నంతఃకరణమును యోగాభ్యాసముననే ప్రవర్తింపఁజేయవలయును.

['యుంజీత', యనుపదముచే పాతంజలసూత్రములలోఁ జెప్పఁబడిన యోగ మిచ్చో వివక్షిత మని ముందున్నశ్లోకమునందు వివక్షిత మగుచున్నది. అయినను కర్మయోగమును సాధింపుదమని యిచ్ఛయించువాఁడు తనయాయుర్దాయమునంతను పాతంజలయోగమునందే గడుపవలయునని యీశ్లోకమున కర్థము కాదు. కర్మయోగమునకు సంబంధించు సామ్యబుద్ధిని సంపాదించుకొనుటకు సాధన మని పాతంజలయోగ మీయధ్యాయమునందుఁ జెప్పఁబడినది; మఱియు నేకాంతవాసముసైత మందునిమి

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్. ౧౧
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే. ౧౨
సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్. ౧౩
ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ౧౪

త్తమే చెప్పఁబడినది. ప్రకృతిస్వభావానుసారముగ నాలోచింప పాతంజలయోగమునందలిసమాధి యనేకుల కొకజన్మమందె సాధించుటకు శక్యము గాదు. అట్టి పురుషుఁ డాయుర్దాయముంతను పాతంజలయోగమునందే కోలుపోక వీలయినంతవఱకును బుద్ధిని స్థిరపఱచుకొని, కర్మయోగము నాచరించుచుండవలయును. ఆకారణముననే యనేకజన్మముల తుదను సిద్ధి కలుగునని యీయధ్యాయముయొక్క యంతమున భగవంతుఁడు చెప్పెను (గీ. ర. ప్ర. ౧౦. పు. ౩౯౭-౩౯౮).

(౧౧) మొదట దర్భాసనమును, దానిపై కృష్ణాజినమును, నందుపై వస్త్రమును పఱచి విస్తార మున్నతమును మిక్కిలిపల్లమును కాని తనయాసనమును శుద్ధమగు ప్రదేశమున పఱచి (౧౨) చిత్తముయొక్కయు నింద్రియములయొక్కయు వ్యాపారమును నిరోధించి, మనస్సు నేకాగ్రము చేసి యాత్మశుద్ధ్యర్థమై యాయాసనముపైఁ గూర్చుండి యోగము నభ్యసింపవలయును. (౧౩) కాయమును, అనఁగా వెన్నును, తలను, కంఠమును సమముగను, అనఁగా: నిలువుగను సరళముగను నిశ్చలముగను నిలిపి స్థిరుఁడై దిక్కులు చూడక తననాసిక చివర దృష్టి నుంచి (౧౪) భీతిని చెందక శాంతమగు నంతఃకరణముతో బ్రహ్మచర్యవ్రతమును పాలించుచు మనస్సును సంయమించుకొని చిత్తమును నాయందే యుంచి నాయందే తత్పరుఁ డయి యుక్తుఁ డగుచు కూర్చుండవలయును.

[‘శుద్ధమగు ప్రదేశమునందుఁ గూర్చుండి’, ‘శరీరమును, మనస్సును, శిరస్సును సమముగఁ జేసికొని’ యను శబ్దములు శ్వేతాశ్వరోపనిషత్తులో నున్నవి (శ్వే. ౨. ౮. మఱియు ౧౦ చూడు). మఱియుఁ బైచెప్పఁబడిన విషయమంతయు పాతంజలయోగమునందు చెప్పఁబడినది కాదు. ప్రాచీనము

యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. ౧౫

లగు నుపనిషత్తులయందలి యోగవర్ణనముతో మిక్కిలి సంబంధించి యున్నది. హఠయోగమునందు నింద్రియనిగ్రహమును బలాత్కారముగఁ జేయుచున్నారు. అటుల చేయక "మనసై వేంద్రియగ్రామం వినియమ్య"— మనస్సుచేతనే యింద్రియముల నిగ్రహించి— అని యీ యధ్యాయమునందె ముందు ౨౪-వ శ్లోకమునందు చెప్పఁబడినది. దీనిని బట్టి హఠయోగము గీతలయందు వివక్షితము కాదని స్పష్టమగుచున్నది. అటులే జన్మమంతయు యోగాభ్యాసమునందే గడపవలయునని చెప్పుటకు వీలులేదనియు నీయధ్యాయమునందె కడపట చెప్పఁబడినది. ఇప్పు డీ యోగాభ్యాసముయొక్క ఫలమునే నిరూపించుచున్నాఁడు.—]

(౧౫) ఇట్లెప్పుడును యోగాభ్యాసము చేయుచుండుటచే, మనస్సు స్వాధీనమగుటవలన (కర్మ-) యోగికి నాయందుండు నట్టియు, తుదకు. నిర్వాణప్రదమును, అనఁగా: నాయొక్క స్వరూపమునందు లయమును చేయునట్టియు శాంతి కలుగును.

[ఈశ్లోకమునందు 'సదా' యనుశబ్దముచే ప్రతిదినమును ౨౪ గంటలును అని యర్థము చేసికొనఁగూడదు. ప్రతిదినము నొకగడియయైనను యథాశక్తిగ నీయభ్యాసము చేయవలయునని యిచ్చో వివక్షితము. (౧౦-వ శ్లోకముమీఁద టీకను చూడుము.) ఇట్లు యోగాభ్యాసమును చేయుచు మచ్చిత్తుఁడవును, మత్పరాయణుఁడవును కమ్మని చెప్పుటకు కారణ మేమన: పాతంజలయోగమనునది మనస్సును నిరోధించుకొనుట యను నొకయుక్తి, లేక, క్రియ యయి యున్నది. ఈసాముచే మనస్సు స్వాధీనమయినను, ఆయేకాగ్రమగు మనస్సును భగవంతునియం దుంపక మఱియొక విషయమందుసైతము ముంపవచ్చును; కాని యేకాగ్రమగు చిత్తము నిట్టుల వ్యర్థముసేయక, పరమేశ్వరస్వరూపమును తెలిసికొనుటకే యుపయోగింపవలయును. అట్లుపయోగించినపుడే యీయోగము సుఖకర మగును. లేనిచో నిది క్లేశకరము మాత్రమే యగు నని గీత చెప్పుచున్నది. ఈవిషయమే ముందున్న ౨౯–౩౦ శ్లోకములయందును, ఈయధ్యాయముయొక్క కడపటి ౪౭-వ శ్లోకమునందును మరల చెప్పఁబడినది. పర

నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. ౧౬
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. ౧౭

మేశ్వాసనియమము నిత్యలేక యింద్రియనిగ్రహమును మాత్రము, లేక, వ్యాయామమును మాత్రము చేసినవానికి జారణము, మారణము, వశీకరణము మొదలగులోకోపద్రవమును గలుగఁజేయు శక్తులయందే మాత్రము ప్రవీణులుగ నుందురు. ఈయవస్థ గీతలకేగాక, యేవిధమైన మోక్షమార్గమునకు సమ్మతమయినది కాదు. ఇప్పుడు మరల యీ యోగక్రియనే విశేషముగ విస్తరించుచున్నాఁడు—]

(౧౬) ఓయర్జునా! ఈయోగ మధికముగ తిండితినువానికిని, బొత్తిగ తినని వానికిని, ఎప్పుడును నిద్రఁబోవువానికిని, ఎల్లప్పుడును మేల్కొనియుండు వానికిని సిద్ధింపదు. (౧౭) ఎవని కాహారవిహారములు తగునట్టుల నుండునో, కర్మాచరణము తగుమాత్ర ముండునో, నిద్రయు, మేల్కొనుటయు నెవరికి విపరీతముగ నుండునో, యట్టివానికి (ఈ) యోగము దుఃఖమును పోఁగొట్టును, అనఁగా: సుఖదాయక మగును.

[ఈశ్లోకమునందు 'యోగ' మనఁగా పాతంజలయోగముయొక్క క్రియ యనియు, 'యుక్త' మనఁగా తగునట్టుల నియతమైన, లేక, పరిమితమైన యనియు నర్థము. ఇటుతర్వాతనుండుశ్లోకములలో నొకటిరెండుస్థలములందు సైతము, యోగమనఁగా పాతంజలయోగమే యర్థము అయినను నంతమాత్రముచేత నీయధ్యాయమునందు పాతంజలయోగమే స్వతంత్రముగ ప్రతిపాద్యమని యర్థము కాదు. కర్మయోగమును సిద్ధింపఁజేసికొనుట యనునదియే జీవితకాలమునందుఁ బ్రధాన మగుకర్తవ్య మగుటచే దానికి సాధనమును నూహాతోమాత్రమే పాతంజలయోగము చెప్పఁబడిన దని పూర్వమునందు స్పష్టముగఁ జెప్పఁబడినది. ఈశ్లోకమునందలి "కర్మలను యోగ్యముగ నాచరించుట" యనుశబ్దములచే నయిత ఖితరకర్మలను వదలివేయక యీయోగము నభ్యసింపవలయు నని స్పష్టముగ నున్నది. ఇప్పుడు యోగులను కొంచెము వర్ణించి పిదప సమాధిసుఖముయొక్క స్వరూపము ను వర్ణించుచున్నాఁడు—]

§§ యదా వినియతం చిత్త మాత్మ న్యే వావతిష్ఠ తే,
నిఃస్పృహః సర్వ కామేభ్యో యుక్త ఇ త్యుచ్య తే తదా. ౧౮
యథా దీపో నివాతస్థో నేంగ తే సోపమా స్మృతా,
యోగినో యతచి త్తస్య యుంజతో యోగ మాత్మనః ౧౯
యత్రో ఫరమ తే చి త్తం నిరుద్ధం యోగ సేవయా,

(౧౮) ఎవనియొక్క నిరోధింపఁబడిన మనస్సాత్మయందు యెప్పుడును స్థిరమగుచున్నదో, యెవని కెట్టియుపభోగమునందును నిచ్ఛ యెప్పుడునుండదో, యప్పుడు వాఁడు యుక్తుఁ డని చెప్పఁబడును. (౧౯) చిత్తము నిరోధించి యోగము నభ్యసించుయోగియొక్క స్థితి, గాలిలేని ప్రదేశమునం దుంపఁబడిన దీపముయొక్క జ్యోతిస్సువలె నిశ్చలముగ నుండును.

[ఈయుపమానమే కాక మహాభారతమునందు (శాంతి. ౩౦౦.౩౨,౩౪) "తైలముచే నిండింపఁబడిన పాత్రము శిరస్సునం దుంచుకొని వెళ్లు చున్నప్పుడుగాని, లేక, తుపాను కొట్టినప్పుడు నావను సంరక్షించుచున్నప్పుడుగాని మనుజుఁ డెట్లు 'యుక్తుఁడు', లేక, ఏకాగ్రుఁ డగుచున్నాఁడో యటులే యోగియొక్కమనస్సును నేకాగ్రముగ నుండు" నని చెప్పఁబడినది. సారథియొక్కయు, తేరుగుఱ్ఱములయొక్కయు దృష్టాంతము కఠోపనిషత్తునందుఁ బ్రసిద్ధముగనే యున్నది.మఱియు గీతలయం దీదృష్టాంతము స్పష్టముగఁ జెప్పఁబడక పోయినను రెండవయధ్యాయమునందు ౬౭, ౬౮ శ్లోకములను,ఈయధ్యాయమునందలి ౨౫-వ శ్లోకమును నాదృష్టాంతమును మనస్సున నుంచుకొనియె చెప్పఁబడినది.యోగమనఁగా కర్మయోగ మని గీతలయందు పారిభాషికార్థ మయినను నాశబ్ద మితరార్థమునందు సైతము గీతలయం దుపయోగింపఁబడినది. ఉదాహరణ మేమనః ౯. ౫ మఱియు ౧౦.౭ శ్లోకములందు యోగమన: "అలౌకికము, లేక, యిష్టమైన దానినెల్ల చేయుశక్తి" యని యర్థము. వేయేల? యోగశబ్దమున కనేకము లగు నర్థము లుండుటచేతనే గీతలయందు పాతంజలయోగముగాని,సాంఖ్యమార్గముగాని ప్రతిపాద్యముగ నున్నదని చెప్పుటకు నాయాసాంప్రదాయికులకు ననుకూల మయినదని చెప్పవచ్చును. అది యట్లుండనిమ్ము; ౧౦-వ శ్లోకమునందుఁ జెప్పఁబడిన చిత్తనిరోధరూపమగు పాతంజలయోగమునందలి సమాధియొక్క స్వరూపము నిప్పుడు విస్తరించుచున్నాఁడు—].

యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. ౨౦
సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః. ౨౧
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. ౨౨
తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగో నిర్విణ్ణచేతసా. ౨౩

(౨౦) యోగానుష్ఠానముచే నిరుద్ధమయి చిత్త మెక్కడ రమించుచున్నదో, యెక్కడ తన్నుతాను చూచుకొని యాత్మయందె సంతుష్టుఁడగుచున్నాఁడో, (౨౧) ఎక్కడ (కేవలము) బుద్ధిగమ్యమును, నింద్రియములకు నగోచరమును నగు నత్యంతసుఖము వానివానియనుభవమునకు గోచర మగునో, యెక్కడ వాఁడు ఒకసారి స్థిరుఁడగునేని, తత్త్వమునుండి యెప్పుడును ప్రచ్యుతుఁడు కాఁడో, (౨౨) అటులే యేస్థితి ప్రాప్తమయినపిదప దానికంటె నేవిధమయినలాభము నతనిమనస్సునకు నిష్టము కాదో, యెక్కడ స్థిరుఁ డగునేని యెట్టిగొప్పదుఃఖము అయినను (అతనిని) చలింపచేయనేరదో; (౨౩) అట్టివానికి, దుఃఖసంయోగ వియోగము, అనఁగా: యోగమను పేరుగల్గిన స్థితి కల్గునని తెలిసికొనుచున్నారు. మఱియు నీయోగము మనస్సునందు విసుగుఁజెందక నెప్పుడును నాచరించి తీరవలయును.

[ఈనాలుగుశ్లోకములుకలసి యొకవాక్య మగును. ౨౩-వ శ్లోకారంభమున నున్నపూర్వాపరామర్శక మగు ‘తం’ అను సర్వనామముచే పూర్వపు మూఁడుశ్లోకములయందలి విషయ మంతయు నుద్దేశింపఁబడినది; మఱియు నాల్గుశ్లోకములును సమాధిని బూర్తిగ వర్ణించినవి. పాతంజలయోగసూత్రములందు “యోగశ్చిత్తవృత్తినిరోధః” — యోగ మనఁగా: చిత్తవృత్తినిరోధము — అని యే ‘యోగ’ లక్షణము చెప్పఁబడినదో, యట్టిదే ౨౦-వ శ్లోకారంభమునం దున్నశబ్దములచేఁ జెప్పఁబడింది. ఈచిత్తవృత్తినిరోధముయొక్క పూర్ణావస్థయే సమాధి యగును. దానికే ‘యోగ’ మని పేరు. ఈయోగశబ్దమునకు నూతనలక్షణము స్వయముగఁ జెప్పఁబడినది. నిగ్రహమును, నుద్యోగమును గలమనుజున కీయోగము సామాన్యముగ నాఱుమాసములలోనే సిద్ధించు నని యుపనిషత్తులయందును మహాభారతమునందును జెప్పఁబడినది. (మైత్ర్యు. ౬. ౨౮; అమృతనాద. ౨౯; మ. భా. అశ్వ. అనుగీత. ౧౯.

§§ సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః,
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. ౨౪
శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. ౨౫
యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్,
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. ౨౬

౬౬). అయినను పాతంజలయోగమునం దున్న సమాధిచే లభించెడుసుఖము చిత్తనిరోధమువల్లమాత్రమే కాదు, చిత్తనిరోధముచే తాను తనయొక్క యాత్మను దెలిసికొన్నపిదప ప్రాప్త మగునని పూర్వమునందు ౨౦-వ శ్లోకమునందును, పిదప ౨౮-వ శ్లోకమునందును స్పష్టముగఁ జెప్పఁబడినది. ఈదుఃఖవిరహితమగు స్థితినే బ్రహ్మానందమనికాని, యాత్మప్రసాదజ మగుసుఖమనికాని, యాత్మానందమనికాని చెప్పుదురు. (గీ. ౧౮. ౩౭; మఱియు గీతా. ర. ప్ర. ౯. పు. ౩౧౭ చూడుము); ఆత్మజ్ఞానముగల్గుటకు కావలసిన యీచిత్తముయొక్క సమత యీపాతంజలయోగముచేతమాత్రమే కలుగునని నియమము లేదు. ఇఁక నేమన:—చిత్తశుద్ధియొక్క పరిణామభూతమగు జ్ఞానభక్తులచేసైతము సంఘటిల్లు నని ముందున్నయధ్యాయములోఁ జెప్పఁబడినది. కావున నామార్గమె మిక్కిలి ప్రశస్తమును, సులభము నని చెప్పుచున్నారు. సమాధిలక్షణములు చెప్పఁబడినవి; ఇప్పుడు దాని నెట్లు సాధింపవలయునో చెప్పుచున్నాఁడు—]

(౨౪) సంకల్పమునుండి బయల్వెడుకోరిక లన్నింటిని, అనఁగా: వాసనలను నిశ్శేషముగఁ ద్యజించి సర్వేంద్రియములను నలుప్రక్కలవను బోనీయక మనస్సుచే నియమించియు (౨౫) ధైర్యముతోఁ గూడుకొన్నబుద్ధిచే క్రమక్రమముగ శాంతుఁ డగుచుండవలయును. మఱియు మనస్సు నాత్మయందు స్థిరపఱచి యేవిచారమును మనస్సులోనికి రానీయక యుండవలయును. (౨౬) ఈరీతిగ చిత్తము నేకాగ్రము చేయుచుండఁగా చంచలమును నస్థిరమును నగుమనస్సు బాహ్యవిషయములకుఁ బరుగెత్తునపుడెల్ల నిరోధించి దాని నాత్మకు నధీనమైనదానిఁగనే చేయవలయును.

[మనస్సును సమాధిలోఁ బ్రవేశపెట్టుట యనుక్రియ, కఠోపనిషత్తునందు రథముతోఁ బోల్చి మిక్కిలి వ్యక్తముగఁ జెప్పఁబడినది. (కఠ.౧.౩.౩)

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్,
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్. ౨౭
యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే. ౨౮

రథముయొక్క గుఱ్ఱముల నిటునటు పోనియ్యక యుత్తముఁడగు సారథి వానిని సరళమగుమార్గమున నడిపించునటులనే 'మనుష్యుఁడు సమాధికొఱకు ప్రయత్నముఁ జేయుట యావశ్యకము. ఏవిషయమునం దైనను మనస్సును స్థిరపఱచు నభ్యాసముగల పురుషునకుఁ దీశ్లోకమునం దున్నరహస్యము శీఘ్రముగనే తెలియును. మనస్సు నొకవిషయమునుండి నిరోధించుటకుఁ బ్రయత్నించినను నది మఱియొకవిషయమును గుఱించి పరుగెత్తుచునే యుండును. ఇది నిరోధింపఁబడినగాని సమాధి దృఢ మగుటకు వీలు లేదు. ఇట్లు యోగాభ్యాసముచే మనస్సు స్థిరపడినచోఁ గల్గు నట్టిఫలము నిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౨౭) ఈప్రకారముగ శాంతచిత్తుఁడును, రజోగుణశూన్యుఁడును, పాపశూన్యుఁడును, బ్రహ్మభూతుఁడు నయిన (కర్మ-) యోగికి యుత్తమమగు సుఖము ప్రాప్త మగును. (౨౮) ఇట్లెల్లప్పుడును నాత్మవిషయకమగు యోగాభ్యాసముఁ జేయు (కర్మ-) యోగి పాపములనుండి ముక్తుఁడై బ్రహ్మసంయోగమువలన ప్రాప్తమగు నత్యంతసుఖమును సులభముగ నుపభోగించును.

[ఈరెండుశ్లోకములయందును యోగి యనఁగా: 'కర్మయోగి' యని నేనర్థమును చేసినాను. కారణ మేమన: పాతంజలయోగమును, కర్మయోగమునకు సాధకమే యని చెప్పఁబడియుండుటచే పాతంజలయోగము నభ్యసించునిపురుషుఁడు కర్మయోగి యనియే వివక్షిత మగును. అయినను యోగి యనఁగా: సమాధియందు కూర్చున్నవాఁడన్ని యర్థము చేసినను చేయవచ్చును; కాని గీతలయందు ప్రతిపాద్య మగుమార్గము మాత్రము దీనికంటె వేఱుగ నున్నదని ప్రత్యేకముగ జ్ఞప్తియం దుంచుకొనవలయును. ఈన్యాయమే ముందున్న రెండుమూఁడుశ్లోకములయందు సైతము సంబంధించియున్నది. నిర్వాణ మను బ్రహ్మసుఖ మిట్లనుభవములోనికి వచ్చినపిదప సర్వభూతములయందును గలుగునట్టి యాత్మౌపమ్యదృష్టి నిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

§§ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతానిచాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ౩౧

(౨౯) ఎవనియాత్మ (ఈరీతిగ) యోగయుక్త మయినదో యతనిదృష్టి యంతటను సమ మయినది యగునుగాన, సర్వభూతములయందు తానును, తన యందు సర్వభూతములును (నున్నట్లు) వానికి కాన్పించును. (౩౦) నే(పరమేశ్వరుం డగు పరమాత్మ) నన్నిచోట్ల నున్నా నని తెలిసికొనునట్టియు, నాయందు సమస్త మున్నదనితలచునట్టియు మనుజునకు నే నెప్పుడును కాన్పింపకపోను. అతఁడును నా కెప్పుడును కనఁబడక యుండఁడు.

[ఈరెండుశ్లోకములలోను మొదట నాత్మశబ్దమును బ్రయోగించి యధ్యాత్మదృష్టిచేత నవ్యక్తమును, పిదప ప్రథమపురుషను బోధించు నే ననుపదమును ప్రయోగించి భక్తిదృష్టిచే వ్యక్తమును, జెప్పఁబడినవి. కాని రెండుశ్లోకములకును నొకటే యర్థము. (గీతా. ర. ప్ర ౧౩. పు. ౫౯౧-౫౯౨. చూడుము). ఈ బ్రహ్మాత్మైక్యదృష్టియే మోక్షమునకును, కర్మయోగమునకును బుట్టినిల్లు యయినది. ౨౯-వ శ్లోకముయొక్క పూర్వార్థము కొంచెము శబ్దభేదముతో మనుస్మృతియందును (మను. ౧౨. ౯౧) మహాభారతమందును (శాం. ౨౩౮. ౨౧; ౨౬౮. ౨౨) నుపనిషత్తుల యందును (కైవ. ౧. ౧౦; ఈశ. ౬) నున్నది. వేయేల? సర్వభూతాత్మైక్య జ్ఞాన మనునదియే, యధ్యాత్మశాస్త్రము, కర్మయోగము ననువానికి మూల మయియున్నదని గీతారహస్యమున ౧౨-వ ప్రకరణమునందు నేను సవిస్తరముగ నిరూపించియున్నాను (పు. ౫౩౫ మొదలగునవి చూడు). ఇంద్రియనిగ్రహము సిద్ధించినను ఈజ్ఞానము గల్గిననేగాని యది వ్యర్థము కాకమానదు. కాన పరమేశ్వరవిషయక మగుజ్ఞానమును జెప్పుటకుఁ జెప్పఁబోవు యధ్యాయము మొదలుగాని యారంభింపఁబడినది.—]

(౩౧) ఏకత్వబుద్ధిని (అనఁగా: సర్వభూతాత్మైక్యబుద్ధిని) మనస్సునం దుంచుకొని, సర్వభూతముల్లయందుండు, నన్ను (పరమేశ్వరుని) భజించు (కర్మ-)

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః. ౩౨

అర్జున ఉవాచ.

యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన,
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్. ౩౩
చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. ౩౪

యోగి వ్యవహారములన్నింటిని చేయుచున్నను నాయందె యుండును. (౩౨) ఓయర్జునా! సుఖముగాని, దుఃఖముగాని తనవలె యితరులకు నను (ఆత్మౌపమ్య) దృష్టిచే నన్నింటిని సమానముగఁజూచు (కర్మ-) యోగి పరముఁడుగ (ఉత్కృష్టుఁడుగ) నెన్నఁబడుచున్నాఁడు.

[సర్వభూతములయందును నొకటేయాత్మయే యున్నదనువిషయము సాంఖ్యయోగ, కర్మయోగములరెంటియందును సమానముగనే యున్నది. అటులనే పాతంజలయోగమునందును, సమాధిలో నుండి పరమేశ్వరుని తెలిసికొన్నపిదప నీసామ్యావస్థయే ప్రాప్త మగును; కాని సాంఖ్యులకును, పాతంజలయోగులకును సర్వకర్మలయొక్క త్యాగము సమ్మత మగుటచే నీసామ్యబుద్ధిని వ్యవహారమునం దుపయోగించుకొనవలసిన యవసరమే యుండదు; గీతలలో వర్ణింపఁబడిన (కర్మ-) యోగి యట్లుచేయక యధ్యాత్మజ్ఞానముచేఁ బ్రాప్తమగు సామ్యబుద్ధిని వ్యవహారమునందును సర్వదా యుపయోగించుకొనుచు, లోకసంగ్రహార్థమై జగత్తునందలి సర్వకార్యములను జేయుచున్నా ననువిషయము వారిమతముకంటె విశేషము. కావుననే తపస్వికంటెను (అనఁగా: పాతంజలయోగికంటెను), జ్ఞాని (అనఁగా: సాంఖ్యమార్గీయుని) కంటెను (కర్మ-) యోగి శ్రేష్ఠుఁడని యీయధ్యాయముకడపట(౪౬-వ శ్లోకమున)స్పష్టముగఁ జెప్పఁబడినది. ఈసామ్యయోగవర్ణనను విని యర్జునుఁ డిట్లు శంకించుచున్నాఁడు.—]

(౩౩) ఓమధుసూదనా! నీవు చెప్పిన సామ్యబుద్ధిచే ప్రాప్తమగు నీకర్మయోగము మనస్సు చంచల మగుటచే స్థిరముగ నుండునట్లు గన్పట్టదు. (౩౪) కారణమేమన, కృష్ణా! మనస్సు చంచలమైనదియు, పట్టుకొనుటకు సాధ్యమైనదియు, బలిష్ఠమైనదియు, దృఢమైనదియు, (అనఁగా: స్వాధీనము చేసికొనుటకు సాధ్యము

శ్రీభగవా నువాచ.

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే. ౩౫
అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యో ఽవాప్తు ముపాయతః. ౩౬

కొనిదియు) గాన వాయువును మూటకట్టుకొనుటవలె దీనిని నిగ్రహించుట మిక్కిలి దుష్కరముగఁ గన్పట్టుచున్నది.

[౩౩-వ శ్లోకమునందు సామ్యముచేత, లేక, సామ్యబుద్ధిచేత ప్రాప్తమగునది యనువిశేషణముచే యోగశబ్దమున కిచ్చోఁ కర్మయోగ మనియే యర్థము. పాతంజలయోగమందలి సమాధి పూర్వమందు వర్ణింపఁబడి యుండినను, ఈశ్లోకములోని యోగశబ్దముచే పాతంజలయోగము వివక్షితము కాదు. కారణ మేమన, రెండవయధ్యాయమునందు భగవంతుఁడే "సమత్వం యోగ ఉచ్యతే" (౨.౪౮)-"బుద్ధి సమానముగ నుండుటకే, లేక, సమత్వమునకే యోగ మనిపేరు." అని కర్మయోగమును వ్యాఖ్యానముఁ జేసినాఁడు. అది యటులుండ నిమ్ము. అర్జునుని శంక నొప్పుకొని యిప్పుడు సమాధానమును జెప్పుచున్నాఁడు.—]

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—(౩౫) ఓమహాబాహుఁడ వైన యర్జునుఁడా! మనస్సు చంచలమైనదియగుటచే దానిని నిగ్రహించుట దుర్ఘటమనువిషయమున సందేహ మేమియు లేదు. కాని యోకౌంతేయా! అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను దానిని స్వాధీనము చేసికొనవచ్చును. (౩౬) అంతఃకరణము స్వాధీనములో లేనివాఁడీసామ్యబుద్ధిరూపమగు యోగమును సాధించుట కష్ట మని నాతలంపు. కాని యంతఃకరణమును స్వాధీనములో నుంచుకొని ప్రయత్నము జేయుచుండుమేని యుపాయముచే దీనిని సాధింపవచ్చును.

[మొదట దుర్ఘటమని తోఁచినదియో, పిదప యలవాటుచేతను, చిరకాలము ప్రయత్నించుటచేతను, సాధ్య మగునని తాత్పర్యము. అభ్యాసమన: (నేవిషయమునైన మరలమరలఁ జేయుట.) మఱియు వైరాగ్యమనఁగా: రాగము, లేక, ప్రీతి లేకపోవుట. అనఁగా: (నిచ్ఛామాన్యుఁడగుట) పాతంజలయోగసూత్రములయం దారంభముననే "యోగశ్చిత్త

అర్జున ఉవాచ.

శ్లో॥ అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి. ౩౭
కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి. ౩౮

వృత్తినిరోధః"—చిత్తవృత్తి నిరోధించుటకే యోగ మనిపేరు—అని యోగలక్షణము చెప్పఁబడినది. (ఈయధ్యాయములోని ౨౦-వ శ్లోకమును జూడుము). తర్వాతసూత్రమునందు "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః" "అభ్యాసముచేతను వైరాగ్యముచేతను, చిత్తవృత్తి నిరోధింపఁబడు నని" చెప్పఁబడెను. ఈశబ్దములే గీతలయందును గలవు గాన నాయర్థమునే యిచ్చోఁ జెప్పవలయును. కాని యంతమాత్రముచే గీతలయందున్న యీ శబ్దములు పాతంజలసూత్రములనుండి గైకొనంబడిన వని చెప్పుటకు మాత్రము వీలు లేదు. (గీతా. ర. పు. ౨౨౮ చూడుము). మనస్సును నిగ్రహించి, సమాధిలో ప్రవేశించుటయు నిజ్జే శక్యమైనను, నిగ్రహము చేసినకొలఁదిఁ కిది యీ అభ్యాసములలోనే ప్రాప్తమైనను ప్రకృతిస్వభావానుసారముగ, కర్మయోగమునందలి యీచరమావస్థ యనేకుల కొకటి రెండుజన్మములలోనైనను సాధ్యము కాదు. ఇట్టిపాతంజలయోగుల కీసిద్ధి యెట్లు లభించును? కారణ మేమన, ఒకజన్మమున శక్య మగునంత నింద్రియనిగ్రహము నభ్యసించి, కర్మయోగము నాచరించుచున్నను మరణ సమయమునం దది యపూర్ణముగనే యుండును. మరుజన్మమందు తిరిగి మొదటనుండియు నారంభింపవలయునని చెప్పుమేని యాజన్మమందును నట్లే యపూర్ణ మగుట సంఘటిల్లునని మఱియొక సందేహము వెలువడును. ఈకారణముచే నిట్టిపురుషుఁ డేమి చేయవలయునని యర్జునుఁడు రెండవ ప్రశ్నను వేయుచున్నాఁడు.—]

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు:—(౩౭) ఓకృష్ణా! శ్రద్ధ యుండినను అయతి యగువాఁడు (అనఁగా: ప్రకృతిస్వభావానుసారముగఁ బూర్ణమగుప్రయత్నములేక సంయమము కానందున, యెవరిమనస్సు సామ్యబుద్ధి రూపమగు (కర్మ) యోగమునుండి చలించినదో వాఁడు) యోగసిద్ధినిఁ బొందక యేగతిని పొందును?

(౩౮) ఓమహాబాహువగు శ్రీకృష్ణా! మోహగ్రస్తుఁ డగుటచే బ్రహ్మ

ఏతంమే సంశయం కృష్ణ ఛేత్తు మర్హస్యశేషతః,
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. ౩౯

ప్రాప్తిమార్గమునందు స్థిరుఁడుకాక, యిటునటుగూడ చెడిపోయినపురుషుఁడు చెదరిపోయిన మేఘమువలె (అమధ్యనే) నశించుఁడు గదా ? (౩౮) ఓకృష్ణా! యీ నాసంశయమును నీవే నిశ్శేషముగఁ దీర్పవలయును. ఈసంశయమును దీర్చుటకు నీవుదక్క మఱియొకఁడెవఁడును దొరకఁడు.

[నఞ్, సమాసమున నారంభమందున నఞ్, అనుదానికి సామాన్యముగ నభావమర్థమైనను నల్పార్థమందును సైతె మఱి యనేకస్థలములఁ బ్రయోగింపఁబడుచుండును. కావున (౩౭)-వశ్లోకమునం దున్న "అయతి" శబ్దమునకు "అల్పమైన (అనఁగా : అపూర్ణమైన) ప్రయత్నమును, లేక, సంయమమును జేయువాఁడు" అనియర్థముఁ జెప్పవలయును ౩౮-వ శ్లోకమునందు "రెండువైపుల నాధారము లేనివాఁడు," లేక, "ఇతో భ్రష్ట స్తతో భ్రష్టః" అని చెప్పినదానికి సయితము కర్మయోగ పరముగనే యర్థము చేసికొనవలయును. కామ్యబుద్ధితోనైనను, శాస్త్రానుసారముగఁ గర్మలను జేయునేని స్వర్గము లభించును. నిష్కామబుద్ధితోఁ జేయునేని వానిచే బంధింపఁబడక మోక్షము నొందును. కావున కర్మలు రెండుఫలములు గలవయి యున్నవి. కాని యిట్టి యుభయభ్రష్టుఁ డగు మనుష్యునియొక్క కర్మలు స్వర్గాదికామ్యఫలముల నియ్యవు. అట్టియుద్దేశము లేకుండుటయే దానికి కారణము; మఱియు సామ్యబుద్ధి సంపూర్ణతను జెందకపోవుటచే, మోక్షము గలుగుటకును వీలులేదు. కాన మోక్షమును, స్వర్గమును సైతము లేకపోయెను. నేయియు నెల వైపోయినది, నూనె సైతము నైపోయినది. పొగ ప్రాప్తించినది. ఇట్లు రెంటికిని చెడుటచే మూగవాని స్థితివలె యగునా యేమి ? యని యర్జునుఁడు ప్రశ్నించెను. ఈప్రశ్నము పాతంజలయోగరూప మగుకర్మయోగముయొక్క సాధనమునుమాత్రమె సంబంధించి యుండలేదు. కర్మయోగసిద్ధికొఱకు కావలసిన సామ్యబుద్ధి యొకానొకప్పుడు పాతంజలయోగముచేతను, నొకప్పుడు భక్తిచేతను, నొకప్పుడు జ్ఞానముచేతను ప్రాప్త మగునని ముందరియధ్యాయములోఁ జెప్పఁబడినది. మఱియు పాతంజలయోగ మనునిసాధన మొక జన్మయందె యపూర్ణముగ నుండుటకు సంభవ ముండునటులె, భక్తినిగాని

శ్రీభగవానువాచ.

పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే,
న హి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి. ౪౦
ప్రాప్య పుణ్యకృతాంలోకా నుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. ౪౧
అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. ౪౨
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన. ౪౩
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. ౪౪

: జ్ఞానమునుగాని సాధనముగ నంగీకరించిన ప్రతివానికిని నొకజన్మమున నపూర్ణముగ నుండవచ్చును. కాన నర్జునుని పైప్రశ్నకు భగవంతుఁ డిచ్చిన యుత్తరము కర్మయోగమార్గమునందలి సాధనముల కన్నింటికిని సామాన్యముగ సంబంధించియే యున్నదని చెప్పవలయును.—]

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు—(౪౦) ఓ పార్థా! ఇహలోకమందుగాని పరలోకమందుగాని యిట్టిపురుషుఁ డెప్పుడు వినాశ మొందఁడు. కారణమేమనఁ: నాయనా! కల్యాణకారకము లగుకర్మలను జేయువాఁ డెవఁడు దుర్గతి నొందఁడు. (౪౧) యోగభ్రష్టుఁడు (అనఁగా: కర్మయోగమునుండి భ్రష్టుఁడైన వాఁడు) పుణ్యకర్మలను జేయుపురుషులకు లభించుస్వర్గాదిలోకములఁ జేరి యచ్చో ననేకవత్సరములు వసించి పిదప పరిశుద్ధులగు శ్రీమంతులగేహములందు జన్మించును. (౪౨) లేదా, బుద్ధిమంతులగు (కర్మ-) యోగుల కులమందె జన్మించును. ఇట్టిజన్మ (యీ) లోకమునందు మిక్కిలి దుర్లభమైనది. (౪౩) దానియందనఁగా: (అవ్విధముగ ప్రాప్తమయినజన్మమందు) పూర్వజన్మమందలి బుద్ధిసంస్కార మతనికి ప్రాప్తమగును; మఱియు నోకురునందనా! అతఁడు దానికంటె యధికమగు (యోగ) సిద్ధిని సంపాదించుకొనుటకుఁ బ్రయత్నించును. (౪౪) పూర్వజన్మసంబంధమైన యాతనియభ్యాసము చేతనే యవశుఁడై (స్వయముగ నిచ్ఛ లేకపోయినను) పూర్ణసిద్ధివైపునకు లాగఁబడును. ఎవరికి (కర్మ-) యోగముయొక్క జిజ్ఞాస

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్. ౪౫

అనఁగా: జ్ఞానము సంపాదించుకొనవలయు ననునిచ్ఛ కల్గినదో యతఁడు సైతము శబ్దబ్రహ్మకంటె బరమునకుఁ జేరును. (౪౫) ఇట్లు ప్రయత్నము చేయుచు నుఁడఁగ నుండఁగ పాపములనుండివి ముక్తుఁడై (కర్మ-) యోగి యనేకజన్మముల నొంది సంసిద్ధుఁడయి తుదకు నుత్తమగతి నొందును.

[ఈశ్లోకమునందు యోగ, యోగభ్రష్ట, యోగి శబ్దములు, కర్మయోగము, కర్మయోగమునుండి భ్రష్టుఁడైనవాఁడు, కర్మయోగి యనునర్థముల యందే ప్రయోగింపఁబడినవి. కారణమేమనః శ్రీమంతులకులమందు జన్మించుట యనుస్థితి యితరుల కిష్టమయి యుండు నని చెప్పుటకు వీలు లేదు. మొదట శక్యమగునంత శుద్ధబుద్ధితో కర్మయోగము నాచరించుటకు నారంభింపవలయును. కొంచెమైనను నిట్లు చేయఁబడు కర్మలే యీజన్మమందు కాకపోయిన రాఁగలజన్మలయందు గొప్పగొప్పసిద్ధులను సంపాదించుకొనుటకు కారణములై తుదకు పూర్ణమగు సద్గతి కలుగుటకు కారణము లగునని భగవంతుఁడు చెప్పుచున్నాఁడు. "ఈధర్మము కొంచెముగ నాచరింపఁబడినను గొప్పభయమునుండి తరింపఁ జేయుచున్నది." (గీ. ౨.౪౦ అనేక జన్మ లెత్తినపిదప వాసుదేవుని పొందును. (౭-౧౯) అను శ్లోకము లీసిద్ధాంతమునె బలపఱచుచున్నవి. (విశేషమగువివేచన గీతారహస్య ప్ర. ౧౦. పు. ౩౮౭-౩౯౦ నందు చేయఁబడినదిగాన చూడు). ౪౪-వ శ్లోకమునందున్న శబ్దబ్రహ్మశబ్దమునకు వైదికమగు యజ్ఞయాగాదికామ్య కర్మలని యర్థము. కారణ మేమన: నీకర్మలు వేదవిహితము లగుటచే వేదముపై శ్రద్ధనుంచికొనియే వానిని జేయుచుందురు. మఱియు వేదమన, సృష్టికంతకును పూర్వమందుండుశబ్దము (అనఁగా : శబ్దబ్రహ్మ యగును): ఎవరైనను మొదట కర్మల నన్నింటిని కామ్యబుద్ధితోడనే జేయుచుందురు. కాని యీకర్మలచే చిత్తశుద్ధి యెంతగల్గునో యద్దానికి తగినంతయే నిష్కామబుద్ధితో కర్మలు చేయవలయు నను నిచ్ఛ పుట్టును. కాన.—

ద్వే బ్రహ్మణి వేదితవ్యే శబ్దబ్రహ్మపరం చ యత్,
శబ్దబ్రహ్మణినిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున. ౪౬

"బ్రహ్మ రెండువిధములుగ నున్నదని తెలిసికొనవలయును. అందు శబ్దబ్రహ్మమొక్కటి. రెండవది దానికంటె పరముగ నున్నది. (నిర్గుణము) శబ్దబ్రహ్మను బాగుగ నెఱింగినపిదప దానికంటె పరమగు (నిర్గుణ) బ్రహ్మను నొందును."—అని యుపనిషత్తులయందును, మహాభారతమునందును జెప్పఁబడినది. (మైత్ర్యు. ౬. ౨౨. అమృతబిందు ౧౭; మ. భా. శాం. ౨౩౧. ౬౩; ౨౬౯. ౧). జ్ఞానియగు పురుషునకు శబ్దబ్రహ్మయందున్న కామ్యకర్మలను జేయుటయం దేవగింపు కల్గినను, తుద కాకర్మలనే లోకసంగ్రహార్థమై చేయవలయు నని చెప్పుకర్మయోగ మిష్టమగును. మఱియు నీనిష్కామకర్మయోగము కొంచెమైనను మొదట నాచరించుట సంఘటిల్లును. అనంతరము "స్వల్పారంభాః క్షేమకరాః" యను న్యాయముచే నీస్వల్పాచరణమే యామనుజుని నీమార్గమునందు ముందుకు క్రమముగఁ జేర్చి యావల నిదానముగ పూర్ణమగు సిద్ధి నొందింపఁ జేయును. "కర్మ-యోగమును దెలిసికొనవలయు నని యిచ్ఛకలిగినను వాఁడు శబ్దబ్రహ్మకంటె పరమగుదానిం జేరును." అని ౪౪-వ శ్లోకమునందు జెప్పఁబడిన దాని కిదియె తాత్పర్యము. కారణ మేమన నీజిజ్ఞాస (కర్మ-యోగ) రూపమగు నిత్యఖండమునకు మొద లగుచున్నది; మఱియు నొకసారి యీయిత్యఖండము మొదలు దొరకునేని యీజన్మయందు కాకపోయినను ముం దేజన్మములోనైన పూర్ణమగు సిద్ధిని సంపాదించుకొని శబ్దబ్రహ్మముకంటె పరమందున్న బ్రహ్మను బొందక మానఁడు. జనకాదు లీసిద్ధి నొకజన్మయందె సంపాదించికొనిరని చూచుచుండగనే తోఁచును. కాని యథార్థమును విచారించితిమేని వారికిసయితము మీఫల మనేకజన్మల సంబంధమైనసంస్కారమువల్ల గలిగి యుండు నని తోఁచక పోనదు. అది యట్లుండనిమ్ము. (కర్మ-) యోగముయొక్క యల్పమయిన యాచరణము సైతము, వేయేల? జిజ్ఞాసయయిత మిట్లు తప్పక కల్యాణకారక మగుటచే, దానిచేతనే తుదకు మోక్షప్రాప్తియును నిస్సంశయముగ్గా నగునని భగవంతుఁ డిప్పు డర్జునున కిట్లు చెప్పుచున్నాఁడు.—]

(౪౬) తపస్వులకంటెను, జ్ఞానులకంటెను, కర్మఠులకంటెను (కర్మ-) యోగి శ్రేష్ఠుఁడని తెలిసికొనుచున్నారు. కావున నోయర్జునా! నీవు యోగివి కమ్ము.

[ఈశ్లోకమునందు తపస్వి యనఁగా: నరణ్యమునకు పోయి యుపవాసములు మొదలగు కాయక్లేశకరములగు వ్రతములచేకాని, హఠయోగమునందలి సాధనాదులచేగాని, సిద్ధిని సంపాదించుకొన్నవారని యర్థము. కావున సామాన్యముగ నయినను నీశబ్దమునకు నిదియె యర్థము. జ్ఞాని యనఁగా: చెప్ప నక్కఱలేకుండగనే "జ్ఞానయోగేన సాంఖ్యానాం" (గీ. 3. 3) అనుశ్లోకమున జెప్పఁబడిన జ్ఞానపదమునకు సాంఖ్యమార్గముచే గర్మలను వదలివేసి సిద్ధిని సంపాదించికొనెడిసాంఖ్యనిష్ఠు లని యర్థము. అటులే యీశ్లోకమునందలి "కర్మభ్యః" అనుపదమునకు గీతయందలి (గీ. ౨. ౪౨-౪౪; ౯. ౨౦,౨౧) శ్లోకములలోఁ జెప్పఁబడిన కామ్యకర్మలనే చేయునట్టియు, స్వర్గపరాయణులగునట్టియు మీమాంసకులగు కర్మఠులని యర్థము, ఈమూఁడుమార్గములను బట్టి ప్రతిమనుజుఁడును తనతన మార్గము చేతనే సిద్ధి లభించు నని చెప్పుచుండును. కాని తపస్విలకంటెను, కర్మఠులగు మీమాంసకులకంటెను, జ్ఞాననిష్ఠులగు సాంఖ్యులకంటెను (కర్మ-) యోగియే గాక, కర్మయోగ మనుమార్గముసైతము శ్రేష్ఠమయినది. మఱియు నీసిద్ధాంతమె పూర్వమునం దీకర్మకంటె కర్మ శ్రేష్ఠమైనది. (గీ. 3. ౮), కర్మసన్న్యాసముకంటె కర్మ-యోగము గొప్పది" (గీ. ౫. ౨) అను శ్లోకములయందు జెప్పఁబడినది. (గీతా.ర.ప్ర ౧౧. పు ౪౨౨,౪౨౩ చూడు) వేయేల? తపస్వి, మీమాంసకులు, జ్ఞానమార్గీయులు ననువారిలో ప్రతివానికంటెను కర్మ-యోగి శ్రేష్ఠుఁడు. కావుననే పూర్వమునందు యోగస్థుఁడవై కర్మలను జేయుము. (గీ. ౨. ౪౮; గీతా. ర. పు. ౬౯) లేక, "యోగము నాశ్రయించి లెమ్ము" (౪.౪౨) అని యర్జునున కుపదేశించినటులే యిక్కడను "నీవు కర్మ-యోగివి కమ్ము" అని మరల స్పష్టముగ నుపదేశించెను. మఱియు కర్మ-యోగ మిట్లు శ్రేష్ఠమని యంగీకరింపఁబడని యెడల "ఆహేతువువలన నీవు యోగివి కమ్ము" అను నుపదేశమందున్న "తస్మాత్"-(గనుక) అనుపదము నిరర్థక మగును. కాని సన్న్యాసమార్గీయులగు టీకాకారుల కీసిద్ధాంత మెట్లు సమ్మత మగును? కాన జ్ఞాని యనుపదమునకు నర్థమును మార్చి, జ్ఞానియనఁగా: శబ్దజ్ఞానము మాత్రమే గాని, పుస్తకజ్ఞానము మాత్రమే గాని కలిగినవాఁ డని యర్థముఁ గావించిరి. కాని యీయర్థము ముఖ్యముగ సాంప్రదాయకమగు నాగ్రహముచే జెప్పఁబడినది. కర్మవదలివేయు జ్ఞానమార్గము తక్కువది

యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః.౪౭

[ఇదియే గీతయొక్క యభిప్రాయ మనువిషయము టీకాకారుల కక్కఱలేదు. కారణ మేమన: నట్లొప్పుకొనినచో వారిసాంప్రదాయము గౌణ మయిన దగును. ఇందుచే నీకారణముననే "కర్మయోగో విశిష్యతే" (గీ. ౫. ౨) అనువాక్యమునకు వారర్థమును మార్పు చేసిరి. కాని దీనియొక్క పూర్ణ విచారము గీతారహస్యము ౧౧-వ ప్రకరణమునందు (పు. ౪౨౨) చేయబడియుండుటచే నీశ్లోకమునకు నేను వ్రాసిన యర్థపువిషయమై విశేషవిచారముఁ జేయను. కర్మ-యోగ మనుమార్గమే గీతానుసారముగ నన్నిటిలోను శ్రేష్ఠ మని మాత్రము మా యభిప్రాయము. ఇప్పుడు కర్మయోగులలో సైత మెట్టితారతమ్యము చూడవలయునో దానిని చెప్పుచున్నాఁడు.]

(౪౭) అయిన నన్ని (కర్మ-) యోగులలోను, ఎవఁడు నాయం దంతఃకరణమ్ము నుంచి శ్రద్ధచే నన్ను భజించుచున్నాఁడో యాతని నేనందఱిలో నుత్తముఁడైన యుక్తుఁ డని (అనఁగా: నుత్తమమగు సిద్ధినొందిన కర్మ-యోగి) తలచుచున్నాను.

[కర్మయోగమునందు సైతము భక్తిరూప మగు ప్రేమ గలియుటచే పాలలో పంచదార పడినట్లగునుగాన నాకర్మయోగి భగవంతునకు మిక్కిలి ప్రియుఁడగు నని యీశ్లోకమునకు తాత్పర్యము. ఇట్లనుటచే నిష్కామకర్మయోగముకంటెను, భక్తి శ్రేష్ఠమని యర్థము కాదు. కారణ మేమన: ముందు (౧౨) పండ్రెండవయధ్యాయమునందు ధ్యానముకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠమని భగవంతుఁడె స్పష్టముగఁ జెప్పియున్నాఁడు. (గీ. ౧౨. ౧౨) నిష్కామకర్మయొక్కయు, భక్తియొక్కయు సముచ్చయము శ్రేష్ఠ మనుమతమును, నిష్కామకర్మయోగమంతయు వ్యర్థమనియు భక్తియనునదియే శ్రేష్ఠమనియు చెప్పుమతమును భిన్నములే. గీతాసిద్ధాంతము మొట్టమొదటిది, భాగవతపురాణముయొక్క పక్షము రెండవది. క్రియాయోగమంతయు నధ్యాత్మజ్ఞానవిఘాతక మని భాగవతమున (భాగ. ౧. ౫. ౩౪) నిశ్చయింపఁబడినది. "నైష్కర్మ్యమప్యచ్యుతభావవర్జితం నశోభతే జ్ఞాన మలం నిరంజనమ్." నైష్కర్మ్య మనఁగా: నిష్కామ

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే ధ్యానయోగో నామ
షష్ఠోఽధ్యాయః. ౬

---

కర్మయును (భాగ. ౧౧. ౩. ౪౬) భగవద్భక్తి లేనిదే శోభింపదు వ్యర్థమగును. (భాగ. ౧. ౫. ౧౨. మఱియు ౧౨. ౧౨. ౫౨) అని భాగవతమందు మొదటిస్కంధమునను కడపటిస్కంధమునను జెప్పఁబడినది. భాగవతకారునకు భక్తియందుమాత్రమే కటాక్ష ముండుటచే నాయాస్థలముల యందు భగవద్గీతలోఁ జెప్పఁబడిన మతమునుసైతము నిరాకరించి ప్రవర్తించునని యీశ్లోకమునందుండి వ్యక్తమగును. మహాభారతమందును, గీతలయందును, భక్తి తగినంతగ వర్ణింపఁబడలేదని తలఁచియే వ్రాయఁబడిన భాగవతపురాణమునందుఁ జెప్పిన శ్లోకములవంటి వింకను గొన్ని యుండవచ్చును. అది యొకయాశ్చర్యము కాదు. కాని, నేను గీతాతాత్పర్యమునే విచారింపవలసినవాఁడను. భాగవతములో చెప్పినట్టి విషయమును జూడనక్కఱ లేదు. ఈరెంటియొక్క ప్రయోజనములును కాలములును వేర్వేఱుగనే యున్నవి. ఈహేతువుచే వానిరెండింటికి నేకవాక్యత చేయుట యుక్తము కాదు. అద్ది యట్లుండనిష్కః కర్మ-యోగమునందలిసామ్యబుద్ధిని సంపాదించుటకు నేసాధనము లపేక్షితములో వానిలో పాతంజలయోగమునందున్న సాధనము లీయధ్యాయమునందు నిరూపింపఁబడినవి. జ్ఞానము, భక్తియుం, నను నీరెండును నితరసాధనములుగ నున్నవి. మఱియు నిఁక చెప్పఁబోవు అధ్యాయము మొదలుకొని వానినిరూపణ యారంభింపఁబడుచున్నది.—]

ఈరీతిగ భగవంతునిచే గానము చేయఁబడిన ధ్యానయోగ మనుపేరి యాఱవ యధ్యాయము సమాప్తమయినది.



# సప్తమోఽధ్యాయః

---

## ఏడవయధ్యాయము.

[కర్మయోగము, సాంఖ్యయోగమువలెనే (మార్గమువలెనే) మోక్షప్రదమగును. కాని స్వాతంత్ర్యము దానికంటె శ్రేష్ఠమయినదియు నై యున్నది. మఱియు నీమార్గము స్వల్పముగ నాచరింపఁబడినను వ్యర్థముకాదని ప్రతిపాదించి యీమార్గముయొక్క సిద్ధినిమిత్తము కావలసినయింద్రియనిగ్రహమే ప్రకారముగఁ జేయవలసినదని నిరూపింపఁబడినది. కాని యింద్రియనిగ్రహము బాహ్యక్రియమాత్రమె యైనచో దాని నేల సాధింపవలయునో యింతవఱకు విచారింపఁబడలేదు. "కామక్రోధాదు లయినశత్రువు లింద్రియములయందుఁ బ్రవేశించి జ్ఞానవిజ్ఞానములనశింపఁజేయుచున్నారు. (౩.౪౦,౪౧) కాన మొదట నీయింద్రియముల నిగ్రహించి, నీశత్రువుల జయించికొనుము" అని భగవంతుఁడె యింద్రియనిగ్రహముయొక్క ప్రయోజనమును మూఁడవయధ్యాయమునందుఁ జెప్పినాఁడు. మఱియును బూర్వాధ్యాయమునందును నింద్రియముల నిగ్రహించుకొని "జ్ఞానవిజ్ఞానములచేఁ దృప్తుఁ డయినపురుషుఁడు, పరమేశ్వరుని సర్వభూతముల యందును, సర్వభూతములను పరమేశ్వరునియందును జూచుచున్నాఁడు." (౬.౨౯) అని చెప్పెను. కాన నింద్రియనిగ్రహ మెట్లు చేయవలయునో చెప్పినపిదప, జ్ఞానవిజ్ఞానము లనగ నేమియో, పరమేశ్వరుని బూర్ణముగ నెఱింగి కర్మలను వదలివేయక కర్మయోగమార్గమునందున్న యేవిధి నాచరించుటచే తుదకు నిస్సంశయముగ మోక్షము లభించునో యిప్పుడు తప్పక చెప్పవలసివచ్చినది. మఱియు నీవిషయమే యేడవయధ్యాయము మొదలు పదునేడవ యధ్యాయముచివరవఱకును, పదునొకండధ్యాయములలోఁ జెప్పఁబడినది; కడపటియధ్యాయమునందు (అనఁగా: పదునెనిమిదవయధ్యాయమున) కర్మయోగమంతయు నుపసంహరింపఁబడినది. సృష్టియందలి యనేకవిధము లగునట్టియు, ననేకములగు నశ్వరపదార్థములయన్నింటిలో

నవినాశి యగుపరమేశుఁ డొక్కఁడే నిండియున్నాఁ డని తెలిసికొనుటకే జ్ఞాన మని పేరు. మఱియు నిత్యుఁడైన పరమేశ్వరునియొక్కనిచేతనే, వివిధములును, నశ్వరములును అగుపదార్థము లెట్లుత్పన్నము లైనవో తెలిసికొనుటకు విజ్ఞాన మనిపేరు. (గీ. ౧౩.౩౦) మఱియు దీనినే క్షరాక్షర విచారమని చెప్పుదురు. ఇంతియకాక తనశరీరమందు (అనఁగా: క్షేత్రమునందు) ఆత్మయని చెప్పఁబడుదానియొక్క సత్యమగుస్వరూపము ఎట్టిదియు తెలిసికొనుటచేత పరమేశ్వరస్వరూపముయొక్క బోధ గల్గును. ఇట్టి విచారమునే క్షేత్రక్షేత్రజ్ఞవిచారమని చెప్పుచున్నారు. వీనిలో క్షర-అక్షర విచారమును మొదట నారంభించి పిదప క్షేత్ర-క్షేత్రజ్ఞవిచారమును పదమూఁడవయధ్యాయమునందు చేయుచున్నాఁడు. కాని పరమేశ్వరుఁ డొక్కఁడైనను నతనియొక్కయవ్యక్తస్వరూపము బుద్ధికిమాత్రమే తెలియఁదగినదైనను, వ్యక్తము, ప్రత్యక్షావగమ్యమని, యుపాసనయొక్క దృష్టిచే దానియందు రెండుభేదములు గలవు. కాని బుద్ధిచే పరమేశ్వరు నెట్లు తెలిసికొనవలసినదియు, శ్రద్ధచేతఁగాని, భక్తిచేతఁగాని, వ్యక్తస్వరూపము నుపాసించి, దానిమూలమున నవ్యక్తము నెట్లు తెలిసికొనవలసినదియు, నీనిరూపణమందే చెప్పవలసివచ్చును. అప్పు డీవిచారమున కంతకును పదునొకండధ్యాయములు పట్టునేని యది యొకయాశ్చర్యము కానేరదు. ఇంతియకాక యీ రెండుమార్గములచేతను, పరమేశ్వరుని యొక్క జ్ఞానమును, నింద్రియనిగ్రహమును స్వయముగనే పొందవలసి యుండుటచేత, నింద్రియనిగ్రహమునుమాత్రమే సంపాదించుకొనెడి పాతంజలయోగమార్గముకంటె జ్ఞానము, భక్తియు ననునీరెండుమార్గముల యొక్క యోగ్యతయు మోక్షధర్మములయం దధికముగ నంగీకరింపఁబడినది. అయినను నీవివేచనమంతయు కర్మ-యోగమార్గముయొక్క యుపపాదములో నంతర్భూతమైనది. స్వతంత్రమైనది కాదని జ్ఞప్తియం దుంచుకొనవలయును. అనఁగా: గీతయొక్క మొదటియాఱధ్యాయములందును, కర్మయు, రెండవషట్కమునందు భక్తియు, మూఁడవషట్కమునందు జ్ఞానము అని గీతయందు చేయఁబడిన స్వతంత్రములగు మూఁడువిభాగములును యథార్థముగ విచారింతుమేని సత్యమైనవి కావు. స్థూలముగఁ జూచితిమేని యీమూఁడువిషయములు వర్ణింపఁబడినవే; కాని యవి స్వతంత్రములు

శ్రీభగవానువాచ.

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. ౧
జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః,
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే. ౨

కావు. (కర్మ-) యోగమునకు నంగములుగ విచారింపఁబడినవని గీతారహస్యమునందలి పదునాల్గవ ప్రకరణమునందు (ప్ర. ౧౪. పృ. ౬౨౫-౬౨౯) ప్రతిపాదింపఁబడినవి. కాన నిచ్చట నావిషయములను మరలఁ జెప్పను. ఏడవ యధ్యాయమును భగవంతుఁ డెట్టు లారంభించెనో చూతము.—]

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు. (౧) ఓ పార్థా! నాయందు చిత్తము నుంచియు, నన్నే యాశ్రయించియు కర్మయోగము నాచరించుచు నీవు నన్ను యథాప్రకారముగ (విధిగను) పూర్ణముగను నిస్సంశయముగను నెట్లు తెలిసికొందువో దానిని వినుము. (౨) విజ్ఞానముతోఁ గూడుకొనిన యీజ్ఞానమును నేమియు శేషములేకుండునటుల నీకు నేను చెప్పుచున్నాను. దేన్నిని తెలిసికొనుటచే నీలోకమునందు మరలఁ దెలిసికొనఁదగిన దేమియు నుండదో దానిని చెప్పుచున్నాను.

[మొదటిశ్లోకమునందు "నన్నే యాశ్రయింపుము" అనుశబ్దములం బట్టియు, ముఖ్యముగ యోగశబ్దమునుబట్టియు, పూర్వాధ్యాయమునందు వర్ణింపఁబడినకర్మయోగము సిద్ధించుకొఱకై జ్ఞానవిజ్ఞానములు చెప్పఁబడినవి. కాని స్వతంత్రములైనవి కావనువిషయము స్పష్టమగుచున్నది. (గీతా. ర. ప్ర. ౧౪. పృ. ౬౨౪ చూడుము). ఈశ్లోకమునందే కాక గీతలలో మఱియొక చోటను సైతము "మద్యోగమాశ్రితః" (గీ. ౧౨.౧౧) "మత్పరః" (గీ. ౧౮.౫౭; ౧౧.౫౫) అనుశబ్దములు కర్మయోగము ననుసరించియే యున్నవనియు, కావున పరమేశ్వరుని యాశ్రయించి, యేయోగము నాచరింపవలయునని గీత చెప్పుచున్నదో యాయోగము పూర్వమందున్న యాఅధ్యాయములయందును ప్రతిపాదింపఁబడిన కర్మయోగమే యని చెప్పుటకు సందేహ మేమియు లేదు. విజ్ఞానశబ్దమునకు 'అనుభవసిద్ధమైన బ్రహ్మజ్ఞానము, లేక, బ్రహ్మసాక్షాత్కారము' అని యనేకు లర్థము చెప్పుచున్నారు. కాని పైనచెప్పినట్లు పరమేశ్వరజ్ఞానమునకే సమష్టిరూపము

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. ౩

(జ్ఞానమును) వ్యష్టిరూపము (విజ్ఞానము) నని రెండు భేదములు కలవనియు, నవియే జ్ఞానవిజ్ఞానశబ్దములచే నిర్దేశింపఁబడుచున్న వనియు నాకుఁ దోఁచుచున్నది. (గీ. ౧౩.౩౦ మఱియు ౧౮.౨౦ చూడుము) రెండవశ్లోకమునందున్న "మరలఁ దెలిసికొనవలసిన దేమియు నుండదు" అనుశబ్దము లుపనిషత్తుల యాధారముచేతనే ప్రయోగింపఁబడినవి. ఛాందోగ్యోపనిషత్తునందు శ్వేతకేతువు తండ్రిని "యేన...అవిజ్ఞాతం విజ్ఞాతం భవతి"—"ఏ యొకవస్తువును తెలిసికొనుటచే నంతయుఁ దెలియఁబడుచున్నదో యది యేది?" యని ప్రశ్నింపఁగా "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" (ఛాం. ౬.౧.౪)—"నాయనా! యెటులొక్క మట్టిముద్దయం దేమి యున్నదియు, దెలియఁబడునేని, మిగిలిన మృణ్మయపదార్థము లన్నియు, నామృత్తికయొక్క వేర్వేఱగు నామరూపముల ధరించినవికారములేగాని మఱియొక టేమియు గాదని తెలియునో"—యటులే బ్రహ్మను దెలిసికొనుటచే మఱియొక వస్తువును దెలిసికొనవలసినది యుండదు. అని వివరింపఁబడినది; మఱియు ముండకోపనిషత్తునందును (ముం. ౧. ౧. ౩) "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి" "దేనిని తెలిసికొనినచో నితరము లగువస్తువులన్నియుఁ దెలియఁబడును" అని యారంభమునందే ప్రశ్న చేయఁబడెను. దీనిం బట్టి యొక పరమేశ్వరునియొక్క జ్ఞానవిజ్ఞానములు గలిగినచో నీజగత్తునం దితరమైనదేమియుఁ దెలిసికొనవలసిన నవసర ముండదని స్పష్టమగుచున్నది. కారణ మేమన: జగత్తుయొక్క మూలతత్త్వ మొక్కటియే. అదియే నామరూపభేదముచే జగత్తునంతటను నిండియున్నది. అదో దక్క యితరవస్తు వేదియు జగత్తునందు లేదు; అనునద్వైతసిద్ధాంతమే యిచ్చో నుద్దేశింపఁబడినట్లు కాన్పించుచున్నది. అట్లు కానిచో రెండవశ్లోకమునందలి ప్రతిజ్ఞ సార్థక మయినది కాకపోవును.]

(3) వేలకొలది జనులలో నొకానొకండె సిద్ధిని సంపాదించుకొనవలయునని యత్నించును; ప్రయత్నించుచున్నవారిలో సైత మొకానొకనికే నాయొక్క సత్యమైనజ్ఞానము కల్గును.

భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా. ౪
అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్. ౫
ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా. ౬
మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. ౭

[ప్రయత్నించుపురుషులు సిద్ధపురుషు లని యిచ్చట చెప్పఁబడినను పరమేశ్వరజ్ఞానము గల్గినపిదపనే వారికి సిద్ధి కలుగును. కాని యూరకఁ గలుగదని తెలిసికొనవలయును. ఈపరమేశ్వరజ్ఞానమున క్షరాక్షర విచారమనియు, క్షేత్రక్షేత్రజ్ఞ విచారమనియు రెండుభాగములు గలవు. వానిలో క్షరాక్షరవిచారము నిప్పు డారంభించుచున్నాఁడు.—]

(౪) నాయొక్క ప్రకృతియే—పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము (ఈయైదు సూక్ష్మభూతములు.) మనస్సును, బుద్ధియు, అహంకారమును అని యెనిమిదివిధములుగ విభజింపఁబడినది (౫) ఇది 'అపరా' (అనఁగా: నికృష్టముగు) ప్రకృతి. ఓబాహువా! యర్జునా! ఇదిగాక దేనిచే నీజగత్తు ధరింపఁబడుచున్నదో యట్టి 'పరా' (అనఁగా: శ్రేష్ఠమైనది) శ్రేణిలోని చైతన్యజీవస్వరూపము నా రెండవప్రకృతి యని యెఱుంగుము. (౬) ఈ రెంటినుండియు సర్వభూతములు నుత్పన్నములగుచున్న వని యెఱుంగుము. నేనే జగత్తున కంతకును ప్రభువును (అనఁగా: మూలభూతుఁడను) ప్రళయము (అనఁగా: చివర) నయి యున్నాను. (౭) ఓధనంజయా! నాకంటె పరమునం దేమియును లేదు. దారమునం దనేక మణులు గ్రుచ్చఁబడినటుల నాయందివి యన్నియుఁ గూర్చఁబడియున్నవి.

[ఈ నాలుగు శ్లోకములలోను క్షర + అక్షరజ్ఞానముయొక్క సారమంతయు నిరూపింపఁబడినది. మఱియు నీవిషయమే ముందుశ్లోకములలో విస్తరింపఁబడినది. సాంఖ్యశాస్త్రమునందు సృష్టికంతకును నచేతనమైన (అనఁగా: జడమైన) ప్రకృతియు, సచేతనుఁడైనపురుషుఁడును స్వతంత్రములగు రెండుతత్త్వములు కారణము లని చెప్పి యీరెండుతత్త్వముల

నుండియు, పదార్థము లన్నియు నుత్పన్నములైన వనియు, వీరెంటి కంటెను పరముగ మూఁడవతత్త్వము లేదనియు ప్రతిపాదింపఁబడినది; కాని, గీతలకు నీయద్వైతము సమ్మతము కాదు. ఒకపరమేశ్వరునకే, ప్రకృతియు, పురుషుఁడు అను రెండువిభూతులుగల వనిచెప్పి జడప్రకృతి యనునది కనిష్ఠమగు స్తంభమనియు, జీవము (అనఁగా: పురుషుఁడను వాఁడు) శ్రేష్ఠమగు స్తంభరూప మయిన విభూతి యన్నియు, నాలుగైక శ్లోకములయందుఁ జెప్పఁబడిన దనియు, నీరెంటియందుండి స్థావరజంగమ సృష్టియంతయు నుత్పన్నమైన దనియుఁ జెప్పఁబడినది. (గీ.౧౩. ౨౬ చూడు) వీనిలో జీవభూతమగు శ్రేష్ఠ ప్రకృతియొక్క విచారము; క్షేత్రజ్ఞుఁ డనునామాతో ముందు పదమూఁడవ్యధ్యాయమునందు విస్తరింపఁబడినది. మిగిలినది జడప్రకృతి. ఇది స్వతంత్రురాలు కాదనియు, పరమేశ్వరుని యధీనమై యుండి, సృష్టినంతను నిర్మించుచున్న దనియు, గీతయొక్క సిద్ధాంతము. (గీ. ౯. ౧౦) ప్రకృతి గీతలలో స్వతంత్రురాలని యంగీకరింపఁబడకపోయినను సాంఖ్యశాస్త్రమునందు విభజింపఁబడిన భేదములే కొంచెము మార్పుతో గీతయందును జెప్పఁబడినవి. (గీ. తా. ర. ప్ర. ౭. పు. ౧౬౭-౧౭౦); మఱియు పరమేశ్వరునియొక్క మాయచే జడప్రకృతి యుత్పాదింపఁబడినపిదప (గీ. ౭. ౧౪) ప్రకృతినుండి పదార్థము లెట్లు నిర్మింపఁబడెన్నదియు, సాంఖ్యులచేఁ బ్రతిపాదింపఁబడిన సిద్ధాంతము నైతము (అనఁగా: గుణోత్కర్ష యొక్క తత్త్వమును) గీతకు సమ్మతమే. (గీతా. ర. ప్ర. ౯. పు ౩౩౧ చూడుము) సాంఖ్యులు ప్రకృతియు, పురుషుఁడును కలసి మొత్తముపై యిరువదియైదు తత్త్వము లని యందురు. వీనిలో ప్రకృతివలన నిరువదిమూఁడు (౨౩) తత్త్వములు బయలు వెడలుచున్నవి. ఈయిరువదిమూఁడింటిలో స్థూలభూతము లైదును, పది యింద్రియములును, మనస్సు అను నీపదునాఱును మిగిలిన యేడు తత్త్వములనుండియు బయలుదేరినవి. (అనఁగా : వానివికారము లైయున్నవి.) కాన, "మూలతత్త్వములెన్ని" యని విచారించునపు డీ పదునాఱింటిని వదలుచున్నారు. మఱియు వీనిని వదలివేయుదుమేని బుద్ధి (మహాన్) అహంకారము, పంచతన్మాత్రలు (సూక్ష్మభూతములు) ను కలిసి యేడేమూలతత్త్వములు మిగిలి యుండును. సాంఖ్యశాస్త్రమున నీయేడింటినే ప్రకృతివికృతు లని యందురు. ఈ యేడు ప్రకృతివికృతు

రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః,
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. ౮

లను, మూలప్రకృతియును గలిసి యిప్పు డెనిమిదివిధములగు ప్రకృతియే యగుచున్నది; మఱియు మహాభారతమునందు (శాం. ౩౧౦. ౧౦. ౧౫) దీనినే యష్టవిధమగు ప్రకృతి యనిచెప్పిరి. కాని యేడు, ప్రకృతివికృతులతో మూలప్రకృతిని లెక్కించుట గీతలకు యోగ్యమ్మని తోఁచలేదు. కారణ మేమన: ఎట్లగు నేని యొకటి మూలమనియు, దానికి నేడువికారములనియు భేదమును నిరూపించుటకు వీలులేదు. కాన నేడు ప్రకృతివికృతులను మనస్సును కలసి మూలప్రకృతి యెనిమిదివిధములుగ నుండు నని గీతలయందలి వర్గీకరణమునకును, మహాభారతమునందలి వర్గీకరణమునకును కొంచెము భేదము కలదు.(గీతా. ర. పు. ౨౮౬). సాంఖ్యులు సెప్పినటుల ప్రకృతి స్వాతంత్ర్యరాలని గీత యొప్పుకొనకపోయినను, ముందున్న విస్తృతమగు నిరూపణము రెండుపక్షములలో నొకటిగనే యున్నదని జ్ఞప్తియం దుంచుకొనవలయునని యిందలిసారాంశము. గీతలయందు వలెనె యుపనిషత్తులయందును పరబ్రహ్మమునుండియే సామాన్యముగ:—

ఏతస్మా జ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ,
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ.

"వీనినుండి(పురుషునివలన) ప్రాణము; మనస్సును, అన్ని యింద్రియములును ఆకాశమును, వాయువు, అగ్నియు; జలమును, విశ్వమును ధరించు పృథివియు నను నివియన్నియు నుత్పన్నము లగుచున్నవి" అని చెప్పఁబడినది. (ముండ ౨. ౧. ౩; కై ౧. ౧౫; ప్రశ్న ౬. ౪) (మఱియు విశేషముగఁ దెలిసికొనుటకై గీతారహస్యముయొక్క యెనిమిదవ ప్రకరణమును జూడుము). పృథివి మొదలగు పంచతత్త్వములను "నేనే" యని నాల్గవ శ్లోకమునందుఁ జెప్పఁబడినది; ఇప్పు డీతత్త్వములయం దేగుణములు గలవో యవియును "నేనే" యనియుఁ జెప్పి పదర్థములన్నియు సూత్రములోని మణులవలె గుంఫితము లైయున్న వని పూర్వమునందు చెప్పఁబడిన విషయమునె స్పష్టీకరించుచున్నాఁడు.—]

(౮) ఓకౌంతేయా! జలములో రసము నేను. చంద్రసూర్యులలోని కాంతిని నేను. ప్రణవము (ఓంకారము) నేను. ఆకాశమునందలి శబ్దము నేను.

పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు. ౯
బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్,
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినామహమ్. ౧౦
బలం బలవతా మస్మి కామరాగ వివర్జితమ్,
ధర్మా విరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ. ౧౧
యేచైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చయే,
మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు తే మయి. ౧౨

అందఱిలో నున్న పౌరుషమును నేనే యయి యున్నాను. (౯) పృథివియందున్న పుణ్యగంధము (అనఁగా: సువాసన) నేను. అగ్నియందున్న తేజస్సు నేను. సర్వభూతములయందున్న జీవనశక్తియును, తపస్సు జేయువారియొక్క తపస్సును నేనే. (౧౦) ఓ పార్థా! సర్వభూతములకు సనాతన మగుబీజమును, నేనే యని తెలిసికొమ్ము. బుద్ధిమంతులయొక్క బుద్ధిని నేను. తేజశ్శాలురయొక్క తేజస్సు సైతము నేనే. (౧౧) కామమును (వాసన) రాగము (అనఁగా: విషయాసక్తి) గాక బలవంతులలో బలమును నే నయియున్నాను. మఱియు నోభరతశ్రేష్ఠా! ధర్మమునకు విరుద్ధముగాని భూతములయం దున్న కామమును నేనే యయి యున్నాను. మఱియు సాత్త్వికములును, రాజసములును, తామసములు నగుభావము (పదార్థములు) అన్నియు నావలన బయలువెడలిన దనియుఁ దెలిసికొమ్ము. కాని యవి నాయందున్నవి. నేను వానియందు లేను.

[“అవి నాయం దున్నవి, నేను వానియందు లేను” అనువాక్యము నందలి యర్థము మిక్కిలి గంభీరముగ నున్నది. మొదటి (అనఁగ : తేటగా నున్న) యర్థమే మనపదార్థములన్నియు పరమేశ్వరునియందుండి వెలువడిన వైనందున మణులయందున్న దారమువలె నీ పదార్థములయందున్న గుణ ధర్మములును పరమేశ్వరుఁడే యయినను, పరమేశ్వరునివ్యాప్తి యంతటితో నాగలేదనియు, దీనిని వ్యాపించి పరమందును నాపరమేశ్వరుఁడే యున్నాఁడనియుఁ దెలిసికొనవలయును; మఱియు నీవిషయమే ముందు “ఈజగత్తంతయు నేనొక యంశచే వ్యాపించియున్నాను” (గీ ౧౦.౪౨) అను శ్లోకమునందుఁ జెప్పఁబడినది. కాని యీయర్థముగాక, మఱియొక యర్థము సైతము తప్పక వివక్షితమయియున్నది. అదేమన, త్రిగుణాత్మక

త్రిభిర్గుణమయైర్భావైరేభిః సర్వమిదం జగత్,
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్. ౧౩
దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే. ౧౪

[మనుజగత్తునందున్న నానాత్వము నావలన నిర్మింపఁబడినట్లు కాన్పించినను, నానానాత్వము నాయొక్క నిర్గుణస్వరూపమునం దుండదు; మఱియు నీ రెండవయుక్తమును మనస్సులో నుంచుకొని "భూతభృత్ నచ భూతస్థః" (౯. ౪ మఱి ౫) మొదలగుపరమేశ్వరునియొక్క యలౌకికమగు శక్తి ముందు వర్ణింపఁబడినది. (గీ. ౧౩. ౧౪-౧౬) పరమేశ్వరునియొక్క వ్యాప్తి యీరీతిగ సర్వజగత్తుకంటె నధికమైనచో నిజమయిన పరమేశ్వర స్వరూపము నెఱుంగుటకు నీమాయికమగు జగత్తుకంటెను పరముగ విచారింపవలయుననీ స్పష్టమగుచున్నది; మఱియు నీవిషయమునే స్పష్టముగ ప్రతిపాదించుచున్నాఁడు.—]

(౧౩) (సత్త్వమును, రజస్సును, తమస్సు నను నీ) త్రిగుణాత్మకములగు పదార్థములచే మోహితమైన యీ జగత్తంతయు, దీనికంటె పరముగ నున్నవాఁడును నవ్యయుఁడ (నిర్గుణమగు) నగువాఁడును నగు నన్ను తెలిసికొనలేదు.

[మాయ, లేక యజ్ఞానమనునది త్రిగుణాత్మకములగు దేహేంద్రియములధర్మముగాని యాత్మధర్మము కానేరదు. ఆత్మజ్ఞానమయుఁడును, నిత్యుఁడును, నయియున్నాఁడు—వాని నింద్రియములు భ్రమింపఁజేయుచున్నవి. అని మాయాసంబంధమున గీతారహస్యమునందలి తొమ్మిదవప్రకరణమున చెప్పఁబడిన సిద్ధాంతమే అద్వైతమతమునందలి సిద్ధాంతము. అదియే యీశ్లోకమునందు చెప్పఁబడినది. (గీతా. ౭. ౨౪. మఱియు. గీ. ర. ప్ర ౯. పు. ౩౨౩-౩౩౭ చూడు.—]

(౧౪) గుణాత్మకమును, దివ్యము నగు నా మాయ దుస్తరమైనది. కాన నన్నే శరణుజెందువా రీమాయను తరింతురు.

[సాంఖ్యశాస్త్రమునందు చెప్పఁబడిన త్రిగుణాత్మకప్రకృతినే గీతలయందు భగవంతుఁడు తనమాయ యని చెప్పుచున్నాఁడని దీనింబట్టి స్పష్టమగుచున్నది. మహాభారతమందలి నారాయణీయోపాఖ్యానమందు భగవంతుఁడు నారదునకు విశ్వరూపముఁ జూపి—

నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః. ౧౫
చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః. ౧౭
ఉదారాః సర్వఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాంగతిమ్. ౧౮

మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద,
సర్వభూతగుణై ర్యుక్తం నైవ త్వం జ్ఞాతు మర్హసి.

"ఓ నారదా! నీవు చూచుచున్నది నాచే కల్పింపఁబడినమాయ యయి యున్నది. సర్వభూతములయొక్కయుగుణములతో నేను కూడికొనియున్నానని నీవనుకొనకుము—" అని శివుఁడు చెప్పెనని యున్నది. (శాం. ౩౩౯-౪౪) ఆసిద్ధాంతమే యిప్పుడిక్కడనైతము చెప్పఁబడినది. మాయ యన నేమియో గీతారహస్యమున ౯, ౧౦ ప్రకరణముల నిరూపింపఁబడినది చూఁడుము.—]

(౧౫) మాయచే నశించినజ్ఞానము గలవారును, మూఢులును, దుష్కర్ములును నగు నరాధము లాసురబుద్ధికి లోఁబడినందున నన్ను శరణుజెందరు.

[మాయయందు మగ్నులగులోకులు పరమేశ్వరుని మఱచిపోదు రనియు, నాశము నొందుదు రనియు చెప్పఁబడినది. ఇప్పుడు పరమేశ్వరుని శరణు జొచ్చి భజించువారిని వర్ణించుచున్నాఁడు.—]

(౧౬) ఓభరతశ్రేష్ఠుఁడ వగునర్జునుఁడా! ఆర్తులు (రోగపీడితులు), జిజ్ఞాసులు(జ్ఞానమును తెలిసికొనవలయునని కోరికగలవారు), అర్థార్థులు (ద్రవ్యము మొదలగువానిని గోరువారును), జ్ఞానులు ననునాల్గుతెగలవారు నన్ను సేవింతురు. మఱియు జ్ఞాని పరమేశ్వరుని తెలిసికొని కృతార్థుఁడగుటచే నేమియును సంపాదించుకొన నవసరము లేకపోయినను నిష్కామబుద్ధితో నన్ను భజించును,(౧౭) వీనిలో ననన్యభావమున, నన్ను భజించువాఁడును, ఎల్లప్పుడును నిష్కామబుద్ధితో వ్యవహరించువాఁడును నగు జ్ఞాని గొప్పవాఁడు; జ్ఞానికి నేను మిక్కిలిప్రియుఁడను. జ్ఞాని నాకత్యంతమును ప్రియుఁడు. (౧౮) ఈభక్తులెల్లరును మంచివారలు; కాని

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే,
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః. ౧౯

వారెల్లరలోను జ్ఞానియన 'నేనే' యని నామతము. కారణమేమన: యుక్తచిత్తుఁ డగుచు నందఱికంటె నుత్తమోత్తమగతియగు నాయందే వాఁడు స్థిరుఁడై యుండును. అనేకజన్మము లెత్తినపిదప "సర్వమును వాసుదేవుఁడే" యని యనుభవము లోనికి తెచ్చుకొని జ్ఞానవంతుఁడు నన్ను పొందుచున్నాఁడు. అట్టిమహాత్ముఁడు మిక్కిలి దుర్లభుఁ డగును.

[ప్రకృతి, పురుషుఁడు నను రెండును నాస్వరూపములే యనియు, నేనే నేకత్వముతో నలుప్రక్కల నిండియున్నాననియు తనయొక్కస్వరూపమును క్షరాక్షరదృష్టితోఁ దెలిపి యీస్వరూపమును భజించుటచే పరమేశ్వరునియొక్కజ్ఞానము గల్గునని భగవంతుఁడు పైనచెప్పినదానియం దున్నతాత్పర్యమును బాగుగ జ్ఞప్తియం దుంచుకొనవలయును. వ్యక్తోపాసనగాని, యవ్యక్తోపాసనగాని యందఱును చేయవలసినదే. కాని యీరెంటిలో వ్యక్తోపాసన మిక్కిలి సులభమయినదగుటచే దానినే యిక్కడ చెప్పుచున్నాఁడు. దానికే భక్తి యని పేరు. అయినను స్వార్థబుద్ధితో నొకానొకకారణముచే పరమేశ్వరుని భజించుటయనెడు భక్తిమార్గము నికృష్టమయినది. పరమేశ్వరజ్ఞానము కావలయు ననుతలంపుతో భజించువాఁడు (జిజ్ఞాసువు) నయితము నికృష్టుఁడే యని తెలిసికొనవలయును. కారణ మేమన: నతనిజ్ఞాన మిప్పటికిని పరిపూర్తి కాలేదని యతనియొక్క జిజ్ఞాసుత్వావస్థనుం బట్టియే స్పష్టమగుచున్నది. అయినను వీరందఱును భజించువారగుటచే సుదారులు (అనఁగా: మంచిమార్గమున నడుచువారు) అని చెప్పఁబడినది. (శ్లోక. ౧౮) కాని జ్ఞానప్రాప్తిచే కృతార్థుఁడయి, యీజగత్తునందు చేయఁదగినది కాని, లేక పొందఁదగినది కాని లేనివాఁ డగుజ్ఞాని (గీ. 3. ౧౭-౧౯) నిష్కామబుద్ధితో చేయుభక్తి (భాగ. ౧. ౭. ౧౦) యన్నింటికంటెను శ్రేష్ఠమయినదని మొదట మూఁడుశ్లోకములకును తాత్పర్యము ప్రహ్లాదనారదాదులభక్తి యీశ్రేష్ఠవర్గములోనిదే. ఈకారణముననే భక్తియోగమన "పరమేశ్వరునందు నిర్హేతుకము, నిరంతరము నయినభక్తి" యని భాగవతమునందు భక్తియొక్కలక్షణము చెప్పఁబడినది. (భాగ. 3. ౨౯. ౧౨; మఱియు గీతార. ప్ర. ౧౩. పు. ౫౮౮ చూడు)

కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యన్తే౽న్యదేవతాః,
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా.
యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్. ౨౧

[‘ఏకభక్తిః’ అనియు, ‘వాసుదేవః’ అనియు ౧౭వ ౧౯వ శ్లోకములయం దున్న పదములు భాగవతధర్మములయం దున్నవి. వేయేల? పైనచెప్పిన భక్తులయొక్క విషయమంతయు భాగవతధర్మములనుండియే గ్రహింపఁబడినదనియు చెప్పవచ్చును. కారణమేమన: మహాభారతమునం దీధర్మములను జెప్పుచు—

చతుర్విధా మమజనా భక్తా ఏవం హి మే శ్రుతమ్,
తేషా మేకాంతి నశ్శ్రేష్ఠా యేచైవా నన్యదేవతాః.
అహ మేవ గతి స్తేషాం నిరాశీః కర్మకారిణామ్.
యే చ శిష్టా స్త్రయో భక్తాః ఫలకామా హి తే మతాః,
సర్వే చ్యవనధర్మా స్తే ప్రతిబుద్ధ స్తు శ్రేష్ఠభాక్.

మహా. భా. శాం. ౩౪౧. ౩౩-౩౫) అని నాల్గుతెగలభక్తులను మొదట నెత్తుకొని యనంతర మనన్యదైవతుఁడును, నేకాంతికుఁడును, ఫలాశారహితుఁడై కర్మలను చేయువాఁడును నగు భక్తునివలె మిగిలిన మువ్వురు భక్తులును కర్మలను చేయక యేదో యొకయుద్దేశమును మనస్సున నిడికొని భజించుచున్నారు. కాన చ్యవనశీలురను, నేకాంతప్రతిబుద్ధులును (అనఁగా: తెలిసికొన్నవారు) శ్రేష్ఠులని చెప్పఁబడినది. మఱియు నటుపిమ్మట “సర్వభూతాధివాస శ్చ వాసుదేవ స్తతో హ్యహమ్”—సర్వభూతములయందును నేను వసించుచున్నాను కాన నన్ను వాసుదేవుఁ డనుచున్నారు— అని వాసుదేవశబ్దమున కాధ్యాత్మికమగు వ్యుత్పత్తి చెప్పఁబడినది. (శాం. ౩౪౧. ౪౦) అది యట్లుండనిమ్ము. అంతటను నొకపరమేశ్వరుఁడే యున్నచో వేర్వేఱగుదేవతలను లోకు లెందు కుపాసించుచున్నదియు, నిట్టియుపాసకులకు నేమిఫలము సిద్ధించునదియు నిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౨౦) తమతమ ప్రకృతినియమానుసారముగ నాయా (స్వర్గాదిఫలముల యందలి) వెట్టివెట్టికోరికల నొందినలోకు లాయాయుపాసనలయొక్క కోరికల ననుసరించుచు నితర (వేర్వేఱు) దేవతలను భజించుచున్నారు—(౨౧) ఏయే

స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్. ౨౨
అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్,
దేవాన్దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి. ౨౩

భక్తు లేయేరూపమును (అనఁగా: దేవతలను) శ్రద్ధతో నుపాసింపనిచ్చయించుచున్నారో వారివారి కా శ్రద్ధనే నేను స్థిరపఱచుచున్నాను. (౨౨) కాన, నా శ్రద్ధతో యుక్తుఁడై వాఁడా దేవతయొక్క యారాధనమును చేయుట కారంభించును; కాని నాచే నిర్మింపఁబడిన యా కామఫలములను మాత్రమే యాతఁడు సంపాదించుకొనుచున్నాఁడు. (౨౩) కాని యీ యల్పబుద్ధిగలవారికి కలిగెడు ఫలములు నశ్వరము లయి యున్నవి. (మోక్షమువలె స్థిరములుగ నుండునవి కావు.) దేవతలను భజించువారు దేవతల నొందుచున్నారు. నా భక్తులు నన్ను బొందుచున్నారు.

[పరమేశ్వరుఁడు మోక్షము నిచ్చువాఁడయినను సంసారమునందు కోరఁబడునట్టి యనేకములయిన నిష్టవస్తువుల నిచ్చుశక్తి దేవతకే యున్నది; కావున నా దేవతలనే యుపాసింపవలయును, అని సామాన్యజను లెన్నెదరు. దేవతలయొక్క యుపాసన యిట్లు ప్రాప్తమయినపిదప పుట్టినప్పటినుండియు నెవరికెట్టి శ్రద్ధ యుండునో దాని ననుసరించి, (గీ.౧౭. ౧-౬ చూడు) కొందఱు అశ్వత్థమును, కొందఱు శనివారమందు శనిని, పూజించుట కెట్లభ్యాసపడగలరో పైశ్లోకమునందు సుందరముగఁ జెప్పఁబడినది. దీనియందు ముఖ్యముగ గమనింపవలసినవిషయ మేమన: వేఱ్వేఱు దేవతలయొక్క యారాధనచే ప్రాప్తమగుఫలము, నా యా యి దేవత యిచ్చుచున్నదని మన మనుకొన్నను, నదియు నొకవిధముగ పరమేశ్వరునియొక్క యారాధనమే యగును. (గీ.౯.౨౩) ఫలములను మాత్రము పరమేశ్వరుఁడే యిచ్చుచున్నాఁడు. (శ్లో.౨౨); ఇంతియకాక, ఏదేవతనైన యారాధింతమని బుద్ధిని సైతము పూర్వకర్మానుసారముగ పరమేశ్వరుఁడే యిచ్చుచున్నాఁడు. (శ్లోక.౨౧) కారణ మేమన: ఈజగత్తునందు పరమేశ్వరునికంటె నితరమైన దేదియు లేదు. వేదాంతసూత్రములయందును (౩.౨.౩౮-౪౧) నుపనిషత్తులయందును నీవిషయమే సిద్ధాంతము చేయఁబడినది. (కౌషీ.౩.౮) ఈ వేఱ్వేఱు దేవతలను భజింపఁగా, బుద్ధిస్థిరమును, శుద్ధము నగుటచే తుదకు నొకఁడును, నిత్యుఁడు నగుపర

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః,
పరం భావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్. ౨౪
నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః,
మూఢో ఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ౨౫

మేశ్వరునియొక్క జ్ఞానము కల్గుటయే యీ వేర్వేఱు పాసనలవలన గల్గు నుపయోగము. కాని యంతకుముందు కలుగుఫలములన్నియు ననిత్యము లయినవనియు, నీఫలాశయందు మగ్నుఁడు కాక, జ్ఞానియగు ప్రతివాఁడును భక్తుఁ డగుటకుఁ బ్రయత్నింపవలయు ననియు భగవంతుఁ డుపదేశించెను. అన్నిపనులను చేయువాఁడను, నన్నిఫలముల నిచ్చువాఁడను నయినను, వారివారికర్మానుసారముగ ఫలముల నిచ్చువాడను గాన (గీ.౪.౧౧) నిజముగ విచారించిన నేనేమియు చేయువాఁడను కానని చెప్పుదురు.(గీ.౫.౧౪) (గీతారహస్యమునందలి ౧౦, ౧౩, ప్రకరణములయందు, ౩౬౬, ౬౪౪ పుటలయం దీవిషయమై విశేషముగ చర్చింపఁబడినది, కాన చూడుము) ఇప్పుడు దేవతారాధనముయొక్క ఫలమును పరమేశ్వరుఁడే యిచ్చుచున్నాఁ డనువిషయమును మఱచిపోయి ప్రకృతిస్వభావానుసారముగ లోకులీదేవతలను వెంబడించుచున్నారని పైన చెప్పినవిషయమును స్పష్టీకరించుచున్నాఁడు—].

(౨౪) బుద్ధిశూన్యులు నాయొక్క శ్రేష్ఠము, నుత్తమోత్తమము నవ్యయము నగురూపమును తెలిసికొనలేక యవ్యక్తుఁడనైన నన్ను వ్యక్తుఁడనుకొనుచున్నారు. (౨౫) నేను నాయోగరూపకమగు మాయచే నాచ్ఛాదితుఁడ నగుటచే నెల్లవారికిని స్వస్వరూపముతోఁ గన్పట్టను. నే నజుఁడను, నవ్యయుఁడను నని మూఢులు తెలిసికొనలేరు.

[యోగ మనఁగా నవ్యక్తస్వరూపమును వదలివేసి వ్యక్తస్వరూపమును ధరించెడియుక్తి. (గీ ౪.౬; ౭.౧౫; ౯.౭ చూడు) దీనినే వేదాంతులు మాయ యని చెప్పుచున్నారు. మఱియు నీయోగమాయచే పరమేశ్వరుఁ డాచ్ఛాదితుఁడగు నేని వ్యక్తస్వరూపధారియగుచున్నాఁడు. వ్యక్తసృష్టి మాయికమును, ననిత్యమును నవ్యక్తుఁడగుపరమేశ్వరుఁడు మాత్రము సత్యుఁడును, నిత్యుఁడునునై యున్నాఁడని యీశ్లోకమునకు భావార్థము. కాని యిక్కడను నితరస్థలములయందును, మాయాశబ్దమునకు నలౌకికమగు, లేక

విలక్షణమను శక్తి యని యర్థము చేసికొని, యనేకు లీమాయ యసత్యమైనది కాదనియు పరమేశ్వరునివలె నిత్యమయినదనియు ప్రతిపాదించుచున్నారు. మాయాస్వరూపము గీతారహస్యమందలి తొమ్మిదవ ప్రకరణమునందు సవిస్తరముగ విచారింపఁబడి యచ్చో చెప్పఁబడెను: మాయ యనునది పరమేశ్వరునియొక్క యేయొకానొక విలక్షణమును ననాదియు నగులీల యని యద్వైతవేదాంతులును నొప్పుకొందురు. కారణ మేమన: మాయ యనునది యింద్రియములచే నుత్పాదింపఁబడినదియు, దృశ్యమైనదియు నైనను, నింద్రియములు పరమేశ్వరునియొక్క సత్తచేతనే యీ కార్యమును చేయుచున్నవి గాన మాయ తుదకు పరమేశ్వరునియొక్క లీలయె యని చెప్పవచ్చును. ఈ మాయ తత్త్వమును బట్టి చూడఁగా సత్యమైనదా? లేక మిథ్యాభూతమైనదా? యనునదిమాత్రమే యిట వివాదాంశము. మఱియు నీవిషయమై యే నామరూపాత్మకమగు మాయచే నవ్యక్తుఁడగు పరమేశ్వరుఁడు వ్యక్తుఁడుగఁ దలఁపఁబడుచున్నాఁడో యా మాయచేతనే దానిని యలౌకికశక్తి యనిగాని మఱియొకటి యనిగాని యనవచ్చును. అజ్ఞానముచే నుత్పన్నమైన, కాన్పించువస్తువు లేక మోహము గాన సత్యమగు పరమేశ్వరతత్త్వము, దీనికంటె భిన్నముగ నున్నదని యద్వైత వేదాంతమును ననుసరించియే, గీతయొక్కయు సిద్ధాంత మున్నదని పై శ్లోకమునుండి స్పష్టమగును. లేకపోయినచో 'నీబుద్ధి' యని గాని, 'మూఢ' యని గాని పదమును ప్రయోగించుటకు కారణమేమియు నుండదు. కాన మాయ సత్యమైనది కాదనియు, పరమేశ్వరుఁ డొక్కరుఁడె సత్యుఁడై యున్నాఁ డనియు నిందలి సారాంశము — మాయచే మోహితులగుటచే లోకు లనేకదేవతలను వెంబడించుచున్నారని గీత చెప్పుచున్నది. బృహదారణ్యకోపనిషత్తునందును (బృ. ౧. ౪. ౧౦) ఆత్మయును, బ్రహ్మయును నొక్కటే యని యెఱుంగక భేదభావముతో వేర్వేఱు దేవతలను పూజించువారు దేవతలకు పశువులని (అనఁగా: గోవు మొదలగు పశువులవలన మనుష్యులకు లాభమైన ట్లీయజ్ఞానులగు భక్తులవలన దేవతలకు మాత్రమే లాభము కలదనియు వారిభక్తులకు మోక్షము గలుగదని) చెప్పఁబడినది. మాయయందు మగ్నులై యనేకదేవతలను భేదభావముతో నుపాసించువారివర్ణన సమాప్తమయినది. ఇప్పు డామాయనుండి క్రమక్రమముగ విముక్తి యెట్లగునదియుఁ జెప్పుచున్నాఁడు —]

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున,
భవిష్యాణిచ భూతాని మాంతు వేద నకశ్చన. ౨౬
ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత,
సర్వభూతాని సమ్మోహం సర్గేయాంతి పరంతప. ౨౭
యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్,
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః. ౨౮
§§ జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే,
తే బ్రహ్మ తద్విదుఃకృత్స్న మధ్యాత్మం కర్మచాఖిలమ్. ౨౯
సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః,
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః. ౩౦

(౨౬) భూతభవిష్యద్వర్తమానకాలములయం దుత్పన్నములయిన సర్వ ప్రాణులను నేనెఱుఁగుదును. కాని, యో యర్జునా! నన్నెవరును తెలిసికొనేరరు. (౨౭) కారణమేమన: నో భారతా! యో పరంతపా! యింద్రియములయొక్క యిచ్ఛాద్వేషములవలన గల్గు (సుఖదుఃఖాది) ద్వంద్వముల మోహముచే సీసృష్టి యందలి సర్వభూతములును భ్రమఁ జెందుచున్నవి. (౨౮) కాని పాపములన్నియు నశించుటచే పుణ్యాత్ములగు వారు (సుఖదుఃఖాది) ద్వంద్వములయొక్క మోహము నుండి ముక్తులయి దృఢవ్రతులుగ నన్ను భజించుచున్నారు.

[ఇట్లు మాయనుండి ముక్తులయిన పిదప వారియొక్క స్థితి యెట్లుండునో ముందు చెప్పుచున్నాఁడు—]

(౨౯) (ఈరీతిగ) నన్నాశ్రయించి జరామరణములనుండి ముక్తులగుటకు ప్రయత్నించువారు ఆ బ్రహ్మమును, నధ్యాత్మమును, సమస్తకర్మలను తెలిసికొను చున్నారు. (౩౦) మఱియు నధిభూతము, నధిదైవతము, నధియజ్ఞము ననునవి సైతము నేనే యైనట్లు తెలిసికొన్నవారు యుక్తచిత్తులు. వారు మరణసమయమునందు సైతము నన్ను తెలిసికొనుచున్నారు.

[అధ్యాత్మము, అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము నన నేమో ముందటియధ్యాయమునందుఁ జెప్పఁబడినది. మరణసమయమునందు మనుజునియొక్క మనస్సునం దేబుద్ధి ప్రబలమై యుండునో తదనుసారముగ ముందుజన్మ గలుగునని, ధర్మశాస్త్రముయొక్కయు, నుపనిషత్తులయొక్క

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానవిజ్ఞానయోగో నామ
సప్తమోఽధ్యాయః. ౭

యీ సిద్ధాంతము ననుసరించి "మరణసమయమునందు సైతము" అని యీ చివరశ్లోకమునందు చెప్పఁబడినది. అయినను మరణమునకంటె పూర్వము పరమేశ్వరుని పూర్ణముగ తెలిసికొనిన గాని యంత్యకాలమునందే యీజ్ఞానము గల్గుటకు శక్యము కాదని చివరశ్లోకమునందున్న 'అపి' యనుపదముచే స్పష్టమగుచున్నది (గీ. ౨. ౭౨ చూడుము) ముందటి యధ్యాయమునం దీవిషయము విస్తరింపఁబడినది. అధిభూతాదిశబ్దములచే ముందటియధ్యాయము యొక్క ప్రస్తావనయే యీరెండుశ్లోకములయందును చేయఁబడెనని యనఁ జెప్పవచ్చును.]

ఇట్లు శ్రీభగవంతునిచే చెప్పఁబడిన, యుపనిషత్తులయందు బ్రహ్మవిద్యాంతర్గతమగు (కర్మ-) యోగశాస్త్రమునందు శ్రీకృష్ణార్జునుల సంవాదమందలి జ్ఞానవిజ్ఞానము పేరుగల యేడవయధ్యాయము సమాప్తమయినది.



# అష్టమోఽధ్యాయః.

## ఎనిమిదవ యధ్యాయము.

[కర్మయోగాంతర్గతములగు జ్ఞానవిజ్ఞానముల నిరూపణమే యీయధ్యాయమునందును జేయఁబడినది. బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము నని పూర్వాధ్యాయము కడపట పరమేశ్వర స్వరూప మనేక ప్రకారములుగఁ జెప్పఁబడినది. కాన వాని కర్థములు చెప్పి వానియందలి యథార్థమును మొదట వివేచన చేయుచున్నాఁడు. కాని యీవివేచన మీశబ్దములకు మిక్కిలి సంక్షిప్తముగ వ్యాఖ్యానము చేయుటచేత దీని నీయవతరణికయందు కొంచెము బాగుగ వివరించుట యావశ్యక మయినది. బాహ్యసృష్టిని చూచి సృష్టికర్త ననేకు లనేకవిధములఁ గల్పించుచున్నారు. సృష్టియందున్న నిఖిలపదార్థములును పంచభూతములయొక్క వికారములే యగుటచే నీపంచమహాభూతములు దక్క వీనికి మూలభూతమగు మఱియొకతత్త్వ మేదియు లేదని కొంద అందురు. గీతలయందలి చతుర్థాఽధ్యాయమునందుఁ జెప్పఁబడినట్లు జగత్తంతయు యజ్ఞములనుండి యుత్పన్నమయినవి కాన, పరమేశ్వరుఁడు యజ్ఞనారాయణస్వరూపుఁడగుటచే యజ్ఞములచేతనే యాయనను పూజింపవలయునని పలువురు ప్రతిపాదించుచున్నారు. సృష్టియందున్నవ్యాపారమును జడపదార్థములు, తమంతట తామే చేయనేరవు. కాని వానిలోఁ బ్రతిదానియందును యెవఁడో యొకసచేతనపురుషుఁడు గాని, యేదియో యొకదేవతగాని యుండును. ఆదేవతయే వ్యవహారమును జేయుచున్నది. కాని నాదేవతను మన మారాధింపవలయును. ఉదాహరణము. సూర్యుఁడనెడు జడమును, పాంచభౌతికము నగుగోళమునందున్న సూర్య డను పేరుగలపురుషుఁడె ప్రకాశము నిచ్చుట మొదలగు కర్మలఁ జేయును. కాన నతఁడే యుపాస్యుఁ డనికొంద అందురు. ప్రతిపదార్థమునందును నాపదార్థముకంటె వేఱొకదేవత వసించుచున్నదని చెప్పుట యుక్తము

కాదు. మనుష్యశరీరమున నాత్మ నివసించుచున్నటుల ప్రతివస్తువునందును నావస్తువుయొక్కయే, యేదో యొకానొకసూక్ష్మమగు రూపము(అనఁగా: నాత్మ నంటిసూక్ష్మశక్తి) వసించుచుండును గాన, నదియె యావస్తువునకు మూలమం దున్నదియు, సత్యమును నగుస్వరూపము. ఉదాహరణము- స్థూలము లగుపంచమహాభూతములందు సూక్ష్మములగు పంచతన్మాత్రలును, హస్తపాదాదిస్థూలేంద్రియముల యందు సూక్ష్మేంద్రియములును మూల భూతములయి యున్నవని మఱికొందఱ అందురు. ప్రతిమనుజునియొక్కయు నాత్మ సైతము వేర్వేఱుగ నుండుటచే పురుషు లసంఖ్యులుగ నున్నారను సాంఖ్యమత మీనాల్గవమతమునే యవలంబించి యున్నది; కాని ప్రకృత మునం దీసాంఖ్యమతము 'నధిదేహమను' వర్గమునందుఁ జేర్పవలసియున్నట్లు కన్పట్టుచున్నది. ఈనాలుగుపక్షములకే క్రమముగ నధిభూతము, అధి యజ్ఞము, అధిదైవతము, నధ్యాత్మము నని పేర్లు. 'అధి' యను నుపసర్గ నేశబ్దమున కైనను వెనుక ప్రయోగింతుమేని 'తమధికృత్య', 'తద్విషయక' 'దానిలోని' లేక 'దానియందుండెడి' యని యర్థమగును. ఈ యర్థాను సారముగ నధిదైవతమన ననేకదేవతలయం దుండుతత్త్వ మని యర్థము "అధ్యాత్మశబ్దమునకు "ఒకయాత్మయే యన్నింటియందు నున్నది యని ప్రతిపాదించుశాస్త్రము." అని సామాన్యముగు నర్థము; కాని యీయర్థము సిద్ధాంతపక్షములోనిది (అనఁగా: ననేకములగు వస్తువులయందును మను ష్యులయందును సైత మనేకములగు నాత్మలు కలవా యని చేయఁబడు పూర్వపక్షముయొక్క సిద్ధాంతములోనిది) యగుటచే వేదాంతశాస్త్రముచే నాత్మైక్యమనునది సిద్ధాంతీకరింపఁబడినది. కాన, నాపూర్వపక్షము విచా రింపవలసివచ్చినప్పుడు ప్రతిపదార్థముయొక్కయు సూక్ష్మమగు స్వరూపము (అనఁగా: నాత్మ) వేఱే యని యందురు. ప్రకృతమునం దధ్యాత్మశబ్ద మున కీయర్థమే చెప్పఁబడినది. ఒక వివేచనమే యధ్యాత్మము, అధిదైవ తము, అధిభూతము ననుదృష్టిచే నిట్లేల భిన్నమైనదియో మహాభారతము నందు మనుష్యుని యింద్రియములయొక్క యుదాహరణముతో స్పష్టము చేయఁబడినది. (మ. భా. శాం. ౩౧౩; మఱియు, అశ్వ ౮౧ చూడు.) మనుజునియొక్క యింద్రియములవివేచనము 'అధిభూతము, అధ్యాత్మము, అధిదైవతము నని మూఁడువిధములుగ చేయవచ్చు'నని మహాభారతకారుఁడు

సెప్పుచున్నాఁడు. ఈ యింద్రియములచే గ్రహింపఁదగినవిషయములు— అనఁగా: చేతులతోఁ దీసికోఁదగినదియును, వీనులచే వినఁదగినదియు, కన్నులతోఁ జూడఁదగినదియు, మనస్సుతో విచారింపఁదగినదియు) అన్నియు నధిభూతములే. మఱియు హస్తపాదాదికములయొక్క సాంఖ్యశాస్త్రోక్తమగు సూక్ష్మస్వభావము (అనఁగా: సూక్ష్మేంద్రియములు) లీయింద్రియములకు నధ్యాత్మములు; కాని యీరెంటిని వదలి యధిదైవతదృష్టిచే విచారింతుమేని హస్తములకు దేవత యింద్రుఁడనియు, పాదములకు విష్ణువనియు, గుదమునకు మిత్రుఁడనియు, నుపస్థకు ప్రజాపతియనియు, వాక్కునకగ్నిహోత్రుఁడనియు, నేత్రములకు సూర్యుఁడనియు, శ్రోత్రములకు దిక్కులనియు, లేక యాకసమనియు, జిహ్వకు జలమనియు, నాసికకు పృథ్వియనియు, త్వక్కునకు వాయువనియు, మనస్సునకు చంద్రుఁడనియు, నహంకారమునకు బుద్ధి యనియు, బుద్ధికి పురుషుఁడనియు నధిదేవతలు గల రని చెప్పి యీదేవతలే యాయాయింద్రియములయొక్క వ్యాపారములను చేయించుచున్నారని చెప్పుదురు. ఉపనిషత్తులయందును, నుపాసనార్థమై బ్రహ్మస్వరూపమునకుఁ జెప్పఁబడిన ప్రతీకములయందు మనస్సు, అధ్యాత్మ ప్రతీకమనియు, సూర్యుఁడుగాని, యాకసముగాని యధిదైవత ప్రతీకమనియు, చెప్పఁబడినది. (ఛాం. ౩. ౧౮. ౧) అధ్యాత్మము, అధిదైవతమను భేద ముపాసనకొఱకు మాత్రమే చేయఁబడినదికాదు. ఇది యేమన: వాక్కు, చక్షుస్సు, శ్రోత్రములు మొదలుగాఁగల యింద్రియములును, ప్రాణము ననువానిలో నేదిశ్రేష్ఠమైనది యనుప్రశ్నమును నిర్ణయించుటకొఱకును చేయఁబడినది. కావున నాప్రశ్న మొకప్పుడు చక్షుస్సు, శ్రోత్రమునను సూక్ష్మేంద్రియములను బ్రహ్మయొక్క పాదములునుగ గ్రహించి యధ్యాత్మ దృష్టితోడను, ఒకానొకప్పుడాయింద్రియములకే యగ్ని, సూర్యుఁడు, ఆకసము ననువారిని దేవతలనుగా గ్రహించి యధిదైవత దృష్టితోడను నుపనిషత్తులలో విచారింపఁబడినది. (బృ. ౧. ౫. ౨౧—౨౩; ఛాం. ౧. ౨-౩; కౌషీ. ౪. ౧౨, ౧౩) అధిదైవతము, అధిభూతము, అధ్యాత్మము మొదలగు భేదములు చిరకాలమునుండి నుఁ ప్రచారములోనే యున్నవనియు, పరమేశ్వరస్వరూపము విషయమై తేఁబడిన యీవెవ్వేఱు కల్పనలలో నేది నిజమైనది, యను ప్రశ్నయు నప్పటినుండియు నున్నదియే

అర్జున ఉవాచ.

కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,
అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే. ౧
అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్మధుసూదన,
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః. ౨

యనియు నిందలి సారాంశము. సర్వభూతములయందును, సర్వదేవతలయందును, సర్వమగు నధ్యాత్మమందును, సర్వలోకములయందును, సర్వయజ్ఞములయందును, సర్వదేహములయందును నంతర్యామి వ్యాపించియుండెననియు, నవి యతనిని తెలిసికొనకపోయినను, వానిని యాడించుపరమాత్మ యొక్కఁడున్నాఁడనియు బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞవల్క్యఋషి యుద్దాలకుఁడగు నారుణియనువానికిఁ జెప్పెను (బృ. 3. 7). ఉపనిషత్తులయందలి యీసిద్ధాంతమే వేదాంతసూత్రములయందలి యంతర్యామ్యధికరణమునందు స్వీకరింపఁబడినది. (వే. సూ. ౧. ౨. ౧౮-౨౦), అక్కడనే సర్వాంతర్యామియగు నీతత్త్వము సాంఖ్యులు చెప్పునట్టి ప్రకృతిగాని, జీవాత్మగాని కాదనియు, పరమాత్మయే యనియు స్థిరపఱుపఁబడినది. ఈ సిద్ధాంతము ననుసరించియే మనుజునియొక్క దేహమునందును, సర్వభూతములయందును (నధిభూతమును) సర్వయజ్ఞములయందును (నధియజ్ఞమును) సర్వదేవతలయందును (నధిదైవతమును) సర్వకర్మలయందును సర్వవస్తువులయొక్క సూక్ష్మమగు (అనఁగా: నధ్యాత్మమగు) స్వరూపమునందును నొక పరమేశ్వరుఁడే నిండియుండుటచే దేవత, యజ్ఞము మొదలుగాఁగల నానాత్వము గాని, లేక వివిధప్రకారములగు జ్ఞానములు గాని, సత్యములైనవి కావని భగవంతుఁడిప్పు డర్జునునకుఁ జెప్పుచున్నాఁడు. ఏడవ యధ్యాయముయొక్క చివరయం దధిభూతము మొదలుగాఁగల శబ్దముల నుచ్చరించుటచే వానియొక్క యర్థమును దెలిసికొనవలయునని యిచ్ఛ కలిగినందున మొదట నర్జునుఁడిట్లు ప్రశ్న చేయుచున్నాఁడు.—]

అర్జును డడుగుచున్నాఁడు— (౧) ఓ పురుషోత్తమా! ఆబ్రహ్మమనఁగ నేమి? అధ్యాత్మమనఁగ నేమి? కర్మయన నేమి? దేని నధిభూత మనవలయును? దేని నధిదైవత మని చెప్పుచుందురు? (౨) ఓమధుసూదనా! అధియజ్ఞ మెటులుండునో, యీ దేహమునం దది యేదియో? (అనఁగా: నధిదేహమన నేమియో?)

శ్రీ భగవానువాచ.

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే,
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. ౩
అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్,
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర. ౪

ఇంద్రియములను నిగ్రహించుకొన్నవారు అంతకాలమందు నిన్నెట్లు తెలిసికొనవలయునో చెప్పుము.

[బ్రహ్మము, అధ్యాత్మము, అధిభూతము, అధియజ్ఞము, అనుశబ్దములు పూర్వాధ్యాయమునందున్నవి. కాని యిప్పు డర్జునుఁడు వానినిగాక యధిదేహ మనఁగ నేమని నూతనముగ నొక దాని నడుగుచున్నాఁడని జ్ఞప్తియందుంచుకొందుమేని ముందు చెప్పఁబోవు సమాధానముయొక్క యర్థమును తెలిసికొనుటకు ప్రతిబంధక ముండదు.—]

శ్రీ భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—(౩) (అందరికంటెను) నుత్కృష్టమైన యక్షరము (అనఁగా: నెప్పుడును నాశనము నొందని తత్త్వము గలది) యనెడి బ్రహ్మము. ప్రతివస్తువునకును నున్న మూలభావము (స్వ-భావము) నధ్యాత్మ మని చెప్పుచున్నారు. (అక్షర బ్రహ్మమునుండి) తన్మాత్రలు మొదలుగాఁ గలిగిన (చరాచర) పదార్థముల నుత్పాదింపఁజేయు విసర్గము (అనఁగా: సృష్టివ్యాపారము) కర్మ యని చెప్పఁబడును.

(౪) (జన్మించినట్టి యధిభూతములయొక్కయు) క్షరమగు (అనఁగా: నామరూపాత్మకమగు, లేక నశ్వరమునగు) స్థితియే యధిభూతము; (ఈ పదార్థములయందుండు) పురుషుఁడు (అనఁగా: సచేతనమగు నధిష్ఠాత) అధిదైవతము. శరీరధారులలో శ్రేష్ఠుఁడవగు నో యర్జునా! అధియజ్ఞము (అనఁగా: సకలయజ్ఞములకు నధిపతి యని చెప్పఁబడువాఁడను) నేనే. ఈ దేహమునందు (అధిదేహ) నేనే యున్నాను.

[యీ (పై) శ్లోకమునందలి పరమశబ్దము బ్రహ్మశబ్దమునకు విశేషణము కాదు. అక్షరమునకు విశేషణము. సాంఖ్యశాస్త్రమువారు అవ్యక్తమగు ప్రకృతిని సైత మక్షరమని చెప్పుచున్నారు. (గీ. ౧౫. ౧౬). కాని వేదాంతుల మతమునందలి బ్రహ్మ యీయవ్యక్తమును, నక్షరము నగు ప్రకృతికంటె నత్యుత్తమ పరమైయున్నది. (ఈ యధ్యాయమునందలి ౨౦, ౩౧

శ్లోకములను చూడుము) కాఁబట్టి యొకయక్షరశబ్దమే సయోగింపఁబడినచో,
సాంఖ్యుల ప్రకృతియనియు బ్రహ్మము అనియు రెండర్థములను చెప్ప
వచ్చును. ఈసంశయమును నివారించుటకే 'అక్షర' శబ్దమునకు
పరమందున్న 'పరమ' అను విశేషణమును ప్రయోగించి బ్రహ్మమని వ్యాఖ్యా
నము చేయఁబడినది. (గీతార. ప్ర. ౯. పు. ౨౭౨, ౨౭౫. చూడుము)
స్వభావశబ్దమునకు మహాభారతమందు పైఁ జూపిన యభిప్రాయము ననుస
రించి యేపదార్థముయొక్కయైనను సూక్ష్మస్వరూపమని నేనర్థము
చేసినాను. నాసదీయసూక్తమునందు దృశ్యమగు జగత్తు పరబ్రహ్మముయొక్క
విసృష్టి (విసర్గము) యని చెప్పఁబడినది. (గీతార. పు. ౨౮౯; ప్రస్తుతమం
దు విసర్గశబ్దమున కాయర్థమే చేసికొనవలయును. విసర్గమనఁగా: యజ్ఞము
నందలి హవిరుత్సర్గమని యర్థము చేసికొన నక్కఱలేదు. ఈదృశ్యసృష్టినే
'కర్మ' యని యేల చెప్పినదియు, గీతారహస్యముయొక్క పదియవ ప్రక
రణమునందు (పు. ౨౭౯) సవిస్తరముగ నిరూపింపఁబడినది చూడుము.
క్షర మనఁగా: పదార్థమాత్రము యొక్క నామరూపాత్మకమగు వినశ్వర
మగు స్వరూపము; దీనికంటె పరమందున్న యక్షరతత్త్వము బ్రహ్మమని
తెలిసికొనవలయును. పురుషశబ్దముచే సూర్యునియందున్న పురుషుఁడును,
ఉదకముయొక్క దేవత, లేక, వరుణదేవుఁడు మొదలయిన చేతనులగు
నట్టియు, సూక్ష్మదేహధారు లగు నట్టియు, దేవతలు వినశ్వరములయినందున
హిరణ్యగర్భుఁడును నాపురుషశబ్దార్థమునందే చేరును. అధియజ్ఞశబ్దము
నకు భగవంతుఁ డిచ్చే వ్యాఖ్యానము చేయలేదు. కారణ మేమన:
యజ్ఞము విషయమై వెనుక మూఁడవ, నాల్గవ యధ్యాయములందు సవి
స్తరముగఁ జెప్పఁబడినది. మఱియు "నేనే సర్వయజ్ఞములకును ప్రభు
వును, భోక్తను" నని తిరిగి ముందును చెప్పఁబోవుచున్నాఁడు. (గీ. ౯.
౨౪; ౫. ౨౯; మఱియు మ. భా. శాం. ౩౪౧ చూడుము) అధ్యాత్మము
మొదలగువానియొక్క లక్షణముల నీరీతిగ చెప్పినపిదప తుదకు అధియజ్ఞ
మని దేనిని చెప్పుచున్నారో యదియు నాస్వరూపమే నాదేహమునం
దున్నదని (అనఁగా: మనుష్యదేహమునందున్న యధిదైవమును సకలయజ్ఞ
మును నేనే యయియున్నా నని) సంక్షేపముగఁ జెప్పఁబడినది. సాంఖ్యులు
ప్రతిదేహమునందును వేఱ్వేఱగు నాత్మ (పురుషుఁడు) యున్నాఁడనియు,

నాయాత్మ లసంఖ్యములనియు జెప్పుదురు. కాని వేదాంత శాస్త్రమునం దీమత మంగీకరింపఁబడక దేహము లనేకములయినను, వానియన్నింటియందును నొకయాత్మయే యున్నదని సిద్ధాంతము చేయఁబడినది. (గీతా. ర. పు. ౨౩౬–౨౩౮) ఈసిద్ధాంతమే 'యధిదేహమును నేనే' యనువాక్యమునందలి నేనే యయియున్నా ననుశబ్ద మొక యధియజ్ఞమును గాని, యొక యధిదేహమును గాని యుద్దేశించి చెప్పఁబడినదికాదు. అధ్యాత్మము మొదలగు పూర్వపదములతో దానికి సంబంధము వివక్షితమయినది. కాన వేర్వేఱగు యజ్ఞములను జూచినను, ననేక పదార్థములయందున్న యనేక దేవతలను జూచినను, వినశ్వరములగు పంచమహాభూతములను జూచినను ప్రతి పదార్థముయొక్క సూక్ష్మభాగమును, లేక వేర్వేఱగు నాత్మను జూచినను, బ్రహ్మనుజూచినను, కర్మనుజూచినను, లేక వేర్వేఱగు మనుష్యులయొక్క దేహములను జూచినను, ప్రతిస్థలమునందును నేనే(అనఁగానొక పరమేశ్వరతత్త్వమే) యున్నానని మొత్తముపై యర్థమగును. అధిదేహముయొక్క స్వరూపము స్వతంత్రముగ నిచ్చో వర్ణింపఁబడలేదనియు, నధియజ్ఞమును వ్యాఖ్యానముచేయుచు దానియం దధిదేహము పర్యాయముగఁ జెప్పఁబడినదనియు కొందఱు చెప్పుచున్నారు. కాని యీవిషయము నాకు మంచిదిగఁ గన్పట్టదు. కారణమేమన: గీతలయందేకాక, యుపనిషత్తులయందును, వేదాంతసూత్రములయందును (బృ. ౩. ౭. వే. సూ ౧. ౨. ౨౦) నీవిషయము చెప్పఁబడినచోట నధిభూతము మొదలయినవానియొక్క స్వరూపమునువలెనే శారీరమగు నాత్మనుసైతము విచారించి యంతటను నొకపరమాత్మయే యున్నదని సిద్ధాంతము చేయఁబడినది. అటులే గీతలయందును, నధిదేహమువిషయమై మొదట ప్రశ్నచేయఁబడుటచే నిక్కడ దానిని వేఱుగఁ జెప్పుట యవసరమైనది యని చెప్పుట సయుక్తికమగును. ఉన్న దంతయు పరబ్రహ్మమే యయినయెడల నధిభూతము మొదలగువాని స్వరూపము చెప్పునప్పుడు వానియందు పరబ్రహ్మను గణనచేయుట యావశ్యకము కాదని తోఁపవచ్చును. కాని బ్రహ్మము వేఱనియు, నాత్మ వేఱనియు, దేవత వేఱనియు, యజ్ఞనారాయణుఁడు వేఱనియు ననేక భేదములు కల్పించి నానావిధములగు నుపాసనల జేయువారి ననుసరించి యీనానాత్వము వర్ణింపఁబడియుండుటచే వారెన్నునట్లు కలుగఁబోవు భేదముయొక్క లక్షణమును మొదటఁ జెప్పి పిదప "ఇదంతయు నేనే" యని

§§ అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫
యం యం వాపి స్మరన్భావం త్యజత్యంతే కళేబరమ్,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. ౬

సిద్ధాంతము చేయఁబడినదని తెలిసికొనినచో నేసందేహమును బొడమదు. అట్లుండుఁ గాక; అధిభూతము, అధిదైవతము, అధ్యాత్మము, అధియజ్ఞము, అధిదేహము మొదలుగాఁగల పద్ధతు లుపాసనార్థమై వేర్వేఱుగఁ గల్పింపఁబడినవి యైనను, నీ నానాత్వము సత్యమయినది కాదనియు, నిజముగ పరమేశ్వరుఁ డొక్కఁడే యంతటను వ్యాపించియున్నాఁడనియు, నీభేదమందున్న యథార్థముఁ జెప్పి యిప్పు డంతకాలమందు సర్వవ్యాపి యగు భగవంతు నెట్లు తెలిసికొనవలయు నను నర్జునునియొక్క కడపటిప్రశ్నకు నుత్తరము చెప్పుచున్నాఁడు.—]

(౫) మఱియు నెవఁ డంతకాలమునందు నన్నే స్మరించుచు దేహమును వదలివేయుచున్నాఁడో, వాఁడు నాస్వరూపము నొందుచున్నాఁడు. ఇందుకు సందేహములేదు. (౬) లేదా! ఓ కౌంతేయా! ఎప్పుడును (అనఁగా: జన్మ యంతయు) దానియందె యనురక్తమగునటు లభ్యసించినమనుజుఁడే యేభావమును స్మరించుచు తుదకు దేహమును వదలివేయునో యాభావమునే పిమ్మట బొందును.

[ఐదవశ్లోకమునందు మరణసమయమునందు పరమేశ్వరుని స్మరించుటయందుగల యావశ్యకతయు, ఫలమును చెప్పఁబడినది. కాని యింతమాత్రముచే మరణకాలమునందు స్మరించుటయే చాలునని యెవరయిన పొరఁబడవచ్చునని యూహించి యీఅఱవశ్లోకమునందు, యావజ్జీవము మనస్సునందున్న విషయము మరణకాలమునందు సైతము విడువదని చెప్పి మరణకాలమునందె కాక యావజ్జీవమును పరమేశ్వరుని స్మరించుట యొక్కయు నుపాసించుటయొక్కయు నావశ్యకత సిద్ధముచేయఁబడినది. (గీతా. ర. ప్ర. ౧౦. పు. ౩౯౬) ఈసిద్ధాంతము పరిశీలింతుమేని యంతకాలమునందు పరమేశ్వరుని భజించువారు పరమేశ్వరు నొందుదు రనియు, దేవతలను స్మరించువారు దేవతలను బొందుదురనియు, స్వయముగనే సిద్ధమగును. (గీ. ౭. ౨౩; ౮. ౧౩ మఱియు ౯. ౨౫ చూడు) కారణ మేమన: ఛాం

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయమ్. ౭
అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. ౮

దోగ్యోపనిషత్తునందు చెప్పినట్లు "యథాక్రతురస్మిఁల్లోకే, పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" (ఛాం. ౩. ౧౪. ౧)— ఈలోకమున మనుజుఁ డెట్టి క్రతువుగలవాఁడో (అనఁగా, సంకల్పముగలవాఁడో) అట్టి గతినే మరణానంతరమునఁ బొందును. ఇతరములగు నుపనిషత్తులలో సైత మిట్టి వాక్యములే యున్నవి. (ప్రశ్న. ౩. ౧౦; మైత్ర్యు. ౪. ౬). కాని యావజ్జీవము నొకభావమునందే మనస్సు నిరంతరము నుంచిననే కాని, యంత్యకాలమునందలి యాతనయందును, నీభావన కల్గుటకు వీలులేదు. అని గీత యిచ్చోఁ జెప్పుచున్నది. (వే. సూ. ౪. ౧. ౧౨), అను సిద్ధాంతము ననుసరించి భగవంతుఁ డర్జునున కిట్లు చెప్పుచున్నాఁడు.—]

(౭) కాన సర్వకాలములయందును నన్ను స్మరించుచుండుము. మఱియు యుద్ధము చేయుము. నాయందు మనస్సును బుద్ధిని సమర్పించితివేని (యుద్ధము చేసినను) నన్నే పొందుదువు. దీనియందు సంశయ మేమియు లేదు (౮) ఓ పార్థా! చిత్తమును రెండవవైపునకుఁ బోనియ్యక యభ్యాసముయొక్క సాయముచే స్థిరపఱచి, దివ్యుఁడగు పరమపురుషునిధ్యానము చేయుచుందువేని యాతనినే పొందుదువు.

[భగవద్గీతయందు సంసారమును వదలి భక్తి యొక్కటియే చేయఁదగినది యని ప్రతిపాదించునట్టివారు ముఖ్యమైన దగు నీయేడవ శ్లోకమునందలి సిద్ధాంతమును పూర్ణముగ గమనింపవలయును. మోక్షము పరమేశ్వరుని యొక్క జ్ఞానయుక్తమగు భక్తిచే లభించుననియు, మరణసమయమునందు సైతము నాభావనయే స్థిరముగ నుండుటకై యావజ్జీవము నాయభ్యాసమునే చేయుచుండవలయు ననియు నిర్వివాదముగ నున్నవిషయమే. కాని యందుకొఱకు కర్మలను వదలిపెట్టవలయు నని గీతయందలి యభిప్రాయము కాదు. ఇంతియగాక భగవద్భక్తులు స్వధర్మానుసారముగ ప్రాప్తము లగుకర్మల నన్నింటిని నిష్కామబుద్ధితోఁ జేయవలయుననియే గీతాశాస్త్రపు సిద్ధాంతము. ఆసిద్ధాంతమే "నన్నెల్లపుడును చింతింపుము, యుద్ధమును

§§ కవిం పురాణమనుశాసితార మణోరణీయాంసమనుస్మరేద్యః,
సర్వస్య ధాతారమచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. ౯
ప్రయాణకాలే మనసాచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ,
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్యసమ్యక్ సతంపరంపురుషముపైతిదివ్యమ్.
యదక్షరం వేదవిదో వదంతి విశంతి యద్యతయో వీతరాగాః,
యదిచ్ఛంతో బ్రహ్మచర్యంచరంతి తత్తేపదంసంగ్రహేణ ప్రవక్ష్యే.
సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్. ౧౨
ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్,
యః ప్రయాతి త్యజందేహం స యాతి పరమాం గతిమ్. ౧౩

: కూడ చేయుము'' అనుశబ్దములచే స్పష్టపఱుపఁబడినది. అది యట్లుండు
: గాక. పరమేశ్వరార్పణబుద్ధితో యావజ్జీవమును నిష్కామకర్మను చేయు
: (కర్మ-) యోగి యంతకాలమున నైతము దివ్యుఁడగుపురుషు నెట్టుల చింతిం
: చునో యిప్పుడు వర్ణించుచున్నాఁడు.—]

(౯) కవియు (అనఁగా : సర్వజ్ఞుఁడును) పురాతనుఁడును, శాసించువాఁడును, అణువుకంటెనుగూడ చిన్నవాఁడును, అన్నింటికిని ధాతయు (అనఁగ నాధారభూతుఁడును లేక కర్తయు) అచింత్యస్వరూపుఁడును, చీకటికి వెలుపలభాగమున నున్న సూర్యునివలె దేదీప్యమానుఁడు నగుపురుషుని స్మరించువాఁడును (౧౦) అంతకాలమునందు (ఇంద్రియనిగ్రహరూపమగు) యోగముయొక్క సామర్థ్యము చేతను, భక్తిచేతను యుక్తుఁడయి మనస్సును స్థిరముగఁజేసి, ప్రాణమును కనుబొమలమధ్యయందు బాగుగ నునిచి భజించువాఁడును నగు పురుషుఁ డాపరమపురుషుని పొందును. (౧౧) వేదవేత్తలుదేని నక్షరమనిచెప్పుచున్నారో, వీతరాగులైన యతి దేనియందుఁ బ్రవేశించుచున్నాఁడో, యెవరినికోరి బ్రహ్మచర్యవ్రతము నాచరించుచున్నాఁడో యాపదమును (అనఁగా: ఓంకారబ్రహ్మను) నీకు సంక్షేపముగఁ జెప్పుచున్నాను. (౧౨) అన్ని (ఇంద్రియరూపములగు) ద్వారములను నరికట్టియు, మనస్సును హృదయమునందు నిరోధించియు తనప్రాణమును శిరస్సునఁ జేర్చియు, యోగధారణమును జెందియు (౧౩) "ఓం" అను నేకాక్షరబ్రహ్మను జపించుచు నన్ను స్మరించుచు దేహమును వదలివేయువాఁడు శ్రేష్ఠగతిని పొందును.

§§ అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః. ౧౪
మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్,
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః. ౧౫

[౯-౧౧ శ్లోకముల వర్ణింపఁబడిన పరమేశ్వరస్వరూప ముపనిషత్తుల లోనుండి గ్రహింపఁబడినది. తొమ్మిదవశ్లోకమునందున్న "అణోరణీయాన్" అనుపదములును, చివరచరణమును శ్వేతాశ్వతరోపనిషత్తునం దున్నది. (శ్వేత 3. ౮ మఱియు ౯) ౧౧వ శ్లోకముయొక్క పూర్వార్థము నందలి యర్థమును నుత్తరార్థమునందలి శబ్దములును కఠోపనిషత్తునం దున్నవి. (కఠ ౨. ౧౫) కఠోపనిషత్తునందు "తత్తేపదంసంగ్రహేణబ్రవీమి" అనుచరణమునకు ముందు "ఓమిత్యేతత్" అని స్పష్టముగ చెప్పఁబడినది. దీనిఁబట్టి ౧౧వ శ్లోకమునందున్న యక్షరశబ్దములకు 'ఓం' అనెడి వర్ణరూపమగు బ్రహ్మ లేక 'ఓం' అనెడిశబ్ద మర్థమని తెలిసికొనవలయును. మఱియు పదమూఁడవశ్లోకమునందును నోంకారోపాసనయే యుద్దేశింపఁబడినదని స్పష్టముగనె దెలియుచున్నది. (ప్రశ్న. ౫ చూడుము.) అయినను నక్షరమన నవినాశియగుబ్రహ్మయనియు, పదమనగ బ్రహ్మస్థానమనియు నీయర్థములు సైతము భగవంతుని యొక్క మనస్సున లేవని చెప్పుటకు సాధ్యముకాదు. కారణమేమన 'ఓం' అనునది వర్ణమాలయందున్న యొక యక్షరమగుటచే బ్రహ్మయొక్క ప్రతీకమని యొకయర్థమే కాదు గాన 'యవినాశి' యనునర్థమును నున్నదని చెప్పవచ్చును. (ముందు ౨౧వ శ్లోకమునుచూడుము.) కావున పదునొకండవ (౧౧) శ్లోకముయొక్క భాషాంతరమందు 'అక్షర' మనియు 'పదము'నియు నర్థద్వయము గల్గిన మూలమునందలిశబ్దముల్లనే నేను ప్రయోగించినాను. ఈయుపాసనచే గలుగఁబోవు నుత్తమగతి నే యిపుడు స్పష్టముగ నిరూపింపఁబోవుచున్నాఁడు.—]

(౧౪) ఓపార్థా! అనన్యభావముచే నెల్లప్పుడును, నన్ను ప్రతిదినమునను స్మరించునట్టి నిత్యయుక్తులగు (కర్మ-)యోగులకు నేను సులభుఁడను (అనఁగా: వారు నన్ను నొందుట సులభము). (౧౫) నన్ను పొందినపిదప పరమసిద్ధి నొందిన మహాత్ములకు, దుఃఖమున కునికిపట్టును నశాశ్వత మగు పునర్జన్మ ప్రాప్తము కాదు.

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున,
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే. ౧౬
§§ సహస్రయుగపర్యంతమహర్యద్బ్రహ్మణో విదుః,
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః. ౧౭

(౧౬) ఓయర్జునా! బ్రహ్మలోకము మొదలుకొని స్వర్గాదిలోకములవఱకును, గల లోకములన్నియు (ఎప్పుడో యొకప్పుడు) పునరావర్తనమును (తిరిగివచ్చుట) బొందును. కాని, యోకౌంతేయా! నన్ను నొందుటవలన పునర్జన్మయుండదు.

[పదునాఱవశ్లోకమునందలి 'పునరావర్తిన' శబ్దమునకు పుణ్యమును అనుభవించినపిదప భూలోకమునకు తిరిగి వచ్చువాఁడని యర్థము. (గీ. ౯. ౨౧; మ. భా. వన. ౨౬౦ చూడుము). యజ్ఞము, దేవతారాధన, వేదాధ్యయనము, మొదలుగాఁగలకర్మలచే నింద్రలోకమును, వరుణలోకమును, సూర్యలోకమును, వేయేల? బ్రహ్మలోకముసైతము ప్రాప్తమయినను పుణ్యాంశము సమాప్తమయినపిదప నక్కడనుండి మరల వెనుకకుతిరిగివచ్చి యీలోకమునందు జన్మింపవలసి వచ్చును. (బృ. ౪. ౪. ౬), లేక కుట్టతుదకు బ్రహ్మలోకము నశించినపిదపనైనను, పునర్జన్మమనుచక్రములోఁబడుట యావశ్యకమగును. కావున నీగతులన్నియు నికృష్టములైనవి యనియు పరమేశ్వరునియొక్క జ్ఞానముచేతనే తిరిగిజన్మించుట లేకపోవుటచే నీగతియే సర్వశ్రేష్ఠమనియు, పదునాఱవ శ్లోకమునందలి భావార్థము (గీ. ౯. ౨౦, ౨౧). బ్రహ్మలోకప్రాప్తియును ననిత్యమని చివర చెప్పఁబడిన దానిని సమర్థించుటకయి బ్రహ్మలోకముసైతము ప్రతిసృష్టియందును, నుత్పత్తిని, లయమును మరల మరల నెట్లు పొందుచున్నదియు నిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౧౭) అహోరాత్రములనగ నేమియో (యథార్థముగ) తెలిసికొనినవారు కృత, త్రేత, ద్వాపర, కలియనుచతుర్యుగములుకలసి యొకమహాయుగమనియు, వేయిమహాయుగములయొక్క కాలము బ్రహ్మదేవునియొక్క యొకదివసమనియు నట్టివేయియుగములు లాయనకు నొకరాత్రి యగుననియుఁ దెలిసికొనుచున్నారు.

[ఈశ్లోకము పూర్వమందున్న యుగమానముయొక్క. కోష్ఠకమును వేయక గీతలయందు చెప్పఁబడినది. మఱియు దానియర్థమును మఱియొకచోట వ్రాయఁబడిన కోష్ఠకమునుండి తెలిసికొనవలయును. ఈకోష్ఠకమును

అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వాః ప్రభవంత్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే. ౧౮
భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే. ౧౯
§§ పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః,

[గీతలయందున్న యీశ్లోకము మహాభారతమునందును (శాం. ౨౩౧. ౩౧) మనుస్మృతియందును (మను. ౧. ౭౩) చెప్పఁబడియున్నది. యాస్కుని యొక్క నిరుక్తమునందును నాయర్థమే వర్ణింపఁబడినది. (నిరుక్త. ౧౪. ౯). బ్రహ్మదేవునియొక్క దివసమునకే కల్పమని పేరు. అవ్యక్తమనఁగా, సాంఖ్యశాస్త్రమునందు చెప్పఁబడిన యవ్యక్త ప్రకృతి యని ముందుశ్లోకమునందు జెప్పఁబడినది. అవ్యక్తమన పరబ్రహ్మముకాదు. కారణ మేమనఁగా : బ్రహ్మరూపమగునవ్యక్త మీశ్లోకమునందు వర్ణింపఁపడిన యవ్యక్తముకంటె పరముగను, వేఱుగను, నున్నది యని, ముందు యిరువదవ (౨౦)వ శ్లోకమునందు స్పష్టముగఁ జెప్పఁబడినది. అవ్యక్తమునుండి వ్యక్తమెట్లు సృష్టింపఁబడును ? దానిపూర్ణమగు వివరణమును, కల్పములయొక్కయు, కాలమానముయొక్కయు, కోష్ఠకమును గీతారహస్యముయొక్క యెనిమిదవ (౮వ) ప్రకరణమునందు (పృ. ౨౬౦-౨౬౨) చెప్పఁబడినది చూడు.—]

(౧౮) ఈ(బ్రహ్మదేవునియొక్క) దివస మారంభమగునేని యవ్యక్తమునుండి వ్యక్తమంతయు (పదార్థము)బయలు వెడలును. రాత్రియందు పూర్వోక్తమగు నవ్యక్తమందు లయించుచున్నది. (౧౯) భూతములయొక్క యాసముదాయమే (యీరీతిగ) తిరిగితిరిగి జన్మించి యవశ్యమయినదయి (అనఁగా, తన కిచ్ఛయున్నను లేకపోయినను యంత్రమునందు వేయఁబడిన దానివలె) రాత్రి యారంభముకాఁగానే లయముఁ బొందుచున్నది. ఓపార్థా ! దివసారంభముకాఁగానే తిరిగి పుట్టుచున్నది.

[అనఁగా: పుణ్యకర్మలచే నిత్యమగు బ్రహ్మలోకవాసము ప్రాప్తించినను ప్రళయకాలమందు బ్రహ్మలోకము నశించునది యగుటచే ప్రాణులు తిరిగి నూతనకల్పారంభమునందు జన్మింపక తప్పదు. అది తప్పుటకు గలయొక్క మార్గమునే యిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. ౨౦
అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్,
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ. ౨౧
పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా,
యస్యాంతః స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్. ౨౨

(౨౦) కాని పైనచెప్పిన యవ్యక్తముకంటె పరమందున్నదియు, సనాతనము నగునదియు నుఱియొక యవ్యక్తపదార్థము సర్వభూతములు నశించినను, నశించునది కాదు. (౨౧) ఏయవ్యక్తము నక్షరమనియు చెప్పుచున్నారో యదియె పరమమని (అనఁగా: నుత్కృష్టమని, కడపటిగతియని) చెప్పఁబడినది. (మఱియు) దేనినొందిన తిరిగి జన్మించుటలేదో యట్టినాయొక్క పరమస్థానమును నదియే.

(౨౨) ఓ పార్థా! యెవరిలోపల నన్నిభూతములును నున్నవో, యెవనిచే నీసమస్తము విస్తరింపఁజేయఁబడినదో, లేక వ్యాపింపఁజేయఁబడినదో యా పరేముఁడు (అనఁగా: శ్రేష్ఠుఁడైనపురుషుఁడు) అనన్యభక్తిచేతనే పొందఁదగినవాఁడు.

[౨౦, ౨౧వ శ్లోకములు రెండును నొకవాక్యమే; వీనిలో ౨౦వ శ్లోకమునందున్న యవ్యక్తశబ్దము మొదట సాంఖ్యులయొక్క ప్రకృతిని (అనఁగా: పదునెనిమిదవ శ్లోకమునందున్న యవ్యక్తమగు ద్రవ్యమును) ఉద్దేశించి ప్రయోగింపఁబడినది. తర్వాత సాంఖ్యుల ప్రకృతికి పరమందున్న పరబ్రహ్మమునుద్దేశించి ప్రయోగింపఁబడినది; మఱియు నీరెండవ యవ్యక్తము నే యక్షరమనియు చెప్పుచున్నారని ౨౧న శ్లోకమునందు చెప్పఁబడినది; అటులనే యీయధ్యాయముయొక్క యారంభమునందును "అక్షరం బ్రహ్మపరమం" అని చెప్పఁబడినది. అవ్యక్తశబ్దమువలెనే యక్షరశబ్దమును గీతలయందు రెండువిధములుగ నుపయోగింపఁబడినది. సాంఖ్యులు చెప్పునట్టి ప్రకృతిమాత్రమే యవ్యక్తమును, నక్షరమును కాదు. ఇఁక నేమన: "సర్వభూతములును నశించినను నెవఁడు నశింపఁడో" ఆపరమేశ్వరుఁడును, లేక బ్రహ్మయును, నక్షరము, నవ్యక్తమను శబ్దములచేఁ జెప్పఁబడునని యిందలి సారాంశము. పదునైదవ (౧౫వ) యధ్యాయమునందు పురుషోత్తము లక్షణములను జెప్పుచు వాఁడు క్షరము, నక్షరము ననునీ రెంటికంటెను పరమందున్నాఁడని చెప్పఁబడియున్న దాని యందున్న యక్షరశబ్దము సాంఖ్యులయొక్క ప్రకృతి నుద్దేశించియె ప్రయోగింపఁ

§§ యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ. ౨౩
అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. ౨౪
ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్,
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే. ౨౫

బడినదని సు దీనినుండి స్పష్టమగుచున్నది. (గీ. ౧౫. ౧౬-౧౮ చూడు). 'అవ్యక్తము', 'అక్షరము' అను నీవిశేషణములు రెండును నొకప్పుడు సాంఖ్యులయొక్క ప్రకృతిని, మఱియొకప్పు డీప్రకృతికంటె పరముగనున్న పరబ్రహ్మను నుద్దేశించి గీతలయందు యోజింపఁబడిన వని యెఱుంగ వలయు నని యిందుల తాత్పర్యము. (గీతా. ర. పు. ౨౩౩, ౨౩౪ చూడు) (వ్యక్తావ్యక్తములను పరమందున్న బ్రహ్మస్వరూపము గీతారహస్యముయొక్క తొమ్మిదవ ప్రకరణమునందు స్పష్టముగ నిరూపింపఁబడినది) అక్షర బ్రహ్మను (అనఁగా: నేస్థానమునకు చేరిన మనుజుఁడు తిరిగి జన్మించుట యను నుపద్రవమునుండి విముక్తుఁడగుచున్నాఁడో దానిని) వర్ణించుట యయినది. ఇప్పుడు మృతినొందిన పిదప నెవరికి ననావృత్తియో, (అనఁగా: తిరిగి జన్మింప నక్కఱలేదో), యెవరి కావృత్తికలుగునో (అనఁగా: స్వర్గమునుండి వెనుకకు మరలి వచ్చి పునర్జన్మయెత్తవలసి వచ్చునో) వారివృద కునుగల కాలముయొక్కయు, గతియొక్కయు భేదమును చెప్పుచున్నాఁడు.—]

(౨౩) ఓ భరతశ్రేష్ఠా! యిప్పుడు నీకు (కర్మ-)యోగి యేకాలమునందు మృతినొంది తిరిగి యీలోకమున జన్మించుటకురాఁడో, యేకాలమునందు మృతిఁ జెందుటచే తిరిగి యీలోకమున జన్మించునో యాకాలమును జెప్పుచున్నాను. (౨౪) అగ్ని, జ్యోతిస్సు, (మంట) దివసము, శుక్లపక్షము, ఉత్తరాయణ మాఱు మాసములు నను కాలమున మరణించిన బ్రహ్మవేత్తలు మృతిఁజెందినపిదప బ్రహ్మను పొందుచున్నారు. (తిరిగి జన్మింపరు) (౨౫) (అగ్ని) ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయన మాఱుమాసములు నను కాలమున (మృతిజెందిన) (కర్మ-)యోగి చంద్రునియొక్క తేజస్సును పొంది (అనఁగా: చంద్ర లోకము దగ్గఱకు వెళ్లి) తిరిగి (పుణ్యము క్షీణించిన పిదప) వచ్చుచున్నాఁడు.

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయా వర్తతే పునః. ౨౬

§§ నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. ౨౭

వేదేషు యజ్ఞేషు తపఃసుచైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్,
అత్యేతితత్సర్వమిదం విదిత్వా యోగీపరంస్థానముపైతిచాద్యమ్.౨౮

(౨౬) ఈరీతిగ శుక్లము, కృష్ణము (అంఁగా: ప్రకాశమయము, అంధకారమయము) అని జగత్తునకు శాశ్వతములగు రెండుగతులు (అంఁగా: స్థిరములగు మార్గములు) గలవని చెప్పఁబడినవి. ఒకమార్గమున బోయిరేని తిరిగి రారు. మఱియొకమార్గమునఁ బోయిరేని తిరిగి వత్తురు.

[ఈరెండు గతులును దేవయానమనియు (శుక్లము) పితృయాణమనియు (కృష్ణము)లేక యర్చిరాదిమార్గమనియు, ధూమాదిమార్గమనియు నుపనిషత్తులలోఁ బేర్కొనఁబడినవి. ఋగ్వేదమునందును నీమార్గములు సెప్పఁబడినవి. మృతినొందిన మనుజునియొక్క దేహమునకు నగ్ని సంస్కారానంతరమున (అగ్నినుండి) నీరెండుమార్గములును, అరబ్ధము లగుచున్నవి; కాన నిరువదియైదవ (౨౫వ) శ్లోకమునందు పూర్వశ్లోకమునందలి యగ్నిపదమును నధ్యాహారము చేసికొనవలయును. పూర్వశ్లోకమునందు వర్ణింపఁబడిన మార్గమునందును, రెండవమార్గమునందును గలభేదమును జెప్పుటయే యిరువదియైదవ (౨౫వ) శ్లోకమును జెప్పుటకు కారణమగుటచే నగ్నిశబ్దము మరల నాశ్లోకమునందు బ్రయోగింపఁబడలేదు. (ఈవిషయమై విశేషవిచారము గీతారహస్యమునందలి పదవ (౧౦వ) ప్రకరణము చివర (పు. ౪౦౫-౪౧౨ చేయఁబడినది చూడుడు). దానినుండి పైశ్లోకముయొక్క భావార్థము స్పష్టముగఁ దెలియును. ఈరెండు మార్గములయందలి యథార్థమును దెలిసికొనుటచే కలుగు ఫలము నిప్పుడు చెప్పుచున్నాఁడు—]

(౨౭) ఓ పార్థా! ఈరెండుమార్గములను (యథార్థముగ) దెలిసికొనిన, యే(కర్మ-)యోగియును మోహము నొందఁడు; కాన నోయర్జునా! నీవు సర్వకాలము (కర్మ-) యోగయుక్తుఁడవు కమ్ము.

(౨౮) దీనిని (పైనచెప్పినతత్త్వమును) తెలిసికొనుసేని, వేదములయందును, యజ్ఞములయందును, తపస్సులయందును, దానములయందు నే పుణ్య

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరబ్రహ్మయోగో నామ అష్టమోఽధ్యాయః. ౮

ఫలము చెప్పఁబడినదో దానిని నంతను (కర్మ-)యోగి యతిక్రమించును. దానికి పరమందున్న యాద్యస్థానమును బొందుచున్నాఁడు.

[ఏమనుష్యుఁడు దేవయాన పితృయాణములనెడి యీరెండుమార్గముల యందలి తత్త్వమును దెలిసికొనునో (అనఁగా: దేవయానమార్గముచే మోక్షము లభించినందున తిరిగి జన్మింపవలసిన యవసరము లేదనియు, పితృయాణమార్గము స్వర్గము నిచ్చునదియైనను మోక్షప్రదము కాదనియు తెలిసి కొన్నాఁడో) వాఁడీహేతువుచే వీనిలో తనకు నిజముగ కల్యాణమునిచ్చుమార్గ మును స్వీకరించును. మోహముచే క్రిందనున్న నికృష్టమార్గమందుఁ బడఁడని స్పష్టమయియున్నది; మఱియు నీవిషయము ననుసరించియే "ఈరెండు 'సృతులను' (మార్గములను)యథార్థముగ తెలిసికొన్నవాఁడు" అనుశబ్దములు మొదటిశ్లోకమునందు ప్రయోగింపఁబడినవి. దేవయానము, పితృయాణము ననురెండుమార్గములలో నేదియెచ్చోటికి పోవునో (కర్మ-) యోగికి తెలి యును. కావున వీనిలో నేది యుత్తమమార్గమో దానినే సహజముగ స్వీక రించును. మఱియును స్వర్గమును గుఱించి పోవుటకును, వచ్చుటకును సాధన మైన మార్గమునువదలి, దానికి పరమందున్న మోక్షపదమును బొందుదమని యత్నించునని యీశ్లోకముయొక్క భావార్థము. మఱియు నిరువదియేడవ (౨౭-వ) శ్లోకమునందారీతిగ నాచరింపుమని యర్జునున కుపదేశము సైతము చేయఁబడినది.—]

ఈరీతిగ భగవంతునిచే గానము చేయఁబడిన యక్షరబ్రహ్మయోగమను నెనిమిదియవ యధ్యాయము సమాప్తమయినది.—



# నవమోఽధ్యాయః.

---

## తొమ్మిదవ యధ్యాయము.

[(కర్మ-)యోగమునాచరించు పురుషుఁడు పరమేశ్వరుని పూర్ణముగఁ దెలిసికొని, మనస్సుయొక్క శాంతిన్ని, లేక ముక్తావస్థను నెట్లుపొందునో నిరూపించుటకై జ్ఞానవిజ్ఞానములయొక్క నిరూపణము, నేడవ యధ్యాయమునం దారంభించి, నక్షరుఁడును, నవ్యక్తుఁడు నగు పురుషునియొక్క స్వరూపము చెప్పఁబడినది మఱియు నంతకాలమునందుసైత మాస్వరూపము మనస్సునందు స్థిరముగ నుండవలయుననియు, పాతంజలయోగానుసారముగ సమాధినొంది యోంకారోపాసన నెట్లు చేయవలసినదియు పూర్వాధ్యాయమునందు చెప్పఁబడినది. కాని, యక్షరబ్రహ్మము యొక్క జ్ఞానము గలుగుటయే మొదటకష్టము. సమాధి యంతకంటెను కష్టసాధ్యము. అట్టిసమాధికావలయునని చెప్పితిమేని సామాన్యజను లీమార్గము వదలిరయే వేయుదు రనుసందేహమును మనస్సున నిడికొని యెల్లవారికి పరమేశ్వరజ్ఞానము సులభముగ సాధ్యమగుట కొకరాజమార్గమును భగవంతుఁ డిప్పుడు సెప్పుచున్నాఁడు. దీనినె భక్తిమార్గ మనిచెప్పుచున్నారు. ఇది గీతారహస్యమునందలి (౧౩ వ) పదమూఁడవ ప్రకరణమునందు సవిస్తరముగ వివేచింపఁబడినది. ఈమార్గమునందు పరమేశ్వరస్వరూపము ప్రేమచేఁ బొందఁ దగినదియును, వ్యక్తమైనదియు(అనఁగా: ప్రత్యక్షముగ తెలియునదియు)నై యున్నది. మఱియు నావ్యక్తస్వరూపమే, తొమ్మిది, పది, పదునొకండు, పండ్రెండు (౯,౧౦,౧౧, ౧౨)ను నగు నాలుగధ్యాయములయందును విస్తృతముగ నిరూపింపఁబడినది. అయినను నీభక్తిమార్గముసైతము స్వతంత్రమైనది కాదనియు, నేడవ యధ్యాయమునందు (కర్మ-) యోగసిద్ధికొఱకారంభింపఁబడిన జ్ఞానవిజ్ఞానములయందొక భాగమయి యున్నదనియు జ్ఞప్తియందుంచుకొనవలయును. మఱియు నీయధ్యాయముయొక్క యారంభముసైతము పైన చెప్పఁబడిన జ్ఞానవిజ్ఞానములకు నంగ మను నూహతో నారంభింపఁ బడినది.—]

శ్రీభగవానువాచ.

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. ౧
రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్. ౨
అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని. ౩

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు. (౧) నీవసూయ లేనివాఁడవుకాన నిప్పుడు గుహ్యములలో గుహ్యమైనదియు, విజ్ఞానసహితమగుజ్ఞానమును, దానిని దెలిసికొనుటచే పాపములనుండి ముక్తుఁడవగుటకు నీకు జెప్పుచున్నాను. (వినుము.) (౨) ఇది (జ్ఞానము) గుహ్యముల యన్నింటికిని (రాజు) శ్రేష్ఠమయినది. రాజవిద్య యన, విద్యల యన్నింటిలోను శ్రేష్ఠమయినది. ఇది పవిత్రమును, నుత్తమమును, ప్రత్యక్షముగఁ దెలియునదియు, నాచరించుటలో సుఖకరమును, నవ్యయమునును, ధర్మ్యము నై యున్నది. (౩) ఓ పరంతపా! ఈ ధర్మమునందు శ్రద్ధలేనివారు, నన్ను నొందక మృత్యువుతోఁ గూడిన సంసారమునందు తిరుగుచున్నారు. (అనఁగా : వారికి మోక్షము సిద్ధింపదు).—

[రెండవశ్లోకమునందున్న రాజవిద్య, రాజగుహ్య, ప్రత్యక్షావగమ యను పదములయొక్క యర్థము, గీతారహస్యమునందలి పదమూఁడవ (౧౩వ) ప్రకరణమునందు (పు. ౫౭౨-౫౭౪) విచారింపఁబడినది. ఈశ్వరప్రాప్తిని గలుగఁజేయు సాధనము లుపనిషత్తులయందు విద్యయని పేర్కొనఁబడినవి. రహస్యముగనుంచుటయు సంప్రదాయమై యుండెను. భక్తిమార్గము, లేక వ్యక్తవస్తువుయొక్క యుపాసన, యనునీవిద్య యీగుహ్యవిద్యల యన్నింటిలోను శ్రేష్ఠమైనది. ఇంతియకాక, యీధర్మము ప్రత్యక్షముగ నేత్రములకుఁ గాన్పించునది. కావుననే యాచరించుటకు సులభముగనున్న దని చెప్పఁబడినది. అయినను నిక్ష్వాకువు మొదలగురాజులయొక్క పరంపరనుండియే యీ యోగము ప్రచారములోనికి వచ్చియుండుటచే (గీ.౪-౨) నీమార్గము రాజులయొక్క యనఁగా గొప్పవారియొక్క విద్య యను నర్థము చేతనై తమ్ము రాజవిద్యయనియుఁ జెప్పఁదగి యున్నది. ఏ యర్థమును

§§ మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా,
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః. ౪
న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్,
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః. ౫
యథాకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ. ౬

[గ్రహించినను నిది యక్షరము, లేకయవ్యక్తము నగుబ్రహ్మముయొక్క జ్ఞానమునను సరించినది కానందున రాజవిద్యాశబ్దముచే భక్తిమార్గమే యిచ్చో వివక్షితమని స్పష్టమయియున్నది. అట్లుండనిమ్ము; ఈరీతిగ నారంభమునందే యీమార్గమును ప్రశంసించి భగవంతుడిప్పుడు దానిని విస్తారముగ వర్ణించుచున్నాడు.—]

(౪) నేను నాయొక్క యవ్యక్త స్వరూపముచే నీజగత్తునంతను విస్తరించి నాను లేక వ్యాపించినాను. నాయందు సర్వభూతములును నున్నవి. నేను వానియందు లేను. (౫) మఱియు నాయందు సర్వభూతములును లేవు! నాయొక్క యీశ్వరశక్తి, లేక యోగసామర్థ్య మే విధమున నున్నదో చూడుము! భూతములను బుట్టించు నాయొక్క యాత్మ భూతములను ధరించుచున్నను, భూతములయందు లేదు. (౬) అంతటను వీచుచున్న గొప్పవాయు వెల్లప్పుడును నాకాశమందున్నట్లు సర్వభూతములు నాయందున్నవని తెలిసికొమ్ము.

పరమేశ్వరుడు నిర్గుణుడును, సగుణుడును నయి యుండుటచే నీ విరోధాభాసము గల్గుచున్నది. (ఏడవయధ్యాయమునందలి పన్నెండవ (౧౨వ) శ్లోకముయొక్క టీకను, గీతారహస్యమునందలి తొమ్మిదవ (౯వ) ప్రకరణమున పు. ౨౬౯, ౨౭౨ మఱియు ౨౭౩ చూడుము). ఇటు లాశ్చర్యముగల్గునటులు దనరూపమును వర్ణించి యర్జునుని జిజ్ఞాసను బురికొల్పి, యిప్పుడు తననుండి వ్యక్తమెట్లు సృజింపబడినదియును, తనవ్యక్తస్వరూపమేదియైనదియు పూర్వమునం (గీ. ౭. ౪-౧౫; ౮. ౧౬-౨౦) యేడవ, యెనిమిదియవ యధ్యాయములయందు వర్ణింపబడినదానికంటె కొంచెము భేదముగ ప్రసంగానుసారముగ భగవంతుడు మరల చెప్పుచున్నాడు. 'యోగ' శబ్దమునకు 'యలౌకిక సామర్థ్యము', లేక 'యుక్తి' యని యర్థము చేసికొన్నను నవ్యక్తము వ్యక్తమగుట యను 'యోగము' లేక 'యుక్తి'

§§ సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. ౭
ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౮
న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు. ౯
మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్,
హేతునాఽనేన కౌంతేయ జగద్విపరివర్తతే. ౧౦

: యననే 'మాయ' యగునని గీత (౭-౨౫) శ్లోకముయొక్క టీకయందును : గీతారహస్యమునందలి తొమ్మిదవ ప్రకరణమునందును (పు. ౩౨౨-౩౨౭) : ప్రతిపాదింపఁబడినది. ఈయోగము పరమేశ్వరునకు నత్యంతము సుల : భము. వేయేల ? యిది పరమేశ్వరునకు దాసురాలగుటచే, పరమేశ్వరుని : యోగేశ్వరుఁడని (గీ. ౧౮. ౭౫) చెప్పుచున్నారు. ఈయోగసామర్థ్యము : చేత జగత్తుయొక్క యుత్పత్తిలయము లెట్లుజేయఁబడుచున్నవో యిప్పుడు : చెప్పుచున్నాఁడు.—]

(౭) ఓకౌంతేయా! కల్పాంతమునందు సర్వభూతములును నాప్రకృతి నొందుచున్నవి. కల్పారంభమునందు(అనఁగా బ్రహ్మదేవుని పగటియొక్క యారంభమునందు నేనే వానిని మరల నిర్మించుచున్నాను. (౮) నేను నాయొక్క ప్రకృతిని స్వాధీనముచేసికొని, యాప్రకృతికి స్వాధీనులగుటచే నవశులైన (వారి వారి కర్మలచే బద్ధులయిన) యీభూతములయొక్క సముదాయము నంతను మరల మరల సృజించుచున్నాను. (౯)కాని ఓ ధనంజయా! (సృష్టిని నిర్మించుటయను) నీకర్మయందు నాకు నాసక్తిలేమిచే నే నుదాసీనునివలె నున్నాను గాన నాకర్మలు నన్ను బంధింపనేరవు. (౧౦) నేనధ్యక్షుఁడనై ప్రకృతినుండి చరాచర సృష్టినంతను ప్రసవింపఁజేయుచున్నాను. కావున నోకౌంతేయా! జగత్తున కుత్పత్తి లయములు జరుగుచున్నవి.

: [బ్రహ్మదేవుని పగటికాల (కల్పము) మారంభమగునేని యవ్యక్తప్రకృ : తినుండి వ్యక్తసృష్టి కలుగుచున్నదని (నిర్మింపఁబడుచున్నదని) పూర్వాధ్యా : యమునందు చెప్పఁబడినది. (౮.౧౮). కాని పరమేశ్వరుఁడు ప్రతిమను : జునియొక్కయు కర్మననుసరించియే వానికి మంచిదిగాని, చెడుదిగాని

§§ అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్,
పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్. ౧౧
మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. ౧౨
§§ మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః,
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్. ౧౩.

యగు జన్మలనిచ్చువాఁడగుటచే, తాను కర్మలచే నలిప్తుఁడుగ నున్నాఁడను నది మొదలగు విషయము లచ్చో విశేషముగఁ జెప్పఁబడినవి. శాస్త్రీయ ప్రతిపాదనయందీవిషయములన్నియు నొక ప్రకరణముననే చెప్పవచ్చును. గీతలయందున్న పద్ధతి సంవాదాత్మకం బగుటచే నొకవిషయమే ప్రసంగానుసారముగ కొంచెమొకచోటను, మఱియొకచో మఱికొంచెమును చెప్పఁబడినది. పదవశ్లోకమునందు "జగద్విపరివర్తతే" యను పదములు వివర్తవాదము ననుసరించియే యున్నవని యనేకులందురు. కాని జగత్తున కుత్పత్తిలయములు జరుగుచున్నవి; అనఁగా : వ్యక్తము, అవ్యక్తమును మరల నవ్యక్తము వ్యక్తముగను నగుచున్నది యను దానికంటె 'విపరివర్తతే' యను పదమునకు విశేషార్థముండునటుల నాకు తోఁచదు. శాంకరభాష్యమునందును చెప్పలేదు. కర్మచే మనుజుఁ డపశుఁడెట్లగునదియు గీతారహస్యము నందలి పదవప్రకరణమునందు వివేచింపఁబడినది. చూడుఁ.—]

(౧౧) సర్వభూతములకును గొప్పయీశ్వరుఁడునగు నాయొక్క యుత్కృష్టమగు స్వరూపమును నెఱుఁగనట్టి మూఢులు నన్ను మానుషదేహమును ధరించినవానిగాఁదలచి యవమానముచేయుచున్నారు. (౧౨) వారియొక్క యాశలు నిష్ఫలములైనవియు, కర్మలు వ్యర్థములైనవియు, జ్ఞానము ఫలశూన్యమును, చిత్తము భ్రష్టమయినదియు నగుటచే వారు మోహాత్మకమును, రాక్షసమును, నాసురమగు స్వభావము నాశ్రయించి యున్నారు.

[అసురపురుషులను వర్ణించి యిప్పుడు దైవస్వభావము గలవారిని వర్ణించుచున్నాఁడు—].

(౧౩) కాని, ఓ పార్థా! నా దైవీ ప్రకృతినాశ్రయించి యున్న మహాత్ములు సర్వభూతములకును, నవ్యయమైనట్టి యాద్యస్థానమును నగు నన్ను దెలిసికొని యనన్యభావ

సతతంకీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. ౧౪
జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్. ౧౫
§§ అహం క్రతురహం యజ్ఞః స్వధాఽహమహమౌషధమ్,
మంత్రోఽహ మహమేవాజ్యమహమగ్నిరహం హుతమ్.

ముగలవారై నన్ను భజించుచున్నారు.(౧౪)మఱియు, యత్నశీలురును, దృఢవ్రతులును, నిత్యమును యోగయుక్తులు నగుచు, నన్నెల్లప్పుడును గొనియాడుచు, వందనముచేయుచు భక్తితోనుపాసించుచున్నారు. (౧౫)అటులే యనేకులు సర్వతోముఖుఁడనైన నన్నేకత్వముచేతను (అనఁగా: నభేదభావముచేతను) పృథక్త్వముచేతను (అనఁగా భేదభావముచేతను) లేక బహువిధములగు జ్ఞానయజ్ఞములచేతను యజించి యుపాసించుచున్నారు.

[జగత్తునందు స్పష్టముగఁ గాన్పించు దైవస్వభావముగల్గినట్టియు, రాక్షసస్వభావము గల్గినట్టియు పురుషులను నిచ్చో సంక్షేపముగవర్ణించి, యావిషయమునె ముందు పదునాఱవ యధ్యాయమున విస్తరించుచున్నాఁడు. జ్ఞానయజ్ఞ మనఁగ పరమేశ్వరస్వరూపమును జ్ఞానముచేఁ దెలిసికొని దానివలన సిద్ధిని సంపాదించుకొనుటయే యర్థమని పూర్వమునందు చెప్పఁబడియేయున్నది. (గీ. ౪. 33. పైన టిప్పణి చూడుడు) కాని పరమేశ్వరునియొక్క యీజ్ఞానముసైతము ద్వైతమును, నద్వైతమును మొదలగు ననేక ప్రకారములైనది కావచ్చును. కావున జ్ఞానయజ్ఞములు సైతము వేర్వేఱుగ నుండవచ్చును. కాని జ్ఞానయజ్ఞము లీరీతిగ ననేకములైనను, పరమేశ్వరుఁడు విశ్వతోముఖుఁ డగుటచే నీయజ్ఞము లన్నియు నాతనినే జెందునని పదునైదవ శ్లోకమునందలి తాత్పర్యము. 'ఏకత్వము'చేతను, 'పృథక్త్వము' చేతను మొదలగు పదములను బట్టి ద్వైతాద్వైతవిశిష్టాద్వైతాది సంప్రదాయము లర్వాచీనములైనను నీకల్పనలు బహుకాలము క్రిందటనే యున్నవని స్పష్టమగుచున్నది. ఈశ్లోకమునందు చెప్పఁబడిన పరమేశ్వరునియొక్క యేకత్వ,పృథక్త్వ మెద్దియో దానిని సైతము చెప్పుచున్నాఁడు.—]

(౧౬) క్రతువు(అనఁగా: శ్రౌతయజ్ఞము) నేను, యజ్ఞము(అనఁగా: స్మార్తయజ్ఞము) నేను, స్వధయును (అనఁగా : శ్రాద్ధములందు పితృదేవతల కర్పింపఁబడు

పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవ చ. ౧౭
గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయమ్. ౧౮
తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ,
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున. ౧౯

వన్నమును) నేను, ఔషధము (అనఁగా : వనస్పతులనుండి యజ్ఞార్థమై బయలు దేరిన యన్నమును) నేను, (యజ్ఞమునందు హోమము చేయుచు చెప్పఁబడు) మంత్రములును నేను. ఆజ్యమును నేను, అగ్నియు నేను, (అగ్నియందు హోమము చేయఁబడిన) యాహుతియు నేనే.

[క్రతువును, యజ్ఞము నను నీశబ్దములు మొదట సమానార్థకములే కాని, యజ్ఞశబ్దముయొక్క యర్థము, తర్వాత వ్యాపకమయినందున, దేవపూజ వైశ్వదేవము, నతిథిసంతర్పణము, ప్రాణాయామము, జపము మొదలుగా
౧ గల కర్మలును యజ్ఞశబ్దముచేఁ జెప్పఁబడినవి. (గీ. ౪. ౨౩-౩౦), అట్లు క్రతుశబ్దమున కర్థము వ్యాపకము కాలేదు. శ్రౌతధర్మములయం దశ్వమేధాదియజ్ఞములకును నీశబ్దమే ప్రయోగింపఁబడియుండుటచే నాయర్థమే తర్వాత స్థిరమైనది. కాన, నీస్థలమునందు క్రతుశబ్దమునకు శ్రౌతయజ్ఞములనియు నర్థము చేసికొనవలయునని శాంకరభాష్యమునందు చెప్పఁబడినది. మఱియు నీయర్థమె పైన వ్రాయఁబడినది. కారణమేమన, నటుల భేదము చెప్పకపోదుమేని క్రతు, యజ్ఞశబ్దములు సమానార్థకములగుటచే నీశ్లోకమునందవి నిష్కారణముగ రెండవపర్యాయము చెప్పినదోషమువచ్చును.—]

(౧౭) ఈజగత్తునకుఁ దండ్రిని, తల్లిని, ధాతను (ఆధారభూతుఁడను) పితామహుఁడను (తాతను) నేను, పవిత్రమైనవస్తువును, జ్ఞేయమైనవస్తువును, ఓంకారమును, ఋగ్వేదమును, సామవేదమును, యజుర్వేదమును, నేనే. (౧౮) (అందఱకు) గతిని, (ఎల్లవారికి) పోషకుఁడను, ప్రభువును, సాక్షిని, నివాసమును, శరణమును, సఖుఁడను, నుత్పత్తిని, ప్రళయమును, స్థితిని, నిధానమును, నవ్యయమగు బీజమును నేనే. (౧౯) ఓయర్జునా! నేను వేఁడిని కలుగఁజేయుచున్నాను. దానిని లేకయుండుటను జేయుచున్నాను. అమృతమును, మృత్యువును, సత్తును, నసత్తును నేనే యయి యున్నాను.

[పరమేశ్వరుని స్వరూపమిట్లే సవిస్తరముగ ౧౦, ౧౧, ౧౨వ యధ్యాయములయందు వర్ణింపఁబడినది. కాని యిచ్చోట విభూతిమాత్రమే కాక పరమేశ్వరునకు జగత్తునందలి భూతములతోనున్న సంబంధము, తల్లిదండ్రులు, మిత్రులు మొదలయినవారితో నున్న సంబంధమువలెనున్నదని విశేషముగఁ జెప్పఁబడినది. ఈరెండువిధములగు వర్ణనలలోను కొంచెము భేదమున్నది. అది యట్లుండనిమ్ము; సృష్టిని కలుగచేయుటయును, నాకర్షించుటయు నను నీరెంటిలో నొకక్రియయే మనదృష్టికి లాభదాయకమును, రెండవది నష్టమును కలుగజేయునదిగను నున్నను, తాత్త్వికదృష్టిచే నీరెంటిని పరమేశ్వరుఁడే చేయుచున్నాఁడని తెలిసికొనవలయును. ఈయభిప్రాయమునే మనస్సున నిడికొని పూర్వమునందు (గీ. ౭-౧౨) సాత్త్వికములును, రాజసములును, తామసములు నగుపదార్థములన్నింటిని నేనే పుట్టించినానని భగవంతుఁడు చెప్పుచున్నాఁడు. మఱియు ముందు పదునాల్గవయధ్యాయమునందు గుణత్రయవిభాగముచే నానాత్వ మెట్లుగలుగునో సవిస్తరముగ వర్ణింపఁబడినది. ఈదృష్టితోఁజూచితిమేని యిరువదియొకటవశ్లోకమునందు, సత్, అసత్ అను నీరెండుపదములకును యథాక్రమముగ మంచి చెడుగులని యర్థము చేయవలసివచ్చును. మఱియు గీతలలో నుత్తరగ్రంథమున (గీ. ౧౭. ౨౬-౨౭) నొకప్పుడు అట్లర్థము చేయఁబడియు నున్నది కాని 'సత్' అనఁగా 'నవినాశి'యనియు, అసత్ అనఁగా 'వినాశి'యనియు లేక నశ్వరము, అనియు సామాన్యములగునర్థములే (గీ. ౨-౧౬) యిచ్చో నుద్దేశింపఁబడి యుండును. మఱియు మృత్యువు, అమృతమును, సత్, అసత్ అనెడి ద్వంద్వాత్మకములగుశబ్దములు ఋగ్వేదమునందలి, నాసదీయసూక్తమునుండి గ్రహింపఁబడినవని తోఁచుచున్నది. అయినను నాసదీయసూక్తమునందు 'సత్' అనుశబ్దము దృశ్యసృష్టియనునుద్దేశముతోఁ బ్రయోగింపఁబడినది. గీతలో 'సత్' అను శబ్దమును 'పరబ్రహ్మ' యనునర్థమునఁ బ్రయోగింపఁబడినది. దృశ్యసృష్టిని 'అసత్' అనిచెప్పుచున్నది. ఇదియే వీనిలోనున్న (గీతా. ర. ప్ర. ౯. పు. ౨౩౨-౨౩౫ చూడు) భేదము; కాని యీరీతిగ పారిభాషికమగుభేద ముండినను 'సత్', 'అసత్' శబ్దములు రెండును నొకసారియే ప్రయోగింపఁబడినచో వానియందు దృశ్యసృష్టియు, పరబ్రహ్మయు నను నీరెండును నొకదానిలోచేరునని స్పష్టమగుచున్నది. కాని వేర్వేఱగు పరిభాషచే నొక్కదానిని 'సత్' అనియు, నొకదానిని 'అసత్'

§§ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక మశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్.
తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే.

[అనియు నీవు చెప్పినను, రెండును పరమేశ్వరస్వరూపములేయని నిరూపించుటకై 'సత్' 'అసత్' అనునీశబ్దములకు వ్యాఖ్యానము చేయుక, 'సత్', 'అసత్', లు నేనే యైయున్నానని సామాన్యముగఁ జెప్పఁబడిన దనియు, నీవర్ణనకు భావార్థమును చెప్పవచ్చును. (గీ. ౧౧.౩౭ మఱియు ౧౩.౧౨ చూడుము) పరమేశ్వరుని స్వరూపము లిట్లనేకమయినను నేకత్వబుద్ధితో నుపాసించుటయును, ననేకత్వబుద్ధితో నుపాసించుటయు ననువానిలో నున్న భేదము నిప్పుడు చెప్పుచున్నాఁడు:—]

(౨౦) త్రైవిద్యులు అనఁగా ఋక్, యజుస్సు, సామము నను మూఁడు వేదములయందున్న కర్మ చేయువారును, సోమపులు (సోమపానము చేయువారును) నిష్పాపులునగువారు నన్ను యజ్ఞములచేఁ బూజించి స్వర్గలోకము నొందుదమని యిచ్ఛయించుచున్నారు. వారింద్రునియొక్క పుణ్యలోకమును జేరి స్వర్గమునందు దేవతలయొక్క ననేకములగు దివ్యభోగముల ననుభవించుచున్నారు. (౨౧) ఆవిశాలమగు స్వర్గలోకము ననుభవించి పుణ్యముక్షయించిన పిదప మఱల జన్మనెత్తి మృత్యులోకమునకు వచ్చుచున్నారు. ఇట్టి త్రయీధర్మముల (అనఁగా: మూఁడు వేదములయందలి యజ్ఞయాగాది శ్రౌతధర్మముల) నాచరించువారును, కామ్యములగు, నుపభోగములను గోరువారును (స్వర్గమునుగుఱించి) రాకపోకల జేయుచుందురు.

[యజ్ఞయాగాది ధర్మములచేగాని, నానావిధములగు దేవతలయారాధనచేఁగాని కొంచెము కాలము స్వర్గమునందుండినను, పుణ్యాంశము నశించిన పిదప మఱల భూలోకమునకు రావలసిన సిద్ధాంతము పూర్వము నందనేకపర్యాయములు చెప్పఁబడినది. (గీ. ౨.౪౨-౪౪; ౪.౩౪; ౬.౪౧; ౭.౨౩; ౮. ౧౬ మఱియు ౨౫) మోక్షమిట్టిదిగాదు. నిత్యమయినది. అనఁగా నొకపర్యాయము పరమేశ్వరునొందినపిదప తిరిగి జననమరణ చక్రములోఁ బడఁడు. మహాభారతమునందు (వన. ౨౬౦) వర్ణింపఁబడిన స్వర్గసుఖమును నిట్టిదె. కాని యజ్ఞయాగాదులచేతనే వృష్టిమొదలయినవి యుత్పన్నము

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. ౨౨
§§ యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్. ౨౩

లాయెనుగాన- యజ్ఞయాగములను వదలినచో నీజగత్తునందలి యోగక్షేమము (అనఁగా: నిర్వాహము) ఎట్లగునని శంకకలుగును. (గీ. ౨. ౪౫ మీఁదటిప్పణిచూను. గీ. ర. పు. ౪౦౩ చూడుఁ.) కాన పైశ్లోకమునుగలిపియే దానికిప్పుడుత్తరమును జెప్పుచున్నాఁడు.—]

(౨౨) ఎవరు అనన్యనిష్ఠులయి నన్ను జింతించుచు నన్ను పాసించుచున్నారో యట్టి నిత్యయోగయుక్తులయిన పురుషులయొక్క యోగక్షేమములను నేనువహించుచున్నాను.

[అదివఱకు తనకు లేనివస్తువును సంపాదించుకొనుట యోగము. తనకున్నవస్తువును రక్షించుకొనుట క్షేమము. అని యోగక్షేమశబ్దములకు వ్యాఖ్యానము (శాశ్వతకోశమునందు ౧౦౦ మఱియు ౭౮౭ శ్లోకములను చూడుఁ) చేయఁబడియుండుటచే వానికి మొత్తముమీఁద సంసారమునందెల్లప్పుడును నవసరములగు వానియొక్క నిర్వాహమని యర్థము. కర్మయోగమార్గమున నీశ్లోకమునకేమి యర్థమైనది యను గీతారహస్యమునందల్లి పండ్రెండవప్రకరణమునందు (పు. ౫౩౨, ౫౩౩) విచారింపఁబడినది. నారాయణీయధర్మములయందును నిట్లే.

మనీషిణో హి యే కేచిత్ యతయో మోక్షధర్మిణః,
తేషాం విచ్ఛిన్నతృష్ణానాం యోగక్షేమవహో హరిః.

అని చెప్పఁబడినది. (మ. భా. శాంతి. ౩౪౭. ౭౨) ఈపురుషుఁడేకాంతభక్తుఁడైనను ప్రవృత్తిమార్గము నందున్నవాఁడని (అనఁగా: నిష్కామబుద్ధిచే కర్మలచేయుచున్నాఁడని యక్కడఁ జెప్పఁబడినది. అదియట్లుండనిమ్ము. ఇప్పుడు బహుత్వముతోఁ బరమేశ్వరుని సేవించువారికి కడపటగల్గుఫలమును జెప్పుచున్నాఁడు.—]

(౨౩) ఓకౌంతేయా! భక్తిశ్రద్ధాయుక్తులయి యితరదేవతలను యజించువారు సైతము నన్నే యజించినవారగుదురు; కాని యీయాయజనము శాస్త్రోక్తమయి

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే. ౨౪

నదికాదు. (౨౪) కారణమేమన సర్వయజ్ఞములకును భోక్తను, స్వామిని నేనే యయియున్నాను. నాయొక్క తత్త్వము తెలియకపోవుటచే వారు మఱల జనన మరణప్రవాహమునఁ బడుదురు.

[ఈరెండుశ్లోకములయం దున్నసిద్ధాంతములో నున్నగొప్పతనము గీతారహస్యమునందలి పదమూఁడవ ప్రకరణమునందు (పు. ౫౭౦-౫౭౩) వివేచింపఁబడినది. ప్రతిదేవతయు భగవంతునియొక్క యొకవిధమగు స్వరూపమే యైయున్న దనుతత్త్వము వైదికధర్మములలో నతిచిరకాలమునుండియు వాడుకలోనే యున్నది. ఉదాహరణము. ఋగ్వేదమునందే "ఏకం సద్విప్రా బహుధా వదం త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః"(ఋ.౧. ౧౬౪. ౪౬) పరమేశ్వరుఁ డొక్కఁడే యైనను పండితు లాతని నగ్నియనియు, యముఁడనియు, వాయువనియు ననేకవిధములుగ బేర్కొనుచున్నారు అనిచెప్పఁబడినది; మఱియు దాని ననుసరించియే దీనిపైయధ్యాయమునందు పరమేశ్వరుఁ డొక్కఁడైనను నాతనియొక్క విభూతు లనేకములని జెప్పఁబడినది. అరీతిగనే మహాభారతాంతర్గతమగు నారాయణీయోపాఖ్యానమునందు చతుర్విధభక్తులలోను కర్మచేయు నేకాంతికభక్తుఁడు శ్రేష్ఠుఁడు. (గీ. ౭. ౧౯ మీదటిప్పణి చూడు) అని చెప్పినపిదప—

బ్రహ్మాణం శితికంఠం చ యాశ్చాన్యా దేవతాః స్మృతాః,
ప్రబుద్ధచర్యాః సేవంతో మామేవైష్యంతి యత్పరమ్.

"బ్రహ్మదేవునిగాని, శివునిగాని, యితరదేవతలనుగాని, భజించుసాధువులును నన్నే పొందుచున్నారు. (మ. భా. శాం ౩౪౧. ౩౫) అని చెప్పఁబడినది. (భాగ. ౧౦. పూ. ౪౦. ౮-౧౦ చూడు) నారాయణీయోపాఖ్యానమునందును—

యే యజంతి పితౄన్ దేవాన్ గురూంశ్చైవాతిథీంస్తథా,
గాశ్చైవ ద్విజముఖ్యాంశ్చ పృథివీం మాతరం తథా,
కర్మణా మనసా వాచా విష్ణుమేవ యజంతి తే,

"దేవతలు, పితరులు, గురువులు, అతిథులు, బ్రాహ్మణులు, గోవులు మొదలయినవానిని సేవించువారు పర్యాయముగ విష్ణునే యజించుచున్నారని

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్. ౨౫

చెప్పఁబడినది. (మ. భా. శాం. ౩౪౧. ౨౬, ౨౭). భక్తి ముఖ్యముగ గ్రహింపఁబడుటచే దేవతారూప మగు ప్రతీకము గౌణమగును. లేక, విధి భేదమున్నను, నొక పరమేశ్వరునియుపాసనయే చేయఁబడు నని భాగవత ధర్మములు స్పష్టముగఁ జెప్పుచుండ, భాగవతధర్మీయులుసైతము, శైవులతో వివాద పెట్టుకొనుట యాశ్చర్యకరమైనది. అది యటులుండుగాక; ఏదేవత నుపాసించినను నాయుపాసన భగవంతునకే చేరు ననుసిద్ధాంతము నిజమయినను సర్వదేవతలును భగవంతుఁడే యనుజ్ఞానము లేకపోవుటచే మోక్షమార్గము తప్పిపోయినందున నాయా దేవతల నుపాసించువారికి వారి వారిభావము ననుసరించి భగవంతుఁడె వెవ్వేఱుఫలముల నెట్లిచ్చునో యిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౨౫) దేవతలయొక్క వ్రతముచేయువారు దేవతలను, పితృలయొక్క వ్రతముచేయువారు పితరులను, నాయాభూతములఁ బూజించువా రాయాభూతములను, నన్ను యజించువారు నన్నును నొందుచున్నారు.

[ఒక పరమేశ్వరుఁడే యంతటను నిండియున్నను వారివారిభావానుసారముగ న్యూనాధికములగు ఫలములు వారికి లభించుచుండును; అయినను నీ ఫలములనుసైతము దేవత లియ్యరు. ఇఁక నేమన పరమేశ్వరుఁడే యిచ్చునని పూర్వము చెప్పినవిషయమును (గీ. ౭. ౨౦–౨౩) మఱుమఁగూడదని యిందలి సారాంశము. పైన యిరువదినాల్గవశ్లోకమునందు "యజ్ఞముల కన్నింటికి నేనే భోక్తను" అని భగవంతుఁడు సెప్పినదాని కిదియే తాత్పర్యము. మహాభారతమునందును—

యస్మిన్ యస్మింశ్చ విషయే యో యో యాతి వినిశ్చయమ్,
స తమేవాభిజానాతి నాన్యం భరతసత్తమ.

"ఎవఁడేయేభావమునందు కృతనిశ్చయుఁ డగుచున్నాఁడో, వాఁ డాయా భావమున కనురూపముగనె ఫలము నొందుచున్నాఁడు" అని చెప్పఁబడినది. (శాం. ౩౫౨. ౩)."యం యథా యథోపాసతే తదేవ భవతి" అని శ్రుతియుం దున్నది.(గీ. ౭. ౬ మీఁదటిప్పణి చూడుము). నానాత్వముచేత దేవతల నుపాసించువారికి (అనఁగా : ననేకదేవతల నారాధించువారికి)

§§ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః. ౨౬

లభించుఫలమును మొదటిచరణమునందు చెప్పినపిదప, రెండవచరణమునం దనన్యభావముచే భగవంతుని భజించువారికి నిజమయిన భగవత్ప్రాప్తి కలుగు నని యర్థము చెప్పఁబడినది. ఇప్పుడు భగవంతుఁడు తన భక్తుఁడు తనకేమి సమర్పించుచున్నదియు విచారింపక యతనిభావమును మాత్రమే విచారించి యతనియొక్క భక్తిని స్వీకరించుచున్నాఁ డనునది భక్తిమార్గమునందలి గొప్పతత్త్వ మని చెప్పుచున్నాఁడు.—]

(౨౬) ఏదో యొకానొకపత్రమునుగాని, పుష్పమునుగాని, ఫలమునుగాని, యథాశక్తిగ కొంచె ముదకమునయినను, భక్తితో నాకర్పించునట్టి ప్రయతాత్మునియొక్క అనఁగా: నియతచిత్తునియొక్క యీభక్తియను కానుకను నేనానందముతో స్వీకరించుచున్నాను.

[కర్మకంటె బుద్ధి శ్రేష్ఠము (గీ. ౨. ౪౯) అను కర్మయోగమునందలి సిద్ధాంతమునే భక్తిమార్గమునందు మఱియొకవిధమున పైశ్లోకమునందు వర్ణింపఁబడినది. (గీతా. ర. ప్ర. ౧౪. పు. ౬౫౨-౬౫౪ చూడుము). ఈ విషయమయి సుదామునియొక్క (కుచేలునియొక్క) యటుకులసంగతి ప్రసిద్ధమై యున్నది. భాగవతపురాణమునం దీశ్లోకము కుచేలోపాఖ్యానమునందే చెప్పఁబడినది. (భాగ. ౧౦. ఉ. ౮౧. ౪). పూజాద్రవ్యములు స్వల్పముగ నున్న వనువిషయమును నధికముగ నున్న వనువిషయమును నెప్పుడును మనుజునియొక్క స్వాధీనములోనే యుండదు. కావున యథాశక్తిగ ప్రాప్తమగు కొంచెమైన పూజాద్రవ్యముచేతనే గాక శుద్ధమగుభావముతో సమర్పింపఁబడిన మానసిక మగుపూజాద్రవ్యముచేతనైతము భగవంతుఁడు సంతుష్టుఁ డగుచున్నాఁ డని శాస్త్రములయందు చెప్పఁబడినది. దేవుఁడు భావము నపేక్షించును. పూజాద్రవ్యమును నపేక్షించువాఁడు కాఁడు. మీమాంసకులమార్గముకంటె భక్తిమార్గమునందలి విశేష మిదియే. యజ్ఞయాగములు చేయుటకు మిక్కిలి పటాటోపముచేఁసి, విశేషద్రవ్యము సంపాదింపవలసివచ్చును. కాని, భక్తియజ్ఞ మొకతుళసీదళముచే నైతము పూర్తియగును. దుర్వాసులవారు తమయింటికి వచ్చినప్పుడు ద్రౌపది యిట్టి యజ్ఞమునే చేసి భగవంతుని సంతోషింపఁజేసిన దని మహాభారతమునందు

§§ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. ౨౭
శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి. ౨౮

చెప్పఁబడినది. అది యట్లుండనిమ్ము; భగవద్భక్తులు తమకర్మలను చేయు నటుల, నీవును చేయుమని యర్జునున కుపదేశించి దానివల్లన గలుగుఫలము నిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౨౭) ఓకౌంతేయా! నీవు సేయునదియు, భుజించునదియు, హోమము చేయునదియు, దానము చేయునదియు, తపము చేయునదియు, నాకు నర్పించుచుండుము. (౨౮) ఇట్లు చేయుటచే (కర్మలను చేసినను) కర్మలయొక్క శుభాశుభ ఫలరూప మగుబంధనమునుండి నీకు ముక్తి కలఁగును. మఱియు (కర్మఫలములను) త్యజించుట యనునియోగముతో యుక్తాత్ముఁడవు(అనఁగా: శుద్ధాంతఃకరణ కలిగినవాఁడవు) ను ముక్తుఁడవు నగుచు నన్ను నొందుదువు.

[భగవద్భక్తులు సయితము కృష్ణార్పణబుద్ధితో కర్మల నన్నింటిని చేయ వలయును. వదలఁగూడదని దీనింబట్టి స్పష్టమగుచున్నది; మఱియు "సమత మున నీరెండుశ్లోకములును గొప్పవి. "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః" (గీ. ౪. ౨౪) ఈ జ్ఞానయజ్ఞముయొక్క తత్త్వమే యిప్పుడు భక్తియొక్క పరిభాష ననుసరించి యిరువదిఏడవ శ్లోకమునందు చెప్పఁబడినది. (గీతా. ర. ప్ర. ౧౩. పు. ౫౮౪-౫౮౫ చూడు) "మయి సర్వాణి కర్మాణి సన్న్యస్య" (గీ.3.30) "నాయందు కర్మముల నన్నింటి నుంచి యుద్ధముచేయుము." అని యర్జునునకు మూఁడవ యధ్యాయమునందు చెప్పఁబడినది. మఱియు నైదవ యధ్యాయమునందు "బ్రహ్మయందు కర్మల నర్పించి సంగరహితుఁడై కర్మలను చేయువానికి కర్మలేప ముండదు" (౫. ౧౦) అని మరల చెప్పఁబడినది. గీత లనుబట్టి చూడఁగ నిదియె నిజమగుసన్న్యాస మని తోఁచును. (గీ. ౧౮. ౨) ఈరీతిగ ననఁగా: కర్మఫలాశను వదలి, (సన్న్యస్య) సర్వకర్మలను జేయువాఁడె నిత్యసన్న్యాసి యగును. (గీ. ౫. ౩) కర్మత్యాగరూపమగుసన్న్యాసము గీతలకు సమ్మతము గాదు. ఈరీతిగఁ జేయఁబడుకర్మలు మోక్షమునకుఁ బ్రతిబంధకములు కావని పూర్వమునందనేకస్థలములయందు (గీ. ౨. ౬౪; ౩. ౧౯; ౪. ౨౩; ౫. ౧౨; ౬. ౧; ౮. ౩) చెప్పఁబడినది. ఆవిషయమునే మరల

౨౯ సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతితు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్. ౨౯

అపి చేత్సు దురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః. ౩౦

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. ౩౧

నీయిరువదియెనిమిదవ శ్లోకమునందు చెప్పెను. భాగవతపురాణమునందును, నృసింహరూపుఁడగు భగవంతుఁడు ప్రహ్లాదునకు "మయ్యావేశ్య మనస్తాత కురు కర్మాణి తత్పరః"—నాయందు చిత్తమును నిలిపి సర్వకర్మలను చేయుము—అని యుపదేశించెను. (భాగ. ౭-౧౦-౨౩) తర్వాత భగవద్భక్తులు సర్వకర్మలన్ను నారాయణార్పణము చేయవలయు నని యేకాదశస్కంధమందు భక్తియోగముయొక్క తత్త్వము సెప్పఁబడినది. (భాగ. ౧౧. ౨. ౩౬ మఱియు ౧౧.౧౧.౨౪ చూడు) అది యటులుండనిమ్ము; భక్తిమార్గము సులభమని యీయధ్యాయారంభమందు చెప్పఁబడినది. ఇప్పుడు దాని యందలి సమత్వరూపమను మఱియొక గొప్పవిశేషమును చెప్పుచున్నాఁడు.—]

(౨౯) నేను సర్వభూతములకును సమానుఁడనుగానే యున్నాను. నాకు (ఒకఁడు) ద్వేష్యుఁడుగాని (అనఁగా : నప్రియుఁడు) మఱియు (ఒకఁడు) ప్రియుఁడు(అనఁగా:నిష్టమైనవాఁడు)కాఁడు. కాని యెవరు నన్ను భక్తితో భజించుచున్నారో వారు నాయందును, నేను వారియందు నుందుము. (౩౦) విశేష దురాచారియైనను, నన్నన్యభావముతో భజించినచో నతఁడు సాధువే యని తెలిసికొనవలయును. కారణమేమియన : నతని బుద్ధికి మంచినిశ్చయముగలిగి యున్నది. (౩౧) వాఁడు శీఘ్రముగ ధర్మాత్ముఁడగును. మఱియు నిత్యమగుశాంతి నొందును. ఓకౌంతేయా! నాయొక్క భక్తుఁ డెప్పుడును నాశనము నొందఁ డని నీవు బాగుగ తెలిసికొనుము.

[భగవద్భక్తుఁడు దురాచారియైనను భగవంతున కిష్టుఁడేయగు నని ముప్పదవ శ్లోకార్థమును చేయరాదు. మొదట నెట్టిమనుజుఁడైనను(అనఁగా:దురాచారియైనను) నొకసారి పరమేశ్వరునిపైఁ దనబుద్ధిని నిల్పెనేని పిదప నతఁడేమియును దుష్కర్మను చేయఁడు, మఱియు నతఁడు క్రమక్రమముగ

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేపి యాంతి పరాం గతిమ్. ౩౨

ధర్మాత్ముఁడై సిద్ధి నొందును. ఈసిద్ధిచే వానిపాపములు పూర్ణముగ తుదకు నశించు నని మాత్రమె భగవంతుఁడు సెప్పుచున్నాఁడు. కావున నాఱవ యధ్యాయమునందు (౬. ౪౪) కర్మయోగమును దెలిసికొనవలయునని కోరికమాత్రమే పుట్టి ను చక్రములోఁ బడవేయఁబడినవానివలె యవశుఁడై మనుజుఁడు శబ్దబ్రహ్మముకంటె పరమగు పదమును బొందు నని చెప్పఁబడిన సిద్ధాంతమునే యిప్పుడు భక్తిమార్గమునకు సంబంధింపఁజేసి చూపించినాఁడని యిందలి సారాంశము. పరమేశ్వరుఁడు సర్వభూతములయందును సమానుఁడుగ నుండు నను విషయమునే యిప్పుడు విశేషముగ వివరించుచున్నాఁడు.—]

(౩౨) కారణ మేమన: నో పార్థా! నన్నాశ్రయించి, స్త్రీలును, శూద్రులును, నంత్యజులు మొదలగు పాపయోనులును సైతము పరమగతి నొందుచున్నారు.

[౩౨ వ శ్లోకమునం దున్న పాపయోనిశబ్దము విశేష్యము కాదనియు, స్త్రీలకును, వైశ్యులకును, శూద్రులకును విశేషమనియు,నందుకు కారణము పూర్వమునం దేదో యొక పాపము చేసిననే గాని స్త్రీ-వైశ్య-శూద్రులై యెవరును జన్మింపరనియు కొందఱుటీకాకారులు వ్రాసిరి. వారిమతమున పాపయోనిశబ్దము సామాన్యముగుటచే స్త్రీలు, వైశ్యులు, శూద్రులు నను భేద ముదాహరణార్థమయి చెప్పఁబడినది. కాని మాకీయర్థము సమ్మతమైనది కాదు. పాపయోనిశబ్దమున కీకాలమున దొరతనమువారిచే నపరాధులని యెన్నఁబడినవారని యర్థము వివక్షితమైనందున యాజాతివారికిని భగవద్భక్తిచే సిద్ధిగల్గునని యీశ్లోకమునందలి తాత్పర్యము. స్త్రీలును, వైశ్యులును, శూద్రులును నీవర్గములోనివారు కారు. ఇఁక వారికి మోక్షము సిద్ధించుటకు ప్రతిబంధ మేమన: వేదశ్రవణమునకు వారనధికారు లనుటయే. కావుననే భాగవతపురాణమునందు—

స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా,
కర్మశ్రేయసిమూఢానాం శ్రేయ ఏవం భవేదిహ,
ఇతిభారతమాఖ్యానం కృపయా మునినాకృతమ్.

"స్త్రీలు, శూద్రులు, కలియుగమునందలి నామధారులగు బ్రాహ్మణులు

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా,
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్. 33
§§ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. 34

నను వారికీసులకు వేదములు వినఁబడదగనందున వారు మూఢులుగ నుండకూడదని వ్యాసులవారు దయగలవారై మహాభారతమును ముఖ్యముగ గీతను వారికల్యాణార్థమయి రచించిరి" అని చెప్పఁబడినది. (భాగ. ౧. ౪. ౨౫) భగవద్గీతలయందున్న పైశ్లోకము కొంచెము పాఠభేదముతో నను గీతలలో నున్నది. (మ. భా. అశ్వ ౧౯. ౬౧, ౬౨). జాతియొక్కయు, వర్ణముయొక్కయు, స్త్రీపురుషాదులయొక్కయు, తెల్ల నలుపు, తెలుపు మొదలగు రంగులు మొదలగువానియొక్కయు భేదమును లక్ష్యముసేయక యెల్ల రకును సద్గతినిచ్చు భగవద్భక్తియను రాజమార్గముయొక్క నిజమగు గొప్పతనము, మహారాష్ట్రమునందలి సంతమండలి (సత్పురుషసముదాయము) యొక్క యితిహాసములనుబట్టి యందఱకును దెలియును. (పైశ్లోకమునకు విశేషమగు విచారము గీతారహస్యము ప్ర. ౧౩. పు. ౬౦౪-౬౦౬)లో చేయఁబడినది చూడుడు). ఈధర్మము నాచరించువిషయమయి యర్జునునకు 33 వ శ్లోకముయొక్క యుత్తరార్థమునందు చేయఁబడినయుపదేశమే ముందును జేయఁబడుచున్నది.—]

(33) ఇఁక పుణ్యమతులగు బ్రాహ్మణులును, నాకు భక్తులగురాజర్షులును (క్షత్రియులును) ననువారివిషయము చెప్పనేల ? ఈయనిత్యమును అసుఖమును (అనఁగా : దుఃఖము నిచ్చునదియు నగుమృత్యు) లోకమునందు నీవుంటివికాన, నన్ను భజింపుము. (34) నాయందు మనస్సు నుంచుము. నాభక్తుఁడవు కమ్ము. నాయొక్క యజనపూజనలఁ జేయుము. నన్ను నమస్కరింపుము. ఇట్లు మత్పరాయణుఁడవై నీయొక్కయోగము నవలంబించితివేని నన్నే పొందుదువు.

[యథార్థముగ విచారింతుమేని 33 వ శ్లోకమునందె యీ యుపదేశ మారంభింపఁబడినది. ప్రకృతియొక్క వ్యాపారము (అనఁగా: నామరూపాత్మక మగుదృశ్యసృష్టి) అనిత్యమును, పరమాత్మయె నిత్యము ననెడు యధ్యాత్మశాస్త్రముయొక్క సిద్ధాంతము ననుసరించి యనిత్యపదము 33 వ శ్లోకమునందుఁ బ్రయోగింపఁబడినది. మఱియు, నసుఖపద మీసంసారము

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగుహ్యయోగో నామ

నవమోఽధ్యాయః. ౯

నందు సుఖముకంటె దుఃఖ మధికముగ నున్న దనుసిద్ధాంతము ననువదించుచున్నది. అయినను నివర్తన మధ్యాత్మమార్గము ననుసరించినది కాదు. భక్తిమార్గము ననుసరించినది. కాన 'పరబ్రహ్మ' లేక 'పరమాత్మ' యనుశబ్దములను ప్రయోగింపక "నన్ను భజింపుము, నాయందు మనస్సు నుంపుము, నన్ను నమస్కరింపుము," అని వ్యక్తస్వరూపమును దెలియఁజేయు నుత్తమ పురుషప్రయోగముచే భగవంతుఁ డుపదేశించెను. ఈరీతిగ భజించి మత్పరాయణుఁడవై నియోగము (కర్మ-యోగమును) నవలంబించితివేని (గీ. ౮. ౧ చూడుము) కర్మబంధమునుండి ముక్తుఁడవై నిస్సంశయముగ నన్ను పొందుదు వని భగవంతుఁడు తుదకు చెప్పుచున్నాఁడు. మఱియు నీయుపదేశమే ౧౧ వ యధ్యాయమునందు కడపట మరల చేయఁబడినది. గీతయందలి రహస్యమంతయు నిదియే. ఒకప్పు డది యధ్యాత్మదృష్టితోడను, నొకప్పుడు భక్తిదృష్టితోడను చెప్పఁబడును. ఇదియే భేదము.—

ఈరీతిగ భగవంతునిచే గానముచేయఁబడిన రాజవిద్యారాజగుహ్య మనుపేరుగల తొమ్మిదవ యధ్యాయము సమాప్తమయినది.



# దశమోఽధ్యాయః.

---

## శ్రీభగవానువాచ.

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. ౧
న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః,
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. ౨
యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. 3

పదియవ యధ్యాయము.

[కర్మయోగసిద్ధికొఱకు. పరమేశ్వరసంబంధమైన వ్యక్తస్వరూపముయొక్క యుపాసనకు సంబంధించిన జ్ఞానవిజ్ఞానమార్గము పూర్వాధ్యాయమునందు చెప్పఁబడినది. కాన దానినే యీయధ్యాయమునందు కొంచెము వర్ణించి, యర్జునుఁ డడుగగా పరమేశ్వరునియొక్క యనేకములగువ్యక్తరూపములను (అనఁగా: విభూతులను తుదకు వర్ణించుచున్నాఁడు. మఱియు దానిని వినుటవలన ప్రత్యక్షమైనరూపమును జూడవలయు నని యర్జునునకు కోరికగలుగఁగా ౧౧ వ యధ్యాయమునందు భగవంతుఁడు తనవిశ్వరూపమును జూపి యర్జునుని కృతార్థునిఁజేసెను.—]

శ్రీ భగవంతుఁడు చెప్పుచున్నాఁడు:—(౧) ఓ మహాబాహువా! (నాసంభాషణముచే) సంతుష్టుఁడ వగునీయొక్క హితమునకై మరల చెప్పఁబోవు విషయమును వినుము. (౨) నాయొక్క ఉత్పత్తి దేవతలగణములును, మహర్షులకును సైతము తెలియదు. కారణమేమనఁగా : దేవతలకును, మహర్షులకును, అన్నివిధములచేతను, నేనే యాదికారణము. (3) నేను (పృథివి మొదలుగాగల యన్ని) లోకములకును గొప్ప యీశ్వరుఁడ నగుటచే నాకు జన్మయును, నాదియు లేదని తెలిసికొనువాఁడే మనుష్యులలో మోహవిరహితుఁడై సర్వపాపములనుండియు విముక్తుఁ డగుచున్నాఁడు.

మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః.౬

మును చూడుడు) తపము, దానము, యజ్ఞము మొదలగుశబ్దములచే తత్పరము లయిన బుద్ధియొక్క భావములే వివక్షితములయినవి. భగవంతుఁ డిప్పుడు చెప్పునదేమనగా:—]

(౬) సప్తమహర్షులును,నట్లె పూర్వమందున్న నలుగురగు మనువులును ఎవరి నుండి (ఈలోకమునందున్న) ప్రజలు గలిగిరో వారును, నాయొక్క మానసులే - (అనఁగా: మనస్సుచే నిర్మింపఁబడిన భావములే) యై యున్నారు.

[ఈశ్లోకమునందున్న శబ్దములు సులభముగ నుండినను, నేపౌరాణిక పురుషుల నుద్దేశించి యీశ్లోకము చెప్పఁబడినదో వారివిషయములలో టీకా కారులకు విశేషమతభేదములు కలవు. ముఖ్యముగ 'పూర్వే', 'చత్వారః' అనుపదములకు నేపదముతో నన్వయము చేయవలయు ననువిషయమున, ననేకు లనేకవిధములుగ చెప్పిరి. సప్తమహర్షులు ప్రసిద్ధులయ్యే యున్నారు. కాని బ్రహ్మదేవునియొక్క యొకకల్పమునందు పదునాలుగుమన్వంతరములు (గీతార. పు. ౨౬౧—౨౬౨ చూడుడు) కావున ప్రతిమన్వంతరమునకు మనువును, దేవతలును,మహర్షులును వెవ్వేఱుగ నుందురు. (హరివంశము ౧, ౭; విష్ణు. ౩. ౧; మఱియు మత్స్య. పు. ౯—చూడుడు). కాన 'పూర్వే' యనుపదమును, సప్తమహర్షులకును విశేషణముగఁజేసి ప్రకృతవైవస్వతమన్వంతరమునకు పూర్వమునందున్న చాక్షుషమన్వంతరమునందలి సప్తమహర్షులె యిచ్చో వివక్షితులయి యున్నారని యనేకులు సెప్పుచున్నారు. ఈసప్తర్షులు భృగ్వాదులు,అనఁగా: భృగువు, నభుఁడు, వివస్వతుఁడు,సుధాముఁడు, విరజుఁడు, అతినాముఁడు, సహిష్ణుఁడు అనువేడుగురు; కాని యీయర్థము సరియైనదికా దని నాయభిప్రాయము.కారణమేమన ప్రకృతమందున్న అనఁగా: వైవస్వతునికంటె పూర్వము(అనఁగా: నేమన్వంతరమునందు గీత చెప్పఁబడినదో యతనికంటె పూర్వము)న నున్న మన్వంతరమునందలి సప్తర్షుల నిచ్చట చెప్పుటకు కారణము లేదు. కాన ప్రస్తుతమునందున్న మన్వంతరములోని సప్తర్షులనే గ్రహింపవలయును. వీరికి, మరీచి, అంగిరస్సు, అత్రి, పులస్త్యుఁడు,పులహుఁడు,క్రతువు,వసిష్ఠుఁడు ననిపేర్లు. మహాభారతమున శాంతిపర్వమునందు నారాయణీయోపాఖ్యానములో

వ్రాయఁబడినవి. (మ. భా. శాం. ౩౩౯. ౫౭, ౫౯; ౩౪౦. ౬౪ మఱియు ౬౯); వారె యిచ్చో వివక్షితులని నామతము. కారణమేమన: నారాయణీయ (లేక భాగవతములగు) ధర్మము లెవ్వాని విధులతోఁగూడ గీతయందు ప్రతిపాద్యములై యున్నవి. (గీతా. ర. పు. ౧౨ చూడు) అయినను మరీచి మొదలుగాఁగల సప్తర్షులయొక్కయు పైచెప్పిన పేరులలో అంగిరస్సుయొక్క స్థానమున భృగువు నప్పుడప్పుడు జెప్పినట్లు స్పష్టముగఁ గన్పట్టుచున్నది. మఱియు కొన్నిస్థలములయందు, కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడును ప్రస్తుతపు యుగమునందున్న సప్తర్షుల చెప్పఁబడినదని, యిక్కడ చెప్పుట యావశ్యకమయియున్నది. (విష్ణు. ౩. ౧. ౩౨ మఱియు ౩౩; మత్స్య. ౯. ౨౭ మఱియు ౨౮; మ. భా. అను. ౯౩. ౨౧); మరీచిమొదలుకొని పైన చెప్పఁబడిన సప్తర్షులలోను భృగువును, దక్షుని పరిగణించి, విష్ణుపురాణమునందు తొమ్మండుగురనియు, (విష్ణు. ౧. ౭. ౫-౬) వారియంతె నారదునిసైతము లెక్కించి బ్రహ్మయొక్క పదుగురుమానసపుత్త్రులని మనుస్మృతియందు చెప్పఁబడినది. (మను. ౧. ౩౪-౩౫) మఱియు మరీచ్యాది శబ్దములయొక్క వ్యుత్పత్తి భారతమునందు చెప్పఁబడినది. (మ. భా. అను. ౮౫) కాని సప్తమహర్షు లెవరనిమాత్రమె మనము విచారింపవలసినది. తొమ్మండుగురు పదుగురు నగు మానసపుత్త్రులుగాని, లేక వారియొక్క నామవ్యుత్పత్తులగాని యిచ్చో విచారింపవలసిన యావశ్యకత లేదు. 'పూర్వమందయిన' అనఁగా: పూర్వపుమన్వంతరమునందయిన సప్తమహర్షులని యర్థము కావించికొనుటకు సాధ్యము కాదని స్పష్టమయియున్నది. ఇప్పుడు పూర్వమందయిన నలుఁవురు అనుదానిని మనువులకు విశేషణముచేసి యనేకులు చేసినయర్థ మెంతవఱకు సయుక్తికముగ నున్నదో చూతము. మొత్తముపై మన్వంతరములు పదునాలుగు (౧౪). మఱియు నీ పదునాల్గింటికి పదునల్గురు మనువులు. వానిలో నేడేడుచొప్పున రెండువర్గములు కలవు. మొదటి యేడ్గురికిని స్వాయంభువు, స్వారోచిషుఁడు, ఔత్తమి, తామసుఁడు, రైవతుఁడు, చాక్షుషుఁడు, వైవస్వతుఁడు నని పేర్లు. వీరిని స్వాయంభువాదిమనువు లనెదరు. (మను. ౧. ౬౨ మఱియు ౬౩) వీరిలో నాల్గురుమనువులు గడచనిరి. ప్రస్తుతము ఏడవవాఁడగు వైవస్వంతుని మన్వంతరము జరుగుచున్నది. ఇతని యనంతరము రాఁబోవు యేడ్గురిమనువులలో మొదటి

ళ్ళానికి(భాగ.౮.౧౩.౭)సావర్ణికమనువని పేరు. వారికి సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి,ధర్మసావర్ణి,రుద్రసావర్ణి, దేవసావర్ణి,ఇంద్రసావర్ణియని పేర్లు. (విష్ణు. ౩.౨; భాగవత. ౮. ౧౩; హరివంశ. ౧. ౭).మనువు లిట్లు వేర్వేఱు సప్తకములుగ నుండుటచే నేవర్గమందయినను పూర్వమిరిదున్న అనఁగా: మొదటివారైన నలుఁవురే గీతలయందు వివక్షింపఁబడవలయు ననుదానికి కారణమేను చెప్పుటకు వీలులేదు. సావర్ణికమనువులలో మొదటివాఁడు గాక పిమ్మటను నలుఁగురు అనగా: దక్ష-బ్రహ్మ-ధర్మ-రుద్రసావర్ణు లొక కాలమునందే పుట్టిరని బ్రహ్మాండపురాణమునం దున్న (౪. ౧) కథనుబట్టి యీనలుఁవురు సావర్ణికమనువులే గీతయందు వివక్షితులైనారని యనేకులు చెప్పుచున్నారు.సావర్ణికమనువు లందఱును పిమ్మట కాఁబోవువారే యగుటచే "నెవరినుండి లోకములో నున్న ప్రజ లుత్పన్నులయిరో" అని భూతకాలమును దెలియఁజేయు ముందున్నవాక్యము కాఁబోవు సావర్ణికమనువులను జెప్పనేరదు. అని కొందఱీమతము నాక్షేపించుచున్నారు. ఇంతమాత్రముచే పూర్వమునందున్న నాలుగు అనుశబ్దమునకు మనుశబ్దముతో నర్థము చెప్పుట యుక్తము కాదు. కాన "పూర్వమునం దున్న నాలుగు" నను నీరెండుశబ్దములును, స్వతంత్రరీతిగ పూర్వమునందున్న నెవరో నలువురు ఋషులు లేక పురుషులను సంబంధించియున్నవని చెప్పవలసివచ్చును. మఱియు నట్లు చెప్పితిమేని పూర్వమందున్న నలువు రెవ రను ప్రశ్నము సహజముగనె వెలువడును. ఏటీకాకారు లీరీతిగ నర్థమును జెప్పిరో వారియొక్క మతమునందు సనక, సనందన, సనాతన, సనత్కుమారులు (భాగ.౩.౧౨.౪) అనువారె. యీనలువురు ఋషులును నగుచున్నారు. కాని యీయర్థమున నలువురు ఋషులును బ్రహ్మదేవునియొక్క మానసపుత్త్రులే కాని వారందఱు జన్మమొదలుకొని సన్న్యాసులయి యుండుటచే ప్రజావృద్ధిని చేయువారు కానందున బ్రహ్మదేవుఁడు వారిపై కోపగించె నని భాగవతమున నుండుటచే (భాగ. ౩. ౧౨; విష్ణు ౧. ౭) "ఎవరి నుండి యీలోకమునందున్న ప్రజలు పుట్టిరో"—'యేషాం లోక ఇమాః ప్రజాః' అను వాక్య మీనలువురుఋషులకును బొత్తుగ సంబంధించదని యాక్షేపము కలుగును. ఇంతియకాక, ఋషులు నలువురని పురాణములలో వర్ణించినను భారతమునందు నారాయణీయములైన (అనఁగా: భాగవత) ధర్మములయందు నలుఁవురిలోను సనుఁడు, కపిలుఁడు, సనత్సుజాతుఁడు

నను నీముప్పురు కలిసి యేడుగురు బ్రహ్మమానసపుత్త్రులనియు - మొదట నుండియు నివృత్తిధర్మమునందే యున్నారనియుఁ జెప్పఁబడినది. (మ.భా. శాం. ౩౪౦-౬౭, ౬౮). సనకాదిఋషు లిట్లేద్దు రని గ్రహింపఁబడుదు రేని వారిలో నలుఁవురినిమాత్రము గ్రహించుటకు కారణము కాన్పించదు. అట్లైన పూర్వమునందున్న నలుఁవు రెవరు ? అను ప్రశ్నను నారాయణీయములు లేక భాగవతధర్మములయొక్క-పురాణకథచేతనే సమాధానము చెప్పఁబడినది. కారణమేమనః భాగవతధర్మములే గీతలయందు ప్రతిపాద్యము అని మామతమునందలి సిద్ధాంతము గాన, భాగవతధర్మమునందు సృష్ట్యుత్పత్తి యెట్లు చెప్పఁబడినదో చూచితిమేని, మరీచి మొదలగు సప్తఋషులకంటె పూర్వమునందు వాసుదేవుఁడు (ఆత్మ), సంకర్షణుఁడు (జీవుఁడు), ప్రద్యుమ్నుఁడు (మనస్సు), అనిరుద్ధుఁడు (అహంకారము) నను నీనాల్గుమూర్తు లుత్పన్నము లయినవనియు వానిలో కడపటివాఁడగు ననిరుద్ధునివలన అనఁగా: బ్రహ్మదేవునివలన మరీచ్యాదిపుత్త్రులు పుట్టిరనియు చెప్పఁబడినట్లు స్పష్టముగఁ గాన్పించుచున్నది. (మ.భా. శాం. ౩౩౯. ౩౪-౪౦—మఱియు ౬౦-౭౨; ౩౪౦. ౨౭-౩౧) వాసుదేవుఁడు, సంకర్షణుఁడు, ప్రద్యుమ్నుఁడు, ననిరుద్ధుఁడు నను నీనలుఁగురికే చతుర్వ్యూహ మని పేరు. ఈ నలువురును స్వతంత్రు లని భాగవతధర్మములయందలి యొకతెగవారి మతము. మఱియొకతెగవా రీనలుఁవురిలోనే యిరువురో ముప్పురో ప్రధాను లని యందురు. కాని యీకల్పన భగవద్గీతకు సమ్మతమయినది కాదు. గీత యేకవ్యూహమును బోధించును. అనఁగా: నొకపరమేశ్వరునినుండియే చతుర్వ్యూహాదికమంతయు పుట్టిన దని ప్రతిపాదించుచున్నటుల నేను గీతారహస్యమందు నిరూపించితిని. (గీతార. పు ౨౬౪, ౨౬౫. ౭౩౭ చూడు) కాన వ్యూహాత్మకములగు వాసుదేవాదిమూర్తులను స్వతంత్రము లని యనక యీ నాలుఁగువ్యూహములును నొకపరమేశ్వరునియొక్క-(అనఁగా: సర్వవ్యాపి యగు వాసుదేవునియొక్క-) (గీ. ౭-౧౯) భావములే యని యీశ్లోకమునందు నిర్ణయింపఁబడినది. ఈదృష్టితో జూచితిమేని 'పూర్వమందున్న నలువురు' అనుశబ్దములు, భాగవతధర్మానుసారముగ సప్తమహర్షులకంటె పూర్వమం దుత్పన్నమైన వాసుదేవుఁడు మొదలుగాగలిగిన చతుర్వ్యూహమునకు సంబంధించినట్లు గాన్పించును. భాగవతధర్మములయొక్క- చతుర్వ్యూహాది భేదములు పూర్వమునుండి

౬౬. ఏతాం విభూతి యోగం చ మమ యో వేత్తి తత్త్వతః,
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః. ౭
అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః. ౮
మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్,
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ. ౯
తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే. ౧౦

ప్రచారములోనే యున్నవని భారతమునందే చెప్పఁబడినది. (మ.భా.శాం. ౩౪౮-౫౭); ఈకల్పనను నేను నవీనముగ చేయలేదు. మహర్షులు (అనఁగా: మరీచ్యాదులనియు) పూర్వమందైన నలుగురు (అనఁగా: వాసుదేవాదిచతుర్వ్యూహ మనియు) మనువులు (అనఁగా: నాకాలముకంటె పూర్వమును, నాకాలమునందు నున్న స్వాయంభువాది యేడ్గురుమనువులు) ననియు నిందలిసారాంశము. భారతమునందున్న నారాయణీయోపాఖ్యానాను సారముగ నే నీశ్లోకము నిట్లన్వయించితిని.అనిరుద్ధుఁడు(అం:నహంకారము) మొదలగు నాలుగుమూర్తులును పరమేశ్వరునిపుత్త్రు లని మహాభారతమున మఱియొకస్థలమున కల్పింపఁబడినది. (మ. భా. శాం. ౩౧౧. ౭,౮ చూడు) పరమేశ్వరునియొక్క భావములు చెప్పఁబడినవి. వీనిని తెలిసికొని యుపాసన చేయుటచే కలుగునట్టిఫలము నిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౭) నాయొక్క విభూతియందును (విస్తారము) యోగమునందును (ఈవిస్తరింపఁజేయుశక్తి లేక సామర్థ్యము) నున్నతత్త్వమును తెలిసికొన్నవారికి స్థిరమయిన (కర్మ-) యోగము ప్రాప్తించుటకు సంశయము లేదు. (౮) నేను సమస్తమునకు నుత్పత్తిస్థానమును, మఱియు నావలన సర్వవస్తుశ్రేణులును ప్రవర్తించినది. ఈవిషయమును తెలిసికొనినబుద్ధిమంతులు, భావయుక్తులగుచు నన్ను భజించుచున్నారు. (౯) నాయందు చిత్తమును నిలపియు, నాయందు జీవప్రాణముల నర్పించియు, ఒకరినొకరు బోధించుకొనుచు, నాకథలను జెప్పుకొనువారు, తమలోపల తామే యెప్పుడును సంతోషించుచు, రమించుచు నుందురు. (౧౦) ఈవిధమున నెప్పుడును యుక్తులయి (అనఁగా: సమాధియందుండి) ప్రీతిపూర్వకముగ నన్ను భజించువారికి నన్ను పొందుటకుఁ దగిన (సమత్వ-) బుద్ధిరూపమయిన యోగ

తేషామేవానుకంపార్థమహమజ్ఞానజం తమః,
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. ౧౧
అర్జున ఉవాచ.
§§ పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవమజం విభుమ్. ౧౨
ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా,
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే. ౧౩

మును నేనే యిచ్చుచున్నాను. (౧౧) మఱియు వారి ననుగ్రహించునిమిత్తమై వారియొక్క యాత్మభావమందు (అనఁగా: వారి అంతఃకరణమునందు) ప్రవేశించి, ప్రకాశించుచున్న జ్ఞానదీపముచే(వారిమనస్సునందు)అజ్ఞానమువలన గలిగిన యంధకారమును నశింపఁజేయుచున్నాను.

[౭ వ యధ్యాయమునందు దానాదేవతలయందలి భక్తినిసయితము పరమేశ్వరుఁడే యిచ్చుచున్నాఁడని పైన పదియవశ్లోకమునందు చెప్పఁబడినది. కాన కర్మ-యోగముయొక్క జిజ్ఞాస యొకపర్యాయ మారంభమైనపిదప చక్రములో పడ్డదానివలె క్రమక్రమముగ మనుజుఁడు పూర్ణమగుసిద్ధిని జెందునని పూర్వమునందు (గీ. ౬. ౪౪) చెప్పఁబడినదానితో భక్తిమార్గమున నున్న యీసిద్ధాంతము సమానార్థకముగనే యున్నది. జ్ఞానదృష్టిచే (అనఁగా: కర్మవిపాకక్రియానుసారముగ)నీకర్తృత్వ మాత్మస్వాతంత్ర్యమువలన ప్రాప్తమగునని చెప్పఁగను. ఆత్మయును పరమేశ్వరుఁడే కాన, భక్తిమార్గమునందు దీఫలములను (లేక యీబుద్ధిని) పరమేశ్వరుఁడే వారి వారి పూర్వకర్మానుసారముగ నిచ్చుచున్నాఁడని చెప్పఁబడుచున్నది. (గీ. ౭-౨౦ మఱియు గీతార. ప్ర. ౧౩ పు. ౫౫౦ చూడు). ఇట్లు భగవంతుఁడు భక్తిమార్గమునందున్న తత్త్వమును జెప్పినపిదప.—]

అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు—(౧౨) నీవే పరబ్రహ్మవును, శ్రేష్ఠమగు స్థానమును, పరమపవిత్రమగు వస్తువునునై యున్నావు; దివ్యుఁడు శాశ్వతుఁడునగు పురుషుఁడును, నాదిదేవుఁడును, జన్మరహితుఁడును సర్వవిభువును (అనఁగా: సర్వవ్యాపి) నని (౧౩) నిన్ను ఋషులును, దేవర్షియగు నారదుఁడును, అసితుఁడును, దేవలుఁడును, వ్యాసులవారును చెప్పుచున్నారు. నీవును నాకు నా విషయమునే స్వయముగఁ జెప్పుచున్నావు.

సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ,
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః. ౧౪
స్వయమేవాఽత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ,
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే. ౧౫
వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః,
యాభిర్విభూతిభిర్లోకా నిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి. ౧౬
కథం విద్యామహం యోగిన్ త్వాం సదా పరిచింతయన్,
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్మయా ౧౭
విస్తరేణాఽత్మనో యోగం విభూతిం చ జనార్దన,
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్.

(౧౪) ఓకేశవా! నీవు నాకు చెప్పినవిషయ మంతయును సత్యమని తలంచెదను. ఓ భగవానుఁడా! నీయొక్క వ్యక్తిని (అనఁగా: నీయొక్క మూలమును) దేవతలుగాని రాక్షసులుగాని యెవ్వరు నెఱుఁగరు. (౧౫) ఓ భూతభావనా! యోభూతేశా! యోదేవదేవా! యోజగత్పతీ! యోపురుషోత్తమా! నిన్ను నీవు నీచేతనే తెలిసికొనుచున్నావు. (౧౬) నీయొక్క విభూతులు దివ్యములైనవి. వానిచే నీజగత్తునంతను వ్యాపించియుందువు. కావున నీవే (కృపయుంచి) నాకా విషయమును పూర్ణముగఁ జెప్పుము (౧౭) ఓ యోగీశ్వరుఁడా! యెల్లప్పుడును నీ చింతనము చేయు నేను నిన్నెట్లు తెలిసికొనవలయునో? మఱియు నోభగవానుడా! యేయేపదార్థములలో నిన్ను నేను ధ్యానింపవలయునో నాకుఁ జెప్పుము. (౧౮) ఓజనార్దనా! నీయొక్క విభూతిని, యోగమును, తిరిగి విస్తారముగ నాకుఁ జెప్పుము. కారణ మేమన, నమృతతుల్యమగు (నీయొక్క భాషణమును) విని నేను తృప్తి నొందకయున్నాను.

[విభూతి, యోగశబ్దము లీయధ్యాయమునం దేడవ శ్లోకమునందు చెప్పఁబడినవి. వానినే యిచ్చో నర్జునుఁడును ననువదించెను. యోగశబ్దమున కర్థము ను వెనుక నేడవ యధ్యాయమున నిరువదియైదవ శ్లోకమున వ్రాయఁబడినది. భగవంతునియొక్క విభూతి నర్జునుఁడు విచారించుట యాయావిభూతులను, దేవతలని ధ్యానము చేయుటకొఱకు గాదు. ఇఁక నేమన: నీవిభూతులయందు సర్వవ్యాపియగు పరమేశ్వరునియొక్క భావననే యుంచుకొనుటకు విచారింపఁబడినవని ౧౭ వ శ్లోకమునందు చెప్పఁబడినవిషయ

శ్రీభగవానువాచ.

§§ హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే. ౧౯
అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ. ౨౦
ఆదిత్యానా మహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్,
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ. ౨౧
వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః,
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా. ౨౨

మును గమనింపవలయును. కారణ మేమన: పరమేశ్వరుఁ డొక్కఁడె యన్నిస్థలములయందును నున్నాఁడని తెలిసికొనుటకును, పరమేశ్వరుని యొక్క వెవ్వేఱువిభూతులు వెవ్వేఱుదేవతలయి యున్నవని తెలిసికొనుటకును భక్తిమార్గదృష్టిచే విశేషముగా భేద మున్నదని భగవంతుఁడు పూర్వమునందే (గీ. ౭. ౨౦-౨౫, ౯. ౨౨-౨౮) చెప్పియున్నాఁడు.—]

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు. (౧౯) ఓకురుశ్రేష్ఠుఁడా! మంచిది అటులే చెప్పెదను. కాని నాయొక్క దివ్యవిభూతులలో ముఖ్యములైనవానిని చెప్పెదను. కారణ మేమన: నాయొక్క విస్తారమునకు నంతము లేదు.

[ఈవిభూతివర్ణనానుసారముగనే యనుశాసనికపర్వమునందును (౧౪. ౩౧౧-౩౨౧) అనుగీతలయందును (అశ్వ ౪౩-౪౪) పరమేశ్వరునియొక్క రూపము వర్ణింపఁబడినది కాని గీతలలో నున్నవర్ణనము దానికంటె మిక్కిలి సరసముగ నుండుటచే నిదియే యితరస్థలముల ననువదింపఁబడుచున్నదని స్పష్టమగుచున్నది. ఉదాహరణమునకై భాగవతపురాణముయొక్క పదునొకండవ స్కంధమునందలి పదునాఱవయధ్యాయమునం దిట్టివిభూతివర్ణనమునే భగవంతుఁ డుద్ధవునకు నిరూపించెను. అది యీయధ్యాయమునందున్న వర్ణనవలె నున్నదని యక్కడనే (భాగ. ౧౧. ౧౬. ౬-౮) యారంభమునందు జెప్పఁబడినది.—]

(౨౦) ఓగుడాకేశుఁడా! సర్వభూతములలోపల నున్నయాత్మను నేనే. మఱియు (సర్వ)భూతములయొక్క యాదియు, మధ్యయు, నంతమును నేనే. (౨౧) ద్వాదశాదిత్యులలో విష్ణువును నేనే, తేజస్సులలో కిరణము లనెడు మాల గలిగిన సూర్యుఁడను, (యేడు లేక ముప్పదితొమ్మిది) మరుత్తులలో మరీచిని నేనే యయియున్నాను. నక్షత్రములలో చంద్రుఁడను నేనే. (౨౨) నేను వేద

ములలో సామవేదమునై యున్నాను. దేవతలలో నింద్రుఁడనై యున్నాను. ఇంద్రియములలో మనస్సునై యున్నాను. భూతములలో చేతన (అనఁగా: ప్రాణముల యొక్క కదలుట) నేనే యయియున్నాను.

[''వేదములలో సామవేదమును నేను'' అనుటచే సామవేదము ముఖ్యమని యర్థము. ఇట్లే మహాభారతమునం దానుశాసనికపర్వమున ''సామవేదశ్చ వేదానాం యజుషాం శతరుద్రియమ్'' (౧౪. ౩౧౭) అని చెప్పఁబడినది. కాని యనుగీతలయందు ''ఓంకార స్సర్వవేదానాం'' (అశ్వ. ౪౪. ౬) అని యోంకారమే వేదములన్నింటిలోను శ్రేష్ఠమని చెప్పఁబడినది. గీతలయందును వెనుక (౭. ౮) ''ప్రణవ స్సర్వవేదేషు'' అని చెప్పఁబడినది. అటులె ''ఋక్సామయజు రేవ చ''(గీ. ౯.౧౭) అనువాక్యమునందు సామవేదముకంటె ఋగ్వేదమునకు నగ్రస్థాన మియ్యఁబడినది. లోకములో సామాన్యజ్ఞానము నటులే యున్నది. ఈపరస్పరవిరుద్ధము లగువిధానములపై యనేకు లనేకకల్పనలఁ జేసిరి. ఛాందోగ్యోపనిషత్తునందు ఓంకారమే''ఉద్గీథ''మను పేరు గలది యనియు నీయుద్గీథము సామవేదముయొక్క సారమయి యున్నదనియు, సామవేదము ఋగ్వేదముయొక్క సారమనియు చెప్పఁబడినది. (ఛాం. ౧. ౧. ౨) ఛాందోగ్యమునందలి యీవాక్యముచే, వేదాంతములయన్నింటిలో శ్రేష్ఠమైన దేది యనువిషయముపై పైనచెప్పినవిధానములకు నేకవాక్యతను జేయవచ్చును. కారణమేమన: సామవేదము మఱియొక వేద మయినను దానియందున్న మూలమంత్రములు ఋగ్వేదమునుండియే గ్రహింపఁబడినవి; కాని; యంతమాత్రముచే తృప్తిఁ జెందక గీతలయందు సామవేదమున కియ్యఁబడిన ప్రాధాన్యమున కేదో యొకగూఢమగు కారణ ముండవలయు ననియనేకులు చెప్పుచున్నారు. ఛాందోగ్యోపనిషత్తున సామవేదమునకు ప్రాధాన్య మియ్యఁబడినను మనువు ''సామవేదముయొక్క ధ్వని యశుచిగ నున్న'' దని చెప్పెను (మను. ౪.౧౨౪). కాని సామవేదమునకు ప్రాధాన్య మిచ్చుగీత మనువుకంటె ప్రాచీనమయినదయి యుండునని కొంద ఱూహించిరి. గీతయొక్క కర్త సామవేది యగుటచే వారు సామవేదమున కిచ్చో ప్రాధాన్యము నిచ్చినారని మఱికొందఱు చెప్పుచున్నారు. కాని ''వేదములలో సామవేదమును నేను'' అనుదానికింతదూర ముపపత్తి చెప్పుటకు పఱుగిడుట యనవసరమని యెన్నెదను. భక్తిమార్గమునందు పరమేశ్వరునియొక్క గానపరమగు స్తుతికి తప్పక ప్రాధాన్య మీఁబడియుం

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరాక్షసామ్,
వసూనాం పావకశ్చాస్మి మేరు శ్శిఖరిణా మహాన్. ౨౩
పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్,
సేనానీనామహం స్కంద స్సరసామస్మి సాగరః. ౨౪
మహర్షీణాం భృగురహం గిరా మస్మ్యేకమక్షరమ్,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః. ౨౫

డును. ఉదాహరణము! నారాయణీయధర్మములయందు "వేదేషు సపురాణేషు సాంగోపాంగేషు గీయసే" (మ. భా. శాం. ౩౩౪. ౨౩) అని నారదులు భగవంతుని స్తోత్రము చేసిరి. వసురాజు "జప్యంజగౌ"—జప్యమును గానము చేయుచుండెను! (శాం. ౩౩౭. ౨౭; మఱియు ౩౪౨. ౭౦-౮౧ చూడుము). అని 'గై' ధాతువునె మరల ప్రయోగించెను. కాన భక్తిపరములగు ధర్మములచే యజ్ఞయాగాదిక్రియాత్మకము లగు వేదములకంటె గానపరమగు వేదమునకు (అనఁగా: సామవేదమునకు) నధిక మగుమహత్త్వము చెప్పఁబడుట యొకయాశ్చర్యము కాదు. మఱియు మామతానుసారముగ నిదియె "వేదములలో సామవేదము నేను" అని చెప్పుటకు సరళమును, సులభమును గు కారణముగ నున్నది.—]

(౨౩) మఱియు నేకాదశరుద్రులలో శంకరుఁడను నేనే, యక్షరాక్షసులలో కుబేరుఁడను అష్టవసువులలో పావకుఁడను నేను, సప్తపర్వతములలో మేరువును నేను (౨౪) ఓపార్థా! పురోహితులలో ముఖ్యుఁడగు బృహస్పతిని నేనే యని తెలిసికొనుము. సేనానాయకులలో నేను స్కందుఁడను (కుమారస్వామిని), జలాశయములలో సముద్రుఁడను నేనే. (౨౫) మహర్షులలో భృగువును నేను, అక్షరములలో నేకాక్షరమును (ఓంకారమును) నేనే. యజ్ఞములలో జపయజ్ఞమును నేనే, స్థావరములలో (స్థిరపదార్థములలో) హిమాలయమును నేనే.

["యజ్ఞములలో జపయజ్ఞమును నేను" అనువాక్యము మిక్కిలి గొప్పదే; అనుగీతలయందు (మ. భా. అశ్వ. ౪౪-౮) "యజ్ఞానాం హుతముత్తమమ్" అనఁగా: యజ్ఞమునందు అగ్నిహోత్రములో హవిస్సును సమర్పించుటచే సిద్ధమగు యజ్ఞ ముత్తమ మని చెప్పఁబడినది. మఱియు నిదియె వైదికులగు కర్మకాండతత్పరులయొక్క మతము. కాని భక్తిమార్గమునందు హవిర్యజ్ఞముకంటె నామయజ్ఞమును, జపయజ్ఞమును గొప్పవి గాన గీత

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః,
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః. ౨౬
ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్,
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్. ౨౭
ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్,
ప్రజనశ్చాస్మి కందర్ప స్సర్పాణామస్మి వాసుకిః. ౨౮
అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్,
పితౄణామర్యమా చాస్మి యమ స్సంయమతామహమ్. ౨౯

యందు "యజ్ఞానాం జపయజ్ఞోస్మి" యను వాక్యము చెప్పఁబడినది. మఱి యొకయజ్ఞమును చేసినను చేయకపోయినను జపముచేతనే బ్రాహ్మణుఁడు సిద్ధి నొందుచున్నాఁడని మనువును నొకచోట (౨-౮౭) చెప్పినాఁడు. భాగవతమువందు "యజ్ఞానాం బ్రహ్మయజ్ఞోహం" అని పాఠాంతరము కలదు.—]

(౨౬) వృక్షము లన్నింటిలో నశ్వత్థమును (రావిచెట్టును) దేవర్షులలో నారదుఁడను, గంధర్వులలో చిత్రరథుఁడను, సిద్ధులలో కపిలమహామునిని, (౨౭) గుఱ్ఱములలో నమృతమథనసమయమునందు పుట్టిన యుచ్చైశ్శ్రవ మను గుఱ్ఱమును నేనే. గజశ్రేష్ఠములలో నైరావతమును నేనే, మఱియు మనుజులలో రాజును, (౨౮) ఆయుధములలో వజ్రమును నేను. గోవులలో కామధేనువును నేనే. మఱియు ప్రజలను పుట్టింపఁజేయు మన్మథుఁడను నేనే, సర్పములలో వాసుకిని నేనే (౨౯) మఱియు నాగములలో ననంతుఁడను నేనే; యాదస్సు లలో (జలమునందు నివసించు జంతువులలో) వరుణుఁడను నేను; మఱియు పితృదేవతలలో నర్యముఁడను నేను; నియమించువారిలో యముఁడను నేను.

[వాసుకి యనువాఁడు సర్పములకు రాజనియు, అనంతుఁ డనగా శేషుఁ డనియు నిశ్చితమైనది. ఆయర్థమే యమరకోశమునందును మహాభారతము నందును చెప్పఁబడినది. (మ. భా. ఆది. ౩౫-౩౯ చూడు) కాని నాగముల యందును సర్పములయందును భేదము స్పష్టముగఁ జెప్పుటకు సాధ్యము కాదు. మహాభారతమునందలి యాస్తీకోపాఖ్యానమున నీశబ్దములు సమానార్థములుగనే ప్రయోగింపఁబడినవి. అయిన నిచ్చో సర్పశబ్దముచేతను, నాగశబ్దముచేతను, సామాన్యముగ సర్పములజాతులు రెండని చెప్పఁబడి

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్,
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్. ౩౦
పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్,
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ. ౩౧
సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్. ౩౨
అక్షరాణామకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్య చ,
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః. ౩౩

నట్లు కాన్పించుచున్నది. శ్రీధరటీకయందు సర్పము విషయుక్తమనియు నాగము నిర్విషమైనదనియు చెప్పఁబడినది. మఱియు రామానుజభాష్యమునందు సర్ప మొకశిరస్సు గలదియు, నాగ మనేకశిరస్సులు గలదియనియు భేదము నిరూపింపఁబడినది. కాని యీరెండుభేదములును నిజముగఁ గాన్పింపవు. కారణ మేమనఁ గొన్నిచోట్ల నాగముయొక్క ముఖ్యములైన కులములనే చెప్పునపుడు 'అనంతుఁడును, వాసుకియు' ముఖ్యముగఁ జెప్పఁబడిరి. మఱియు నీరెండు ననేకశిరస్సులు కలవియును, విషముతోఁ గూడినవియునై యున్నవి. కాని యనంతుఁ డగ్నివర్ణము గలవాఁడనియు, వాసుకి పీతవర్ణముగల వాఁడనియు వర్ణింపఁబడినది. భాగవతములో నున్న పాఠము గీతలలో నున్నట్లే యున్నది.—]

(౩౦) మఱియు దైత్యులలో ప్రహ్లాదుఁడను నేనే, మ్రింగువారలలో కాలమునై యున్నాను. మఱియు పశువులలో మృగేంద్రుఁడను (సింహమును) నేను; మఱియు పక్షులలో గరుడుఁడను. (౩౧) వేగముగలవారిలో వాయువును నేనే, శస్త్రధారులలో రాముఁడను నేనే, చేపలలో మకరమును నేనే; నదులలో గంగను నేనే. (౩౨) ఓయర్జునా! సృష్టికంతకు, నాదియు, నంతమును, మధ్యమును నేనే; విద్యలలో నధ్యాత్మవిద్యను, వాదించువారలలో వాదమును నేనే.

[వెనుక యిరువదియవశ్లోకమునందు సచేతనములగు భూతములకు నాదియు, మధ్యము, నంతమును నేనే యన్ని చెప్పఁబడినది. మఱియు నిప్పుడు చరాచరసృష్టికంతకును నాదియు, మధ్యము, నంతమును నేనే యని చెప్పఁబడినది. ఇదియే నీరెంటికిని భేదము.—]

(౩౩) అక్షరములలో నకారమును నేనే; మఱియు సమాసములలో (సుధ

మృత్యుః సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్,
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా. ౩౪
బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్,
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః. ౩౫

యపదప్రధాన మగు) ద్వంద్వమును నేనే; నిమేషము, ముహూర్తము మొదలగువానిలో నక్షయమగు కాలమును నేనే. సర్వతోముఖుఁడను (అనఁగా: నలుప్రక్కల ముఖములుగల ధాత) బ్రహ్మదేవుఁడను నేనే. (౩౪) మఱియు నందఱను నశింపఁజేయుమృత్యువును, తిరిగి జన్మించువారికి నుత్పత్తిస్థానమును నేనే; స్త్రీలలో కీర్తి, శ్రీ, వాణి, స్మృతి, మేధ, ధృతి, క్షమ యనునవన్నియు నేనే.

[కీర్తి, శ్రీ, వాణి మొదలగుశబ్దములచే నాయాయిదేవతలు వివక్షితులయిరి. వీనిలో వాణి, క్షమ యనురెండును గాక మిగిలినయయిదును (పుష్టి, శ్రద్ధ, క్రియ, లజ్జ, మతి యనునైదును) కలిసి పది యగును. ఈపదుగురును దక్షునికన్యకలు. వీరందఱును ధర్మునకిచ్చి వివాహము చేయఁబడిరి. కాన వీరు ధర్మునిపత్నులని మహాభారతమున (ఆది. ౬౬. ౧౩, ౧౪) చెప్పఁబడినది.—]

(౩౫) అటులే సామలలో (అనఁగా : గానము చేయఁదగిన వైదికములగు స్తోత్రములయందు) బృహత్సామమును, ఛందస్సులలో గాయత్రీఛందస్సును నేను. మాసములలో మార్గశీర్షమాసమును నేను, ఋతువులలో వసంతుఁడను నేనే.

[మాసములలో మార్గశీర్షమాసమునకు నగ్రస్థాన మిచ్చుట యాకాలమునందు పండ్రెండుమాసములను లెక్కించునపుడు మార్గశీర్షమాసము మొదలుగ లెక్కపెట్టుటయను నలవా టుండుటచే నట్లు చెప్పఁబడియుండును. (మ. భా. అను ౧౦౬ మఱియు ౧౦౯; మఱియు వాల్మీకిరామాయణము ౩. ౧౬ చూడుడు). భాగవతము ౧౧. ౧౬. ౨౭ యందును నిట్లే చెప్పఁబడినది. మృగశీర్షనక్షత్రమునకు నాగ్రహాయణి యనియు వర్షారంభనక్షత్రమనియు పేరుండుటచే మృగశీర్ష మొదలుకొని నక్షత్రముల లెక్కించుట ప్రచారములో నున్నప్పుడు, మృగశీర్షనక్షత్రమునకు మొదట నగ్రస్థానము సంభవించెననియును మొదలగు విచారములను నాయొక్క (ఒరాయన్) గ్రంథమున చూడుము. గ్రంథవిస్తరభీతిచే నిచ్చట వ్రాయలేదు.—]

ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్.
వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః. ౩౭
దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్,
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్.
యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్. ౩౯
నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా. ౪౦
§§ యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశసంభవమ్. ౪౧
అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున,

(౩౬) మోసముచేయువారలలో నేను జూదమును. తేజస్వంతులయొక్క తేజస్సును నేను. విజయశాలురగు పురుషులయొక్క విజయమును నేను; నిశ్చయము గలవారియొక్క నిశ్చయమును నేను; సత్వశీలురయొక్క సత్వమును నేను. యాదవులలో వాసుదేవుఁడను నేను. (౩౭) పాండవులలో ధనంజయుఁడను, మునులలో వ్యాసుఁడను నేను, కవులలో శుక్రాచార్యుఁడను కవిని; (౩౮) శిక్షించువారలయొక్క శిక్షను నేను. జయేచ్ఛగలవారలయొక్క నీతిని యనఁగ: సుపాయమును నేను, మఱియు రహస్యములలో మౌనమును నేనే; జ్ఞానులయొక్క జ్ఞానమును నేనే (౩౯) అట్లే ఓయర్జునా! సర్వభూతములకు బీజమును నేను, నేను లేకయుండు నట్టిచరాచరభూత మేదియు లేదు. (౪౦) ఓపరంతపా! నాయొక్క దివ్యములగు విభూతులకు నంతము లేదు. విభూతులయొక్క సవిస్తారము దిగ్దర్శనార్థముచెప్పఁబడినది.

: [ఈరీతిగ ముఖ్యములగు విభూతులను చెప్పి యీప్రకరణము నిప్పుడుపసంహరించుచున్నాఁడు.—]

(౪౧) ఏయేవస్తువు వైభవముతోడను, లక్ష్మితోడను, ప్రభావముతోడను కూడియున్నదో యదియంతయు నాసంబంధమైన తేజస్సుయొక్క యంశముచే నుత్పన్నమైనదనియే తెలిసికొమ్ము. (౪౨) లేక ఓయర్జునా! అక్కడక్కడ నుండు

విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్. ౪౨

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ
దశమోఽధ్యాయః. ౧౦

యీవస్తువులను తెలిసికొనుట యేల? సంక్షేపముగ చెప్పుచున్నాను వినుము. నేను నాయొక్క యొకటియేయగు నంశముచేతను యీజగత్తునంతను వ్యాపించి యున్నాను.

[చివరశ్లోకము "పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" అను పురుషసూక్తమునందలి ఋక్కుయొక్క (ఋ.౧౦.౯౦.౩) యాధారముచేఁ జెప్పఁబడినది. ఈమంత్రము ఛాందోగ్యోపనిషత్తునందును(ఛాం.౩.౧౨.౬) కలదు. అంశశబ్దమునకు గీతారహస్యమునందలి తొమ్మిదవ ప్రకరణముకడపట (పు. ౩౩౫. మఱియు ౩౩౬)అర్థము చేయఁబడినది చూడుము. భగవంతుఁడు తనయొక్క యొకయంశముచేతనే జగత్తునంతటను వ్యాపించి యున్నచో వీనియన్నింటికంటెను భగవంతునియొక్క మొత్తపుమహిమ, మిక్కిలి గొప్పదిగనే యుండవలయునని స్పష్టమగుచున్నది; మఱియు నావిషయమును చెప్పవలయునను తలంపుతోడనే కడపటిశ్లోకము జెప్పఁబడినది. పురుషసూక్తమునందు "ఏతావానస్య మహిమా అతో జ్యాయాంశ్చ పూరుషః"—ఇదంతయు నాతనిమహిమయయి యున్నది. దీనికంటె పురుషుఁడు శ్రేష్ఠుఁడని స్పష్టముగనె చెప్పఁబడియున్నది—].

ఇట్లు భగవంతునిచే గానముచేయఁబడిన విభూతియోగమనుపేరి పదవ యధ్యాయము సమాప్తమయినది.



# ఏకాదశోఽధ్యాయః.

అర్జున ఉవాచ.

మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. ౧
భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్. ౨
ఏవమేతద్యథాఽఽత్థ త్వమాత్మానం పరమేశ్వర,
ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ. ౩
మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో,
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్. ౪

## పదునొకండవ యధ్యాయము.

[పూర్వాధ్యాయమునందు భగవంతుఁడు తనవిభూతిని వర్ణింపఁగా పరమేశ్వరునియొక్క యీవిశ్వరూపమును చూడవలయు నని తలఁచి యర్జునుఁడు విశ్వరూపమును జూపుమని యడుగ భగవంతుఁ డతనికి జూపినవిశ్వరూప మీయధ్యాయమున వర్ణింపబడినది. గీతలలో నిదియే యుత్తమమగునధ్యాయ మని గణింపఁబడినది. ఏలనన : ఇతరములగుగీతలను రచించినవారుసైతము దీనినే యనుసరించిరి. కావున నంతసరసముగ వర్ణింపఁబడినట్లు తెలియును. మొదట యర్జునుఁ డిట్లు ప్రశ్నించుచున్నాఁడు.—]

అర్జునుఁ డడుగుచున్నాఁడు. (౧) నాయందలి యనుగ్రహముచే నధ్యాత్మమను పేరుగల యీ గుహ్యమగు యీ గుహ్యమును నీవు చెప్పితివి గాన, నాయొక్క మోహము నశించినది. (౨) ఓకమలపత్రాక్షా: అటులనే భూతములయొక్క యుత్పత్తిలయములను నీనాశరహిత మగుమాహాత్మ్యమును నీవల్ల నేను సవిస్తరముగ వింటిని. (౩) ఓపరమేశ్వర! ఓపురుషోత్తమా! ఇప్పుడు నీవు వర్ణించునటుల నీయొక్క యీశ్వరసంబంధ మగురూపమును నేను ప్రత్యక్షముగ చూడ నిచ్ఛయించుచున్నాను. (౪) ఓయోగీశ్వరా! అట్టిరూపమును నేను చూడవచ్చునని నీకుఁ దోఁచెనేని నీయొక్క యవ్యయ మగుస్వరూపమును నాకుఁ జూపుము,

శ్రీభగవా నువాచ.

§§ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. ౫

[ఏడవ యధ్యాయమునందు జ్ఞానవిజ్ఞానములను జెప్ప నారంభించి యేడు, యెనిమిది యధ్యాయములయందు పరమేశ్వరునియొక్క యక్షరమగు లేక యవ్యక్తమగురూపమును తొమ్మిదవ యధ్యాయమునను, పదియవ యధ్యాయమునను ననేకములగువ్యక్తరూపములను దెలియఁజెప్పి వానినె యధ్యాత్మ మని యర్జునుఁడు మొదటిశ్లోకమునందుఁ బేర్కొనెను. మఱియు నొక యవ్యక్తమునుండి యనేకము లగువ్యక్తపదార్థము లెట్లు నిర్మింపఁబడునో యేడు (౭. ౪-౧౫), యెనిమిది (౮. ౧౬-౨౧), తొమ్మిది (౯. ౪-౮) అధ్యాయములయందు వర్ణింపఁబడిన యావిషయమే భూతములయొక్క యుత్పత్తి లయశబ్దములచేత రెండవ శ్లోకమునందు వివక్షితమై యున్నది. మూఁడవ శ్లోకముయొక్క పూర్వోత్తరార్థములను వేర్వేఱగు రెండువాక్యములుగ కల్పించి వానికి "ఓ పరమేశ్వరా! నీవు నీయొక్క యేస్వరూపమును వర్ణించితివో అది నిజమే (అనఁగా: నేను తెలిసికొన్నాను) అనియు నో పురుషోత్తమా! నేను యిప్పుడు నీయొక్క యీశ్వరసంబంధ మగురూపమును చూడఁగోరుచున్నాను. అనియు, నర్థము చెప్పుచున్నారు. (గీ. ౧౦. ౧౪ చూడు) కాని రెంటిని గలిపి యేకవాక్యముగఁ జెప్పిన బాగుగనుండును. మఱియు 'పరమార్థప్రప' యనుటీకయం దట్లేకవాక్యము చేయఁబడినది. నాల్గవ శ్లోకమునం దున్న యోగేశ్వరశబ్దమునకు యోగములకు (యోగులకు కాఁడు) ఈశ్వరుఁ డని యర్థము. (గీ. ౧౮. ౭౫) యోగమనఁగా: నవ్యక్తరూపమునుండి వ్యక్తసృష్టిని నిర్మించెడుసామర్థ్యము లేక యుక్తి యని యర్థ మని పూర్వమునందు (గీ. ౭. ౨౫; మఱియు ౯. ౫) చెప్పఁబడినది. ఆసామర్థ్యముచేతనే విశ్వరూపమును జూపవలయును గాన యోగేశ్వర! యనుసంబోధన మిచ్చో సహేతుకముగ ప్రయోగింపఁబడినట్లు కాన్పించుచున్నది:—]

(౫) ఓ పార్థా! నాయొక్క యనేకవిధములైనదియు, ననేకములగు రంగులు గలదియు, నాకారములు కలిగిన యీవందలకొలదిగాని, లేక వేలకొలదిగాని దివ్యము లగురూపములను జూడుము.

పశ్యాఽదిత్యాన్ వసూన్ రుద్రాన్ అశ్వినౌ మరుతస్తథా,
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాఽశ్చర్యాణి భారత. ౬
ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్,
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి. ౭
న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్. ౮

సంజయ ఉవాచ.

§§ ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః,

(౬) ఇదిగో ! చూడు హేభారతా ! (ద్వాదశ) ఆదిత్యులను (నష్ట) వసువులను, (నేకాదశ) రుద్రులను (నిరువురగు) నశ్వినీ కుమారులను, అటులే (నలువదితొమ్మిది) మరుద్గణములను పూర్వమునందు నెప్పుడు చూడని యనేకాశ్చర్యములను చూడుము.

[నారాయణీయధర్మములయందు నారదునకుఁ జూపినవిశ్వరూపమునందు ద్వాదశాదిత్యుల నెడమవైపునను, ముందుభాగమున నష్టవసువులను, కుడివైపున నేకాదశరుద్రులను పృష్ఠభాగమున నిరువురగు నశ్వినీకుమారులను అని వేఱుగ నర్ణింపఁబడినది (శాం. ౩౩౯. ౫౦-౫౨) కాని యిదియే యంతటను వివక్షితమైనట్లు కాన్పింపదు. (మ భా. ఉ. ౧౩౦ చూడు) ఆదిత్యులును, వసువులును, రుద్రులును, అశ్వినీకుమారులును, మరుద్గణములు నను దేవతలు వేదములయందు, చెప్పఁబడిరి. వారిలో నాదిత్యులు క్షత్రియు లనియు, మరుద్గణములు వైశ్యులనియు, నశ్వినికుమారులు శూద్రులనియు, దేవతలకు చాతుర్వర్ణ్యమను భేదము మహాభారతమునందు (శాం. ౨౦౮. ౨౩, ౨౪) చెప్పఁబడినది. శతపథబ్రాహ్మణము (౧౪. ౪. ౨. ౨౩ చూడు).—]

(౭) ఓగుడాకేశా ! నే డిక్కడ నొకస్థలమునందే యున్న చరాచరజగత్తునంతను, మఱియు నీవు చూడఁదలఁచుకొన్న దాని నంతేను, (నాదేహమునందు) చూడుము (౮) కాని నీయొక్క యీచక్షుస్సుచే నన్ను జూడలేవు. నీకు నేను దివ్యదృష్టి నిచ్చుచున్నాను. దానిచే నాయొక్క యీశ్వరసంబంధమైనయోగమును అనఁగా: యోగసామర్థ్యమును జూడుము.

దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్. ౯
అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్,
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్. ౧౦
దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్;
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్. ౧౧
దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా,
యది భాస్సదృశీ సా స్యాద్భాస స్తస్య మహాత్మనః. ౧౨
తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా,
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా. ౧౩
తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత. ౧౪

సంజయుఁడు చెప్పుచున్నాఁడు—(౯) అని చెప్పి యోరాజా! ధృతరాష్ట్రా! యోగములకు గొప్పయీశ్వరుఁ డగుహరిచే నర్జునునకు తనశ్రేష్ఠమగు నీశ్వరసంబంధమైనరూపము (అనఁగా:విశ్వరూపము) చూపఁబడినది.(౧౦) దానికి యనఁగా: నా విశ్వరూపమునకు ననేకములగు ముఖములును, నేత్రములు నుండెను. వానియందనేకములగు నద్భుతములు గోచరించుచుండెను.(౧౧)మఱియు దానిపై ననేకవిధము లగుదివ్యములైన యలంకారము లుండెను. మఱియు దానిపై ననేకవిధము లగుదివ్యములైన యాయుధము లెత్తఁబడి (తళతళలాడుచు) యుండెను. (౧౨) అది యనంతమును, సర్వతోముఖమును, అన్నివిధములగు నాశ్చర్యములచే నిండియున్న దేవునియొక్క దివ్యమగు సుగంధముచేఁ బూయఁబడినదియు, దివ్యములగుపుష్పములను వస్త్రములను ధరించినదియు; నాకాశమునందు వేవురసూర్యులయొక్క కాంతి యొకపర్యాయమే వెలువడినచో నెట్లుండునో యాకాంతితో కొంచెము పోలియుండునదియు, (౧౩) దేవదేవునియొక్క యీశరీరమునందు నానావిధముల విభజింపఁబడిన జగత్తంతయు నొకస్థలమునందె యున్నటు లర్జునున కప్పుడు కాన్పించెను. (౧౪) మఱియు నాశ్చర్యమున మునిగినవాఁడగుటచే నతనిశరీరము గగురుపొడిచినవెంట్రుకలుగలది యయ్యెను. మఱియు శిరస్సుచే నమస్కరించియు, హస్తములు ముకుళించియు, నాయర్జునుఁడు భగవంతునితో మాటలాడుచున్నాఁడు అదేమన:—

అర్జున ఉవాచ.

§§ పశ్యామి దేవాంస్తవ దేవ దేహే సర్వాంస్తథా భూతవిశేష
సంఘాన్, బ్రహ్మాణమీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వాను
రగాంశ్చ దివ్యాన్. ౧౫
అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనంత
రూపమ్, నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వే
శ్వర విశ్వరూపమ్. ౧౬
కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమం
తమ్, పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా ద్దీప్తానలార్క
ద్యుతిమప్రమేయమ్. ౧౭
త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధా
నమ్, త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురు
షో మతో మే. ౧౮

అర్జునుఁడు పలుకుచున్నాఁడు. (౧౫) ఓ దేవా! నీయొక్క దేహమునందు దేవత లెల్లవారును, నానావిధములగుభూతములయొక్క సముదాయమును, అటులే దేవతల కందఱకును స్వామియును, కమలాసనమునందు కూర్చున్న బ్రహ్మదేవుఁడును, ఋషు లందఱును, వాసుకి మొదలగు దివ్యములగుసర్పము లన్నియును, నాకు కాన్పించుచున్నవి. (౧౬) అనేకములయిన బాహువులు, ననేకములయిన యుదరములు, ననేకములయిన ముఖములును, ననేకములగు నేత్రములును గలిగి యనంతరూపములు గలిగిన నిన్నే నేను నలుప్రక్కలను చూచుచున్నాను; కాని యోవిశ్వేశ్వరా! విశ్వరూపా! నీకు నంతమును, మధ్యమును, నాదియును నున్నటులు నా కెచ్చోటను కనఁబడదు. (౧౭) కిరీటమును, గదను, చక్రమును ధరించి నలుప్రక్కల కాంతితో తేజఃపుంజమై జాజ్వల్యమానమగు నగ్నిసూర్యులవలె దేదీప్యమానమై యీనానేత్రములతోఁ జూచుటకు నశక్యముగ నుండియున్న నీవే నాకు నలుదిక్కులను కాన్పించుచున్నావు. (౧౮) నీవే తుదకు జ్ఞేయుఁడవగు నక్షరుఁడవు. అనఁగా: బ్రహ్మవు నీవే. ఈ ప్రపంచమునకు కడపటి యాధారభూతుఁడవు నీవే. యవ్యయుఁడవును, శాశ్వతమైనధర్మమునకు రక్షకుఁడవును, సనా

అనాదిమధ్యాంత మనంతవీర్యమనంతబాహుం శశిసూర్య
నేత్రమ్, పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా
విశ్వమిదం తపంతమ్. ౧౯
ద్యావాపృథివ్యోరిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశ
శ్చసర్వాః,దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం
ప్రవ్యథితం మహాత్మన్. ౨౦
అమీ హి త్వాం సురసంఘా విశంతి కేచిద్భీతాః ప్రాంజల
యోగృణంతి, స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః స్తువంతి
త్వాం స్తుతిభిః పుష్కలాభిః. ౨౧
రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుత
శ్చోష్మపాశ్చ, గంధర్వయక్షాసురసిద్ధసంఘా వీక్షంతే త్వాం
విస్మితాశ్చైవ సర్వే. ౨౨

తన పురుషుఁడవు నని నాకుఁ దోఁచుచున్నది. (౧౯) ఆదియు, మధ్యము, నంతము, లేనిదియు, నెవరికి యనంతబాహువులు కలవో, చంద్రుఁడును, సూర్యుఁడును నెవరికి నేత్రములో, ప్రజ్వలించుచున్నయగ్నిహోత్ర మెవరికి ముఖమో, యిట్టి యనంతశక్తి గలనీవే నీయొక్క తేజస్సుచే నీజగత్తునంతను తపింపఁజేయుచున్నటుల నేను చూచుచున్నాను. (౨౦) కారణ మేమనఁ: నాకసముయొక్కయు, పృథ్వియొక్కయు,మధ్య నున్న యంతరమునంతను,సర్వదిక్కులను నీవొక్కఁడవే వ్యాపించియున్నావు.మఱియు నీయొక్క యీ యద్భుతమును నుగ్రమును నగురూపమును జూచి యోమహాత్మా! లోకత్రయమును భీతిచే (ప్రవ్యథితం) కంపము నొందుచున్నది. (౨౧) దేవగణములు నీయందు ప్రవేశించుచున్నవి. మఱియు కొందఱు భయముచే చేతులు ముకుళించి ప్రార్థించుచున్నారు. మఱియు "స్వస్తి, స్వస్తి" యని చెప్పుచు ననేకవిధము లగుస్తోత్రములచే మహర్షులయొక్కయు, సిద్ధులయొక్కయు గణములు నిన్ను స్తోత్రము చేయుచున్నవి. (౨౨) అటులే రుద్రులును, ఆదిత్యులును, వసువులును, సాధ్యగణములును, విశ్వేదేవతలును, (ఇరువురు)అశ్వినీకుమారులును,మరుద్గణములును,ఊష్మపులును(పితృలును), గంధర్వులు, యక్షులు, రాక్షసులు, సిద్ధులు, ననువారియొక్క గణములన్నియు ప్రతిచోటను విస్మితములై మిమ్మును చూచుచున్నవి.

[శ్రాద్ధకాలమునందు పితృదేవతల కర్పింపఁబడినయన్నమును వేడి

రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో బహుబాహూరుపాదమ్, బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్. ౨౩

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్, దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ధృతిం న విందామి శమం చ విష్ణో. ౨౪

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని,
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస. ౨౫

వేడిగ నున్నంతవఱకే వారు గ్రహింతురు. కాన వారికి 'ఊష్మపు'' లని పేరు. (మను. 3. ౨౩౪) ఈపితృదేవతలయొక్క గణములు సోమసదులనియు, అగ్నిష్వాత్తులనియు, బర్హిషదులనియు, సోమపులనియు, హవిష్మంతులనియు, ఆజ్యపులనియు, సుకాలినులనియు నేడువిధములుగ మనుస్మృతియందు (3. ౧౯౪-౨౦౦) చెప్పఁబడినది. ఆదిత్యాదిదేవతలు వేదమునందుఁ జెప్పఁబడిరి. పైయాఱవ శ్లోకమును చూడుము. బృహదారణ్యకోపనిషత్తునందు (3. ౯-౨) అష్టవసువులును, ఏకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులును, ఇంద్రుఁడును, ప్రజాపతియును కలసి ముప్పదిమువ్వురుదేవతలని చెప్పఁబడినది. మహాభారతము ఆదిపర్వమునను అ.౬౫,౬౬ శాంతిపర్వమునను అ. ౨౦౭. వీరియొక్క నామములు పుట్టుకయును చెప్పఁబడినవి.—]

(౨౩) ఓమహాబాహూ! నీయొక్క యీ గొప్పదియును, ననేకముఖములు గలదియు, ననేకనేత్రములు, ననేకబాహువులు, ననేకములగునూరువులు గలవియు ననేకము లగు పాదములు, ననేకము లగునుదరములు, ననేకము లగుకోరలు గలిగియుండుటచే వికృతముగ గాన్పించురూపమును జూచి లోకము లన్నియును, నేనును, భీతిఁ జెందినాము. (౨౪) ఓమహావిష్ణువా! ఆకాశము నొరయుచున్నదియు, తేజశ్శాలియును, ననేకము లగురంగులు గల్గినదియు, తెఱవఁబడిన ముఖములు గల్గినదియు, గొప్పవై ప్రదీప్తము లగునేత్రములు గల నిన్నుఁ జూచి యంతరాత్మ వ్యాకులమునొందుటచే, నాయొక్క ధైర్యము పోయినది. శాంతియు నశించినది. (౨౫) మఱియు దంతములచే వికృతములైనవియు మఱియు ప్రళయకాలమందున్న యగ్నివంటి నీయొక్క యీముఖమును చూచిన నాకు దిక్కులు తెలియుట

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహైవావని
పాలసంఘైః, భీష్మో ద్రోణస్సూతపుత్ర స్తథాఽసౌ సహాస్మ
దీయై రపి యోధముఖ్యైః. ౨౬
వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రాకరాలాని భయాన
కాని, కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితై
రుత్తమాంగైః. ౨౭
యథా నదీనాం బహవోఽంబువేగాః సముద్రమేవాభిము
ఖా ద్రవంతి, తథా తవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభి
విజ్వలంతి. ౨౮
యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధ
వేగాః, తథైవ నాశాయ విశంతి లోకా స్తవాపి వక్త్రాణి సమృ
ద్ధవేగాః. ౨౯
లేలిహ్యసే గ్రసమాన స్సమంతా ల్లోకాన్ సమగ్రాన్ వదనై
ర్జ్వలద్భిః, తేజోభి రాపూర్య జగత్సమగ్రం భాస స్తవోగ్రాః
ప్రతపంతి విష్ణో. 30

లేదు. సుఖమును తోఁచదు. (అటులైనది) ఓ జగన్నివాసా! ఓ దేవదేవా! ప్రసన్నుఁడ వగుము. (౨౬) రాజులయొక్క సంఘములతోకూడ ధృతరాష్ట్రుని పుత్త్రులందఱును, భీష్ముఁడును, ద్రోణుఁడును, నటులె యీసూతపుత్త్రుండును (కర్ణుఁడు), మాపక్షమునం దున్నముఖ్యులగు యోద్ధలును; (౨౭) నీయొక్క వికృతమైన కోరలుగల్గినదియు, ననేకములైనదియు, భయంకరములైనదియు నగు ముఖముల యందు మిక్కిలి వేగముతో పడుచున్నారు. మఱియు కొందఱు దంతములయందు చిక్కుకొనుటచే వారితలలు చూర్ణమైనటుల కాన్పించుచున్నవి. (౨౮) నదులలోని జలమంతయు ప్రవాహములుగా సముద్రమందు మిక్కిలి వేగముతో ప్రవేశించు లాగున నీశూరులందఱు ప్రజ్వలించుచున్న నీముఖములందు ప్రవేశించుచున్నారు. (౨౯) మండుచున్న యగ్నిహోత్రమునందు మరణముకొఱకు మిక్కిలి వేగముతో మిడుతలు పడునట్లు నీయొక్క యనేకము లగునోళ్లయందు (ఈజనులు) మరణార్థమయి యతివేగముగ ప్రవేశించుచున్నారు. (౩౦) ఓ విష్ణూ! లోకములనన్నింటిని నీయొక్క జాజ్వల్యమానము లగుముఖములచే మ్రింగుచు, నీయొక్క జిహ్వను కదల్చుచున్నావు. మఱియు తేజస్సుచే జగత్తునంతను వ్యాపించుటవలన నీయుగ్రమగు

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోఽస్తు తే దేవవర
ప్రసీద, విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం న హి ప్రజా
నామి తవ ప్రవృత్తిమ్. ౩౧

శ్రీభగవానువాచ.

§§ కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తు
మిహ ప్రవృత్తః, ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే యేఽవ
స్థితాః ప్రత్యనీకేషు యోధాః. ౩౨
తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుక్ష్వ
రాజ్యం సమృద్ధమ్, మయైవైతే నిహతాః పూర్వమేవ నిమి
త్తమాత్రం భవ సవ్యసాచిన్. ౩౩
ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథాఽన్యానపి
యోధవీరాన్, మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్. ౩౪

కాంతి నలువైపులను తపించుచున్నది. (౩౧) ఈయుగ్రరూపమునుధరించిన నీవెవం డవో నాకు చెప్పుము. దేవతలలో శ్రేష్ఠుఁడా! నిన్ను నమస్కరించుచున్నాను. ప్రసన్నుఁడ వగుము. నీవే యాదిపురుషుఁడ వని తెలిసికొనుటకు కోరుచున్నాను. కారణ మేమన: నీయొక్క కృత్యము నాకేమియు తెలియుటలేదు.

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు:—(౩౨) నేను లోకములను క్షయింప చేయునట్టియు,వృద్ధినొందినట్టియు కాలమునై యున్నాను. మఱియు నిచ్చో లోకములను సంహరించుటకుఁ బూనినాను. నీవు లేకపోయినను, అనఁగా : నీవేమియు చేయకపోయినను నొకరికొక రెదురుగనున్న యోద్ధలెల్లరును నశింతురు; (౩౩) కావున నీవు లెమ్ము ; యశస్సును సంపాదించుకొనుము. మఱియు శత్రువులను జయించి సమృద్ధమగు రాజ్యము నుపభోగింపుము. నేను వీరిని పూర్వమునందే చంపియున్నాను. (కావున) నోసవ్యసాచీ! (అర్జునా!) నీవు నిమిత్తమాత్రముగ నుండుము. (౩౪) ద్రోణుని, భీష్ముని, జయద్రథుని, కర్ణుని, యితరులగువీరులైన యోద్ధులను నేను పూర్వమునందే చంపియున్నాను. వారిని నీవు చంపుము. తొందరపడకుము. యుద్ధము చేయుము. యుద్ధమునందు నీవు శత్రువులను జయింతువు.

[సారాంశ మేమన: ఉద్యోగపర్వమునందు శ్రీకృష్ణుఁడు సంధిచేయుటకొఱకు పోయినపుడు దుర్యోధనుఁడు మంచిమాట లేమిచెప్పినను, వినఁ

సంజయ ఉవాచ.

§§ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలిర్వేపమానః
కిరీటీ, నమస్కృత్వా భూయ ఏవాఽఽహ కృష్ణం సగద్గదం భీత
భీతః ప్రణమ్య. ౩౫

అర్జున ఉవాచ.

స్థానే హృషీకేశ తవప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే
చ, రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధ
సంఘాః. ౩౬

కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽ
ప్యాదికర్త్రే, అనంత దేవేశ జగన్నివాస త్వమక్షరం సదస
త్తత్పరం యత్. ౩౭

: డని తెలిసికొని, భీష్ములు "కాలపక్వ మిదం మన్యే సర్వ క్షత్రం జనా
: ర్దన" (మ. భా. ఉ. ౧౬౮.౩౨) ఈక్షత్రియు లెల్లరును "కాలపక్వ
: మయి యున్నారు" అని శ్రీకృష్ణునకు ప్రత్యక్షముగ చెప్పినవిషయము న్నే,
: యీప్రత్యక్షముగురూపముచే శ్రీకృష్ణుఁడు తనయొక్క విశ్వరూపమునుండి
: యర్జునునకుఁ జూపించెను. పైశ్లోకము ౨౬-౩౧ చూడుము. దుష్టుఁడు
: తన కర్మచేతనె చచ్చుటకు సిద్ధమగును. కాన వానిని చంపువాఁడు కేవలము
: నిమిత్తమాత్రుఁ డగుటచే చంపువానికి దోషము తగులదని కర్మవిపాక
: ప్రక్రియయొక్క సిద్ధాంతముసైతము ౩౩వ శ్లోకమునందు చెప్పఁబడినది.—]

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:—(౩౫) కేశవుని సంభాషణను విని మిక్కిలి భీతుఁడై గద్గదస్వరముతోఁ గంపించుచు చేతులు జోడించి, నమస్కరించి యర్జునుఁడు శ్రీకృష్ణునితో మరల చెప్పుచున్నాఁడు.—(౩౬) ఓహృషీకేశా! జగత్తు (అంతయు) నీయొక్క గుణకీర్తనములచే నానందము నొందుచున్నది; మఱియు వానియం దనురాగముగలది యగుచున్నది. రాక్షసులు నీకు భయపడి (పది)దిక్కులకు పఱుగులిడుచున్నారు. మఱియు సిద్ధపురుషులయొక్క సంఘములు నిన్నే నమస్కరించుచున్నారు. (ఇవంతయు యోగ్యముగనే యున్నవి). (౩౭) ఓమహాత్మా! బ్రహ్మదేవునకును నాదికారణుఁడవును, వారికంటెను శ్రేష్ఠుఁడవు నగునిన్ను వారేల నమస్కరింపక యుందురు! ఓయనంతా! దేవదేవా! ఓజగన్నివాసా! నీవే

త్వమాది దేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్, వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వమనంతరూప. ౩౮
వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాంకః ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ, నమో నమ స్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమ స్తే. ౩౯

సత్తువును, నసత్తువును నై యున్నావు. ఈరెంటికిని పరముగనున్న యక్షరుఁడవును నీవే యైయున్నావు.

[సదసచ్ఛబ్దములయొక్క యర్థ మిక్కడ క్రమముగ వ్యక్తము, నవ్యక్తము ననుశబ్దములతోగాని, క్షరాక్షరశబ్దములతోగాని సమానముగనే యున్నదని(గీత౭.౨౪;౮.౨౦; లేక ౧౫. ౧౬.)శ్లోకములను బట్టి కాన్పించును. సదసత్తులకంటె పరమం దున్నతత్త్వమే యక్షరమను మగుబ్రహ్మ యని గీతయందు(౧౩. ౧౨)నేను సత్తనుగాను,అసత్తనుగా నని స్పష్టముగనే చెప్పఁబడినది. అక్షరశబ్దము గీతయం దొకప్పుడు ప్రకృతి యనునర్థమునను, నొకప్పుడు పరబ్రహ్మ యనునర్థమునను బ్రయోగింపఁబడుచున్నది. (గీత.౯. ౧౯; ౧౩. ౧౨; మఱియు ౧౫. ౧౬ చూడుము).—]

(౩౮) నీ, వాదిదేవుఁడవు(పురాణపురుషుఁడవు) నీవే యీజగత్తునకు ముఖ్యమైన సాధారమవు. జ్ఞాతవును,జ్ఞేయమును నీవే. ఓయనంతరూపా! నీవే శ్రేష్ఠమగుస్థానమును,నీవే యీవిశ్వమును వ్యాపించినవాఁడవు.(౩౯) వాయువును, యముడవును,అగ్నియును, వరుణుఁడవును,చంద్రుఁడవును, ప్రజాపతివిని అనఁగా: బ్రహ్మదేవుఁడవును, ప్రపితామహుఁడవును నీవే. నిన్ను వేయిసారులు నమస్కరించుచున్నాను.

[బ్రహ్మదేవునిచే మరీచ్యాది సప్తమానసపుత్త్రులును నిర్మింపఁబడిరి.మరీచివలన కశ్యపుఁడును, కశ్యపునివలన ప్రజలును పుట్టిరి (మ. భా. ఆ. ౬౫. ౧౧); కాన నీమరీచాద్యులనే ప్రజాపతు లని చెప్పుచున్నారు (మ. భా. శాం. ౩౪౧. ౬౫). కావున ప్రజాపతిశబ్దమునకు కశ్యపాదిప్రజాపతులని కొందఱర్థము చెప్పుచున్నారు. కాని ప్రజాపతిశబ్ద మిచ్చో నేకవచనముగ నున్నది; కాన ప్రజాపతియనః బ్రహ్మదేవుఁడే యనునర్థము బాగుగ నుండునట్లు కాన్పించుచున్నది. ఇంతియకాక బ్రహ్మదేవుఁడు మరీచ్యాదులకు తండ్రి యనఁగా: నందఱకును పితామహుఁడు (తాత) అగుటచే పిమ్మట ప్రపి

నమః పురస్తా దథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అనంతవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽ
సిసర్వః. ౪౦

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ హే యాదవ
హే సఖేతి, అజానతా మహిమానంతవేదం మయా ప్రమా
దాత్ప్రణయేన వాఽపి. ౪౧

యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజ
నేషు, ఏకోఽథ వాఽప్యచ్యుత తత్సమక్షం తత్క్షామయే త్వా
మహమప్రమేయమ్. ౪౨

తామహుఁడు (ముత్తాత) అనుపదముసైత ముండుటచే నది సార్థకమని వ్యక్తమగుచున్నది.—]

(౪౦) నీకు ముందుండి నమస్కరించుచున్నాను. వెనుకనుండి నమస్కరించుచున్నాను. ఓసర్వాత్మకా! నలుప్రక్కలనుండియు నమస్కారము నీకగుగాక; నీయొక్క శౌర్య మనంతము. నీయొక్క పరాక్రమ మతుల మగుటచే నెల్లవారి కంటెను పూర్ణుఁడవై యున్నావు. కావున నివి యంతయును నీవేయై యున్నావు.

[ముందునుండి, వెనుకనుండి 'నమస్కారము' అనుశబ్దము పరమేశ్వరుని యొక్క సర్వవ్యాపిత్వమును తెలియఁజేయుచున్నది. ఉపనిషత్తులయందున్న "బ్రహ్మైవేదం అమృతం పురస్తాత్ బ్రహ్మ పశ్చాత్ బ్రహ్మ దక్షిణత శ్చోత్తరేణ, అధశ్చోర్ధ్వంచ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్"(ముం. ౨. ౨. ౧౧; ఛాం. ౭. ౨౫) అను బ్రహ్మయొక్క వర్ణన ననుసరించి భక్తిమార్గమునం దీ"నమనాత్మక"స్తుతి చేయఁబడినది.—]

(౪౧) నీయొక్క యీమహిమను తెలియక స్నేహితుఁడ వనుకొని యోరీ కృష్ణా! యోరీ యాదవా! యో సఖుఁడా! యని ప్రమాదముచేఁగాని, స్నేహముచేఁగాని యగౌరవముగ మాటలాడినందుకును (౪౨)మఱియు నోయచ్యుతా! యాహారవిహారములయందును, పరుండుట,కూర్చుండుట మొదలగువానియందును, నేకాకివిగ నున్నప్పుడుగాని, నలుఁవురిలో నున్నప్పుడుగాని హాస్యమునకు నిన్నవమానము చేసినందుకును, నన్ను క్షమింపవలయు నని యప్రమేయుఁడ వయిన నిన్ను నేను ప్రార్థించుచున్నాఁడను.

పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గ
రీయాన్, న త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతోఽన్యో లోక
త్రయేఽప్యప్రతిమప్రభావః. ౪౩
తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహ
మీశమీడ్యమ్, పితేవ పుత్త్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియా
యార్హసి దేవ సోఢుమ్. ౪౪

(౪౩),(౪౪) కావున స్తుత్యుఁడవును, సమర్థుఁడవు నయిననీవు ప్రసన్నుఁడవగు మని కాయముచే నమస్కరించి నిన్ను ప్రార్థించుచున్నాను. ఓదేవా! తండ్రి పుత్త్రునియొక్కయు, స్నేహితుఁడు తనస్నేహితునియొక్కయు నపరాధమును క్షమించినటుల ప్రియుఁడవు (అనఁగా: నీవు) ప్రియునికొఱకు (అనఁగా: నిష్టుఁడ నయిన నాకొఱకు) లేక నా ప్రీతికొఱకు నాయపరాధముల నన్నింటిని క్షమింపుము.

[“ప్రియః ప్రియాయార్హసి” అనుశబ్దములకు ప్రియుఁడు తన ప్రియురాలికొఱకువలె నని యనేకు లర్థమును చెప్పుచున్నారు. కాని యది సరియైనదికా దని యెన్నెదరు. కారణ మేమన: ప్రియాయార్హసి యనుచో “ప్రియాః + అర్హసి” యనిగాని “ప్రియాయై + అర్హసి” యనిగాని పదవిభాగముచేయుట వ్యాకరణవిరుద్ధ మగును. మఱియు “ఇవ” యను నుపమాద్యోతకశబ్దము సైత మీశ్లోకమునందు రెండుపర్యాయములు ప్రయోగింపఁబడినది. కాన “ప్రియః ప్రియాయార్హసి” యను మూఁడవ వాక్యము నుపమేయమని యెన్నుట మిక్కిలి సరసమైయుండును. పుత్త్రుని యొక్క (పుత్త్రస్య) సఖునియొక్క (సఖ్యుః) అను నుపమానాత్మకములగు రెండుషష్ఠ్యంతశబ్దములవలె, నుపమేయమందును, ప్రియస్య (ప్రియునియొక్క) అను షష్ఠ్యంతపద ముండినచో మిక్కిలి రసమైయుండును; కాని “స్థితస్య గతిశ్చింతనీయా” యనున్యాయము ననుసరించి మన మిచ్చోట నుపపత్తిని చెప్పుకొనవలయును. ‘ప్రియస్య’ యను షష్ఠ్యంతమయిన పుంలింగపదము లేనందున ‘ప్రియాయాః’ అని వ్యాకరణవిరుద్ధముగ షష్ఠ్యంతస్త్రీలింగముగ పదమును విడఁదీయుటయు, నట్లు విడదీయఁబడినస్త్రీలింగశబ్ద మర్థమునకు సంబంధింపదు; కాన ‘నివ’ శబ్దము నధ్యాహారము చేసి “ప్రియః ప్రియాయాః”—ప్రియుఁడు తనప్రియురాలియొక్క—అని మూఁడవవాక్యమును కల్పించుటయు, నాకల్పించిన

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే,తదేవ మే దర్శయ దేవ రూపం ప్రసీద దేవేశ జగన్నివాస. ౪౫

కిరీటినం గదినం చక్రహస్తమిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ, తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే. ౪౬

వాక్యము శృంగారముగ నుండుటచే, ప్రసంగవిరుద్ధముగ నుండుటయు యుక్తముకాదు; గాన మూఁడవవాక్యమును నుపమానముగ నంగీకరించుట నాకు యుక్త మనితోఁచును. ఇంతియకాక పుత్రస్య, సఖ్యుః, ప్రియాయాః అను నీమూఁడుపదములును ఉపమానములే యయినయెడల నుపమేయ మగుషష్ఠ్యంతపదము మూలమునందు లేకపోవుటచే 'మే''యనిగాని "మమ" యనిగాని తిరిగి యధ్యాహారము చేసికొనవలసివచ్చును. మఱియు నింతకల్లోలముచేసి యుపమానమునందును, నుపమేయమునందును, సమానవిభక్తికత్వమును సాధించినను రెండింటికిని లింగవైషమ్యమగును. మఱియొకదోష మప్పటికిని నుండియే యుండును. రెండవపక్షమునందు అనఁగా: ప్రియాయ+అర్హసి అని వ్యాకరణశుద్ధమును సరళమునైనపదచ్ఛేదమును చేసికొనినచో నుపమేయమునందు షష్ఠి యుండవలసినచోట "ప్రియాయ" యని చతుర్థియున్నదను నొక్కయాక్షేపణయే యుండును. మఱియు నదియు గొప్పదోషము కానేరదు. కారణ మేమన: షష్ఠివిభక్తియొక్కయర్థ మిక్కడ చతుర్థివలెనే యున్నది. మఱియు ననేకస్థలములయందు నీరీతిగ నుండును. 'పరమార్థప్రప' యనుటీకయందు నే చేసినటులనే యర్థము చేయఁబడినది.—]

(౪౫) ఎప్పుడును చూడనిదానిని చూచినందున నాకు మిక్కిలి సంతసమైనది. మఱియు భయముచే నామనస్సు వ్యాకులమైనది. ఓజగన్నివాసా? దేవదేవా! ప్రసన్నుఁడ వగుము. మఱియు నోదేవా! నీయొక్క యాపూర్వరూపమును జూపుము. (౪౬) కిరీటమును గదను ధరించినదియు, హస్తమున చక్రమును ధరించినదియు, పూర్వమునందువలె నన్ను నిన్ను చూడ నిచ్ఛగించుచున్నాను. కాన, నోసహస్రబాహూ! యోవిశ్వమూర్తీ! యానాలుగుభుజములుగల రూపముతోడనే కనఁబడుము.

శ్రీ భగవానువాచ.

§§ మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మ యోగాత్, తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వ దన్యేన న దృష్టపూర్వమ్. ౪౭

న వేద యజ్ఞాధ్యయనైర్న దానైర్న చ క్రియాభిర్న తపోభి రుగ్రైః, ఏవం రూపః శక్యః అహం నృలోకే ద్రష్టుం త్వద న్యేన కురుప్రవీర. ౪౮

మా తే వ్యథా మా చ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్, వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం తదేవ మే రూపమిదం ప్రపశ్య. ౪౯

సంజయఉవాచ.

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా స్వకం రూపం దర్శయా మాస భూయః, ఆశ్వాసయామాస చ భీతమేనం భూత్వా పున స్సౌమ్యవపుర్మహాత్మా. ౫౦

శ్రీ భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—(౪౭) ఓయర్జునా! నీవిషయమున ప్రసన్నుఁడనైతిని; నీవుదక్క యితరులు పూర్వమునం దెప్పుడు చూడనట్టి యీ తేజోమయమును, ననంతమును, నాద్యమును, నుత్కృష్టమును, నగువిశ్వరూపమును, నాయోగసామర్థ్యముచేత నీకు చూపితిని. (౪౮) ఓకౌరవశ్రేష్ఠా! వేదములచేతను, యజ్ఞములచేతను, స్వాధ్యాయములచేతను, దానములచేతను, కర్మలచేతను, నుగ్రము లగుతపస్సులచేసైత మిట్టి నాయొక్కస్వరూపము నీకుదక్క యెవరికిని మనుష్యలోకమునందు చూచుటకు శక్యముకాలేదు. (౪౯) ఇట్టి నాఘోరరూపమును చూచి నీచిత్తమును తత్తరపడనీయకుము. మూఢతను చెందనీయకుము. భయమును వదలి సంతోషముతో నాయొక్క మొదటిరూపమును చూడుము. సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—(౫౦) అనిపలికి వాసుదేవుఁ డర్జునునకు తన (పూర్వమందున్న) రూపమును మరల జూపెను. తిరిగి సౌమ్య మగురూపమును ధరించి యీ మహాత్ముఁడే భయపడిన యర్జునునకు ధైర్యము చెప్పెను.

[విశ్వరూపవర్ణనయందలి యీముప్పదియారు శ్లోకములయొక్కయు గీతలయందలి ద్వితీయాధ్యాయమునందున్న ౧౯, ౨౦, ౨౨, ౨౩, మఱియు ౨౯ శ్లోకములయొక్కయు, నెనిమిదియవ యధ్యాయమునందలి

అర్జున ఉవాచ.

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన,
ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః. ౫౧

శ్రీభగవానువాచ.

§§ సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. ౫౨
నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. ౫౩
భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. ౫౪

[౯, ౧౦, ౧౧, ౨౮ శ్లోకములయొక్కయు, తొమ్మిదవ యధ్యాయమునందలి ౨౦, ౨౧ వ శ్లోకములయొక్కయు, పదునైదవ యధ్యాయమునందలి ౨-౫ మఱియు ౧౫ శ్లోకములయొక్కయు వృత్తమొక్కటియె యనఁగా: పదునొకండక్షరములుగల్గిన చరణములు గల్గియున్నవి. మఱియు వానియందు గణములయొక్క నియమము లేనందున కాళిదాసుని కావ్యమం దున్న ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, ఉపజాతి, దోధక, శాలినీ మొదలగువృత్తములయొక్క నడక ననుసరించిన దని యెన్నుటకు వీలులేదు. అనఁగా: ఈవృత్తరచన యార్షము, అనఁగా: వేదసంహితయందలి "త్రిష్టుప్" వృత్తముయొక్కగతి ననుసరించి చేయఁబడినది. మఱియు నిందుచే గీత మిక్కిలి ప్రాచీనమయియుండు ననుసిద్ధాంతము బలవత్తర మగుచున్నది. గీతారహస్యము పరిశిష్టప్రకరణము పు. ౨౦౭. ౨౦౩ చూడుడు.—]

అర్జునుఁడు అడుగుచున్నాఁడు:—(౫౧) ఓ జనార్దనా! నీయొక్క యీ సౌమ్యమును మానుషమును నగురూపమునుఁ జూచి యిప్పుడు మనస్సు స్వస్థమగుటచే పూర్వమునందువలె సావధానుఁడ నైయున్నాను. శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు:—(౫౨) నీచే చూడఁబడిన నాయొక్కస్వరూపమ్మును చూచుట మిక్కిలి కష్టము. దేవతలుసైత మీరూపమును జూడవలయు నని యెన్నుదురు. (౫౩) నీవు నన్ను చూచినటుల, వేదములచేత గాని, దానములచే గాని, యజ్ఞములచే గాని, యేవారును నన్ను చూచుటకు వీలులేదు. (౫౪) ఓ యర్జునా! యోపరంతపా!

§§ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ. ॥౫౫॥

యనన్యభక్తిచేమాత్రమే యీరీతిగ నన్ను తెలిసికొనుటయు, నన్ను చూచుటయు. నాయందు ప్రవేశించుటయు సంభవించును.

[భక్తిచేతను, పరమేశ్వరుని మొదట తెలిసికొనవలయును. పిదప తుదకు భక్తులకు పరమేశ్వరుని తాదాత్మ్యము కలుగు నను నీసిద్ధాంతమే పూర్వమందు ౪. ౯. మఱియు ముందు ౧౮. ౫౫ శ్లోకములయందును చెప్పఁబడినది. దానియొక్క స్పష్టీకరణము గీతారహస్యమునందలి ౧౩ వ ప్రకరణమునందు (పు. ౫౪౯-౫౯౧) నే చేసితిని చూడుము. ఇప్పు డర్జునునకు సకలగీతార్థసారమును సంక్షేపముగ చెప్పుచున్నాఁడు.—]

(౫౫) ఓ పాండవా! కర్మల నన్నింటిని నాసంబంధమ్మైనవి యనఁగా: పరమేశ్వరునిసంబంధము లైనవి యనుబుద్ధితో చేయువాఁడును, మత్పరాయణుఁడును, సంగరహితుఁడును, సర్వభూతములయందును వైరము లేనివాఁడును నగు నాభక్తుఁడు నన్నుఁ బొందుచున్నాఁడు.

[పరమేశ్వరార్పణబుద్ధితో ననఁగా: జగత్తునం దున్నకర్మలన్నియు పరమేశ్వరునివే యనుకొని, వాఁడె నిజమగుకర్తయనియు, కారయిత యనియు; మన మీకర్మలను నిమిత్తమాత్రము చేయుచున్నా మనియు, వాఁడు చేయించుచున్నాఁ డని నిరభిమానబుద్ధితో జగత్తునం దున్నవ్యవహారములను భగవద్భక్తులు చేయవలయు ననియు తాత్పర్యము. (పైన ౩౩వ శ్లోకము చూడుము) అనఁగా : నాకర్మలు శాంతికి గాని, మోక్షప్రాప్తికి గాని, ప్రతిబంధకములుగా వని పైశ్లోకమున కర్థ మగును. మఱియు నీశ్లోకమునందు గీతాశాస్త్రముయొక్కతాత్పర్య మంతయు నిమిడియున్న దని శాంకరభాష్యమునందును జెప్పఁబడినది. గీతలయం దున్నభక్తిమార్గ మేమియుఁ పని చేయక హరి హరి యనిచెప్పునది కాదు, జాజ్వల్యమాన మగుభక్తితోడను, సుత్సాహముతోడను, నిష్కామకర్మల నన్నింటిని చేయు మని చెప్పుచున్న దని దీనివలన స్పష్ట మగుచున్నది. నిర్వైరుఁ డనఁగా: సన్న్యాసమార్గీయులు చెప్పినటుల నిష్క్రియుఁ డనునర్థ మిచ్చో వినక్షితము కా దని వ్యక్తము చేయుటకై 'మత్కర్మకృత్' అనఁగా : కర్మ లన్నియు పరమేశ్వరునివి, శివికా వనితెలిసికొని పరమేశ్వరార్పణబుద్ధితో వానిని

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపదర్శనం నామ
ఏకాదశోఽధ్యాయః. ౧౧.

: చేయ్యు మని యావిశేషణముచే కలుపఁబడినది. ఈవిషయమై గీతారహ
: స్యమునందలి పండ్రెండవ ప్రకరణమునందు (పు. ౫౪౧-౫౫౦) సవిస్తర
: మగువిచారణ చేయఁబడినందున యిచ్చో విశేషము చర్చింపఁబడదు.

ఈరీతిగ భగవంతునిచే గానముచేయఁబడిన విశ్వరూపదర్శన మనుపేరి పదునొకండవయధ్యాయము సమాప్తమయినది.



# ద్వాదశో ఽధ్యాయః.

---

అర్జున ఉవాచ.

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. ౧

## పండ్రెండవ యధ్యాయము.

[కర్మయోగసిద్ధికొఱ కేడవయధ్యాయమునందు జ్ఞానవిజ్ఞానములనిరూపణ మారంభింపఁబడి యెనిమిదవదానియందు నక్షరమును, ననిర్దేశ్యమును నవ్యక్తము నగుబ్రహ్మయొక్క స్వరూపము చెప్పఁబడినది. పిమ్మట తొమ్మిదవయధ్యాయమునందు భక్తియనెడు ప్రత్యక్ష మగురాజమార్గముయొక్క నిరూపణ మారంభింపఁబడి పది పదునొకండవయధ్యాయములయందు తదంతర్గత మగువిభూతివర్ణనమును, విశ్వరూప దర్శనము నను రెండుపాఖ్యానములు చెప్పఁబడినవి. పిదప భక్తితోడను, నిస్సంగ బుద్ధితోడను, నన్నికర్మలను జేయవలయు నని సర్వార్థసారము ననుపేరున పదునొకండవ యధ్యాయము చివర నర్జునున కుపదేశింపఁబడినది. పిదప కర్మ-యోగ సిద్ధికొఱకు, ఏడు, ఎనిమిదియధ్యాయములయందు, క్షరాక్షరవిచారపూర్వకముగ పరమేశ్వరునియొక్క యవ్యక్తస్వరూపమే శ్రేష్ఠ మని సమర్థించి యవ్యక్తము యొక్క, లేక యక్షరముయొక్క యుపాసన (౭. ౧౯ మఱియు ౨౪; ౮. ౨౧) చెప్పఁబడినది. మఱి యుక్తచిత్తముతో యుద్ధముచేయుము మని(౮–౭) యుపదేశింపఁబడినది. పిమ్మట తొమ్మిదవ యధ్యాయమునందు వ్యక్తోపాసనారూప మగుప్రత్యక్ష ధర్మమును చెప్పి సర్వకర్మలును పరమేశ్వరార్పణబుద్ధితో చేయవలయు నని (౯. ౨౭; ౩౪; మఱియు ౧౧. ౫౫) చెప్పఁబడినది. ఈరెండింటిలోను శ్రేష్ఠమార్గ మేది యనుప్రశ్నయందున్నవ్యక్తోపాసన యనుశబ్దమునకు భక్తి యని యర్థము కాని యీభక్తి వేర్వేఱగు ననేకోపాస్యవస్తువులసంబంధమైన దనునర్థ మిచ్చో వివక్షితము కాదు గాన, నుపాస్యము, లేక ప్రతీక మేదియైనను, దానియందు సర్వవ్యాపి యగుపరమేశ్వరుఁ డొకఁడె యని, భావించి చేయఁబడిన భక్తియే నిజ మగు వ్యక్తోపాసనగ నున్నది. అదియే యీయధ్యాయమున నుద్దేశింపఁబడినది.—]

అర్జునుఁ డడుగుచున్నాఁడు.—(౧) ఇట్లెప్పుడును యుక్తులై యనఁగా:

శ్రీ భగవానువాచ.

॥శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. ౨
యే త్వక్షర మనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్. ౩
సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. ౪
క్లేశోధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. ౫
యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. ౬
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,

యోగయుక్తులయి, యేభక్తులు నీయొక్కగాని, యవ్యక్తమైనయక్షరముయొక్క (బ్రహ్మయొక్క)గాని యుపాసన చేయుచున్నారో, వారలలో నుత్తమమైన, (కర్మ-)యోగవేత్త యెవరు ? భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—(౨) నాయందు మనస్సును నిలిపి యెల్లప్పుడును యుక్తచిత్తులై పరమశ్రద్ధతో నన్నుపాసించు వారే యందఱిలోను యుత్తము లగుయుక్తులు, అనఁగా: నుత్తమయోగు లని నాయుద్దేశము. (౩) కాని యెవరు, అనిర్దేశ్యము (అనఁగా: ప్రత్యక్షముగ చూపించుటకు శక్యముకానిది) నవ్యక్తమును, సర్వవ్యాపియు, నచింత్యమును, కూటస్థమును, (అనఁగా: నన్నింటికంటె పూర్వమం దుండునదియు) నచలమును, నిత్యమును నయిన యక్షరమును (అనఁగా: బ్రహ్మను) (౪) ఇంద్రియముల నన్నింటిని, నిరోధించి యంతటను సమబుద్ధిగలవారై యుపాసన చేయుచున్నారో! యాసర్వభూతములయొక్క హితమునందు తత్పరు లయినవారును (వారుకూడ)నన్ను పొందుచున్నారు.

(౫) (అయినను) వారియొక్క చిత్త మవ్యక్తమునం దాసక్తమగుటచే వారికి మిక్కిలి క్లేశము కలుగును. కారణ మేమన: (దేహధారులును, వ్యక్తులు నగుమనుజులకు) నవ్యక్తోపాస్తియొక్కమార్గము కష్టముచే సిద్ధముగ నున్నది. (౬) కాని యెవరు నాయందు సర్వకర్మల నర్పించి మత్పరాయణు లయి, యనన్య

భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్.
మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. ౮

యోగముతో నన్ను ధ్యానించి భజించుచున్నారో (౭) అట్టి మచ్చిత్తు లగువారిని నో పార్థా! విలంబము చేయక యీమృత్యుమయ మగుసంసారసాగరమునుండి నే నుద్ధరించుచున్నాను. (౮) (కాన) నాయందే మనస్సు నుంచుము. నాయందు బుద్ధిని స్థిరము చేసికొమ్ము. అటు లగునేని పిమ్మట నీవు నాయందే నివసింతువు. దీని యందు సంశయ మేమియును లేదు.

[భక్తిమార్గముయొక్క శ్రేష్ఠత నీయందు చెప్పఁబడినది. రెండవ శ్లోకమునందు భగవద్భక్తుఁడు త్తమయోగి యని సిద్ధాంతమును జెప్పి పిదప, మూఁడవశ్లోకమునందు 'తు' అను రెండవపక్షమును బోధించు యవ్యయ మును ప్రయోగించి, దానిని నాలుగవ శ్లోకమును సేతివాక్యము చేసి రెండు శ్లోకములయందును నవ్యక్తము నుపాసించువారు సైతము నన్నే పొందు చున్నా రని చెప్పఁబడినది. కాని యిది నిజమైనను నవ్యక్తోపాసనయొక్క మార్గము, మిక్కిలి క్లేశప్రద మని యైదవ శ్లోకమున జెప్పి యాఱు, ఏడు శ్లోకములయందు దానికంటె వ్యక్తోపాసనయొక్క సౌలభ్యమును వర్ణించి యెనిమిదవ శ్లోకమునందు నీ వాతీరు నాచరించు'' మని చివర కర్జునున కుప దేశించెను. "పదునొకండవ (౧౧వ) యధ్యాయముకడపట (గీ. ౧౧.౫౫) చేయఁబడిన యుపదేశమే, యర్జునుని ప్రశ్నగుండా, యిచ్చో దృఢీకరిం పఁబడినది." అని యిందలిసారాంశము. భక్తిమార్గమునందు గలసౌల భ్యము గీతారహస్యమునందలి పదమూఁడవప్రకరణమునందు సవిస్తరముగ విచారింపఁబడినది. గాన దాని నిచ్చో పునరుక్తము చేయను. అవ్యక్తోపా సన, క్లిష్టమైనదయినను, నదియును మోక్షప్రదమే యనియు, భక్తిమార్గ మున నైనకర్మలను విడలక, యాకర్మలనే యీశ్వరార్పణబుద్ధితో నవశ్య ముగ చేయవలయు ననియు, భక్తిమార్గీయులు జ్ఞప్తియం దుంచుకొనవలయు ననియు నీహేతువు చేతనే యాఱవశ్లోకమునందు "నాయందు సర్వకర్మలను సన్న్యసించి" యనుశబ్దములు ప్రయోగింపఁబడిన వనియుమాత్రమే చెప్ప దురు. భక్తియోగమునందున్న కర్మలను బొత్తుగ విడువ నక్కఱ లేదు. ఇంక నేమన: పరమేశ్వరునకు వానిని యునఁగా: వానియొక్క ఫలముల నర్పింప

§§ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరం
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ. ౯
అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి. ౧౦
అథైత దప్యశక్తోసి కర్తుం మద్యోగ మాశ్రితః,
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. ౧౧
శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్. ౧౨

వలయు నని, దీనికి స్పష్టమగునర్థము. భక్తుఁడైనవాఁడు "నాకిష్టుఁ" డని భగవంతుఁ డీయధ్యాయమునకడపట చెప్పుటయును నిష్కామ కర్మయోగమార్గమును దృఢపఱచుటకే యని తెలిసికొనవలయును. బొత్తుగ కర్మలను వదలుటకొఱకు కాదనియు దీనివలన స్పష్ట మగుచున్నది. అది యిటు లుండనిమ్ము; భక్తిమార్గముయొక్క సౌలభ్యమును, శ్రేష్ఠత్వమును నీతీఁన సమర్థించి యిప్పుడు పరమేశ్వరునియం దిట్టిభక్తి స్థిరపడుటకు నుపాయములును, సాధనములును నేవియో చెప్పి వానియం దున్నతారతమ్యములనుసైతము స్పష్టపఱచుచున్నాడు.—]

(౯). ఇప్పు డీవిధముగ నాయందు నిశ్చలముగ చిత్తము నుంచుట నీవలన కానిచో నోధనంజయా! యభ్యాసముయొక్క సాహాయ్యము చేననఁగా: పదేపదే ప్రయత్నించి నన్ను పొందవలయు నని యుత్సాహపడుము. (౧౦) అభ్యాసము చేయుటకును నసమర్థుఁడ వగుదువేని, నన్ను పొందునిమిత్తములు (శాస్త్రముల యందు చెప్పఁబడిన జ్ఞాన-ధ్యాన-భజన - పూజనాదులగు) కర్మలను చేయుచుండుము. మదర్థమై నీవు కర్మలను చేసినను సిద్ధి నొందుదువు. (౧౧) కాని దీనిని చేయుటకును నీ వసమర్థుఁడ వగుదువేని మద్యోగమును (అనఁగా: మదర్పణపూర్వక మగునేయోగము, (అనఁగా: కర్మ-యోగము కలదో దానిని) ఆశ్రయించి, నియతాత్ముఁడవై (అనఁగా: మెల్లమెల్లగ చిత్తమును నిరోధించుచు) పిదప సర్వకర్మలయొక్క ఫలమును త్యజింపుము. (౧౨) కారణ మేమన: నభ్యాసముకంటె జ్ఞానము మిక్కిలి మంచిది. జ్ఞానముకంటె ధ్యానము మిక్కిలి యోగ్యతఁగలది ధ్యానముకంటె కర్మఫలత్యాగము మిక్కిలి శ్రేష్ఠమైనది. మఱియు నీకర్మఫలముయొక్క త్యాగమువలన తర్వాత వెంటనే శాంతి కలుగును.

[ఈశ్లోకము కర్మ-యోగమును సమర్థించుటకు మిక్కిలి గ మఱియు దానియందు భక్తియుక్త మగుకర్మ-యోగము సిద్ధించుటకు నభ్యాసము, జ్ఞానము, భజనము, కర్మలు మొదలుగ గల్గిన సాధనములను చెప్పి, వీనికిని నితరసాధనములకును తారతమ్యమును విచారించి తుదకు కడపటిది యని ౧౨వ శ్లోకమునందు కర్మఫలత్యాగముయొక్క (అనఁగా: నిష్కామకర్మ-యోగముయొక్క) శ్రేష్ఠత్వము వర్ణింపఁబడినది. నిష్కామకర్మ-యోగముయొక్క యీశ్రేష్ఠత్వ మిచ్చట నే వర్ణింపఁబడలేదు. ఇఁక నేమన: పూర్వమున మూఁడు (౩. ౮), అయిదు (౫. ౨), ఆఱు (౬. ౪౬) అధ్యాయములయందును నీయర్థమే స్పష్టముగ వర్ణింపఁబడినది. తదనుసారముగనే ఫలత్యాగరూప మైన కర్మ-యోగము నాచరించుటసైత మక్కడక్కడ నర్జునున కుపదేశింపఁబడినది. (గీతా. ర. పు. ౪౨౨, ౪౨౩ చూడుడు.) కాని గీతాధర్మములకంటె భిన్నము లగుసంప్రదాయము గలవారి కిది విరుద్ధముగ నుండును. కాన వారు పైశ్లోకమునందును, ముఖ్యముగ పండ్రెండవ శ్లోకమునందును, నున్నపదములయొక్క యర్థమును మార్చుటకు ప్రయత్నించుచున్నారు. కేవల జ్ఞానమార్గీయు లగు(అనఁగా: సాంఖ్యులగు) టీకాకారులకు, జ్ఞానముకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠ మని నిశ్చయించుట యిష్టములేదు. కాన జ్ఞానశబ్దముచే గ్రాంథికజ్ఞానమును గ్రహింపవలయు ననిగాని, లేక కర్మఫలత్యాగముయొక్క ప్రశంస యర్థవాదము ని (అనఁగా: స్తుతి యని) తెలిసికొనవలయు ననిగాని వారు చెప్పుదురు. అటులే పాతంజలయోగమార్గీయులకు నభ్యాసముకంటె కర్మఫలత్యాగము గొప్పది యనినిశ్చయించుట సమ్మతము కాదు. మఱియు కేవలభక్తిమార్గీయులకు (అనఁగా: భక్తినితప్ప మఱియొకకర్మను చేయఁగూడ దనువారికి) కర్మఫలత్యాగముయొక్క శ్రేష్ఠత్వము (భక్తికంటె) సమ్మతము కాదు. పాతంజలయోగము, జ్ఞానము, లేక భక్తి యను నీ మూఁడుసంప్రదాయములకంటెను వే ఱగుసంప్రదాయము (అనఁగా: గీతలయందున్న భక్తియుక్త మగుకర్మయోగసంప్రదాయము) ప్రస్తుతము విశేషించి లుప్తమయినది. కావున నీసంప్రదాయమును ప్రశంసించిన, లేక వ్రాసిన టీకాకారులు లేరు. కాన ప్రస్తుతమునందు గీతలపై గాన్పించు వ్యాఖ్యానము లన్నిటియందును కర్మఫలత్యాగముయొక్క శ్రేష్ఠత్వ మర్థవాదాత్మకము (స్తుతి) అనియే నిశ్చయింపఁబడినది. కాని యిది తప్పని

నే తలఁచెద. గీతలయందు నిష్కామకర్మయోగమే ప్రతిపాద్య మని యంగీకరింపఁబడినచో నీశ్లోకముయొక్క యర్థమువిషయమై ప్రతిబంధక మేమియు నుండ నేరదు. కర్మను వదలినచో నేమియు నడువ నేరదు. నిష్కామకర్మలను తప్పక చేయవలయును. అని చెప్పుదుమేని స్వరూపముతో కర్మలను త్యజించు జ్ఞానమార్గమును, లేక యింద్రియములయొక్క వ్యాయామమునే బోధించు పాతంజలయోగము, లేక సర్వకర్మలను వదలుభక్తిమార్గము నను నవియే కర్మ—యోగముకంటె తక్కువయోగ్యత కల వని నిశ్చిత మగుచున్నది. నిష్కామకర్మయోగ మీరీతిగ శ్రేష్ఠ మని స్థిరపడినపిదప దానియందు నావశ్యక మగుభక్తియుక్త మయినసామ్యబుద్ధిని సంపాదించు నుపాయము లెవ్వియో దెల్పుటయే మిగిలిన పని. దీనికి నభ్యాసము, జ్ఞానము, ధ్యానము ననునీమూఁడును సాధనములు. వీనిలో నభ్యాసము శక్యముకానిచో జ్ఞానధ్యానములలో నేదుపాయమునైన స్వీకరింపవలయును. ఈయుపాయము నాచరించుట వెనుక చెప్పినక్రమమున సులభ మని గీత చెప్పుచున్నది. మఱియు నిదియు సాధ్యము కానిచో కర్మ-యోగము నాచరించుట తత్క్షణమే యారంభింపవలయు నని పండ్రెండవ (౧౨ వ) శ్లోకమును చెప్పఁబడినది. ఇప్పు డభ్యాసమును, జ్ఞానమును, ధ్యానమును శక్యములు గానివారికి కర్మయోగముమాత్ర మెట్లునడుచు నని సందేహము వెలువడును. అప్పుడు కర్మ-యోగ మన్నిటికంటె సులభమని చెప్పుటయే నిగర్థక మని యానేకులచే నిశ్చయింపఁబడినది. దానిని కొంచెము విచారించితిమేని దీనికంటె మంచిది వేఱొకటి లే దని కాన్పించును. కాని పండ్రెండవ శ్లోకమునందు కర్మఫలత్యాగ మొక్కపర్యాయమే చేయు మని చెప్పలేదు. ఇఁక నేమన: భగవంతునిచే వర్ణింపఁబడిన కర్మ-యోగమును మొదట నవలంబించి పిదప మెల్లమెల్లగ నీవిషయమును చివరకు సిద్ధింపఁజేసికొనవలయు నని చెప్పఁబడినది. మఱియు నిటు లర్థము చేసికొనిన నేమియు నసంగతముగ నుండదు. కర్మఫలత్యాగముయొక్క స్వల్పాచరణమే గాక (గీ. ౨. ౪౦) జిజ్ఞాసయైన (గీ. ౬.౪౪ మఱియు దానిపైనున్న నాటిప్పణి చూడుము) కలిగినచో మనుజుఁడు చక్రమునఁ బడినవానివలె తుదకు సిద్ధినిఁ జెందు నని పూర్వాధ్యాయమునందే చెప్పఁబడినది. కాన కర్మయోగము నాశ్రయించుట (అనఁగా: నామార్గము నాచరింపవలయు నని మనస్సులో నుంచుకొనుటయే) యీమార్గమునందు సిద్ధిని సంపాదించుకొనుటకు మొదటి

§§ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ. ౧౩
సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మే భక్త స్స మే ప్రియః. ౧౪

సాధనము, లేక మార్గము. మఱియు నీసాధన మభ్యాస, జ్ఞాన, ధ్యానముల కంటె సులభముకాదని యెవరు చెప్పరు? మఱియు పండ్రెండవ శ్లోకము యొక్క భావార్థమును నిదియె. భగవద్గీతలయందే గాక సూర్యగీతలయందు సైతము—

జ్ఞానా దుపాస్తి రుత్కృష్టా కర్మోత్కృష్ట ముపాసనాత్,
ఇతి యో వేద వేదాన్తైః స ఏవ పురుషోత్తమః.

“జ్ఞానముకంటె నుపాసన (ధ్యానము) లేక, భక్తి యుత్కృష్టమైన దనియు, నుపాసనకంటె కర్మ - (అనఁగా: నిష్కామ- మయినది) శ్రేష్ఠమైన దనియు నీవేదాంతతత్త్వమును తెలిసికొన్నవాఁడె పురుషోత్తముఁ డనఁబడు యును.”—అని చెప్పఁబడినది. (సూర్య గీ. ౪. ౭౭) కర్మఫలత్యాగరూప మైనయోగమే (అనఁగా: జ్ఞాన, భక్తియుక్త మయిననిష్కామకర్మయోగమే) యన్నిమార్గములలోను శ్రేష్ఠ మయినది యని భగవద్గీతయొక్క సిద్ధాంతమతము గాన దాని కనుకూలమయినదియే గాక పోషకమును నగు యుక్తివాదముసైతము పండ్రెండవ శ్లోకమునందు చెప్పఁబడిన దని సారాంశము. ఇతరము లగు నేసంప్రదాయములకును నది సంబంధింపనిచో వానివి వదలివేయవలయును; కాని యర్థమును నిష్కారణముగ మార్పఁగూడదు. అది యటు లుండనిమ్ము; కర్మఫలత్యాగము నీతీరున శ్రేష్ఠ మని నిశ్చయించి యిప్పు డామార్గమునఁ బ్రవర్తించువారికి (కర్మలను పూర్తిగ వదలువారికి కాదు.) తుదకు ప్రాప్తమగు సమమును, శాంతము నగుస్థితిని వర్ణించి యిట్టి భక్తుఁడె నాకు మిక్కిలి శ్రేష్ఠుఁ డని భగవంతుఁడు కడపట చెప్పుచున్నాఁడు.—]

(౧౩) ఏవారిని ద్వేషించనివాఁడును, సర్వభూతములయందును మిత్రభావముతో సంచరించువాఁడును, దయగలవాఁడును, మమత్వబుద్ధిలేక, నహంకారమును లేనివాఁడును, సుఖదుఃఖములు సమానముగ నున్నవాఁడును, క్షమ గలవాఁడును, (౧౪) ఎల్లప్పుడు సంతుష్టుఁడును సంయమము గలవాఁడును, దృఢనిశ్చయము గలవాఁడును, నాయం దుంపఁబడిన మనోబుద్ధులు గలవాఁడును

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః. ౧౫
అనపేక్షశ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః. ౧౬
యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః. ౧౭
సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః ౧౮
తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః. ౧౯

నగు నాకు భక్తుఁడును నగు(కర్మ-)యోగి నాకు మిక్కిలి ప్రియుఁడు: (౧౫) ఎవరిని లోకులు వ్యాకులపెట్టరో, లోకుల నెవఁడు వ్యాకులపెట్టఁడో యట్టివాఁడును, హర్షము, క్రోధము, భయము, విషాదము ననువానిచే వికారము నొందనివాఁడును నాకు ప్రియుఁడు. (౧౬) నిరపేక్షియును, శుచియును, దక్షుఁడును(అనఁగా: నేకార్యమునైన నాలస్యములేక చేయువాఁడును)- ఫలవిషయమై యుదాసీనుఁడు- ఎవరిని యేవికారమును చలింపచేయనేరదో మఱియు నెవఁడు కామ్యఫలములయొక్క- యారంభముల నన్నింటిని యనఁగా: సుద్యోగముల నన్నింటిని వదలెనో యట్టి నాభక్తుఁడు నాకిష్టుఁడు. (౧౭) ఎవఁడు (దేనివిషయమున నైనను) ఆనందము నొందఁడో, ద్వేషింపఁడో, శోకింపఁడో, యిచ్ఛగింపఁడో, శుభాశుభములను (కర్మఫలములను) వదలినాఁడో యట్టిభక్తి గలిగినపురుషుఁడు నాకిష్టుఁడు (౧౮) శత్రువులును, మిత్రులును, మానావమానములును, శీతోష్ణములును, సుఖదుఃఖములును నెవరికి సమానములుగ నుండునో, ఎవరికి దేనియందును నాసక్తి లేదో, (౧౯) నిందాస్తుతులు రెండును నెవరికి సమానము లైనవో, మితభాషి యెవఁడో, సంప్రాప్త మయినదానిచేతనే సంతుష్టుఁ డగువాఁ డెవఁడో, చిత్తము స్థిరమయినది యగుటచే నెవఁ డనికేతుఁడో (అనఁగా: నెవనియొక్క- కర్మఫలాశారూపమైననివాస మెచ్చటను లేదో) యట్టిభక్తి గలపురుషుఁడు నాకిష్టుఁడు.

[అనికేతశబ్దము గృహస్థాశ్రమమును వదలి, సన్న్యసించి, బిచ్చ మెత్తుకొనుచు, మఠములలో నుండుయతులను వర్ణించినప్పుడును ననేకస్థలముల

యందు ప్రయోగింపఁబడుచున్నది. (మను. ౬. ౪౩. చూడు) దాని కిల్లులేనివాఁ డనిఘాత్వర్థము. కాన నీయధ్యాయమునం దున్న 'నిర్మమః', 'సర్వారంభపరిత్యాగీ' 'అనికేతః' అనుపదములును నితరస్థలములయం దున్న "త్యక్తసర్వపరిగ్రహః" (౪. ౨౧) 'వివిక్తసేవీ' (౧౮. ౫౨) మొదలగు నీశబ్దములంబట్టి 'ఇల్లు వాకిండ్లను విడచి యిచ్ఛాశూన్యుఁడై మఠములలో నుండి జీవితకాలమును గడపువాఁ డని సన్న్యాసమార్గమునందలి ముఖ్య విషయమే గీతలయందుఁ బ్రతిపాదింపఁబడిన దని సన్న్యాసమార్గీయు లగుటీకాకారులు చెప్పిరి. వారికి నాధారముగ స్మృతిగ్రంథములయం దున్నశ్లోకములను వారు చూపించుచున్నారు ; కాని యీకేవలసన్న్యాస పర మగునర్థము సన్న్యాససాంప్రదాయిక్దృష్టిచే గొప్పదైనను గీతా వాక్యములకు నిజమయినయర్థము కాదు. కారణ మేమన : నిరగ్నియు, నిష్క్రియుఁడు నగుట గీతానుసారముగ నిజమగుసన్న్యాసము కాదు. ఫలాశనుమాత్రమే వదలవలయును. కర్మల నెప్పుడును వదలకూడదు. అను గీతలయొక్క స్థిరమైనసిద్ధాంత మని పైన పలుమార్లు చెప్పఁ బడియేయున్నది. (గీ. ౫. ౨; ౬. ౧, ౨ చూడు) కాన 'యనికేత' పదమునకు "ఇల్లు వాకిండ్లను వదలుట" యని యర్థము చేసికొనరాదు. గీతలయం దున్నకర్మయోగమునకు సంబంధించిన యర్థమునే చేసికొనవల యును. గీ. ౪. ౨౦ వ శ్లోకమునందు కర్మఫలము నపేక్షింపనిపురుషు నకే "నిరాశ్రయుఁడు" అను విశేషణము ప్రయోగింపఁబడినది. గీతా. ౬. ౧శ్లోకమునందు "అనాశ్రితః కర్మఫలం" అనుశబ్దములును నాయర్థ మందే ప్రయోగింపఁబడినవి. "ఆశ్రయము, నికేతము" అనుశబ్దములకు రెండింటికి నొకటే యర్థము. గాన యనికేతుఁ డనఁగా, గృహదార లను వదలినవాఁ డని యర్థము చేయఁదగదు. గృహదారాదులయందు మగ్న ముగాని మనస్సుగలవాఁ డని దానియర్థము. "ఎవరియొక్క సమారంభ ములు ఫలాశారహితములో వారికర్మలు జ్ఞానముచే దగ్ధము లగుచున్నవి" (గీ.౪. ౧౯) అనుశ్లోకముతో సమానార్థకముగను ననఁగా : "కామ్యము లగునారంభములను (అనఁగా : కర్మలను) విడచినవాఁడు." అని యర్థము కావింపవలసివచ్చును. ఇది. గీ. ౧౮. ౨ మఱియు ౧౮. ౪౮, మఱియు ౪౯ శ్లోకములనుండి సిద్ధమగుచున్నది. కావున గృహదారాదులయందును, లేక జగత్తునందలి యితరవ్యవహారములందును నిమగ్నమైనచిత్తముగలవారికి

§§ యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః. ౨౦

వానిమూలమున దుఃఖము గలుగుచున్నది. కాన నీవిషయముల యన్నింటి యందును చిత్తమును మరలింపఁజేయఁగూడ దనిమాత్రమే గీత చెప్పుచున్న దనియు, మనస్సుయొక్క యీవైరాగ్యస్థితిని చూపుటకే గీతల యందు "అనికేతః, సర్వారంభపరిత్యాగీ" మొదలగుశబ్దములు స్థితప్రజ్ఞుని యొక్క వర్ణనయం దుపయోగింపఁబడుచున్న వనియు, నీశబ్దములే యతుల యొక్క అనఁగా: కర్మత్యాగముచేయు సన్న్యాసులయొక్క వర్ణనల యందుసైతము స్మృతిగ్రంథములలోఁ బ్రయోగింపఁబడినవనియు, నంత మాత్రముచే కర్మత్యాగరూప మగుసన్న్యాసమే గీతలయందుఁ బ్రతి పాద్య మని చెప్పుట సాధ్యముకాదనియు, కారణ మేమన: నెవరిబుద్ధి యందు నీవైరాగ్యము పూర్ణముగ నున్నదో యట్టిజ్ఞానులును నీవిరక్త మగు బుద్ధిచేతనే ఫలాశనువదలి శాస్త్రమును బట్టి ప్రాప్త మగుకర్మల నన్నింటిని చేయవలయు ననియు, గీతలయొక్క మఱియొకనిశ్చిత మగుసిద్ధాంత మని సారాంశము. ఈపూర్వాపరసందర్భము నంతను గమనింపక 'అనికేత శబ్దము' వలె వైరాగ్యబోధకశబ్దము లేయెడనైనను గీతలలో వచ్చినచో నంత మాత్రముచేతనే కర్మసన్న్యాసపర మగుమార్గమే గీతలయందు ప్రతి పాదింపఁబడిన దని చెప్పరాదు.—]

(౨౦) పైన చెప్పఁబడిన యీయమృతతుల్య మగుధర్మమును మత్పరు లగుచు శ్రద్ధతో నాచరించుభక్తులు నాకు మిక్కిలి యిష్టు లగుచున్నారు.

[భక్తుఁ డయినజ్ఞాని యెల్లవారిలో శ్రేష్ఠుఁ డని పూర్వమందున్నవర్ణనను (గీ. ౬. ౪౭; ౭. ౧౭) అనుసరించి భగవంతుఁడు, పరమభగవద్భక్తుఁ డగుకర్మయోగి, తన కత్యంతప్రియుఁ డని యీశ్లోకమునందు వర్ణించి చెప్పెను. గీ. ౯. ౨౯వ శ్లోకమునందు భగవంతుఁడే "నాకెల్లరును సమానులె, ఒకఁ డిష్టుఁడనియు, మఱియొకఁ డనిష్టుఁడనియు భేదములేదు." అని చెప్పినాఁడు. పైకి ఇది విరుద్ధముగఁ గాన్పించునను గాని, సగుణోపాసనను గాని, భక్తిమార్గమునుగాని సంబంధించునది యొకవర్ణన మనియు, రెండవది యధ్యాత్మదృష్టిచేఁగాని, కర్మవిపాకదృష్టిచేఁగాని చెప్పఁ బడిన దనియు నను యన్నుమానమేని యీవిరోధ ముండదు. గీతారహస్య

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగో నామ
ద్వాదశోఽధ్యాయః. ౧౨

[మునందలి పదమూఁడవ (౧౩వ) ప్రకరణమునకు కడపట (పు. ౫౯౧-౫౯౨) ఖూశిపయమై చేయఁబడిన వివేచనమును చూడుము —]

ఈరీతిగ భగవంతునిచే గానము చేయఁబడిన భక్తియోగమను పేరి పండ్రెండవయధ్యాయము సమాప్తమయినది.



# త్రయోదశోఽధ్యాయః.

---

## పదమూఁడవ యధ్యాయము.

[అనిర్దేశ్యుఁడును, నవ్యక్తుఁడు నగుపరమేశ్వరుని బుద్ధియందు చింతించుటచేఁ దుదకు మోక్షము లభించుట నిజ మయినను దానికంటె శ్రద్ధతో పరమేశ్వరునియొక్క ప్రత్యక్షమును, వ్యక్తము నగుస్వరూపమును భజించి పరమేశ్వరబుద్ధితో సర్వకర్మలను చేయుచుండుటచే నామోక్ష మే సులభోపాయముగ లభించు నని పైయధ్యాయమునందు సమర్థింపఁబడినది. కాని యేడవ యధ్యాయమున జ్ఞానవిజ్ఞానములను చెప్పుటకు నారంభించుట యింతమాత్రముచేతనే సమాప్తము కాదు. పరమేశ్వరుని పూర్ణముగఁ దెలిసికొనుటకు బాహ్యసృష్టియొక్క క్షరాక్షరవిచారమువలెనే, మనుష్యునియొక్క శరీరమును, ఆత్మను, లేక క్షేత్రమును, క్షేత్రజ్ఞుని విచారింపవలసివచ్చును. అటులే జడప్రకృతివలన వ్యక్తపదార్థము లన్నియు నిర్మింపఁబడుచున్న వని సామాన్యముగఁ దెలిసినను ప్రకృతియొక్క యే గుణము చేనిది యంతయు బయలువెడలుచున్నదో, దానియొక్క క్రమ మేదియో, చెప్పిననేగాని జ్ఞానవిజ్ఞానములయొక్క నిరూపణము పూర్తిగఁ గానేరదు. కాన పదమూఁడవ యధ్యాయమునందు మొదట క్షేత్రక్షేత్రజ్ఞవిచారమును, పిదప నాలుగధ్యాయములయందును గుణత్రయవిభాగమును చెప్పి పదునెనిమిదియవ యధ్యాయమున మొత్తముపై నున్నవిషయము లన్నియు నుపసంహరింపఁబడినవి. కడపటి యీ అధ్యాయములును స్వతంత్రములైనవి కావనియు, కర్మయోగసిద్ధికొఱకు నేడవయధ్యాయమున నారంభింపఁబడిన జ్ఞానవిజ్ఞానముల నిరూపణము పూర్ణముగ నీయీ అధ్యాయములయందును చేయఁబడిన దనియు నిందలి సారాంశము. (గీతార. ప్ర. ౧౪. పు. ౬౩౨-౬౩౮ చూడు) గీతలయొక్క యనేకపుస్తకములయం దీపదమూఁడవయధ్యాయారంభమున "అర్జున ఉవాచ — ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ, ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ" — అనుశ్లోకము వ్రాయఁబడియున్నది. "అర్జునుఁ డడుగుచున్నాఁడు. ప్రకృతిని,

శ్రీభగవా నువాచ.

ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయ తే,
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. ౧
క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ. ౨

పురుషుని, క్షేత్రమును క్షేత్రజ్ఞుని, జ్ఞానమును, జ్ఞేయమును అనఁగా : నేమియో యెఱుంగవలయు నని కోరిక యున్నది. కావున దానిని చెప్పుము'' అని యర్థము. కాని క్షేత్రక్షేత్రజ్ఞవిచారము గీతలలోని కెట్లువచ్చినదో తెలియక యీశ్లోకము నిచ్చో నెవరో చేర్చినట్లు కాన్పించుచున్న దని కొందఱు టీకాకారు లీశ్లోకమును ప్రక్షిప్తమనుచున్నారు. అట్లు కానిచో గీతలయందలి శ్లోకములయొక్క సంఖ్యయు నేడు నందలకంటె నొక్కటి యధిక మగుచున్నది. కాన నేనును నీశ్లోకమును ప్రక్షిప్త మని తలఁచియే, శాంకరభాష్యమునంగుసరి యీయధ్యాయారంభమును గావించితిని.—]

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—(౧) ఓ కౌంతేయా ! యీశరీరమే క్షేత్ర మని చెప్పఁబడుచున్నది. దీనిని తెలిసికొనినవాఁడే క్షేత్రజ్ఞుఁ డని యీశాస్త్రము నెఱిగినవారు చెప్పుచున్నారు. (౨) ఓ భారతా ! సర్వక్షేత్రములయందున్న క్షేత్రజ్ఞుఁడను నేనే,యని యెఱుంగుము. క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క జ్ఞానమే నాయొక్క (పరమేశ్వరునియొక్క) జ్ఞాన మని చెప్పఁబడినది.

[మొదటిశ్లోకమునం దున్న క్షేత్రక్షేత్రజ్ఞశబ్దముల కర్థము చెప్పఁబడినది; రెండవశ్లోకమునందున్న క్షేత్రజ్ఞశబ్దమునకు "పరమేశ్వరుఁడనైన నేను, లేక యేది పిండమునం దుండునో యదియే బ్రహ్మాండమునం దంతటను కలదు'' అని క్షేత్రజ్ఞునియొక్క స్వరూపము చెప్పఁబడినది. రెండవశ్లోకమునం దున్న 'చాపి'=సయితము అనుశబ్దమునకు క్షేత్రజ్ఞుఁడే గాక క్షేత్రము సయితము నేనే యని యర్థ మగుచున్నది. కారణ మేమన : క్షేత్రము, లేక శరీర మే పంచమహాభూతములవల్ల వెలువడుచున్నదో యది ప్రకృతి నుండి వెలువడినందున ప్రకృతి పరమేశ్వరునియొక్క కనిష్ఠ మగువిభూతియే యని, యేడు, తొమ్మిది యధ్యాయములయందు వర్ణింపఁబడినది. (౭. ౪; ౭. ౮; ౯. ౭ చూడు) క్షేత్రము లేక శరీర మిట్లు పంచమహాభూతముల

§§ తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్,
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. 3
ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. ర

యందుండి యుత్పన్నమయినందున క్షరాక్షరవిచారమునందు క్షరమని చెప్పుదానియందే క్షేత్రమును జేరుచున్నది. మఱియు క్షేత్రజ్ఞుఁడన పరమేశ్వరుఁడే కావున క్షరాక్షరవిచారమువలె క్షేత్రక్షేత్రజ్ఞవిచారము నైతము పరమేశ్వరునియొక్క జ్ఞానమున కొక్క భాగమై యున్నది. (గీతార. పు. ౧౫౧, ౧౫౨, ౧౫౫ చూడు) ఈయభిప్రాయమునే మనస్సున నిడికొని రెండవ శ్లోకముకొనయందు "క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క జ్ఞానమే నాయొక్క (పరమేశ్వరునియొక్క) జ్ఞానము" అనువాక్యము ప్రయోగింపఁబడినది. అద్వైతవేదాంతము నంగీకరింపనివారు "క్షేత్రజ్ఞుఁడనుసయితము నేనే" యనువాక్యమును తికమకజేసి "క్షేత్రజ్ఞుఁడును పరమేశ్వరుఁడును" నను నీ యిరువురకు నభేదభావ మీవాక్యముచేఁ జూపఁబడ దని ప్రతిపాదింపవలసివచ్చును; మఱికొందఱు నాయొక్క (మమ) యనుపదమును జ్ఞానశబ్దముతో నన్వయింపక మతము (అంగీకరింపఁబడినది) అనుశబ్దముతో నన్వయించి "దీనియొక్కజ్ఞానమునే, నేను జ్ఞానమని యెన్నుచున్నాను" అని యర్థమును చేయుచున్నారు. కాని యీయర్థము సరళమైనది కాదు. దేహమునందు వసించు నాత్మను (అధిదైవము) నేనే యగుదును. "లేక పిండమందున్నదే బ్రహ్మాండమందును కలదు" అని యెనిమిదవ యధ్యాయారంభముననే వర్ణింపఁబడినది. ఏకవదానియందును జీవము నాయొక్క పరాప్రకృతి (౭. ౫) అని చెప్పఁబడినది. పిమ్మట నీయధ్యాయమునందున్న ౨౨, ౩౧ శ్లోకములయందును నటులె చెప్పఁబడినది. అదియటులుండనిమ్ము; ఇప్పుడు క్షేత్రక్షేత్రజ్ఞవిచారము నెవ్వో నెవ్వరు చేసినదియు చెప్పుచున్నాఁడు-]

(3) క్షేత్రమనఁగా? నేమియో నది యెట్టిదియో, దానివికార మెద్దియో, (దానియందును) దేనినుండి యేది యుత్పన్నమగుచున్నదియో యటులే క్షేత్రజ్ఞుఁ డెవఁడో, యాతనిసామర్థ్య మేమియో నేను సంక్షేపముగఁ జెప్పుచున్నాను వినుము. (ర) అనేకవిధములుగ వివిధము లగు ఛందస్సులచేతను కార్యకారణ

రూప మగుహేతువును చూపించి పూర్ణముగ నిశ్చయింపఁబడిన బ్రహ్మసూత్రముల యందలిపదముల చేతను నీవిషయము గానము చేయఁబడినది.

[ఈశ్లోకమునం దున్న బ్రహ్మసూత్ర శబ్దముచేఁ బ్రస్తుతమం దున్న వేదాంతసూత్రములు నిర్దిష్టమైన దని గీతారహస్యమునందలి పరిశిష్టప్రకరణమునందు నేను సవిస్తరముగ నిరూపించితిని. (గీతార. పు. ౭౨౭,౭౨౯–౭౩౭, ౭౩౯ చూడుము) ఉపనిషత్తు లొకఋషీశ్వరుని గ్రంథములు కావు. అనేకు లగుఋషీశ్వరులకు వెవ్వేఱుకాలములయందును వెవ్వేఱుస్థలములయందును నధ్యాత్మవిచారసంబంధములో స్ఫురించినవిచారములు పరస్పరసంబంధము లేకుండగనే వేవ్వేఱగునుపనిషత్తులయందు వర్ణింపఁబడినవి. కావున నుపనిషత్తులు సంకీర్ణముగ నుండునట్లును ననేకస్థలములయందు పరస్పరవిరుద్ధములుగ నుండునట్లు కాన్పించుచున్నవి. పైశ్లోకముయొక్క ప్రథమపాదమునం దున్న 'వివిధ' 'పృథక్' అనుశబ్దము లుపనిషత్తులయొక్క యీసంకీర్ణస్వరూపమునే యుద్దేశించి ప్రయోగింపఁబడినవి. ఉపనిషత్తు లీతీరున సంకీర్ణములును పరస్పరవిరుద్ధములు నగుటచే వానియందున్నసిద్ధాంతమున కేకవాక్యతను కలుగఁజేయుటకై బాదరాయణులవారు బ్రహ్మసూత్రములను, లేక వేదాంతసూత్రములను రచించిరి. వానిలో నుపనిషత్తులయం దున్నవిషయముల నన్నింటిని విచారించి ప్రతివిషయమునకు నన్నియుపనిషత్తులలో నుండియు నొకసిద్ధాంతమే చేయవలసినదియు, సప్రమాణముగ కార్యకారణాదిరూపహేతువులను నిరూపించి పూర్ణముగ సిద్ధాంతము చేయఁబడినది. అనఁగా: నుపనిషత్తులయందలి రహస్యము తెలియుటకై వేదాంతసూత్రము లత్యావశ్యకము లగును. కాన నీశ్లోకమునందు రెండును నుల్లేఖింపఁబడినవి. బ్రహ్మసూత్రములయందలి రెండవ యధ్యాయమున నుండు మూఁడవపాదమున మొదటిపదునాలుసూత్రములయందును క్షేత్రమును, పిదప పాదసమాప్తిపర్యంతము క్షేత్రజ్ఞుఁడును విచారింపఁబడిరి. బ్రహ్మసూత్రములయం దీవిచారముండుటవలన వానికి శారీరసూత్రములు అనఁగా: శరీరమును లేక క్షేత్రమును విచారించుసూత్రము లనిచెప్పుచున్నారు. అది యట్లుండనిమ్ము; క్షేత్రక్షేత్రజ్ఞవిచారము నెవ రెక్కడ చేసిరో చెప్పఁబడినది. ఇప్పుడు క్షేత్ర మనగా: నేమియో చెప్పుచున్నాఁడు—].

§§ మహాభూతా న్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ,
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః. ౫
ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖంసంఘాత శ్చేతనా ధృతిః,
ఏత త్క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్. ౬

(౫) పృథివ్యాది (స్థూలములయిన)పంచమహాభూతములును నహంకారము బుద్ధి(మహాన్)యు నవ్యక్తము (ప్రకృతి) అటులె పది (సూక్ష్మములగు) యింద్రియములును, మనస్సనునది యొకటియు, పంచేంద్రియములయొక్క (శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము ననుసూక్ష్మములగు) నైదువిషయములును, (౬) ఇచ్ఛయు, ద్వేషము,సుఖము, దుఃఖము, సంఘాతము, చేతన (ప్రాణాదుల యొక్క వ్యక్తమగువ్యాపారమును) ధృతి (ధైర్యము) అనునీ(3౧)తత్త్వముల యొక్క(యు) సముదాయము సవికారమయినక్షేత్ర మని చెప్పఁబడినది

[క్షేత్రమునకును దానియొక్కవికారమునకును నీలక్షణము చెప్పఁబడినది. అయిదవశ్లోకమునందు సాంఖ్యులయొక్క యిరువదియైదుతత్త్వముల లోను, పురుషుని వదలి, మిగిలిన యిరువదినాలుగుతత్త్వములును చెప్పఁబడినవి. ఈయిరువదినాలుగుతత్త్వములయందే మనస్సును జేరును గాన నిచ్ఛయు ద్వేషము మొదలుగాగల మనోధర్మములను వేఱుగఁ జెప్ప నక్కఱలేకుండెను. కాని కాణాదులయొక్కమతమునందు నీధర్మము లాత్మసంబంధమయినవి. ఈమతము స్వీకరింపఁబడునేని యీగుణములు క్షేత్రమునందు జేరునా? చేరదా? యని శంక గలుగును. కానక్షేత్రశబ్దమును నిస్సందిగ్ధముగ వ్యాఖ్యానముచేయుటకై క్షేత్రమునందె యిచ్ఛాద్వేషాది ద్వంద్వములను నిచ్చో స్పష్టముగ సమావేశము చేయఁబడినది.
దానియందే భయాభయాది యితర ద్వంద్వములలక్షణమును జేరును. అన్నింటియొక్క సంఘాతము (అనఁగా: సముదాయము) క్షేత్రముకంటె స్వతంత్రకర్త గాదని నిరూపించుటకు నవి క్షేత్రములో లెక్కపెట్టఁబడినవి. చేతనాశబ్దమునకే యనేకస్థలములయందు చైతన్య మని యర్థము కలదు. కాని ప్రకృతమందు • చేతన యనఁగా: జడదేహమునందలి ప్రాణాదుల యొక్క దృగ్గోచరము లగువ్యాపారములు. లేక బ్రతికియుండుట యను చేష్ట యనిమాత్రమే యర్థము వివక్షితమైనందున, జడమునం దీచేతన దేని నుండి యుత్పన్నమగుచున్నదో యట్టిచిచ్ఛక్తికి చైతన్యము క్షేత్రజ్ఞరూప

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః. ౭
ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ,
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్. ౮
అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు,
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. ౯

ముగ క్షేత్రమునకంటె భిన్నముగ నున్నదని పైన రెండవ శ్లోకమునందు చెప్పఁబడినది. ధృతిశబ్దము గీతలయందే ముందు (౧౮-33) వ్యాఖ్యానము చేయఁబడును. ఆఱవ శ్లోకమునందలి 'సమాసేన' యనుపదమునకు "ఇవ న్నియు కలసి యగునట్టి సముదాయము" అని యర్థము. గీతారహస్యము నందలి యెనిమిదవ ప్రకరణముయొక్క చివర విశేషవిచారము చేయఁ బడినది. (పు. ౧౯౧-౧౯౨-౧౯౩) క్షేత్రజ్ఞుఁ డనఁగా: పరమేశ్వరుఁ డని మొదట చెప్పి, పిదప క్షేత్రమనఁగా: నేమో విచారింపఁబడినది. ఇప్పుడు దేనిని జ్ఞానమని చెప్పవలయునో యాజ్ఞానమునకు మనుజునియొక్క స్వభావముపై నెట్టిపరిణామము సంఘటిల్లునో దానిని చెప్పుచున్నాఁడు; పిదప జ్ఞేయముయొక్క స్వరూపము చెప్పఁబడినది. ఈరెండువిషయములును పైకి వేఱుగనే కాన్పించును. కాని వాస్తవముగఁ జూచిన యీ రెండును క్షేత్రక్షేత్రజ్ఞవిచారముతో చేరియున్నవి. కారణ మేమన: క్షేత్రజ్ఞుఁ డనఁగా: పరమేశ్వరుఁడే యని యారంభమునందే చెప్పఁబడినది. కాన క్షేత్రజ్ఞునియొక్క జ్ఞానమే పరమేశ్వరునియొక్క జ్ఞాన మగును. ఆతనిస్వరూపమే ముందు శ్లోకములలో వర్ణింపఁబడినది. ఇతరవిషయమును నడుమ వ్యర్థముగఁ జెప్పలేదు.—]

(౭) మానములేకుండుట, దంభములేకుండుట, అహింస, క్షమ, సరళత్వము, గురుసేవ, శుచిత్వము, స్థైర్యము, మనోనిగ్రహము, (౮) ఇంద్రియముల విషయములయందు విరక్తి, అహంకారము లేకపోవుటయు, జన్మము, మృత్యువు, జర, వ్యాధి, దుఃఖము అనునవి తనవెంట తగిలినదోషము లనియెన్నికొనుటయు, (౯) (కర్మలయందు) అనాసక్తియు, దారాపుత్రాదులు గృహము లోనగువాని యందు లంపటుఁడు కాకుండుట, ఇష్టమైనను, అనిష్టమైనను, ప్రాప్తమయినను

మయి చానన్య యోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్త దేశసేవిత్వ మరతి ర్జనసంసది. ౧౦
అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్,
ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా. ౧౧

నొకవిధమననే యెప్పుడును చిత్తవృత్తి నుంచుట (౧౦) నాయందు ననన్యభావముచే వ్యభిచరింపనిభక్తియు నేకాంతమైన ప్రదేశమునం దుండుట సామాన్య జనులయొక్క సముదాయమును కోరకుండుట. (౧౧) అధ్యాత్మజ్ఞానము నిత్యమనుకొనుట, తత్త్వజ్ఞానముయొక్క సిద్ధాంతమును పరిశీలించుటయు ననునవి జ్ఞానమని చెప్పఁబడుచున్నవి. ఇవిగాక మిగిలినది యజ్ఞానమై యున్నది.

[క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క జ్ఞాన మన ప్రకృతిపురుషులసంబంధమైన వివేకమువలన గలిగినజ్ఞాన మని సాంఖ్యులమతము. ఇదియె యీయధ్యాయమునందు పిదప చెప్పఁబడినది. (౧౩. ౧౯-౨౩; ౧౪.౧౯). అటులె "అవిభక్తం విభక్తేషు" అనియు జ్ఞానస్వరూపమునకు వ్యాపక మగులక్షణము పదునెనిమిదియవ యధ్యాయమునందు (౧౮. ౨౦) చెప్పఁబడినది. కాని క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞాన మనఁగా: నీవిషయ మీవిధమున నున్నదని బుద్ధిచే నెఱుంగుట యనునర్థముమాత్రమే మోక్షశాస్త్రమునందు వివక్షితము కాదు. దేహస్వభావముపైన సామ్యబుద్ధిరూప మగునాజ్ఞానముయొక్క పరిణామము సంఘటిల్లవలయును. లేనిచో నాజ్ఞాన మపూర్ణమైనది. లేక యపరిపక్వమైనదియై యుండు నని యధ్యాత్మశాస్త్రముయొక్క సిద్ధాంతము. కాన జ్ఞానమనగా: బుద్ధిచే నాయావిషయముల నెఱుంగుట యనఁదగదు. మానము, దంభము, వదలిపోవుట, అహింస, అనాసక్తి, సమబుద్ధి మొదలగు పై నియైదుశ్లోకములయందు చెప్పఁబడిన యిరువదిగుణములును మనుజునియొక్క శరీరమునందు కాన్పించు నేని యది జ్ఞాన మని చెప్పవలయు నని జ్ఞానముయొక్క వ్యాఖ్యానము పైశ్లోకములయందు చేయఁబడినది. (గీతార. ప్ర. ౯. పు.౨౩౭. మఱియు ౨౩౯ చూడుడు) పదియవ శ్లోకమునందు,వివిక్త ప్రదేశమునం దుండుట, మఱియు చతుష్పథములు గుచింపకఁబోవుట యని జ్ఞానమునకు,చెప్పినలక్షణములనుబట్టి సన్న్యాసమార్గమే గీతలో నుద్దేశింపఁబడినదని, సమర్థించుట కనేకులు ప్రయత్నించుచున్నారు; కాని యీమతము సత్యము కాదు. ఈఅర్థమున నర్థముసైతము చేయుట యుక్తమైనదికాదని పూర్వమునందే నేను చెప్పియున్నాను (గీ. ౧౨.౧౯ పై

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే,
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే. ౧౨
సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్,
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి. ౧౩
సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ. ౧౪

[టిప్పణిని, గీతారహస్యము ప్ర. ౯వ చూడుము) జ్ఞానమనఁగా నేమియో యింతవఱకిచ్చో విచారించినాము. అజ్ఞానము అనఁగా: దారాపుత్రాదులు లేక లోకులయొక్క చతుష్పథములు వనువానియందు దనాసక్తి యనువిషయమై, యేవివాదమును లేదు. ఈజ్ఞానము గల్గినపిదప నీయనాసక్తబుద్ధి చేతనే దారాపుత్రాదులవిషయమున నట్లు ప్రవర్తింపవలయును ననిగాని, లేక గృహమునందుండి సర్వభూతహితార్థమై జగత్తుయొక్క వ్యవహారము నాచరింపవలయునా? వలదా? యనిగాని ప్రశ్న బయలువెడలును. కేవలము జ్ఞానముయొక్క వ్యాఖ్యానముచేతనే దానిసిద్ధాంతము సుచేయుట న్యాయము కాదు. కారణ మేమన: భగవద్గీతయందే భగవంతుఁడు పలుతావులలో జ్ఞాని కర్మలయందు లంపటుఁడుగాక యనసక్తబుద్ధితో నాకర్మలనే లోకసంగ్రహార్థము చేయవలయు నని చెప్పి, దానిసిద్ధికో ఱకు జనకునియొక్కయు తనయొక్కయు నాచరణరూప మగుదృష్టాంతము నిచ్చెను. (గీ. ౩. ౧౯-౨౪; ౪. ౧౪) పట్టణములయం దుండుట యిష్టము కాకపోయినను జగత్తుయొక్క వ్యవహారము కేవలము కర్తవ్య మనియెట్లు చేయుదురో సమర్థరామదాసుగారిచరిత్రవల్ల స్పష్టమగును. (దాసబోధ ౧౯. ౬. ౨౯ మఱియు ౧౯. ౯. ౧౧ చూడుము.) ఇది జ్ఞానముయొక్క లక్షణము. ఇప్పుడు జ్ఞేయముయొక్క స్వరూపమును చెప్పుచున్నాఁడు.—]

(౧౨) (ఇప్పుడు) దేని నెఱింగిన నమృతము (మోక్షము) లభించుచున్నదో దానిని (నీకు) చెప్పుచున్నాను. అది యనాది (అన్నింటికి) పరముగనున్న బ్రహ్మ యగును. అది సత్తని చెప్పుటకుగాని యసత్తని చెప్పుటకుగాని సాధ్యముగాదు. (౧౩) దానికి నన్నివైపులను హస్తపాదము లున్నవి; అన్నివైపులను నేత్రములును, శిరస్సులును, ముఖములును కలవు. అన్నివైపులను శ్రోత్రములుగలవు. అదియే యీలోకమునం దంతటను వ్యాపించియున్నది. (౧౪) (జ్ఞానయందు సర్వేంద్రి

బహి రంతశ్చ భూతానా మచరం చరమేవ చ,
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్. ౧౫
అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్,
భూతభర్తృ చ యజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. ౧౬
జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య ధిష్ఠితమ్. ౧౭

యములసంబంధ మయిన గుణములయొక్క యాభాసము కలదు. అయినను దానికి నేయింద్రియమును లేదు. అది యసక్తమయినది. వేఱుగ నుండియును, సమస్తమును ధరించును. నిర్గుణముగ నుండియు గుణముల ననుభవించును. (౧౫) అది సర్వభూతములయొక్క లోపలను, వెలుపలను నుండును. అచరమును చరమును నైనది. సూక్ష్మమగుటచే నవిజ్ఞేయ మైనది. దూరమం దున్నను సమీపమునందె యుండును. (౧౬) (తత్త్వతః) అది నిజముగ నవిభక్తమైనది. అఖండమయినది. (అయినను) సర్వభూతములయందును నానాత్వముచే వేఱువేఱైన దానివలె నున్నది. మఱియు సర్వభూతములను ధరించును. సంహరించును. ఉత్పన్నముచేయునదియును నద్దియె యనియెఱుంగవలయును. (౧౭) దానినే తేజస్సులకు తేజస్సనియు, అంధకారమునకు పరముగనున్న దనియుఁ జెప్పుచున్నారు. జ్ఞానమును తెలిసికొనదగినదియు (జ్ఞేయము) జ్ఞానగమ్యమును, అనఁగా: జ్ఞానముచేతనే తెలియునదియును నదియే యగుటచే నందఱిహృదయములయందును నదియే యధిష్ఠించియున్నది.

[అచింత్యము, నక్షరము నగుపరబ్రహ్మముయొక్క (అనఁగా: దేనిని క్షేత్రజ్ఞుఁ డని, పరమాత్మ యని చెప్పుచున్నారో (గీ. ౧౩. ౨౨) దానియొక్కయే) వర్ణనము పదునెనిమిదియవ యధ్యాయమునం దున్న అక్షరమగుబ్రహ్మయొక్కవర్ణనమువలె (గీ. ౮. ౯-౧౧) నుపనిషత్తులయొక్క యాధారముచే చేయఁబడినది. పదమూఁడవ శ్లోక మంతయు (శ్వే. ౩. ౧౬) మఱియు "సర్వేంద్రియ సంబంధము లయినగుణములయొక్క యాభాస కల్గినది. అయ్యును సర్వేంద్రియవిరహిత మయినది. అను మొందుశ్లోకము యొక్క పూర్వార్థమును శ్వేతాశ్వతరోపనిషత్తునందలి శబ్దములతోనే యున్నది. (శ్వే. ౩. ౧౭), మఱియు "దూరమునం దున్నదయినను సమీపమునం దున్నదే" యనుశబ్దము లీశావాస్యయందును (౫) ముండకోపనిషత్తు

నందును (౩. ౧౮) స్పష్టముగ కాన్పించుచున్నది. అటులే తేజస్సులక "తేజస్సు" అనుశబ్దములు బృహదారణ్యకమునందును (బృ. ౪. ౪. ౧౬) "అంధకారముకంటె పరమైనది" అనుశబ్దములు శ్వేతాశ్వతరమునందును (౩. ౮) నున్నవి. "ఏదిసత్, మఱియు నసత్ అని చెప్పుటకు సాధ్యము కాదో" అనునది ఋగ్వేదమునందు "నాసదాసీత్ నోసదాసీత్" అను ప్రసిద్ధ మగు బ్రహ్మపరసూక్తమును, (ఋ. ౧౦. ౧౨౯) అనుసరించియే యున్నది. సదసచ్ఛబ్దముల యర్థమును గుఱించినవిచారమును గీతారహస్య ప్ర. ౯. పుట. ౩౩౩. మఱియు. ౩౩౪. వీనియందు సవిస్తరముగను గీతా. ౯. ౧౯ శ్లోకము పైటీకయందును నిరూపింపఁబడినది. గీతా. ౯. ౧౯. లోసత్తును, నసత్తును నేనే" యని చెప్పఁబడినందున, సత్యముగు బ్రహ్మ సత్ కాదనియు, విరుద్ధముగ వర్ణింపఁబడినట్లు తోఁచుచున్నది. కాని నిజముగఁ జూచిన నీవిరోధము సత్యమయినది, కాదు. కారణ మేమన: "వ్యక్తమును (క్షర) అవ్యక్తమును(అక్షర)నగు సృష్టులు పరమేశ్వరునియొక్క స్వరూపములే యైనను సత్యమగుపరమేశ్వరతత్త్వ మీరెండింటికంటె పరముగ నున్నది. అనఁగా: పూర్ణముగ తెలిసికొనుటకు సాధ్యముకాదు" అనుసిద్ధాంతము పూర్వమునందు "భూతభృన్నచభూతస్థః" (గీ. ౯. ౫) అను గీతాశ్లోకమునందును పిదప (౧౫, ౧౬, ౧౭) పురుషోత్తమలక్షణములయందును స్పష్టముగఁ జెప్పఁబడినది. అది యట్లుండనిమ్ము; ఏది నిర్గుణబ్రహ్మ యని చెప్పుదు రనియు, నది జగత్తులో నున్నదయినను జగత్తుకంటె పరము నెట్లున్నదనియు, లేక యది విభక్తముగ, నఁగా: నానారూపాత్మకముగ కాన్పించినను మొదట యవిభక్తము(ఒకటె) ఎట్లుయినదనియు మొదలగు ప్రశ్నలు గీతారహస్యమునందలి తొమ్మిదవ ప్రకరణమునందు పుట-౨౦౫ మొదలు విచారింపఁబడినది. అదియును మిచ్చోఁ జెప్పఁబడెను. ౧౬వ శ్లోమున "విభక్తముగనున్నదానివలె కాన్పించుచున్నది" అనునది "విభక్తమివ" యనుదానికి భాషాంతరము. ఈ ఇవ శబ్ద మీయర్థమునం యన్నఁగా: జగత్తునందున్న నానాత్వము భ్రాంతిమూలక మయినదనియు ఏకత్వమే సత్యమైన దనియు ననుయర్థమునవే యుపనిషత్తులలో ననేకస్థములయందు ప్రయోగింపఁబడినది. ఉదాహరణము. "ద్వైతమివ భవతి", "య ఇహ నానేవపశ్యతి" మొదలగువాక్యములఁ జూడుము(బృ. ౨. ౪. ౧౪ ౪. ౪. ౧౯; ౪. ౩. ౭). కావున నానానామరూపాత్మక మగుమాయ, భ్ర

§§ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః,
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే. ౧౮

యనియు దానియం దవిభక్తముగ నున్న బ్రహ్మమాత్రమే సత్యమైనది యనియు నద్వైతసిద్ధాంతమే గీతలయందు ప్రతిపాదింపఁబడియున్న దని స్పష్టముగఁ గాన్పించుచున్నది. 'అవిభక్తం విభక్తేషు' అనఁగా: నానాత్వము నందు నేకత్వమును చూచుట యనునది సాత్త్వికమైనజ్ఞానముయొక్క లక్షణ మని గీ. ౧౮. ౨౦లో మరల చెప్పఁబడినది. "ఈసాత్త్వికజ్ఞానమే బ్రహ్మము," అనునది మొదలుగాగలవిచారము గీతారహస్యమునందలి యధ్యాత్మప్రకరణమునందు చేయఁబడినది. (గీతార. ప్ర. ౯. పు. ౨౯౦, ౨౯౧, ౨౯౨ మఱియు ప్ర. ౬. ౧౪౬, ౧౪౪, ౧౪౮ చూడుము.)—]

(౧౮) ఈరీతిగ క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయమును నేదియో సంక్షిప్తముగఁ జెప్పఁబడినవి. వీనిని తెలిసికొను నేని నాయొక్క భక్తుఁడు నాస్వరూపమును బొందుచున్నాఁడు.

[అధ్యాత్మ (లేక వేదాంత) శాస్త్రముయొక్క యాధారముచే నింతవఱకును క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయమును విచారింపఁబడినది. వీనిలో జ్ఞేయమనఁగనే క్షేత్రజ్ఞుఁడు లేక పరబ్రహ్మమనియు, జ్ఞాన మనఁగా రెండవ శ్లోకమునందు చెప్పఁబడిన క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞాన మనియును నర్థ మగుటచే పరమేశ్వరునియొక్క జ్ఞానమంతయు నిరూపింపఁబడినది. క్షేత్రక్షేత్రజ్ఞ విచారమన: పరమేశ్వరునియొక్క జ్ఞాన మగుటచే దానియొక్క ఫలము మోక్ష మయ్యేయుండవలయు నని పిమ్మట యర్థమునసుండి సిద్ధమగుచున్నది. మఱియు నాసిద్ధాంతమే (౧౮వ) పదునెనిమిదవ శ్లోకమునందు చెప్పఁబడినది. వేదాంతశాస్త్రమునందలి క్షేత్రక్షేత్రజ్ఞవిచారము ముగిసినది. కాని ప్రకృతినుండియే పాంచభౌతికమైనసవికార మగు క్షేత్రముత్పన్న మగుటచేతను, సాంఖ్యులు పురుషుఁ డని చెప్పువాని నధ్యాత్మశాస్త్రమునం దాత్మ యని పేర్కొనుటచేతను క్షేత్రక్షేత్రజ్ఞవిచార మనఁగనే సాంఖ్యదృష్టిచే ప్రకృతిపురుషవివేకమై యున్నది. సాంఖ్యులవలె ప్రకృతియును పురుషుఁడు నను నీరెండుతత్త్వములును గీతాశాస్త్రమునందు స్వతంత్రముగ నంగీకరింపఁబడలేదు. ఈరెండును నొకపరమేశ్వరునియొక్కయే కనిష్ఠము, శ్రేష్ఠము నగురూపము లని యేడవ యధ్యాయము

§§ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౧౯
కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే,
పురుషఃసుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే. ౨౦

నందుఁ జెప్పఁబడినది. (౭ ౪,౫) కాని సాంఖ్యులయొక్క ద్వైతమునకు ప్రతినిధిగ గీతాశాస్త్రమునందలి యీయద్వైత మొకపర్యాయ మంగీకరింపఁబడిన పిమ్మట ప్రకృతిపురుషులను సంబంధించిన సాంఖ్యులయొక్క జ్ఞానము గీతలకును సమ్మతముకాదు. వేయేల? క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానమునకే ప్రకృతిపురుష వివేక మనునది రూపాంతరముగ నున్నదని చెప్పినను చెప్పవచ్చును. (గీతార. ప్ర.౭ చూడుఁడు) కాన నింతవఱకును నుపనిషత్తులయాధారమునఁ జెప్పఁబడిన క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానమునే సాంఖ్యులయొక్క పరిభాషానుసారముగఁ జెప్పుచు సాంఖ్యులయొక్క ద్వైతము నంగీకరింపక ప్రకృతిపురుషవివేక మనురూపాంతరముచే చెప్పుట కారంభించుచున్నాఁడు.—]

(౧౯) ప్రకృతి పురుషుఁడు అను నీరెండును అనాదు లని తెలిసికొమ్ము. వికారమును, గుణములు మొదలగున వన్నియు ప్రకృతినుండి యుత్పన్నము లగు నని తెలిసికొనుము.

[సాంఖ్యశాస్త్రానుసారముగ ప్రకృతి, పురుషుఁడు అను నీయిరువురు ననాదులే గాక స్వతంత్రములును, స్వయంభువలును నైయున్నారు. వేదాంతులు ప్రకృతి పరమేశ్వరునం దుండియే యుత్పన్నమైన దనియు, కావుననే స్వయంభువు కాదనియు, స్వతంత్రురాలును కాదనియుఁ జెప్పుదురు. (గీ. ౪. ౫, ౬) కాని "ప్రకృతి పరమేశ్వరునం దుండి యెప్పుడు బయల్పడెను" అనువిషయము చెప్పుటకు సాధ్యము కాకపోయినను పురుషుఁడు (జీవుఁడు) పరమేశ్వరునియొక్క యంశ (గీ. ౧౫. ౭) మగుట చేత, రెండును ననాదు లనిమాత్రము వేదాంతులు సెప్పుదురు. ఈవిషయమై విశేష మగువిచారము (గీతారహస్య ప్ర.౭.విశేషముగ పు.౨౧౬, ౨౧౭–౨౨౩–౨౨౪ మఱియు ప్ర. ౧౦. ౩౫౯–౩౬౪ చేయఁబడినది చూడుఁడు).—]

(౨౦) కార్యమనగ దేహమును, కారణమనగ నింద్రియములును నను నీ రెంటియొక్క కర్తృత్వమునకు ప్రకృతి కారణ మని చెప్పుచున్నారు. మఱియు

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు. ౨౧
§§ ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. ౨౨

కర్త కాకపోయినను, సుఖదుఃఖముల ననుభవించుటకు పురుషుఁడు (క్షేత్రజ్ఞుఁడు) కారణమని చెప్పఁబడుచున్నాఁడు.

[ఈశ్లోకమునందు కార్యకరణ యనుదానికి మారుగ కార్యకారణ యనియును పాఠముగలదు. సాంఖ్యులయొక్క మహత్తత్త్వము మొదలుగ గలయిరువదిమూఁడుతత్త్వములును నొకదానియందుండి యొకటి యిట్టి కార్యకారణక్రమముచేత నుత్పన్నము లయినందున వ్యక్తసృష్టియంతయు ప్రకృతియందుండి బయలువెడలుచున్నదని దానికర్థము. ఈయర్థ మేమియు నసంగతమయినదికాదు. అయినను క్షేత్రజ్ఞవిచారమునందు క్షేత్రముయొక్క యుత్పత్తి విచారము ప్రస్తుతమున కాదు. జగత్తు ప్రకృతినుండి యెట్లు బయలుదేరినదియు పూర్వమునందు ౭-౯ యధ్యాయములయందు వర్ణింపఁబడినది. కాన కార్యకరణ యనుపాఠమే యిచ్చో ప్రశస్తమైనది. శాంకరభాష్యమునందు కార్యకరణయనుపాఠమే స్వీకరింపఁబడినది.—]

(౨౧) కారణ మేమియన: ప్రకృతియందు పురుషుఁ డధిష్ఠితుఁడైనచో ప్రకృతియొక్క గుణముల నతఁ డుపభోగించును. ప్రకృతిసంబంధమైన యాగుణములయొక్క యీసంయోగము మంచియోనులయందుగాని చెడుయోనులయందుగాని పురుషుఁడు జన్మించుటకు కారణ మగుచున్నది.

[ప్రకృతియొక్కయు పురుషునియొక్కయు పరస్పరసంబంధమును గుఱించియు, భేదమునుగుఱించియు సాంఖ్యశాస్త్రమునందు చెప్పఁబడినది. (గీతార. పు. ౨౦౭-౨౧౫ చూడు) వారిలో పురుషునే వేదాంతులు పరమాత్మ యనిచెప్పుదు రని, సాంఖ్యవేదాంతములకు పరస్పరసంబంధమును జెప్పుదురు. అట్లు చెప్పుదుమేని ప్రకృతి పురుషవిచారమునకును క్షేత్రక్షేత్రజ్ఞవిచారమునకును పూర్ణమగు నేకవాక్యతగల్గును.—]

(౨౨) ప్రకృతియొక్క గుణములకు) ఉపద్రష్ట (అనఁగా: దగ్గఱ నుండి చూచువాఁడు,) అనుమోదించువాఁడు, భర్త, (అనఁగా: ప్రకృతిగుణములకు

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. ౨౩
ధ్యానేనాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. ౨౪

వృద్ధిపొందించువాఁడు) మఱియు సుఖభోగించువాఁడు. ఇట్టివానినే యీ దేహమునం దున్న పురుషుఁడనియు, పరమేశ్వరుఁడనియు, పరమాత్మయనియు చెప్పుచున్నారు. (౨౩) పురుషుఁడు (నిర్గుణుఁడును) ప్రకృతి గుణములుగలదియును నని తెలిసికొనినవాఁ డెట్లు ప్రవర్తించుచున్నను నతనికి తిరిగి జన్మ కలుగదు.

[పురుషుఁ డన దేహమందున్న పరమాత్మ యని ౨౨వ శ్లోకమునందు సిద్ధాంతము చేయఁబడినది. పదపడి సాంఖ్యశాస్త్రానుసారముగ పురుషున కున్న యుదాసీనత్వమును, నకర్తృత్వమును, నాత్మయొక్క యకర్తృత్వ మగుచున్నది. మఱియు సాంఖ్యులయొక్క యుపపత్తికి వేదాంతముతో నేకవాక్యత గల్గుచున్నది. సాంఖ్యులు వేదాంతులకు శత్రువులని యనేకులగు వేదాంతగ్రంథకర్తలు తలచి సాంఖ్యులయొక్క యుపపత్తి బొత్తిగ త్యాజ్యమనుచున్నారు. కాని గీతలయం దట్లు చెప్పలేదు. క్షేత్రక్షేత్రజ్ఞవిచారమునం దొకవిషయమే యొకప్పుడు వేదాంతదృష్టిచేతను మఱియొకప్పుడు (వేదాంతుల యద్వైతమతమును విడిచివేయక) సాంఖ్యదృష్టిచేతను ప్రతిపాదింపఁబడినది. ఇందువలన గీతాశాస్త్రముయొక్క సముబుద్ధి వ్యక్తమగుచున్నది. వేయేల ? ఉపనిషత్తులయందును గీతలయందును నున్న వివేచనములో నిది యొక గొప్పభేద మని చెప్పవచ్చును. (గీ. ర. పరిశిష్ట. పుట. ౭౨౩ చూడుము) సాంఖ్యులయొక్క ద్వైతవాదము గీతలకు సమ్మతము కాకపోయినను సాంఖ్యులయొక్క ప్రతిపాదనమునం దున్న సయుక్తిక మగు విషయ మంతయును గీతలకు సమ్మతమే యని దీనింబట్టి స్పష్టమగుచున్నది. క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క జ్ఞానమనగనే పరమేశ్వరునియొక్క జ్ఞాన మని రెండవ శ్లోకమునందు చెప్పఁబడినది. పిండమందును, జగత్తునందును నున్న పరమేశ్వరునియొక్క జ్ఞానమును సంపాదించి మోక్షమును సంపాదించుకొనుటకు మార్గ మేదియో ప్రసంగిమిసుబట్టి సంక్షేపముగఁ జెప్పుచున్నాఁడు—.]

(౨౪) కొందఱు స్వయముగనే తనయందు ధ్యానముచే నాత్మను చూచుచున్నారు. కొందఱు సాంఖ్యయోగముచేతను, కొందఱు కర్మయోగముచేతను

అన్యే త్వేవమజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. ౨౫

§§ యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజంగమమ్,
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్తద్విద్ధి భరతర్షభ.. ౨౬

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్,
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి సపశ్యతి. ౨౭

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్,
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్. ౨౮

చూచుచున్నారు; (౨౫) కాని యిట్లు స్వయముగ జ్ఞానము కలుగనివా రితరుల యుపదేశమును విని (శ్రద్ధతో పరమేశ్వరుని) భజించుచున్నారు. విన్నవిషయమును ప్రమాణ మని యంగీకరించి యాచరించు పురుషులును మృత్యువు నతిక్రమించుచున్నారు.

[పాతంజలయోగానుసారముగ ధ్యానము, సాంఖ్యమార్గానుసారముగ జ్ఞానము గల్గినపిదప కర్మసన్న్యాసమును, కర్మయోగమార్గము ననుసరించి నిష్కామబుద్ధితో పరమేశ్వరార్పణపూర్వకము కర్మలను చేయుటయును, జ్ఞానము లేకపోయినను శ్రద్ధతో నాప్తవాక్యముల విశ్వసించి పరమేశ్వరుని భజించుటయు (గీ. ౪. ౩౯) నను నాత్మజ్ఞానముయొక్క వెవ్వేఱగు మార్గము లీరెండుశ్లోకములయందును చెప్పఁబడినవి. ఏమార్గము నవలంబించినను చివఱకు భగవంతునియొక్క జ్ఞానము గల్గి మోక్షము సిద్ధించును. అయినను లోకసంగ్రహదృష్టిచే కర్మయోగము శ్రేష్ఠమని పూర్వమందు చేయఁబడిన సిద్ధాంతము దీనిచే బాధితముకాదు. ఇట్లు సాధనములఁ జెప్పినపిదప మొత్తముపై నున్నవిషయములను సామాన్యముగ ముందు శ్లోకమునందుపసంహరించినందున దానియందును, కాపిలసాంఖ్యమునకు వేదాంతశాస్త్రముతో సంబంధము గలుగజేయఁబడినది.—]

(౨౬) ఓభరతశ్రేష్ఠా ! స్థావరజంగమరూపమైన యేవస్తువైనను, క్షేత్రజ్ఞులయొక్క సంయోగమువలననే బుట్టు నని యెఱుంగుము (౨౭) సర్వభూతముల యందును సమానముగనే యుండునదియు సర్వభూతములు నశించినను నశించనదియు నగు పరమేశ్వర స్వరూపమును చూచినవారు నిజముగు తత్త్వము నెఱింగినవా రని చెప్పవలయు (౨౮) ఈశ్వరుఁడు సర్వత్ర సమానముగనే యున్నాఁడని తెలిసి

§§ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి. ౨౯
యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి,
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా. ౩౦
§§ అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయమవ్యయః,
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే. ౩౧
యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే. ౩౨

కొని యెవఁడు తనకుతాను కొల చేసికొనఁడో (అనఁగా : తాను తనంతటనే మంచి మార్గములోఁ బ్రవేశించుచున్నాఁడో) యతఁడు దానినుండి యుత్తమగతిని పొందుచున్నాఁడు.

[౨౭వ శ్లోకమునందు చెప్పఁబడిన పరమేశ్వరుని లక్షణములు వెనుక గీ. ౮–౨౦ శ్లోకమున చెప్పఁబడినవి. అది గీతారహస్యమునందలి తొమ్మిదవ ప్రకరణమున స్పష్టీకరింపఁబడినది. (గీతార. పు. ౨౯౬, ౨౯౭, మఱియు ౩౪౦ చూడుము) అటులె యాత్మ యనునది తనకు బంధువనియు, తనకు శత్రువనియు వెనుక (గీ. ౬. ౫–౬) చెప్పఁబడిన యర్థమే ౨౮వ శ్లోకమునందును మరలఁ జెప్పఁబడినది. ౨౬. ౨౭. ౨౮వ శ్లోకములయందు, సర్వభూతములయందును నుండు సామ్యబుద్ధి నిట్లు చెప్పిన పిదప దీనిని తెలిసికొనిన యేమియగునో చెప్పుచున్నాఁడు.—]

(౨౯) సర్వకర్మలును సర్వవిధములచేతను ప్రకృతిచేతనే చేయఁబడుచున్న వనియు నాత్మ యకర్తయనియు (అనఁగా : దేనిని చేయుదనియు) నెఱింగినవాఁడు నిజమగు తత్త్వమును తెలిసికొనె నని చెప్పవలయును. (౩౦) ఎప్పుడు సర్వభూతములయందును, నున్న పృథక్త్వము (అనఁగా : నానాత్వము) ఏకముగ కాన్పించునో, మఱియు నీయేకత్వమునుండియే సర్వమును విస్తృతమయినది యని కాన్పించునో యప్పుడు బ్రహ్మప్రాప్తమగును.

[ఆత్మ నిర్గుణమును, నలిప్తమును, నక్రియమును నెటులగునో యిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౩౧) ఓకౌంతేయా ! అనాదియు నిర్గుణము నగుటచే నీయవ్యయ మగుపరమాత్మ శరీరమందుండినను దేనిని చేయనేరదు. మఱియు దానికి (ఏకర్మయొక్కయు) లేప (సంబంధము) ముండదు. (౩౨) ఇటు లాకాశముపలె నలుగడల వ్యాపించి

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి. భారత. 33
క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమంతరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్. 34

సూక్ష్మమై యుండుటచే దానికి (దేనియొక్కయు) సంబంధ ముండనేరదు. అటులే యాత్మ దేహమందంతట నుండునది యగుటచే దానికి (దేనియొక్కయు) లేపము తగులదు. (33) ఓ భారతా! ఏతీరున నొక్కడగు సూర్యుడు జగత్తునంతను ప్రకాశింపజేయుచున్నాడో యటులనే క్షేత్రజ్ఞుడు క్షేత్రముల నన్నింటిని (అనగా: శరీరములను) ప్రకాశింపజేయుచున్నాడు.

(34) ఇట్లు జ్ఞాననేత్రములచే క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క భేదమును, సర్వ భూతములకును (మూలభూతమగు) ప్రకృతియొక్క మోక్షమును తెలిసికొన్న వారు పరబ్రహ్మము నొందుచున్నారు.

[మొత్తమున పైప్రకరణములకన్నింటికి నిది యుపసంహారము. భూత ప్రకృతి మోక్షశబ్దమునకు సాంఖ్యశాస్త్రసిద్ధాంతానుసారముగనే నర్థము చేసినాను. మోక్షము లభించుట, లభింపకపోవుట యనునివి యాత్మ యొక్క యవస్థలు కావు; కారణ మేమన: నది నియతముగ నకర్తయు, నసంగము నయియున్నది. కాని ప్రకృతిగుణముల సంబంధముచే తనయందు కర్తృత్వము నారోపించుకొనుచుండును. ఈయజ్ఞానము నశించినచో దానితో సంయుక్తమగు ప్రకృతి వదలిపోవును. అనగా: దానికే మోక్షము గల్గును. పిదప నది పురుషునియెదుట నాట్యముచేయుట మానివేయు నని సాంఖ్యులయొక్క సిద్ధాంతము. కాన బంధమోక్షము లను నీ రెండవస్థలును తాత్త్వికదృష్టిచే ప్రకృతివే యని సాంఖ్యులు ప్రతిపాదించుచున్నారు. (సాంఖ్యకారిక ౬౨. మఱియు గీతారహస్య ప్ర. ౭. పు. ౨౨౦, ౨౨౧ చూడు) ఈసాంఖ్యసిద్ధాంతము ననుసరించియే "ప్రకృతియొక్క మోక్షము అనుశబ్దము లీశ్లోకమునందు ప్రయోగింపబడినవి యని నాకు దోచు చున్నది. కాని యనేకులు "భూతేభ్యః ప్రకృతేశ్చ మోక్షః" అను, పంచ మహాభూతములనుండియు, అనగా: మాయాత్మకము లగుకర్మలనుండియు నాత్మకు మోక్షము కలుగుననియు నీశబ్దముల కర్థమును చెప్పుచున్నారు. అది యట్లుండనిమ్ము; ఇది క్షేత్రక్షేత్రజ్ఞ వివేక మనుజ్ఞానచక్షుస్సుచే

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః. ౧౩.

: తెలియునది (గీ. ౧౩. ౩౪). కాని తొమ్మిదవ యధ్యాయమునం దున్న రాజ విద్య ప్రత్యక్షము (చర్మచక్షుస్సుచే తెలియునది) గీ. ౯. ౨, విశ్వరూప దర్శనము పరమభగవద్భక్తులకును, కేవలము దివ్యచక్షుస్సుచేతనే తెలియఁ దగినది (గీ. ౧౧-౮) ఇది తొమ్మిది, పదునొకండు, పదమూఁడవ యధ్యాయములయం దున్న జ్ఞానవిజ్ఞాన నిరూపణమందలి భేద మని తెలిసికొన వలయును.—]

ఈరీతిగ భగవంతునిచే గానము చేయఁబడిన ప్రకృతి పురుషవివేకము అనగ క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగ మను పేరుగలిగిన పదమూఁడవ యధ్యాయము సమాప్తమయినది.



# చతుర్దశోఽధ్యాయః.

## పదునాల్గవ యధ్యాయము.

శ్రీభగవానువాచ.

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్,
యజ్జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధిమితో గతాః. 1
ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః,

[పదమూఁడవ యధ్యాయమునందు క్షేత్రక్షేత్రజ్ఞ విచార మొకపర్యాయము వేదాంతదృష్టితోను, నొకపర్యాయము సాంఖ్యదృష్టితోను చెప్పఁబడిన దనియు నిజగత్తున కంతకును ప్రకృతియే కర్త యనియు పురుషుఁ (క్షేత్రజ్ఞుఁడు) డుదాసీనుఁ డనియు ప్రతిపాదింపఁబడినది. కాని ప్రకృతియొక్క యీ కర్తృత్వ మేవిధమున బ్రవర్తింపుచున్నదియు నిప్పటికిని విచారింపఁబడలేదు. కావున నొక ప్రకృతియం దుండియే నానావిధ సృష్టియు ముఖ్యముగ సజీవ సృష్టియు నెట్లుగలుగునదియు నీయధ్యాయమున నిరూపింపఁబడుచున్నది. మానవ సృష్టిని మాత్రమే విచారించితిమేని యీవిషయము క్షేత్రమును సంబంధించినది (అనఁగా : శరీరమును సంబంధించినది) యనుటచే, నది క్షేత్రక్షేత్రజ్ఞవిచారమునందు చేరవచ్చును. కాని స్థావరసృష్టిసైతము త్రిగుణాత్మక మగు ప్రకృతియొక్క వ్యాప్తియే గాన నీప్రకృతిసంబంధములగు నాభేదములయొక్క వివేచనమే క్షరాక్షరవిచారముయొక్కయు భాగము కావచ్చును. కాన క్షేత్రక్షేత్రజ్ఞ విచారమును క్లిష్ట మగునామమును వదలి యేడవయధ్యాయమునందు చెప్ప నారంభింపఁబడిన జ్ఞానవిజ్ఞానములే యిప్పుడు నీకు మిగుల స్పష్టముగ చెప్పఁబడుచున్న వని యీయధ్యాయారంభమునందు భగవంతుఁ డారంభించెను. సాంఖ్యశాస్త్రము ననుసరించి యీవిషయము సవిస్తరముగ గీతారహస్యమునందలి యెనిమిదవ ప్రకరణమునందు నిరూపింపఁబడినది. త్రిగుణములయొక్క వ్యాప్తి, యనుగీతలయందును, మనుస్మృతియందల్లి పండ్రెండవ యధ్యాయమునందును వర్ణింపఁబడినది.—]

శ్రీకృష్ణభగవానుఁడు చెప్పుచున్నాఁడు.—(1) మఱియును జ్ఞానములలో నుత్తమ మగుజ్ఞానము నిప్పుడు నీకు మరలఁ జెప్పుచున్నాను. దేనిని తెలిసికొనుటచే

సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ. ౨
§§ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్,
సంభవః సర్వభూతానాం తతో భవతి భారత. ౩
సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః,
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా. ౪
§§ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః,
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్. ౫
తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ. ౬
రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్,

మును లందఱు నీలోకమునం దుత్కృష్టమయిన సిద్ధి నొందిరో (౧) (దానిని) ఈ జ్ఞానము నాశ్రయించి నాయొక్క సారూప్యము నొందినవారు సృష్టియొక్క యుత్పత్తికాలమునందుసైతము జన్మించరు. ప్రళయకాలమునందుసైతము వ్యథ నొందరు. (అనఁగా: జననమరణములనుండి యన్నివిధములచేతను విముక్తులగుదురు.)

[ఇది ప్రస్తావన. ఇప్పుడు ప్రకృతి నాయొక్క స్వరూపమే యని తొలుత చెప్పి సాంఖ్యులయొక్క ద్వైతమును త్రోసివైచినపిదప ప్రకృతి యొక్క గుణములగు సత్త్వరజస్తమస్సులచే సృష్టియం దున్న నానావిధము లగు వ్యక్తపదార్థము లెట్లు సృజింపఁబడినవనియు వేదాంతశాస్త్రమునకు విరోధము గాకుండు నటుల నిరూపించుచున్నాఁడు.—]

(౩) ఓభారతా! మహద్బ్రహ్మ (అనఁగా: ప్రకృతియనునది) నాకు యోనియై యున్నది. నేను దానియందు గర్భము నుంచుచున్నాను. అనంతరము దానియందుండి సర్వభూతములును బుట్టుట కారంభమగును. (౪) ఓకౌంతేయా! (పశుపక్ష్యాది) సర్వయోనులయందును బుట్టుచున్న దేహముల యన్నింటికి నామహద్బ్రహ్మయే యోనియై యున్నది. నేను బీజదాతనగు తండ్రిని. (౫) ఓమహాబాహువా! ప్రకృతినుండి యుత్పన్నములైన సత్త్వరజస్తమోగుణములు దేహమందున్న యవ్యయమగు (అనఁగా: నిర్వికారమగు) నాత్మను దేహమునందు బంధించివేయుచున్నది. (౬) ఓపాపరహితుఁడవగు నర్జునుఁడా! వీనిలో నిర్మలమయినదియు, ప్రకాశింపఁజేయునదియు, నేదోషమును లేనిదియు నగుసత్త్వగుణము సుఖముయొక్కయు, జ్ఞానముయొక్కయు సంగమముచే ప్రాణులను బంధింపుచున్నది.

తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్. ౭
తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. ౮
సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత,
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత. ౯

(౭) రజోగుణముయొక్క స్వభావ మనురాగస్వరూపమైనదనియు, తృష్ణ చేతను నాసక్తిచేతను బుట్టునదనియు తెలిసికొనుము. ఓ కౌంతేయా! అది ప్రాణులను కర్మసంగముచే (అనఁగా: కర్మ చేయుద మనునూహయొక్క సంగముచేత) బంధించి వేయుచున్నది. (౮) ఓ భారతా! తమోగుణ మజ్ఞానమువలన బుట్టిన దనియు ప్రాణులనన్నింటిని మోహింపఁజేయునదనియు, తెలిసికొనుము. ఇది జ్ఞానము నావరించి ప్రమాదమును కర్తవ్యమూఢతయందు. (అనఁగా: కర్తవ్యమును మఱచిపోవుట యందు) నాసక్తిని గలుగఁజేయుచుండును. (౯) సత్త్వగుణము సుఖమందుఁ బ్రవర్తింపఁజేయునది. రజోగుణము కర్మయందుఁ బ్రవర్తింపఁజేయునది. ఆసక్తిని యుత్పన్నముజేయుచున్నది. తమోగుణము జ్ఞానము నావరించి ప్రమాదకార్యముల యందు ప్రవర్తింపఁజేసి కర్తవ్యమూఢతయందు నాసక్తిని యుత్పన్నముఁ జేయుచుండును.

[సత్త్వరజస్తమోగుణములను వేర్వేఱుగ నిలక్షణములు చెప్పఁబడినవి. కాని యీగుణము లెప్పుడును వేర్వేఱుగ నుండవు. మూఁడు నొక్కచోటనే యుండును. ఉదాహరణము:—ఏ మంచికార్యమైనను చేయుట సత్త్వగుణముయొక్క లక్షణమైనను మంచిపని చేయుటయందు ప్రవృత్తి గల్గుట రజోగుణసంబంధ మగుధర్మము. కావున సాత్త్వికస్వభావమందు సైతము కొంచెమైనను రజోగుణము మిశ్రమై యుండకమానదు. ఇందుచే తమస్సుయొక్క మిధునము (జంట) సత్త్వమనియు, సత్త్వముయొక్క మిధునము రజస్సనియు ననుగీతలయందుఁ జెప్పఁబడినవి. (మ. భా. అశ్వ. ౩౯) వానియొక్క యన్యోన్యాశ్రయముచే లోకమయివున్నియు నొక దానితో నొకటి కలయుటచేత యందున్న పదార్థము లన్నియు పుట్టుచున్న, వని చెప్పఁబడుచున్నది (సాం. కా. ౧౨. గీతార. పృ. ౨౧౧-౨౧౩ చూడుము.) ఈతత్త్వమునే మొదట చెప్పి పిదప సాత్త్వికములైనట్టియు, రాజసములైనట్టియు, తామసములైనట్టియు స్వభావములయొక్క లక్షణములను చెప్పుచున్నాఁడు.—]

§§ రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత,
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా. ౧౦
సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత. ౧౧
లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా,
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ. ౧౨
అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ,
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన. ౧౩
§§ యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. ౧౪
రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే. ౧౫
కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలమ్,

(౧౦) రజస్తమస్సులనణచి సత్త్వము విజృంభించును. (అప్పుడు దానిని సాత్త్వికమని చెప్పవలయును); అట్లే సత్త్వతమస్సులనణచి రజస్సును, సత్త్వరజస్సుల నణచి తమస్సును, విజృంభించును. (హెచ్చుచున్నవి). (౧౧) ఈ దేహము నందలి ద్వారములన్నింటియందును (ఇంద్రియములయందు) ప్రకాశమానమగు (నిర్మలమగు) జ్ఞాన ముత్పన్నమైనపుడు సత్త్వగుణము వృద్ధిపొందిన దని తెలిసికొనవలయును. (౧౨) ఓభరతశ్రేష్ఠుండా! రజోగుణము వృద్ధిపొందునేని లోభమును,కర్మలయందు ప్రవృత్తియు వానియారంభమును అతృప్తియు నిచ్ఛయు గలుగును. (౧౩) ఓకురునందనా! తమోగుణము వృద్ధినొందునేని యంధకారమును, ఏమియుచేయక పోవలయునన్నకోరికయు కర్తవ్యమును మఱచుటయును, మోహమును బుట్టును.

[మనుజుండు ప్రతికియందు త్రిగుణములవలన వానిస్వభావమునందు గల్గుభేదము చెప్పబడినది. ఇప్పుడీమూండు తెగల గుణములును గలమనుజులకు లభించు గతిని చెప్పుచున్నాడు.—]

(౧౪) సత్త్వగుణము వృద్ధిం బొందినపుడు ప్రాణి మరణించినచో, నుత్తమ మగుతత్త్వమును దెలిసినవారియొక్క (అనంగా: దేవతలు మొదలగువారియొక్క) నిర్మలములగు (స్వర్గాది) లోకములను పొందును. (౧౫) రజోగుణము ప్రబల

రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. ౧౬
సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ. ౧౭
ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః. ౧౮

మైనప్పుడు మృతిజెందినచో నేని కర్మలయం దాసక్తమైన (జనులయందు) జన్మమెత్తును. తమోగుణము ప్రబలమైనప్పుడు మృతిఁజెందినచో నేని (పశుపక్ష్యాది) మూఢయోనుల యందు జన్మించును. (౧౬) పుణ్యకర్మకు నిర్మలమును, సాత్త్వికము నగుఫలము గల్గు ననియు రాజసకర్మకు దుఃఖఫలమనియు తామసకర్మ కజ్ఞానము ఫలమనియు చెప్పబడినది. (౧౭) సత్త్వమువలన జ్ఞానమును, రజోగుణమువలన కేవలము లోభ మును, బుట్టును. తమోగుణమువలన ప్రమాదమును, మోహమును మాత్రమేగాక యజ్ఞానముసైతము బుట్టును. (౧౮) సాత్త్వికు లయినపురుషు లూర్ధ్వగతిని (అనఁగా: స్వర్గాది లోకములను) జెందుదురు. రాజసులు మధ్యమగతిని (అనఁగా: మనుష్యలోకమును) జెందుదురు. కనిష్ఠమైన గుణవృత్తిచే తామసు లధోగతిని జెందుదురు.

[సత్త్వస్థుఁడైనమనుజుఁడు ధార్మికుఁడును పుణ్యకర్మలను చేయువాఁడు నగును కాన నతనికి స్వర్గములభించును. తామసుఁ డధర్మము నాచరించి యధోగతిని జెందుచున్నాఁడని సాంఖ్యకారికలయందు చెప్పఁబడినది (సాం. కా. ౪౪). ఈ పదునెనిమిదవ శ్లోకము అనుగీతలయందలి త్రిగుణ వర్ణనయందును నీయక్షరములతోడనే చెప్పఁబడినది (మ. భా. అశ్వ. ౩౯. ౧౦. మను. ౧౨. ౪౦ చూడు). కాని సాత్త్వికకర్మలచే స్వర్గములభించి నను, స్వర్గసుఖ మనిత్యమగుటచే పరమపురుషార్థము దానివలన సిద్ధింపదు. ఈ పరమపురుషార్థమును, లేక మోక్షమును బొందుటకై యుత్తముఁడగు సాత్త్వికుఁడయియుండుటయే గాక ప్రకృతి వేఱనియును (నేను) పురు షుఁడు వేఱని జ్ఞానముసైతము గలుగవలయు నని సాంఖ్యుల సిద్ధాంతము. దీనినే సాంఖ్యులు త్రిగుణాతీతావస్థ యని చెప్పుదురు. ఈస్థితి సత్త్వము, రజస్సు, తమస్సు అనుమూఁడుగుణములకంటె పరమందుండునదయినను నది సాత్త్వికావస్థయొక్క పరాకాష్ఠయే గాన, దానిని సామాన్యముగ సాత్త్వికవర్గమునందే చేర్చుచున్నారు: కావున త్రిత్వవి యగుసాల్గవయవస్థను

§§ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. ౧౯
గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే. ౨౦

అర్జున ఉవాచ.

§§ కైర్లింగైస్త్రీన్ గుణానేతానతీతో భవతి ప్రభో,
కిమాచారః కథం చైతాంస్త్రీన్ గుణానతివర్తతే. ౨౧

కల్పింపవలసిన యవసరము లేదని గీతారహస్యమునందలి యేడవప్రకరణము కడపట (పు. ౨౨౫) చెప్పఁబడినది. అయినను ప్రకృతియు, పురుషుఁడు నను నీసాంఖ్యులయొక్క ద్వైతము గీతలకు సమ్మతము కానందున, ప్రకృతిపురుషులకు పరమందున్న యాత్మస్వరూపుఁ డగుపరబ్రహ్మను నిర్గుణబ్రహ్మ యని తెలిసికొనినవాఁడే త్రిగుణాతీతుఁ డని చెప్పవలయు నని సాంఖ్యులయొక్క సిద్ధాంతమే గీతయందు మఱియొక విధముఁ జెప్పఁబడినది. ఈయర్థమే వెనుకశ్లోకములయందు వర్ణింపఁబడు చున్నది.—]

(౧౯) ద్రష్టయనఁగా: నౌదాసీన్యముగఁ జూచు పురుషుఁడు. ప్రకృతిగుణములు దక్క మఱియొక కర్తలేఁడని తెలిసికొనినపుడును, త్రిగుణములకంటె పరమందున్న తత్త్వమును తెలిసికొన్నప్పుడును వాఁడు నన్ను బొందుచున్నాఁడు. (౨౦) దేహధారి యగుమనుజుఁడు దేహోత్పత్తికి కారణభూతములయిన నీమూఁడు గుణములను గడచి, జన్మజరామరణములయొక్క దుఃఖములయందునుండి ముక్తుఁడయి యమృతము.(అనఁగా: మోక్షము) ననుభవించును.

[వేదాంతులు మాయ యనుదానినే సాంఖ్యులు త్రిగుణాత్మక ప్రకృతి యనుచున్నారు. కావున త్రిగుణాతీతుఁడగుట యన, మాయనుండి విముక్తుఁడయి పరబ్రహ్మను తెలిసికొనుటయే (గీ. ౨. ౪౫); దీనినే బ్రాహ్మీస్థితి యందురు (గీ. ౨. ౭౨;౧౮-౫౩). అధ్యాత్మశాస్త్రమునందు జెప్పఁబడిన యీ త్రిగుణాతీతుని లక్షణములను విని వానిని బాగుగ నెఱుంగవలయు నని యర్జునునకు కోరిక బొడముటచే వనుక రెండవ యధ్యాయమున స్థితప్రజ్ఞనివిషయమై యడిగినటులే (౨-౫౪) యిప్పుడు స్థితిసుజ్ఞునిఁ డడుగుచున్నాఁడు.

అర్జునుఁ డడుగుచున్నాఁడు.—(౨౧) ఓ ప్రభూ! ఏలక్షణములచే నిమూఁడు

శ్రీభగవా నువాచ.

ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాండవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి. ౨౨
ఉదాసీనవదాసీనో గుణైర్యోన విచాల్యతే,
గుణా వర్తంత యిత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే. ౨౩
సముదుఃఖసుఖః స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః,
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః. ౨౪
మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే. ౨౫

గుణములను గడుచునో ? ఆత్రిగుణాతీతునియొక్క యాచారమెట్లుండునో ? వాఁడీమూఁడుగుణముల నెట్లుగడచునో ? నాకుచెప్పుము. భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—(౨౨)ఓ పాండవా ! ప్రకాశమును, ప్రవృత్తియును, మోహమును అనఁగా:ననుక్రమముగ సత్త్వరజస్తమోగుణములయొక్క కార్యములు (ఫలములు) ప్రాప్తము అయినను వాని నెవఁడు ద్వేషింపఁడో, ప్రాప్తములు కాకపోయినను వాని నభిలషింపఁడో,(౨౩)(కర్మఫలము విషయమై)యెవఁ డుదాసీనుఁడై యుండునో(సత్త్వరజస్తమో) గుణము లెవనిని చలింపలేవో గుణములు తమంతట తామే కార్యములుచేయుచున్న వని తెలిసికొని యెవఁడు స్థిరుఁడగునో, చలింపఁడో (అనఁగా : వికారము నొందఁడో) (౨౪) ఎవనికి సుఖదుఃఖములు సమానముగ నుండునో, యెవఁడు స్వ-స్థుఁడో, అనఁగా : తనయందే స్థిరుఁడుగను నుండునో, మృత్తికయు, ఱాయియు, బంగారమును నేరికి సమానములుగ నుండునో, ప్రియమును, నప్రియమును, నిందయు, స్తుతియును, నెవరికి సమానములుగ నుండునో (౨౫) ఎవరికి మానమును, నవమానమును సమములో, మిత్రుఁడును, శత్రుఁడును సమానులో ప్రకృతి యన్నింటిని చేయుచున్న దని తెలిసికొనుటచే (నెవరికి సర్వ (కామ్య) ఉద్యోగములును విడిపోయినవో యాపురుషుఁడు త్రిగుణాతీతుఁ డని చెప్పుదురు.

[త్రిగుణాతీతుఁడైనపురుషునియొక్క లక్షణములు నాచారములును నెటులుండు నను ప్రశ్నకు నిది సమాధానము. ఈ లక్షణములును, రెండవ యధ్యాయమునందున్న స్థితప్రజ్ఞునియొక్కయు (౨-౫౫. ౭౨); పండ్రెండవ యధ్యాయమునందున్న భక్తునియొక్కయు (౧౨. ౧౩-౨౦) లక్షణములును సమానములుగనే యున్నవి. వేయేల ? సర్వారంభపరిత్యాగీ,

§§ మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. ౨౬
బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమమృతస్యావ్యయస్య చ,

తుల్యనిన్దాస్తుతిః, ఉదాసీనః మొదలగు కొన్ని విశేషణములు సైతము రెండు మూఁడు స్థలములయందును నొక్కవిధముగనే యున్నది. దీనింబట్టి పూర్వాధ్యాయమునందు (౧౩. ౨౪-౨౫) చెప్పఁబడిన నాల్గుమార్గములలో, నేమార్గము నవలంబించినను సిద్ధిని పొందుపురుషునియొక్క లక్షణములును, నాచారములును, నన్నిమార్గములయందును నొకవిధముగనే యుండునని స్పష్టమగుచున్నది. అయినను వెనుక మూఁడు, నాల్గు, అయిదు మొదలగు నధ్యాయములలో నిష్కామకర్మతే వారిని నదలవని యొకరీతిగనే చేయఁబడిన సిద్ధాంతము బాధింపఁబడదు గావున స్థితప్రజ్ఞుఁడును, భగవద్భక్తుఁడును, త్రిగుణాతీతుఁడును కర్మయోగమార్గములోనివారే యని యెఱుంగవలయును. "సర్వారంభపరిత్యాగీ" యనుదానికి నర్థము (౧౨-౧౬) శ్లోకముయొక్క టిప్పణియందు చెప్పఁబడినది. చూడుము. సిద్ధావస్థ పొందినపురుషునియొక్క యాచరణము స్వతంత్రములయినవి యని కల్పించి సన్న్యాసమార్గీయులగు టీకాకారులు తమసంప్రదాయమే గీతలయందు ప్రతిపాదింపఁబడినదని చెప్పుచున్నారు. కాని యీయర్థము పూర్వాపర సందర్భములకు విరుద్ధమైనదియు, నసత్యమైనదియు నని గీతారహస్యము నందలి ౧౧, ౧౨ ప్రకరణములయందు (పు. ౪౪౭, ౪౪౮ మఱియు ౫౧౪) నేను సవిస్తరముగ ప్రతిపాదించినాను. అది యట్లుండనిమ్ము; అర్జునునియొక్క రెండుప్రశ్నలకును సమాధానము చెప్పఁబడినది. ఇప్పుడు పురుషుఁడు త్రిగుణముల నేవిధమున నతిక్రమించునదియుఁ జెప్పుచున్నాఁడు.—]

(౨౬) మఱియు నెవఁడు (కర్మల నన్నింటిని నాకే యర్పించునట్టి) అవ్యభిచారమగు (ఏకనిష్ఠ గలిగిన) భక్తియోగముచే నన్ను సేవించుచున్నాఁడో వాఁడీమూఁడుగుణముల నతిక్రమించి బ్రహ్మభూతావస్థను సంపాదించుకొనుటకు సమర్థుఁడగును.

[త్రిగుణాతీతావస్థ సాంఖ్యమార్గసంబంధమైయుండ, కర్మపరమయిన భక్తియోగముచే నది యెట్లు ప్రాప్తించు ననుశంక యీశ్లోకమున గలుగవచ్చును. కావున భగవంతుఁ డిట్లు చెప్పుచున్నాఁడు —]

శాశ్వతస్యచ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ. ౨౭

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయవిభాగయోగోనామ
చతుర్దశోఽధ్యాయః. ౧౪.

(౨౭) కారణమేమనః నేనే యమృతమును, నమృతము నగుబ్రహ్మయొక్కయు శాశ్వతమైన ధర్మముయొక్కయు, నేకాంతికమైనది సుఖము(అనఁగాః పరమావధిగ్యైన) నత్యంత సుఖముయొక్కయు కడపటిస్థానమైనవాఁడను.

[సాంఖ్యులయొక్క ద్వైతమును వదలిన పిదప నంతటను నొక పరమేశ్వరుఁడే యుండుటచ్చే నాతనియందలి భక్తిచేతనే త్రిగుణాతీతావస్థయు ప్రాప్తమగు నని యీశ్లోకమునకు భావార్థము. అయినను పరమేశ్వరుఁడొక్కఁడుగనే యున్నాఁడని యంగీకరించినపిదప, సాధనవిషయమున గీతకు నేవిధమునగు నాగ్రహములేదు (గీ. ౧౩. ౨౪, మఱియు ౨౫ చూడుఁ). భక్తిమార్గము సులభ మగుటచే నెల్లరకును గ్రాహ్యమని గీతలలోఁ జెప్పఁబడినది నిజమే. అయినను నితరమార్గములు త్యాజ్యము లని గీతలయందెచ్చోటను చెప్పఁబడలేదు. గీతలయందు భక్తియే ప్రతిపాదింపఁబడు నని కొందఱును, జ్ఞానమే బోధింపఁబడు నని కొందఱును, యోగమే యని కొందఱును వారివారి సంప్రదాయములయందభిమానము గలవారలై యిటీపల గీతలను వ్యాఖ్యానముఁ జేయుచు వచ్చిరి. గీతలయందు నిజముగ ప్రతిపాద్యవిషయము వేఱుగనే యున్నది. మార్గ మేదియైనను పరమేశ్వరుని తెలిసికొనినపిదప సంసారమం దున్నకర్మలను లోకసంగ్రహార్థమై చేయువలయునా? లేక వలదా? యనునది గీతయందలి ముఖ్యమైన విషయమై యున్నది. కర్మయోగము శ్రేష్ఠమని పూర్వమునందే దానికి స్పష్టమైన సమాధానము చెప్పఁబడినది.

ఈరీతిగ భగవంతునిచే గానము చేయఁబడిన గుణత్రయవిభాగ మను పేరి పదునాల్గవ యధ్యాయము సమాప్తము.



# పంచదశోఽధ్యాయః.

పదునేనవ యధ్యాయము.

శ్రీభగవానువాచ.

ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. ౧

[క్షేత్రక్షేత్రజ్ఞవిచారమును సంబంధించి పదమూఁడవ యధ్యాయమునందు తత్సదృశ మగుసాంఖ్యులయొక్క ప్రకృతిపురుషవివేకము చెప్పఁబడినది. మఱియు పదునాల్గవ యధ్యాయమునందు ప్రకృతియొక్క గుణత్రయముచే నొక్కొక్క మనుజునికిని స్వభావభేద మెట్లుత్పన్నమగు ననియు, దానివలన సాత్త్వికాది గతిభేదము లెట్లు కలుగునదియుఁ జెప్పి, త్రిగుణాతీతావస్థ లేక యధ్యాత్మదృష్టిచే బ్రాహ్మీస్థితి యేదియో, దాని నెట్లు సంపాదించుకొనవలసినదియు వివేచింపఁబడినది. ఈనిరూపణ లన్నియు సాంఖ్యులయొక్క పరిభాషలో నున్నమాట నిజమే. అయినను నవి సాంఖ్యులయొక్క ద్వైతము నొప్పుకొనక, ప్రకృతియు, పురుషుఁడును, నేపరమేశ్వరునియొక్క విభూతులో యాపరమేశ్వరునియొక్క జ్ఞానవిజ్ఞానము లను దృష్టితో నిరూపింపఁబడినవి. పరమేశ్వరస్వరూపము నీవిధమున నిరూపించుటయే గాక యధియజ్ఞము, నధ్యాత్మమును, నధిదైవతమును మొదలగు భేదముల నెనిమిదవ యధ్యాయమునందు జెప్పి యంతటను నొకపరమేశ్వరుఁడే నిండియున్నాఁ డనియు, క్షేత్రమం దున్నక్షేత్రజ్ఞుఁడును వాఁడే యనియు పూర్వమునఁ జెప్పఁబడినది. ఇప్పుడు పరమేశ్వరునిచేత నే నిర్మింపఁబడిన సృష్టియొక్క వ్యాప్తిని, లేక పరమేశ్వరునియొక్క నామరూపాత్మక మగువిస్తారము నే యప్పుడప్పుడు వృక్షరూపముగను వర్ణించుటకు బీజమేమియో మొదటచెప్పి పిదప పరమేశ్వరునియొక్క స్వరూపముల నన్నింటిలోని శ్రేష్ఠమగుపురుషోత్తమస్వరూప మీయధ్యాయమునందు వర్ణింపఁబడుచున్నది.—]

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.— (౧) మొదలు పైనను, కొమ్మలు క్రిందను నుండి యేది యెప్పటికిని నశింపని దనియు, వేదములు దేనికి యాకులనియు, జెప్పిరో యా యశ్వత్థవృక్షమును దెలిసికొనినవాఁడే వేదముల నెఱింగినవాఁడు.

[ఇది బ్రహ్మవృక్షముయొక్క (అనఁగా: సంసారవృక్షముయొక్క వర్ణన "సంసారము లేక ప్రపంచము" అనఁగా: దారాపుత్త్రాదులతో నుండి నిత్యమును వ్యవహరించుట యర్థ మని సాధారణముగ వాడుకయై యున్నది. కాని ప్రకృతమునం దీసంకుచితార్థము సూచింపఁబడ్డలేదు. సంసారమన "కన్నులయెదుట కాన్పించు జగత్తంతయు, లేక దృశ్యసృష్టియంతయు నని యర్థము. దీనినే సాంఖ్యులు "ప్రకృతియొక్క విస్తార మనియుఁ (బ్రహ్మారణ్య మనియు) జెప్పిరి; (మ. భా. అశ్వ. ౩౫. ౪౭. చూడు.) ఒక సూక్ష్మమైన బీజమునుండి గొప్పదియును, నాకాశము నొరయునదియు నగు వృక్షము బయల్పడినటుల, నొకయవ్యక్తుఁ డగుపరమేశ్వరునియం దుండి దృశ్యసృష్టిరూపముగను, భవ్యముగను వెలువడిన దనుకల్పన లేక రూపకము, వైదిక ధర్మములయందేగాక యితరము లగు ప్రాచీనధర్మముల యందును స్పష్టముగఁ గాన్పించుచున్నది. ప్రాచీనయూరోపీయభాషల యందు దానికి విశ్వవృక్షము, లేకజగద్వృక్షమని పేరు. ఋగ్వేదమునందు ౧. ౨౪. ౭) వరుణలోకమునందు నొక వృక్షము కల దనియు, నావృక్ష సంబంధములైన కిరణములయొక్క మూలము పైం (ఊర్ధ్వమున) నుండు న నియు, దాని కిరణములు పైనుండి క్రిందికి (నిచీనాః) వ్యాపించుచున్న వనియు, వర్ణింపఁబడినది; మఱియు విష్ణుసహస్రనామములయందు "వారుణోవృక్షః" వరుణునియొక్కవృక్షము, అనునది పరమేశ్వరునియొక్క వేయినామములలో నొకనామ మని చెప్పఁబడినది. యముఁడును పితరులును, నే సుపలాశవృక్షములయొక్క క్రిందకూర్చుండి సహపానముచేయుదు న్నారో; (ఋ. ౧౦. ౧౩౫. ౧) యనియు, దేనియొక్క "యగ్రభాగమున రుచియగు పిప్పల ముండునో, దేనిపై రెండుసుపర్ణములు పక్షు లుండునో" యనియు (ఋ. ౧. ౧౬౪. ౨౨) "నేపిప్పలమును (అశ్వత్థమును) వాయుదేవత(మరుద్గణము)కదలించుచున్నదో" యనియు (ఋ. ౫-౫౪.౧౨)ఋగ్వేదమున చెప్పఁబడిన వృక్షమునునిదియే.అథర్వవేదమునందు దేవసదనమైన యశ్వత్థవృక్షము మూఁడవస్వర్గలోకమునం (వరుణలోకమునం) దున్నది యని వర్ణింపఁబడినదియు (అథర్వ ౫. ౪.౩, మఱియు ౧౯. ౩౯. ౬) నీవృక్షమే యైనట్లు కాన్పించుచున్నది. అగ్ని లేక యజ్ఞ ప్రజాపతి పితృయాణకాలమునందు దేవలోకమునుండి లేచిపోయి యీ వృక్షముక్రింద నశ్వము (గుఱ్ఱము)యొక్క రూపమును ధరించి యొకవత్స

రము రహస్యముగనుండినందున నీవృక్షమున కశ్వత్థ మని పేరువచ్చినటుల తైత్తిరీయబ్రాహ్మణమునందు (౩. ౮. ౧౨. ౨) నిర్వచనము చెప్పఁబడినది; (మ. భా. అను. ౮౫ చూడుడు.) అనేకులు నిరుక్తకారులు పిత్రుయాణమందలి దీర్ఘరాత్రులయందు సూర్యుని గుఱ్ఱములు యమలోకమునందీవృక్షముక్రింద విశ్రాంతిని జెందుచుండుగాన దీనికి నశ్వత్థమని (అనఁగా: గుఱ్ఱములుండుస్థలము) నామము వచ్చెనని చెప్పుచున్నారు. 'అ'=కాదు అనియు, 'శ్వ'=అనఁగ రేపుఅనియు, 'త్థ'=అనఁగా: నుండునది యనియు నాధ్యాత్మికమగు నిరుక్తి పిదప కల్పింపఁబడినది. నామరూపాత్మక మగు మాయయొక్క స్వరూపము నశించునది, లేక ప్రతిక్షణమునందు మాఱునది యగుటచే నది "రేపటిదాఁక నుండునది కాదు" అని యశ్వత్థశబ్దమున కర్థము చెప్పనచ్చును. నిజమే. కాని యీయభిప్రాయ మిచ్చోట నుద్దేశింపఁబడినదికాదని "యవ్యయము" అనఁగా: నెప్పుడును వ్యయము (నాశము) నొందనిదియను విశేషణమువలన స్పష్ట మగుచున్నది. రావిచెట్టు మొదట నుండియు నశ్వత్థ మనిచెప్పఁబడుచున్నది. కఠోపనిషత్తునందు (౬.౧)—

ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థః సనాతనః,
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే.

అని చెప్పఁబడిన బ్రహ్మమయమును నమృతమును నగు నశ్వత్థవృక్షమును నిదియే. భగవద్గీతలోని వర్ణనము కఠోపనిషత్తునుండియే గ్రహింపఁబడెనని "ఊర్ధ్వమూల మధశ్శాఖం" అనుపదసాదృశ్యమును బట్టియే వ్యక్త మగుచున్నది. పరమేశ్వరుఁడు స్వర్గమునందుండుటచే, నచ్చోనుండి వెలువడిన జగద్వృక్షము క్రిందికి (అనఁగా: మనుష్యలోకమునకు) వచ్చుటచే నీవృక్షముయొక్క మూలము (అనఁగా: పరమేశ్వరుఁడు) పైనుండె ననియు, నావృక్షముయొక్క యనేకశాఖలు (అనఁగా: జగత్తుయొక్క విస్తారము) క్రిందికి నంకురించిన వనియు వర్ణింపఁబడినది. కాని మఱ్ఱిచెట్టుయొక్క యూడలు పైనుండి క్రిందికి వృద్ధినొందును గాన "ఈసంసారవృక్షము వటవృక్షముగ నుండవలయును, రావిచెట్టుగ నుండరాదు" అని మఱియొక కల్పనయును ప్రాచీనధర్మగ్రంథములలో స్పష్టముగ గాన్పించుచున్నది. ఉదాహరణము.—అశ్వత్థవృక్షము సూర్యునియొక్కయు, "న్యగ్రోధోవారుణోవృక్షః" న్యగ్రోధమనగా (న్యక్) క్రిందికి, (రోధ) వృద్ధినొందునది (అనఁగా: "వటవృక్షము=వరుణునియొక్కవృక్షము") అనివర్ణింపఁబడినది.

(గోభిలగృహ్యసూత్రములు ౪.౭.౨౪) మార్కండేయఋషి ప్రళయకాలము నందు బాలరూపుఁడగు పరమేశ్వరుఁడు (ఆ ప్రళయకాలమునందును నాశము నొందనివాఁడు గనుకనే) అవ్యయ మగు న్యగ్రోధముపై (అనఁగా: వటవృక్షముయొక్క స్కంధముపై) జూడఁబడెనని మహాభారతమునందు వర్ణింపఁబడినది. అటులే ఛాందోగ్యోపనిషత్తునందు అవ్యక్తస్వరూపుఁడగు పరమేశ్వరునియందుండి తుచ్ఛమును, దృశ్యమును నగు జగమెట్లు నిర్మింపఁబడినదియో చూపుటకు న్యగ్రోధముయొక్క బీజమే దృష్టాంతముగఁ జెప్పఁబడినది (ఛాం. ౬. ౧౨. ౧). శ్వేతాశ్వతరోపనిషత్తునందును జగద్వృక్షము వర్ణింపఁబడినది (శ్వే. ౬. ౬). కాని యీవృక్ష మేదియు నచ్చో స్పష్టముగ పేర్కొనఁబడలేదు. ముండకోపనిషత్తునం (౩. ౧) దీ వృక్షము తోడనే రెండుపక్షులు (జీవాత్మయు పరమాత్మయు) కూర్చుండు ననియు వానిలో నొకటి పిప్పలమును (అనఁగా: రావిచెట్టుఫలములను) తిను ననియు ఋగ్వేదమునఁ జెప్పఁబడినట్లే చెప్పఁబడినది. రావిచెట్టనియు, మఱ్ఱిచెట్టనియు మాత్రమేగాక యీసంసారవృక్షముయొక్క స్వరూపమునకు నౌదుంబరవృక్ష (మేడి లేక అత్తిచెట్టు) మని మూఁడవకల్పనయుఁ గలదు. ఇది పురాణములలో దత్తాత్రేయులవారి వృక్షమని చెప్పఁబడినది. పరమేశ్వరుని మాయచే నుత్పన్నమైన జగత్తు ఒకగొప్పరావిచెట్టనియు, మఱ్ఱిచెట్టనియు, మేడిచెట్టనియు నీమూఁడుకల్పనలును ప్రాచీనగ్రంథములలోఁ గన్పట్టుచున్నవి. ఈకారణముచేతనే "న్యగ్రోధోదుంబరాశ్వత్థాః" అని విష్ణువునకు వృక్షరూపము లగుమూఁడు నామము లున్నవనియు (మ. భా. అను. ౧౪౯. ౧౦౧) నీమూఁడువృక్షములే వాడుకలో సైతము దేవతాత్మకములనియు, పూజార్హములనియు నంగీకరింపఁబడుచున్న వనియు నిందలి సారాంశము. ఇంతియకాక విష్ణుసహస్రనామములును, గీతలును, మహాభారతములోని భాగములేగాన విష్ణుసహస్రనామములయందు ఔదుంబరము, వటము, అశ్వత్థ మని మూఁడు వేఱగు నామములు చెప్పఁబడినచో నశ్వత్థశబ్దముచే గీతలయందును రావి (ఔదుంబరముగాని, వటవృక్షముగాని కానేరదు) అనునర్థమునే చేసికొనవలయును. మూలమునందున్న యర్థమును నదియే. "ఛందాసి=వేదములు దేనియొక్క యాకులో" ఈవాక్యము నందలి ఛందాసి యనుశబ్దమునందు ఛద్=కప్పుట యనుధాతువు నుపయోగించి (ఛాం. ౧. ౪. ౨ చూడు.) వృక్షమును కప్పునాకులతో వేదములకు

అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయ
ప్రవాలాః, అధశ్చ మూలాన్యనుసంతతాని కర్మానుబంధీని
మనుష్యలోకే. ౨

సామ్యము వర్ణింపఁబడినది. ఈవర్ణన అన్నియును వైదిక సంప్రదాయానుసారముగ నుండుటచే దీనిని తెలిసికొనినవాఁడు వేదవేత్త యని చెప్పవలయు నని తుదకు చెప్పఁబడినది. ఇట్లు వైదిక సంప్రదాయము చేసియున్న యీవృక్షమును మఱి యొకవిధముగ, అనఁగా: సాంఖ్యశాస్త్రానుసారముగ వర్ణించుచున్నాఁడు.—]

(౨) సత్త్వాదిగుణములు మూఁడింటిచేతను విస్తరించినదియు (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములను) విషయములను పల్లవములు బయలుదేఱుచున్నదియు, దాని కొమ్మలు క్రిందను, పైనను వ్యాపించియున్నవి; మఱియు తుదకు కర్మలయొక్క-స్వరూపమును బొందెడి దానియొక్క వేళ్లు క్రిందను (అనఁగా: మానుషలోకమునందు) వృద్ధినొందుచు బహుదూరము వ్యాపించినవి.

[సాంఖ్యశాస్త్రానుసారముగ ప్రకృతిపురుషులను రెండుతత్త్వములే యారంభమునం దుండును. పురుషునియెదుట త్రిగుణాత్మక ప్రకృతి తనదు కోణమును పెట్టుటకు నారంభించు నని మహదాదిగ నిరువదిమూఁడు తత్త్వములను నుత్పన్నములగును. ఆబ్రహ్మాండవృక్ష మెట్లు నిర్మితమగు నదియు గీతారహస్యమునందలి యెనిమిదవ ప్రకరణమునందు (పు. ౧౭౧) సవిస్తరముగ నిరూపింపఁబడినది. కాని వేదాంతశాస్త్రముయొక్క-దృష్టిచే, ప్రకృతి స్వతంత్రమైనది కాదు. పరమేశ్వరునియొక్క-యొకయంశమే యైయున్నది. త్రిగుణాత్మక ప్రకృతియొక్క-యీవ్యాప్తిని స్వతంత్రమైన వృక్ష మని వేదాంతశాస్త్ర మొప్పుకొనదు. ఈశాఖ లూర్ధ్వమూలమైన యశ్వత్థవృక్షముయొక్క-శాఖలె యని వేదాంతశాస్త్రముయొక్క-సిద్ధాంతము. ఈసిద్ధాంతమున ననుసరించి, మొదటిశ్లోకమున వర్ణింపఁబడినదియు, వైదికమగునదియు, నధశ్శాఖమైన వృక్షముయొక్క-"త్రిగుణములచే బయల్పడిన కొమ్మలు క్రిందనే గాక పైనను వ్యాపించిన" వని యిప్పుడు కొంచెము వేఱుగ వర్ణింపఁబడినది. కావున కర్మవిపాకప్రక్రియ ననుసరించి యటుల జెప్పఁబడినది యని తెలిసికొనవలయును. అనుగీతలయందున్న బ్రహ్మవృ[illegible] యొక్క-వర్ణనయును దీవృక్షమునకు వైదికమును, సాంఖ్యమును నగువర్ణనల

§§ న రూపమస్యేహ తథోపలభ్యతే నాంతో న చాదిర్న చ
సంప్రతిష్ఠా, అశ్వత్థమేనం సువిరూఢమూలమసంగశస్త్రేణ
దృఢేన ఛిత్త్వా. ౩

తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తంతి
భూయః, తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః
ప్రసృతా పురాణీ. ౪

యొక్క సంబంధమును కలుపవలె నని యాలోచింపక కేవలము సాంఖ్య శాస్త్రమునందుండి ఇరువదినాల్గు తత్త్వములుగల బ్రహ్మవృక్షమే వర్ణింపఁబడినది; (మ.భా.అశ్వ.౩౫. ౨౨,౨౩, మఱియు గీతార. ప్ర.౯.పు. ౨౪౧ చూడుము.) కాని గీతలయం దట్లు చెప్పక దృశ్యసృష్టిరూప మగు వృక్షమును సంబంధముచే పరమేశ్వరునియొక్క వేదములయందు కాన్పించుచున్న వర్ణనయును సాంఖ్యశాస్త్రోక్తమగు ప్రకృతిసంబంధమైన వ్యాప్తియొక్కయును, లేక బ్రహ్మాండవృక్షముయొక్కయును వర్ణనలును నీ రెండుశ్లోకముల యందును జెప్పఁబడినవి. మోక్షమునొందుటకు త్రిగుణాత్మకమును, నూర్ధ్వమూలము నగువృక్షముయొక్క వ్యాప్తినుండి ముక్తుఁడు కావలయును. ఈవృక్షము మొదలుసైత మెచ్చోనుండునో దెలిసికొనుటకు వీలులేనంత యసాధ్యమైనది. కాన నీమహావృక్షమును నశింపఁజేసి దానికిమూలమునందున్న యమృతత్త్వము నెఱుంగుటకు మార్గము నిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౩) కాని (పైవర్ణించినటుల) యిహలోకమునందు దానియొక్క స్వరూపము గోచరింపదు. (దానియంతమును, నాదియు, నాధారస్థానమును కనఁబడదు) మిక్కిలి లోతుకు పాతుకొని పోఁగల యీయశ్వత్థము ననాసక్తి యనుబలిష్ఠమగు పట్టాకత్తితో ఛేదించి, (౪) పిదప (సృష్టిక్రమముయొక్క యీ) "పురాతన మగు ప్రవృత్తి యెవరివలన వెలువడినదో యా యాద్యుఁడగుపురుషునే నేను పొందుచున్నాను." (అనుసంకల్పముచే) నెచ్చోటికి పోఁగా వెనుకకు తిరిగిరాఁడో యాస్థానమును శోధింపవలయును.

[సృష్టియొక్క సంసారమన: నామరూపాత్మక మగుకర్మయే. ఈకర్మ యనాదియైనది. దానిని నశింపఁజేయుట యన దానియందున్న యాసక్తిబుద్ధిని వదలుటయే. మఱియొకవిధమున దానిని నశింపఁజేయుటకు వీలు

లేను. కారణమేమన: దానిస్వభావమును బట్టి యనాదియు నవ్యయమునైనది. ఈవివేచనలు గీతారహస్యమునందలి పదవ ప్రకరణమునందు (పు. ౩౯౨-౩౯౬. ౩౯౮ చేయఁబడినది, చూడుము.) కర్మ యనాది యనుసిద్ధాంతమే మూఁడవ శ్లోకమునందు "దానియొక్క స్వరూపముగాని, యాద్యంతములు గాని తెలియవు" అనుశబ్దములచే వ్యక్తము చేయఁబడినది. మఱియు నీకర్మ వృక్షమును నశింపఁజేయుటకు ననాసక్తి యనునది యొకటియే సాధన మని చెప్పఁబడినది. అటులే యుపాసన చేయుచున్నప్పుడే భావము మనస్సునం దుండునో దాని ననుసరించియే ఫలమును లభించును. (గీ. ౮-౬) కాన వృక్షచ్ఛేదన మనుక్రియ జరుగునప్పుడు మనస్సునెట్టి భావ యుండవలయునో నాల్గవ శ్లోకమునందు స్పష్టము చేయఁబడినది. "తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" అని శాంకరభాష్యమునందు గ్రహింపఁబడిన పాఠమునందు వర్తమానకాలికమును నుత్తమపురుషైకవచనాంతమును నగు "ప్రపద్యే" యనుక్రియాపదముండుటచే నీయర్థము కావింపవలసి వచ్చినది. దానియందు "ఇతి" యనుపదము వంటిదానిని నేదోయొకటి నధ్యాహారము చేసికొనవలసివచ్చును. ఈప్రతిబంధమును తప్పించుకొనుటకు శ్రీరామానుజభాష్యమునందు వ్రాయఁబడిన "తమేవచాద్యం పురుషం ప్రపద్యేద్యతః ప్రవృత్తిః" అనుపాఠాంతరము నంగీకరింతుమేని "ఏస్థానమునకు పోయిన తిరిగి వెనుకకు రానక్కఱలేదో యాస్థానమును శోధించి నిశ్చయింపవలయును. (మఱియు) దేనినుండి పర్వసృష్టి యుత్పన్నమైనదో దానినే పొందవలయును" అని యర్థము చేయవలసివచ్చును. కాని "ప్రపద్" అనుధాతు వాత్మనేపదమగుటచే "ప్రపద్యేత్" అని దానికి విధ్యర్థమందు ప్రథమపురుషరూపము కానేరదు. 'ప్రపద్యేత్' అనునది పరస్మైపదమునందలి రూపముగాన వ్యాకరణదృష్టిచే తప్పగును. ఈకారణముచే శాంకరభాష్యమునందీపాఠము స్వీకరింపఁబడలేదు. మఱియు నదియే యుక్తమైనది. ఛాందోగ్యోపనిషత్తునందలి కొన్నిమంత్రములలో 'ప్రపద్యే' యనుపదమునకు 'నితి' శబ్దమును జేర్చక నీప్రకారముగనే యుపయోగము చేసికొనఁబడినది; (ఛాం. ౮. ౧౪. ౧.) 'ప్రపద్యే' యనుక్రియాపదముత్తమపురుషమైనను వక్తతో నవఁగా నీయుపదేశమును చేయుశ్రీకృష్ణునితో దానిని సంబంధింపఁ జేయుటకు వీలులేదని చెప్పనక్కఱలేదు. ఇప్పు డీరీతిన నాచరించుటచే లభించుఫలమును చెప్పుచున్నాఁడు.—]

నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకా
మాః,ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛంత్య మూఢాః
పదమవ్యయం తత్. ౫
న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః,
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ. ౬
§§ మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః
మనష్షష్ఠానీం ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. ౭

(౫) మానమును, మోహమును లేనివారును, నాసక్తి, దోషమును జయించినవారును, నధ్యాత్మజ్ఞానమున్నం దెప్పుడును స్థిరులైనవారును, నిష్కాములును, సుఖదుఃఖములను ద్వంద్వములనుండి ముక్తులయిన జ్ఞానులవ్యయమగు స్థానము నొందుచున్నారు. (౬) ఏకడకుఁబోయి మరలరారో (యట్టిదే) నాయొక్క పరమమగుస్థానము దానిని సూర్యుఁడుగాని, చంద్రుఁడుగాని, యగ్నిగాని, ప్రకాశింపఁజేయలేరు.

[వీనిలో నాఱవ శ్లోకము శ్వేతాశ్వతరములోను(౬. ౧౪) ముండకములోను (౨. ౨. ౧౦) కఠములోను (౫. ౧౫) నున్నది. సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు మొదలగునవి నన్నియు నామరూపములయొక్క పక్షములోనివే యనియు, బ్రహ్మ యీనామరూపములన్నింటికంటె పరమైగ నుండు ననియు, పరబ్రహ్మయొక్క తేజస్సుచే సూర్యచంద్రాదులు ప్రకాశింపఁజేయఁ బడుచున్నారనియు పరబ్రహ్మ ప్రకాశించుటకును మఱియొకవస్తువుయొక్క యపేక్షలేదనియు, స్పష్టముగ సిద్ధమగుచున్నది. పైశ్లోకమునందున్న 'పరమం, ధామ' యనుశబ్దములకు పరబ్రహ్మయర్థము. ఈబ్రహ్మయందు తాదాత్మ్యము నొందుటయే, బ్రహ్మనిర్వాణమోక్షము. వృక్షమనురూపముచే నధ్యాత్మశాస్త్రమునందుఁ జెప్పఁబడిన పరబ్రహ్మము యొక్క జ్ఞానము వివేచింపఁబడినది. ఇప్పుడు పురుషోత్తమస్వరూపమునుఁ జెప్పవలయును; "కాని యెచ్చోటికేగిన మరలరాఁడో" యని చివరచెప్పఁబడినదానింబట్టి సూచింపఁబడిన జీవునియొక్క యుత్క్రాంతిని, దానిని సంబంధించిన జీవుని స్వరూపమును, మొదటఁజెప్పుచున్నాఁడు.—]

(౭) నాయొక్క సనాతనమగునంశరమే జీవలోకమునందు (కర్మభూమియందు) జీవుఁడయి ప్రకృతియందుండి, మనస్సుతోఁగూడి యాఱైన నవఁగా:

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్. ౮
శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ,
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే. ౯

మనస్సును, అయిదు (సూక్ష్మ) యింద్రియములును ప్రకృతితో నాఱగు నింద్రియములును, (అనఁగా: మనస్సును (సూక్ష్మ) ఇంద్రియములను) తనకై పునరు నాకర్షించుచున్నది. దీనినే లింగశరీర మని చెప్పుచున్నారు. (౮) ఈశ్వరునకు (అనఁగా: జీవునకు) శరీరము (స్థూల) ప్రాప్తించినప్పుడును, ఆ(స్థూల) శరీరమునుండి యాతఁడు దాటిపోయినప్పుడును, గంధముయొక్క పుష్పము మొదలగు నాశ్రయములనుండి వాయువు గంధమునువలె (జీవుఁడు) పైవానిని (మనస్సును పంచేంద్రియములను) కూడనే తీసికొని పోవుచున్నాఁడు. (౯) శ్రోత్రము, చక్షుస్సు, త్వక్కు, జిహ్వ, నాసికయు, నటులే మనస్సును ననువానియందు స్థితిఁజెంది (యీ) జీవుఁడు విషయముల నుపభోగించుచున్నాఁడు.

[ఈ మూఁడుశ్లోకములలోను మొదటిదానియందు సూక్ష్మము, లేక లింగశరీర మేదియో చెప్పి పిదప నాలింగశరీరము స్థూలదేహమునం దెట్లు ప్రవేశించుచున్నదో, దానియందుండి పై కెట్లు పోవుచున్నదో, మఱియు దానియందుండి విషయముల నెట్లు భోగించుచున్నదో, యీ మూఁడు స్థితులును వర్ణింపఁబడినవి. సాంఖ్యమతానుసారముగ నీసూక్ష్మశరీరము, మహత్తత్త్వము మొదలుకొని సూక్ష్మ పంచతన్మాత్రపర్యంతము లగు పదునెనిమిది తత్త్వములయొక్క సముదాయమై యున్నది; వేదాంతసూత్రములయందు (౩. ౧. ౧) పంచసూక్ష్మభూతములును, ప్రాణమును, దానియందుఁ జేర్పఁబడినవి; (గీతారహస్య. ప్ర. ౮. పు. ౨౫౩–౨౫౪ చూడుఁ.) అటులే మైత్ర్యుపనిషత్తునందు (౬. ౧౦) సూక్ష్మశరీరము పదునెనిమిదితత్త్వముల యొక్క సముదాయ మని చెప్పఁబడినది. దీనింబట్టి మనస్సును పంచేంద్రియములు ననుశబ్దములచే సూక్ష్మశరీరమునందున్నయితర తత్త్వములయొక్క సంగ్రహముసైతము మిచ్చో నుద్దేశింపఁ బడినదని చెప్పవలయును. జీవాత్మ పరమేశ్వరునియందుండి ప్రతిసమయమునందును క్రొత్తక్రొత్తగ పుట్టునది కానేరదు. అది పరమేశ్వరునియొక్క సనాతన మగు నంశయయి యున్నది (గీ. ౨. ౨౪. చూడుఁ). ఈసిద్ధాంతము వేదాంతసూత్రములయందు

ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్,
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః. ౧౦
యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్,
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః. ౧౧
§§ యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. ౧౨

నైతము 'నిత్య' 'అంశ' శబ్దములచే చెప్పఁబడినది. (వే. సూ. ౨. ౩, ౧౭ మఱియు ౪౩); గీతలయందున్న క్షేత్రక్షేత్రజ్ఞవిచారము బ్రహ్మసూత్రములలోనుండి గ్రహింపఁ బడినదని పదమూఁడవ యధ్యాయమునఁ జెప్పఁబడినవిషయము (౧౩.౪) దీనిచే బలపఱుపఁబడుచున్నది (గీ.ర.పరి.పు.౭౩౭-౭౩౯ చూడు.) అంశశబ్దమునకు ఘటాకాశము మొదలగుదానివలె నంశమని యర్థము నెఱుంగవలయును. కోసి తీయఁబడిన యంశ కాదని గీతారహస్యమునందలి తొమ్మిదవ ప్రకరణమునందు (పు. ౩౩౫) నిరూపింపఁబడినది. శరీరమును ధరించుటయు, శరీరమును వదలిపెట్టుటయు విషయముల నుపభోగించుటయు ననునిమూఁడుక్రియలును నిట్లు జరుగుచుండ.—]

(౧౦) శరీరమునుండి వెడలిపోవునదియు,శరీరమునుండి గుణములతోఁగూడి (స్వయముగ కాదు) యుపభోగించునదియు నగునీజీవుని మూర్ఖులు తెలిసికొనలేరు. జ్ఞానచక్షుస్సుచేఁ జూచువారు (అతనిని) తెలిసికొనుచున్నారు (౧౧)అటులే ప్రయత్నము చేయుయోగులు తమయందున్న యీయాత్మను తెలిసికొనుచున్నారు. కాని యెవరియొక్క యాత్మ (అనఁగా: బుద్ధి)సంస్కరింపఁబడలేదో యట్టియజ్ఞులు ప్రయత్నమును చేసినను దీనిని తెలిసికొనలేరు.

[పది పదునొకండవ శ్లోకములయందు జ్ఞానచక్షుస్సుచే, లేక కర్మయోగమార్గముచే, నాత్మజ్ఞానము కల్గునని చెప్పి జీవునియొక్క యుత్క్రాంతి వర్ణనము పూర్తిచేయఁబడినది. వెనుక నేడవ యధ్యాయమునందు చెప్పినట్లు (గీ.౭.౮-౧౨చూడు.)ఆత్మసంబంధమైన సర్వవ్యాపిత్వముయొక్క ప్రస్తావనవిషయమందు కొంచెము మఱలచెప్పి, పిదప పదునాఱవ శ్లోకము మొదలుకొని పురుషోత్తమస్వరూపము చెప్పఁబడినది.—]

(౧౨) ఏ తేజస్సు సూర్యునియందుండి జగత్తునంతను ప్రకాశింపఁజేయుచున్నదో, యే తేజస్సు చంద్రునియందును, నగ్నియందును నున్నదో యది నా తే

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా,
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః. ౧౩
అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. ౧౪
సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞానమపో-
హనం చ, వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వే-
దవిదేవ చాహమ్. ౧౫

జస్సే యని తెలిసికొనుము (౧౩) యటులే పృథ్విలోఁ బ్రవేశించి నేనే (సర్వ) భూతములను నా తేజస్సుచే ధరించుచున్నాను. మఱియు రసాత్మకమైన సోముఁడనై (చంద్రుఁడనై) సర్వౌషధులను, అనఁగా: వనస్పతులనుఁ బోషించుచున్నాఁడను.

[సోమశబ్దమునకు సోమవల్లి (సోమలత) యనియును చంద్రుఁడనియు రెండర్థములు గలవు. చంద్రుఁడే రీతిగ జలాత్మకుఁడును, నంశుమంతుఁడును శుభ్రమైనవాఁడునై యున్నాఁడో యటులే సోమవల్లియు నుండు నని వేదములయందు చెప్పఁబడినది ఆయిరువురును వనస్పతులకు రాజులని చెప్పఁబడినది. అయినను పూర్వాపరసందర్భములంబట్టి యిచ్చోఁ జంద్రుఁడే యర్థము. చంద్రునియొక్క తేజస్సు నేనే యని యీశ్లోకమునందు చెప్పిన పిదప వనస్పతులను బోషించు చంద్రునిగుణమును, నేనే యని యీశ్లోకమునందే, చెప్పఁబడినది. చంద్రుఁడు జలమయుఁడగుటచే నీగుణ మతని యందున్నందున దానినుండి వనస్పతులు వృద్ధిఁబొందుచున్నవని శ్రుతియొక్క చోట సైతము చెప్పఁబడినది.—]

(౧౪) నేను వైశ్వానరరూపుఁడ నగునగ్నిహోత్రుఁడై ప్రాణులయొక్క దేహమునందుండి ప్రాణముతోఁడను నపానముతోఁడను కూడినవాఁడనై (భక్ష్యము, చోష్యము, లేహ్యము, పేయ మని) నాలుగువిధము లగు నన్నమును పచనము జేయుచున్నాను. (౧౫) అటులే యందఱియొక్క హృదయములను నేనే యధిష్ఠించి యుంటిని. స్మృతియు, జ్ఞానమును, అపోహమును (తన్నాశము) నావలన నే గలుగుచున్నవి. సర్వవేదములచేతను దెలిసికొనఁ దగినవాఁడను నేనే. వేదాంతములను జేయువాఁడను, వేదములను దెలిసికొనినవాఁడను నేనే.

[ఈశ్లోకముయొక్క రెండవచరణము కైవల్యోపనిషత్తునందున్నది. (కై. ౨. ౩) కాని యిచ్చోనుండు "వేదైశ్చసర్వై" అనుదానికి మారుగ

§§ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ,
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. ౧౬
ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః. ౧౭
యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. ౧౮

"వేదైరనేకైః" అని మాత్రమే పాఠభేదమున్నది. దీనినే "వేదాంతమను శబ్దము గీతాకాలమందు ప్రచారములో లేదనియు నీశ్లోకము ప్రక్షిప్తమై యుండును, లేదా, దానియందున్న వేదాంతశబ్దమున కేదోమఱియొక యర్థముండి యుండుననియు" ననేకులు చేసినయూహ నిర్మూలమైనది. వేదాంతశబ్దము ముండకమునందును (ముం. 3. ౨. ౬) శ్వేతాశ్వతరమునందును (౬. ౨౨) కాన్పించుచున్నది. శ్వేతాశ్వతరమునందలి కొన్నిమంత్రములు లాశబ్దములనైన మార్పక గీతలయందు ప్రయోగింపఁబడినవి. ఇప్పుడు పురుషోత్తమలక్షణము లెవ్వియో నిరుక్తిపూర్వకముగఁ జెప్పుచున్నాఁడు.—]

(౧౬) ఈలోకమున క్షరుఁడనియు నక్షరుఁడనియు నిరువురు పురుషులు గలరు. క్షరుఁడన నశ్వరములగు సర్వభూతములనియు, కూటస్థుఁ డనఁగా: నీసర్వభూతములయొక్క మూలమునందుండు (కూటమునందు ప్రకృతిరూపమై) యేయవ్యక్తతత్త్వము గలదో దాని నక్షరమనియుఁ జెప్పుచున్నారు. (౧౭) కాని యెవఁడు పురుషోత్తముఁడో వాఁ డీరెండింటికంటెను వేఱుగనున్నాఁడు. వానిని పరమాత్మ యని చెప్పుచున్నారు. ఆ యవ్యయుఁడగు నీశ్వరుఁడే త్రైలోక్యమును వ్యాపించి (త్రైలోక్యమును) పోషించుచున్నాఁడు. (౧౮) ఏకారణముచే నేను క్షరముకంటె పరమందున్నవాఁడను, అక్షరముకంటె నుత్తముఁడను నైయున్నానో యాకారణముచే లోకవ్యవహారమునందును, వేదములయందును పురుషోత్తముఁ డను శబ్దముచేఁ బ్రసిద్ధుఁడనయి యున్నాను.

[౧౬ వ శ్లోకమునందున్న క్షరము నక్షరము ననుశబ్దములును, వ్యక్తము, అవ్యక్తము—లేక వ్యక్తసృష్టియు, నవ్యక్తప్రకృతియు నను సాంఖ్యశాస్త్రమునందలి రెండుశబ్దములతో సమానార్థములై యున్నవి. వీనిలో క్షరమనఁగా: నశ్వరమగు పంచభూతాత్మకవ్యక్తపదార్థ మనియర్థము స్పష్టమయి యున్నది. కాని యక్షర మనువిశేషణము పూర్వమునం దనేకపర్యాయములు

పరబ్రహ్మ యనునర్థముననైతము ప్రయోగింపఁబడియున్నది. (గీ. ౮. ౩; ౮. ౨౧; ౧౧. ౩౭; ౧౨. ౩ చూడుము.) పురుషోత్తమునియొక్క వైలక్షణ్యముల యందలి యక్షరశబ్దమునకు నక్షరబ్రహ్మ యని యర్థముకాదు. సాంఖ్యుల యొక్క యక్షర మను ప్రకృతియే యర్థమని యెఱుంగవలయును. ఈసంశయము కలుగకుండునిమిత్తమే యక్షర మనఁగా కూటస్థము(ప్రకృతి)యని ౧౬వ శ్లోకమునందు ముఖ్యముగ వ్యాఖ్యానము చేయఁబడినది. (గీతారహస్య. పు. ౨౭౨, ౨౭౩-౨౭౭) వ్యక్తసృష్టికిని యవ్యక్తప్రకృతికిని పరమంబున్న యక్షరబ్రహ్మకంటెను (గీ. ౮. ౨౧-౨౨ పైన నాటీకను చూడుము), మఱియు క్షరమును (వ్యక్తసృష్టి) నక్షరము (ప్రకృతి) నను వానికంటెను పరముగనున్న పురుషోత్తముఁడును నను నీరెండును యథార్థముగ నొక్కటే యైయున్నది. ఇతనినే పరమాత్మ యనిచెప్పుచున్నారనియు, నీపరమాత్మయే శరీరమునను క్షేత్రరూపమున వసించుచున్నాఁడనియు పదమూఁడవయధ్యాయమున చెప్పఁబడినది. (గీ. ౧౩. ౩౧) దీని నుండి క్షరాక్షరవిచారముచేఁ గుదురు నిష్పన్నమగుమూలతత్త్వమైన యక్షరబ్రహ్మయే క్షేత్రక్షేత్రజ్ఞవిచారమునకును పర్యవసానమనియు లేక పిండమందును బ్రహ్మాండమందును నొకపురుషోత్తముఁడే యున్నాఁడనియు సిద్ధమగుచున్నదని సారాంశము. ఇటులే యధిభూతము, నధియజ్ఞము మొదలగువానియందున్న, లేక పురాతనమగు నశ్వత్థవృక్షము నందున్న తత్త్వ మేదియో యనియుఁ జెప్పఁబడినది. జగత్తునందున్న యీ యైక్యమును తెలిసికొన్నవాఁడును "సర్వభూతములయందు నొకయాత్మయే"(గీ. ౬. ౨౯) కలదని జ్ఞానమును మరణపర్యంతమును మనస్సున నిలిపినవాఁడును (వే. సూ. ౪. ౧. ౧౨; గీ. ౮. ౬) కర్మయోగము నాచరించుచుండగనే పరమేశ్వరుని పొందుచున్నారని యీజ్ఞానవిజ్ఞానప్రకరణమునకు ముఖ్యతాత్పర్యము. కర్మలను చేయకుండ, పరమేశ్వరభక్తిమాత్రము చేత మోక్షము లభింపక పోనేరదు. కాని, గీతలయందున్న జ్ఞానవిజ్ఞాననిరూపణముల కది తాత్పర్యము కాదు. జ్ఞానముచేఁగాని, భక్తిచేఁగాని పరిపూతమగు నిష్కామబుద్ధితో సాంసారికకర్మల నన్నిఁటినిఁ జేయవలయుననియు, వానిని చేయుచుండగనే మోక్షమెట్లులభించుననియు నిరూపించుటకై యీజ్ఞానవిజ్ఞానములయొక్క నిరూపణ యారంభింపఁబడినదని యేడవ

యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్,
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత. ౧౯
ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ,
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత. ౨౦

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమయోగో నామ
పంచదశోఽధ్యాయః. ౧౫.

యధ్యాయారంభముననే చెప్పఁబడినది. అది యట్లుండ నిమ్ము. ఇప్పుడు దీనిని తెలిసికొనిన నేఫలము రాఁగలదో చెప్పుచున్నాఁడు.—]

(౧౯) ఇట్లు నేను పురుషోత్తముఁడ నని మోహమునుఁ జెందక యెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు సర్వజ్ఞుఁడై సర్వభావముల చేతను నన్నే భజించు చున్నాఁడు (౨౦) ఓ నిష్పాపుఁడవగు భారతా! యిట్టిగుహ్యముల యన్నింటి లోను గుహ్యమగు శాస్త్రము నాచేఁ జెప్పఁబడినది. దీనిని దెలిసికొనుటచే మనుష్యుఁడు బుద్ధిమంతుఁడై (అనఁగా: బుద్ధుఁడు, లేక జ్ఞానియై) కృతకృత్యుఁ డగును.

[బుద్ధిమచ్ఛబ్దమునకు బుద్ధుఁడు (తెలిసికొన్నవాఁడు) అనియిచ్చోనర్థము. కారణమేమన: భారతమునం (శాం. ౨౪౮. ౧౧) దీయర్థమునందే బుద్ధ శబ్దమును, కృతకృత్యశబ్దమును ప్రయోగింపఁబడినవి. బుద్ధశబ్దమునకు బౌద్ధావతారమనురూఢార్థము మహాభారతమునం దెక్కడను లేదు. (గీతారహస్య. పరి. పు. ౪౯౯ చూడు.—]

ఈరీతిగ భగవంతునిచే గానము చేయఁబడిన పురుషోత్తమప్రాప్తియోగ మనెడు పదునేనవ యధ్యాయము సమాప్తమయినది.



# షోడశోఽధ్యాయః.

---

పదునాఱవ యధ్యాయము.

శ్రీభగవానువాచ.

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. ౧
అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతిరపైశునమ్,
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్. ౨

[పురుషోత్తమయోగ మను క్షర-అక్షరజ్ఞానముయొక్క పరమావధి ముగిసినది. మఱియు నిజముగ విచారించితిమేని, కర్మయోగము నాచరించుచుండ నందుచేతనే పరమేశ్వరునిజ్ఞానము గలిగి మోక్షమెట్లుగల్గునదియు నిరూపించుటకయి యేడవ యధ్యాయము మొదలుకొని చెప్పుట కారంభింపఁబడిన జ్ఞానవిజ్ఞానములిచ్చో సమాప్తములైనందున నిక నుపసంహారముమాత్రమే మిగిలియుండెను. అయినను తొమ్మిదవయధ్యాయమునందు (౯. ౧౨) రాక్షసు లగుమనుజులు, నాయొక్కయవ్యక్తము, శ్రేష్ఠము నగుస్వరూపమును దెలిసికొన లేరని భగవంతుఁడు సంక్షేపముగఁ జెప్పినవిషయమునే విస్తరించుటకయి యీయధ్యాయ మారంభింపఁబడినది; మఱియు మనుజులయం దిట్టిభేద మేలకలుగునలయునో తర్వాతనుండు నధ్యాయములలోఁ జెప్పి పిమ్మట పదునెనిమిదవ యధ్యాయమునందు గీతనంతను నుపసంహరించుచున్నాఁడు.—]

భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—(౧) ఓభారతా! అభయమును, శుద్ధమగు సాత్త్వికవృత్తియును, జ్ఞానయోగవ్యవస్థితియు (అనఁగా: జ్ఞానమార్గముయొక్కయు, కర్మయోగముయొక్కయు తారతమ్యవ్యవస్థను జేయుటయును), దాతృత్వము, దమము, యజ్ఞము, స్వాధ్యాయము, (అనఁగా: స్వధర్మానుసారముగఁ బ్రవర్తించుట) తపస్సు, సరళత, (౨) అహింస, సత్యము, క్రోధము లేకుండుట, త్యాగము. (కర్మఫలత్యాగము) శాంతి, అపైశున్యము, క్షుద్రబుద్ధిని

తేజః క్షమా ధృతి శ్శౌచమద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత. • 3

విడనాడి యుదారబుద్ధితో నుండుట, సర్వభూతములయందును దయ, లంప టుఁడు కాకుండుటయు, మృదుత, (దుష్కార్యములయందలి) లజ్జయు, చాపల్యములేకుండుట, అనఁగా: వ్యర్థపనులుచేయక పోవుట (3) తేజస్విత, క్షమ, ధృతి, శుచిగనుండుట, ద్రోహముచేయకపోవుట, అను నీగుణములు దైవీసంపత్తునందు జన్మించిన పురుషునకు ప్రాప్తములగును.

[దైవీసంపదయొక్క యీయిరువదియారుగుణములును, పదమూఁడవ యధ్యాయమునఁ జెప్పఁబడిన జ్ఞానముయొక్క యిరువదిలక్షణములును (గీ. ౧౩, ౭-౧౧) నిజముగ విచారించిన వేఱుకావు. ఈహేతువువలన బట్టి ముందుశ్లోకములయందు నజ్ఞానము నాసురీసంపదయందుఁ జేర్పఁబడినది. ఈయిరువదిగుణములయొక్క పట్టికయందున్న ప్రతిశబ్దమునకును సర్వాలోశలలోను వేర్వేఱుగనర్థములను జెప్పుటకు వీలులేదు. అట్టి యుద్దేశమును లేదు. ఉదాహరణము:—అహింసను గొందఱు కాయికమనియు, వాచికమనియు, మానసిక మనియు విభజించి క్రోధముచే నితరులమనస్సును నొప్పించుట యనునది యొకవిధమగు హింసయే యనిచెప్పుచున్నారు. శుచిగనుండుటనుసైతము మిట్లే త్రివిధమంగుమేని మనస్సుయొక్క శుచిత్వమందు క్రోధము చెందకుండుటయు, ద్రోహము చేయకుండుటయు మొదలగు గుణములును చేరును. మహాభారతమున శాంతిపర్వమునందు ౧౬౦ వ యధ్యాయము మొదలు ౧౬౩ వ యధ్యాయమువఱకును వరుసగ దమము, సత్యము, లోభము ననునవి సవిస్తరముగ వర్ణింపఁబడినవి. వీనిలో దమము నందే, క్షమ, ధృతి, అహింస, సత్యము, ఆర్జవము, లజ్జ మొదలగు నిరువది యైదుగాని, ముప్పదిగాని గుణములును జేరును. (శాం. ౧౬౦) సత్యముయొక్కనిరూపణయందు (శాం. ౧౬౨) సత్యము, సమత, దమము, అమాత్సర్యము, క్షమ, లజ్జ, తితిక్ష, అనసూయత, యాగము, ధ్యానము, ఆర్యత (లోకకళ్యాణేచ్ఛ) ధృతి, దయ, అనునీపదమూఁడుగుణములును, సత్యము నందే చేర్చు ననిచెప్పఁబడినది. అచ్చోటనే యీశబ్దములకు వ్యాఖ్యానము సైతము చేయఁబడినది. ఒకగుణమునందె యీతీరున ననేకగుణములఁ జేర్చుట యనునది పాండిత్యముచేఁ జేయుపనియై యున్నది. ప్రతిగుణమును

§§ దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్. ౪
§§ దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా,
మా శుచః సంపదం దైవీమభిజాతోఽసి పాండవ. ౫

గుఱించియు నొక్కొక్క ప్రత్యేకగ్రంథము వ్రాయవలసివచ్చును. దైవీ సంపత్తుయొక్క సాత్త్వికస్వరూపమును పూర్తిగఁ దెలియపఱచుటకే పైశ్లోకమునందు గుణములయొక్క సముచ్చయమంతయుఁ జేయఁబడినది. మఱియు నొకానొకశబ్దమున నేదైననొకయర్థ మిమిడియుండక మఱియొక శబ్దమునం దిముడఁగలదియు ననుతలంపునను, నట్లు చేయఁబడినది. అది యట్లుండ నిమ్ము; పైపట్టికయం దున్న జ్ఞానయోగవ్యవస్థితి శబ్దమునకు గీత ౪. ౪౧-౪౨ శ్లోకముల యాధారముచే కర్మయోగపరముగ నర్థము చేసితిని. త్యాగశబ్దమునకును, ధృతిశబ్దమునకును, వ్యాఖ్యానము భగవంతునిచేతనే పదునెనిమిదవ యధ్యాయమున జేయఁబడినది చూడుఁడు. (౧౮. ౪ మఱియు ౨౯) దైవీ సంపత్తునందుఁ జేరుగుణములను జెప్పి యిప్పుడు తద్విరుద్ధపక్షము నందున్న యాసురీ, లేక రాక్షసీ సంపత్తును వర్ణించుచున్నాఁడు.—]

(౪) ఓపార్థా! దంభము, దర్పము, అభిమానము, క్రోధము, పారుష్యము అనఁగా : నిష్ఠురత, అజ్ఞానము ననునవి యాసురీసంపత్తునందు (అనఁగా : రాక్షస సంపత్తునందు) జన్మించినవారికి (ప్రాప్తములగును.)

[మహాభారతమునందు, శాంతిపర్వము ౧౬౪, ౧౬౫ అధ్యాయముల యందు వీనిలోఁ గొన్నిదోషములు వర్ణింపఁబడినది. తుదకు నృశంసుఁడని యెవరిని యనవలయునో యావిషయము కూడ చెప్పఁబడినది. అజ్ఞానమను నది యాసురీసంపత్తుయొక్క లక్షణమని యీశ్లోకమునందుఁ జెప్పఁబడి నందున జ్ఞానమనునది దైవీసంపత్తుయొక్క లక్షణమని స్పష్టమగుచునే యున్నది. జగత్తునందు కాన్పించుచున్న ద్వివిధములగు స్వభావములను నిట్లువర్ణించి.—]

(౫) (వీనిలో) దైవీసంపత్తు (పరిణామమునందు) మోక్షదాయకమనియు, నాసురీసంపత్తు బంధకమనియు, చెప్పుచున్నారు.—ఓపాండవా! నీవు దైవీసంపత్తునందు జన్మించినవాఁడవు. శోకింపకు మనియుపదేశించెను.

[దైవీ సంపద గలవారికిని, యాసురీ సంపద గలవారికిని గలుగు గతి

॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు. ౬.
ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః,
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. ౭
అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్,
అపరస్పరసమ్భూతం కిమన్య త్కామ హైతుకమ్. ౮

సంక్షేపముగఁ జెప్పఁబడినది. ఇప్పు డాసురసంపద గలవారిని విస్తారముగ వర్ణించుచున్నాఁడు.—]

(౬) ఈలోకమునందు జీవులు రెండువిధములుగఁ బుట్టుచున్నారు. ఒకఁడు దైవుఁడును, మఱియొకఁ డాసురుఁడును. వీరిలో దైవ (ప్రకారముయొక్క) వర్ణనముగఁ జేయఁబడినది. ఇప్పుడో పార్థా! యాసుర (ప్రకారమగు) వర్ణనను నేను జేయుచున్నాను వినుము.

[పూర్వాధ్యాయములయందు కర్మయోగి యెట్లు ప్రవర్తింపవలసినదియు, బ్రాహ్మీస్థితి యెట్లుండునదియు, లేక స్థితప్రజ్ఞుఁడు, భగవద్భక్తుఁడు, త్రిగుణాతీతుఁ డనియెవరిని చెప్పవలసినదియు, జ్ఞానమనఁగా: నేమియో యదియు నీ మొదలగు విషయములు చెప్పఁబడినవి. ఈ యధ్యాయముయొక్క మొదటి మూఁడుశ్లోకములయందునుఁ జేయఁబడిన దైవీసంపత్తుయొక్క వర్ణనమే, దైవీప్రకృతిగలవాని వర్ణనముగాన, దైవ వర్గముయొక్క వర్ణనము విస్తారముగ పూర్వమందు చేయఁ బడినదని, చెప్పఁబడినది. ఆసురసంపత్తి తొమ్మిదవ యధ్యాయమునందు (౯. ౧౧ మఱియు ౧౨) కొంచెము ల్లేఖింపఁబడినది. కాని యచ్చోటనుండు వర్ణన పూర్తికానిదగుటచే దాని నీయధ్యాయమునందిప్పుడు సంపూర్ణముగ వాక్రుచ్చుచున్నాఁడు.—]

(౭) ప్రవృత్తియు (ననఁగా: నేమి చేయవలసినదియు) నివృత్తియు (ననఁగా: నేది చేయకూడదో యదియు) నాసురులకు తెలియదు. శుచిత్వ, యాచారము, సత్యము ననునవి వారియందుండవు. (౮) వీరు (ఆసురులు) జగత్తంతయు నసత్యమనియు నప్రతిష్ఠమనియు (నిరాధారము) ననీశ్వరమనియు (అనఁగా: పరమేశ్వరుఁడు లేకనే యుండునది) అపరస్పరసంభూతమనియు (అనఁగా: నొకదానియందుండి మఱియొకటి పుట్టలేదనియు) కావుననే కామముదక్క (అనఁగా: మనుష్యుల యొక్క విషయోపభోగముల దక్క) యీజగత్తునకు మఱియొక ప్రయోజనమేమియు లేదనియుఁ జెప్పుదురు.

[ఈశ్లోకముయొక్క భావార్థము స్పష్టముగనున్నను వానియందలి పదముల కర్థమువిషయమై మిక్కిలి మతభేదములు గలవు. మాయమతానుసారముగ వేదాంతము, లేక కాపిలసాంఖ్యము ననుసరించుశాస్త్రములయొక్క జగద్రచనావిషయకమైన సిద్ధాంతము నొప్పుకొనని చార్వాకాదినాస్తికుల మతములను వర్ణించుచున్నదియు, కాన నీశ్లోకమునందున్న పదములు సాంఖ్యులయొక్కయు, నధ్యాత్మశాస్త్రమునందున్నవియు నగుసిద్ధాంతములకు విరుద్ధమగునర్థములుగల్గినవై యున్నవి. వేదాంతులు జగత్తు నశ్వరమని చెప్పి దానియందున్న యవినాశియగు సత్యమును-సత్యస్య సత్యం (బృ. ౨.౩-౬) శోధించి తీయుచున్నారు. ఆ సత్యమనుతత్త్వమే జగత్తునకు మూలాధారము, లేక ప్రతిష్ఠ యనియందురు.—బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా (తై. ౨.౫) కాని యాసురులీజగ దసత్యము, అనఁగా: దీనియందు సత్యము లేదో యట్టిది యనియు, నట్లే యప్రతిష్ఠము (అనఁగా: దీనికి ప్రతిష్ఠ కాని యాధారము కాని లేదో యది) అనియు నందురు. కాని యధ్యాత్మశాస్త్రమునందు ప్రతిపాదింపఁబడిన యవ్యక్తమగుపరబ్రహ్మ మీరీతిగ నాసురులకు సమ్మతము కాకపోయినను, భక్తిమార్గమునందున్న వ్యక్తుఁడగు నీశ్వరుని వారొప్పుకొందురా? యనుశంక కలుగనచ్చును. కాననీశ్వర(అ + ఈశ్వర) అనుమూఁడవ పదప్రయోగముచే నాసురులు జగత్తునం దీశ్వరుఁడును లేఁడని యందురని చెప్పఁబడినది. జగత్తుయొక్క మూలాధారము నీరీతిగ నంగీకరింపక పోవుదుమేని "ఆత్మన ఆకాశః సంభూతః। ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః। అగ్నేరాపః। అద్భ్యః పృథివీ। పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోఽన్నం। అన్నాత్పురుషః" మొదలగు నుపనిషత్తులయందున్న (తై. ౨. ౧) సృష్టిక్రమమును, లేక, ప్రకృతిపురుషులను స్వతంత్రములగు రెండు మూలతత్త్వములను నంగీకరించి సత్త్వ రజస్తమస్సులను గుణత్రయముయొక్క యన్యోన్యసంబంధముచే ననఁగా: పరస్పరమిశ్రణముచే వ్యక్తపదార్థములన్నియు నుత్పన్నములైనవి యనుసాంఖ్యశాస్త్రమునందున్న సృష్ట్యుత్పత్తిక్రమమును వదలవలసివచ్చును. కారణమేమన: నీగొలుసు లేక పరంపర యంగీకరింపఁబడినచో, దృశ్యసృష్టియందున్న పదార్థముల దగ్గర నుండి వెనుకకు పోనుపోను నీజగత్తునకేదైన మూలముండి తీరవలయు నని యంగీకరింపవలసి వచ్చును. కాన యాసురులు జగత్తునందున్న పదార్థములు (అ-పరస్పరసంభూతములు) అనఁగా: నొకదానినుండి యొకటియే క్రము

ముగా నుత్పన్నములైనవి) అని యంగీకరింపరు. జగత్తుయొక్క రచనా విషయమై యొకపరి యిట్లు నిర్ణయించిన పిదప మనుజుడు ప్రాణములనే ప్రధానములని నిశ్చయించి వానియొక్క కామవాసనలను, తృప్తిపొందించుట కొఱకే జగత్తునందున్న పదార్థములన్నియు ననియు వానికి మఱియొక ప్రయోజన మేమియు లేదనియు చెప్పనక్కఱలేకయే ప్రాప్తమగును. ఈయర్థమే "కిమన్యత్కామహైతుకం" కామములుదక్క దానికి రెండవకారణ మేమియుండదను. అను శబ్దములచే నీశ్లోకముయొక్క చివరను ముందుశ్లోకమునందును నీయర్థమే చెప్పఁబడినది. అనేకులగు టీకాకారులు "అపరస్పర సంభూతం" అనుదానికి 'కిమన్యత్' అను పదముతో నన్వయించి "పరస్పరము (అనఁగా: స్త్రీపురుషుల సంయోగమునుండి) పుట్టనిది మఱియొకటి కాన్పించునా? లేదు ఈపదార్థమే కన్పట్టునచో నీజగత్తు కామహైతుకముగనే (అనఁగా: స్త్రీపురుషులయొక్క కామేచ్ఛచేతనే) నిర్మింపఁబడినది" అనియర్థము చెప్పుచున్నారు. మఱికొందఱు "అపరశ్చ పరశ్చ, అపరస్పరౌ అనువిలక్షణ మగువిగ్రహమును చేసి, అపరస్పర యనఁగనే స్త్రీపురుషులను వారినుంచి యీజగత్తు పుట్టుటచే దానికి స్త్రీపురుషులయొక్క కామమే హేతువుగ నున్నది మఱియొక కారణమేదియు లేదు" అని యీపదములకే యర్థమును చెప్పుచున్నారు. కాని యీయన్వయము సరళమైనదికాదు. మఱియు నపరశ్చ పరశ్చ యనువానికి సమాసము అపర-పరౌ యని రూపమగును. మధ్యను అపరస్పర యని సకారమురాదు. ఇంతియకాక అసత్య, అప్రతిష్ఠ మొదలగు పూర్వమందున్న పదములను జూచినను అపరస్పర సంభూతశబ్దము, నఞ్, సమాసముగనే యుండవలయు నని కాన్పించుచున్నది. మఱియు నపరస్పర సంభూతశబ్దములచే సాంఖ్యశాస్త్రమునందు గుణములనుండి గుణములయొక్క యేయన్యోన్యజననము వర్ణింపఁబడినదో యదియే యిచ్చో వివక్షితమని చెప్పవలసివచ్చును (గీతారహస్య పు. ౨౧౧ మఱియు ౨౧౨, ౨౧౩ చూడు). "అన్యోన్య", "పరస్పర" శబ్దములు రెండును సమానార్థకములు. సాంఖ్యశాస్త్రములో నొకదానితో మఱియొకదానికి గలుగువిరోధమును జెప్పుచు నీరెండు శబ్దములును ప్రయోగింపఁబడినవి. (మ.భా. శాం. ౩౦౫; సాం. కా. ౧౨ మఱియు ౧౩ చూడు); గీతలయొక్క మాధ్వభాష్యమునం దీయర్థమునే స్వీకరించి జగత్తునందలి వస్తువు లొకదానివలన నొకటి యుత్పన్నమగు

ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః,
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. ౯
కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః ౧౦
చింతామపరిమేయాం చ ప్రలయాంతాముపాశ్రితాః,
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః. ౧౧
ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహంతే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్. ౧౨

మన్నదియు నిరూపించుటకు "అన్నాద్భవంతి భూతాని ఇత్యాది—" అగ్నిహోత్రమునందు వేయఁబడిన యాహుతి సూర్యుని చేరును. కాన యజ్ఞమునుండి వృష్టి, వృష్టినుండి యన్నము, అన్నమునుండి ప్రజలును బుట్టుచున్నారు—అను నర్థముగల గీతలయందున్న శ్లోకమే ప్రమాణముగఁ జెప్పఁబడినది (గీ. ౩. ౧౪; మను ౩౭౬ చూడుము) కాని తైత్తిరీయోపనిషత్తునందున్న వచనములు దీనికంటె మిక్కిలి ప్రాచీనములును వ్యాపకములును గాన వానినే నేను పైప్రమాణముగ గ్రహించితిని. అయినను గీతలయందలి అ-పరస్పర సంభూతపదముచేత నుపనిషత్తులయందలి సృష్ట్యుత్పత్తిక్రమమే విశేషముగ వివక్షితమని నే నెన్నెదను. అది యట్లుండనిమ్ము; జగత్తుయొక్క రచనావిషయమై చెప్పఁబడిన యాసురమతము వారియొక్క ప్రవర్తనముపై నెట్లు పరిణమించునదియు నిప్పుడు చెప్పుచున్నాఁడు. పైశ్లోకమునందు కడపటనుండు కామహైతుక మనుపదమునకు యిదివివరణము.—]

(౯) ఇట్టియూహతో నల్పబుద్ధులు గలనష్టాత్ములును, దుష్టులును క్రూరకర్మల నాచరించుచు, జగత్తును నశింపఁజేయుటకొఱకుఁ బుట్టుచున్నారు. (౧౦) మఱియు) ఎప్పుడును పూర్ణముకాని కామముల (అనఁగా: విషయోపభోగేచ్ఛలను) నాశ్రయించి దంభము, మానము, మదము ననువానిచే వ్యాపింపఁబడినవారు (అసురులు) మోహముచేత నసద్గ్రహమును (అనఁగా: నబద్ధపుకల్పనలను) మనస్సునందు చేసికొని దుర్మార్గపుపనులను జేయుచున్నారు. (౧౧) అటులనే యామరణాంతమును (లెక్కలేని సుఖోపభోగములయొక్క) చింతలచే నాకులులయి కామోపభోగములయందు మగ్నులయి యదియే పరమసాధ్యమని నిశ్చయించుచున్నారు. (౧౨) అనేక లట్టి పాశములచే బద్ధులై, కామక్రోధపరాయణులై,

ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్. ౧౩
అసౌ మయా హతః శత్రుర్హనిష్యే చాపరానపి,
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ ౧౪
ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. ౧౫
అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. ౧౬
ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతే నామయజ్ఞైస్తే దంభేనవిధిపూర్వకమ్. ౧౭
అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. ౧౮
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,

సుఖోపభోగములకొఱకు న్యాయముగ పుష్కలముగ ధనము నార్జించుటయను నభిమానముగలవారగుచున్నారు. (౧౩) నేనీదినమున నింతసంపాదించితిని. ఈ కోరికను నెఱవేర్చుకొందును. ఈ ధనము నాదగ్గిర నున్నది. అదియును నాదేయగును. (౧౪) ఈశత్రువుల, నేజంపితిని. ఇంకను కొందఱిని నేను చంపుదును. నే నీశ్వరుఁడను. (నేనే) ఉపభోగించువాఁడను, నేను సిద్ధుఁడను, బలాఢ్యుఁడను, సుఖిని, (౧౫) నేను సంపన్నుఁడను. గొప్పకులమందుఁబుట్టితిని. నాతో సమానుఁడెవఁడు? నేను యజ్ఞమును జేయుదును, దానములిచ్చెదను, నేనానందము నొందుదును. అని యజ్ఞానముచే మోహమునొంది (౧౬) యనేకప్రకారములగు కల్పనలచే భ్రాంతులయి మోహజాలములోఁబడి విషయోపభోగములయందాసక్తులయిన యీయసురులశుచి యగునరకమందుఁ బడుచున్నారు! (౧౭) ఆత్మశ్లాఘనమునుఁ జేసికొనువారును, స్తబ్ధులును, ధనముయొక్కయు మానముయొక్కయు మదముతోఁ గూడినవారును, నగునాసురులు దంభముతో శాస్త్రవిధినిఁ వదలి కేవలనామమాత్రములగు యజ్ఞములచేయుచుందురు. (౧౮) అహంకారముచేతను, బలముచేతను, కామముచేతను, దర్పముచేతను, క్రోధముచేతను నిండినవారై తమ యొక్కయు, నితరులయొక్కయు దేహములందున్న నన్ను (పరమేశ్వరుని) ద్వేషించుచు,

క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు. ౧౯
ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని,
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్. ౨౦
§§ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేత త్త్రయం త్యజేత్. ౨౧
ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభిర్నరః,
ఆచరత్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్. ౨౨
§§ యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి. ౨౪

నిందించుచు (౧౯) అశుభకర్మలను జేయుచు, ద్వేషించువారును, క్రూరులు నగు నీచరాధములను (ఈ) సంసారమునందు పాపయోనులయందే యెప్పుడును పడవేయుచుందును. (౨౦) ఓకౌంతేయా! ఇట్లు ప్రతిజన్మయందును నాసుర యోనులనే పొందుచు నీమూఢులు నన్నెప్పుడు పొందక మిక్కిలి యధోగతి నొందుదురు.

[అసురులును వారికి ప్రాప్తమగుగతియును వర్ణింపఁబడినది. ఇప్పుడు దీనియందుండి యెట్లు విముక్తులగుదురో చెప్పుచున్నాఁడు.—]

(౨౧) కామము, క్రోధమును, లోభము ననుమూఁడును మూఁడువిధము లగు నరకద్వారములు. అవి మనలను నశింపఁజేయుచున్నవి. కాన నీమూఁడింటిని వదలవలయును. (౨౨) ఓకౌంతేయా! ఈ మూఁడుతమోద్వారములనుండియు విముక్తుఁ డగునేని మనుజుఁడు దనకు దేనివలన మేలుగలుగునో దానినే యాచరింప నారంభించి పిదప నుత్తమగతి నొందును.

[మూఁడునరకద్వారములను వదలిపోవునేని సద్గతి లభించు నని స్పష్టముగనే దెలియుచున్నది; కాని యేవిధమున ప్రవర్తించుటచే వదులునో చెప్పలేదు. కావున నామార్గము నిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౨౩) ఎవఁడు శాస్త్రోక్తవిధిని వదలి యిచ్ఛచొప్పున జేయుచున్నాఁడో వానికి సిద్ధిలభింపదు, సుఖములేదు, ఉత్తమగతియు లభింపదు. (౨౪) కావున కార్యాకార్యవ్యవస్థితిని (అనఁగా: కర్తవ్యమేదియో, యకర్తవ్యమేదియో) నిర్ణ

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసంపద్విభాగయోగో నామ
షోడశోఽధ్యాయః.

యించుటకు నీవు శాస్త్రమునే ప్రమాణముగ గ్రహింపవలయును. శాస్త్రమునఁ జెప్పఁబడినదాని నెఱింగి తదనుసారముగఁ గర్మలం జేయుట యీలోకమున నీకు కర్తవ్యము.

[ఈ శ్లోకమునందుండు 'కార్యాకార్యవ్యవస్థితి' యను పదమునుబట్టి కర్తవ్యశాస్త్రముయొక్క (అనఁగా: నీతిశాస్త్రముయొక్క) కల్పనను కన్నుల యెనుట నిడికొని గీత యుపదేశింపఁబడినదని స్పష్టమగుచున్నది. దీనినే కర్మయోగశాస్త్రమని చెప్పుచున్నారని గీతారహస్యమునందు (పు. ౬౮-౭౦) స్పష్టముగ నిరూపింపఁబడినది.—]

ఇట్లు భగవంతునిచే గానము చేయఁబడిన దైవాసురసంపద్విభాగయోగమను పేర్గు గల్గిన పదునాఱవ యధ్యాయము సమాప్తమయినది.



# సప్తదశోఽధ్యాయః.

---

అర్జున ఉవాచ.

యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః,
తేషాం నిష్ఠాతు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః. ౧

## పదునేడవయధ్యాయము.

[కర్మయోగశాస్త్రానుసారముగ జగత్తుయొక్క ధారణపోషణలఁ జేయువారిని, జగత్తును నశింపఁజేయువారిని నిట్లు వర్ణించినపిదప మనుజులలో నిట్టి భేదమేలగలుగు నని సందేహము సహజముగఁ గలుగును. "ప్రకృత్యా నియతాః స్వయా"—వారివారి ప్రకృతిచే నియతులగుదురు (అనఁగా: నట్లుండుట వారికి స్వభావము) అని యేడవయధ్యాయమున నీశంకకు సామాన్య మగుసమాధానము చెప్పఁబడినది (౭. ౨౦) కాని సత్త్వ రజస్తమస్సు లనుగుణము లప్పుడు నివేచింపఁబడనందున నీప్రకృతిజన్యము లగుభేదములకు సవిస్తరమయిన యుపపత్తి యచ్చోఁ జెప్పఁబడలేదు. కాన పదునాల్గవ యధ్యాయమున గుణత్రయమును వివరించి, యిప్పుడు వానివల్లనే శ్రద్ధాదులయొక్క స్వభావవైచిత్ర్యము నైత మెట్లు గలుగునదియుఁ జెప్పి జ్ఞానవిజ్ఞానములయొక్క సంపూర్ణమగులక్షణ మీయధ్యాయములయందుఁ జెప్పఁబడినది. అట్లే తొమ్మిదవ యధ్యాయమునందున్న భక్తిమార్గమున నైత మనేకభేదము లేల గల్గినవో యీయధ్యాయమునందలి యుపపత్తిచే తెలిసికొనఁబడును (౯. ౨౩, ౨౪ చూడుము).—]

అర్జునుఁ డడుగుచున్నాఁడు.—(౧) ఓకృష్ణా! శ్రద్ధతోఁ గూడినవాఁడైనను శాస్త్రమునందలి విధిని వదలి యజనము చేయువానియొక్క నిష్ఠ (అనఁగా: మనస్సుయొక్క స్థితి) యెట్టిదని తెలిసికొనవలయును? సాత్త్వికమైనదా? రాజసమైనదా? తామసమైనదా?

[పూర్వాధ్యాయము కడపట శాస్త్రమునందలి విధినే నీవు నియమమును, పాలింపవలయు నని చెప్పినపిదప నర్జునున కీశంక కలిగెను. శాస్త్రమునందు నమ్మకమున్నను మనుజుఁ డజ్ఞానముచేఁ బొరఁబడును. ఉదాహరణము. సర్వవ్యాపి యగుపరమేశ్వరునియొక్క భజనపూజనములు సేయు

శ్రీభగవానువాచ.

త్రివిధా భవతి శ్రద్ధా దేవానాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. ౨
సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః. ౩

వలయును శాస్త్రవిధిని విడిచి యితరదేవతలను పూజించుచున్నాఁడు (గీ. ౯. ౨౩) అయినను నట్టిపురుషునియొక్క నిష్ఠ (అనఁగా: నవస్థ లేక స్థితి) యెట్టిదని యర్జునుఁ డడిగెను. అపనమ్మకముచే శాస్త్రములను ధర్మములను తిరస్కరించువారి విషయమయి (అనఁగా: నాసురులగుఱించి) యీ ప్రశ్న చేయఁబడలేదు. అయినను ప్రసంగానుసారముగ వారి కర్మలయొక్క ఫలములుసైతము యీయధ్యాయమునందు వర్ణింపఁబడుచున్నది.—]

భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—(౨) సమస్త జీవులయొక్కయు శ్రద్ధ స్వభావమునుబట్టి సాత్త్వికమనియు, రాజసమనియు, తామసమనియు మూఁడు విధములు. అది యెట్లో వినుము. (౩) ఓభారతా! అందఱకును శ్రద్ధ వారివారి పూర్వజన్మసంస్కారముతోఁ గూడిన యంతఃకరణము ననుసరించి కలుగును. మనుష్యుఁడు శ్రద్ధామయుఁడై యున్నాఁడు. ఎవనికి దేనియందు శ్రద్ధ యుండునో యటులే వాఁడగును.

[రెండవ శ్లోకమునందు సత్త్వశబ్దమునకు దేహస్వభావము, లేక యంతఃకరణ మనునర్థము కఠోపనిషత్తున చెప్పఁబడినది. (కఠ. ౬. ౭) వేదాంతసూత్రములయొక్క శాంకరభాష్యమునందు క్షేత్రక్షేత్రజ్ఞపదములు ప్రయోగింపఁబడినవి (వే. సూ. శాం. భా. ౧. ౨. ౧౨). రెండవ శ్లోకమునందున్న స్వభావశబ్దమును, మూఁడవ శ్లోకమునందున్న సత్త్వశబ్దమును, నీశ్లోకమున సమానార్థకములై యున్న వని సారాంశము. కారణమేమన: స్వభావమనఁగా: ప్రకృతి యనియు, ప్రకృతియందుండియే బుద్ధియు, నంతఃకరణమును బుట్టెననియు, నీ సిద్ధాంతము సాంఖ్యులకును వేదాంతులకును సమ్మతమే. ఎవరి కెట్టి శ్రద్ధగలదో వాఁ డట్లగుచున్నాఁ డను సిద్ధాంతము. "దేవతలను భజించువారు దేవతలను బొందుదురు" మొదలగు పూర్వమునందుఁ జెప్పఁబడిన సిద్ధాంతములను సామాన్యమైన యనువాదమైయున్నది (గీ. ౭. ౨౦-౨౩; ౯. ౨౫). గీతారహస్యమునందలి పద

యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః. ౪

[మూఁడవ ప్రకరణమునం దీవిషయమును నేను విచారించితిని; (గీతార. పు. ౫౭–౫౮ చూడుము) ఎవరికెట్టినిశ్చయము గలదో వారి కట్టిఫలము గలుగును. ఈనిశ్చయము గలుగుటయు, గలుగకుండుటయు ప్రకృతిస్వభావము నవలంబించి యుండు నని చెప్పినపిదప దాని నెట్లు బాగు చేసికొనవలయునో యని మరల ప్రశ్న వెలువడును. ఆత్మ స్వతంత్రమైనది యగుటచే నిదేహస్వభావ మీయభ్యాసముచేతను, వైరాగ్యముచేతను మెల్ల మెల్లగ క్రమేణ మార్పవచ్చు ననునది దానికి సమాధానము. ఈవిషయము గీతారహస్యమునందలి పదియవ ప్రకరణమునందు (పు.౨౭౫, ౨౮౧–౨౮౪, ౨౮౭ వివరింపఁబడినది చూడుము.) ప్రస్తుతమున శ్రద్ధాభేద మేల? యనియు నది యెట్లుగలుగుచున్న దనియు మనము విచారింపవలసి యున్నది. కాన ప్రకృతి స్వభావానుసారముగ శ్రద్ధ మారుచని చెప్పిన పిదప నిప్పుడు ప్రకృతియును సత్త్వ రజస్తమోగుణములతో యుక్తమై యుండుటచేతనే, శ్రద్ధకును మనుజుల స్వభావమునకును, నెట్లు త్రివిధ భేదము గల్గుచుండునదియు వానికేమి పరిణామము గల్గునదియుఁ జెప్పుచున్నాఁడు,—]

(౪) సాత్త్వికము (సత్త్వగుణ ప్రధానములయిన) స్వభావముగలిగిన వారు దేవతలను యజించుచున్నారు; రాజసులు యక్షరాక్షసుల నుపాసించుచున్నారు. మిగిలినవారు (అనఁగా: తామసులు) ప్రేతలను భూతగణములను యజించుచున్నారు.

[శాస్త్రములయందు శ్రద్ధగలిగిన మనుజులును సత్త్వాది ప్రకృతిగుణములయొక్క భేదముచేఁ బొందుచున్న మూఁడుభేదములును వారియొక్క స్వరూపములును చెప్పఁబడినవి. ఇప్పుడు శాస్త్రమువిషయమై శ్రద్ధలేని కామపరాయణులయొక్కయు దాంభికులయొక్కయు వర్గమేదియో చెప్పుచున్నాఁడు. వీరు సాత్త్వికులు కారని స్పష్టమయ్యెయున్నది. కాని వారు కేవలము తామసులని చెప్పుటకును వీలులేదు. కారణమేమన: వారికర్మలు శాస్త్రవిరుద్ధములైనను వానిని చేయుటయందు వారికి ప్రవృత్తికలదు. ప్రవృత్తి రజోగుణధర్మమై యున్నది. ఇట్టివారు సాత్త్వికు లనిగాని,

§§ అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః,
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః. ౫
కర్షయంతశ్శరీరస్థం భూతగ్రామమచేతసః,
మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్. ౬
§§ ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞస్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు ౭

రాజసు లనిగాని, తామసు లనిగాని చెప్పుటకు వీలులేదు. కాన దైవీసర్గమనియు నాసురీసర్గమనియు రెండువర్గములను గల్పించి వానిలో నీదుష్టుల నాసురవర్గమునందు జేర్చవలయు నని సారాంశము. ఈయర్థమే ముందున్న రెండుశ్లోకములయందును జెప్పఁబడినది.—]

(౫) (కాని) ఎవరు దంభాహంకారములతోఁ గూడినవారయి కామముయొక్కయు నాసక్తియొక్కయు బలముచే శాస్త్రవిరుద్ధమయిన ఘోరతపస్సును జేయుచున్నారో వారవివేకులయిన యాసురబుద్ధి గలవారని యెఱుంగుము. (౬) మఱియు నెవరు శరీరమునందున్న పంచమహాభూతములు మొదలగువాని సముదాయమునేగాక శరీరములోనుండు నన్నుసైతము కష్టపెట్టుచున్నారో వారవివేకులయిన యాసురబుద్ధిఁ గలవారని యెఱుంగుము.

[ప్రకృతిస్వభావమునుబట్టి సాత్త్వికమును, రాజసమును, తామసమును గాఁగలను. తదనుసారముగ వారికర్మలలో భేదముండును. వారికర్మానురూపముగ వారికి వేర్వేఱగు గతి ప్రాప్తమగును. అయిన నింతమాత్రముచేతనే ప్రతిమనుజుఁడును నాసురవర్గములోనివాఁడు కాఁడు. ఇఁకనేమన: నాత్మస్వాతంత్ర్యము నుపయోగించుకొనియు, శాస్త్రప్రమాణముగఁ బ్రవర్తించుచు, ప్రకృతిస్వభావమును క్రమేణ సంస్కరించుకొనుటకుఁ బ్రతిమనుజుఁడును బ్రయత్నింపవలయును. ఇట్లుచేయక దుష్టమగు ప్రకృతిస్వభావముయొక్క యభిమానమునే వహించి శాస్త్రవిరుద్ధమైన యాచరణమునే చేయువా రాసురబుద్ధిగలవారని చెప్పవలయు నని యీశ్లోకముయొక్క భావార్థము. ఇప్పుడు శ్రద్ధానుసారముగనే యాహారము, యజ్ఞము, తపస్సు, దానము నను నవి సత్త్వరజస్తమస్సులనెడి ప్రకృతిగుణములచే నెట్లు వేర్వేఱగుచున్నదియు, నాకారణమున స్వభావవైచిత్ర్యముసైత మెట్లుగల్గునదియుఁ జెప్పుచున్నాఁడు—].

(౭) ప్రతిమనుజునకును నిష్టమగు నాహారముసైతము మూఁడువిధములుగ

ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః. ౮
కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. ౯
యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. ౧౦

నున్నది. అట్లే యజ్ఞమును, తపస్సును, దానమును మూఁడువిధములు. వానిభేదమును జెప్పుచున్నాను వినుము. (౮) సాత్త్వికపురుషునకు రుచించు నాహారమాయుష్యమును సాత్త్వికవృత్తిని, బలమును, నారోగ్యమును, సుఖమును, ప్రీతిని వృద్ధిపొందించును. మఱియు రసయుక్తమును, స్నిగ్ధమును నై శరీరమందుఁ బ్రవేశించి చిరకాలముండునదియు మనస్సునకు నానందదాయకమును నగును. (౯) రాజసపురుషులకు నిష్టమగు నాహారము కారముగను, పులుపుగను, నుప్పగను, మిక్కిలి వేడియైనదిగను, మండునదిగను, రూక్షమైనదిగను, దాహమునుఁ జేయునదిగను, దుఃఖమును, శోకమును, రోగమును పుట్టించునదిగను నుండును.

[సంస్కృతమునందు కటువు అనఁగా : కారముగనుండునదియు తిక్తము చేదని యర్థమైనందున తదనుసారముగనే సంస్కృత వైదికగ్రంథములయందు మిరియములు కారముగలవియనియు, వేపాకు చేదనియు వర్ణింపఁబడెను. (వాగ్భటసూత్ర. అ. ౧౦. చూడు) కటు, తిక్త శబ్దములకు యథాక్రమముగ కారము చేఁదు అని యపభ్రంశరూపములు.—]

(౧౦) తామస పురుషులకు నిష్టమగు నాహారము, చాలసేపటికి క్రింద వండఁబడినదిగను, రసహీనమైనదిగను, దుర్గంధముగలదిగను, చద్దిదిగను నుచ్ఛిష్టమైనదిగను, నపవిత్రమైనదిగను నుండును.

[సాత్త్వికమనుజులకు సాత్త్వికమును, రాజసులకు రాజసమును, తామసులకు తామసమును నగు నాహారము రుచించును. ఇంతియకాక యాహారము సాత్త్వికముగనున్నచో మనుష్యునియొక్క వృత్తియు క్రమముగ సాత్త్వికము కాఁగలదు. "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః" అని యుపనిషత్తులలోఁ జెప్పఁబడినది. (ఛాం. ౭. ౨౬. ౨) కారణమేమన : మనస్సును బుద్ధియుఁ బ్రకృతి యొక్క వికారములగుటచే, నాహారము సాత్త్వికమగునేని తదనుసారముగ బుద్ధియు, తనంతట తానే సాత్త్వికమగును. ఆహారము

§§ అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః. ౧౧
అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్. ౧౨
విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. ౧౩
§§ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్,
బ్రహ్మచర్యమహింసా చ శారీరంతప ఉచ్యతే. ౧౪

యొక్క భేదము నిరూపింపఁబడినది. ఇప్పుడిట్లే యజ్ఞములయందలి మూఁడు భేదములను చెప్పుచున్నాఁడు.—]

(౧౧) ఫలాశనుఁ జెందక యజ్ఞమునుఁ జేయుట, తనకర్తవ్యమని యెన్ని కొని శాస్త్రవిధిప్రమాణముగ శాంతచిత్తముతోఁ జేయఁబడు యజ్ఞము సాత్త్వికము. (౧౨) ఓభరతశ్రేష్ఠా! ఫలమును గోరిగాని, దంభార్థమైగాని (అనఁగా: నైశ్వర్యమునుఁజూపుటకై చేయఁబడుయజ్ఞము రాజసమని యెఱుంగుము.

(౧౩) శాస్త్రవిధిని వదలి యన్నదానమును, మంత్రములును దక్షిణలును శ్రద్ధయులేకుండగ చేయఁబడిన యజ్ఞము తామసమని చెప్పుచున్నారు.

[ఆహారమువలెను, యజ్ఞమువలెను, తపస్సునైతము త్రివిధము. కాని మొదట కాయికము, వాచికము, మానసికము నని తపస్సును మూఁడువిధములుగ విభజించి యనంతరమునం దీమూఁడింటికిని ప్రత్యేకముగ సత్త్వరజస్తమోగుణములచేఁ గలుగు త్రైవిధ్యము వర్ణింపఁబడినది. తపస్సు అనఁగా: నేరణ్యమునకేగి పాతంజలయోగముచే శరీరమును కష్టపెట్టు కొనుట యనుసంక్షేపమగు నర్థమిచ్చో వివక్షితముకాదు. యజ్ఞయాగాది కర్మలును వేదాధ్యయనమును, చాతుర్వర్ణ్యానుసారముగ వారివారికర్తవ్యములగుకర్మలును, (ఉదాహరణము:—క్షత్రియుఁడు యుద్ధమునుఁజేయుట, వైశ్యుఁడు వ్యాపారమునుఁజేయుట మొదలగునవియున్నియు) వారివారి తపస్సులే యైయున్నవని తపశ్శబ్దమునకు మనువుచే వ్రాయఁబడిన వ్యాపకార్థమే (మను. ౧౧. ౨౩౬) గీతయందలి యీశ్లోకమున నుద్దేశింపఁబడి యున్నది.—]

(౧౪) దేవతలయొక్కయు, బ్రాహ్మణులయొక్కయు, విద్వాంసులయొ

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. ౧౫
మనఃప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః,
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే. ౧౬
§§ శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే. ౧౭
సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్. ౧౮

క్కయందు పూజనమును, శుచిత్వము, సరళత, బ్రహ్మచర్యము, అహింసయనునవి శారీరకతపస్సులు (అనఁగా: కాయికతపస్సు) అని చెప్పుచున్నారు. (౧౫) (మనస్సునకు) నుద్వేగము నియ్యనిదియు, సత్యమును ప్రియమును, హితకరమును నైన భాషణమును, స్వాధ్యాయమును (అనఁగా: స్వకర్మయొక్క యభ్యాసమును) వాచికమైన తపస్సని చెప్పుచున్నారు. (౧౬) మనస్సును ప్రసన్నముగనుంచుట, సౌమ్యత, మౌనము, (అనఁగా: మునివలె ప్రవర్తించుట) మనోనిగ్రహము, శుద్ధభావన, అనునవి మానసతపస్సు లని చెప్పుచున్నారు.

[౧౫వ శ్లోకమునందలి సత్య, ప్రియ, హితశబ్దములు "సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాన్న బ్రూయాత్ సత్యమప్రియమ్, ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మః సనాతనః" (మను. ౪. ౧౩౮);—సత్యము, మాటలాడవలయును, ఇష్టముగ మాటలాడవలయును, సత్యమైనను అప్రియము నాడరాదు, ఇది సనాతన మగుధర్మము—అను మనువచనము ననుసరించి యున్నట్లు కన్పట్టుచున్నది. అయినను "అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా హి దుర్లభః" అని మహాభారతమునందు విదురుఁడు దుర్యోధనునకుఁ జెప్పియున్నాఁడు (సభా. ౬౩. ౧౭ చూడు.) కాయికము, వాచికము, మానసికమునను మూఁడువిధము లగుతపస్సును మరల నెట్లు విభజింపఁ బడెనన.—]

(౧౭) ఈ త్రివిధమైన తపస్సును, ఫలాశనువదలి యధిక మగుశ్రద్ధతోడను, యోగయుక్త మగుబుద్ధితోడను, మనుజునిచే జేయఁబడినచో నది సాత్త్వికమని చెప్పఁబడుచున్నది. (౧౮) తనకు సత్కారము, మానము, లేక పూజ కావలయు ననిగాని, లేక దంభముతో ననుగాని చేయఁబడిన తపస్సును చలమయిన

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థంవా తత్తామ సముదాహృతమ్. ౧౯
§§ దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్. ౨౦
యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః,
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్. ౨౧
అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్. ౨౨

(అస్థిరమగు) తపస్సును, నిశ్చ (యనఁగా: శాస్త్రమున) రాజసమని చెప్పఁబడినది. (౧౯) వెఱ్ఱిపట్టుదలచే తన్ను పీడించునదియు లేక (జారణ, మారణాదికర్మలచే) లోకులను పీడించుటకై చేయఁబడునదియు నగుతపస్సు తామస మనుచున్నారు.

[తపస్సునందలి భేదములు నిరూపింపఁబడినవి. ఇప్పుడు దానమునందలి త్రివిధమగు భేదమును చెప్పుచున్నాడు.—]

(౨౦) దానము చేయుట తనకు కర్తవ్య మనుబుద్ధితో యోగ్యమగు స్థలమును, కాలమును, పాత్రమును విచారించి ప్రత్యుపకారమును కోరక చేయుదానము సాత్త్వికమని చెప్పఁబడినది. (౨౧) కాని (చేయఁబడిన) యుపకారమునకు బదులుగగాని, లేక ముందేదో యొక యాశ నుంచుకొనిగాని తప్పించుకొనలేక చేయఁబడుదానము రాజస మనిచెప్పఁబడినది. (౨౨) అయోగ్యస్థలమునందును, నకాలమునందును, నపాత్రయందును, సత్కారరహితముగ గాని, లేక యపమానపూర్వకముగగాని చేయఁబడుదానము తామసమని చెప్పుచున్నారు.

[ఆహారము, యజ్ఞము, తపస్సు, దానము ననువానివలెనే, జ్ఞానము, కర్మ కర్త, బుద్ధి, ధృతి, సుఖము ననునవియు, త్రివిధములుగ ముందరియధ్యాయమునందు వర్ణింపఁబడినవి. (గీ.౧౮. ౨౦. ౩౯) ఈయధ్యాయమునందున్న గుణభేదప్రకరణము సమాప్తమయినది. ఇప్పుడు బ్రహ్మను నిర్దేశించి పైనఁ జెప్పఁబడిన సాత్త్వికకర్మలయొక్క శ్రేష్ఠత్వమును, కర్తవ్యతను సిద్ధింపఁ జేయుచున్నాఁడు. కారణ మేమన: పైనుండు వివేచనమును బట్టి కర్మ సాత్త్వికమైనను, రాజసమైనను, తామసమైనను దోషమయమును దుఃఖకరమును నగుటచే నీకర్మలన్నింటిని వదలిననే గాని బ్రహ్మప్రాప్తి కలుగదనుసిద్ధాంతము నిజమయినచో, స్వాకర్మ సాత్త్వికమనియు, నీకర్మ

§§ ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః,
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. ౨౩

రాజసమనియు, చెప్పుటకు కారణ మేమి యని శంకకలుగవచ్చును. సాత్త్వికము, రాజసము, తామసము అను కర్మలయొక్క భేదము పరబ్రహ్మకంటె వేఱైనవి కావని యీ యాక్షేపమునకు గీతయందు సమాధానము చెప్పఁబడినది. బ్రహ్మార్పణముగ చేసితిమా యని చెప్పఁబడిన సంకల్పమునందే సాత్త్వికకర్మలును, సత్కర్మలును జేరుననియు, కావున నీకర్మ లధ్యాత్మదృష్టిచే త్యాజ్యములు కావనియు నిర్వివాదముగనే సిద్ధమగుచున్నది (గీతార. పు. ౩౩౪ చూడుము.) పరబ్రహ్మముయొక్క స్వరూపమువిషయమై మనుజునిచేఁ బొందఁబడిన జ్ఞానమంతయు "ఓం తత్ సత్" అను మూఁడుశబ్దములయొక్క నిర్దేశమునం దిమిడియున్నది. వీనిలో 'ఓం' అనునది అక్షరబ్రహ్మమగుటచె దానికి నుపనిషత్తులయందు వెవ్వేఱగు నర్థము చేయఁబడినది; (ప్రశ్న ౫; కఠ. ౨. ౧౫-౧౭; తై. ౧. ౮; ఛాం. ౧. ౧; మైత్ర్యు ౬. ౩. ౪; మాండూక్య. ౧. ౧-౨.) ఈసర్వరూప మగు బ్రహ్మమే జగత్తుయొక్క యారంభమునం దుండుటచే క్రియలన్నియు నచ్చోటనుండి యారంభమైనది. 'తత్'=అది. అనఁగా: సామాన్యమైనకర్మకంటె పరమందున్న అనఁగా: నిష్కామబుద్ధితో ఫలాశను వదలి చేయఁబడిన సాత్త్వికకర్మయనియు, 'సత్' అనఁగా: ఫలాశ యున్నను శాస్త్రప్రమాణముగఁ జేయఁబడిన శుద్ధమయిన కర్మయనియు నీ సంకల్పమునకు నర్థము. ఈ యర్థానుసారముగ నిష్కామబుద్ధితో జేయఁబడిన సాత్త్వికకర్మలును పరబ్రహ్మయొక్క సామాన్యము, సర్వసామాన్యము నగుసంకల్పమునందుఁ జేరుచున్నవి. కావున నీకర్మలు త్యాజ్యము లని చెప్పువా రన్యాయమాడినవా రగుదురు. 'తత్' 'సత్' అను రెండుకర్మలు దక్క అసత్ అనఁగా: చెడుకర్మ మిగిలియున్నది. కాని యది ఇహలోక పరలోకముల రెండింటియందును గర్హ్యమగుటచే నది యీ సంకల్పమునందు జేరదు. అని కడపటి శ్లోకమునందు నిరూపింపఁబడినది.—]

(౨౩) పరమాత్మ "ఓం తత్సత్" అని మూఁడువిధములుగ (శాస్త్రముల యందు) నిర్దేశముచేత (నే) పూర్వమునందు బ్రాహ్మణులును, వేదములును, యజ్ఞములును, నిర్మింపఁబడినవి.

§§ తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః,
ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్. ౨౪
తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః,
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః. ౨౫
సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే. ౨౬
యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే,
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే. ౨౭

[సర్వసృష్టియొక్కయు ప్రారంభమునందు బ్రహ్మదేవుఁడను మొదటి బ్రాహ్మణుఁడును, వేదములును, యజ్ఞములును బుట్టినవని పూర్వమునందే (గీ. ౩. ౧౦) చెప్పఁబడినది. కాని యిదంతయు, నేపరబ్రహ్మయందుండి నిర్మింపఁబడినదో యాపరబ్రహ్మయొక్క స్వరూపము "ఓం తత్సత్" అను నీమూఁడుశబ్దములయందు నున్నది. కాన "ఓం తత్సత్" అను సంకల్పము సృష్టికంతకును మూలమయి యున్నదని యీ శ్లోకమునకు భావార్థము. ఇప్పుడీసంకల్పమునందున్న మూఁడుపదములను కర్మయోగదృష్టితో మఱియొకవిధమున నిరూపించుచున్నాఁడు.—]

(౨౪) "తస్మాత్" అనఁగా: ఈసంకల్పమునందుండి జగత్తు ప్రారంభింపఁబడినది గాన బ్రహ్మవాదులయొక్క యజ్ఞములును, దానములును, తపస్సులును, నితరములగు శాస్త్రోక్తకర్మలును నెప్పుడును ఓం అని యుచ్చరించి యాచరింపఁబడుచున్నవి. (౨౫) "తత్" అను శబ్దముచే ఫలాశను వదలి యజ్ఞము తపస్సు దానము మొదలగు యనేకవిధములగు క్రియలను, మోక్షార్థులు చేయుచున్నారు. (౨౬) అస్తిత్వమను నర్థమునను, సాధుత్వమను నర్థమునను (అనఁగా: మంచితనము) 'సత్' అను శబ్దము ప్రయోగింపఁబడుచున్నది. మఱియు, ఓ పార్థా! యిటులె ప్రశస్తమగు కర్మను బోధించుటకును సచ్ఛబ్దము ప్రయోగింపఁబడుచున్నది. (౨౭) యజ్ఞము, తపస్సు, దానము, ననువానియందలి స్థితియు (అనఁగా: స్థిరభావన నుంచుకొనుటయు) 'సత్' అని చెప్పఁబడుచున్నది. ఈ హేతువు చేతనే చేయఁదగిన్నకర్మలకును సత్ అని పేరు.

[యజ్ఞము, తపస్సు, దానము మొదలగు ధార్మికకృత్యములు, వానివిషయమై చేయఁబడుచున్న కర్మకే మీమాంసకులు యజ్ఞార్థమైన కర్మలని

§§ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్,
అసదిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్య నో ఇహ. ౨౮

సామాన్యమగు పేరు పెట్టియున్నారు. ఈ కర్మలు సేయునప్పుడు ఫలాశ యున్నను, సది ధర్మమున కనుకూలమగుటచే నీకర్మలు 'సత్' అనువర్గమునం దంతర్భూతములగుచున్నవి. కాని నిష్కామకర్మలన్నియు "తత్"=అది (అనఁగా: పరమందయినది) అను వర్గమునందు జేరును. ఈరీతిగ ప్రతికర్మ యొక్కయు నారంభమునందుండు "ఓం తత్సత్" అను బ్రహ్మసంకల్ప మునం దీరెండుకర్మలను జేరుటచే నీరెండుకర్మలును బ్రహ్మప్రాప్తి కనుకూలమైనవే యని చెప్పఁబడినవి (గీతారహస్య. పు.౩౩౫ చూడు). మిగిలిన యసత్కర్మలయొక్క సంగతి యేమియో యిచ్చో చెప్పుచున్నాఁడు.—]

(౨౮) అశ్రద్ధతోఁ జేయఁబడిన హోమమును, దానమును, తపస్సును వేయేల? చేయఁబడినదంతయు (కర్మ)ను "అసత్" అని చెప్పఁబడినది. ఓపార్థా! ఆ కర్మ యీలోకమునగాని పరలోకమునగాని లాభించునది కాదు.

[తాత్పర్య మేమన: బ్రహ్మస్వరూపమునకు బోధకమగు సర్వసమ్మతమైన సంకల్పమునందే, నిష్కామబుద్ధితోఁ జేయఁబడిన, లేక కేవలము కర్తవ్యమనుబుద్ధితోఁ జేయఁబడిన సాత్త్వికకర్మయును శాస్త్రానుసారముగ సమబుద్ధితోఁ జేయఁబడిన ప్రశస్తకర్మయును, లేక సత్కర్మయుఁ జేరును. మిగిలినకర్మలు వ్యర్థములైనవే. బ్రహ్మనిర్దేశమునం దేకర్మలుఁజేరునో, బ్రహ్మదేవునితోఁగూడ నేకర్మ లుత్పన్నమైనవో (గీ. ౩. ౧౦); యేకర్మ లెవరికిని వదలుటకు సాధ్యములుకావో, వానిని వదలుమని చెప్పుట యోగ్యము కాదని యిందువలన సిద్ధమగుచున్నది. "ఓంతత్సత్" అను బ్రహ్మనిర్దేశమునకు పైనచెప్పిన కర్మయోగపర మగునర్థము నీయధ్యాయమునందే, కర్మవిభాగముతోఁ గలిపిచెప్పుట కిదియే కారణము. కారణ మేమన: కేవలము పరబ్రహ్మస్వరూపము వెనుక పదమూఁడవ యధ్యాయమునందును, తత్పూర్వమునందును వర్ణింపఁబడియే యున్నది. 'ఓంతత్సత్' అనుదానికి మొదటి యర్థ మేమియో గీతారహస్యమునందలి తొమ్మిదవప్రకరణముయొక్క చివర పు. ౩౩౫. చెప్పఁబడినది. సచ్చిదానందశబ్దములచే బ్రహ్మనిర్దేశింపఁబడుట ప్రస్తుతము ప్రచారములో నున్నది. కాని యట్లుచేయక "ఓంతత్సత్" అనుబ్రహ్మనిర్దేశమే యిచ్చోఁ జేయఁబడియుండుటచే సచ్చిదానంద మను

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయవిభాగయోగో నామ
సప్తదశోఽధ్యాయః. ౧౭.

బ్రహ్మనిర్దేశము సామాన్యమైన బ్రహ్మనిర్దేశరూపముగ నొకవేళ గీతలయనంతరమందు ప్రచారమునకు వచ్చెనేమో యని దీనింబట్టి యూహింపవచ్చును.—]

ఈరీతిగ భగవంతునిచే గానముచేయంబడిన శ్రద్ధాత్రయవిభాగ మనుపేరి పదునేడవయధ్యాయము సమాప్తమైనది.



# అష్టాదశోఽధ్యాయః.

---

## పదునెనిమిదవ యధ్యాయము.

[పదునెనిమిదవ యధ్యాయము గీతాశాస్త్రమున కంతకు నుపసంహారమగుచున్నది. కావున నింతవఱకును జెప్పఁబడిన విషయముల నన్నిఁటిని నిచ్చో సంగ్రహముగ సింహావలోకనముచేఁ జూతము. (విశేషముగ తెలుఁగుటీకా గీతారహస్యము ప్ర. ౧౪. చూడు.) స్వధర్మానుసారముగ ప్రాప్తమైన యుద్ధమును వదలి భిక్షాటనకు సిద్ధుఁడైన యర్జునుని స్వకర్తవ్యమునందు ప్రవర్తింపఁజేయుటకొఱకు గీత యుపదేశింపఁబడిన దని ప్రథమ అధ్యాయమునుం బట్టి స్పష్టమైయున్నది. గురుహత్య మొదలగుదోషయుక్తములగుకర్మలను చేయుటచేఁ దనకు కల్యాణము కలుగదని యర్జునుఁడు సందేహించుచుండెను. కాని నాత్మజ్ఞానులు స్వీకరించిన జీవితకాలమును గడపు రెండువిధము లగుమార్గములును రెండవ యధ్యాయముయొక్క ప్రారంభమునందుఁ జెప్పఁబడినవి. మొదటిది సాంఖ్యము. (సన్న్యాసము.) రెండవది (కర్మ-) యోగము. ఈ రెండుమార్గములును మోక్షప్రదము లైనను వానిలోసైతము కర్మయోగమే మిక్కిలి శ్రేయస్కర మని తుదకు సిద్ధాంతము చేయఁబడినది. (గీ. ౫-౨) వీనిలో కర్మయోగమునందు బుద్ధి శ్రేష్ఠమని యందురు. బుద్ధి స్థిరమును సమమును అయినచో కర్మలు బాధింపవు. కర్మ లెవరికి విడిచిపెట్టుటకు సాధ్యముకాదు. విడిచిపెట్టను కూడదు. ఫలాశను మాత్రము వదలినఁ జాలును. తనయొక్క యుపయోగముకొఱకు కాకపోయినను లోకసంగ్రహార్థమైనను చేయవలయును. బుద్ధి మంచిదైనచో జ్ఞానమునకును కర్మకును విరోధ ముండదు. పూర్వమందున్న పరంపరను విచారింతుమేని జనకాదు లీతీరు ననే యాచరించి రనునది మొదలుగాఁగల యుక్తివాదములు మూఁడవ యధ్యాయము మొదలు నైదవ యధ్యాయమువఱకును జెప్పఁబడినది. కర్మయోగసిద్ధ్యర్థమై యపేక్షింపఁబడు బుద్ధి నెట్లు సమముజేసికొనవచ్చునో యీ కర్మయోగము నాచరించుచుండగ, దానిచేతనే తుదకు మోక్ష మెట్లు సిద్ధించునో, యటుపిమ్మట

విచారింపబడినది. ఈ సమత్వమునొందుటకై యింద్రియముల నిగ్రహించి యొక పరమేశ్వరుఁడే సకలభూతములయందును నున్నాఁడని పూర్ణముగ తెలిసికొనవలయును. వేఱొకమార్గము లేదు. దీనిలో నింద్రియనిగ్రహము నాఱవ యధ్యాయమునందు వర్ణించి, యేడవ యధ్యాయము మొదలుకొని పదునేడవ యధ్యాయమువఱకును కర్మయోగము నాచరించుచుండగనే పరమేశ్వరుని జ్ఞాన మెట్లు కలుగునదియు, నాజ్ఞాన మేవిధమైనదియుఁ జెప్పఁబడినది. వీనిలో నేడవ దానియందును నెనిమిదవదానియందును క్షరాక్షరములయొక్క లేక వ్యక్తావ్యక్తముల యొక్క జ్ఞానవిజ్ఞానములను వివరించి, పరమేశ్వరునియొక్క వ్యక్తరూపము కంటె నవ్యక్తము శ్రేష్ఠమైనను పరమేశ్వరుఁ డొక్కఁడే యనుబుద్ధిని చెదర నీయక వ్యక్తమునే యుపాసించుట ప్రత్యక్షావగమ్యము గనుకనె యందఱకును సులభమను విషయము తొమ్మిదవ యధ్యాయము మొదలు పండ్రెండవ యధ్యాయమువఱకును చెప్పఁబడింది. పిదప క్షరాక్షరవిచారమున నవ్యక్తమని చెప్పఁబడునదియే మనుష్యులశరీరమునందలి యాత్మ యని చెప్పఁబడు క్షేత్రక్షేత్రజ్ఞవిచారము పదమూఁడవ యధ్యాయమునందు చేయఁబడినది. పిదప నొకయవ్యక్తమునుండియే, ప్రకృతియొక్క గుణములచే జగత్తునందలి వివిధస్వభావముగల మనుజులును, లేక యితరమగు నానావిధవ్యాప్తియు (సంసారము) నెట్లు వెలువడినదో యను నీక్షరాక్షరవిజ్ఞానాంతర్గతములగు విషయములనుపదునాల్గవ యధ్యాయము మొదలిడికొని పదునేడవ యధ్యాయమువఱకును నాలుగధ్యాయములయందును సవిస్తరముగ విచారించి జ్ఞానవిజ్ఞాననిరూపణము సమాప్తము చేయఁబడినది. అయినను పదేపదే "నీవు కర్మ చేయుమనియే" యర్జునున కుపదేశము చేయఁబడినందున పరమేశ్వరుని భజించి శుద్ధాంతఃకరణముతో పరమేశ్వరార్పణపూర్వకముగ స్వధర్మము ననుసరించి కేవలము కర్తవ్యములే యని యామరణాంతము సర్వకర్మలను చేయుచునే యుండవలయు నను కర్మయోగపర మగుజీవితకాలమును గడపు మార్గమే యన్నింటిలో నుత్తమమయినదని సిద్ధాంతము చేయఁబడినది. భగవంతుఁడు జ్ఞానమూలకమును, భక్తిప్రధానమును నగుకర్మయోగము నిట్లు సాంగోపాంగముగ వివేచించినపిదప దానియొక్క ధర్మములను పదునెనిమిదవ యధ్యాయమున నుపసంహరించి యర్జునుని స్వేచ్ఛగ యుద్ధమునందుఁ బ్రవర్తింపఁజేసెను. గీతలయందు సర్వోత్తమ మని ప్రతిపాదింపఁబడిన యీ మార్గమునందు నీవు చతుర్థాశ్రమమును స్వీకరించి సన్న్యాసివి కమ్మని యర్జునునకు చెప్పలేదు. అయినను

అర్జున ఉవాచ.

సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన. ౧

నీమార్గము నాచరించుమనుష్యుఁడు నిత్యసన్న్యాసిగనె (గీ.౫.3) యుండు నని చెప్పఁబడినది. కాన చతుర్థాశ్రమరూపమగు సన్న్యాసమును గైకొని సర్వకర్మల నెప్పుడైనను వదలవలయునను సిద్ధాంత మీకర్మయోగమార్గమునం దున్నదా? లేదా? యనియు, లేనిచో సన్న్యాసము త్యాగము నను నీరెండుశబ్దములకును నర్థమేమి యని యర్జునుఁ డడుగుచున్నాఁడు. (గీతారహస్య. పు. 3౪౪-3౪౭ చూడు).—]

అర్జునుఁ డడుగుచున్నాఁడు.—(౧) ఓ మహాబాహువా! ఓ హృషీకేశా! యో కేశిదైత్యనిషూదనా! సన్న్యాసమునం దున్న తత్త్వమును, త్యాగమునందలి తత్త్వమును వెవ్వేఱుగ నెఱుంగఁ గోరుచున్నాను.

[సన్న్యాసము త్యాగము ననుశబ్దములకు నిఘంటుకారులచే వ్రాయఁబడిన యర్థముగాని, లేక వానియందలి భేదమునుగాని విచారించుటకై యీ ప్రశ్న చేయఁబడలేదు. ఈరెంటికిని ధాత్వర్థము 'వదలిపెట్టుట' యని యర్జునునకుఁ దెలియకపోలేదు. ఇఁక నేమనః—భగవంతుఁడు కర్మలను వదలివేయవలయు నని యెచ్చోటను నుడువక నాల్గు, అయిదు, ఆఱు అధ్యాయములయందును (౪. ౪౧; ౫. ౧3; ౬—౧.) సన్న్యాసమును వర్ణించిన యితరస్థలములయందును కేవలము ఫలాశను త్యజించి (గీ.౧౨-౧౧) సర్వకర్మలను పరమేశ్వరునియందు సన్న్యాసమును (అర్పణమును) జేయుమని నుడివెను. (3-3౦; ౧౨-౬); ఉపనిషత్తులయందును 'న కర్మణా న ప్రజయా ధనేన, త్యాగే నైకే అమృతత్వమానశుః' (కై. ౧. ౨; నారాయణ ౧౨. 3)-సర్వకర్మలను త్యజించియే యనేకులు మోక్షమును సంపాదించుకొనిరి. అనియు "వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః సన్న్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః" (ముండక 3. ౨-౬)—కర్మత్యాగరూపమైన సన్న్యాసయోగముచే శుద్ధులగు యతులు—అనియు 'కిం ప్రజయా కరిష్యామః' (బృ. ౪. ౪. ౨౨)—మాకు పుత్రపౌత్రాదులగు ప్రజలతో నేమిప్రయోజన మున్నది?—అనియు కర్మత్యాగపరములగు సన్న్యాసధర్మమును బోధించువచనములు కాన్పించుచున్నవి. అనఁగా: భగవంతుఁడు త్యాగసన్న్యాసశబ్దములు రెండును స్మృతిగ్రంథములయందు ప్రతిపా

శ్రీభగవానువాచ.

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః,
సర్వకర్మఫలత్యాగం ప్రాహుః త్యాగం విచక్షణాః. ౨

దింపఁబడిన నాలుగాశ్రమములలోను కర్మత్యాగరూపములయిన సన్న్యాసాశ్రమపరము లని చెప్పక యితరమగు నేయర్థమునందైన నాశబ్దములఁ బ్రయోగించెనేమో యని యర్జునుఁ డెన్నుకొని యావిషయమును బాగుగ వివరింపవలయు నని యడిగెను. (గీతారహస్య. ప్ర. ౧౧. పు. ౪౮౦-౪౮౨ చూడు.)—]

శ్రీభగవంతుఁడు సెప్పుచున్నాఁడు.—(౨) కామ్యములు నాఁబడు కర్మల యొక్క న్యాసమును (అనఁగా: వదలుటను) బుద్ధిమంతులు సన్న్యాసమని చెప్పుచున్నారు. మఱియు సర్వకర్మలయొక్క ఫలములను వదలుట పండితులు త్యాగమని చెప్పుచున్నారు.

[కర్మయోగమార్గమునందు దేనిని సన్న్యాసమనియు, దేనిని త్యాగమనియుఁ జెప్పుదురో యీశ్లోకమున స్పష్టముగఁ జెప్పఁబడినది. కాని సన్న్యాసమార్గీయు లగుటీకాకారుల కీమతము సమ్మతము కానందున వారీశ్లోకమును మిక్కిలి తికమకఁ జేసిరి. శ్లోకప్రారంభమునందే కామ్యశబ్దము ప్రయోగింపఁబడినది కాన మీమాంసకులు సెప్పు నిత్యము, నైమిత్తికము, కామ్యము, నిషిద్ధము మొదలగు కర్మలయొక్క భేద మిచ్చో వివక్షితము కాదు. వీనిలో కామ్యములైన కర్మలనే వదలివేయవలయు నని భగవంతుఁ డుపదేశించినట్లు టీకాకారులు సెప్పుచున్నారు; కాని సన్న్యాసమార్గీయులకు నిత్యము, నైమిత్తికము లగుకర్మలు సేయనక్కఱలేదు. కాన నిత్యములు నైమిత్తికములు నగుకర్మలు కామ్యకర్మములలోనే జేర్పఁబడిన వని వారు చెప్పవలసివచ్చును ఇట్లు చెప్పినను యీశ్లోకముయొక్క యుత్తరార్థమునందు, ఫలాశను వదలవలయును, కర్మలను వదలఁగూడ దని చెప్పఁబడినది. (పిదప నా౯వ శ్లోకమును చూడు). సంగతేము కానందున తుదకు కర్మమార్గముయొక్క స్తుతి భగవంతునిచేఁ జేయఁబడిన దనియు, భగవంతునకు నిజమగు నభిప్రాయము, కర్మలను వదలివేయవలయుననియే యని యొఁ దమ్మ కిష్టమువచ్చినట్లు టీకాకారు లర్థముఁజెప్పి సమాధానము నొందుచున్నారు. సన్న్యాసము మొదలగువానికి సాంప్రదాయకుల యుద్దేశము ననుసరించి యీశ్లోకమునకు సరియగు నర్థము కుదురదని దీనివలన స్పష్టమగు

చున్నది. దీనికి నిజమైన యర్థము కర్మయోగపరము. అనఁగా : ఫలాశను వదలి యామరణాంతమును సర్వకర్మలను చేయవలయు ననుసిద్ధాంతము పూర్వమునందు గీతలలో ననేక పర్యాయములు చెప్పఁబడినదాని ననుసరించియే జేయవలయును. అది సరళముగనైన నుండదు. కామ్యశబ్దమునకు మీమాంసకులు చెప్పునదియగు నిత్యములును, నైమిత్తికములును, కామ్యములును, నిషిద్ధములు నైనకర్మ లర్థమైనపిదప నీకర్మవిభాగ మిచ్చో నుద్దేశింపఁబడినది కాదని ముందుగఁ దెలిసికొనవలయును. కర్మయోగమార్గమునందు సర్వకర్మలను కామ్యములనియు, (అనఁగా: ఫలాశను మనస్సున నిడికొని చేయఁబడిన పనియు) నిష్కామములైన పనియు, (అనఁగా: ఫలాశను వదలి చేయఁబడిన పనియు) రెండువిధములుగ విభజించుచున్నారు. మనుస్మృతియందలి యథాక్రమముగ ప్రవృత్తికర్మలనియు, నివృత్తికర్మలనియు పేర్కొనఁబడినవి. (మను. ౧౨. ౮౮-౮౯. చూడు). కర్మలు నిత్యములైనను, నైమిత్తికములైనను, కామ్యములైనను, కాయికమైనను, వాచికములైనను, మానసికములైనను, సాత్త్వికాదిభేదములు గలవియయినను, మఱియొకవిధమైనను, నవియన్నియు కామ్యములు, నిష్కామములు ననురెండువర్గములలో నేదోయొకవర్గములోనివై తీరవలయును. కారణ మేమన: ఫలాశయుండుటయు, లేకుండుటయు నను రెండింటికంటె వేఱుగు భేదము సంభవింపదు. ఏకర్మల కేఫలము శాస్త్రమునందుఁ జెప్పఁబడినదో (ఉదాహరణము. పుత్త్రప్రాప్తికొఱకు పుత్త్రేష్టి, యాఫలముకొఱకు చేయఁబడినకర్మ కామ్యమయినది) యాఫలమును మనస్సునఁ గోరక, యాకర్మ కేవలము కర్తవ్య మనుతలంపున చేయఁబడినచో నది నిష్కామము మని చెప్పవలయును. సర్వకర్మలను కామ్యమనియు, నిష్కామమనియు (లేక మనువుయొక్క పరిభాషానుసారము) ప్రవృత్తమనియు నివృత్తమనియు రెండువిధములుగ విభజించినపిదప కర్మయోగి సర్వవిధములయిన కామ్యకర్మలను బొత్తుగ వదలివేయుచున్నాఁడు; కాన కర్మయోగమునందును కామ్యకర్మలను సన్న్యసింపవలయుననియే సిద్ధాంత మగుచున్నది. పైన చెప్పఁబడినకర్మలయొక్క రెండువర్గములలోను నిష్కామకర్మలు మిగిలియున్నవి. ఈ నిష్కామకర్మలను కర్మయోగి చేయవలయు నని గీతలయందలి ముఖ్యమైన యభిప్రాయ మనుమాట నిజమె; కాని వానియందు సైతము ఫలాశను బొత్తిగా త్యజింపవలయును. (గీ. ౭.౨) కాన త్యాగ

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః,
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే. 3
నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ,
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః. ౪

[మును గుఱించిన సిద్ధాంతముసైతము గీతాధర్మములయందు స్థిరముగనే యున్నది. కర్మల నన్నింటిని వదలిపెట్టకపోయినను సన్న్యాసము, త్యాగము నను నీరెండుసిద్ధాంతములును కర్మయోగమార్గమునం దుండ నేయున్నవని యర్జునునకుఁ దెలియునిమిత్తమై సన్న్యాసమన కామ్యకర్మలయొక్క యత్యంతత్యాగమనియు, త్యాగమన చేయఁబడుచున్నకర్మలయందు ఫలాశాత్యాగమనియు నీయర్థములురెండును నీశ్లోకమునందుఁ జెప్పఁబడినవని సారాంశము. కావున సన్న్యాసము (లేక సాంఖ్యము) యోగము నను నీరెండును నొక్కటియే యని నిరూపించుచు సన్న్యాసశబ్దమునకును (గీ. ౫-౩-ఉపతీరుల. ౧. ౬చూడు) నీయధ్యాయమునందే 'త్యాగి' శబ్దమునకును నర్థము చెప్పఁబడినది. (గీ. ౧౮.౧౧) కావున నిచ్చోటను నాయర్థమునే చేయవలయును. బ్రహ్మచారియు, గృహస్థుఁడును, వానప్రస్థుఁడు ననుక్రమమున "తుదకు ప్రతిమనుజుఁడును" సర్వకర్మత్యాగరూపమైన సన్న్యాసమును (లేక చతుర్థాశ్రమమును) గైకొన్ననేగాని మోక్షప్రాప్తి లేదని చెప్పు స్మార్తమతపు మిచ్చో ప్రతిపాద్యము కాదు. సన్న్యాసియొక్క కాషాయవస్త్రము ధరించి, కర్మయోగి సర్వకర్మలను త్యజింపకపోయినను సన్న్యాసముయొక్క నిజమగు తత్త్వమును పాలించుచునే యుండును గావున, కర్మయోగమునకు స్మృతిగ్రంథములతో విరోధము లేదని దీనింబట్టి సిద్ధమగుచున్నది. ఇప్పుడు సన్న్యాసమార్గముయొక్కయు మీమాంసకమార్గముయొక్కయు మధ్య నున్న కర్మవిషయమైనవాదము నుపన్యసించి యీవిషయమై కర్మయోగశాస్త్రముయొక్క కడపటినిర్ణయము చెప్పుచున్నాఁడు.—]

(3) కర్మ దోషయుక్తముగావున దానిని బొత్తిగ వదలివేయవలయు నని యనేకులు పండితులు సెప్పుచున్నారు. మఱియు యజ్ఞము, దానము, తపస్సు, కర్మయు నను వాని నెప్పుడును వదలకూడదని మఱికొందఱు చెప్పుచున్నారు. (౪) అయిన నోభరతశ్రేష్ఠా! త్యాగమువిషయమై నానిర్ణయమును వినుము. ఓపురుష

> యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్,
> యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. ౫
> ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
> కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్. ౬

శ్రేష్ఠుఁడా! త్యాగము మూఁడువిధము లని చెప్పఁబడినది. (౫) యజ్ఞము, దానము, తపస్సు, కర్మయను వానిని విడువఁగూడదు; వానిని (కర్మలను) జేయుచునే యుండవలయును. యజ్ఞము, దానము, తపస్సు ననునవి విద్వాంసునిసైతము పవిత్రము చేయును. అనఁగా: చిత్తశుద్ధిని గలుగఁజేయును. (౬) కావున నోపార్థా! (యజ్ఞదానాది) కర్మలనుసైత మాసక్తిని విడచి, ఫలములను త్యజించి (యితరము లయిన నిష్కామకర్మలను వలెనె లోకసంగ్రహార్థమై) చేయవలయును అని నాయొక్క ముఖ్యాభిప్రాయము. కావున నదియే యుత్తమమైనది.

[కర్మలకు ఫలాశనుబట్టి దోషము (బంధకత్వము) కలదు గాని వానిని చేయుటవలన లేదు. కాన ఫలాశను విడలి నిష్కామబుద్ధితో కర్మల నన్నింటిని చేయవలయు ననుకర్మయోగముయొక్క సిద్ధాంతము పూర్వము ననేకపర్యాయములు చెప్పఁబడుటచే దాని కిది యుపసంహారమై యున్నది. సర్వకర్మలును దోషయుక్తము కావుననే త్యాజ్యములను సన్న్యాసమార్గము నందలి సిద్ధాంతము గీతలకు సమ్మతము కాదు. (గీ.౧౮.౪౮. మఱియు ౪౯ చూడుము) గీత కేవలము కామ్యకర్మలయొక్క సన్న్యాసమును చేయు మని చెప్పదు; కాని ధర్మశాస్త్రమునందు ప్రతిపాదింపఁబడిన కర్మలను జూచితి మేని యవన్నియు కామ్యములే యగుటచే (గీ. ౨. ౪౨-౪౪) వానిని సైతము సన్న్యాసము చేయవలయు నని యిప్పుడు. చెప్పవలసియున్నది. అటుల చేయుదుమేని యజ్ఞచక్రము మునిగిపోయి (౩-౧౬) సృష్టియే నశించిపోవుటయు సంభవించును. అప్పు డేమి చేయవలయు ననుప్రశ్నకు గీత యజ్ఞదానాదికర్మలు స్వర్గాదిఫలముల నొందుటకొఱకు చేయుమని శాస్త్రములయం దుపదేశింపఁబడినను యజ్ఞముచేయుట, దానముచేయుట, తపస్సుచేయుట మొదలగునవి నాకుఁ గర్తవ్యములు. (గీ. ౧౭-౧౧. ౧౭. మఱియు ౨౦ చూడుము) అని నిష్కామబుద్ధితో లోకసంగ్రహార్థమై చేయుటకు సాధ్యములు కావని యుత్తరమిచ్చుచున్నది. కాఁ లోకసంగ్రహార్థమై స్వధర్మానుసారముగ నితరములగు నిష్కామకర్మలు, చేయఁబడుచున్నటులనే యజ్ఞయాగాదికర్మలనుసైతము ఫలాశను నాసక్తిని విడలి చేయవలయును.

§§ నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః. ౭
దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. ౮
కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున,
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః. ౯

కారణ మేమన: నవి యెప్పుడును పావనములు (చిత్తశుద్ధికారకములు) పరోపకారబుద్ధిని వృద్ధి పొందింపఁజేయునవి. మూలమునం దున్న "ఏతాన్యపి=ఈ కర్మలుసైతము" అనుశబ్దములకు ఇతరములగు నిష్కామకర్మల వలె నీయజ్ఞదానాదికర్మలనుసైత మనియర్థము. ఇట్లు ఫలాశను వదలిగాని లేక భక్తితోఁగాని పరమేశ్వరార్పణబుద్ధితోమాత్ర మీకర్మలను జేయుదు మేని సృష్టి యనుఘటీయంత్రమును నడపించుచు కర్మలను జేయుచున్నను; మనయొక్క మనస్సునందలి ఫలాశ వదలిపోవుటచే నీకర్మలు మోక్షప్రాప్తికి ప్రతిబంధకములుగాక యన్నివిషయములకు బాగుగ నైకమత్యము గలుగఁజేయునని కర్మవిషయములో కర్మయోగశాస్త్రముయొక్క నిశ్చిత మగుసిద్ధాంతము (గీ. ౨. ౪౫ పైన నాటిప్పణిని చూడుము). మీమాంసకులయొక్క కర్మమార్గమునకును, గీతలయం దున్నకర్మయోగమునకును గలభేదము గీతారహస్యమునందు (పు.౪౦౧-౪౦౫ ౪౭౬-౪౭౮) మిక్కిలి స్పష్టముగఁ జూపింపఁబడుటచే నావిషయ మిచ్చో విశేషముగ చర్చింపఁబడదు. అది యటు లుండనిమ్ము; అర్జునునియొక్క ప్రశ్నను బట్టి సన్న్యాస, త్యాగ శబ్దములయొక్క యర్థ మిట్లు కర్మయోగదృష్టిచే వివరింపఁబడినపిదప సాత్త్వికాదిభేదములచే కర్మ చేయుటయం దుండుభేదము లేవియో చెప్పి యీయర్థమునే దృఢము చేయుచున్నాఁడు.—]

(౭) (స్వధర్మానుసారముగ) నియత మగుకర్మయొక్క సన్న్యాసము (అనఁగా: త్యజించుట), (ఎవరికిని) యోగ్యమయినదికాదు. మోహముచేఁ జేయఁబడిన యాత్యాగము తామస మనిచెప్పఁబడును. (౮) శరీరమునకు కష్టము గలుగు ననుభీతిచే (అనఁగా: దుఃఖకర మగునను తలంపుతో మాత్రమే) కర్మను వదలితి మేని యాత్యాగము రాజస మగుటచే త్యాగమునకు లభింపఁ దగినఫల మతనికి సిద్ధింపదు. (౯) ఓయర్జునా! సంగమును వదలి నిత్యమగుకర్మను విధిగనుక చేయువలయు

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. ౧౦
న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే. ౧౧

నను తలంపుతోఁ జేయుచు ఫలమును వదలినచో నా త్యాగము సాత్త్వికమనఁబడును.

[ఏడవ శ్లోకమున 'నియత' పదమునకు నిత్యనైమిత్తికాదిభేదములు గల కర్మలలో, నిత్యకర్మ యర్థమని యనేకులు చెప్పుచున్నారు. అది న్యాయ్యము కానేరదు. "నియతం కురు కర్మ (గీ. ౩.౮). అను స్థలమునం దున్న 'నియత' పదముయొక్క యర్థమునే యిచ్చోటను స్వీకరింపవలయును. మీమాంసకుల పరిభాష యిచ్చో వివక్షితము కానేరదని పైన చెప్పఁబడియే యున్నది. 'నియత' శబ్దమునకు మాఱుగ 'కార్య' శబ్దము గీతలయందు ౩.౧౯ శ్లోకమునం దున్నది. ఇక్కడ తొమ్మిదవ శ్లోకమునందు, 'కార్య', 'నియత' శబ్దము లొక్కచోట ప్రయోగింపఁబడినవి. స్వధర్మానుసారముగ ప్రాప్తములయిన యేకర్మలను వదలివేయక వానినే కర్తవ్యము లనునూహతో చేయుట (గీ. ౩. ౧౯ చూడుము). సాత్త్వికత్యాగమని చెప్పఁబడుచున్నది. మఱియు కర్మయోగశాస్త్రమునందు దీనినే త్యాగమనిగాని, సన్న్యాసమనిగాని చెప్పుదురు. ఈ యధ్యాయారంభమున రెండవ శ్లోకమునఁ జెప్పఁబడిన విషయమునకే యిది సమర్థకము. 'త్యాగ' సన్న్యాసశబ్దములయొక్క యర్థమున కిది వివరణము. ఇప్పు డీసిద్ధాంతము ననుసరించియే నిజమగు త్యాగియు, సన్న్యాసియు నెవఁడో చెప్పుచున్నాఁడు.—].

(౧౦) ఒకకర్మ 'అకుశలమని' (అకల్యాణకరమని) దానిని ద్వేషింపకయు, మఱియొకకర్మ కల్యాణకరమని, లేక లాభదాయకమని దానియం దనురక్తినిఁ జెందకయు నుండువాఁడే సత్త్వశీలుఁ డగుబుద్ధిమంతుఁడును సంశయవిరహితుఁడైనత్యాగి యనియు (అనఁగా: సన్న్యాసి యనియు) చెప్పవలయును (౧౧)కారణమేమన: దేహధారి యైనవాఁడు కర్మను నిశ్శేషముగఁ ద్యజించుటకు వీలులేదు. కాన కర్మలను వదలక, కర్మఫలములనుమాత్రము వదలినవాఁడే నిజమగుత్యాగి, సన్న్యాసి, యని చెప్పఁబడును.

[కర్మను వదలక ఫలాశనుమాత్రము వదలి త్యాగియైనవానికి ఫల మేవిధమునను, బంధకము కాదని యిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

§§ అనిష్టమిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్. ౧౨
§§ పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. ౧౩
అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. ౧౪
శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. ౧౫
§§ తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః,
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః. ౧౬

(౧౨) అత్యాగులకు మరణించిన పిదప 'ననిష్టము, ఇష్టము, మిశ్రము నను ముత్త్రివిధములగు ఫలములు ప్రాప్తము లగును. ఫలమును సన్న్యసించినవానికి (అనఁగా: ఫలాశను వదలి కర్మ చేయువానికి) నీఫల మెప్పుడును ప్రాప్తము కాదు. అనఁగా నవి బంధింపనేరవు.

[త్యాగము, త్యాగీ, సన్న్యాసియను వానివిషయమైనవిచారము పూర్వమునం (గీ. ౩. ౪-౭; ౫. ౨. ౧౦; ౬. ౧) దనేక స్థలములయందు చేయఁబడినందున యావిషయమే యిచ్చో నుపసంహరింపఁబడినది. అన్ని కర్మలయొక్కయు సన్న్యాసము గీతల కెప్పుడును నిష్టము కాదు. ఫలాశను త్యజించువాఁడే గీతానుసారముగ నిజమైనసన్న్యాసి (లేక నిత్యసన్న్యాసి గీ. ౫. ౩) నిజమైనత్యాగ మనఁగా: మమత్వయుక్తమైన ఫలాశయొక్క త్యాగమే (అనఁగా: నహంకారబుద్ధియొక్క త్యాగమే) యగును. ఈ సిద్ధాంతమునే దృఢపఱుచుటకై యిప్పుడింకను కారణములు సెప్పుచున్నాఁడు.—]

(౧౩) ఓమహాబాహూ! సర్వకర్మలును సిద్ధించుటకు సాంఖ్యులయొక్క సిద్ధాంతమునందు చెప్పఁబడిన యైదుకారణములను నేను చెప్పుచున్నాను వినుము. (౧౪) అధిష్ఠానము (స్థానము), కర్త, వెవ్వేఱగు సాధనములు, అనేకవిధములగను వెవ్వేఱుగనుండు (కర్తయొక్క) వ్యాపారమును నటులే యైదవది దైవమును. (౧౫) శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను మనుజుఁడు సేయ నారంభించిన శాస్త్రోక్తములుగాని, యశాస్త్రీయములుగాని యగుకర్మల నన్నింటికిని నీయైదే కారణములు. (౧౬) నిజమయిన స్థితి యిటులుండ బుద్ధి సంస్కరింపఁ

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,
హత్వాఽపి స ఇమాఁల్లోకాన్ న హంతి న నిబధ్యతే. ౧౭

బడినది కావునను, నేనొక్కఁడనే కర్తనయి యున్నానని యనుకొనెడు దుర్మతి కేమియు తెలియదు. (అనిచెప్పబడును) (౧౭) ఎవనికి నేను చేయుచున్నా నను భావన లేదో మఱియెవనిబుద్ధి యలిప్తమైనదో యతఁడు లోకములను చంపినను, చంపినవాఁడు కాఁడు. మఱియు నాకర్మ లతనికి బంధకములును కావు.

[పదమూఁడవ శ్లోకమునం దున్న సాంఖ్యశబ్దమునకు వేదాంతశాస్త్ర మనునర్థము ననేకులగు టీకాకారులు చెప్పిరి. కాని పదునాల్గవ శ్లోకము నారాయణీయధర్మముల (మ. భా. శాం. ౩౪౭-౮౭) యందొకయక్షర మైన మార్పులేక యున్నది. అంతకు పూర్వమునం దా గ్రంథమున ప్రకృతి పురుషు లను కాపిలసాంఖ్యమునం దున్న సిద్ధాంతము లుల్లేఖింపఁబడియుం డుటచే, సాంఖ్యశబ్దముచే నిచ్చోటను కాపిలసాంఖ్యమే యుద్దేశింపఁ బడెనని నాయభిప్రాయము. కర్మఫలములను మనుజుఁడు కోరఁగూడదు. అనఁగా: నే నీపనిని చేయుచున్నా నని యహంకారబుద్ధిని మనస్సులో నుంచుకొనఁగూడదను. అనుసిద్ధాంతము పూర్వ మనేకస్థలములయందు గీతలలోఁ జెప్పఁబడినది. (గీ. ౨. ౧౯; ౨. ౪౭; ౩. ౨౭; ౫. ౮-౧౧; ౧౩. ౨౯) కర్మఫలములు సిద్ధించుటకు మనుజుఁ డొక్కఁడే కారణభూతుఁడు కాఁడని చెప్పి యావిషయ మిచ్చో దృఢము చేయఁబడినది. (గీతార. ప్ర. ౧౧. చూడు.) మనుజుఁ డీజగత్తున నుండినను, లేకపోయినను ప్రకృతిస్వభావానుసారముగ జగత్తుయొక్క యఖండవ్యాపార మెప్పుడును జరుగుచునే యున్నది. మనుజుఁడు తాను చేయుచున్నా నని తలఁచునదంతయు నతని ప్రయత్నముయొక్క ఫలమాత్రమే కానేరదు. అతని ప్రయత్నముయొక్కయు, జగత్తునందలి యితరవ్యాపారములు లేక చేష్టలు మొదలయిన వన్నింటియొక్కయు సాయముచేతనే యాకార్యము జరుగుచున్నదని పదునాల్గవ శ్లోకమున కర్థము. ఉదాహరణము:— వ్యవసాయమనునది యొకమనుజునియొక్క ప్రయత్నముపై మాత్రమే యవలంబించి యుండదు. క్షేత్రము, బీజము, వర్షము, నాగలి, ఎద్దులు మొదలగువానియొక్క గుణధర్మములయొక్కయు, వ్యాపారములయొక్కయు సాహాయ్యము క్షేత్రము ఫలించుటకు కావలసివచ్చును. అటులే మనుజుని

యొక్క ప్రయత్నము సిద్ధించుటకు జగత్తునందలి వివిధమగు వ్యాపారము లును సాహాయ్యము చేయవలసియుండును. వానిలో కొన్ని వ్యాపారములను మనము తెలిసికొనియుండుటచే వానియొక్క యానుకూల్యతను చూచు కొనియే మనము ప్రవర్తించుచున్నాము. కాని మనయత్నములకు ననుకూల ముగఁ గాని, ప్రతికూలముగఁ గాని కొన్ని సృష్టివ్యాపారములు గలవు. కాని యవి మనకుఁ దెలియవు. దీనినే దైవమని చెప్పుచున్నారు. మఱియు కార్యము సంఘటిల్లుటకు నిది యైదవకారణ మని చెప్పఁబడినది. మనుజుని ప్రయత్నము సఫలమగుటకై యీసామగ్రు లన్నియు నావశ్యకములు. కావున వానిలో నెక్కువభాగము మనస్వాధీనములో నున్నప్పుడుగాని, లేనప్పుడుగాని, తా నీపనిని జేయుచున్నానని యభిమానము నొందుటయు, లేక తనయొక్క కర్మ కిట్టిఫలము కావలయు నని కోరుటయు మూర్ఖత్వ మునకు లక్షణమని స్పష్టమగుచున్నది. (గీతార. పు. ౪౫౦ మఱియు ౪౫౨) అయినను ఫలాశను విడిచినవారు తమకుఁ దోఁచినట్లు కుకర్మను చేయవచ్చు నని పదునేడవశ్లోకమున కర్థమును చేయరాదు. సామాన్య మనుజుఁడు సేయునదంతయు స్వార్థలోభముతోఁ జేయుచుండుటచే నతఁ డొకప్పుడు దుర్వర్తనము చేయవచ్చును. కాని స్వార్థమును, లోభమును, ఫలాశయును పూర్ణముగ నశించి, సర్వభూతములయం దును సమదృష్టిగలవా రెవరికిని నహితమును జేయుటకు వీలులేదు. కారణ మేమనః దోషము బుద్ధియం దుండునదిగాని, కర్మయం దుండునది కాదు. కాన యెవరియొక్కబుద్ధి శుద్ధమును, పవిత్రము నయినదని మొదట నిశ్చయమైనదో వారుచేసిన యొకానొక పని లోకులదృష్టికి విపరీతముగఁ గాన్పించినను దానిని వారు సేయుటకు కారణము శుద్ధమైనదిగనే యుండ వలయు నని న్యాయమువలన ప్రాప్తమగుననియు, దానివిషయమై శుద్ధబుద్ధి గల మనుజుని యుత్తరవాదినిగ గ్రహింపఁగూడదనియు పదునేడవశ్లోక మునకు తాత్పర్యము. స్థితప్రజ్ఞునియొక్క (అనఁగా: శుద్ధబుద్ధిగలవాని యొక్క) నిష్పాపత్వవిషయమైన యీసిద్ధాంత ముపనిషత్తులయందును చెప్పఁబడినది. (కౌషీ. 3. ౧. మఱి పంచదశి ౧౪-౧౬౨-౧౬౩ చూడు). ఈ విషయమై గీతారహస్యమునందలి పండ్రెండవప్రకరణమునందు(పు.౫౧౨-౫౧౮) పూర్ణముగ వివేచింపఁబడియుండుటచే నిచ్చో విశేషముగ విస్త రింపఁబడదు. అర్జునుని ప్రశ్నవల్ల నుపస్థితమైన సన్న్యాస, త్యాగ శబ్దముల

§§ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. ౧౮
జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి. ౧౯

[ యొక్క యర్థము నిట్లు విమర్శించి యహంకారరహితబుద్ధిని, ఫలాశను వదలి స్వధర్మానుసారముగ ప్రాప్తములగు కర్మలను చేయుట యనునదియే సాత్త్వికమైన (లేక నిజమైన) త్యాగమనియు, కర్మలను వదలుట సత్యమైనత్యాగము కాదనియు, నిరూపించి పదునేడవయధ్యాయమునందు ప్రారంభింపఁబడిన కర్మలయొక్క సాత్త్వికాదిభేదముల విచారమునే యిచ్చో కర్మయోగసిద్ధాంతముచేఁ బూర్తిచేయుచున్నాఁడు.—]

(౧౮) జ్ఞానమును, జ్ఞేయమును, జ్ఞాతయు నని కర్మచోదన మూఁడువిధములు. మఱియు కరణము, కర్మ, కర్త యని కర్మసంగ్రహము మూఁడువిధములు. (౧౯) జ్ఞానము, కర్మ, కర్త యనునవి మూఁడును (ప్రత్యేకము) సత్త్వము, రజము, తమము (అను గుణభేదములచే) మూఁడుమూఁడు విధములుగ నున్నవని గుణసంఖ్యాశాస్త్రమునందు (అనఁగా: కాపిలసాంఖ్యశాస్త్రమునందు) చెప్పఁబడినది. అది యున్నటుల (నీకు చెప్పుచున్నాను) వినుము.

[కర్మచోదనయును, కర్మసంగ్రహమును ననుశబ్దములు పారిభాషికములు. ఏకర్మయైనను నింద్రియములచేఁ జేయఁబడకమునుపు మనస్సుచే నిశ్చయింపఁబడవచ్చును. కాన నిమానసికవిచారమును కర్మచోదన (అనఁగా: కర్మనుచేయుటకు ప్రథమమైనప్రేరణ) యని చెప్పుచున్నారు. ఇది సహజముగ జ్ఞానమును, జ్ఞేయమును, జ్ఞాతయు నని ముత్త్రివిధములయి యున్నది. ఉదాహరణము:— కుండలమును జేయకమునుపు, తాను వీనిని చేయవలయు నని యనుకొనుటయు (జ్ఞేయమును) అవి యిట్లుండు ననియు (జ్ఞానము) కుమ్మరి (జ్ఞాత) తన మనస్సుచే నిశ్చయించుచున్నాఁడు. ఇది కర్మచోదన. మనస్సుచే నీ రీతిగ నిశ్చయించిన పిదప నాకుమ్మరి (కర్త) మృత్తిక, చక్రము మొదలగుసాధనములను (కరణములను) సంపాదించుకొని ప్రత్యక్షముగ భాండములను (కర్మ) పూర్తిచేయుచున్నాఁడు. ఇది కర్మసంగ్రహము. కుండలు సేయుట యనునది కుమ్మరిదేయైనను కుండ యనునది, మృత్తికయొక్క కార్యమనియు,

§§ సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. ౨౦

పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. ౨౧

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్త మహైతుకమ్,
అతత్త్వార్థవ దల్పం చ తత్తామస ముదాహృతమ్. ౨౨

చెప్పుచున్నారు. కర్మచోదనాశబ్దము మానసికములగు (లేక యంతఃకరణమునందున్న) క్రియలను బోధించునది యగుటచే, కర్మసంగ్రహశబ్దముచే నామానసిక క్రియనే సంబంధించిన బాహ్యక్రియ నిరూపింపఁబడుచున్నదని దీనివలన స్పష్టమగుచున్నది. ఏకర్మనైనను పూర్ణముగ విచారింపవలసినచో చోదన, కర్మసంగ్రహము నను నీరెంటిని చూచుకొనవలయును. వీనిలో జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత (క్షేత్రజ్ఞుఁడు) అనువాని కధ్యాత్మదృష్టిచే లక్షణములు పూర్వమునందు (౧౩. ౧౮) చెప్పఁబడినవి. అయినను క్రియారూపమగుజ్ఞానముయొక్క లక్షణము కొంచెము వేఱగుటచే నీమూఁటిలో జ్ఞానముయొక్కయు, రెండవమూఁటిలో కర్మయొక్కయు, నిరూపణము నిప్పుడు చేయుచున్నాఁడు.—]

(౨౦) విభక్తమైనదియు (అనఁగా : వెవ్వేఱగు సర్వభూతములయందును నొక్కటియే యైనదియు) నవిభక్తమైనదియు, నవ్యయమైనదియు నగుభావము (లేక తత్త్వము) న్నదియని యేజ్ఞానముచే నెఱుంగఁబడునో యది సాత్త్వికజ్ఞానమని యెఱుంగుము. (౨౧) సర్వభూతములయందును వెవ్వేఱగు నానాభావములని పృథక్త్వబోధము గలిగించిన జ్ఞానము రాజసమని తెలిసికొనుము. (౨౨) ఇదియే సర్వస్వమని యేదోయొకవిషయమునం దేకారణము లేకయును, తత్త్వార్థమునకు వ్యతిరేకముగను గలుగు నల్పజ్ఞానము తామసమని చెప్పఁబడుచున్నది.

[నానావిధములగు జ్ఞానములయొక్క యీ లక్షణములు మిక్కిలి వ్యాపకములై యున్నవి. తన దారాపుత్రాదులే సంసారమనియెడు ననుజ్ఞానము తామసము. ఇంతకంటె కొంచెముదూరముగ విచారించినేని బుద్ధి మిక్కిలి వ్యాపకమై తమగ్రామమందును, పిదప దేశమందును నుండుమనుజులెల్లరును తనవారే యని తోఁచును; అయినను నాయాగ్రామములయందుండు

వారుగాని, లేక దేశములయందుండు వారుగాని వెవ్వేఱుగనే యున్నారను నూహామాత్రము దృఢముగనే యుండును. ఈజ్ఞానము రాజసము. ఇంత కంటె మఱికొంతదూరము నాలోచించెనేని సర్వభూతములయందును నొకయాత్మయే కలదని తెలంసును. ఈజ్ఞానము పూర్ణము, సాత్త్వికమునై యున్నది. విభక్తములయం దవిభక్తమును లేక నానాత్వమునం దేకత్వమును దెలిసికొనుట జ్ఞానముయొక్క లక్షణమని సారాంశము. ఇట్లే "నేహ నానాస్తికించన", ఈజగత్తునందు నానాత్వము లేదని తెలిసికొనినవాఁడు ముక్తుఁడును "మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" (బృ. ౪. ౪. ౧౯)—"ఎవఁడు జగత్తునందు నానాత్వమును జూచుచున్నాఁడో వాఁడు జననమరణచక్రమునందు పడుచున్నాఁడు" అని బృహదారణ్యకమునందును, కఠోపనిషత్తునందును జెప్పఁబడినది. (కఠ. ౪. ౧౧) ఈజగత్తున దెలిసికొనదగినదంతయు నిదియె గావున(గీ. ౧౩. ౧౬) నిదియె జ్ఞానముయొక్క పరమావధియై యున్నది. కారణ మేమన, సర్వము నొక్కటియే యైనపిదప నేకీకరణమను జ్ఞానక్రియకు నవకాశమే యుండ నేరదు. (గీతార. పు. ౩౧౭. చూడు) ఏకీకరణము చేయు జ్ఞానమనెడుమానసిక క్రియ యెట్లు జరుగునదియు గీతారహస్యమునందలి తొమ్మిదవ ప్రకరణమునందు నిరూపింపఁబడినది. (పు. ౨౯౨ మఱియు ౨౯౩) ఈ సాత్త్వికజ్ఞానమే మనస్సున బింబించునేని దేహస్వభావమున, నతనికి గలుగు పరిణామమే దైవీసంపత్తని పదునాఱవయధ్యాయమున నారంభమునందే చెప్పఁబడినది. పదమూఁడవ యధ్యాయమునం (౧౩. ౭-౧౧) దీదేహస్వభావమే జ్ఞానమని పేర్కొనఁబడినది. దీనింబట్టి జ్ఞానశబ్దమునకు (౧) ఏకీకరణమను మానసక్రియయొక్క పూర్ణతయును, (౨) అపూర్ణతనుండి దేహస్వభావమున గలుగు పరిణామమును నీ రెండర్థములును గీతలయందు వివక్షితములని కాన్పించుచున్నవి. కాన నిరువదియవశ్లోకమునందు చెప్పఁబడిన జ్ఞానముయొక్క లక్షణములు దృష్టికి మానసికములగు క్రియాస్వరూపములుగఁ గాన్పించినను దానియందే యీజ్ఞానముచే దేహస్వభావమున కల్గుపరిణామముసైతము చేరుట యిష్టమని గీతారహస్యమునందలి తొమ్మిదవ ప్రకరణమునందు (పు. ౩౩౭-౩౪౦) స్పష్టము చేయఁబడినది. అది యటులుండనిమ్ము; జ్ఞానముయొక్క భేదము చెప్పఁబడినది. ఇప్పుడు కర్మయొక్క భేదమును చెప్పుచున్నాఁడు.—]

§§ నియతం సంగరహితమరాగద్వేషతః కృతమ్,
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే. ౨౩
యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః,
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్. ౨౪
అనుబంధం క్షయం హింసామనవేక్ష్య చ పౌరుషమ్,
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే. ౨౫

(౨౩) ఫలప్రాప్తిని కోరని మనుష్యునిచే ప్రీతియైనను, ద్వేషమైనను మనస్సున నుంచుకొనక యాసక్తినివదలి (స్వధర్మానుసారముగ) నాచరింపఁబడిన కర్మ సాత్త్వికమని చెప్పఁబడును. (౨౪) కాని కామమును (ఫలాశను) కోరిగాని, లేక యహంకారబుద్ధితోఁగాని మిక్కిలి యాయాసపడి చేసిన కర్మ రాజసమని చెప్పఁబడును. (౨౫) అనుబంధమును (అనఁగా: ముందురాఁబోవు శుభాశుభ ఫలమును) నాశమును, హింసను, తనసామర్థ్యమును విచారింపకయే మోహముచే నారంభింపఁబడిన కర్మ తామసమని చెప్పఁబడుచున్నది.

[ఈ మూఁడువిధములగు కర్మములయందును కర్మలన్నియుం జేరును. నిష్కామకర్మయే సాత్త్వికమని (అనఁగా: నుత్తమమని)యేల చెప్పవలసినదియు గీతారహస్యమునందలి పదునొకండవప్రకరణమునందు చెప్పఁబడినది. ఇది నిజమైన యకర్మయె యగును. (గీ.౪. ౧౬ పైన టిప్పణి చూడు.) కర్మకంటె బుద్ధి శ్రేష్ఠమని గీతలయొక్క సిద్ధాంతమగుటచే కర్మయొక్క లక్షణముల చెప్పునప్పుడు కర్తృసంబంధమగుబుద్ధి ప్రతిసమయమునందు నుల్లేఖింపఁబడుచున్నది. కర్మయొక్క బాహ్యమైన పరిణామము ననుసరించియే యది సాత్త్వికమా? తామసమా? యని నిశ్చయింపఁబడదని తెలిసికొనవలయును. (గీతార. ప్ర. ౧౨. పు. ౫౭౪, ౫౭౫ చూడు.) అటులే ఫలాశ త్యజింపఁబడినచో వెనుకముందులనుగాన్ని, లేక సారాసారవిచారమునుగాని చూడకఁ దోఁచిన దంతయుఁ జేయవచ్చునని యెన్నఁగూడదని యిరువదియైదవశ్లోకమ్మునుబట్టి సిద్ధమగుచున్నది. కారణ మేమన: ననుబంధమును ఫలమును చూడక చేయఁబడినకర్మ తామస మగుచున్నది. సాత్త్వికము కాదని యిరువదియైదవశ్లోకమునందు స్పష్టముగఁ జెప్పఁబడినది. (గీతార. పు. ౫౭౪, ౫౭౫ చూడు.) ఇప్పుడీసిద్ధాంతము ననుసరించియే కర్తలలో భేదమును చెప్పుచున్నాఁడు.—]

౸౸ ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. ౨౬
రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. ౨౭
అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. ౨౮

(౨౬) ఆసక్తిలేనివాఁడును, నేనే చేయుదు నని గాని, [illegible] యని గాని యనకొననివాఁడును, కార్యము సిద్ధించినను, లేకపోయినను (మనస్సునందు) వికారముఁ జెందనివాఁడును (అయిన) ధైర్యమును ఉత్సాహమును గలవాఁడును నైన కర్మలను జేయువాఁడు సాత్త్వికుఁ డగుకర్త యనఁబడును. (౨౭) విషయాసక్తుఁడును, లోభియు (సిద్ధించుటవలనను, సిద్ధింపకపోవుటవలనను, యథాక్రమముగ) హర్షముతోడను శోకముతోడను కూడుకొనువాఁడును, హింసించువాఁడును, నశుచియు నగుకర్త రాజసుఁ డనఁబడుచున్నాఁడు. (౨౮) చలచిత్తుఁడును, నవివేకియు, జడుఁడును, మాయఁజేయువాఁడును, నితరులపనులను చెఱుచువాఁడును, సోమరియు, దుఃఖశీలుఁడును, ఘంటలోఁ జేయఁదగినపనిని నెలలకొలఁదిని జేయుచుండువాఁడును నగుకర్త తామసుఁడని చెప్పఁబడును.

[౨౮ వ శ్లోకమునందు 'నైష్కృతిక' (నిస్ + కృతి = భేదించుట, చెలుగుట) శబ్దమునకు నితరులకార్యమును చెఱచువాఁడు, లేక చెడఁ జేయువాఁడని యర్థము; కాని దీనికి మాఱుగ కొందఱు "నైకృతిక" యని పాఠమును గ్రహించుచున్నారు. నికృతుఁ డనఁగా : శఠుఁడని యమరకోశమునం దర్థము వ్రాయఁబడియున్నది. కాని శఠుఁ డనువిశేషణము పూర్వమునందు చెప్పఁబడుటచే నేను 'నైష్కృతి' యనుపాఠమునే గ్రహించితిని. అద్ది యట్లుండనిమ్ము; ఈమువ్వురుకర్తలలోను సాత్త్వికకర్త, యలిప్తకర్త, లేక కర్మయోగి యగుచున్నాఁడు. ఫలాశను వదలినను, కర్మలను చేయుఁడ మనుప్రయత్నమును, నుత్సాహమును, సారాసారవిచారమును దృఢముగ నే యున్నవని పైశ్లోకములవలన స్పష్టమగుచున్నది. జగత్తు యొక్క త్రివిధమగు వ్యాప్తినే బుద్ధికిని, ధృతికిని, సుఖమునకును నిప్పుడు సంబంధింపఁజేయుచున్నాఁడు. ఇచ్చో బుద్ధియనఁగా : రెండవ యధ్యాయమున (౨. ౪౧) చెప్పఁబడిన వ్యవసాయాత్మకబుద్ధి లేక నిశ్చయించు

§§ బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు,
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ. ౨౯
ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే,
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ. ౩౦
యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ,
అయథావత్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ. ౩౧
అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా,
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ. ౩౨
§§ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః,
యోగేనావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్త్వికీ. ౩౩

: నింద్రియమని యర్థము కాదు. ఈ విషయము గీతారహస్యమునందలి యా
: అవ ప్రకరణము పు. ౧౮౬—౧౯౦లో వివరింపఁబడినది చూడు.—]

(౨౯) ఓ ధనంజయా! బుద్ధికిని ధృతికిని గుణములవలన గలుగు మూఁడు విధము లగు భేదములను వేర్వేఱుగను, నిశ్శేషముగను చెప్పుచున్నాను వినుము. (౩౦) ఓ పార్థా! ప్రవృత్తిని, (అనఁగా: నేవిషయమునయినను చేయనారంభించుటను), నివృత్తిని (అనఁగా: నేవిషయము నయినను చేయకుండుటను) కార్యమును (అనఁగా: నేపని చేయుటకు తగినదియో దానిని) అకార్యమును (అనఁగా: నేది చేయఁగూడనిదియో దానిని) దేనివలన భయపడవలయునో, దేనివలన భయపడకూడదో యాసంగతులను, బంధమోక్షములు దేనివలన గలుగునో, యావిషయమును తెలిసికొనినబుద్ధి, సాత్త్వికము. (౩౧) ఓ పార్థా! యేబుద్ధి ధర్మము యొక్కయు, నధర్మముయొక్కయు, లేక కార్యముయొక్కయు, నకార్యముయొక్కయు యథార్థమును నిర్ణయింపలేదో యది రాజసము. (౩౨) ఓ పార్థా! తమస్సుచే వ్యాప్తమగుటవలన నధర్మమును ధర్మమనుకొనునదియు, నన్నివిషయముల విపరీతముగా గ్రహించునదియు నగుబుద్ధి తామసము.

: [బుద్ధి యిట్లు విభజింపఁబడినది. సదసద్వివేక మనునది స్వతంత్ర మగు
: దేవత కాకపోవుటచే దానిని సాత్త్వికబుద్ధియందే చేర్చవలయు ననునది
: మొదలుగాఁగల వివేచనము గీతారహస్యమునందు పు. ౧౯౦ చేయఁబడినది.
: ఇప్పుడు ధృతియొక్క భేదమును చెప్పుచున్నాఁడు.—]

(౩౩) ఓ పార్థా! ఏయవ్యభిచారి యగు (అనఁగా: నికడ నాకడ భ్రష్టము

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి సా పార్థ! రాజసీ. ౩౪
యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ,
నవిముంచతి దుర్మేధా ధృతి సా పార్థ! తామసీ. ౩౫

గాని) ధృతితోఁ గూడిన పురుషుఁడు, మనస్సుయొక్కయు, ప్రాణములయొక్కయు, నింద్రియములయొక్కయు వ్యాపారమును (కర్మఫలత్యాగరూపమగు) యోగముచే ధరించుచున్నాఁడో యాధృతి సాత్త్వికము. (౩౪) ఓ యర్జునా! పార్థా! ఏధృతిచే ధర్మము, అర్థము, కామము నను పురుషార్థములను (ధర్మార్థకామ్యముల యందలి) ప్రసంగానుసారముగ ఫలమును గోరువాఁడై పురుషుఁడు ధరించుచున్నాఁడో యాధృతి రాజసము. (౩౫) ఓ పార్థా! ఏధృతిచే మనుజుఁడు దుర్బుద్ధిఁ గలవాఁడై నిద్ర, భయము, శోకము, విషాదము, మదము ననువానిని విడలఁడో యాధృతి తామసము.

[ధృతిశబ్దమునకు ధైర్యమని యర్థము. కాని శారీరకమగు ధైర్యమిచ్చో వివక్షితము కాదు. ఈప్రకరణమునం దీశబ్దమునకు దృఢనిశ్చయమని యర్థము నిర్ణయించుపని బుద్ధిదే యయియున్నది. బుద్ధిచే యోగ్యముగ నిర్ణయింపఁబడినను నది స్థిరముగ నుండుటకు నిశ్చయమున కీరీతిగ దార్ఢ్యము సంపాదించుకొనుట యనునది మనోధర్మమై యున్నది. కాన ధృతి లేక మానసికధైర్యము అనునిగుణము, బుద్ధులు రెండింటియొక్క సాయముచే నుత్పన్నమగు నని చెప్పఁబడినది. కాని యవ్యభిచారిణి యనఁగా: నీకడకు నాకడకు పరుగిడని ధృతిచే మనస్సుయొక్కయు, ప్రాణములయొక్కయు, నింద్రియములయొక్కయు వ్యాపారములను నడపించునది యని మాత్రమే చెప్పుటచే సాత్త్వికధృతియొక్క లక్షణములు పూర్తిగ కానేరవు. ఈవ్యాపారము దేనికై ప్రవర్తింపవలసినదియు, లేక యీవ్యాపారముయొక్క కర్మ యేమని చెప్పవలసినదియు నా 'కర్మయోగ' శబ్దముచేఁ జెప్పఁబడినది. అనఁగా: యోగశబ్దమున కేకాగ్రచిత్త మని మాత్రమే యర్థమని చెప్పినఁ జాలదు. కాన నేను కర్మఫలత్యాగరూపమగుయోగ మర్థమని పూర్వాపరసందర్భ మనుసరించి చెప్పితిని. సాత్త్వికకర్మయు, సాత్త్వికకర్తయు మొదలగువానిలక్షణములు చెప్పుచున్నప్పుడు ఫలముయొక్క యాసక్తిని విడుచుట యనుగుణము ప్రధాన మని యంగీక

§§ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ,
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి. ౩౬
యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్. ౩౭
విషయేంద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్. ౩౮

రించినటులే, సాత్త్వికధృతియొక్క లక్షణములు చెప్పునప్పుడున్ను ఆగుణమే ప్రధానమని యంగీకరింపఁబడవలయును. ఇంతియకాక రాజసమైన ధృతి ఫలమునాకాంక్షించునదియే యని ముందుశ్లోకమునందే చెప్పఁబడినది. కాన సాత్త్వికధృతి దానికి విరుద్ధముగను నఫలాకాంక్షిగను(అనఁగా : ఫలమును కోరనిదిగను) నుండవలయు నని ముందుశ్లోకమును బట్టి సిద్ధమగుచున్నది. నిశ్చయముయొక్క దార్ఢ్య మనునది మానసికక్రియకే సంబంధించి యున్నదనియు, దానిని మంచిదానినిగఁగాని, లేక చెడుదానిగగాని, చేయుటకు క్రియను సంబంధింపచేయుకార్య మెటులున్నదని ముందుగ నాలోచింపవలయుననియు, నిద్ర, ఆలస్యము మొదలగుకార్యములయందే దృఢనిశ్చయ ముండునేని యది తామసమగుననియు, ఫలాశచే నిత్యము వ్యావహారికము లగుకార్యములను చేయుటయందుండెనేని రాజసమగుననియు, ఫలాశాత్యాగరూపమైన యోగమునందు దృఢనిశ్చయమై యుండెనేని యది సాత్త్విక మగుననియు ధృతియొక్క భేదము చెప్పఁబడిన దనిసారాంశము. ఇటులే సుఖమును గుణభేదముచే మూఁడుప్రకారము లేలాగున నగుచున్నదో చెప్పుచున్నాఁడు.—]

(౩౬) ఓభరతశ్రేష్ఠా ! సుఖమునకును మూఁడుభేదముల నిప్పుడు చెప్పుచున్నాను వినుము. అభ్యాసముచే (అనఁగా: నెల్లప్పుడును పరిచయము కలుగుటచే) నెచ్చో రమించునో, యెచ్చో దుఃఖము నొందకుండునో (౩౭) ఏది యారంభమునందు విషమువలె నుండియు, పరిణామమున నమృతతుల్యముగ నగునో, యాత్మనిష్ఠ కలిగినబుద్ధియొక్క ప్రసన్నతవలన గలుగు (అనఁగా : స్వాధ్యాత్మికమయిన) నాసుఖము సాత్త్విక మని చెప్పఁబడినది. (౩౮) ఇంద్రియములయొక్కయు వానివిషయములయొక్కయు కలయికవలనఁ గలుగునదియు (అనఁగా : నాధిభౌతికమగునదియు), మొదట నమృతమువలె నున్నను పరిణామమున విషమువలె నుండు

యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః,
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్. ౩౯
న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః,

నదియు నగుసుఖము రాజసమని చెప్పఁబడినది. (౩౯) ప్రారంభమునందును, పరిణామమునందును తనకు మోహమును గలుగఁజేయునదియు, నిద్ర, ఆలస్యము, ప్రమాదము (అనఁగా : కర్తవ్యమును మఱచుట) అను వానివలనఁ గలుగుసుఖము తామస మని చెప్పఁబడినది.

[౩౭వ శ్లోకమునందున్న 'ఆత్మబుద్ధిప్రసాదజ' మను పదమునకు 'ఆత్మనిష్ఠబుద్ధి' యని యర్థముఁ జెప్పితిని. కాని యాత్మ యనఁగా 'నేను' అని యర్థముచేసి, యా పదమునకు 'తనబుద్ధి' యనియు నర్థముఁ జేయవచ్చును. కారణ మేమన : వెనుక (౬.౨౧) అత్యంతసుఖము బుద్ధిచేతనే గ్రహింపఁదగినదనియు, నతీంద్రియమనియుఁ జెప్పఁబడినది. ఏవిధముగా నర్థము చేసికొన్నను తాత్పర్య మొక్కటియే యగును. సత్యము నిత్యము నగుసుఖ మింద్రియోపభోగమునందు లేకపోవుటచే బుద్ధిగ్రాహ్యమే యని చెప్పినను నది సత్యమును, నాత్యంతికమును, బుద్ధిచే ప్రాప్యమును నగుటకు నేమిచేయవలయు నని విచారించినచో బుద్ధి యాత్మనిష్ఠ యయిననే గాని యీ పరమావధి యగుసుఖము లభింప దని గీతలలో నాఱవ యధ్యాయమునుబట్టి స్పష్టమగుచున్నది. (గీ. ౬. ౨౧, ౨౨.) 'బుద్ధి' యింద్రియ మగునా? కాదా? అది యొకవైపునుండి త్రిగుణాత్మక ప్రకృతిని జూచుచున్నదనియు, రెండవ వైపునుండి యీ వ్యాప్తి నారంభమునందు (అనఁగా : సర్వభూతములయందు) నేకముగ నున్నదియు, నాత్మస్వరూప మయినట్టి బ్రహ్మమును చూచుచున్న దనియుఁ జెప్పఁబడినది. కాన నింద్రియనిగ్రహముచే త్రిగుణాత్మకప్రకృతియందలి వ్యాప్తి నుండి బుద్ధిని మరల్చి దానికి పాతంజలయోగసాధ్య మగునంతర్ముఖతను నాత్మనిష్ఠను సంపాదించినచో నది ప్రసన్నమగుటచే నిత్యమును, నాత్యంతికమును నగుసుఖము మనుజునకు ననుభవగోచర మగునని తాత్పర్యము. ఆధ్యాత్మికసుఖము యొక్క శ్రేష్ఠత్వము విషయమై గీతారహస్యమునందలి యైదవప్రకరణమునందు (పు. ౧౨౫-౧౨౯) చేయఁబడిన వివరణమును చూడుము. ఇప్పుడీ త్రివిధమగుభేదమే యీ జగత్తునందు నిండియున్న దని సామాన్యముగఁ జెప్పుచున్నాఁడు.—]

సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్త్రిభిర్గుణైః. ౪౦

(౪౦) ఈ పృథివియందుఁగాని, యాకాశమునందుఁగాని, దేవలోకమునందుఁగాని, ప్రకృతియొక్క యీ గుణత్రయముచే విముక్తఁబడిన పదార్థ మేమియు లేదు.

[పదునెనిమిదవ శ్లోకము మొదలుకొని యింతదనుక జ్ఞానము, కర్మ, కర్త, బుద్ధి, ధృతి, లేక సుఖము ననువానియొక్క భేదమును నిరూపించి మొత్తముపై జగత్తునందు ప్రకృతియొక్క గుణభేదముచే వైచిత్ర్య మెట్లు కలుగుచున్న దని యర్జునునకుఁ దెలియఁజేసి యీ యన్నింటిలో సాత్త్వికము శ్రేష్ఠము గ్రాహ్యము నని భగవంతుఁ డుపదేశించెను. ఈ సాత్త్విక ప్రకారముల యన్నింటియందును, శ్రేష్ఠమగు స్థితియే గీతలయందు 'త్రిగుణాతీతావస్థ' యని పేర్కొనఁబడినది. త్రిగుణాతీతము లేక నిర్గుణము ననునది గీతానుసారముగ నొక స్వతంత్రమైన (అనఁగా : నాల్గవది యగు) భేదము కాదని గీతారహస్యమునందలి యేడవ ప్రకరణమునందు (పు. ౨౨౫) చెప్పఁబడినది. మఱియు నీయభిప్రాయముతోడనే మనుస్మృతియందును సాత్త్వికగతియే యుత్తమము, మధ్యమము, కనిష్ఠము నని విభజింపఁబడి యుత్తమమైన సాత్త్వికము మోక్షప్రద మైనదనియు, మధ్యమమైన సాత్త్వికము స్వర్గప్రద మనియుఁ జెప్పఁబడినది (మను. ౧౨. ౪౮-౫౦; ౮౯-౯౧ చూడు.) అది యట్లుండనిమ్ము; జగత్తునందలి ప్రకృతియొక్క వైచిత్ర్యము పూర్ణముగ నిరూపింపఁబడినది. ఇప్పుడీగుణవిభాగముచేతనే చాతుర్వర్ణ్యవ్యవస్థ యెట్లు గలిగినదియు నిరూపింపఁబడుచున్నది. స్వధర్మానుసారముగ తమకు నియతము లైనకర్మలను ఫలాశను వదలి, ధృతిని ఉత్సాహమును, సారాసారవిచారమును, దృఢముగనుంచుకొని, చేయుట యనునదియే యీజగత్తునందలి కర్తవ్య మని పైన యనేకస్థలములయందు చెప్పఁబడినది (౧౮. ౭-౯; ౨౩; ౩. ౮ చూడు.) కాని యీకర్మ నిత్యమగుటకు కారణ మిప్పటికిని నేకడను చెప్పఁబడ లేదు. వెనుక చాతుర్వర్ణ్యవ్యవస్థయొక్క త్రోటక ముల్లేఖింపఁబడుటచే (౪. ౧౩); కర్తవ్యాకర్తవ్యనిర్ణయము శాస్త్రానుసారముగ చేయవలయు నని చెప్పఁబడినది (గీ. ౧౬. ౨౪); కాని జగత్తుయొక్క వ్యవహారము బాగుగనడుపుటకు (గీతారహస్య. పు. ౪౬౧-౫౫౧. ౬౮౦-౬౮౧ చూడు.) నే గుణకర్మవిభాగముయొక్క సిద్ధాంతము ననుసరించి చాతుర్వర్ణ్యరూప మగు శాస్త్రవ్యవస్థ నిర్మింపఁబడినదో యది పూర్ణముగ నేకడను వివరింపఁబడియుండ

బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః. ౪౧
శమో దమస్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవచ,
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్. ౪౨
శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్,
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. ౪౩
కృషిగోరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మస్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. ౪౪

లేదు. కావున నేవిధచే సమాజమునందలి ప్రతిమనుజునియొక్క కర్తవ్యమును నియతమగుచున్నదో (అనఁగా: నిశ్చయింపఁబడుచున్నదో) ఆ చాతుర్వర్ణ్యమునకు గుణత్రయవిభాగముచే నుపపత్తిని చెప్పి ప్రతివర్ణమునకు నిట్లు నియతములైన కర్తవ్యకర్మలనుసైత మిప్పుడు చెప్పుచున్నాఁడు.—]

(౪౧) ఓపరంతపా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులయొక్క కర్మలు వారియొక్క స్వభావజన్యములైన (అనఁగా: ప్రకృతిసిద్ధములగు) గుణములనుబట్టి వేఱ్వేఱుగ విభజింపఁబడినవి. (౪౨) శమము, దమము, తపస్సు, శుచిగనుండుట, శాంతి, సరళత (ఆర్జవము) జ్ఞానము, (అనఁగా: అధ్యాత్మజ్ఞానము), విజ్ఞానము, (అనఁగా: వివిధజ్ఞానమును), ఆస్తిక్యబుద్ధియు, ననునవి బ్రాహ్మణులయొక్క స్వభావజన్యములైనకర్మలు (౪౩) శౌర్యము, తేజస్విత, ధైర్యము, దక్షత, యుద్ధములో వెనుదీయకుండుట, దాతృత్వము, ప్రజల నేలుట యనునవి క్షత్రియునకు స్వభావజన్యము లగుధర్మములు. (౪౪) కృషి, గోరక్షణము, (అనఁగా: పశుపాలనము మొదలగు వ్యాపారములు) బేరము ననునవి వైశ్యునియొక్క స్వభావజన్యము లైనకర్మలు. అట్లులే సేవించుట శూద్రునకు స్వభావజన్య మగుకర్మ.

[చాతుర్వర్ణ్యవ్యవస్థ స్వభావజన్య మైనగుణభేదముచేఁ జెప్పఁబడినది. ఈ యుపపత్తి గీతలయందే యపూర్వముగ నున్నది కాదు. మహాభారతమునందున్న వనపర్వమునందు నహుషయుధిష్ఠిరులయొక్కయు, ద్విజ–వ్యాధులయొక్కయు సంవాదములయందును, (వన. ౧౮౦–౨౧౧) శాంతిపర్వమునందలి భృగుభరద్వాజసంవాదమునందును, (శాం. ౧౮౮) అనుశాసనపర్వమునందుమాహేశ్వరసంవాదమునందును (అను. ౧౪౩) నశ్వమేధ

§§ స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. ౪౫
యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. ౪౬

పర్వమందలి యనుగీతలయందును (అశ్వ. ౩౯. ౧౧) నీగుణభేదముయొక్క యుపపత్తి కొంతమార్పుతోఁ గన్పట్టుచున్నది. జగత్తునందలి వివిధవ్యవహారములును ప్రకృతియొక్క గుణభేదములచేతనే నడచుచున్న వని పూర్వమునందే చెప్పఁబడినది. ఎవ రేమిచేయవలసినదియుఁ జాతుర్వర్ణ్యవ్యవస్థచే నిశ్చయింపఁబడినవిషయము. ఇదియు ప్రకృతిసంబంధమైన గుణభేదముయొక్క పరిణామమే యని నిరూపింపఁబడినది. ఇప్పు డీకర్మలే ప్రతిమనుజుఁడును నిష్కామబుద్ధితోఁ (అనఁగా : పరమేశ్వరార్పణబుద్ధితో) జేయవలయును. లేనిచో జగత్తులోని వ్యవహారము నడవదు. అని ప్రతిమనుజుఁడును బ్రవర్తించెనేని దానిమూలముననే సిద్ధినొందును. సిద్ధిని సంపాదించుకొనుటకు నితరమగు నేయనుష్ఠానమును చేయనక్కఱలేదు. అని చెప్పుచున్నాఁడు.]—

(౪౫) తమతమ స్వభావజన్యములగు గుణముల ననుసరించి ప్రాప్తములైన కర్మలయందు నిత్యమునురతుఁడయిన పురుషుఁ డుత్తమ మగుసిద్ధి నొందును. స్వకర్మయందుతత్పరుఁడగుటచే సిద్ధి యెట్లులభించునో వినుము. (౪౬) ఎవరినుండి సర్వభూతములును ప్రవర్తించెనో, మఱియు నెవరిచే నీసర్వజగత్తును వ్యాపింపఁబడినదో వారియొక్క పూజ (స్వధర్మానుసారముగ) ప్రాప్తము లయినకర్మలచేఁ (కేవల వాక్కుచేఁగాని, పుష్పములచేఁగాని కాదు) జేయఁబడునేని మనుజులకు దానిచేతనే సిద్ధి ప్రాప్తమగును.

[చాతుర్వర్ణ్యానుసారముగ ప్రాప్తము లైనకర్మలను నిష్కామబుద్ధితో, లేక పరమేశ్వరార్పణబుద్ధితోఁ జేయుదుమేని యవి విరాట్స్వరూపి యగు పరమేశ్వరునియొక్క యొకవిధమగు యజనపూజనములే యగు ననియుఁ జెప్పఁబడినది (గీతార. పు. ౬౦౩). ఇప్పు డీగుణకర్మభేదమువలన స్వభావముచే ప్రాప్తములగు కర్తవ్యకర్మ లితరులదృష్టి కొకప్పుడు దోషయుక్తములుగను, నశ్లాఘ్యములుగను నుండవచ్చును. ఉదాహరణము : ప్రకృతస్థలమున, క్షత్రియధర్మమునందు హత్యసంభవించుటచే నది సదోషముగఁ

§§ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. ౪౭
సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః. ౪౮
అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి. ౪౯

గ్రాహ్యించును. అర్జునుని యెదుట నున్నయుద్ధము ... స్వధర్మమును వదలి యితరుల ... (గీ. ౩. ౩౫) లేక యేమైనను సరియే యనుకొని స్వకర్మను చేయవలయునా? యను ప్రశ్నయును, చేయవలయునేని యెట్లు చేయవలయు నను ప్రశ్నయును సమాధానము నీయధ్యాయమునందు మొదట (౧౭. ౬) యజ్ఞయాగాదికర్మల నుద్దేశించి చెప్పఁబడిన దానినే యనుసరించి యిచ్చట చెప్పుచున్నారు.—]

(౪౭) పరులయొక్క ధర్మము సుఖముగ నాచరించుటకు శక్యమైనను దానికంటె తనధర్మమే (అనఁగా : చాతుర్వర్ణ్యవిహిత కర్మమే) విగుణమైనను (అనఁగా : సదోషమైనను) మిక్కిలి శ్రేయస్కరమై యున్నది. తనస్వభావసిద్ధముగ (అనఁగా : గుణస్వభావము ననుసరించి నిర్మింపఁబడిన చాతుర్వర్ణ్యవ్యవస్థ చేత విధింపఁబడిన కర్మలను చేయుచున్నప్పు డేవిధమగు పాపమును నంట నేరదు. (౪౮) ఓ కౌంతేయా! ఏకర్మలు సహజమైనవో (అనఁగా : పుట్టుక మొదలు గుణకర్మవిభాగముచే నియతములయినవో) యవి సదోషములుగ నున్నను వదలకూడదు. కారణ మేమన : పొగచే నగ్నిహోత్రమువలె సర్వారంభములు (ఉద్యోగములు) నేదో యొకానొక దోషముతోఁ గూడియుండును. (౪౯) కాన దేనియందును నాసక్తినిఁ జెందక మనస్సును స్వాధీనములో నిడికొని నిష్కామబుద్ధితోఁ బ్రవర్తించినచో కర్మఫలములయొక్క సన్న్యాసమగును దాన పరమమగు నైష్కర్మ్యసిద్ధి ప్రాప్తమగును.

[పరధర్మముకంటె స్వధర్మము మంచిదన్నియు (గీ. ౩. ౩౫) నైష్కర్మ్యసిద్ధి ప్రాప్తించుటకు కర్మలను వదలవలసిన యావశ్యకత లేదనియు (గీ. ౩. ౪) పూర్వమునందుఁ జెప్పఁబడిన విచారమే యుపసంహారాత్మకముగ నీ యధ్యాయమునందును స్పష్టముగ వివరింపఁబడినది. నైష్కర్మ్యమనఁగా నేదియో, దేనిని నిజమగు నైష్కర్మ్యసిద్ధి యని చెప్పవలయునో

(గీ. ౩. ౪) పై టిప్పణియందు స్పష్టముగ నిరూపించితిని. సన్న్యాస మార్గీయుల దృష్టి మోక్షమునందుమాత్రమే యుండు ననియు భగవంతుఁడు మోక్షము, లోకసంగ్రహము నను నీరెంటిని సమానముగనే చూచుచు న్నాఁడనియుఁ దెలిసికొందుమేని యీ సిద్ధాంతమునందలి మహత్త్వము సహజముగఁ గాన్పించును. లోకసంగ్రహార్థమై (అనఁగా: సమాజము యొక్క ధారణపోషణార్థమై) జ్ఞానవిజ్ఞాన యుక్తుఁడైన పురుషునివలెనే రణాంగణమందు ఖడ్గమును గైకొని యుద్ధముచేయు శూరుఁడగు క్షత్రియునివలెను, కృషికర్మఁ జేయువాఁడును, బేరము చేయువాఁడును, సాలె వాఁడును, లోహకారుఁడును, కుంభకారుఁడును, మాంసమును విక్రయించు వ్యాధుఁడుసైతముకూడ నావశ్యకులయియున్నారు. కర్మలను వదలినగాని మోక్షము సిద్ధింపదని వీరెల్లరును తమతమ వ్యాపారములను వదలివైచి సన్న్యాసులే కావలయు ననునూహతో కర్మసన్న్యాసమార్గీయులు వీరిని విశేషముగ లెక్కపెట్టరు; గాని గీతలయొక్క యుద్దేశ మిట్లు సంకుచితమైనది కాదు. కావునఁ దమయధికారము ననుసరించి ప్రాప్తమైన వ్యాపారములను వదలి యితరుల వ్యాపారములు మంచివని వానిని చేయ నారంభించుట యోగ్యము కాదని గీత చెప్పుచున్నది. ఏవ్యాపారమున నైనను నేదో యొకదోషముండకతప్పదు. ఉదాహరణము: బ్రాహ్మణునకు ముఖ్యముగ విహితమైన శాంతియందు సైతమొకదోషము కలదు. (౧౮. ౪౨) క్షమావంతుఁడైనపురుషుని లోకులు 'దుర్బలుఁడని యెన్నుట' యను గొప్పదోషము కలదు (మ. భా. శాం. ౧౬౦. ౩౪). వ్యాధుని వ్యాపారమున మాంసవిక్రయమును చేయుట యనునదియు కష్టమయినపనియే. (మ. భా. వన. ౨౦౬) కాని యంతమాత్రముచే నీకర్మను వదలుట మంచిది కాదు. ఏకర్మను చేయువాఁడైనను నొకపరి స్వీయమని స్వీకరింపఁబడినకర్మ యెంతకఠినమైనదిగ నప్రియమైనదిగ నున్నను దానినే యాసక్తి వదలివైచి చేయవలయును. కారణ మేమన: మనుజునియొక్క గొప్పతనమును, కొద్దితనమును వ్యాపారము నవలంబించియుండదు. ఏయుద్దేశముతో నాకర్మలను చేయుచున్నాఁడో యాబుద్ధియందు వానియోగ్యత యధ్యాత్మదృష్టి నవలంబించియున్నది. (గీ. ౨. ౪౯) ఎవఁడు తనయొక్క మనస్సు శాంతమగుటచే సర్వభూతాంతర్గత పరమాత్మైక్యమును తెలిసికొనెనో వాఁడు కర్మనుబట్టిగాని, జాతినిబట్టిగాని వ్యాపారము చేయువాఁడైనను

§§ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే,
సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా. ౫౦
బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ,
శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. ౫౧
వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః,
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. ౫౨
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్,
విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే. ౫౩

కటికవాఁడైనను నిష్కామబుద్ధితో వ్యాపారములను చేయును గాని, స్నానసంధ్యాశీలుఁ డగు బ్రాహ్మణునివలె గాని, శూరుఁడగు క్షత్రియుని వలె గాని గొప్పవాఁడునై మోక్షాధికారియగును. ఇంతియకాక కర్మలను వదలుటచే ప్రాప్తించు సిద్ధియే నిష్కామబుద్ధితో తనవ్యాపారములను జేయుచున్నవానికిని లభించు నని ౪౯వ శ్లోకమున స్పష్టముగ చెప్పఁబడినది. భాగవతధర్మములయం దున్న ముఖ్య మగురహస్య మిదియే. ఈరీతిగ నాచరించుమనీతత్త్వమును నాచరణములో నుంచుకొనుట యశక్యము కాదని మహారాష్ట్రదేశమందలి సంతమండలి (సత్పురుషసమాజము) యొక్క యితిహాసమువలన స్పష్టమగుచున్నది. (గీతార. ప్ర. ౧౩. పు. ౬౦౫-౬౦౬ చూడు.) ఇప్పుడు తనకర్మలయందు తత్పరుఁడుగ నుండుటచేతనే తుదకు మోక్ష మెట్లులభించునో చెప్పుచున్నాఁడు.—]

(౫౦) ఓ కౌంతేయా! (ఈరీతిగ) సిద్ధి లభించినపిదప (ఆపురుషునకు) జ్ఞానముయొక్క పరమావధి యగునిష్ఠ యయినను బ్రహ్మ మెట్లు ప్రాప్తమగునో దానిని సంక్షేపముగ నేను చెప్పుచున్నాను విను. (౫౧) శుద్ధబుద్ధితోఁ గూడుకొనినవాఁడై, ధైర్యముతోఁ దన్ను సంయమించుకొని శబ్దాదికము లగునింద్రియముల విషయముల విడచి రాగద్వేషములను వదలి (౫౨) ఏకాంతమగు స్థలమునందున్నవాఁడై, మితాహారియై మనోవాక్కాయములను స్వాధీనములో నుంచుకొని నిత్యమును ధ్యానయుక్తుఁడును విరక్తుఁడునై (౫౩) (అటులే యహంకారమును) బలమును, గర్వమును, కామమును, క్రోధమును, పరిగ్రహమును, ఆశాపాశమును, వదలివైచి శాంతుఁడును మమత్వరహితుఁడును నైనవాఁడు బ్రహ్మభూతుఁ డగు

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి,
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. ౫౪
భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్. ౫౫
సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్. ౫౬

టకు సమర్థుఁ డగుచున్నాఁడు. (౫౪) బ్రహ్మభూతుఁ డగునేని ప్రసన్నచిత్తుఁడై దేనిని కోరఁడు. మఱియు దేనిని ద్వేషింపఁడు. సర్వభూతములయందు సముఁడై నాయందు పరమభక్తిని సంపాదించుకొనును. (౫౫) నే నెంతవాఁడనో, నే నెవఁడనో యని తన (నాయందు) భక్తిచే నాతఁడు నిజముగాఁ దెలిసికొనును. ఇట్లు నాయొక్క తాత్త్వికజ్ఞానము గల్గినపిదప వాఁడు నాయందే ప్రవేశించును. (౫౬) నన్నే యాశ్రయించుకొని సర్వకర్మలను నియమముగఁ జేయుచున్నను, నాయొక్క యనుగ్రహముచే శాశ్వతమును నవ్యయమును నగుస్థానము నొందును.

[పైన వర్ణింపఁబడిన సిద్ధావస్థ కర్మయోగిసంబంధమైనదే. కర్మసన్న్యాసమును చేయువానిది కాదని యెఱుంగవలయును. ఆరంభమునందే (అనఁగా: ౪౯, ౫౦ శ్లోకములయం దాసక్తిని వదలి కర్మలను చేయువారి వర్ణన చేయఁబడినందున తుదకు "సర్వకర్మలను చేయుచున్నాను" అని ౫౬వ శ్లోకమునందు చెప్పఁబడినది. భక్తునియొక్క లేక త్రిగుణాతీతుని యొక్క వర్ణనవలెనే యీవర్ణనయుఁ జేయఁబడినది. వేయేల? కొన్నిశబ్దము లావర్ణనలో నుండియే గ్రహింపఁబడినవి. ఉదాహరణము:—౫౩వ శ్లోకమునం దున్న 'పరిగ్రహ' శబ్ద మాఱవ యధ్యాయమునందున్న (౬. ౧౦) యోగియొక్క వర్ణనయందుఁ బ్రయోగింపఁబడినది. ౫౪వ శ్లోకమునందున్న 'నశోచతి, నకాంక్షతి' యనుపదములు ౧౨వ యధ్యాయమున భక్తిమార్గముయొక్క వర్ణనలో నున్నవి. (౧౨. ౧౭) 'వివిక్తము' (అనఁగా: నిర్జనము) ఏకాంతమగు స్థలమునందుండు నను శబ్దములు పూర్వమునందు (గీ. ౧౩. ౧౦) శ్లోకమునందు కలవు. కర్మయోగి ప్రాప్తమగు నీకడపటి స్థితియును కేవలము మానసికదృష్టిచే నొక్కటియే యై యుండుటచే

§§ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ. ౫౭

[అర్జునలు తమ మతమును బోధించుచున్నారని సన్న్యాసమార్గీయు లగు టీకాకారులు చెప్పుదురు. కాని యీయర్థము సత్యమైనది. కాదని పూర్వమునం దనేక పర్యాయములు చెప్పఁబడినది. అని యర్థముఁజేయవలెను; సన్న్యాసమనఁగా: కర్మను విడిచివేయుటకాదు. ఫలాశను విడుచుటయే సన్న్యాసమని చెప్పవలయును. గాన యజ్ఞయాగాదికర్మ లన్నియు నిత్యములైనను, కామ్యములైనను, నైమిత్తికములైనను, నితరములగు సర్వకర్మలనుగూడనే, ఫలాశ లేక నుత్సాహముతోను, సమబుద్ధితోను, చేయవలయు నని యీయధ్యాయారంభమునఁ బ్రతిపాదింపఁబడినది. పిదప జగత్తునందున్న కర్మలు, కర్త, బుద్ధి మొదలగు సర్వవిషయములును గుణభేదముచే నానావిధములైనను, వానిలో సాత్త్వికములైనవి శ్రేష్ఠములైనవనియు, చాతుర్వర్ణ్యవ్యవస్థచే స్వధర్మానుసారము లగుకర్మల నన్నిఁటిని యాసక్తివిరహితుఁడై చేయుటచేతనే పరమేశ్వరునియొక్క యజనపూజనాదులు సంభవించి వానివలననే క్రమక్రమముగా పరబ్రహ్మప్రాప్తి మోక్షము లభించుననియు, మోక్షమునకై కితర మగునను ష్ఠానమును చేయవలసిన యవసరము లేదనియు, లేక కర్మత్యాగరూప మగుసన్న్యాసమును వేఱుగ గ్రహింపనవసరము లేదనియు నొక కర్మయోగముచేతనే మోక్షమును, సర్వసిద్ధులును ప్రాప్తము లగుననియు, గీతారహస్యమునందలి ఫలితార్థము చెప్పఁబడినది. ఇప్పుడీకర్మయోగమార్గమునే స్వీకరింపవలయు నని యర్జునునకు తుట్టతుద నుపదేశించుచున్నాఁడు.—]

(౫౭) మనస్సుచే సర్వకర్మలను నాకర్పించి మత్పరాయణుఁడ వగుచు (సామ్య) బుద్ధియోగముయొక్క యాశ్రయముచే నాయం దెప్పుడును చిత్తము నుంచుము.

["బుద్ధియోగ" శబ్దము పూర్వమునందు రెండవ యధ్యాయమునందు ప్రయోగింపఁబడినది. (౨. ౪౯) అచట, ఫలాశను వీడక కర్మలను జేయుట యనుయుక్తి యని, లేక సమత్వబుద్ధి యని దాని కర్థము. ఈయర్థమే యిప్పుడును వివక్షితమైనందున కర్మకంటె బుద్ధి శ్రేష్ఠ మని రెండవ

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి,
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి. ౫౮
§§ యదహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. ౫౯
స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్. ౬౦
ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. ౬౧
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. ౬౨

[యధ్యాయమునందు చెప్పఁబడిన సిద్ధాంతమునకే యిది యుపసంహారమై యున్నది. కర్మసన్న్యాసమనఁగా నేమియో దానియందె "మనస్సుచేత (సాక్షాత్కర్మచేతఁగాదు) గాక కేవల బుద్ధిచేతనే నాకు సర్వకర్మల నర్పించి" అను శబ్దములచేఁ జెప్పఁబడినది. ఆయర్థమే వెనుక గీతయందు ౩. ౩౦; ౫.౧౩ వర్ణింపఁబడినది.—]

(౫౮) నాయందు చిత్తము నుంచితివేని నాయొక్క యనుగ్రహముచే సర్వ సంకటములను (అనఁగా: కర్మయొక్క శుభాశుభఫలములను) తరించెదవు. కాని యహంకారముచె నామాట వినక పోదువేని నాశము నొందుదువు.

[౫౮వ శ్లోకము చివర నహంకారముయొక్క యేపరిణామము చెప్పఁ బడినదో దానినే యిప్పుడు విశేషముగ వివరించుచున్నాఁడు.—]

(౫౯) నేను యుద్ధము చేయ నని యహంకారమును నీవు చెందెదవేని నీయొక్క యీనిశ్చయము వ్యర్థము. ప్రకృతి (అనఁగా: స్వభావము) నీచే నాపనినిఁ జేయించును. (౬౦) ఓ కౌంతేయా! స్వీయ మగుస్వభావజన్య మైనయా కర్మచేత బద్ధుఁడ వగుటచె మోహామువలన దేనిని నీవు చేయుట కిచ్ఛగించవో దానినే పరతంత్రుఁడవయి (అనఁగా: ప్రకృతియొక్క స్వాధీనుఁడవయి) నీవు చేయవలసివచ్చును. (౬౧) ఓయర్జునా! ఈశ్వరుఁడు సర్వభూతములయొక్క హృదయమునందు నుండి యంత్రముమీద నెక్కించినటుల సర్వభూతములను (తనమాయచే) త్రిప్పుచున్నాఁడు. (౬౨) కాన నోభారతా! సర్వభావముల

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా,
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు. ౬౩

చేతను నాతనినే శరణునొందుము. ఆతని యనుగ్రహముచే పరమ మగుశాంతి, నిత్యమైన స్థానమును ప్రాప్తమగును. (౬౩) ఈరీతిగ గుహ్యములలో గుహ్య మగు జ్ఞానము నాచేఁ జెప్పఁబడినది. దీనిని పూర్ణముగ విచారించి, నీ యిచ్చ వచ్చినటులఁ జేయుము.

[పై శ్లోకమునందుఁ జెప్పఁబడిన కర్మస్వాతంత్ర్యముయొక్క గూఢ మగుసిద్ధాంతమునందలి విచారము, గీతారహస్యము. పదియవ ప్రకరణము నందు చేయఁబడినది చూడుము. ఆత్మ స్వయముగ స్వతంత్రమైనను జగత్తుయొక్క (ప్రకృతియొక్క) వ్యవహారము జూచుచున్నను కర్మ యనెడి ఘటీయంత్ర మనాదినుండియు నడుచుచున్నందున దానిపై యాత్మ యొక్క యధికార మేదియు లేదని స్పష్టముగఁ గాన్పించుచున్నది. తా నిచ్ఛయించక పోయినను వేయేల ? తనకు వద్దనుకొన్నను, శతములును, సహస్రములు నగువిషయములు జగత్తునందు నడుచుచున్నందున వాని యొక్క వ్యాపారముల పరిణామము నతని యాత్మయం దారోపింపఁబడు చున్నది. లేక యా వ్యాపారములయందే యున్నకొన్ని భాగములను మనము చేయవలసివచ్చును. చేయననినను తప్పదు. ఇట్టి సమయములయందు నిపుణుఁ డగుపురుషుఁడు తనబుద్ధిని నిర్మలముగ నుంచుకొనియును, సుఖదుఃఖ ములను సమానముగ నెంచుకొనియును నిజకార్యములనుఁ జేయుచున్నాఁడు. మూర్ఖుఁడు వానిపాశములలో బద్ధుఁ డగుచున్నాఁడు. ఈ యిరువురయొక్క యాచరణమునందును నిదియే గొప్ప భేదము. "భూతములు ప్రకృతియొక్క యలవాటునుబట్టి నడచును. అచ్చో నిగ్రహము పనిచేయనేరదు." (గీ. ౩. ౩౩) అని భగవంతుఁడు మూఁడవ యధ్యాయమున నే చెప్పియున్నాఁడు. ఇట్టి సమయములయందు కర్మలయం దాసక్తిని జెందకుము. ఇంతకంటె మోక్షశాస్త్రమును, నీతిశాస్త్రమును, నేమియుఁ జెప్పుటకు శక్తమైనది కాదు. ఆధ్యాత్మదృష్టిచేఁ జేయు విచారమైనది; కాని భక్తిదృష్టిచే ప్రకృతియైనను నీశ్వరునియొక్క యంశయే. కాన ౬౧, ౬౨ శ్లోకములలో నీశ్వరునకే సర్వకర్తృత్వమును జెప్పినందున నీసిద్ధాంతమే యిక్కడ చెప్పఁబడినది. జగత్తునందుఁ నడచుచున్న వ్యవహారమునంతను పరమేశ్వరుఁడు

§§ సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్. ౬౪
మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. ౬౫
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. ౬౬

తనకుఁ దోఁచిన ట్లొనర్చుచున్నాఁడు. కావున నహంకారబుద్ధిని వదలి విద్వాంసుఁడు తనయాపత్తును పరమేశ్వరునియొక్క యధీనము చేయుటయే యోగ్యమైనది. ౬౩వ శ్లోకమునందు "నీయిచ్ఛ వచ్చినట్లు చేయుము" అని భగవంతుఁడు చెప్పినది నిజమే కాని దానియొక్క యర్థము మిక్కిలి గంభీరమైనదిగ నున్నది. జ్ఞానముచేతను, భక్తిచేతను బుద్ధి సామ్యావస్థను బెందునేని, చెడుకోరికయే యుండదు. గాన నిట్టి జ్ఞానియొక్క యిచ్ఛా స్వాతంత్ర్య మతనికిగాని జగత్తునకుగాని యెప్పుడును నపాయకరము గా నేరదు. "కాన నీజ్ఞానమును నీవు తెలిసికొందువేని (విమృశ్య) నీవు స్వయం ప్రకాశుఁడ వగుదువు. పిదప (ముందు కాదు) నీవు స్వేచ్ఛగఁ జేయుకర్మలె ధర్మ్యములును, ప్రమాణములును నగును. ఈవిధ మగుస్థితప్రజ్ఞునియొక్క యవస్థ నీకు ప్రాప్తమైనపిదప నీయిచ్ఛను ప్రతిబంధించుకొన నక్కఱ యుండదు" అని దానియందలి భావార్థము. అది యటులుండనిమ్ము; జ్ఞానము కంటె గీతయందు భక్తికే యెక్కువమహత్వము చెప్పఁబడిన దని గీతారహస్యమునందల్లి పదునాల్గవ ప్రకరణమునందు నేను నిరూపించియున్నాను. ఈసిద్ధాంతము ననుసరించి మొత్తముపై గీతాశాస్త్రమును నిప్పుడు భక్తిపరముగ నుపసంహరించుచున్నాఁడు.—]

(౬౪) సర్వగుహ్యములలో గుహ్యమైన యొకవిషయమును తుదకు మరల చెప్పుచున్నాను వినుము. నీవు నాకత్యంతము నిష్టుఁడ వగుటచే నీయొక్క హితార్థమై యీ విషయమును చెప్పుచున్నాను. (౬౫) నాయందు మనస్సు నుంచుము. నన్ను భజింపుము. న న్నుద్దేశించి యజనము చేయుము. నన్నుగురించి వందనము చేయుము; అట్లు సేయుదువేని నీవు నన్నే పొందుదువు. సత్యము. ప్రతిజ్ఞ చేయుచున్నాను. కారణ మేమనేః నాకు నీవిష్టుఁడవు. (భక్తుఁడవు) (౬౬) సర్వధర్మము

లను వదలి నన్నొక్కనినే శరణుజొందుము. నేను నిన్ను సర్వపాపములనుండియు ముక్తునిగఁ జేయుదును, భయపడకుము.

[కేవలజ్ఞానమార్గము లగుటీకాకారులకు భక్తిపర మగు నుపసంహారము రుచింపదు. కాన ధర్మశబ్దమునందే యధర్మమును గూడఁ జేర్చి "సర్వాధర్మములను, కృతమును, నకృతమును, భూతమును భవ్యమును, నను నన్నింటిని వదలి వీనికంటె వేఱుగ నున్న పరబ్రహ్మనే తెలిసికొనుము" అని యుపదేశింపఁబడిన దని చెప్పుదురు. కఠోపనిషత్తులో నుపదేశింపఁబడిన మంత్రముతో (కఠ ౨. ౧౪) నీశ్లోకము సమానార్థక మైనందున దీనియందు నిర్గుణబ్రహ్మను శరణుజెందు మని చెప్పినటుల వారు చెప్పుదురు. కఠోపనిషత్తులోని మంత్రము మహాభారతమునందును నిర్గుణబ్రహ్మనే నర్థించుచున్నది. (శాం. ౩౨౯. ౪౦. ౩౩౧. ౪౪). కాని రెండుస్థలములయందును సర్వాధర్మపదములు స్పష్టముగ నున్నట్లు గీతలయందు లేవు. గీతలకు నిర్గుణబ్రహ్మ మంగీకారమే కాన, నదియె పరమేశ్వరునియొక్క శ్రేష్ఠ మగు స్వరూప మని గీతలయందు నిర్ణయింపఁబడినది నిజమే. (గీ. ౭. ౨౪) అయినను వ్యక్తోపాసన సులభమును శ్రేష్ఠము ననియు గీతయొక్క సిద్ధాంతము. (గీ. ౧౨. ౫) కాన భగవంతుఁ డగు శ్రీకృష్ణుఁ డిచ్చట స్వీయ మగు వ్యక్తస్వరూపమునే యుద్దేశించి మాట్లాడుచుండుటచే నీయుపసంహారము భక్తిపరమైనదే యని నాయొక్క సిద్ధాంతము. అనఁగా: నిర్గుణబ్రహ్మ మీస్థలమునందు వివక్షితము కాదు. ధర్మశబ్దమునకు నహింసాధర్మము, సత్యధర్మము, మాతాపితృసేవాధర్మము, గురుసేవాధర్మము, యజ్ఞయాగధర్మము, దానధర్మము, సన్న్యాసధర్మము మొదలుగ గలిగిన యీ యనేకమార్గములు శాస్త్రమునందు పరమేశ్వరప్రాప్త్యర్థమై చెప్పఁబడినవో యవియే యిచ్చట నుద్దేశింపఁబడిన వని చెప్పవలయును. మఱియు మహాభారతముయొక్క శాంతిపర్వమునందును (శాం. ౩౫౪) అనుగీతలయందును (అశ్వ. ౪౯) ఈవిషయము చర్చింపఁబడిన స్థలములయందును, నీమోక్షోపాయములే ధర్మశబ్దముచే స్పష్టపఱుపఁబడినవి; కాని యిట్టి ధర్మములయొక్క గోలాహలములోఁ బడక "నన్నొక్కనినే భజింపుము నిన్ను నేను తరింపఁజేయుదును. భయపడకుము." అని భగవంతుఁ డిచ్చట గీతలయందు ప్రతిపాద్య మగు ధర్మము నుద్దేశించి నిశ్చయముగఁ జెప్పుచున్నాఁడు. (గీతార. ప్ర. ౧౩. పు. ౭౦౬, ౭౦౭,

